# ఆంధ్ర
# వ్యాకరణసంహితా సర్వస్వము

కారక సమాస తద్ధిత క్రియా కృత్ ప్రకీర్ణక పరిచ్ఛేదములు

## రెండవసంపుటము

గ్రంథకర్త:
కళాప్రపూర్ణ
వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి




**ఆంధ్ర బుక్ హౌస్**
బుక్ సెల్లర్సు అండు పబ్లిషర్సు
సుల్తాన్ బజారు, హైద్రాబాద్.

ఆంధ్రవిశ్వకళాపరిషత్
ప్రచురితము

---

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
వావిళ్లప్రెస్సునముద్రితము
1952

 [వెల. రూ. 25-0-0.

# ము ఖ్య వి ష య సూ చి క



A

విషయసంఖ్య. పుట.

## కారకపరిశిష్టము.



## సమాసపరిచ్ఛేదము.

విషయసంఖ్య. పుట.

## క్రియా పరిచ్ఛేదము.

## కృదంత పరిచ్ఛేదము.

## ప్రకీర్ణకపరిచ్ఛేదము.

# ఆంధ్ర

# వ్యాకరణసంహితా సర్వస్వము

## కారకపరిచ్ఛేదము.

సర్వవిభక్తిస్సంస్కృతతుల్యా. (ఆం. చిం. హాలం. ౧౫ కారి. అహో. ౪౨౩ పుట)

ప్రాతిపదికార్థ లిఙ్గ పరిమాణ వచనమాత్రే ప్రథమా. (౨-౩-౪౬) నియతోపస్థితికః ప్రాతిపదికార్థః (సి. కౌ. కారక. ౫౩౨ సూ.)

నన్నయాథర్వణీయము. ౨౩౪ విషయము.

ల్యర్థసంబుద్ధ్యుక్తార్థే ప్రీ. (వృత్తి) లేః ప్రాతిపదికస్యార్థే, సంబోధనే, తైర్యైః = ప్రత్యయైరుక్తార్థే, కే సతిచ. ప్రీ = ప్రథమా స్యాత్. కృష్ణః - శ్రీః - జ్ఞానమ్ - హేవిష్ణో - సర్వో ఒరోచ్యే జీవనః పాతా దానీయః ప్రభవో లయః. (ముగ్ధ. వ్యా. కారక. ౨౨౦ సూ.)

కల్పతరువు. ౨౩౪ విష:—సర్వవిభక్తిః = సమస్తమగు విభక్తియు, సంస్కృత తుల్యా = సంస్కృతవ్యాకరణోక్తరీతిని తెలుఁగునందును నగును. ఇట్లు భట్టారకుఁడు సంక్షేపించిచెప్పుటచేత నీప్రకరణమున సంస్కృతవ్యాకరణములలోఁ జెప్పఁబడిన విభక్త్యర్థబోధకసూత్రములు మూలముగాఁ జూపఁబడుచున్నవి. తఱుచుగాఁ బాణినీయసూత్రము లుదాహరింపఁబడును, సుబోధములగు ముగ్ధబోధ సూత్రములును నచ్చటచ్చట జూపఁబడును.

తత్సమాచ్ఛికపరిచ్ఛేదములలో సుబ్విభక్త్యంతరూపములు సాధింపఁబడెను. ఇందు విభక్త్యర్థములు వివరింపఁ బడుచున్నవి. “క్రియాజనకం కారకమ్. కరోతి క్రియాం నిర్వర్తయతీతి భాష్యే వ్యుత్పత్తిదర్శనాత్” (సి. కౌ. ౫౩౪ సూ. వ్యాఖ్య.

బాలను.) అనురీతిని క్రియాజనక మనఁగాఁ క్రియాకాంక్షను గలిగించునది కారక మనఁబడును. 'దేవదత్తుఁడు' అనినపిదప వాక్యమున వచ్చెను మున్నగు నేదేని క్రియ యాకాంక్షితముకాకతీరదు గాన నది కారక మనిపించుకొనును. "కర్మ కరణ కర్తృ సంప్రదానాపాదానాధికరణానా మేకతమత్వం కారకత్వ మితియావత్ - క్రియా నిమిత్తం కారకం లోకసిద్ధమితి దుర్గసింహః - చైత్రస్యేత్యాదౌ ధనాదికమే వాకాంక్షితంస్యా న్నతు గచ్ఛేత్యాదికమ్. తేన సంబన్ధస్య క్రియానిమిత్తత్వా భావా న్నకారకత్వమ్. ఏవం లిఙ్గార్థసంబోధనయో రపీతి." (దుర్గా. వ్యా. ముగ్ధ. వ్యా. కార. ౩౧౬ సూ. వ్యాఖ్య.) అనుచొప్పునఁ క్రియానిమిత్తములగు కర్మ కరణ కర్తృప్రభృతు లాఱిటిలో నన్యతమము కారకమనిపించుకొనును. 'చైత్రుని యొక్క' అని ప్రయోగించినవెంటనే వాక్యమున 'ధనము - గుణము' మున్నగు నవియె యాకాంక్షితములగునుగాని క్రియ యాకాంక్షితము కానేరదు. కావున సంబంధార్థము (శేషషష్ఠి) కారకము కానేరదు. అట్లె వాక్యగతముకాని లింగార్థ మనఁగాఁ బ్రాతిపదికార్థమగు ప్రథమయు నిరాకాంక్షమగు సంబోధనమును గారక విభక్తులు కానేరవు. ఇంక 'ఉక్తార్థప్రథమ' మాత్రమె కారకవిభక్తి యనిపించు కొనును.

"నను కృష్ణఇత్యత్ర క్రియారహితం వాక్యం నాస్తీతిన్యాయాత్ భవత్యాది క్రియాధ్యాహారేణైవ ఉక్తార్థత్వాత్ ప్రథమాప్రాప్తౌ లఙ్గార్థ (ప్రాతిపదికార్థ) గ్రహణం కథమితిచేత్, సత్యమ్. యత్ర అసమాపకక్రియాపదం కర్త్రాదిపదయుక్తం తత్రైవ తన్న్యాయాత్ భవత్యాదిక్రియాధ్యాహారః. యత్రతు కేవలో రూఢ శబ్దః ప్రయుజ్యతే తత్ర వాక్యత్వాభావాత్ తన్న్యాయస్యావసరో నాస్తి." (ముగ్ధ. ౨౨౦ సూ. దుర్గా. వ్యాఖ్య.) అనుచొప్పున వాక్యేతరస్థలములం దనఁగాఁ గోశాదులందుఁ బ్రయుక్తమగు ప్రథమ ప్రాతిపదికార్థమాత్రమెకాని "ఉక్తార్థము" కానేరదుగాన నది కారకవిభక్తికానేరదు. అస్తి భవత్యా ద్యధ్యాహారమున నట్టిదియు వాక్యగతమై యుక్తార్థప్రథమ కానోపు ననరాదు. అసమాపకక్రియాది ప్రయోగముచే వాక్య మసమాప్తమై నిల్చిపోయినపుడుమాత్రమె "అస్తి - భవ త్యాద్యధ్యాహారము" కల్గుట శాస్త్రసిద్ధము.

ప్రాతిపదికార్థేత్యాదిః—ప్రాతిపదికార్థ = ప్రాతిపదికార్థ మాత్రమందును, లిఙ్గ = లిఙ్గమాత్రాధిక్యమందును, పరిమాణ = పరిమాణమాత్రమందును, వచన మాత్రే = సంఖ్యామాత్రమందును, ప్రథమా = ప్రథమావిభక్తి యగును. నియ తోపస్థితికః = నియతమగు నుపస్థితిగలది, ప్రాతిపదికార్థః = ప్రాతిపదికార్థ మనిపించు

కొనును. "యస్మిన్ ప్రాతిపదికే ఉచ్చారితే యస్యార్థస్య నియమే నోపస్థితిః స తదర్థ ఇత్యర్థః" (సి. కౌ. ౫౩౨ సూ. బాలమ. వ్యాఖ్య.) ఏ ప్రాతిపదిక ముచ్చరింపఁబడు నప్పటి కేయర్థము నియతముగా స్ఫురించునో యదియే యాప్రాతిపదికమున కర్థమని తాత్పర్యము. "ప్రవృత్తినిమిత్తం వ్యక్తిశ్చేతి ద్వికం ప్రాతిపదికార్థః; ప్రవృత్తినిమిత్తం - వ్యక్తిః - లిఙ్గంచేతి త్రికం ప్రాతిపదికార్థః; ప్రవృత్తినిమిత్తం - వ్యక్తిః - లిఙ్గం - సంఖ్యాచేతి చతుష్కం ప్రాతిపదికార్థః; ప్రవృత్తినిమిత్తం - వ్యక్తిః - లిఙ్గం - సంఖ్యా - కారకంచేతి పఞ్చకం ప్రాతిపదికార్థః. ఇత్యేతే పక్షాః 'సరూపాణామేకశేష ఏకవిభక్తౌ' 'స్త్రియామ్' ఇత్యాదిసూత్రేషు భాష్యే స్థితాః" (సి. కౌ. ౫౩౨ సూ. బాలమ. వ్యా.) ప్రవృత్తినిమిత్త మనఁగా జాతి. 'ఘట' అను ప్రాతిపదికమునకు 'ఘటత్వ' రూపజాతియే యర్థ మనునది యొకపక్షము, ఘటత్వజాతియు దానికాశ్రయమగు ఘటవ్యక్తియుఁ బ్రాతిపదికార్థము లనునది మఱియొకపక్షము. ఘటత్వజాతియు ఘటవ్యక్తియు దానిపుంలింగమును బ్రాతిపదికార్థము లనునది మఱొకపక్షము. సంఖ్యయనఁగా వచనము, కారకమ్మనఁగాఁ గర్తృకరణాదికము. కాన వచనమును గల్పిన యర్థచతుష్కమును బ్రాతిపదికార్థమనునది యింకొకపక్షము. కారకమును గలిపిన యర్థపంచకమును బ్రాతిపదికార్థమే యనునది యైదవపక్షము. ఈయైదుపక్షములును మహాభాష్యసమ్మతములె యగుటచేఁ బ్రమితములె యనఁదగును. ఈసందర్భమున నేపక్షము నాశ్రయించినను నట్టి ప్రాతిపదికార్థములకచటిప్రత్యయము ద్యోతకమగుననియుఁ దక్కినయర్థములకుఁ బ్రత్యయము వాచకమగుననియు నెఱుంగనగును. అగ్నియందుండు దహనశక్తి ప్రకటితమగుటకు శుష్కేంధనము సాధనమయినట్లు ప్రాతిపదికార్థములకుఁ బ్రత్యయము ద్యోతకమగుట విరుద్ధము కానేరదు. "తటః - తటీ - తట మిత్యాద్యనియతలిఙ్గేషు నియమేన కస్యాపి లిఙ్గస్యోపస్థిత్యభావాత్ ప్రాతిపదికార్థశబ్దేనాఽగ్రహణాత్ పృథక్ లిఙ్గగ్రహణ మావశ్యక మితిభావః" (సి. కౌ. ౫౩౨ సూ. బాలమ. వ్యా.) అనుచెప్పున ననియతలింగశబ్దములకు లింగము ప్రాతిపదికార్థము కానేరదుగానఁ బ్రత్యయార్థమే యని యెన్ననగును. పయిపక్షములలోఁ బరిమాణసామాన్యప్రతీతి లేకుండుటచేఁ బరిమాణమాత్రమునఁ బ్రథమ యగుననునదియు నావశ్యక మనిభావము. "ద్రోణో వ్రీహిః" అని పరిమాణోదాహృతి. (విస్తరI.). "అనియతలిఙ్గాస్తు తటాదిశబ్దాః లిఙ్గమాత్రాధిక్య స్యోదాహర

---

విస్తర I ౨౩౮ పుట:—ద్రోణ మనఁగాఁ గుంచమువంటి పరిమాణము. ధాన్యరాశి యనియర్థము. "జాలసూర్యమరీచిస్థం । త్రసరేణు రితి స్మృతమ్ । తే

ణామ్. తత్ర లిఙ్గానా మనియతోపస్థితికతయా ప్రాతిపదికా ర్థాన న్తర్భావాత్" (సి. కౌ. ౫౩౧ బాలమ. వ్యా.). ముగ్ధబోధవ్యాకరణకర్తయగు వోపదేవుఁడు ప్రాతిపదికార్థ సంబు ద్ధ్యుక్తార్థములందుఁ బ్రథమయగునని యీక్రిందిరీతిని సూత్రించెను. ల్యర్థేక్షేత్యాదిః—ల్యర్థ = ప్రాతిపదికార్థమందును, సంబుద్ధి = సంబోధనమందును, ఉక్తార్థే = తిజాదిప్రత్యయములచే నుక్తమగు నర్థమందును, ప్రి = ప్రథమయగును. కేసతి = కారకమందే యుక్తార్థమునఁ బ్రథమవచ్చును. కృష్ణః = కృష్ణుఁడు. శ్రీః = లక్ష్మి. జ్ఞానమ్ = జ్ఞానము. అనునవి ప్రాతిపదికార్థమున వచ్చుప్రథమకుదాహృతులు. 'కృష్ణః' అనునపుడు - 'కృష్ణత్వము - తదాశ్రయకృష్ణవ్యక్తి - పుంస్త్వము - 'ఏకత్వసంఖ్య' అనునవి ప్రాతిపదికార్థములు. ఇట్లే యంతటను నెఱుంగునది. హేవిష్ణో = ఓవిష్ణువా. ఇది సంబోధనప్రథమోదాహరణము. ప్రత్యయములచే (తిజ్-కృత్తద్ధిత) నుక్తమగు నర్థమందుఁ బ్రథమవచ్చుట కుదాహృతులు:- సర్వో ఽర్చ్యో జీవన ఇత్యాదిక ముదాహరణము. సర్వః = ఈశ్వరుఁడు, అర్చ్యః = అర్చింపఁదగినవాఁడు. జీవనః = జీవింపఁజేయువాఁడు. పాతా = రక్షించువాఁడు. దానీయః = భక్తితోఁ బత్త్రపుష్పఫలాదిక మీఁదగువాఁడు. ప్రభవః = ప్రపంచోత్పత్తికిఁ గారణమైనవాఁడు. లయః = ప్రపంచము తనయందె లయించువాఁడు. ఇట - "అర్చ్యతే అయమితి అర్చ్యః" అనువ్యుత్పత్తి (ఇతఁ డర్చింపఁబడు నని వ్యుత్పత్త్యర్థము) చొప్పున కర్మార్థమున ఘ్యణ్ ప్రత్యయము వచ్చినది. ఇట 'సర్వః' అనునది కర్మము. ఇట్టియెడల ("సర్వః శివః-అర్చ్యః - అర్చ్యతేఽయమితికర్మణి ఘ్యణి... అత్రసర్వఇతికర్మోక్తమ్." ముగ్ధ. కార. ౨౮౦ సూ. దుర్గాదాసవ్యాఖ్య.) ద్వితీయ (సర్వమ్) రావలసియున్నది. అట్లయినను నచటి ఘ్యణ్ ప్రత్యయము కర్మార్థమును జెప్పుచుండుటచేఁ బునరుక్తముగ "ఉక్తార్థానా మప్రయోగః" అను న్యాయము చొప్పునఁ గర్మార్థకద్వితీయ మరల రానేరదు. అట్టియెడల "న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః" అనున్యాయము చొప్పునఁ గేవలప్రాతిపదికము వాక్యమునఁ బ్రయోజ్యము కామింజేసి శబ్దసాధుత్వార్థముగఁ బ్రాతిపదికార్థప్రథ

---

ఒష్టౌ లిక్షాతు కా స్త్రిస్రో। రాజసర్షప ఉచ్యతే। గౌరస్తు తేత్రయ ష్షట్తే। యవో మధ్యస్తు తేత్రయః। కృష్ణలః పఞ్చతే మాషః। తే సువర్ణస్తు షోడశ। పలం సువర్ణా శ్చత్వారః। పఞ్చ వాపి ప్రకీర్తితమ్। పలద్వయంతు ప్రసృతం। ద్విగుణం కుడబం మతమ్। చతుర్భిః కుడబైః ప్రస్థః। ప్రస్థా శ్చత్వార ఆఢకః।ఆఢకై స్తై శ్చతుర్భిస్తు। ద్రోణ ఇత్యభిధీయతే। కుమ్భో ద్రోణద్వయం శూర్పః। ఖారీ ద్రోణాస్తు షోడశ ఇతిస్మరణాత్'' (సి. కౌ. బాలమ. కార. ౫౩౨ సూ. వ్యా.)

మఱి యనువాదముగ నిల్చెనని యెఱుంగునది. ఇట్లే యంతటను సమన్వయించునది. (విస్తర II) సంబోధనమునందును నుక్తార్థమునందును బ్రథమవచ్చునని పాణినీయులును వచించిరి.

"సంబోధనేచ. (౨-౩-౪౭) ఇహ ప్రథమాస్యాత్ - హేరామ" (సి. కౌ. కార. ౫౩౩ సూ.) "అనభిహితే (౨-౩-౧) ఇత్యధికృత్య. 'కర్మణిద్వితీయా' (౨-౩-౨) అనుక్తే కర్మణి ద్వితీయాస్యాత్ - హరిం భజ - అభిహితేతు కర్మణి 'ప్రాతిపదికార్థమాత్రే' ఇతి ప్రథమైవ. అభిధానంచ ప్రాయేణ తిఙ్కృత్తద్ధిత సమాసైః........" (సి. కౌ. ౫౩౬-౫౩౭ సూ.). (విస్తర III) సంబోధనమనఁగా నభిముఖీకరణము. "అన్యత్ర వ్యాసక్తస్య కార్యాన్తరే నియోజనార్థమాభిముఖ్యవిధానం సంబుద్ధిః - హేవృక్ష - హేలతే - ఇత్యాదా వచేతనేతు

---

విస్తర II ౨౩౪ వివ:—"కర్త్రాదీనా ముక్తార్థత్వే 'ఉక్తార్థానా మప్రయోగ ఇతి న్యాయాత్ ద్వితీయాదీనా మప్రాప్తౌ లిఙ్గార్థ (ప్రాతిపదికార్థ) మాత్రత్వ ప్రథమైవ భవిష్యతి." (ముగ్ధ. ౨౭౦ సూ. దుర్గా. వ్యాఖ్య.). "విభక్తి రిహానువాదికా-శబ్దసాధుత్వార్థం ప్రయోజ్యా. 'న కేవలా ప్రకృతిః ప్రయోజ్యా-నాఽపి ప్రత్యయః' ఇతి. అనభిహితసూత్ర భాష్యసిద్ధవ్యాయా దితిభావః." (బాలమ. వ్యాఖ్య. ౫౩౨ సూ.). ఉక్తార్థతావిషయమునఁ జేటికావ్యాఖ్యాత "నామవాచక శబ్దార్థ ముక్తార్థ మగుటంజేసి" (౨౬౫ పు.) మున్నగురీతిని మిక్కిలి సంప్రదాయ విరుద్ధముగ వ్రాసెను. ఈక్రిందిగాణపతవివరణపంక్తు లుక్తార్థతా స్వరూపము నీక్రిందిరీతిని సంప్రదాయవిరుద్ధముగా వివరించుచున్నవి. "ఉక్తార్థము = క్రియాదులచేఁ జెప్పఁబడిన యర్థముగలది. అనఁగా నాకాంక్షయందు.........ఎవఁడు సంహరించెను? అని యాకాంక్షగలిగినపుడు (సంహరించెనను క్రియ) రామునిఁ జెప్పుచున్నది. కాన రామశబ్దముకన్నఁ బ్రథమావిభక్తివచ్చినది. రామునిచే రావణుఁడు సంహరింపఁబడెను. ఇట ఎవఁడు సంహరింపఁబడియె? అను నాకాంక్షచే రావణుఁడు చెప్పఁబడెను. కాన రావణశబ్దముకన్నఁ బ్రథమవచ్చినది......... ఆదిచేఁగృత్తద్ధిత సమాసములు గ్రహింపఁబడు. కృత్:—రాముఁడేలిక, తద్ధిత:—వాఁడువగకాఁడు, సమాస:—శివుఁడు ముక్కంటి"(గాణ కార. ౧౭౦ సూ. వివ.)

విస్తర III. ౨౩౪ వివ:—"తిఙ్-హరి స్సేవ్యతే. కృత్-లక్ష్మ్యా సేవితః.తద్ధిత-శతేనక్రీత శ్శత్యః. సమాస - ప్రాప్తః ఆనందో యంస ప్రాప్తానందః-క్వచి న్నిపాతే నాభిధానమ్. యథా - 'విషవృక్షోఽపి సంవర్ధ్య। స్వయం ఛేత్తు మసాంప్రతమ్.' సాంప్రత మిత్యస్యహి యుజ్యత ఇత్యర్థః" (సి. కౌ. కార. ౫౩౭ సూ. వివరణము.)

ఇతిశబ్దముచేత సైత ముక్తార్థత కలదు. ఉదా:—దశరథుఁ డని చెప్పఁబడిన వాఁడు. "ఇతిశబ్దేనా ప్యుక్తార్థతా యథా:—కృష్ణ ఇత్యవ్యయం నామ......... దశరథ ఇత్యుదాహృతః. ఇత్యాది" (ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. ౨౮౦ సూ.).క. నిను సౌమ్యుఁడవని యెఱిఁగితి.........(శాంతి. 3 ఆ. ౫౬ ప.). 'హరి స్సేవ్యతే' అనుచో "తిఙు" చేతను, 'లక్ష్మ్యా సేవితః' అనుచో 'క్త' ప్రత్యయముచేతను (కృత్తుచేతను) గర్మార్థము చెప్పఁబడుటచే 'హరి' అనుదానికర్మత్వ ముక్తమగుటచేఁ గర్మార్థమున రావలసినద్వితీయ రాక ప్రాతిపదికార్థప్రథమయే వచ్చినది. 'శత్యః అశ్వః' అనుచోఁ గర్మార్థమున యత్ ప్రత్యయము విధింపఁబడెనుగాన నట్టితద్ధితముచే నశ్వమునందలికర్మత్వ ముక్తమైనది కానఁ గర్మార్థద్వితీయ రాక ప్రాతిపదికార్థ ప్రథమయి వచ్చెను. 'ప్రాప్తః ఆనన్దో యంసః = ప్రాప్తానందః గ్రామః' అనుచో నే గ్రామము నానందము పొందెనో యాగ్రాము మనునప్పుడు ద్వితీయాబహు వ్రీహిచే గ్రామమునందలి కర్మత్వ మభిహిత మైనదిగాన నటఁ గర్మార్థద్వితీయ రాక ప్రాతిపదికార్థప్రథమయి వచ్చెను. 'ప్రాప్తానంద' అనునది ప్రాతిపదికము. 'నయు జ్యతే'అను కర్మార్థముగల "అసాంప్రతమ్" అను నిపాతముచే విషవృక్షమందలి కర్మత్వ ముక్తమగుటచేఁ గర్మార్థద్వితీయ రాక ప్రాతిపదికార్థప్రథమయి వచ్చినది. ఇట్లె కర్తృకరణాదికారకము లభిహితము లగునపుడును బ్రథమయి వచ్చును. కల్పతరువున నుదాహృతమగు ముగ్ధబోధశ్లోకమునకు దుర్గాదాసుఁ డుదాహరించెను. అందలి 'అర్చ్యః' అనునది కల్పతరువున నుదాహరింపఁబడెను. "జీవ్యతే ఽనేనేతి జీవనః. కరణే ఽనట్. అత్ర సర్వఇతి కరణ ముక్తమ్. పాతీతి పాతా-కర్తరి తృన్- అత్ర సర్వఇతి కర్తా ఉక్తః. దీయతేఽస్మై ఇతి దానీయః. అత్ర కృద్యోఃకభావ ఇత్యనేన సంప్రదానే ఽనీయః అత్ర సర్వఇతి సంప్రదానముక్తమ్. ప్రభవత్యస్మాదితి ప్రభవః- అపాదానే అచ్ - అత్ర సర్వఇత్యపాదాన ముక్తమ్ - లీయతే ఽస్మిన్నితి లయః-అధి కరణే అచ్-అత్ర సర్వ ఇత్యధికరణ ముక్తమ్......సంబన్ధస్యా ప్యుక్తార్థత్వే పీతమ మ్బరం యస్యాసౌ పీతామ్బరో హరి రిత్యాదౌ ప్రథమాస్యాత్......" (ముగ్ధ. ౨౮౦ సూ. దుర్గా. వ్యాఖ్య.) పీతాంబరుఁడు 'ఎవ్వనియొక్క యంబరము పచ్చ నిదో యతఁడు' అనుబహువ్రీహిచే సంబంధ ముక్తమైనది గాన "పీతాంబర"అను ప్రాతిపదికముపైని శేషషష్ఠి నిలువక ప్రాతిపదికార్థ ప్రథమయె నిల్చినది. "పీతా మ్బర" అనుసమాసము ప్రాతిపదికము,

అనభిహితత్వమం దన్ననో కర్మాది కారకములకు ద్వితీయాదివిభక్తులు వచ్చును. అపుడవి యీ ప్రాతిపదికార్థప్రథమ కపవాదములగును. 'కృష్ణుని స్మరించెదను' అను

ఉపచారః." (ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. కార. ౨౮౦ సూ. వ్యాఖ్య.) అచేతనముల సంబోధనమునం దభిముఖీకరణ మౌపచారిక మనితాత్పర్యము.

ప్రాతిపదిక సంబోధ నోక్తార్థంబులం బ్రథమయగు. ౧.

ప్రాతిపదికార్థమునందు:—రాముఁడు - రావణుఁడు. నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. సంబోధనమునందు:—ఓరాముఁడ, ఓరావణుఁడ. ఉక్తార్థమందు:—రాముఁడు రావణుని సంహరించెను. ఉక్త మనఁగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమునం దాఖ్యాతము కర్తను జెప్పినదిగావునఁ దద్వాచకమగు రామశబ్దమునకుఁ బ్రథమయయ్యె. రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె. ఈవాక్యమునం దాఖ్యాతము కర్మమును జెప్పినదిగావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమ యయ్యె ననియెఱుంగునది.

బాలవ్యాకరణ వివరణము ౨౩౪ I విష.

సంజీవని. ౨౩౪ I విష:—ఈసూరిసూత్రము కల్పతరువులో నుదాహరింపఁబడిన ముగ్ధబోధవ్యాకరణసూత్రమునకు సరిగనున్నది. ఏప్రాతిపదిక ముచ్చరింపఁబడఁగానే, యేయర్థము నియతముగా స్ఫురించునో యాప్రాతిపదికమున కది యర్థమని యెఱుంగనగును. ఉక్తార్థమనునది కల్పతరువున విపులముగా వివరింపఁబడెను. ఆఖ్యాత మనఁగాఁ డిజ్ప్రత్యయము. లేదా తిబన్తశబ్దము ననవచ్చును. "ఆఖ్యాతమ్" త్రి. కథితే-వ్యాఖ్యాతే. న-తిఙ్,........" (శబ్దా. చిం.) "ఆఖ్యాత. త్రి. (ఆ+ఖ్యా+కర్మణి క్తః) కథితే - ఆఖ్యాతే - వ్యాకరణప్రసిద్ధే తిబన్తే పదేచ..." (శబ్దస్తో) "అభిధానంచ ప్రాయేణ తిజ్కృత్తద్ధితసమాసైః" (సి. కౌ. కార. ౫౩౭ సూ. వివ.). సూరి, యుదాహృతులు రెంటను సమాపకక్రియాపదస్థతిఙ్చేత మాత్రమె కర్తృకర్మము లభిహితములగుటను జూపెను. ప్రత్యయాంతరములచే నభిహితములగుట నేలొకో యుదాహరింపలేదు. భావార్థకాదికృత్తులచేఁ గర్తృకర్మము లభిహితమగుట తెల్గున విపులముగా నున్నది. ఉదా:—చైత్రుఁడు చదువఁగా మైత్రుఁడు వినెను. ఇచట కర్త్రర్థక భావలక్షణార్థ నుజీచేఁగర్త యభిహితమయ్యెను. అట్లగుటచేఁ గర్తృవాచకచైత్రశబ్దముపైఁ గర్త్రర్థకతృతీయ నిలువక ప్రాతిపదికార్థ

---

నపుడు స్మరణక్రియకుఁ గర్మము 'కృష్ణుని' అనునది. అది తిజాదిప్రత్యయములచే నభిహితము కాలేదు. కాన నటఁ గర్మార్థమున ద్వితీయ వచ్చినది. తిఙ్చే నభిహితముకర్త కాన 'నేను' అనునది ప్రథమాన్తమె యైనది.

ప్రథమయై నిల్చినది. చైత్రునిచేఁ బాఠము చదువఁబడుట మైత్రునకు వినఁబడలేదు. అనుచోఁ 'చదువఁబడుట' అనుకర్మార్థక ధాత్వర్థట ప్రత్యయముచేఁ గర్మ ముక్త మాయెను. గానఁ గర్మవాచిపాఠశబ్దముపైఁ గర్మార్థద్వితీయ నిల్వక ప్రాతిపదికార్థ ప్రథమయై నిల్చినది. "లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికిఁ గర్తయందును నగు." (బా. క్రియా. ౪౮ సూ.) అనుసూత్రమునందలి యాది శబ్దముచే లడాదులవలెనె భావార్థకాదులును గర్త్రర్థమునందును గర్మార్థమునందును విధింపఁబడిన వనుటకు సందియములేదు. ఇట్లు భావార్థకాదిప్రయోగమునఁ గర్తృ కర్మవాచకములకుఁ బ్రథమ సిద్ధించుచుండఁగా సూరి "భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమయగు" (బా. కా. ౩౨ సూ.) అని పునరుక్తముగా సూత్రించెను. ఇటఁ గర్తకుమాత్రము ప్రథమనువిధించుట నరయఁగా నీతఁడు తిఙ్సుచేమాత్రమె యభిహితత్వము గలదనియు భావార్థకాదులచే నభిహితత్వము లేమింజేసి యిట్టి యెడలఁ గర్తృవాచకముపైఁ దృతీయ నిల్వవలసివచ్చుననియుఁ దలఁచి యీసూత్రమును రచించెనని తోఁచకమానదు. బా క్రియా. ౩౯ సూ. మొ. ౪౯ సూ. వఱకును భావార్థకాది ప్రత్యయములు విధింపఁబడెను. అట్లె బా. క్రియా. ౧౨౨ సూత్రముచేత విధింపఁబడిన నుజీయు నీభావార్థకాదులలోఁ జేర్పఁదగినదె. (విస్తర I)

సూరిగారి యుదాహృతుల సమన్వయము:—'రాముఁడు రావణుని సంహరించెను.' అనువాక్యమున దిజ్విభక్తియగు లిట్టు 'రాముఁడు' అను కర్తను జెప్పుచున్నది. అనఁగా "లకారాదులు సకర్మంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికిం గర్తయందును నగు" (బా. క్రియా. ౪౮ సూ.). అనుసూత్రముచే లిట్టు కర్త్రర్థమున విధింపఁబడినది గాన లిట్టుచేఁ గర్తచెప్పఁబడినది. కావున గర్తృవాచకమగు రామశబ్దముపైఁ గర్త్రర్థమున నిలువవలసిన తృతీయ (బా. కార. ౩ సూ.) 'ఉక్తార్థానా మప్రయోగః' అనున్యాయముచొప్పునఁ బునరుక్తముగ నిలువదయ్యె. అట్టి

విస్తర I ౨౩౪ I విష:—బా. క్రియా. ౧౨౨ సూత్రపు నుజీ వాడినచోటఁ గర్తకుఁ బ్రథమయేకాక షష్ఠియువచ్చుట గలదు. ఉదా: ఇది నేను జేయఁగాదు, ఇది నాకుఁ జేయఁగాదు. నుజ్యంతముతోఁ నన్వయింపక కర్త వలయ్యాదులతో నన్వయించుటచే షష్ఠ్యంత మగపడు చున్నది. క. వీరికిఁ జొరనగు । వీరికిఁ గాదను విచారవిషయము గలదే. (ఆది. ౬ ఆ. ౩౮.) ఆ-వె. కాన నింక వేఁడఁగాదు నాకు (సభా. ౨ ఆ. ౨౬౩.) ప్రథమకు:—ఉ.........।దైవముతోఁ ద్వడన్ వలయు,.....(ఉద్యో. ౩ ఆ. ౭౩.) క.........నాకు నీవేమియుఁ జెప్పనువలవదు. (ద్రోణ. ౧ ఆ. ౯౪.). మొ.

యెడఁ బ్రయోగయోగ్యతకై "(న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా-నాపి ప్రత్యయః" అనున్యాయముచొప్పున) ప్రాతిపదికార్థప్రథమయె నిల్చినది. ఇట్లె 'రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె' అనునపుడును లిట్టు కర్మార్థమునందు విధింపఁబడెను గాన (బా. క్రియా. ౪౫ సూ.) లిట్టుచే గర్మార్థ మభిహితంబయ్యె. అక్కారణమునఁ గర్మవాచక రావణశబ్దముపైఁ గర్మార్థక ద్వితీయ (బా. కార. ౨ సూ.) పునరుక్తముగ నిలువక ప్రాతిపదికార్థప్రథమయె నిల్చినది. ఇట్లె భావార్థకాది కృత్తులును బా. క్రియా. ౪౫ సూత్రముచొప్పునఁ గర్తృకర్మార్థములందు విధింపఁ బడుటంజేసి వానిప్రయోగమునందును గర్త్రర్థమునఁ దృతీయయుఁ గర్మార్థమున ద్వితీయయుఁ బునరుక్తముగ నిలువక ప్రాతిపదికార్థప్రథమయె నిల్చును. ప్రయోగ ములు:—చ. అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా। స్త్రముల యశేషపారము నుదంబునఁ బొందను బుద్ధిబాహువి। క్రమమున దుర్గమార్థజల గౌరవభారతభారతీసము। ద్రము దరియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే (ఆది. ౧ ఆ. ౧౯.) మ.........భూ।పతి సహియింప నోపునె (సభా. ౨ ఆ. ౯౫.) సీ.........నన్నిట్లు వీతదయుండవై విడిచి చనఁగ।దగునె నీకు.........(అర. ౨ ఆ. ౭౨.). ఉ.........వాయుసుతుండు మల్లయు। ద్ధమ్మున నోర్చు నాతని నుదగ్ర మహాభుజశక్తి యేర్పడన్. (సభా. ౧ ఆ. ౧౬౨.) చ. తడయక యేఁగి నీతిబల దర్పము లొప్పఁగ... .....(సభా. ౧ ఆ. ౧౬౪.) చ.........మా కధికశత్రు జయం బగుటేమిపెద్ద.........(సభా. ౧ ఆ. ౧౬౬.) చ.........నవసౌరభప్రసవ చిత్రవనావలి గల్గుదాని (సభా. ౧ ఆ. ౧23.) చ.........హంసుఁడు డిభకుండు నంతక। తుయగతులైన నిప్డు.........(సభా. ౧ ఆ. ౧౬౧.) శా. ఆదుర్యోధనుఁ డుద్భవిల్లుడును.........(ఆది. ౫ ఆ. ౧౦౬.) గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నా నుండె నేని (సభా. ౨ ఆ. ౨౫.). ఆచ్ఛికశబ్దములకునైతము ప్రాతిపదికార్థసంబోధనము లందుఁ బ్రథమ యగును. ఉదా:—తండ్రి - తల్లి - గోడ - ఓతండ్రీ - మొ. 'తండ్రి' అనుచో "తండ్రితనమును జాతియుఁ దదాశ్రయమగు పితృవ్యక్తియు మహదర్థకత్వ మును ననునవి ప్రాతిపదికార్థము లగుచున్నవి. తెలుఁగున మహత్త్వామహత్త్వ మహతీత్వములె లింగస్థానీయములు. కాన నవియుఁ బ్రాతిపదికార్థములె యనుటలో విప్రతిపత్తిలేదు. తెల్గునందును మిత్త్రుఁడు - మిత్త్రము - కంధర -.కంధరము - దూత- దూతుఁడు మున్నగు ననియతలింగసమములు గలవు. అట్టియనియతలింగసమత్వమును వచనాదులును బ్రత్యయార్థములనియు, బ్రాతిపదికార్థములు కావనియు నాంధ్ర వైయాకరణుల యాశయము. "ఇట్లనేకలింగంబులుగల శబ్దంబులయొద్ద (మిత్త్రము -

మిత్రు(డు) లింగము ప్రాతిపదికార్థములలో నంతర్భూతమని యంగీకరింపక విభక్త్యర్థమే యని గ్రహించుకొనునది" (బా. గు. ప్ర. కా. ౧ సూ. వ్యాఖ్య. ౨౦౪ పుట. ద్వి. ము.). (విస్తర II)

సర్వవిభక్తిః సంస్కృతతుల్యా. (ఆం. చిం. హలం. ౧౫ అహో. ౪౨3.)

కర్తురీప్సితతమం కర్మ. (౧-౪-౪౯.) కర్తుః క్రియయా ఆప్తుం ఇష్టతమం కారకం కర్మసంజ్ఞం స్యాత్.

కర్మణి ద్వితీయా (౨-3-౨) అనుక్తే కర్మణి ద్వితీయా స్యాత్. హరిం భజతి. (సి. కౌ. ౫3౭ సూ.)

తథా యుక్తం చానీప్సితమ్ (౧-౪ ౫౦.) ఈప్సితతమవత్ క్రియయా యుక్త మనీప్సితమపి కారకం కర్మసంజ్ఞం స్యాత్-గ్రామం గచ్ఛం స్తృణం స్పృశతి.

నన్నయా విషం భుఙ్క్తే. (సి. కౌ. ౫3౮ సూ.)

౨3౫ విషయము అకథితం చ. (౧-౪-౫౧.) అపాదానాదివిశేషైరవివక్షితం కారకం కర్మసంజ్ఞం స్యాత్. శ్లో. దుహ్యాచ్-పచ్-దణ్డ్-రుధి-ప్రచ్ఛి । చి-బ్రూ-శాసి-జి-మథ్ముషామ్ । కర్మయుక్ స్యా దకథితం।తథా స్యా న్నీ-హృ-కృష్వహామ్. దుహాదీనాం ద్వాదశానాం తథా నీ ప్రభృతీనాం చతుర్ణాం కర్మణా యద్యుజ్యతే తదే వాఽకథితం కర్మేతి పరిగణనం కర్తవ్యమిత్యర్థః. గాం దోగ్ధి పయః......(సి. కౌ. ౫3౯ సూ.)

కర్మప్రవచనీయకే కూర్చిః (ఆం. చిం. అజం. ౫ కారి. అహో. ౨౬౦ పుట.)

---

విస్తర II ౨3౪ I విషః—సూరి కారకశబ్దార్థమును వివరింపక యుపేక్షింపఁగాఁ ద్విలింగలక్షణశేషమునఁ బూరింపఁబడెను. "కారకంబులనం గర్త్రాదులు. అవి యాఱు. కర్మకారకము-కర్తృకారకము - కరణకారము - సంప్రదానకారకము - అపాదానకారకము - అధికరణకారకము. క్రియాన్వయము గలిగించునది యనఁగాఁ గ్రియాన్వయము కలదియని కారకశబ్దార్థము." (ప్రౌఢ. కార. ౧ సూ.). ఉదా:— దేవదత్తుఁడు వంటకమును వండెను. మొ.

కల్పతరు. ౨౩౫ విష:—సర్వవిభక్తి రిత్యాదికారిక ౨౩౮ విషయమున వ్యాఖ్యాత మయ్యెను. కారకప్రక్రియలో సంస్కృతవ్యాకరణసూత్రములను మూలముచేయుట కిదియే కారణము. కాన నిది యెల్లెడల వానిమొదటఁ జూపఁ బడును.

కర్తురిత్యాది. కర్తుః = కర్తకు, క్రియయా ఆప్తుమ్ = క్రియతో వ్యాపించుటకు, ఇష్టతమరి కారకమ్ = మిక్కిలియిష్టమైనది కారకమై, కర్మ = కర్మసంజ్ఞ గలదగును. అనుక్తే కర్మణి = అనభిహితకర్మవాచకముపైని ద్వితీయా స్యాత్ = ద్వితీయ నిల్చును. ఉదా:—హరిం భజతి = భక్తుడు హరిని భజించుచున్నాఁడు. భక్తుని భజనవ్యాపారమున కీప్సితతముఁడు హరి గావున హరి కర్మమయ్యెను. అట్టి యనుక్తకర్మమునకు వాచకమగు హరిశబ్దముపై ద్వితీయావిభక్తి నిల్వఁగా '(భక్తో) హరిం భజతి' అని సిద్ధించినది.

తథా యుక్తంచేత్యాది:—తథాయుక్తంచ = ఈప్సితతమమువలెఁ గ్రియతో సంబంధించునట్టియు, అనీప్సితమ్ = కర్త కిష్టతమము కానిదియుఁ గారకమై కర్మ సంజ్ఞగలదగును, గ్రామం గచ్ఛన్ = గ్రామమునుగూర్చి పోవుచు, తృణం స్పృశతి= తృణమును దాఁకుచున్నాఁడు. తృణస్పర్శము కర్త కిష్టతమము కాకున్నను గర్మసంజ్ఞ కల్గుచున్నది. విషం భుఙ్క్తే = విషమును రోగి దినుచున్నాఁడు. ఇందును నైరీతినె గ్రహింపనగును. సామాన్యముగా విషాశన మీప్సితము కాదు సరేకదా యనిష్ట మును నైయుండును.

"యత్క్రియతే తత్కర్మేతి ప్రసిద్ధమ్. కరోతే ర్నిఖిలక్రియావాచకత్వాత్ కర్తు ర్వ్యాపారేణ యత్ సాధ్యతే తత్ కర్మే త్యర్థః."(కర్తయొక్క వ్యాపారముచే సాధింపఁబడినది కర్మమనియర్థము. దేవదత్తుని పచనవ్యాపారముచేఁ బాకము సాధింపఁబడెను. అట్టిపాకమున కాశ్రయమగు నన్నము కర్మసంజ్ఞిత మగును.) "అతఏవ క్రియావ్యాప్యం కర్మేతి క్రమదీశ్వరః. కర్తు రీప్సితతమం కర్మేతి పాణినిః. తద్భిన్నత్వేసతి క్రియాజన్యఫలశాలిత్వం కర్మత్వ మిత్యపరే." (ముగ్ధ. ౩౮౧ సూ. దుర్గా-వ్యా.) క్రియాభిన్నమై క్రియాజన్యఫలమున కాశ్రయమైనది కర్మసంజ్ఞగల దను నీమూఁడవపక్షముచేఁ బాణినీయలక్ష్యము లెల్ల సంగ్రహింపఁబడుచున్నవి.

అకథితం చేత్యాది:—అకథితంచ = అపాదానాదివిశేషములచే వివక్షింపఁ బడని యనఁగా నపాదానాదిరూపమున వివక్షింపఁబడక కర్మరూపమున వివక్షింపఁ బడిన యట్టికారకము నైతము కర్మసంజ్ఞగలదగును. ఉదా:—గాం దోగ్ధి పయః= గొల్లఁడు గోవును బాలను బిదుకుచున్నాఁడు. అనుచో నీప్సితతమకర్మము పాలు.

క్రియతో నన్వయించు గోశబ్దవాచ్యమునం దపాదానము వివక్షింపక కర్మత్వమును వివక్షించుటచే నదియుఁ గర్మమయ్యెను. అపాదానవివక్షయందు 'గొల్లఁడు గోవు నుండి పాలను బిదుకుచున్నాఁడు' అనియే యేర్పడును. ఇట్టి ద్వికర్మకక్రియలు కొన్ని పరిగణింపఁబడినవి. అవియే దుహాదులు. దుహ్ = పిదుకు, యాచ్ = యాచించు, పచ్ = పచించు = వండు, దణ్డ్ = దండించు, రుధి = ఆవరించు = నిరోధించు, ప్రచ్ఛి = పృచ్ఛించు, చి = ఫలాదులనుగోయు, బ్రూ = వచించు = చెప్పు, శాసి = శాసించు, జి = జయించు, మథ్ = మథించు, ముష్ = దొంగిలించు, నీ = తీసికొనిపోవు, ఇట్లె హృ = కృష్ - వహ్. మొ. ముగ్ధబోధవ్యాకరణమున "యాచ్ఞార్థ - దుహ - చి - ప్రచ్ఛ । రుధ్ - బ్రూ - శాస - జి - నీ - వహః । హృ - దణ్డి - గ్రహ - క్రుష్ - మన్థ । ముష్ - పచాద్యా - ధవో - ద్విధాః." అని చెప్పఁబడెను. కౌముదిలోఁ బరిగణింపఁబడినట్లు పదునారేకాక యింకను 'ద్విధాః' = ద్వికర్మకములు గలవని 'పచాద్యాః' అనుచు గణము వచింపఁబడెను. "ఆద్యశబ్దాత్ హీన = వర్ధనే - గతౌ - గురుః శిష్యం గ్రామం ప్రాహిణోతీత్యాది.........వృక్షం నౌకాం కరోతీత్యాది. ఏకమేవ కర్మ ప్రకృతివికృతిభేదేన భిన్నం సువర్ణం కుణ్డలం కరోతీత్యాదివత్." (ముగ్ధ. ౨౮౫ సూ.) దీనినిబట్టి వర్ధకి వృక్షము నోడను జేసెను. కమసాలి సువర్ణమును గుండలమును జేసెను. మున్నగురీతిని స్థలాంతరములందును ద్వికర్మకత్వము గల్గుననియెన్నవగును.

మైత్రుండు చైత్రునిగూర్చి యిట్లనియె. (ఇట్లనఁగా నీవాక్యమును.) ఇందు 'ఇట్లు' అనునది ముఖ్యకర్మము. 'చైత్రుని' అనునది యముఖ్యకర్మము. "వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడ కు వర్ణకంబులు ప్రాయికంబుగ నగు. ఉదా:—మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె. మైత్రుండు చైత్రున కిట్లనియె. ప్రాయికంబగుటచే నొకానొకచో ద్వితీయయు నగు." (బా. కార. ౬ సూ.) అని సూరి సూత్రించెను. ఒకానొకచో ననఁగా—'మైత్రుండు చైత్రునిగూర్చి యిట్లనియె' అనియుఁ గ్వాచిత్కముగా నుండనగునని యెఱుంగునది.

'సన్వవిభక్తి స్సంస్కృతతుల్యా'అని భట్టారకుఁడు వచించుటచేఁ బయిరీతిని ద్వికర్మకక్రియలు నిరూపింపఁబడెను గాని యిట్టి ద్వికర్మకతాప్రయోగము తెల్గున మిక్కిలియరుదు. పై నుదాహరించిన సూరిసూత్రముచొప్పునఁ బయిచోటులందుఁ బ్రాయికముగా "తోడ-కు" వర్ణకములు వచ్చుటే తెలుఁగు సంప్రదాయము. సీ.........గీ. అధిక। బలుఁడు శూరుండు గట్టుము పట్ట మతని (ద్రోణ. ౧ ఆ. ౬౨ ప.) చ. పలుకఁడె నిన్న నేఁడు నినుఁ బట్టము గట్టెదనంచు బొంకొకో (భాస్క.

రా. అయో. ౪౯ స) (వి_స్తర I, II). ఇట్టి ద్వికర్మకము లరుదు. వచ్యర్థకధాతు ప్రయోగమునఁ బఱుఁ సూరిసూత్రముచొప్పున 'తోడ-కు' వర్ణకము లముఖ్యకర్మ

---

విస్తర I ౨౩౫ విష:—సంస్కృతభాషాప్రసిద్ధవిభక్తులు కొన్ని తెలుఁగునఁ బ్రయుక్తములగుట సంప్రదాయముకాదు. కావున "సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా" అనుభట్టారకసూత్రము ప్రాయోఽభిప్రాయమున వచింపఁబడెను. కావుననె దాని వెంటనె "అన్యస్యాః క్వచి ద్భవే చ్ఛానా్యా" అనిసూత్రించినవాఁడయ్యెను. "ఉపాన్వధ్యాఙ్వసః" (౧-౪-౪౮.) ఉపాదిపూర్వస్య వసతే రాధారః కర్మ స్యాత్-ఉపవసతి-అనువసతి - అధివసతి - ఆవసతి - వా - వైకుణ్ఠం హరిః." (సి. కౌ. ౫౪౪ సూ.) ఉపాదిపూర్వక వస్ధాతువున కధికరణము కర్మసంజ్ఞగల దగును. "ఉపవసతి వైకుంఠం హరిః" = వైకుంఠమును హరి యధివసించుచున్నాఁ డనియర్థము. తెలుగున నిట్టిప్రయోగ ముండదు. వైకుంఠమందు హరి యధివసించుచున్నాఁ డని ప్రయోగించుటయె సంప్రదాయము. ఇట్లె "ఉభ సర్వతసోః కార్యా।ధి గుపర్యాదిషు త్రిషు। ద్వితీయా ఽమ్రేడితాన్తేషు। తతో ఽన్యత్రాపి దృశ్యతే. (సి. కౌ. ౧౪౪౪ వార్తికము.) 'ఉభయతః-సర్వతః.' అనువాని ప్రయోగమునందును ధిక్శబ్దప్రయోగమునందును నామ్రేడితములగు "ఉపరి - అధః - అధి" అనువానియోగమునందును నిట్టి మఱికొన్నిటి యోగమునందును ద్వితీయ వచ్చును. ఉభయతః కృష్ణం గోపాః = కృష్ణునిని రెండుప్రక్కలను గోపకులు గలరు. ఇట్టి ద్వితీయ తెల్గున వాడఁబడదు. ఇట్టయెడల షష్ఠి మున్నగునవియె తెల్గున వాడఁబడును. మఱియు ధిగాదిశబ్దములకుఁ దెల్గునఁ దత్సదృరూపప్రయోగమును లేదు. కృష్ణున కిర్వంకలను గోపకులు గలరు. ఈరీతినే "అకర్మకధాతుభి ర్యోగే దేశః కాలో భావో గన్తవ్యో ఽధ్వాచ కర్మసంజ్ఞక ఇతివాచ్యమ్. కురూన్ స్వపితి - మాస మాస్తే - గోదోహ మాస్తే - క్రోశ మాస్తే." (సి. కౌ. ౫౩౯ సూ. ౧౧౦౩-౧౧౦౪ వార్తి.) అకర్మక ధాతుప్రయోగమున దేశకాలాదులు కర్మసంజ్ఞ గలవగును. దేవదత్తుఁడు గ్రామ సమూహమును నిద్రించుచున్నాఁడు. ఇట్టివాడుక తెలుఁగున లేదు. దేవదత్తుఁడు గ్రామసమూహమందు నిద్రించుచున్నాఁడని ప్రయోగించుటయె సంప్రదాయము. "కాలాధ్వనో రత్యన్తసంయోగే. (౨-౩-౫) ఇహ ద్వితీయా స్యాత్. మాసం కల్యాణీ. మాస మధీతే. మాసం గుడధానాః. క్రోశం కుటిలా నదీ. క్రోశ మధీతే........" (సి. కౌ. ౫౫౮ సూ.) గుణక్రియాద్రవ్యములచేఁ గాలాధ్వముల కవిచ్ఛిన్నసంయోగము గమ్యమగుచుండఁగా ద్వితీయ యగును. "మాస మధీతే = ఒకనెలను విచ్ఛేదము లేకుండఁ జదువుచున్నాఁడు." ఇట్టివాడుకలు తెల్గున

మునకు రాకుండుటయుఁ బ్రయోగదృష్టమగుచున్నది. క. అని వెండియు నాపతి కురు । జననాథుగుఱించి పలుకు శుక్రుఁడుతోడై.........(శల్య. ౨ ఆ. ౫౦.). చ. అనవిని యన్నరేశ్వరుఁడు హాసముతో నతనింగుఱించి యి । ట్లను.........(శల్య. ౨. ఆ. ౭౩.) గీ. ఆతఁ డారణ్యకోన్గీతమైన వాక్య । సంచయము విన్నగుఱిచి

---

లేవు. ఒకమాసమున విచ్ఛేదము లేకుండఁ జదువుచున్నాఁ డనురీతిని బ్రయోగించుటయే సంప్రదాయము. ఇంకను "కాలాధ్వములకుం బ్రాయికంబుగఁ బ్రథమ యగు." (బా. కా. ౨౫ సూ.) అనుచోప్పున "వాఁడు నిన్న వచ్చెను - వాఁడు క్రోశము నడచెను." అనురీతిని బ్రథమ వచ్చుటయు సంప్రదాయమై యున్నది. చ. పలుకఁడె నిన్న నేఁడు నినుఁ బట్టముఁ గట్టెద నంచు.........(భాస్క. అయో. ౪౯ ప.)

కర్మప్రవచనీయక ఇత్యాది చింతామణిసూత్ర మీవఱకు ౧౩౫ విషమున వ్యాఖ్యాత మయ్యెను. సంస్కృతవ్యాకరణములలో "ప్ర - పరా - పీత్యాది ప్రాదుల లోని కొన్నిటికి—"అను - ఉప - ప్రతి - అభి - అధి - సు - అతి-అపి" - అనువానికిఁ గొన్నిటికి—గత్యుపసర్గసంజ్ఞ కపవాదముగఁ గర్మప్రవచనీయసంజ్ఞ గలదనియు నట్టి వానియోగమున ద్వితీయావిభక్తి వచ్చుననియుఁ జెప్పఁబడెను. "లక్షణేత్థంభూతాఖ్యాన భాగ వీప్సాసు ప్రతిపర్యనవః. (౧ ౪-౯౦.) ఏష్వర్థేషు విషయభూతేషు ప్రత్యాదయ ఉక్తసంజ్ఞాః స్యుః." (సి. కౌ. ౫౫౫ సూ.) "కర్మప్రవచనీయ యుక్తే ద్వితీయా (౨-౩-౮.) ఏతేన యోగే ద్వితీయా స్యాత్. పర్జన్యో, జపమను, ప్రావర్షత్" (సి. కౌ. ౫౭౮ సూ.) "జపమనుప్రావర్షత్ - ఇచట 'అను' అను దానిచే లక్షణము (హేతువు) ద్యోత్యమగును.........జపజ్ఞానముచే వర్షము జ్ఞానవిషయమగును." (కౌముదీశరదాగమము. ౨౭ పుట.) "లక్షణమున లక్ష్యలక్షణ భావము. (జ్ఞాప్యజ్ఞాపకభావము.)" (కౌ. శర. ౨౯ పు.) "కర్మక్రియాం ప్రోక్తవన్తః= కర్మప్రవచనీయాః.........క్రియానిరూపితమగు సంబంధవిశేషమును ద్యోతనము చేయునవి యనియర్థము." (కౌము. శర. ౨౭ పు.) (విభక్త్యర్థప్రకరణము.). పైసందర్భమునుబట్టి "పర్జన్యో, జపమను, ప్రావర్షత్." అనఁగా నింద్రుఁడు జప హేతువుచే వర్షించె ననునర్థము విశదమగుచున్నది. ఇట్టియెడల హేత్వర్థకతృతీయ సాధారణముగా రావలసియుండఁగా (పర్జన్యో జపేన ప్రావర్షత్.) ద్వితీయ, కర్మ ప్రవచనీయయోగమునఁ గల్గెనని యెఱుంగునది. ఇట్టి వ్యస్తములగు కర్మప్రవచనీయ ములకుఁ (అను.-మొ) తెల్గునఁ దత్సమప్రయోగము లేదు. ఇట్టి కర్మప్రవచనీయార్థకము లగు తెల్గువిభక్తులకును దెనుఁగుప్రబంధములందు సాధారముగాఁ బ్రయోగము

[బా. కార. ౨. సూ.] వైషయికసప్తమిచోటఁ బర్యాయముగ 'కూర్చి' విభక్తినిల్చును

పఠించె నధిప. (శాం. ౬ ఆ. ౩౬౨.). ఇట్టియెడల గుఱించి ప్రభృతులు గుఱించు ధాతుక్త్వార్థకరూపంబు లనియు నవి పరమగునపుడు ద్వితీయావిభక్తినిల్చుననియు నెఱుంగునది. క. ఇందుముఖి వేఁడు మెద్దియిష్టము నీకున్. (సభా. ౨ ఆ. ౨౪౭.) ఎద్దియిష్టమో దానిని నన్ను వేఁడుమని యర్థము. ఇట్లు యాచ్ఞార్థకములెల్ల ద్వికర్మకము లగును.

---

లేదు. కాని "కర్మప్రవచనీయకే కూర్చిః" (౧౩౪ విష.) "కూర్చి - ల - ను - నయోః భవేద్ద్వితీయా తు." (౧౧౯ విష.) "కర్మప్రవచనీయజవిభక్తిః" (౮౨ విష.) అని భట్టారకుఁడును "అందు - పట్టి - కూర్చి - విభక్తిషు" (౮౮ విష.) అని యథర్వణాచార్యుఁడును వచించియుండుటంజేసి కర్మప్రవచనీయ ద్యోతిత్వార్థములలో నేదాననైన "కూర్చి" యను తెనుఁగువిభక్తి నంగీకరింపక తీరదు. నేఁటి ముద్రణములలోఁ బ్రాచీనకావ్యములందు "కూర్చి" అను విభక్తియె యున్మూలితమైనది. నన్నయాథర్వణులు పేర్కొన్న యీవిభక్తి ప్రాచీనకావ్యములలో లేదనుట విశ్వసనీయము కాదు. కాన లేఖకపారకాదికృతమగు నీసాహస ముపేక్ష్యము. నాచూచిన తాళపత్రమాతృకలలో భారతమందే కొన్నియెడల నయ్యది యుపలబ్ధ మగుచువచ్చెను. నన్నయాథర్వణీయములోని 'కూర్చి'కి సరియగు 'గుఱిచి - గుఱించి' అనునవి 'విభక్త్యర్థాభిధాయకశబ్దములు' నంగీకార్యములె. ఇంక నియ్యది కర్మప్రవచనీయార్థములలో నెట్టియర్థమున వచ్చుచున్నదో పరిశీలింపవలసి యున్నది.

పయి నుదాహరించిన లక్షణేత్థంభూతాఖ్యానేత్యాది సూత్రోపదిష్టార్థములలో నొకటియగు నిత్థంభూతాఖ్యానార్థమునఁ గూర్చివిభక్తి వచ్చుట నన్నయాథర్వణసమ్మతమని తోఁచుచున్నది. "కస్యచిత్ ప్రకార స్యాపత్తిః ఇత్థంభావః...... భక్తో విభుమభి (అభిరభాగే) = విభౌ విషయే భక్తిభావాపన్నః........."(ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. ౨౧౬ సూ.) "భక్తో విష్ణుంప్రతి.........విషయతాసంబన్ధః ప్రత్యాదిద్యోత్యోఽర్థః......విష్ణు విషయకభక్తిమా నిత్యర్థః. అత్ర భక్తః భక్తిరూపం ప్రకారవిశేషం ప్రాప్తత్వా దిత్థంభూతః..." (సి. కౌ. ౫౫౨ సూ. బాలమ. వ్యాఖ్య.) "భక్తో విష్ణుంప్రతి" అనఁగా విష్ణు విషయకమగు భక్తిగలవాఁడని యర్థము. ఇకానొకప్రకారవిశేషము నొందినవాఁ డిత్థంభూతుఁ డనిపించుకొనును. అట్టివానిరీతి యిందుఁ జెప్పఁబడెను గాన నిది యిత్థంభూతాఖ్యాన మనఁగును. విష్ణువు విషయము. భక్తి విషయి. విష్ణునకును భక్తికిని గల విషయవిషయిభావరూపసంబంధము 'అభి' 'ప్రతి' మున్నగు కర్మప్రవచనీయములచే ద్యోతిత మగుచున్నది. ఇచట వైషయికసప్తమి రావలసియుండఁగాఁ

కర్మప్రవచనీయయోగమున ద్వితీయవచ్చినది. తెల్గున నిట్టియర్థమునఁ గూర్చివిభక్తి ప్రయోగదృష్ట మగుచున్నది. ఆ-వె. ఆశమీకపుత్త్రుఁ డంబుజసంభవుఁ । గూర్చి భక్తితోడ ఘోరతపము । సేయుచున్న సుప్రసిద్ధుండు.........(ఆది. ౨ ఆ. ౧౬౯ ప) ('అంబుజసంభవు।గుఱిచి'అని ముద్రణపాఠము.) ఈభట్టారకుని పద్యము నందలి కూర్చివిభక్తి యిత్థంభూతాఖ్యానమున వచ్చినది. అంబుజసంభవునకును భక్తిపూర్వకతపశ్చరణమునకును గలవిషయవిషయిభావ మిందు గ్రహింపవలయును. అంబుజసంభవవిషయకము తపశ్చరణుని యర్థము. ఇట్లే యంతటను "కూర్చి - గుఱిచి - గుఱించి" యనువాని కర్మప్రవచనీయతను సమన్వయించుకొనునది. సంస్కృతభాషాప్రసిద్ధవిభక్తులకుఁ బర్యాయముగాఁ దెలుఁగు విభక్తులవాడుకలను జూపునభినివేశముతో భట్టారకుఁ డిట్లు కర్మప్రవచనీయజ విభక్తని జూపెనే కాని యిట్టిస్థలములందలి కూర్చి ప్రభృతుల కుద్దేశార్థకత్వమున సమర్థనము కుదురకపోదు. పైయాదిపర్వపద్యమున శమీకపుత్త్రుఁ డంబుజసంభవు నుద్దేశించి భక్తితోడఁ దపము చేయుచున్నవాఁడని సమన్వయించుటలో విరోధము లేదుగదా, 'కు' విభక్తితోఁ గుదురుపడుచున్నను సంస్కృతభాషాప్రసిద్ధ తాదర్థ్యార్థకాని స్థలములందుఁ జతుర్థివిభక్తి నంగీకరించి భట్టారకుఁడు "కొఱకు-కై" అనువాని నుపదేశింపలేదా? శేషషష్ఠీ నిర్వాహమునకయి తా నెచ్చటనువాడనట్టి యొక్క విభక్తి నుపదేశింపలేదా? ఆరీతినె కర్మప్రవచనీయవిభక్తి ద్యోతకార్థమునందు 'కూర్చి' విభక్తి పర్యాయముగా నిల్చునని భట్టారకునియాశయము నెన్ననగును. విషయవిషయిభావము వ్యక్తమగుస్థలములందలి కూర్చి విభక్తి కర్మప్రవచనీయార్థకమనియుఁ దద్భిన్నములగు కేవలోద్దేశార్థకస్థలములందలి "కూర్చి" ప్రభృతులు కర్మప్రవచనీయార్థకములు కాక ద్వితీయాంతములగు నని "పరే షూండాద్యాది శబ్దేషు । సప్తమ్యాద్యా విభక్తయః" (౨౮౭ విష.) అనునథర్వణవచనముచొప్పున నను ప్రయుక్తములగుశబ్దము లనఁదగుననియు నెఱుంగనగును. ఈద్వివిధములగు కూర్చి ప్రభృతులు నిల్చుటలోని ప్రక్రియయు భిన్నముగనేయున్నది. కర్మప్రవచనీయార్థక కూర్చి ప్రత్యయము ప్రాతిపదికముపై నిల్చునపుడు "అందు పట్టి కూర్చి విభక్తిషు" (౮౮ విష) అను నథర్వణవచనముచొప్పున నుమాగమము రాఁగా "అంబుజసంభవ+కూర్చి = అంబుజసంభవు+కూర్చి = అంబుజసంభవు+నుమ్+కూర్చి = అంబుజసంభవుంగూర్చి" అనురీతిని రూపసిద్ధికల్గును. అనుప్రయుక్తకూర్చి శబ్దమునిల్చునపుడు ద్వితీయాంతశబ్దమునకయి "తన్నున్+కూర్చి = తన్నుఁగూర్చి" అనురీతిని 'కూర్చి' శబ్దమునిల్చుటచే రూపసిద్ధిగల్గును. ఇట్టి 'తన్నుఁగూర్చి - నన్నుగూర్చి' మున్నగు

చోటులం దెన్నఁడును గర్మప్రవచనీయగూర్చి విభక్తియని భ్రమింపరాదు. మఱియు నీక్రిందిరీతిగల ప్రయోగములందు సయితము వైషయికసప్తమికిఁ బ్రసక్తిలేమిం జేసి కర్మప్రవచనీయార్థము కాదని గ్రహింపవలయును. క. అని వెండియు నాపలికిరపు! జననాథు గుఱించి పలుకు........(శల్య. ౨ ఆ. ౫౦.). ఇట్లె సీ. అబ్జాసనుఁడు తన్ను నర్థితోఁ గుఱిచియ, ఱించుటఁగోరి సృజించె సురల (హరి. పూ. ౧ ఆ. ౯౭.) అనురీతి ప్రయోగములందును గర్మప్రవచనీయ విభక్తియని తలంపఁరాదు.

"ఉద్దేశార్థమునందు ద్వితీయకు గుఱిచియునను ప్రయుక్తంబగు........ సముచ్చయగ్రహణము గూర్చి జ్ఞాపనార్థము" (ప్రౌఢ. కార. ౨ సూ.). ఈతఁడు 'గుఱించి' అనుదానిని జూచికొనలేదు. ఇందు 'గూర్చి' జ్ఞాపనార్థమనుటచే నీతఁడు చింతామణ్యుపదిష్ట గూర్చి విభక్తిని స్పృశించెనని తోఁచుచున్నది. కాని కర్మప్రవచనీయార్థకగూర్చి ప్రభృతులు ద్వితీయా విభక్తిమీఁద నిల్చుననుట కేవలము నసంగతము. విభక్తిప్రత్యయములు ప్రాతిపదికములపై నిల్చుటగదా వైయాకరణ సంప్రదాయము! కావుననేకదా 'రాముంగూర్చి భక్తితోఁ దపముచేసె' మున్నగువాని సిద్ధికయి యథర్వణాచార్యుఁ డట్టియెడల నుమాగమమును విధించినవాఁ డయ్యెను.

ఉద్దేశార్థమున 'గుఱించి' ప్రభృతు లనుప్రయుక్తములు కాకుండుటయుఁ (లోపించుటయు) గలదు. చ........సుతున్ హతుఁడయ్యె ననంగ విన్నయంతన యతఁ డాయుధంబు దిగఁద్రావి యచేష్టతఁబొందు (ద్రోణ. ౫ ఆ. ౩౦౫) (సుతుని గూర్చి విన్నయంతనె యనియర్థము.). "ఆ-వె. వేఁటఁ బోయినారు విభు లిష్టు వత్తురు (ఆర. ౬ ఆ. ౧౬౩.). అవ్విభుండు పాల మేఁగెను." (వి పు. ౭ ఆ. ప్రౌఢ. కార. ౧౩ సూ. వివ.). క.....బల మెక్కడికి నరుగు నందుఁ బోవఁగడఁగి వెడలితిన్. (శాంతి. ౩ ఆ. ౧౮౮.) ఉ........ఎందుఁ బోయిరొక్కొ వారనినన్. (ఆది. ౮ ఆ. ౨౭.) ఇట్టియెడల "వేఁటంగూర్చి పోయినారు - పాలముఁగూరిచి యేఁగెను. అందుఁ గూర్చి పోవఁగడఁగి - ఎందుగుఱించి పోయిరొ" అనురూపములలోని గూర్చి ప్రభృతులు లోపించెనని యెఱుంగునది. తాదర్థ్యచతుర్థికి షష్ఠివచ్చినచో వేఁటకుఁ బోయిరనియు నుండవచ్చును.

విస్తర ॥ ౨౩౫ వివః—కర్మప్రవచనీయముల విషయమున నహోబల పండితుఁ డీక్రిందిరీతిని వ్రాసెను. "ఆద్యవ్యాకరణే కర్మప్రవచనీయయుక్తే ద్వితీయేతి సూత్రేణ యా ద్వితీయా విహితా తత్ర కూర్చీతి స్యాత్. జపముంగూర్చి వర్షము........" (అహో. ౨౬౦ పు.). సంస్కృతమునందలి కర్మప్రవచనీయ ద్వితీయాస్థలములందెల్లఁ గూర్చివిభక్తి వచ్చుననుట సరికాదు. ఇత్థంభూతాఖ్యా

నేతరస్థలద్వితీయకుఁ దెలుఁగునఁ గూర్చివిభక్తి నిల్చిన ప్రయోగ మెచ్చటను లేదు. 'జపమను ప్రావర్షత్' అనుదానికి సరిగ నహోబలపతి 'జపముంగూర్చి వర్షము'అని యుదాహరించుట సరికాదు. హేతుభూతజపోలక్షితము వర్షమను నర్థమున నట్టి ప్రయోగ మెంతమాత్రమును దెలుఁగుకావ్యములందు లేదు. తుదికిఁ దెలుఁగు వాడుకలందును నట్టిప్రయోగము లేదు. అట్లయినను నహోబలపతి యుదాహరించె ననుచు నర్వాచీనులు కొందఱట్లె యుదాహరింపసాగిరి. ఈవిషయమున నాంధ్రభాషాచరిత్రకర్తగారు వ్రాసినవిషయములు మిక్కిలి వింతగనున్నవి. "౧౮-కర్మప్రవచనీయకే కూర్చిః. కర్మప్రవచనీయార్థమున "కూర్చి" (యనునదివచ్చును)" (ఆం. భా. చ. ౧౬౨౭ పు.) అనుసూత్రమున కంతటను "నదీ మన్వవసితా సేనా......వృక్షం ప్రతి (పరి-అను) విద్యోతతే విద్యుత్ = మెఱుపు చెట్టువంక (ప్రక్క-వైపు) మెఱయుచున్నది. భక్తో విష్ణుం ప్రతి (పరి-అను) = విష్ణునియెడ (వంక-యందు) భక్తుఁడు........" అనియిట్లు సంస్కృతవ్యాకరణవాక్యములును, వానియర్థములును నుదాహరింపఁబడెను. చింతామణిసూత్రమునకు వ్యాఖ్యచేయుచున్న విషయమును మఱచి కూర్చివిభక్తితోడి యుదాహృతి నొకచోటనైనఁ జూపలేదు. తుదికి విష్ణుని యెడ భక్తుఁడని చూపఁబడెనేకాని 'విష్ణువునుగూర్చి భక్తుఁడు' అనియేని చూపఁబడలేదు. "అంబుజసంభవుఁగూర్చి" మున్నగుచోట్ల 'కూర్చి'కిఁ బూర్వమునమున్న ద్రుతము "పట్టికూర్చివిభక్తిషు"అను నథర్వణవచనముచొప్పున వచ్చిన నుమాగమసంబంధియని గ్రహింపక యది ద్వితీయా'ను'వర్ణకమనియు నచటికూర్చి యట్టిద్వితీయపై నిల్చిన కర్మప్రవచనీయశబ్దమనియు ననుకొని యట్లు నన్నయ నిరూపింపకుండుట చింత్యమనుచు నీక్రిందిరీతిని విమర్శించిరి. "పై వివరణమునుబట్టి కర్మప్రవచనీయకము లనునవి సాధారణముగఁ గర్మమును దెలుపుపదముల ద్వితీయావిభక్త్యంతరూపములపైఁ జేరుచుండుననియు తాముమాత్రము విభక్తిప్రత్యయములు కావనియుఁ దెలిసికొనవచ్చును. కాని చింతామణి 'కూర్చి'ని ద్వితీయావిభక్తిప్రత్యయముగాఁ దెలుపుచున్నది. అట్లు చెప్పుట వైయాకరణసంప్రదాయవిరుద్ధము. కూర్చియెప్పుడును ద్వితీయావిభక్త్యంతపదములమీఁదనే వచ్చుచుండుటచే దానికిఁ గర్మప్రవచనీయసంజ్ఞ తగియున్నది. కాని యది ద్వితీయావిభక్తిప్రత్యయము కానేరదు. "కూర్చి"అను నొక్కదానినె కర్మప్రవచనీయార్థమునఁ జెప్పి తత్తుల్యములగు 'వంక - ఎడ - అందు - వెంబడి - ప్రక్క - వైపు - పట్టి - చేసి - మొదలగువానిని గూడఁ గర్మప్రవచనీయసంజ్ఞికములుగ నుదాహరింపకుండుట చింత్యము." (ఆం. భా. చ. ౧౬౨౮ పుట.) వీరువ్రాసిన కర్మప్రవచనీయ శబ్దార్థము శాస్త్ర

కర్మంబున ద్వితీయ యగు. ౨.

బాలవ్యా ౨౩౫ I విషయము

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు. దేవదత్తుఁడు వంటకమును వండెను. ఇట వండె ననుమాటకు వంటచేసె ననియర్థము. వంట ఫలము. చేయుట, వ్యాపారము. వంటయనఁగాఁ బాకము. పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మంబయ్యెనని యెఱుంగునది.

సంజీవని ౨౩౫ I విష:—కర్మంబునన్ = కర్మార్థమునందు ద్వితీయ యగును. తిజాది ప్రత్యయములచే ననుక్తమగు కర్మంబున ద్వితీయావిభక్తి యగును. (విస్తర) తిజాది ప్రత్యయములచేఁ గర్మం బుక్తమైనచోఁ ద్వితీయ రానేరదనియుఁ బ్రథమయే వచ్చుననియు నీవఱకు సవిస్తరముగాఁ జెప్పఁబడెను. (౨౩౪ I విష.). ధాతువునకు 'ఫలము - వ్యాపారము'నని యర్థములు రెండు. అందు ఫలాశ్రయము కర్మము. వ్యాపారాశ్రయము కర్త. ధాత్వర్థమగు ఫలమున కాశ్రయము కర్మంబనం బడునని సూరి కర్మస్వరూపమును నిరూపించెను. ఈలక్షణము నుదాహృతియందు సూరియే 'ఇట.........' ఇత్యాదివాక్యముచే సమన్వయించెను. దేవదత్తుఁడు

---

విరుద్ధము. సంస్కృతపద్ధతిని దెలుఁగువ్యవహారము లేదవు డంతయు దానిరీతినె యుండు టెట్లుపొసఁగును. వంక ప్రభృతులు కర్మప్రవచనీయార్థకములని యెవ్వరును వచింపలేదు. 'కూర్చి' అమ్ ప్రత్యయమువంటి ద్వితీయా ప్రత్యయ మగుట సంప్రదాయవిరుద్ధ మెట్లగును? దానికి ముందటి ద్రుతకార్యములు ద్వితీయా ప్రత్యయ'ను'వర్ణక సంబంధులనుకొనుట భ్రాంతిమూలకము. 'వెంబడి - వైపు - వంక - ప్రక్క' మున్నగునవి యుదాహృతవాక్యములలో షష్ఠ్యంతములపై నిల్చియున్నవి. వానికి 'కూర్చి'తో సామ్య మెట్లు? ఉదాహృతసంస్కృత వాక్యములలోని "నదీ మన్వవసితా.........భక్తో విష్ణుం ప్రతి" మున్నగువాక్యములలోని—నదీవిష్ణుప్రభృతులు ద్వితీయాంతములు కర్మవాచకము లనుకొనుట కేవలభ్రాంతిమూలకము. శాస్త్రవిరుద్ధము. అచటిద్వితీయకర్మార్థమున వచ్చినది కాదు. కర్మప్రవచనీయయోగమున వచ్చినదయియున్నది.

విస్తర. ౨౩౫ I విష:—"క్రియచేఁ జెప్పఁబడని కర్త కర్మలకు, (వింత ప్రయోగము) తృతీయవచ్చును. ఉదా:—రాముని చేత బాణము చేత వాలికూల్పఁబడెను." (ఆం. భా. అ. కార. ౨౮ సూ.) అనభిహితకర్మమునకుఁ దృతీయవచ్చు ననుట కేవలము ప్రామాదికము.

వంటకమునఁగా నన్నమును వండెననుచో వంటచేయుట యనువ్యాపారమున కాశ్రయుఁడు దేవదత్తుఁడు కర్త. వంటయనఁగాఁ బాకము (మెత్తన) ఫలము. దాని కాశ్రయము వంటక మనఁగా నన్నము కాన వంటకము కర్మంబయ్యె. అట్టి కర్మంబున ద్వితీయవచ్చి 'వంటకమును' అని సిద్ధించెను. 'వండెను' అనుక్రియలోని తిఙ్విభక్తి కర్త్రర్థకముగుటచేఁ గర్తను జెప్పుచున్నదిగానఁ గర్తృవాచిదేవదత్తశబ్దముపైఁ గర్త్రర్థకమె యగు తృతీయ రాక ప్రాతిపదికార్థక ప్రథమావిభక్తి నిల్చెను. కాఁగా 'దేవదత్తుఁడు వంటకమును వండెను' అనునది సిద్ధించెను.

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా (ఆం. చిం. హల ౧౫ కా. అహో. ౪౨౩ పు.)

గతి - బుద్ధి - ప్రత్యవసానార్థ - శబ్దకర్మ - కాకర్మ కాణా మణికర్తా సణౌ. (౧-౪-౫౨) గత్యాద్యర్థానాం

నన్నయా ౨౩౬ విషయము

శబ్దకర్మణా మకర్మకాణాం చాణౌ యఃకర్తా స ణౌ కర్మస్యాత్. శత్రూ నగమయత్ స్వర్గం। వేదార్థం స్వా నవేదయత్ । ఆశయ చ్చామృతం దేవాన్ । వేద మధ్యాపయ ద్విధిమ్। ఆసయ త్సలిలే పృథ్వీం। య స్స మే శ్రీహరి గ్గతిః. (సి. కౌ. కార. ౫౪౦ సూ.).

కల్పతరు. ౨౩౬- విష:—సర్వవిభక్తి రిత్యాదిసూత్రము ననుసరించి గతిబుద్ధీత్యాది పాణినిసూత్ర మిటవివరింపఁబడుచున్నది. 'ణిచ్' అనునది సంస్కృతమునఁ బ్రేరణార్థకప్రత్యయము. గత్యర్థకాదిక్రియల కప్రేరణమునఁ గర్త యగునది ప్రేరణమునఁ గర్మంబగును. గత్యర్థకములనఁగా గమనార్థకములు. బుద్ధ్యర్థకములన జ్ఞానార్థకములు, ప్రత్యవసానార్థకములన భోజనార్థకములు. శబ్దకర్మకములనఁగా మాట = పలుకు మున్నగునవి కర్మముగాఁగల ధాతువులు. అకర్మకములనఁ గర్మాకాంక్షలేనివి. ఉండు - కలుగు - అగు - మేల్కాను - వర్ధిలు - లజ్జించు - క్షీణించు - భీతిల్లు - జీవించు - చచ్చు - శయనించు - మున్నగునవి. కొన్ని యర్థములుగల ధాతువు లకర్మకములగునని వైయాకరణులు వివరించిరి. శ్లో. సత్తా - లజ్జా - స్థితి - జాగరణం। వృద్ధి - క్షయ - భయ-జీవిత మరణమ్। శయన - క్రీడా- రుచి - దీప్త్యర్థా। నైతే కర్మణి ధాతవ ఉక్తాః" (ముగ్ధ. గిరిశచంద్రకృతవ్యాఖ్య. ౧౬౦ పుట.) ఇట్లే యింకను ననేకధాతువులు చెప్పఁబడినవి. విస్తరభీతి నుదాహరింపలేదు. (ముగ్ధ. దుర్గాదాసవ్యాఖ్య. ౯౩౨ సూ.).

శత్రూనిత్యాది:— ఏహరి శత్రులను స్వర్గమును బొందించెనో (గత్యర్థోదాహృతి), తనవారిని వేదార్థము నెఱుంగునట్లుచేసెనో (బుద్ధ్యర్థ), దేవతల నమృతమును దినిపించెనో (అశనార్థ), బ్రహ్మను వేదమును జదివించెనో (శబ్దకర్మక), సముద్రజలమున భూమి నుండునట్లు చేసెనో (అకర్మక), యట్టిశ్రీహరియె నాకుగతి యని యుదాహృతశ్లోకార్థము. 'శత్రువులు స్వర్గమును బొందిరి' అనునది యప్రేరణ వాక్యము. 'శ్రీహరి శత్రువులను స్వర్గమును బొందించెను' అనునది ప్రేరణ వాక్యము. శత్రులు స్వర్గమును బొందునట్లు శ్రీహరి చేసెను గాన శ్రీహరి ప్రేరణ కర్త. అప్రేరణమునఁ గర్తయగు 'శత్రువు' ప్రేరణమునఁ గర్మంబయ్యెను. కావునఁ గర్తృవాచకమగు 'శత్రువులు' అనునది 'శత్రువులను' అనెడి ద్వితీయాంతరూపము నందెను. ఇట్టిపద్ధతిచే నప్రేరణమున నకర్మకమగు క్రియ ప్రేరణమున సకర్మకమగును. ఉ. సముద్రజలమందు భూమి నుంచెను. అప్రేరణమున సకర్మకమగు క్రియ ప్రేరణమున ద్వికర్మకమగును. ఉ. హరి శత్రులను స్వర్గమును బొందించెను. అప్రేరణమున ద్వికర్మకమగునది ప్రేరణమునందును ద్వికర్మకముగనే యుండును. అప్రే:— దేవదత్తుఁడు రాజును ధనమును యాచించెను. ప్రేర:— యజ్ఞదత్తుఁడు దేవదత్తునిచే రాజును ధనమును యాచింపించెను. ఇందు దేవదత్తుఁ డనభిహితకర్త యగుటచే - బా - కార - 3 సూత్రముచొప్పున ననభిహిత కర్తృవాచకము తృతీయాంత మయ్యెను. అభిహితకర్తృవాచకమగు యజ్ఞదత్త శబ్దము ప్రథమాంత మయ్యెను. అప్రేరణకర్తయగు దేవదత్తుఁడు యజ్ఞదత్తునిచేఁ బ్రయోజ్యుఁడు గానఁ బ్రయోజ్యకర్తయు ననఁబడును. యజ్ఞదత్తుఁడు ప్రయోజక కర్త. ప్రయోజ్యకర్త = అనభిహితకర్త = అప్రేరణకర్త. ప్రయోజకకర్త = అభిహితకర్త = ప్రేరణకర్త.

ప్రయోగములు:— తే-గీ. విదురుఁడు.........నిన్ గఱపె బుద్ధి. (ఆది. ౬ ఆ. ౧౪౫). సీ. ద్రోణగాంగేయులు దురితవిదూరులు నిన్నెద్ది గఱపిరి నెమ్మితోడ (ఆది. ౮ ఆ. ౪3.) క. తడయక యబ్బాని శుక్రుఁ ద్రావించి రొగన్. (ఆది. 3 ఆ. ౧౧౪) క. విను మాచార్యులు నూర్వురు।.........అ।జ్జనపతి వినిపింతురు త।త్త్వ నిరూపకశాస్త్రములు.........(శాంతి. ౪ ఆ. 3౪౦.) చ.........నీవు మున్। కనినది విన్నయట్టివి ప్రకామకుతూహలచిత్తుఁడైన కృ।ష్ణుని వినిపింపు నావుడు (అను. ౪ ఆ. ౪౧3.) (ప్రాసప్రయోగము). (పయివానిలోని - శాస్త్రములు, వినినది మున్నగునవి ద్వితీయార్థకప్రథమలు.) క. విమలాత్ముఁడు పారాశ।ర్యమునీంద్రుఁడు శిష్యులను మహాభారతసం।చయములగు వేదముల మే।రుమహీధరవాసినై కరుణఁ జదివించెన్. (శాంతి. ౬ ఆ. 3౯౯.).

అంతర్గతప్రేరణార్థకములు:—ఆ-వె...విధులఁ గడచి యెందు|'ఆఁగఁబడినవాని లోఁగక చేయుట|యధమగతికి మార్గము........(ఆది. 3 ఆ. ౨౨౦.) (ఆఁగు. ప్రే. ఆఁగు = ఆఁపు. ఆఁగఁబడిన = నిషిద్ధ.). క. కఱచునెడ నేయునెడ వడిఁ| బఱచునెడం బెనఁగునెడ నపారబలంబుల్| మెఱయునెడ.........(ఆది. ౫ ఆ. ౧౬౪) "మెఱయు—దే - అ - క్రి - ప్రకాశించు......అం - ప్రే - బయలుపఱుచు." (శ-ర). ఆ-వె.........| కలయ బెరసినపుడు కలితనంబు| మెఱఁగుదురు మహాత్ములు ......... (విరా. ౪ ఆ. ౨౨౩.) (కలితనము = సామర్థ్యము.). సీ. అరుణాంబుదంబులు పరఁగి పెన్నెత్తురుఁ, గండలుఁ గురిసె మార్తాండబింబ| ము......(అశ్వ. ౪ ఆ. ౩౯ ప.) "కురియు దే - అ - క్రి - ౧ వర్షించు. అం-ప్రే-కురియించు." (శ-ర). సీ.... ...వను శంతనుసుతుండు| గురుఁడును విదురుఁడు కూర్కొని కూర్కొని, చెవులలోఁ బోయమె సవిశేషకార్య (తే-గీ.) వచనములు......... (స్త్రీ. ౧ ఆ. ౧౪౨.) "కూరుకొను - దే - అ-క్రి - చొచ్చు, అం-ప్రే, చొప్పించు, క్రుక్కు. (రూ - కూర్కొను.)" (శ-ర).

గతి - బుద్ధి - ప్రత్యవసానార్థ - శబ్ద - కర్మ - కాకర్మకం
బుల కప్రేరణంబునం గర్తయగునది ప్రేరణంబునం
గర్మంబగు. ౧౨౩. (క్రియాపరిచ్ఛేదము)

బాలవ్యా వివరణము. ౨౩౬ I విషయము.

పొందు మొదలగునవి గత్యర్థకంబులు. తెలియు మొదలగునవి బుద్ధ్యర్థకంబులు. తిను మొదలగునవి ప్రత్యవసానార్థకంబులు. విను - చెప్పు - చదువు - మొదలగునవి శబ్దకర్మకంబులు. అకర్మకంబులు ప్రసిద్ధంబులు. మైత్రుండు గ్రామంబుం బొందెను. చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను. లాఁతిచోసహిత మిక్కార్యంబు గానంబడియెడి. మైత్రుండు పుడమి నేలెను. చైత్రుఁడు మైత్రునిం బుడమి నేలించెను.

సంజీవని. ౨౩౬ I విష:—గత్యర్థకములు = గమనార్థకములు, బుద్ధ్యర్థకములు = జ్ఞానార్థకములు, ప్రత్యవసానార్థకములు = భోజనార్థకములు, శబ్దకర్మకములు = పాఠము మాట మున్నగునవి కర్మముగాఁ గలవి. అకర్మకములు = కర్మాకాంక్ష లేని ధాతువులు. ఉండు - కలుగు - అగు - చచ్చు - లజ్జించు - భీతిల్లు - మేల్కొను - మొదలగునవి. 'మైత్రుండు గ్రామంబుం బొందెను' అనునది గత్యర్థకమగు నప్రేరణవాక్యము. ఇందలి కర్తయగు మైత్రుఁడు ప్రేరణమున గర్మంబయ్యెను.

కాఁగా నట్టికర్మవాచకము 'మైత్రుని' అనుద్వితీయాంతరూపము నంది ప్రేరణవాక్యమున నిల్చెను. అట్టియెడలఁ మైత్రుని గ్రామమును బొందించిన చైత్రుఁడు ప్రేరణకర్త యయ్యెను. అట్టికర్త 'పొందించెను'అను క్రియలోని కర్త్రర్థక లిట్టుచే నభిహితమయ్యెను గానఁ గర్త్రర్థకతృతీయ రాక ప్రాతిపదికార్థప్రథమయె వచ్చినది. కాఁగా 'చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను'అను ప్రేరణవాక్యము సిద్ధించినది. పొందుధాతువు సకర్మకము గానఁ బ్రేరణంబున ద్వికర్మక మయ్యెను.

లాఁతిచోసహిత మనఁగా గత్యర్థకాదులలోఁ జేరనిధాతువుల ప్రయోగములందును నిష్కార్యం బనఁగా 'అప్రేరణంబునఁ గర్తయగునది ప్రేరణంబునం గర్మం బగుట' అనునట్టి కార్యము సంభవించుట కవిప్రయోగంబులం గలదని యర్థము. ఏలుధాతువు గత్యర్థకాదులలో నిది కాకున్నను నట్టికార్యము గల్గెనని యుదాహరించుచున్నాఁడు. మైత్రుండు పుడమి నేలె ననెడి యప్రేరణస్థలములోని కర్తయగు మైత్రుఁడు ప్రేరణమునఁ గర్మంబయ్యెను. అచటఁ బ్రేరణకర్తృవాచక చైత్రుశబ్దము ప్రథమాంతముగనుఁ బ్రేరణంబునఁ గర్మంబయిన మైత్రునకు వాచకమైనశబ్దము ద్వితీయాంతముగను నిల్వఁగా 'చైత్రుఁడుమైత్రునిం బుడమి నేలించెను.' అను ప్రేరణవాక్యము సిద్ధించెను. (విస్తర I. II). గురువు శిష్యునిచే నక్షరములను బలికించెను. మున్నగునవియు లాఁతిస్థలములలోనివె యనఁదగును.

- - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - - -

విస్తర I ౨3౬ I విష:—సంస్కృతమునందును నిట్లె లాఁతిచో సహితమిష్కార్యము గలదని శ్రీరామగంగాధర తర్కవాగీశభట్టాచార్యుఁడు ముగ్ధబోధ వ్యాకరణ వ్యాఖ్యలో వ్రాసియున్నాడు."ఏవం జ్ఞానార్థత్వేఽపి శ్రో స్త్రిహాణాం క్వచిదన్యత్రాపీతి జ్ఞాపనార్థమ. తేన—'పురుహూతద్విషో ధుర్షు। యుక్తాన్ యానస్య వాజినః। ఆయూంషి త్వతు నిర్భిద్య। ప్రాభక్షని రమోచయ దితిభట్టిః. శూరసేనం పౌరుషం త్యాజయతి. ముక్తాజాలం చిరపరచితం త్యాజితో దైవగత్యా. దేవదత్తం శతం దాపయతీత్యాది స్యాత్." (ముగ్ధ. వ్యాఖ్య. ౨౮౮ సూ. ౧౮౧ పుట.) ఇట్లగుటచేతనే భట్టారకాదులును లాఁతిస్థలములందు నైత మిష్కార్యమును బ్రయోగించిరి. క.........అవనీభర మా। తనిఁ బూన్చి (సభా. ౧ ఆ. ౪౯ ప.) (ప్రాసగతము.). మ.........భువనేశత్వభరంబుఁ బూన్పఁదగునే పూరున్ జఘన్యాత్మజున్. (ఆది. 3 ఆ. ౧౯౬.). చ. మద మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁజే। యుదు నని పూని.........నీసుతులు మంత్రులు సాబలు జూదమూర్చ సం। పదఁగొని.........(ఉద్యో. 3 ఆ. ౨౮౦.) మ.........షడ్వక్త్రుండు......... దేవతల నేలించుం ద్రిలోకంబులన్. (నన్ని. ఖు. ౧౦ ఆ. ౪౦౬ ప.)

మ. మునులవ్వీరు భజింపరే క్రతువు లామోదంబుతో నమ్మహా। త్ముని జేయింపరె (శాంతి. ౧ ఆ. ౨౮౭.) (ప్రాసప్రయోగము.) క. మాతలి పాణిగ్రహణం। బా తని జేయించి.........(ఉద్యో. 3 ఆ. ౨=3.)

విస్తర. II ౨౩౬ I విష:—పాణినీయులును గత్యర్థకాదులలోఁ జేరిన కొన్నిటి ప్రయోగమున 'నీ వహ్యోర్న'మ్మున్నగు వార్తికాదులచొప్పునఁ బైకార్యములు రావనియు, గత్యర్థకాదులలోఁ జేరని కొన్ని ధాతువుల ప్రయోగమున "దృశేశ్చ. దర్శయతి హరిం భక్తాన్ (గురుః)", "హృక్రో రన్యతరస్యామ్(౧ ౪-౫౩) హారయతి-కారయతివా భృత్యం భృత్యేన కటమ్" (సి-కౌ). మున్నగురీతిని బైకార్యములు వచ్చుననియు వచించియున్నారు. (అనుబంధము I) "ప్రభుః భృత్యేన భారం వాహయతి" (ప్రభువు భృత్యునిచే భారమును వహింపించుచున్నాఁడు) అనునది మొదలగుచోట్ల వహధాతువునకు గత్యర్థకత్వమే లేదు. అట్లయినను నద్దాని కెట్టెటో గత్యర్థకత్వమును గల్పించి యానిషేధమును వైయాకరణులు సమర్థించిరి— "యద్యపి నీవహ్యోః ప్రాపణ మర్థః తథాపిగత్యనుకూలవ్యాపారార్థకే ప్రాపణే గతే ర్విశేషణత్వేన ప్రవిష్టతయా గత్యర్థత్వాత్ ప్రాప్తి రిత్యర్థః. (బాలమ.

అనుబంధము I విస్తర II ౨౩౬ I విష:—"దృశ్చేశ్చ" మున్నగునవి తత్తద్ధాతుమాత్రపరములెకాని తత్తదర్థకధాతుపరములు కావు. అట్లు కానిచో గత్యర్థకములు మున్నగురీతిని జెప్పినట్లు దృశ్యర్థకములు మున్నగురీతిని జెప్పియుండరా? ఇంతయేల! "గతిబుద్ధ్యాదిసూత్రే (సి. కౌ. ౫౪౦) జ్ఞానసామాన్యార్థానా మేవ గ్రహణమ్-నతు తద్విశేషార్థానా మిత్యనేన జ్ఞాప్యతే. తేన స్మరతి జిఘ్రతిత్యాదీనాం న." (సి. కౌ. కార. ౫౪౦సూ. భట్టోజీవృత్తి) "ఆదినాప్రేక్షత్యాదీనాం సంగ్రహః" (బాలమ.వాఖ్య.) అని కంఠోక్తముగనే చెప్పఁబడెను.ఇట్లగుటంజేసి దృశ్యర్థకములకు వచ్చునని వ్రాసిన యీక్రింది-బా-గు-ప్ర-వ్యాఖ్యాదులు నిర్మూలములు. "దృశేశ్చ-అనువార్తికముచేత సంస్కృతవ్యాకరణానుసారంబుగా నాంధ్రభాషయందుం జూడ గత్యాద్యర్థకధాతువులకుఁ బ్రేరణంబున, నప్రేరణంబందలి కర్త కర్మంబగుట ప్రసక్తంబగుచుండ—" (బా.గు.ప్ర.క్రియా.౧౨౪ సూ.వ్యాఖ్య.) "సంస్కృతవ్యాకృతి ననుసరించి (దృశేశ్చ) దృశ్యర్థధాతుయోగమునను నప్రేరణకర్తకుఁ బ్రేరణమునఁ గర్మత్వము గలుగవలసియున్నది"(బా-సా=పే క్రియా-౧౨౪ సూ-వ్యాఖ్య). ఇట్లగుట చేతనే "కన్యాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగ నగు" (బా.క్రి. ౧౨౪ సూ.) అని సూరిసూత్రింపఁగలైను.

౧౧౦౯ వార్తికవ్యాఖ్య) గమనములేక వహనముగాని ప్రాపణముగాని సంభవింపదుగాన నయ్యవి గమనార్థకములుగాఁ గల్పింపఁబడుచున్నవని తాత్పర్యము. ఈకల్పనమును గొందఱు నిరసించుచున్నారు "ఇట్టికల్పనమునం దరుచిచేతనే మతాంతరము వెలసియున్నది. "నీవహ-ధాతువులు ప్రాపణార్థకములుగాని గత్యర్థకములు కావు. అని కొందఱమతము. వీరిమతమున 'నీ వహ్యోర్న' అను నిషేధ మనావశ్యకమని గ్రహించునది" (కౌముదీశరదాగమము.విభక్త్య. ౧౮౯) ఇట్టి యభిప్రాయభేదములచేతనే (అనుబంధ II) సూరి లాఁతిచో సహిత మిత్యాది వివరణము చేయుటయు భట్టారకాదులు గత్యర్థకాదీతరస్థలములందును నేతత్సూత్రకార్యములను బ్రయోగించుటయు సంభవించెనని యెఱుంగునది. ఇట్లు గతిబుద్ధీత్యాది సూత్రమునకు విషయములుకాని "పూను ఏలు" మున్నగు ధాతువుల ప్రయోగమున సయితము ప్రేరణకర్తకుఁ గర్మత్వము ప్రయోగింపఁబడుటయేకాక యయ్యది యనభిహితకర్తయగుటచేఁ దృతీయాంతముగాఁ బ్రయోగింపఁబడుటయుఁ బ్రయోగదృష్ట మగుచున్నది. "ద్రుపద-క్రతు వమ్మహాత్ముచేఁ గావించెనేని" (రంగ. రా. యూ. ము. ౧౪౯.) "మైత్రుండు పుడమి నేలె ననుదానికిఁ జైత్రుఁడు మైత్రునిచేఁ బుడమి

అనుబంధము II విస్తర II ౨౩౬ I విష. గుప్తార్థప్రకాశికాకర్తలాఁతిచో సహిత మిత్యాది సూరివివరణమునకుఁ వ్యాఖ్యచేయక యుపేక్షించి గత్యర్థకాదులలోఁ జేరని యట్టి లాఁతివానియందు గత్యర్థకత్వాదులను గల్పింప యత్నించెను. "మ...భార్గవదౌహిత్రుఁడు పాత్రుఁ డీయదుఁడు లోకఖ్యాతుఁ డుండంగ నీభువనేశత్వభరంబు పూన్పఁదగునే పూరున్ జఘన్యాత్మజున్ (ఆది. 3 ఆ. ౧౯౬)...ఇచ్చటను 'బూను'నకుఁ బొందుట యర్థము చెప్పవలయును.......వహించుట యర్థము చెప్పుకొన్నచో 'నీ వహ్యోర్న' అనువార్తికముచే...కర్తృత్వనిషేధ మున్నందున...తృతీయావిభక్తి వచ్చి 'పూనుచే' అని ప్రయోగింపవలసివచ్చును....ఈప్రయోగంబు ప్రామాదికంబని చెప్పవలసివచ్చునుగాన నిచట సందర్భవశమునఁ బూన్పుటకుఁ బొందించుట యర్థంబని యూహించునది" (బా. గు. ప్ర. క్రియా. ౧౨౩సూ. వ్యాఖ్య.). ప్రామాదిక మనవలసివచ్చు నని లేని గత్యర్థమును గల్పింపవలయునఁట! అపుడు ప్రామాదికత్వము తప్పి పోవునఁట! ఇట్టి లేనిపోని కల్పనములను జేయుటకంటె సంస్కృతమునందే యీవిషయమున నభిప్రాయభేదము లుండుటచేతను సంస్కృతమునందును గత్యాద్యర్థకేతరస్థలములందును నేతత్సూత్రకార్యములు కవిప్రయుక్తములయి యుండుటచేతను (విస్తర. I ౨౩౬ I విష.) భట్టారకాదులు లాఁతిచో సహితము ప్రయోగించి రనుట యుక్తముకాదా ?

నన్నయా తత్ర తృతీయా షష్ఠీచ । విభక్తీ సమ్మతే ఉభే (వికృ.
౨౩౭ విష. క్రియా. ౨౩ కారి. అహో. ౫౦౩ పుట.)

కల్పతరు-౨౩౭ విష:—ఈకారిక "నతు ణౌ భవేచ్ఛ లోపోన్యార్థే యో వర్తతే పరే తస్మిన్" అను చింతామణిసూత్రమును సవరించుసందర్భములోనిది గాన నిందలి 'తత్ర' అనుదాని కాణిజర్థమందని యర్థము చెప్పవలయును. తత్ర = అప్రేరణార్థమునందు, అప్రేరణకర్తకుఁ బ్రేరణమున ద్వితీయ రానప్పుడు దానికి, తృతీయా - షష్ఠీ-చ ఉభే-విభక్తీ = తృతీయ-(ఒకప్పుడు) షష్ఠి (ఒకప్పుడు) అనెడి రెండువిభక్తులును, సమ్మతే = సమ్మతములగును. అప్రేరణకర్తృవాచకము ప్రేరణమున ద్వితీయాంతము కానపుడు కొన్నియెడలఁ దృతీయాంతమును గొన్ని యెడల షష్ఠ్యంతమును నగుట సమ్మతమని తాత్పర్యము - 'సర్వవిభక్తి స్సంస్కృత తుల్యా' అను చింతామణి చొప్పున నప్రేరణకర్తృవాచకము ప్రేరణమున ద్వితీయాంత మగుటయుఁ గానపుడు తృతీయాంతమగుటయు సంస్కృత వ్యాకరణములనుండియె తెలియఁగలదు. అట్లు ద్వితీయరానపుడు తృతీయ మాత్రమె వచ్చుటకాక కొన్నియెడల షష్ఠి వచ్చుటయుఁ గలదని చకారస్వారస్యమున నెన్నఁనగును-(వి సర.) ఉదా.—అప్రే:—దేవదత్తుఁడు

---

నేలించెననియు వాక్యములు గలుగనేరవని తేలుచున్నది" (బా. సా. పే. క్రియా. ౧౨౩ సూ. వ్యా.) అను పేటికా వాక్యము నిరాధారము. "లాఁతిచోసహిత మిక్కార్యంబు గానంబడియెడి" అని మాత్రమే సూరి వివరించెనుగాని యక్కార్యంబు నిత్యంబని వచింప లేదు. ప్రయోగములును దాని నిత్యతను నిర్వహింపఁజాలవు. కావున నట్టికార్యమున కనిత్యతను బాటించునపు డట్టి యనభిహిత కర్తకుఁ దృతీయ వచ్చుటయే సహజముగదా! (బా. కార. ౩సూ.). కావుననే కదా సూరి. "చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను" అని యుదాహరించెను (బా. క్రియా. ౧౨౨. సూ. వివ.). మ...సమదదేవారాతిరించోళిచేఁ । దినిపించెన్ దృణరాజి...(దశా. ౨ ఆ. ౮౦౦. సూ. రా. ని.) అను నిట్టి యశనార్థకధాతు ప్రయోగము నందును నప్రేరణకర్తకుఁ బ్రేరణమునఁ గర్మత్వము లేకుండుటనరయ నర్వాచీనులెల్లెడ నిక్కార్యము బహుళమని తలంచి రననగును.

విస్తర ౨౩౭ విష:— ఈ తత్రేత్యాదికారిక కర్మార్థకవాక్యపరముగా నహోబలపతిచేతను దదనుయాయి కవిజనమండనకారాదులచేతను నన్వయింపఁ బడెను. "తత్ర తృతీయా షష్ఠీచ.. ...ఇత్యథర్వణవచనాత్ విభక్తిద్వయమ్.

వంటకమును వండెను. ప్రే:—యజ్ఞదత్తుఁడు దేవదత్తునిచే వంటకమును వండించెను. అ-ప్రే-భరతుఁడు రాజ్యము నేలెను. ప్రేర:—రాముఁడు భరతుని రాజ్యము నేలించెను. = రాముఁడు భరతునిచే రాజ్యము నేలించెను. షష్ఠివచ్చుటకు:—అప్రే. అర్జునుఁడు తత్త్వముం దెలిసెను (తెలిసికొనెను). కృష్ణుఁ డర్జునునిఁ దత్త్వముం దెలిపెను - కృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వముం దెలిపెను. అ-ప్రే:—రాముఁడు రామాయణమును వినెను. ప్రేర:—కుశలవులు రాముని రామాయణమును వినిపించిరి. కుశలవులు రామునకు రామాయణమును వినిపించిరి. (ప్రేర) అర్జునుఁడు తనయన్నలఁ దమ్ముల నుత్తరుని గానిపించెను. (ఉత్తరుఁ డర్జునునియొక్క యన్నలఁ దమ్ములఁ గనెనని యప్రేరణవాక్యము). అర్జునుఁ డుత్తరునకుఁ దనయన్నలఁ దమ్ములఁ గానిపించెను. (కనుధాతు ప్రేరణరూపము కానిపించు. ప్రయోగములు:—ము. ఈవచ్చు సు|న్నదవీరావళికిం భుజావిభవవిన్యాసంబు గాన్పించి (విరా. ౪. ఆ. ౨౬౩). ఉ. అత్తఱి లేచివచ్చి తన యన్నలఁ దమ్ములఁ గానిపించె న| య్యుత్తరు నర్జునుండు...(విరా. ౫ఆ. ౩౪౨) క. వానిం దోడ్కొనిచని యా|భూనాథునిఁ గానిపించి...(ఆగ. ౭ఆ. ౭ప.) క. చనుదెంచి పేడితనమును । వనితారూపమ్ము నమర వాసవసుతుఁడా|మనుజాధీశునకు సభా । జనులకుఁ దనుఁ జూపి మందసంచారమునన్ (విరా. ౧ఆ. ౨౭౯).

ఈసూత్రమునందలి తత్ర శబ్దము చింతామణిలోని నతు నణా విత్యాది నాకర్షించుచున్నది. కావున వికృతివివేకము చింతామణి శేషగ్రంథమనుట స్పష్టమగుచున్నది.

అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా
నగు. ౧౨౪ (క్రియాపరిచ్ఛేదము). రాముఁడు మిథిలం

---

మాచే ఘటింపఁబడియెన్ = మాకు ఘటింపఁబడియెన్." (అహో. ౫౦౩ పు) (బాకృ. క్రియా. ౨౩. సూ. వ్యాఖ్య; నారా. గణ. ౭౯౪. కారి. ౧౪. ప. కారక). మాచే ఘటింపఁబడియె ననుదానికి మాకు ఘటింప బడియె ననునది పర్యాయమనుట యెంతమాత్రము సరికాదు. 'మాచే ఘటింపఁబడియె' అను నర్థమునందు మాకు ఘటింపఁబడియె నని యెచ్చటను బ్రయోగింపఁబడి యుండలేదు. అచటి 'మాకు' అనుదానికి 'మానిమిత్తము' అనునర్థము వచ్చునేకాని 'మాచే' అనునర్థము రానేరదు. ఆవాక్యమున ఘటింపఁబడియె ననుదానికి వేఱొకకర్త యధ్యాహార్యము కావలసియున్నది. "మాకు నీచే ఘటింపఁబడియె" అనురీతి నావాక్య ముండవలసియున్నది.

బాలవ్యాకరణ వివరణము.
౨౩౭ I విషయము

గనియె. రామునకు మిథిల గనంబడియె. రామునిచే
మిథిల గనంబడియెను. మైత్రుఁడు తత్వంబుం దెలిసెను.
చైత్రుండు మైత్రునకుం దత్వంబుఁ దెలిపెను. కన్వాది
యోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగా
నగు. విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను.
కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

సంజీవని. ౨౩౭ I విష:— తిఙాదిప్రత్యయములచేఁ గర్త్రర్థ మభిహితము కానపు డట్టికర్తృవాచకమున కొకానొకప్పుడు షష్ఠివచ్చునని సూత్రార్థము. బా. కార 3 సూత్రముచొప్పున నట్టికర్తృవాచకముపైఁ దృతీయ వచ్చుట సహజమె. 'రాముఁడు మిథిలను గనియె' అనునది కర్త్రర్థకవాక్యము. 'రామునిచే మిథిల గనంబడియెను' అనునది దానికర్మార్థకవాక్యము. 'కనంబడియెను' అనుక్రియలోని తిఙ్ఞు కర్మార్థకముగాన నీకర్మార్థకవాక్యమునఁ గర్మం బభిహితమయ్యెను గాని కర్త యభిహితము కాలేదు. కావున నట్టి యనభిహితకర్తృవాచకము బా. కార. 3. సూత్రము చొప్పునఁ దృతీయాంతమగుట సహజమె. అట్టికర్తృవాచకము షష్ఠ్యంతమును నగునని ప్రకృతసూత్ర ముపదేశించుచున్నది. కాని యిట్టియర్థమున షష్ఠివచ్చుట కవిప్రయోగములం దెచ్చటను లేదు. (విస్తర-I) ఇట్టిసూరిగారి యపమార్గమున కహోబలపండితీయములోని వెనుకవివరింపఁబడిన (విస్తర. ౨౩౭ విష.) ప్రామాదిక సమన్వయమును "మాచే ఘటింపఁబడియె=మాకు ఘటింపఁబడియె" (అహో. ౫౦౩ పు) అనుప్రామాదికోదాహృతియు మూలములై యున్నవి. 'రామునకు మిథిల గనంబడియె' అనుదానిలోని 'రామునకున్' అనునది "రాముచేతన్" అనుదానికిసరి యగు నర్థముగలది కాకున్నను ఘుణాక్షరన్యాయమున సూరిచే నుదాహరింపఁబడిన వాక్యములు రెండును దుల్యమయిన యర్థము గలవానివలెఁ గన్పట్టును. తుల్యార్థము లనునపుడు సూరి యుదాహృతిలోని 'కనంబడియె' అనునది యకర్మకమును 'ప్రత్యక్షమగు-గోచరించు' అనునర్థము గలదియు నగు వేఙొకధాతువునుండి

విస్తర I ౨౩౭ I విష:—గుప్తార్థప్రకాశికా వేటికావ్యాఖ్యలును నీ ప్రామాదికమార్గముననె యున్నవి. "రామునకు మిథిల గనంబడియె......కర్తయైన రాముఁడు ఆఖ్యాతముచే నభిహితుండు కానందున - కార - 3 సూత్రముచే 'చేత' వర్ణకము ప్రాప్తించుచుండఁగా నీ సూత్రముచే 'చేత' వర్ణకంబునకు మాత్రము బాధకంబై షష్ఠివచ్చి పైవిధంబుగా వాక్యంబయ్యె" (బా. గు. ప్ర. ౪౨౪ పుట. ద్వి. ము.) వేటికయు నిట్లెయున్నది (బా. సా. వే. ౪౯౨ పుట.)

యేర్పడిన రూపమే కాని సకర్మకమగు 'కను' ధాతువుయొక్క కర్మార్థకరూపము
కాదు. "కనఁబడు = కానఁబడు. అ. క్రి (కనన్ + పడు) అగపడు - కనుపట్టు -
గోచరించు" (సూ.రా.ని.) ("కనఁబడు=కనుటనుబొందు=కనుటకుఁబడు=గోచరించు".)
ఇంకఁ బ్రేరణమున ననభిహితకర్తృవాచకమున కనఁగాఁ బ్రయోజ్యకర్తృవాచక
మునకుఁ బైఁగాషష్ఠివచ్చుటకు ఉదా:—"అప్రే:—మైత్రుండు తత్త్వంబుం దెలిసెను.
ప్రే:—చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను" అని సూరి యుదాహరిం
చెను. ఇచట నప్రేరణమున బుద్ధ్యర్థకమగు 'తెలిసెను' అనుదాని కర్త మైత్రుఁడు.
ప్రేరణవాక్యమునఁ 'తెలిపెను' అనుచోటి యాఖ్యాతముచే నభిహితంబు గాకుండు
టం జేసి యట్టి ప్రయోజ్యకర్తృవాచకమునకుఁ బ్రకృతసూత్రముచే షష్ఠి పాక్షిక
ముగ వచ్చెను. చైత్రుండు మైత్రునిఁ దత్త్వంబుం దెలిపె నని ద్వితీయయుఁ బక్షాం
తరమున రావచ్చును. (విస్తర II)

"కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగ నగు. విశ్వా
మిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. కృష్ణుఁ డర్జునునకు విశ్వరూపంబుం
జూపెను" అని సూరి వివరించెను. అనభిహితేత్యాది ప్రకృతసూత్రములోని
బహుళగ్రహణముచే 'కను - చూచు' మున్నగు ధాతువుల ప్రయోగమునఁ బ్రేరణ
వాక్యమునందలి ప్రయోజ్యకర్తృవాచకమున కనఁగా ననభిహితకర్తృవాచక
మునకు రావలసిన తృతీయ పాక్షికముగానైన రాదనియు షష్ఠియె నిత్యముగా
వచ్చుననియు సూరిగారి వివరణమునకుఁ దాత్పర్యము. ఇందులకు సూరిగారిచ్చిన
రెండుదాహరములందును దృశ్యర్థకధాతువునలె నీఁబడినస్వారస్యముచేఁ గన్వాదు
లిటఁ 'కను - చూచు' మున్నగుదృశ్యర్థకములుమాత్రమె యని సూరియాశయము

---

విస్తర II ౨౩౭ I విమ:— "సూత్రములోని బహుళగ్రహణమున నొకా
నొకచో ద్వితీయము నగు ఉదా. క. కడుఁదడవు నిద్రపోయితిఁ। బడఁతీ ననుఁ
దెలుపవలదె...... (ఆర ౭ ఆ. ౨౧౩) (బా. గు. ప్ర. ౭౨౫ పు. ద్వి. ము.)"
అనెడి గుప్తార్థప్రకాశిక వ్రాఁత సరికాదు. ఈ పద్యములోని తెలియుధాతు వకర్మ
కము. సూరివాక్యములోనిదన్ననో సకర్మకము. "తెలియు. దే. అ. క్రి.........3.
మేల్కను' (శ. ర). అకర్మక మగుటచేఁ బ్రేరణకర్త కర్మంబయ్యెయు గాన
'చైత్రుఁడు మైత్రునకుఁ దత్త్వంబు దెలిపెను' అను సూరియుదాహృతికిది పక్షాం
తరము కాదు. సూత్రములోని బహుళగ్రహణమున షష్ఠికి మాఱుగ రాలేదు.
షష్ఠికిచటఁ బ్రసక్తియే లేదు.

నభివర్ణింపనగును. (విస్తర III). ఈ సూరిగారి షష్ఠీనిత్యతావివరణము నీక్రింది మహాకవిప్రయోగములు ప్రతిఘటించుచుండుటంజేసి షష్ఠీనిత్యత పొసఁగదు. పాక్షికషష్ఠి యంగీకార్యమె యగుట కీవలికుఁ బ్రయోగములు చూపఁబడెను. ఉ. అత్తఱి లేచివచ్చి తనయన్నలఁ దమ్ములఁ గానిపించె నయ్యుత్తరు నర్జునుండు........(విరా. ౫ ఆ. ౩౮౨ ప.) క. వానిం దోడ్కొనిచని యా భూనాథునిఁ గానిపించి (ఆర - ౭ ఆ - ౭ ప) క. ఆసమయమునఁ గుమారిం। గైసేసి తదీయజననిఁ గాన్పించి చకో। రీసుదతి సుప్రయా।। శ్రీసూచనచేసి ప్రణతి సేయిం చుటయున్ (విక్ర. ౪ ఆ. ౧౯౨ ప). "కానిపించు" అనువానికి 'గోచరించు' అను నర్థమందును వాడుకలు గన్పట్టుటంజేసియు నట్టియెడల షష్ఠీనిత్యత యన్యాయమగుటం జేసియు సూరి యిట్లు భ్రమింపవలసె ననితోఁచెడిని. "కానిపిం(న్పిం)చు. కనిపించు స. క్రి. (కానుచు) చూపు - చూపించు - దర్శింపఁజేయు.........అ. క్రి. కన్పడు - ప్రత్యక్షమగు...... శా. ఈచందంబునఁ బంక్తికంఠునకు వాణీశుండు గాన్పించి (ఉ-రా. ౨ ఆ. ౧౭౯)" (సూ. రా. ని.)

---

విస్తర III ౨౩౭ I విష:—"కను - విను - తిను. ఇత్యాదులు కన్వాదులు" (బా - గు - ప్ర. క్రియా - ౧౨౪ సూ - వ్యా) అనియిట్లు గుప్తార్థప్రకాశికాకర్త కన్వాదిగణమున దృశ్యర్థకములు కానట్టి 'విను - తిను' మున్నగువానిని సూరియభిప్రాయమునకు విలక్షణముగాఁ జరించుటంజేసి యీక్రింది తిక్కయజ్వప్రయోగములు బాధకములు కావలసివచ్చెను. చ......నీవుమున్। కనినది విన్నయట్టిగి ప్రకామకుతూహలచిత్తుఁడైన కృ। ష్ణుని వినిపింపు నావుడు (అను. ౪ ఆ. ౪౧౩) (ఇందలి ద్వితీయ ప్రాసస్థలగతము). క. విను మాచార్యులు నూర్వురు।......అర్జున పతి వినిపింతురు త। త్త్వనిరూపకశాస్త్రములు........(శాంతి. ౪ ఆ. ౩౪౦.) షష్ఠి నిత్యముగా రావలసిన కన్వాదిగణములో వినుధాతువును జేర్చుటంజేసి యీద్వితీయాప్రయోగములు బాధకములగుచున్నవి. ఇంక 'తిను' ధాతుస్థలమున నిత్యముగాఁ గాకున్నను బాక్షికముగా నైతము షష్ఠిపొసంగ నేరదు. మ...... సమదదేవారాతిరింఛోళిచేఁ। దినిపించెం దృణరాజి (దశ. ౨ ఆ. ౪౦౦.). గతిబుద్ధ్యాదిసూత్రముచే నిట ద్వితీయవచ్చుట సహజమే కాన "దేవారాతిరింఛోళినిం। దినిపించెం దృణరాజి" ననియుండినను నుండనగును. దేవారాతిరింఛోళికిం దినిపించెం దృణరాజి ననుట సంగతముకానేరదు,

గుప్తార్థప్రకాశికాకర్త విను-తినుల షష్ఠి శ్రుతికటువుకాకుండు స్థలములను రెండిటిని గల్పించి యీక్రిందిరీతిని జూపెను. "భీష్ముండు ధర్మజునకు ధర్మంబుల

సంజీవని. ౨౩౭ II విష:—ప్రసంగవశమున నిట - గనుధాతుప్రేరణరూపములు సాధింపఁబడుచున్నవి. బా - క్రి - ౭౦ సూత్రముచే 'కను' ధాతువునకుఁ బ్రేరణార్థమున నించుక్కు రాఁగా "కను+ఇంచు" అని యేర్పడును. బా. క్రి. ౭౮ సూత్రముచొప్పున "పు"గాగమము రాఁగా 'కను+పు+ఇంచు' అగును. బా. క్రి. ౭౩ సూత్రపు వివరణములోని "బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ బుగాగమంబు లేదు. అను - అనుపించు, తిను - తినుపించు, కను - కనుపించు, దీనియత్వంబునకు దీర్ఘంబు నగు కానిపించు." అనుచొప్పున 'కనిపించు - కానిపించు' అనురూపము లేర్పడును. వీని యందలి 'ను' అనువాని ఉకారము బా. క్రి. ౧౫౭ సూత్రము చొప్పున 'ఇ' కారమయ్యెనని గ్రహింపవలెను. బా. క్రి. ౭౩ సూత్రములోని బహుళగ్రహణముచే 'కను' ధాతువునకుఁ బ్రేరణమున 'చుక్కు' వికల్పముగా వచ్చుననియు నట్టియెడ 'కను' ధాతు 'క' కారముమీఁది 'అ' కారమునకు నిత్యముగా దీర్ఘమగుననియు నెంచినచో "కను+చు = కాను+చు = కానుచు"అను ప్రేరణరూప మేర్పడును. బా - క్రి - ౭౭ సూత్రముచొప్పున నందలి 'ను' వర్ణస్థానమున నిండుసున్న నిల్వఁగా 'కాంచు' అను ప్రేరణరూపాంతర మేర్పడును. క. మానంబుతోడ నర్థిస్నానంబొనరించుచున్న సాత్యవతేయుం। గానిచి......... (వి. పు. ౮ ఆ. ౩౦౬ ప. సూ. రా. ని.). (ప్రాసస్థలప్రయోగము.) గీ. కాన్పు మతనికి (ఉద్యో. ౧ ఆ. ౨౭౦.). ఇట్టిప్రేరణరూపములలో 'కానిపించు' అనుదాని యప్రేరణకర్త ప్రేరణంబునఁ గర్మంబగుట యీావఱకు విపులముగా నుదాహృతమయ్యెను. (౨౩౭-౨౩౭ I విష.) 'కానిపించు - కనిపించు' అనువానికి 'గోచరమగు= ప్రత్యక్షమగు'అనునర్థమును గలదని యీావఱకువ్రాయఁబడెను. (౨౩౭I విష.) అట్టి వినిపించెన్. జనని పుత్త్రునకు నన్నమును దినిపించెన్. ఇత్యాదిప్రయోగంబులు కారకము ౨౧ సూత్రమున (ఒకానొకచో నొకవిభక్తికి మఱియొకవిభక్తియు నగు. కార. ౨౧ సూ.) కర్త్రర్థంబున షష్ఠివచ్చి సాధువులైనవని తెలియవలయును. అథవా 'కన్యాదియోగంబున .........' అనుసూత్రంబున......షష్ఠి యయ్యె." (బా. గు. ప్ర. ౪౨౩ పు. ద్వి. ము.) అనుగుప్తార్థప్రకాశికాపంక్తులు విమర్శసహములు కావు. ఇట్టియెడల నిత్యషష్ఠి యనభిహితకర్తకుఁ జెప్పుట సరికాదుగాని పాక్షికషష్ఠివచ్చుట కాటంక మేమున్నది? ఇట్లు షష్ఠి ౧౨౪ సూత్రముచేఁ బాక్షికముగ సాధ్యమగుచుండఁగా బా-కార-౨౧ సూత్రమునకుఁ బ్రసక్తియెట్లు? ఉక్త సూత్రముల సాధ్యముకాని కవిప్రయోగముల విషయమునఁగదా యగతికగతిగా బా. కార. ౨౧ సూత్రము నుపయోగించుట సంప్రదాయము!

యర్థమునందును నవి ప్రేరణరూపములె యనఁదగును. అచటి ప్రేరణార్థము నీక్రింది రీతిని గ్రహింపనగును. ఉదా:—అప్రే:- చైత్రుఁడు మైత్రుని గనెను. ప్రే:- మైత్రుఁడు తన్నుఁ జైత్రుని గనునట్లు చేసెను= మైత్రుఁడు తన్నుఁ జైత్రుని గానిపించెను = కనిపించెను = మైత్రుఁడు చైత్రునికిఁ గానిపించెను=కనిపించెను=(మైత్రుఁడు చైత్రునకు గోచరించెను.). 'కానుచు - కాంచు' అనువాని ప్రేరణార్థమునుసైత మీక్రిందిరీతి నెన్నవలయును. ఉదా:—ప్రే—చైత్రుఁడు మైత్రుని గాంచెను = కానిచెను = చైత్రుఁడు తన్నుమైత్రుని గనునట్లుచేసెను. తన్ను మైత్రుఁడు చూచుటలోఁ దాను మైత్రునిజూచుట సంభవించునుగదా. ఇంక ప్రేరణకర్తృవాచక తాను శబ్దము ప్రేరణమునఁ గర్మవాచకమయ్యెను. దీనియందలి ప్రేరణరూపమునుబట్టి యిట్టి యర్థకల్పన చేయవలసెను. ఇట్టిప్రేరణార్థమును గ్రహింపకయో రుచింపకయో "కానుచు = కాంచు" అనువానిని ప్రేరణార్థకములుగాఁ గోశకర్తలంగీకరింపలేదు. <u>(విస్తర.)</u>

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (ఆం. చిం. హల. ౧౫ కారి. అహో. ౪౯౩ పు.).

స్వతన్త్రః కర్తా. (౧-౪-౫౪) క్రియాయాం స్వాత

---

విస్తర. ౨౩౭ II విష:—"కాంచెనను రూపము కానిపించెనను ప్రేరణరూపమును దరియింపఁగా........" (బా. సా. పే. ౪౯౩ పుట.) అనుపేటికావ్యాఖ్య ప్రామాదికము. "కానిపించు" అనునది "కను" ధాతుప్రేరణరూపము. (బా. క్రి. ౭౩-౭౪ సూ.). "కానిపిం చనుదాని కప్రేరణార్థమును బ్రయోగసిద్ధముగుటంజేసి యట్టిరూపము యోగమునమాత్రము ముందటివివరణమునంజేసి ప్రేరణార్థాభావమున షష్ఠి కర్తకుఁగలుగదు." (బా. సా. పే. ౪౯౩-౪౯౪ పుటలు.). ఈపేటికా పంక్తులు కేవలము నసంగతములు. ముందటిసూత్రపు వివరణమున 'అనభిహితకర్తకు షష్ఠి విధింపఁబడినది. రామునకు మిథిల గాలిపించె ననఁగా గోచరించె ననియర్థము చేయునపుడు ప్రేరణార్థాభావమున మిథిలగదా కర్త. అది యభిహితమే యగుచున్నది. దానికి షష్ఠి యెట్లును రాదు. అభిహితకర్త గాన నటఁ బ్రథమవచ్చినది. ఆప్రయోజ్యకర్తృవాచకము షష్ఠ్యంతముగ నేయున్నది (రామునకు). కాన నీపేటికా వాక్యము లసంగతార్థములు, ఇంక నా నిరూపించినరీతిని "రామునకు మిథిల తన్నుఁ గానిపించె" నని ప్రేరణము నెన్ని యచట నప్రేరణమునందలి కర్త రాముఁడు కానఁ దద్వాచి రామశబ్దము (అనభిహితకర్తృవాచి) షష్ఠ్యంతమయ్యె నని గ్రహింపవలెను.

స్వాతన్త్ర్యేణ వివక్షితో ఽర్థః కర్తా స్యాత్. (సి. కౌ.
నన్నయా. ౫౩౯ సూ.)
౨౩ర విషయము కర్తృకరణయో స్తృతీయా (౨-3-౧౮) అనభిహితే
కర్తరి కరణేచ తృతీయా స్యాత్. (సి. కౌ. ౫౬౧ సూ.)
రామేణ హతో వాలీ.

టాసశ్చేతః. (ఆం. చిం. అజం. ౬ కారి. అహో. ౨౬3 పు.)

కల్పతరువు. ౨3౮ విష:—సర్వవిభక్తి రిత్యాదికారిక ౨3౪ విషయమున వ్యాఖ్యాతము. పాణినిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము. స్వతన్త్ర ఇత్యాది:—క్రియాయామ్ = క్రియయందు, స్వాతన్త్ర్యేణవివక్షితః అర్థః = స్వతంత్రతతో వివక్షింపఁబడినయర్థము, కర్తా స్యాత్ = కర్త యనిపించుకొనును. 'దేవదత్తుఁడు వంటకమును వండెను.' 'దేవదత్తునిచే వంటకము వండఁబడెను'. అను వాక్యములలోఁ బచనక్రియాజననమందు దేవదత్తునకే స్వాతంత్ర్యము గలదు. కాన దేవదత్తుఁడు కర్త. ధాతువునకు వ్యాపారము, ఫలము నను నవి యర్థములు. ఇందుఁ బ్రధానమైన పచ్ధాత్వర్థమగు పచనక్రియ దేవదత్తునందున్న వ్యాపారము, దాని కాశ్రయుఁడగు దేవదత్తుఁడు కర్త. "యః కరోతి స కర్తా ఇతిసర్వవర్మా, కృత్యాశ్రయః కర్తేతి తార్కికాః" (ముగ్ధ. కార. ౨౦౮ సూ. దుర్గా. వ్యా.) కృత్యాశ్రయుఁడు = ధాత్వర్థీభూత వ్యాపారాశ్రయుఁడు. ప్రకృతోదాహృతిలో వండుట యను వ్యాపారమున కాశ్రయుఁ డగుటంజేసి దేవదత్తుఁడు కర్త. అట్టికర్తృవాచి దేవదత్తశబ్ద ముత్తరసూత్రముచొప్పున తృతీయాప్రత్యయరూప చేత వర్ణకాంత మగుచున్నది.

కర్తృకరణయోరిత్యాది:— కర్తరి = కర్తయు, కరణేచ = కరణమును, అనభిహితే = చెప్పఁబడనివై యుండఁగా తృతీయాస్యాత్ = తృతీయావిభక్తి యగును. రామేణ హతో వాలీ = రామునిచే వాలి చంపఁబడినవాఁడు. హననక్రియాశ్రయుఁడు రాముఁడు కర్త. కానఁ గర్తృవాచక రామశబ్దము తృతీయాంత మయ్యెను. హననఫలాశ్రయుఁ డగు వాలి కర్మంబు. ఇందు 'హతః' అను దానియందలి కర్మార్థకక్తప్రత్యయముచేఁ గర్మం బభిహితమగుటం జేసి కర్మవాచకవాలిశబ్దముపయిఁ బ్రాతిపదికార్థప్రథమ నిల్చినది. ఇట్లే దేవదత్తుని చేత వంటకము వండఁబడె ననుచోటను సమన్వయించుకొనునది. ప్రయోగము:—
చ. ఈ యవనిపులెల్ల నాతనిదయం బరిముక్తులు వానిచేత నా। హావజితులున్......
(సభా. ౨ అ. ౨౪ ప.) ఇందు 'పరిముక్తులు' అనునది 'ముచ్' ధాతువునుండి పుట్టిన

కర్త్రర్థక క్తప్రత్యయాంతరూపము. 'జితులు' అనునది 'జి' ధాతువునుండి పుట్టిన కర్త్రర్థక క్తప్రత్యయాంతరూపము. మోచనవ్యాపారాశ్రయము కృష్ణునిదయ. జయవ్యాపారాశ్రయుఁడు తచ్ఛబ్దార్థకృష్ణుఁడు. కావునఁ గర్తృవాచకములు రెండును ('ఆతనిదయన్ = ఆతనిదయచేత, వానిచేతన్' అనునవి) తృతీయాంతములయ్యెను. ధాత్వర్థఫలాశ్రయత్వమునఁ గర్మసంజ్ఞగల 'అవనిపులు' కర్త్రర్థక క్తప్రత్యయముచేఁ జెప్పఁబడుటంజేసి యట్టికర్మవాచకమగు 'అవనిప' శబ్దముపైఁ బ్రాతిపదికార్థప్రథమ నిల్చినది.

ద్వికర్మకధాతువులు కర్త్రర్థకము లగునపు డా రెండుకర్మములలోను నొకటి యభిహితమై ప్రథమాంతమగును. తక్కినది ద్వితీయాంతముగనె యుండిపోవును. అందేది యభిహితమగునో యనువిషయము మహాకవ్యధీనము. (విస్తర.) ఇట్టివాడుకలు తెనుఁగున మిక్కిలియరుదు. ఆ-వె.........రాజుఁ బెద్దదొరలుఁ। జీర లొలువఁ బడిరి. (విరా. ౫ ఆ. ౨౨౨) "మనము రాజులను బెద్దదొరలను జీరల నొలిచితి మనునది కర్త్రర్థకవాక్యము. 'ఒలుచు' ధాతువు పచాదిగణములోనిది గాన ద్వికర్మకం బయ్యె. ఇందు గౌణకర్మములు రాజులును - బెద్దదొరలును, ముఖ్యకర్మము చీరలు. ఇందు గౌణకర్మము లభిహితములయ్యెను. కానఁ దద్వాచకములు ప్రథమాంతము లయ్యె. ముఖ్యకర్మము ద్వితీయార్థక ప్రథమగనె నిల్చెను. కాఁగా 'మనచే రాజును బెద్దదొరలును జీరల నొలువఁబడిరి' అనువాక్య మేర్పడెను.

టాసశ్చేతఇత్యాది:—ఈసూత్రము ౧౩౫ III విషయమున వ్యాఖ్యాతమయ్యెను. 'టా - భ్యామ్ - భిస్' అన తృతీయకు 'చేత - చే' వర్ణకములు తెల్గున వచ్చునని యర్థము.

---

విస్తర. ౨౩౮ విష:—ఈవిషయమున సంస్కృతవ్యాకరణములయందీక్రింద వివరింపఁబడిన రీతిగల నియమముగలదు. "న్యాది ఇ్యన్తార్థ గత్యర్థా। ముఖ్యే ధే థత్వ మాప్నుయుః। గౌణే యాచాదయో ఽన్యేతు। యథేష్టం ద్విధధుష్వితి. (ముగ్ధ. వ్యా. ౯౩౨ సూ.). (ధ=కర్మము. ఇ్యన్త=ణిజన్తము =ప్రేరణార్థకము. థ్య= ప్రత్యయము. ధు = ధాతువు. ఇవిముగ్ధబోధవ్యాకరణసంజ్ఞలు.) న్యాది=నీ-వహ్-హృ - దణ్డ - గ్రహ - కృష్ - మన్థ - ముష - ధాతువులును 'పచా'దిధాతువులును (పచాదికమాకృతిగణము.) సకర్మక ణిజంతములును గత్యర్థకణిజంతములును, ముఖ్యేధే = ముఖ్యకర్మమందు, థత్వ మాప్నుయుః = కర్త్రర్థకప్రత్యయముల నందును. యాచాదయః = యాచ్ఞార్థకధాతువులు, గౌణే = గౌణకర్మమందుఁ గర్త్రర్థకప్రత్యయము నందును. అన్యేతు = తక్కినద్వికర్మకధాతువులు, యథేష్టమ్ = కవిసమ్మతముగఁ, గర్త్రర్థకప్రత్యయమునందును,

చేతవర్ణకంబు కర్తకగు. 3.

బాలవ్యా. ౨3౮ I విష.

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు. దేవదత్తునిచే వంటకము వండఁబడియె. వండఁబడియె ననఁగా వంటచేయఁబడెనని యర్థము. చేయుట కాశ్రయుండగుటంజేసి దేవదత్తుఁడు కర్త యయ్యె.

సంజీవని. ౨3౮ I విష:—తిజాదులచే నభిహితము కానట్టి కర్తకు వాచకమైనది చేత వర్ణకాంతమగునని యర్థము. 'చే' అనునది చేతవర్ణక సంక్షేపరూపమె కాన నదియుఁ గర్తృవాచకముపై నిల్చును. 'తోడ - తో' వర్ణకములు కరణసహార్థములలో వచ్చునని ముందు విధింపఁబడును. ధాత్వర్థమగు పచనాదివ్యాపారమున కాశ్రయుండు కర్త యనఁబడును. దేవదత్తునిచేత వంటకము వండఁబడియె ననుచోటఁ బచనవ్యాపారమున కాశ్రయుఁడు దేవదత్తుఁడు కర్త. అట్టి కర్తృవాచకముపైఁ దృతీయావర్ణకములలో 'చేన్ - చేతన్' అనునవి నిల్చునని సూత్రార్థము.

సర్వవిభక్తిః సంస్కృతతుల్యా (అం. చిం. హలం. ౧౫ కారి. అహో. ౪౨3 పు.)

నన్నయా థర్వణీయము. ౨3౯ విషయము.

సాధకతమం కరణమ్. (౧-౪-౪౨.) క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కారకం కరణసంజ్ఞం స్యాత్...... (సి. కౌ. ౫౬౦ సూ.) రామేణ బాణేన హతో వాలీ. హేతౌ (౨-3-౨3.) హేత్వర్థే తృతీయా స్యాత్. దణ్డేన ఘటః. (సి. కౌ. ౫౬౮ సూ.)

కల్పతరు. ౨3౯ విష:—సర్వవిభక్తి రిత్యాగికారిక ౨3౪ విషయమున వ్యాఖ్యాతము. పాణినీయసూత్రాదికమును మూలముగాఁ గొనుట కిదియె మూలము. క్రియాసిద్ధౌ = క్రియాఫలసిద్ధియందు, ప్రకృష్టోపకారకం కారకమ్ = అతిశయితోపకారియగు కారకము, కరణసంజ్ఞం స్యాత్ = కరణసంజ్ఞగల దగుచున్నది. కరణార్థమున "కర్తృకరణయోస్తృతీయా" అనుచోప్పున (౨3౮ విష.) తృతీయావిభక్తి నిల్చును. ఉదా:—'రామేణ బాణేన హతో వాలీ.' అనుచో బాణము వాలిహననమున ముఖ్యసాధన మయ్యెనుగాన నట్టికరణార్థకబాణశబ్దము తృతీయాంత మయ్యెను.

హేతావిత్యాది:—హేత్వర్థే= హేతుమాత్ర మర్థమగునపుడు, తృతీయా స్యాత్ =తృతీయా విభక్తియగును. ఉదా:—దణ్డేన ఘటః=దండముచే ఘటము నిర్మితమగుచున్నది. ఘటనిర్మాణమునకు దండము ప్రకృష్టసాధనముగాదు. సాధనమాత్ర

మగుచున్నది. 'హేతుః ఫలసాధనయోగ్యః' (ముగ్ధ. కార. ౨౮౭ సూ. శ్రీరామ తర్కవాగీశ వ్యాఖ్య.)ఫలమును సాధించుట కర్హమైనదెల్ల హేతు వనిపించుకొనును. కరణము:—"క్రియాయాం సాధ్యాయాం బహూనాం కారణానాం మధ్యే కారణాన్తరవ్యవధానాభావే యద్వస్తు క్రియానిష్పత్తికారణం వివక్షితం తదేవ సాధనం భవతి.........'కారణాఽవ్యవధానేతు । క్రియానిష్పత్తికారణమ్ । యద్వై వివక్షితం తేషు । కరణం తత్ప్రకీర్తితమ్.' (ముగ్ధ. ౨౮౭ సూ. దుర్గా. వ్యాఖ్య.) ఏహేతువు కారణాంతరవ్యవధానములేకుండఁ గ్రియానిష్పత్తికారణముఁగ వివక్షితమగునో యది కరణ మనిపించుకొనును. రామేణ బాణేనేత్యాది స్థలమున వాలి హననమునం దనేకకారణములున్నను బాణము కారణాంతరవ్యవధానము లేకుండఁ గ్రియానిష్పత్తిజనక మయ్యెను గాన బాణము కరణ మయ్యెను.

చేతవర్ణకంబు హేతుకరణంబులకు, గ్రహ్యాదియో
గజంబగు పంచమికిని బహుళంబుగ నగు. ౮.

బాలవ్యా. వివరణము ౨౩౮ I విషయము

ఫలసాధనయోగ్యంబగు పదార్థంబు హేతువు. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. హేతువునకు:—ధనముచే సౌఖ్యంబుగలుగు. విద్యచేత యశంబుగలుగు. పక్షంబున వలన వర్ణకంబగు. కరణంబునకు:—ఖడ్గంబుచేత ఖండించె. కోలచేతఁ గూలనేసె. పక్షంబునం దోడవర్ణకంబగు. గ్రహ్యాదియోగంబునందు:—జరాసంధుండు రాజులచేతఁ గప్పంబు గొనియె. మైత్రుండు చైత్రునిచేత ఋణంబు గొనియె. ఈయర్థంబును నీచేత నెఱింగితి. ఈవృత్తాంతంబు వానిచేత వింటి. పక్షంబున వలన వర్ణకంబగు.ఇత్యాదికంబు లెఱుంగునది.

సంజీవని. ౨౩౮ I విష:—కల్పతరువున నుదాహరింపఁబడిన లక్షణములె హేతుకరణములకు సూరిచే వివరింపఁబడెను. సౌఖ్యరూపఫలమును సాధించుట కర్హమైనది ధనము గాన నది హేతువు. కాన నట్టి హేత్వర్థకముపైని బ్రకృత సూత్రముచేఁ దృతీయ నిల్చెను. 'ధనముచేత సౌఖ్యంబుగలుగు' అని యేర్పడెను. ఇట్లె 'విద్యచేత యశంబుగలుగు' అనుచోటను గ్రహింపవలెను. తృతీయరానిపక్షంబున వలన వర్ణంబువచ్చునని వివరించుచున్నాఁడు. దీనిమూలమునసే హేత్వర్థమునన వర్ణకమువచ్చునని గ్రహింపవలెను. బా. కార. ౧౪ సూత్రము వివరణమున

సైతము "పట్టివర్ణకంబు హేతువులగు గుణక్రియలకగు...ఇచట వలన వర్ణకంబునగు. జ్ఞానమువలన ముక్తుండగు" (బా.కా.౧౪సూ.) అని హేత్వర్థకముపై వలన వర్ణకము నిల్చునని వచింపఁబడెను. 'ఖడ్గంబు చేత ఖండించె' అనుచో ఖండనక్రియాసిద్ధియందు ఖడ్గము సాధకతమమగుచున్నదిగాన నయ్యది కరణ మనిపించుకొనును. దాని పైని బ్రకృతసూత్రముచేత 'చేత' వర్ణకమును బా. కా. ౫ సూత్రముచొప్పున తోడ' వర్ణకమును నిల్చును. ఖడ్గముతో ఖండించెననియుఁ జెప్పవచ్చును. బా. కా. ౯ సూత్రమున "గ్రహణమునకు:—మైత్రునివలన ధనంబు గొనియె." అని వివరింపఁ బడును. అట్టి గ్రహణశబ్దముచేత 'ఎఱుఁగు - విను' మున్నగునవియు నుద్దేశింపఁ బడెనని ప్రకృతసూత్రము వివరణమువల్లనే విశదమగుచున్నది. అట్టి యుద్దేశము తోనె గ్రహ్యాదియోగజపంచమికి 'చేత' వర్ణకంబగునని ప్రకృతసూత్రమున వచింపఁ బడెను. కావున "జరాసంధుండు రాజులచేతఁ గప్పంబుగొనియె. రాజులవలనఁ గప్పంబు గొనియె" అని రెండువిధములుగాను నుండనగును. "ఈయర్థంబు నీచేత నెఱింగితి. ఈయర్థంబు నీవలన నెఱింగితి" అను ద్వివిధప్రయోగములును సమ్మతములె యగును. (విస్తర. I)

ప్రయోగములు:—మ. పరఁగన్ దక్షిణదిఙ్మహీపతులచేఁ బౌలస్త్యుచే...... కప్పముల్ గొనియె. (సభా. ౧ ఆ. ౨౯౪.) తరువోజ.........।భూనాథ నీగుణం బులు హంసచేతఁ బొలుపుగా విని ........(అర. ౨ ఆ. ౪౭.) సీ. ధర్మతనయుఁ। డాదిగాఁగల తమ్ములందఱు నాచేత నెఱిఁగి.........(ఉద్యో. ౪ ఆ. ౨౯.) సీ.........ఆ-వె...... .అ। క్కథకువలన మునినికాయమెల్ల । వివిధపుణ్య కథలు వినుచేడ్క.........(ఆది. ౧ ఆ. ౨౮.)

---

విస్తర I. ౨౩౯ I విషః—"నీచేత నెఱింగితి - వానిచేత వింటి" అను నిట్టివి సంస్కృతము ననుసరించి సిద్ధిష్టములుగాని తెనుఁగున సహజమగువాడుకకు మాత్రము విరుద్ధముగఁ దోఁచెడిని. వలన వర్ణకయోగమె సహజముగఁ దోఁచెడిని" (బా. సా. పే. ౨౭౦ పుట.) అను పేటికావ్యాఖ్య కేవలము ప్రామాదికము. సంస్కృతమున నట్టి తృతీయాప్రయోగ మెంతమాత్రము సమ్మతముకాదు. ఇట్టి తృతీయ యాంధ్రమహాకవిసమ్మతమయియున్నది. సీ. ధర్మతనయుఁ। డాదిగాఁగల తమ్ము లందఱు నాచేత, నెఱిఁగి. (ఉద్యో. ౪ ఆ. ౨౯.) తరువోజ. భూనాథ నీగుణం బులు హంసచేతఁ బొలుపుగా విని.........(అర. ౨ ఆ. ౪౭.) గీ. నన్నుఁ గొని పోయె నాచేత నిన్ను వినిన । యపుడె. (ఉద్యో. ౪ ఆ. ౨౮౦.) ఆ-వె......... నీచేత । నేఁడు విన గవలసె వేఁడిపలుకు. (భీష్మ. 3 ఆ. ౧౭౭ ప.). గీ నారదుచేత వింటి (హరి. ఉభా. ౨ ఆ. ౧౨౬.)

చే - చేత - వర్ణకములకు మాఱుగా జడవాచకములపై ద్వితీయావిభక్తి (ఇతరత్రచ ద్వితీయా. ఆం. చిం.) యు, నుదంతజడవాచకములపై నేకత్వమున 'న' వర్ణకమును, (ఇది చింతామణిమతమున సప్తమీప్రత్యయము కాన 'అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా' అనుచింతామణిసూత్రముచొప్పున వచ్చును.) నౌపవిభక్తికములపై నేకత్వమున 'అన్' అనునదియు ('కేషాంచి దుదన్తానామ్ .....ఔపవిభక్తికనామ్నా మత్వం స్యాత్.' అనువొప్పున వచ్చునని.) దృతీయాసప్తములందు వికల్పముగా వచ్చుట మహాకవిప్రయోగసమ్మతమై యున్నది. (విస్తర II) క.........భీమా సురసం। ఘాతంబు తత్క్షణంబ ని। పాతింతును దివ్యశస్త్రపటుఘాతములన్. (ఆర. 3 ఆ. 3౬.). తే.గీ. విద్యయొసఁగును వినయంబు వినయమునను। బడయుఁ బాత్రత పాత్రత వలన ధనము। ధనమువలనను ధర్మంబు దానివలన। నైహికాముష్మిక సుఖంబులందు నరుఁడు. చ. అనవ్రతు ధర్మజుండనియె నధ్యయనంబున దేవభావముం। గను నవనీసుపర్యఁ డధికవ్రతశీలత సాధుభావమున్...... (ఆర. 2 ఆ. ౪3౧.). శా. భల్లంబొక్కటి విల్లుద్రుంచి రయమొప్ప న్నాల్గిటన్ వాజులన్। ద్రెళ్ళం బెట్టుగనేసి సూతుతల పండిప్రైక బాణాహతిన్। డొల్లంజేసి... (ద్రోణ. ౪ ఆ. 33 ప.)

---

విస్తర. II ౨౩౯ I విష:—"తృతీయాపక్షే జాడ్యముచేత బద్ధుఁడు. కర్తృకరణయో స్తృతీయా ఇత్యాదిసూత్రవిహిత తృతీయాస్థానే టాపశ్చేత ఇతి విధానాత్. తత్త్వం తు:—జడప్రకృతిభ్య స్తృతీయాస్థానే "అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా" ఇతి సూత్రోక్తరీత్యా విహితే ద్వితీయా సప్తమ్యావేవ (ఇందలిసప్తమి'న' వర్ణకరూపము.) హేతుతృతీయేతి వ్యవజహార స్వయమాచార్యః. తత్రాపి 'చేసి' శబ్దః ప్రాయశః ప్రాయుజ్యత." (అహో. ౨౭౨ పు. షష్ఠీతతు పఞ్చమీత్యాదిసూత్ర వ్యాఖ్య.) జడవాచకములగు ప్రకృతులపైని హేతు తృతీయచోట 'చే - చేత,' వర్ణకములు రావనియు ద్వితీయగాని 'న' వర్ణకముగాని నిల్చుననియు నట్టివాని పైని 'చేసి' శబ్దము తఱచుగానిల్చుననియుఁ గై కవిశిరోభూషణపంక్తుల తాత్పర్యము. ఇది సరి కాదు. "అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా." "ఇతరత్రచ ద్వితీయా తస్యాః ప్రథమాచ జడపదానాం స్యాత్." అను సూత్రములచొప్పున జడవాచకములపైఁ దృతీయాద్యర్థములందు ద్వితీయాదులు నిల్చుటయుఁగలదని మాత్రమె చెప్పఁ బడెనుగాని "చే-చేతలు" నిల్వరాదని చెప్పఁబడలేదు. క. తనవిద్యాతపముల చే। త నుపార్జితమైన పేర్మి. (హరి. ఉత్త. ౪ ఆ. ౨౧౦. సూ. రా. ని.)

"పరే షూండాద్యాదిశబ్దేషు । సప్తమ్యాద్యా విభక్తయః । క్వచిన్నిత్యాః క్వచిద్వాస్యుః........" (వికృ. అజం. ౮౨ కా. అహో. ౩౬౨ పు.) (౨౪౭ విష.) అనుచో ప్పునఁ జేత విభక్త్యర్థక ప్రత్యయమును వలన వర్ణకమును బూర్వమందు గల్గదై చేసి శబ్దము నిలుచుట తెలుచుగాఁ బ్రయోగములయందు వెలయుచున్నది. ఉ. భారతభారతీ శుభగభస్తిచయంబులఁ జేసి (ఆది. ౧ ఆ. ౨౨.) సీ. క్షత్రియుల చేత । సంశుద్ధ రత్నపుంజములఁ జేసి పూజితుండయి (సభా. ౧ ఆ. ౨౧౫.) చ. తన గదఁ జేసి రాక్షసుల దారుణ శస్త్రచయంబు నశ్రమం । బున నతివీరుఁడై నిలిపె (ఆర. ౩ ఆ. ౩౬౨. ఆర. ౪ ఆ. ౧౭.). ఉ. ఈసున నీశుఁ దొట్టి సురలెల్ల నభీష్టవరంబు లిచ్చుటం । జేసి కృతార్థుఁడైన కురుసింహము (ఆర. ౨ ఆ. ౨౯౫) గీ. ఇందఱకు నిన్నిభంగుల నిడుమఁ గుడువ । వలసె ధర్మతనూభవు వలనఁ జేసి (విరా. ౨ ఆ. ౨౨౫.). (విస్తర. III)

---

విస్తర III ౨౩౯ । విష:—చేసి శబ్దానుప్రయోగవిషయమునఁ బ్రౌఢవ్యాకర్త యీక్రిందిరీతిని సూత్రించియున్నాఁడు. "కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థక వర్ణకంబులకును వలన వర్ణకంబునకును దఱచుగఁ జేసి యనుప్రయుక్తంబగు. ఉ......... ఏకవిప్రుసం । బోదనఁ జేసి......(ఆర. ౨ ఆ.).........సంప్రయోగమునఁ జేసి (సభా. ౧ ఆ.)........" (ప్రౌఢ. కార. ౪ సూ.) చేత విభక్త్యర్థక వర్ణకంబుల కనుటం జేసి 'చే - చేత' వర్ణకములకు "చేసి" శబ్దానుప్రయోగము కల్గనేరదనఁ దగును. "ద్విపద. మహనీయపాయస మహిమచేఁ జేసి (రంగ. రా. బాల. ౨౧ పుట. ౫౪౦ ప.) ద్వి. మహనీయ రావణ మహిమచేఁ జేసి. (రంగ. రా. యుద్ధ. ౩౭౬ పుట. ౭౮౧ ప.) (యూ. ము.)." ఇట్టిప్రయోగములకుఁ బ్రామాణిక కవిప్రయోగాంతర హస్తావలంబము లభింపలేదు. రెండిటను "మహిమను జేసి" అనిసవరించుట కవకాశము కన్పట్టుచున్నది. "అయ్యది యొక్కచోఁ బెక్కుచోట్ల కొక్కటియ చాలెడి. సీ.........కర్కశస్తనములఁ గరమువాఁడి । చూడ్కుల నతిరాగ సురుచిరాధరముల మదవిలాసాలస మందగతుల । వక్త్రాలకంబుల వలుద పిఱుందుల దర్ప గద్గదభాషితములఁ జేసి. (ఆది. ౮ ఆ. ౭౪ ప.). (ప్రౌఢ. కార. ౫ సూ.) చ. సతతకృతోపవాసముల, శాకఫలోదకమూల పారణ । వ్రతముల, దేవ పూజల నపారజపంబులఁ జేసి నిష్ఠతో । నతుల తపంబు సేసె. (ఆర. ౩ ఆ. ౭౮ ప) ఒకట 'న' వర్ణకమునకును నొక్కటఁ జేత వర్ణకార్థకద్వితీయకును 'చేసి' యొక్కటియె యనుప్రయుక్తమగుటగలదు. తే-గీ. అనఘ యేము ముచ్చొరము మూఁడగ్నులట్లు । నీమహాయజ్ఞ కార్యంబు నిర్వహింతు । మాజరాసంధ వధమున నఖిలశత్రు । వాహూ

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (ఆం. చిం. హలం. ౧౫ కా. అహో. ౪౨౩ పు.)

సాధకతమంకరణమ్ (౧-౪-౪౨). కర్తృకరణయో స్తృతీయా. (౨-౩-౧౮). సహయుక్తే ఽప్రధానే. (౨-౩-౧౯) సహార్థేనయుక్తే అప్రధానే తృతీయా స్యాత్. పుత్రేణ సహాగతః పితా, ఏవం - సాకం సార్థం - సమంయోగేపి. వినా పితదోష్యగం తృతీయా-

నన్నయా. వృద్ధోయూనేత్యాది దర్శనాత్. (సి. కౌ. ౫౬౪ సూ.)

౨౪౦ విషయము. తుల్యార్థై రతులోపమాభ్యాం తృతీయాన్యతర స్యామ్. (౨-౩-౭౨) తుల్యార్థైర్యోగే తృతీయా వా స్యాత్. పక్షే - షష్ఠీ. తుల్య స్సదృశ స్సమోవా కృష్ణస్య - కృష్ణేనవా. అతులోపమాభ్యాంకిమ్ - తులా - ఉపమా వా కృష్ణస్య నాస్తి. (సి. కౌ. సూ. ౬౩౦.)

---

తులఁ, జేసి తృప్తులమగుచు బలిమి." (సభా. ౧ ఆ. ౧౨౬.). పై స్థలములందు "ఉప వాసములన్ = ఉపవాసముల చేతను,...... ..జపములంజేసి = జపముల చేతను" అని యర్థము చేసి 'పెక్కిటి కొక్కటి చాలు' అను సూత్రము సుజ్జగింపరాదా యను శంకపొడముచున్నది. కాని "సీ. రత్నంబులను వధూరత్నంబులను జేసి, తత్తపోవిఘ్న విధాననిరతు । లయి (ఆది. ౮ ఆ. ౯౬.) "అట్టిగౌతమానుగ్రహం బునను నీదుర్గబలంబుననుం జేసి యీ మాగధుల నెవ్వరును జయింపనోపరు (సభా. ౧ ఆ. ౧౭౬ గద్య.) మున్నగుచోటులందలి చేసి శబ్దమునకు మునుపటి సముచ్చయార్థక 'ను' శబ్దములచే నట్టి మార్గాంతరము సరికాదని తోఁచెడిని, స్థలాంతరములందును 'చేత' వర్ణకార్థక ప్రత్యయములకు వ్యవహితముగ 'చేసి' శబ్దప్రయోగము చూపట్టుచున్నది. ఉ. చేయుము రాజసూయమెడ సేయకదాననఁసి దోషముల్ । వాయు...(సభా. ౧ ఆ. ౯౮.) ద్వి. నాకును నీకారణమునఁగా చేసి। చేకూరె. (బసవ. ౩ ఆ. ౨౨౦.) ద్వి. కాన నాతప్పునఁగా చేసి (బసవ. ౩ ఆ. ౨౯౯.) (కా = కదా.). ఆ-వె. తండ్రిపనుపుఁజేసి ముదిమిగొని. (ఆది. ౩ ఆ. ౯౫.) ఆ-వె. భీష్మపనుపుఁ జేసి కొలవైతి (సభా. ౨ ఆ. ౧౧.) ఇట్టిచోటులందలి ద్వితీయ "ఇతరత్రచ ద్వితీయా" అను చింతామణిచేఁ జేత వర్ణకార్థమగుచున్నదని ప్రౌఢ వ్యాకర్త సమర్థించెను. అది చింత్యము. (ప్రౌఢ. కార. ౪ సూ. వివృతి.). (చూ. ప్రస్తు 1, ౨౫౫ విష.)

తోడసహార్థే టాసః. (ఆం. చిం. అజం. ౭ కారి.

సన్నయా. అహో. ౨౬౯ పు.)

౨౪౦ విష శబ్దా యేచ సముత్పన్నా।ఆద్యాయా మత్ర తే ఖిలాః।

కథితా వైకృతై శ్శబ్దై।ర్భవన్తి సదనుగ్రహాత్. (వికృ.

అజం. ౧౮ కారి. అహో. ౨౭౦ పు.)

కల్పతరు. ౨౪౦ విష:—సర్వవిభక్తి రిత్యాదిసూత్రము ౨౩౪ విషయమున వ్యాఖ్యాతము. పాణినీయాదుల మూలముగాఁ గొనుట కిదియె మూలమగుచున్నది. 'కర్తృకరణయో స్తృతీయా' అను పాణినీయసూత్రము ౨౩౮ విషయమునందును 'సాధకతమం కరణమ్' అనుసూత్రము ౨౩౯ విషయమునందును వ్యాఖ్యాతము లయ్యెను. కరణకారకమందు వచ్చిన తృతీయకుఁ దెలుంగున "టాసశ్చేతః" అను చొప్పున 'చే - చేత' వర్ణకము లేకాక (౨౩౮ విష.) మహాకవిప్రయోగములందుఁ బ్రసిద్ధము లయియుండుటచే 'తో - తోడ' వర్ణకములును వచ్చును. 'బాణేన హతోవాలీ' అనునది కరణకారకమునవచ్చు తృతీయ కుదాహరణ మీవఱకుఁ జూపఁబడెను. దానికిఁ దెలుఁగున బాణముచేత వాలి హతుఁ డయ్యె ననుటయే కాక బాణముతో వాలి హతుఁడయ్యె ననియుఁ జెప్పవచ్చును,

సహాయుక్తఇత్యాది:—సహార్థేనయుక్తే = సహార్థకశబ్దములతోఁగూడిన, అప్రధానే=అప్రధానాన్వయముగల శబ్దమందును దృతీయ యగును. పుత్రేణ సహాగతః పితా=పుత్త్రునితోఁగూడఁ దండ్రివచ్చినాఁడు. ఇందుఁ బిత కాగమనక్రియాసంబంధము శబ్దసిద్ధము. పుత్త్రునకన్ననో పితృసాహిత్యమున గమ్యమగుట నర్థసిద్ధమై యున్నది. కావున దాని కప్రధానత్వము గల్గెనని గ్రహించునది. "పితు రత్రాగమన క్రియాసంబన్ధ శ్శాబ్దః. పుత్త్రస్యతు తత్సాహిత్య (కూడిక) గమ్య ఆర్థికఇతి తస్యా ఽప్రాధాన్యమ్" (బాలమ. వ్యాఖ్య. ౫౬౪ సూ.). సహార్థకశబ్దము లనుటచేత "సాకం - సార్థం - సమం=సహ" మున్నగువాని యోగమందును దృతీయవచ్చును 'పుత్రేణసాక (సార్థం - సమంవా) మాగతః పితా'అనియు నుదాహరింపనగును. వినాపి తద్యోగం తృతీయా. వృద్ధోయూనేత్యాది దర్శనాత్=సహార్థకశబ్దయోగము లేకున్నను దృతీయవచ్చును. వృద్ధోయూనా తల్లక్షణశ్చే దేవ విశేషః. (౧-౨-౬౫.) యూనాసహోక్తౌ గోత్రం శిష్యతే........" (సి. కౌ. ౯౩౧ సూ.) అను సూత్రమునందలి గ్రంథకర్తగారి ప్రయోగము చూపట్టుచున్నది. తెల్గునందును సహార్థకమగు 'కూడన్' మున్నగునవి లేకున్నను దృతీయవచ్చును. పుత్త్రునితోఁ దండ్రివచ్చెను = పుత్త్రునితోఁగూడఁ దండ్రివచ్చెను.

తుల్యార్థైరిత్యాది:—తుల్యార్థైః = తుల్యార్థకశబ్దయోగమునందుఁ దృతీయ వైకల్పికముగా వచ్చును. తృతీయ రానపుడు షష్ఠి వచ్చును. "తులా - ఉపమా" అను శబ్దముల యోగమునఁ దృతీయ రాక షష్ఠిమాత్రమె వచ్చునని "అతులోపమాభ్యామ్" అను పర్యుదాసమునకుఁ దాత్పర్యము. ఉదా:—తుల్య - స్సదృశః సమో వాకృష్ణస్య - కృష్ణేనవా = కృష్ణునకు (లేదా) కృష్ణునితోఁ దుల్యుఁడు, సదృశుఁడు, (లేదా) సముఁడు. అతులోపమాభ్యాం కిమ్ - తులా - ఉపమావాకృష్ణస్యనాస్తి = అతులోపమాభ్యా మననేల కృష్ణునకుఁ దుల (లేదా) ఉపమ లేదు. ఇటఁ దృతీయ రాదు. 'కృష్ణునితోఁ దుల (లేదా) ఉపమ లేదని' ప్రయోగింపరాదు.

తోడ సహార్థ ఇత్యాది:—ఈసూత్రము ౧౩౫ III విషయమున వ్యాఖ్యాతమయ్యెను. 'సహాయుక్తేఽప్రధానే' అనుసూత్రముచొప్పున వచ్చు సహార్థ తృతీయకుఁ దెలుఁగున తోడవర్ణకమగునని యర్థము. 'సహ-సాకమ్' మున్నగు సంస్కృతశబ్దములకు మాఱుగఁ దెలుఁగున 'కూడన్' మున్నగు శబ్దములు ప్రయుక్తములగును. ఉ. తండ్రితోఁ గూడఁ బుత్త్రుండు వచ్చెను. 'కూడన్' అనునది లేకున్నను "తండ్రితోఁ బుత్త్రుఁడు వచ్చెను" అని వాడుటయు కవిప్రసిద్ధము. కూడన్ - అర్వాచీనము. తుల్యార్థైరిత్యాదిసూత్రమువొప్పున వచ్చు తృతీయా షష్ఠులును గవిప్రయోగసిద్ధములగుటచే సర్వవిభక్తిరిత్యాది సూత్రముచొప్పునఁ దెల్గున రావచ్చునని యెఱుంగునది. అట్టియెడలఁ దుల్యాదిశబ్దములకు మాఱుగాఁ దెలుఁగున "సరి - సాటి - ఉద్ది" మున్నగునవి నిల్చునని యథర్వణుఁడు వివరించు చున్నాఁడు.

శబ్దా యేచేత్యాది:—ఆద్యాయామ్ - సంస్కృతభాషయందు, యేచశబ్దాః సముత్పన్నాః = సదృశ - తుల్యాదిశబ్దములు సహ-సాకం ప్రభృతిశబ్దములు ననునవి యేవిగలవో? అఖిలాఃతే = అవియెల్ల, సదనుగ్రహాత్ = సత్కవులయనుగ్రహమున, వైకృతైః శబ్దైః = 'సరిసాటి - ఉద్ది - కూడన్' మున్నగు నాచ్ఛికశబ్దములచేత కథితాః భవన్తి = చెప్పఁబడుచున్నవి. "ఆచార్యప్రయోగే కథం సరీత్యాది కేవల వికృతిపదం సంగచ్ఛత ఇతిచేన్నైష దోషః. వికృతిపదైస్సంస్కృతపదార్థాభిధానస్యాపి 'సర్వవిభక్తిస్సంస్కృతతుల్యేతి సూత్రస్వరసప్రాప్తత్వాత్" (అహో. ౨౭౦ పుట.)

కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడ
వర్ణకంబగు. ౫౧.

బాలవ్యాకరణ వివరణము ౨౪౦ I విష.

కరణంబునందు:—కోలతోడఁ గూలనేసె. సహార్థము నందు:—రాజు సేనలతోడ వచ్చె = సేనాసహితుండయి వచ్చె నని యర్థము. తుల్యార్థయోగంబునందు:—చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు. తృతీయ కనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు.

సంజీవని. ౨౪౦ I విష:—కరణశబ్దార్థ మీావఱకు ౨౩౯ విషయమున విశదీకరింపఁబడెను. కరణకారకమున వెనుక వ్రాసినరీతిని (౨౩౯ విష.) చే - చేతవర్ణములును ప్రకృతసూత్రముచే 'తో - తోడ' వర్ణకములును వచ్చును. సూత్రములోని తోడశబ్దము 'తో' అనుదానికిని నుపలక్షణము. ఉదా:—రాముఁడు వాలిని కోలచేతఁ గూలనేసెను. కోలచేఁ గూలనేసెను. కోలతోడఁ గూలనేసెను. కోలతోఁ గూలనేసెను. కూలనేయుసాధనములలోఁ గోల యనఁగా బాణము సాధకతమ మనఁగాఁ బ్రకృష్టసాధనము గాన నది కరణ మనిపించుకొనును. ఇట్లె సహార్థకశబ్దయోగమునందును, దుల్యార్థకశబ్దయోగమునందును 'తో - తోడ' వర్ణకంబులగును. ఉదా:—'రాజు సేనలతోడ వచ్చెను - సేనలతో వచ్చెను - సేనాసహితుఁడై వచ్చె నని యర్థము.' అని సూరియే యుదాహరించెను. అట్లె తుల్యార్థకయోగమున 'తోడ - తో' వర్ణకములే కాక కువర్ణకము నగును. చైత్రునితోడన్ - చైత్రునితోన్- చైత్రునకున్ - మైత్రుండు తుల్యుండు. తుల్యార్థకములు:—సీ. ప్రత్యనీక - ప్రతిపక్ష - సమాన - ప్రతిద్వంద్వి - నిభ - సజాతీయములును I ............ I సహలక్షణ - ప్రతిచ్ఛంద - విరోధి - సదృక్ష - సవర్ణ - సపక్షములును I............ (కావ్యాలం. ౫ ఉల్లా. ౧౫ ప.) ఇట్లె ఎదురు - ఎదుర్కొను - మార్కొను మున్నగునవియుఁ దుల్యార్థకములలోనివె.

ప్రయోగములు:—ఉ.........ఈ I బాహుబలంబుకోఁ గడఁగి పార్థుని దాఁకెడుబుద్ధి........(విరా. ౫ ఆ. ౨౧౭). ఇది హేతు తృతీయ. ఇంక సహార్థయోగతృతీయకు:—క. దేవసముఁలైన యనుజుల I తో విప్రులతో రథాలితో వచ్చి. (అర. ౨ ఆ. ౫ ప.) క. గీర్వాణప్రభుఁ డాదిగ I గీర్వాణగణంబు కాలకేయులతోడన్ I గర్వించి రణముసేసిరి........(అర. 3 ఆ. ౪౧.) తరల. దివిజముఖ్యులతోడ నేనును దివ్యబాణము లిచ్చితిన్. (అర. ౧ ఆ. 3౭౪.). క. విపరీతమతిని సుందుఁడు I నుపసుందుఁడు దాఁకి పొడిచి రొండొరుతోడన్. (ఆది.

ా ఆ. ౧౧౨.). ఆ-వె. బాలుఁ డొంటి యిట్లు పలువురతోఁడఁ బో। రంగ (ద్రోణ. ౨ ఆ. ౬౧.).

తుల్యార్థయోగతృతీయాషష్ఠులకు:—క. సురసిద్ధమునీంద్ర తప। శ్చరణలు నాతపముతోఁడ సరిగావంటిన్. (ఆది. 3 ఆ. ౨౧౬.)క....।...మునిగణప్రవరులభా। సురతపములు నాదగు దు।ష్కరఘోరతపంబు సరియుఁ గావమరేంద్రా (ఆది. 3 ఆ. ౨౧౦.). తపంబు+యొక్క+సరి = తపంబుసరి = తపమునకు సరియని యర్థము. "కువర్ణకంబును గొన్నియెడల సంబంధంబునందగు" (బా. కార. ౧౫ సూ.) ఇట్లు శేషషష్ఠిచోట "కు" వర్ణకంబు వచ్చుటయుఁ గలదు. క. సతు లీభార్గవికి భాగ్య సంపద నెనయే (ఆది. 3 ఆ. ౧౭౧ ప.) క.........దివ్యసభలెల్ల నరే। శ్వర చూచితి నవి దీనికి। సరిగా వత్యంశవిభవసౌందర్యమునన్. (సభా. ౧ ఆ ౬౦.) క. నీదుకులమునకుఁ దగఁగఁ బ। తోఁదము గొని. .......(ఆది. ౬ ఆ. ౫౬.) తగన్ = సదృశముగ. మాఱు - మాఱొక్కను - ఎదురొక్కను మున్నగునవియు సదృశార్థకములె:—మ... .....అ। య్యనినాతోఁడఁ జతుర్దశాబ్దమున మాఱై పోరు కర్ణాడి (సభా. ౨ ఆ. ౨౯౭.) శా. నాతోమాఱొక్కనలేరు (ఉ. హరి. అప్పం. 3 ఆ. 3౧౯.) వీనియోగమున కర్మకారకద్వితీయయునగు. క. నను మాఱొక్కని గెలువఁగ న। య్యనిమిషులకు (భీష్మ. ౧ ఆ. ౧౫౮ ప్రాసస్థలగతము) మ......... ఈ। తని దేవావళికైన మాఱొక్కనునె దుర్దాంతుండు భీష్ముండు పో। రిన యన్నా ళ్ళను. (ద్రోణ. ౧ ఆ. ౧3౦.) (ప్రాస) (విస్తర. I ). క. వీనికి మాఱొక్కనఁ జాలెదు। దానికి (విరా. ౧ ఆ. ౯.) చ... . ...పాండుపుత్త్రు నై। న్యమునకు

విస్తర. I ౨౮౦ I విష:—"కర్తృకర్మాదులందప్పు నెల్లయర్థముల నీతుల్యార్థ మందేగాక సామాన్యముగఁ దెలుఁగున 'కు' షష్ఠియె ప్రాచీనకావ్యములందును సహజమై చూపట్టెడి. (చూ. ప్రౌఢ. కా. ౧3 సూ) సంస్కృతవ్యాకరణకారక ప్రకరణము ననుసరించి కారకము విధించుటేగాని తెలుఁగున కవి యసహజ ములై........." (బా. సా. వే. కార. ౫ సూ. వ్యాఖ్య.) ఈవ్రాఁత కేవలము నపరిశీలనమూలకము. పయిరీతిని సంస్కృతవ్యాకరణోక్తకారకాదివిభక్తులు నన్నయ తిక్కనాదులగ్రంథములలో వేలకొలఁదిగఁ బ్రయుక్తము లగుచుండ నవి యసహ జము లెట్లగును ? "కు షష్ఠియే ప్రాచీనకావ్యములందు సహజమై చూపట్టెడి" అనుట యెట్లు పొసఁగును ?

మూర్ఛోనం దలఁచె (ద్రోణ. ౧ ఆ. ౯.) చ. కనియెదు సైంధవుం గడచి క్రందుగ నాకు నెదిర్చురాజులన్. (ద్రోణ. ౨ ఆ. ౩౧౨.) (విస్తర. II ).

---

విస్తర II. ౨౪౦ I విష:—త్రిలింగలక్షణశేషమున 'తోడ' వర్ణకవిషయమునఁ గొన్నివిశేషము లిట్లు సూత్రింపఁబడెను. "ఒకానొకచోఁ దోడకుఁ బ్రత్యేక ప్రయోగంబునుం జూపట్టెడి. తే-గీ. స్తంభగతరత్నపుత్రికతనదుబోఁటి।యని విలోకించి తోడ మాటాడకునికి। నలుగడలు చూచి తెలిసి యచ్చెలున బెదరి।.........
(తోడన్ = తనతోడ) (రామా. ౪ ఆ. ౧౫౮.) (ప్రౌఢ. కార. ౬. సూ.). చ....
హలాయుధప్రభృతియాదవలోకము తోడరా (ఉద్యో. ౧ ఆ. ౪౭ ప.) చ. పరువడి నగ్నిహోత్రములు బంధులు శిష్యులు తోడరా..........(ఆర. ౧ ఆ. ౧౧.)
సీ.........ఆ-వె. ఒడలితోడ నీకు నూర్ధ్వలోకమునకు। నరుగవచ్చు; నెప్పుడగుగు తలఁపు। దోఁచె నప్పు డిదియుఁ దోడిదయ్యె ప్రీతి। నగుగుదెంచు ననియెఁ గురువరేణ్య (అను. ౧ ఆ. ౮౦.) (తోడన్+అది = తోడన్+ఇ+అది = తోడిది)
(బాల. సమా. ౯. సంధి-౪౩-౪౫ సూ.)

"కొన్నియెడల 'ను' శబ్దప్రయోగంబునం దోడకు లోపంబును వ్యవహితత్వంబును బహుత్వంబునుం గానంబడియెడి. గీ...అతనికిఁ బరలోక।విధుల శాస్త్రదృష్టి వెలయఁజేసె। నాపగాసూనుఁ డఖిలబాంధవులయు। బ్రాహ్మణులయుఁ దోడ భానునిభుఁడు (ఆది. ౪ ఆ. ౨౧౬.) క. నెమ్మిని ధర్మజు నలువురు। తమ్ములుఁ దమవస్త్రములయుఁ దమశస్త్రవరూ। థమ్ములతోడను సకలమహీ। తమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్. (సభా. ౨ అ. ౨౬౧.) (ప్రౌఢ. కార. ౭ సూ.). (అనుబంధ)

---

అనుబంధ - విస్తర. II ౨౪౦ I విష:—"తమ యాయుధముల తమవర్మవరూ। థమ్ములయుఁ దోడ" అనుపాఠము వావిళ్ళవారిముద్రణమందును సూ-రానిఘంటునందును జూపట్టుచున్నది. వర్మవరూథశబ్దములు రెండును గవచవాచకములన్న తలంపునఁ బునరుక్తిలేకుండ 'వస్త్ర' శబ్దమును జొనిపి ప్రౌఢవ్యాకర్త సవరించె ననఁదగును. కాని వరూథశబ్దము రథపర్యాయము గలదు. "వరూథః - పుం - రథగుప్తౌ.........వరూథోరథగుప్తిర్యా। తిరోధత్తే రథస్థితమితి సజ్జనః........."
(శబ్దార్థచిం.) మ. నరనాగాశ్వవరూథయూథములతో (ఆది. ౪ ఆ. ౨౦౧.) వ భీష్ముండును దనరథంబు నివర్తింపించి.........నిలిచిన.........చ.........కురుసింహవరూథము నిట్లు క్రమ్మఱం। చునె యితఁ డంచు ........(ఆది. ౪ ఆ. ౨౦౭.)
అని భట్టారకుఁడె రథపర్యాయముగఁ బ్రయోగించెను గాన నిందుఁ బునరుక్తిలేమిం జేసి ప్రౌఢవ్యాకర్త సవరణము సరికాదని యెఱుంగునది.

వచ్యర్థాఽముఖ్యకర్మంబునకుఁ "దోడ - కు" వర్ణకం

బాలవ్యా. బులు ప్రాయికంబుగా నగు. ఉ.

౨౪౧ విషయము. మైత్రుండు చైత్రునితో నిట్లనియె. మైత్రుండు చైత్రున కిట్లనియె. ప్రాయికం బనుటచే నొకానొకచో ద్వితీయయు నగు.

సంజీవని. ౨౪౧ విష:—"దుహ్ - యాచ్ - పచ్ - దణ్డ్ - రుధి - ప్రచ్ఛి - చి - బ్రూ - శాసు - జి - మథ్ - ముషామ్ । కర్మయుక్ స్యా దకథితం । తథా స్యా న్నీ - హృ - కృష్ - వహామ్" (౨౩౫ విష.) అనుచెప్పిన బ్రూధాతు ప్రయోగమున, నకథితత్వప్రయుక్తకర్మంబును కర్తురీప్సితతమం కర్మేతి సూత్రసిద్ధ కర్మంబును (౨౩౫ విష.) వెలయుచుండును. "అర్థనిబన్ధనే యం సంజ్ఞా... ..... మాణవకం ధర్మం భాషతే - అభిధత్తే - వక్తీత్యాది" (సి. కౌ. ౫౩౯ సూ. వివృతి.) అను దీక్షితులవారి వివరణముచెప్పిన వచ్యాదులెల్ల ద్వికర్మకములె యగును. (మాణవకం ధర్మం భాషతే=అభిధత్తే - వక్తి = బాలకునిగూర్చి గురువు ధర్మమును భాషించుచున్నాఁడు. పల్కుచున్నాఁడు - వచించుచున్నాఁడు.). వానిలో 'కర్తృ

పైప్రయోగములలో రెండవదానినిబట్టి యొక్కచోట నుశబ్దమున్నను జాలునని విశదమగుచున్నది. "తోడ = తో.........ఇది కొన్ని ప్రయోగములందు సముచ్చయపూర్వకమై వ్యవహితముగాను కాన్పించుచున్నది." (సూ. రా. ని.). ఇట్లు ప్రౌఢవ్యాకర్తయుఁ దదనుసారి సూ. రా. నిఘంటుకర్తలును సముచ్చయ'ను'శబ్ద ముండవలయునని వచించిరేకాని 'ను'శబ్దము లేకయు నట్టిప్రయోగము గలదు. క.........అధి । కుల, హీనులతోడ నైనఁ గొఱగా దధిపా. (ఉద్యో. ౨ ఆ. ౪౬.) కంటెవర్ణకమునకును నిట్టి ప్రయోగము గలదు. ఉ. సూతసుతుండు వీఁడనక సూనుల తమ్ములకంటె నాకు సం । ప్రీతి యొనర్చి. (ఉద్యో. ౪ ఆ. ౩౯.)

"ఒకానొకచోఁ దోడకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు. అయినను దానికివలె దీనికి నితరకార్యంబు గలుగదు. ఉ. చ. పగతురచేతిలోఁబడక ప్రాణము తోడుత నున్నవాఁడవే" (భాగ. ౧౦ స్కం. పూ.) (ప్రౌఢ. కార. ౮ సూ.). ఇతర కార్యంబు = ప్రత్యేకప్రయోగాదికము. తిక్కనయు ప్రయోగించియున్నాఁడు. సీ. త్రాసులుంబోని చిత్తంబులతోడుతఁ, బ్రజవివాదములెడఁ బక్షముడిగి (శాంతి. ౨ ఆ. ౩౭౪.) గీ. ఓర్చి యడఁకువతోడుత నునికి యరిది (విరా. ౧ ఆ. ౧౧౮.) (సూ. రా. ని.) ('తోడన' వావిళ్ళవారిముద్రణము.). ఉ.........బొ । ద్ధత్యము తోడుతన్ సమరధర్మము.........(జై. భా. ౧ ఆ. ౫౬. సూ. రా. ని.)

రీప్సితతమం కర్మే'తి సూత్రసిద్ధకర్మము ముఖ్యకర్మము. అకథితత్వమున సిద్ధించుకర్మ మముఖ్యకర్మము. దీనిని గౌణకర్మమనియు వ్యవహరింతురు. సంస్కృతమున నీద్వివిధ కర్మంబులకును బ్రాయికముగా ద్వితీయయే వచ్చును. తృతీయ రానేరదు. షష్ఠి యరుదుగా నగును. "కింకర్మః, కస్యవాబ్రూముః ఇత్యాదిశిష్టప్రయోగదర్శనాత్" (ముగ్ధ. ౩౦౨ సూ. వ్యాఖ్య. దుర్గా.) తెల్గునం దన్ననో ముఖ్యకర్మకు ద్వితీయయే వచ్చును. గౌణకర్మంబునకు 'తోడ కు' వర్ణకంబులు పర్యాయంబుగ నగును. ద్వితీయయు నరుదుగ నిల్చును. ఈవిషయమునే సూరిగారు "ప్రాయికంబనుటచే" నిత్యాదివాక్యముతో వివరించిరి. ప్రయోగములు. సీ. ఓడకుమని నన్ను నూఱడఁ బలికిన (అర. ౨ ఆ. ౮౨ ప.) ఉ.........అప్పుడే। మంటి నృపేంద్ర నన్నని రణాగ్రమున న్నిను మూదలించెదన్. (ఉద్యో. 3 ఆ ౫౯.) ద్విపద. చేయుదు నన్నింత చెప్పంగనేల (బసవ. ౧ ఆ. ౨౭౭.) మ.........గోవింద ని। న్ననుమా నింపక యాడుచున్న తెఱఁగే మారాజు వాక్యంబుగా (హరి. ఉ. భా. ౧ ఆ. ౭.) ఉ.........ఉసురోర్వఁజాఁడీ యను నింతిబోఁటులన్. (హరి. ఉ. భా. 3 ఆ. ౪౪.) ఇట్లు వచ్యర్థకప్రయోగమున ద్వికర్మకత్వము కవిప్రయోగసిద్ధము. కూర్చి - గుఱిచి- గుఱించిశబ్దము లనుప్రయుక్తములగునపుడును వచ్యర్థకముల ద్వికర్మకప్రయోగము ౨౩౫ విషయమున నుదాహరింపఁబడెను. 'తోడ-కు' వర్ణకములకుఁ బ్రయోగములు. క. రురునకు నిట్లనియె మునివరుం డనురక్తిన్. (ఆది. ౧ ఆ. ౧౫౬.) ఉ.........ఎమ్మెయి గెల్చితి నాకుఁ జెప్పుమా? (విరా. ౫ ఆ. ౨౮౨) క...... ఇ। ట్లను నత్యాదరము మెఱయ నాతనితోడన్. (విరా. ౫ ఆ. ౨౭౪.) ఉ...... ఇట్లను నర్వజనంబుతోఁ దగన్. (విరా. ౫ ఆ. ౨౬౫.) క.........కుంతీ। తన యాగ్రజుఁ డిట్టు లనియె.........న। జ్జననాయకుతోడ.........(విరా. ౫ ఆ. ౨౫౬.) (విస్తర.)

---

విస్తర. ౨౪౧ విష:—పయిరీతి నముఖ్యకర్మంబునకు మూఁడువిభక్తులు వచ్చిన ప్రయోగములు వెలయుచుండఁగా నీక్రిందిరీతి నపరిశీలితముగాఁ జేటికా వ్యాఖ్యాత వ్రాయుట సరికాదు "చైత్రునితోడ నిట్లనియె. చైత్రున కిట్లనియె. అని రూపద్వయము గలుగును. ద్వితీయయైనఁ జైత్రు నిట్లనియె నని రూప మేర్పడును. తోడవర్ణకయోగమే యాంధ్రభాషాసహజముగఁ దోఁచెడి" (బా. సా. పే. కార. ౬ సూ. వ్యా.) ఈవ్యాఖ్యలోనె "అనియె - అనుదానికి మాటలాడెననియు నర్థము కాన నిది సామాన్యముగా నంతర్గతకర్మార్థకమయ్యెడి" అనుట వింత. అకర్మకముగాఁ బ్రయోగింపఁబడునని తలంచెనేమో!

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (ఆం. చిం. హ. ౧౫
నన్నయా కా. అహో. ౮౨3 పు.
౨౮౨ విషయము. ఆఖ్యాతోపయోగే (౧-౪-౨౯.) నియమపూర్వక విద్యాస్వీకారే వక్తా ప్రాక్ సంజ్ఞః స్యాత్. ఉపాధ్యా యా దధీతే. (సి. కౌ. ౫౯౨ సూ.)

కల్పతరువు. ౨౮౨ విష:—సర్వవిభక్తిరిత్యాదికారిక ౨3౮ విషయమున వ్యాఖ్యాతము. పాణినీయసూత్రాదికమును మూలముగాఁ గొనుట కిదియె మూలము. ఆఖ్యాతేత్యాది:—నియమపూర్వకవిద్యాస్వీకారే = నియమముతో శిష్యుఁడు విద్యనుగ్రహించునపుడు, వక్తా = ఆఖ్యాత యనఁగా గురువు, ఉక్త సంజ్ఞః స్యాత్ = అపాదానసంజ్ఞకలవాఁడగును. అట్టి యపాదానత్వమునఁ బంచమీవిభక్తి (అపాదానే పంచమీ) వచ్చును, ఉపాధ్యాయా దధీతే = ఉపాధ్యాయుని వలననుండి యధ్యయనముచేయుచున్నాఁడు. "ఉపాధ్యాయా దధీతఇతి:—నియమ విశేషపూర్వకం ఉపాధ్యాయస్యోచ్చారణ మనూచ్చారయతీత్యర్థః" (సి. కౌ. బాల మనోరమావ్యాఖ్య.) ఉపాధ్యాయుఁ డుచ్చరించినతోడనే దాని యనూచ్చారణము చేయుచున్నాఁడని యర్థము. సీ.........భూసురవరుల వలన। వేదంబులును ధనుర్వేదాదివిద్యలు, గఱచుచు.........(ఆది. 3 ఆ. ౧౨ ప.) ఇట్లిచట సంస్కృత పద్ధతి ననుసరించి పంచమి ప్రయోగింపఁబడినను దెలుఁగున 'తోడ' వర్ణక మిట్టి యెడలఁ దఱచుగాఁ బ్రయోగింపఁబడుచుండును.

ఉపయోగమునం దాఖ్యాతకుం దోడవర్ణకంబగు. 2.
బాలవ్యా. నియమపూర్వకవిద్యాస్వీకారం బుపయోగం బనం
౨౮౨ I విషయము. బడు. రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జది విరి. సాందీపనివలన నని యర్థము.

సంజీవని. ౨౮౨ I విష:—శాస్త్రోక్తములగు నియమములతో నుపాధ్యాయునియొద్దనుండి శిష్యుఁడు విద్యాగ్రహణముచేయునపుడుపాధ్యాయున కపాదాన సంజ్ఞగలుగుననియు నక్కారణమునఁ దద్వాచకము పంచమ్యంత మగుననియు సంస్కృతమునఁ జెప్పఁబడెను. ఉపయోగమనఁగా నియమపూర్వకవిద్యాస్వీకారము. ఆఖ్యాత యనఁగా వక్త = ఉపాధ్యాయుఁడు. ఇచటిది యాఖ్యాత[illegible]బము.

పయిరీతిని బంచమి సంస్కృతవ్యాకరణముచొప్పున రావల[illegible]యుండుటంజేసి యట్టి పంచమిని భట్టారకుఁ డొకచోఁ బ్రయోగించెను. సీ.........భూసురవరుల వలన। వేదంబులును ధనుర్వేదాదివిద్యలు గఱచుచు (ఆది. 3 ఆ. ౧౨). ఇట్లు

ప్రయోగించినను నిట్టియెడల గురునితోడి యనూచ్చారణమున కనుకూలముగ 'తోడ'వర్ణకప్రయోగము రుచించుటంచేసి భట్టారకుఁడును దర్వాతివారును నట్టిప్రయోగమును దఱచుగాఁ జేసిరి. అదిచూచి సూరి భట్టారకుని పంచమీప్రయోగమును జూచికొనక తోడవర్ణకవిధానమును మాత్రమె నిత్యముగ సూత్రించెను. (విస్తర. I).

'రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులం జదివిరి'అని సూరి యుదాహరించెను. సందీపనపుత్త్రుఁడైన మునివలననుండి బలరామకృష్ణులు విద్యాగ్రహణమును జేసిరని యర్థము. (విస్తర. II) వలన వర్ణకప్రయోగ ముదాహృతమయ్యెను. తోడ - తోవర్ణకములకు:—సీ. సాంగంబులగుచుండ సకలవేదంబులు, సదివె వసిష్ఠుతో.........(ఆది. ౮ ఆ. ౧౬౯.) తే-గీ. చ్యవనసుతుఁడైన ప్రమతితోఁ జదివె సకల। వేదవేదాంగములు ........(ఆది. ౨ ఆ. ౧౬౩.) సీ.......... ద్రోణుండు.........ధనుర్వేద మగ్నివేశులతోడ నర్థిఁ గఱచి। (ఆది. ౭ ఆ. ౫౯.) సీ. చిత్రసేనుడ గంధర్వపతితోడ గారవమున (ఆ-వె.) వజ్రధరుఁడు గీతవాద్య నృత్యంబులు గఱవఁబంచెఁ బార్థు. (అర. ౧ ఆ. ౩౬౯.). వ అభిమన్యుండు. మత్తకోకిల.........ధౌమ్యుతో। వేదముంగయుతంబుగాఁ జదివెన్ ధనంజయుతో ధను। ర్వేద మిమ్ముగ నభ్యసించె (ఆది. ౬ ఆ. ౨౩౬-౨౨౭.). క. విలువిద్య గఱచుచుండిరి। బలయుతులు కుమారకులు కృపద్రోణాచా। ర్యులతోడ (ఆది.

---

విస్తర. I ౨౮౨ I విష:—"తోడ = తో.........నియమపూర్వక విద్యాస్వీకారమున గురువాచకశబ్దముల కనుప్రయుక్తము" (సూ. రా. ని.) ఇది సరికాదు, విభక్తిప్రత్యయముల ననుప్రయుక్తములనుట సంప్రదాయవిరుద్ధము.

విస్తర. II ౨౮౨ I విష:—బాలవ్యాకరణపుస్తకములు పెక్కిటియందు 'సాందీపునితోడ - సాందీపునివలన' అనియె యున్నది. బాలవ్యాకరణప్రథమ ద్వితీయముద్రణములందును నట్లె యున్నది. గుప్తార్థప్రకాశికాపేటికావ్యాఖ్యాతలును నట్టియపపాఠమునె యనుసరించిరి. "ఇచ్చో సాందీపుఁడు........సాందీపునితోడ ననఁగా సాందీపునివలన నని యర్థము." (బా. గు. ప్ర. ౨౧౨ పుట. ద్వి. ము. ౧౮౭ పు. ప్ర. ము.)"సాందీపునిం జెప్పు సాందీపశబ్దమునకు........సాందీపునితోఁ గలసి" (బా. సా. పే. ౨౭౩ పు.) ఇది కేవలము ప్రామాదికము. "సాందీపని - పు. సందీపనస్యాపత్యమ్. ఇఞ్. రామకృష్ణయో రాచార్యే" (శబ్దస్తో) "సాందీపనిః - పుం - మునివిశేషే.........అవంతి పురవాసిని రామకృష్ణయోర్గురౌ. సందీపనస్యాపత్యమ్, అతఇఞ్" (శబ్దా. చిం.)

౫ ఆ. ౧౮౧ ప.) క. కడఁక విలువిద్య శివుతో । నెడపక కావించునప్పు డీసున... ......(భాస్కర. రా. బాల. ౭౩౮ ప.) ద్విపద. కరమొప్ప విలువిద్యఁ గడిమిమై నేను । హరునితోఁ దొల్లి యభ్యాసంబు సేయ । (రంగ. రా. ౮౮ పు. యూ. ము.) (విస్తర. III )

సర్వవిభక్తిః సంస్కృతతుల్యా. (ఆం. చిం. హలం.
౧౫ కా. అహో. ౮౨౩ పు)
కర్తృకర్మణోః కృతి (౨ ౩ ౬౫) కృద్యోగే కర్తరి
కర్మణిచ షష్ఠీస్యాత్. (సి. కౌ. ౬౨౩ సూ.)
కష్ణస్యకృతిః. జగతః కర్తా కృష్ణః.
నన్నయా ౨౮౩ విషయము.
కృత్యానాం కర్తరివా. (౨-౩-౭౧.) మయా మమవా
సేవ్యో హరిః. (సి. కౌ. ౬౨౯ సూ.)
ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్. ప్రకృత్యా చారుః
(సి. కౌ. ౧౮౬౬ వా. ౫౬౧ సూ.)
సహవారణ సమోనార్థార్థవినా పృథఙ్నానాద్యైః
(ముగ్ధ. ౨౮౯ సూ.)

కల్పతరువు. ౨౮౩ విష:—సర్వవిభక్తిరిత్యాదిసూత్రము ౨౩౮ విషయమున వ్యాఖ్యాతము. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము.

సంస్కృతవ్యాకరణప్రసిద్ధములగు విషయములు సూరి సంగ్రహింపనివి పెక్కుగలవు.

---

విస్తర. III ౨౮౨ I విష:—పయిరీతినున్న మహాకవిప్రయోగముల నరయని కతంబునఁ జేటికావ్యాఖ్యాత యీక్రిందిరీతిని మిక్కిలి పొరపాటుగ వ్రాసెను. "ఇట్టిచోటుల గ్రహణార్థమున నాఖ్యాతకు 'వలన' వర్ణకముగలుగుటయే తెలుఁగు వాడుకకు సహజము. కాని తోడవర్ణకము సహజముగాదు........సంస్కృతము నందును సంస్కృతలక్షణానుసారులగు లాక్షణికప్రయోగములందును దప్ప...... తెలుఁగు వాడుకకు విరుద్ధవిషయ మిది యన సందియములేదు" (బా. సా. వే. కార. ౭ సూ. వ్యాఖ్య.) ఏమివింత! "సంస్కృతమునందును సంస్కృతలక్షణానుసారులగు లాక్షణికకవులప్రయోగములందును దప్ప" అనుటనుబట్టి చూడఁగా నీవ్యాఖ్యాత "అఖ్యాతోపయోగే" అనుసూత్రమును స్మరించినట్లు కన్పట్టదు.

"కర్తృకర్మణోః కృతి. (౨-3-౬౫.) కృద్యోగే కర్తరి కర్మణిచ షష్ఠీస్యాత్." (సి. కౌ. ౬౨3 సూ.) కృత్ప్రత్యయాంతముతోడి యోగమునఁ గర్త్రర్థమందును గర్మార్థమందును షష్ఠివచ్చును. కృష్ణస్య కృతిః = కృష్ణునియొక్క కృతి. కృతిశబ్దము భావార్థక క్తిన్ ప్రత్యయాంతము. కృతి కృష్ణకర్తృకమగుటచే రావలసిన తృతీయ రాలేదు. జగతః కర్తా కృష్ణః = కృష్ణుఁడు జగమునకుఁ గర్త. ఇటఁ గర్మార్థమున ద్వితీయ రాలేదు. "కృత్యానాం కర్తరి వా (౨-3-౭౧) మయామమవా సేవ్యో హరిః" (సి. కౌ. ౬౨౯ సూ.) కృత్యప్రత్యయయోగమున షష్ఠి వైకల్పికముగ నగును. "తవ్య - అనీయ - య" మున్నగునవి కృత్యప్రత్యయములు. హరి నాచేత సేవ్యుఁడు - నాకు సేవ్యుఁడు. క. లోకోత్తరచరితుండగు। నాకావ్యతనూజ నీకు నారాధ్యను. (ఆది. 3 ఆ. ౧3౫.) "ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్. ప్రకృత్యా చారుః" (సి. కౌ. ౧౪౬౬ వార్తి ౫౬౧ సూ ) ప్రకృత్యాదిశబ్దములకుఁ బరముగాఁ దృతీయ నిల్చును. ప్రకృతిచేత సుందరుఁడు = స్వభావముచేతనే సుందరుఁడని యర్థము. "సహవారణసమోఽనార్థార్థ వినా పృథఙ్నానాద్యైః." (ముగ్ధ. ౨౭౯ సూ.) సహార్థకములతోను వారణార్థకముతోను, తుల్యార్థకములతోను, 'ఊనార్థక' ములతోను ప్రయోజనార్థకములతోను వినాశబ్దముతోను బృథక్ శబ్దముతోను నానాదిశబ్దములతోను యోగము గల్గునపుడు తృతీయవచ్చును. సహార్థములు తుల్యార్థములును నీవలఁ గుదాహరింపఁబడెను. (౨౪౦ విష.) నానాదులకుఁ దెల్గునఁ బ్రయోగము లేదు. అట్టి యర్థముగల యాచ్ఛికశబ్దముల యోగమునఁ దృతీయవచ్చును. క. తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వేఱగునే. (ఉద్యో. 3 ఆ ౧౬3.) మొ.

సయితము - సైతము - మున్నగుశబ్దములతోడి యోగమునఁ దృతీయయుఁ బ్రథమాద్వితీయలును వచ్చుననెడి "సహితాదిపదానాం స్యా" దిత్యాద్యథర్వణ కారిక యీవలనె వివరింపఁబడెను. ఉదా:—దానితో సైతము - దానితో సయితము - దానితో సహితము. దానిని సయితము. మొ. (౨3 3 III విషయము.)

ఈవిషయములను బాలవ్యాకర్త్రప్రభృతులు సంగ్రహింపలేదు.

సర్వావిభక్తి స్సంస్కృతుల్యా. (ఆం. చం. హాలం. ౧౫ కారి. అహో. ౪౨3 పుట )

కర్మణా య మభిప్రైతి స సంప్రదానమ్. (౧-౪-3౨)

దానస్య కర్మణా య మభిప్రైతి స సంప్రదాన సంజ్ఞ స్స్యాత్. (సి. కౌ. ౫౬౯ సూ.)

చతుర్థీసంప్రదానే. (౨-3-౧3) విప్రాయ గాం దదాతి.
అనభిహిత ఇత్యేవ. దీయతేఽస్మై దానీయో విప్రః.

నన్నయా ధర్వణీయము.

క్రియయా య మభిప్రైతి సోఽపి సంప్రదానమ్.
(వా. ౧౦౮౫.) పత్యే శేతే. (సి. కౌ. ౫౭౦ సూ.)

౨౪౪ విషయము.

తాదర్థ్యే చతుర్థీవాచ్యా. (౧౪౫౭ వా. ౫౮౦ సూ.)
ముక్తయే హరిం భజతి.

క్రియార్థోపపదస్య కర్మణి స్థానినః. (౨-3-౧౪) క్రియార్థా క్రియా ఉపపదం యస్య తస్య స్థానినోఽప్రయుజ్యమానస్య తుమునః కర్మణి చతుర్థీస్యాత్. ఫలేభ్యో యాతి - ఫలాన్యాహర్తుం యాతీత్యర్థః........
(సి. కౌ. ౫౮౧ సూ.)

కల్పతరువు. ౨౪౪ విష:—సర్వవిభక్తి రిత్యాదిసూత్రము ౨3౪ విషయమున వ్యాఖ్యాతము. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము.

దానస్య కర్మణా = దానముయొక్క కర్మపదార్థముచేత, యమభిప్రైతి = భోక్తృత్వమున నెవ్వని నుద్దేశించుచున్నాఁడో యతఁడు సంప్రదానసంజ్ఞ నొందుచున్నాఁడు. సంప్రదానే=అనభిహితసంప్రదానమున, చతుర్థీస్యాత్ = చతుర్థీవిభక్తి యగును. విప్రాయ = విప్రునికొఱకు, గామ్ = గోవును, దదాతి = ఇచ్చుచున్నాఁడు. విప్రు నుద్దేశించి గోవు నిచ్చుచున్నాఁడని యర్థము. అనభిహిత ఇత్యేవ = అనభిహితత్వముండే చతుర్థివచ్చును. దానీయః విప్రః = గోవు నీఁదగువాఁడు విప్రుఁడు -వీనికొఱ కియ్యఁబడు ననునర్థమున 'అనీయ' అనుప్రత్యయము సంప్రదానార్థమున వచ్చినది. కావున నిట 'అనీయ' ప్రత్యయముచే సంప్రదానము చెప్పఁబడుచుండుటంజేసి "ఉక్తార్థానా మప్రయోగః" అనుచొప్పున సంప్రదాన చతుర్థి రాదయ్యెనుగానఁ బ్రాతిపదికార్థప్రథమయే వచ్చినది. అకర్మకక్రియలయందు గర్మచే న ద్దేశించుట సంభవింపదుగాన నట్టియెడల "క్రియయా = క్రియచేత, యమభిప్రైతి = ఎవ్వని నుద్దేశించునో, సోఽపి = వాఁడును, సంప్రదానసంజ్ఞఃస్యాత్ = సంప్రదాన సంజ్ఞికుండగును." అనువార్తిక మారంభింపఁబడెను. ఉదా:—పత్యే = పతికొఱకు, శేతే=శయనించుచున్నది. పతి నుద్దేశించి శయనించుచున్నదని యర్థము.

తాదర్థ్యఇత్యాది:—తస్మైకార్యాయ ఇదం తదర్థమ్. తస్య భావః = తాదర్థ్యమ్. తాదర్థ్యే = తదర్థత్వమున, ఉపకార్యవాచిపయి చతుర్థీవాచ్యా = చతుర్థి

వచ్చునని వచింపఁదగును. తాదర్థ్యము = ఉపకార్యోపకారకభావరూపమగు సంబంధము. ఇది పెక్కువిధములు. కార్యకారణభావము ప్రకృతివికృతిభావము మొదలగునవి 'ముక్తయే హరిం భజతి = ముక్తికొఱకు హరిని భజించుచున్నాఁడు' అనునపుడు ముక్తికార్యము. హరిభజనము కారణము. ఈతాదర్థ్య చతుర్థిచేతనే సంప్రదానచతుర్థియు సిద్ధించుచున్నది. 'విప్రాయగాం దదాతి' అనునపుడును, విప్రుఁ డుపకార్యుఁడు-గోవుపకారకము. ఇట్లగుటచేత సంప్రదానసంజ్ఞాకరణమును, నందుఁ జతుర్థివచ్చు ననుటయు నేల యని శంకింపరాదు. రుచ్యర్థానాం ప్రీయమాణ ఇత్యాదులందు దానికి సార్థక్యముగలదని యెఱుంగునది. "నచైవ మపి అన్యైవ సిద్ధే చతుర్థీసంప్రదానే ఇతిసూత్రం సంప్రదానసంజ్ఞావిధానంచ వ్యర్థమితివాచ్యమ్. హరయే రోచతే భక్తిః-ఇత్యాదౌ 'రుచ్యర్థానాం ప్రీయమాణః' ఇత్యాద్యర్థం తదావశ్యకత్వాదితిభాష్యే స్పష్టమ్" (బాలమ. వ్యా. ౫౭౦ సూ. వ్యాఖ్య.) రుచ్యర్థానాం ప్రీయమాణ ఇత్యాదులందలి సంప్రదానత్వము మున్ముందు వివరింపఁబడును. (౨౮౬ విష.).

క్రియార్థేత్యాదిః—క్రియార్థోపపదస్య=క్రియయర్థముగాఁ గలది క్రియయె. క్రియ యుపపదమగుట యసంభవముగానఁ గ్రియావాచక ముపపదముగాఁగల, స్థానినః = అప్రయుజ్యమానమగు (దీని కీయర్థము వైయాకరణసంప్రదాయసిద్ధము.) తుమున్నంతముయొక్క, కర్మణి=కర్మమును బోధించెడి ప్రాతిపదికముకంటెఁబరముగా, చతుర్థీస్యాత్ = చతుర్థివిభక్తి యగును. ఉదా:—ఫలేభ్యోయాతి = పండ్లకొఱకు వెళ్ళుచున్నాఁడు = ఫలాన్యాహర్తుం యాతీత్యర్థః = పండ్లు తెచ్చుటకొఱకు వెళ్ళుచున్నాఁడని యర్థము. ఇందు 'యాతి' అనునది ఉపపదము. ఇట్టి యుపపదముగల ప్రయోగింపఁబడని "ఆహర్తుమ్" అను తుమున్నంతమునకుఁ గర్మ ఫలములు. కావున ఫలశబ్దము చతుర్థ్యంతమయ్యెను.

సంప్రదానంబునకుం జతుర్థియగు. ౮.

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు. జనకుండు రామునికొఱకుఁ గన్య నిచ్చెను. కొన్ని యెడల నుద్దేశ్య మాత్రంబునకగు. పురుషార్థముకొఱకు యత్నింపవలయు. చతుర్థికి మాఱుగా షష్ఠియే తఱుచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి. జనకుండు రామునకుం గన్య నిచ్చెను. పురుషార్థంబునకు యత్నింపవలయు.

బాలవ్యా. ౨౮౮ I విష.

సంజీవని. ౨౪౪ I విష:—త్యాగోద్దేశ్యము సంప్రదానమనఁగా దేయద్రవ్యోద్దేశ్యము సంప్రదానమని యర్థము. జనకుఁడు రాము నుద్దేశించి కన్య నిచ్చెను గాన రామశబ్దమునకుఁ జతుర్థి వచ్చినది. ఉద్దేశ్యవాచకమాత్రమునకె చతుర్థి యగుననుపక్షము నాశ్రయించునపు డింక "క్రియార్థోపపదస్యేత్యాది" సూత్రలక్ష్యములు సైతము దీనిచే సిద్ధించు ననఁదగును. ఫలేభ్యోయాతి = ఫలముల నుద్దేశించి యనఁగా ఫలములను దెచ్చుట నుద్దేశించి వెళ్ళుచున్నాఁడని సమన్వయింప నగును. తాదర్థ్యార్థకచతుర్థీలక్ష్యమగు "ముక్తయే హరిం భజతి" అనుచోట సైతము ముక్తి నుద్దేశించి హరిని భజించుచున్నాఁడని సమర్థింపవచ్చును. (విస్తర. I ). ఆంధ్రశబ్దచింతామణియందుఁ జతుర్థికి "కయి-కొఱకు" అనునవి ప్రత్యయములుగఁ జెప్పఁబడినను నారెండిటికిని 'కు' ప్రత్యయమె (కున్+అయి = కయి - కొఱ+కున్ = కొఱకున్) మూలమగుటచేతను జతుర్థిచోట షష్ఠిని బ్రయోగించు నలవాటు విస్తరించుటచేతను (విస్తర. II ) జతుర్థ్యర్థమున "కు" ప్రత్యయమూలమునఁ గల్పించిన "కయి - కొఱకు"లె కాక "అర్థము - తదర్థము - పొంటెన్" అనునవియు సమర్థ

---

విస్తర. I ౨౪౪ I విష:—"అర్థా చ్చతుర్థీ విధానే నైవేష్టసిద్ధా తాదర్థ్యఇతి శబ్దార్థయో ర్గౌరవం జ్ఞాపయతి. అర్థశబ్దస్యాత్ర ప్రయోజనం నివృత్తిశ్చేతి ద్వావర్థా గ్రాహ్యౌ. తథాచ 'అర్థోభిధేయే రై వస్తు ప్రయోజన నివృత్తిషు' ఇత్యమరః........జ్ఞానాయపఠతి = పాఠస్య జ్ఞానం ప్రయోజన మిత్యర్థః, మశకాయ ధూమః = మశకస్య నివృత్తయే ఇత్యర్థః." (ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. ౨౯౪ సూ.) ఇట్టియెడల సైతము "జ్ఞానము నుద్దేశించి పఠించుచున్నాఁడు. మశకముల నుద్దేశించి యనఁగా మశకబాధానివృత్తి నుద్దేశించి పొగవేయుచున్నాఁడు." అనురీతి నుద్దేశార్థకప్రయోగముచే నర్థసిద్ధిని సంగ్రహింపనగును. "గత్యర్థకర్మణి ద్వితీయాచతుర్థ్యౌ చేష్టాయా మనధ్వని (౨-౩-౧౨)......గ్రామం గ్రామాయవాగచ్ఛతి" (సి. కౌ. ౫౦౫ సూ.) గమనార్థధాతువుల కర్మమునందు, ద్వితీయాచతుర్థులగును. గ్రామమునుగూర్చి (లేదా) గ్రామముకొఱకు వెళ్ళుచున్నాఁడని యర్థము. ఇట్టిచోటులందు సైతము గ్రామము నుద్దేశించి వెళ్ళుచున్నాఁడని యుద్దేశార్థకచతుర్థిని సమర్థింపనగును. ఉద్దేశార్థమున ద్వితీయవచ్చుననియు నద్దానిపయి 'గూర్చి - గుఱిచి-గుఱించి' అనునవి యనుప్రయుక్తములగుననియు నీవఱకు వచించియున్నాను. (౨౩౫ విష.)

విస్తర. II ౨౪౪ I విష:—సంస్కృతమునందే చతుర్థిచోట షష్ఠీప్రయోగ మారబ్ధమయ్యెను. "ఏవం శిష్ట ప్రయోగానుసారా దన్యత్రాపి - యథా - మాసా

ములై యుండుటచేతను భట్టారకుఁ డట్టివానినె ప్రయోగించుచువచ్చెను. కొఱ కును, యొక్కను వలెనె ప్రయోగింపలేదు. కయి విభక్తిని ప్రయోగించియున్నాఁడు. తర్వాతి తిక్కన "కొఱకును" ధారాళముగాఁ బ్రయోగించెను. అట్లని భట్టారకుని నాఁటికి 'కొఱకు' అనుదానికి మూలమగు 'కొఱ' శబ్దము లేకపోలేదు. క......... నీకున్ । మడవక మాయట్టివారి మాటలు కొఱయే (సభా. ౨ ఆ. ౧౯౦.)

ప్రయోగములు:—ఆ వె.........మీకు సకలవృద్ధ । రాజులొద్ద నర్థ రాజ్యమిచ్చితి (ఆది. ౧ ఆ. ౬౬) మ.........గాండీవమున్ చాపర । త్నము నిచ్చెన్ వరుణుండు పార్థునకు నుద్యద్విక్రమోద్భాసికిన్. (ఆది. ౧ ఆ. ౨౫౩.) మత్తకోకిల:—నీతదర్థమ కాఁగ దేవవినిర్మితంబిది.........(ఆది. ౨ ఆ. ౨౦౧.) సీ. నీతదర్థంబులై నిఖిలవేదంబులు వర్తిల్లు. (సభా. ౧ ఆ. ౨౯.) తే-గీ. నాతదర్థ । మాచరింపుము బ్రహ్మహత్యావ్రతంబు (ఆరణ్య. 3 ఆ. ౨౭౫.) గీ. ఏను గుర్వర్థ మర్థినై మానవేశ । కడఁగి వచ్చితి. (ఆది. ౧ ఆ. ౯౫.) ఆ-వె. సురహితంబు పొంటె (ఆది. ౧ ఆ. ౯౬.) ఆ-వె. కార్యసిద్ధి పొంటె (ఆర. 3 ఆ. 3౪౧.) సీ. చైద్యునకై పూని సన్నద్ధులై యున్న. (సభా. ౨ ఆ. 3౧.) గీ. అనఘ మా మామ శకుని నాకై కడంగి । జూదమాడెడి. (సభా. ౨ ఆ. ౧౭౪ యతిస్థానము.) క.........ఎఱిఁగిం । చితి నీపరిపాటి కర్మశీలత కొఱకున్. (శాంతి. ౪ ఆ. ౯౧.) క......స । మ్మానిత శాంతికొఱకు వి । జ్ఞానంబున (శాంతి. ౫ ఆ. ౯౦.) క.........త్రి । భువనములం బరమహితము పొంటెం గరుణన్. (అను. ౫ ఆ. ౨౭౨.) (విస్తర. II.) ఇట్టిచోటులం దెల్ల "కు" వర్ణకమును నిల్పినను సహజముగనె యుండును. కావుననె సూరి "చతు

నా మశ్నీయా దితిభాష్యమ్. నచోపలేభే వణిజాం పణాయామిత్యాభట్టిః. సాలక్ష్మ్యు రుప కురుతేయయా పరేషా మితికిరాతే. నారాయణ స్యానుకరోతి. గురువిప్రతపస్విదుర్గ తానాం । ప్రతికుర్వీత భిషక్ స్వభేషజైః. శ్రుతసోమ్యోపకరోతియః. కింకుర్మః కస్య వాబ్రూమో నాస్తీహాభూతలే ఇత్యాది దర్శనాత్. (దుర్గా. వ్యాఖ్య.) "నచ స్ని హ్యతి కస్యచిదితిభట్టిః. సాలక్ష్మీ రుపకురుతే యయా పరేషామితిభారవిః........." (శ్రీరామతర్కవాగీశవాఖ్య. ముగ్ధ. 3౦౨ సూ.) చతుర్థ్యా అపిషష్ఠీ స్యాత్ (షడ్భా. ౪ పుట.) అనియిట్లు ప్రాకృతమున షష్ఠియే ప్రయోగింపఁబడును.

విస్తర. III ౨౪౪ 1 విష:—"కై కొఱకులను నన్నయ వాడలేదనియు నాతని కాలపు శాసనములందయినను నవి కానరావనియు నింతకుముందు తెలుపఁ బడినది." (ఆం. భా. చ. ౧౬౨౯ పు.) "కొఱకు - కై (అనునవి) చతుర్థికగును... ......వీనిలో కొఱకును నన్నయ వాడలేదు. అతనికాలపు శాసనములందును నవి

ర్థికిమాఱుగ షష్ఠియే తఱుచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి" అని వివరించి యుదాహరించెను. కు షష్ఠికిఁగల ప్రయోగప్రాచుర్యము ముందు విపులముగ నుదాహరింపఁబడును. (౨౪౫ II. III విష.) గీ. వలసినప్పుకు చేత కై వలన యొక్క। యందు ననునవి యగుఁ దృతీయాదులందు । ......... క. కమియంగ నికి నకులు త। త్సమములఁ బోఁ ద్రోచి నిలుచు షష్ఠి చతుర్థిన్...... (ఆం. భూ. ౪౬ పద్య.)

---

కానరాదు. 'కై' అనుదాని కొకటి రెండు ప్రయోగము లున్నను వానిని 'కు+అయి' అని ఛేదము చేయవచ్చును. అస్థలములం దచ్చు నకే ప్రాధాన్య మీయఁబడినది. కాఁబట్టి 'కై' కూడ చతుర్థివిభక్తి ప్రత్యయముగ నన్నయ యంగీకరించి యుండఁడు." (ఆం. భా. చ. ౧౬౨౩ పు.) ఇట్లాంధ్రభాషాచరిత్రమున వ్రాయఁబడెను. అచ్చునకుఁ బ్రాధాన్య మీయఁబడుట విభక్తిత్వవ్యపదేశమునకుఁ బ్రతిబంధక మెట్లగును? ద్విపద. ఆదట ద్వాపరమందు విష్ణుండు. (బసవ. ౬ ఆ ౮౦౯.) సీ.........ప్రజాపతు, లం దచింత్యాకుం డైనయట్టి (తే-గీ.) విష్ణుఁ డెక్కుడు నాకంటె విను డు తెలియ. (అశ్వ. ౨ ఆ. ౧౬౨.) ఆ-వె. అంతరంగంబు । నందుఁ జిక్కి కినుక నలఁతఁ జేసె. (సౌప్తి. ౧ ఆ. ౮౭.) స్వరయతిలోఁ బ్రయోగింపఁబడిన "అందు" అనునది ప్రత్యయము కాదందురా? "కొఱకుకయి చతుర్థ్యాః స్తః" "జేసః కయికొఱకూ" అని కంఠోక్తముగాఁ జెప్పఁచుండ నవి విభక్తిప్రత్యయములు కావనుట యెట్లు? భాషాచరిత్రకర్తగారి మతముచొప్పునఁ జింతామణి నన్నయ కృతము కాకున్నను మఱెవ్వరైన రచించిరనక తీరదుగదా. ఎవ్వరైన 'కై' అనుదాని యందు స్వరప్రాధాన్యము నంగీకరింపనివారుగలరా? కావ్యాలంకారచూడామణిలో "తృతీయకు "చేత-తోడ" అనునవియుఁ జతుర్థికి 'కై-కొఱక'నునవియు... ......అయ్యె" (కావ్యాలం. ౯ ఉల్లా. ౫౩ పుట. ౯౭ వచనము.) అని యిట్లు కయికొఱకులు చతుర్థివిభక్తిప్రత్యయములుగాఁ జెప్పఁబడెను. "క. కూఁతులకై కూఁతుకొఱకుఁ గూఁతులవలన్." (కావ్యాలం. ౯ ఉల్లా. ౫౬ పుట. ౧౧౨ ప.) క. పలుకుల తుదఁ గైశబ్దం । బలవడ నిలిచినఁ జతుర్థియగు విశ్వమహీ । లలనునికై యలఘునికై । చెలువారం గృతులు కవులు చెప్పుదు రనిసన్. (కావ్యాలం. ౯ ఉల్లా. ౪౯ పు. ౭౬ ప.) ఇట్లు 'కై' శబ్దము చతుర్థివిభక్తియని ధారాళముగఁ జెప్పఁబడెనుగదా! ప్రాచీనాంధ్రవాఙ్మయప్రపంచమునం దేచ్చటనేని "కై" శబ్దమున స్వరప్రాధాన్యము లేకుండుట ("కున్ +అయి = కున్ +ఐ") స్వరప్రధానయతిని మాని యఖండప్రాణియతిని నిల్పుట యచ్చునకేనిఁ జూపఁగలరా? తే-గీ. పొదలుఁ దఱుగుటకై, పొడవొదవుఁ బడుట। కై, కడుం జేరుఁ బాయుటకై, జనించుఁ।

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (ఆం. చిం. హల. ౧౫
కా. అహో. ౪౨౩ పు.)

నన్నయా ౨౪౫ విషయము

యస్మై దిత్సా౽సూయా క్రోధేర్ష్యా రుచిద్రోహ స్థాహ్ను శ్లాఘుస్పృహీ శప్రాధీఙా ప్రతిశ్రుప్రత్యను గృాధా ర్యర్థా భం చీ తాదర్థ్యేచ. (వృత్తి) యస్మై దాతు మిచ్ఛా, అసూయాదయః స్థాదేరర్థశ్చ యస్మై తత్ భసంజ్ఞం స్యాత్. తత్రచీ - తాదర్థ్యేచ. (ముగ్ధ. ౨౯౪ సూ.)

కల్పతరువు. ౨౪౫విష:—సర్వవిభక్తిరిత్యాది కారిక ౨౩౪ విషయమున వ్యాఖ్యాతము. యస్మై దిత్సా=యస్మై దాతు మిచ్ఛా=ఎవనికొఱకు ఇచ్చెడి యిచ్ఛయో? యస్మై = ఎవనికొఱకు, అసూయాదయః = అసూయాదులో? యస్మై = ఎవ్వనికొఱకు, స్థాదేరర్థశ్చ = స్థామొదలగు ధాత్వర్థములప్రయోగమో? తత్ = ఆపదార్థము, భసంజ్ఞంస్యాత్ = సంప్రదానసంజ్ఞ గలదగును. తత్ర = ఆసంప్రదానమున, చీ = చతుర్థీవిభక్తి, స్యాత్ = అగును. తాదర్థ్యేచ = తాదర్థ్యమందును జతుర్థి యగును. "భ = సంప్రదాన. చీ = చతుర్థి" అనునవి ముగ్ధబోధవ్యాకరణసంజ్ఞలు. "రుచ్యర్థానాం ప్రీయమాణః. (౧-౪-౩౩.) రుచ్యర్థానాం ధాతూనాం ప్రయోగే ప్రీయమాణోర్థః సంప్రదానసంజ్ఞః స్యాత్." (సి.కౌ.౫౭౧ సూ.)అనునది మున్నగు

బొలియుటకు నై, సుఖంబులఁ బొందు దుఃఖ। మొందుటకు నై, పదార్థము లెందు నధిప (శాంతి. ౧ ఆ. ౭౦౬.) భట్టారకుఁడు "గీ. అనఘ మా మామ శకుని నాకై కడంగి" అని స్వరప్రధానయతిని బ్రయోగింపఁగా "క. భూతమ్ముల సృజియించుట। కై తోయములందు మునిఁగి యత్యుగ్రతపః। స్థితుఁడనై...... (సౌప్తి. ౨ ఆ. ౧౧౮.) అని సోమయాజియు స్వరప్రధానయతినె నిల్పెను. పై సోమయాజి ప్రయోగములలో "కై" అనునది వైయాకరణుల వచనముచొప్పునఁ జతుర్థీవిభక్తియనియు, "కునై" అనెడివ్యస్తపదముల జంట విభక్త్యర్థాభిధాయకమనియు, గ్రహింపవలెను. ఇట్టు చతుర్థీవిభక్త్యర్థమున 'కునై' అను జంటనే కాక "కుఁగాన్" అనుజంటను సైతము తాదర్థ్యస్ఫూర్తికయి తిక్కయజ్వప్రయోగించి యున్నాఁడు. తే-గీ. అనుజతనుజులుఁ జెలులు వియ్యములు నడుగు। మాలిపోదురు నీకుఁగా మనుజనాథ. (ఉద్యో. ౩ ఆ. ౩౪౧.) సీ........అడుగుము నీకుఁగా నని నేయు టొక్కటి। దక్కఁగ. (భీష్మ. ౧ ఆ. ౧౫౭.) మ. ఉ। త్కటదుఃఖంబుల నారలొందితి రథేశ్యస్థిత్యులై నాకుఁగాన్. (శాంతి. ౧ ఆ. ౩౯౪ ప.)

పెక్కుపాణినీయసూత్రముల నీయొక్కసూత్రమె సంగ్రహించునదగుటచేతను నీసూత్రములలోని యలంతివిషయములుమాత్రమె తెలుఁగునకు పచరించునవగుట చేతను నట్టి పాణినీయసూత్రములనెల్ల నిచట నుదాహరించి వ్యాఖ్యానింపలేదు. ఈముగ్ధబోధసూత్రములోని "యస్మైదాతుమిచ్ఛా - తాదర్థ్యేచ" అనువిషము లీవఱకుఁ బాణినీయసూత్రోదాహరణపూర్వకముగ వివరింపఁబడినవి. ఇంక మిగిలిన యీసూత్రములోని విషయములందును "దేనికొఱ కసూయాదులో యది సంప్రదానసంజ్ఞగలదగునను విషయముమాత్రమె తెల్గునకు పచరించును."అసూయ-క్రోధము - ఈర్ష్య - రుచి-ద్రోహము - శ్లాఘ - స్పృహ"-అనునవి యెవ్వనికొఱకో యట్టివానిని దెల్పుశబ్దము చతుర్థ్యంతమగును. ఉదా:—గోపీగణః కృష్ణాయ అసూయతి, కుప్యతి, ఈర్ష్యతి, రోచతే, ద్రుహ్యతి, స్పృహయతి = కృష్ణునికొఱకు గోపికాగణము, అసూయపడుచున్నది, క్రోధించుచున్నది, ఈర్ష్యపడుచున్నది, ప్రీతి పడుచున్నది, ద్రోహముచేయుచున్నది, శ్లాఘించుచున్నది, స్పృహపడుచున్నది. మొ. ఇట్టి చతుర్థిచోట నయితము భట్టారకుఁడు మున్నగువారు 'కు'షష్ఠినె ప్రయోగించిరి. క. ఆతఁడమ మునీంద్రుఁ డగ్ని కతిరోషమునన్. వచనము. నీవతిక్రూరుండవు సర్వభక్షకుండవు గమ్మనిశాపం బిచ్చిన. (ఆది. ౧ ఆ. ౧౩౫-౧౩౬.) తే-గీ,... ......। జగదనుగ్రహ నిగ్రహ శక్తియుక్తుఁ। డయిన యట్టి యయాతికి నలిగి యేమి। కారణంబున శాపంబు కావ్యుఁ డిచ్చె. (ఆది. 3 ఆ. ౯౮) క......... రాజును విప్రుల। కలిగి చెఱుపఁబోయి తాన యనయంబు చెడున్. (శాంతి. ౨ ఆ. ౧౭౨.) చ. ఇతనికిఁ గూర్తురేని ధనమిత్త్రురుగాక.........(సభా. ౨ ఆ. ౧౦.) గీ. కుడిచినచోటికిఁ గూర్ప వెపుడు. (సభా. ౨ ఆ. ౧౮౮.) అసూయాదిస్థలము లందేకాక స్థలాంతరములందును నిట్టి చతుర్థి గలదు. క. నిపుణుఁడవై నీమఱఁదికి। నప రాధశతంబు సైఁపుదు యయ్యె యుపేంద్రా. (సభా. ౨ ఆ. ౫౯.) పైవిషయములను బాలవ్యాకర్త సంగ్రహింపలేదు.

సర్వావిభక్తిస్సంస్కృతతుల్యా. (ఆం. చిం. వాలం. ౧౫ కా. ఆహో. ౮౨౩ పుట.)

చతుర్థీచాశిష్యాయుష్య మద్ర భద్ర కుశల సుఖార్థ హితైః. (౨-౩-౭౩.) ఏతదర్థైర్యోగేచతుర్థీవాస్యాత్. పక్షే షష్ఠీ.........చిరంజీవితం కృష్ణాయ కృష్ణస్య వా భూయాత్. ఏవం మద్రం - భద్రం - కుశలం నిరామయం సుఖం శం అర్థః ప్రయోజనం హితం

పథ్యం వా భూయాత్. (సి. కౌ. ౬౩౧ సూ.)
దూరాన్తికార్థైః షష్ఠ్యన్యతరస్యామ్.(౨-౩-౩౪.) ఏభి
నన్నయా. రోగే షష్ఠీస్యాత్ పఞ్చమీచ. దూరం - నికటం
౨౪౫ I విషయము. గ్రామస్య గ్రామాద్వా. (సిద్ధా. కౌ ౬౧౧ సూ.)
నమః స్వస్తి స్వాహాస్వధాలం వషడ్యోగాచ్చ
(౨-౩-౧౬.) ఏభిర్యోగే చతుర్థీస్యాత్. హరయే
నమః - ఉపపదవిభక్తేః కారకవిభక్తిర్బలీయసీ. (ప.
౧౦౩.) నమస్కరోతిదేవాన్. ప్రజాభ్యః స్వస్తి.
అగ్నయేస్వాహా - పితృభ్యః స్వధా. అలమితి పర్యా
ప్త్యర్థగ్రహణమ్. (వా. ౧౪౬౨.) తేన దేవేభ్యో
హరిరలం. ప్రభుః - సమర్థః శక్తఇత్యాది. ప్రభ్వాది
యోగే షష్ఠ్యపిసాధుః. తస్మై ప్రభవతి. (౧౭౬౫
సూ.) స ఏషాం గ్రామణీః. (౧౮౭౦ సూ.) తేన
ప్రభుర్బుభూషు ర్భువనత్రయస్య ఇతి సిద్ధమ్. వష
డిన్ద్రాయ,........(సి. కౌ. ౫౮౩ సూ.)

కల్పతరువు. ౨౪౫ I విష:—సర్వవిభక్తిరిత్యాదిసూత్రము ౨౩౪ విషయ మున వ్యాఖ్యాతము. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము.

చతుర్థీచేత్యా౭:—ఆశీరర్థాదులయోగమునఁ జతుర్థియు షష్ఠియు నగును. ఆశీర్విషయక క్రియతో నన్వయించు నర్థముగల ప్రాతిపదికమునకును జతుర్థీ షష్ఠులగును. ఆయుష్యము చిరంజీవితమును గృష్ణునికొఱకు లేదా కృష్ణున కగుఁ గాక, కృష్ణునకు హితము. మొ. దూరాన్తికార్థైరిత్యాది:—'దూరము-సమీపము' అనునర్థములుగల శబ్దములతోడియోగమున షష్ఠీపంచములగును. దూరం - నికటం గ్రామస్య - గ్రామాద్వా = గ్రామమునకు గ్రామమువలన దూరము లేదా సమీపము. ఇందలి పంచమి తెలుఁగున లేదు. గ్రామమునకు దూరమనియె యుండును.

నమఃస్వస్తీత్యాది:—నమః ప్రభృతిశబ్దయోగమునఁ జతుర్థి యగును. హరయే నమః = హరికొఱకు నమస్కారము. హరికి నమస్కారము. దేవాన్ నమస్కరోతి = దేవతలను నమస్కరించుచున్నాఁడు. ఇటఁ గర్మకారకమున ద్వితీయ వచ్చినది. ఉపపదేత్యాది = ఉపపదవిభక్తికన్నఁ గారకవిభక్తి బలవత్తరమను న్యాయముచొప్పునఁ గారకవిభక్తి బలీయము. ఒకశబ్దముతోడి కూడికవలన వచ్చు

విభక్తి యుపపదవిభక్తి. తెలుఁగున నిట్టిభేదములేక కారకవిభక్తిచోట సైతము చతుర్థి పాక్షికముగ వచ్చును. ఉదా:—రామునకు నమస్కరించి-రాముని నమస్కరించి. మొ. ప్రజాభ్యః స్వస్తి = ప్రజలకొఱకు స్వస్తియగుఁగాక. స్వాహాస్వధావషట్ శబ్దములకుఁ దత్సమరూపమునఁ బ్రయోగములేదు. అలంశబ్దార్థములనుటచే శక్తసమర్థాదిశబ్దయోగమునఁ జతుర్థి యగును. 'స ఏషాం గ్రామణీః'ఇత్యాది పాణినిసూత్రప్రయోగముచొప్పున "గ్రామణీః - ప్రభుః" అనునది మున్నగువాని యోగమునఁ జతుర్థీషష్ఠులగును. 'ప్రభుర్బుభూషుః భువనత్రయస్య' = ముల్లోకములకుఁ బ్రభువు గాఁగోరువాఁడై అనిభారవిప్రయోగము. ఇన్ద్రాయవషట్ = ఇంద్రోద్దేశ్యకము హవిర్దానమని యర్థము. ఇట్లె స్వధాస్వాహాస్థలములందును నర్థము నెన్నునది.

ప్రయోగములు:—క. కరమిష్టముచేసితి మా। కరిసూదన దీన నీకు నగు సత్ఫలముల్. (ఆది. ౧ ఆ. ౧౨౦.) మనకుఁ గుశలముచేయు. (అర. ౧ ఆ. ౧౮౩.) "ఆ-వె. మీరు నాకు నేకు మీకు నెన్నండు ము। న్నహిత మాచరించినదియు లేదు. (సభా. ౧ ఆ. ౧౭౬.) నాకిది యు యిష్టము. (ఆది. ౬ ఆ. ౫౧.) క. హరికిఁ బడయన్। దూరము. (అర. ౧ ఆ. ౩౭౧.) క. మాకు సమీపస్థుండవ। దూరంబున నుండియుం జతుర్భుజ మాకున్. (సభా. ౨ ఆ. ౭౨ ప.) తరల. గిరిసుతాదిక దేవతాతతికి న్నమస్కృతిసేసి. (ఆది. ౧ ఆ. ౨౧.) ఆ-వె. అమ। రేశ్వరునకు మ్రొక్కియిట్టు లనియె. (ఆది. ౮ ఆ. ౩౬.) ఉ.........వం। దుష్యంతుని నప్పరాశర సుతుం బ్రణమిల్లి. (ఆది. ౧ ఆ. ౪౪.) క.........అస్మదాదుల కెల్లన్। స్వస్తి యొనర్పంగ.........(ఆది. ౨ అ. ౨౧౯.) క.........బ్రాహ్మణులకుఁ గా। క.........ఒరులకలవియె. (అర. ౮ ఆ. ౧౨౫.) చ.........నాకపకారము సేసె. (ఆది. ౧ ఆ. ౧౨౨.) ఇది హితశబ్దగ్రహణమువనె సంగ్రహింపఁబడును. 'హితము - అహితము - ఉపకృతి - అపకృతి'మున్నగునవెల్ల దానిచే సంగ్రహింపఁదగినవె. ఇట్లె శక్తార్థములనుటచే "అర్హము - తగు - తగదు - పోలును - అగును - కాదు - నేరదు-చాలదు." మున్నగునవెల్ల సంగ్రహింపఁదగును. (విస్తర I ౨౩౮ I). ఉ.........ధర్మ వెఱుంగ వీనికిం। బోలునె.........(సభా. ౨ ఆ. ౨౨.) చ.........విధాత్రునకైనను నేరఁబోలునే. (ఆది. ౧ ఆ. ౧౯.) ఎ - గీ.........ఒరు లేమి సేయనేర్తు రిందుకులుఁడ. (పభా. ౨ ఆ. ౩౧౩). సీ. కాంత నీ కెఱిఁగింపఁగాని యట్టి. (అను. ౮ ఆ. ౮౨౨.) ఆ-వె. కాన యింక వేఁడఁగాదు నాకు. (సభా ౨ ఆ. ౨౬౩.) ఆ-వె. చనునె నీకు నిట్టిసాహసక్రియఁజేయ. (అర. ౩ ఆ. ౩౪౪..

క.........నీకు దురాగ్రహమగునే. (ఉద్యో. 3 ఆ. 330 ప.) అర్థార్థ:—
క. నీదుకులమునకుఁ దగఁగ. (ఆది. ౬ ఆ. ౫౬ ప.)

గత్యర్థకర్మణీత్యాదిసూత్రసిద్ధపాక్షికచతుర్థి (విస్తర I ౨౪౪ I విష.):—సీ.
ఆతన్వి యమునానదీతీరమున కేఁగి. (ఉద్యో. ౪ ఆ. 3౬3.) చ. అడవికి వేఁటకై
చరిగి. (పాండు. ౫ ఆ.) చ అత: డొకనాఁడు వేఁటకొఱకై......పైన నూటఁ
గని. (భల్లా. 2 ఆ.) ఇది తాదర్థ్యచతుర్థియన్నను సరియే. ఇట వేఁటకుఁ బయన
మగుటఁ గని యన్నను నగవచ్చును. ద్వికర్మకములలోని యముఖ్యకర్మస్థల'కు'షష్ఠి:—
ఎ-గీ.........అధిక! బలుఁడు శూరుఁడు గట్టుము పట్ట మతని (ద్రోణ. ౧
ఆ. ౬౨.) శా. భగ్నంబైన బలాధిపత్యమునకుం బట్టంబు గట్టుండు. (ద్రోణ. ౧ ఆ.
2౪ ప). "వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకంబగు......
వీప్సయందు - మ్రానికి మ్రానికి నరిగె. (ఆర. ౨ ఆ.)" (ప్రౌఢ. కార. ౧౪ సూ.) ఇట
వీప్సయందు రా లేదు. గత్యర్థయోగముననె వచ్చినది. దేశాధ్వకాలములకు
షష్ఠి:—కొండొకసేపునకుఁ దెలిసి. (హరి. ఉ. ౧ ఆ.) నా మగుడివచ్చునంతకు.
(ఆర. 3 ఆ. 3౧) క్రిందికి డిగెను. మీఁది కెగసెను. రేపటికి వచ్చును. ఇత్యాదు
లెల్ల గత్యర్థయోగమునకె లక్ష్యము లనుట లెస్స.

సర్వవిభక్తిః సంస్కృతతుల్యా. (ఆం. చిం. వ్యా. ౧౫
కా. అహో. ౪౨3 పు.)
ధ్రువమపాయేఽపాదానమ్. (౧-౪-౨౪) అపాయో
విశ్లేషః - తస్మిన్సాధ్యే ధ్రువమవధిభూతం కారక
మపాదానం స్యాత్. (సి. కౌ. ౫౮౬ సూ.)

నన్నయా. అపాదానే పఞ్చమీ. (౨-3-౨౮) గ్రామాదాయాతి.
౨౪౬ విష. (సి. కౌ. ౫౮2 సూ.)
యతోఽపాయ భీ జుగుప్సాపరాజయ ప్రమాదాదాన
భూత్రాణ విరామాన్తర్ధివారణం జం పీ. (వృత్తి) యత
ఏతే తజ్జ సంజ్ఞం స్యాత్-తత్ర పీ-విభీషణః పదా ద్బ్రిష్టో!
భ్రాతు ర్భీతో జుగుప్సితః! ............(ముగ్ధ. కార.
౨౯౯ సూ.)

కల్పతరువు. ౨౪౬ విష:—సర్వవిభక్తిరిత్యాదిసూత్రము ౨3౪ విషయ
మున వ్యాఖ్యాతము. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె
మూలము. ధ్రువమిత్యాది:—అపాయ మనఁగా విశ్లేషము. అట్టి విశ్లేషము

సాధ్యమగుచుండఁగా స్థిరమై నిల్చునది యనఁగా నట్టివిభాగమున కవధియగునది యపాదానసంజ్ఞ గలదగును. అపాదానే పఞ్చమీ = అపాదానవాచకము పంచమ్యంతమగును. ఉదా:—గ్రామాదాయాతి = దేవదత్తునకు గ్రామమునకు విశ్లేషము కలుగునపుడు గ్రామము ధ్రువమైయుండెను గానఁ దద్వాచకము గ్రామశబ్దము పంచమ్యంతమగును. గ్రామాదాయాతి = దేవదత్తుఁడు గ్రామమునుండి వచ్చుచున్నాఁడు. యతోఽపాయేత్యాది= దేనినుండి యపాయము కల్గునో, దేనినుండి భయమో; దేనినుండి జుగుప్సాదులో యది, జమ్ = జసంజ్ఞగల దనఁగా నపాదాన సంజ్ఞగలదగును. తద్వాచకముకంటెఁ బరముగ, పీ = పంచమి, స్యాత్ = అగును. 'జం పీ' అనునవి ముగ్ధబోధసంజ్ఞలు. పెక్కు పాణినీయసూత్రాదుల నిది యొక్కటే సంగ్రహించుచుండుటచే నిది యుదాహృతమయ్యెను. మఱియు నించుకేని వదుప దప్పక సూరి దీనినె యనుకరించి సూత్రించుటచేత నైత మిది చూపఁబడెను. ఉదా:—విభీషణః పదాద్భ్రిష్టః = పదమువలననుండి విభీషణుఁడు భ్రష్టుఁడయ్యెను. భ్రాతుః = అన్నయగు రావణునినుండి, భీతః = భీతుఁడయ్యెను. జుగుప్సితః = ఏవగించెను. మొ. ఈసూత్రములోని ఆదాన మనఁగా గ్రహణము. (రాజు జనుల నుండి కప్పములఁ గొనెను. మొ). పాణినీయమున వచింపఁబడలేదు. "విప్రాద్వస్త్రం గృహ్ణాతీత్యాదౌ గౌణాపాయావధిత్వేన వివక్షితత్వాత్ జత్వమ్." (ముగ్ధ. శ్రీరామతర్కవాగీశవ్యాఖ్య. ౨౯౯ సూ) విప్రునినుండి వస్త్రమును గ్రహించుచున్నాఁడనుచో విప్రునినుండి వస్త్రమున కపాయము గౌణముగా నున్నందున జత్వ మనఁగా నపాదానత్వము గల్గునని తాత్పర్యము. "బుద్ధిపరికల్పితమగు నపాదానము నాశ్రయించియే "జుగుప్సావిరామ" అనువార్తికమును 'భీత్రార్థానాం భయహేతుః' మున్నగు వక్ష్యమాణసూత్రములను భాష్యకారుఁడు ప్రత్యాఖ్యానముఁ జేసెను." (కౌ. ౪౮. ౬౮ పుట.)

అపాయభయ జుగుప్సాపరాజయ ప్రమాదగ్రహణ
భవనత్రాణ విరామాంతర్ధివారణంబు లెద్దాన నగు
దానికి వలన వర్ణకంబగు. ౯.

అపాయము = విశ్లేషము, భయము = వెఱపు, జుగుప్సా = ఏవ, పరాజయము = డయ్యుట, ప్రమాదము = మఱాకు, గ్రహణము = కొనుట, విరామము = విరమించుట, అంతర్ధి = మఱుఁగుట, వారణము = వారించుట. అపాయంబునకు - మైత్రుండు రాజ్యంబు

బాలవ్యా వివరణము. ౨౮౬ I విషయము.

వలన భ్రష్టుండయ్యె. భయంబునకు - చోరునివలన భయపడియె. జుగుప్సకు - పాపంబువలన నేవగించె. పరాజయమునకు - అధ్యయనమువల్లన డస్సెను, ప్రమాదంబునకు - పాడివలనం బరాకుపడియె. గ్రహణంబునకు - మైత్రునివలన ధనంబు గొనియె. భవనంబునకు - మనువువలనం బ్రజలు పుట్టిరి. త్రాణంబునకు - చోరునివలనం గాచె. విరామంబునకు - భోగంబువలన విరమించె. అంతర్ధికి - కృష్ణుండు తల్లివలనఁ దాఁగె. వారణంబునకు - శోకంబువలన వారించె. ఈపంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు. చోరునకు వెఱచె. పాపంబున కేవగించె. అధ్యయనంబునకు డస్సె. పాడికిం బరాకుపడియె, మనువునకు నిక్ష్వాకుండు పుట్టె. ఇత్యాదు లూహించునది.

సంజీవని:—౨౮౬ I విష:—అపాయాదులెద్ది యవధిగా జరుగునో యది యపాదానకారకమనిపించుకొనును. తద్వాచకము పంచమ్యంతమనఁగా వలన వర్ణకాంతమగును. రాజ్యకలితుఁడై యుండిన మైత్రుఁడు రాజ్యమునుండి తొలఁగెను. రాజ్యము ధ్రువమై నిల్చెనుగాన నయ్యది యపాదానమయ్యెను. కావున రాజ్యశబ్దము వలన వర్ణకాంతమయ్యెను. "ద్వయో స్సంయుక్తయో రన్యతరస్య చలనా ద్విశ్లేష ఇతిస్థితిః-తత్ర తా దృశచలనాఽనాశ్రయభూతం ధ్రువమ్"(సి.కౌ.౫౮౬సూ. బాలమ. వ్యా.) ఇట్లె భయాదులును దేనివలనఁగలుగునో యది యపాదానసంజ్ఞ గలదగునుగానఁ దద్వాచకము వలన వర్ణకాంతమగును. అపాయాదులకెల్ల సూరి వరుసగ నుదాహృతులనొసంగెను. ఉదాహృతులు ప్రాయికముగా సిద్ధాంతకౌముదిలోనివి. భయమునకు - "చోరాద్బిభేతి" చోరునివలన భయపడియె. భయము చోరునివలనఁగల్గెనుగానఁ జోరశబ్దము వలన వర్ణకాంతమయ్యెను. జుగుప్సకు - "పాపాజ్జుగుప్సతే" పాపమువలన నేవగించె. ఏవ పాపమువలనఁ గల్గెనుగాన పాపశబ్దము వలన వర్ణకాంతమయ్యెను. (విస్తర.) పరాజ - "అధ్యయనా త్పరాజ

---

విస్తర. ౨౮౬ I విష:—"ఈసూత్రంబువలన......'చోరభీతి' ఇత్యాది స్థలములయందుఁ బంచమీతత్పురుషంబే తప్పక చెప్పికొనవలయును. షష్ఠీతత్పురుషాదు లశాస్త్రీయంబులు.........కావుననే సమాసపరిచ్ఛేదంబునందలి తృతీసు

యతే - గ్లాయతీత్యర్థః". అధ్యయనంబువలన డస్సె. డయ్యుటయనఁగా బడలిక యధ్యయనమువలనఁ గల్గెనుగాన నధ్యయన శబ్దము వలన వర్ణకాంతమయ్యెను. ప్రమాద - "ధర్మాత్ ప్రమాద్యతి" పాడివలనం బరాకుపడియె. పాడియనఁగా ధర్మము - నీతి. గ్రహణః—మైత్రునివలన ధనంబుగొనియె. బా. కా. ౮ సూత్రపు వివరణమున, నెఱుఁగు - విను మున్నగునవి గ్రహ్యాదులెయనియు నక్కారణమున "ఈయర్థంబు నీచేతనెఱింగితి. ఈవృత్తాంతము వానిచేతవింటి. పక్షంబున వలన వర్ణకంబగు" అని యుండనగుననియు వచింపఁబడెను. భవనమునకు - "బ్రహ్మణః ప్రజాః ప్రజాయన్తే" మనువువలనం బ్రజలు పుట్టిరి. త్రాణ - "చోరాత్త్రాయతే" చోరునివలనం గాచె. విరామ - "పాపాద్విరమతి". భోగంబులవలన విరమించె. అంతర్ధి - "మాతు ర్నిలీయతే కృష్ణః". కృష్ణుండు తల్లివలనఁ దాఁగె. వారణ - శోకంబువలన వారించె. ఈసూత్రమునఁ బేర్కొనఁబడిన యపాయాదిస్థలములలోఁ గొన్నిటఁ బంచమికి మాఱుగా 'కు' షష్ఠియు నిల్చుట గలదనుచు సూరి భయ జుగుప్సాపరాజయప్రమాదభవనముల స్థలములలో షష్ఠి నుదాహరించెను. చోరునకు వెఱచె. మొ.

సూత్రంబునొద్ద "దొంగభయము" అనునది పంచమీతత్పురుషంబునకు నుదాహరణమ్ముగా నీయఁబడినది" (బా. గు. ప్ర. కా. ౯ సూ. వ్యా. ౨౧౮ పుట. ద్వి-ము.) గుప్తార్థప్రకాశికా ప్రథమముద్రణమునందును నిట్లెయున్నది. 'దొంగభయము' అనునది పంచమీతత్పురుషమనుట చింతామణి విరుద్ధము. సూరి నిర్బాధమగు 'రామునిబాణము' అనునదితప్పఁ దక్కినయుదాహృతులెల్ల సమాసపరిచ్ఛేద తృతీయసూత్ర వివరణమున నాచ్ఛికతత్పురుష సమాసములనె యుదాహరించుట నరయఁగాఁ జింతామణి విరుద్ధముకాని 'దొంగబయము' అను నాచ్ఛికసమాసమునె యుదాహరించెనని తోఁచుచున్నది. చింతామణిలోని "లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషు స్యాత్సమాసకాఙ్క్షేషు" అనుసూత్రము సాధ్యసాంస్కృతిక సమాసములందును మిశ్రసమాసములందును సమాసవిభక్తిలోపమును వచింపఁజాలదు. ఈరెండువిధములగు (సాంస్కృతిక-మిశ్ర.) తత్పురుషములందును షష్ఠీతత్పురుషముమాత్రమె చింతామణి సమ్మతమగునుగాని తక్కిన ద్వితీయాతత్పురుషాదులు సాధ్యములు కానేరవు. షష్ఠీతత్పురుషములందుమాత్రము "షష్ఠీభవేద్ద్వితీయాతుల్యా । తత్పురుష సంస్థితానామ్నామ్" అనుచొప్పున, "రామునియొక్క+బాణము = రామునిన్+బాణము - దొంగయొక్క+భయము = దొంగన్+భయము" అని యేర్పడును. పిదప "ద్రుతస్యసర్వత్ర లుక్ సమాసేషు" అనుచొప్పున నట్టి ద్వితీయాద్రుతము లోపించి "రామునిబాణము - దొంగభయము" అనునవి సిద్ధించును.

ప్రయోగములు:—ఆ. వె. మనునిఘుండు ధర్మతనయుండు దాస్యంబు। వలనఁ బాయవలయు వసుమతీశ. (సభా. ౨ ఆ. ౨౪౯.) క. నెమ్మిని ధర్మజు నలువురు। తమ్ములు.....పాయంగవలయు దాస్యమువలనన్ (సభా. ౨ ఆ. ౨౬౧ ప.) చ. అనిమిషు లెల్లవానికి భయంపడుచుండుదు రట్టి (ఆది. ౪ ఆ. ౩౭.) తే-గీ. వీరు లని పాండుసుతులకు వెఱతు నేను (ఆది. ౬ ఆ. ౧౨౧.) క. విను కర్ణునకే నోడితి। నన నేఁటికి నీవు నోడి తనిలజమాద్రీ। తనయులు మున్నే యోడిరి। మనతోఁ గూడంగఁ గంసమర్దియు నోడెన్ (కర్ణ. ౩ ఆ. ౫౩.) కం. ।పాండవులవలని కీడో। క్కొండును లే దధిప.....(స్త్రీ. ౧ ఆ. ౮౩.) క. క్షితిపతులవలన సముపా। ర్జిత మైన ధనంబు.....(సభా. ౧ ఆ. ౨౭౭.) చ. నరవసుఁడైన భీమువలనం బ్రభవించె హిడింబకున్ సుతుం। డు (ఆది. ౬ ఆ. ౨౩౫.) కం. చ్యవనునకు సుకన్య కకు। ద్భవమయ్యె ఘనుండు ప్రమతి.....(ఆది. ౧ ఆ. ౧౪౫.) తే-గీ. నన్ను ననుచిత కృత్యంబునకుఁ దొలంగఁ। ద్రోచితివి.....(కర్ణ. ౩ ఆ. ౭౯ ప.) గీ. విద్య యొసఁగును వినయంబు వినయమునను। బడయుఁ బాత్రత పాత్రతవలన ధనము। ధనము వలనను ధర్మంబు దానివలన। నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు.

నన్నయా. ప రేషూండ్యాదిశబ్దేషు। సప్తమ్యాద్యా విభక్తయః
౨౪౭ విషయము. క్వచిన్నిత్యం క్వచిద్వాస్యా। దహో తేషాం ప్రకా
రితా. (వికృ. అజం. ౮౩ కారి. అహో. ౩౬౨ పు.)

కల్పతరు. ౨౪౭ విష:—ఉండ్యాదిశబ్దేషు పరేషు = ఉండ్యాదిశబ్దములు పరములగునపుడు, సప్తమ్యాద్యాః-విభక్తయః = సప్తమీప్రభృతులగు విభక్తులు, ప్రయుక్తములగుచుండును. ఈవిధమైన యునికి, క్వచిన్నిత్యమ్ = ఒకప్పుడు నిత్యముగాను, క్వచిద్వాస్యాత్ = కొన్నియెడల వైకల్పికముగాను సంభవించును. ఆసప్తమ్యాదులపై నుండ్యాదులు నిల్వకుండుటయుఁ గలదనియర్థము. తేషామ్ ప్రకారితా = అవిభక్తులయు, నాయుండ్యాదుల యునికియొక్కయుఁ బ్రకారిత యనఁగా (ప్రకారమె) రీతి, అహో = వింతయైనది. ఉండ్యాదియను చోటియాది శబ్దముచేత, ఉంచి - కూర్చి - గుఱించి - గుఱిచి-చేసి-తొట్టి - కొలెన్ - కొలెన్-వంటి - బోఁటి - పోని - అట్టి - పోలెన్ - బలెన్ - వలెన్ - అట్లు - కరణి - రీతి - ఫాతి - ప్రభృత్యర్థకములు మున్నగునని గ్రహింపనగును. 'సప్తమ్యాద్యాః' అనుట చేత, సప్తమి - ప్రథమ - ద్వితీయ - పంచమి - తృతీయ యనువిభక్తులు చెప్పఁబడుచున్నవి. 'వలనన్ - అందున్ - నన్ - లోన్' అనునవి యుండి శబ్దపరకత్వమున నిల్చును. ఉంచి శబ్దము పరమైనపుడు ద్వితీయావిభక్తి నిల్చును. కూర్చి - గుఱించి

గుఱించి శబ్దములు పరమగునపుడును ద్వితీయయే నిల్చును. ఇవి కర్మప్రవచనీయార్థ మునవచ్చు విభక్తులగునపుడు వీనికిఁ బూర్వాగమముగా నుమ్మచ్చునుగాన నది ద్వితీయ యని భ్రమింపరాదు. (౨౩౫ విష.). చేసి శబ్దము పరమగునపుడు తృతీయా విభక్తి (౨౩౮ I విష.) యనఁగాఁ జేతవర్ణకార్థములు నిల్చును. క్వాచిత్కముగా వలనవర్ణకమును నిల్చును. తొట్టిశబ్దము పరమగునపుడు ద్వితీయావిభక్తి నిల్చును. 'కాలెన్ - కోలెన్' శబ్దములు పరమగునపుడు సప్తమి నిల్చును. కొన్నియెడల నివి పరమగునపుడు సప్తమ్యంతదానన్ శబ్దలోపమునంజేసి భూతార్థవిశేషణము పూర్వపదముగా నిల్చినట్లు తోఁచుటయుఁ గలదు. (ఇతఁడు పుట్టినకోలె = పుట్టిన దానంగోలె౨౧౦ VIII విష.).వంటి మున్నగు నుపమానవాచకములు పరమగునపుడు, షష్ఠీద్వితీయాప్రథమలు యథాప్రయోగముగ నిల్చును. ప్రథమ నిల్చునపుడది ద్రుత పరకమై నిల్చుటయుఁగలదు.తక్కిన మొదలు మున్నగు ప్రభృత్యర్థకములు పర మగు నపుడు ప్రథమావిభక్తి నిలుచును. ఇట్లివి సదా తత్తద్విభక్తులకుఁ బరముగా నియత ముగాఁ బ్రయుక్తములగుచువచ్చుటంజేసియు త్తరోత్తరవైయాకరణులు కొంద ఱట్టి శబ్దములు తత్తద్విభక్తుల కనుప్రయుక్తము లనుచు సూత్రించుట సంభవించెను. కాని యవెల్ల ననుప్రయుక్తము లనిపించుకొనవు. వానిలోఁ గొన్ని సాధారణ ముగా నర్థవంతములై తత్తద్విభక్తులతో నదికి తత్తద్వాక్యములందలి క్రియాదు లతో నన్వయించుచుండుటంజేసి యథర్వణుఁడు వీని నట్లుపదేశింపఁడయ్యె. కాని 'చేసి'శబ్దమున కన్వయ మిపుడు స్ఫురింపలేదు. అది లోపించినను దృతీయావిభక్త్యర్థ స్ఫూర్తికి భంగములేదు. కావున దాని ననుప్రయుక్తశబ్ద మన్న ననవచ్చును. 'తొట్టి - కోలెన్ - కాలెన్' అనునవియుఁ బ్రభృత్యర్థకములును నుపమానవాచకము లగు పోలె ప్రభృతులును లోపించినచో నన్వయభంగమె కల్గునుగాన వాని ననుప్రయుక్తశబ్దము లనరాదు. 'కూర్చి - గుఱించి - గుఱిచి' అనునవియు నర్థ వంతములై సుసమన్వితము లగుచున్నను నవి లోపించినను నర్థభంగములేదు గాన వీని ననుప్రయుక్తశబ్దములన్నను ననవచ్చును. (౨౩౫ విష.).ఇవి ద్వితీయావిభక్తిపయి ననుప్రయుక్తము లగునని ౨౩౫ విషయమున విశదీకరింపఁబడెను. 'చేసి' శబ్దము చేతవర్ణకార్థకప్రత్యయములపై ననుప్రయుక్తమగుననియు వలన వర్ణకముపైని సయిత మరుదుగ ననుప్రయుక్తమగుట గలదనియు ౨౩౮ I విషయమున స్పష్ట పఱుపఁబడెను. (విస్తర. 1)

---

విస్తర. I ౨౮౭ విష:—"పరేషాండాద్యాదిశబ్దేషు । సప్తమ్యాద్యా విభ క్తయః" అనుకారికలో "సప్తమ్యాద్యే విభక్తయః" అనుపాఠ మహోబలపండితీయ

తొట్టి - కొలెన్ - కోలెన్ - మొదలు - మొదలగునవి పరమగునపుడు ద్వితీయాదులు నిల్చుట కీక్రింది ప్రయోగములు కన్పట్టుచున్నవి. క. త్రిదశేంద్రుం దొట్టి యష్టదిక్పాలవరుల్. (అర. ౪ ఆ. 32.) చ.........నిన్నుఁ దొట్టి యీ। యనిమిషులెల్ల.........(ఆది. ౪ ఆ. 32.) తరల.........ఉ। త్తరకురూత్తముఁ దొట్టి యుత్తరధారుణీశులు. (సభా. ౧ ఆ ౨౪౧.) సీ.........ఆ వె. పరముఁ దొట్టి పాశుపత మాదిగా దివ్య। శరము లిచ్చి రట్టె. (ఆ. ౧ ఆ. ౩౭౮.) చ. హిమకరుఁ దొట్టి పూరుభరతేశకురుప్రభుపాండు భూపతుల్. (ఆది. ౧ ఆ. ౧౪.) సీ. జననుత దానివత్సంబు నిన్నటఁగోలె, నుడుగక యీఅగ చుసున్న గ దిగు. (ఆది. ౮ ఆ. ౧౧౮.) సీ. గోగ్రహణంబునఁగోలె నెంతయు మెచ్చఁబడకుండుదురె వారు...
......(ఉద్యో. 3 ఆ. ౯౨.) సీ.........తే-గీ. ఇతఁడు పుట్టినకోలెను నెపక మెసఁగు। దర్పమునన వర్తిలు. (విరా. ౧ ఆ. ౭౪.) (పుట్టినకోలెను = పుట్టినాసంగోలెను.) శా.........భూపాలుఁ డా। గాముష్టీణిక జన్మనాఁటఁగోలి (వసు. ౪ ఆ. ౭౬.) క. ఇది మొదలుంగాన్. (ఆది. ౮ ఆ. ౫౯.) క. భూసురు లాదిగఁ గల జను। లీసుర సేవించిరేని యిది మొదలుగఁ బా। పాసక్తిఁ బతితు లగుదురు।.........
(ఆది. 3 ఆ. ౧౨౧.) "నాఁటఁగోలె.........అది సుత (మొదల్కొని) నినుఁ దొట్టి బంధుజనములు ఇత్యాది" (అహో. 3౬3 పు.) సంస్కృతమునఁ బ్రభృత్యర్థక యోగమునఁ బంచమి వచ్చును. "కార్తిక్యాః ప్రభృతీతి భాష్యప్రయోగాత్. ప్రభృత్యర్థయోగే పంచమీ. భవాత్ ప్రభృతి ఆరభ్య వా సేవ్యో హరిః." (సి. కౌ. ౫౯౫ సూ.) వంటి మున్నగునవి పరమగునపు డీక్రిందిరీతి విభక్తులు నిల్చునని ప్రౌఢవ్యాకర్త సూత్రించెను. (విస్తర. II)

---

మున నుదాహృతమయ్యెను. "పరేషాంద్యాదిశబ్దేషు। సప్తమ్యాద్యే విభక్తయః।...
......ఆద్యే ప్రథమా ద్వితీయే ఇత్యర్థః. నిన్నుండి........." (అహో. 3౬౨ పు.) ఈపాఠము పక్షమున "చేసి వలన" శబ్దములకు ముందు తృతీయ నిల్చుట(౨3౯ I విష.) యుపమానవాచకములకు ముందు షష్ఠ్యాదివిభక్తులు నిల్చుట మున్నగువిషయములు సంగ్రహింపఁబడఁజాలవుగాన "సప్తమ్యాద్యాః" అనుపాఠమె యథర్వణాభిప్రేతమనఁదగును.

విస్తర. II ౨౪౭ విష:—"అట్లు పోలె బలె వలె శబ్దంబు లివార్థకంబులు. ఉపమేయము ప్రథమాంతమగునపు డట్లు పరంబగుచో నుపమానంబులగు నామతదస్మదుష్మదాత్మార్థములకు షష్ఠియు, పోలె బలెలు పరంబు లగుచో నామతచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు నస్మదర్థప్రభృతులకు ద్వితీయయు, వలె పరంబగుచో నామ

<u>ఉండి - ఉంచి:</u>—వీనిని బ్రమాదముగాఁ గొంద ఱాధునికులు 'నుండి-నుంచి' అని వాడుటయుఁ గలదు. ఇవి పంచమీవిభక్తి ప్రత్యయములె యని కొందఱును బంచమీవిభక్త్యర్థప్రకాశకములగు ననుప్రయుక్తశబ్దములని కొందఱును నద్యతనులు తలంచుచున్నారు. ఇవి ప్రయుక్తములగునపుడు సప్తమ్యాదివిభక్తులు వీనికిఁ బూర్వమున నిల్చి వీనితో నన్వయించును. ఉండుధాతు క్త్వార్థకరూపము 'ఉండి' అనునది ఈధాతువునకుఁ బ్రే[illegible]రూపము 'ఉంచు' అనునది. దీని క్త్వార్థకరూపము

---

తచ్ఛబ్దార్థములకు షష్ఠియు నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయలయం దెద్దియే నొక్కటియుఁ గ్రమంబుగ నగు. ఉపమేయము ద్వితీయాద్యంత మగునపుడు పోలె ప్రభృతులు పరంబగుచో నుపమానంబుల కుపమేయవిభక్తుల యగు. పోలినయెడఁ దచ్ఛబ్ద మేతవాదులకు నుపలక్షణముగా గ్రహించునది. అట్లు కరణ్యాదులకు గ్రాహకము. ఉ. పాయకపాకశాసనికి భారతఘోరరణంబునందు నా। రా యణునట్లు.........(ఆది. ౧ ఆ. ౨౫.).........పరి కాఁడుబోలె. (ఆది. ౪ ఆ.) .........శా. కానీరా యిటువంటిసీతము లనేకంబుల్ <u>నినుంబోలె</u> వి। న్నాఁడ న్నేను (శాం. 3 ఆ.) తామరపాకు నీరుబలె. (హరి. 3 ఆ.).........ఉ. భీరులఁ బోలె నేల వెఱపించెదు మాటల మమ్ము.........(అర. ౬ ఆ.) క. జ్ఞానులచే మానులచే। .........బద్ధుం డగునే। శ్రీనాథుఁడు భక్తియుతులచేతంబోలెన్. (భాగ ౧౦ స్కం. పూ.) ఉ.........దేవరకుంబలె నవ్విధూటికిం। దొత్తగుచున్ బనుల్ సలుపుదున్. (కళా. ౪ ఆ.)" (3౮ సూ.). "ప్రథమాంతములమీఁద పోలె బలె పోనిశబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాషనగు. ఉదా:—సమిద్ధహవ్యవహుఁడుం బోలెన్. (హరి. ఉ. ౧౦ ఆ.).. ...అమృతధారాపాతంబునుబోలె. (అర. ౨ ఆ.)" (3౯ సూ.). "అట్టి పోని బోఁటి వంటి శబ్దంబులు పదర్థకంబులు. బోఁటి తనంతఁ బ్రత్యయార్హంబునగు. అట్టి ప్రభృతులు పరంబులగుచో నట్లు ప్రభృతిపరకనామాదులకుం బలెఁ బూర్వపదంబులకు విభక్తులు త్రివిధంబులం బరఁగు. అందు బోఁటివంటులు సమానంబులు. అవి పరంబులగుచో నాత్మార్థమునకు నాయుతచ్ఛబ్దంబులకుంబోలెఁ గార్యంబు. పోని పరంబగుచో డు వర్ణకంబుమీఁద ద్రుతంబు నిత్యంబు. ఉదా:—.........రెండవమన్మథుండునుంబోనివాని. (అర. ౨ ఆ. వ.) నీయట్టి పుణ్యాత్మకుల్ గలరే (భాగ. ౧౦ పూ.) ఎ-గీ. వరుణేంద్ర దేవియుఁ। బోని దాని దేవయానిఁ గనిరొ. (ఆది. 3 ఆ.).........నినుబోంట్లను నమ్మక యేనును బ్రదికెద (శాంతి. 3 ఆ.) ఎ-గీ. నాకు మిమ్మువంటి లోకోత్తరుల కియ్యఁ। గలిగె (వి. పు. ౭ ఆ.) క. మీవంటిగృహస్థుల సుఖ। జీవనము (మను. ౧ ఆ.)" (ప్రౌఢ. ౪3 సూ.).

'ఉంచి' అనునది. "ఉంచి కూడా వల్ల వలన । వంకయుం డీతిపంచమీ" (అథర్వణ వ్యాకరణము. IV కాండ.) అని శరణ్యకర్తగా రొకప్రమాణవాక్యముగా దీనిం జూపిరి. తిక్కనకు సమకాలికుఁడును వికృతివివేకమనెడి యథర్వణకారికావళిని రచించినవాఁడును నగు నథర్వణుఁ డీయుంచికూడా కారికాకర్త కాఁడు. ఇతఁడు కేవల మాధునికుఁడు. ఇది భ్రమింపఁజేయుటకుఁ జూపిన యొకయర్వాచీనవ్యాక రణకారిక. "ఉంచికన్న పట్టికంటే నుండివలన వంకోండ్యోః జసిసః. ఏతేపంచ మ్యాఃస్యుః" ఇది మఱొకప్రమాణమఁట. ఇది కేవలము నాధునికమని యనుటలో విప్రతిపత్తియేలేదు. (ఆంధ్రకౌముది. బాలక. ౧౯3-౧౯౪ పు.). "గీ. కాంచి యమ్మంత్రి యొచ్చోటినుంచి వచ్చె" (కృష్ణరాయవిజయ. IV ఆ.) (బాలక. ౧౯౪ పు.) ('ఎచ్చోటనుంచివచ్చె' అని శరణ్యమునఁ బొరపాటుగఁబడినది.). ఈయొక్కటిం దప్పఁ దక్కినప్రయోగములందెల్ల (బాలకవిశరణ్యములోనివి. ౨౦౧ పు.) 'ఉండి' శబ్దము నిల్పనగునైనస్థలములే. "శా. న । న్నుంచే" అస్పష్టము. పైకృష్ణరాయ విజయపద్యమునందుఁగలెనె "ఉంచి" అనుదానికి ముందు ద్వితీయమాత్రమె నిల్పి సుసమన్వితమగును. ఎచ్చోటిని 'ఉంచి' = వదలివచ్చె నని యన్వయము. ఎచ్చోట నుంచి యన్నచో నన్వయము కుదురదు. ఎచ్చోటను నమ్మంత్రి దేనిని నుంచి రాలేదుగదా. 'ఇంటి నుంచివచ్చెను' అన్నచో నింటియం దేదేని యుంచివచ్చెనను నభిప్రాయార్థము సిద్ధించును ఇట్లే "వనమువనుండి వచ్చెను, అచ్చోటనుండివచ్చెను, నీటిలోనుండి వచ్చెను." మున్నగు పెక్కు సప్తమీస్థలములలో "ఉండి" అనునది నిల్పునపు డన్వయము కుదురుపడినట్లు "ఉంచి" అనునది నిల్పినచోఁ గుదురుపడదు. కావుననే సూరి 'ఉండి' శబ్దానుప్రయోగము నంగీకరించి 'ఉంచి' శబ్దానుప్రయోగము నంగీకరింపఁజాలఁడయ్యెను. (విస్తర. III) ద్వితీయావిభక్తిమీఁది యుండి శబ్దప్రయోగమునుగాని యుంచిశబ్దప్రయోగమునుగాని నిర్వహింపఁజాలు ప్రాచీన మహాకవిప్రయోగము లభింపలేదు. శరణ్యకర్తగా రుదాహరించిన యర్వాచీనకవి ప్రయోగములు పెక్కుప్రకృతమగు నపాదానపంచమీస్థలములు కావు. ఆప్రయోగములలో సప్తమిని 'ఉండి' శబ్దమును నిల్పినచో, సుసమన్వితముగా నుండును.

---

విస్తర. III ౨౪౭ విమ:—పై సందర్భమునుబట్టి "వాఁడు ఇంటిలోనుంచి పుస్తకము తెచ్చెను, అని ప్రయోగించడమే సహజముగా కనబడుతున్నది" (బాలక. ౧౯౧ పు.) అనువాక్యము సరికాదని స్పష్టపడుచున్నది. "ఉంచి"కి వదలి అనే అర్థ మెట్లు చెప్పఁగలిగిరో మాకు తెలియదు" (బాలక. ౧౯౨ పు.) ఏల తెలియదో ఉండునట్లుచేయు = ఉంచు, ఉండిపోవునట్లుచేయుట యనఁగా వదలివేయుటయేకదా.

ఉ......పురివెల్వడినప్పటనుండి నీమొగం। బున్న తెఱఁగుఁ గాంచి దిగులొందుచు నుందు......” మొ. (బాలక. ౧౯౫ పు.). క. అప్పటనుండియు నెవ్వగ (ఉద్యో. ౨ ఆ. ౧౯.) (అప్పటన్+ఉండి యిప్పటికిని నెవ్వగఁ గప్పికొనిన.) సంస్కృతమున నపాదానార్థమున “గృహా ద్రాజగామ-వనా ద్రాజగామ” అనురీతి నపాదానపంచమి వచ్చుచుండును. తెల్గునందును నల్లె బాల- కారక- ౯ సూత్రము చొప్పున గృహము వలన వచ్చెను. వనమువలన వచ్చెను. అనురూపములు సంస్కృతానుకారులయి సాధువులు కానోపును. ప్రయోగములు:—క. విద్యయొసఁగును వినయంబు వినయమునను। బడయఁ బాత్రత పాత్రతవలన ధనము। ధనమువలనను ధర్మంబు దానివలన। నైహికాముష్మికసుఖంబు లందు నరుఁడు చ. నరవరుఁ డైన భీమువలనం బ్రభవించె హిడింబకున్ సుతుం। డు (ఆది. ౬ ఆ. ౨౩౫.) (౨౮౬ I విష.). ఇట్టి వలనవర్ణకముయొక్క యర్థమును బ్రకాశింపఁజేయుచు దీనిపై ‘ఉండి’ శబ్ద మనుప్రయుక్తమగునని సూరి సూత్రించెను. అది సరికాదు. అట్టి ప్రయోగములు మృగ్యములు. ఒకటి రెండు ప్రయోగము లున్నను నందలి ‘వలనన్’ అనునది యోపవిభక్తిక వలనుశబ్దపు సప్తమ్యంతరూపమనియు నట్టి సప్తమి యధికర ణార్థకమయి యచటి యుండుధాతు క్త్వార్థముతో నన్వయించుననియు గ్రహింప వలయును. ఆ-వె. విష్ణుపదమువలన విధునివలన సూర్యు। వలన మేరురూపకలితుఁ డైన। విష్ణువలనఁ ద్రిపురవిజయిమౌళివలన। నుండి హిమనగమున నొలసె గంగ. (అను. ౨ ఆ. ౧౧౮.). వలను శబ్దమున కిట్టి యోపవిభక్తికసప్తమ్యర్థక ప్రయోగములు ప్రసిద్ధములెయ్యెయున్నవి. సీ. కమలాక్షి యెవ్వరి।యింటఁ దానుండె నయ్యింటివలనఁ। బెఱవారు సనకుండ. (ఆది. ౮ ఆ. ౧౧౫.) సీ. వడి దాని పోయినవలనిఁ జూచు. (అర. ౨ ఆ. ౨౬.) సీ. వర్గత్రయంబున వలనను సప్తాంగములయందుఁ జిత్తంబు మెలఁగు చుండ. (శాంతి. ౬ ఆ. ౨౦౦.)

సప్తమీవిభక్తి ప్రత్యయంబు లన్నిటిమీఁదను ‘ఉండి’ శబ్దము సుసమన్వితమై యుండును. ఇయ్యది మహాకవి ప్రయోగసమ్మతము. సీ.........గీ. ఇతఁ డపూర్వమనుజుఁ డెందుండివచ్చెనో.........(అర. ౨ ఆ. ౩౯.) సీ.........కావున దేవి యిద్దేవపథము। నందుండి వసుమతి కొందంగఁ జనుదేరవలయు. (అర. ౩ ఆ. ౮౦ ప.) సీ.........హరుశిరంబు। నందుండి భువనైకవందిత సురనది, ధరణీతలంబున కరుగుదెంచి. (అర. ౩ ఆ ౮౩.) గీ. అద్దనుజవరుని తనువునందుండి.........పురుషుండు వెడలిన. (శాంతి. ౩ ఆ. ౧౮౧.) క.........సనత్కుమారుఁడు మహికిం। జనుదెంచె బ్రహ్మలోకం। బుననుండి

(ఆది. 3 ఆ. ౯౧.) క.........వచ్చెన్ గగనం । బునసుండి కమలమిత్రుఁడు (ఆది. ౫ ఆ. ౨౦.) సందర్భయోగ్యపదవ్యవధానమును గలదు. వచన. ఎందేనినుండి యొక్కమహామునివచ్చి. (ఆది. 3 ఆ. ౧౮౦.) వచన........ఋషు లెందేనినుండి యాత్రాపరులై కురుక్షేత్రంబునకుం బోదురు. (ఆర. ౨ ఆ. ౨౬౪.)

ద్వితీయమీఁది యుండికిఁ బ్రాచీనమహాకవి ప్రయోగములు కన్పట్టలేదు. "వనమునుండి వచ్చెను - గృహమునుండి వెడలెను" మున్నగు వ్యావహారికవాక్యములు సాధువులనువారు సయితము "వనమున్+ఉండి - గృహమున్+ఉండి"అని ఛేదముచేసి యచటి ద్వితీయకు "ఇతరత్ర చద్వితీయా" అనుచింతామణిసూత్రము చొప్పున (ప్రౌఢ. కార. ౪ సూ. వివరణము.) సప్తమ్యర్థము చెప్పుకొనుటకన్న వేఱగు ప్రాచీనవైయాకరణసమ్మతమార్గము లేదుగదా. కావున నెచ్చటనైన 'ఉండి' శబ్ద పూర్వసప్తములెల్ల నధికరణార్థకములె యనియు నవి యుండుధాతుక్త్వార్థకమగు 'ఉండి' శబ్దముతో నన్వయించుచున్నవనియు నెన్నవలెను. వాని నపాదాన పంచమి కాదేశములుగా సూరి సూత్రించుటయు, నచటి 'యుండి' శబ్దము విభక్త్యర్థద్యోతక మగు ననుప్రయుక్తశబ్ద మనుటయు సరికాదు. ఈక్రింది యుదాహరణములలోని "ఉండి" శబ్దములేని యంద్వాదిసప్తమీవిభక్తి ప్రత్యయములును ద్వితీయాప్రత్యయములును నపాదానార్థకపంచమికాదేశములె ('అన్యస్యాః క్వచి ద్భవేచ్చాన్యా' అనుచొప్పున) యనియు నధికరణార్థకములుగాని కర్త్రార్థకములుగాని కానేరవనియుఁ జెప్పుట యుక్తము. ఉండిశబ్దములేని సప్తమికిఁ బ్రయోగములు:—క. పడినది వీపున వెడలిన (అశ్వ. ౪ ఆ. ౬౪.) ఉ.........తన్ముఖనేత్ర నాసికా । ద్వారములందు వెల్వడియె దారుణవహ్నిశిఖాకలాపముల్. (ఆర. ౪ ఆ. ౪౧౦.) (ద్వారములందున్ = ద్వారములవలన) (అపాయార్థపంచమి.). క. నలుఁ దొల్లి యాక్రమించిన । కలి కర్కోటకవిషంబుఁ గ్రక్కుచు నోడలన్ । వెలువడి............... (అర. ౨ ఆ. ౧౭౯.) వ. నాయం దధికధనంబుఁ గొనిపొమ్ము. (ఆది. ౨ ఆ. ౧౯3.) (ఇది గ్రహ్యాదియోగజపంచమి.) క.........ముఖనేత్రనాసికా రంధ్రములం । దనవరతరోషపావక । జనితశిఖావితతు లక్కజంబుగ వెడలెన్. (ఆర. ౬ ఆ. 3౧౬.) చ......నూతిలో । వెలువడఁ గోమలిం దిగిచె. (ఆది. 3ఆ. ౧౪౪.) (విస్తర. IV) చ..........నీరిలో । ను వెడలకుండి కూర్మ మతనుస్థితి. (అను. ౧ ఆ. ౨3౨.) సీ.........నరేంద్ర.........మనువర్యనీయందుఁ బడయు నెన్నిక...

---

విస్తర. IV ౨౪౭ విష:—"వలన కాదేశంబగు ద్వితీయాసప్తములమీఁది యుండికి లోపంబు బహుళంబుగానగు. (ద్వితీయమీఁదనున్న యుండి కొక్క

...............వచ్చితి, ననురాగవతినైన ననువరించి । పదఁగుము నాయం దపత్యంబు. (మనుచ. ౬ ఆ. ౯౮.) ఇట్టియెడల "అందు" విభక్తికి లేని 'వలన' వర్ణకార్థము నంగీకరించి, సూ. రా. నిఘంటుకర్త లుదాహరించిరి. (చూ. సూ. రా. ని. అందు శబ్దమునొద్ద.) ఈపక్షమున నీక్రిందిప్రయోగములచొప్పున ద్వితీయా 'ను' ప్రత్యయమునకును వలన వర్ణకార్థము నేల యంగీకరింపలేదో తెలియకున్నది. ఉండిలేని ద్వితీయా ప్రయోగములు. చ.........చే దినం । దను తనువున్ బృహద్రుధిరధారలు బోరన మీఁది కొల్కఁగన్. (సభా. ౨ ఆ. ౬౮ ప.). (విస్తర V) ఉ.........పృథుదేహము వెల్వడి తేజమంబరం । బెల్ల వెలుంగవచ్చి॰ (సభా. ౨ ఆ. ౬౯.) క.........విద్యాధరసములు పురము వెల్వడిరి. (అర. ౧ ఆ. ౧౫౪.) ఉ.........కూ । ర్మము గడంగి నీర్వెడలి. (అను. ౧ ఆ. ౨33.) (నీర్వెడలి = నీరిని వెడలి = నీరివలన వెడలి.). శా.........మృత్యువున్ । గావం గోరు బహుప్రకారముల లోకంబు......(నిర్వ. 3 ఆ. ౬౯.) (మృత్యువున్ గావన్=మృత్యువు వలనఁ గావన్. త్రాణార్థకపంచమి.)

---

ప్రయోగమైనఁ గలదా.). బహుళగ్రహణముచే నందు మీఁదియుండికి లోపంబు కలుగదని యెఱుంగునది. ఈసూత్రము నిట్లు చెప్పుట కంద్వితరసప్తమ్యర్థకవర్ణకం బులమీఁది యుండికి లోపంబు వచ్చుట ప్రయోజనంబు" (ప్రౌఢ. కార. ౧౧ సూ.) పైరీతి నందువర్ణకముమీఁది యుండిలోపమును జూచికొనక ప్రౌఢవ్యాకర్త ప్రమాదపడి వ్రాసెను. గుప్తార్థప్రకాశికాకర్త యీప్రౌఢవ్యాకరణవిషయములఁ దనగ్రంథములో నెక్కించెను. "బహుళగ్రహణముచేత వనమందుండి వచ్చెను ఇత్యాదులందలి యుండికి లోపంబు గలుగదు........." (బా. గు. ప్ర. కార. ౧౧ సూ. వ్యాఖ్య.)

విస్తర. V ౨౮౭ విమః—పయిరీతి నుండి లేనిస్థలములందు బహుళముగా వలనకు ద్వితీయా సప్తమ్యాదేశములుగల ప్రయోగములు వెలయుచుండఁగాఁ బేటికావ్యాఖ్యాత యీక్రిందిరీతిని వ్రాయుట కేవల మపరిశీలనమూలకము. "ఉండి లేని వలన వర్ణకమున కీవిధి గలుగదని గ్రహించునది. (౨౭౭ పుట.). "ద్వితీయ మీఁద నున్న యుండికిని సప్తమ్యర్థకముమీఁద నున్న యుండికిని లోపము ప్రాచీన ప్రయోగములం దగపడమింజేసి (యు) సూరి త్రిలింగలక్షణశేషమార్గము నాదరింపఁ దయ్యెను.........ఇట్టి యుండి లోపించిన ప్రయోగములు తొలుతటి తెలుఁగుఁ గబ్బముల మృగ్యములయ్యె. నన్నయప్రయోగముల నుండి పరముగా సప్తమియే దృష్టము." (౨౭౮ పు.) (బా. సా. వే. కార. ౧౧ సూ. వ్యాఖ్య.)

ఉండిపదం బొ కానొకచో వలనవర్ణకంబున కను
ప్రయుక్తం బగు. ౧౦.
హిమగిరివలననుండి గంగ వొడమె. నాకంబువలన
నుండి నారదుండు వచ్చె.

బాలవ్యాకరణ వివృతి. ౨౮౭ I విష.

ఉండిశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్త
ములు ప్రాయికంబుగ నగు. ౧౧.
వనమునుండి వచ్చె, వనమందుండి వచ్చె, ఊరినుండి
వచ్చె, ఊరనుండి వచ్చె. వనమునుంచి - ధనమునుంచి
యని యుంచి శబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు
వ్యవహరించెదరు. కాని యది సాధుకవిప్రయోగా
రూఢంబుగాదని యెఱుంగునది.

సంజీవని. ౨౮౭ I విష:—౧౦ సూ. వ్యాఖ్య:—వలన పై ననుప్రయుక్త
మగు "ఉండి" శబ్దమునకుఁ బ్రయోగములు మృగ్యంబులనియు నేఁడే నొకటి
రెండుస్థలములు దొరకినను నందలి 'వలనన్' అనునది యేపవిభక్తిక వలనుశబ్ద
సప్తమ్యంతరూపమె యనఁదగియుండుననియు నీవఱకు వ్రాయఁబడెను. (౨౮౭ విష.).
ఆ-వె. విష్ణుపదమువలన విధునివలన సూర్యు । వలన మేరురూపకలితుఁడైన । విష్ణు
వలనఁద్రిపురవిజయిమౌళివలన । నుండి హిమనగమున నొలసె గంగ. (అను. ౨ ఆ.
౧౧౮ ప.). ఇందుఁ బెక్కు వలనల కొక్క యుండిశబ్దము నిల్పఁబడుటయు నిందలి
'వలనన్' అనునది ప్రత్యేకపదమనుటకు సహకారియగుచున్నది. వివిధసప్తమ్యంత
ముల మీఁదను 'ఉండి' శబ్దము నిల్చుచుండుటయు నద్దానితో నట్టి సప్తమ్యంతము
లన్వయించుచుండుటయు బహుప్రయోగప్రదర్శనపూర్వకముగా నీవఱకుదాహరింపఁ
బడెను. (౨౮౭ విష.). అట్టి విషయమునె "పరేషాండ్వ్యాదిశబ్దేషు । సప్తమ్యాద్యా
విభక్తయః" అను నథర్వణకారిక విశదీకరించుచున్నది.

౧౧ సూ. వ్యాఖ్య:—"వనమందుండివచ్చె - ఊరనుండివచ్చె" అనురీతి
సప్తమ్యంతప్రయోగములు మహాకవిసమ్మతములు నథర్వణసమ్మతములు (౨౮౭ విష.)
నయి యున్నవిగాని వానిలోని యందువర్ణకము వలన కాదేశముగా వచ్చినదనుట
సరికాదు. ఉండిశబ్దముతో నన్వయించుచున్న యచటి 'అందు' వర్ణక మధికరణార్థ
కము. సంస్కృతములోని యపాదానపంచమీస్థలములు పయిరీతిని 'ఉండి' శబ్దముతో
నన్వయించు నధికరణార్థకసప్తమిచేఁ దెలుఁగున వచింపఁబడునని యెఱుంగునది.
ఖా.........నన్నుఁ జూడఁ జనుదే వెన్నాళ్ళనో యుండి" (పాండు. 3 ఆ.)

అనురీతి ప్రయోగములందలి 'ఉండి' శబ్దము ప్రభృత్యర్థకముగానఁ బ్రకృతమగు నపాదానార్థస్థలవిషయకము కాదని కొందఱియాశయము. "ఉండి - అవ్య...... ౪. ప్రభృతి (మొదలుకొని) అనునర్థమును దెలుపును. ఉ.........సుధారసము చింది పయిం దిగువాఱ నంతనుం। డి న్నెల సన్నగిల్లు. (విజ. వి. ౧ ఆ. ౭.) (అంత నుండిన్.........అదిమొదలుకొని) (అంతన్, అనునది ప్రథమాంత మెట్లగును ?)" (సూ. రా. ని.). "నాటనుండి - నేఁటనుండి - ఇంతటనుండి - అంతటనుండి. అవని రాజ్యభరంబుఁ బూనిన యంతనుండి.........ఇత్యాది వచన మాచార్యస్య. అందుండి పలికె రప్పుడు ఇత్యాదౌ 'ఉండి' శబ్దస్య స్థిత్యేత్యస్య పర్యాయత్వమ్..." (అహో. ౩౬౩ పు.) అని యహోబలపతి వ్రాసెను. పైవానియందును నుండిశబ్దమునకు సప్తమితో నన్వయము కుదురకపోలేదు. ప్రభృత్యర్థకములకునుందుఁ బ్రథమ నిల్చుట యుక్తము. ఇంక ,"వనమునుండివచ్చె-ఊరినుండివచ్చె" అనురీతిని ద్వితీయమీఁద నుండిశబ్దము నిలిచి యపాదానపంచమ్యర్థమును వచించు ప్రయోగములు ప్రాచీనమహాకవి గ్రంథములందుఁ గన్పట్టలేదు. "గుడినుండే గుడిరాళ్లు మ్రింగుట-అని రుక్మాంగదచరిత్ర ప్రయోగము కనబడుతున్నది" (బాలక. ౧౯౩ పు.). అని శరణ్యకర్తగారు వ్రాసిరికాని యీప్రయోగము ప్రకృతమగు నపాదాన పంచమీస్థలము కాదు. అధికరణార్థకము. ఏవేని యర్వాచీనప్రయోగములలో "వనమునుండివచ్చె - ఊరినుండివచ్చె" అనురీతిని బ్రయోగింపఁబడినను నచటి ద్వితీయ "ఇతరత్ర చ ద్వితీయా" అనుచెప్పిన సప్తమ్యర్థకమె కాని యపాదాన పంచమ్యర్థకము కాదని యచటి "ఉండి" శబ్దముతోడి యన్వయము విశదపఱుపఁ గలదు. వనమున్ = వనమందు, ఉండి = ఆపలకునుండి, వచ్చె ననునర్థ మచట సుసంగతముగా నుండును. ఇట్లె యంతటను నెఱుంగునది. "నన్నుండి - నిన్నునుండి - వారినుండి - వీరినుండి - మమ్ముండి - మమ్మునుండి - అందుండి - ఎందుండి - ఇందుండి........." (అహో. ౩౬౨ పు.) అని కవిశిరోభూషణమున నుదాహరింపఁ బడెను. వీనియందలి 'అందుండి' మున్నగునవి సప్తమ్యంతములె. 'నన్నుండి' మున్నగునవి కవిప్రయుక్తములయినచో నట "ఇతరత్ర చ ద్వితీయా" అనుచింతామణి సూత్రముచెప్పిన సప్తమ్యర్థమునవచ్చిన ద్వితీయలే యని చెప్పవలసి యుండును. "ఉండి - అవ్య.........౩ హేత్వర్థకము. క. నిన్నుండి వీనిరూపముఁ। గన్నులఁ జూడంగఁ గలిగె.........(అని. ౨ ఆ. ౧౩౭.) (నిన్నుండి = నీవు కారణముగా.........)" (సూ. రా. ని.). ఇచట "నిన్నున్ = నీయందు = నీసహాయమందు, ఉండి = ఉండుటచేత" అని యర్థముచేసినచో హేత్వర్థకత్వము లభింపఁ

గలదు. అజడస్థలములందును ద్వితీయవచ్చుటచేకవిప్రయుక్తమగుట నది విరుద్ధము కాదు. "ఒక్కొకచో భూతార్థకాసమాపక్రియ హేత్వర్థకంబగు. ఉదా:—రాహు కంఠము దెగి దేహము ధరణిఁబడియె. (భార. ఆది. ౨ ఆ.)" (ప్రౌఢ. క్రియా. ౧౫ సూ.). "వనమునుంచి - ధనమునుంచి........" అనువాక్యముచే సూరి 'వనమునుంచి వచ్చెను' ఇత్యాదివాక్యముల నంగీకరింపకుండుట యుక్తమె కాని కొన్నియెడల ద్వితీయమీఁది 'ఉంచి' శబ్దప్రయోగము సుసమన్వితమగుచుండుట చేత నట్టియెడల నర్వాచీనకవిప్రయోగములనుబట్టి సాధుత్వము నంగీకరించుట యుక్తము. 'మంచమునుంచి దిగెను' అనుచో మంచము నచట నుంచివేసి దిగె ననునర్థము సుసమన్విత మగుచున్నదిగదా. పరేష్వాఙ్యాదిశబ్దేష్విత్యాద్యథర్వణ సూత్రములోని యాదిశబ్దముచే 'ఉంచి' శబ్దమును బ్రయోగానుసారముగ గ్రహించుట యావశ్యకము. "కాంచియమ్మంత్రి యెచ్చోటనుంచివచ్చె" (కృష్ణ రాయవిజయము. IV ౨౬౦ బాలక. ౧౯౪ పు.) ('ఎచ్చోటనుంచి' అనుపాఠము ముద్రణసంస్కర్తృప్రమాదకృతము.). ౨౪౭ విషయమున "ఉండి - ఉంచి' అను వానినిగుఱించి విపులముగ వివరింపఁబడెను. (విస్తర.)

సర్వవిభక్తిః సంస్కృతతుల్యా. (ఆం. చిం. హలం. ౧౫ కారి. అహో. ౪౨౩ పుట)

అన్యారాదితరర్తేదిక్ శబ్దాఞ్చూత్తర పదాజాహి యుక్తే. (౨-౩-౨౯.) ఏభిర్యోగే పఞ్చమీ స్యాత్. అన్యేత్యర్థగ్రహణమ్. ఇతరగ్రహణం ప్రపఞ్చార్థమ్ - అన్యో భిన్న - ఇతరో వాకృష్ణాత్. ఆరాద్వనాత్ - ఋతేకృష్ణాత్ - పూర్వోగ్రామాత్......చైత్రాత్పూర్వః ఫాల్గునః............ప్రాక్ ప్రత్యగ్వా గ్రామాత్.........(సి. కౌ. ౫౯౫ సూ.)

నన్నయా.
౨౪౧ విషయము.

కంటేఽన్యారాదాదేః. (ఆం. చిం. అజం. ౮ కారి. అహో. ౨౭౩ పు.)

---

విస్తర. ౨౪౭ I విష:—"ఉండిపదంబు పరంబగుచో వలన కందువర్ణక మట్లు నవర్ణకంబు నగు" (ప్రౌఢ. కా. ౧౦ సూ.). "వలన కాదేశంబగు ద్వితీయాసప్తముల మీఁది యుండికి లోపంబు బహుళంబుగా నగు........బహుళగ్రహణంబుచే నందు మీఁదియుండికి లోపంబు కలుగదు........" (ప్రౌఢ. కార. ౧౧ సూ.) అని యిట్లు బాలవ్యాకరణమును సవరించుచుఁ ద్రిలింగలక్షణశేషకర్తయు ద్వితీయా సప్తములు వలన కాదేశమనియె వచించెను.

కల్పతరు. ౨౮౫ విష:—సర్వవిభక్తి రిత్యాదిసూత్రము ౨౩౮ విషయమున వ్యాఖ్యాతము - పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియే మూలము. అన్యారాదిత్యాది:—అన్య = అన్యశబ్దార్థకములగు 'ఇతర - భిన్న' మున్నగుశబ్దములయోగమందును, ఆరాత్ = దూరసమీపార్థకశబ్దములయోగమందును, ఇతర - ఋతే - దిక్శబ్దాఞ్చూత్తరపద - ఆచ్ - ఆహియుక్తే = 'ఇతర - ఋతే' అనుశబ్దములయు, అఞ్చుధాతూత్తరపదకములగు దిక్శబ్దములయు, ఆచ్ - ఆహిప్రత్యయాంతములయు, యోగమునందును బంచమీస్యాత్ = పఞ్చమీవిభక్తియగును. అన్యశబ్ద మన్యార్థపరమగుటచే సూత్రములోని 'ఇతర' శబ్దమన్యాదుల విస్తృతిని దెల్పును. ఉదా:—అన్యో - భిన్న - ఇతరోవాకృష్ణాత్ = కృష్ణకంటె = కృష్ణునకు - నన్యుఁడు - భిన్నుఁడు - ఇతరుఁడు. ఆరాద్వనాత్ = వనముకంటె = వనమునకు - దూరము సమీపము. ఋతేకృష్ణాత్ = కృష్ణునికంటె = కృష్ణునకుఁ దప్ప, పూర్వో గ్రామాత్ = గ్రామముకంటె = గ్రామమునకుఁ బూర్వము. చైత్రాత్పూర్వః ఫాల్గునః = చైత్రమునకంటెఁ=చైత్రమునకు-బూర్వము ఫాల్గునము. ప్రాక్ - ప్రత్యగ్వా వనాత్ = వనముకంటెఁ = వనమునకు - దూర్పు - పడమర, మొ. పైస్థలములందుఁ దెల్గున "కు" వర్ణకమునకును వాడుకగల్గుటంజేసి యట్లు చూపఁబడెను.

కంటేఽన్యారాదిత్యాది:—అన్యారాదాదేః = అన్యారాదిత్యాది పాణినీయ సూత్రసిద్ధమగు పంచమిచోట, కంటే = కంటెవర్ణకమగును. సంస్కృతమున హ్రస్వవక్రములు లేమింజేసి భట్టారకునిచే "కంటే" అని ప్రయోగింపఁబడినను నచట 'కంటెన్' అనునదియే యుద్దేశింపఁబడినదని యెఱుంగునది. ఉదా:—రామునికంటె నితరుఁడు, వనముకంటె = వనమునకు దగ్గఱ. మొ. ప్రయోగములు:—చ...... అంబుజనాభునిఁ బ్రీతుఁజేయుకంటెను హితమైనకృత్య మొకటింగలదే...... (ఉద్యో. 3 ఆ. ౧౫౮.) ఒకటి = వేఱొకటి, ఒకటి యన్యార్థకము. "ఏకే ముఖ్యాన్య కేవలాః" అని యమరము. ఒకటిశబ్ద మేకశబ్దార్థకము. సీ. ఇంత । కంటెను గష్టంబు గలదె యొండు. (సభా. ౨ ఆ. ౨౬౯.) అధికహీనాదిశబ్దయోగమునందును "కంటె" వర్ణకమగును. ఉదా:—నీకంటె నధికుఁడు. మొ. ఇట్టి 'కంటె' వర్ణకముచోట'కు' వర్ణకము నిల్చుటయుఁ గలదు. "అధికశబ్దేనయోగేసప్తమీ పఞ్చమ్యావిష్యేతే." 'తస్మిన్నధికమ్' (సి. కౌ. ౧౮౪౬ సూ.) ఇతి, 'యస్మాదధికమ్' (సి. కౌ. ౬౪౫ సూ.) ఇతి చ సూత్రనిర్దేశాత్" (సి. కౌ. ౬౪3 సూత్రపువివరణము.) అని సంస్కృతమునందును నధికశబ్దయోగమునఁ బంచమి యంగీకరింపఁబడెను. క......ప్రజా । పరిపాలనంబు

కంటెను । ధరణీశ విశేష మొండు ధర్మము గలదే. (అర. ౧ ఆ. ౨౫౫.). పెక్కు శబ్దముల కొక్క 'కంటె' వర్ణకము నిల్చుటయుఁ గలదు. ఉ. సూతసుతుండు వీఁ డనక సూనుల తమ్ములకంటె నాకు సం । ప్రీతి యొనర్చి. (ఉద్యో. ౪ ఆ. ౩౯ ప.) కువర్ణక స్థితికిఁ బ్రయోగము:—గీ......జలపూర్ణమంగళకలశమునకుఁ । బాద్యమునకును గుశలసంప్రశ్నమునకు । మిగుల నొండు జనార్దను మెచ్చుగాదు. (ఉద్యో. 3 ఆ. ౧౬౧.) ఉ...... . ఉ । ర్వీవరుఁ డాత్మశక్తి కతిరిక్తములైన సముద్యమం బులన్. (శాంతి. 3 ఆ ౧౭౨.) క. విలువిద్య నొరులు నీక । గ్గలముగ లేకుండ నిన్నుఁ గల్పను ........(ఆది. ౫ ఆ ౨౩౯.). కంటె వర్ణకమున కర్వాచీన రూపము 'కన్న' అనునది. చ.........అ । న్ననదముకన్నఁ దిన్ననయి. (వసుచ. ౨ ఆ. ౫౬) క నిన్నుఁ జెలి గొన్న హైహాయు । కన్నం దోర్వీర్య మెక్కుడగు భార్గవు [illegible] । ల [illegible] నన్నను శూరుండు ముజ్జగంబులఁ గలఁడే. (చమత్కారచంద్రికయందుగల ఉప్పు. 3 ఆ. ౨౩౭ ప.)

కంటె వర్ణకం బన్యర్థాదియోగజంబగు పంచమి
కగు. ౧౭.

బాల్యా. రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు.
వివరణము. క్రోధంబుకంటె నితరంబు దోషంబు లేదు. ఇచట
౨౪౭ I విషయము పష్ఠియు నగు. రామున కన్యుండు ధానుష్కుండు
లేఁడు. అన్యము - ఇతరము - పూర్వము - పరము -
ఉత్తరము ఇత్యాదు లన్యాదులు.

సంజీవని. ౨౪౭ I విష:—అన్యార్థాదియోగజంబగు అన్యారాదితర్యాది పాణినీయసూత్రోక్తశబ్దయోగమునఁ గల్గుపంచమికి "కంటె" వర్ణకంబగు నని యర్థము. ధానుష్కుండు = ధనుర్విద్యాకుశలుండు. ప్రయోగాదు లెల్ల ౨౪౭ విషయమున విస్తరింపఁబడెను.

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (ఆం. చిం. ౧౫ కా. హాలం. అహో. ౪౨౩ పు.)

నన్నయా. షష్ఠ్యమీవిభక్తే (౨-3-౪౨.) విభాగోవిభక్తమ్. నిర్ధా
౨౪౯ విష. ర్యమాణస్య యత్ర భేద ఏవ తత్ర పఞ్చమీ స్యాత్.
మాథురాః పాటలిపుత్రకేభ్య ఆఢ్యతరాః. (సి. కౌ.
౬౩౯ సూ.)

కల్పతరు. ౨౪౯ విష:—సర్వవిభక్తిరిత్యాదిసూత్రము ౨౩౪ విషయమున వ్యాఖ్యాతమయ్యెను. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము.

పఞ్చమీత్యాది:—విభక్త మనఁగా విభాగము. నిర్ధారణావధికిని నిర్ధార్యమాణమునకును నెచట భేదమె యుండునో యచట నిర్ధారణావధివాచకముకంటెఁ బంచమి వచ్చునని యర్థము. ఉదా:—మాథురాః = మధురాదేశీయులు పాటలిపుత్రకేభ్యః = పాటలిపుత్రవాసులకంటె, ఆఢ్యతరాః = అధికధనవంతులు. ఇచట మాధురులు పాటలిపుత్రవాసులును బరస్పరము భిన్నులు. నిర్ధార్యమాణులు మాధురులు. నిర్ధారణావధిభూతులు పాటలిపుత్రవాసులు. కాన నిర్ధారణావధివాచక పాటలిపుత్రశబ్దమునకంటెఁ బంచమి యయ్యెను. "అత్ర మధురాదేశీయత్వ పాటలిపుత్ర దేశీయత్వయోః గోత్వాశ్వత్వవత్ విరోధాత్ కథంచిదపి తద్రూపేణ నాఽభేదఇతి నిర్ధారణావధేః పఞ్చమీతిభావః" (బాలరు. వ్యాఖ్య. ౬౩౯ సూ.) "కాకాత్ కోకిలః కృష్ణః ఇత్యాది నిర్ధారణే పఞ్చమ్యేవ నతు షష్ఠీసప్తమ్యావితి వక్తవ్యమ్" (ముగ్ధ. దుర్గా. ౩౧౩ సూ.) కాక కోకిలములు పరస్పరవిభిన్నములు గాన నిర్ధారణావధివాచకము పఞ్చమ్యంతమయ్యెనని భావము. షష్ఠీసప్తములు వచ్చెడి నిర్ధారణముగల "మనుష్యులలో క్షత్రియుఁడు శూరుఁడు" మున్నగుచోట్లలందు క్షత్రియులును మనుష్యులే కాన నిట్టి కేవలభేద మచట లేదని తాత్పర్యము. పై రీతిని సంస్కృతమున "పఞ్చమీవిభక్తే" అనుసూత్రముచొప్పున "కాకాత్ కోకిలః కృష్ణః" మున్నగుచోట్లఁ బంచమియే వచ్చునుగాని తెలుంగున "కాకముకంటెఁ గోకిలము నల్లనిది. కాకమునకుఁ గోకిల నల్లనిది" అని యిట్లు పంచమియు షష్ఠియుఁ బర్యాయమున నగును. క. భూరిగుణోన్నతు లనఁదగు। వారికి ధీరులకు ధరణివల్లభులకు వా।క్పారుష్యము సన్నె మహా।దారుణ మది విషముకంటె దహనము కంటెన్. (సభా. ౨ ఆ. ౧౭ ప.) ఆ-వె. కన్న నగవు లోకగర్హితుం డగు దుస్స। నేను చెయిది కంటె.........నామనంబు.........నేర్చుచున్నయది. (అర. ౧ ఆ. ౧౩౯.) క. నర సిద్ధసాధ్యవిద్యా। ధరసురకన్యకలకంటె దమయంతియ సుం। దరి.........(అర. ౨ ఆ. ౩౧.) చ. నుతజలపూరితంబులగు నూతులు నూటికంటె సూనృత। వ్రత యొకబావి మేలు మఱిబావులు నూటికంటె నొక్కస। త్క్రతువది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు త। త్సుతశతకంబుకంటె నొకసూనృత వాక్యము మేలు భూవరా. (ఆది. ౪ ఆ. ౯౪.) సీ. నీకంటె హరి బుద్ధిలేకయే నిజ నేత్రకమలంబు పూన్చి చక్రంబు గొనియె। మఘువుండు నీకంటె మరులైయె క్రతు

తలి, నర్చించి దేవేంద్రుఁడై వెలింగె। నిఖలదేవాళియు నీకంటె నవివేకులయియె సేవించి భోగాత్ములైరి। ......... (నన్ని. కు. ౨ ఆ. ౧౬౪ ప.) (ఇందు హరి ప్రభృతులు నీకంటె నెక్కువవారని యర్థము నెన్నునది.) షష్ఠికిఁ బ్రయోగములు:— తే-గీ. విత్తరతుకుఁ గడుమేలు వృత్తరతు. (ఆర. ౪ ఆ. ౧౩౦.) క.........నాక కాదీ। త్రిలోకముల కధికుఁ జూచితిమి యొకయెలుఁగున్. (ఆది. ౨ ఆ. ౨౬౫.) క.........పుణ్య। వ్రతచర్యను నీవ యెల్లవారికి నత్యు। న్నతుఁడవు......... (ఆర. ౨ ఆ. ౨౩౮ ప.) తే-గీ. సాధ్యులకు దేవతలకుఁ బ్రజాపతులకు। శాశ్వతుఁ డితండ యని. (ఉ. హరి. ౬ ఆ. ౧౪ ప.)

కంటె వర్ణకంబు నిర్ధారణ పంచమికగు. ౧౩.

బాలవ్యాకరణ వివరణము. ౨౪౯ I విషయము — ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబె కలిగియుండు నచటం బంచమి యగు. ఆపంచమికిం గంటె వర్ణకం బగునని యర్థము. జానపదులకంటె నాగరులు వివేకులు. మానహానికంటె మరణము మేలు.

సంజీవని. ౨౪౯ I విష:—జానపదులు పల్లెలయందు వసించువారు, నాగరులు = పట్టణవాసులు. జానపదత్వనాగరత్వములు పరస్పరము కేవలము విభిన్నములు. నాగరులు వివేకులుగా నిర్ధారణము చేయఁబడెను గాన నిర్ధార్యమాణ నాగరులు జాతిగుణక్రియాద్రవ్యములచే నిర్ధారణావధిభూతజానపదులకంటె భేదమే కలిగియుండుటం జేసి నిర్ధారణావధివాచకజానపదశబ్దము కంటె వర్ణకాంత మయ్యెనని గ్రహింపవలయును. ఇట్లి యంతటను నెఱుంగునది. ఇందులకు మహాకవిప్రయోగములు ౨౪౯ విషయమునఁ జూపఁబడెను. అట్టి ప్రయోగములనుబట్టి "జానపదులకు నాగరులు వివేకులు - మానహానికి మరణము మేలు" అని షష్ఠియు నుండవచ్చును. సూరి యట్లు వచింపకుండుటకుఁ గారణము తెలియకున్నది.

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (అం. చిం. హలం. ౧౫ కారి. అహో. ౪౨౩ పుట.)

నన్నయా. ౨౧౦ విష. — విభాషాగుణేఽస్త్రియామ్. (౨-౩-౨౫.) గుణే హేతా వస్త్రీలిఙ్గే పఞ్చమీవాస్యాత్. జాడ్యా జ్జాడ్యేన వా బద్ధః - గుణేకిమ్ - ధనేన కులమ్ - అస్త్రియామ్ కిమ్- బుద్ధ్యా ముక్తః - 'విభాషా'ఇతి యోగవిభాగాదగుణే స్త్రియాంచ క్వచిత్ - ధూమా దగ్నిమాన్ - నాస్తి ఘటోఽనుపలబ్ధేః. (సి. కౌ. ౬౦౨ సూ.)

పట్టీతితు పఞ్చమీగుణే హేతౌ. (ఆం. చిం. అజం. ౭
కారి. అహో. ౨౭౧.)
కేచి న్నాస్త్రాచ్ఛ గుర్వాదే ర్ద్వత్వీక రా త్పట్టి మూచిరే.
(వికృ. క్రియా. ౧౯ కారి. అహో. ౪౯౯ పు)

కల్పతరు. ౨౫౦ విష:—సర్వవిభ_క్తిరిత్యాదిసూత్రము ౨౩౪ విషయమున వ్యాఖ్యాత మయ్యెను. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము.

గుణే = గుణము, హేతౌ = హేతువగుచుండఁగా, అస్త్రియామ్ = స్త్రీలింగే తరస్థలమున, పఞ్చమీ = పంచమీవిభ_క్తి, వాస్యాత్ = వైకల్పికముగా నగును. ఉదా:—జాడ్యాత్ - జాడ్యేనవా బద్ధః = జాడ్యముంబట్టి, (లేదా) జాడ్యము చేతను, బద్ధుండగుచున్నాఁడు. గుణేకిమ్ = 'గుణము' అననేల ? ధనేనకులమ్ = ధనముచేత కులము గల్గునని యగునేకాని ధనముంబట్టి కులము గల్గునని సిద్ధింపదు. అస్త్రియామ్ కిమ్? బుద్ధ్యా ము_క్తః=అస్త్రియామ్మని చెప్పనేల? బుద్ధిచే ము_క్తుఁడగును. బుద్ధిశబ్దము స్త్రీలింగముగాన 'బుద్ధేః ము_క్తః' అనురీతిని బంచమి కలుగదు. గుణవాచకే తరస్థలములందును స్త్రీలింగవాచకస్థలములందును బంచమి "ధూమా దగ్నిమాన్ - నా_స్తి ఘటోఽనుపలబ్ధేః" అనురీతిని బ్రయోగింపఁబడుటంజేసి - ప్రకృతసూత్రమున 'విభాషా" "గుణేఽస్త్రియామ్" అని యోగవిభాగముచేసి యట్టివానిని సమర్థింప నగునని "విభాషా' ఇతియోగవిభాగా"దిత్యాదివాక్యమునకుఁ దాత్పర్యము. "విభాషా" (వ్యాఖ్య) హేతౌపఞ్చమీవాస్యాదిత్యర్థః.........గుణేఽస్త్రియామ్ (వ్యాఖ్య)...గుణే హేతౌ వస్త్రీలిఙ్గే పఞ్చమీ వా స్యా దిత్యుక్తోఽర్థః" (బాలమ. వ్యాఖ్య. సి. కౌ. ౬౦౨ సూ.)

పట్టీత్యాది:—గుణేహేతౌ = గుణము హేతువగుచుండఁగా, వచ్చు' పఞ్చమీతు = పంచమీవిభ_క్తి, పట్టీతి = 'పట్టి' అను ప్రత్యయముచే వాచ్యమగును. "జాడ్యము+పట్టి - బద్ధుఁడు" అనుచో "అందు పట్టి కూర్చి విభ_క్తిషు"అను నథర్వణ సూత్రముచొప్పున (౮౮ విష.) నుమ్ము రాఁగా "జాడ్యము+ను+పట్టి = జాడ్యముం బట్టి బద్ధుఁడగు" ననురూపము సిద్ధించును. సంస్కృతమునందలి యొక్కొక్క విధమగు విభ_క్తి యర్థమునఁ దెలుఁగున నొక్కొక ప్రత్యయమగునని చూపుట కిట్లు వచింపఁ బడెనేకాని తెలుఁగునఁ బ్రాయికముగా హేత్వర్థమునఁ దృతీయాపంచము లెట్లును సిద్ధించునుగదా ? గీ. విద్య యొసఁగును వినయంబు వినయమునను | బడయుఁ బాత్రతవలన ధనము|.........

కేచిదిత్యాది - ద్వ్యక్షరాత్ = రెండక్షరములుగల్గినట్టియు, గుర్వాదేః = గుర్వక్షరము పదాదిని గల్గినట్టియు; నాన్తాచ్చ = భావార్థక నకారాంతశబ్దమునకుఁ బరముగాను, కేచిత్ = కొందఱు, పట్టిమూచిరే = పట్టి విభక్తివచ్చునని పల్కిరి. నకారాంతమనఁగా నుజ్యంతమని యర్థము. నాంతపదము విభక్తియోగ యోగ్యము కాకున్నను బ్రత్యేకవిధాన సామర్థ్యమున దాపైని'పట్టి' మాత్రము నిల్చును. (విస్తర.) (3౦౯ విష. చూ.) ఉదా: నీవుగలుగఁగఁబట్టి

పట్టివర్ణకంబు హేతువులగు గుణక్రియల కగు. ౧౪.

బాలవ్యా. ౨౫౦ I విషయము. జ్ఞానముంబట్టి ముక్తుఁడగు. నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడ నయితిని. ఇచట వలన వర్ణకంబు నగు. జ్ఞానమువలన ముక్తుండగు.

సంజీవని. ౨౫౦ I విష:—సంస్కృతమునందె గుణవాచకేతరస్థలములందును బంచమి యంగీకరింపఁబడుటంజేసి యుఁ గ్రియ హేతువగునపుడును బంచమి ప్రయోగ దృష్టమగుటంజేసియు "హేతువులగు గుణక్రియలకు" అని సూరిగారు సవరించిరి. కాని దేనికిని మహాకవిప్రయోగము లభింపలేదు. గుణమునకు:—జ్ఞానముంబట్టి ముక్తుఁడగు. క్రియకు:—నీవు వచ్చుటంబట్టి ధన్యుఁడనైతిని. ఇట్టియెడల వలన వర్ణకమును వచ్చునని వివరించి 'జ్ఞానమువలన ముక్తుండగు'అని యుదాహరించిరి. బా. కార. ౪ సూత్రముచొప్పున 'చేత'వర్ణకము నగునని యేల యుదాహరింపరైరో తెలియకున్నది. జ్ఞానముచేత ముక్తుండగుననియు నుండనగును.

---

విస్తర. ౨౫౦ విష:—"కొన్నియెడల హేతువునం దన్నంతక్రియల మీఁదను బట్టివర్ణకంబు విభాషనగు. ఉదా:—గీ.........ఎట్టు సమకూరు వీరికి నీప్రభావ। మీవు గలుగఁగఁబట్టి కాకిందువదన (కాశీ. ౩ ఆ. ౪౪.) పక్షంబునఁ గలుగుటంబట్టి, మొ." (ప్రౌఢ. కా. ౧౨ సూ.) ఈశ్రీనాథప్రయోగమున కీక్రింది శంభుదాసప్రయోగము మూలము కానోపును. మ. గతవిద్వేషుఁడు ధర్మనంద నుఁడు గల్గంబట్టి యిప్పాట దు। ర్గతికిందప్పితి. (ఆర. ౬ ఆ. ౯౧ ప.) ప్రాచీనకాలమున నిట్లు రెండక్షరములుగల క్రియలమీఁదమాత్రమె, పట్టివర్ణకము మాత్రమె భావార్థక నుజ్యంతములపై నిల్చుచుండుటంజేసి యథర్వణుఁ డట్లు వచించెనుగాని కాలక్రమమున, "విడువఁబట్టి" మున్నగురీతిని త్ర్యక్షరాదుల మీఁదను "పట్టి" ప్రయుక్తము కాఁజొచ్చెను. భావార్థకమయ్యును నద్దానిపైఁ బట్టీతరవిభక్తులు నిలువనేరవని పట్టివర్ణక ప్రత్యేకవిధానము నియమించుచున్నది. (చూడు. 3౦౯ విష.)

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (ఆం. చిం. హలం. ౧౫ కారి. అహో. ౭౨౩ పు.)

నన్నయా. షష్ఠీ శేషే. (౨-౩-౫౦.) కారక ప్రాతిపదికార్థవ్యతిరిక్తః

౨౫౧ విషయము. స్వస్వామిభావాదిసంబన్ధః శేషః. తత్ర షష్ఠీస్యాత్. రాజ్ఞః పురుషః. (సి. కౌ. ౬౦౬ సూ.)

యొక్కచ శేషే షష్ఠీ. (ఆం. చిం. అజం. ౮ కా.)

కల్పతరు. ౨౫౧ విష:—సర్వవిభక్తి రిత్యాదిసూత్రము ౨౩౪ విషయమున వ్యాఖ్యాతము. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదె మూలము.

షష్ఠీత్యాదిః—కారక ప్రాతిపదికార్థవ్యతిరిక్తః = కర్త్రాదికారకవ్యతిరిక్తమగు నట్టియుఁ బ్రాతిపదికార్థవ్యతిరిక్తమగునట్టియు, స్వస్వామిభావాదిసంబన్ధః = స్వస్వామి భావము మున్నగుసంబంధము శేష మనిపించుకొనును, అట్టి యర్థమునందు షష్ఠి యగును. ఉదా:—రాజ్ఞః పురుషః = రాజుయొక్క పురుషుఁడు. రాజు స్వామి- పురుషుఁడు వాని స్వమ్ము. కాన రాజపురుషులసంబంధము స్వస్వామిత్వరూపము. "విశిష్టధీహేతుః సంబన్ధః - సచానేక ప్రకారః - స్వస్వామిత్వ జన్యజనకత్వావయ వావయవిత్వ ప్రతియోగ్యనుయోగి త్వాధారాధేయత్వాదిః. సంబన్ధస్యోభయనిష్ఠ త్వేపి సంబన్ధస్య నిరూపకత్వాత్ స్వామ్యాదేః షష్ఠీస్యాత్. యదుక్తమ్ - భేద్యభేద కయోః శ్లిష్టః । సంబన్ధోఽన్యోన్య మిష్యతే।ద్విష్ఠో యద్యపి సంబన్ధః । షష్ఠ్యుత్పత్తిస్తు భేదకాత్." (ముగ్ధ. శ్రీరామతర్కవాగీశ వ్యాఖ్య. ౩౦౨ సూ.) సంబంధము ద్విష్ఠ మైనను ననఁగా వస్తుద్వయమందును నుండునదెయైనను స్వామ్యాదిసంబంధివాచ కముపైనె షష్ఠీప్రత్యయము నిల్చునని యర్థము. 'రాజుయొక్క పురుషుఁడు' అనుచో రాజుశబ్దము భేదక మనఁగా విశేషణము. పురుషశబ్దము భేద్య మనఁగా విశేష్యము. రాజనిష్ఠస్వామిత్వనిరూపిత స్వత్వాత్మకసంబంధశాలి పురుషుఁడని శాబ్ద బోధము కల్గును. 'దశరథునియొక్క పుత్త్రుఁడు రాముఁడు' అనుచో జన్యజనకభావ రూపము సంబంధము. ఇట్లె యితరసంబంధములను నరయునది. కర్త్రాదివివక్షచేయక సంబంధసామాన్యవివక్షచేయునపుడు శేషషష్ఠివచ్చునని యెఱుంగునది.

యొక్కచేత్యాదిః—శేషేషష్ఠీ = శేషార్థములం దనఁగా స్వస్వామిత్వరూపాది సంబంధార్థమునఁ బాణినీయసూత్రమునవచ్చు షష్ఠి, తెల్గున - యొక్కచ = యొక్క ప్రత్యయవాచ్యమును నగుచున్నది. చకారస్వారస్యముచేఁ బ్రాయికముగా యొక్క ప్రత్యయము ప్రయోగింపఁబడదనియు ననఁగా లోపించుననియుఁ గొన్నియెడల 'యొక్క' అనుదానిచోట 'కి-కు' ప్రత్యయములు నిల్చుననియు, గ్రహింపవలయును,

(విస్తర.). సమాసమందుఁగాని వ్యస్తతయందుఁగాని యేకవచనముందయినను బహు వచనమందైనను యొక్క ప్రత్యయము నిలువక లోపించుటయే ప్రాచీనవైయాకరణ కవీంద్రసంప్రదాయము. చ. ద్రుపదతనూజులం గెలిచి.........క। ర్ణుపడుట భీష్ములేమిని గురుండు మృతుండగుటం ధరాధిపా. (శల్య. ౧ ఆ. ౬౯ ప్రాసస్థలము.)

విస్తర. ౨౫౧ విష:—"యద్యపి యొక్కషష్ఠ్యర్థప్రతిసంవిధానం సమాస ఏవ, వాక్యస్య తు ప్రయోగః ప్రబన్ధేషు ప్రాయశోనదృశ్యతే. తథాపి తస్య ప్రయోగఇష్టఏవ, కళామధ్యేతత్పాఠేన ప్రయోగస్య జ్ఞాపితత్వాత్. కి-కు ఇతి విభక్తిస్తు అసమాసే కారకషష్ఠీతి జ్ఞేయమ్." (అహో. ౨౭౪ పు.) అను కవిశిరోభూషణవ్యాఖ్య సరికాదు. "ప్రాయశోన దృశ్యతే" అననేల? ప్రాచీనమహాప్రబంధములందు మచ్చునకేని యొక్కప్రత్యయప్రయోగము లేదు సమాసములందు సైతము విగ్రహమున నిల్చునేకాని సమాసమున "యొక్క" అనుదానిచోట "షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా । తత్పురుషసంస్థితా నామ్నామ్" అనుచొప్పున ద్వితీయా విభక్తి తుల్యముగునాకారమే నిల్చును. అట్టి ద్వితీయారూప'ను' ప్రత్యయసంబంధ ద్రుతము "ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు" అనుచొప్పున లోపించును. ల ప్రత్యయమును లోపింపదు. దానిద్రుతముమాత్రమె సమాసమున లోపించును. ఉదా:—రామునియొక్కగుణములు = రామునిన్+గుణములు= రామునిగుణములు. రాములయొక్కగుణములు = రాములన్+గుణములు = రాములగుణములు. వ్యస్తస్థితిలోను యొక్క లోపించును. "చ.........తన చిన్నిరామచంద్రుని నగు నగుమోము" (రాఘవ. ౨.ఆ.౯.) (తనయొక్క+చిన్ని రామునియొక్క+చంద్రుని నగు మోము. (భార.) తనయొక్క చిన్నిరామచంద్రునియొక్క+నగుమోము. (రామా.) అట్లయినఁ గళలలో యొక్కను బరిగణింప నేల యని యహోబలపతి శంకించెను. పైరీతి వ్యస్తప్రయోగములలో "చిన్నిరాము" అను లుప్తశేషము కళ యని తెలియుట, యొక్కకళాత్వకథనమునకుఁ బరమప్రయోజన మగుచున్నదిగదా. మఱియు, సంస్కృతవ్యాకరణోక్తవివిధవిభక్తులకును బ్రతిగా జాతి కొకటిగఁ దెనుఁగువిభక్తుల నుపదేశించుటకై యాంధ్రవ్యాకర్తలు యొక్కాదులగు కొన్నిటిని వచించిరేకాని యొక్కవిభక్తి నెవ్వరును బ్రయోగించియుండ లేదు. "ఒడయందు షష్ఠియు (అం. భూ. ౬౭ గద్య.) ఒడయఁ డనఁగా స్వామిగాన దీనిచే స్వస్వామి భావాదిసంబంధమును దెల్పు యొక్కషష్ఠి చెప్పఁబడెనని యెఱుంగునది. ఇందు యొక్కషష్ఠికి "సుతునిధనము - సుతుధనము-సుతులధనము" అనునవి యుదాహరింపఁబడినవి. (అం. భూ. ౮౮-౮౯ ప.) "షష్ఠికిం గి కు కారంబులును యొక్క లోపల యనుశబ్దములును.........అయ్యె." (కావ్యాలం. ౯౭ గద్య. ౫౩ పుట)

క. మనవారి కపుడు భీష్ముని । చనుటయుఁ గోదండగురుని సమయుటయును గ । ర్ణుని పొలియుటయును గ్రొత్తై. (శల్య. ౧ ఆ. ౩౦౩.) క......... । తమమును చూపిన । యూతం డగుటకు. (అర. ౪ ఆ. ౧౮౮.) చ. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు.........(ఆది. ౬ ఆ. ౪౫.) ఇట్టివి పెక్కు విస్తరమునఁ జూపఁబడినవి.

---

యొక్క లోపించిన ప్రయోగములు:—"యొక్క కులోపంబు బహుళంబుఁ క. నెమ్మినిధర్మజు నలువురు । తమ్ములు.........(సభా. ౨ ఆ. ౨౬౧.) (నలువురు - ప్రథమాబహువచనరూపము.) ఎ-గీ. అపుడు సమ్మెట కోలల యంకుశముల । చేటు కోలల ప్రేటుల. (ద్రోణ. ౩ ఆ. ౪౮.) క. నరగోమృగసింహంబుల । కరుణము లగు.........స్వగములు. (హరి. పూ. ౬ ఆ.) ఉ. ఇమ్ముగ సర్వలోకజను లెవ్వని యేని ముఖామృతాంశుబిం । బమ్మున.........(ఆది. ౧ ఆ. ౭౭.)" (ప్రౌఢ. కార. ౧౬ సూ.) ఏకత్వమునందును బహుత్వమునందును సమాసమునందును వ్యస్తత యందును యొక్కపష్ఠికము నిలువనేరదు. ఎ గీ. వరుస । తోడ దుర్మర్షణునియును దుర్ముఖునియు । నిండ్లు గవలకు సంప్రీతి నిచ్చె నృపతి. (శాంతి. ౧ ఆ. ౩౯౬.) క.........తా । నచ్చట నంతర్హితుఁడై । యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటి యెల్లిటి లోనన్. (విరా. ౫ ఆ. ౩౦౧.) (ఇందలి 'లోనన్' అనునది యాపవిభక్తిక లోను శబ్దరూపము.) వచ. ఇప్పాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లపహరింపుము. (సభా. ౨ ఆ. ౨౨౯.) మ. విను నీ నా యెడఁబాటు సెల్లె. (అను. ౧ ఆ. ౨౬౩ ప.) ద్విపద. దాన సందియమె గౌతముని దధీచి । వ్యాసుని శాపంబు వహ్నిపాలైన । భూసురులకు భక్తి వొలుపొంద నగునె. (బసవ. ౧ ఆ. ౪౯౨ ప.) సర్వజ్ఞు నెట్టన శరణుల రాక । కు.........(బసవ. ౭ ఆ. ౭౫౯ ప.) "గీ.........మనుజవిభుని । సరులు లేని దృక్ఛంజనశాబకములు." (నైష. ౩ ఆ. ప్రౌఢ. కార. ౧౬ సూ.) బహుత్వమున:—సీ. అంగనాజనులయుత్తుంగసంగతకుచ, కుంకుమచందనపంకములయు।...
......నవపుష్పదామములయు । .........సురభినిశ్వాసములయు । .........ధూపములయు । విలసితసౌరభావళులు దాల్చి. (ఆది. ౩ ఆ. ౧౫౬.) చ.........భూ । పతులయు విప్రముఖ్యుల సభన్.........(సభా. ౨ ఆ. ౧౦.) క. అనుజుల తనుజుల చావులు । గనుఁగొని......(ఉద్యో. ౪ ఆ. ౨౦౯.) క. మనవారల వారి వారి మానము లధిపా.(ఉద్యో. ౪ ఆ. ౨౧౯.)క. వారి తమ కొలఁదు లెఱుఁగరు. (భాస్క. యుద్ధ. ౧౩౩.) క. నీ మాహృదయములు. (భాస్క. యుద్ధ.౧౩౮.)"ధాతుజ విశేషణభావార్థక పూర్వవ్యవహితావ్యవహితకర్తృపద ప్రథమకుఁ దఱచుగ యొక్క షష్ఠియగు" (౧లో౧.) ధాతుజవిశేషణపూర్వవ్యవహితకర్తృపదప్రథమకు.....

తెలుఁగున శేషషష్ఠి యర్థవిశేషబోధకము నగుచున్నది. ఆ-వె. కఱకు దర్భ పూరి పఱపులు. (ఆది. ౭ ఆ. ౨౨౬.) దర్భయొక్క పూరి = దర్భపూరి = దర్భరూప

---

చ. తన మును పడ్డబన్నములు............(ఉద్యో. ౩ ఆ.) .........(౨లో౧.) భావార్థకపూర్వవ్యవహితకర్తృపదప్రథమకు.........వచ. మన పుట్టి బుద్ధి యెఱుఁగుట మొదలు. (వారి. పూ. ౫ ఆ.) (౨లో౨.) భావార్థకపూర్వావ్యవహితకర్తృపద ప్రథమకు.........క.........పరీక్షి । జ్జనపాలు చనుట.........(ఆది. ౨ ఆ.) తఱచుగ ననుటచే బాహుకుండు రథంబు గడపు నేర్పునకు ఇత్యాదు లెఱుంగునది. క. మేము ప । రింపనిశాస్త్రములె మాఁకరింపనిశ్రుతులే. (ఆము. ౬ ఆ.)" (ప్రౌఢ. కార. ౧౫.) "యొక్కకు లోపంబు బహుళంబు.........బహుళగ్రహణంబుచే ధాతుజవిశేషణభావార్థకముల ముందటికర్తృపదంబుల యొక్కకు నిత్యంబుగ లోపం బని యెఱుంగవలయు." (ప్రౌఢ. కార. ౧౬ సూ.) ఇట్లు వ్రాయుటకు మఱెచ్చట యొక్కలోపము గల్గదో తెలియకున్నది. ఇట్టి ప్రయోగము లింకను ననేకములు గలవు క.........భీ । మునిచేసిన యది సంజయ । ......... । విని పింపుము. (శల్య. ౨ ఆ. ౩౮౮ ప్రాసస్థలము.) క.........తము మును చూపిన । యాతం డగుటకు (ఆర. ౪ ఆ. ౧౮౮.) చ. ద్రుపదతనూజులం గెలిచి......... క । ర్ణుపడుట భీష్ములేమిని గురుండుమృతుం డగుటం ధరాధిపా. (శల్య. ౨ ఆ. ౬౯ ప్రాసస్థలము.) క. మనవారి కపుడు భీష్ముని । చనుటయుఁ గోదండగురుని సమయుట యును క । ర్ణుని పొలియుటయును గ్రొత్తే.........(శల్య. ౧ ఆ. ౩౦౩.) (ప్రాసస్థలము.) ప్రథమ నిల్పుటకు:—సీ. రోదసీకుహరంబు రుచిరాంశుతతిఁ జేసి, యర్కుండు వెలిఁగించునట్లు లమృత । సందోహనిష్యందచంద్రికఁ జేసి శీ, తాంశుఁ డానందించు నట్లు... .....(సభా. ౨ ఆ. ౬.) (అనందించు = ఆనందింపఁ జేయు.) ద్విప. నందీశ్వరుఁడు చేయునవ్రతపంబు. (బసవ. ౧ ఆ. ౨౨౧.)

కి - కులు శేషషష్ఠ్యర్థమున నిల్పుటకు:—ఉ. ఈతఁడు మీకు నాపదలకెల్లను మూలము. (ద్రోణ. ౩ ఆ. ౧౮౩.) (మీకు నాపదలకెల్ల = మీయొక్క యాపదలకెల్ల) చ. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్రుఁడు. (ఆది. ౬ ఆ. ౪౫.) సీ. నీవు రాజవుగాక నీ కేను రాజనే. (ఆశ్వ. ౧ ఆ. ౩౪.) ఆ-వె .........యజ్ఞమునకు । విఘ్న మాచరించె......... । బభ్రుభార్యఁ దనకుఁ భార్యఁ జేసె. (సభా. ౨ ఆ. ౬౫.) క... .....నాకుఁ జిత్త మూరడి యుండున్. (సభా. ౨ ఆ. ౨౮౮.) క.........కన్నుమూయదు నాకున్. (ఆర. ౧ ఆ. ౨౭౦.) ఇట్టి వింతవ్యవధానము గల ప్రయోగములును గన్పట్టుచున్నవి.

ముగు గడ్డి. దర్భపూరియొక్క+పఱుపులు = దర్భరూపముగు గడ్డితోనిర్మించిన పఱుపులు. ఉ.........దృఢదీర్ఘబాహువీ। ర్యమ్ములవారు......(ఆది. ౭ ఆ. ౧౮౦.) బాహువీర్యమ్ముఁలయొక్క+వారు = బాహువీర్యమ్ములు గలవారు. సీ......... కవలవారు.........(ఆది. ౭ ఆ. ౧౯౫.) కవలయొక్క+వారు = జంట జన్మము గలవారు = యమళులు. క.......  ....నాగాయుత బలంబువాఁడు. (ఆది. ౭ ఆ. ౨౨౪.) అయుత = పదివేలు. నాగాయుత బలంబు యొక్క వాఁడు = పదివేల యేనుఁగుల బలము గలవాఁడు. క. కడుఁ బేదమనసు వా డని। చెడనాడుదురు... ......(శాంతి. ౧ ఆ. ౧౯౭.) పేదమనసుయొక్క+వాఁడు = పేదమనస్సుగలవాఁడు = అనుద్ధతుఁడు. చ.........నృపుఁ డెట్టిభంగి వా। ని యెడ. (శాంతి. ౨ ఆ. ౩౫౦.) ఎట్టిభంగియొక్క+వానియెడ = ఎట్టిరీతిగలవానియెడ. మ. సుతువాఁడై వినయంబు నేకొనక.........(ఉద్యో. ౩ ఆ. ౨౫.) సుతుయొక్క+వాఁడు = సుతపక్షపాతము గలవాఁడు. ఇట్టి షష్ఠీ సమాసమునె యథర్వణుఁ డాభాస బహువ్రీహి యని వ్యవహరించెను. "త్రినేత్రః - పీతామ్బరః - ఇత్యాద్యనుసారేణ మూఁడు కన్నులవాఁడు - పీతాంబరమువాఁడు - పట్టుపుట్టముదొర - ఇత్యాద్యా ఆభాస బహువ్రీహయః పుంసి. స్త్రీత్వేతు - మూఁడుకన్నులయది - పట్టుపుట్టమునది. ఇత్యాద్యాః, స్యాదాభాసబహువ్రీహిః। ప్రథమాది ప్రయోగత ఇత్యథర్వణః - ప్రథమాన్తశ్చాత్ర - తచ్ఛబ్ద శ్చాన్యశబ్దశ్చ, వేఁడివెలుంగు ఇత్యాదావపి షష్ఠ్యర్థ వివక్షాయాం ప్రథమాంత ప్రయోగ ఇష్టఏవ. వేఁడివెలుఁగువాఁడు ఇత్యాది" (అహో. ౪౩౬ పు.)

డిః స్యాత్సంబన్ధార్థే। సర్వస్మా ద్యుష్మదస్మదాత్మభ్యః।
ద్విత్రివర్ణకః. (ఆం. చిం. హలం. ౧౦ కా. అహో. ౪౦౨-౪౦౩ పు.)

నన్నయా ౨౫౧ I విషయము. ఏకత్వేచ బహుత్వేచ। సంబన్ధే డి వి వర్ణకౌ. (వికృ. అజం. ౩౬ కారి. అహో. ౩౧౦ పు.)

క్వచిత్ప్రత్యయయోగేచ। తథాత్వ మభిధీయతే.
(వికృ. సంధి. ౨౫ కా. అహో. ౧౮౯ పు.)

కల్పతరువు. ౨౫౧ I విష:—సంబన్ధార్థే = శేషషష్ఠ్యర్థమున, సర్వస్మాత్ = ప్రాతిపదికము లన్నిటికంటెను బరముగ (డి వి ప్రత్యయములనుబట్టి య మహత్త్వ మందనునర్థము వ్యక్తమగుచున్నది.) డిఃస్యాత్ = డిప్రత్యయమగును, యుష్మదస్మదాత్మభ్యః = నీ - నా - తా మన శబ్దములకంటెఁ బరముగ, ద్విత్రివర్ణకః = 'దు' అను

ప్రత్యయమగును. అథర్వణుఁడు సవరించుచున్నాఁడు:—ఏకత్వేచ బహుత్వేచ = సంబంధివస్తువుల యేకత్వమునందును బహుత్వమునందును, సంబన్ధే = సంబంధార్థమున, ది వి వర్ణకౌ='ది-వి' అను ప్రత్యయములు వరుసగ నగును. సంబంధివస్తువుల యేకత్వమున 'ది' ప్రత్యయమును బహుత్వమున 'వి' ప్రత్యయమును నగును. సంబంధివస్తువు లనుమాత్రులై యున్నపుడే యీ ప్రత్యయము లగునని యెఱుంగునది. యుష్మదస్మదాత్మశబ్దములకు నుభయార్థమునకును బరముగ సంబంధివస్తుబహుత్వమునం బ్రత్యయవిధానము లే'కని విశదపఱుచుట కథర్వణుఁడు 'దు'వర్ణకమును విడిచి 'ది'వర్ణకమును మాత్ర మనువదించెనని యెఱుంగునది.

క్వచిదిత్యాది:—క్వచిత్ = క్వాచిత్కముగ, ప్రత్యయయోగేచ ప్రాతిపదికము (ది-వి) ప్రత్యయములతోఁ గూడునపుడును, తథాత్వమ్ = షష్ఠి ద్వితీయాతుల్యాకారముతో నిల్చుట, అభిధీయతే=చెప్పఁబడుచున్నది. "షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నా" మ్మనుసూత్రమునుండి పయియర్థము లభించును 'నీ-నా-తా మ' శబ్దములచోటి షష్ఠి ద్వితీయాకారమునందదు.(౨౭౦విష.) ఉదా:— రామునియొక్క = రామునిన్+ది = రామునిది (గుణము) 'ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు' అనుచోఁ జెప్పిన నంతటను ద్వితీయాకారము తుదిని నిల్చిన తిజ్మధ్యశాస్త్రసిద్ధమగు ద్రుతము లోపించును. రాములయొక్క = రాములన్+ది = రాములది (శక్తి) రామునియొక్క = రామునిన్+వి = రామునివి (గుణములు) రాములయొక్క = రాములన్+వి = రాములవి (అవతారములు). "దా। నిది కలరూపు" (ఆది. ౪ ఆ. ౩౦.) అనుచో దానియొక్క+కలరూపు = దానిన్+ది+కలరూపు = దానిది కలరూపు" అని రూపసిద్ధి నెఱుంగునది. 'ది-వి-దు' అనునవి సంబంధార్థకప్రత్యయము లనుటచేత షష్ఠ్యంతములవలెనె యీ ప్రత్యయములతోఁగూడిన శబ్దములు వ్యస్తములని గ్రహింపవలెను. ఇవి వ్యస్తములనుటను "శబ్దేభ్యో యుష్మదాదిభ్య। స్సమాసోఽపి గురు ర్భవే" త్తనుకారికయు విశదపఱుపఁగలదు. (చూ. ౨౭౧-౨౮౧ I విష.) నాయొక్క=నా+దు=నాదు.(గుణము)ఇచటి'యొక్క' స్థానమున 'దు' ప్రత్యయము నిల్చెను. ద్వితీయాకారము (నన్నున్) రాలేదు. (౨౭౦ విష.) ఇట్లె "మాదు (గుణము) నీదు (గుణము) మీదు (గుణము)తనదు (గుణము) తమదు (గుణము) మనదు(గుణము)"అనురూపములు సిద్ధించును. 'నాదుగుణములు' అనురీతి ప్రయోగములు భట్టారకునిమతమున సాధువులు కావు, ప్రయోగములు:—చ... ......దా। నిది కలరూ పెఱుంగ నవనీపతి......... (ఆది. ౪ ఆ. ౩౦.) (దానియొక్క = దానిన్+ది = దానిది = ఆశకుంతలది (కలరూపు) సీ.........వా.

వ ధమ్మిల్లభారావకలితదివ్యామోదనవపుష్పదామములయు । వారివ.........నిశ్వాసములయు । వారివ.........ధూపములయు............(ఆది. ౩ ఆ. ౧౫౬.) (వారియొక్క = వారిన్+ని+అ = వారివ.) (పుష్పదామములు.) మధ్యాక్కరము. ద్వాదశమాసిక ........। నీదు మనోరథ మెట్లు సలుపంగనేర్తు.........(ఆది. ౭ ఆ. ౧౩౩.) సీ.........ఆ-వె.........నెమ్మి నడపెఁ దనదు నేర్పు పేర్మి. (ఆది. ౩ ఆ. ౧౧౦.) క..... ...తనదుకీర్తి వెలుంగన్. (ఆది. ౫ ఆ. ౩౭.) చ. సదయము నీషఁ బంచశిఖసంయమిమోక్షముఁ దెల్పె నంటి నీ। హృదయము నాదు చొచ్చుటకు నెంతయు రోసితి..... ...(శాంతి. ౬ ఆ. ౨౦౨.) శేషషష్ఠి విశేష్యముతోనె యన్వయించునుగాన 'నీదు మనోరథము' మున్నగుచోట్ల 'మనోరథము'మున్నగునవి నిల్చినవి. కావున నవి(నాదుమనోరథము-మొ)షష్ఠీసమాసములని భ్రమింపరాదు.క... జనంబులదయిన......(సభా. ౨ ఆ. ౭౧.) మున్నగుస్థలములందువలెనే సీ...... ఆ-వె. తనదైన దివ్యదీప్తి. (అర. ౧ ఆ. ౩౪౭.) మున్నగుస్థలములందును 'తనది+ఐన' అనియే పదచ్ఛేదము చేయవలెను. 'తనదు' అని ఛేదము చేయరాదు. 'తనదు' = (తనయొక్క) అనునది విశేష్యముతో నన్వయించునేకాని 'అయిన' మొదలగు ధాతుజవిశేషణములతో నన్వయింపదు. తనయొక్కయయిన 'దివ్యదీప్తి' అనురీతి ప్రయోగములసంభవములుగదా. చ. అనుపమశౌర్య నీదుసముదగ్రగుణంబులు... (అర. ౧ ఆ. ౩౬౨) అను నన్నయపద్యమునందలి 'నీదు సముదగ్రగుణంబులు' అనుచో 'నీదుసముదగ్రగుణావళి' అని తాళపత్రమాతృకలలోఁ గన్పట్టుచున్నది. అదియె నన్నయప్రయుక్తపాఠ మనఁ దగును. అది - అవిశబ్దముల తుదివర్ణములె ది-వి-ప్రత్యయములనియుఁ బ్రాచీనకాలమందుఁ దెలుఁగున నైత ముండెడిదని యూహింపఁదగిన "అదు" ( = అది) అనుదాని సంక్షేపరూపమె 'దు' ప్రత్యయమనియు శబ్దతత్వశాస్త్రపద్ధతిని నెన్ననగును. నన్నయప్రయోగములలో నీపద్ధతికి విరుద్ధములగు బలమయిన ప్రయోగములు కానరాలేదుగాని తిక్కయజ్వప్రయోగములలో 'దు' ప్రత్యయము విషయమున వైరుధ్యము కన్పట్టుచున్నది. "అదు-అవు" (అది-అవి) అనురూపములు తెల్గునఁ గన్పట్టమింజేసి యట్టివాని యర్థస్ఫూర్తి తెలుఁగునఁ గల్గకపోవచ్చును. సంబంధిపదంబు మహద్వాచియగునపుడును బహువచనాంతమై యున్నపుడును 'దు' ప్రత్యయమువచ్చుట కవిబ్రహ్మగారిప్రయోగములలోఁ జూపట్టుచున్నది. క. పాండవులవలని కీడొ। క్కొండును లే దధిప నీదు కొడుకులు ధరణీ.........(స్త్రీ. ౧ ఆ. ౭౩.) ఆ-వె. కోరియిచ్చెఁ దనదుకూఁతుల మువ్వుర. (నిర్వ. ౨ ఆ. ౭౨.) తే-గీ.........నీదుగర్భమున వాఁడు.........(ఆది. ౪

ఆ. ౬౨.) అను నన్నయ ప్రయోగమునందలి 'నీదు' అనునది 'గర్భము' అనుదానితో నన్వయించుచున్నది. గాని 'వాఁడు' శబ్దముతో నన్వయింపలేదు గాన విరోధము లేదు. తర్వాతికవులు సోమయాజి ననుసరించిరి. ద్విపద. తమతమవీథులఁ దమదు లోఁగిళ్ళ. (రంగనా. రా. యుద్ధ. ౬౦౭ ప.) తే-గీ. తమదు పంచమములు తృతీయ ములు నగుచు. (అప్పక. 3 ఆ. 3౨౭ ప.) తే-గీ. అట్టిపని నీదుచే నేలయగు।... (స్త్రీ. ౧ ఆ. ౧3౭.) అనుపాఠము సరికాదు. దీనిటిప్పణములో "అట్టిపని యేల నీచేత నగు" అనుపాఠాంతరము వావిళ్ళవారిముద్రణమునఁ జూపఁబడెను. అట్లె తాళపత్త్రమాతృకలో నున్నది. కాన నదియె కవిప్రయుక్తపాఠము కానోపును. అహోబలపతి యీసందర్భమునఁ బొరవడెను. "ప్రాతిపదికమాత్రా దస్యవిధిః" అనుట సరికాదు. (అహో. ౪౦3 పు.) తానే యావ్యాఖ్యలోనే 'తనదుకీర్తి' అని యుదాహరించెను. ద్విపద. మద్భక్తదేహంబు మాదుదేహంబు. (బసవ. ౪ ఆ. ౮౧౨ ప.) బాలవ్యాకర్త యీవిషయములను సంగ్రహింపలేదు.

శేషషష్ఠికి యొక్కయు నగు. ౧౫.

బాలవ్యా. ౨౫౧ II విష. ఇచట శేషం బనఁగా సంబంధంబు. రామునియొక్క గుణములు. నాయొక్క మిత్త్రుఁడు. వానియొక్క తమ్ముఁడు. కువర్ణకంబుకు గొన్నియెడల సంబంధంబు నందగు. నాకుం దమ్ముఁడు. మీకు నెచ్చెలి.

సంజీవని. ౨౫౧ II విష:—రామునియొక్కగుణము లనఁగా రాముని సంబంధమైనగుణములని సూరిగారియాశయము. వ్యస్తమందు 'యొక్క' శబ్ద ప్రయోగము ప్రాచీనవైయాకరణకవీంద్రసమ్మతము కాదని కల్పతరువున విపులముగా వివరింపఁబడెను. అట్లయినను "తథాపి తస్య (యొక్కస్య) ప్రయోగ ఇష్టఏవ, కళా మధ్యే తత్పారేన ప్రయోగస్య జ్ఞాపితత్వాత్........." (అహో. ౨౭౪ పుట.) అను నహోబలపతివాక్యములచొప్పున నాధునికులవాడుక ననురోధించి వ్యస్తతలో యొక్కశబ్దము నుదాహరించిరి. యొక్కస్థలమున "కి కు-ల" ప్రయోగము కల్ప తరువునఁ జూపఁబడెను. నాకుందమ్ముఁడు = నాయొక్క తమ్ముఁడు - నీకు నెచ్చెలి = నీయొక్క నెచ్చెలి.

సర్వవిభక్తిః సంస్కృతతుల్యా. (ఆం. చిం. ౧౫ కా. అహో. ౪౨3 పు.)

నన్నయ. ధర్వణీయము. ౨౫౭ విషయము.

యతశ్చ నిర్ధారణమ్. (౨-3-౪౧) జాతిగుణక్రియా సంజ్ఞాభిః సముదాయాదేకదేశస్య పృథక్కరణం నిర్ధారణం యత స్తతః షష్ఠీసప్తమ్యౌ స్తః. నృణాం నృషు వా ద్విజః శ్రేష్ఠః. గవాం గోషు వా కృష్ణా బహుక్షీరా. గచ్ఛతాం గచ్ఛత్సు వా ధావన్ శీఘ్రః. ఛాత్రాణాం ఛాత్రేషు వా మైత్రః పటుః. (సి. కౌ. ౬3౮ సూ.) (విస్తర. I) లోపల నిర్ధారణోద్భవా షష్ఠీ. (ఆం. చిం. అజం. ౮కారి. అహో. ౨౭౪ పు.)

కల్పతరు. ౨౫౭ విషః—సర్వవిభక్తి రిత్యాదికారిక ౨3౪ విషయమున వ్యాఖ్యాతమయ్యెను. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము. సముదాయాత్ = ఒకసమూహమునుండి, ఏకదేశస్య = ఆసముదాయము లోని యొకభాగమునకు, జాతిగుణక్రియాసంజ్ఞాభిః = జాతిగుణక్రియాసంజ్ఞలలో దేనిచేతనయినను, పృథక్కరణమ్ = వేఱుచేయుట, నిర్ధారణమ్ = నిర్ధారణ మని పించుకొనును, అట్టి నిర్ధారణము, యతః = దేనినుండి కల్గునో, తతః = దానికంటెఁ బరముగ, షష్ఠీసప్తమ్యౌ = షష్ఠీసప్తములు, స్తః = అగుచున్నవి. జాతిచేః—నృణాం నృషు వా ద్విజః శ్రేష్ఠః = మనుష్యులలోపల (లేదా) మనుష్యులందు ద్విజుఁడు శ్రేష్ఠుఁడు. గుణముచేః—గవాం గోషు వా కృష్ణా బహుక్షీరా=గోవులలోపల(లేదా) గోవులందు నల్లనిగో వధికక్షీరములు గలది. క్రియలచేః—గచ్ఛతాం గచ్ఛత్సు వా

---

విస్తర I ౨౫౭ విషః—"ఈసందర్భమున సిద్ధాంతకౌముదిని గలయుదాహరణములనెల్ల మక్కీకి మక్కీగా నాంధ్రీకరించిన సూరి 'నృణాం నృషు వా బ్రాహ్మణః శ్రేష్ఠః' అను నుదాహరణమునుమాత్ర మట్లుచేయక 'మనుష్యుల లోపల క్షత్రియుండు శూరుండు' అనిక్రొత్తదానిని సృజించుటంజేసి యాతఁడు బ్రాహ్మణద్వేషి యగుట స్పష్టమని యందురు" (బా. సా. వే. ౨౮౬ పు.) అనునభిప్రాయము సరికాదు. ఇంతమాత్రమున బ్రాహ్మణద్వేషియనుట న్యాయముకాదు. మనుష్యులలో బ్రాహ్మణులె యుత్తములను ప్రాచీనాభిప్రాయమునందు వైమత్య ముండిన నుండ వచ్చును. "నరాణాం నరేషు నరేభ్యః క్షత్త్రియ శ్శూరతమః. గవాంగోషు గోభ్యో వా కృష్ణా గౌః క్షీరిణీ. అధ్వగానా మధ్వగేషు అధ్వగేభ్యో వా ధావన్తః శీఘ్రతమాః........" (ముగ్ధ. 3౧3 సూ. శ్రీరాతర్కవాగీశవ్యాఖ్య.) అనురీతి నుదాహరించుటయుఁ బ్రసిద్ధమేకదా. మఱియు ద్విజుఁ డనఁగా బ్రాహ్మణుఁడు మాత్రమే యనరాదుగదా.

ధావన్ శీఘ్రః = పోవుచున్నవారిలోపల (లేదా) పోవుచున్నవారియందు పరుగిడు వాఁడు శీఘ్రగామి. సంజ్ఞచే:—ఛాత్రాణాం ఛాత్రేషు వా మైత్రః పటుః = శిష్యుల లోపల (లేదా) శిష్యులందు మైత్రుఁడనువాఁడు బలమైనవాఁడు. నిర్ధార్యమాణ వస్తువుసయితమవధిభూతవస్తువులలోనిదే యగుచుండఁగా నిర్ధార్యమాణవస్తువు నందలి విశేషధర్మమునుబట్టి వేఱుచేయుట ప్రకృతసూత్రమునందలి నిర్ధారణమునకు లక్షణము. ఇట్టి నిర్ధారణమున నవధిభూతవస్తువాచకమునకుఁ బరముగా షష్ఠీ సప్తములలో నొకవిభక్తి నిల్చును. నిర్ధార్యమాణవస్తు వవధిభూతవస్తువులలో నంతర్భూతముకాక వానికంటెఁ గేవలము భిన్నమె యైయుండునప్పటి నిర్ధారణము ౨౮౯ విషయములోనిది. అవధివస్తు నిర్ధార్యమాణవస్తువులలో నిర్ధార్యమాణ వస్తువు నాధిక్యముగాని హైన్యముగాని పై రెండుస్థలములందును నిర్ధారితమగును. కాన నధికాదిశబ్దప్రయోగ మున్నను నీద్వివిధనిర్ధారణస్థలములందును ౨౮౮ విష మునకుఁ బ్రసక్తి కలుగదు. "జాతిగుణక్రియాణా ముత్కృష్టే నాపకర్షేణ వా సజా తీయా త్పృథక్కరణం నిర్ధారః. యథా మనుష్యాణాం బ్రాహ్మణః శ్రేష్ఠః. మను ష్యాణాం చణ్డాలో హీనః" (ముగ్ధ. 30౨ సూ. దుర్గాదాసవ్యాఖ్య.)

లోపలేత్యాది:—నిర్ధారణోద్భవా = యతశ్చ నిర్ధారణమ్మను పాణినీయ సూత్రముచొప్పునఁ గల్గు, షష్ఠీ = షష్ఠీవిభక్తి, లోపల = లోపలవిభక్తి ప్రత్యయ వాచ్యమగును. ఇందలి షష్ఠి యనునది సప్తమికిని నుపలక్షణము. 'లోపలన్-లోనన్' అనుశబ్దములు సయితమాపవిభక్తికములగు 'లోపల - లోను' శబ్దముల సప్త మ్యంతరూపములె. ఉ.......కాలకేయులు బయల్పడి తోఁచిరి దానిలోపలన్. (అర. 3 ఆ. 3౯.) అట్లైనను నిర్ధారణమునందలి సంస్కృతవ్యాకరణోక్తషష్ఠిని సంగ్రహించుటకై చింతామణికర్త 'లోపలన్' అనుశబ్దమును నిర్ధారణషష్ఠీప్రత్యయ ముగా నుపదేశించినవాఁడయ్యెను. కావున 'లోపలన్' అనువానిచరిత్రమునుబట్టి యీనిర్ధారణమున సంస్కృతవ్యాకరణోక్తరీతిని సప్తమియు వచ్చుననుట యుక్త ప్రాయమె యగుచున్నది. ఇట్లు 'అందున్' అనెడి సప్తమీప్రత్యయమేకాక 'నన్' అనుసప్తమీప్రత్యయమును, సప్తమ్యర్థకములగు ద్వితీయాప్రత్యయములును (బా. కార. ౨౨ సూ.) నీనిర్ధారణమున రావచ్చును. ఏకత్వార్థకమగు 'నన్' ప్రత్యయ మీనిర్ధారణమున నెట్లు సంభవించునని శంకింపరాదు. నన్ప్రత్యయాంతసమూహా ర్థకశబ్దము లీవిషయమునఁ బ్రయుక్తము లయియున్నవి. (విస్తర. II) ప్రయోగ

---

విస్తర. II ౨౪౨ విష:—"అందులవా రనునట్టి ప్రాచీనరూపములందువలెనే లోపుశబ్దముపై 'ఉల' చేరి పలుకుబడిలో నుకార మకారమై వికృతినంది ప్రత్య

ములు:—సీ.........ఆ-వె. పూజనీయులైన పురుషులలోపల । నెవ్వఁ డయ్యెఁ గృష్ణుఁడు. (సభా. ౨ ఆ. ౧౧.) పూజనీయులగు పురుషులలోపలఁ గృష్ణుఁ డెవ్వఁడును గాఁడనఁగా నపూజ్యుఁడని భావము. సీ. జ్యోతిస్సులందు వర్యుఁడు రవి భూతంబు, లం దగ్ని వరుఁడు విద్యలఁ బ్రధాన । సావిత్రి దేవతాసమితిఁ బ్రజాపతి, ఘనుఁడు వేదముల ముఖ్యంబు ప్రణవ । మనిలచయమ్మునఁ బ్రాణ మగ్ర్యము ఛంద, ములను గాయత్రి యగ్గలము పశువు । లను మేటియజ మఖిలచతుష్పదములను, ధేనువు మిక్కిలి మానవులను. తే గీ. బ్రాహ్మణుండు వరిష్ఠుండు పక్షులందు । శ్యేన మధికంబు యజ్ఞవిధానముల హు । తంబు పెద్ద యుగములఁ గృతంబు మేలు । ధాతు వర్గములోన నుత్తమము పసిఁడి. (అశ్వ. ౨ ఆ. ౧౬౧.) సీ. యవలోషధులలోన నన్నంబు భక్ష్యభోజ్యములందు జలము పేయములలోన । నమరాచలము పర్వతములలోఁ బ్లక్షంబు, దరువులలోన నూర్ధ్వంబు దిశల । జాహ్నవి నదులందు సాగరంబు సరస్సులందు గృహస్థత్వ మాశ్రమముల । నెక్కు డరయ నెక్కు డేను బ్రజాపతులం దచింత్యాత్మకుం డైనయట్టి. తే-గీ. విష్ణుఁ డెక్కుడు నాకంటె వినుఁడు తెలియ । నీశ్వరుఁడు దేవతావళినెల్ల నెక్కు । డతఁడు నా నేననఁగ విష్ణుఁ డనఁగ వస్తు । వొకఁడు మూర్తిత్రయంబున నుల్లసిల్లు. (అశ్వ. ౨ ఆ. ౧౬౨.) వీనిలో మొదటి పద్యమున "పశువులను మేటి యజము, చతుష్పదములను ధేనువు మిక్కిలి, మానవులను బ్రాహ్మణుండు వరిష్ఠుండు" అను స్థలముల నజడసప్తమిచోట ద్వితీయలక్షణవిరుద్ధమనుకొని కావలయును (ఇతరత్ర చ ద్వితీయా తస్యాః ప్రథమా చ జ డ పతానాం స్యాత్. ఆం. చిం.) ముద్రాపకులు కుషష్ఠిని నిల్పిరి. "పశువులకు మేటి యజ మఖిల చతుష్పదములకు ధేనువు మిక్కిలి మానవులకు । బ్రాహ్మణుండు వరిష్ఠుండు." (వావిళ్ళ. ముద్ర. అశ్వ. ౨ ఆ. ౧౬౧ ప.) అది సరికాదు. అజడవాచకసప్తమిచోట సయితము ద్వితీయ మహాకవిసమ్మతము. (ప్రౌఢ. కార. ౧౮ సూ.) సీ......... గీ.........నలుగాలివాన గోవును.........మనుజుల విప్రుండు । సమధికత్వభాజనము లండ్రు. (శాంతి. ౧ ఆ. ౭౧.) ఆ వె. వనజముఖులు పురుషులను దృప్తి బొందుట । గలుగ దండ్రు కోవిదులు మునీంద్ర. (అను. ౨ ఆ ౧౭౫ ప్రాసస్థలము.( మఱియుఁ బై "పశువులను మేటి........" మున్నగుస్థలములు ప్రకృతముగు

---

యత్వమునందిన శబ్ద మిది యని తోఁచెడి" (బా. సా. పే. ౨౮౬ పు.) ఈవ్రాఁత పొరపాటు. 'లోపు' శబ్ద మేకోశమందును లేదు. అందులశబ్దమున 'ఉల' చేరె ననుట సరికాదు. అందుశబ్దము మీఁదివిభక్తులకు లట్టురాఁగా "అందులకు" మున్నగునవి సిద్ధించును. వెలుపల మున్నగువానిలోవలెనే 'లోపల' శబ్దము లోనిది 'పల' శబ్దము.

"యతశ్చ నిర్ధారణ"మ్మను నిర్ధారణమునకు లక్ష్యములగుటంజేసి యట్టిగొడల 'కు' షష్ఠి ప్రాచీనవైయాకరణకవీంద్రసంప్రదాయవిరుద్ధమునునై యున్నది. చ. పురుష విశేషవిత్తముఁడు పూజ్యుఁడు రాజులలోన నీయుధిష్ఠిరుఁడు (సభా. ౨ ఆ. ౧౨ ప.) సీ అప్సరో, గణములలో నగ్రగణ్యయైన । దాని మేనక......(ఆది. ౪ ఆ. ౩౫.) క. అమరవరులందుఁ బురుషో। త్తముఁ డెట్లు విశేషుఁ డట్ల ధరణిం గల తీ। ర్థములందుఁ బుష్కరత్రిత । యము గరము విశేష మభిమతార్థప్రదమై. (అర. ౨ ఆ. ౨౪౯.) సీ. ఏపురయందును ద్రోవది ప్రీతితో, నొక్కొక్క నింటఁ దా నొక్కయేఁడు । క్రమమున నుండఁగ (ఆది. ౮ ఆ. ౧౧౫.) క. మాయం. దొక్కరు నభీష్టమతి వరియింపన్। దోయజముఖిఁ బ్రార్థింపుము. (అర. ౨ ఆ. ౪౫.)

నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకంబగు. ౧౬.

జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేక దేశంబునకుఁ బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు. ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చటి షష్ఠికి లోపల వర్ణకంబగునని యర్థము. మనుష్యులలోపల క్షత్రియుండు శూరుఁడు. గోవులలోపలఁ గపిల బహుక్షీర. అధ్వగులలోపలం బాఱువాఁడు శీఘ్రగామి. ఛాత్రుల లోపల మైత్రుండు సమర్థుండు. ఇట సప్తమియుఁ గలదు. మనుష్యులయందు క్షత్రియుండు శూరుఁడు. ఇత్యాదు లెఱుంగునది.

బాలవ్యా. ౨౫౨ I విషయము

సంజీవని. ౨౫౨ I విష:—ఇందలివిషయమెల్ల సంస్కృతవ్యాకరణోక్తమె. కాన నిందలి నిర్ధారణాదులవివరణము కల్పతరువునఁ గనందగు. అధ్వగులు = బాటసారులు, పాఱువాఁడు = పరుగిడువాఁడు. ఈనిర్ధారణమున సప్తమివచ్చుట ప్రచురము.

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా. (అం. చిం. హలం. ౯౫ కారి. అహో. ౪౨౩ పుట.)

ఆధారోఽధికరణమ్. (౧-౪-౪౫.) కర్తృకర్మద్వారా తన్నిష్ఠ క్రియాయా ఆధారః కారక మధికరణసంజ్ఞం స్యాత్. (సి. కౌ. ౬౩౨ సూ.)

సప్తమ్యధికరణేచ (౨-౩-౩౬.) అధికరణే సప్తమీ స్యాత్. ఔపశ్లేషికో, వైషయికో, ఽభివ్యాపక

శ్చేత్యాధార స్త్రిధా - కటే ఆస్తే - స్థాల్యాంపచతి.
మోక్షే ఇచ్ఛాఽస్తి - సర్వస్మి న్నాత్మాస్తి.........

నన్నయా. నిమిత్తాత్కర్మయోగే (వార్తి. ౧౪౯౦.) నిమిత్త

౨౫౩ విషయము. మిహ ఫలమ్. యోగ స్సంయోగ స్సమవాయాత్మకః.
చర్మణి ద్వీపినం హన్తి । దన్తయో ర్హన్తి కుఞ్జరమ్ ।
కేశేషు చమరీం హన్తి । సీమ్ని పుష్కలకో హతః. ఇతి
భాష్యమ్. హేతౌ తృతీయాత్ర ప్రాప్తా. సీమా అణ్డ
కోశః - పుష్కలకో గన్ధమృగః" (సి. కౌ. ౬౩౩ సూ.)
విషయ నిమిత్తాదిజా తథై వాన్యా. (ఆం. చిం. అజం.
౮ కా. అహో. ౨౭౫ పుట.)
భావాదిజన్య జిప్తుల్యః । సుసా స్యా దత్ర సర్వదా ।
సత్యర్థజా సప్తమీచ । వర్తమానార్థతాం గతా. (వికృ.
అజం. ౧౮ కారి. అహో. ౨౭౬ పు.)

కల్పతరు. ౨౫౩ విష:—సర్వవిభక్తిరిత్యాదికారిక ౨౩౮ విషయమున వ్యాఖ్యాతమయ్యెను. పాణినీయాదిసూత్రములను మూలముగాఁ గొనుట కిదియె మూలము.

ఆధారఇత్యాది - ఆధారః = ఆధారము, అధికరణమ్ = అధికరణ మనిపించు కొనును. 'ఘటమందు జలమున్నది' మున్నగువ్యవహారములలో జలాదికమునకు ఘటాదిక మాధారము. జలాదిక మాధేయము. కర్తృకర్మములును క్రియ కాశ్రయ ములె. కానఁ గర్తృద్వారమునఁగాని కర్మద్వారమునఁగాని కర్తృకర్మములందుండు క్రియ కాధారమగునది కారకమగుచు నధికరణసంజ్ఞగల దగునని కర్తృకర్మద్వారే త్యాదివృత్తికిఁ దాత్పర్యము. ఇట్లు పరమ్పరగాఁ గ్రియ కాధారమగునది యధికరణ సంజ్ఞగలదని యెఱుంగునది.

అధికరణేచ = అధికరణమందు, సప్తమీ = సప్తమీవిభక్తి యగును. అధికరణ వాచకమునకుఁ బరముగా సప్తమీవిభక్తి యగునని యర్థము. ఆధారః = ఆశ్ర యము, ఔపశ్లేషికః = ఏకదేశసంబంధముగలది యనియు, వైషయికః = విషయతాస బంధమున గోచరించునదనియు, అభివ్యాపకః = సర్వావయవములందును వ్యాపించి యుండునదనియు, త్రిధా = మూఁడువిధములుగలది. ఉదా:—ఔపశ్లేషిక:— కర్తృద్వారమునఁ గ్రియ కాధారము:—కటే ఆస్తే = చాపయందున్నాఁడు. చాపయొక్క యేకదేశమున నున్నాఁడని యర్థము. కర్మద్వారమునఁ గ్రియ కాధా

రము:—స్థాల్యాంపచతి = గిన్నెలో నేకదేశమున వండుచున్నాఁడని యర్థము. వైషయికః:—మోక్షే ఇచ్ఛాస్తి = మోక్షమం దిచ్ఛగలదు. కర్తయగు నిచ్ఛకు మోక్షము గోచరమగుచున్నది. అభివ్యాపకః:—సర్వస్మి న్నాత్మాస్తి = అంతటను నాత్మ గలదు. అన్నివస్తువులం దన్నియవయవములందును నాత్మ వ్యాపించి యున్న దని యర్థము.

"వస్తుతస్తు ఉప సమీపే శ్లేషః, సంబన్ధః, తత్కృత మౌపశ్లేషికమితి-వ్యుత్పత్త్యా సామీపికమేవాధారత్వ మౌపశ్లేషికమ్......ఏవంచ కటే ఆస్తే.. ...ఇత్యాదౌ గౌణ మప్యధికరణం సప్తమ్యర్థఏవ" (సి. కౌ. ౬33 సూ. బాలమ. వ్యా.) "అభివ్యాపకఇతి - సకలావయవవ్యాప్తికృత ఆధారః." (సి. కౌ. ౬33 సూ. బాలమ. వ్యా.) వైషయికసప్తమి మిక్కిలి విస్తృతము. "గోవిన్దః కేళౌ కుశలః=కేళివిషయే పటురిత్యర్థః." (ముగ్ధ. 30౯ సూ. దుర్గా. వ్యా.) "ఆకాశే శబ్దో జాయతే - ధర్మే వేదాః ప్రమాణమ్ - తీర్థేవసతి-గురౌవసతి-ఇత్యాది. ఆకాశ శబ్దయో రవినాభావ స్సంబన్ధః - ధర్మవేదయో ర్బోధ్యబోధకభావ స్సంబన్ధః తీర్థవాస యో రాశ్రయాశ్రయిభావ స్సంబన్ధః. గురుశిష్యయో రుపాస్యోపాసకభావ స్సంబన్ధః- ఇతి సర్వస్యాత్ర విషయతా." (ముగ్ధ. 30౯ సూ. శ్రీరామతర్కవాగీశవ్యాఖ్య.) ఆకాశే శబ్దోజాయతే = ఆకాశమందు శబ్దము పుట్టును = శబ్ద మాకాశగోచరమని యర్థము. ధర్మే వేదాః ప్రమాణమ్ = ధర్మవిషయమున వేదములు ప్రమాణము. తీర్థే వసతి = తీర్థవిషయమున వసించుచున్నాఁడు. గురౌ వసతి = గురుసేవావిషయ మున వసించుచున్నాఁడు. ఇట్లనేకస్థలములం దీవైషయికసప్తమి విలసిల్లుచుండును.

ఔపశ్లేషికాధారస్థలమున నాధారాధేయముల సంబంధము సంయోగ రూపముగాని సమవాయరూపముగాని కావలయును. ఘటమందు జలము సంయోగ సంబంధమున నుండును. శరీరమందు జీవుఁడు సమవాయసంబంధమున నుండును. ద్రవ్యద్రవ్యములసంబంధము సంయోగరూపము. అవయవావయవులకును, జాతి వ్యక్తులకును, గుణగుణులకును, క్రియాక్రియావంతములకును గలసంబంధము సమ వాయరూపము. "రూపే రూపత్వమస్తి-శరీరే చేష్టాస్తీత్యాదౌ సమవాయేన ఔపశ్లేషికమాధారత్వ మిత్యాది జ్ఞేయమ్." (సి. కౌ. ౬33 సూ. బాలమ. వ్యా.)

నిమిత్తాదిజేత్యాదిః:—"నిమిత్త మనఁగా ఫలము. ఫలమునకుఁ గర్మమందు సంయోగసంబంధమునఁగాని సమవాయసంబంధమునఁగాని వృత్తి యుండఁగా ఫలరూపహేతువాచకముకంటెఁ బరముగా సప్తమి యగునని యర్థము. "కర్మ యోగే హేతువాచకాత్ శబ్దాత్ సప్తమీ వాచ్యేత్యర్థః." (సి. కౌ. ౬33 సూ.

బాలమ. వ్యా.) "నిమిత్తముతో నన్వయముగల క్రియయందు కర్మయగుదానితో సంబంధ మున్నప్పుడు నిమిత్తవాచకముకంటె సప్తమి యగును" (కౌముదీశరదాగమము. ౬౩౬ సూ.) హేతుతృతీయప్రాప్తింపఁగా నిది వచింపఁబడెను. చర్మణి = చర్మనిమిత్తమున, ద్వీపినమ్ = పులిని, హన్తి = చంపుచున్నాఁడు. దన్తయోః = దంతములనిమిత్తమున, కుఞ్జరమ్ = ఏఁనుగును, హన్తి = చంపుచున్నాఁడు. కేశేషు = కేశములనిమిత్తమున, చమరీమ్ హన్తి = చమరీమృగమును జంపుచున్నాఁడు. సీమ్ని = అండకోశమునిమిత్తమున, పుష్కలకః = గంధమృగము (బూతుపిల్లి) హతః = చంపఁబడెను. పులినిజంపుట చర్మముకొఱకుఁగాన నిటఁ జర్మము నిమిత్త మనఁగాఁ గ్రియాఫలము. ద్వీపి కర్మము. ద్వీపిచర్మములకును నండకోశగంధమృగములకును సంబంధము సమవాయము. తక్కినవాని సంబంధము సంయోగము. 'చర్మమందు ద్వీపిని జంపెను' అనురీతి సంస్కృతానుసారప్రయోగములు తెనుఁగుకావ్యములందు లభింపలేదు.

విషయేత్యాది:—విషయనిమిత్తాదిజా = వైషయికాద్యధికరణవాచకములకు, 'నిమిత్తాత్కర్మయోగే' అనువార్తికముచొప్పున నిమిత్తవాచకమునకును బరముగావచ్చు, అన్యా = ఈవఱకు వివరించినవిభక్తులకంటె భిన్నమైనసప్తమియు, తథైవ = ఆసంస్కృతవ్యాకరణోక్తప్రకారముగనే తెల్గునందును నగును. ఉదా:— విషయాది:—మోక్షము దిచ్ఛగలదు. ఘటమందు జలమున్నది. అంతట నీశుఁడు గలఁడు. నిమిత్తాది:—చర్మమందు పులినిజంపెను = జర్మము విషయమునఁ జంపెనని యర్థము.

ఇట్లు సప్తమివచ్చునని చెప్పుటచేత, 'అందున్ - నన్ - అన్' అను సప్తమీప్రత్యయములును, లోపలన్ - లోనన్ - లోన్ మున్నగు సప్తమ్యర్థకశబ్దములును సప్తమ్యర్థకద్వితీయాప్రత్యయములును యథాసంభవముగ నగునని గ్రహింపనగును. అనఁగా నుదంతజడవాచకముల యేకవచనమున నవర్ణమును నౌపవిభక్తికములపై 'అన్' అనునదియు నిట్లు యథార్హముగఁ దక్కినవియు నగునని యెన్ననగును. (విస్తర. I)

---

విస్తర 1 అ౹౹3 విష:—అహోబలపండితుఁ డీచింతామణిసూత్రమునకు వ్యాఖ్యచేయుటలో మిక్కిలి పొరపాటుపడెను. "విషయనిమిత్తాద్యర్థజా, అన్యా విభక్తిః, సప్తమీత్యర్థః. తథైవ = తేన ప్రకారేణ ప్రథమాంతత్వాలక్షణేన తిష్ఠతీత్యర్థః. ఆదిశబ్దేన సత్యర్థసప్తమీ గ్రాహ్యా. తద్విధాయకంచ శాస్త్రం యస్యచ భావేన భావలక్షణమిత్యాది. ఇతరయోర్విధాయకంతు నిమిత్తాత్కర్మయోగే.

ప్రయోగములు:—ఔపశ్లేషికము—తే. గీ. ఎల్లయందును దా వసియించు
చెల్ల। యదియుఁ దనయందు వసియించుట...(ఉద్యో. ౨ ఆ. ౩౨.) ఇందు
"ఎల్ల యదియుఁ దనయందు వసియించుట" అనునది యౌపశ్లేషికసప్తమీలక్ష్యము.
విశ్వమెల్లయు వాసుదేవునిబొజ్జలో నేకదేశముగఁగదా వసించియుండును.

---

సప్తమ్యధికరణేచ. ఇత్యాదిశాస్త్రమ్........భృత్యులవిషయము గౌరవమత్యంత
చలంబు సత్య మవనీశులకున్. చర్మము నిమిత్తము ద్వీపిం జంపెన్। వాలము
నిమిత్తము చమరిం జంపెన్।........భృత్యుఁ డావులఁ బిదుకఁగ వచ్చెన్......
షష్ఠీచానాదరే- పుత్రుఁడు దుఃఖింప సన్న్యసించెన్ ఇత్యాది........ప్రథమాన్త
త్వంతు సర్వత్ర సమానమ్. విషయనిమిత్తశబ్దయోః ప్రయోగవవాయం విధిః.
అన్యత్ర మోక్షమునం దిచ్ఛగలదు. ఇత్యాదిరూపం భవత్యేవ."(అహో.౨౭౫-౨౭౬
పు.) అహోబలపండితుఁడు "ఆదిశబ్దేన సత్యర్థసప్తమీ గ్రాహ్యా"అని వ్యాఖ్యచేసి,
చింతామణియం దొక్క వైషయికసప్తమిమాత్రమె సంగ్రహింపఁబడినట్లును నౌప
శ్లేషికాభివ్యాపకాధారసప్తములు స్మరింపఁబడనట్లును వ్యాఖ్యచేయుట పొరపాటు.
చింతామణిలోని యాదిశబ్దముచే సంగ్రహింపఁబడకుండుటచేత నేకదా యథర్వణుఁడు
సత్యర్థసప్తమిని సంగ్రహింపవలసెను. మఱియు నావైషయికసప్తమియందును 'నిమిత్తా
త్కర్మయోగే' అనువార్త్తికముచొప్పున వచ్చుసప్తమియందును 'అంద్వాదిసప్తమీ
ప్రత్యయములె యంతటను వచ్చునని చెప్పక విషయనిమిత్తశబ్దప్రయోగమునఁ
బ్రథమావిభక్తియే నిల్చుననుచు "తథైవ" అనుదానికి "ప్రథమాన్తత్వలక్షణేనైవ
తిష్ఠతీత్యర్థః"అని వ్యాఖ్యచేయుటయు "భృత్యులవిషయము గౌరవమత్యంత
చలంబు. చర్మమునిమిత్తము ద్వీపిని జంపెన్" ఇత్యాదిరీతి నుదాహరించుటయు
మిక్కిలి ప్రామాదికములు. 'తథైవ' అనుచింతామణికి "ప్రథమాన్తత్వలక్షణే
నైవ"అను నర్థ మీతని కెట్లు లభించెనో తెలియకున్నది. మఱియు విషయనిమిత్త
శబ్దముల ప్రయోగమునందును సప్తమీస్థలములందు "విషయమున - నిమిత్తమున"
అని ప్రయోగించుటె వైయాకరణసంప్రదాయము. కావున "భృత్యులవిషయమున
గౌరవము, చర్మమునిమిత్తమున ద్వీపిని జంపెను" అనురీతినే యిట నుదాహరింప
వలసియుండును. సంస్కృతమునందును "క్రీడావిషయే నిపుణః" (ముగ్ధ. దుర్గా.
వ్యా.) అనియు 'చర్మణి ద్వీపినం హన్తి అనియు సప్తమ్యంతముల' నుదాహరించుటే
సంప్రదాయముగాని ప్రథమాంతము నుదాహరించుట సమ్మతముకాదు. ఒకప్పుడు
తెల్గున "అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా" అనుపద్ధతిని "భృత్యులవిషయము" అని
ప్రథమాంతవ్యవహార ముండుటచే నహోబలపతి యట్లు భ్రమించెనేమో? మఱియు

సీ. ద్రోవది ప్రీతితో, నొక్కొక్క నింటఁ దా నొక్కయేఁడు। గ్రమమున నుండును గమలాక్షి యెవ్వరియింటఁ దానుండె నయ్యింటివలనఁ। బెఱవారు సనకుండ (ఆది. ౮ ఆ. ౧౧౫.) వ. ఇవ్వర్షాకాలంబు మాయందయుండి (ఆది. ౮ ఆ. ౧౮౦ వచ.) (మాయంద = మాస్థలమునంద) గీ. అతిథివై వచ్చి నీవు మాయంద కుడిచి (ఆర. ౩ ఆ. ౩౯౦.) క. పగవారియింటఁ గుడిచిన (ఉద్యో. ౩ ఆ. ౨౨౪.) గీ. ఇందు మీయందుఁ గలవస్తు వెద్దియైన (సభా. ౧ ఆ. ౨౩౯.) చ...రాజసూయముఖ

- - - - - - - - - - - - - - - - -

"నిమిత్తము - అర్థము - తదర్థము" మున్నగునవి ప్రథమాంతములుగఁ బ్రయుక్తములగునపు డవి 'కొఱకు' శబ్దార్థకములై తాదర్థ్యచతుర్థీవాచకములగునే కాని సప్తమ్యర్థకములు కావు. తే. గీ. ఏను గుర్వర్థ మర్థినై మానవేశ।...(ఆది ౧ ఆ. ౯౫ ప.) మత్తకోకిలము. నీతదర్థమ కాఁగ దేవవినిర్మితం బిది...(ఆది. ౨ ఆ. ౨౦౮) (౨౪౪ I విష.). సప్తమ్యర్థమున "అందున్" మున్నగు సప్తమ్యర్థకప్రత్యయముతో నిట్టినిమిత్తాదిశబ్దములు ప్రయోగింపఁబడుట సంప్రదాయము. "నీవును గుర్వర్థంబునందు ఋణవిముక్తుండ వైతివి." (ఆది. ౧ ఆ. ౧౨౧ గద్యము.). కవిజనమండన గాణపతవివరణకారాదు లీకవిశిరోభూషణమార్గమునె యనుసరించిరి. ఆంధ్రభాషాచరిత్రకర్తగారీ "విషయనిమిత్తాదిజా తత్రైవాన్యా" అను చింతామణిసూత్రము న వర్ణకవిధానార్థకమనిరి. "అన్యా" అనుపదము సప్తమీప్రత్యయమగు 'న' వర్ణకమును మాత్రము తెలియఁజేయునని తలంపవచ్చును......అన్య ప్రత్యయము 'న' అనునది......మహద్వాచకపదములపై 'న' వర్ణక మెప్పుడు చేరు ననునదియే ప్రస్తుతసూత్రవిషయ మనుటకు సందేహము లేదు......విషయమునన్ - నిమిత్తమునన్......మొదలగు నవర్ణకయుతసప్తమ్యంతపదములతోఁ గలసియుండునని యీసూత్రమున సూత్రకారుఁడు వివరించియున్నాఁడు. నీకృతమునఁ (శాసితరిత్వయి) గౌరవాన్వయ మకిల్బిషకీర్తిఁ బ్రకాశితంబగున్ (ఆర. ౧ ఆ. ౫౧ ప.( మొ." (ఆం. భా. చ. ౧౬౩౨ పుట.) ఇది విమర్శసహమై యుండ లేదు. 'అన్యా' అనుదాని కన్యప్రత్యయమగు 'నవర్ణకమని' యర్థమఁట. 'విషయనిమిత్తాదిజా' అనుదానికి విషయమునన్ - నిమిత్తమునన్ - కారణమునన్ మొదలగుపదములు లక్ష్యములఁట. మహద్వాచకపదములపై 'న' వర్ణకము చేరునఁట. 'నీకృతమునన్' అను (భారతపద్యమందలి) పదము సప్తమీప్రత్యయాంతమఁట. ఔపశ్లేషికాద్యధికరణసప్తమిని నన్నయాథర్వణులు స్మరింపనే లేదని యీసమన్వయమునఁ బర్యవసితమగుచున్నది. నన్నయాథర్వణులు నవర్ణకమును స్మరింపలేదని వీరియాశయము. అది సరి కాదు. (చూడు. ౨౫౩ II విషయము.)

మున్నలిఁ జేసినధన్వు లింద్రునం। దునికియు (సభా. ౧ ఆ. ౮౯.) (ఇంద్రునంగున్ - ఇంద్రుసన్నిధిని.)

వైషయికము:—చ. అనుపమకార్ముకాది వివిధాయుధ విద్యలయందుఁ గోవిదుం। డనఁగ...(ఆది. ౬ ఆ. ౯౬.) సీ. చారువిభూషణాహార విహారశయ్యాసన భోగంబులందు విముఖ (అర. ౨ ఆ. ౨౬.) క. ఇం దీవరలోచన నీ। యందే నభినందితాత్మ నైనట్టులు నీ। నందనులయందుఁ బౌత్రుల। యందును నభినంద్య వగుము యని దీవించెన్. (ఆది. ౮ ఆ. ౬.) వచన. నీమంతులు మంత్రంబులు నాయందుఁ బనిసేయవు (ఆది. ౨ ఆ. ౧౯౧.) వ. నీవును గుర్వగ్రమునందు ఋషిముఖ్యుండ వైతివి (ఆది. ౧ ఆ. ౧౨౧.)

అభివ్యాపకము:—తే. గీ. ఎల్లయందును దా వసియించుట...(ఉద్యో. ౨ ఆ. 3౨౬.) వ. ఎక్కడఁ జూచినం దానయై...(భీష్మ. ౨ ఆ. ౧3౭.)

నిమిత్తాదిజసప్తమి:—చర్మమం దేనుఁగును బులిని జంపెను. జర్మనిమిత్తమున బులినిజంపెను. మొ.

భావాదీత్యాది:—భావాదిజన్యజీప్ = "యస్యచ భావేన భావలక్షణమ్. (౨-3-3౭) యస్య క్రియయా క్రియాన్తరం లక్ష్యతే తతః సప్తమీస్యాత్ - గోషు దుహ్యమానాసుగతః..." (సి. కౌ. ౬3౪ సూ.) అనునది మొదలగుసూత్రముల చొప్పున వచ్చుసప్తమి ('జి. ఓస్. సుప్' అను సప్తమీప్రత్యయముల ప్రత్యాహారము 'జీప్' అనునది.) సుసా = ప్రథమావిభక్తితో ('సు. ఔ. జస్' అను ప్రథమా ప్రత్యయముల సమాహారము.) తుల్యః = సరిగ్రై, అత్ర=ఈ తెనుఁగుభాషయందు; సర్వదా = అంతటను బ్రయుక్తమగును. సత్యర్థ...గతా = ఇట్టిచో నీసత్యర్థజ సప్తమి వర్తమానార్థకమగును. ఇట్టియెడల భావలక్షణార్థక నుజ్యంత క్రియ యంతటను బ్రయుక్తమగును గాన దానిచే నచటి కర్తృకర్మము లభిహితము లగుటం జేసి యచటఁ బ్రాతిపదికార్థ ప్రథమయె కర్తృకర్మవాచకములకుఁ బరముగా వచ్చును. "భావార్థకాదియోగంబునం గర్తకుః బ్రథమయగు" అని సూరి సూత్రించెను. (బా. కా. 3౨ సూ.) గోషు దుహ్యమానాసు గతః దేవదత్తః = గోవులు పిదుకఁబడుచుండఁగా దేవదత్తుఁడు వెడలినాఁడు. ఇది కర్మవాచకమునకుఁ బరముగా సప్తమివచ్చినస్థలమున కుదాహరణము. కర్తృవాచకస్థలమునకు:— బ్రాహ్మణే ష్వధీయా నేషు గతః = బ్రాహ్మణులు చదువుచుండఁగా వెడలినాఁడు. ఇట్టి యెడల సంస్కృతమునవచ్చు సప్తమి తెల్గునందలి ప్రథమకు సరిగ్రైయుండునని యథర్వణాశయము. సర్వదాయనుటచే నీసందర్భములోని సప్తము లన్నిటియెడలను

నిట్లు ప్రథమయే నిల్చునని విశదమగుచున్నది. "అర్థానాం కర్తృత్వే నర్థానా మ కర్తృత్వే తద్వైపరీత్యేచ" సత్సు తరత్సు అసత్సు ఆసతే = సత్పురుషులు వెడలు చుండఁగా నసత్పురుషులు నిల్చుచున్నారు. (సి. కౌ. వా. ౬౩౮ సూ.) షష్ఠీ చానాదరే (౨-౩-౩౮.) అనాదరాధిక్యే భావలక్షణే షష్ఠీసప్తమ్యౌ స్తః. (పుత్రాదా) రుదతి రుదతో వా ప్రావ్రాజీత్=రుదన్తం పుత్రాదిక మనాదృత్య సన్న్యస్తవానిత్యర్థః= పుత్రాదులు శోకించుచుండఁగా (వారి ననాదరించి) తండ్రి సన్న్యసించెను. అధికరణ సప్తమీస్థలములందును నిట్టిభావలక్షణను జ్యన్తప్రయోగము సత్యర్థకసప్తమియూల మున సంభవించునని సూత్రములోని సర్వదా శబ్దస్వారస్యమున నెన్నునది. "ఉదితే ఆదిత్యేజుహోతీత్యత్రతు సామీపిక మధికరణత్వం సప్తమ్యర్థః. ఉదితాదిత్యసమీప కాలే ఇత్యర్థః. ఆదిత్యోదయోత్తరసమీపకాల ఇతి పర్యవసన్నోర్థః." (సి. కౌ. ౬౩౫ సూ. బాలమ. వ్యా.) 'ఉదితే ఆదిత్యే జుహోతి = ఆదిత్యుఁ డుదితుఁ డగు చుండఁగా హోమముచేయుచున్నాఁడు' అను చోటి యధికరణసప్తమీస్థలమందును నీభావలక్షణను స్తమ్యర్థక నజ్యంత ప్రయోగము గల్గెనని యెఱుంగునది. (విస్తర II.)

---

విస్తర. II ౨౫౩ విమ:—వికృతివివేకటీకాకర్త యీయాథర్వణకారికను దిద్ది యపార్థమును జేసెను. "భావాదిజన్యజిప్తుల్య । సుస్సాస్యాదత్ర సర్వదా ।...... టీక. అత్ర = ఈ తెలుఁగునందు, సర్వదా = ఎల్లపుడు, సా = ప్రసిద్ధమైన, భావాది జన్యజిప్ = భావాద్యర్థమువలనఁ బుట్టిన, సప్తమీవిభక్తి, తుల్యసుః = సమానమైన ప్రథమైకవచనముగలది. స్యాత్...తా. విషయనిమిత్త సత్యర్థంబులఁబుట్టిన సప్తమీ విభక్తి ప్రథమాతుల్యం బగును. అందు సతిసప్తమి వర్తమానార్థమును బొందును. భృత్యులవిషయముగారవ । మత్యంతచలంబుసత్య మవనీశులకున్. చర్మనిమిత్తము దుష్పిం జంపెన్......(వికృ. అజం. ౧౮ కా.) చింతామణిలోని "విషయనిమిత్తాది జాతథైవాస్యా" అను సూత్రవ్యాఖ్యయగు నహోబలపండితీయమున నీయథర్వణ కారికయుండుటచే నట్టి కవిశిరోభూషణగ్రంథము సరిగా నర్థముచేసికొనక యీతఁ డీరీతి నపవ్యాఖ్యచేసినవాఁ డయ్యెను. 'గోవులు పిదుకఁబడుచుండఁగా' అనుచోటి ప్రథమాబహువచనమునైనఁ జూచికొనక సుప్రత్యయమాత్ర మను నపార్థము గలపాఠమును బ్రక్షేపించుట మిక్కిలి వింతగా నున్నది. చింతామణి సూత్రముచే సిద్ధింపని భావలక్షణార్థసప్తమి నథర్వణుఁడు వివరించుచున్నాఁడని గ్రహింపక చింతామణ్యుదాహరణములుసయిత మీయాథర్వణసూత్రమునకు లక్ష్య ములని తలంచుట మిక్కిలి వింత.

ప్రయోగములు:—మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచు చుండన్......(సభా. ౨ ఆ. ౨౩౩.) మ. గురుభీష్మాదులు సూచుచుండ సభ యీకుం గీడు నాఁడట్లు......(ఉద్యో. ౩ ఆ. ౩౬.)

"స్వామీశ్వరాధిపతి దాయాదసాక్షిప్రతిభూప్రసూతైశ్చ (౨ ౩-౩౯) ఏతైః స్సప్తభి ర్యోగే షష్ఠీసప్తమ్యౌ స్తః. షష్ఠ్యేవ ప్రాప్తాయాం పాక్షిక సప్త మ్యర్థం వచనమ్. గవాంగోషు వా స్వామీ" (సి. కౌ. ౬౩౬.) ఇత్యాదిసూత్ర ముల లక్ష్యములందుఁ దెలుఁగున షష్ఠియె కన్పట్టుచున్నది. తెలుఁగున 'గోవులకు స్వామి' అనియె ప్రయోగింపఁబడుట సహజము. గోవులయొక్క-స్వామి. ఇట్టి శేషషష్ఠి యని యెఱుంగునది.

అధికరణంబునకు సప్తమియగు. ౧౭.

బాలవ్యాకరణ వివరణము ౨౪౩ I విషయము.

అధికరణంబు నాధారంబు. ఔపశ్లేషికంబు - వైష యికం బభివ్యాపకంబని యాధారంబు త్రివిధంబు, ఘటమందు జలమున్నది. మోక్షమం దిచ్ఛగలదు. అన్నింటియం దీశ్వరుండు గలండు.

సంజీవని. ౨౪౩ I విషయము:—చింతామణిచెప్పిన వివిధసప్తములలో నధి కరణార్థకసప్తమినిమాత్రము సూరి యిట్లు సంగ్రహించెను. ఔపశ్లేషికాదుల స్వరూ పము ౨౪౩ విషయమున విస్తరించి వివరింపఁబడెను. ఔప:—ఘటమందు జల మున్నది. వైష:—మోక్షమం దిచ్ఛ గలదు. అభివ్యా:—అన్నింటియం దీశ్వ రుండు గలండు.

నన్నయా. ౨౪౩ II విష.

జేర్నః స్యాత్తోఽపి ముబ్వాన్తం । వినా వుప్రత్యయా న్వితమ్ । అమహాన్నాము జడగం । చోదన్తం గాన్యతో విధిః ॥ (వికృతి. అజం. ౧౬ ౧౭ కారి. అహో. ౨౬౭.)

కల్పతరువు. ౨౪౩ I విష:—ఈకారికలు ౧౩౭ విషయమున వ్యాఖ్యా తము లయ్యెను. ౨౨౭-౨౩౩ విషయమునందును నీవిషయము కొంత ప్రసంగింపఁ బడినది.

బాలవ్యా. ౨౪౩ III విష

ఉకారాంతజడంబునకు 'న' వర్ణకంబగు. ౧౮.
ఘటంబున జలంబున్నది - దేవదత్తునకు మోక్షమున నిచ్ఛ గలదు.

సంజీవని. ౨౫౩ III విష:—నవర్ణకము సైతము సప్తమీప్రత్యయమె యగుటచేత నది పూర్వసూత్రముచొప్పున నధికరణార్థమున వచ్చునని వేఱ చెప్ప నక్కఱలేదు. కాని 'అందు' వర్ణకమువచ్చుచోటులందెల్ల 'న'వర్ణకము రానేరదు. కావున 'న'వర్ణకము వచ్చుస్థలము లిందు నిరూపింపఁబడినవి.

నన్నయా. అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా (ఆం. చిం. హలం. ౨౫౮ విషయము. ౧౫ కా. అహో. ౪౨౭ పు.)

కల్పతరు. ౨౫౮ విష:—బా. కా. ౧౯-౨౦ సూత్రములు కారకపరిచ్ఛే దములోని విశేషణముల విభక్తివచనప్రసంగమున నుండుట యుక్తమని తోఁచి వానిని బా. కా. ౨౬ సూత్రమునకుఁ బూర్వమున నిల్పనెంచి యుంచటఁ గ్రమము తప్పించి యీ ౨౧ సూత్రపుమూలము నిల్పఁబడెనని యెఱుంగునది.

అన్యస్యాః = ఒకవిభక్తిచోట, అన్యా = మఱొకవిభక్తి, క్వచిత్ = ఒకా నొకప్పుడు, భవేచ్చ = అగుటయుఁ గలదు. సంస్కృతవ్యాకరణసూత్రముల చొప్పున నొకవిభక్తి రావలసియుండఁగా నద్దానిచోట వేఱొకవిభక్తివచ్చుటయు నాంధ్రమహాకవిప్రయోగములందుఁ గన్పట్టుచున్నదని యర్థము. చింతామణికర్త సూరివలె సంస్కృతవ్యాకరణసిద్ధవిభక్తులకు భిన్నములగు విభక్తులు తెల్పఁనవచ్చుటఁ గలదని యాయావిభక్తులస్థలములను నిరూపింపలేదు గానఁ జింతామణిసూత్రమున కర్థముచేయుటలో సంస్కృతవ్యాకరణసిద్ధవిభక్తులచోట నితరవిభక్తులు తెల్పనవచ్చు టయుఁ గలదనుటయె యుక్తము. అట్టివానిఁ గొన్ని తానె (చింతామణికర్త) వివ రించును. "ఇతరత్ర చ ద్వితీయా। తస్యాః ప్రథమాచ జడపదానాం స్యాత్". మొ. "ఉపయోగమునం దాఖ్యాతకుఁ దోడవర్ణకంబగు" (బా. కార. ౭ సూ.) "చతుర్థికి మాఱుగ షష్ఠియె......కానంబడియెడి" (బా. కా. ౮ సూ.) "ఉదంతజడంబు తృతీయకు నవర్ణకంబగు" (బా. కా. ౨౩ సూ.) మున్నగు సూరిచెప్పిన మార్పులెల్ల నీచింతామణిసూత్రమునకు లక్ష్యములు కానోపును. అవ్విభుండు పాల మేఁగెను. (వి. పు. ౭ ఆ. ప్రౌఢ. కార. ౧౩ సూ.) చ. చిరముగఁ బ్రహ్మకుం దపమునేసి (ఆది. ౨ ఆ. ౧౨౯.) మున్నగు బాలవ్యాకరణాసాధ్యవిభక్తులును దీనికి లక్ష్య ములు కానోపును. ఇట్లు "క్వచి దన్యవిభక్త్యర్థే। ప్రథమాపి ప్రదృశ్యతే." (వికృ. అజం. ౮౭ కా. అహో. ౩౬౫ పు.) అను వికృతివివేకకారికకు లక్ష్యములు వేఱయుండుటచేత నీక్రింది ప్రయోగములు ప్రకృతచింతామణిసూత్రమునకు లక్ష్యములనుటయె యుక్త మనఁదగును. చ...దు। ర్మతులు......తీర్థము

లాడనోపరు (అర. ౨ ఆ. ౨౮౬.) ఆ. వె. ఎఱుకు నన్ను నుఱక నేసినశరములు। నెఱుఁకులాడి... వేదనఁగావించు (అర. ౧ ఆ. 3౧౪ ప.)

సంస్కృతవ్యాకరణాసాధ్యవిభక్తులును నీక్రిందిరీతిని దీనికి లక్ష్యములు కాఁదగును. "స్వాగతావృత్తము. ఆగిరీంద్రసుత హర్షముతో శై। వాగమోదిత విధాయతితో సు। స్వాగతాభిమతవాక్యములం ద। భ్యాగతోచిత సపర్యలఁ దన్వెన్ (నన్ని. కు. ౭ ఆ. ౮3౬.) శా... వరాంగములు సోకుం బుష్కరాగ్రంబునం। దాటోపం బొనరించు...(నన్ని. కు. ౧ ఆ. ౧౦౦.) గీ ముప్పూరముగూడ నీశిలీముఖమునందుఁ। దెగితిమి (భాస్కర. అయో. ౧౮౧ ప.)" (సూ. రా. ని. అందు శబ్దము.) ఈపద్యములందలి 'అందు' విభక్తికిఁ బైరీతిని వివక్షావశమునఁ బ్రయోగము నంగీకరింపక సూ. రా. నిఘంటుకర్తలు 'అందు' శబ్దమునకుఁ దృతీయార్థమే కలదని వ్రాయుట సరికాదు. సంస్కృతమునందును నిట్లు వివక్షావశమునఁ గారకవిశేషములను బ్రయోగించుటఁ గలదు. "ఏవం వివక్షావశా దత్ర వస్తుతో దానం తత్రాపి న - సమము బ్రాహ్మణే దానం। ద్విగుణం బ్రాహ్మణబ్రువే। అధీతే శతసాహస్ర। మనన్తం వేదపారగ. ఇతి మనుః." (ముగ్ధ. కార. ౭౯౪ సూ. వ్యాఖ్య.) "గృహే ప్రవిశతీత్యత్ర గృహస్య కర్మతయా ద్వితీయా ప్రాప్తౌ అధికరణస్య వివక్షయా సప్తమీ, వివక్షావశాద్ధి కారకాణి భవన్తీతి న్యాయాత్.........తపో వనేషు స్పృహయాళు రేషా ఇతి రఘుః ఇత్యాదౌ సంప్రదానే అధికరణవివక్షా. ఇత్యాదయో మహాకవిప్రయోగాత్ వివక్షయా సమాధానీయాః. స్థితేర్గతి శ్చిన్తనీయేతి న్యాయాత్. తేన స్వేచ్ఛయా—గ్రామే గచ్ఛతీత్యాది ప్రయోగోనకర్తవ్య ఇతి సాంప్రదాయికాః" (ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. 3౧౬ సూ.) ఇట్లె కవిప్రయుక్తములగు విభక్తులు వైవక్షికములని సమాధానము చేసికొనవలయును. మ. అభిజాతుండవు ధర్మశీలుఁడవు నీయం దైనసంబంధము (ఆది. ౮ ఆ. ౫౨.) సీ. కౌరవైశ్వర్యంబు గౌరవంబున సమగ్రిత మయ్యె నీయంద పేర్మితోడ (సభా. ౨ ఆ. ౧౦౨.)

ఏకవాక్యమున నపునరుక్తముగఁ బ్రయుక్తమైన యొక్కపదమె రెండుచోట్ల నన్వయించునపు డందొకకారకమె రెండవదాని నడంచి నిల్చును. "ద్వయోర్యుగపత్ ప్రాప్తౌ, కర్తృకర్మాధికరణం।కరణం సంప్రదానకమ్।అపాదానంచ సందేహే।పరం పూర్వేణ బాధ్యతే ఇతి వచనా ద్వ్యవస్థా. గంగాం గత్వా స్నాతి (గంగనుగూర్చి యేఁగి స్నానముచేయుచున్నాఁడు.) ఇత్యాదౌ అధికరణం బాధిత్వాకర్మప్రవృత్తమ్. గృహం ప్రవిశ్య నిస్సరతి (గృహమును బ్రవేశించి వెడలుచున్నాఁడు) ఇత్యత్ర

అపాదానం బాధిత్వా కర్మ ప్రవృత్తమ్. వర మాహూయ కన్యాం దదాతి (వరు నాహ్వానించి కన్య నిచ్చుచున్నాఁడు)......ఇత్యత్ర సంప్రదానం బాధిత్వా కర్మ ప్రవృత్తమ్. అశ్వే స్థితో గచ్ఛతి (అశ్వమందుఁ గూర్చుండి పోవుచున్నాఁడు.) ఇత్యాదౌ కరణం బాధిత్వా అధికరణం ప్రవృత్తమ్. ఏవ మన్యద ప్యూహ్యమ్" (ముగ్ధ. కార. 3౧౬ సూ. దుర్గా. వ్యా.) పై వానిలో 'గంగనుగూర్చి యేఁగి గంగలో స్నానముచేయుచున్నాఁడు' మున్నగురీతిగల వాక్యములలో నధికరణము నడంచి కర్మకారకము నిల్చెనని యిట్లు గ్రహింపవలయును. సీ...సుందరి నీపతు లందుఁ బ్రీతిఁ। బలిభక్తి యొప్ప నపత్యంబుఁ బడయుము. (ఆది. ౮ ఆ. ౪.) ఇటఁ "బతులందుఁ బలిభక్తి యొప్పఁ బతులవలన నపత్యంబుఁ బడయుము" అనఁదగి యుండ నపాదనము నడంచి యధికరణము నిల్చినది. సీ...ఎద్ది చెప్పఁ డిష్టంబు... (ఆది. ౮ ఆ. ౨౧.) ఎద్ది యిష్టంబు దానిని జెప్పు డని యుండవలసియుండఁగాఁ గర్మకారకము నడంచి కర్తృకారకము నిల్చినది. త్రిలింగలక్షణశేషకర్త యిట్టి యెడలఁ బైరీతిని గ్రహింపక విభక్తి విపరిణామాన్వయము నంగీకరించెను. "కొన్నియెడల విభక్తి విపరిణామంబు గ్రాహ్యంబు ఉదా:—ఉ...ఈతనితో సాటి యనంగ మేలన...(నిర్వ. 3 ఆ.)...ఇక్కడఁ దృతీయకుఁ బంచమిగా మార్పు గలిగెనని తెలియవలయును. మొ." (ప్రౌఢ. కార. ౨౬ సూ.) "ఈతనితోసాటి; ఇతనికంటె మేలు" అనుచో నేకవాక్యప్రయోగమునఁ బచమి నడంచి సహార్థతృతీయ నిల్చెననుట యుక్తము. ఉ...నీ। యేపున కోర్వ దేవతల కేనియు దైత్యుల కేని రాదు పా। ష్టేపగతేని గెల్వను......(శాంతి. ౨ ఆ. ౪3౭.) 'ఏపగ తెదిర్చిరేని వారిని గెల్వను' అని యుండవలసియుండఁగా గర్మకారకము నడంచి కర్తృకారమము నిల్చినది.

ఒకానొకచో నొకవిభక్తికి మఱియొకవిభక్తియునగు.

బాలవ్యాకరణ వివరణము. ౨౫౪ I విషయము.

౨౧. మైత్రుండు గృహమును వెడలెను. గృహము నుండి యని యర్థము. వాఁడు వాహనమును దిగెను. వాహనమునుండి యని యర్థము. వారు సుఖమున్నారు. సుఖముతో నని యర్థము. ఇత్యాదు లెఱుంగునది.

సంజీవని. ౨౫౪ I విష:—"అన్యస్యాః క్వచి ద్భవే చ్ఛాన్యా" అను చింతామణిసూత్రమె దీనికి మూలమైనను సంస్కృతవ్యాకరణోక్తవిభక్తులను నాంధ్రమహాకవి ప్రయోగారూఢములగు సంస్కృతప్రసిద్ధవిభక్తివిలక్షణములగు విభక్తు

లను జాలవఱకు సూరి సూత్రించినవాఁ డగుటంజేసి సూరిగారి యీసూత్రమున కర్థము చేయునపుడు సంస్కృతవ్యాకరణోక్తవిభక్తులకును సూరి సంగ్రహించిన విభక్తి విశేషములకును విలక్షణములగు విభక్తులు వచ్చుటయుఁ గలదని వ్యాఖ్య చేయవలసియుండును. 'మైత్రుండు గృహమును వెడలెను' అనుచో నపాదాన పంచమి రావలసియుండుననియు నట్టియెడల "ఉండి" శబ్దానుప్రయోగమును బంచమీవిభక్తి వలనకు ద్వితీయాదేశమును రాఁగా 'గృహమువలననుండి=గృహమునుండి' (బా. కా. ౯-౧౦-౧౧ సూ.) అని యేర్పడుననియు నట్లగుటచే నిట 'గృహమువలన' అను పంచమీవిభక్తికి మాఱుగ నుండి శబ్దరహిత ద్వితీయయె ప్రకృతసూత్రముచొప్పున వచ్చెననియు సూరిగారియాశయము. ఇట్లె వాహనమును దిగె ననుచోటను గ్రహింపవలయును. వారు సుఖముతోనున్నారని సహార్థ తృతీయ రావలసియుండఁగా నద్దానికి మాఱుగఁ బ్రథమవచ్చి ప్రకృతసూత్రమునకు లక్ష్యమగుచున్నదని యెఱుంగునది. సూరి 'కాలాధ్వములకుం బ్రాయికంబుగఁ బ్రథమయగు' (బా. కా. ౨౪.) అనిమాత్రము సూత్రించుటచేత దేశ (ప్రదేశ) వాచకముల సప్తమ్యర్థక ప్రథను సంగ్రహింపఁబడదయ్యె. అద్దానిని ప్రౌఢవ్యాకర్త పూరించుటకై "ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు (ప్రౌఢ. కా. ౨౦ సూ.) అని సూత్రించి తీర్థమాడి (తీర్థమందాడి = స్నానముచేసి) నెఱకులాడి (మర్మస్థానములందు గ్రుచ్చుకొని) పేరోలగముండి (పెద్దసభయందుండి) మున్నగువాని నుదాహరించెను. బా-గు-ప్రకర్త యట్టి కవిప్రయోగపద్యముల నెల్ల స్వీకరించి ప్రకృతసూత్రమునకు లక్ష్యములనుగా నుదాహరించెను.

సూరి పయిరీతిని వివరించెనే కాని "గృహమునుండి వెడలెను - వాహనము నుండి దిగెను" అనురీతి ప్రయోగములు మృగ్యములు. అపాదానపంచమ్యర్థమున వచ్చిన ద్వితీయకుఁ ('గృహమును వెడలెను' అనురీతిని) బ్రయోగములు గలవు. క...। కలి కర్కోటకవిషంబుఁ గ్రక్కుచు నొడలన్ వెలువడి (అర. ౨ ఆ. ౧౯౩.). 'సుఖముండె' అనుటకు "సుఖముండు మింక" (ఆది. ౭ ఆ. ౧౨౯ ప.) అనురీతి ప్రయోగములు గలవు.

నన్నయసూ. ఇతరత్ర చ ద్వితీయా (ఆం. చిం. అజం. ౧౪ కారి.
౨౪౪ విషయము. అహో. ౩౨౦ పు.)

కల్పతరు. ౨౪౪ విష:—"అన్యస్యాః క్వచి ద్భవేచ్చాన్యా" అను సూత్రపు స్థలములనె కొన్నిటిని వివరించుచున్నాఁడు. జడపదానామ్ = జడవాచకములకు, (ఉత్తరసూత్రమునుండి యనువృత్తివచ్చును.) ఇతరత్ర = ద్వితీయేతర తృతీయాదివి

భక్తులచోట, ద్వితీయా=ద్వితీయా విభక్తి, స్యాత్=అగును. ఇట్లితరవిభక్తు లన్నిటిచోటను ద్వితీయ వచ్చునని చెప్పఁబడినను దృతీయాసప్తమీవిభక్తులచోట మాత్రమె ద్వితీయ నిల్చుటమహాకవిప్రయోగదృష్ట మగుచున్నది. అహోబలపండితుఁడు నిట్లె యభిప్రాయపడెను. "ద్వితీయావిభక్తిః స్వవిషయవ్యతిరిక్తవిషయేఽపిస్యాత్ రాముఁడు హేతి నమరారుల నఱకెన్, రాముఁడ యోధ్యను న్నవాఁడు. ఆద్యే (ఉదాహరణే)తృతీయాస్థానే "అమ్" (ద్వితీయ), ద్వితీయే(ఉదాహరణే)సప్తమీస్థాన ఇతి.వివేకః.పక్షే హేతిచే నఱకెన్ ఇత్యాదికం రూపం సంస్కృతన్యాయే.నజడవిషయ ఏవాయమ్." (అహో. ౩౨౦ పు.) (పంచమిచోట ద్వితీయ యరుదు. ౨౫౭ I విష.) అందును బహువచనమునందే యంతటను ద్వితీయ నిల్చును. ఏకత్వమున నను దంతములకు మాత్రమె తృతీయాసప్తములచోట ద్వితీయనిల్చును. ఉదంతముల కన్ననో తృతీయాసప్తములచో 'నన్' అనునదియే నిల్చును. ఔపవిభక్తికములకు 'అన్' అనునది నిల్చును (బా. కా. ౧౮-౨౩ సూ. ఆచ్చి. ౩౮ సూ. ౨౫౩ I విష. ౨౫౬ విష. ౨౨౭-౨౩౩ విష.). (విస్తర. I) ఉదా:—వనములన్ = వనముల చేతన్ - వనములందున్. త్రాడులన్ = త్రాడులచేతన్ - త్రాడులందున్ - హేతు

విస్తర. I ౨౫౫ విష:—త్రిలింగలక్షణశేషకర్త యుదంతజడములకు నైతము కొన్నియెడలఁ దృతీయాసప్తములచోట ద్వితీయ యగునని వివరించెను. "ఒకానొకచో నేకవచనంబున నుకారంబుమీఁది ద్వితీయయుఁ దృతీయావిభక్త్యర్థక మయ్యెడునని తెలియవలయు. ఈయర్థమునకు 'ఇతరత్ర చ ద్వితీయా' అను స్థాననియమశూన్యవిధియు నవకాశ మిచ్చుచున్నది. ఉ:—ఎ. గీ. తండ్రి పనుపుఁ జేసి......(ఆది. ౩ ఆ. ౯౫.) సీ. దాశకన్యాకేళి తప్పుఁజేసి (స్వా. ౨ ఆ. ౭౩.) మొ. ఇట్లనుటచే ఇవ్విధము నాననముల్ గలవార (నిర్వ ౪ ఆ. ౮౭.) అను నిట్టి ప్రయోగములును నిర్దుష్టము లగుచున్నవి" (ప్రౌఢ. కార. ౪ సూ.) ఇట్లె ఆ. వె. భీష్మపనుపుఁజేసి చేలవైతి. (సభా. ౨ ఆ. ౧౧.) అనిభట్టారకుఁడు స్థలాంతరము నందును బ్రయోగించెను. అరయ నరయ నీప్రయోగములందలి 'చేసి' శబ్దము 'దుర్గబలంబునంజేసి' (సభా. ౧ ఆ. ౧౭౬ గద్య) మున్నగుచోటులందువలెనె యన్వయశూన్యమై యనుప్రయుక్తమయ్యెననియు, 'పనుపునన్ - తప్పునన్ -' అను తృతీయలచోట 'పనుపున్ - తప్పున్' అను ద్వితీయ నిల్చుటచేత వానిపైనను ప్రయుక్తమయ్యెననియుఁ జెప్పుట న్యాయ్యమని తోఁచునుగాని 'ఉ' దంతములపై మతెచ్చుటను దృతీయార్థమున నిట్లు ద్వితీయ నిల్చు ననుటను నిర్వహింపఁజాలు ప్రామాణికప్రయోగములు లేమింజేసియు నీప్రయోగములకు మార్గాంతరమున

లన్ = హేతులచేతన్ - హేతులందున్ హేతిన్ = హేతిచేన్ - హేతి యందున్. వనమునన్ = వనముచేతన్ - వనమునందున్. త్రాటన్ = త్రాటిచేతన్ - త్రాటియందున్. మొ. ఉదంతములు సహజముగా నుకారాంతశబ్దములు కావచ్చును. లేదా "స్యాద్యముహతాం విభక్తౌ" "సర్వత్రోదోతో ర్వ్యర్థవతి మువత్" అను చింతామణిసూత్రముల చొప్పున వచ్చునాగమ 'ము - వు' లం గూడుటచే నేర్పడు 'ఉ' కారాంతములును గావచ్చును. ఉదా:—చిగురునన్ - వనమునన్ - తరువునన్ - మొ. చకారముచే నీసూత్రము పాక్షికమని గ్రహింపవలెను. ఉ. లతన్ = లతచేతన్ - లతయందున్ - మొ. ఉదంతజడవాచకములయు నొప విభక్తికజడవాచకములయు ద్వితీయాంతరూపములకుఁ దృతీయాసప్తమ్యర్థములు కల్గనేరవు. ఉదా:—వనమున్ = వనమును, త్రాటిన్ = త్రాటిని. మొ 'వనమున్.' అనుదానికి 'వనముచేతన్ - వనమునందున్' అనియు, 'త్రాటిన్' అనుదానికి "త్రాటిచేతన్ - త్రాటియందున్" అనియు నర్థములు లేవని యెఱుంగునది.

కొన్నియెడల బహుళత్వమున నజడవాచకముల తృతీయాసప్తములచోట సయితము ద్వితీయావిభక్తి నిల్చుట నన్నయేతరకవిప్రయోగదృష్ట మగుచున్నది. సీ... తే-గీ. అనిన నలుగాలి వాన గోవును నశేష। శబ్దముల మంత్రమును లోహజాతిఁ గాంచ । నమును మనుజుల విప్రుండు సమధికత్వ । భాజనము లండ్రు వేదప్రపంచ విదులు. (శాంతి. ౧ ఆ. ౭౧.) 'మనుజులన్ = మనుష్యులయందు' అని తిక్కయజ్వ ప్రయోగించెను. స్థలాంతరములందును నిట్టి ప్రయోగములు గలవు. సీ...ఆ-వె. వనజముఖులు పురుషులను దృప్తిఁబొందుట । గలుగదండ్రు (అను. ౨ ఆ. ౧౭౫.) సీ...పశువు । లను మేటి యజ ముఖులచతుష్పదములను । ధేనువు మిక్కిలి మానవులను. తే గీ. బ్రాహ్మణుండు వరిష్ఠుండు పక్షులందు । శ్యేనము......(అశ్వ. ౨

---

సమాధానము చూపట్టుచుండుటంజేసియు నీత్రిలింగలక్షణశేషకర్త యాశయము నంగీకరించుట కవకాశము చాలకున్నది పైప్రయోగము లీక్రిందిరీతిని సుసమాధేయములై యున్నవి. "తండ్రి పనుపున్ = తండ్రియాజ్ఞను, చేసి = నెఱవేర్చి" "దాశకన్యాకేళి తప్పఁజేసి = దాశకన్యాక్రీడ యనుతప్పిదము గావించి" "భీష్ము పనుపుఁజేసి = భీష్మునియాజ్ఞను జరపి" అని యిట్లుచటిద్వితీయలు చేసి శబ్దముతో నన్వయించుచున్నఎనుటలో క్షతి కానరాదు. ఇట్లె "ఇవ్విధముయొక్క+ఆననముల్ = ఇవ్విధమున్+ఆననముల్ = ఇవ్విధము నాననముల్ = ఈవిధముగల ముఖములు" అని శేషషష్ఠీసమాసముచే (౨౫౧ విష.) నిర్వచనోత్తర రామాయణపద్యమును నిర్బాధమగుచున్నది.

ఆ. ౧౬౧.) (ఇందు - పశువులకు - మున్నగురీతిని నుస్థానమున 'కు' వర్ణకము ముద్రణములందుఁ బ్రక్షిప్తములని యచటి ౧౬౧-౧౬౩ పద్యములలోని ప్రక్రమము విశదపఱుపఁజాలును. మఱియు నచట "యతశ్చనిర్ధారణమ్" అను పాణినీయ సూత్రముచొప్పున వర్తిల్లు నిర్ధారణషష్ఠికి (౩౫౩-౩౫౩ II విష.) 'కు' వర్ణకము వచ్చుట శాస్త్రవిరుద్ధము. (విస్తర. II) తృతీయాసప్తమ్యర్థక ద్వితీయకును, 'ఉ' దంతస్థలమున నవర్ణకమునకును బ్రయోగములు:—ఉ. ఆశ్రిత పోషణంబున ననంతవిలాసముఁనన్ మనీషి వి। ద్యాశ్రము తత్త్వవిత్త్వమున దాన

---

విస్తర. II ౩౫౫ విష:—కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి. ఉదా:—తృతీయకు. ఎ-గీ...... । ఘనతర స్తన చక్రవాకముల నలరు । నంబను......(హరి. ఉ. భా. ౭ ఆ.) సప్తమికి సీ...ఆ-వె. బలిమిఁ గొనినధనముఁ । బడివేలయిుంటెలఁ । బెఱికిరాఁగ......(సభా. ౧ ఆ. ౩౬౮.) మనుజుల విప్రుండు (భార. శాంతి. ౧ ఆ.) (ప్రౌఢ. కా. ౧౭ సూ.)

పయి యుదాహృతులలో మొదటి రెండును సరికావని యీక్రిందిరీతిని జేటికావ్యాఖ్యాత వ్రాసెను "స్తనములందుఁ జక్రవాకత్వ మారోపిత మగుటం జేసి చక్రవాకనిష్ఠమగు నజడత్వమున కిటఁ బ్రసక్తి యంతగ లేమిని స్తనధర్మము ననుసరించి చక్రవాకములనుగూడ జడములుగఁ దలంపనగుం గాన నిది యంతగా నీవిధి కుదాహరణము గాఁజాలదేమో ? యని తోఁచెడి. 'పెఱికిరాఁగ' అను క్రియల కొంటెలు కర్తలైనట్లు స్పష్టపడుచున్నది గాన నిట నొంటె లనునది సప్తమ్యర్థక ద్వితీయగాక ప్రథమా బహువచనాంతమని యనవలెను. కాన నిదియు నీవిధికి సరియైన యుదాహృతి కాఁజాలదనియే తోఁచెడి......శబ్దరత్నాకరమున నొంటెలనునది గర్త్రర్థకముగనే యుదాహృత మయ్యెను. చూ. శ. ర. పెఱుకుశబ్దము. (౫౧౬ పుట) ఇంక మిగిలినది మనుజుల విప్రుం డనునదే" (బా. సా. వే. కార. ౩౩సూ. వ్యాఖ్య.) "మనుజులవిప్రుండు" అను సోమయాజిప్రయోగము నంగీకరింపక తీరనపు డింకఁ దక్కినవాని నేవేవో యపమార్గముల నాశ్రయించి నిరాకరించుట వృథా ప్రయాసముగదా. ఇంక నట్టి నిరాకరణమును బ్రమాదభూయిష్ఠముగనే యున్నది. స్తనములందుఁ జక్రవాకత్వము నారోపించుటచేఁ జక్రవాకముల నజడములనుగా భావింపనగు ననుట కేవలము పొరపాటు. ఇట్లయిన నీఁక ముఖ చంద్రుఁ డనుచోఁ జంద్రుఁడును జడవాచకమె యగును గాన "ముఖచంద్రము" అనవలసినదేనా ? ఆరోపితవస్తుధర్మావభాసమె యారోపణఫలమగుచుండ నద్దాని యందు విషయధర్మము లెట్లు భాసిల్లును ?

గుణాభిరతిన్ సమస్తవ। ర్ణాశ్రమ ధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో। కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంకచరిత్రసంపదన్ (ఆది. ౧ ఆ. ౬ ప.) క. మనుజేంద్ర వానిఁ బెడచెవు। లను బెట్టుము వేఱుగాఁ దలంపక దయతో (కర్ణ. ౩ ఆ. ౯౩ ప.) ఉ. ధనార్థులఁ దన్పి దిక్కులన్। నించె యశంబు... (సభా. ౧ ఆ. ౧౭.) క. విమలమణిమయములగు దూ। లములం గంబముల గోడలను వేదులఁ గు। ట్టిమములఁ జుట్టినప్రాకా। రములను గర మొప్పుచుండ రచియించె సభన్. (సభా. ౧ ఆ. ౧౧.) సీ. సురుచిరహరినీలకిరణజలంబులఁ బద్మరాగారుణపద్మములను। రాజితరాజీవరాజహంసావళి నిర్మలసౌవర్ణకూర్మములను। కమనీయవైదూర్యకుముదంబులను వజ్రమీనమౌక్తిక నవఫేనములను। మరకతశైవలోత్కరముల విలసిల్లఁ గొలను (సభా. ౧ ఆ. ౧౩ ప.) ఈసూత్రమునకు "ఆం - భా - చ - కర్తగారుచేసిన యపార్థము విస్తర. II ౧౪౫ విషయమున నిరసింపఁబడినది.

జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబు గానగు. ౨౨.

బాలవ్యా. ౨౫౫ I విషయము. రాముఁడు వాలి నొక్కకోలం గూలనేసె. కోలతో నని యర్థము. లంకం గలకలంబుపుట్టె. లంకయందని యర్థము. బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు. అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె. బాణంబులచే నని యర్థము. మీనంబు జలంబుల నుండు. జలంబులందని యర్థము.

సంజీవని. ౨౫౫ I విష:—"ఒకానొకచో నొకవిభక్తికి మఱియొకవిభక్తియు నగు" (బా. కా. ౨౧ సూ.) అనుసూత్రమునఁ జెప్పఁబడినరీతిని వచ్చువిభక్తి వ్యత్యాసములను గొన్నిటిని వివరించుచున్నాఁడు. చింతామణికర్త "ఇతరత్రచ ద్వితీయా" అని చెప్పినను నట్టి ద్వితీయ తృతీయాసప్తములచోటనె బహుళముగాఁ గన్పట్టుటంజేసి యట్టిరీతిని సూత్రమును మార్చి యుపదేశించుచున్నాఁడు. జడములనఁగా నచేతనవాచకములు. అట్టివాని తృతీయాసప్తములచోట ద్వితీయావిభక్తి వైకల్పికముగా నిల్చును. 'ఒక్కకోలన్' అను ద్వితీయ కొక్కకోలతో నని తృతీయార్థమును సూరిగారే వివరించిరి. అట్లె "లంకన్" అను ద్వితీయకు "లంకయందని" యర్థ మనుచు వివరించిరి. బహుళగ్రహణముచే నుదంతములకు నేకవచనమునఁ

దృతీయాసప్తమ్యర్థములు లేవనియు బహువచనమునందు మాత్రమె యట్టి యర్థములు ద్వితీయకుఁ గల్గుననియు "బాహుళకంబుచే" నిత్యాదివాక్యముతో వివరించి యుదాహరించిరి. 'బాణంబులను' అనుదానికి బాణంబులచే ననియు, 'జలంబులను' అనుదానికి జలములందనియు నర్థములని వివరించిరి. దీనినిబట్టి యుదంతములగు వీని ద్వితీయైకవచనముచోటఁ దృతీయాసప్తమ్యర్థములు లేవని స్పష్టమగుచున్నది. ఉ:—"బాణంబున్ = బాణమును; జలంబును = జలమును" అనియే యర్థము. తృతీయాసప్తమ్యర్థములు లేవు.

సన్నయా. అన్యస్యాః క్వచిద్భవేచ్చాసా. (ఆం. చిం. హాలం. ౨౫౬ విష ౧౫ కారి. అహో. ౮౨౭ పుట.)

కల్పతరు. ౨౫౬ విష:—ఈసూత్రమునకు ౨౫౮ విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

బాలవ్యాకరణ ఉదంత జడంబు తృతీయకు నవర్ణకంబగు. ౨౩. వివరణము రాముఁడొక్క బాణంబున వాలిం గూలనేసె. బాణ ౨౫౬ I విషయము ముచే నని యర్థము.

సంజీవని. ౨౫౬ I విష:—'అందు - న - సప్తమి' అని బా. తత్స. ౭ సూత్రమునఁ జెప్పఁబడుటచే 'న' వర్ణకము సప్తమీవిభక్తి ప్రత్యయమాత్రమె యగుటచేత నిటు తృతీయార్థమునందును వచ్చునని సూత్రింపవలసెను. ఇట్లు నవర్ణకము వచ్చుట వైకల్పికమనియు దెలియఁగునది. బా. కా. ౧౮ సూత్రముచే సప్తమ్యర్థమున నుదంతజడంబులకు 'అందు' విభక్తికిఁ బర్యాయముగా న వర్ణకమువచ్చునని యుపదేశింపఁబడెను. (౨౫౩ II విష.) అట్టిస్థలములందే తృతీయార్థమునందు సైతము న వర్ణకమువచ్చునని ప్రకృతసూత్రమున కర్థము. ఉదంతత్వము 'చిగురు' మున్నగువానియందు సహజము. ముగాగమ వుగాగమములచో సైతము (బా. తత్స. ౮౦-౮౯ సూ.) నుదంతత్వము నంగీకరించి వానిపైన వర్ణకమును నిల్పనగును. ఉ. 'బాణంబునన్' అనుదానికి 'బాణముచే' నని యర్థ మనుచు సూరిగారే వివరించిరి. 'బాణమునన్' అనుదానికి 'బాణమందున్' అనియు బా. కా. ౧౮ సూత్రము చొప్పున నర్థము సిద్ధించును. ఉదంతజడంబులకు సైతము 'నన్' ప్రత్యయము రానపుడు 'బాణముచేతను - బాణముతోడను' అనురీతిని 'చేత - చే - తోడ - తో' ప్రత్యయములును వచ్చును. ఈయుదంతములకు బహుత్వమున నవర్ణకము రానేరదు. ఉదా:—"బాణంబులన్ = బాణంబులచేతన్, తరువులన్ = తరువులచేతన్, చిగురులన్ = చిగురులచేతన్" అని యిట్లు బా. కా. ౨౨ సూత్రము

చొప్పునఁ దృతీయాసప్తమ్యర్థములందు ద్వితీయయే వచ్చును. బా. కా. ౨౨ సూత్రమునందు బహుళగ్రహణముచే నుదంతముల దృతీయాసప్తములచోట ద్వితీయ రానేరదని వివరింపఁబడుటంజేసి యట్టి యుదంతజడములకుఁ బ్రకృత సూత్రముచేతను బా. కా. ౧౮ సూత్రముచేతను నవర్ణకము పాక్షిక ముగా వచ్చునని యుపదేశింపఁబడెను. (విస్తర.). ప్రయోగములు:—ఉ. ఆశ్రిత పోషణంబున ననంతవిలాసమునన్ మనీషి వి। ద్యాశ్రమతత్వవిత్త్వమున .....మహి నొప్పు సర్వలో । కాశ్రయుఁడు......(ఆది. ౧ ఆ. ౬ ప.) చ. అన విని యప్మహీ రమణుఁ డాతని కిట్లను మీకు నాకతం। బున బహుదుఃఖముల్ గలిగె......... నీమనం। బునఁ గృపపుట్టి కాచినను బోయెద నిప్పుడ యేను గానకున్ (కర్ణ. 3. ఆ. ౯౭) (ప్రాసస్థలము.) క. విని క్రడి......ఊరుతలము కరతలం। బున నప్ప ళించె......(శల్య. ౨ ఆ. ౨౭౨ ప.) (ప్రాసస్థలము).

నన్నయా తస్యాః ప్రథమా చ జడపదనాం స్యాత్. (ఆం. చిం. ౨౫౭ విషయము. అజం. ౧౫ కారి. అహో. 3౨౧ పు.)

కల్పతరు. ౨౫౭ విష:—జడపదానామ్ = జడవాచకములయొక్క, తస్యాః = ఆద్వితీయకు ('ఇతరత్రచద్వితీయా' అను పూర్వసూత్రములోని ద్వితీయా' అనునది 'తస్యాః' అనెడి యీతచ్ఛబ్దముచేఁ బరామృష్ట మగుచున్నది.) ప్రథమాచ = ప్రథ మయు, స్యాత్ = అగును. చకారముచేతఁ బ్రథమ వికల్పముగ వచ్చునని యెఱుం గునది. జడవాచకద్వితీయకుఁ బ్రథమ వికల్పముగ నాదేశమగు నని యర్థము. ఉదా:—నీరు త్రాగెను = నీటిని ద్రాగెను. ఇల్లు నేసెను = ఇంటిని నేసెను. మొ. ప్రయోగములు:—సీ. గరుడధ్వజుం డప్డు కరుణాసమేతుఁడై యమ్మాగధుల కెల్ల నభయ మిచ్చిఁ (సభా. ౧ ఆ. ౨౧౫.) క...భరతా। మ్నాయులగు పాండ వేయుల। శ్రీ యిమ్మెయిఁ గొనిన నిన్నుఁ జీ యనరె యొరుల్ (సభా. ౨ ఆ. ౧౮౫.) (శ్రీ = శ్రీని - ప్రాసస్థలము.) చ. అనిలుఁడు పక్షయుగ్మ మమృతాంశుఁడు వీఁ పన లుండు మస్తకం। బినుఁడు సమస్తదేహమును నెప్పుడుఁ గాచుచు నీ కభీష్టముల్।

---

విస్తర. ౨౫౬ I విష:—"ఒక్కచో నుదంతంబగు నజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి. ఉదా:—ఉ ఏపునఁ గిట్టి యేనుఁగున నేనుఁగు వైచుచు వాజి వాజిచే। రూపడఁగంగ మోదుచును. (భాస్క. యుద్ధ.) దీనికిఁ బ్రయోగాం తరంబు మృగ్యంబు" (ప్రౌఢ. కార. ౧౭ సూ.) "ఉ. ఏపునఁ గిట్టి యేనుఁగుల నేన్గుల వైచుచు"అనియెగ్రంథకృత్ప్రియుక్తమన్నను క్షతిలేదుగాన నీప్రయోగము సమర్థము కాదు.

ఘనముగఁ జేయుచుండెడు జగన్నుత యున్నతియుం జయంబుఁ జే। కొనుమని యిచ్చె దీవనలు గోరి ఖగేంద్రునకుం బ్రియంబునన్ (ఆది. ౨ ఆ. ౫౭.) ఇందు 'దేహమును' అనుచోటి 'ను' అనునది సముచ్చయార్థక మనఁదగును. లేదా 'దేహమును' అనునది ద్వితీయయె యని యెంచి ద్వితీయాంతములును ద్వితీయార్థక ప్రథమలును నేకవాక్యమునఁ గలసియుండనోపునని యంగీకరించినను నంగీకరింపవచ్చును. ఈవిషయమును నిర్వహించు మాప్పరానిప్రయోగము గలదు. ఉ:—మాకు నతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య యీ। లోకములోని వర్తనములుం దగువారి నెఱుంగుదు......(ఆది. ౭ ఆ. ౧౫౬.) ఇందు 'వర్తనములున్' అనుచో 'వర్తనములన్' అని సవరింపరాదు. 'వర్తనములు' అనుచోటి 'లు' అనునది యతిస్థలము.

జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు. ౨౮.
వాఁడు పూవులు దెచ్చె = వాఁడు పూవులను దెచ్చె.
బాలవ్యా. ఆకె సొమ్ములు దాల్చె = ఆకె సొమ్ములను దాల్చె.
౨౫౭ I విషయము, వాఁ డిల్లు వెడలె = వాఁ డింటిని వెడలె. బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించిన ద్వితీయకుం బ్రథమరాదు.

సంజీవని. ౨౫౭ I విష:—జడంబు ద్వితీయకు = జడవాచకముపై నున్న ద్వితీయకు, ప్రథమ = ప్రథమావిభక్తి బహుళముగా నాదేశమగునని యర్థము. ద్వితీయైకవచనమునకుఁ బ్రథమైకవచనమును ద్వితీయాబహువచనమునకుఁ బ్రథమాబహువచనమును నాదేశములగునని యెఱుంగునది. ఆకె = ఆమె. 'వాఁ డింటివలన వెడలె' అనుచోటి యపాదానపంచమికి, బా. కా. ౧౦ సూత్రముచొప్పున 'ఉండి' శబ్దానుప్రయోగమును, బా. కా. ౧౧ సూత్రముచొప్పున వలనకు ద్వితీయాదేశమును రాఁగా 'ఇంటినుండి వెడలె' అని సిద్ధించును. అట్టి ద్వితీయకు 'ఉండి' శబ్దముతోడి దానికిఁ బ్రకృతసూత్రముచేఁ బ్రథమావిభక్తి యాదేశము కాఁగా 'ఇల్లు వెడలె' అనురూపము సిద్ధించును. ప్రథమాదేశము రానపుడు "ఇంటినుండి వెడలె" అని యుదాహరించుటయె న్యాయ్యము. కాని బాలవ్యాకరణపుస్తకము లన్నిటియందును 'వాఁడింటిని వెడలె' అనురూపమె కన్పట్టుచున్నది. ఉండిలోపమును సూరి వచింపలేదు. ఉండి పరమగునపుడె వలనకు ద్వితీయాదేశమును బా. కా. ౧౧ సూత్రము విధించుచున్నది. కావున "ఇంటిని వెడలె" అనుచో 'ఇంటినుండి వెడలె' అని యుండనగును. అచటి 'ఉండి' శబ్దము ప్రథమ

ముద్రణమందె భ్రష్టమయ్యెను. లేదా "వాఁడింటివలన వెడలె" అను పంచమ్యంత రూపమున కుండి పదానుప్రయోగము లేనిదానికి బా. కా. ౨౧ సూత్రముచొప్పున వచ్చెడి 'ఇంటిని వెడలె' అను ద్వితీయాంతరూపము సూరిగారిచే నుదాహృత మయ్యెనని యైన గ్రహింపవలయును. కాని సూరి యట్లు వివరింపలేదు. పంచమి కాదేశమయిన ద్వితీయకుఁ బ్రథమ యాదేశమయినట్లె తృతీయాసప్తములకు బా. కా. ౨౨ సూత్రముచొప్పున నాదేశ మగు ద్వితీయకును బ్రథమ యాదేశమగుననియు 'లంకం గలకలంబు పుట్టె' అనుచో "లంక కలకలంబు పుట్టె" అను ప్రథమాఘటితరూపమును సాధువే యనియు భ్రమింపరాదనుచు సూరి "బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించినద్వితీయకుం బ్రథమ రాదు" అని వివరించెను (విస్తర. I) సూరి యుదాహరించినస్థలము వంటిదె యనందగు నీక్రిందిచోటఁ బంచమీస్థలమున "అన్యస్యాః క్వచి"దిత్యాది సూత్రముచొప్పున వచ్చుద్వితీయస్థానమునఁ బ్రథమ కన్పట్టుచున్నది. ఉ...కూ। ర్మము గడంగి నీర్వెడలి (అను. ౧ ఆ. ౨౩౩ ప.) 'నీటివలననుండి వెడలి' అనుచో నపాదానపంచమి. నీటినుండి వెడలి - అపాదానపంచమీస్థలమున వచ్చినద్వితీయ. అట్టి ద్వితీయచోట వచ్చినప్రథమ:—నీరు వెడలి=నీర్వెడలి. (విస్తర. II, III).

---

విస్తర. I ౨౫౭ I విష:—ఇట్లు స్పష్టముగను గంఠోక్తముగను సూరి వచించుచుండఁగాఁ బేటికావ్యాఖ్యాత "ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయగు" (ప్రౌఢ. కార. ౨౦ సూ.) నని దీనిని సవరించుటను గమనించునది. దీనఁ దృతీయాసప్తములకుఁ గల్గినద్వితీయలలో సప్తమికిఁ గల్గినద్వితీయ ప్రథమాంతమై సప్తమ్యర్థకముగావచ్చుననుట తెల్లము" (బా. సా. పే. కార. ౨౮ సూ.వ్యాఖ్య. ౨౯౬ పు.) అని యిట్లువ్రాయుట సరికాదు. ప్రౌఢ. కార. ౨౦ సూత్రమునందలి "ఒక్కొకచో" అనుదాని కందలి యుదాహరణముల స్వారస్యమునుబట్టి యుదంతస్థలములందె యట్లు సప్తమికిఁ బ్రథమావిభక్తి వచ్చునని యర్థమునుచు వ్యాఖ్య చేయవలసియున్నది. కావున నుదంతముల సప్తమికి (౨౫౭ I విష.) ద్వితీయవచ్చుట వైయాకరణ కవిప్రయోగసమ్మతము కామింజేసి పేటికావ్యాఖ్యాత యాశయము పరాస్తమగుచున్నది. మఱియు సప్తమికిఁ బ్రథమ వచ్చుస్థలములలో నొక్కటి నైన ద్వితీయవచ్చిన ప్రయోగము మచ్చునకేని లేదుగదా. ఉదంతేతరశబ్దములందు సప్తమికిఁ బ్రథమవచ్చులక్ష్యములు ప్రౌ. కా. ౨౦ సూత్రమునఁ జూపఁబడలేదు.

విస్తర. II ౨౫౭ I విష:—స్త్రీలింగలక్షణశేషకర్త యీసూత్రమున రెండు విషయములు కొఱవడినవనుచు నీక్రిందిరీతిని బూరించెను.

"ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయగును. ఉదా:—వాహీకమునాఁగఁ బరఁగు తీర్థమాడి మేధాసమన్వితులగుదురు. చ. వ్రతములు లేనివారు...తీర్థము లాడనోపరు. (భార. అర. ౨ ౨౦౬ ప.) ఉర్విం గల్గుతీర్థంబు లెల్లను నే నాడుచు. (హరి. పూ. భా. ౫ ఆ.) క. ఎఱుకు నన్ను నుఱక యేసినశరములు। నెఱకులాడి... (భార. అర. ౧ ఆ.) చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము గ్రమ్మఁగ...... (భార. శల్య. ౧ ఆ.) ఆనమిడినఁ బగిలిపోవుటయు (భార. స్త్రీ. ౧ ఆ.) ఎ-గీ. ముట్టి కందముల్ వడిఁ గత్తి పెట్టిపెట్టి (హరి. పూ. ౬ ఆ.) శా. భావంబుల్ భయ ముజ్జగించి చూరుఁ డీ......(హరి. పూ. ౭ ఆ.) మ......సురసంఘం బేకతం బుండఁగన్ (హరి. పూ. ౫ ఆ.) ఎ-గీ. లీలఁ జేరోలగంబున్న నీలవర్ణు (ఉ. హరి. ౪ ఆ.) శార్ఙ్గగుణాగాధరవంబు నభంబు నిండఁగన్ (నిర్వ. 3 ఆ.) అదియున్ మే నుచ్చి (రా. అర. ౨ ఆ.) జనయిత్రి చిచ్చుఱికిన (జై. ౮ ఆ.) తే గీ.................. పంకము గొరిజ దిగఁబడి పఱవలేవు (స్వా. ౪ ఆ.) పక్షాంతరమునఁ దీర్ఘముండాడి. మొ. ఇట్టి ప్రయోగములచేత 'అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా' అను శబ్దానుశాసనుల సూత్రము సార్థకమగుచున్నది" (ప్రౌఢ. కార. ౨౦ సూ.) ఈ ప్రౌఢవ్యాకరణ సూత్రములోని 'ప్రథమయు' అనుచోటి 'యును' అనుదానిచేత సప్తమియు నిల్చుననియుఁ బ్రథమ పాక్షికమనియు విశదమగుచున్నది. "సప్తమికిని" అనుచోటి 'ను' శబ్దము చేత బాలవ్యాకరణము కా-౨౪ సూత్రముచెప్పిన ద్వితీయకే కాక సప్తమికిని బ్రథమ వచ్చునను గ్రంథకర్త యాశయము స్పష్టపడుచున్నది. పరిశీలింపఁగా నేతత్సూత్రవిషయము - బా - కార - ౨౫ సూత్రమునకు సవరణముగాఁ జెప్పుట యుక్తము. ఉత్తరసూత్రమున నిది వివరింపఁబడును.

విస్తర. III ౨౫౭ I విష:—"కొన్నియెడల నజడంబు ద్వితీయకును బ్రథమ కానఁబడియెడి. ఉదా:—చ. అని ఉజవంబునం బఱచు నమ్మదనాగ మెదిర్చి క్రమ్మరిం। చిన పరికాఁడువోలెఁ గురుసింహవరూథము నిట్లు క్రమ్మఱిం। చునె (భార. ఆది. ౪ ఆ. ౨౦౭ ప.) చ. తన వారణేంద్రము।క్కురుకుల వీరుమీఁద నెసకొల్పిన (భార. అర. ౬ ఆ.) తత్క్రతుహయోత్తమ మొక్కెడఁ గట్టఁ బంపుచున్ (జై. ౫ ఆ.) మొ." (ప్రౌఢ. కార. ౧౯ సూ.) ఇట్టు చింతామణికి సరియగు బాలవ్యాకరణసూత్రమును సవరించుటకు నిర్వహింపఁజాలు ప్రమాణములుగ నీలక్ష్యములు కన్పట్టుచున్నవి. మొదటి యుదాహృతిలో "అమ్మదనాగ మెదుర్పఁ గ్రమ్మఱిం। చిన" అని గ్రంథకృత్ప్రయుక్తపాఠ మన్నచో క్షతి కానరాదు. రెండవ యుదాహృతిలో "తనవారణేంద్రు నకొక్కరుకులవీరుమీఁద" అని గ్రంథకృదుద్దిష్ట

నన్నయా. క్వచి దన్యవిభక్త్యర్థే । ప్రథమాపి ప్రదృశ్యతే

విషయము. ౨ ౫౮ (విశ్వ. అజం. ౮౭ కా. అహో 3౬౫ పు.)

కల్పతరువు. ౨౫౮ విష:—ఈకారికకు ౨౨౦-౨౨౮ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. అచట సమాసమందె దీని కుదాహరణములు చూపఁబడెను. ఇచట వ్యస్తతయందును సమాసమందును నుదాహృతులు చూపఁబడుచున్నవి. అన్య విభక్త్యర్థే = ఇతరవిభక్తులయర్థమున, ప్రథమాపి = ప్రథమావిభక్తియు, క్వచిత్ = కొన్నియెడల, ప్రదృశ్యతే = కనఁబడుచున్నది. అపశబ్దమునుచే నీవిధి పాక్షికమని గ్రహింపవలయును. I దేశాధ్వకాలవాచకముల సప్తమికిఁ బ్రథమయు, II విశేషణ విశేష్యములలోఁ బ్రథమప్రయుక్తమునకు ద్వితీయాదిస్థానమునఁ బ్రథమయు, III విశేషణముల ద్వితీయాదిస్థానమునఁ బ్రథమయు బహుళముగా నగును. I ఉదా:—పేరోలగముండె. తీర్థములాడె, నిన్నవచ్చె, తేపచనియె, క్రోశమునడచె. II ఉదా:—మనుష్యులందఱకు దేవుఁడు పూజ్యుఁడు-పుస్తకములునాల్గిటిని దెమ్ము- III ఉదా:—తల్లి ద్రౌపదితోడన్. మొ. ప్రథమరానపుడు పేరోలగమందుండె, తీర్థములందాడె (స్నానముచేసె) నిన్నటియందు వచ్చె. తేపటియందుఁ జనియె. క్రోశమునందు నడచె. మనుష్యులకందఱకు దేవుఁడు పూజ్యుఁడు. పుస్తకములను నాల్గిటిని దెమ్ము. తల్లితో ద్రౌపదితో. మొ. దేశాధ్వకాలవాచకములకు సంస్కృతమున ద్వితీయాసప్తములు వచ్చును. "అకర్మకధాతుభి ర్యోగే దేశః కాలో భావో గన్తవ్యోఽధ్వాచ కర్మ సంజ్ఞక ఇతి వాచ్యమ్......" (సి. కౌ. ౫3౯ సూ. ౧౧౦3-౧౧౦౪ వార్తి) (విస్తర. I ౨3౫ విష.). "సప్తమ్యధికరణేచ (౨-3-3౬) (సి. కౌ. ౬33 సూ.)" అనుచోవ్వున దేశాధ్వ కాలవాచకములకు సంస్కృతమున ద్వితీయాసప్తములు వచ్చును. తెల్గునందన్నో యట్టియెడలఁ బ్రకృతసూత్రమునఁ బ్రథమయుఁ బ్రథమ రానపుడు సప్తమియు నగును. ఉదా:—పేరోలగముండె పేరోలగమందుండె. క్రోశము నడచె-క్రోశ

---

పాఠమని చెప్పినఁ జెప్పవచ్చును. ఇట్టిపాఠమె వావిళ్ళవారిముద్రణమునఁ గన్పట్టు చున్నది. మూఁడవయుదాహృతిలో "క్రతుహయోత్తము నొక్కెడఁ గట్టఁ బంచినన్" అని గ్రంథకృదభిప్రేతపాఠమనుటలో బాధ చూపట్టదు- "అశ్వోత్త మున్ దవ్వులన్" (ఆశ్వ. ౨ ఆ. 3౦.) అని యిట్టి ప్రయోగము మహాకవిసమ్మతమె యైయున్నది. పైరీతిని మార్పరాని ప్రమాణాంతరము దీని నిర్వహించుటకుఁ గన్పట్టలేదు.

మందు నడచె - నిన్నవచ్చె - నిన్నటిదినమందువచ్చె. ఇట్టియెడల సంస్కృతమందు వలె ద్వితీయ రానేరదు. (విస్తర I. II.).

దేశవాచకములకుఁ బ్రయోగములు:—విస్తర. II ౨౫౭ I విషయము నందలి త్రిలింగలక్షణశేషోదాహరణములెల్ల నిందలి దేశవాచకముల ప్రథమ కుదా హృతు లగుచున్నవి. ప్రౌఢవ్యాకర్త యాశయముచొప్పున బా-కా-౨౮ సూత్ర మునకు నవరణముగా నయ్యది యుదాహృతమయ్యెనుగాని యది బా-కా-౨౫

---

విస్తర. I ౨౫౯ విష:—"కాలాధ్వనో రత్యన్తసంయోగే. అనుదాని ననుస రించి యీసూత్రము గలిగెనని యనుమానింపఁదగును." (బా. సా. వే. ౨౬౭ పు.). అను పేటికావ్యాఖ్య సరికాదు. అత్యంతసంయోగాభావమున సప్తమీద్వితీయలు పర్యాయముగా వచ్చును. తెలుఁగునందు సప్తమి పాక్షికముగా నయినవచ్చును. పై పాణినిసూత్రముచే నత్యంతసంయోగమున ద్వితీయ నిత్యమగుటంజేసి సప్తమి యైనను బాక్షికముగా సయితము రానేరదు. ఇట్టి పాణినీయసూత్రము ననుస రించి ప్రకృతసూత్రము గలిగెననుట యసంగతము.

విస్తర. II ౨౫౯ విష:—అధ్వవాచకములకు మాత్రము సప్తమీప్రథమ లీక్రిందిరీతిని సంస్కృతమున వచ్చునని వోపదేవుఁ డుపదేశించియున్నాఁడు. "సీమాం తమార్గాత్ ప్రీచాంతే. ఉదా:—సోమనాథాచ్ఛతం క్రోశాః। కృష్ణః క్రోశేషు చాయుతే। గఙ్గాయమునయో ర్మధ్యే। కతిక్రోశాశ్చ జాహ్నవీ." (ముగ్ధ. కార. ౩౧౮ సూ.) "అవధిభూతయో రన్తర్వర్త్యధ్వవాచినః ప్రథమా సప్తమ్యౌ స్యాతా మిత్యర్థః." (ముగ్ధ. శ్రీరామతర్కవాగీశవ్యాఖ్య.) "సీమాద్వయమధ్యవర్తి మార్గ పరిమాణవాచకాత్ శబ్దాత్ అన్తే గమ్యమానే ప్రథమా - చకారాత్ సప్తమీ చస్యాదిత్యర్థః. అన్తగమ్యమానాభావేతు కేవలం ప్రథమాస్యాదిత్యర్థశ్చ వక్తవ్యః" (గిరిశచంద్ర విద్యారత్నవివరణము) అంతమం దనునర్థము గమ్యమానమగు చుండఁగా సరిహద్దులనడుమనుండు నధ్వ (మార్గ) వాచిశబ్దముకంటెఁ బరముగాఁ బ్రథమాసప్తములు పర్యాయముగ వచ్చునని యర్థము. ఉ. సోమనాథక్షేత్రము మొదలొకాని నూఱుక్రోశములు కృష్ణుఁ డున్నాఁడు = నూఱుక్రోశములతుదిని గృష్ణుఁ డున్నాఁడని యర్థము. (ఆయూరి కీయూరు నాల్గుక్రోశములు, అనురీతి నెన్నునది.) పదివేలక్రోశములం దున్నాఁడనియుఁ జెప్పవచ్చును. 'గంగాయము నలనడుమ గంగ యెన్నిక్రోశములు' అని యుత్తరార్థమునకర్థము. "గంగాయమున యోర్మధ్యే జాహ్నవీ కతిక్రోశాః-కతిక్రోశాన్ వ్యాప్య తిష్ఠతీత్యర్థః - అత్ర కేవలం ప్రథమా" (గిరిశచంద్రవిద్యారత్న వివరణము.)

సూత్రమునకు సవరణముగాఁ బ్రౌఢవ్యాకర్త సూత్రించుట యుక్తము. ఆసూత్ర
మును "ఒక్కొకచో నుదంతదేశవాచకముల సప్తమికిని బ్రథమ వైకల్పికముగనగు"
అని సూత్రించుట యర్హము. ప్ర దేశవాచకములకుమాత్రమె యుదంతములకు
మాత్రమె యట్టి ప్రథమ కొన్నియెడలఁ గన్పట్టుచున్నది. ఉదంతేతరశబ్దములం
దట్టిప్రథమ ప్రయోగదృష్టము కాలేదు. వాఁడడవినుండె ననుచోట వాఁడడవి
యుండె ననరాదుగదా. ఉదంతదేశవాచకములకు నైతమంతటను బ్రథమ నిలువదు.
చంద్రుఁడు తూర్పునఁ గలఁ డనుచోఁ జంద్రుఁడు తూర్పు గలఁడని చెప్పరాదు
గదా. మఱికొన్ని ప్రయోగము లిటఁ జూపఁబడుచున్నవి:—మథ్యాక్షరము
మాయన్నయాదేశమునఁజేసి సర్వతీర్థములాడుచు (ఆది. ౮ ఆ. ౧౩౩.) (తీర్థములు =
తీర్థములందు, ఆడుచు = స్నానముచేయుచు.) ఆరణ్యపర్వ ద్వితీయాశ్వాసమున
నిట్టివి యనేకప్రయోగములు గలవు. తే-గీ. కొల్వుందు బుద్ధి (విరా. ౫ ఆ. ౩౧౭.)
గీ. వచ్చి యిమ్మెయిఁ దపమున్నవార మేము (అర. ౭ ఆ. ౧౯౨.) చ. కడువడి
నాథనంజయుని కాంక్షిత మెక్కడ నక్కడెల్ల.........తేరుపఱపెన్ (ద్రోణ. ౧
ఆ. ౨౪౮.) మ. తమదిక్కార్పులఁ దూర్యనాదములు నత్యంతంబు శోభిల్ల (శల్య.
౧ ఆ. ౨౭౧.) సీ. అంత దేవాహితులు.........మంతనం బుండి (ఆది. ౨ ఆ.
౨౧.) (మంతనంబు = ఏకాంతము) ఇట్టివియుం గలవు. చ. వెలయఁగ నొక్కఁడున్
రిపుని వీ డఖిశంకతఁ జొచ్చె (హరి. ఉ. భా. ౨ ఆ. ౧౩౫.) కాలవాచకములకు:—
క. అనవిని యూరడి నిద్రా। జనితసుఖం బంది తేపు జనపతి యనికిం। జను
టయు.........(భీష్మ. ౩ ఆ. ౯.) (తేపు = ప్రాతఃకాలమందు.) క......వఱపు
ధరిత్రి। తాపంబుఁజేసె జనముల। పాపంబున వత్సరములు పండ్రెం డధిపా (శాంతి.
౩. ఆ. ౨౭౯.) చ.........సురాసురయుద్ధమునాఁడు దైత్యులన్ వెలయఁగ
నోర్చి.........(ఆది. ౮ ఆ. ౨౮౭.) ఆ-వె...ముందర గింద్రుపంచిన మహా। దారు
ణాంబుధరశతంబుచేత (ఆది. ౮ ఆ. ౨౩౮.) (ముందర = ముందటిసమయమున)
ఉ. జాను సెడంగ నీఖణము చంపరె కోపభరీతచిత్తులై (అర. ౨ ఆ. ౨౧౫.) అధ్వ
వాచక:—"వచన - నీయుత్తరీయంబు పడినయెడ యిచ్చోటికి నొక్కయోజనంబు
గలదు (అర. ౨ ఆ. ౧౭౩.) వచ. అది యిచ్చటికి లక్ష యోజనంబులు గల దనుగు
మనిన (ఆది. ౨ ఆ. ౭౯.) క. నరవరుఁడు నలుఁడు గా కె। వ్వరు శత యోజనము
లొక్క వాసరమున వ। త్తురు.........(అర - ౨ ఆ - ౨౧౪.)

కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు.

బాలవ్యాకరణ ౩౪౭.

వివృతి. వాఁడు నిన్నవచ్చె. వీఁడు నేఁడు వోయె. మాపు

౩౪౭ I విషయము. నిలువుము. తేపు పొమ్ము. వారు క్రోశము నడచిరి.

వీ రామడ వోయిరి.

సంజీవని. ౩౪౭ I విష:—నిన్న = పూర్వదినము, నేఁడు = ఈదినము, మాపు = రాత్రి, తేపు = మఱుసటిదినము లేదా ప్రాతఃకాలము. ఇవి కాలవాచకముల ప్రథమ కుదాహరణములు. ప్రథమ రానపుడు 'వాఁడు నిన్నటిదినమందు వచ్చె' అనురీతి నన్నిటను సప్తమి యగును. 'క్రోశము - ఆమడ' అనునవి యధ్వవాచకోదాహరణములు. ప్రథమ రానపుడు. 'వారు క్రోశమందు నడచిరి' మున్నగురీతిని సప్తమివచ్చును. దేశవాచకముల ప్రథమను సూరి సూత్రింప మఱచుటచేతఁ బ్రౌఢవ్యాకర్త (కార. ౨౦ సూ.) "ఒక్కొకచో జడంబు సప్తమికిం బ్రథమయు నగు.........(విస్తర. II ౩౪౬ I విష.) అని సూత్రించెను. (౩౪౭ విష.) (విస్తర.)

విశేష్యంబునకుంబోలె విశేషణంబునకును లింగవిభక్తి

వచనంబులగు. ౧౮.

బాలవ్యా. నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు. దేవకీపుత్త్రు

౩౪౮ విషయము. హరిని నుతింతు నెపుడు. శుభవిధాయుల రామ

కృష్ణులఁ భజింతు. భువనవంద్యను రుక్మిణిఁ బ్రస్తు

తింతు.

---

విస్తర. ౩౪౭ I విష:—"కాలపరిమితియందు నామంబులకు "కు" వర్ణకమగునని ప్రౌఢవ్యాకర్త ఆఱునెలలకు అను మొదలగునుదాహృతుల నిచ్చియుండుటను గమనించునది." అనుపేటికావ్యాఖ్య సరికాదు. ప్రౌఢ. కా. ౧౪ సూత్రమున కయ్యవిలక్ష్యములు. "కొండొకసేపునకుఁ దెలిసి - వర్షావధికిఁ బెట్టంగల యప్పనములు - పార్థశిర మాఱునెలలకుఁ ద్రెళ్ళు" అను తత్సూత్రలక్ష్యము లవధిప్రభృత్యర్థములందు వచ్చినవి. కావుననె యీయుదాహృతులచోటఁ బ్రకృతసూత్రము చొప్పునఁ బ్రథమావిభక్తిని నిల్పుటకు వలనుపడదు. "కొండొకసేపు తెలిసి - వర్షావధి పెట్టంగల యప్పనములు - ఆఱునెలలు త్రెళ్ళు" అనునవి సంగతార్థములు కావుగదా! "ఆమడకు నడచెను" అని చెప్పరాదుగదా! ఆమడ నడచె ననియే వ్యవహార మగపడుచున్నది.

సంజీవని. ౨౫౯ విష:—విశేష్యలింగవిభక్తివచనములె విశేషణమునకు నగు. కృష్ణుండు పుంలింగము మహద్వాచకము ప్రథమావిభక్తి యేకవచనము నగుటచే విశేషణమగు 'నందతనయుండు' అనునదియు నట్లె పుంలింగము మహద్వాచకము ప్రథమావిభక్తి యేకవచనము నయియున్నది. ప్రథమావిభక్తిని మార్చి ద్వితీయావిభక్తిగల విశేష్యవిశేషణములను జూపుటకై దేవకీపుత్త్రు నిత్యాది ద్వితీయోదాహరణము చూపఁబడెను. బహువచనవిశేష్యవిశేషణములఁ జూపుటకయి శుభవిధాయుల నిత్యాది తృతీయోదాహృతి చూపఁబడెను. స్త్రీలింగవిశేష్య విశేషణములను జూపుటకయి నాల్గవయుదాహరణము ప్రదర్శింపఁబడెను. విశేష్య విశేషణము లిట్లు సమానలింగవిభక్తివచనకములై సాధారణముగ నుండవలయు ననునది సంస్కృతభాషాప్రసిద్ధమగుటచే నన్నయాథర్వణులు వేఱుగ నుపదేశింప లేదు. సూరి యట్టి విషయమును బైరీతిని సూత్రించెను. (విస్తర I)

---

విస్తర. I. ౨౫౯ విష:—"నందతనయుండు. అనుపదార్థంబునకు 'కృష్ణుండు' అను ప్రథమా కారక ద్వారంబుననే క్రియాన్వయంబు కాని సాక్షాదన్వయంబు లేదనుకొని విశేషణంబుపైఁ బ్రథమాదివిభక్త్యాదులు ప్రాప్తింపకపోవుచుండఁగా నీసూత్రంబుచే నవి యపూర్వంబుగా విధింపఁబడినవి.' "శాస్త్రంబున నాలోచింపఁగా విశేష్యంబునకుంబోలె విశేషణంబునకును 'కృష్ణుండు దిక్కగున్' 'నందతనయుండు దిక్కగున్' అని ప్రత్యేకంబుగాఁ గ్రియాన్వయంబుకలదని యంగీకరింపక తీరదు. కావుననే గీర్వాణాదిభాషలలో విశేషణంబులపైనిఁ గూడఁ గారకవిభక్తి గలుగుచున్నది. కారకవిభక్తి పుట్టినపిమ్మట విశేషణవిశేష్యభావము కల్పింపవలెను." (బా. గు. ప్ర. కార. ౧౯ సూ. వ్యాఖ్య.) అని గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడెను. దీని ననుసరించియే పేటికావ్యాఖ్యాతయు విశేషణంబులకు లింగవిభక్తివచనములు "సిద్ధింపవను నపోహమును నిర్మూలింపఁగ నీసూత్ర మారబ్ధమయ్యెనని (బా. సా. వే. ౨౮౭ పుట.) వ్రాసెను. కాని యిచట సూరిగారు విశేషణముల క్రియాన్వయము విషయమున నేమియు వ్రాయలేదు. విశేషణవిశేష్యములు సాధారణముగ సమానలింగవిభక్తివచనకము లయియుండు ననువిషయమును మాత్రమె సూత్రించిరి. అట్లు వచించుట గీర్వాణభాషయందును గలదు. "ఉదితే విధౌ=విధో రుదయక్రియానంతరం, అనేన విధావితి 'స్త్రీ'. (సప్తమీ. ముగ్ధబోధసంజ్ఞా.). ఉదిత ఇతి తద్విశేషణత్వాత్ 'స్త్రీ' (సప్తమీ.). యదుక్తమ్. విశేష్యస్యచ యల్లిఙ్గం। విభక్తివచనేచయే। తాని సర్వాణి యోజ్యాని విశేషణపదేష్వపీతి." (మహామహోపాధ్యాయ శ్రీరామతర్కవాగీశ భట్టాచార్యవ్యాఖ్య. ముగ్ధ.

తెలుఁగున మహత్త్వమహతీత్వామహత్త్వములె లింగమునకు మాఱు వాడఁబడుననియు నట్లగుటచేతనే మహద్వాచకవిశేషణములును మహత్తులె యని యిట్లు విశేషణవిశేష్యముల మహత్త్వాదికమును దుల్యముగనె సాధారణముగా నుండుననియు నీవఱకు నుపదేశింపఁబడెను. (౧౨౫-౧.౨౫ I - II - III - IV - విషయములు.)

పయిరీతిని వ్యవహరింపఁబడు పుంలింగాదికమును మహత్త్వాదికమును విశేషణవిశేష్యములకుఁ దుల్యముగా నుండుట సాధారణ నియమము. వానికి వ్యత్యాసమును గలదు. లింగవ్యత్యాస మీవఱకుఁ గొన్నియెడల వివరింపఁబడెను. (౧౮౬-౧౮౬ I - II - III - IV - విష.) అట్లె మహత్త్వామహత్త్వముల వ్యత్యాసమును లింగవ్యత్యాసమును ౧౨౬-౧౨౬ I మొ. ౧౨౬ VIII వ. విషయములలో వివరింపఁబడెను.

ఆచ్ఛికశబ్దములపట్ల లింగవ్యవహారములేమింజేసి యవి పుంలింగసమములు స్త్రీలింగసమములు నపుంసకలింగసమములు నని వ్యవహరింపఁబడుననియు వానివిష

---

వ్యాక. కార. 3౦౯ సూ.) ఇంతయేల ? "పాణి న్యమర జమునేన్ద్రా। జయన్త్య ష్టాది శాబ్దికాః" అనుచొప్పున నాదిశాబ్దికులలో గణింపఁబడిన యమరసింహుఁడును నిట్లె వచించెను. "స్త్రీ దారాద్యై ర్యద్విశేష్యం। యాదృశైః ప్రస్తుతం పదైః। గుణద్రవ్యక్రియాశబ్దా। స్తథాస్యు స్తస్య భేదకాః" (నామలింగానుశాసనము. 3 కాం. విశేష్యనిఘ్నవర్గము. ౨ శ్లో.) వ్యాఖ్య:—"అస్మిన్వర్గే లిఙ్గజ్ఞానోపాయమాహ. యాదృశైః = యాదృగ్రూప లిఙ్గవచనవిభక్తియుక్తైః, స్త్రీదారాద్యైః = స్త్రీదారకళత్రాదిభి స్సుబన్తశబ్దైః, యద్విశేష్యమ్ = కర్తృత్వకరణత్వాద్యర్థ విశేష సంఖ్యావచ్ఛిన్న మర్థస్వరూపం భార్యాదికమ్, ప్రస్తుతమ్ = ఉపస్థాపితమ్, తస్య = తాదృశపదోపస్థాపితస్య తథా భూతవిశేష్యరూపార్థస్య, భేదకాః (విశేషణములు) గుణద్రవ్యక్రియాశబ్దాః = గుణద్రవ్యక్రియా యోగోపాధిలక్షణస్వార్థద్వారేణ అవచ్ఛేదకాః శబ్దాః, తథాస్యుః = విశేష్యవాచకస్త్రీదారాదిశబ్దవత్ లిఙ్గసంఖ్యోపాధికరూపవిశేష భాజోభవన్తి." (లింగయసూరి విరచితపదవృత్తి వ్యాఖ్య.) "యాదృశైః = ఏలింగముగలవైన, స్త్రీదారాద్యైఃపదైః = స్త్రీదారకళత్రాదిపదములచేత, యద్విశేష్యమ్ = ఏవిశేష్యమైన యర్థము, ప్రస్తుతమ్ = ఉపక్రమింపఁబడెనో, తస్య = ఆవిశేష్యమునకు, భేదకాః = విశేషణములైన, గుణద్రవ్యక్రియాశబ్దాః = గుణవాచక ద్రవ్యవాచక క్రియావాచకశబ్దములు, తథాస్యుః = ఆవిశేష్యలింగము గలవే యగును." (గురుబాలప్రబోధిక. టీక)

యమున విశేషణవిశేష్యములకు లింగసమత్వవిషయక సామ్యము నియతము కాదనియు వ్యత్యాసమె ప్రాయికమనియు ౧౯౦-౧౯౦ I విషయములందును ౧౮౬ విషయమునందును వివరింపఁబడెను. కొన్ని సంస్కృతసమశబ్దములకును బుంలింగాది సమత్వ వ్యవహారముగలదని తత్సమప్రకరణమున ౧౬౪ మున్నగు విషయములలో నుపదేశింపఁబడెను. అట్టివాని విశేషణవిశేష్యముల లింగవ్యత్యాసము సముచితము ౧౮౬ మున్నగువిషయములలో వివరింపఁబడెను. వివిధవిశేషణ విశేష్యవచనవిభక్తి వ్యత్యాసములు ౨౬౦ మున్నగు విషయములలో ముందు వివరింపఁబడును. (విస్తర II.)

---

విస్తర. II ౨౫౯ విష:—లింగవచనవిషయకములగు కొన్ని ప్రయోగవిశేషములు:—క......నీవలి। గిన నడ్డమె పురహరాజకేశవు లైనన్. (ఆది. ౪ ఆ. ౧౮౫ ప.) క......అడ్డంబగువా। రాయతభుజశక్తి నడ్డునుగుఁడు......(ఆది. ౪ ఆ. ౧౯౯.) తే.గీ. హరుఁడు వానికిఁ బ్రత్యక్షుఁడయి (ఆర. ౪ ఆ. ౨౪౪.) క......రావణుఁడు సమ్ముఖమై (నిర్వ. ౫ ఆ. ౨౯.) సీ. అనఁగె నీ వాడియుద్ధ్యాంత మగుట (ఉ. హరి. ౨ ఆ. ౨౧౨.) క......మదనుఁడు భస్మం బయ్యెన్ (నన్ని. కు. ౫ ఆ. ౫౨౯.) ఉ......మీా। రెక్కడ మాయమైతిరి (నన్ని. కు. ౫ ఆ. ౫౫౯.) చ. హరునకు రెండు రెండొకొ గజాజినముం దహనాంబకంబు నాన్. చ. ...గం గయుఁ జంద్రుఁడు రెండురెండు నా। శిరమునఁ బొంది రజ్జపథసింధుసుధాకరు లద్భుతంబుగాన్ (నన్ని. కు. ౮ ఆ. ౨౬.) ద్వి. హరియును గిరియును నజుఁడును గిజుఁడు। సురలును గిరలును హరుని సముంబె (బసవ. ౬ ఆ. ౭౪౧ ప.) “సమానార్థకంబులైన యీడెన సరిసాటి లోనగు దేశ్యవిశేషణశబ్దములును. (నిత్యైకవచనాంతములు.) సభలెల్ల......దీనికి సరిగావు......(సభా. ౧ ఆ)......సరులులేని దృక్షంజన కాబకములు. అని యొకచోఁ బ్రయోగము కానంబడుచున్నది......” (ప్రౌఢ. శబ్ద. ౩౨ సూ.).

“కొన్నియెడల విధేయవిశేషణమొండ బహువచనాంతంబయి విశేష్యంబులు పెక్కిటి కన్వయయోగ్యంబగు. క. ఇది దక్షిణాపథంబున। కిదియు విదర్భాపుర మున కిది కోసలకిం। దిది యుజ్జయనికిఁ దెరువులు.........(ఆర. ౨ ఆ. ౭౦.) బహువచనాంతము కాక యేకవచనాంతమైనచోఁ దెరువు లైదుండవలెను. (ప్రౌఢ. కార. ౨౫ సూ.) క. కరులకు నై రావతమును। హరులకు నుచ్చైశ్శ్రవంబు నవనీ స్థలిపై। నరులకు నృపతియు హిమగిరి। గిరులకు నేఁడుల కుదధియుఁ గీర్తితభర్తల్ (హరి. పూ. భా. ౧ ఆ. ౯౬ ప.) ఉ. ఎవ్వతనేని ధాత సృజియించెఁ దగన్ మగ

ఏకత్వం ఖేదకగతబహువచనానాంచ దృశ్యతే వికృతౌ
నన్నయా (ఆం. చిం. హలం. ౧౫ కారి.) (అహో. ౪౩౦.)
౨౬౦ విషయము. క్వచిదేకత్వమిష్టం స్యా । దప్రాణి స్త్రీవిశేషణే । సిద్ధ

వానిఁగాఁగ నా । కొవ్వుమిఁజేసి యట్టి నిను నుగ్గలిసేయఁగ నొల్ల.........శిఖండినీ (భీష్మ. 3 ఆ. 3౨౨) కం. నినుఁ గూల్చెదఁ । జూ యెవ్వత నైతి నేమి చూచెదు నన్నున్. (భీష్మ. 3 ఆ. 3౨౫.) క. మానవపతి నన్నొక్కఁడి । దానవు నీవనియెనేని ద్రౌపదికడ సున్నానంబువడసి మెలఁగుదు । నానగరుల నృత్యగురువ ననఁగలవాఁడన్ (విరా. ౧ ఆ. ౯౦.) (పేడియగు నర్జునువాక్యము.) చ. నలదమయంతు లిద్దఱు మనఃప్రభవానల దహ్యమానలై.........(ఆర. ౨ ఆ. ౨౪.) "పుమాన్ స్త్రియా. (౧-౨-౬౭.) స్త్రియాసహోక్తౌ పుమాన్ శిష్యతే - తల్లక్షణ ఏవ విశేషశ్చేత్." (సి. కౌ. ౯33 సూ.) అనుచొప్పున 'నలదమయన్త్యౌ' అనుదాని విశేషణముగు 'దహ్యమాన' శబ్దము "దహ్యమానశ్చ - దహ్యమానాచ = దహ్యమానౌ" అని పుంలింగముగనే నిల్చునుగాన "దహ్యమానులై" అని యుండవలయు ననుకొని కొంద ఱట్టిపాఠమును బ్రక్షిప్తము గావించుచున్నారు. కాని "పరవల్లిఙ్గం ద్వన్ద్వ తత్పురుషయోః. (౨-౪-౨౬.) ఏతయోః పరపదస్యేవ లిఙ్గం స్యాత్" (సి. కౌ. ౮౧౨ సూ.) అను సూత్రముచొప్పునఁ బరపదమగు దమయన్తీశబ్దస్త్రీలింగమె కలుగఁగా 'దహ్యమానలై' అనురూపమే యచట సాధువని యెఱుంగనగును. "కుక్కుటమయూర్యా విమే ఇతి. అయంచ ఇయంచ ఇమే ఇత్యత్ర......... విశేష్యనిఘ్నతైవ......ద్వన్ద్వవిశేషణస్య తత్పురుషవిశేషణస్య చానుప్రయోగే తదేవలిఙ్గమితి భాష్యకైయటయోః స్థితమ్. తతశ్చ - కుక్కుటమయూర్యా విమే ఇత్యుదాహరణే 'అయంచ ఇయంచ' ఇతి విగ్రహే 'పుమాన్ స్త్రియా' ఇతి పుంశేషేపి 'పరవల్లిఙ్గమ్' ఇతి విశేషణత్వాత్ స్త్రీలిఙ్గత్వే........." (సి. కౌ. ౯3౧ సూ. బాలమ. వ్యాఖ్య. ౪౧౬ పు.)

"ప్రకృతే ర్వికృతే ర్వాపి । యత్రోక్తత్వం ద్వయోరపి । వాచకః ప్రకృతే స్సంఖ్యాం । గృహ్ణీయా ద్వికృతే ర్నతు॥ యథా ఏకోవృక్షః పఞ్చనౌకా భవతి. పఞ్చవృక్షాః ఏకా నౌ ర్భవన్తీత్యాది" (ముగ్ధ. ౯౬౪ సూ. దుర్గా. వ్యాఖ్య.) అను చొప్పున తెల్గునందును "ఒకమ్రాను పదిబల్లలగుచున్నది. పదిబల్ల లొకతలుపగుచున్నవి" అని యిట్లు ప్రకృతి వికృతులలోఁ బ్రకృతియొక్క యేకత్వాదివచనమె నిల్చును. దీనికి విరుద్ధప్రయోగములును గలవు. "ద్వాద్వా మాఘాదిమాసౌ స్యా దృతు స్తైరయనమ్" (నామలిం. కాల. ౧3.) (చూ. ౧౧౯ విష.)

మ్వాన్త స్త్రీసమయో । స్సద్విశేష్యక యో స్తథా.(వికృ.
హలం. ౧౫-౧౬ కా. అహో. ౪౩౦.)

కల్పతరు. ౨౬౦ విష:—విశేషణ విశేష్యముల లింగవ్యత్యాసము. ౧౮౬-౧౮౬ II విషయములలోఁ జూపఁబడెను. వచనవ్యత్యాసము నుపదేశించుచున్నాఁడు. భేదకగతబహువచనానామ్ = విశేషణగతబహువచనమునకు, ఏకత్వమ్ = ఏకవచనము, దృశ్యతే=కవిప్రయోగములందుఁ గన్పట్టుచున్నది. ఇట్టిది సార్వత్రికముగా నుండరాదనుచు నది యుండెడిస్థలముల నథర్వణుఁడు చాల్గవివరణముగాఁ జూపుచున్నాఁడు:—క్వచిత్ = ఒకప్పు డనఁగా నీక్రింద వివరింపఁబడిన స్థలములందు, అప్రాణి=అప్రాణివాచక 'ము' వర్ణకాంతమగునట్టియు (మువర్ణకాంతత్వ ముత్తరార్థమునుండి యాకృష్టమగుచున్నది.) స్త్రీ = స్త్రీసమమగునట్టియు, విశేషణే = విశేషణమందు, ఏకత్వమ్ = చింతామణిలోఁ జెప్పఁబడిన యేకవచన మనఁగా విశేషణగతమగు బహువచనమునకు వచ్చు నేకత్వము, ఇష్టం స్యాత్ = పాక్షికముగా నగుట సమ్మతమగును. "సిద్ధమ్వాన్త స్త్రీసమయో." అను దానిచొప్పున "అప్రాణి స్త్రీవిశేషణే" అనుస్థలమందలి 'అప్రాణి' శబ్దమునకు మువర్ణకాంతజడవాచకమని యర్థము చేయఁబడెను. అట్టి మువర్ణకాంతజడవాచకము తత్సమమయినం గావచ్చును. ఆచ్ఛికమైనను గావచ్చును. స్త్రీసమమునునది యాచ్ఛికమె కావలయును. ఉదా:—ఇష్టమగుపదార్థనుఁలు. కులిశధారలు కుంఠితమయ్యె. బా. తత్స. ౮౬ సూ. ౧౮౬ విష. చొప్పునఁ గులిశధారా శబ్దవిశేషణమగు కుంఠితాశబ్దమునకుఁ బాక్షికక్లీబత్వము రాఁగాఁ బ్రకృతసూత్రముచే నేకవచనము వైకల్పికముగఁ గల్గెను. అందమగువస్తువులు, మాటలు పెక్కేల? "తాపహర్తలగు నుద్యానములు" అనుచో బా. తత్స. ౫౨ సూ. చొప్పున (౧౫౬ I విష.) "తాపహర్తలు" అను విశేషణమునకు స్త్రీత్వ మతిదిష్టమైనను నాచ్ఛికము కామింజేసి యేకవచనము రానేరదు.

ఉత్తరార్థ వ్యాఖ్య:—సిద్ధమ్వాన్త స్త్రీసమయోరిత్యాది—సద్విశేష్యకయోః= (సచ్ఛబ్దము ప్రాణిపరము.) ప్రాణివాచకము విశేష్యముగాఁగల, సిద్ధమ్వాన్త = సహజ (సిద్ధశబ్ద మాచ్ఛికమాత్రపరము) సిద్ధ'ము'వర్ణకముతోఁగూడిన యనఁగా నపుంసకలింగసమమగు విశేషణమునకును, (సిద్ధ) స్త్రీసమయోః=ఆచ్ఛిక స్త్రీసము విశేషణమునకును, తథా = ఆప్రకారముగానే బహువచనమున కేకవచనము పాక్షికముగ నగుట సమ్మతమగును. "తద్విశేష్యకయో రప్రాణి స్త్రీవిశేష్యకయో రిత్యర్థః. 'అందము - చొక్కము' ఇత్యాదయః సిద్ధమ్వాన్తాః - ఇంపు సొంపు ఇత్యాదయః

స్త్రీసమాః" (అహో. ౪౩౦ పు.) ఇందలి 'తద్విశేష్యకయోః' అనుచోటి 'తత్' అనునది ప్రక్షిప్తపాఠము. అహోబలపతి వ్రాతచొప్పున నద్దాని యర్థ మప్రాణి స్త్రీవిశేష్యకమనియు యంగీకరించినచో నది పూర్వార్థమునకె పునరుక్తమగుట నుత్తరార్థము వ్యర్థ మనవలసివచ్చును. కావునఁ బూర్వార్థ మప్రాణివిశేష్యపర మనియు నుత్తరార్థము ప్రాణివిశేష్యపరమనియు నర్థముచేసికొనుట యుక్తము. ఉదా:—పెక్కేనుంగులు - ఏనుంగులు పెక్కు. ఇంపయినజవరాండ్రు - "ఇంపయిన ప్రియురాండ్రు" (అహో. ౪౩౦ పు.) మొ. తత్సమప్రాణి విశేషణములకు రాదనునియమముచే "వంద్యములగు దైవతములు - జితసింహము లగు నేనుంగులు, జగద్భర్తలగు సురలు" ('భర్త' అనుదానికి స్త్రీత్వ మతిదిష్టము. బా. తత్స. ౫౨ సూ) (౧౫౬ విష) మున్నగుచోటులందు 'వంద్యమగుదైవత ములు' మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. 'అన్న - తండ్రి' మున్నగు విశేష్యస్త్రీసమములు విశేషణములుగా వాడఁబడినపు డీవిధి వర్తిల్లనేరదు. ఉదా:— అన్నలగుమానుసులు - ఇట 'అన్నయగుమానుసులు' అనురీతి ననిష్టరూపము సిద్ధింపనేరదు.

మహన్మహతీవాచక స్త్రీసమవిశేష్యకతత్సమ విశేషణము (తల్లిసదయ-తండ్రి సదయుఁడు. మొ.) లకు "వికృతౌ చ స్త్రీలిఙ్గాః స్త్రీలిఙ్గక సర్వనామధేయాః స్యుః." (౧౮౬ విష.) (౧౯౦ విష.) మున్నగుసూత్రములచొప్పున మువర్ణకాంతత్వమె సంభవింపదుగాన, మనోహరులగు కొడుకులు - మనోహరలగు నింతులు - బల్లిదు లగు కొడుకులు మున్నగుచోట్ల నీవిధికిఁ బ్రసక్తియేలేదు. "ఏకత్వం భేదకగత బహువచనానాంచ దృశ్యతే వికృతౌ...ఇంపైనప్రియురాండ్రు - ఒప్పైనసిరులు- ఇత్యాది. వికృతి పదప్రయోగస్వారస్యేన శుద్ధాంధ్రే ష్వేవైకత్వ మాచార్యస్యసమ్మ తమితి విజ్ఞాయతే..." (అహో. ౪౩౦ పు) ఇదిసరికాదు. "గుణవద్గణో ద్వితీయైక వచనతుల్యో భవే ద్వికృతౌ" అని యిట్లు వికృతిశబ్దమును గేవల సంస్కృతసమశబ్ద విషయమునఁ జింతామణికర్త యుపయోగించుటచేతను "కులిశధారల్ కుంఠితం బయ్యె" అని భట్టారకుఁడు ప్రయోగించియుండుటచేతను నై యహోబలపతి వ్యాఖ్య సరికాదనియుఁ బ్రయోగానుసారముగా నేకవచనమువచ్చునని చింతామణి వచింపఁగా నట్టి విషయము నథర్వణుఁడు వివరించెననియుఁ జెప్పుట యుక్తము. ప్రయోగములు:—లింగవిభక్తివచనసమతకు:—సీ. తనకుల బ్రాహ్మణు ననురక్తు నవి రళ, జపహోమతత్పరు విపులశబ్ద। శాసను సంహితాభ్యాసు బ్రహ్మాండాది, నానా

పురాణవిజ్ఞాననిరతుఁ । బాత్రు నాపస్తంబసూత్రు ముద్గలగోత్రజాతు........నన్ను పార్యుఁ జూచి........(ఆది. ౧ ఆ. ౯ ప.) ఉ. రాజకులైకభూషణుఁడు రాజ మనోహరుఁ డన్యరాజతే । జోజయశాలిశౌర్యుఁడు........రాజమహేంద్రుఁ డున్నతిన్. (ఆది. ౧ ఆ. 3 ప.) ఆ-వె.....వరుణేంద్రదేవియు । పోనిదాని దేవ యానిఁ గనియె (ఆది. 3 ఆ. ౧౪౦.) ఉ. రాజకులాగ్రగణ్య మృగరాజపరాక్రమ రాజరాజ.........(ఆది. ఆ. ౧ ఆ. ౧౬౨.) కం. ఓంకారవాచ్యునకు నన । హంకార విరూఢభావనారాధ్యునకున్ ।.........హరిహరనాథునకు......... (విరా. ౧ ఆ. 3౨ మొ. 3౬ వ).

విశేషణవిశేష్యముల వచనవ్యత్యాసమునకు:—ఉ. యోధుల సింహనాదము మదోత్కటవారణబృంహితంబు వే । గాధికవాజిహేషితమహారవమున్ రథనేమి ఘోషమున్ । బాధితకర్ణరంధ్రమయి పర్వె..........(సభా. ౧ ఆ. ౨౬౬.) చ......అనివారితమై చెలఁగెన్ మదీయవా । హిని భటసింహనాదహయహేషిత సింధురబృంహితధ్వనుల్ (సభా. ౧ ఆ. ౧౭౬.) మ......మూత్రై పోరుకర్ణాది దు । ర్జనసంఘుంబుల (సభా. ౨ ఆ. ౨౯౭.) స్రగ్ధర.........కులిశధారల్ గుంఠితం బయ్యె......(ఆది. ౨ ఆ. ౮౨.) కం.......పెక్కులు పలుకుల్ । పలుకంగ నేల (సభా. ౨ ఆ. ౧౭౨.) సీ. మాటలు పెక్కేల మానిసిగుఱ్ఱ మేనుంగను పేరెల్లఁ ద్రుంగె (సౌప్తి. ౧ ఆ. ౨౦౨.) కం.........మాయట్టివారిమాటలు కొఱయే (సభా. ౨ ఆ. ౧౯౦.) ప్రాణివిశేషణముల బహువచనమున నేకవచనప్రయోగములు:—సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ రాఁ బురవీథులఁ గ్రాలఁగలదె (విరా. ౫ ఆ. ౨౦౪ ప.) (పెక్కు లేనుంగులు - ఏనుంగులు పెక్కు.) ఇంపైన జవరాండ్రు. "మదికింపులు నింపుకలస్వనంబుతో" (వసు. ౨ ఆ. ౧౯.) అని యింపు శబ్దమునకు బహుత్వప్రయోగమును గలదు.

"మ. అదె నక్తంచరులందు నిందును (అర. ౭ ఆ. ౨౫౫.)" (అరుణో నక్తంచరులని వ్యవహారము) మున్నగుచోటులందు 'అదె' అనుదానికి 'చూడుము' అను నధ్యాహృతక్రియతో నన్వయముకాన నట్టివి దీనికి లక్ష్యములు కానేరవు (౨౧౫ II విష.). 'సరసములు+వచనములు' మున్నగుచోట్లఁ బ్రకృతకారికలోని పూర్వార్థముచొప్పున నప్రాణి మ్యంత విశేషణమున నేకత్వము రాఁగా "సరసము+వచనములు" అని సిద్ధించును, పిదప "మోస్తువిభక్త్యేకవచనకే పు-ంపూ" అను చొప్పున 'పు-ంపులు' రాఁగా "సరసపువచనములు - సరసంపువచనములు" అనురీతి రూపములు సిద్ధించును. (౯౪ విష.)

స్త్రీసమంబులగు విశేషణంబులయు మువర్ణకాంత విశే
షణంబులయు బహువచనంబున నేకవచనంబు బహు
బాలవ్యా. ళంబుగానగు. ౨౦.

౨౬౦ I విమర్శము. మాటలు పెక్కేల - మాటలు పెక్కులేల, కులిశధార
లు కుంఠితంబయ్యె, కులిశధారలు కుంఠితంబులయ్యె.
ఇష్టమగుపదార్థములు - ఇష్టములగు పదార్థములు.

సంజీవని. ౨౬౦ I విమ:—"మాటలు పెక్కేల - మాటలు పెక్కులేల" అనునవి స్త్రీసమవిశేషణోదాహరణములు. "ఇష్టమగుపదార్థములు - ఇష్టములగు పదార్థములు" అనునవి 'ము'వర్ణకాంత విశేషణోదాహరణములు. 'కులిశధారల్ కుంఠితంబయ్యె' (కులిశ = వజ్రాయుధముయొక్క, ధారల్ = దారులు, కుంఠిత మయ్యె = మొక్కవోయెను = వ్యర్థములయ్యెను.) అనుచో బా. తత్స. ౧౬ సూత్రముచొప్పున మహతీతర స్త్రీలింగవిశేషణమగు కుంఠితశబ్దమునకు వైభాషిక క్లీబత్వము రాఁగా "కుంఠితములు" అనురూప మేర్పడెను. పిదపఁ బ్రకృతసూత్రముచే బహువచనమున నేకవచనము రాఁగా "కుంఠితము" అనురూపము సిద్ధించెను. బా. తత్స. ౧౬ సూత్రముచొప్పునఁ గ్లీబత్వము రానిపక్షమున బా తత్స. ౧౫ సూత్రముచొప్పున స్త్రీలింగకులిశధారాశబ్దవిశేషణమగు కుంఠితశబ్ద మాకారాంతమగుచు రమాశబ్దమువలె రూపముల నంది 'కులిశధారలు కుంఠితలయ్యె' అనియే నిల్చును. కుంఠితశబ్దమునకుఁ గ్లీబత్వము వచ్చినను బ్రకృతసూత్రముచే బహువచనమున నేకవచనము రానిపక్షమున 'కులిశధారలు కుంఠితములయ్యె." అనురూపము గల్గును.

సూరి యథర్వణవచనమునందలి 'అప్రాణి' శబ్దమును సూత్రమున సంగ్రహింపకుండుటచే "వంద్యములగుదైవతములు - జితసింహములగు నేనుఁగులు - జగద్భర్తలగుసురలు" మున్నగుచోటులందును సూరి సూత్రముచొప్పున నేకత్వము కల్గి "వంద్యమగుదైవతములు - జితసింహమగు నేనుఁగులు - జగద్భర్తయగుసురలు" మున్నగు ననిష్టరూపములు దుర్వారము లగుచున్నవి. ఇట్లె "అన్నలగు మానుసులు లేరె యితరుల్ నీలీలకుం బాత్రముల్" మున్నగుచోటులందును "అన్నయగుమానుసులు - లేరె యితరుల్ నీలీలకుం బాత్రము" మున్నగురీతి ననిష్టరూపములు సూరి సూత్రమున దుర్వారము లగుచున్నవి.

గుప్తార్థప్రకాశికాకర్త "ఈసూత్రంబునందు స్త్రీసమంబులును మువర్ణకాంతంబులును జడవిశేషణంబులె గ్రహింపవలెను." (బా. గు. ప్ర. ౨౨౫ పుట. ద్వి.

ము.) అని వ్రాసి యీక్రింది తిమ్మకవి సూరకవి లక్షణములను బ్రమాణముగాఁ జూపెను. ఈ బా-గు. ప్ర. పక్షమున "సుస్థితులగు కొండలు" అనుచో "సుస్థితి యగుకొండలు" అనెడి యనిష్టరూపము దుర్వారమగుచున్నది. ఈతనిపక్షమున ఏనుంగులు పెక్కు - ఇంపైనప్రియురాండ్రు మున్నగురూపములెల్ల నసాధువులు కావలసివచ్చును. ఈతఁడు చూపిన సూరకవి తిమ్మకవి లక్షణములును సరిగా నుండలేదు. క. తెలుఁగునఁ బ్రాణిపదంబులు। వెలిగా బహువచనమునకు విస్పష్టముగా। నిలుచును విశేషణంబై।పొలుపొందఁగ నేకవచనము ముఖధ్వంసీ (సర్వల. ౨ ఆ. ౧౧ ప. ౫౮ పు.) క. జడపదబహువచనములకు। నిడఁదగును విశేషణములనేకవచనముల్ । మృడుని ఘనకీర్తులు బెడం। గడరెం దట్టముయి దిశల నన్నవిధమునన్ (కవిసం. ౧ తరం. ౨౦ లక్ష.) పీ రీవిధి పాక్షికమనకుండుటచేత "ఇష్టములగు పదార్థములు" మున్నగురూపములె దుర్లభములగుచున్నవి. ఇంతియుకాక వీరు స్త్రీసమముల కనువిషయమునె స్మరింపకుండుటచేత 'మాటలు పెక్కేల' మున్నగు తిక్కనాదులప్రయోగములును (సౌప్తి. ౧ ఆ. ౨౦౨.) నసాధువులె కావలసివచ్చును. మఱియు "మనోహరయగులతలు" అనురీతిగల యసాధుప్రయోగములు సయితము వీరిలక్షణముచొప్పున సాధువులె యనవలసియున్నది.

బా. సా. పే. వ్యాఖ్య యీవిషయమున బొత్తిగాఁ బ్రమాదభూయిష్ఠమై యుండుటచే విస్తరభీతి నద్దాని విమర్శ ముపేక్షితమయ్యెను.

నన్నయా. ౨౬౧ విష. క్వచిదన్యవిభక్త్యర్థే। ప్రథమాపి ప్రదృశ్యతే (వికృః అజం. ౮౭ కారి. అహో. 3౬౫ పుట.)

కల్పతరు. ౨౬౧ విషః—ఈకారిక. ౨౫౮ విషయమున వ్యాఖ్యాతము

సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం
దెయ్యది ముందు ప్రయోగింపంబడు దాని ద్వితీ
యాదులకుం బ్రథమ బహుళంబుగానగు. ౨౬.

బాలవ్యాకరణ వివరణము. ౨౬౧ I విషయము.

అన్నిగట్టములకు = అన్నింటికి గుట్టములకు, గుట్టములన్నిఁటికి=గట్టముల కన్నింటికి, సాహిణులు ముప్వురు. రెండుగట్టములకు = రెండింటికి గుట్టములకు, గుట్టములు రెండింటికి = గుట్టములకు రెండింటికి సాహిణులు నలుగురు, లక్షగుట్టములకు = లక్షకు గుట్టములకు, గుట్టములు లక్షకు = గట్టములకు లక్షకు రవుతులు లక్ష. ఇత్యాదు లెఱుంగునది.

సంజీవని. ౨౬౧ I విష:—ఇతరవిభక్తివిశేషణము ప్రథమాంతముగా నుండు స్థలము చూపఁబడుచున్నది. సర్వనామము దానివిశేష్యము నను జంటలో నేది ప్రథమప్రయుక్తమగునో యది ప్రథమాంతమై తక్కినది ప్రథమేతరవిభక్త్యంతమై యుండఁదగును. ఈవిధి బహుళముగానఁ బ్రథమప్రయుక్తము సైతము తక్కిన దానితో సమానవిభక్తిక మయియున్నను నుండవచ్చును. ఉదా:—గుఱ్ఱము లన్నింటికి = గుఱ్ఱముల కన్నింటికి, అన్నిగుఱ్ఱములకు = అన్నింటికి గుఱ్ఱములకు, సాహిణు లనఁగా రవుతులు మువ్వు రనునది యన్వితవాక్యమగుటకయి నిల్పఁబడెను. సంఖ్యావాచకము తద్విశేష్యము నను జంటలో నేది ప్రథమప్రయుక్తమగునో యది ప్రథమాంతమై తక్కినది ప్రథమేతరవిభక్త్యంతమై యుండదగును. బహుళవిధిగానఁ బ్రథమ ప్రయుక్తము సైతము తక్కినదానితో సమానవిభక్తికమయి యున్నను నుండవచ్చును. ఉదా:—రెండుగుఱ్ఱములకు = రెండింటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములు రెండింటికి = గుఱ్ఱములకు రెండింటికి 'సాహిణులు నలుగురు' అను దానితో నన్వయము. తెలుఁగున సంఖ్యావాచకమెల్ల సర్వనామమె యైనను సంస్కృతమున నట్లు కామింజేసి తత్సమసంఖ్యావాచకములందును నీవిధి వర్తించుటకై 'సంఖ్యాభిధాన' శబ్దము సూత్రమున వచింపఁబడెను. అద్దాని కుదాహరణము:—లక్షగుఱ్ఱము లకు = లక్షకు గుఱ్ఱములకు, గుఱ్ఱములు లక్షకు = గుఱ్ఱములకు లక్షకు 'రవుతులు లక్ష' అనుదానితో నన్వయము. 'రవుతులు లక్ష' అనుచోటి మహద్విశేషణ లక్షశబ్దమునకు "లక్షసంఖ్యవారు" అని యర్థము. (౨౨౩ విష.). ద్వితీయాదుల కనెడి సూత్రములోని వచనముచొప్పున, "గుఱ్ఱము లన్నిటిని = గుఱ్ఱముల నన్నిటిని, గుఱ్ఱము లన్నిటియందు = గుఱ్ఱములం దన్నిటియందు" మున్నగులక్ష్యములను గ్రహింపనగును. సూరి యమహత్తులను మాత్రమె యుదాహరించినను సూత్రమున నట్టి నియమము లేమింజేసి "మనుష్యులందఱును = మనుష్యుల నందఱును, జనులందఱియందును = జనులయం దందఱియందును మొదలగులక్ష్యములను సైతమెన్న నగును.

'రెండుగుఱ్ఱములు' అనుదానిలోని రెండుశబ్దమును 'అన్నిగుఱ్ఱములు' అను దానిలోని 'అన్ని' శబ్దమును బ్రథమాంతములనుచు నుదాహరించుటంజేసి యవి వ్యస్తములె యను సూరియాశయమును గ్రహింపవలయును. అవి సమాసగతము లన్నచోఁ బ్రకృతసూత్రమునకు లక్ష్యములు కానేరవు. సూరి యట్లు సూత్రించెనే కాని కొన్నియెడల నీవిధి వర్తిల్లనేరదు. 'మాయిద్దఱిలో = మా లో నిద్దఱిలో' అనుచో 'మేమిద్దఱిలో' అనురీతి ప్రయోగములు గన్పట్టలేదు. ఇట్లె 'మనయంద

అలో' అనుచో "మనమందఱలో" అని సిద్ధింపనేరదు. (వి స్తర.) ప్రయోగములు:—కం......మన | కీచకులందఱను రాత్రి గిటడఁచె రవా | స్యోచిత...... (విరా. ౫ ఆ. 33౧.) ఉ. ఆరయ నీకు నాకుఁ గులమంతకు నీనృపకోటి కుర్వికిన్ (ఉద్యో. 3 ఆ. ౨౬౨) ఉ...పార్థివసూను లిద్దఱు | గ్రీడయపోలెఁ గిట్టి...... (అర. ౭ ఆ. ౧౧౧.) సీ. దివ్యదేహోద్ధత దీప్తిసంతానంబు దిశలు పదింటను దీటుకొనఁగ (మహా. ప్ర. ౧ ఆ. ౪౮.) చ. అతఁ డొకరుండ లోకముల కన్నిటికిన్ మహనీయ దైవ | వతము.........(అను. ౫ ఆ. 3౧౭.) తే.గీ. వానియన్నింటి కంటె మేలైనశాంతి (ఉద్యో. ౨ ఆ. ౮౫.) క. మాయిరువురతోఁ గయ్యము | సేయ (ఉద్యో. ౨ ఆ. ౧3౫.) తే గీ ఏటికొను మీవు మాయేవురందు (శల్య. ౨

---

వి స్తర. ౨౬౧ I విమ:—"సంఖ్యాప్రయుక్తవిశేషణము............అని సూత్రించి సూరియొక్క యీసందర్భమును త్రిలింగలక్షణశేషకర్త సవరించుట నరయునది" (బా. సా. పే. కార. ౨౬ సూ. వ్యా. ౨౯౯ పు.) అను పేటికావాఖ్య సరికాదు. సూరిగారి యీసందర్భమునకును త్రిలింగలక్షణశేషకర్తగారి యీసూత్రములకును నేమియు సంబంధములేదు. ఆప్రౌఢవ్యాకరణసూత్రము బా. కా. ౨౬ సూత్రమును సవరింపలేదు. "ఒకటి = ఒకఁడు, ఒకండ్రు." అను శబ్దములయు 'అర - పావు - మున్నగు సంఖ్యార్థకశబ్దములయుఁ బ్రయోగము సమాస వ్యస్తతలలో నుండు వచనములరీతినిమాత్రమె యీప్రౌఢవ్యాకరణసూత్రము వివరించుచున్నది. అట్టి వివరణమునైతము చాలవఱకు నిరాధారము. (ప్రౌఢ. శబ్ద. ౪-౫ సూ.) 'డెబ్బదియొక్క రథము' అనవలెనుగాని 'డెబ్బదియొక్క రథములు' అనరాదఁట - వ్యస్తతలో 'రథములు డెబ్బది యొక్కటి' అని యిట్లు విశేష్యము పూర్వపదమే కావలెనఁట. ఇట్లనుట కాధారమేమో తెలియకున్నది. రెండున్నర రూపాయవంటి ప్రయోగములు బొత్తిగా లభింపవు. "సంఖ్యాప్రయుక్తవిశేషణమేకాంతంబయి యమహద్విశేష్యకమయ్యు, తదంశాంతంబయి మహదమహద్విశేష్యకమయ్యు, సమస్తంబు వ్యస్తంబు నగుచో విశేష్యంబు క్రమంబుగ నుత్తరపదంబు నేకవచనాంతంబును, పూర్వపదంబు బహువచనాంతంబునగు. ఉదా:—డెబ్బదియొక్కరథము = రథములు డెబ్బదియొక్కటి; రెండున్నరమాఁసి = మానుసులు రెండున్నర; రెండున్నరరూపాయ = రూపాయలు రెండున్నర. మొ.' (ప్రౌఢ. శబ్ద. ౪ సూ.) ఇట్టిసూత్రము ప్రకృతసూత్రమును (బా. కార. ౨౬ సూ.) సవరించుననుట యెట్లు? "రథములు డెబ్బదియొక్కటికి" అని ప్రకృతిసూత్రము చొప్పున వచించుటకుఁ బ్రతిబంధ మేమున్నది?

ఆ. ౧౦౮ ప.) క. అనేకముల్లు గలవు వాని యన్నిటిలోనన్ (అను. ౨ ఆ. ౧౩౮.) క. తమ ముప్పురుఁ బూర్వజ పూ। ర్వముగఁ బ్రమోదంబుతో వివాహంబైనన్ (నిర్వ. ౨ ఆ. ౮౩ ప.) ఇట్టియెడల "అవి యన్నిటికంటె-మే మిరువురతో-మే మేవు రందు-అవి యన్నిటిలోనన్ - మున్నగురీతి బ్రయోగములు కన్పట్టలేదు.

షష్ఠీ విశేషణానాం। ప్రథమాస్యాత్ ఆం. చిం.

నన్నయా అజం. ౧౪ కారి. అహో. ౩౧౫ పు.)

౨౬౨ విషయము. విభాషయా సుసన్తం స్యా। దత్ర షష్ఠీవిశేషణమ్

(విక్ర. అజం. ౪౧ కారి. అహో. ౩౧౫ పు.)

కల్పతరు. ౨౬౨ విష:—షష్ఠీ విశేషణానామ్ = షష్ఠ్యన్తములకు విశేషణము లగు శబ్దములకు, ప్రథమాస్యాత్ = ప్రథమావిభక్తి యగును. ఉదా:—సుగుణాభిరాముఁడు రామునకు వందనము. ఈవిధి పాక్షికమని చింతామణి చెప్ప కుండుటంజేసి యథర్వణుఁడు సవరించుచున్నాఁడు:—అత్ర = ఈ తెల్గుఁభాషయందు, షష్ఠీ విశేషణమ్ = షష్ఠ్యంతవిశేషణము, విభాషయా = వైకల్పికతచేత, సుసన్తం స్యాత్ = ప్రథమాంతము నగును. ఉదా:—సుగుణాభిరాముఁడు రామునకు నమస్కారము - సుగుణాభిరామునకు రామునకు నమస్కారము. "భ్యాదర్థవ్యవధానేతు। భేద్యస్య నిఖిలం భవేత్" (౨౬౩ విష.) అను నథర్వణవచన స్వారస్య ముచే షష్ఠీతరవిభక్త్యంతముల విశేషణములకు భ్యాదర్థవ్యవధానము లేనపుడు ౨౬౧ ౨౬౧ I విషయములచొప్పునఁ బ్రథమావిభక్తి నిల్చుట కొన్నిచోట్ల నగునని యు షష్ఠీవిశేషణములుమాత్రము విభాషగఁ బ్రకృతసూత్రముచొప్పునఁ బ్రథమాంతము లగుట సార్వత్రికములనియు గ్రహింపవలెను. చ. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు రాజధర్మ బం। ధురచరితుండు నీ వితనితోడ రణం బొనరించె దేని (ఆది. ౬ ఆ. ౪౫ ప.) చ. మదుకఁడనైన నాదుబలమును జలమును వివిధాస్త్ర సం। పదలును బోయి మాగురుఁడు భార్గవుచే వినుము. (ఉద్యో. ౪ ఆ. ౨౪౬.) ప్రయోగము లిట్లుండ సహోబలపతి యాక్రిందిరీతిని వ్రాయుట సరికాదు. "ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె - నిత్యాదికవిపితామహోద్యుక్తిస్తు నిర్మూలైవ." (అహో. ౩౧౫ పు.) (బా. గు. ప్ర. కర్త. యిట నసంగతముగా వ్రాసెను. చూ. ౨౩౬ పు. ద్వి. ము.) అనెడి కవిశిరోభూషణవ్యాఖ్య సాహసైకమూలము. "క్వచిదన్య విభక్త్యర్థే। ప్రథమాపి ప్రదృశ్యతే" (౨౫౮ విష.) అని యథర్వణుఁ డట్టిప్రయోగములను సంగ్రహించియున్నాఁడు. "కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకును బ్రథమ చూపట్టెడి. చ అహీనబాహుబలసారఘనుల్ మధుకైటభాది

దై । త్యపతులనెల్లఁ ద్రుళ్ళడఁచె (నిర్వ. ౪ ఆ. ౧౨ ప.) క. తండ్రీ ఘటోత్కచుఁడు మీ । తండ్రి గలుగఁగాదె తల్లి ద్రౌపదితోడన్ । .........(జైమి. ౧ ఆ. ౯౭.)" (ప్రౌఢ. కా. ౨౨ సూ.). ఆథర్వణమున కుదాహరణాంతరములు. ఎ-గీ. ఆద్యుఁడు హిరణ్యగర్భునం దంతకంటె (అను. 3 ఆ. ౫౦ ప.) క......మున। కీచకులందఱను రాత్రి గీటడఁచె రహ । స్యోచిత........(విరా. ౪ ఆ. 33౧.) క. మాతండ్రి పరాశరసుతు । చేతం బడసితి నసుజ్ఞ (ఆశ్ర. ౧ ఆ. ౫౨ ప.) సీ. దివ్యదేహోద్ధత దీప్తిసంతానంబు, దిశలు పదింటను దీటుకొనఁగ (మహా. ప్ర. ౧ ఆ. ౮౫.) మ... ప్రయో । జన........దుశ్చారిత్రకుం డాసు యో । ధను'న్'.........(ఉద్యో. 3 ఆ. ౯౫.) సీ......ఆ-వె.......అస్త్రకళాస ము । జ్జ్వలుఁడు పార్థుతోడ (కర్ణ. ౨ ఆ. ౮౨.) ఉ......పార్థివసూను లిద్దఱుం । గ్రీడయపోలె.........(ఆర. ౭ ఆ. ౧౧౧.) బాల. కార. ౨౬ సూత్రము ప్రౌఢ. కార. ౨౨ సూత్రము సంగ్రహించుచున్న పై యథర్వణకారికకుఁ బయిప్రయోగములు మూలమగు చున్నవి.

సమాసపూర్వావయవమగు షష్ఠ్యంతవిశేష్యమునకు విశేషణమయినను బ్రథమాంతమగుట మహాకవిప్రయోగదృష్ట మగుచున్నది. "విశేష్య స్యాభిన్నత్వేపి ఇదం విశేషణమ్. ఉ. ప్రల్లదుఁడైన యొక్కరుకులపాంసను చేసినదానఁ దత్కులం బెల్లను నిత్యా ద్యాచార్యోక్తి రత్ర మానమ్" (అహో. 3౧౪ పు.) ఈప్రయోగము భ్యాద్యర్థవ్యవథానము గల్గియున్నది. ఇట్లుగాకున్నను బ్రథమాంతమగుట కలదు. "ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబులకగు విశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి. ఉదా:—ఉ......పార్థివ । ప్రాగ్రసరుండు ధర్మసుతుపన్పిది నీకు నలంఘ్యము (ఆర. ౪ ఆ. ౮౧౬.) చ. లసదగణ్యగుణౌఘవిచిత్రుఁ డమ్మహా । త్ము చరితంబులు మ. ఉత్ఫుల్లలోచనుఁ డావిష్ణుమూర్తితో (హరి. ఉ. ౪ ఆ.) ఉ. విస్ఫురన్మహా । విక్రముఁ డైనదేవుఁడు త్రివిక్రముసొమ్ములు (హరి. ఉ. ౬ ఆ.)" (ప్రౌఢ. కార. ౨౧ సూ). క......భుజా । టోపభయంకరుఁ డర్జును । కోపానల మడరి ముట్టికొనదే వారిన్ (ఉద్యో. ౧ ఆ. ౮౬.). అహోబలపత్యాదుల యను రోధమునఁ బయిరీతిని వ్రాయఁబడెనేకాని బాగుగఁ బరిశీలించినచో నట్లు చెప్పవలసిన ప్రసక్తి యగపడదు. పైప్రయోగములందలి శేషషష్ఠ్యంత విశేష్యములెల్ల యొక్కవిభక్తిలోపించిన వ్యస్తరూపములె యని చెప్పుటలో బాధ యగపడదు. అట్టివి పెక్కుప్రయోగములు ౨౪౧ విషయమునఁ జూపఁబడెను. మఱియు నహోబలపండితీయ త్రిలింగలక్షణశేషాదుల వ్రాఁతలచొప్పున "భుజా । టోపభయంకరుఁ

దర్జునకోపానలము" అనురీతి ప్రయోగములును సాధువులనవలసివచ్చుచున్నది. అట్టివి సాధువులు కానేరవు, సిద్ధసమాసగతషష్ఠ్యంత విశేష్యముయొక్క విశేషణము నకుం బ్రథమవచ్చు ప్రయోగములు కానరావు. ఇచటి నారాయణీయగాణపత వివరణములును సరిగ లేవు (నారా. ౫౮౭ కారిక. ౮ పద్య.).

"క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామిసంబంధంబుగలచో సంబంధి పదంబు షష్ఠికి ద్వితీయయగు. క. కొన్ని వెడమాటలాడుచు। నన్ను నతఁడు చెట్టవట్టినన్ (విరా. ౨ ఆ. ౧౭౪.) ఉ. కట్టియ వైచె నెన్నుదురు గాఁడ భవత్తన యుండు మాద్రిలేఁ। బట్టిని (శల్య. ౧ ఆ. ౩౭౭.) మ. రాముతమ్మున్ లవుం। డిరు మూఁడమ్ములఁ జాపముం దునుము (జై. ౬ ఆ.) క. నరసూను నపుడు కర్ణుఁ। డిరుమూఁడు శిలీముఖము లెదసించిన (జై. ౭ ఆ) మొ." (ప్రౌఢ. కా. ౨౩ సూ.). ఈ ప్రౌఢవ్యాకరణసూత్రమునైత మనావశ్యకమె. రెండవయుదాహృతిలో "మాద్రిలేఁబట్టి నుద్దేశించి కట్టియవైచె"నని యన్వయింపనగును. మొదటియుదాహృతిలో "నన్నుఁ గొన్ని వెడమాటలాడుచు నతఁడు చెట్టవట్టినన్" అని యన్వయింపనగును. మూఁడవయుదాహృతిలో "తమ్మున్ లవుండు" అనుచో 'తమ్ముని' అనునది 'యొక్క' షష్ఠి లోపింపఁగా మిగిలినవ్యస్తపదము. అట్లె నాల్గవయుదాహృతియందును "నర సూను" అనునదియు 'యొక్క' విభక్తి లోపింపఁగా మిగిలినవ్యస్తపదము. (౨౫౧ విష.) రెండిటియందును నజయ్యతాయాపార్థవిశేషబోధకచార్థక 'ను' శబ్దయోగ మున "రాముతమ్మున్ - నరసూనున్" అనురూపములు సిద్ధించును. (౮౪ విష.)

షష్ఠ్యంతవిశేష్యము 'ను' విభక్త్యంతమగునపుడు దానివిశేషణము వైకల్పిక ముగాఁ బ్రథమాంతమగుటలో వివాదమే లేదు. మ......ఉద్దండగం। డక వేదండ వరాహవాహరిపుడ్గవ్యాఘ్ర మీముంచుకొం। డను రాఁజెల్లునె (మనుచ. ౨ ఆ. ౧౬ ప. ప్రాసస్థలము.). "నన్నయ యారీతిగ 'అయిన' అగు మొదలగు ధాతుజ విశేషణములతో వ్యవ్యవహితము లయినప్పుడే షష్ఠీవిశేషణములకుఁ బ్రథమా విభక్తిని వాడియున్నాఁడు. 'అనఘచరితుఁడు రఘునందనునకుఁ బ్రణతి' అను నిట్టి ప్రయోగముల నాతఁడుచేయలేదు." (ఆం. భా. చ. ౧౬౩౭ పుట.) అను భాషా చరిత్రవ్రాత కల్ల. క. ఆచార్యుఁడు ద్రో। ణునకున్ శిష్యుఁడ నెందును। నన వద్యుఁడ నేకలవ్యుఁ డనువాఁడ మహిన్ (ఆది. ౫ ఆ. ౨౩౭.) ఉ......పార్థివ। ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్నిది (ఆర. ౫ ఆ. ౪౧౬.) ఇట్లు నన్నయప్రయోగించి యున్నాఁడు.

ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథరు విభాష

బాలవ్యా. నగు. ౨౭.

౨౬౨ I విషయము. సుగుణాభిరాముఁడు రాముసకు జోహారు వొనర్చెద-

సుగుణాభిరామునకు రామునకు జోహారు వొనర్చెద.

సంజీవని. ౨౬౨ I విష:—స్పష్టార్థము. ప్రౌఢ. కార. ౨౧ సూత్రము దీనిని సవరించుటకై యుపదేశింపఁబడినది. ఆవిషయమును బా. గు. ప్ర. వ్యాఖ్యాత యీసూత్రపుటీకలో సవిస్తరముగా విమర్శించి సంస్కృతవ్యాకరణవిషయము లను బెక్కిటి నెక్కించెను. వానినెల్ల బా. సా. వే. వ్యాఖ్యాత స్వీకరించెను. కల్పతరువులో వివరించినరీతిని "భుజాటోపభయంకరుఁ డర్జును కోపానలము" మున్నగుస్థలములు వ్యస్తములై యగుటచే వారివిమర్శ మెల్ల వృథయగుచున్నది.

నన్నయా భ్వాద్యర్థవ్యవధానేతు । భేద్యస్య నిఖిలం భవేత్

౨౬3 విషయము (వికృ. అజం. ౮౧ కారి. అహో. 3౧౫ పు.)

కల్పతరువు. ౨౬3 విష:—భ్వాద్యర్థ = భూప్రభృతిధాతు వులరూపముల వ్యవధానేతు = వ్యవధానముండైనచో, విశేషణవిశేష్యములకు భూప్రభృతి ధాతురూపముల యన్వయవ్యవధాన మున్నచో, భేద్యస్య = విశేష్యమునకు, నిఖిలంభవేత్ = సకలవిభక్తులు నగును. విశేషణము ప్రథమాంతముగాను విశేష్య మితరవిభక్తులుగలదిగాను వికల్పముగ భ్వాద్యర్థవ్యవధానమందు యథేష్టముగాఁ బ్రయోగింపవచ్చునని యర్థము. భ్వాద్యర్థవ్యవధానముచేయక విశేషణవిశేష్య ములను సమానలింగవిభక్తివచనములు గల్గునట్లును బ్రయోగింపనగును. భ్వాద్యర్థము లనఁగా, భూధాత్వర్థకముగు 'అగు' మున్నగుధాతువులు. ఆది శబ్దముచే 'అగు' ధాతువు మున్నగునవి గ్రాహ్యములు. అట్టిధాతువులనుండిపుట్టిన విశేషణరూపము లనఁగా అగు-కాని మున్నగు ధాతుజవిశేషణములు. వ్యవధానమనఁగా విశేషణము ధాతుజవిశేషణముతో నన్వయించుచుండఁగా నట్టి ధాతుజవిశేషణము విశేష్య ముతో నన్వయించుటయని తాత్పర్యము. సమాపకక్రియలందలి తిఙుచే కర్తృకర్మాదు లభిహితము లగునపుడట్టి కర్తృకర్మాదివాచకములకుఁ దృతీయ ద్వితీయ మున్నగు నవిరాక ప్రాతిపదికార్థప్రథమ వచ్చునట్లె ధాతుజవిశేషణాన్వయమునందును గర్తృ కర్మాదులు కృత్తుచే నభిహితములగునుగాన నట్టిస్థలములందలి కర్తృకర్మాదు లకును బ్రథమయేవచ్చునని "కర్మాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణకశ్చ తద్వత్ స్యాత్" అను చింతామణిసూత్రముపదేశించుచున్నది. (బా. సమా. ౨౬ సూ. ౨౭౮. విష.) కానసట్టిపద్ధతిచొప్పున విశేష్యమేవిభక్తితోనున్నను ధాతుజవిశేషణా

న్వయమున విశేషణవాచకము ప్రథమాంతమెయగునని తాత్పర్యము. విశేష్యము లకువలెనె విశేషణములకును క్రియాన్వయము సంస్కృతాంధ్రవైయాకరణ సమ్మతమైయున్నది. (౨౫౯ విష.). ఇట్లగుటంజేసి ప్రకృతాథర్వణకారిక సిద్ధార్థాను వాదకమెయని యెఱుంగునది. ఉదా:—సుగుణుఁడగు మనజునకు శ్రేయము గల్గును. సుగుణుఁడయిన మానవుని. సుగుణుఁడు కానిమనుష్యునకు శ్రేయస్సు దుర్లభము. మొ. ఇవి భూధాత్వర్థకముల కుదాహృతులు. ఆదిశబ్దముచే - పండితుఁడను ప్రసిద్ధిగలరామునికి - పండితుఁడని యెన్నికగన్నరామునిచే - పండితుఁడు నాఁబరఁగురాముని - పండితుఁడనఁబడని దేవదత్తునికై. మొ. ప్రయోగములు. చ......ప్రసిద్ధులై విమలసద్గుణశోభితులైన పాండవో । త్తముల చరిత్ర (ఆది. ౧ ఆ. ౧౪.) చ. అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబును.........(ఆది. ౧ ఆ. ౧౫.) ఉ......తపకిష్టుఁడున్ సహా । ధ్యాయుఁడునైనవాఁడు. క. దేవసములైన యనుజుల। తో విప్రులతో రథాలితో వచ్చి...... (ఆర. ౨ ఆ. ౫ ప.) క. వినుఁడేఁ బుణ్యశ్లోకుం । డనఁగ సదా యజ్ఞనిరతుఁడనఁగ ధరిత్రిం । దనరిన నలుభార్యను స । జ్జనసుత దమయంతియనఁగఁ జనియెడుదానన్ (ఆర. ౨ ఆ. ౯౯.) ఉ. తే । జోలలితుండు నిర్మలయశుండగు ధర్మతనూజుపాలికిన్ (ఆర. ౨ ఆ. ౨౯౨.)

భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమయగు. ౨౮.

అగు మొదలగునవి భవత్యర్థములు విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురు. భూతదయాళురగు మహాత్ములకు శ్రేయంబుగలుగును. అతిమానుష మత్యద్భుత । మతిదుష్కరమయిన కేశవార్జునకృతి.

భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకు నద్దాని ముందువిశేషణంబుల కయిపదంబును బహుళంబుగా ననుప్రయుక్తంబగు. ౨౯.

బాలవ్యాకరణ వివరణము. అతులుఁడయి యప్రమేయుఁడౌ హరిని గొలుతు.

అయిపదానుప్రయోగంబు లేనిచోఁ దుది

౨౬3 I విషయము. విశేషణంబునకేని విశేషణంబు లన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపఁబడు. 3౦. ఆద్యుఁ డప్రమేయుఁడు నగు హరినిగొలుతు.

ఆద్యుఁడు నప్రమేయుఁడునౌ హరి౯గొలుతు.
ఆద్యుఁ డప్రమేయుండగు హరిని గొలుతు.

ధాతుజవిశేషణావ్యవధానంబున విశేషణంబు
లన్నిటి కయి పదం బనుప్రయుక్తంబగు. ౩౧.

బాలవ్యా. ౨౬౩. I విషయము

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసఁ
గెడు దేవుని నభినుతింతు. ఇచట మఱియుం
బ్రయోగవైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల
నెఱుంగునది.

భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ
యగు. ౩౨.

రాముఁడు వచ్చుట, రాముఁడు రాఁగా లక్ష్మణుండు
గాంచె. రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకు
లంబులగు. రాముండు పట్టినప్రతిన వారింపం
దరంబుగాదు.

సంజీవని. ౨౬౩ I విష:—బా. కా. ౨౮ మొ. ౩౨ సూత్రమువఱకుఁగల బాలవ్యాకరణవిషయములు సయితము సిద్ధార్థానువాదకములె యనఁదగునుగాని వానివైఖరినిబట్టి చూడఁగా సూరి యట్లు తలంచెనని తోఁచకున్నది. భావార్థకాదిప్రత్యయములెల్ల బా. క్రి. ౪౮ సూత్రముచొప్పునఁ గర్త్రర్థమందును గర్మార్థమందును విధింపఁబడిన వగుటంజేసి వానిచేఁ గర్తృకర్మార్థము లభిహితములె యనఁదగును గాన నట్టి కర్తృకర్మవాచకములకుఁ బ్రాతిపదికార్థ ప్రథమయె వచ్చును. కావున "భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు" (బా. కా. ౨౮ సూ.) అనుసూత్రము సిద్ధార్థానువాదకమె యనుటలో సందేహములేదు. బా. కా. ౨౮ సూత్రమునఁ జెప్పఁబడిన భవత్యర్థవిశేషణములును ౨౯-౩౦-౩౧ సూత్రములలోఁ జెప్పఁబడిన భవత్యర్థధాతుజవిశేషణములును 'అయి' పదంబును భావార్థకాదులలోనివె (బా. కా. ౩౨ సూ.) యగుటం జేసి వానితో నన్వయించు విశేషణములును బ్రథమాంతములగుట సిద్ధార్థమెకాని యపూర్వవిషయముకాదు.

౨౮ సూత్రపుటీక:—ఇందుఁ జెప్పఁబడిన భవత్యర్థము లనఁగా "అగు" ధాతుజన్యములగు విశేషణములుమాత్రమె యని గ్రహింపవలయును. ౨౯-౩౦-౩౧ సూత్రములలో వచింపఁబడిన 'అయి' పదంబుసయితము భవత్యర్థకరూపమె

యయినను నద్దానిని సూరి యిం దుద్దేశింపలేదు. ౨౯-30-3౧ సూత్రములలో 'అయి' పదప్రయోగమునఁగల్గు వాక్యన్యాయసిద్ధవిషయములు వివరింపఁబడును. భ్యాదర్థేత్యాద్యథర్వణ వచనమునందలి 'ఆది' శబ్దము నర్థము సూరిచే సంగ్రహింపఁబడనే లేదు. అగుధాతుజన్యములగు విశేషణములు విశేషణవిశేష్యము లకు వ్యవస్థాయకము లగునపుఁడు విశేష్యమే విభక్తితో నున్నను విశేషణము ప్రథమాంతమగునని సూత్రార్థము. 'పురుషునిన్' అనువిశేష్యము ద్వితీయాంత మయినను 'అగు' అనెడి భవత్యర్థకవిశేషణముచే వ్యవస్థాపితమగు 'విద్యాశాలి' అనువిశేషణము ప్రథమాంతమైయున్నది. ఇట్లె తక్కినస్థలములందును లక్ష్య లక్షణసమన్వయమును గ్రహింపవలయును. అగుధాతుజవిశేషణము పెక్కు విశేషణముల కొక్కటియే వ్యవస్థాయక మగుటకు 'అతిమానుష' మిత్యాది భట్టా రకపద్యభాగ ముదాహరింపఁబడెను. క. అతిమానుష మత్యద్భుత । మతిదుష్కర మైన కేశవార్జునకృతి గో । పతి చూచి మెచ్చి సురపరి । వృతు డయి చనుదెంచెఁ గృష్ణవిజయుల కడకున్ (ఆది. ౮ ఆ. 3౯ ప) (గోపతి = స్వర్గపతి. 'కృతిన్' అనిభేదము.) "అతిమానుష మత్యద్భుత । మతిదుష్కరమైన కేశవార్జునకృతి ఇత్యాదిస్థలంబులయందు" (బా. గు. ప్ర. ౨3౭ పుట. ద్వి. ము.) అని ప్రకా శికాకర్త యుదాహరించుట పొరపాటు. ఈవాక్యమున ద్రుతలోప మసంభవము.

౨౯ సూత్రపువ్యాఖ్య:—'అయి' అనునది యగుధాతుక్త్వార్థకరూపము. 'ఔ' అనునది 'అగు' ధాతుతద్ధర్మార్థకవిశేషణరూపము. కాన రెండును భవత్యర్థ రూపములు భావార్థకాదులలోనివియు నగుచున్నవి. అయిపదముతో నన్వ యించు 'ఆద్యుఁడు' అనువిశేషణమును, 'ఔ' పదముతో నన్వయించు 'అప్ర మేయుఁడు' అనువిశేషణమును బ్రాతిపదికార్థప్రథమాంతములయినవి. 'అయి' అనుక్త్వార్థకము 'ఔ' అనుధాతుజవిశేషణముతోను నట్టిధాతుజవిశేషణమగు 'ఔ' పదము "హరిని" అనువిశేష్యముతోను వాక్యసామాన్యన్యాయసిద్ధముగా నన్వ యించుచున్నవి. ఇట్టివాక్య న్యాయసిద్ధవిషయములను సూరి ప్రత్యేకముగా సూత్రించుట కేవల మనావశ్యకము. బహుళమనుటచే "ఆద్యుఁ డప్రమేయుఁడౌ హరిని గొలుతు" అనియు నుండవచ్చును. చ. అనిలజవాశ్వయుక్తమయి హాటక రత్నవిచిత్రతార్క్ష్యకే । తనమయి మేఘనాదమయి దారుకసారథి యైన దివ్యకాం । చన రథమెక్కి (సభా. ౨ ఆ. ౮౪.)

30 సూత్రపువ్యాఖ్య:—పయిరీతిని 'అయి' పదప్రయోగము లేనపుడు ప్రథమాంతవిశేషణములు పెక్కులున్నచో వానియన్నిటి తుదిని సముచ్చయార్థక

'ను' శబ్దము నిల్పుటయు లేక ౮౪ I విషయములోని "అయుతా వపి సంయుతౌ" అను నథర్వణసూత్రముచొప్పున యథాసంభవముగా 'ను' శబ్దము నిల్పుటయు వాక్యన్యాయసిద్ధములై యున్నవి. అట్టి విషయములను బ్రత్యేకముగా సూత్రించుట యనావశ్యకము. సూరి యిట్లు సూత్రించెనేకాని తానే యుదాహరించిన "అతిమానుష మత్యద్భుత । మతిదుష్కరమైన కేశవార్జునకృతి (నీ)" (ఆది. ౮ ఆ. 3౧౯ ప.) అను భట్టారకపద్యమున నొక్కటేని సముచ్చయార్థక 'ను' శబ్దము ప్రయోగింపఁబడలేదే! తానును 'ఆద్యుఁ డప్రమేయుఁ డగుహరిని గొలుతు' అని యుదాహరించెనుగదా. మొదటియుదాహృతిలోఁ దుదివిశేషణముమాత్రము 'ను' శబ్దాంతమై యుండునట్లును రెండవయుదాహృతిలో విశేషణములన్నియు 'ను' శబ్దాంతములై యుండునట్లును మూఁడవయుదాహృతిలో విభాష ననుదానికి సరిగ నొక్క విశేషణమేని 'ను' శబ్దాంతము కాకుండునట్లును సూరి తనసూత్రము నకు నుదాహరించెను.

3౧ సూత్రపువ్యాఖ్య:—అగుధాతు భిన్నమగు వేఱొండుధాతువునుండి పుట్టినవిశేషణము వ్యవధాయకమగునపు డనఁగా నట్టి యితరధాతుజవిశేషణము విశేష్యమునకు సన్నిహితమయి దానితో నన్వయించునపు డట్టి విశేష్యపువిశేషణములెల్ల 'అయి' పదముతో నదుకునని యర్థము. ఉదా:—ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడుదేవుని నభినుతింతు = ఇందు 'దేవునిన్' అను విశేష్యమునకు విశేషణములయ్యె - 'అయి' పదముతో నన్వయించున వగుటంజేసి 'ఆద్యుఁడు' మున్నగువిశేషణములు ప్రథమాంతములయ్యెను. అట్టి యగుధాతుక్త్వాంతరూపములగు 'అయి' పదంబులన్నియు 'ఎసంగెడు' అనుధాతుజ విశేషముతో నన్వయించుచున్నవి. అట్టి ధాతుజవిశేషణము 'దేవునిన్' అను విశేష్యముతో నన్వయించుచున్నది. ఇట్టి వాక్య న్యాయసిద్ధవిషయములను సూరి ప్రత్యేకించి సూత్రించుట యనావశ్యకము. వాక్యమున నర్థవంతమయి ప్రత్యేకాన్వయముకల్గిన 'అయి' పదంబు నను ప్రయుక్తమని వచించుట సరికాదు. ఇంకను వివిధములగువింతలు మహాకవులవాక్యములందుఁ గలవనియు వాని నట్టి ప్రయోగంబుల నెఱుంగ నగుననియు సూరి యింతతో విరమించుట ప్రశంసార్హము.

ప్రయోగములు:—మధ్యాక్షరము - అని ననివృత్తులై పుణ్యచరితులై యాత్మప్రబోధ । వినిహితచిత్తులై సర్వధర్మార్థవిదులయి తృప్తిఁ । దనరెడు రాజర్షి వరులకు.........(ఆర. ౧ ఆ. ౧3౮.) మఱియుం బ్రయోగవైచిత్ర్యంబు:—

క. నీ యడిగిన యర్థాభి । ప్రాయములకు నుత్తరంబు పరువడిఁ జెప్పన్ । ధీయుత బ్రాహ్మణులకుఁ గా । కాయతమతులయ్యు నొరుల కలవియె చెప్పన్. (అర. ౪ ఆ. ౧౨౫.) 'ఆయతమతులయియు' అనురీతిని విశేషణ మయి పదాంతమయి యుండఁగా నొరులకు ననువిశేష్యమునకు ముందేదేని ధాతుజవిశేషణముకాని 'ఉండినను మున్నగు సుగ్రహాన్వయముగల పదములుగాని లేకుండుట వింత. సీ. చక్రధరుండయ్యు జలరుహనాభుండు గాండీవధరుఁడయ్యుఁ బాండవుండు । నుండిరి. (ఆది. ౭ ఆ. ౨౬౧.) క. పంబి యజనాథ్యయనదా । నంబుల వర్తిల్లె బ్రాహ్మణప్రియమయి ధ । ర్మ్యంబయి క్షత్రియవైశ్యకు । లం బవిరతపుణ్యకర్మలాలసమగుచున్ (ఆది. ౭ ఆ. ౭౫ ప.) వీనియందెల్ల 'అయి' పదప్రయోగ మున్నను విశేష్యమునకు ముందు ధాతుజవిశేషణప్రయోగము లేకుండుట విశేషము.

౩౨ సూత్రపువ్యాఖ్య:—బా. క్రియా. ౩౫ సూత్రము మొదలు ౪౮ సూత్రమువఱకుఁగల విధులచేఁ జెప్పఁబడిన "ట - కజి మిజి - ఇ - కజి - నుజి - న - డును - చును - ఎడి - ఎడు - తల్లోపము - ఉన్న - కల - న - నిజి" అనువర్ణకములును, బా - క్రి - ౧౨౨ సూత్రముచే విధింపఁబడిన నుజవర్ణకమును భావార్థకాదులు. అట్టివర్ణకముల యోగంబున ననఁగాఁ దత్తద్వర్ణకాంతములతో నన్వయించు కర్తృవాచకమునకుఁ బ్రథమయగునని యర్థము. బా - క్రియా - ౪౭ సూత్రముచొప్పున లడాదులును భావార్థకాదులును గర్తృకర్మార్థములందు విధింపఁబడుటంజేసి కర్తృకర్మము లభిహితములగుచు గాన బా - కా - ౨-౩ సూత్రముల చొప్పునఁ గర్తృకర్మవాచకములపైని దృతీయయు ద్వితీయయు నిల్వనేరవు. కావున నవి ప్రాతిపదికార్థప్రథమాంతములె యగునని ప్రకృతసూత్రము సిద్ధార్థానువాదక మగుచున్నది. సూరిగారి యుదాహృతులలో 'రాముఁడు వచ్చుట' అనునది టవర్ణకోదాహరణము. 'రాముఁడు రాఁగా' అనునది భావలక్షణార్థకనుజికి నుదాహృతి. 'రాముఁడు విల్లందివన్' అనునది వృత్తంబగుభావలక్షణమునందలి నవర్ణకమున కుదాహరణము. 'రాముఁడు పట్టినప్రతిన' అనునది క్త్వవదర్థకనవర్ణకోదాహృతి. (ఒరులు) 'వారింప' అనునది తుమర్థకనుజికి నుదాహరణము. ఇట్లె తక్కినస్థలములకు నుదాహృతుల నరయునది. ౨౭ మొ. ౩౨ వ. సూత్రముల రచనము నరయఁగా నీ సూత్రములు పయిరీతిని బ్రత్యాఖ్యేయములని సూరి తలంచినట్లగపడదు. (౨౩౪ I విష.). ప్రయోగములు:—తే.గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నానుండెనేని । బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు (సభా. ౨ ఆ. ౩౫). ఉ......వాయుసుతుండు మల్లయు । ద్ధమ్మున నోర్చు నాతని నుదగ్రమహాభుజశక్తి

యేర్పడన్ (సభా. ౧ ఆ ౧౬౨.) శా. ఆదురోర్యోధనుఁ డుద్ధవిల్లుఁడును......... (ఆది. ౫ ఆ. ౧౦౬.) మ......కర్ణుఁడు దర్పహీనుఁడగుచున్ ద్రోణాత్మజుం డెఱ్ఱుయా। త్మరథస్థుంఁడుగఁజేసి యేసె విజయున్ (ద్రో. ౪ఆ. 3౦౨.) చ...నిన్ను శాశ్వతవిభుండుగ (నిర్వ. ౮ ఆ ౧౫.) ఉ. భీమున్ర్వధకుర ప్రచయుభిన్నతనుండుగఁ జేసె నాతఁ డాభూమిపునిట్లు (భీష్మ. ౨ఆ. 3౦౯.) సీ నిన్ను బాధితుండుగఁజేసె(అశ్వ. ౧ ఆ. ౮౪.) ఇట్లగుధాతు నుజ్యంత యోగమున విశేషణద్వితీయచోఁ బ్రథమ నిల్చుటయేకాక ద్వితీయయె నిల్చిన ప్రయోగములును గన్పట్టుచున్నవి (చూ ప్రౌఢ. కార. ౨౪ సూ.) సీ. ఏపుణ్యు రాలోకో యింప్పాడు నినుఁ బుత్త్రుఁగాఁ గాంచుటకు...(ఆర. ౭. ఆ. 3౪౪.) ఉ......మహాభుజంగము నద్భుతమంత్రనిరస్తదర్పముం। గా నొనరించునట్లు......। (ద్రో. ౧ ఆ. ౪౭.) క. ననుఁ దగియెడు నతిథిఁగా। (కర్ణ. ౨ ఆ. ౨౮౬.) ఇట్టియెడ ల 'కిన్ - కాన్' అనునవి యను ప్రయుక్తములనియు (బా. క్రి. ౧౧౫ సూ.) విశేష్యవిభక్తి విశేషణమున కయ్యెననియు నెఱుంగునది. క. అనఘా యగ్నిషోముల। ననుఁగా భావింప.........(శాంతి. ౬ ఆ. ౪3౦.) కొన్ని కృదంతములయోగమునందును నిట్టి ప్రయోగములు చూపట్టుచున్నవి. సీ......చూడు। తే-గీ. మానుహాత్ములు దక్కు నున్మార్గచరుల। దండితులఁ జేఁత వినమె.........(శాంతి. ౧ ఆ. ౧౦౮). (చేఁత = చేయుట.) క. నకులము నులూకమును బోకకు సంతస మందియుండి గ్రక్కున నమ్మా। షికము......... (శాంతి. 3 ఆ. ౨౧౦.) (పోకకు = పోవుటకు.) ఉ. నీవు సుమాలికూఁతుర మునీశ్వర మిమ్ములఁ దండ్రిపంపునన్। జూడఁగ రాక యంచు (నిర్వ. 3 ఆ. ౫౦ ప.) (రాక = వచ్చుట) ద్విపద......। ఎసఁగ లంజెతికమే నీరాత్రి నేఁత (బసవ. 3 ఆ. ౨౧౨ ప.) (చేఁత = చేయుట.). వలయ్వాదిక్రియా కర్తృభూతక్రియల నుజ్యంతములతోఁడి యోగమునఁ గర్తృవాచకముపైని షష్ఠీవిభక్తిగె భట్టారకప్రయోగములందుఁ గన్పట్టుచున్నది. అట్టి షష్ఠి వలయ్వాదులతోఁడి యన్వయమునఁ గల్గు ననఁదగును. ఉదా:—ఈపని నీకుఁజేయవలయును. ఇచటఁ బనిచేయుట నీకు వలయునని యన్వయము నెన్నునది. "ఈపని నీవు చేయవలయు." అనుచో 'నీవు' అనునది చేయుధాతువునకుఁ గర్తయగుటచేఁ బ్రథమాంతమయ్యెనని యెన్ననగును. షష్ఠికి—ఉ......ధర్మ వెఱుంగ వీనికిం। బోలునె (సభా. ౨ ఆ. ౨౨.) ఆ-వె......। కాన యింక వేఁడఁగాదు నాకు (సభా. ౨ ఆ. ౨౬3) క. పితృసంకల్పము సేయఁగ। సుతుల కవశ్యమును వలయు.........(సభా. ౧ ఆ. ౯౪.)

ప్రథమకు:—క......నాకు నీవేమియుఁ జె। ప్పను వలవదు........(ద్రోణ. ౧ ఆ. ౯౪.) క. వినవలయు వానినెల్లను। జననాయక వింటి వీవు.....(అశ్వ ౧ ఆ. ౬ ప.) ఉ...। దైవముతోడ్పడన్ వలయు (ఉద్యో. ౩ ఆ. ౭౩.)

అస్మద్యుష్మద్వాచ్యా। దేకత్వ ఇతో నివీ పరేషాంతు।
ధర్మోత్తమమధ్యమవ, ద్బహుషు న మధ్యవదుతోచ్చ
సర్వేషు. (ఆం. చిం. హలం ౧౪ కా. అహో. ౪౨౦.)

నన్నయా. ఇతో స్మద్యుష్మదర్థాత్ స్యా। న్నామ్నో నిర్వాచ్ఛ
౨౬౪ విషయము. వా క్వచిత్। ఉభయార్థే విశేష్యేతు। భేదకాత్
స్యా స్నువర్ణకః. (వికృ. హలం. ౧౪ కా. అహో.
౪౧౯-౪౨౧)వాం ప్సాం కోం గాం కే ; (వికృ. అజం.
౩౯ కా. అహో. ౩౧౧ పు.)

కల్పతరువు. ౨౬౪ విష:—అస్మద్యుష్మద్వాచ్యాత్ = అస్మద్యుష్మదర్థకమగు ననఁగా నస్మద్యుష్మద్విశేషణమగు, ఇతః = ఇకారాంతమునకుఁ బరముగా, ఏకత్వే = ఏకవచనమందు, నివీ = 'ని - వి' అనునవి యగును. అనఁగా నస్మదర్థకవిశేషణవాచకప్రథమాంతముపై 'ని' అనునదియు, యుష్మదర్థకవిశేషణవాచక ప్రథమాంతముపై 'వి' అనునదియు నిల్చునని యర్థము. ఉదా:—నేను రవిని (౧౩౪ విష.) నీవు రవివి. 'నేను, రవిని' అనునవి ప్రథమాంతములు గాన కళలు. వీని తుదిస్వరము కవిభల్లటసూత్రముచొప్పున వికల్పముగ (౨౧౦ II విష.) లోపించును. ఉదా:—నేన్, రవిన్. మొ. ఇవి ద్రుతాంతములు.

పరేషాంతు = ఇకారాంతవ్యతిరిక్తములగు నస్మద్యుష్మ ద్విశేషణవాచక ప్రథమాంతములపై నేకవచనమున, ధర్మోత్తమమధ్యమవత్ = తద్ధర్మార్థకక్రియల కుత్తమమధ్యమ పురుషైకవచనముల వచ్చుప్రత్యయములవంటివి యనఁగా 'ను - వు' అనునవి వరుసగా నగును. అనఁగా నేకత్వమున నస్మద్విశేషణ ప్రథమాంతముపై 'ను' వర్ణకమును యుష్మద్విశేషణప్రథమాంతముపై 'వు' వర్ణకమును నిల్చునని యర్థము. ఉదా.—నేను పండితుఁడను, నీవు పండితుఁడవు. ఇచట సైతము 'నేను - పండితుఁడను' అనునవి ప్రథమాంతములు గానకళలు. వీని తుది యుకారము కవిభల్లటసూత్రముచొప్పున (౨౧౦ II విష.) వైకల్పికముగా లోపించును. ఉదా:—నేన్ బండితుఁడన్ - మొ. ఇవు డివి ద్రుతాంతములు. బహుషు = బహువచనములందు, నమధ్యవత్ = మధ్యమపురుషేతరములగు నుత్తమప్రథమ పురుషములందలి ప్రత్యయములవంటి వనఁగా 'ము - రు' లగును. బహువచన

మున నస్మదర్థకవిశేషణవాచక ప్రథమాంతముపై 'ము' వర్ణకమును యుష్మదర్థక విశేషణవాచకప్రథమాంతముపైని 'రు' వర్ణకమును నగునని పర్యవసితార్థము. ప్రథమమధ్యమోత్తమపురుషము లనెడివరుసను మనంబున నిడికొని యహోబలపతి "నమధ్యవత్." అనుదానిచేఁ బ్రథమోత్తమవత్తునర్థము లభించుననియు నక్కా-రణమునఁ జింతామణిలోని "అస్మద్యుష్మత్త"ను వరుస యవివక్షితమనియు యుష్మదస్మదర్థకవిశేషణములకు 'రు - ము' లు వచ్చునని గ్రహింపవలయుననియు నీక్రింది రీతి నసంగతముగా వ్రాసెను. "సూత్రే అస్మచ్ఛబ్దస్య పూర్వనిర్దిష్టత్వ మవివక్షిత మితి యుష్మచ్ఛబ్దా దేవ ప్రథమపురుష 'రు' వర్ణక ఇతిధ్యేయమ్. ఆచార్యప్రబన్ధేషు ప్రయోగ శ్చాత్రమానమ్." (అహో. ౪౨౧ పు.) కాని భట్టారకుఁ డుత్తమ మధ్యమ ప్రథమపురుషములనెడి వరుస నీసందర్భమున నుద్దేశించెనని "అస్మద్యుష్మ ద్వాచ్యాత్త" నెడి ప్రక్రమమే విశదీకరించుచున్నది.

సర్వేషు = ఈసందర్భమునఁ జెప్పఁబడిన ప్రత్యయములెల్లఁ బరమగునపుడు, ఉతః = పూర్వస్థితోకారమునకు, అచ్చ = హ్రస్వాకారాదేశమును నగును. ఉదా:—పండితుఁడు+ను = పండితుఁడ+ను = పండితుఁడను. పండితుఁడు+వు = పండితుఁడ+వు = పండితుఁడవు. పండితులు+ము = పండితుల+ము - పండితులము, పండితులు+రు = పండితుల+రు = పండితులరు. 'ని - వి' అనునవి పరమగునపుడు పూర్వమున "ఉ" కారము (కవిని - కవివి.) లేమింజేసి వాని కిచటఁ బ్రసక్తిలేదు.

ఇతోఽస్మదిత్యాది:—అస్మద్యుష్మదర్థాత్ = అస్మద్యుష్మదర్థక విశేషణమగు, ఇతః = ఇకారాంతపదము తుదినున్న 'ఇ' కారమునకుఁ బరముగ, నిః - విశ్చ = నివర్ణక వివర్ణకములువచ్చుట, నామ్నః = తచ్ఛబ్దాను ప్రయోగములేని శబ్దములకు మాత్రమె. ఇట్లగుటచేత "ను - వు - ము - రు" అనునవి ద్రవ్య గుణవాచక విశేషణములకును గ్రియాజన్య విశేషణములకును బరముగా సయితము నిలుచుచుండునని వ్యక్తమగుచున్నది. ఉదా:—నేను రవిని నీవు రవివి, నేను కృష్ణుఁడను - నేను నల్లనివాఁడను - నేను వచ్చిన వాఁడను - వచ్చినాఁడను - నేను రానివాఁడను. మొ. వాక్వచిత్ = పయిని వివరించినరీతిని యుష్మదస్మద్విశేషణములకు వచ్చెడి - "ని - వి; ను - వు, ము - రు." అను ప్రత్యయములు, క్వచిత్ = కొన్నియెడల, వా = వికల్పముగానగును. ఉదా:—గర్వగరిష్ఠుఁడవగునిన్ను - గర్వగరిష్ఠుఁడగునిన్ను. మొ. (విస్తర. I)

---

విస్తర. I ౨౬౪ విష:—ఇతోఽస్మదిత్యాద్యథర్వణకారికకు "ఇకారాంతము లకుమాత్రమె 'ని-వి' అనునవి వైకల్పికముగవచ్చునని యర్థముచేసికొని యహోబల

ఉభయార్థ ఇత్యాది:—ఉభయార్థే = అస్మద్యుష్మ దుభయవాచకమగు "మనము" అనునది, విశేష్యేతు = విశేష్యమైయున్నపుడు, భేదకాత్ = వాని విశేషణమునకుఁబరముగా, 'ముపర్ణకః='ము' అను ప్రత్యయము, స్యాత్ = అగును. ఉదా:—మనము పండితులము. దీనినిబట్టి, యన్యయుష్మదస్మత్సహ ప్రయోగమున నుత్తరోత్తరము బలీయమగునని విశదమగుచున్నది. ఉదా:—వాఁడును నీవును నేనును బండితులము. ఇట్టి బలిష్ఠత పురుషవిషయమున నిత్యమనియువచనవిషయమునఁ బాక్షికమనియు నెన్నఁనగును. పాక్షికతయనఁగాఁ గర్తృబహుత్వమున బలిష్ఠపురుషమునందు బహువచనమునిల్చుట యొకపక్షము. యుష్మదస్మదన్యతర సంబంధివచనముమాత్రమె నిల్చుట పక్షాంతరము. ఉదా:—నేనును నీవును బండితులము. వాఁడును నీవును బండితులరు. వాఁడును నీవును నేనును బండితులము. ఇవి మొదటిపక్షమునకు లక్ష్యములు. వజ్రము నీవును బిడికిటితాఁకున నొఱగుదువు. (శాంతి ౪. ఆ ౩౯౮) ఏనును నాదళమును బెనఁగెదను. మొ. (విస్తర II.).

పతి యీక్రిందిరీతిని వ్రాసెను. "ఇతో౽స్మద్యుష్మదర్థాత్ స్యా। న్నామ్నా నిర్విశ్చ వాక్వచిత్. ఇత్యథర్వణః. తేన నేమహాకవివచ్చితి నిన్నుఁజూడ ఇత్యాదిసిద్ధమ్" (అహో. ౪౧౯ పు.). క్వాచిత్కమగు నీవైకల్పికత "ని-వి" అనువానికేకాక యన్నిటిపట్లనుగలదని నావ్రాసినరీతి నర్థముచేసికొనమింజేసి "పాండుభూ।వరునకుఁ గోడవైతి॥ (ఉద్యో. ౩ ఆ. ౧౦౮.) ఇత్యాదివచనం త్వనాకరమేవ" (అహో. ౪౨౦.) అని యిట్లు కవిబ్రహ్మాదులప్రయోగముల నహోబలపండితుఁడు నిరసింపవలసినవాఁడయ్యెను. ఇట్టి యీయహోబలుని యపవ్యాఖ్యనే కవిజనమండన నారాయణీయాదులును ననుసరించెను. "తే. అతివ, 'ని-ను' లిదంతమౌ యుష్మదస్మదర్థ। (ఛందోభంగము.) భేదకములయందు విభాష వెలయు నొకెడ (నారా. కార. ౨౯౮ కారి. ౧౭ ప.)

ఈసందర్భమునందలి చింతామణిసూత్రములలోఁ దద్ధర్మక్రియా ప్రత్యయములవంటి వర్ణకములువచ్చునని చెప్పఁబడుటచే "నస్యాత్తద్ధర్మోతః" అనుచోప్పున వీనికి సంధిరాకపోవలసివచ్చునని యహోబలపతి చర్చించెను. (అహో. ౪౨౧ పు ) ఇదియాంతిదేశికవిధి యగుటచే నట్టి యనుపపత్తి కలుగదు. మఱియును ధర్మార్థకములందలి ధాతూకారమునకుమాత్రమె సంధిని దత్సూత్రము నిషేధించునుగాన నీప్రత్యయముల యుకారమునకు సంధివచ్చుట నిర్బాధము (౭౩ విష.)

విస్తర. II ౨౬౪ విష:—మొదటిపక్షమునకుఁ బ్రయోగములు. తే గీ...। విదురుఁడును నీవు నుండుఁడు ముదముతోడ (సభా ౨ ఆ. ౧౨౭.) క...రాధా।

తనయుని నరుఁ డేఁ గుంభజు । ననిఁ జంపుదు మేల వగవ నంబుజనేత్రా (అర. ౧ ఆ. ౧౮౫.) మ......విజయుండు నేను దగ......భూచక్రరా । జ్యము నేకొందుము... (అర. ౧ ఆ. ౩౯౮.) క...పార్థుండు నీవు......విజయా । స్వద బాహుల రగుడు ధర్మపరిరక్షకులై (అర ౧ ఆ. ౩౯౭.) చ. అనుపమశౌర్యవంతుల రనంతబలాఢ్యుల రీవు నీజనా । ర్దనుఁడును.........(అర. ౩ ఆ. ౧౬౫.) క. నీవును భీష్ముఁడు ద్రోణుఁడు । భూవినుత విశుద్ధధర్మబుద్ధుల రగుటన్ । (ఆది. ౮ ఆ. ౫౦.) పక్షాంతరమునకుం బ్రయోగములు:—చ......నేను బుత్త్రులును బంధులుఁ దమ్ములు కొల్చి యుండెదన్ (విరా. ౫ ఆ. ౩౪౮.) క. ఏనును నాదళమును ద్రుప । దానీకవిరాటసైన్యయాదవబల సం । తానములతోడఁ బెనఁగెదఁ । బూనుఁడు మీరెల్లఁ బాండుపుత్త్రుల గెలువన్ (భీష్మ. ౩ ఆ. ౧౮౧ ప.) క..... వజ్రము నీవును బిడి । కిటితాఁకున నొఱగు దేను కినిసితినేనిన్ (శాంతి. ౪ ఆ. ౩౯౮.) అస్మదర్థమువంటి ప్రాబల్య మాత్మార్థమునకు నిత్యముగ గన్పట్టుచున్నది. క.....విహరించుచుండె సఖులుం దానున్ (ఆది. ౪ ఆ. ౪౩ ప.)

ఈవిషయమునకు బా. గు. ప్ర. వ్యాఖ్యాత సంస్కృతముతోఁ బోలిక గలదనుచు "త్యదాదీనా మ్మిథ స్సహోక్తౌ యత్పరం తచ్ఛిష్యతే" (వా_ర్తి. ౮౦౧. సి. కౌ. ౯౩౮ సూ.) అను వా_ర్తికపద్ధతితో దీనిని సమాకరించెను. "త్యదాదులు:—త్యద్ - తద్ (వాఁడు - అది) యద్ (ఎవఁడు - ఏది) ఏతద్ - ఇదమ్ - అదస్ (వీఁడు - ఇది) ఏక - ద్వి (ఒకటి - రెండు) యుష్మద్ (నీవు) అస్మద్ (నేను) భవత్ (నీవు)......ఈశబ్దార్థంబులకు సముచ్చయంబు సంభవించినప్పుడు పై గణపాఠములోఁ జూపినక్రమమున నేశబ్దంబు పరమో యది శేషించి తక్కినశబ్దంబు లోపించు. 'యూయమ్' అనునప్పుడు 'తేచ+యూయంచ' (వారును మీరును) అన్నవృత్తి పైనిం జూపఁబడియె." (బా. గు. ప్ర. బా. కా. ౩౬ సూ. వ్యా. ౨౪౪ పుట. ద్వి. ము.) ఈవా_ర్తికము ప్రకృతోపయోగి కాదు. సంస్కృతమున "తేచ+యూయంచ = యూయమ్" అను నేకశేష మేర్పడినట్లు తెలుఁగున "వారును+మీరును" అనుచో 'మీరు' అని శేషింపదు. 'వారును మీరునువచ్చితిరి' అన వలెనుగాని సంస్కృతమందువలె నట్టియర్థమున 'మీరువచ్చితిరి' అని తెలుఁగునఁ బ్రయోగింపరాదుగదా. మఱియు సంస్కృతమునందుసైతము 'రామశ్చ+త్వంచ' అనుచోఁ బైవా_ర్తికమునకుఁ బ్రవృత్తిలేదు. ఇట్లని 'అన్యయుష్మదస్మత్స హోక్తిలో నుత్తరోత్తరంబు బలీయము' అనుపద్ధతి సంస్కృతమున లేదని నాయభిప్రాయము కాదు. "లిఙ్గయుష్మదస్మదాం యుగపదుక్తౌ తిబాదిత్రయ, సిబా

దిత్రయ, మిబాదిత్రయాణాం యుగపత్ ప్రాప్తౌ యత్ పరంభవతి తదేవస్యాత్-తథాపి సముదాయస్య సంఖ్యానుసారేణ ద్వివచనం బహువచనంవేతి. కిఞ్చాత్రలిఙ్గాదీనాం పాఠక్రమ మనాదృత్య భవిష్య ద్విభక్తీనాం పరత్వమేవ గ్రాహ్యమ్. (లిఙ్గ మనఁగా యుష్మదస్మద్భిన్నము.) (బా. కా. 3౬ సూత్రమునకిదియే మూలమా యనునట్లున్నది.)............అహంచ భాష్యకారశ్చ। కుశాగ్రీయధియా వుభౌ। నైవ శబ్దాంబుధేః పారం। కిమన్యే జడబుద్ధయ ఇతి - అత్ర 'నైవ' ఇతి క్రియా పదమ్." (ముగ్ధ. ౯౬౪ సూ. దుర్గాదాసవ్యాఖ్య.) లిఙ్గయుష్మదస్మదామ్ = అన్య యుష్మదస్మదర్థములకు, యుగపదుక్తౌ = ఒక్కటఁజెప్పఁబడుటలోను, తిబాది...... యుగపత్ ప్రాప్తౌ = తిప్ మున్నగు పురుషత్రయవిభక్తులకు నొక్కటఁ బ్రాప్తిగల్గు చుండఁగా, యత్ పరంభవతి తదేవ స్యాత్ = వానిలోనవఁగాఁ బ్రథమ మధ్య మోత్తమపురుషములలో నుత్తరోత్తరము ప్రబలమై వర్తిల్లును. తథాపి...... వచనంచేతి = కర్తృద్విత్వ బహుత్వములంజేసి ద్వివచన బహువచనములగును. కిఞ్చాత్ర.........గ్రాహ్యమ్ = అన్యయుష్మదస్మదర్థక ప్రయోగములోని వరుస భేదమున మార్పేమియులేదు. అహంచేత్యాది = కుశాగ్రబుద్ధులమగు నేనును భాష్యకర్తయు నను నిద్దఱము శబ్దసముద్రపారమును, నైవ = న+ఐవ ('ఇగతౌ'అను ధాతువు, లఙుత్తమపురుషద్వివచనరూపము) పొందము = పొందలేదు - ఇతరజడ బుద్ధులమాట యేమి ?" అని తాత్పర్యము.

సంస్కృతమునలేని విశేష మొకటి యీవిషయమునఁ దెలుఁగునందుఁగలదు. యుష్మదర్థకకర్తతోఁ బ్రథమపురుషకర్తలకు సహోక్తి గల్గునపుడు యుష్మదర్థక కర్తకు సరిపడు పురుషవచనాదులతోఁ గ్రియయు విశేషణమును బ్రయోగింపఁ బడుటయు నటఁ బ్రథమపురుషాదులకు సరిగఁ బ్రయోగము లేకుండుటయు నట్లె యస్మదర్థకకర్తతో నన్య యుష్మదర్థకకర్తలకు సహోక్తిగల్గునపు డస్మదర్థకకర్తకు సరి పడునట్లు క్రియయు విశేషణమును బ్రయోగింపఁబడుటయు నటఁ బ్రథమపురుషాదు లకుఁ బ్రయోగము లేకుంటయుఁ బాక్షికముగాఁ గవిప్రయోగములందుఁ గన్పట్టు చున్నది. ఆత్మార్థకము కర్తయగునపుడు పైపద్ధతి నిత్యముగాఁ బ్రాచీనమహాకవి ప్రయోగములందుఁ జూపట్టుచున్నది. "ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మ దర్థంబు లభిహితంబులగునపుడు క్రియలు తత్కర్తృకంబులు (అనుబం.) విభాషనగు ఉదా:—ఉ. విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీనిషాదియున్ (ఆది. ౨ ఆ.

---

అనుబంధము. విస్తర. ౨౬౪ విష:—తత్కర్తృకంబులనఁగా యుష్మ దస్మదర్థకములకు సరియగు పురుషవచనములుగలవియనియర్థము. బా. గు. ప్ర.

దాన ఇత్యాది:—సంబోధనాదికే = తదర్థకమగు 'ఆ' శబ్దముయొక్క యుష్మ దస్మద్రూపమగు 'అది' అనునది విశేషణములకు విధేయతావివక్షయం దనుప్రయుక్తమగునపుడు దాని సంబోధనరూపమందును నాదిశబ్దముచే యుష్మదస్మద్విశేషణములందును 'అది' శబ్దమునకు, దానః = దానాదేశమగును. ఉదా:—ఓ చిన్నదాన - నేను చిన్నదానను - నేను వచ్చినదానను - నీవు చిన్నదానవు - నీవు వచ్చినదానవు - మొ. (౨౧౫ I విష.)

ప్రయోగములు:—ప్రత్యయము వచ్చుటకు:—క. లోకోత్తరచరితుండగు। నా కావ్య తనూజ నీకు నారాధ్యను నే। బ్రాకటభూసురకన్యక। నీకట్టినమైల కట్ట నేర్తునె చెపుమా. (ఆది. ౩ ఆ. ౧౩౫.) క. అనవద్యధర్మచరితం। బున నున్నతుం

౬౮.) క......ముకుం। దుని నాశ్రయింపవయ్య య। తనిం బొందినం బ్రదుకు దీవుం దమ్ములు సుతులున్ (ఉద్యో. ౨ ఆ. ౩౨౧.) ఉ......నేను నా। సేనయు దాడివెట్టెద విశృంఖలతన్ (హరి. ఉభా. ౩ ఆ. ౯౮ ప.)........పక్షమున - ము......మోహాంధుండు భీష్ముండు కే। శవ నీవుం గడుంగుండు. (సభా. ౨ ఆ. ౬౩.) (ప్రౌఢ. క్రియా. ౨౬.) "ఆత్మార్థం బభిహితంబగుచోం దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబులకగు రాముండు రావణుంబరిమార్చి సీతయుందాను సౌమిత్రిసహితంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబునకేతెంచె" (బా. క్రియా. ౧౨౦ సూ.) ఇట్టిప్రయోగములు పెక్కుగలవు:— సీ..............। అను జాలు దానును జనుదెంచె (ఆది. ౮ ఆ. ౬౩.) మొ. (చూ. ౩౫౦ విష).

కర్త యీసూత్రమునందలి ప్రయోగములను స్వీకరించి యట్టిప్రయోగములందు "పురుషవిపరిణామం బూహించుకొనవలయు"ననియు "భిన్నవాక్యంబుచేసి సమన్వయించుకోవలయు"ననియువ్రాసి కర్తృబహుత్వమున్నను క్రియ యేకవచనముం దుండుట గీర్వాణభాషయందునుగలదని యప్రసక్తముగం గొన్నిశ్లోకముల నుదాహరించెను. కాని పురుషవిపరిణామము నుదాహరింపంజాలండయ్యెను. (బా. గు. ప్ర. ౨౮౬-౨౬౭ పుటలు. ద్వి. ము.) మఱియునట్టి ప్రయోగము తెలుంగున సమ్మతముకాదు. పురుషభేదము లేనపుడుమాత్రమే కర్తృబహుత్వమున భిన్నవాక్యకల్పనము చేసికొని విరోధమును దొలంగించికొనుట సంప్రదాయము (చూ. ౩౦౨ విష.)

డైన నహుషుపుత్త్రుఁడఁ బూరుం । డను మధ్యములో కేశ్వరు । జనకుండ యయాతి యనఁగఁ జనియెడువాఁడన్. (ఆది. 3 ఆ. ౨౧౪.) క. క్షత్త్రియులము పాండు ప్రియ । పుత్త్రుల మేనగ్రజుండ............(ఆది. 2 ఆ. ౨3౮.) ఉ. మాకు నతి ప్రియుండవు సముస్తవిదుండవు చెప్పుముయ్య............(ఆది. 2 ఆ. ౧౫౬.) చ. భరతకులప్రసూతులరు భాసుర శస్త్రమహాస్త్రవిద్యలం । గరము ప్రసిద్ధుఁడై పరఁగు గౌతమశిష్యుల రిట్టిమీరు......(ఆది. ౫ ఆ. ౨౧౦ ప.) సీ. వినవయ్య నహుషుఁ డన్ జనపతి నేను మీ, పూర్వజులకునటఁ బూర్వజుండ। ననఘ సుత్రాముని కెనయగు వాఁడ........ఆ-వె. కలశభవుఁ డగస్త్యుఁ డలిగి యత్యుగ్రాహి । వగుమునియును శాప మొగిన యిచ్చె । ......నవయుచున్న వాఁడ నాఁటఁగోలె (అర. ౪ ఆ. ౧౧౯ నన్నయపద్యము.) సీ......పాండవులధర్మపత్నినై గోవిందు, చెలియలనై వీనిచేత నిట్లు । పరిభూతనగుచు...ఆ-వె. ధన్యులార యేన దాసినే దాసినే ।యొలుఁగఁజెప్పి ...(సభా. ౨ ఆ. ౨౪౪.) సీ. సర్వధర్మజ్ఞుల రుర్వీశపూజ్యుల రన్యోన్య నిత్యసౌహార్ద యుతుల । రగణితగుణయుక్తిఁ బొగడంగఁదగువార లిట్టి మీకేపురకు......... (ఆది. ౮ ఆ. ౯3.) ఇందు "మీరుపొగడంగఁదగువారలనిఁ బ్రత్యయములేకుండుట ముద్రణసంస్కర్తృసాహసకృతము. ప్రత్యయమునుమానుట భట్టారక భారత భాగముం దెచ్చుటను లేదు. క. వలవదు చనుఁ డీరు చిఱుతవారల రనినన్ (అర. 3 ఆ. ౨౪2.) ఇట్టెల్లయెడలను భట్టారకుఁడు ప్రత్యయమును బ్రయోగించుటయే సంప్రదాయము. చ. అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యము యంటి నీవు మూ । ర్ఖవు శిశుపాల.........(సభా. ౨ ఆ. ౨౪. ప్రాసగతము.) ఉ. పూజ్యుఁడ వెల్ల వంశముల భూపతులందును ధర్మనిర్మల । ప్రాజ్యవిభూతి నద్ది విజపాలకునట్టిఁడ నీకయొప్పె......(సభా. ౧ ఆ. ౨2౯.). ఇట "దివిజపాలకు నట్టిఁడ నీకయొప్పె" అని కాని పాఠాంతరముగాఁ జూపఁబడినట్టియుఁ దాళపత్త్రమాతృలలోనున్నట్టియు ప్రాజ్యవిభూతి యద్దివిజపాలకు నట్టిద" అనునదికాని నన్నయప్రయుక్తమనఁ దగును.

తిక్కనాదులప్రయోగములలోఁ బ్రత్యయాభావమును మిశ్రగతియు బహుళముగఁగలదు. తే-గీ. నరుఁడు నారాయణుండు ననంగఁబరఁగు । నిత్యపురుషులు నీవును నేనుఁ జూమ్ము । భువనహితమాచరింపఁగాఁ బూని వేడ్క । వచ్చి యిమ్మహిఁ బుట్టిన వారమనఘ (శాంతి. ౬ ఆ. ౪౧౯.) క. గురుఁడును నీవును మద్రే । శ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు సౌబలుఁడు ననున్।ధర యేలింపఁగ నున్నా । రరు మీకుం

దగునె సంగరములోఁ గలఁగన్ (ద్రోణ. ౫ ఆ.౧౧౧ ప్రాసస్థలము.)చ.జననుత మీరు దివ్యులరు సమ్మతి దేవహితార్థ మిమ్మహిన్ । జననము నొందినారరు.........(ఆర. ౪ ఆ. ౧౮౧.) చ. వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁజొచ్చితి నందుఁ బాండుభూ । వరునకుఁ గోడలైతి......... । సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంత యున్ (ఉద్యో. 3 ఆ. ౧౦౮.) ఉ. నీతలఁ వేను గంటి.........ఇంత జే । లైతి గదే............(ఉద్యో. 3 ఆ. ౧౫౯.) (జేల వైతివిగదే యని యర్థము. ప్రాస స్థలము.) చ. జననుత నీవు నిక్కముగ శక్రుఁడవో యల కాధిపుండవో । యన లుఁడవో సమీరుఁడవొ యట్టులు గాక జగన్నుతుండు మ । జ్జనకుఁడు ధర్మదేవ తవొ సత్కృపఁ జెప్పుము నాకు నేర్పడన్ (ఆర. 2 ఆ. ౪౬౦.) ఇట్లు యుష్మదస్మ దర్థకవిశేషణములకుఁ బ్రత్యయములు కొన్నిటఁ జూపట్టలేదు. ఆ-వె. ఎఱుఁగ వలయుదాని నెఱిఁగి కోవిదుఁడగు । నట్టి నీకు వగవనగునె పార్థ. (ద్రోణ. ౨ ఆ. ౨౫౮.) క. గురుఁడవుగాక పగతుఁడవె । దురమునఁ గుపితుఁడగు నిన్నెదుర్కొన (ద్రోణ. 3 ఆ. 23.) చ...ఇయ్యెడ నీవ యొక్కఁడుం । దక్క నొరుండు...... (ద్రోణ. 3 ఆ. ౨2౯.) క......బాహువిక్రమ । ఘనుఁడగు నాకాజి జయము గలుగుం జులుకన్ (కర్ణ. ౧ ఆ. ౫౮) తే-గీ. అతుల ధర్మశీలుండగు నన్ను...... (కర్ణ. 3 ఆ. 343.) సీ...గీ. అది నిజంబుగఁ గొనక జేలైతి నాదు । జేలతనమున (కర్ణ. 3 ఆ. ౬౧.) ఉ......నీ । వొక్కరుఁ డున్నవాఁడవు........(శల్య. ౨ ఆ. ౪౦౧.)

"అగు ధాతురూపములతోఁ జేరనపుడు 'నీవు ధన్యుఁడు - నేను కృతా ర్థుఁడు - మేము పుణ్యాత్ములు' అని ప్రయోగింపరాదు" (ఆం. భా. అ. కార. ౫2 సూ. వివ.) అని యనుశాసనమున వ్రాయఁబడెనుగాని యది సరికాదు. "తే-గీ. నరుఁడు నారాయణుండు ననంగఁ బరఁగు । నిత్యపురుషులు నీవును నేను జుమ్ము । భువనహిత మాచరింపఁగాఁ బూని వేడ్క।వచ్చి యిమ్మహిఁ బుట్టినవార మనఘ (శాంతి. ౬ ఆ. ౪౧౯.) చ......నీదగుకూర్మికేను భా । జనముఁబె (కర్ణ. 3 ఆ. 3౮౯.) క. ఏ మిందఱుఁ దలఁప నొక్క యొత్తు కుమారా (శల్య. ౧ ఆ. ౫3.) మ......... ఏ మీముప్పురున్ మన్ననల్ । వడయంగాఁ దగునట్టివారము (ఉద్యో. ౨ ఆ ౨౮౨ ప.)" అనురీతి నగు ధాతురూపములతోఁ జేరకున్నను ప్రత్యయములు నిల్వకుండుట కవి ప్రయోగసిద్ధమైయున్నది. ఉభయార్థకమునకు:—తే-గీ. నరుఁడు నారాయణుండు ననంగఁ బరఁగు । నిత్యపురుషులు నీవును నేను జుమ్ము । భువనహిత మాచరింపఁగాఁ బూని వేడ్క।వచ్చి యిమ్మహిఁ బుట్టినవార మనఘ(శాంతి. ౬ఆ.౪౧౯)

తే.గీ. నరుఁడు నారాయణుండు నాఁ బరఁగునాఁడి।మునుల మిద్దఱ మందు నీ వనఘ న
రుఁడ । నేను నారాయణుండ ననూనశక్తి । యుతులమై మర్త్యయోనిఁ బుట్టితిమి
పేర్మి (ఆర. ౧ ఆ. ౧౩౧.) క. మన మిందఱు పైఁబడి (భాస్కర.యుద్ధ. ౨౯౭.)
క......। తమాయుతులమైన మనలఁ గౌరవులు (ఆర. ౧ ఆ. ౨౪౩.) ఆ-వె....
అందఱుఁ దగ । వైనపనుల నిలుచు టభిమతంబు. క. మనలోన......(విరా. ౧
ఆ. ౬౪-౬౫.) 'అందఱను' అనలేదు. ఆ-వె......ఎవ్వరి । దాన వేమిపనికిఁ బూని
యిప్పు । డు.........(విరా. ౧ ఆ. ౩౧౨.) (దానాదేశము ప్రాసయతిగతము.)
తే గీ. నీవు దుర్జాతి గామికి నీవ సాక్షి । (విరా. ౨ ఆ. ౫౩.) చ. ఇనకులముఖ్యుఁ
డుత్సుకత నెవ్వరివారల రిప్రబంధ.........(నిర్వ. ౧౦ ఆ. ౧౨౩.) చ.........
ధన్యుఁడఁ బుఖ్యుఁ డగణ్యవస్తు సం । భరణుఁడ నేన యంచు (హరి. పూ. భా. ౪-
౪౫.) ద్విపద - ముల్లోకములకెల్ల ముత్తవ వ్వాను (బసవ. ౩ ఆ. ౩౯౯.) ఇట వు
ప్రత్యయమునకై యశాస్త్రీయముగు వకారముమీఁది యుల్లోపము నంగీకరించుట
ముద్రణ సంస్కర్త్ర ప్రమాదకృతము. 'ముల్లోకముల కెల్ల ముత్తవ్వ నాకు'
అనియె కవ్యభిప్రేత పాఠ మునఁదగును. వు ప్రత్యయము లేకుండుట విరుద్ధము కాదు
గదా. ఆ-వె......నిన్ను నధముఁడగుట । .........ఎఱింగియుఁ దగ । నావు
లస్త్య మనుమఁ డని తలంచి.........(నిర్వ. ౫ ఆ. ౧౫ ప.) (అధముఁడవగుట -
మనుమఁడవని.) ఉ...నీకు మృత్యువై । .........అయోనిజమూర్తిఁ దాల్చెదన్
(నిర్వ. ౫ ఆ. ౧౯.) (మృత్యువనై.)

ప్రథమాంతంబులగు యుష్మదస్మద్విశేషణంబుల కేక
త్వంబున వు - ను - లును, బహుత్వంబున రు - ము -
లు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు. ౩౩.

ఈ యాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వం
బగు. ౩౪.

నీవు ధన్యుఁడవు - నేను ధన్యుఁడను - మీరు ధన్యు
లరు - మేము ధన్యులము. ఇకారంబుమీఁది కు -
ను - వు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు నను
సూత్రముచేత వు - ను - ల కిత్వంబగు - నీవు సుకృ
తివి - నేను సుకృతిని. ఆర్తిహరుఁడవు నినుఁగొల్తు
నంబుజాక్ష - గర్వగరిష్ఠుండగు నన్ను - మీరలు
పెద్దలు - ఇద్యాదులు ప్రాయికగ్రహణముచే రక్షి
తంబులయ్యె.

బాలవ్యాకరణ
విపృతి
౨౬౪ I విషయము

అది శబ్దంబునకు వు ను లు పరంబులగునపుడును సంబో
ధనంబునందును దానయను నాదేశంబగు. 35.
నీవు చిన్నదానవు - నేను జిన్నదానను - ఓచిన్నదాన.

సంజీవని. ౨౬౪ I వివ:—33-34 సూత్రములవ్యాఖ్య:—యుష్మదస్మద్విశేషణంబులకు 'వు - ను' లగుననుటచే యుష్మద్విశేషణమునకు 'వు' వర్ణకమును నస్మద్విశేషణమునకు 'ను' వర్ణకము నగునని యర్థము నెన్నునది. అట్లె బహుత్వమున రు - ము లంతాగమములగు ననుటచే యుష్మద్విశేషణమునకు 'రు'వర్ణకమును, నస్మద్విశేషణమునకు 'ము' వర్ణకమును నంతాగుములగునని యర్థము గ్రహింపనగును. తెలుఁగున యుష్మదర్థకము 'నీ' శబ్దము. అస్మదర్థకము 'నా' శబ్దము. ప్రథమాంతంబులకు ననుటచే షష్ఠ్యర్థము నవచ్చు ప్రథమ యయినను నీసూత్రము వర్తిల్లునని యెఱుంగనగును. ఉదా:—మహాత్ముఁడవగు నీకు - మొ. నీశబ్దమున కుదాహృతులు - నీవు ధన్యుఁడవు - మీరు ధన్యులరు. 'ధన్యుఁడు+వు' అని యుండఁగా 34 సూత్రముచొప్పున 'డు' అనుదానిమీఁది 'ఉ' కారమునకు 'అ' కారాదేశముకల్గఁగా "ధన్యుఁడవు" అయ్యెను. అట్లె - "ధన్యులు+రు = ధన్యులరు = ధన్యులరు" అనురూపము సిద్ధించును. అస్మదర్థకమున కుదాహరణములు:— నేను ధన్యుఁడను - మేము ధన్యులము. వీనిప్రక్రియను బైరీతినె గ్రహింపవలెను. ఇకారాంతవిశేషణములమీఁద నేకత్వమున యుష్మదర్థకమునకుఁ దుదిని 'వు' అనునదియు నస్మదర్థకము తుదిని 'ను' అనునదియు నిల్చునపుడు బా. తత్స. ౨౬ సూత్రముచే 'వు ను' లు 'వి - ని' అనురూపమును వరుసగా నందునని "ఇకారంబు మీఁదితాఁదిది"వాక్యముచే సూరిదేవివరించెను. "నీవు సుకృతి+వు = నీవు సుకృతివి. సుకృతి+ను=సుకృతిని" అని ప్రక్రియ నెన్నునది. ఇట్లుదాహరణములుపూర్తియయినపిదప మరల 'ఆర్తిహరుఁడవు+ఓ=ఆర్తిహరుఁడవో' అను యుష్మదర్థకమును సూరియుదాహరించెనని విశ్వసింపరాదు. కాని బాలవ్యాకరణ ప్రథమముద్రణము నందునైతమిట్లెయున్నది. అట్లయినను బైకారణముచే నిట "ఆర్తిహరుఁడు+అవు = ఆర్తిహరుఁడవు" అనురీతినె సూరి వు ప్రత్యయరహితమునె ప్రాయికగ్రహణ రక్షితముగ 'గర్వగరిష్ఠుండగుననున్న' అను 'ను' ప్రత్యయవిరహితరూపమును వలెనె యుదాహరించెనని గ్రహించుటయుక్తము. ఇట్లగుటచేఁ బ్రత్యయరాహిత్యమున యుష్మదర్థకమునకు "ఆర్తిహరుఁడవు నిన్ను......" అనుదానిని నస్మదర్థకమునకు "గర్వగరిష్ఠుండగు నన్ను" అనుదానిని నుదాహరించెనని తలంపనగును. మ......
గ। ర్వగరిష్ఠుండగు నన్ను నిర్దేసకుఁ దేరన్ జాలుటన్ వాసవీ (నిర్వ. ౭ ఆ. ౯౧.)

అను పద్యమునుండి తీసి "గర్వగరిష్ఠుండగు నన్ను" అనుదానిని సూరి యుదాహ రించెను. అట్లె "ఆర్తిహరుఁడవు నినుఁగొల్తు నంబుజాక్ష" అను గీతిచరణము నేదేని కవిపద్యమునుండియే తీసి యుదాహరించెనని విశ్వసింపనగును.

౩౫ సూత్రపువ్యాఖ్య:—క. జననుత దమయంతియనఁగ జనియించుదానన్ (ఆర. ౨ ఆ. ౯౯.) ఆ-వె......ఎవ్వరి । దాన వేమి పనికిఁ బూని యిప్పుఁడు (విరా. ౧. ఆ. ౩౧౨. ప్రాసగతము.)

బాలవ్యా. అన్యయుష్మదస్మత్కర్తృకార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు. ౩౬.

౨౬౮ II విష. వారును మీరును ధన్యులరు. మీరును మేమును ధన్యులము.

సంజీవని. ౨౬౮ II విష:—'ఉభయార్థవిశేష్యే తు । భేదకాత్ స్యాత్ స్మవర్ణకః' అను (౨౬౮ విష.) నథర్వణకారికలో యుష్మదస్మదర్థకములలో నస్మదర్థకము నకుఁ బ్రాబల్యమునంగీకరించి 'ము'వర్ణకమును విధించినస్వారస్యము నాశ్రయించి "లిఙ్గయుష్మదస్మదాం యుగప దుక్తౌ......యత్ పరం భవతి తదేవ స్యాత్...... (౨౬౮ విష.) అను సంస్కృతభాషా ప్రసిద్ధవిషయమును సూరిగారిట్లు సూత్రించిరి. అన్యమనఁగా యుష్మదస్మద్భిన్నము. పై సంస్కృతసూత్రములోని లిఙ్గశబ్దమునకును యుష్మదస్మద్భిన్నమనియే యర్థము. లిఙ్గయుష్మదర్థకముల యుగపదుక్తిలో యుష్మదర్థక మునకును లిఙ్గయుష్మదస్మదర్థకములలో నస్మదర్థకమునకును సరియగు పురుషబోధక ప్రత్యయములు క్రియకును విధేయ విశేషణమునకును నగుననియు కర్తృబహుత్వ మూలకమగు బహువచనము గల్గుననియు గ్రహింపవలయును. ఉదా:—సమాపకక్రి యకు:—రాముఁడును నీవును నేనును జదివితిమి-విధేయవిశేషణమునకు:-రాముఁడు నీవు నేనును బండితులము. రాముఁడు నీవును బండితులరు-'రాముఁడు నీవును జదివి తిరి' అని క్రియాపక్షమునందలి యుదాహృతి. యుష్మదస్మదర్థకముల యుగపదుక్తి యందుఁ దెలుఁగున నుభయార్థక'మన' శబ్దమును దదనుసారి సమాపకక్రియయు విధేయవిశేషణమును బ్రయుక్తములగును. ఉదా:—నీవును నేనును ననఁగా మనము చదువుదము. నీవును నే ననఁగా మనము పండితులము. ఉభయార్థ కర్తృకస్థలమునఁ బైరీతిని విశేషరూపము గల్గుట "ఉభయార్థే భవే దత్వ। మర్థభేదే క్వచి న్న తత్" అను నథర్వణకారికచెప్పిన నర్థవిశేషమునందుమాత్రమె యనఁగా "ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు" (బా. క్రి. ౩౦ సూ.) అను చెప్పిన నుభయకర్తృక ప్రార్థనాద్యర్థములందుమాత్రమెయని యెఱుంగునది.

తక్కినచోట్ల నిట్టివిశేషములేదు. మనము లేక మేము చదువుదుము - చదివితిమి = చదువము. మొ.

వ్యవహితాశ్చ సర్వే స్యుః. (అం.చిం. అజం. ౧౪ కా. అహో. 3౧౬ పు.)

వ్యవధానంచ సాధు స్యాత్। ప్రకృత్యార్థ ప్రకాశకమ్।
క్రియాయాస్తు ప్రయోగః స్యా। త్కారకాద్యన్త భాగయోః। మధ్యభాగే తత్ప్రయోగో। నసాధు హృదయఙ్గమః। (విక్ర. అజం. ౪౨ కా. అహో. 3౧౬ పు.)

నన్నయా థర్వణీయము. ౨౬౫ విషయము.

క్వచిత్కారకసంబన్ధో౽। ప్యత్ర నాహితకృద్భవేత్।
అధ్యాహారస్య సంయోగ। స్త్వత్ర నైవ సుఖావహః (విక్ర. అజం. ౯3 కారి. అహో. 32౨ పుట.)

కల్పతరు. ౨౬౫ విష:—వ్యవహితా ఇతి. సర్వే = విశేషణ విశేష్యములె కాక వాక్యగతపదములెల్ల, వ్యవహితాశ్చ స్యుః = అన్వయక్రమముగా నుండక పరస్పరవ్యవధానముకల్గియు నుండవచ్చును. ఇట్లనుటచే నన్వయక్రమముగా నుండుట సహజమెయని తాత్పర్యము. "సర్వే = సర్వవిభక్తి విశేషణములును, వ్యవహితాశ్చ = విశేష్యముతో వ్యవధానము గల్గియును" (బాలస.) అని యిట్టి వ్యవధానాంగీకారము విశేషణ విశేష్యమాత్రవిషయకమె యని బాలసరస్వతులు వివరించినను "సర్వే శబ్దాః వ్యవహితాశ్చ భవేయుః చా దవ్యవహితాశ్చ. రాముఁ దలఁచెద సద్గుణారాము నెపుడు. రాము నభిరాము సద్గుణారాముఁ దలఁతు నిత్యా ద్యుదాహరణ" మ్మని యహోబలపతి వ్యాఖ్యానముచేసెను. "గీ. చను వ్యవహిత ముగను విశేషణములెల్ల" (నా రా. కార. ౨౨౭ కారి. ౮ పద్య.) అనురీతిగల బాలసరస్వతీయానుసారివ్యాఖ్యయు సరికాదు. "ఉ......భ। గ్నోరుతరోరుఁ జేసెద సుయోధను నుగ్రరణాంతరంబునన్" (సభా ౨౩ ౨౪౯)అనురీతిని బహుళముగనున్న భట్టారకాది ప్రయోగము లీవ్యవధానాంగీకారము విశేషణ విశేష్యమాత్రవిషయ కము కాదని విశదీకరించుచున్నవి. భారతాదనున్న మొదటిశ్లోకము మొదలుకొని 'చళుక్యాన్వయాభరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ" (ఆది. ౧ ఆ. ౯ ప.) అనుదానితో ముగిసిన యేకవాక్యము దీని కుదాహరణము కానోపును. ఈవ్యవధానాంగీ కారముచే వాక్యగతపదముల పూర్వోత్తరస్థితి వ్యత్యాసముసయుత ముక్తప్రాయ మగుచున్నది. పైనుదాహరించినవాక్యములో "కరుణతోడ నిట్టులనియె" అనుటకు

మాఱుగా "ఇట్టులనిరోఁ గరుణతోడ" అని ప్రయోగింపఁబడెను. ఇట్టి వ్యవధానాంగీకారము ఛందోనురోధమునఁ సంభవించెనుగాన వచనములం దిట్టివ్యవధానము ప్రచురము కాదని యెఱుంగునది. అథర్వణుఁ డీసూత్రమును సవరించుచున్నాఁడు.

వ్యవధానంచేత్యాది:—వ్యవధానంచ = అంగీకృతమగు వాక్యగతపదముల పరస్పర వ్యవధానముసయితము, ప్రకృతార్థప్రకాశకమ్ = ప్రస్తుతవివక్షితార్థప్రకాశకమగునదే, సాధుస్యాత్ = సాధువగును - ఇట్లనుటచే "రాముఁడు దండెత్తి చంపెను లంకపై గపిసేనతో రావణుని" అనురీతివాక్యములు సాధువులు కావని విశదమగుచున్నది. ప్రకృతార్థప్రకాశమగు వ్యవధానమున కీక్రిందిభట్టారకపద్యము నహోబలపతి యుదాహరించెను. "చ... ..భవ|జ్జనకుఁ బరీక్షితున్ భుజగజాల్మఁ డసహ్య విషోగ్రధూమకే। తన హతిఁ జేసి చేసె నతిదాంతుఁ గృతాంతనికేతనాతిథిన్. ఇత్యాద్యా వాగనుశాసనానాం వాచః." (ఆది. ౧ ఆ. ౧౨౮ అహో. 3౧౬ పు) క. అక్కడుకు నబ్జనాభుం। డక్కజముగ నెత్తికొనుడు నందఱు చూడన్। గ్రక్కున నొక్కట నడఁగెను। మిక్కిలి చేతులును వాని మిక్కిలి కన్నున్ (సభా. ౨ ఆ. ౫౭.) "అబ్జనాభుం డెత్తికొనుడు.........అక్కజముగ.........నడఁగెనని యన్వయక్రమమున నుండవలయును. ఉ. కర్మఫలంబు నర్పితముగాఁ దగ నీశ్వరునందుఁ జేఁత స। ద్ధర్మము............(శాంతి. ౧ ఆ. ౧౪౯.) ఈశ్వరునం దర్పితముగాఁ జేఁత సద్ధర్మము." అనునది యన్వయక్రమము. ఉ .....ఆపరో। జాసనుఁ దొట్టి వారితేజఁ గారయ వచ్చి రమర్త్యు లందఱున్ (నిర్వ. ౫ ఆ. ౬౨ ప.) ఆపరోజాసనుఁదొట్టి యమర్త్యు లందఱును వారి తేజఁ గారయ వచ్చిరని యన్వయక్రమము. సీ. వంశవృద్ధులు పుత్త్రవర్గవియుక్తులై, యున్నవా రేమిట నుమ్మలింతు।రో యనుపుఱిలోట నాయుధిష్ఠిరుఁడు దమ్ములకును దగు నమాత్యులకు నిష్ట। భృత్యులకును "విూరు ప్రీతియు భక్తియు, నాంబికేయుని దెస నతిశయిల్ల। నారాజుపంచినయట్ల చేసి చరింపుఁ, డతని నారాధించు టస్మదీయ. ఆ-వె. చిత్తమునకుఁ బ్రియము సేయుట యతనికి। మనసుగాని యట్టిపనియొనర్చు। టగ్గలంపుదుఃఖ మావహించుట"యని। యనుదినంబుఁ జెప్పు మనుజనాథ. (ఆశ్ర. ౧ ఆ. ౧౦.) ఇట్టివాక్యాంతర గర్భిత వాక్యములును మహాకవిసమ్మతములని యెఱుంగునది. (చూ. ప్రౌఢ. వాక్య. ౨౧సూ.)

క్రియాయాశ్చేత్యాది:—కారకాద్యన్తభాగయోః = తనతో నన్వయించుచున్న కారకముల కాదియందుఁగాని యన్తమందుఁగాని, క్రియాయాః = క్రియయొక్క, ప్రయోగశ్చ = ప్రయోగముసైతము, స్యాత్ = సమ్మతమగును, మధ్యభాగే = అట్టిస్వాన్వితకారకములనడుమ, తత్ప్రయోగః = ఆక్రియయొక్క ప్రయోగము

నసాధుర్హ్యాదయజ్గమః = మహాకవిసమ్మతముకాదు. దీని కహోబలపతి యీ క్రిందిరీతి నుదాహరించెను. "నడచె నేనుఁగు గుఱ్ఱము, ఏనుఁగు గుఱ్ఱమునడచెను. ఇత్యాది పూర్వార్థ ఉదాహరణమ్. ఏనుఁగునడచెను గుఱ్ఱము ఇత్యాదిప్రయోగో న సాధు సమ్మతః" (అహో. ౩౧౬ పుట.) ఇట్టి కారికచే "గాలివీచెను జల్లగా - చల్లగా వీచెనుగాలి" అను సూరిగారి యుదాహృతులు దుష్టములగుచున్నవనియు "అథర్వణోక్తి ననుసరించి యిందలి రెండవ ఉదాహరణము లసాధువులగుచున్నవి" (బా. సా. వే. ౩౧౫ పుట.) అనియు వ్రాసినవ్రాఁత పొరపాటు. ఆవాక్యములలో నట్టి కారకముల నడుమఁ గ్రియ నిల్వలేదు. 'గట్టిగా' అనునది కారకము కాదు.

క్వచిదిత్యాది:—కులకసంబన్ధోఽపి = ఏకవాక్య గతానేకపద్య సంబంధము నైతము, అత్ర = ఈ తెల్గుభాషయందు, క్వచిత్ = ఒకానొకచో, న - అహిత కృత్ = సమ్మతముకాకపోదు - దీని కహోబలపతి యీ క్రిందిరీతి నుదాహరించెను. "ఉ......తత్ఫలావళుల్। వారలకెల్లఁ బెట్టి యనవద్యుఁడు దానొకపండుచెచ్చెరన్" క. కొని వచ్చుచు,........(ఆది. ౨ ఆ. ౧౯౯-౨౦౦ ప.) ఇత్యాచార్యస్య కులక మిష్టమేవ" (అహో. ౩౭౨ పుట.) ఈ యహోబలపతి లక్ష్యములె గాణపత వివరణమున స్వీకరింపఁబడెను (గాణ. ప్రకీర్ణ. ౪౨౭ కారి. ౭ ప.) త్రిలింగలక్షణ శేషకర్త పయివిషయములను వాక్య. ౨౩ సూత్రమున వివరించెను. అహోబల పతి పైరీతి నిచట (౩౭౨ పుటలో) వివరించియు ౪౧౧ పుటలో నీక్రిందిరీతిని వ్రాయుటవింత. "భాగవతే:—నృపకుమారులఁ జదివింప నేర్పుగలుగు. ఇతివిశేషణాం తత్వేన పద్యంసమాప్య - గురుజనంబులు విను మూఁడుకోట్లమీఁద" ఇతివిశేష్యా దిత్వేన పద్యోపక్రమః ప్రామాదిక ఇత్యవధేయమ్" (అహో. ౪౧౧ పు.) అని వ్రాయుట సరికాదనఁదగును. సంస్కృతమున నర్ధర్చాంతమునందును శ్లోకాంతము నందును సమానపదమును సమాసమును దెగిపోవలయునుగాని తెలుఁగున నట్టినియ మము లేదు. ఉ. దైన్యముదక్కి దూతయుచితంబుగఁ। బాండునృపాలుపాలు రా।జన్య వరుండు ధర్మజుఁడు సమ్మతివేఁడెను నన్న లోకసా।మాన్యవిధిం దగంగ...(ఉద్యో. ౧ ఆ. ౩౨ ప.) ఉ. శ్రీయన గౌరినాఁ బరఁగు చెల్వకుఁజిత్తము పల్లవింప భ।ద్రాయితమూర్తి యై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూ। పాయ నమశ్శివాయయని పల్కెడు భక్తజనంబు వైదిక। ధ్యాయిత కిచ్చుమెచ్చు పరతత్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్ (విరా. ౧ ఆ. ౧ ప.) ఉ......మనోహర। ద్యోతకగోస్తనీఫలమధుద్రవగో ఘృతపాయస ప్రసా। రాతిరస ప్రసారుచిర ప్రసరంబుగ సారెసారెకున్ (కవిపితా మహుని యుత్పలమాలిక. ౨౫-౨౬ ౨౭ చరణములు.)

"ఛన్దోబద్ధపదంపద్యం। తే నైకేనచ ముక్తకమ్। ద్వాభ్యాం తు యుగ్మకం జ్ఞేయం। త్రిభిః శ్లోకై ర్విశేషకమ్। కాలాపకం చతుర్భిః స్యా। త్తదూర్ధ్వం కులకం స్మృతమ్" (సాహిత్య. ౬ పరి. ౫౫౮ కారి.). "కులక - న. (కుల+అచ్ - సంజ్ఞాయాం కన్.) ...... ఏకవాక్యతాపన్నే పఞ్చాదిక శ్లోకసముదాయే......" (శబ్దస్తో.) అని చెప్పఁబడియున్నను వెనుకనుదాహరించిన యహోబలపతి యుదాహృతులచొప్పున శ్లోకద్వయసముదాయము సైతము కులకముగానె యుంటఁ దలంపఁబడుచున్నది. లేదా యధర్వణకారికలోని కులకశబ్దము యుగ్మకాదులకును నుపలక్షణమని గ్రహింపనగును.

శ్లో. శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే। లోకానాంస్థితిమావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్। తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషాః సంపూజితా వ స్సురై। ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరా శ్శ్రీయసే. (ఆది. ౧ ఆ. ౧.) అనునది మొదలు ౯ పద్యములవఱకు కులకమె. అట్లె ఆది, 3 ఆశ్వా. ౮ వచనము "ఆవైశంపాయనుండు........." అనునది మొదలు ౧౧ పద్యము శా.........నానావేదవేదాంత విద్యా। యుక్తంబగుదానిఁ జెప్పఁ దొడఁగెం దద్భారతాఖ్యానమున్" అనుదానివఱకుఁ గులకమె. ఇట్టివి పెక్కుగలవు.

అధ్యాహారస్యేత్యాది:—అధ్యాహారస్య = వాక్యమునఁ బ్రయుక్తములు కానిపదముల, సంయోగః = యోజన, అత్ర = ఈతెలుఁగునందు, నైవసుఖావహః = సమ్మతమైయుండదు. ఉదా:—వీఁడు దేవదత్తుఁడు - రాముఁడు బ్రాహ్మణుఁడు ఇది కర్తవ్యము - రాముఁడు వచ్చినవాఁడు - మున్నగువాక్యములలోఁ వీఁడు దేవదత్తుఁడైయున్నాఁడు - రాముఁడు బ్రాహ్మణుఁడగును - ఇది కర్తవ్యమగుచున్నది. రాముఁడు వచ్చినవాఁడైయున్నాఁడు మున్నగురీతిని సమాపకక్రియాధ్యాహారము తెలుఁగున హితముకాదని యెఱుంగునది. సుఖావహము కాదనుటచే ననఁగా నిషేధింపకుండుటచేతఁ గ్వాచిత్కముగా సుఖావహమగు నధ్యాహారముండిన నుండుననునర్థము తోఁచుచున్నది. (వి స్తర.) "సంస్కృతభాషాయామివాన్వయానుపపత్తిబలే నాత్రాధ్యాహారస్య సంకల్పః సుఖావహో నైవభవతి" (అహో.

---

వి స్తర. ౨౬౫ పిపః—సుఖావహములగు నధ్యాహారములు కొన్ని త్రిలింగలక్షణశేషమునఁ జూపఁబడెను. "౧౧. కొన్నియెడలం దదాదులు విశేషణంబు లధ్యాహార్యంబు లగు. క. కలకంఠకంఠి కన్ని। రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ (ఇంటన్ = ఆయింట). క. పురుషుండు రెండుతెఱఁగుల। ధర

౩౭౨ పుట.) అని యహోబలపతి వ్రాసెనే కాని సంస్కృతమునందును నధ్యాహార విషయమున మతభేదములు గలవు. "కో రామః - కా సీతా ఇదం జ్ఞాన మిత్యాదౌ ఉక్తార్థత్వాఽభావేపి ల్యర్థే (ప్రాతిపదికార్థే) ప్రీ. (ప్రథమా.). యేతు సర్వం హి వాక్యం క్రియయా పరిసమాప్యతే ఇతిన్యాయా ద స్తీత్యా ద్యధ్యాహార న్తి తన్మతే

---

ను త్తముఁ డనఁగఁ బరఁగు........(రెండు తెఱఁగులన్=ఈక్రింది రెండు తెఱఁగుల చేత.) (ఉద్యో. ౨ ఆ. ౪౧.). ౧౨ కొన్నియెడల సంబంధంబునం బూర్వవాక్యంబు నందలి పదం బధ్యాహార్యం బగు. ఉదా:—గొంతి సంకటపాటుఁ గోడలిబన్నంబు... ......(భార. భీష్మ. ౨ ఆ.) (కోడలిబన్నంబు = గొంతికోడలిబన్నంబు.)......... దానవేశ్వరునకుఁ దమ్ములకును (నిర్వ. ౨ ఆ. ౮౨.) (ఆతనితమ్ములకని యర్థము). ౧౩ న్యూనవచోవాక్యంబునఁ దద్వచనంబు లధ్యాహార్యంబులగు. (న్యూనవచనంబులు - ఐన - ఏని - ఎ - ఓ - మొ. ఉదా:—ఎత్తెఱఁగున ధర్మక్రియఁ । జిత్తంబునఁ జేర్పవలయు.........(ఎత్తెఱఁగునన్ = ఎత్తెఱంగుననైనను లేక ఎత్తెఱఁగుననేని.).........కర్మములు మేలునిచ్చును (కర్మములు = కర్మములే......)... ......౧౪. కొన్నియెడలం గర్తృకర్మక్రియ లధ్యాహార్యంబు లగు. ఉదా:— కర్తకు:—నన్నుఁ జూచి నగరె. (జనులు. కర్త. అధ్యాహార్యము) (భార. ఆర. ౨ ఆ.) చ. దవదహనం బుదగ్రతనుదాహము సేయుచు నున్నఁ జూచి......... (చూచి = దాహము చేయుటను జూచి-కర్మ అధ్యాహార్యము) (భార ఆర. ౨ ఆ)" (ప్రౌఢ. వాక్య.). వీనిని గాణపతవివరణకర్త స్వీకరించెను (గాణ. ప్రకీ. ౪౨౭ కారి వివరణము. ౪౩౪-౪౩౫ సూ.). "ఒక్కొకచో సమాసగతపూర్వపదంబు వ్యవహితోత్తరపదం బొంటితోడను వానిపెక్కింటితోడను నన్వయించెడి. ఉదా:— రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె. (భార. ఆది ౨ ఆ.) క. ఒక్కొక కన్నును జెవియును । జెక్కును......... । అక్కజముగ మనుజశకల మప్పుడుద యించెన్ (సభా. ౧ ఆ.) క. పరులధనమునకు విద్యా । పరిణతికిం దేజమునకు బలమునకు మనం । బెరియఁగ.........(భార. ఉద్యో. ౨ ఆ) క. నాయింటం బదిగడవల । నేయిఁ బెరుఁగుఁ బాలు ద్రావె.........(హరి. పూ. ౩ ఆ) (ప్రౌఢ. సమా. ౩౪ సూ.)" దీనిని జాలవఱకు యథాస్థితముగ గాణపతవివరణకర్త స్వీకరించెను (గాణ. సమా. ౨౭౯ సూ.). పై వానిలోని "రాహు ఒక్కొక - పరుల- పదిగడవల -" అను సమాసపూర్వావయవములు వ్యస్తపదములతో నన్వయించుచున్నవనుటకంటె నవి యామూచోటులం దధ్యాహృతము లగుచున్నవనుట యుక్తమనితోఁచెడిని.

లిఙ్గగ్రహణమ్ (ప్రాతిపదికార్థగ్రహణమ్). కృష్ణః - శ్రీః - జ్ఞానమిత్యాదౌ లిఙ్గ మాత్రప్రతీత్యాం ప్రీ (ప్రథమా) విధానార్థమ్" (ముగ్ధ. ౨౮౦ సూ. శ్రీరామ తర్కవాగీశవ్యాఖ్య. ౧౭౦ పుట.) (౨౩౮ విష. చూ.). "కో రామః = ఎవఁడు రాముఁడు? కా సీతా = ఎవతె సీత? ఇదం జ్ఞానమ్ = ఇది జ్ఞానమ్" మున్నగు వాక్యములలో 'అస్తి - భవతీ' త్యాది క్రియాధ్యాహారము చేయనివారిపక్షమునం దాఖ్యాతము లేమింజేసి యుక్తార్థత్వము లేకున్నను ప్రాతిపదికార్థప్రథమావిభక్తి - 'కః - కా - ఇమ్' మున్నగుచోట్లఁ గల్గుననియు - "అస్తి - భవతీ" త్యాద్యధ్యాహారపక్షమున ౨౩౮ విషయముచొప్పున నట్టియెడలఁ బ్రాతిపదికార్థప్రథమ వచ్చుననియుఁ బై వ్యాఖ్యకుఁ దాత్పర్యము.

'అస్తి - భవతీ' త్యాద్యధ్యాహారపక్షమందును "ఆఖ్యాతే వాక్యసమాప్తిః...... క్తక్తవతూ కృత్యైశ్చేత్యేకే ప్రాహుః, కృత్యాః స్తవ్యాదయః - తథాహి - రామేణ వనం గతమ్ - రామో రావణం హతవాన్ - సాధుభిః రామః స్మర్తవ్యః - ఏషు భవత్యాది క్రియాధ్యాహారో నాస్తి. రామో జగతాం కర్తా - రామో జగతాం సంహారకః - రామేణ స్వర్గః సుగమః - ఇత్యాదౌ భవతీత్యాది క్రియాణా మధ్యాహారం వినా వాక్యసమాప్తి ర్నాస్తీత్యర్థః." (ముగ్ధ. ౩౧౬ సూ. దుర్గా. వ్యాఖ్య.) అనుచొప్పున - క్త ప్రత్యయాంతములయు 'క్తవతు' ప్రత్యయాంతములయు "తవ్య - అనీయ - య' మున్నగు కృత్యప్రత్యయాంత ములయుఁ బ్రయోగమున "అస్తి - భవతీ" త్యాదుల యధ్యాహార మక్కఱ లేదనియుఁ దక్కిన తృనాదిప్రత్యయముల ప్రయోగమున 'అస్తి - భవతీ' త్యాదుల యధ్యాహార మావశ్యకమనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. వింతలగు నధ్యాహారములును సంస్కృతమునఁ గలవు. "శ్లో. అనుభవతి శచీత్థం సాధ్వృతాచీముఖాభి ర్న సహ సహచరీభి ర్నన్దనానన్ద ముచ్చైః । ఇతి మతి రుదయాసీ త్పక్షిణః ప్రేక్ష్య భైమీం । విపిన భువి సఖీభిః సార్థ మాబద్ధఖేలామ్." (నైష. ౨ సర్గ. ౧౦౯ శ్లో.) అత్ర, దమయన్తీం ప్రేక్ష్య పక్షిణః మతి రుదయాసీ దిత్యన్వయః. సఖులతోఁ గ్రీడించు దమయంతిని జూచి హంసకు శచీదేవియు నిట్టియానందము ననుభవింప లేదనుమతి యుదయించెననియర్థము. "భైమీమ్ = భీమనన్దినీం, దమయన్తీ మిత్యర్థః, ప్రేక్ష్య = దృష్ట్వా, పక్షిణః = హంసస్య-ప్రేక్ష్యేతి క్త్వా ప్రత్యయాన్తస్య అనన్తరక్రియయాసహ ఏకకర్తృకత్వనియమాత్ స్థితస్యేతి పక్షిణ ఇత్యస్య విశేషణ మధ్యాహార్యమ్" (జీవానందవిద్యాసాగర భట్టాచార్యవ్యాఖ్య) దమయంతిని

జూచి పక్షి కట్టి బుద్ధి కల్గెనపుడో "దరుయంతిని జూచియున్నట్టి పక్షిక"నుకీతిని 'ఉన్నట్టి' (స్థితస్య) అనునది యథార్థ్యమని పై వ్యాఖ్యకుఁ దాత్పర్యము.

ఏకవాక్యంబునం దొకానొక్కండు దక్క సర్వపదం
బులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంజను. 32.

బాలవ్యాకరణ వివృతి. పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్య మం దెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపం దగును.

౨౬౫ I విషయము ఏని ప్రభృతిశబ్దంబులు కొన్ని నియమ సాపేక్షంబు లయియుండు. గాలి చల్లగా వీచెను. వీచెను జల్లగా గాలి. చల్లగా గాలి వీచెను. వీచెను గాలి చల్లగా. గాలి వీచెను జల్లగా. చల్లగా వీచెను గాలి.

ఇది కారకపరిచ్ఛేదము.

సంజీవని. ౨౬౫ I విష:—సూత్రములో "ఒకానొక్కండు దక్క" అను దానిని "ఏని ప్రభృతిశబ్దంబులు కొన్ని నియమ సాపేక్షంబులయి యుండు" అను వాక్యముతో సూరిగారే వివరించిరి. 'ఏని ప్రభృతి' అనుటచే - అగు - వలెను - పోలెను - పోని - వంటి - అట్లు - కరణి - మున్నగుశబ్దములు గ్రాహ్యములు. ఇట్టివి తమ సంబంధిపదముతోడి వ్యవధానమును సహింపవని గ్రహింపవలయును. ఉ. 'రాముఁడేని కృష్ణుఁడేని వచ్చెను.' అనుచో 'ఏని రాముఁడు వచ్చెను' మున్నగు రీతిని బ్రయోగింపరాదు. ఇట్లె తక్కినవానినిసయితము చూచుకొనవలెను.

వేటికావ్యాఖ్యాత యీసూరియుదాహృతులలోని "యైదా ఉదాహరణ ము లసాధువులని వ్రాయుట (బా. సా. వే. ౩౧౫ పుట.) సరికాదనియు నటఁ గార కములనడుమ క్రియాప్రయోగము లేదనియుఁ గల్పతరువున విశదీకరింపఁబడెను.

సూరి తన సూత్రమునఁ బ్రకృతార్థప్రకాశకమగు వ్యత్యాసముండ నగునని యథర్వణవచనమును సంగ్రహింపకుండుట సరికాదు. ఏన్యాదులకేకాక యొల్లపద ములకును వివక్షితార్థప్రకాశనక్షమమగు స్థాననియమ ముండకతీరదు. 'వలచి నట్లు' అనెడి సూరివచనముచొప్పున "రాముఁడు దండెత్తిచంపెను లంకపైఁ గపి సేనతో రావణుని" అని వాక్యము నిల్పరాదుగదా. అట్టివాక్యము "రాముఁడు కపిసేనతో లంకపై దండెత్తి రావణునిజంపెను" అనువాక్యము నర్థము నీయఁజాలదు గదా.

ఇది కారకపరిచ్ఛేదము = కారకపరిచ్ఛేద మింతటితో ముగిసినదని యర్థము.

---

# కారకపరిశిష్టము

౨౬౫ II విషయము:—"భావాద్యర్థవ్యవధానేతు । భేదస్స్యాన్నిఖిలం భవేత్" అనునథర్వణవచనమును దానివివరణమే యనఁదగు "భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు......విద్యాశాలియగు పురుషుని..........." "భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమయగు......రాముఁడు పట్టినప్రతిన వారింపం దరంబుగాదు......" (బాల. కార. ౨౮ మొ. ౩౨ వ). అను సూరి సూత్రములును సిద్ధాంతానువాదములెకాని యపూర్వములు కావని యాయా విషయములలోఁ వ్రాయఁబడెను. అథర్వణుఁడుద్దేశించిన భావాద్యర్థములెల్లఁ గృదంత రూపములు:—అగు - ఆయెడు - అయ్యెడి - అవుచున్న - అయిన = ఐన - కాఁగల - కాని - అయి = ఐ - కాక - అగుచున్ - అయినన్ - కాన్ - అగుట - కామి - అను - అనెడు - అనెడి - అనఁగన్ - అనిన - అనన్ - నాన్ - మొ. సూరి పేర్కొన్నభవత్యర్థకములు పైనివ్రాసిన భూధాతుకృదంతరూపములె, భావార్థ కాదులుపయితము పైనివ్రాసినకృదంతములతుదిని నిల్పియున్నకృత్ప్రత్యయములు మాత్రమె.

పయినివ్రాసిన కృత్తుల వ్యవధానమున విశేషణముపయిని బ్రథమావిభక్తి నిల్చునని భావాద్యర్థ ఇత్యాద్యథర్వణవచనమునకుఁ దాత్పర్యము. భావాద్యర్థ వ్యవధాన మనఁగా భావాద్యర్థకకృదంతములతోఁడి యన్వయమున విశేషణము ప్రథ మాంతమగునని యర్థము. అట్లె భావార్థకాదియోగమున ననఁగా భావార్థకాది కృత్తులతో నన్వయించుటచేతఁ గర్తృవాచకము ప్రథమాంతమగునని సూరి సూత్రమునకును దాత్పర్యము. పైవానిలో "న - చున్న - కల - ని - ఎడి - ఎడు - తల్లోపము" అను విశేషణఘటకములగు కృత్తులు కర్త్రర్థకము లనుటలో విప్రతిపత్తియే లేదు. "కర్తరికృత్ (౩. ౪. ౬౭.) కృత్ప్రత్యయః కర్తరిస్యాత్." (సి. కౌ. ౨౮౩౨ సూ). అనుచొప్పున నవి కర్త్రర్థకము లనుటలో సందేహమే లేదు. రాముఁడు పట్టినప్రతిన మున్నగుచోటులందలి 'పట్టిన' అను క్తవదర్థక 'న' ప్రత్య యము కర్త్రర్థకమె యగుటచేత నట్టికృత్తుచే 'రాముఁడు' అనుకర్త యభిహితమగు టంజేసి కర్తృవాచకమగు 'రాముఁడు' అనునది తృతీయాంతము కానేరక ప్రాతి పదికార్థప్రథమాంతమయ్యెను. ఇట్లె ధాతుజవిశేషణములెల్లఁ గర్త్రర్థకకృదంత

ములై యగుటచేత వానితో నన్వయించుకర్తృవాచకము ప్రథమాంతమగుననువిధి సిద్ధార్థానువాదమె యనుటలో సందియ మేమున్నది?

ఈవిషయమున సంస్కృతాంధ్రములకుఁ జాలభేదము గలదు. సంస్కృతమున సాధారణముగా విశేషణవిశేష్యములు సమానలింగవిభక్తివచనకము లయియుండుటయు నట్టివిశేషణము విశేష్యముతోనె యన్వయించుటయు సంప్రదాయము. తెల్గున నట్లుగాక విభక్త్యంతములగు విశేషణములు క్రియాజన్యవిశేషణాదులతో నన్వయించుటయు నట్టిక్రియాజన్యరూపములు విశేష్యములతోఁగాని క్రియాంతరములతోఁగాని యన్వయించుటయు విశేష్యవిశేషణములు భిన్నవిభక్తివచనకము లయియుండుటయు ననెడిపద్ధతిపయిత మతిప్రచురముగ నున్నది. సీ. గుణవంతులగుచున్న కొడుకులుగలవాఁడు.........(ఆది. ౮ ఆ. ౨౫) ఉ. తన కిష్టుఁడున్ సహాధ్యాయుఁడు నైనవాఁడు. (ఆది. ౧ ఆ. ౨౫) క. దేవసముళైన యనుజులతో (ఆర. ౨ ఆ. ౫ ప). ఇట్టి ప్రయోగము లనంతముగాఁగలవు. విశేషణము ప్రత్యేకముగాఁ గ్రియతో నన్వయించుపద్ధతి సంస్కృతమున వివాదగ్రస్తమైనను (చూ. అనభిహితసూత్రభాష్యము) దెలుంగున ధారాళముగా నున్నదని పయిరీతిగల ప్రయోగశతములు నిర్ణయించుచున్నవి. అట్లగుటచేతఁ బయిప్రయోగములలోని "అగుచున్న - ఆయిన - ఐన" మున్నగు కర్త్రర్థకధాతుజనిశేషణముల తుదినున్న 'చున్న - న' మున్నగుకృత్తులచేత "గుణవంతులు - సహాధ్యాయుఁడు" మున్నగుకర్త లభిహితములగుటంజేసి యట్టి కర్తృవాచకములు తృతీయాంతములుగా నేరక ప్రాతిపదికార్థప్రథమాంతము లయియున్నవనుట యుక్తముగాని యవి వాచనికప్రథమాంతములనుట యుక్తముకాదుగదా. ఇట్లె యనేకస్థలములందుఁ బ్రసిద్ధమయియున్న సామాన్యపద్ధతిచే లభించుచున్న ప్రథమను విధించుట సిద్ధార్థానువాదకమెకాని యపూర్వవిధి కానేరదుగదా.

ఇంక - ట - అమి - క్త్వా - మున్నగు భావార్థకకృత్తులచేఁ గర్తృత్వ మభిహితమయ్యె ననుట విరుద్ధమగుటంజేసి 'రాముఁడువచ్చుట' మున్నగుస్థలములందలి కర్తృవాచకప్రథమయైన వాచనిక మనక తీరదుగదాయని శంకింపరాదు. క్రియ నిరాశ్రయమైయుండుట యసంభవమగుటంజేసి "రాముఁడువచ్చుట" అనుస్థలము నందలి గమనక్రియకాశ్రయుఁడగు రాముఁడనుకర్తతో నన్వయించుచున్న 'వచ్చుట' అనుస్థలమందలి భావార్థక'ట' ప్రత్యయాదిస్థలములం దాభాసకర్తృత్వ మంగీకార్యమగుచున్నది. 'రాముఁడు చంపిన రావణుఁడు - గోవు నిచ్చిన విప్రుఁడు' మున్నగుచోట్లందు 'చంపిన - ఇచ్చిన' మున్నగువానికి లేని విశేషణత్వము

నాభాసరూపముగా నంగీకరించి యట్టిస్థలములు "స్యాత్కర్మధారయాభాసః కర్తృత్వే కారకాశ్రితే" అనుచొప్పున నాభాసకర్మధారయములని యథర్వణాచార్యుఁ డంగీకరించియుండ లేదా?

చ. అమలసువర్ణశృంగఖురమై కపిలం బగుగోశతంబును......(ఆది. ౧ ఆ. ౧౫) క. వినుఁ డేఁబుణ్యశ్లోకుం । డనఁగ సదాయజ్ఞనిరతుఁ డనఁగ ధరిత్రిం । దన రిన నలుభార్యను స । జ్జనసుత దమయంతి యనఁగఁ జనియెడు దానన్ (అర. ౨ ఆ. ౯౯) మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో । ద్ధురుఁడై ద్రౌపది నట్లుచేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ । కరలీలన్ వధియించి తద్విపుల వక్షఃశైలరక్తౌఘుని । ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్ (సభా. ౨ ఆ. ౨33) మున్నగుప్రయోగశతములందు "సువర్ణశృంగఖురమై - కపిలం బగు - పుణ్యశ్లోకుఁ డనఁగ - యజ్ఞనిరతుఁ డనఁగ - దమయంతి యనఁగ - బాంధవులు చూచుచుండఁగా - ఉర్వీపతి చూచుచుండన్" అనురీతిగలచోటులం దెల్లఁ గ్రియలు నిరాశ్రయములనియు నచటి ప్రథమవాచనికమనియుఁ జెప్పుట యుక్తము కాదుగదా.

క. పదపడి దుస్తరమగు నీ । పదమూఁడవయేఁడు కడపఁబడుట యరిది...(ఉద్యో. ౧ ఆ. ౯) మున్నగుచోటులందు "పడ్వ"నుబంధమనెడి నిపాతముచేఁ గర్త యభిహితమయ్యెనుగానఁ గర్తృవాచి ప్రాతిపదికార్థప్రథమాంతమయ్యెనని యెఱుంగునది.

---

# ఆంధ్ర
# వ్యాకరణసంహితా సర్వస్వము
## సమాసపరిచ్ఛేదము

---

కల్పతరువు ౨౬౬ విష:—సమాసలక్షణము సంస్కృతవ్యాకరణప్రసిద్ధమె యనుతలంపునంగావలయు నన్నయాథర్వణులు వచింపలేదు. "ద్వైక్యం సోఽన్వయే. ద్వయో ర్బహూనాం వా దానా మైక్యం ససంజ్ఞం స్యాత్ (ముగ్ధ. ౩౧౭ సూ). ('ద=పద; స=సమాస.' అనునవి ముగ్ధబోధవ్యాకరణసంజ్ఞలు) రెండుపదముల యైక్యముకాని పెక్కుపదముల యైక్యముకాని సమాస మనఁబడును. పరస్పరాన్వయముగలపదములు సముదాయశక్తిచే నేకార్థబోధకంబులగుట సమాసమని యర్థము. ఇచటిపదములనఁగా సుబంతములనియె యర్థము, కావున "వచ్చును+పోవును" మున్నగుస్థలములందు సమాసము కానేరదు. "దంపదమ్. తచ్చ స్యా (స్యా) ద్యన్తమేవ......అన్యథా లిఖతిచ పఠతిచ ఇత్యాదావపి సమాసాపత్తిః స్యాత్. అతఏవ 'నామ్నాం సమాసో యుక్తార్థ । స్తత్ స్థా లోప్యా విభక్తయ' ఇతి సర్వవర్మా. ప్రణమతి, నిషేధతీత్యాదౌ సమాసస్తు 'వ్యస్య గ్యనుకా'రేత్యాది విధ్యన్తరాత్......" (ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. ౩౧౭ సూ). నిషేధతి = నిషేధించుచున్నాఁడు మున్నగుచోట్ల సుబన్తతిజన్తముల సమాసము "వ్యస్య గ్యనుకారేత్యాది విశేషవిధిచే (ముగ్ధ. ౫౮౦ సూ). సంభవించునుగాన సామాన్యముగా సుబంతపదములకే సమాసమని యెఱుంగనది. (విస్తర). 'రామునియొక్క+పుత్త్రుఁడు' అనురీతి భిన్నభిన్నములగు పదములు సామర్థ్యముగలవై సముదాయశక్తిచే 'రామసంబంధిపుత్త్రుఁడు' అను నేకార్థమునుబోధించుచు 'రామునిపుత్త్రుఁడు' అనురీతి నేర్పడునని యెఱుంగనగును.

---

విస్తర. ౨౬౬ విష:—సుబంతములు తిజంతములతో సమసించువిశేషవిధి—"వ్యస్య గ్యనుకార డాచ్చ్వి కిణేలంసన్మనోఽదోన్తః పురోఽస్తం తిరస్ కారికో ర్యాదే ర్థా సః. వృత్తిః—"ఏషాం వ్యానాం (అవ్యయానామ్) థా (థాతౌ) పరదే

సామర్థ్యము రెండువిధములు. ౧ వ్యపేక్షాసామర్థ్యము. ౨ ఏకార్థీభావసామర్థ్యము. 'కాష్ఠములతో స్థాలియం దోదనమును వండుచున్నాఁడు' అనురీతివాక్యములలో నాకాంక్షావశమునఁ బదము లన్వితములయియుండుట వ్యపేక్షాలక్షణసామర్థ్యము. పృథగ్భూతములగు నర్థములుఁగల పదములు సముదాయశక్తిచే నేకార్థప్రతిపాదకములగుట యేకార్థీభావలక్షణసామర్థ్యము. ఇది సమాసములందే కల్గును. "సామర్థ్యం ద్వివిధమ్. వ్యపేక్షాలక్షణమ్ - ఏకార్థీభావలక్షణంచ, తత్ర స్వార్థపర్యవసాయినాం పదానా మాకాంక్షాదివశా ద్యః పరస్పరాన్వయః తత్ వ్యపేక్షారూపం సామర్థ్యమ్......ఇదం రాజ్ఞః పురుష ఇత్యాదివాక్యఏవ భవతి......ఏకర్థీభావలక్షణసామర్థ్యంతు ప్రక్రియాదశాయాం ప్రత్యేకమర్థవత్త్వేన పృథగ్గృహీతానాం పదానాం సముదాయశక్త్యా విశిష్టైకార్థప్రతిపాదకతారూపమ్......ఇదంచ సామర్థ్యం రాజపురుష ఇత్యాది వృత్తావేవ." (బాలమ. ౬౪౭ సూ. వ్యాఖ్య.). వాక్యగతపదములకును నన్వయముండునుగాని యందుఁ బరస్పరాకాంక్ష లేనివానికి సమాసము కలుగనేరదు. "కాష్ఠైః స్థాల్యా మోదనం పచతీత్యత్ర పచన క్రియాయాః కరణం కాష్ఠమ్ - ఏవం పచనక్రియాయా అధికరణం స్థాలీ, పచనక్రియాయాః కర్మ ఓదనః, తేన కాష్ఠైఃస్థాల్యా మోదన మితిత్రయాణాం పరస్పరాకాంక్షాఽభావా న్న సమాసః." (ముగ్ధ. ౩౧౭ సూ. దుర్గా. వ్యా.)

---

(పరపదే) సః స్యాత్ (సమాసః స్యాత్)"(ముగ్ధ. ౫౪౦ సూ.) దీనివ్యాఖ్య:—"అత్ర సమాసః ఏకపదీభావమాత్రమ్. ద్వన్ద్వాదిసంజ్ఞాస్తు స్యాదన్తానామేవ.........". ప్రాదులకును మఱికొన్ని యవ్యయములకును (గి+అనుకార+డాచ్+చ్వి+కణే+అలమ్+సత్+మనస్+అదస్+అస్తర్+పురస్+అస్తమ్+తిరస్+కారికా+ఊర్యాది) ధాతువు పరమగుచుండఁగా సమాసంబగునని యర్థము. "ప్రణమతి - నిషేధతి - ఇత్యాదౌ వ్యస్య గేత్యాదినా సమాసేఽపి తిబాదేర్న లోపః......" (ముగ్ధ. ౩౧౯ సూ. వ్యాఖ్య).

"ప్రణమతి - నిషేధతి" అనునవి మున్నగునవి సమస్తపదములు కావనియు వ్యస్తములనియు నట్లు వ్యస్తములయినను వానికట్టిచోఁ బదాంతరవ్యవధాన ముండదనియుఁ బాణినీయుల సిద్ధాంతము. కాని యీపక్షమున "అనుభవించెను - ఉపవసించెను" మున్నగు పరిణతి సంవృతి క్రియారూపములందలి "అను - ఉప" మున్నగుప్రాదులు తెల్గున వ్యస్తముగాఁ బ్రయుక్త మగుననుట సరికామింజేసి యిట్టివి పైరీతిని సమస్తపదములనుటయే యుక్తమనితోఁచుచున్నది.

సమ్మయా సమాసయు గ్భవే దాద్య । ఆత్మాదిగ విభక్తిగః. (విక్ర).
థర్వణీయము. హాలం. ౧౩ కారి. అహో. ౪౧౭ పు).
౨౬౬ I అభిన్నస్యాపి నాదేః స్యా । ద్భిన్నేనాపి సమన్వయః (విక్ర).
హాలం. ౨౫ కా. అహో. ౪౫౩ పు).

కల్పతరువు. ౨౬౬ I వివః—ఆత్మాది గ = 'తా' మున్నగుశబ్దములపై నిల్చిన, విభక్తిగః=విభక్తులతో నన్వయించుచట్టి, ఆద్యః = సంస్కృతపదము, సమాసయుగ్భవేత్ = సిద్ధసమాసగతముగుటయుఁ గలదు. వ్యస్తములగు తనయొక్క - నీయొక్క - నాయొక్క మున్నగువానితో నన్వయించు సంస్కృతపదము సిద్ధసమాసాద్యవయవ ముగుటయుఁ గలదని యర్థము. ఉ. తన నామమహిమ. అభిన్నస్యాపి, నాదేః = సమాసగతములగు నవర్ణకాంతాది విశేషణశబ్దములకు, భిన్నేనాపి సమన్వయః = వ్యస్తపదముతో సమన్వయము కలుగవచ్చును. ఉదా: నేనుజేసినపని - నేనుజేయుని పని - మొ. ఇచట 'నేను' అనువ్యస్తపదము 'చేసిన' అను సమాసపూర్వావయవముతో నన్వయించుచున్నది. దీని నేకదేశాన్వయ మందురు. "సీ. తనధర్మవిభవపు తతసంస్తవామోదపరిపూర్ణులైన భూసురులు గొలువ. ఇత్యాద్యాకారేణ సమాసో న కార్యః. వికారేతు,తతసంస్తవప్రీతిఁ బరిపూర్ణులైన. ఇత్యాద్యాకారేణ సమాస స్సాధురేవ" (అహో. ౪౧౭ పు). దీనినిబట్టి - తన - నీ - నా మున్నగువానితో సమాసమందు నపుడు సమాసోత్తరపదము తన ప్రభృతులతో నన్వయించు నర్థసందర్భ ముండవలయునని యహోబలపతి తలంచిన ట్లగపడుచున్నది కాని యట్టినిర్బంధము కవి ప్రయోగములలోఁ గానరాదు. సంస్కృతమందును నేకదేశాన్వయము గన్పట్టుచున్నది. సముదాయశక్తిచే నేకార్థబోధకములగు పదములలో నొకదానికి సమాసగతిలేనిచోఁ దక్కినవానికిని సమాసము గల్గనేరదు. "బుద్ధస్య రాజ్ఞో మాతఙ్గా ఇత్యత్ర బుద్ధస్యేతి విశేషణస్య రాజ్ఞ ఇతి విశేష్యేణ సమాసాభావే రాజ్ఞ ఇతి పదస్య మాతఙ్గా ఇతిపదేన సమాసో నస్యాత్. తేన బుద్ధస్య రాజమాతఙ్గా ఇతి నస్యాదితి. యత్ర ప్రతియోగిపద (ప్రతియోగః.........సంబంధః) (శబ్దా. చిం.) కారకపదయోరపేక్షా వర్తతే తత్రస్యాదేవ. యథా రామస్య నామమహిమా-కృష్ణమాశ్రితమనాః - బాణేన భిన్నహృదయః - రామేణ హతభర్తృకా - విప్రాయ దత్తభూమిః - వ్యాఘ్రాల్లబ్ధభయః - సిద్ధౌ నిమగ్నసర్వస్వ ఇత్యాది. తథాచ - ప్రతియోగిపదా దన్యద్ । యదన్య త్కారకాదపి । వృత్తిశబ్దైకదేశస్య । సంబన్ధ స్తేన నేష్యతే - ఇతి ప్రాఞ్చః - ఏవం వృద్ధస్య బాహోరపత్య మిత్యత్ర వృద్ధస్య బాహవిరితి నస్యాత్ - వీరం పుత్ర మిచ్ఛతీత్యత్ర వీరం పుత్రకామ్య తీత్యపి నస్యాత్"

(ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. ౩౧౭ సూ). శ్రీరామతర్కవాగీశ భట్టాచార్యుఁడును నిట్లె యుదాహరించెను. "ప్రతియోగిపదా దన్య। ద్యదన్య త్కారకాదపి। వృత్తి శబ్దైకదేశస్య। సంబన్ధ స్తేన నేష్యతే॥ యథా:—శరుణో్య వృషలీభార్యః। ప్రవీరం పుత్త్రకామ్యతి। ఋద్ధస్య రాజమాతఙ్గా। ఇతి న స్యుః ప్రయుక్తయః॥ చైత్రస్య దాసభార్యేయం। లూనచక్రరథో మయా। శరైః శాతితపత్త్రోయం। వృక్షా దితి సతాంమతమ్......అసమానాధికరణ సాపేక్షస్య గమకత్వేన సాభ్యుపగమాత్ (సమాసాభ్యుపగమాత్) సమానాధికరణసాపేక్ష్య మసమర్థం భవతీతి కశ్చిత్. అన్యేతు "సమస్త స్యాసమస్తేన। నిత్యాపేక్షేణ సంగతిః" (ముగ్ధ. శ్రీరామ. వ్యాఖ్య. ౩౧౭ సూ). సిద్ధసమాసగతవిశేష్యమునకు విశేషణము వ్యస్తముగా నుండరాదనియు శేషషష్ఠ్యంతపదముగాని కారకపదముగాని వ్యస్తముగా నుండ వచ్చుననియుఁ బర్యవసితార్థము. ఉదా:—ఋద్ధుఁడయిన రాజుయొక్క మాతంగములనుచో ఋద్ధుఁడగు రాజమాతంగము లనరాదు. (ఋద్ధుఁడగు రాజు మాతంగము లనుట నిర్బాధము.) దేవదత్తుని యుపాధ్యాయుని కులమనుచో దేవదత్తుని యుపాధ్యాయకుల మనవచ్చును. రామునియొక్క నామముయొక్క మహిమ యనుచో రాముని నామమహిమ యనవచ్చును. బాణముచే భిన్నమగు హృదయము గలవాఁడనుచో బాణముచే భిన్నహృదయుఁ డనవచ్చును (విస్తర.)

---

విస్తర. ౨౬౬ I విష:—"కొన్నియెడల సిద్ధసమాసమధ్యగతపదంబులతోఁ దద్భిన్నపదంబుల కన్వయంబు చూపఁబడె......ఒకటిచే జనితాధరపీడయై...... (కళా. ౫ ఆ.)" (ప్రౌఢ. సమా. ౩౫ సూ). పైసూత్రము నుదాహృతులలోఁ బ్రౌఢవ్యాకర్త "వారి యస్మదీయోరు చమూసమూహములు (హరి. ఉ. ౨)" అనియుఁ బ్రామాదికముగా నుదాహరించెను. గాణపత వివరణకర్త యలవాటుచొప్పున నట్టి యుదాహృతిని స్వీకరించి "లాఁతిచో సహిత మిందేకదేశాన్వయంబు చూపఁబడి" (గాణ. సమా. ౨౨౮ సూ). అని సూత్రించి యాప్రయోగమును దానితో పాటు మఱికొన్ని ప్రామాదికోదాహరణములను నొసంగెను. "వారి = వారియొక్కయు, అస్మదీయ = మాయొక్కయు, ఉరుచమూసమూహములని యర్థమనియు, 'వారియొక్క' అనువ్యస్తషష్ఠ్యంతము 'చమూసమూహములు' అను సమాసైకదేశమగు నుత్తరపదముతో నన్వయించుచున్నదనియుఁ బైవారియాశయము. ఇట్టి ద్వంద్వసమాసైకదేశము వ్యస్తముగానుండుట కేవలము నసంభవము. ఇది కవ్యభిప్రేతమును గాదు. ఈవిషయము విశదపడుటకయి యిట పద్యము పూర్తిగాఁ జూపఁబడుచున్నది. ఉ. వైరి యవధ్యుఁ డాతనికి వారక

ప్రయోగములు:—శా. "ఆనారాయణపాండవేయగుణమాహాత్మ్యామల జ్యోత్స్న (ఆది. 3 ఆ ౨౧ ప). ఇత్యాదివచనమాచార్యస్య" (అహో. ౪౧౭ పు). అని నన్నయప్రయోగముఁజూపి వెనుకవ్రాసినరీతిని సిద్ధసమాసోత్తరపదము "తన-నీ-నా-ఆ-ఈ" అనురీతి శబ్దములతో నన్వయింపఁదగిన యర్థసందర్భము గల్గియుండవలయునని యహోబలపండితుఁడు తలంచెనే కాని యట్టియర్థసందర్భములేని యేకదేశాన్వయములు నన్నయప్రయోగములందును గన్పట్టుచున్నవి. సీ. ఆ. వె. అవనీశులెల్ల నీ। యనుజవీర్యవిజితులయి (సభా. ౧ ఆ. ౨౭౨). సీ...ఆ. వె. అతని కరతల ద్వయాంకముద్రితములై। కందియును మహాసుగంధికుసుమ। తతులు...... (ఆర. ౨ ఆ. ౧౯౭). క. నా వీర్యప్రభువులైన నలువురుసుతులన్ (ఆది, ౮. ఆ. 3౦౧). తే. గీ. నా యథాశక్తిఁజేసి యన్యాయపథముఁ। బరిహరించి (సభా. ౧ ఆ. ౫౭). చ...బహువేదఘోషములఁజేసి నిరస్తసమస్తకిల్బిషో। త్కరులగుచున్న ధన్యులు......(అర. ౧ ఆ. ౧౧). సీ. హరుచేత సంప్రాప్తవరుఁడయ్యె నరుఁడని, తే. గీ (అర. ౧ ఆ 33౭) ఉ...ప్రధానవరులందు సమర్పితరాజ్యభారుఁడై (అర. 3 ఆ. ౨౦౦). క...ఇక్ష్వాకుని। కులతిలకుఁడు......(అర. 3 ఆ. 3౨౫). శా. నీ కంఠార్పితకాలపాశము.........(భాస్కర. సుందర.) ద్విపద. ఆ యగ్రహార మహాజనోత్తముని। కాయపూజిత పాదకమలద్వయుండు (బసవ. ౧ ఆ. ౫౬ ప. ఇట్టి విచట నుదాహరణములుగలవు). ఆ మహాత్ముని సముద్య త్కృపాపూరి। తామృత హస్తకృతావతారుండు (బసవ. ౧ ఆ. ౬౪ ప). ఇతని

---

యున్నఁగఁ బెద్దసైన్యముల్; । సారబలోద్ధతిం దొడరి చంపుదుమేని ననేకవర్ష వి। స్తారములందునుం దెగవు; సంక్షయమొందును వాలి యస్మదీ। యోరుచమూసమూహ; మిటులూరక యేటికి నిందుఁ జావఁగన్. (హరి. ఉభా. ౨ ఆ ౧౦౫) వ్రాలుధాతురూపాంతరము వాలు. 'వాలి'యనఁగా యుద్ధమునకు దిగియని యర్థము. యుద్ధమునకుఁగడగి సేనలు క్షయ మొందు ననెడి సముచితమైనయర్థము కవిప్రయుక్తమనఁదగియున్నది. గాణపతసూత్రవివరణకర్తయు నిట్లుదాహరించెను. "లస దగణ్యగుణౌఘ విచిత్రుఁ డమ్మహాత్ము చరితంబులు. ఉత్ఫుల్లలోచనుఁ డా-విష్ణుని మూర్తితో, (హరి. ఉ. ౫ ఆ). భుజాటోపభయంకరుఁ డర్జును కోపానలము (భార. ఉద్యో. ౧ అ)." ఇవి యేకదేశాన్వయోదాహృతులు కావు. ఇందలి "మహాత్ము-విష్ణుని-అర్జును" అనునవి శేష షష్ఠ్యంతములె యనవచ్చును. (౨౬౨ విష). ప్రౌఢవ్యాకర్తయు నిట్టివి యేకదేశాన్వయోదాహృతులని తలంపలేదు. కావుననే వీనిని వేఱుసూత్రముతో సమర్థించెను (ప్రౌఢ. కార. ౨౧ సూ).

పాదోదకాయత్త సిద్ధిఁగాదె. (బసవ. 3 ఆ. ౮౬౨). సీ. ఆ పర్వతాగ్ర హేమైక శృంగంబునా । నమరు జటామకుటాది భాతి । ఆ తుంగశృంగ శిలాపూర్ణ సరసినాఁ బొంగారు...... । ఆ నిమ్నసరసి విహారమరాళికాపం క్తినా...... । ఆ. వె. ఆ మహామరాళికాఁ బర్విన్నా. బొల్చు)......(నన్ని. కు. ౧ ఆ. ౪ ప). క. అనిపలుక సంతసిలి, యా । ఘనవిద్యాకలితుఁడగుచుఁ గౌసల్యానం । దనుఁడు......వెలిఁగె......(భాస్కర. బాల. ౪౧౨ ప). సీ...తే. గీ. అరయ భూమి కుచాగ్రహారాభమైన । శ్రీతెనాల్యగ్రహారనిర్ణేతవు (పాండు. ౧ ఆ. ౪౩). 'అసమానాధికరణసాపేక్షస్య గమకత్వేన సా (స = సమాస) భ్యుపగమా" త్తనుచెప్పుటను (ముగ్ధ. 3౧౨ సూ. శ్రీరామ. వ్యా). 'ఆత్మాదిగ విభక్తిగః' అను నాథర్వణ విభక్తిదళ స్వారస్యమునను బయిరీతిగల "ఆ రథాధిరూఢుఁడు" (అర. ౪ ఆ. ౧౮3). మున్నగు సాధుసమానాధికరణ సమాసస్థలములు లక్షణసమ్మతములు కాకున్నను మహాకవిప్రయుక్తములగుటచే బ్రమితములనకతీరదు.

కావున ద్వి-అచ్చుగాఁ దాఁ జౌదళాబ్జంబు గడచి (బసవ. ౧ ఆ. 3౮ ప.) ద్వి-అల్లవో బసవయ్య ముల్లోకవంద్య (బసవ. ౧ ఆ. ౬౦౨.) మున్నగు సోమనారాధ్య ప్రయుక్తములగు సాపేక్షకర్మధారయకలితములయిన "చౌదళాబ్జ - ముల్లోకవంద్య" ప్రభృతులును బ్రమితములెయనియు నవి బసవపురాణ పీఠికాకర్తగారు తలంచినట్లు (బస. పీ. ౯౨. ౯౭ పు.) వైరిసమాసములని భ్రమింపరాదనియుఁ దెలియనగును. ఇట్టి వింకను నిందుఁగలవు. ద్వి. ముల్లోకనాథుని ముట్టఁగొల్చియును (బసవ. ౨ ఆ. ౨౬౮.) మొన్నఁబల్కించిన ముల్లోకనుతుఁడు (బస. ౪ ఆ. ౯౦.). మఱొకవిధముగు నేకదేశాన్వయము:—ద్వి - కఱకంఠు (టు) శ్రీపాదకమలాంతరంగ (బస. 3 ఆ. 3౧3.) అనుచో "అతనికరతల ద్వయామర్దితములై (అర. ౪ ఆ. ౧౯౨.) నావీరశ్రీప్రభవులు (ఆది. ౮ ఆ. 3౦౧.)" మున్నగు నన్నయాదిప్రయోగముల చొప్పునను లాక్షణిక సమ్మతిచొప్పునను "కఱకంఠు (టు)" అను షష్ఠ్యంత వ్యస్త పదము సిద్ధసమాసగతపదములతో నన్వయించుట సాధువై యుండును. "కఱకంఠ శ్రీపాదకమలాంతరంగ" అను వైరిసమాసచ్ఛందోభంగదోష దూషితపాఠము ముద్రణసంస్కర్తృ ప్రమాదకృతమె కాని సోమనారాధ్య ప్రయుక్తము కాదని తెలియుగునది. పయిరీతిని భట్టారకుఁడే పెక్కుచోట్లఁ బ్రయోగించియుండఁగాఁ దిమ్మకవి - తన నీ నా శబ్దముల స్థలములందుమాత్రమె యేకదేశాన్వయము గలదని వ్రాయుట సరికాదు. క. తన నా నీ యను పదముల । గొన సంస్కృతశబ్దవితతిఁ గూర్చి సమాసం । బొనరింపఁజెల్లుఁ గృతులన్ । ధనపతిసన్మిత్ర కరటివానవశైత్రా.

సీ. తనయశో ౽ శిరదముక్తా సౌధపాళికి, నంబుదాయనము వాతాయనముగ (వసుచరిత్ర) (పర్వల. ౨ ఆ. ౧౭ - ౧౮ ప.). కేతన యీ క్రిందిరీతి నొక్క 'సీ' శబ్దము చోటుమాత్రముచూపుట మఱియు వింత. "క. 'సీ' సంస్కృతంబుతోడ స। మానించును నీ వినూత్నమణి నూపురశ। బ్ధాసక్త చిత్తహంస। త్రాసకరాంబుదము నాఁగఁ దఱుచై యునికిన్ (ఆం. భూ. ౧౩౮ ప.)

అభిన్నస్యాపి సాదే రిత్యాది కుదాహృతులు:—చ...వాఁడు దానవిశిఁ జేసినదెయ్య మెఱింగి.........(ఆది. 3 ఆ. ౧౮౬.) చ...దానముచేసిన తత్ఫలంబు (ఆది. ౧ ఆ. ౧౫.)

కల్ప. ౨౬౬ II వివ:—సమాసము సాధారణముగా నైచ్ఛికము—సుగుణాభిరామునకు రామునకు వందనము = సుగుణాభిరామురామునకు వందనము. కొన్నియెడల సమాసముకల్గదు. ఉదా. సీత జానకి. కొన్నిట సమాసము నిత్యము. ఉదా:...నమస్కరించెను. నమస్కారము. "సర్వ స్సమాసో వికల్పితః......చత్వారో భుజా యస్య తస్మై నమః = చతుర్భుజాయ నమః. నీల ముత్పల మిదమ్=నీలోత్పల మిదమ్......పఞ్చభి ర్గోభిః క్రీతోయ మశ్వః = పఞ్చగు రశ్వః. కృష్ణ మధికృత్య కథా = అధికృష్ణం కథా ఇత్యాది. క్వచిన్నిత్యః - యథాకృష్ణసర్పః. లోహితశాలిః ఇత్యాదౌ సమాసయోగ్యవాక్యం నతిష్ఠతీతి. క్వచిత్ సమాసో న స్యాత్ - తేన - రామో జామ దగ్న్యః, వ్యాసః పారాశర్యః.........తథా చ - నిత్యో ఽనిత్యో వికల్పశ్చ। సమాసః కర్తు రిచ్ఛయేతి ప్రాహుః" (ముగ్ధ. 3౧౭ సూ. దుర్గా. వ్యాఖ్య.) "విభాషా. (౨. ౧. ౧౧.) అధికారోఽయమ్. (దీనినే మహావిభాషాధికారమందురు) తతశ్చ ఉత్తరత్ర సమాసవిధిషు ఏతదనువర్తతే. ఇతిలభ్యతే" (సి. కౌ. బాలమ. ౬౮౫ సూ.)

కల్పతరువు. ౨౬౬ III వివ:—సంస్కృతమందువలెనె తెల్గునందును నలుక్సమాసములును గలవు. "ఇచ్ఛ విభక్త్య న్నిమస్య జే రలిచ" అను చింతామణిసూత్రజ్ఞాపకముచే "చేతాదులకు" లోపములేదు. నాచేతిసొమ్ము - నీతోడిచెలిమి. వానివలనిభయము. నాయందలికరుణ. షష్ఠీ భవే ద్ద్వితీయేత్యాది సూత్రసిద్ధద్వితీయకు లోపములేదు. ఉదా:— రామునిబాణము - గుణములప్రోక - మొ.

బాలవ్యాకరణ సమర్థంబులగు పదంబు లేకపదంబగుట సమాసంబు. ౧.

వివృతి. పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు. పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థమునందు వృత్తి సామర్థ్యము.

౨౬౬ IV వివ.

సంజీవని. ౨౬౬ IV వివ:—సమర్థంబులగు = సామర్థ్యముగల, పదంబులేక పదంబగుట సమాసంబనంబడు. వేర్వేఱుగఁ బ్రసిద్ధములగు నర్థములుగల పదము లేకార్థమునందు వర్తించుట సామర్థ్య మనఁబడును. దీనినె భంగ్యంతరముగ సూరి వచించెను. పృథగ్ఖ్యాతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు. 'రాజు యొక్క+పురుషుఁడు' అని వేర్వేఱుగఁ బ్రసిద్ధంబులగు నర్థంబులుగల యాపదంబులు 'రాజపురుషుఁడు = రాజసంబంధిపురుషుఁడు' అను నేకార్థమును బోధించుట సామర్థ్యము. ఇట్టి సమాసములందలి సామర్థ్య మేకార్థీభావసామర్థ్యమనఁబడును. 'రాముఁడు రావణుని జంపె' ననురీతివాక్యములందలి సామర్థ్యము వ్యపేక్షాలక్షణ సామర్థ్య మనఁబడును.

ప్రౌఢవ్యాకర్త "సమాసమనఁగా సంయోగదశయందుఁ గలిగెడు విభక్తి లోపాత్మకపదస్వరూప సంగ్రహము. ఇది లుక్సమాసవిషయము" అని లక్షణము చూపెను. "పశ్యతోహరుఁడు" మున్నగుచోటులందు విభక్తి లోపరూపసంగ్రహము లేదుగాన నీలక్షణము "అలుక్స"మాసములయెడ సరిపడదని యాతఁడు తలంచెను.

| | |
|---|---|
| నన్నయా | కేవల వికృతిపదై ర్యః। సమాసకం తం బ్రువన్తి |
| థర్వణీయము | వాక్యజ్ఞాః। సంస్కృత వైకృత శబ్దై। ర్మిశ్రసమాసస్స |
| ౨౬౭ వివరణము. | ఏవ విజ్ఞేయః. (ఆం. చిం. ౧౮ కారి. అహో. ౭౭౮ పు.) |

కల్పతరువు ౨౬౭ వివ:—కేవల వికృతిపదైః = అచ్చాంధ్రపదములతోఁ బరస్పరముజరగు, యః = ఏసమాసముగలదో, తమ్ = దానిని, వాక్యజ్ఞాః = వైయాకరణులు, సమాసకమ్ = సమాసకమను సంజ్ఞగలదానినిగ, బ్రువన్తి = వచించుచున్నారు. ఉదా:—౧. ముక్కంటి - ౨. అరపదిమోముల వేలుపు - మొ. సంస్కృత వైకృతశబ్దైః = సాంస్కృతికాచ్ఛికముల మిశ్రణముగాజరగు సమాసమేది గలదో, సఏవ = అదియే, మిశ్రసమాసః = మిశ్రసమాసమని, విజ్ఞేయః = తెలియఁ దగినది. ఇంక కేవల సంస్కృతపదములతోఁ జరగుసమాసము సాంస్కృతికమని యర్థసిద్ధ మగుచున్నది. మిశ్రసమాసము రెండువిధములుగ నున్నది. ౧. శుద్ధ సంస్కృతవిభక్త్యంత మాచ్ఛికపదముతో సమసించునది. ఇది కవిప్రయుక్తరీతి గలది మాత్రమె సాధువు. ఉదా:—సిద్ధ+అన్న = సిద్ధన్న = సిద్ధన - మొ. ౨. తత్సమ పద మాచ్ఛికముతో సమసించునది. తెల్లయశ్వము. సరసపుమాట. ఇవియెల్ల సాధ్యసమాసములె. ఇంక సాంస్కృతికమును రెండువిధములె. ౧. సంస్కృత

వ్యాకరణముచొప్పున సంస్కృతముంచె సిద్ధించునది. ఇయ్యది సిద్ధసమాసమనc బడును. ౨. తెలుఁగువ్యాకరణపు విధులచొప్పున సాధింపcదగినది. ఇది 'సాధ్య సాంస్కృతికము' అనcబడును. ఉదా:—సాంస్కృతికము - సిద్ధము:— రాజపురుషుcడు - సరసవచనము - మొ. సాంస్కృతికము సాధ్యము:—రాజపురుషుcడు - సరసపువచనము - మొ.

సాంస్కృతికాచ్ఛిక మిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు. ౨.

బాలవ్యాకరణ వివరణము ౨౬౭ I విషయము.

సాంస్కృతికంబని యాచ్ఛికంబని మిశ్రంబని సమాసంబు త్రివిధంబు. అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు. కేవల సంస్కృతశబ్దంబుల సమాసంబు సిద్ధంబు నాcబడు. రాజాజ్ఞ. తటాకోదకము. లక్ష్మీవల్లభుడు. సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబు నాcబడు. రాజునాజ్ఞ - తటాకంబునుదకము, లక్ష్మీవల్లభుcడు. తక్కిన తెనుcగుల సమాసం బాచ్ఛికం బనంబడు. తేనియానతి - చెఱువునీరు - సిరిచెలువుcడు. ఉభయంబులు గూడినది మిశ్రం బనంబడు. రాజుముదల - చెఱువునుదకము. సిరివల్లభుcడు.

సంజీవని. ౨౬౭ I విష:—సాంస్కృతికేత్యాది వాక్యమునకు "సాంస్కృతికం బని........."అను వాక్యముతో సూరిగారే వివరణము వ్రాసిరి. కేవల సంస్కృత పదంబులనcగా సంస్కృతవిభక్త్యంత శబ్దములని యర్థము. కావున "రాజుయొక్క+ ఆజ్ఞ, రాజునాజ్ఞ" మున్నగునవి సిద్ధసమాసములు కావనియు, "రాజ్ఞః+ఆజ్ఞా = రాజాజ్ఞా" (దీనితత్సమము రాజాజ్ఞ) అనునదిమున్నగురీతివే సిద్ధము లనిపించుకొను ననియుc దాత్పర్యము. అర్థభేదము లేకున్నను పదముల భేదములచే సిద్ధత్వ సాధ్యత్వ సాంస్కృతికత్వాదిభేదములు కల్గుటను సూరిగారు నిపుణముగా నుదాహరించిరి. 'రాజాజ్ఞ - తటాకోదకము - లక్ష్మీవల్లభుcడు' అనునవి సంస్కృతవిభక్త్యంత విగ్రహములచే నేర్పడినవిగాన సిద్ధసమాసములని భావము - సమాసార్థబోధక వాక్యము విగ్రహమనcబడును. రాజ్ఞః (రాజుయొక్క) ఆజ్ఞా (ఆజ్ఞ) 'రాజాజ్ఞా' ఇది సిద్ధసమాసరూపము. దీని తత్సమరూపము 'రాజాజ్ఞ' అనునది. వీని సాధ్య సమాసరూపములు 'రాజునాజ్ఞ' మున్నగునవి. ఇవి యాంధ్రవిభక్త్యంతములయి

నను (రాజుయొక్క+ఆజ్ఞ) సంస్కృతశబ్దములై యగుటచే సాంస్కృతికములే. 'తేనియొక్క+ఆనతి = తేనియానతి' మున్నగునవి మూఁడును గేవలాచ్ఛికపద ఘటితములగుటచే నాచ్ఛికసమాసము లనిపించుకొనును. ఇంక 'రాజుయొక్క ముదల' అను రీతి విగ్రహములుగల 'రాజుముదల' మున్నగు మూఁడును సంస్కృతాచ్ఛిక మిశ్రితములగుటచే నవి మిశ్రసమాసము లనఁబడును. సూరి చింతామణి వచించిన 'సమాసక'మను నాచ్ఛికసమాససంజ్ఞను వివరింపలేదు. విభక్తిలోపాదిక విషయమున సమాసకములకును సమాసములకునుగల కొన్ని భేదములను సూరి గ్రహించినట్లగపడదు. ఆవిషయములు ముప్పుందు విశదీకరింపఁబడును. "సాధ్యములుగాని మిశ్రములుగాని తత్పురుషకర్మధారయములై యయ్యేడిఁగాని యితరములుగాఁజాలవు" (బా. సా. వే. ౩౧౮ పు.) అను పేటికావ్యాఖ్య సరికాదు. మల్లోకములు - మున్నగు ద్విగసమాసములు సయితము మిశ్రములగు సాధ్యములగుటలో విప్రతిపత్తి యేమున్నది? మఱియు నితఁడు 'సాధ్యములుగాని మిశ్రములుగాని' అనుట సరికాదు. మిశ్రములు సాధ్యము లేకదా? ఇంతియకాక సాధ్యములు "ముక్కంటి - తల్లిదండ్రులు" అనునవి వరుసగా బహువ్రీహి ద్వంద్వము నయియున్నవిగదా. తెలుఁగుపదముల విగ్రహమునుండి యేర్పడు సమాసము సాధ్యసమాసమునంబడును.

సన్నయా
౨౬౮ విషయము.

> ద్విగు కర్మధారయౌ త, త్పురుష ద్వన్ద్వౌ బహు
> వ్రీహిః। అన్యేచ కేచి దుపమా; నోత్తర పదలోప రూప
> కాఖ్యాద్యాః. పరిదృశ్య ఇహ.........(ఆం. చిం.
> హలం. ౧౬ - ౧౭ కా.) (అహో ౮౩౧).
> పూర్వత్వ మపరత్వం స్యా । న్నామ్నాం నేతు
> ప్రయోగతః. (వికృ. హలం. ౨౨ కా. అహో.
> ౮౮౮ పుట.)

కల్పతరువు. ౨౬౮ విషః—ద్విగు కర్మధారయౌ = ద్విగుసమాసమును గర్మధారయ సమాసమును, తత్పురుష ద్వన్ద్వౌ = తత్పురుషసమాసమును, ద్వన్ద్వసమాసమును, బహువ్రీహిః = బహువ్రీహిసమాసమును, అన్యే = ఇతరములైన, సంస్కృతభాషా ప్రసిద్ధములగు, ఉపమానోత్తరపదలోపరూప కాఖ్యాద్యాః = 'ఉపమితము, ఉత్తరపదలోపము, రూపకము' అను పేర్లుగలవి, ఆద్యాః = మొదలగు, కేచిత్ = మఱికొన్ని, సమాసములును, ఇహచ = ఈ యాంధ్రభాషయందును, పరిదృశ్యాః = కనఁబడుచున్నవి. సిద్ధసమాసములెట్లును వెలయుచునే

యుండును. 'ఇహచ' అను దళము స్వారస్యముచే నాయాసమాసముల లక్షణములు సంస్కృతవ్యాకరణోక్తములె ప్రాయికముగా నిందును గ్రాహ్యములని విశదమగుచున్నది. ద్విగుప్రభృతులను జెప్పి యవ్యయీభావమును వచింపకుండుటచేఁ దెలుఁగున నవ్యయీభావసమాసము లేదని విశదమగుచున్నది. అట్లయినను సిద్ధసమాసములద్వారమున దానికిఁ దెల్గున బ్రయోగము గలదు. ఉదా:—ప్రతిదినము వచ్చును. (దినేదినే = ప్రతిదినమ్.)

సేతు = సమాసమందు, నామ్నామ్ = శబ్దములకు, ప్రయోగతః = కవిప్రయోగానుసారముగ, పూర్వత్వమ్ = సమాసపూర్వావయవమగుటయు, అపరత్వమ్ = సమాసోత్తరావయవమగుటయు, స్యాత్ = అగును. సంస్కృతమందె పూర్వనిపాతాదిశాస్త్ర మనిత్యమని యంగీకరింపఁబడెనుగాన నట్లె యాంధ్రిక సమాసములందును సమాసపదముల పౌర్వాపర్యము కవిప్రయోగానుసారముగ నెన్నవలెను. (చూ. అ౬౹ా VII విమ.)

కల్ప. అ౬౹ా I:—పయిరీతిని ద్విగుప్రభృతిసమాసములు తెల్గునఁ గలవనిమాత్రమె చెప్పఁబడెనుగాని యా ద్విగుప్రభృతుల లక్షణములు నన్నయాథర్వణీయమున వివరింపఁబడలేదు. "శాస్త్ర మపౌరుష మాద్యమ్........" అను చింతామణి కారికచొప్పున నట్టిలక్షణములు సంస్కృతవ్యాకరణమునుండి తెలిసికొనవలసినదే యని నన్నయాథర్వణుల యాశయము. కావున వానిలక్షణముల నిట దిఙ్మాత్రముగా వివరించుచున్నాను.

"కృత్తద్ధిత సమాసైకశేష సనాద్యన్తధాతురూపాః పఞ్చ వృత్తయః పరార్థాభిధానం వృత్తిః। వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః. సద్వివిధా:—లౌకికోఽలౌకికశ్చ. పరినిష్ఠితత్వా త్సాధు ర్లౌకికః। ప్రయోగానర్హోఽసాధు రలౌకికః- యథా - రాజ్ఞః పురుషః (ఇది లౌకికవిగ్రహము). రాజన్+జస్+పురుష+సు. ఇతి (ఇది యలౌకికవిగ్రహము) - అవిగ్రహో నిత్యసమాసః - అస్వపదవిగ్రహోవా" (సి. కౌ. ౯౭౯ సూత్రము తరువాయి. సర్వసమాసశేషప్రకరణము). "విగ్రహవాక్యావయవపదార్థేభ్యః పరః అన్యః యోయం విశిష్టైకార్థః తత్ ప్రతిపాదికా వృత్తిరిత్యర్థః. (బాలమ. ౪౧౭ పుట.) వృత్త్యవయవ పదార్థములకంటె భిన్నమగు నర్థముతోఁ గూడిన స్వార్థమును (వృత్త్యవయవ పదార్థమును) బోధించునది వృత్తియని తాత్పర్యము. "కృద్వృత్తిః...భజన్త ఇతిభక్తాః......తద్ధితవృత్తిః......అదితేర పత్యాని పుమాంసః = ఆదితేయాః......(సమాసవృత్తి ముందు వివరింపఁబడును) సనాద్యన్తధాతువృత్తిః...... వైరమాచ రతివైరాయతే.

ఏకశేషవృత్తిః......మాతాచ పితాచ = పితరౌ." (సమాస కుసుమావళి.)
కృద్వృత్తియందు "భజ్+క్త" భక్త అను ప్రాతిపదికమేర్పడును. తద్ధితవృత్తి యందు "అదితి+జస్+ఏయ=ఆదితేయ" అనుచో "సుపో ధాతు ప్రాతిపదికయోః" (సి. కౌ. ౬౫౦ సూ.) అనుచోప్పున 'జస్' అనుసుప్పు లోపించును. సనాద్యన్త ధాతువృత్తియందు "వైర+అమ్+య" అనుచో "అమ్ము" (ద్వితీయైకవచనము) "సుపోధాతు ప్రాతిపదికయోః" అనుచొప్పున లోపించును.

కృదాదివృత్తు లయిదిటియందును, వృత్త్యవయవశబ్దములలోఁ బ్రధానశబ్దము గాని యప్రధానశబ్దముగాని యన్యతరశబ్దార్థసంవలితమగు స్వార్థమును బోధించు చుండుననియు గ్రహింపనగును. రాజపురుషశబ్దములలో నొక్కటే యితరశబ్దార్థ సంవలితస్వార్థమును బోధించునని సంప్రదాయము. శబ్దసముదాయరూప సమాస మందలి యభిధాశక్తియు వృత్తియనఁబడును. అట్టిశక్తికి లేదా వృత్తి కాశ్రయ మగుటచేత సమాసము వృత్తి యనఁబడుచున్నది. కాన వృత్త్యాశ్రయము సమాస మని ఫలితార్థము.

సమాసవృత్తి యింక వివరింపఁబడుచున్నది. "సమాస శ్చతుర్ధేతి ప్రాయోవాదః. అవ్యయీభావ తత్పురుష బహువ్రీహి ద్వన్ద్వాధికార బహిర్భూతానామపి 'సహసుపా' ఇతి (సి. కౌ. ౬౪౯ సూ.) విధానాత్. పూర్వ పదార్థప్రధానోఽవ్యయీ భావః. ఉత్తరపదార్థప్రధాన స్తత్పురుషః; అన్య పదార్థప్రధానో బహువ్రీహిః. ఉభయపదార్థప్రధానో ద్వన్ద్వః." ఇత్యపి ప్రాయో వాదః = ప్రాయోఽభిప్రాయః. సూపప్రతి - ఉన్మత్తగఙ్గ సూపస్య లేశః = సూప ప్రతి, (సి. కౌ. ౬౬౩ సూ.) ఉన్మత్తాగఙ్గాయస్మిన్ పదేశః = ఉన్మత్తగఙ్గమ్ (సి. కౌ. ౬౭౪ సూ.) మిత్యాద్యవ్యయీభావే, అతిమాలాదౌ తత్పురుషే, ద్విత్రాః (ద్వౌవాత్రయోవా) ఇత్యాది బహువ్రీహౌ, దన్తోష్ఠమి (దన్తానామోష్ఠయోస్స మాహారః) త్యాదిద్వన్ద్వేచాఽభావాత్. (పూర్వపదార్థప్రాధాన్యాది లక్షణములు లేవనిభావము) తత్పురుషవిశేషఃకర్మధారయః - తద్విశేషోద్విగుః - అనేకపదత్వం ద్వన్ద్వ బహువ్రీహ్యోరేవ. తత్పురుషస్య క్వచిదేవేత్యుక్తమ్. (సి. కౌ. బాలదు. ౪౧౮ పుట.) (ద్వే అహనీజాతస్య = ద్వ్యహజాతః - ఇట్టివి త్రిపద తత్పురుషము లగుదు.)

అవ్యయీ భావాదులు నాలుగే సమాసములగుటయుఁ బూర్వపదార్థ ప్రధానమవ్యయీ భావమనునది మొదలగువాని లక్షణములును బ్రాయోభి ప్రాయమునఁ బెద్దలచేఁజెప్పఁబడినవనియు నవి విమర్శసహములు కావనియు భట్టోజీ

దీక్షితులవారు వచించిరి. అట్లయినను నిందు సంక్షేపముగాఁ దెలుపఁదలంచి యుండుటచేత నిట నట్టి ప్రాయోవాదమె చూపఁబడుచున్నది. ఇటఁ బ్రాధాన్య మనఁగాఁ గ్రియాన్వయిత్వమని యెఱుంగునది. "యథాశక్తి వచించెను" అను నవ్యయీభావమునందుఁ బూర్వపదీభూత యథాశబ్దార్థము క్రియతో నన్వయించుచున్నది. కర్మధారయమును దదంతర్భూతములగు ద్విగువును దత్పురుషాంత ర్భూతములె కావున నమ్మూఁటియందును—"రాజపురుషుఁడు - నీలోత్పలము - త్రిలోకములు"అను మూఁడిటియందును—నుత్తరపదము క్రియతో నన్వయించును. ఉదా:—తత్పు - రాజపురుషుఁడు వచ్చెను. కర్మ - నీలోత్పలమును జూడుము. ద్విగు - త్రిలోకములు భీతిల్లెను - మొ. వ్యధికరణము తత్పురుషము. రాజ త్వము రాజునందును బురుషత్వము పురుషునందును వర్తిల్లునుగాన నివి వ్యధికరణ సమాసము - కర్మధారయము సమానాధికరణము. 'నీలోత్పలము' అనుచో నీల త్వమును నుత్పలత్వమును నుత్పలమునందే వర్తిల్లునుగాన నిది సమానాధికరణ సమాసము. 'త్రిలోకములు' అనుచోఁ ద్రిత్వమును లోకత్వమును లోకమందే వర్తిల్లునుగాన నిదియు సమానాధికరణ సమాసమె. సంఖ్యావాచకము మొదటఁ గల్గియుండుట కర్మధారయముకన్న నిందలి విశేషము. బహువ్రీహియందు సమాస పదములలో నొకదానికిని బ్రాధాన్యముండదు. 'పీతాంబరుఁడు వచ్చెను' అనుచోఁ బచ్చని యంబరముగల 'విష్ణువు' అనునదే క్రియతో నన్వయించుచున్నది ద్వంద్వ సమాసమున సమాసపదములన్నియుఁ గ్రియతో నన్వయించును. 'బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు నమస్కరింతును' అనుచో మూఁడుపదములును గ్రియతో నన్వయించుచున్నవి. "హరిహరా విత్యాది ద్వన్ద్వేతు పరస్పరసాహిత్యమే వాన్వ యః" (ముగ్ధ. 3౧౭ దుర్గా. వ్యా.) అనుచొప్పున సమాసగతపదార్థముల సాహి త్యమే ద్వంద్వసమాసమందలి యేకార్థీభావలక్షణసామర్థ్యమని గ్రహింపనగును.

"ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్ (౧. ౨. ౪3.) సమాసశాస్త్రే ప్రథ మానిర్దిష్ట ముపసర్జనసంజ్ఞం స్యాత్. ఉపసర్జనం పూర్వమ్. (౨. ౨. 30) సమాసే ఉపసర్జనం ప్రాక్ ప్రయోజ్యమ్" (సి. కౌ. ౬౫3 - ౬౫౪ సూ.). సమాసవిధాయక సూత్రములలోఁ బ్రథమావిభక్తితో నిర్దేశింపఁబడినది సమాసమునఁ బూర్వపద ముగాఁ బ్రయోగింపఁదగును. "విశేషణం విశేష్యేణ బహులమ్" (౨. ౧. ౫౦) అనుచొప్పున నగు నీలోత్పలాదిస్థలములలో విశేషణము సమాసపూర్వావయవ మగుచున్నదిగదా.

"సుపో ధాతు ప్రాతిపదికయోః. (౨. ౪. ౭౧) ఏతయో రవయవస్య సుపో లుక్స్యాత్." (సి. కౌ. సమా. ౬౫౦ సూ.) అనుచొప్పున ధాతువునకుఁగాని

ప్రాతిపదికమునకుఁగాని యవయవములగు సుబ్విభక్తులు లోపించును. "రాజన్+జస్+పురుష+సు" అను నలౌకిక ప్రక్రియావాక్యమున నేకార్థీభావసామర్థ్యవివక్షచే సమాసము సంభవింపఁగా నట్టి సమాసరూపమగు (కృత్తద్ధిత సమాసాశ్చ - అనుచెప్పున) ప్రాతిపదికమున కవయవములగు సుబ్విభక్తులు లోపించునని వైయాకరణసంప్రదాయము. అట్లులోపింపఁగా 'రాజపురుష' అను ప్రాతిపదికము నిల్చును. "కృత్తద్ధితసమాసాశ్చ(౧-౨-౪౬) కృత్తద్ధితాన్తా సమాసాశ్చ ప్రాతిపదికసంజ్ఞాః స్యుః (సి. కౌ. ౧౭౯ సూ.) అను సూత్రముచెప్పున "రాజన్+జస్+పురుష+సు" అను సమాసమునకే ప్రాతిపదికసంజ్ఞ కలుగునని గ్రహింపనగును.'ఆత్మనః పుత్రమిచ్ఛతి'అనునది మున్నగు నామధాతుస్థలములందు"పుత్ర+అమ్+య"అను రీతికలచోటులందు ధాత్వవయవమగు సుప్పులోపించి 'పుత్రీయతి' మున్నగురూపములు సిద్ధించును. "స్వౌజసమౌట్ఛష్టాభ్యాంభిస్ ఙేభ్యాంభ్యస్ ఙసిభ్యాంభ్యస్ ఙసోసాం ఙ్యోస్సుప్" (౪.౧. ౨) (సి. కౌ. ౧౮౩ సూ.) అను సూత్రముచెప్పున నట్టి సమాసాదిరూపప్రాతిపదికముపై సుబ్విభక్తులు నిల్చునని యెఱుంగునది.

## అవ్యయీభావము

కల్పతరు. ఆంధ్ర II విభ:—"అవ్యయం విభక్తి సమీప సమృద్ధి........ (౨. ౧. ౬) అవ్యయం సమర్థేన సహ సమస్యతే. సోఽవ్యయీభావః." (సి. కౌ. ౬౫౨) అను సూత్రముచెప్పున సప్తమీవిభక్త్యర్థమును, సమీప సాదృశ్య వీప్సా పర్యంతాద్యర్థములును, గలయవ్యయము సామర్థ్యముగల పదముతో సమసించును. అట్టి సమాస మవ్యయీభావ మనిపించుకొనును. అందుఁ బ్రథమానిర్దిష్టమగుటం జేసి యవ్యయము సమాసమునఁ బూర్వావయవమగును. "దినేదినే = ప్రతిదినమ్= ప్రతిదినము" దినదినమందును నని యర్థము. "అవ్యయీభావశ్చ (౨. ౪. ౧౮) అయం నపుసకమ్ స్యాత్" (సి. కౌ. ౬౫౯ సూ.) అనుచెప్పున నవ్య యీభావ సమాసము నపుంసకమగును. "అవ్య యీభావశ్చ" (౧. ౧. ౪౧) (సి. కౌ. ౪౫౧ సూ.) "అవ్యయసంజ్ఞః స్యాది తి శేషః" (బాలమ వ్యా.) అను సూత్రము చెప్పున నవ్యయీభావసమాస మవ్యయ మె యగును గాన "అవ్యయా దాప్ సుపః (౨.౪.౮౨) అవ్యయా ద్విహిత స్యాపః సుపశ్చ లుక్ స్యాత్" (సి.కౌ.౪౫౨ సూ.) అను సూత్రముచెప్పున నవ్యయముమీఁది సుబ్విభక్తులు లోపించుటంజేసి దానికి నపుంసకత్వవిధాన మేలయని శంకింపరాదు. "అధిగోపమ్" మున్నగుస్థలములందుఁ బ్రాతిపదికదీర్ఘమునకు హ్రస్వమువచ్చు ప్రయోజనముగలదుగదా. (సి. కౌ. ౬౫౯ సూ.) "అవ్యయీభావశ్చ. (౨. ౪. ౧౮.) అయం నపుంసకంస్యాత్" "హ్రస్వో

నపుంసకే ప్రాతిపదికస్య." (సి. కౌ. ౩౧౮ సూ.) (గోపాశబ్దము 'ఆ' కారాంతము - విశ్వపా శబ్దమువంటిది.) అనుచొప్పున హ్రస్వమయ్యెను.

అవ్యయీభావమందు హ్రస్వమువచ్చెడి వేఱొకస్థలము:—"దిశయోర్మధ్యే= అపదిశమ్" = అపదిశము = రెండుదిక్కుల నడిమిభాగము. విదిక్కనియర్థము. అపదిశమ్మనుచో "గోస్త్రియో రుపసర్జనస్య. (౧. ౨. ౪౮.) ఉపసర్జనం యో గోశబ్దః స్త్రీప్రత్యయాన్తంచ తదన్తస్య ప్రాతిపదికస్య హ్రస్వః స్యాత్" (సి. కౌ. ౯౫౬ సూ.) అను సూత్రముచొప్పున 'దిశా' శబ్దమునకు హ్రస్వము వచ్చును. (విస్తర.) ఇటమధ్యార్థకమగు "అప" అను నవ్యయము సమసించినది.

ఈయరీతి నవ్యయములగు నవ్యయీభావసమాసములు తత్పురుషములగునపుడు వానిపై మరలఁ దెనుఁగువిభక్తులు నిల్చుటయుఁ గలదు. (౧౧౨ విష.) నాయథాశక్తిఁజేసి. (సభా. ౧ ఆ. ౫౭.) మొ. అవ్యయీభావసమాసము తుదిని 'అ' ప్రత్యయము సమాసాన్త మగును. ఉదా:—"అక్ష్ణోః సమీపమ్=సమక్షమ్ (సమ్ + అక్షిన్ + అ) సమక్షము (కన్నులయెదుట). నీసమక్షమున మొదలగురీతి ప్రయోగముల నరయునది, సాధ్యసమాసము లవ్యయీభావము లుండనే యుండవు. సిద్ధసమాసములందును మహాకవి ప్రయుక్తములే ప్రయోజ్యములని యెఱుంగనగును.

కల్పతరు ౨౬౮ III తత్పురుషము. ఉత్తరపదము క్రియతో నన్వయించుచుండఁగాఁ బూర్వపదము విభక్త్యన్తరుగుచు నుత్తరపదముతో నన్వయించుట

---

విస్తర. ౨౬౮ II విష:—ఇట నుపసర్జనమనఁగా సాధారణముగా లోకప్రసిద్ధమయిన యప్రధానరూపము కాదనియు విగ్రహవాక్యమున నియతవిభక్తి గలది యుపసర్జన మనఁబడుననియుఁ బాణినీయుల సిద్ధాంతము. (చూ. "ఏకవిభక్తిచాపూర్వనిపాతే. (౧. ౨. ౪౪.) విగ్రహే య న్నియత విభక్తికం త దుపసర్జనసంజ్ఞం స్యాత్ నతు తస్య పూర్వనిపాతః." సి. కౌ. ౯౫౫ సూ.) బాల. వ్యాఖ్య:—"ప్రకృతేచ దిశయో ర్మధ్యః, మధ్యం మధ్యేవేత్యాది విగ్రహవాక్యేషు దిశాశబ్దస్య నియతవిభక్తికత్వాత్ ...". 'దిశయోర్మధ్యే' అనుచో దిశాశబ్దము నియతషష్ఠ్యంతముగానే నిల్చును. కాని యీనిర్వచనముసైతము లోకసాధారణనిర్వచనమునకు సాధారణముగా సరిపడుచునేయుండును. ముగ్ధబోధవ్యాకరణమున నిట "అప్రధాన"రూపమెయని సూత్రింపఁబడెను. "గవా బాదేః స్వోన్తే గౌణ్యేఽనీయసః. (వృత్తి) అన్తే స్థితస్యగోః, ఆప-ఈప - ఊపశ్చ స్వః (హ్రస్వః) స్యాత. అప్రధానత్వేసతి - నత్వీయసః" (ముగ్ధ. 330 సూ.)

సాధారణముగా నిందు సంభవించుచుండును. ఇందుఁ బూర్వోత్తరపదార్థములకు సామానాధికరణ్య ముండదు. కాన దీనిని వ్యధికరణసమాస మందురు. రాజపురుషుఁడు వచ్చుచున్నాఁడు. ఇట 'రాజుయొక్క పురుషుఁడు' అన్నది షష్ఠీతత్పురుష (లౌకిక) విగ్రహము. రాజత్వము రాజునందును బురుషత్వము పురుషునందునే యుండును. కావున రాజత్వపురుషత్వములు సమానాధికరణములు కావు. విభిన్నాధికరణములు.

"ద్వితీయా శ్రితాతీత పతిత గతాత్యస్త ప్రాప్తాపన్నైః (౨-౧-౨౪) ...... ద్వితీయాన్తం శ్రితాదిప్రకృతికైః సుబన్తైః సహ వా సమస్యతే. కృష్ణం శ్రితః=కృష్ణశ్రితః (కృష్ణు నాశ్రయించినవాఁడు). దుఃఖ మతీతో దుఃఖాతీతః=(దుఃఖము నతిక్రమించినవాఁడు)........." (సి. కౌ. సమా. ౬౮౬ సూ.) సమాసవిధాయకసూత్రమున శ్రితాది శబ్దములు తృతీయాంతములుగ నుపదేశింపఁబడినవిగాన నవి సమాసమున నుత్తరపదములుగ నిల్చును. ద్వితీయాంతము సమాస పూర్వపదమై యుండును. ఇట్లె యంతటను బూర్వోత్తరస్థితి నరయుచుండునది. ఇంకను నీవిషయమునఁ బెక్కు సూత్రములున్నవి. విస్తరభీతి నొక్కొకటిమాత్రమె చూపెదను.

'పూర్వ సదృశ సమోనార్థ కలహ నిపుణ మిశ్ర శ్లక్ష్ణైః" (౨-౧-౩౧) తృతీయాన్తమేతైఃప్రాగ్వత్. మాసపూర్వః (మాసముచేఁ బూర్వుఁడు) 'మాసేన + పూర్వః' అని విగ్రహము). మాతృసదృశః, (మాత్రా + సదృశః = తల్లితో సదృశుఁడు)" "అవరస్యోపసంఖ్యానమ్ (వార్తి). మాసేన అవరో మాసావరః = (నెలచేతఁ జిన్నవాఁడు) (సి. కౌ. సమా. ౬౯౩ సూ). ఇచట కారకసూత్రములచేఁ గొన్నియెడలఁ దృతీయకుఁ బ్రాప్తి లేకున్నను నీసూత్రవిధానమునఁ దృతీయ వచ్చును. మాసపూర్వుఁడు మొ. "అన్నేన వ్యఞ్జనమ్ (౨-౧-౩౪) సంస్కారద్రవ్యవాచకం తృతీయాన్తమన్నేన ప్రాగ్వత్. దధ్నా + ఓదనః = (దధి + ఓదన) దధ్యోదనః (దధ్నా = పెరుఁగుచేతఁ దడుపఁబడిన, ఓదనః = అన్నము) ఇహాన్తర్భూతోపసేకక్రియాద్వారా సామర్థ్యమ్"=(దధ్యోదనములకు నంతర్భూతమగు నుపసేకక్రియ మూలమున నేకార్థీభావసామర్థ్యమును గ్రహింపవలెను). (సి.కౌ. ౬౯౬ సూ.)

"చతుర్థీ తదర్థార్థ బలి హిత సుఖ రక్షితైః(౨-౧-౩౬)చతుర్థ్యన్తార్థాయ యత్ తద్వాచినా, అర్థాదిభిశ్చ చతుర్థ్యన్తం వా ప్రాగ్వత్......యూపాయదారుః = యూపదారుః" (యూపస్తంభమునకై యగుదారువు). (సి కౌ. ౬౯౮ సూ.) ఇచట యూపము కొఱకగు దూలమని యర్థము. సూత్రమున బలి రక్షితశబ్దముల పృథగ్గ్రహణజ్ఞాపనముచే ('భూతేభ్యో+బలిః'=భూతములకొఱకు బలి, బల్కి, తదర్థార్థమె

గదా). తదర్థశబ్దమునఁ బ్రకృతివికృతిభావమును గ్రహింపవలయును. యూపము వికృతి - దారువు ప్రకృతి. ఇట్టి జ్ఞాపకముచేత 'రన్ధనాయస్థాలీ' (వంటకొఱకగు గిన్నె యనుచోఁ బ్రకృతి వికృతిభావము లేమింజేసి చతుర్థీతత్పురుషసమాసము కల్గ నేరదు. బలిరక్షితశబ్దములకుఁ బృథగ్విధానముచేత సమాసము గల్గును—'భూతే భ్యోబలిః = భూత బలిః' (భూతములకొఱకు బలి) మొ. "అర్థేన నిత్యసమాసో విశేష్యలిఙ్గతా చేతి వక్తవ్యమ్" (సి. కౌ. వార్తి. ౬౯౪ సూ.). చతుర్థీత్యాదిసూత్ర ములోని 'అర్థ' శబ్దముతోడి సమాసము నిత్యము - మహావిభాష దీనియందు వర్తిం పదు. నిత్యసమాసములందలి విగ్రహము 'అస్వపదము'. అనఁగా సమాసగతపద ములకన్న భిన్నమైనపదములును విగ్రహమున నిలుచును. మఱియు నిందు విశేష్య లింగము వర్తిల్లును. అనఁగా "పరవల్లిఙ్గం ద్వన్ద్వ తత్పురుషయోః (౨-౪ ౨౬) ఏతయోః పరపదస్యైవ లిఙ్గం స్యాత్" అనుచొప్పునఁ దత్పురుషసమాసమున నుత్తర పదలింగమె వర్తిల్లునన్న నియమముచొప్పున,నర్థశబ్దముతోడి సమాసమున నుత్తరపదీ భూతార్థశబ్దముయొక్క పుంలింగము నిలువదనియు విశేష్యలింగమె కల్గుననియు భావము. 'ద్విజాయ + అయమ్ = ద్విజార్థః సూపః' = (పప్పు) 'ద్విజాయ + ఇదమ్= ద్విజార్థమ్ పయః' = (పాలు) ఇచటఁ బయశ్శబ్ద నపుంసకత్వమె యర్థశబ్దమునకుఁ గల్గినది.

"పఞ్చమీ భయేన (౨ - ౧-౩౭)" పఞ్చమ్యంతము భయశబ్దముతో ననఁగా "భయ భీత భీతి భీ భిరితి వాచ్య" మ్మనుచొప్పున భయ - భీత - భీతి - భీశబ్దములతో సమసించు నని యర్థము. 'చోరాత్ + భయమ్=చోరభయమ్.' (సి. కౌ. ౬౯౯ సూ. (ఇట్లె చోరభీతి మొ.). "అపేతా పోఢ - ముక్త-పతితాపత్రస్తై రల్పశః (౨-౧-౩౮) (అపేతాదిశబ్దములతోఁ బంచమ్యంతములు కొన్నిమాత్రమె సమసించును) సుఖాత్ + అపేతః = సుఖాపేతః" సుఖమునుండి తొలఁగినవాఁడు. కొన్నిపంచమ్యంతము లనుటచేతఁ బ్రాసాదపతితుఁడను సమాసము లేదు. (సి. కౌ. సమా. ౭౦౦ సూ.)

"షష్ఠీ"(౨-౨-౮)"షష్ఠ్యన్తం సుబన్తేన సమస్యతే, సతత్పురుష ఇత్యర్థః. రాజ పురుష ఇతి రాజన్+ఙస్+పురుష+సు-ఇత్యలౌకికవిగ్రహవాక్యే సమాసేసతి సుప్ లుకి అన్తర్వర్తినీం విభక్తిం ప్రత్యయలక్షణేన ఆశ్రిత్య నలోపః (నకారలోపము)" (సి. కౌ. ౭౦౨ సూ. బాలమ.) అని షష్ఠీతత్పురుషవిధి. "పూర్వాపరాధరోత్తర మేక దేశినైకాధికరణే. అవయ వినాసహ పూర్వాదయః సమస్యన్తే. ఏకత్వసంఖ్యా విశిష్టశ్చే దవయవీ. షష్ఠీసమాసాపవాదః-పూర్వం + కాయస్య=పూర్వకాయః..." "సర్వోప్యేకదేశో౽హ్నా సమస్యతే."...మధ్యాహ్నః (అహ్నోమధ్యమ్). కేచిత్తు

సహ్యైకదేశః కాలేన సమస్యతే-నత్వహ్నైవ...మధ్యరాత్రః (మధ్యం రాత్రేః)" (సి. కౌ. ౭౧౨ సూ.). ఏకత్వసంఖ్యావిశిష్టరుగు నవయవితో పూర్వాదులు సమసించును. పూర్వకాయము = శరీరపూర్వభాగమని యర్థము. 'అహన్' శబ్దముతో సమస్తములగు నేకదేశవాచకములు సమసించును. కొందఱు 'అహన్' శబ్దముతో ననేల? కాలవాచకముతో నేకదేశవాచి సమసించు నందురు. మధ్యాహ్నము = అహముయొక్క మధ్యభాగము కాలమునకు:—మధ్యరాత్రము = రాత్రియొక్క మధ్యభాగము. ఈయేకదేశిసమాసము షష్ఠీసమాసమున కపవాద మనఁగా నిందు షష్ఠ్యంత ముత్తరపదమై యుండును. ప్రథమాంతమగు నేకదేశవాచకము సమాస పూర్వపదమై యుండును. ఇట్లగుటచే నిది ప్రథమాతత్పురుషమనియు 'కృష్ణాశ్రితుఁడు' మున్నగునవి ద్వితీయాదితత్పురుషములనియు సమాస కుసుమావళీకారుఁడు వ్యవహరించెను. "తత్పురుషోఽష్టధోఽభూ। త్ప్రథమావిభక్తి సఙ్ఖ్య కృత్తై ర్భేదైః...ప్రథమా తత్పురుషః...ఉత్తరః + కాయస్య = ఉత్తరకాయః..." (సమాసకుసుమావళి ౧౦౪ పుట.) ఇందు సమాసపూర్వపదము క్రియతో నన్వయించును. కావుననే "పూర్వపదార్థ ప్రధానోఽవ్యయీభావః - ఉత్తరపదార్థ ప్రధానస్తత్పురుషః" ఇత్యాదిలక్షణములు ప్రాయికములని చెప్పఁబడెను. అహోబలపండితుఁ డిట్టివాని నేకదేశిసమాసములని వ్యవహరించెను. "అద్దిశబ్దేన - అరగన్ను - క్రేగన్ను - సామేను - కొనచేయి - పెడతల - ఇత్యాద్యా ఏకదేశిసమాసాః ప్రాహ్యాః" (అహో. ౪౪౪ పుట.)

"సప్తమీ శౌణ్డైః. సప్తమ్యన్తం శౌణ్డాదిభిః ప్రాగ్వద్వా - అక్షేషు శౌణ్డః = అక్షశౌణ్డః = (పాచికలయాటయందు సమర్థుఁడు). ఇది సప్తమీతత్పురుషము. విభక్తి కొకటిరెండుసూత్రములుమాత్రము పై రీతిని దిఙ్మాత్రముగఁ జూపితినిగాని యిట్టివి పెక్కువిధులు గలవు.

కల్ప ౨౬౮ IV విష:—కర్మధారయము:—"తత్పురుషః సమానాధికరణః కర్మధారయః" (౧-౨-౪౨)((సి-కౌ ౭౪౫ సూ). సమానమైన యాధారముగల పదార్థములు సమానాధికరణము లనిపించుకొనును. అట్టిపదములు సమసించు తత్పురుషమనఁగా నుత్తరపదార్థప్రాధాన్యము ప్రాయికముగాఁగల సమాసము కర్మధారయమనిపించుకొనును. ఉదా:—నీలోత్పలము. (నీలంచ తత్ ఉత్పలంచ=ఉత్పలమందు నీలత్వమును నుత్పలత్వమును నున్నవి.)'నీలోత్పలము వికసించెను' అనుచో నుత్తరపదము క్రియతో నన్వయించుచున్నదిగదా. "విశేషణం విశేష్యేణ బహుళమ్ (౨ - ౧ - ౫౭). భేదకం సమానాధికరణేనభేద్యేన బహుళం ప్రాగ్వత్ (సమస్యతే). నీలముత్పలమ్ = నీలోత్పలమ్. బహుళగ్రహణాత్ క్వచి న్నిత్యమ్ - కృష్ణసర్పః.

క్వచిన్న - రామో జామదగ్న్యః" (సి.కౌ. ౭౩౬ సూ). కర్మధారయమునఁ బ్రాయిక ముగా విశేషణము సమాసపూర్వావయవమై యుండు నటుకై యీవిధియందు విశేషణశబ్దము ప్రథమాంతముగ నిర్దేశింపఁబడెను."పూర్వాపర ప్రథమ చరమ జఘన్య సమాన మధ్య మధ్యమ వీరాశ్చ (౨-౧ ౫౮). పూర్వనిపాతనియమార్థమిదమ్. పూర్వవైయాకరణః......అపరస్యార్థే పశ్చ భావో వక్తవ్యః (వార్తి. ౩౨౫౩). అపర శ్చాసా వర్ధశ్చ=పశ్చార్ధః. కథ మేకవీరఇతి......బహుళగ్రహణా ద్భవిష్యతి" (సి. కౌ. ౭౩౭ సూ). ఇట్లు కొన్ని కర్మధారయములందు విశేషణము సమాసోత్తరపద మయి యుండుటయుఁ గలదు ఇందు 'పూర్వా'దిశబ్దములు ప్రథమావిభక్తితో నిర్దేశింపఁబడుటచే వానికిఁ బూర్వనిపాతత్వము నియతమని తాత్పర్యము. వైయాకరణశబ్దము విశేషణముగా వివక్షితమయినను "వైయాకరణపూర్వః" అనరాదని తాత్పర్యము.

"శ్రేణ్యాదయః కృతాదిభిః (౨ - ౧ - ౫౯). శ్రేణ్యాదిషు చ్వ్యర్థవచనం కర్తవ్యమ్. (వార్తి. ౧౨౯౬). అశ్రేణయః శ్రేణయః కృతాః శ్రేణికృతాః" "చ్విప్రత్యయార్థేఽ భూతతద్భావే గమ్యే శ్రేణ్యాదీనాం సమాసోవక్తవ్య ఇత్యర్థః. శిల్పేన పణ్యేన వా జీవినాం సమూహాః శ్రేణయః........" (సి. కౌ. ౭౩౮ సూ. బాలమ.) అభూతద్భావమనఁగా పూర్వమున లేకయుండఁ దర్వాతఁ గల్గుట. అభూతతద్భావార్థమున "చ్వి" ప్రత్యయము తద్ధిత ప్రకరణమునఁ జెప్పఁబడును. పూర్వము శిల్పముచే జీవించుట కసమర్థు లిపుడు దానిచే జీవింప సమర్థులుగాఁ జేయఁబడిరి యనునర్థమున "అశ్రేణయః శ్రేణయః కృతాః." అనువిగ్రహముగలదై "శ్రేణికృతాః" అను సమాసము సిద్ధించునని భావము. ఇట శ్రేణిశబ్ద మిగారాంతము. చ్విప్రత్యయ మిట వచ్చినచో "చ్వౌచ" అనుచోప్పున దీర్ఘమువచ్చును. 'శ్రేణీకృతాః' అను నిత్యసమాస మేర్పడును. (చూడు. "కు గతి ప్రాదయః" (౨ ౨ ౧౮) (సి. కౌ ౭౬౧ సూ).

"శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపదలోప స్యోపసంఖ్యానమ్ (వార్తి ౧౩౧౦ - ౭౩౯ సూ)." "శాకః ప్రియః యస్యసః శాకప్రియః...... శాకప్రియశ్చాసౌ పార్థివశ్చేతి విగ్రహే బహువ్రీహిగర్భో విశేషణసమాసః. తత్ర పూర్వఖణ్డే బహువ్రీహౌ ఉత్తరపదస్య ప్రియశబ్దస్యలోపః. దేవబ్రాహ్మణఇతి. దేవాః ప్రియాః యస్య స దేవప్రియః, సచాసౌ బ్రాహ్మణశ్చేతి విగ్రహః. పూర్వవదుత్తరపదలోపః. దేవపూజకో బ్రాహ్మణఇతి వా విగ్రహః" (సి. కౌ. ౭౩౯ సూ. బాలమ.) శాకపార్థివుఁ డనఁగా శక్తి ప్రియ మైనదిగాఁగలరాజని యర్థము. ఇందు

ప్రియశబ్దము లోపించినది. దీని నుత్తరపదలోపసమాసమనియె నన్నయ వ్యవహరించెను. దీనిని మధ్యమపదలోప సమాసమనియు వాడుదురు. ఈసమాసము పెక్కుస్థలములం దుపచరింపవలసిన విస్తృతవ్యాప్తి గలది. "లోకశబ్దోఽత్ర లోక సముదాయపరః. త్ర్యవయవో లోక స్త్రిలోకఇతి మధ్యమపదలోపీ సమాసః. ఏతచ్చ 'ద్విగో ర్లు గనపత్యే' ఇతి సూత్రే భాష్యే స్పష్టమ్. షోడశపదార్థానా మిత్యత్రతు 'షోడశస ఙ్ఖ్యాకాః పదార్థాఇతి మధ్యమపదలోపీ సమాస ఇత్యలమ్" (సి. కౌ. ౭౨౭ సూ. బాలమ.) (విస్తర)

"ఉపమానాని సామాన్యవచనైః. (౨ - ౧ - ౫౫) ఘన ఇవ శ్యామో ఘన శ్యామః. ఇహ పూర్వపదం తత్సదృశే లాక్షణిక మితి సూచయితుం లౌకికవిగ్రహే ఇవశబ్దః ప్రయుజ్యతే. పూర్వనిపాత నియమార్థం సూత్రమ్" (సి. కౌ. ౭౩౮ సూ.)

---

విస్తర I ౨౬ూ IV విష:—"శాకపార్థివాద్యాః:—శాకపార్థివాద్యా నిపాత్యన్తే. శాకః శక్తిః ప్రధానం యస్య సః శాకప్రధానః పార్థివః = శాకపార్థివః. మేరునామా మహీభృత్ = మేరుమహీభృత్. సుగ్రీవనామా కపిః = సుగ్రీవకపిః, శ్రీహర్షనామా నృపతిః = శ్రీహర్షనృపతిః, ముఖయుక్తా నాసికా = ముఖనాసికా, త్రిగుణీకృతా జగతీ = త్రిగతీ, అర్ధావశిష్టం ఘృతమ్=అర్ధఘృతమ్. ఇత్యాది శాకపార్థివాది రాకృతిగణః"(ముగ్ధ ౩౮౯ సూ. శ్రీరామతర్కవాగీశ వ్యాఖ్య.) "పక్షే శాకపార్థివాదిత్వా దధికపదస్య లోపే ద్విచత్వారింశత్. శాకపార్థివాది ర్యథా:—శాకప్రధాన శ్చాసౌ పార్థివ శ్చేతి శాకపార్థివః, అత్ర ప్రధానశబ్దస్య లోపః. శాకః శక్తిః (అనుబంధ) ఏవం దధ్నా మిశ్రితః ఓదనః=దధ్యోదన ఇత్యాది" (ముగ్ధ. ౩౫౧. సూ. దుర్గా. వ్యాఖ్య )"ద్వి అధికా దశ ఇతి శాకపార్థివాదిత్వాత్ అధికశబ్దలోపే ద్వాద్యాదేశః. ఏవం ద్వావింశతిః - త్రయోవింశతిః - అష్టావింశతిః - ద్వాత్రింశత్ - త్రయస్త్రింశత్ - అష్టాత్రింశత్ - ద్వాచత్వారింశదిత్యాది..." (ముగ్ధ. ౩౫౧ సూ. శ్రీరామ. వ్యాఖ్య.) ఇక్లే - శతాబ్దము మున్నగునవియు సాధ్యములగును - (చూడు. విస్తర. II ౨౯ IV)

---

అనుబంధము-విస్తర I ౨౬ూ IV:—"జవ్వాదిసెట్టి పచ్చళ్ళబాఁపత మొదలైనవి యుత్తరపదలోపములు" (బాలసరస్వతీయ టీక. ద్విగుకర్మధారయావిత్యాది కారిక). "జవ్వాదిసెట్టి - పచ్చళ్ళబాఁపత - గాజులసెట్టి ఇత్యాద్యా ఉత్తరపద లోపాః..." (అహో. ౮౮౮ పుట.) పైవ్యాఖ్యలలోని 'పచ్చళ్ళబాఁపత' అనునుదాహృతి నరయఁగా బాలసరస్వత్యహోబలపండితులు "శాకపార్థివుఁడ"నుదానికి "కూరలు ప్రియమైనవిగాఁగలవాఁడ"ని యర్థము చేసికొన్నట్టు తోఁచుచున్నది.

ఉపమానవాచిపదములు సాధారణధర్మవాచకపదములతో సమసించును, ప్రథమా నిర్దిష్టమగు నుపమానవాచిపదము సమాసపూర్వావయవమై యుండును. 'ఘనః = మేఘము, శ్యామః = నల్లనివాఁడు' అను వానికి నేకార్థీభావలక్షణ సామర్థ్యము లేదు గావున నద్దాని సిద్ధికై "ఘనసదృశుఁడు శ్యాముఁడు" అని యర్థము సెప్పవలెను. అనఁగా ఘనశబ్దము ఘనసదృశార్థమును లక్షణాశక్తిచే నొసంగునని గ్రహింపవలెను. ఈవిషయమును విశదపఱుచుటకే "ఘన ఇవ శ్యామః" అను లౌకికవిగ్రహ మేర్పడినది. 'ఘనసదృశ - శ్యామ' అను రెండిటిలో నొకటిమాత్రమె విశేషణమగుటకు వినిగమకము లేనందున నుపమానవాచిపదమునకుఁ బూర్వనిపాతనియమమును బ్రథమానిర్దేశముచే సూత్రకర్త విశదపఱిచెను.

"ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాఽప్రయోగే. (౨ - ౧ - ౫౬). ఉపమేయం వ్యాఘ్రాదిభి స్సహ ప్రాగ్వత్ (వా సమస్యతే) సాధారణధర్మస్యాఽప్రయోగేసతి. పూర్వనిపాతార్థం సూత్రమ్. పురుషవ్యాఘ్రః, నృసోమః, వ్యాఘ్రాది రాకృతిగణః - సామాన్యాప్రయోగేకిమ్-పురుషో వ్యాఘ్ర ఇవ శూరః" (సి. కౌ. ౭౩౫ సూ.) ఉపమితమనఁగా నుపమేయము. ఉపమానోపమేయ సమభివ్యాహారమున నుపమానమె విశేషణమగు నను నియమము చెప్పునను"విశేషణం విశేష్యేణ బహులమ్" అను విశేషణ సమాస విధాయకశాస్త్రముచెప్పునను "వ్యాఘ్రపురుషుఁడు" అను ననిష్టరూపము కలుగకుండుటకయి యీసూత్ర మువదేశింపఁబడినది. కావునఁ బ్రథమానిర్దిష్టమగుటచే నుపమేయమే పూర్వపదమైయుండునని యెన్ననగును. వ్యాఘ్రశబ్దమునకు వ్యాఘ్రసదృశుఁడని యర్థము. 'శూరః' మున్నగు సాధారణధర్మవాచకము ప్రయోగింపఁబడునపుడు సమాసము కానేరదు. 'పురుషుఁడు వ్యాఘ్రమువలెఁ గ్రూరుఁడు' అనియె ప్రయోగింపవలయును.

'వ్యాఘ్రమువంటి పురుషుఁడు = వ్యాఘ్రపురుషుఁడు' అనురీతి సమాసము సాధువుకాదని యీసూత్రమె విశదపఱుచుచున్నది. ఉపమానోపమేయ శబ్దములకు సమాసముఁగల్గినపు డుపమేయవాచియే సమాస పూర్వపదమై యుండునని కదా ప్రకృతసూత్రమునకుఁ దాత్పర్యము. (విస్తర II) "భాష్యాబ్ధిః క్వాతిగమ్భీర ఇతికై యట ప్రయోగస్తు మయూర వ్యంసకాదిత్వా త్సమాధేయః - భాష్యమే

---

విస్తర II ౨౬౮ IV విష:—కొంద ఱాంధ్రకవు లుపమాన పూర్వపదకర్మధారయములను బ్రయోగించిరి. ద్విపద - బింబోష్ఠములు చంద్రబింబాననములు (రంగ. రా. యుద్ధ ౫౩౩౮ పద్య. ౫౨౮ పు. ౬ పం. యూ. ముద్ర). కం......
పసిఁడి కంబము లనఁగాఁ । గరమొప్పు నగతనూజకుఁ । గరభోరులఁ బోలుచు

వాబ్ధిరితి రూపకం వా." (సి. కౌ. ౭3౫ సూ. బాలమ. వ్యాఖ్య). 'అతిగంభీర మగు భాషాబ్ధి యొచ్చట' అని పై కైయటప్రయోగమున కర్థము. సాధారణ ధర్మప్రయోగ ముండుటచే నుపమితసమాసము కానేరదనియు మయూరవ్యంస కాదులలోఁజేర్చి సాధుత్వము నెన్నవగుననియుఁ దాత్పర్యము.

"మయూరవ్యంసకాదయశ్చ (౨ - ౧ - ౭౨). ఏతే నిపాత్యన్తే. మయూరో

---

మదనకరికరలీలన్.।(నన్ని. కు. 3 ఆ. ౨౯౧). సీ. అళికేశి లక్తకాధరపాదతలములు నమృతాంశు ముఖశుక్తికాంఘ్రియుగము। కంబుకంధర ప్రీహికర్భాభ జంఘలు బిసహస్త రంభోరు లసితరుచియుఁ। బూర్ణకుంభస్తన పులిననితంబంబు హరిమధ్య వేదిమధ్యాభినుతియుఁ। గుంభికుంభనితంబ కోకస్తనమ్ములు కరభోరు మృదు లతా కరయుగంబు. ఆ. వె. కామశరధిజాను క్రముకకంఠంబును। గమఠపాద వికచ కమలముఖముఁ। బల్లవాంఘ్రితల సుబర్హిణాలకములు। నజునకైనఁ బొగడ నరిది గాదె. (నన్ని. కు. ౮. ఆ. ౧౮ ప). చ. సరసిజశస్త హస్తములఁ జంద్రనిభాస్యముఁ గంబుకంఠమున్...గ్రసించిరి మాంసభక్షకుల్. (భాస్క. రా. ఆరణ్య. ౨ ఆ. ౨౭౨ ప). వయివానిలోని "అళికేశి-అమృతాంశుముఖ-మున్నగు నుపమానపూర్వ పద బహువ్రీహులు నిర్దుష్టములు. అట్లె సరసిజశస్త హస్తములు మున్నగు నుప మానసాధారణ ధర్మసమాసములును లక్షణసముచితములె. ఇంక - రంభోరులు - కోకస్తనములు కంబుకంఠము మున్నగు నుపమానపూర్వపద కర్మధారయములు లక్షణసమ్మతములు కానేరవు. ఇట్టిప్రయోగములు కవిత్రయమువారు నాచన సోముఁడు శ్రీనాథుఁడు మున్నగువారి గ్రంథములలోఁ గానరాలేదు కాని కాళి దాసే యిట్టి ప్రయోగమును జేసియున్నాఁడు. "అముం పురః పశ్యసి దేవదారుం। పుత్త్రీకృతోఽసౌ వృషభధ్వజేన। యో హేమకుమ్భస్తన నిఃసృతానాం। స్కన్దస్య మాతుః పయసాం రసజ్ఞః" 'ఏ దేవదారువృక్షము పార్వతీదేవిచేతఁ బుత్త్రునిగాఁ జేయఁబడినదో యట్టిదాని నెదుటఁ జూచితివా' యని తాత్పర్యము (రఘువంశము ౨ సర్గము 3౬ శ్లో.) (దేవదారుపక్షమున):—"హేమ్నః కుమ్భ ఏవ స్తనః తస్మాన్ని స్సృతానాం పయసా మమ్బూనాం రసజ్ఞః". (స్కన్దపక్షమున) "హేమకుమ్భ ఇవ స్తన ఇతి విగ్రహః పయసాం క్షీరాణామ్......స్కన్దపమానప్రేమాస్పద మితిభావః..." (మల్లినాథవ్యాఖ్య) ఇట్టియెడల "చంద్రసదృశం ముఖమ్" = చంద్రముఖము అను రీతిని మధ్యమలోపసమాసమును బై మహాకవు లంగీకరించిరా యని యాలోచింప వలసియున్నది.

వ్యంసకః=మయూరవ్యంసకః. వ్యంసకో ధూర్తః,..."(సి. కౌ. ౭౩౮ సూ). "వ్యంసకశ్చాసౌ మయూరశ్చ" అని విగ్రహము. ధూర్తుడగు నెమిలి. విశేష్యమునకుఁ బూర్వనిపాతము సిద్ధించుటకయి సూత్ర ముపదేశింపఁబడెను. "ముఖమేవ పఙ్కజమ్ = ముఖపఙ్కజమ్" = "ముఖపంకజము" అనుచో ముఖమువంటిపంకజమని విగ్రహము చేయరాదు. ఇంక, పంకజమువంటి ముఖమని యుపమితసమాసమును గాని 'ముఖమనెడి పంకజము' అని రూపకసమాసమునుగాని గ్రహింపవలయును. ఆ యాస్థలములందలి సందర్భమునుబట్టి యుపమితరూపకములను నిర్ణయించుకొనవలయును. (విస్తర III) 'మయూరవ్యంసకాదయశ్చ' అను ప్రకృతసూత్రమె రూపకసమాసవిధాయకశాస్త్రమును నని గ్రహింపవలయును.

"నాస్తి కించన యస్య సః=అకించనః, నాస్తి కుతో భయం యస్య సః=అకుతోభయః"అనునవి మొదలగు నన్యపదార్థప్రధానములు సయితము బహువ్రీహి కపవా

విస్తర III, ౨౬౮ IV విమ:—"ముఖచన్ద్రం పశ్యామీ త్యత్ర కిం ముఖం చన్ద్ర ఇవే త్యుపమా. ఉత ముఖ మేవేతి రూపక మితి సన్దేహః. సాధకబాధకయో ర్ద్వయో రేకతరస్య సద్భావే పునః న సన్దేహః. యథా 'ముఖచన్ద్రం చుమ్బతి' ఇత్యత్ర చుమ్బనం ముఖస్యానుకూల మిత్యుపమాయాః సాధకమ్. చన్ద్రస్య తు ప్రతికూలమితి రూపకస్య బాధకమ్. "ముఖచన్ద్రః ప్రకాశతే" ఇత్యత్ర ప్రకాశాఖ్యో ధర్మః రూపకస్య సాధకో ముఖే ఉపచరితత్వేన సమ్భవతీతి నోపమా బాధకః...
......'సున్దరం వదనామ్బుజమ్' ఇత్యాదౌ సాధారణ ధర్మప్రయోగే 'ఉపమితం వ్యాఘ్రాదిభి స్సామాన్యాప్రయోగే' ఇతి వచనాత్ ఉపమా సమాసో న సంభవతీతి ఉపమాయా బాధకః - ఏవం చాత్ర మయూరవ్యంసకాదిత్వా ద్రూపకసమాస ఏవ" (సాహిత్యదర్పణము ౧౦ పరి. ౭౩౭ కారిక. ౬౨౩ - ౬౨౪ పుటలు), ఈయరీతిని సాధకబాధకముల పరిశీలనమునకు వలనుపడకుండునట్లుగ నుపమారూపకముల సాంకర్యమును మాఘకవి ప్రయోగించియున్నాఁడు—లిలఙ్ఘయిషతో లోకా । నలఙ్ఘ్యా నలఘీయసః । యాదవామ్భో నిధీన్ రున్ధే వేలేవ భవతః క్షమా (శిశుపాలవధ. ౨ సర్గము. ౫౮ శ్లో). యాదవులనెడి సముద్రములను నీయోర్మి చెలియలికట్టవలె నరికట్టుచున్నదని యర్థము. "జలపూరణముచే లోకముల నాక్రమించునవి సముద్రములు. పరాక్రమముచే లోకముల నతిక్రమించునవి యాదవ సైన్యములు" అనురీతిగల సాధారణ ధర్మప్రయోగముచే నుపమితము బాధితము గాన యాదవులనెడి యంభోనిధులని రూపకసమాసమును గ్రహింపవలయును గాని "వేలేవ"=చెలియలికట్టవలె నను కంఠోక్తమగు నుపమ నంగీకరింపకతీరదు "వస్తుతస్తు

సాధారణధర్మప్రయోగా త్తత్ర రూపక మేవ. వేలేవే త్యుపమైవ." (అహో॰ ౮౮౧ పు) (అనుబం) "యాతవ్యపార్ష్ణిగ్రాహాది । మాలాయా మధికద్యుతిః । ఏకార్థతన్తు ప్రోతాయాం । నాయకో నాయకాయతే" (శిశు. ౨ స. ౯౩ శ్లో) ఇందును 'నాయకాయతే' అనెడి యాచారార్థ క్యఙ్జుచే నుపమను గ్రహింపకతీరదు. ఏకార్థతన్తు ప్రోతాయా మ్మనుదానిచే మాలికయందే గ్రుచ్చఁబడుట సరియగుదు గాన రూపకమున కనుకూలత గలదు. కాన నిందును రూపకోపమసంకరము చెప్పఁదగియున్నది. ద్వాదశ రాజమండల మనెడి మాలికయందు విజిగీషువు నాయకమణివంటివాఁ డని తాత్పర్యము. "ఏకార్థత న్త్విత్యత్ర రూపకత్వే అధిష్ఠాన తిరోధానేన ఆరోప్యమాణ తన్తుత్వస్యైవ ఉపోద్బలకత్వా త్ప్రోతత్వసిద్ధిః. తద్బలా దేవ పార్ష్ణిగ్రాహాది మాలాయామి త్యత్రాపి రూపక మేవ.నాయా కాయత ఇత్యత్ర తూపమైవ.అన్యథానుశాసనవిరోధాత్." (అహో. ౮౮౧ పు). (సి. కౌ. క్యఙ్‌విధి ౨౬౬౫ సూ). ఇట్టియెడల నరసింహసంకర మనఁదగు నని విన్నకోట పెద్దన వచించెను. "నరసింహసంకరము,.........ను. పనితో దగ్రుఁడు విశ్వనాథుఁ డనిలోఁ బర్జన్యుచందంబునన్ । గనుపట్టున్ బటహారవంబు మొరయం గర్జోపమానోద్ధతిన్ । దనరించున్ రుధిరాపగా నికరముం దదోద్యద్బాహాభ్రము । ఘనకోదండపయోధర ప్రవిగళత్కాండావళీవర్షముల్" (కావ్యాల. ౬ ఉల్లా. ౧౦ ప) రూపకోపమాసంకరము.

---

అనుబంధము. విస్తర III అంగా IV విష:—ఈ క్రింద నుదాహరింపఁబడు యాతవ్యేత్యాది శ్లోకమందువలెనే యిందును నుపమారూపక సంకరమును మల్లినాథుఁడు వ్రాయకుండుట సరి కాదని యహోబలపతి చర్చించెను (అహో. ౮౮౧ పు).

ఇట్టియెడల శబ్దసాధర్మ్యమే కాని యర్థసాధర్మ్యము లేమింజేసి సాధారణధర్మప్రయోగము లేదనియే తలంచి యుపమిత సమాసము చేయనగునని వైయాకరణులు చెప్పుచున్నారు—"సాధారణధర్మస్యానుగామిత్వ మేవేతిమతే, నాత్ర విశేషణ స్యానుగామిత్వమ్. ఏకత్ర లఙ్ఘనం జఃపూరణే నాక్రమణమ్. అన్యత్ర విజయ ఇత్యాద్యర్థభేదస్య విద్యమానత్వాత్. అత ఏవ భాష్యాబ్ధిః క్వాతిగమ్భీరః, క్వచాల్పవిషయా మతిరితి కైటోక్తౌ ఏకత్ర గాంభీర్యం దుష్ప్రవేశత్వమ్, అన్యత్ర దుర్విజ్ఞేయత్వమితి నానుగామిత్వ మిత్యభియుక్తై రుక్తమ్. మనోరమాయాంతు 'అత్ర గామ్భీర్యేణ సాదృశ్యం న వివక్షితం. కింతు వితతమురవగాహత్వాదినా, తస్య ప్రయోగోనాస్త్యేవేతి సమాసో నిర్బాధ ఏవేత్యుక్తమ్. అశ్రిత్య శబ్దమాత్రం సాధర్మ్య మిహాపి సంభవతీత్యాలంకారికమతమ్..............." (అహో ౮౮౧ పు.).

దములగుచుఁ ద్విపదతత్పురుషములనువేర దీనికి (మయూరవ్యంసకాదిశాస్త్రమునకు) లక్ష్యములగుచున్నవి. "న బ్రాహ్మణోఽబ్రాహ్మణః" (బ్రాహ్మణుఁడు కానివాడు.) 'న అశ్వః=అనశ్వః'=అశ్వము కానిది.ఇత్యాదులు నఞ్ తత్పురుషములు "అతి క్రాన్తో మాలా మతి మాలః" మాల నతిక్రమించినవాడు. మున్నగునవియు (పూర్వపదార్థ ప్రధాన తత్పురుషములు) "ప్రగతః ఆచార్యః=ప్రాచార్యః" (ప్రాదిసమాసములు) మున్నగునవియుఁ (కుగతిప్రాదయః.సి-కౌ.౭౩౧సూ.) దత్పురుషభేదములె."పుంవత్కర్మ ధారయజాతీయదేశీయేషు (౬-3 ౪౨) కర్మధారయే జాతీయదేశీయయోశ్చ పరతః భాషితపుంస్కాత్పరః ఊఙభావోయస్మిం స్తథా భూతం పూర్వం పుంవత్....... మహానవమీ (మహతీ నవమీ) కృష్ణచతుర్దశీ (కృష్ణాచ సా చతుర్దశీ)." (సి. కౌ. ౭౪౬) ఇత్యాదిసూత్రములచొప్పునఁ గర్మధారయమునఁ బుంవద్భావమగును. మహచ్ఛబ్దతకారమునకు 'ఆ'కారాదేశ మగును.

భాషితపుంస్క మనఁగాఁ బున్నపుంసకత్వములందుఁగాని పుంస్త్రీత్వములందుఁ గాని (తుల్యప్రవృత్తినిమిత్తకము) యర్థభేదములేక వర్తించునది. (౨౬౮ IV. బహువ్రీహి). ఉదా:—"శుక్లః పురుషః - శుక్లాస్త్రీ. మృదుః పురుషః - మృదు వస్త్రమ్." ఇట్లు శుక్ల - మృదు ప్రభృతిశబ్దములు భాషితపుంస్కములు. 'శుక్లాచ సా తనుశ్చ = శుక్లతనుః. (శుక్లయగు తనువు = శుక్లతనువు) ఇందు స్త్రీలింగశుక్లా శబ్దము పుంలింగమువంటిరూపముతో నిల్చెను. ఇట్లె పైనుదాహరించిన "కృష్ణ చతుర్దశీ - మహానవమీ" అనుస్థలములందును బుంవద్భావము నరయునది. ఊఙన్తమునకుఁ బుంవద్భావము రాదు. ఉదా:—"వామోరూభార్యః"=వామోరు వగు నన:గా రమ్యమగు "ఊరు" వనఁగాఁ దొడగలభార్యగలవాఁడు=వామోరూ భార్యుఁడు. మొ. "రాజాహస్సఖిభ్యష్టచ్ (౫-౪-౯౧) ఏతదన్తాత్ తత్పురుషాట్టచ్ స్యాత్ - పరమరాజః - అతిరాజః - కృష్ణసఖః (సి. కౌ. ౭౮౮ సూ.)" ఇత్యాది విధులచొప్పునఁ దత్పురుషసమాసమున నన:గాఁ దత్పురుష కర్మధారయ ద్విగువుల ననేకములగు సమాసాన్తప్రత్యయములు మున్నగునవి వచ్చును. విస్తరభీతిని వివరింపలేదు.

కల్ప. ౨౬౮ V విష:—ద్విగుసమాసము:—సమానాధికరణతత్పురుషసమా సములలో సంఖ్యావాచక పూర్వపదకసమాసములు ద్విగుసమాసములు. ౧ తద్ధితార్థ ద్విగువు. ౨-ఉత్తరపదద్విగువు. 3 సమాహారద్విగువు.

"సంఖ్యాపూర్వోద్విగుః.(౨-౧-౫౨)తద్ధితార్థ (౭౨౮ సూ.) ఇత్యత్రోక్తః త్రివిధః సంఖ్యాపూర్వో ద్విగుః స్యాత్." "బాలమ:—తద్ధితార్థే విషయే, ఉత్తరపదేచ

పరతః, సమాహారేచ వాచ్యే ఇత్యేవం త్రిప్రకారో యః సంఖ్యాపూర్వః సమాస ఉక్తః స ద్విగురితియావత్."(సి. కౌ. ౭౩౦సూ.) "తద్ధితార్థోత్తరపదసమాహారేచ" (౨-౧-౫౧) అనుసూత్రమునఁ, (సి. కౌ. ౭౨౮ సూ.) దద్ధిత ప్రత్యయార్థమువిషయ మగునపుడును నుత్తరపదము పరమగునపుడును సమాహారమందును (సమాహామును- మొత్తము) దిగ్వాచక సంఖ్యావాచకములు సమానాధికరణపదముతో సమసించునని చెప్పఁబడెను. అట్టి మూఁడువిధముల స్థలములందలి సంఖ్యాపూర్వపదస్థలములు ద్విగుసంజ్ఞగలవని యర్థము. ఉదా;—"పఞ్చభి ర్గోభిః క్రీతః = పఞ్చగుః." ఇది తద్ధితార్థద్విగువు, ఇందు "క్రీతః"అనునర్థమును ద్విగుసమాసము చెప్పుచున్నది గానఁ దద్ధితప్రత్యయము నిల్వలేదు. (ఉక్తార్థానా మప్రయోగః). ఇంక నుత్తరపదపరక ద్విగువు:—"పంచ గావో ధనం యస్యేతి త్రిపదే బహువ్రీహౌ అవాన్తరతత్పురుషస్య వికల్పే ప్రాప్తే - 'ద్వన్ద్వ తత్పురుషయో రుత్తరపదే నిత్యసమాసవచనమ్' (వార్తి. ౧౨౮౭)........పఞ్చగవధనః" = పంచగవధనుఁడు = ఐదుగోవులు ధనముగాఁ గలవాఁడు. ఈబహువ్రీహిలోని 'పంచగవమ్' అనునది తత్పురుషము. మహావిభాష చే నట్టితత్పురుషమునకు వైకల్పికత్వము కల్గుచుండఁగాఁ బైవార్తికము చెప్పిన నిత్యత గల్గినది. కాఁగా నట్టి యుత్తరపదపరక మగు సమాస ముత్తరపద పరద్విగువున కుదాహరణమగుచున్నది. సమాహారద్విగువునకు:—"పఞ్చానాంగవాం సమాహారః = పఞ్చగవమ్ = అయిదుగోవుల మొత్తమని యర్థము. "ద్విగురేకవచనమ్. (౨ ౪-౧) ద్విగ్వర్థః సమాహారః ఏకవత్ స్యాత్" (సి. కౌ. ౭౩౧ సూ). "స నపుంసకమ్. (౨-౪-౧౭) సమాహారే ద్విగు ర్ద్వన్ద్వశ్చ నపుంస కంస్యాత్. పరవల్లిఙ్గాపవాదః - పఞ్చగవమ్........" (సి. కౌ. ౮౨౧ సూ.) అనుసూత్రముల చెప్పిన సమాహారద్విగువు నపుంసకము నేకవచనాన్తము నగును. (విస్తర I) పఞ్చగవము=అయిదుగోవుల సమాహాము. "అకారాన్తోత్తరపదో ద్విగుః స్త్రియా మిష్టః" (వార్తి. ౧౫౫౬ ౮౨౧ సూ.) ద్విగువులోని యుత్తరపదము 'అ'కారాంత మగునపు డాద్విగువు స్త్రీలింగమగును. "ద్విగోః. (౪-౧-౨౧) అదన్తా ద్విగోర్ఙీప్ స్యాత్" (సి. కౌ. ౪౭౧ సూ.). స్త్రీత్వమునం దదంతద్విగువునకు జీప్ప్రత్యయము

---

విస్తర. I ౨౬౪ V విష:—ఆంధ్రలాక్షణికులు పైమూఁడువిధములలోఁ జేరనిచోటులందును సంఖ్యాపూర్వపదకర్మధారయమును (ముల్లోకములు) సంఖ్యాపూర్వపదమధ్యమపదలోపిసమాసములను సైతము (ముప్పది) ద్విగువులని వ్యవహరింతురు. (విష. ౨౮౩) "ద్విగో రమిశ్రతాయాంతు। ప్రాయ ఏకత్వ మిష్యతే। మిశ్రతాయాం బహుత్వం స్యాత్" (అథర్వణుఁడు). (చూ. ౨౮౪ విష).

వచ్చును. "త్రయాణాం లోకానాం సమాహారః త్రిలోకీ"=త్రిలోకములు "పఞ్చానాం నలానాం సమాహారః=పఞ్చ+నల = పఞ్చనలీ" "పాత్రాద్యన్తస్య న" (వా_ర్తి. ౧౫౯౬. సూ. ౮౨౧.). "బాలమః—పాత్రాదిర్గణః-తద_న్తస్య సమాహారద్విగోః న స్త్రీత్వమితి వ_క్తవ్య మిత్యర్థః" (సి. కౌ. ౮౨౧ సూ.). పాత్రాదులగు 'అ'కారాంత శబ్దము లు_త్తరపదములగునపు డాద్విగువు స్త్రీలింగము కాదు. ఇంక నపుంసక మే యగును. ఉదా:—ద్విపాత్రము - త్రిపాత్రము - త్రిభువనము. మొ.

పయిరీతిని ముప్విధములగు స్థలములందే ద్విగుసమాస మంగీకరింపఁబడుట చేత చతుర్యుగములు - త్రిపురుషులు - త్రిలోకములు - పంచపాండవులు - శతాబ్దములు మున్నగునవి ద్విగువులు కానేరవు. అయ్యవి తత్పురుషభేదములె (కర్మధారయములె) యనవలయును. (వి_స్తర. II)

---

వి_స్తర. II ౭౬౮ V విమ:—చతుర్యుగములు మున్నగు సమాసములె యసాధువులని కొందఱ యాశయము. 'తద్ధితార్థో_త్తరపద సమాహారేచ' (సి. కౌ. ౭౨౮ సూ.) అనుసూత్రమునఁ జెప్పఁబడిన మూఁడువిధములలోను బఱువాని సమాస మేదియుఁ గాకుండుటచేత వానిద్విగుసమాసమునకే సాధుత్వము లేదని వారి యాశయము. "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్. (౨-౧-౫౦)" "బాలమః—దిక్సంఖ్యే సమానాధికరణేన సుబ_న్తేన సమస్యేతే స తత్పురుష ఇత్యర్థః" (సి.కౌ.౭౨౭ సూ.). అనుచొప్పున దిగ్వాచకములు సంఖ్యావాచకములును సంజ్ఞావాచిత్వమందే సమానాధికరణమగు సుబంతముతో సమసించునని చెప్పఁబడుటచేత నవి "స_ప్తర్షయః = స_ప్తర్షులు" అనుదానివలెనే సంజ్ఞావాచకములె యనఁదగును. (చతుర్యుగములు = కృత త్రేతా ద్వాపర కలియుగములకే సంజ్ఞ). కాన వానిసమాసము సాధువనఁదగును. చతుశ్శ్రుతులు నేరకయున్నవి నాకు శక్యమే (నిర్వ. ౧ ఆ. ౧౮ ప.) మ.........వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్. (ద్రోణ. 3 ఆ. ౧౬౨.) 'చ. కొను మిదె నీమనఃప్రియుని గోమలి వీఁడు చతుశ్శతాబ్దముల్ । మను నిటమీఁద...... (ఆర. ౭ ఆ. ౨౫౧.) 'చతుశ్శతాబ్దముల్' అనునది తక్కినవానివలె సంజ్ఞావాచి కాదనక తీరదు. కాన నిట "చతుశ్శతసంఖ్యాః అబ్దాః" అనురీతి విగ్రహముగల యు_త్తరపదలోప మనఁదగును. (చూడు. వి_స్తర II ౭౯ IV విమ.) (౭౬౮ IV విమ.) "షోడశపదార్థానా మిత్యత్రతు షోడశసంఖ్యాకాః పదార్థా ఇతి మధ్యమపదలోపీ సమాసః" (సి. కౌ. ౭౨౭ సూ. బాలమ. వ్యాఖ్య.) ఇంకఁ బాత్రాదుల లోనిదగు 'త్రిభువనమ్' అనుదానికి "త్రిభువనీ" అనురూప మెట్లు సిద్ధించునని యాలోచింపవలసియున్నది. చ.........కలితప్రభవస్థితి సంహృతిక్రియా । నిరతి,

ఇవి సంజ్ఞావాచకములు కావు గాన "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" (౨-౧-౫౦ సి. కౌ. ౭౨౭ సూ.) అనుసూత్రముచొప్పునఁ గర్మధారయములు కానేరవనియు "త్రిసంఖ్యాకాః లోకాః త్రిలోకాః" అను రీతిని మధ్యమపదలోప సమాసము నంగీకరింపనగుననియుఁ బ్రామాణికుల యాశయము. "త్రిలోకశబ్దస్య అసంజ్ఞాత్వాత్ త్ర్యవయవో లోకః ఇతి మధ్యమపదలోపీ సమాసః" (సి. కౌ. ౭౨౭ సూ. బాలమ. వ్యాఖ్య.) ఇట్లె 'శతాబ్దములు - శతాబ్దము' అనురూపములును సాధువు లగుచున్నవి. "శతసంఖ్యాకాః అబ్దాః శతాబ్దాః = (శతాబ్దములు) శతావయవో అబ్దః శతాబ్దః = (శతాబ్దము)" దీనివలన 'శతాబ్ది' అనుసమాహారద్విగ్వర్థము నిర్వహింపఁబడుచున్నది. "దిక్సంఖ్యే సంజ్ఞాయామ్" అనుసూత్రముచేఁ గర్మధారయసమాసము రాఁగా "త్రయశ్చ తే లోకాశ్చ। త్రిలోకాః-(త్రిలోకములు)...... అనురీతిని నీశబ్దములు పాణినీయముచేతనే సాధితములైనవి" అనెడి బ్ర॥ శ్రీ. పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వ్రాఁత పైసందర్భమునుబట్టి సరికాదనుట స్పష్టము (పాణినీయము - కావ్యవాఙ్మయము. ౮౧ పు.).

కల్పు. ౨౬౮ VI విష. బహువ్రీహిసమాసము:—సమానాధికరణములగు పదముల కన్యపదార్థ బోధకత్వమునఁ గల్గునది బహువ్రీహిసమాసము. ఉదా:— "పీతమ్+అమ్బరమ్+యస్య సః=పీతామ్బరః" = (పీతాంబరుఁడు - పచ్చనివస్త్రముగలవాఁడు. ఇది తద్గుణసంవిజ్ఞానబహువ్రీహి యనఁబడును. పీతాంబరుఁడు వచ్చెననుచోఁ బీతాంబరునితో నంబరము సయితము వచ్చును. "దృష్టః సాగరో యేనసః= దృష్టసాగరః" = దృష్టసాగరుఁడు = చూడఁబడిన సాగరముగలవాఁడు. ఇది యతద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి యనఁబడును. దృష్టసాగరుఁడువచ్చె ననుచో దృష్టసాగరుఁడు మాత్రమె వచ్చును. సాగరము రానేరదుగదా. బహువ్రీహిసమాసము సమానాధికరణములగు ప్రథమాంతములకే కల్గును. అయ్యవి ప్రథమేతరమగు ద్వితీయాదులయర్థమును జెందుచుండును. ద్విపదబహువ్రీహి బహుపదబహు

---

వివర్తిత త్రిభువనీ మహనీయుని, దైత్యమర్ది ........(శల్య. ౧ ఆ. ౨౬౫). స్రగ్ధర. భువనీ చక్రాచలేంద్రాంబుధి కుహరదిశాపూర్ణమై.........(భేరీరవ) (నన్నె. కు. ౧౧ ఆ. ౬౩౩). ఇట్లు భువనీశబ్దము వెలయుచుండుటచేత "తిస్రః భువన్యః = త్రిభువన్యః - తాసు మహనీయః." అనురీతి నర్థము చేయనగును. మ. ధరణీనాథ.........ఈ। యరదం బెక్కి వధింపు మీవును మదీయస్ఫారసారథ్యవి। ర్భరభంగిన్ దశకంధరుం ద్రిభువనీభంగోన్నమత్కంధరున్. (ఆర. ౭ ఆ. ౧౮౭ ప.)

వ్రీహియు నుండును. ఉదా:—"ఆరూఢో వానరో యం సః = ఆరూఢవానరో వృక్షః." (వానరము దేని నధిరోహించెనో యది యనఁగా నట్టివృక్షము "ఆరూఢ వానరము" అనిపించుకొనును. ఇట్లె తృతీయార్థమునందు;—"ఊఢో రథో యేన సః = ఊఢరథః = "(ఊఢరథము వృషభము). దేనిచే రథము వహింపఁబడెనో యది యూఢరథ మనిపించుకొనును. ఇట్లు ద్వితీయాదివిభక్త్యన్తాన్యపదార్థముల బహువ్రీహులు సంభవించునని పాణినీయుల యాశయము. కాని ప్రథమావిభక్త్యర్థమందును బహువ్రీహిగలదని ముగ్ధబోధవ్యాకరణాశయము. "ద్వితీయాన్తాద్యన్య పదార్థా బహువ్రీహయ ఇతి సర్వే మన్యన్తే. స్వమతేతు ప్రథమాన్తాన్యపదార్థోపి, యథా సహ మాత్రా వర్తతే యోఽసౌ = సమాతృకః = (ఎవఁడు తల్లితోఁ గలసి యున్నాఁడో వాఁడు సమాతృకుఁడని పించుకొనును) ఏవం సముపకః - సనామకః" (ముగ్ధ. 3౨౮. దుర్గా. వ్యాఖ్య). పాణినీయులమతమున వ్యధికరణ పద బహువ్రీహి సమ్మతముకాదు. "సమానాధికరణానాం బహువ్రీహి ర్వక్తవ్యః. కింప్రయోజనమ్. వ్యధికరణానాం మాభూదితి. పఞ్చభిః భుక్త మస్యేతి" (మహా భాష్యము. ౨. అ. ౨. పా. ౨. ఆహ్ని. ౪౫౦. పు.) . 'సప్తమీవి శేషణే బహువ్రీహౌ' (౨. ౨. 3౫). "సప్తమ్యన్తం విశేషణంచ బహువ్రీహౌ పూర్వం ప్రయోజ్యమ్. కణ్ఠేకాలః. అతఏవ జ్ఞాపకా ద్వ్యధికరణపదో బహువ్రీహిః" ('సి. కౌ. ౮౯౮. సూ). అను దీక్షితులవారివృత్తిచొప్పున వ్యధికరణపదబహువ్రీహి పాణినీయసమ్మతమే కాదా యని శంకింపరాదు. "సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తరపదలోపశ్చ. సప్తమ్యన్తం ఉపమానంచ యస్య తస్య పదాన్తరేణ సమాసః ఉత్తరపదలోపశ్చ భవతీత్యర్థః. కణ్ఠేస్థః కాలః యస్య సః కణ్ఠేకాలః. ఉష్ట్రముఖమివ ముఖం యస్య సః ఉష్ట్రముఖః......" (౨. అ. ౨ పా. ౨. ఆహ్ని. ౪౫౦. పు. ప్రదీపోద్ద్యోతసహిత మహాభాష్యము). (బాలమనోరమాసహిత. సి.కౌ. అనేక మన్యపదార్థే. (౨. ౨. ౨౪.) పుట. ౮3౦. సూత్రమునొద్ద). అనుచొప్పునఁ బాణినీయు లట్టియెడల సామానాధికరణ్యమునే సంపాదించుచున్నారు. "యద్యపి కణ్ఠేస్థశబ్దః ప్రథమాన్త ఏవాత్ర బహువ్రీహౌ పూర్వపదమ్. తస్య కాలశబ్దేన సామానాధికరణ్య మస్త్యేవేతి (విస్తర I) కథం సప్తమీగ్రహణం వ్యధికరణపద బహువ్రీహి జ్ఞాపకమ్. కించ విశేషణత్వా దేవసిద్ధే కిం వా సప్తమీగ్రహణేన."

విస్తర I. ౨౬౮. VI వి:—ఇట్టిస్థితిలో బ్రహ్మశ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్య శాస్త్రులుగారు "మనుమార్గః' అనునది............'ఉష్ట్రముఖః' అనుదానివలె సమానాధికరణబహువ్రీహిగానే సాధితమైనది. దీనిని శ్రీశాస్త్రిగారు వ్యధికరణ

(బాలమ. సి. కౌ. ౮౯౮. సూ. వ్యా.). పయిరీతిని వ్యధికరణబహువ్రీహి నంగీకరింప నక్కఱ లేకున్నను బాణినిన్యాచార్యసూత్రములోని సప్తమీ గ్రహణము వ్యర్థము కావలసివచ్చు నను భీతిచేతఁ బాణినీయవ్యాఖ్యాతలు వ్యధికరణబహువ్రీహినిసయిత మంగీకరించిరి. పాణినిమునిసూత్రములోని సప్తమీశబ్దము సప్తమ్యంత

బహువ్రీహి యనుట ప్రమాదము. వ్యధికరణబహువ్రీహులు కంఠేకాలాదులు." (పాణినీయము, కావ్యవాఙ్మయము ౩౯. పుట). అని యెట్లు వ్రాయఁగడంగిరో తెలియకున్నది. వెనుక నుదాహరించిన మహాభాష్యోదాహరణములనుబట్టి "ఉష్ట్రముఖః" అనుదానివలెనె "కణ్ఠేస్థః కాలో యస్యసః కణ్ఠేకాలః" అనునది యును సమానాధికరణబహువ్రీహియనుటలో విరోధమేమియుఁ గన్పట్టదు. ఇట్లు "సప్తమీ విశేషణే బహువ్రీహౌ" అను పాణినిసూత్రములో సప్తమీగ్రహణమున సప్తమ్యంతపద ఘటితోపపదసమాసమునకే పూర్వనిపాతము విధింపఁబడెనని గ్రహింపవచ్చును. వ్యధికరణబహువ్రీహి జ్ఞాపిత మగుచున్నదని వ్యాఖ్యాతలు వ్రాసిరే కాని మునిత్రయమువారు వచింపలేదు. ఇట్లె "ప్రహరణార్థేభ్యః పరే నిష్ఠాసప్తమ్యౌ" (వా ర్తి. ౧౨౨౫). "(వాహితాగ్న్యాదిషు." (౨. ౨. ౩౭) అను సి. కౌ. ౯౦౦. సూత్రమునొద్దది). మున్నగుస్థలములందును "దణ్డః పాణిగతః యస్యసః దణ్డపాణిః" అనురీతిని విగ్రహము నంగీకరించి సామానాధికరణ్యమును సంపాదింపనగును. ఇట్టి వానినిబట్టి సప్తమ్యంతపదఘటితోపపదసమాసమునకుఁ బరనిపాతము జ్ఞాపితమగుచున్నదని వ్యాఖ్య చేయవలసియుండును. ఇట్టిస్థితిలో వ్యధికరణబహువ్రీహి పాణినీయసమ్మతముకాదని నేను వ్రాయుటలో (చిం. వి. ప. ౧౧౫. ఫు. ౮౧. విమ). నేమి విరోధ మున్నదో తెలియకున్నది.

ఇట్లగుటచేత నీక్రిందిరీతిని వ్రాసిన శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రులుగారివాక్యములు సరికావని గ్రహింపవలెను. "శ్రీశాస్త్రిగారి యాశయ మేమో నాకుఁ దెలియదు. పాణినీయానుశాసకులగు ముగ్గురు మహర్షులును నేకకంఠముగా వ్యధికరణబహువ్రీహి పాణినీయసమ్మతమని చెప్పియున్నారు." (పాణినీయము - కావ్యవాఙ్మయము. ౩౭ పుట) మహాభాష్యకర్త సామానాధికరణ్యమును జూపుచు వివరించిన "సప్తమ్యుపమాన పూర్వపద స్యోత్తరపదలోపశ్చ" "సప్తమ్యన్తం ఉపమానంచ యస్య తస్య పదాన్తరేణ సమాసః ఉత్తరపదలోపశ్చ భవతీత్యర్థః. కణ్ఠేస్థః కాలో యస్యసః కణ్ఠే కాలః........."(మహాభాష్యము. ౨ అ. ౨ పా ౨ ఆహ్ని. ౪౫౦ పుట. ప్రదీపోద్ద్యోతసహితమహాభాష్యపుస్తకము.) అనుభాష్యపంక్తులను గొంత మార్చి స్వవాదానుకూలము లనుకొనుచు సుబ్రహ్మణ్యశాస్త్రులుగా రుదాహరించుట వింతగ నున్నది. వీరి మఱికొన్ని యపసిద్ధాంతములు:—

"త్రిలోకీ - త్రిలోకాః - త్రిభువనమ్ - త్రిభువనీ - త్రిభువనాని" ఇవెల్ల మహాకవిప్రయుక్తములగునపుడు పాణినీయసూత్రములతో సమర్థించుటకంగా యిట్టివెల్ల సంజ్ఞావాచకములని బ్రహ్మశ్రీ. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ధారాళముగా వచించిరి. (పాణినీయము - కావ్యవాఙ్మయము ౪౦ పు.) "త్రిలోకశబ్దస్య అసంజ్ఞాత్వాత్" (బాలమ. వ్యా. సి. కౌ. ౭౨౭ సూ.) అని వాసుదేవదీక్షితులవారు చెప్పిరి. (చూ-విస్తర II ౨౬౮ V విష.) సామాన్యధర్మప్రయోగమునందును నుపమిత సమాసములు మహాకవిప్రయుక్తము లుండుటయు, నపాణినీయములగు కుంభస్తనములు మున్నగు నుపమానపూర్వపదకర్మధారయములు మహాకవిప్రయుక్తములగుటయు నీవలకుఁ బ్రదర్శింపఁబడెను. (౨౬౮ IV విష. విస్తర II, III). శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రిగారు స్వవాదానుకూల్యమునకయి వింతవింతలు వ్రాసిరి: కావ్యకర్తలు ప్రమాదపడినపుడు శాస్త్రకర్తలు గౌరవార్థమై వానిని ఛాందసములు నార్షములు నని చెప్పుదురఁట! మహాకవిప్రయోగములను బ్రయోగశరణులగు వైయాకరణులు దష్టాలనిచెప్పుట యెట్లు పొసఁగును? (పాణి. కావ్య. ౬౮-౯౦-౯౧ పు.)

పాణినీయమునకు మంచివ్యాఖ్యలు పుట్టనికాలపుఁబ్రాచీనమహాకవులు సాధువులనుకొని కొన్నియపప్రయోగములను జేసిరఁట!(పాణి.కావ్య.౪౬-౫౭ పుట.)సూత్రములను గల్పించి పిత్తులగు ప్రత్యయములను విధించి గాత్రనేత్రాదిశబ్దములను సాధించికొన్నచో జీప్ప్రత్యయము సుప్రాపమగునఁట! (పాణి. కావ్య. ౫౦-౫౧ పుటలు.) ఒక్కొక్కవ్యాఖ్యాత యొక్కొక్కరీతి సూత్రములను సమన్వయించునపుడందు దేనిచేతఁ బ్రయోగము సరిపడినను సరిపడిన దనుకొననగునఁట! అందేదియు శాస్త్రవిరుద్ధ మనరాదఁట! దేనిచేఁ గుదిరినప్రయోగమును దానిచే సాధించుకొనవలసినదే. (పాణి. కావ్య. ౪౭ పుట.) పాణిని సంయోగోపధములకు జీష్ప్రత్యయము రాదని చెప్పి యైదిటికిమాత్రమె వచ్చు నసెను. (క్రోడ. జఘ్న. దన్త. కర్ణ. శృఙ్గ). కాత్యాయనుఁడు పుచ్ఛశబ్దమునకును వచ్చు ననెను. ఇంకను "అఙ్గ - ఆన్త్ర- నేత్ర - గాత్ర - కణ్ఠ" అనునవి కొలవడినవి. పైరీతిని పాణినిచెప్పని యాఁటిటిని జేర్చునపుడు త్యాజ్యచిహ్నములనడుమ నిల్పి పుచ్ఛశబ్దమును నేను జేర్చఁగా "పుచ్ఛాచ్చ" అనునది వార్తికమని తెలియక వ్రాసినట్లుగ నిరసించిరి. అది కాశికాకారునిసూత్రమనియె నేను దలంచియున్నచో దానిని గాశికావాక్యములఁ జేర్పక వేఱుపంక్తిలోఁ ద్యాజ్యచిహ్నములనడుమ నిల్పుదునా? (చిం. వి. పరి. ౧౧౧ పుట.) పాణినిసూత్రములు కానివాని నచటఁ బ్రదర్శించుటయే యచటి నాయుద్దేశము.

“ఉపులిత్రియిఁయిషిషతి. (ముగ్ధ. ౧౯౯ సూ.) యనుదానివంటి ప్రయోగములు లేవనుట యెట్లు? ఎచటఁ బ్రయోగింపఁబడెనో? చూచితిరా? సర్వవేద పారిషదం హీదం శాస్త్రమ్.........సప్తద్వీపా వసుమతీ. త్రయో లోకాః. వాకో వాక్య మితిహాసః పురాణం వైద్యకమ్మని మహాభాష్యకర్త శాస్త్రమునకు విషయమును జూపెను. ఈనాఁడు వైదికవాఙ్మయమున బాహ్వృచాదులలో నొక్కశాఖయైనను లభింపకున్నది. లౌకికవాఙ్మయముననైనను సప్తద్వీపా వసుమతీ యని యతఁడుదాహరించెను. సప్తద్వీపములలోని భాషమాట యటుండ సప్తద్వీపములలోని యొక్క ద్వీపమునైనను శ్రీశాస్త్రిగారు చూడలేదు. (వీరి యీ యభిప్రాయమును బట్టి పాణినీయసాధితశబ్దములను దెలిసికొనవలెనన్న దేశాంతరములను ద్వీపాంతరములను దిరుగుటయే కాక స్వర్గమునకుఁ బోవలయునని పర్యవసితమగుచున్నది. అట్టి పండితుఁడు దుర్లభుఁడుగదా.) తుద కిప్పటికి సంస్కృతమునకుఁ బేరుపడియున్న నేపాళకాశ్మీరాదిదేశములనైన వీరు చూచియుండరే. ఏయే దేశమున నెట్టిశబ్దము లెట్టివ్యవహారమునఁ గలవో? ఎంత వాఙ్మయ మెక్కడ నెక్కడ దిగఁబడియున్నదో? శిథిలమైపోయిన వాఙ్మయ మెంతకలదో వీరి కెట్లు తెలియును?......” (పాణి. కావ్య. ౧౩౦ పు.) అని వ్రాసిరి. ఇంకఁ బాణినీయసాధితరూపములకుఁ బెక్కిటికిఁ బ్రయోగములు లేవనుట తప్పుకాదా? ఇంక “మేకాధీశా శబ్దార్థ శతకోటి”లోని ప్రయోగములవిషయమున నయిత మప్రయుక్తతాశంకాంకూరమునకైనఁ బ్రసక్తి యుండఁబోదు. దానిరీతి దిఙ్మాత్రముగఁ జూపెదను. “ధీశాః = అనుభవబుద్ధిమన్తః - వ్యా. లోమాదిత్వాత్ ‘శ’ ప్రత్యయః” (3 పుట.) “మూ. మేకాధీశా మేకాధీశా - పదచ్ఛేదము:—మేకా ధీశాః, మేకాధీశ—అ. (మేక ధీశేత్యస్య తన్త్రేణ ఆవృత్తిః). వ్యా. హే మేకాధీశ = మేకావంశాధినాథ, అ = అనన్దః - ధీశాః = ధీశా ఇతి విభక్తిః, మేకా = పఞ్చమీవిభక్తిః, అనుపదం వ్యాఖ్యాతమేతత్:—మశ్చ+అశ్చ+ఈశ్చ = మయః, మడాగమ డట్ ప్రత్యయ జీప్ప్రత్యయాః; తే, ఏ = అజ్గణే, యస్యాస్సా = మేకా = మడాగమ డట్ ప్రత్యయ జీప్ప్రత్యయ పురస్సరా, మ+సు, అ+సు, ఈ+సు, ఇత్యలౌకికే విగ్రహే సుపోలుకి, మే ఇతి జాతే తతః, మే+జస్, అ+జీ ఇతిస్థితే సుపోలుకి పూర్వరూపే శేషా ద్విభాషేతి కప్ - టాపి సుప్రత్యయే లుకి చ - మేకా ఇతి రూపనిష్పత్తిః - యద్యప్యత్ర మడాగమ డట్ ప్రత్యయ జీప్రత్యయ పురస్సరత్వం పఞ్చమీవిభక్తౌ నాస్తి. పరం తు పఞ్చమీ విభక్తిప్రతిపాదకపఞ్చమీపదే వర్తతే. తథాపి ద్విరేఫో భ్రమర ఇతివత్ లక్షితలక్షణయా పఞ్చమీపదప్రతిపాదక మేకాపదేన పఞ్చమీవిభక్తి ర్లక్ష్యతే.ఏవంచ ధీశానాం =

పదఘటితోపపదసమాసపదపరమని వారేల తలంపరైరో తెలియకున్నది. ఈయరీతిని వ్యధికరణబహువ్రీహి నంగీకరించుపక్షమునఁ బ్రథమాంతములకే బహువ్రీహియను తమసిద్ధాంతమును బాణినీయులు విడిచికొనవలసినదే. ఇంతమాత్రమే కాదు. వెనుక నుదాహరించినరీతినున్న "సమానాధికరణానాం బహువ్రీహిర్వక్తవ్యః కిం ప్రయోజనమ్. వ్యధికరణానాం మా భూదితి" (౨. అ. ౨. పా. ౨. ఆహ్ని. ౪౧౦. పుట. ప్రదీపోద్ద్యోతసహిత మహాభాష్య పుస్తకము). అను మహాభాష్యసిద్ధాంతమును సైతము విడిచికొనవలసినదే. ఈ క్రిందిరీతిని బాలమనోరమావ్యాఖ్యాత వ్రాసెను. "తథాపి 'స్థ' పద మనాదృత్య కణ్ఠే ఇత్యస్యాధికరణత్వం. తస్యచ కాల రూపే ఉత్తరపదార్థే ఉపసంక్రమః. తదా కణ్ఠే ఇత్యస్య అప్రథమాన్తత్వాత్ బహువ్రీహేరప్రసక్తేః తత్ర సప్తమ్యన్తస్య పూర్వనిపాతవిధి రభిత్తిచిత్రాయితః స్యాత్. తతశ్చ సప్తమీగ్రహణాత్ అప్రథమాన్తోపి బహువ్రీహిః క్వచిదస్తీతి విజ్ఞాయతే ఇతి రహస్యమ్. తేన సచ్ఛాస్త్రజన్మాహి వివేకలాభః ఇత్యాది సిద్ధమ్" (బాలమ. సి. కౌ. ౮౯౦. సూ. వ్యాఖ్య). "సచ్ఛాస్త్రజన్మాహి వివేకలాభః" అనుచో సైతము "సచ్ఛాస్త్రగతమగు జన్మముగలది," అనురీతిని సామానాధికరణ్యము సుఘటమే యగుచున్నది.

బహువ్రీహిసమాసమునందు భాషితపుంస్కములకుఁ (విశేష్యనిఘ్నశబ్దములకు)బుంవద్భావము వచ్చును. "స్త్రియాః పుంవద్భాషితపుంస్కా దనూఙ్ సమానాధికరణే స్త్రియా మపూరణీ ప్రియాదిషు. (౬-3-3౪) తుల్యే ప్రవృత్తినిమిత్తే యదుక్త పుంస్కం తస్మాత్పరః ఊఙో౽భావో యత్ర తథా భూతస్య స్త్రీవాచకస్య పుంవాచకస్యేవ రూపం స్యాత్ సమానాధికరణే స్త్రీలిఙ్గే ఉత్తరపదే. న తు పూరణ్యాం ప్రియాదౌ చ పరతః" (సి. కౌ. ౮3౧ సూ.) స్త్రీత్వమందును పుంస్త్వమందును దుల్యప్రవృత్తినిమిత్తకమగునది (విశేష్యనిఘ్నము) భాషితపుంస్కమనఁ బడును. (చూ. కర్మధా.) ఏయర్థమునఁ బురుషుఁడు చెప్పఁబడునో యాయర్థము

---

పణ్డితానామ్, అః = భావః = ధీశాః = పాణ్డిత్యమ్, అకారః ప్రశ్లిష్యతే - తస్మాత్ - ధీశాః=పాణ్డిత్యా దితి తదర్థః. హాహావత్ పఞ్చమ్యన్తమిదమ్. ఏవంచ న వ్యాకరణ విరోధ ఇతి తదాశయ ఇతి సిద్ధాన్తః" (౧౧-౧౨ పుటలు.) "మా. మేకాధీశా."
పదచ్ఛేదః—మా+ఇ+కా+ధీశ+అ. వ్యా:—ఇ ఇతి సంబోధనే. ధీశ = హేపణ్డిత, మా = మితిః = అనుమితిః, పూర్వోక్తా, మేకాః - ధీశాః. ధీశా ఇత్యనుమితిః, కా = కథమ్ - అ = అద్భుతమ్. సాధ్యహేత్వోరైక్యా దియ మనుమితి ర్నోపపద్యత ఇత్యాశ్చర్యమితి" (౧౨ పు.)

భాషితపుంస్కపదార్థము. భాషితపుంస్కశబ్దమునకంటెఁ బరముగ, "ఊఙ్" ప్రత్యయములేని స్త్రీవాచకశబ్దమునకుఁ బూరణీ ప్రియాది భిన్నమగు స్త్రీలింగశబ్దము పరమగుచుండఁగాఁ బుంలింగమునకువలె రూపము కల్గునని సూత్రార్థము. ఉదా:— "చిత్రాః గావో యస్యసః (చిత్రవర్ణమగు గోవులుగలవాఁడు.) = చిత్రగుః," ఇచటఁ జిత్రశబ్దము పుంస్త్వమందును స్త్రీత్వమందును (తుల్యప్రవృత్తినిమిత్తకముః) నర్థభేదము లేక వర్తించును గాన నది భాషితపుంస్కము. (చూ. అధ్యా IV విష. కర్మధా.) కాన నది పుంలింగమువంటి రూపముతో నిల్చెను. పిదప "గోస్త్రియోరుపసర్జనస్య. (౧-౨-౪౮) ఉపసర్జనం యో గో శబ్దః స్త్రీప్రత్యయాంతంచ తదన్తస్య ప్రాతిపదికస్య హ్రస్వః స్యాత్" (సి. కౌ. ౬౫౬ సూ) (ఉపసర్జనత్వమున గోశబ్దమునకును స్త్రీప్రత్యయాన్తమునకును హ్రస్వమగును. (ఓకారమునకు హ్రస్వము కారమే.) అనుసూత్రముచేఁ బైస్థలమున హ్రస్వము రాఁగా "చిత్రగు" (చిత్రగో) అనురూపము సిద్ధించినది." రూపవతీ భార్యా యస్యసః=రూపవద్భార్యః" (రూపవతి యగుభార్య గలవాఁడు.) ఇట్టి పుంవద్భావవిధులు పెక్కుగలవు.

సమాసాంతప్రత్యయములును గలవు:—"నద్యృతశ్చ. (౫-౪-౧౫౩) నద్యుత్తరపదా దృదన్తోత్తరపదాచ్చ బహువ్రీహేః కప్స్యాత్" (సి. కౌ. ౮౩౩. సూ.). నదీసంజ్ఞగల (ఈదన్తములును 'ఊ'దన్తములును నగు నిత్యస్త్రీలింగశబ్దములు నదీసంజ్ఞగలవి.) శబ్ద ముత్తరపదముగాఁ గల్గినట్టియు ఋదన్తము త్తరపదముగాఁ గల్గినట్టియు బహువ్రీహికంటెఁ బరముగా 'కప్' ప్రత్యయ మగును. "బహవః కర్తారః యస్యసః = బహుకర్తృకః (అనేకు లగు కర్తలు గలది.) పూజితా గౌరీ యేన సః = పూజితగౌరీకః. (పూజింపఁబడిన గౌరిగలవాఁడు.)" "సమాసాన్తవిధి రనిత్యః. పూజితగౌరిః." (నిత్యముగా విధింపఁబడిన సమాసాన్తప్రత్యయములు సైతము కొన్నియెడల రాకుండుట గలదు.)

"శేషా ద్విభాషా (౫-౪-౧౫౪). అనుక్తసమాన్తా చ్ఛేషాధికారస్థా ద్బహువ్రీహేః కబ్వా స్యాత్. మహాయశస్కః-మహాయశాః......" (సి. కౌ. ౮౫౧. సూ. మతోకసమాసాన్త ప్రత్యయము చెప్పఁబడనట్టియు శేషాధికారములోనిదగునట్టియు బహువ్రీహికంటెఁ బరముగ 'కప్ప్ర'త్యయము వైకల్పికముగ నగును. 'మహత్+యశః+యస్యసః' = అనుచో 'మహాయశస్కుఁడు = మహాయశుఁడు' అను ద్వివిధరూపములు గల్గును. (సమానాధికరణసమాసములలో 'మహత్' అను దాని తకారము 'ఆ'కార మగును). ఇంక సమాసాన్తములును ననేకములు గలవు.

'దశానాం సమీపే'యే సత ఉపదశాః=పదిసమీపమున నుండు సంఖ్యలు-తొమ్మిది - లేదా పదునొకండని యర్థము 'ఆసన్నవింశాః'. = వింశతికి సమీపగతములు. 'ద్వౌ వా త్రయో వా ద్విత్రాః' = రెండుగాని మూఁడుగాని. "వార్థే బహువ్రీహిః" (బాలమ. సి. కౌ. ౮౨౬. సూ). ఇట్టివానికి బహువ్రీహిసంజ్ఞ మాత్రముగలదు కాని యివి యన్యపదార్థ ప్రధానములుగావు. 'దక్షిణస్యాశ్చ పూర్వస్యాశ్చ దిశో రన్తరాళం = దక్షిణపూర్వా.' (ఆగ్నేయదిక్కు) సర్వనామములకు వృత్తిమాత్రమునఁ బుంవద్భావము గల్గును గాన 'దక్షిణాపూర్వా' అని కానేరదు. "కేశేషు కేశేషు గృహీత్వా ఇదం యుద్ధం ప్రవృత్తం తత్ కేశాకేశి - దణ్డైశ్చ దణ్డైశ్చ ప్రహృత్య ఇదం యుద్ధం ప్రవృత్తం తత్ దణ్డాదణ్డి." ఇట్టివి వ్యతీహారబహువ్రీహులు, "ముష్టాముష్టి ఇతి పూర్వపదాంతస్య ఆత్వ మపాణినీయమ్" (సి. కౌ. ౮౨౬. సూ. బాలమ. వ్యా). 'ముష్టీముష్టి' అనురీతిని బూర్వస్వరదీర్ఘము మాత్రమె సాధువని తాత్పర్యము. కాని ముగ్ధబోధవ్యాకర్త "ముష్టాముష్టి" అను దానికిని సాధుత్వమును సూత్రించెను. "వ్యతీహారే చిః పూర్వో ర్ఘోన చ్యావా. (వృత్తి) వ్యతీహారే యో హః (బహువ్రీహిః) తస్మాచ్చిః స్యాత్. పూర్వస్య చ దీర్ఘః స్యాత్ - ఆ. వా, నత్వచి" (ముగ్ధ. ౩౨౯. సూ). "యుద్ధాదన్యత్రాపి దృశ్యతే. కర్ణాకర్ణి జపన్తి హన్త నిభృతమితి మహానాటకే. పరస్పర మేకజాతీయ క్రియాకరణం వ్యతీహారః" (దుర్గా. వ్యాఖ్య). క. భీమాసుర వీరులము। ష్టాముష్టి రణచ్ఛటాచ్ఛటా శబ్దంబు। ద్దాముంబై.........(ఆర. 3. ఆ. ౩౯౪. ప) "పుత్త్రేణ సహావర్తత ఇతి సపుత్త్రః (ఇందు సహశబ్దమునకు 'స' అనునది వికల్పముగ నాదేశమగును) సహపుత్త్రః. అవిద్యమానః పుత్త్రో యస్య సః = అపుత్త్రః = అవిద్యమాన పుత్త్రః = (పుత్త్రులులేనివాఁడు) ప్రపతితం పర్ణం యస్మాత్ సః = ప్రపర్ణః = ప్రపతితపర్ణః" (రాలిన యాకు గలచెట్టు) అనురీతి వివిధబహువ్రీహులును గలవు. విస్తరభీతిని వాని లక్షణములను వివరింపలేను.

కల్పతరువు. ౨౬౭ VII విధః—ద్వన్ద్వసమాసము:—"చార్థే ద్వన్ద్వః. (౨. ౨. ౨౯.)" (సి. కౌ. ౯౦౧. సూ). చార్థమందు వర్తించు సుబన్తములకు వైకల్పికముగా సమాసము కల్గును. అది ద్వంద్వసంజ్ఞ గలదగును. సముచ్చయాన్వాచయేతరేతరయోగ సమాహారములు చార్థములు. పరస్పరనిరపేక్షములగు ననేకపదముల కొకక్రియయందు వేర్వేఱుగ నన్వయము సముచ్చయము. ఉదా:—'ఈశ్వరం గురుంచ భజస్వ' అనుచో, 'ఈశ్వరుని భజింపుము - గురునినైతము భజింపుము' అని యర్థము. భజనక్రియయందు సహాన్వయము లేదు' ఈశ్వరం గురుం' అనువానికిఁ

పరస్పరాపేక్ష లేదు. భజనక్రియతోఁ గర్మముగా 'ఈశ్వరమ్' అనునది యన్వయించిన పిదపఁ గ్రియయొక్క యావృత్తిచే 'గురుమ్' అనునదియు నన్వయించును. కావున నీ సముచ్చయమం దేక 'చ' శబ్ద ప్రయోగము మాత్ర ముండును. రెండువస్తువులలో నొకటి ప్రధానమై మఱొకటి యప్రధాన మగునపు డాచశబ్దార్థ మన్వాచయ మనఁబడును. (భిక్షా మట - గాం చానయ) భిక్షకేగుము - గోవును సైతము తెమ్ము. ఇచట భిక్షకేగు మనునదియే ప్రధానము. అట్లేఁగినపుడు మార్గమున లభించెనేని గోవును సైతము తెమ్మని తాత్పర్యము. ఈసముచ్చయాన్వాచయములు రెండిటియందును నేకార్థీభావలక్షణరూపసామర్థ్యము లేమిం జేసి సమాసము కానేరదు.

పరస్పరాపేక్షగల యనేకపదార్థముల కొకక్రియయం దన్వయ ముండునపుడు చార్థ మితరేతరయోగము. పరస్పరసాహిత్యసూచనమునకై యిందు 'చ' శబ్దద్వయప్రయోగ ముండును. "ఇతరేతరయోగం లక్షయతి మిళితానామితి పరస్పరాపేక్షితానాం సముదితానా మేకస్మిన్ క్రియాపదేఽన్వయో యత్ర, తత్రేతరేతరయోగః. పరస్పరసాహచర్యం చార్థః ప్రత్యేతవ్య ఇత్యర్థః. యథా ధవశ్చ ఖదిరశ్చ ధవఖదిరావితి అత్ర పరస్పరసాహిత్యసూచనాయ చకారద్వయప్రయోగః" (బాలమ. వ్యాఖ్య. సి. కౌ. ౯౦౧ సూ.) కొన్నియెడల ద్వంద్వఘటితపదార్థముల సాహిత్యము శాబ్దబోధమునందుమాత్రమె వర్తిల్లును. క్రియానిష్పత్తియం దద్దానికిఁ బ్రసక్తి లేకపోవచ్చును. "మాతాపిత్రోర్మృతేఽహనీతివ ద్బోధే సాహిత్యం న తు క్రియానిష్పత్తౌ" (వృద్ధిసూత్ర ప్రదీపోద్యోతము.) ఇందు మాతాపితృమరణముల కేకకాలికత్వము వక్తృతాత్పర్యసిద్ధము కాదుగదా. శాబ్దబోధమందును సాహిత్యము కొన్నికవిప్రయోగములందుఁ బాటింపఁబడలేదు. 'రామలక్ష్మణులు రావణేంద్రజిత్తులను వధించిరి.' అనువ్యవహారమున రావణేంద్రజిత్తుల హననమున రామలక్ష్మణు లిద్దఱకు సహవ్యాపారము భాసిల్లుటచే రాముఁడు రావణుని లక్ష్మణుఁ డింద్రజిత్తును వధించిరను ప్రత్యేకార్థము లభింపనేరదు. భాష్యసమ్మతము కాకున్నను బ్రయోగానురోధమున యథాసంఖ్యాన్వయమును వేఱుగ వ్యాఖ్యానించుకొనవలసినదె యని యెఱుంగునది. ఇతరేతరద్వంద్వము బహుపదఘటితమును గావచ్చును. ఉదా:—'రాముఁడును+లక్ష్మణుఁడును+భరతుఁడును+శత్రుఘ్నుఁడును=రామలక్ష్మణభరతశత్రుఘ్నులు.' ఇందు 'చ' శబ్దార్థము సమాసశక్తిచే బోధ్యమగునుగాన విగ్రహవాక్యములోని చశబ్దములు సమాసమున లోపించును. సమాసఘటితపదార్థముల సంఖ్యనుబట్టి యిందు వచన మేర్పడును. సమాసచరమావయవశబ్దముయొక్క

లింగము నిల్చును. "సీతాచ+రామశ్చ = సీతారామౌ" = సీతయు రాముఁడును = సీతారాములు, ద్వంద్వాంతమున నిల్చుశబ్దము ద్వంద్వఘటితపదము లన్నిటితోను బ్రత్యేకముగ సంబంధించును. ఉదా:—కృష్ణార్జునప్రభావము వర్ణనాతీతము = కృష్ణప్రభావము నర్జునప్రభావమును వర్ణనాతీతములు. ద్వంద్వఘటితపదముల పౌర్వాపర్యము విషయమున వైయాకరణులు పెక్కునియమములను వచించిరి. కాని యవెల్లఁ బ్రాయికములు. అట్టినియమములకు విలక్షణములగు ప్రయోగ ములును గలవు. అట్లయినను వానిలోఁ గొన్ని యిటఁ బ్రదర్శింపఁబడుచున్నవి. "ద్వంద్వే ఘి (౨-౨-3౨) ద్వన్ద్వే ఘి సంజ్ఞం పూర్వం స్యాత్ - హరిశ్చ+హరశ్చ = హరిహరౌ" (సి. కౌ. ౯౦3 సూ.) నదీసంజ్ఞికములు కాని (స్త్రీప్రత్యయాంతములు కాని) యికారాన్తములు ఘిసంజ్ఞగల వగును. సఖిశబ్దమునకు ఘిసంజ్ఞ లేదు. రవి - హరి - గురు-విష్ణు - మొ. "అనేకప్రాప్తా వేకత్ర నియమోఽనియమ శ్శేషే (వార్తి. ౧౪౧౦) హరిగురుహరాః - హరిహరగురవః" - పెక్కుఘిసంజ్ఞికము లున్నపు డొక్క చోటనే యీనియమము చెల్లునని వార్తికార్థము. (సి. కౌ. ౯౦3 సూ.)

"అజా ద్యదన్తమ్ (౨-౨-33) ఇదం ద్వన్ద్వే పూర్వం స్యాత్. ఈశకృష్ణౌ, బహుష్వనియమః. అశ్వరథేన్ద్రాః=ఇన్ద్రాశ్వరథాః". "ఘ్యన్తా దజా ద్యదన్తం విప్రతి షేధేన (వార్తి. ౧౪౨౬) ఇన్ద్రాగ్నీ" (సి. కౌ. ౯౦౪) అచ్చు పదాదియందును 'అ'కారము పదాంతమందును గలది యజాద్యదన్త మనిపించుకొనును. అట్టిది ద్వంద్వమునఁ బూర్వపద మగును. ఘ్యన్తముకన్నను నజాద్యదన్తము పూర్వపద మగును. ఈశకృష్ణులు ఇంద్రాగ్నులు. "అల్పాచ్‌తరం పూర్వమ్. (౨-౨-3౪) (అల్పసంఖ్యాకస్వరము లు గలది మొదట నిల్చును. శివకేశవులు.) శివకేశవౌ...... లఘ్వక్షరం పూర్వమ్ (వార్తి. ౧౪౧3) కుశకాశమ్ - అభ్యర్హితంచ. (వార్తి. ౧౪౧౨) తాపసపర్వతౌ (పూజార్హము = శ్రేష్ఠము = అభ్యర్హితము - కృష్ణార్జు నులు) - (మాత పితలు (గర్భధారణపోషాభ్యాం । పితుర్మాతాగరీయసీ" (సి.కౌ ౯౦౫ సూ.) "మాతాపితరౌ పిత్రాదాహరతా ప్రాయేణ ద్వన్ద్వే స్త్రీలిఙ్గస్యైవ పూర్వస్థితి రితి సూచితమ్. తేన........వధూవరౌ ఇత్యాది. క్వచిన్న........ తేన "సోఽధవ ద్వరవధూ సమాగమః.........ఇతిరఘౌ" (ముగ్ధ. 3౨౧ సూ. దుర్గా. వ్యాఖ్య.)

కల్పతరు. ౨౬౭ VIII సమా హారద్వంద్వము:—సమాహార మనఁగా సమూ హము. ద్వంద్వఘటితపదార్థముల సమూహము సమాహి ద్వారమునఁ గ్రియతో నన్వయించును. ప్రధానముగు సముదాయ మొక్కటే సమాసబోధ్య మగుటచే నిది

యేకవచనాంత మె యగును."స నపుంసకమ్. (౨-౪-౧౭) సమాహారే ద్విగు ర్ద్వన్ద్వశ్చ నపుంసకం స్యాత్ - పరవల్లి ఙ్గాపవాదః." (సి. కౌ. ౮౨౧ సూ.) పయిసూత్రము చొప్పున సమాహారద్వంద్వ మేకవచనాంతము నపుంసకలింగము నగును. "ద్వన్ద్వశ్చ ప్రాణితూర్య సేనాఙ్గానామ్ (౨-౪-౨) ఏషాం ద్వన్ద్వః ఏకవత్ స్యాత్. పాణి పాదమ్." "(పాణ్యోః పాదయోశ్చ సమాహారః" అని విగ్రహము. ఇది ప్రాణ్యంగ మోదాహరణము) 'మార్దఙ్గికపాణవికమ్' (ఇది తూర్యాఙ్గోదాహరణము. 'మార్దఙ్గికపాణవికయోః సమాహారః' అని విగ్రహము. మృదంగవాదక పణవ వాదకుల సమాహార మని యర్థము) 'రథికాశ్వారోహమ్' (ఇది సేనాంగోదాహరణము. 'రథికానా మశ్వారోహాణాం సమాహారః' అని విగ్రహము. రథికు లయు నశ్వారోహులయు సమాహారమని యర్థము.) (సి. కౌ. ౯౦౬ సూ.) ఇట్లు ప్రాణ్యంగ తూర్యాంగ సేనాంగముల కేకవద్భావ మనఁగా సమాహారద్వంద్వము నెన్న నగును. బహుపదసమాహారమును నుండును. రథగజతురగపాదాతము. "సమాహార మేకరూపమే కాన నచట నేకవద్భావము సిద్ధమగుచుండ సమాహార ద్వన్ద్వవిషయకమగు నీ ప్రకరణము నియమార్థ మగును. ప్రాణ్యంగాదులకు సమాహారమందే సమాస మగునుగాని యితరేతరయోగమున లేదని నియమస్వరూపము" (కౌము శర. ౩౪౨ పుట.) "విభాషా వృక్ష మృగ తృణ ధాన్య వ్యఞ్జనపశు శకు న్యశ్వ బడబ పూర్వాపరాధరో త్తరాణామ్. (౨-౪-౧౨) వృక్షాదీనాం సప్తానాం ద్వన్ద్వః, అశ్వబడబేత్యాది ద్వన్ద్వత్రయంచ ప్రాగ్వద్వా (ప్రాగ్వత్ = సమాహారద్వన్ద్వః ఏకవత్ స్యాత్) ........ప్లక్షన్యగ్రోధమ్, ప్లక్షన్యగ్రోధాః, (ప్లక్షాశ్చ న్యగ్రోధాశ్చ అని విగ్రహము) (వృక్ష). రురుపృషతమ్ రురుపృషతాః (మృగ). కుశకాశమ్- కుశకాశాః (తృణ). వ్రీహియవమ్ - వ్రీహియవాః (ధాన్య). దధిఘృతమ్ - దధిఘృతే (వ్యఞ్జన). గోమహిషమ్ - గోమహిషాః (పశు). శుకబకమ్ - శుకబకాః (శకుని)..." (సి. కౌ. ౯౧౬ సూ.) ఇట్టి యేకవద్భావవిధులు పెక్కుగలవు.

సమాసాన్తవిధులు-సమాసాశ్రయవిధులును నీద్వంద్వమందుఁ బెక్కు గలవు. "ఆనఙ్ ఋతో ద్వన్ద్వే (౬ - ౩ - ౨౫). విద్యాయోని సంబన్ధవాచినాం ఋదన్తానాం ద్వన్ద్వే ఆనఙ్ స్యాత్ ఉత్తరపదే......మాతాపితరౌ పితాపుత్రౌ. హోతృపోతృ నేష్టోద్గాతారః - హోతాపోతానేష్టోద్గాతారః" (పుత్రేన్యతరస్యామ్మను సూత్రము నుండి మండూకప్లుతిచే పుత్రశబ్ద మనువర్తించును) (సి. కౌ. ౯౨౧. సూ.). విద్యా సంబంధవాచకములు యోనిసంబంధవాచకములు నయిన ఋదంతశబ్దములకు ద్వంద్వము దట్టిసంబంధమేగల ఋదంతముగాని పుత్రశబ్దముగాని యుత్తరపద మగు

నపుడు 'ఆనఙా'దేశ మగును. "మాతాచ పితాచ = మాతాపితరౌ" అనుచో, ఋత్రోత్పాదనమందు వారికి యోనికృతసంబంధము గలదు. 'ఆనఙ్'అనునది ఋ స్థానమున నా దేశమయ్యెను. ఙకార మిద్వ్యము - అకార ముచ్చారణార్థ ... రము సమాసమున లోపించును. 'పితాచ పుత్త్రశ్చ = పితాపుత్త్రౌ' అనుచో ... జన్యజనకభావరూపమగు యోనిసంబంధము గలదు గాన నానఙ్ వచ్చినది. "హోతా చ+పోతాచ+నేష్టాచ+ఉద్గాతాచ = హోతృపోతృనేష్టోద్గాతారః" అనుచో వారి కేక యజ్ఞమునందు విద్యాద్వారమున ఋత్విక్సంబంధము గలదు గాన 'ఆనఙ్' వచ్చినది. హోత = హోమముచేయువాఁడు - పోత = ఋత్విజులలో నొకఁడు - నేష్ట = ఋత్విజులలో నొకఁడు - ఉద్గాత = ఋత్విజులలో సామవేదమంత్రము నడపువాఁడు. వీనిలో నుత్తరపదపరకత్వము నేష్టృశబ్దమునకే గలదు గాన దానికి మాత్రము 'ఆనఙ్' వచ్చినది. "హోతాచ+పోతాచ = హోతాపోతారౌ, నేష్టాచ+ఉద్గాతాచ = నేష్టోద్గాతారౌ, హోతాపోతారౌచ + నేష్టోద్గాతారౌచ" అనుద్వంద్వ ద్వయగర్భమగు ద్వంద్వసమాసమున నన్నిటికిని నుత్తరపదపరకత్వము సంభవించునుగాన మూఁడుచోట్లందును 'ఆనఙ్' రాఁగా 'హోతాపోతానేష్టోద్గాతారః' అనురూపము సిద్ధించును.

"దేవతాద్వన్ద్వేచ (౬ - 3 - ౨3) (సి. కౌ. ౯౨౨). విద్యాయోనిసంబంధములు ఋదంతత్వము లేమింజేసి యీసూత్ర మారంభింపఁబడెను. వేదమందుఁగాని లోకమందుఁగాని సుప్రసిద్ధమగు సంబంధముగల దేవతావాచకద్వంద్వమందు నట్టి దేవతావాచియగు నుత్తరపదము పరమగుచుండఁగా 'ఆనఙ్'వచ్చును. ఉదా:— 'మిత్రశ్చ+వరుణశ్చ = మిత్రావరుణౌ' 'సూర్యశ్చ+చన్ద్రమాశ్చ = సూర్యాచన్ద్రమసౌ' మొ. "మాతరపితరావుదీచామ్. (౬ - 3 - 3౨). మాతరపితరౌ" (సి. కౌ. ౯౨౯). "మాతాచ+పితాచ" అనుద్వన్ద్వమున 'మాతరపితరౌ' అనియు రూపము గలదని తాత్పర్యము. ఆనఙు వచ్చుటచే 'మాతాపితరౌ' అనురూపమును సిద్ధించుచున్నది.

"ద్వన్ద్వా చ్చుదషహాన్తా త్సమాహారే (౫ - ౪ - ౧౦౬). (సి. కౌ. ౯3౦.) చవర్గాంతములకన్నను దకార షకార హకారాంతములకన్నను సమాహారద్వంద్వమున 'టచ్' ప్రత్యయ మగును. "వాక్ చ+త్వక్ చ తయోః సమాహారః = వాక్త్వచమ్. త్వక్ చ+స్రక్ చ - తయోః సమాహారః = త్వక్స్రజమ్. శమీదృషదమ్ - ఛత్రోపానహమ్" మొ. ఇట్టివి పెక్కుగలవు. అహోరాత్రము వాఙ్మనసము - మొదలగునవి పెక్కుసమాసాంత ప్రత్యయాన్తములు గలవు - విస్తరభీతి నుదాహరింపలేదు.

కల్పతరువు. ౨౬౮ IX విష:—ఏకశేషవృత్తి:—ఏకశేషవృత్తి ద్వంద్వాప వాదము. ఏకశేషమునకు ద్వంద్వసంజ్ఞయు సమాససంజ్ఞయు లేవు. 'రామశ్చ+ రామశ్చ' అనుచో 'రామరామౌ' అని కానేరదు. ఇంక 'రామౌ' అనియే రూప సిద్ధి కల్గును. అట్టి యేకశేషస్థలములు పరిదీకరింపఁబడుచున్నవి. "సరూపాణా మేక శేష ఏకవిభక్తౌ (౧ ౨-౬౪) ఏకవిభక్తౌ యాని సరూపాణ్యేవ దృష్టాని తేషా మేక ఏవ శిష్యతే.........రామౌ (రామశ్చ+రామశ్చ). (సి. కౌ. ౧౮౮ సూ.)" ఎల్ల విభక్తులందును సమానరూపమే కల శబ్దములలో నొకశబ్దమే మిగులును. "రామశ్చ+ రామశ్చ=రామౌ" (రాముఁడును+రాముఁడును=రాములు) అని రూప మేర్పడును. కొన్ని విభక్తులందు రూపభేదము లేకున్నను నెందేని భేదమున్నచో నేకశేషము కానేరదు - "మాతాచ + (పరిచ్ఛేత్త) (కొలుచువాఁడు) మాతాచ (తల్లి) మాతృ మాతరౌ" అని ద్వంద్వమే యగును. "మాతా - మాతరౌ - మాతరః" అని జననీవాచకత్వమందును 'మాతా - మాతారౌ - మాతారః' అని పరిచ్ఛేత్తృవాచ కత్వమందును ప్రథమావిభక్తియందు రూపభేదము వీనికి గన్పట్టుచున్నదిగదా. "మాతృశబ్దస్తావ జ్జననీవాచీ. పరిచ్ఛేత్తృవాచీచ, తత్ర మాతృభ్యా మితిభ్యామాదా క్వ చిత్సారూప్యే సత్యపి, ఔజసాదిషు మాతరౌ - మాతారావితి వైరూప్యదర్శ నాత్ నైకశేషః" (బాలమ. వ్యా. సి. కౌ. ౧౮౮. సూ.) "పుమాన్ స్త్రియా॰ (౧ - ౨ - ౬౭). స్త్రియా సహోక్తౌ పుమాన్ శిష్యతే, తల్లక్షణ ఏవ విశేషశ్చేత్ - హంసీచ హంసశ్చ = హంసౌ" (సి. కౌ. ౯౩౩ సూ.) స్త్రీవాచకముతోడి సహోక్తి యందుఁ బుంవాచకము శేషించును. ఆరెండిటికిని బుంస్త్వస్త్రీత్వ భేదముమాత్రమే యున్నపుడె యట్లు సంభవించును. "హంసశ్చ వరటాచ - హంసవరటే" అనుచో నేకశేషము కానేరదు. వరట యనఁగా హంసి యనఁగా నాఁడుహంసము. "పితా మాత్రా. (౧ - ౨ - ౭౦). మాత్రా సహోక్తౌ పితా వా శిష్యతే - మాతాచ పితాచ = పితరౌ - మాతాపితరౌ" (సి. కౌ. ౯౩౬). మాతృశబ్దముతోడి సహోక్తి యందు పితృశబ్దము వైకల్పికముగా శేషించును. "పితరౌ = మాతాపితరౌ = మాతరపితరౌ" = తల్లిదండ్రులు. ఇచటి లింగవిశేషములనుగూర్చి ౨౪౯ విష. విస్తర II చూడవలెను. "గ్రామ్యపశుసంఘే ష్వతరుణేషు స్త్రీ (౧ - ౨ - ౭౩) ఏషు సహ వివక్షాయాం స్త్రీ శిష్యతే. పుమాన్ స్త్రియే త్యస్యాపవాదః. గావ ఇమాః" (సి. కౌ. ౯౩౯. సూ.) అనేకశఫములగు గ్రామ్యపశువుల సంఘములలో (లేఁతవి కానపుడు) పుంలింగములతోడి సహోక్తియందు స్త్రీలింగము శేషించును. "గావశ్చ (ఎద్దులును) గావశ్చ (ఆవులును) గావః" అని యగును. అట్టి 'గావః' అనునది

స్త్రీలింగమని విశదీకరించుటకు 'ఇమాః' అనునది నిల్పఁబడెను. అశ్వము లేకశఫములు (ఒకడెక్కగలవి) గాన నవి గ్రామ్యపశుసంఘములైనను నీవిధి వర్తింపదు. "అశ్వాశ్చ + (మగగుఱ్ఱములు) అశ్వాశ్చ = (ఆఁడుగుఱ్ఱములు) అశ్వా ఇమే" అనియగును. పుంలింగము శేషించెనని తెల్పుటకై 'ఇమే' అనునది నిల్పఁబడెను. "నపుంసక మనపుంసకే నైకవ చ్చాన్యతరస్యామ్. (౧ - ౨ - ౬౯)" (సి. కౌ. ౯3౫ సూ) నపుంసకమునకు నపుంసకేతరములతోడి సహావివక్షయందు నపుంసకమే శేషించును. ఇట్టి నపుంసకశిష్టత నిత్యమై యగును. ఆ శేషించినది యేకవచనాంతము వైకల్పికముగ నగును. వానికి లింగకృతమగు భేదముమాత్రము గల్గునపుడె యీవిధి వర్తిల్లును "శుక్లశ్చ + (పటము) శుక్లాచ+(పటి) శుక్లంచ = (పటమ్) శుక్లమ్—శుక్లాని" అని రెండువిధములుగాను శేషించును.

కల్పతరు. ౨౬౮ X విష:—అలుక్సమాసములు కొన్నియెడల సమాస విభక్తికి "సుపోధాతు........."అను (౨౬౮ I విష.) సూత్రముచొప్పున లోపము కల్గకుండుటయుఁ గలదు. అలుక్సమాసవిధాయకసూత్రములు సుపోధాత్విత్యాది కపవాదములు. అట్టివి "అలుక్సమాసములు" అనఁబడును. అట్టివి తెల్గున "సి. వనజేక్షణామనోధన పశ్యతోహరుండు" అనురీతిని బ్రయోగింపఁబడు చుండును.

"పుంసానుజో జనుషాన్ధ ఇతిచ (వార్తి. 3౮౮౧.) యస్యాగ్రజః పుమాన్ సపుంసానుజః (పురుషునిచేత ననుజుఁడు = పురుషుఁ డగ్రజుఁడు గాఁగలవాఁడు) జనుషాన్ధో = జాత్యన్ధః" (జనుషా = జన్మముచేతనే, అన్ధః = అంధుఁడు) (సి. కౌ. ౯౬౦ సూ.) "వైయాకరణాఖ్యాయాం చతుర్థ్యాః (౬-3-౭) ఆత్మనః. ఇత్యేవ ఆత్మనే పదమ్" (సి. కౌ. ౯౬౪ సూ) "పరస్యచ (౬-3-౮) పరస్మైపదమ్........." (సి. కౌ. ౯౬౫.) "వాగ్దిక్ పశ్యద్భ్యః యుక్తిదండహారేషు. (వార్తి. 3౮౯౭) షష్ఠ్యాఅలుక్. వాచోయుక్తిః (యుక్తియుక్తమగుమాట). దిశోదణ్డః (దిక్కుయొక్క దండము=దిక్కునందలి దణ్డము) పశ్యతోహరః" (పశ్యన్తమనాదృత్య హరతీత్యర్థః) = (చూచుచున్నవానిని వంచించి దొంగిలించువాఁడు) (సి. కౌ. ౯౭౯ సూ.) "ఋతో విద్యాయోని సంబన్ధేభ్యః (౬-3-౨3)" (సి. కౌ. ౯౮౧ సూ.) ఋదన్తములగు విద్యాయోనిసంబంధవాచకములకంటెఁ బరముగనున్న షష్ఠి విద్యాయోని సంబంధవాచకములు పరమగునపుడు లోపింపదు. "పితుర న్తేవాసీ (తండ్రికిశిష్యుఁడు). పితుః పుత్త్రః" (తండ్రికిఁగుమారుఁడు). అన్యతరపరత్వ మంగీకృత మగుటచేత "హోతుః పుత్త్రః" (హోతయొక్క పుత్త్రుఁడు) అనియు నలుక్సమాసము సాధు

వగును. "భ్రాతృజాయా" మ్మను మేఘసందేశ ప్రయోగము 'పితామహః పితృపితా' అనునమరో క్తియు వీని కన్యథాత్వమును జూపుచున్నవి. పితుఃస్వస (మేనత్త)మాతుః స్వస(పినతల్లి) 'పితృష్వస-మాతృష్వస' అనుపాక్షికరూపములును వైయాకరణసమ్మతములు. "ఇవేన సమాసోవిభక్త్యలోపశ్చ (వా ర్తి. ౧౨౩౬ ౧౩౮౧) జీమూతస్యేవ" (మేఘమునకువలె) (సి. కౌ. ౬౫౦ సూ.) ఈసమాసము వైకల్పికమనుట భాష్యసమ్మతము కావుననే 'ఉద్బాహురివ వామనః' (రఘు. ౧ సర్గ) అను కాళిదాస వ్యస్తప్రయోగము సాధువగుచున్నది. దేవానాం ప్రియుఁడు = మూర్ఖుఁడు (బౌద్ధులబిరుదము.) దాస్యాః పుత్త్రుఁడు = నింద్యుఁడు మొదలగునవియును వైయాకరణసమ్మతములు. "అమూర్ధమస్తకాత్ స్వాఙ్గా దకామే (౬-౩-౧౨) కణ్ఠేకాలః" (కంఠమున నల్పుగలవాఁడు = శివుఁడు) (సి. కౌ. ౯౭౦ సూ) (విస్తర II. ౨౬ల VI-విష.) మూర్ధమస్తకశబ్దభిన్నములయిన స్వాంగవాచకములకంటెఁ బరమగు సప్తమికిఁ గామశబ్దేతరము పరమగుచుండఁగా సంజ్ఞయందు లోపము గల్గదని సూత్రార్థము. కంఠే కాలుఁడు. మొ. "హలదన్తాత్సప్తమ్యాః సంజ్ఞాయామ్. (౬-౩-౯) ........ యుధిష్ఠిరః (యుధి+స్థిరః = యుద్ధమందు స్థిరుఁడు) హలన్తమునకంటెను 'అ'దన్తముకంటెను బరమగు సప్తమికి సంజ్ఞయందు లోపము కల్గదని యర్థము. దివిజులు - సరసిజము మున్నగు పెక్కులగు పలుకులింకను గలవు. విస్తరభీతిని జూపలేదు.

కల్పతరు. ౨౬ల XI విష:—సర్వసమాసాంతప్రకరణము:—ఆయాప్రకరణములం దాయాసమాసములందు వచ్చు సమాసాన్తప్రత్యయము లీవఱకుఁ జూపఁబడెను. ఇందు సర్వసమాసముల తుదిని వచ్చు ప్రత్యయములు మిశ్రముగఁ జెప్పఁబడుచున్నవి. "ఋక్పూరబ్ధూః పథా మానక్షే (౫-౪-౭౪) అ-అనక్షే ఇతి ఛేదః. ఋగాద్యన్తస్య (ఋక్ పూర్ అప్-ధూర్-పథిన్) సమాసస్య అప్రత్యయో ఽన్తావయవః స్యాత్, అక్షేయా ధూస్తదన్తస్య తు న. అర్ధర్చః...విమలాపం సరః." (సి. కౌ. ౯౪౦ సూ.) "అర్ధ+ఋచ్+అ = అర్ధర్చః. (ఋక్కులో సగము) విమల+అప్+అ = విమలాపమ్ = (నిర్మలజలముగలది సరస్సు.) విష్ణు+పుర్+అ=విష్ణుపురమ్. రాజన్+ధుర్+అ = రాజధురా (రాజ్యభారము) రమ్య+పథిన్+అ = రమ్యపథః" అని రూపము లేర్పడును. ఇట్టివి పెక్కుగలవు. "స్త్రీచ+పుమాంశ్చ = స్త్రీపుంసమ్-వాక్చ+మనశ్చ = వాఙ్మనసమ్ - పురుషస్య+ఆయుస్=పురుషాయుషమ్" మున్నగు నిపాతములు నింకననేకవిశేషములును గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు.

కల్పతరువు. ౨౬ల XII విష:—సమాసాశ్రయవిధులు:—సమాసపదముల నడుమ జరిగెడి పెక్కుకార్యవిశేషములు సంస్కృతవ్యాకరణమున నుపదేశింపఁబడినవి. అట్టి విట దిక్ప్రదర్శనముగఁ జూపఁబడుచున్నవి.

"ఇకో హ్రస్వోఽఙ్యో గాలవస్య (౬-3-౬౧) ఇగన్తస్యాఙ్యన్తస్య హ్రస్వో వాస్యాత్ ఉత్తరపదే. గ్రామణిపుత్త్రః - గ్రామణీపుత్త్రః" (సి. కౌ. ౯౯౯ సూ.) ఙ్యన్తము కాని ఇక్ ప్రత్యాహారాన్తముల (ఇ-ఉ-ఋ) కుత్తరపదము పరమగు చుండఁగా హ్రస్వము వైకల్పికముగ నగును. "గ్రామణి యగు పుత్త్రుఁడు లేదా గ్రామణియొక్క పుత్త్రుఁడు" అని కర్మధారయమునుగాని తత్పురుషమునుగాని గ్రహింప వలయును. గ్రామణీశబ్దములోనిది 'నీ' ధాతువుయొక్క 'ఈ'కారమేకాని ఙీప్రత్యయసంబంధి కాదు. "గ్రామణీః+పుత్త్రః = గ్రామణీపుత్త్రః" అని రూపము కల్గినది. "ఙ్యాపోః సంజ్ఞా ఛన్దసో ర్బహులమ్ (౬-3-౬3) రేవతిపుత్త్రః - అజక్షీరమ్" (సి. కౌ. ౧౦౦౧ సూ.) ఙ్యన్తమునకు నాబంతమునకు నుత్తరపదము పరమగుచుండఁగా సంజ్ఞావాచిత్వమునను ఛందస్సునందును హ్రస్వము కల్గును. "రేవత్యాః+పుత్త్రః = రేవతిపుత్త్రః" అనుచోప్పున సిద్ధించిన రేవతిపుత్త్రుఁడనునది యొకని పేరు. అజాయాః+క్షీరమ్ = అజక్షీర మ్మనునది తైత్తిరీయమున సంజ్ఞగాఁ బ్రయోగింపఁబడెను. "జ్యోతిర్జనపదరాత్రినాభినామగోత్రరూపస్థానవర్ణవయో వచనబన్ధుషు (౬-3-౮౫) ఏషు ద్వాదశ సూత్తరపదేషు సమానస్య సః స్యాత్. సజ్యోతిః" (సి. కౌ. ౧౦౧3 సూ.) జ్యోతిః ప్రభృతులు పరమగునపుడు పూర్వపదమగు 'సమాన' అనుదానికి 'స' అనునది యాదేశమగును. "సమానం గోత్రం యస్య సః = సగోత్రః" = (సమాన గోత్రజాతుఁడు) "సమానం వయః యస్య సః సవయస్కః "(సమానమగువయస్సు గలవాఁడు.) అనురీతిని విగ్రహముల నెన్నునది. "విశ్వస్య వసురాటోః (౬-3-౧౨౮) విశ్వశబ్దస్య దీర్ఘోన్తాదేశః స్యాద్వసౌ రాట్ శబ్దేచ పరే విశ్వం వసు యస్య సః = విశ్వావసుః.........విశ్వారాట్" (సి. కౌ. 3౭౯ సూ.) విశ్వావసు వనువాఁ డొకగంధర్వుఁడు. విశ్వావసు వనున దొకసంవత్సరము "విశ్వారాజ్ విశ్వేషాం రాజని పరమేశ్వరేచ" (శబ్దస్తో) "మిత్త్రే చర్షౌ (౬-3-౧3౦) విశ్వామిత్త్రః. ఋషావేవ - విశ్వమిత్త్రో మాణవకః" (సి. కౌ. ౧౦౪౯ సూ.) మిత్త్రశబ్దము పరమగుచుండఁగా ఋషి యర్థమగుచుండఁగా బూర్వపదమగు విశ్వశబ్దమునకు దీర్ఘమగునని సూత్రార్థము. "పృషోదరాదీని యథోపదిష్టమ్. (౬-3-౧౦౯) పృషోదరప్రకారాణి శిష్టై ర్యథోచ్చారితాని తథైవ సాధూని స్యుః - పృషత్+ఉదరమ్ (పృషోదరము) తలోపః-వారివాహకో వలాహకః - పూర్వపదస్యవః - ఉత్తరపదాదేశ్చ లత్వమ్..." (సి. కౌ. ౧౦3౪ సూ.) పృషోదరశబ్దమువంటివి శిష్టప్రయోగమునుబట్టి యే సాధువులగును. "పృషతః+ఉదరమ్ = పృషోదరమ్. షష్ఠీసమాసే సుబ్లుకి తలోపే - అద్గుణః ఇతిభావః." (బాలమ.) అనురీతిని వీనిరూపసాధనప్రక్రియ నూహించుకొననగును.

సమాసాశ్రయవిధులు వ్యాకరణమున ననేకములు గలవు. విస్తరభీతి నుదాహరింపలేదు.

పయిరీతి సిద్ధసమాసములు సంస్కృతవ్యాకరణమున సవిస్తరముగా విశదీకరింపఁబడెను. ఎంత చెప్పినను గొంతంత యుండక తీరదు "కృత్తులు - తద్ధితములు - సమాసములు" అనువానిలక్షణము పూర్ణముగఁ జెప్ప శక్యముకాదు. "కృత్తద్ధిత సమాసానా । మభిధానం నియామకమ్ । లక్షణం త్వనభిజ్ఞానాం । తదభిజ్ఞాన సూచకమ్. ఇతి ప్రాఞ్చః." (ముగ్ధ. ౧౧౮౩ సూ. వివ.)

౨౬౮ XIII విష:—కొన్ని సిద్ధసమాసాదివిశేష ప్రయోగములు.—తే-గీ. మున్న కొనివచ్చు గణికాసమూహితోడ. (నన్ని. కు. 3 ఆ. 3౫౧.౧౦ ఆ. 3౭౫-3౮౬ ప.) ద్విపద - భక్తసమూహికి బసవయ్యమహిమ. (బసవ. ౨ ఆ. ౬౪౭ ప.) పనిఁగొని సకలభక్తసమూహి చూడ. (౭ ఆ. ౯౪౪ బసవ.) సమూహిశబ్దము దుష్టమగు వైరిపదమువంటి యసాధారణప్రయోగముగ బసవపురాణపీఠికలో నుదాహరింపఁబడెను. (బసవ. పీ. ౯౯ పు) కాని యిది సాధువె యనందగును. "సు ప్యజాతౌ ణిని స్తాచ్ఛీల్యే. (3-౨-౭౮) అజాత్యర్థే సుపి ధాతోర్ణిని స్స్యాత్ - తాచ్ఛీల్యే ద్యోత్యే, ఉష్ణభోజీ. (ఉష్ణం భోక్తుంశీల మస్య)........ఇహ వృత్తికారేణ ఉపసర్గభిన్న ఏవ సుపి ణిని రితి........తచ్చ భాష్యవిరోధా దుపేక్ష్యమ్, ప్రసిద్ధ శ్చోపసర్గే ణినిః-ప బభూ వోపజీవినామ్, అనుయాయివర్గః, పత త్యధోధామ విసారి. నవఞ్చనీయాః ప్రభవో నుజీభి రిత్యాదౌ" (సి. కౌ. కృదన్త. ౨౯౮౮ సూ) "భాష్యవిరోధాదితి - సుబ్గ్రహణ ముపసర్గగ్రహణానువృత్తి నివృత్త్యర్థమ్ - ఉపసర్గే అనుపసర్గేచ సుబన్తే ఉపపదే ధాతోర్ణిని రిత్యేవ భాష్యే ఉదాహృతత్వా దితిభావః" (బాలమ.) అనురీతిని 'సమూహితుం పరస్పర మేకీభవితుం శీలమస్య = సంఘస్య సమూహీ' అనువ్యుత్పత్తిచొప్పున సమూహిశబ్దము సిద్ధించుచున్నది. ఏకీభవించు శీలము గల సంఘ మని యర్థము.

౨ ద్విపద. మఱియును విను బెజ్జ మహాదేవి యనఁగ (బసవ. 3 ఆ. 3౧3). ఇట్టిచోటులందలి మహాశబ్దము మహచ్ఛబ్దభవ మని (మహాశబ్దమువలెనె) బసవ పురాణపీఠికలో వ్రాయఁబడెను. (బస. పీ. ౧౦౨ పు.) ఇది సరికాదు. మహాశబ్దము మహచ్ఛబ్దభవమైన స్త్రీపరుమైయైనచో 'తెల్ల+వాఁడు' మున్నగురీతిని 'మహా వాఁడు' మున్నగు ననిష్టరూపములు దుర్వారములు కావలసివచ్చును. కావున 'అ' కారాంత మగు మహాశబ్ద మిట్టియెడల నవ్యభిప్రేతమని యెన్నగును. "మహ - పు. (మహ+ ఘఞర్థే క) ఉత్సవే సతతానందజనకవ్యాపారే. తేజసి - యజ్ఞే........" (శబ్దస్తో).

'శ్లో. మ్మైహ్రా। ర్ష్ణద్ధస్పున్ మమహన్దసాహి రయతే సార్థాభిధా మస్వహామ్' (వేంకటపతిరాయల శాసనము.) "మహ = తేజో యుక్తయగు దేవి. లేదా ఆనందయుక్తయగు దేవి" అని మధ్యమపదలోపసమాసము నంగీకరింపనగును. 'మాకేమి పట్టుము మహాలింగదేవ' (బసవ. ౨ ఆ ౬౫౦) అని యిట్లు పెక్కుచోట్ల దీనిని సోమనారాధ్యుఁడు ప్రయోగించి యున్నాఁడు. పయిరీతి మధ్యమపదలోపిసమాసములును సోమరారాధ్యునకు సమ్మతములె. "అనురాగచిత్తుఁడు (బసవ. ౧ ఆ. ౧౫౪-౬౧౧ ప.) ఆశ్చర్యహృదయుఁడై (౫ ఆ ౧౬౭). సంతోషచిత్తుఁడై (౫ ఆ. ౨౨). సంతాపచిత్తులై చయ్యన నేఁగి (౨ ఆ. ౩౯౪) (౨ ఆ. ౨౪౩-౨౭౨.)

3 ద్వి. ఇది సుమహాత్తత్త్వము......(బస. ౧ ఆ. ౨౬౭). ఇట 'సుమహాతత్త్వ'మని సవరింప నగునుగాని సోమనారాధ్యునకు "మహత్" అనుదానిని గర్మధారయమునఁ బ్రయోగించుట యభిలషితము. ద్వి. 'ప్రోద్గతసూత్రమహద్గురుపుత్త్ర। మండలిలో భవన్మహదాజ్ఞ...(పండితా) అని ప్రాసాదిస్థలములలోఁ బ్రయోగించినాఁడు (బస. పీ. ౯౯ పు.). అట్లైన "ఆన్మహతః సమానాధికరణజాతీయయోః (౬-3-౪౬) మహతః ఆకారోఽన్తాదేశః స్యాత్ సమానాధికరణే ఉత్తరపదే, జాతీయేచ పరే. మహాదేవః......" (సి. కౌ. ౭౦౨ సూ.) అనుచొప్పున 'మహాతత్త్వము - మహాగురుపుత్త్ర' అనురీతిని నాకారాదేశము రావలదా యని శంకింపరాదు. ఇచటిది విపులవృద్ధాద్యర్థక మహచ్ఛబ్దము కాదు. ఇంకఁ బయిను దాహరించిన యుత్సవతేజః ప్రభృత్యర్థక మహాశబ్దమునుండి యేర్పడిన యాచారార్థకక్విబంతనామధాతువుయొక్క శత్రంతరూపము. "సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః" (వార్తి. ౧౭౨౨) (సి. కౌ. ౨౬౬౫ సూత్రమునొద్ద) అనుచొప్పున "మహాఇవాచరతి = మహాతి = నిత్యానందివలె నొప్పుచున్నాఁడు. దీని శత్రంతరూపము. 'మహత్' అని యేర్పడును. నిత్యానందియగుచున్న యని యర్థము. తేజోవంతమగుచున్న యనియు నర్థము చెప్పవచ్చును. ఇట్టి నిరవద్యములగు వింతప్రయోగములచేఁ బ్రతిపక్షులను భ్రమింపఁజేసి ధిక్కరించుట వీరశైవమతాచార్యుఁడగు సోమనారాధ్యున కభిలషితము. ఇట్టి యీతని ప్రయోగము లింక నేకము లీవలకుఁ జూపఁబడెను, ఇంకను జూపఁబడును. ఆచారార్థక క్విబంతనామధాతుప్రయోగములు:—

"శ్లో. వాదీ మూకతి రఙ్కతి క్షితిపతి ర్వైశ్వానర శ్శీతతి। క్రోధీ శామ్యతి దుర్జన స్సుజనతి శీఘ్రానుగః ఖఞ్జతి। గర్వీ ఖర్వతి సర్వవిచ్చ జడతి త్వన్మన్త్రణాయన్త్రితః। శ్రీనిత్యే వనజన్ముఖి ప్రతిదినంకల్యాణితుభ్యంనమః" (ముగ్ధ. లిధు. ౭౪౭ సూ. దుర్గా. వ్యా.) మఱికొందఱు మహాకవులును నిట్టిప్రయోగము నంగీకరించి

యున్నారు. దళితాంభోరుహాస్తపత్త్ర సుమహాత్కాశాసనాఘంబు.........
......(వన్ని. ప. ౬ ఆ. ౭౬౯ ప). సీ. దహనకుండోపమ మహాదతీ నివ
హంబు (భాస్క. యుద్ధ. ౧౯౯౫ ప.) క. అతులపౌరుషనిధి హ। ర్యతులపరాక్ర
ముఁడు మహాదహాంకృతితోడన్. (భాస్క. యుద్ధ. ౨౦౩౧ ప.) క. కంఠీరవముఖ
వివరా। కుంఠకరోరాగవాతిఘూర్ణితనహాతో। త్కంఠేభదహానరుహాదుప। కంఠము
నై దేహి దఱిసి కళవళపడుచున్. (జై. అశ్వ. ౬ ఆ.)

ఠ. మ.........రా । దమొ నా దిగ్బధిరీకృతం బగుచు నిత్యంబున్
జెలంగుం బురిన్. (వన్ని. కు. ౭ ఆ. ౯౬౨) క. మునితతి కరముకులితులై । విను
తించుచు.........(వన్ని. కు. ౭ ఆ. ౯౧౪). చ.........శంఖకాహళా । దికనిన
దంబు లెల్లఁ గడు దిగ్బధిరీకృతమై చెలంగఁగా. (వన్ని. కు. ౮ ఆ ౨౪.) 'బధిరీకృత
దిక్కము - ముకులితకరము' అనురీతిని 'క్త' ప్రత్యయాంతము బహువ్రీహిని బూర్వ
పదమై యుండుట సామాన్యవిషయము. "వాహితాగ్న్యాదిషు. (౨-౨-౩౭)"
(సి. కౌ. ౯౦౧ సూ.) అనుచోప్పున నది సమాసోత్తరపదమై 'అగ్న్యాహితః'
అనున ట్లుండుట విశేషప్రయోగము. "అహితాః = ఆధానేన సంస్కృతాః
అగ్నయః యేన సః = అగ్న్యాహితః = ఆహితాగ్నిః" అని ద్వివిధప్రయోగ
ములును శాస్త్రసమ్మతములె.

౫ మ. అళిధమ్మిల్ల మృణాళహస్తఁ గమనీయావర్తనాభిన్ మహో। త్పల
గంధిం గలహంసయాన విలసద్బంధూకకర్ణోత్స ను। త్పలనేత్రం గమలాస్య నంగజర
సాంభః పూరఁ దత్పార్వతిన్ । జలజావాసముఁ జొచ్చి యీడక మనోజాతానలం
బాఱునే (వన్ని. కు. ౬ ఆ. ౮౨౪.) 'పార్వతిన్ జలజావాసమున్ = పార్వతియనెడి
సరస్సును' అని వ్యస్తరూపకము నెన్నునది. ఇట 'పార్వతీ జలజావాసము' అని
రూపకసమాసపాఠము నంగీకరించి బ్రహ్మ. శ్రీ. మానవల్లి రామకృష్ణకవిగారీ క్రింది
రీతిని టిప్పణమున వ్రాసిరి. "ఉపమానోపమేయవిపర్యయమును విశేషణవిశేష్య
లింగభేదము ను దోషములుగా గ్రహించి వానిఁ దొలఁగింపననికాఁబోలును తెన్నాలి
రామలింగకవి తనకందర్పకేతువిలాసములో నిట్లు మార్చి పద్యమును గూర్చు
కొనెను.మ. లలితాస్యాంబురుహంబు నీలకచరోలంబంబు నేత్రాసితో। త్పల ముచ్చై
స్తనకోక మోష్ఠపిలసద్బంధూక ముద్యత్కటీ। పులినం బుద్గతచిత్తజాతరసవాః
పూరంబు ప్రాణేశ్వరీ। జలజావాసము సొచ్చి యీడక మనోజాతానలంబాఱునే॥
ఇది సరికాదు. టిప్పణకర్తగారు వెంకటాదిత్యునిపద్యమున దోషము లున్నవని
తలంచిరే కాని రామలింగకవి యట్లు తలంచియుండఁడు. ఆతఁడు రచనాభేదమున

నన్నిచోడునిపద్యము ననుకరించెను. మఱియుఁ డిప్పణకర్తగా రన్న దోష ములు వారంగీకరించిన 'పార్వతీజలజావాసము' అనెడిపారమున నున్నవి. నన్నిచోడుఁ డందు వ్యస్తరూపకము నంగీకరించెను. "అళిధమ్మిల్ల - మృణాల హస్త" మున్నగుచోటులందు "అళులవంటి ధమ్మిల్లముగలది. మృణాళమువంటి హస్తములుగలది" అనురీతి నుపమానపూర్వపదబహువ్రీహి నన్నిచోడ కవిప్రయుక్తము. ఆపక్షమున దోషలేశమును లేదు. ఆయాస్థలములందలి యుపమానములనుండి యారోపితవస్తు సాధర్మ్యము లుపచరితములు కాఁగలవు. కొంకణాదిత్యుని పద్యమున నుపమారూపకాలంకారములు రెండును వర్తిల్లును. రామలింగకవిపద్యమున రూపకాలంకారముమాత్రమె విలసిల్లును. "పార్వతీన్ = పార్వతినెడి, జలజావాసమును," "అనుచో 'ఏవార్థక' మధ్యాహృతమగునట్లె 'ఉమ=ఉమయనెడి, బోఁటి=స్త్రీ' అనుచో 'ఇత్యర్థక' మధ్యాహృతమగును. ద్విపద. ఉమబోఁటి యాత్మలో నుత్తలపడఁగ. (బసవ. 3 ఆ. ౨౭౮ ప) (సూ-౨౬౫ విమ. దానివిస్తరము).

తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తం బ యగు. 3.

తత్పురుషబహువ్రీహిద్వంద్వంబులని సమాసంబులెల్లం ద్రివిధంబు లయియుండు. అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థప్రధానంబు లయియుండు. అందుఁ దత్పురుషంబు వ్యధికరణంబని సమానాధికరణంబని ద్వివిధంబు. ద్వితీయాదులకు మీఁది పదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు. నెలతాల్పు - నెలతక్కవవాఁడు - దేవరమేలు - దొంగభయము. రామునిబాణము - మాటనేర్పరి. విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు. ఇదియె కర్మధారయంబు నాఁబడు. సరసపు వచనము - తెల్లగుఱ్ఱము - మంచిరాజు, ఇది సంఖ్యా పూర్వకంబు ద్విగువునాఁబడు. ముజ్జగములు - ముల్లోకములు. బహువ్రీహి-ముక్కంటి-చలివెలుఁగు. ద్వంద్వము - తల్లిదండ్రులు. అన్నదమ్ములు. ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబు తొడరని సమా

బాలవ్యాకరణ వివరణము ౨౬౫ విషయము.

సంబుం గలదని సూచింపంబడియె. దానంజేసి చిగురుం
గేలు - జుంటిమోవి యిత్యాదులయిన యుపమాన
పూర్వపదకర్మధారయంబులు గ్రాహ్యంబులు. ముఖ
పద్మము చరణకమలములు. ఇట్టియుపమానోత్తరపదం
బులు గలవుగాని విపరీతంబులు సిద్ధంబులు లేవని
యెఱుంగునది. సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు. రాజ
పురుషుండు - నీలోత్పలము - పీతాంబరుండు - రామ
లక్ష్మణులు. కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ
సమసింపదు. దానంజేసి యనేకమూఁజు లల్పదండు
లిత్యాదులు దుష్టములని తెలియునది.

సంజీవని. ౨౬౯, వివ:—తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తం బనిచెప్పియు "సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు" అనిచెప్పియు సూరిగారు సిద్ధములగు తత్పురుషాదులకు వరుసగ "రాజపురుషుండు - (తత్పు.) - నీలోత్పలము (కర్మ.) పీతాంబరుండు (బహు.) రామలక్ష్మణులు (ద్వంద్వ.)"అని యుదాహరించిరి. సిద్ధద్విగువునకు "త్రిలోకి" అనియు నవ్యయీభావమునకు 'యథాశక్తి' అనియు నేల యుదాహరింపలేదో తెలియకున్నది. మఱియు "ద్విగుకర్మధారయా" విత్యాదికారికలను భట్టారకుండాచ్ఛికసమాసముల విషయమున నుపదేశించెనే కాని తదితరసాధ్యసమాసముల విషయమున— 'సాధ్యసాంస్కృతిక సమాసము - మిశ్రసమాసము' అనువానివిషయమున—నుపదేశింపలేదు. సూరి యాకారికలను వివరించునుద్దేశముతోనే ప్రకృతసూత్రమును దీనివివరణమును వ్రాయసాగెనుగాని యీసూత్ర వివరణములలో నాచ్ఛికములనే కాక "రామునిబాణము—పరసపువచనము' అను సాధ్యసాంస్కృతికములను "దొంగభయము - ముజ్జగములు - ముల్లోకములు" అను మిశ్రసమాసములను సైతముదాహరించినవాఁడయ్యెను. అవ్యయీభావము నుజ్జగించుట యుపమారూపకాదులను బ్రసంగించుట మున్నగువానినిబట్టి ద్విగుకర్మధారయావిత్యాదికారికల ననుసరించియే యీసూత్రమును దీనివివరణమును నుపదేశించెననుటలో సందియము లేదు. తత్పురుషభేదముల నుదాహరించుటలో సూరి యహోబలపతినే యనుసరించెనుగాని యొకటిరెండుచోటులందు సవరింపఁబోయి పొరవడెను. చింతామణియాశయముచొప్పున ద్విగుకర్మధారయా విత్యాదికారికల కాచ్ఛికసమాసములనే యుదాహరించుట యుక్తమగుటంజేసి యహోబలపతి యట్లే యుదాహరించెను. "పడగతాల్పు - లేనెలేండి (పడగను

దాల్పునది - తేనెను తినునది) ఇత్యాదౌ ద్వితీయాతత్పురుషః - అత ఏవ ధరిత్రి చాచుగరుతాల్చిన కేల నిత్యాదయః కవీనా ముక్తయఃసంగచ్ఛన్తే. పట్టుపుట్టముతాల్పు ఇత్యాదౌ వలుగ్ద్వితీయాతత్పురుషః. (వి స్తర I) ఉలితునుక-నెలతక్కువ బిడ్డ ఇత్యాదౌ తృతీయాతత్పురుషః - '(ఉలిచేతఁ దునుక. నెలచేతఁ దక్కువ.' అని విగ్రహములు) .........దేవరమేలు ఇత్యాదౌ చతుర్థితత్పురుషః.............దొంగయలుకు ('దొంగవలనన్+అలుకు = భయము' అని విగ్రహము) ఇత్యాదౌ పంచమీతత్పురుషః. దొరమానిసి - తేఁటిపిల్ల - మల్లెపూవు - జాబిల్లి- వెన్నెల - గట్టుపట్టి - రాచకొలము - నేతిముంత - కూటికుండ - ఇత్యాద్యాః షష్ఠీతత్పురుషాః - మాటనేర్పరి ఇత్యాదౌ సప్తమీతత్పురుషః" (అహో ౭3౭ పుట). ఇట్లంతటను నాచ్ఛికసమాసములనే యహోబలపతి యుదాహరించెను - అట్టియహోబలపతి యుదాహృతులనె స్వీకరించి యుదాహరించుటలో సూరి యించుక సవరించెను. ముద్రితాహోబలపండితీయమున 'దొంగయలుక ఇత్యాదౌ పంచమీతత్పురుషః' అని ప్రమాదముగఁ బడినది. భద్రాద్రిశాస్త్రిగారిటీకయందును నట్లె యున్నది కాన సూరి చూచిన కశిరోభూషణమునందును నట్లెయుండునని తోఁచెడిని. "అలుక = కోపము" అనుదాని కట్టి పంచమీతత్పురుషములో సందర్భము లేనందున సవరించి "దొంగభయము" అను

---

విస్తర. I అర్థ విష:—తిండిశబ్దమునకు "తినువాఁడు" అనునర్థము కానరాదు. తినుట యనియె యర్థము కన్పట్టుచున్నది. కాన ద్వితీయావిభక్తి కిచటఁ బ్రసక్తిలేదు. "తేనెతిండి = తేనెతిండిగాఁగలది తుమ్మెద" అనువిగ్రహమున నది బహువ్రీహి యనవలెను. లేదా "తేనెతిండి = తేనెయొక్క+తిండి = తేనెతిండి"అని యర్థముచేసినచో షష్ఠీతత్పురుషము కావలెను. అట్లె "పట్టుపుట్టముతాల్పు" అనుచో 'పట్టుపుట్టమును+తాల్పు = ధరించువాఁడు' అనినచో ద్వితీయ లోపించిన తత్పురుషమె యగును. అలుక్సమాసముకాదు. లేదా "పట్టుపుట్టముయొక్క+తాల్పు" అనినచో షష్ఠికాదేశముగావచ్చిన ద్వితీయావిభక్తిరూపము లోపింపలేదనియు ద్రుతమాత్రము లోపించెననియుఁ జెప్పినచో నలుక్ షష్ఠీతత్పురుషమనుట యుక్తము. "పట్టుపుట్టముయొక్క+తాల్పు=('షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుష సంస్థితా నామ్నామ్' అనుచొప్పున ద్వితీయాతుల్యరూప మాదేశము కాఁగా) "పట్టుపుట్టమునన్+తాల్పు"అగును. "నిరమో మహతాం లుక్చ స్యాత్" త్తను చొప్పున 'ను' వర్ణకలోపమును "ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' అనుచొప్పున ద్రుతలోపమును రాఁగా "పట్టుపుట్టముతాల్పు" అని యేర్పడునుగాన ద్వితీయ లోపింపలే దనుట సరికాదు. షష్ఠి లోపింపలే దనవలెను.

దానిని సూరి నిల్పెనని విశ్వసింపనగును. సమాసకముల ననఁగా నాచ్ఛికసమాసములను మాత్రమె యీకారికలచోట నుదాహరించుట యావశ్యకమని తలంపనివాఁడగుట చేతనే సూరి రామునిబాణము మున్నగువానిని సైత ముదాహరించినవాఁ డయ్యెను. (విస్తర II).

సమానాధికరణాదుల స్వరూప మీవలను విశదీకరింపఁబడెను.(ఆర్జా IV విష.) ‘చిగురుఁగేలు’ మున్నగువానివంటి యుపమానపూర్వపదకర్మధారయములు సంస్కృ

---

విస్తర II ఆర్జా విష:—చింతామణిపద్ధతులచొప్పున ‘దొంగభయము’ అను పంచమీతత్పురుషసమాసము సాధువు కాదు. సమాసకమునందుమాత్రమె సమాస విభక్తికి లోపమును జింతామణి యుద్దేశించినది. తక్కిన సాధ్యసాంస్కృతికము లందును మిశ్రసమాసములందును సమాసవిభక్తిలోపమును జింతామణి యుద్దేశింప లేదు. తత్పురుషములలో షష్ఠీతత్పురుషమునుమాత్రమె సాధ్యసాంస్కృతికమిశ్ర సమాసములలో “షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా తత్పురుషసంస్థితా నామ్నామ్” అను సూత్రమున నంగీకరించెను. ఎల్ల కారకములందును శేషషష్ఠీ వివక్ష నిర్బాధము గావున “దొంగయొక్క+భయము = దొంగనున్ = దొంగన్+భయము” అని యుండఁగ ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు” అనుచొప్పున ద్రుతలోపము రాఁగా ‘దొంగభయము’ అనుషష్ఠీతత్పురుషముమాత్రము సిద్ధించును. అచటి షష్ఠి ద్వితీయాతుల్యరూపముతో నిల్చి లోపింపమింజేసి “అలుక్ షష్ఠీతత్పురుష” మనఁ దగును. బాలవ్యాకరణకర్త యట్టి చింతామణియాశయమును గ్రహింపలేక “సమాసవిభక్తికి లోపంబగు నట్టునకుఁ గాదు” (బా. సమా. ౨౫ సూ.) అని యిట్లు సాధ్యసమాసముల విభక్తులకెల్ల లోపమును విధించెను. కావున “దొంగ వలనన్+భయము = దొంగభయము” అను సాధ్యమిశ్రపంచమీతత్పురుషము బాల వ్యాకరణపక్షమున సాధు వగుచున్నది. కాని యీసూరిరచనమునందు “నెలయ వరుఁడు (నెలచేతన్+అవరుఁడు) నెలప్రభవుఁడు. (నెలవలనన్+ప్రభవుడు=బుధుఁడు) మున్నగు ననిష్టరూపములు దుర్వారములగును. మఱియు “సమాసవిభక్తికి లోపం బగు........” (బా. సమా. ౨౫ సూ.) అనెడి సూరిసూత్రము నిర్మూల మగుటం జేసి యశాస్త్రీయము. “లోపశ్చ విభక్త్యాదేః శబ్దేషు స్యా త్సమాసకాఙ్క్షేషు” అని యిట్లు చింతామణి సమాసకములందే విభక్తిలోపమును వచించెనుగాని తక్కిన సాధ్యసమాసములలో విభక్తి లోపము నంగీకరింపలేదు. సమాసకవిభక్తి లోపము సైతము కవిప్రయుక్తములందె చెల్లును. ఈసందర్భమున నూతనపద్ధతి నవలంబించిన సూరిమార్గము కేవల మపమార్గమని ముందు నిరూపింపఁబడును.

తమునందును ప్రయుక్తమయ్యెననియు నట్టి సిద్ధసమాసము లాంధ్రకవిప్రయుక్త ములు గలవనియు నీవఱకు విశదీకరింపఁబడెను. (విస్తర. II ౨౬౪ IV విష.) కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపఁ దనఁగా నాంధ్రవిభక్త్యాదుల నందని సంస్కృతశబ్ద మట్లు సమసింపదని యర్థము. కాన 'అనేకమూఁఖులు' అనునది యసాధువు. 'అనేకముమూఁఖులు'అను తత్సమరూపముల సమాసము సాధువగును. ఇట్లె 'అల్పవృదండులు' అనురీతిని సైతము సాధువె యగును.

లోపశ్చ విభక్త్యాదేః శబ్దేషు స్యాత్సమాసకాఙ్గేషు.
(ఆం. చిం. హలం. ౧౭ కారి. అహో. ౪౪౭ పు)
షష్ఠీ భవే ద్వితీయా, తుల్యా తత్పురుష సంస్థితా సా
మ్నామ్. (ఆం. చిం. ౧౩ కారి. అహో. ౪౧౭ పు.)
స్యా దుత్తరస్య లోపేపి।ద్వితీయా నియతా మతా ।
అన్యత్రాపి తదిష్టి స్స్యాత్ । ప్రయోగ స్తత్ర కార

నన్నయా. ౨౭౦ విష.

ణమ్॥ (వికృ. హలం. ౨౦ కారి. అహో ౪౪౪ పు.)
క్వచిత్ ప్రత్యయయోగేచ । తథాత్వ మభిధీయతే.
(వికృ. సంధి. ౨౫ కారి. అహో. ౧౪౮ పు.)
క్వచి దన్యవిభక్త్యర్థే । ప్రథమాపి ప్రదృశ్యతే. (వికృ. అజం. ౪౭ కారి. అహో. ౩౬౫ పు.)

కల్పతరు. ౨౭౦ విష:—సమాసకాఙ్గేషు = ఆచ్ఛికసమాసావయవములగు (సమాసక = ఆచ్ఛికసమాస) నసఁగా నాచ్ఛికసమాసరూపప్రాతిపదికమునకు నవయవ నములగు, విభక్త్యాదేః = సుబ్విభక్తులు-ఉత్తరపదములు మున్నగువానికి, లోపశ్చ= లోపముసయింతము, స్యాత్ = అగును. చశబ్దముచే నీలోప మరుదుగను బ్రయో గానుసారముగను గల్గును. ఈసూత్ర మిూక్రిందిసంస్కృతవ్యాకరణవిషయముల నుద్దేశించుచున్నది. కావున నట్టిసంస్కృతపద్ధతిచే సమాసవిభక్తిలోపము నుత్తపదాది లోపమును జేయవలయునని దిఙ్మాత్రముగా నుపదేశింపఁబడెను.

"సుపో ధాతు ప్రాతిపదికయోః .(౨-౪ ౭౧) (వృత్తి.) ఏతయో రవయవస్య సుపో లుక్ స్యాత్. (సి. కౌ. ౬౫౦.) శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపదలోప స్యోపసంఖ్యానమ్. (వార్తి. ౧౩౧౦-౭౩౮ సూ.)" మున్నగుసూత్రములచేత సమాసోత్తరపదాదిలోపమును వచింపఁబడెను. అలౌకవిగ్రహమునందే సామానాధి కరణ్యాదివివక్షచేత సమాససంజ్ఞ కల్గఁగా నట్టి సమాసమునకు "కృత్తద్ధిత సమాసాశ్చ (౧-౨-౪౬) కృత్తద్ధితాన్తా సమాసాశ్చ ప్రాతిపదికసంజ్ఞాః స్యుః" (సి. కౌ. ౧౭౮ సూ.)

అనుసూత్రముచొప్పునఁ బ్రాతిపదిక సంజ్ఞ కల్గఁగా నట్టి ప్రాతిపదికమున కవయవ భూతములగు శబ్దములలోని సుబ్విభక్త్యాదులు "సుపో ధాతు ప్రాతిపదికయోః" అను సూత్రముచొప్పున లోపించును. లోపింపఁగా మిగిలిన ప్రాతిపదికముపైని వాక్యాన్వయయోగ్యములగు సుబ్విభక్తులు నిల్చును. ఇట్లే తద్ధితాదివృత్తులందును విభక్త్యాదిలోపము నరయునది. ఆచ్ఛికసమాసాదులందును నైరితినే 'కృత్తద్ధితసమాసాశ్చ' అనుచొప్పునఁ బ్రాతిపదికత్వము గల్గిన సమాసక తద్ధితాద్యవయవములగు శబ్దములందలి విభక్త్యాదులు ప్రకృతమగు "లోపశ్చవిభక్త్యాదేః శబ్దేషు స్యాత్సమాసకాఙ్క్షేషు" అనుసూత్రముచే లోపించుటయు మిగిలిన ప్రాతిపదికరూపశబ్దము పైని వాక్యాన్వయయోగ్యసుబ్విభక్తులు నిల్చుటయు సంభవించును. వేల్పు+ఆమ్+దొర+సు = (వేల్పులయొక్కదొర) అనుచో సమాసరూపప్రాతిపదికావయవములగు 'ఆమ్ సు' అనునవి లోపింపఁగా "వేల్పుదొర" అను ప్రాతిపదికభాగము నిల్చెను. దొంగ+భ్యస్+అలుకు+సు = (దొంగవలనియలుకు) అనుచో "దొంగయలుకు" అను ప్రాతిపదికభాగము లుప్తశేషమగును. మూఁడు+జస్+కన్ను+జస్ (మూఁడు కన్నులెవనికిఁగలవో వాఁడు) 'మూఁడుకన్ను = ముక్కన్ను+ంటి = ముక్కంటి' అను ప్రాతిపదికము నిల్చును. ప్రయోగసిద్ధములగు కొన్ని యాచ్ఛికసమాసకములందును కొన్నిజ్ఞాపకసిద్ధసమాసముల (శోకార్త్తపుటాడలులతో) యందును దప్పఁ దక్కినసాంస్కృతి కాచ్ఛిక మిశ్రసమాసములం దీసంస్కృతవ్యాకరణప్రసిద్ధ సమాససామాన్యపద్ధతి యుపచరింపదు. "రాజన్+జస్+ఆన+సు అనుచో "రాజయాన' అను ననిష్టరూప మేర్పడును. కావుననే యట్టిచోటులందు నన్నయాథర్వణులు "షష్ఠీ భవే ద్వితీయాతుల్యేత్యాది చొప్పున మార్గాంతరమున రూపసిద్ధి నుపదేశించిరి.

లోపశ్చ విభక్త్యాదేరిత్యాది కాంధ్రీకరణమగు "లోపమును సమాసకగతమా పదములపయి విభక్తికి........." అనుదానికి గాణపతవివరణకర్త "ఉత్తరార్థోదాహృతి.........తమ్మునికొడుకు - ననలదండ - వేల్పులదొర. విభక్తి పరమగునపుడు ప్రకృతికి విధింపఁబడిన 'ని-ల'లు విభక్తి సంబంధులుగాక ప్రకృత్యవయవములగుటంజేసి వానికి లోపము రాదు" అని వివృతివ్రాసెను. (గాణ. ౩౦౮ కారి. ౭ పద్య) ఇది సరికాదు. అలౌకికవిగ్రహవాక్యములోనె సమాససంజ్ఞ కల్గఁగా నట్టిసమాసరూపప్రాతిపదికమున కవయవములగు సుబ్విభక్తులు లోపించుటచేత 'ని-ల' లు వచ్చుటకుఁ బ్రసక్తిలేదు. మఱియు గాణపతవివరణకర్త యిచ్చిన యుదాహృతులు "షష్ఠీ భవే ద్వితీయాతుల్యే" త్యాదిసూత్రమునకు లక్ష్యములుగాని

లోపశ్చ విభక్త్యాదే రిత్యాదిసూత్రమునకు లక్ష్యములు కానేరవు. అలౌకికవిగ్రహ మునందే సుబ్విభక్తులు లోపించుటచే "తమ్ముకొడుకు - ననదండ - వేల్పుదొర" అనియే సిద్ధించును. ఇట్లె "కన్ను+ఙస్+కవ+సు" అనువిగ్రహమున సుబ్విభక్తులు లోపింపఁగా "కన్నుఁగవ" అని సిద్ధించును. "ఉ.........మున్నుఁగొంటి మేఁవన్న నదండ యొక్క మగవాఁడిద........." (అను. ౧ ఆ. ౧౪). మధ్యా......... ఉవిద కన్నుంగవ మొగిచి తెఱవక యుండె భయమున. (ఆది. ౪ ఆ. ౨౫౪) ఉ... ......క। న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రునటంచు.........(మను. ౨ ఆ. 3౨.)

సమాసకములం దిట్లు విభక్తిలోపము గల్గుసమాసములు మహాకవి ప్రయోగానుసారముగ నెన్నవలెను. "షష్ఠీ భవే ద్వితీయా తు" త్యాదిసూత్రము (చిం. హలం. ౧3 కా) చొప్పున నన్ననో సాంస్కృతిక మిశ్రసమాసము లేకాక యాచ్ఛిక సమాసములును ధారాళముగా నేర్పడును. ఉదా:—తమ్మునికొడుకు - ననలదండ- వేల్పులదొర - కన్నులకవ మొ. ఇట్టియెడల "కన్ను+ఙస్+కవ+సు" అనునపుడు షష్ఠీ భవే దిత్యాదిచొప్పున రూపసిద్ధి చికీర్షితమగునపుడు సమాసరూపప్రాతిపదికము యొక్క యవయవములోని "ఙస్" ప్రత్యయము లోపింపక దానిచో "శస్" ప్రత్యయరూపద్వితీయాకారము నిల్చును. కవ శబ్దముమీఁది సుప్రత్యయము మాత్రములోపించును - కాఁగా "కన్నులకవ' అని రూప మేర్పడును.

సమాసకేతరస్థలములందు "షష్ఠీ భవే"దిత్యాద్యుత్తరసూత్రసిద్ధ షష్ఠీతత్పురుషమునకుఁ దప్పఁ దక్కినతత్పురుషకర్మధారయాదులకు సాంస్కృతికమిశ్రరూపసాధ్య సమాసస్థితి లేదని పలుసందర్భములవలనఁ దోఁచుచున్నను - "సరళే పరుషే చైవ... వికారాచ్చాపి కేవన" (౮౮. విష). "దారార్థేత ఉదపిరో మోస్తు విభక్త్యేకవచ నకే పుంపూ" (౯3. ౯౪. విష). "సామానాధికరణ్యేషు........." (౯౧. విష). "ద్విగో రమిశ్రతాయాఁతు। ప్రాయ ఏకత్వ మిష్యతే। మిశ్రతాయాం బహుత్వం స్యా దన్యత్రాపి క్వచి ద్భవేత్" (౫౮౪. విష). "ఇచ్చ విభక్త్యన్తిమస్య........." (౧౦౫. విష). అనునవి మొదలగు విషులచేత నితరవిధములగు తత్పురుష కర్మధారయ ద్విగువులకును నభ్యనుజ్ఞ తత్తద్విధానసామర్థ్యమున జ్ఞాపిత మగుచున్నది. కావున నట్టి జ్ఞాపకసిద్ధసమాసములందుఁ దత్తద్విధుల కనుకూలముగాఁ దత్తద్విధుల ననుసరించి శాస్త్రకవిప్రయోగవిరోధము లేనిరీతిని విభక్తిలోపాదికమును "సుపో ధాతుప్రాతిపదికయోః" (సి. కౌ. ౬౫౦. సూ). అనురీతిని ననుక్తన్యాయమునఁ

గల్పించికొనవలయును. "సుపో ధాతు ప్రాతిపదికయోః" అనుదానినే యుద్దేశించు చున్న "లోపశ్చ విభక్త్యాదేః........" (చిం. హలం. ౧౭. కా) అనుసూత్రము నైరీతిసమాసములందును "శోకార్తపుటోడలులతో-చేసిన తత్ఫలము" మున్నగు కవి ప్రయోగజ్ఞాపకసిద్ధ సాంస్కృతికాచ్ఛిక మిశ్రసమాసములందునుమాత్రమె యుపయోగింపనగునుగాని యెల్లయెడలను నుపయోగింపరాదు. జ్ఞాపకసిద్ధములందు "రామ+ జి+భక్తి+సు" అనుచో 'రామునందలిభక్తి' అనునర్థమును వివక్షించునపుడు "జేర లిచ" అనుసూత్రపుజ్ఞాపకమున నందలి 'జి' లోపింపదు. 'సు' ప్రత్యయము లోపించును. జ్ఞాపకసిద్ధసమాస స్థలములం దిట్లాయా సూత్రముల ననుసరించి దీని నుపయోగించుకోవలెను. సీ. ఉల్లతెల్లని తురగోత్తము వాలంబు (ఆది. ౨. ఆ. ౩౮. ప). క. శోకార్తపు టోడలులతో (స్త్రీ. ౨. ఆ. ౧౨౮. ౮. ప). మున్నగు ప్రయోగములనుబట్టియు, "సామానాధికరణ్యే షూదన్తానాం టు గాగ మోచి స్యాత్...... మోస్తు విభక్త్యేకవచనకే పుంపూ" మున్నగువిధులనుబట్టియు సాంస్కృతికమిశ్రరూప సాధ్య సమానాధికరణ సమాసము లభ్యనుజ్ఞాతము లగుచున్నవని యెఱుంగునది. సమాసకములందే కాక సాంస్కృతిక మిశ్రసమాసములందును విధానసామర్థ్యమున జ్ఞాపకసిద్ధసమాసములు చెల్లును. వాని ప్రక్రియను బయిరీతినె గ్రహింపవలెను. శోకార్త+జస్+ఒడలు+జస్ = శోకార్త+జస్+ఒడలు = శోకార్తములు+ఒడలు = శోకార్తము+ఒడలు = శోకార్తపుటోడలు - శోకార్తపుటోడలులతో. అ+జి+ పురుష+జి = అపురుష—అపురుషునందు = అప్పూరుషునందు-మొ. పుంలింగములును బుంలింగసమములునగు సంస్కృతములు సమాసపూర్వావయవములు కారాదు. శోకార్తుగఁడు' అనరాదు. అట్టిప్రయోగములు లేవు. వేల్పులదొర - కొమరుని పేర్మి మున్నగుచోటులందలి షష్ఠి ద్వితీయాకారమున నిల్చియుండుటచే నట్టివి "అలుక్షష్ఠీసమాసములె" అని చెప్పనగును. (౨౭౦. విషయము). వానితోడన్+ ఇ+చెలిమి = వానితోడిచెలిమి. వీనియందున్+అలి+పేర్మి = వీనియందలి పేర్మి. (౧౦౫.విష).ఇట్టివి తృతీయాద్యలుక్ సమాసలు. "ఇవేన సమాసో విభక్త్యలోపశ్చ" అనుచొప్పున (౨౬౮. విష). నుపమానవాచకములతోడి సమాసమున విభక్తి లోపాభావము సాధ్యసమాసములందును గలదు. "క... । తిరముగ వాక్య సమాసా । చరణంబుల ద్వివిధ యగుచు శ్రౌతియుఁ దనరున్ (నరస. ౫. అ. ౧౦. ప). శా = నీదోఃఖడ్గమహీంద్రుఁడో యనఁదగు న్నీదివ్యతేజోభరం । బాదిత్యుం డును బోలెఁ బొల్చు......"(నరస. ౫.ఆ.౧౮.ప). ఇటఁ బ్రథమావిభక్తి 'ఇవార్థకము

తోడి, సమాసమున లోపింపలేదు. (విస్తర). తలన్+పోయు+ప్రాలు = తలంబ్రాలు- ఒడిన్+కట్టు+ప్రాలు = ఒడిఁబ్రాలు. ఊరన్+తిరుగు+పంది = ఊరఁబంది. మొదలగు మధ్యమపదలోపి సమాసములందును (౨౭౦. విష) ద్వితీయాది ద్రుతము కొన్ని యెడల లోపింపక "అపరాన్త" ఇత్యాదిచే బిందుపూర్వకాఁగా 'తలంబ్రాలు' మున్నగు నలుక్సమాసములు సిద్ధించును. (౮౨. III. ౮౭. ౯౦. ౯౦ I విష). సప్తమీ

---

విస్తర. ౨౭౦. విష:—వలె ప్రభృతిశబ్దములతోడ సమాసము గల్గునపుడు తెలుఁగునఁ గొన్ని విశేషములు గలవు. సంస్కృతమున 'ఇవ' శబ్దముతోడి ప్రయోగమున నుపమానోపమేయములు సమానవిభక్తికములుగనె యుండును. "ముఖం చంద్ర ఇవ భాతి - ముఖస్య చన్ద్రస్యేవ విలాసః" అనురీతినే యుండును. తెల్గున నట్లుకాదు - ఉపమేయము ప్రథమేతరవిభక్తులతో నున్నపు డుపమానమును నట్టి విభక్తులతోనె యుండును. ఉపమేయము ప్రథమాంతమైయున్నపు డుపమానమీ క్రిందిరీతిని షష్ఠ్యాదివిభక్తులతో నుండును. సంస్కృతమునందు సదృశాదిశబ్దములతోడి సమాసమున నిట్టిభేదమె యుండును. "ముఖం చన్ద్రసదృశమ్=చన్ద్రేణ సదృశమ్ = చన్ద్రస్య సదృశమ్" మొ. ఈవిషయమునఁ ద్రిలింగలక్షణశేషకర్త యీ క్రిందిరీతిని సూత్రించియున్నాఁడు. "అట్లు - పోలె, బలె - వలె శబ్దంబు లివార్థకంబులు. ఉపమేయము ప్రథమాంతమగునపు డట్లు పరంబగుచో నుపమానంబులగు నామతదస్మద్యుష్మదాత్మార్థములకు షష్ఠియు, పోలె బలె లు పరంబులగుచో నామ తచ్ఛబ్దార్థములకుఁ బ్రథమయు; నస్మదర్థప్రభృతులకు ద్వితీయయు, వలె పరంబగుచో నామతచ్ఛబ్దార్థములకు షష్ఠియు, నస్మదర్థాదులకు షష్ఠీద్వితీయులయందే దియే నొక్కటియుఁ, గ్రమంబుగ నగు. ఉపమేయము ద్వితీయాద్యంతమగు నపుడు పోలె ప్రభృతులు పరంబులగుచో నుపమానంబుల కుపమేయ విభక్తుల యగు. పోలినయెడఁ దచ్ఛబ్దమే తదాదులకు నుపలక్షణముగా గ్రహించునది. అట్లు కరణ్యాదులకు గ్రాహకము" (ప్రౌఢ. సమా. 3౮. సూ). ఉదా:—మీరు బకు నట్లు చత్తురు. మీరు బకునికరణిఁ జత్తురు. ఉపమేయము ద్వితీయాద్యంతమగునపుడు 'అట్లు-కరణి - మున్నగువాని వాడుక వీలుపడదు. ముఖము పద్మము పోలె (పద్మముబలె) నున్నది. నేను నినుంబోలె, (నినుంబలె) విన్నాను. ముఖము చంద్రునివలె నున్నది. వాఁడు నావలె (లేదా) నన్నువలె నున్నాఁడు- భీరులఁబోలె మమ్మునేల వెఱపించెదు. మొ.

"ప్రథమాంతములమీఁది పోలె - బలె - పోనిశబ్దంబులు ద్రుతపూర్వకంబులు విభాషనగు". (ప్రౌఢ. సమా. 3౯. సూ). ఉదా:—నిధిఁ గన్న పేదయుఁ

బోలె. ఇది యాగమము కాదనియు నర్థవిశేషబోధకమనియు నీవఱకు వ్రాయఁబడెను. (౭౪. I విష). పేదవోలె - పుణ్యజనాఖ్యయుంబలె - పుణ్యజనాఖ్యబలె - మన్మథుండునుంబోనివాని - వీంద్రుఁను వాంద్రుఁను బలె. మొ. "కొన్నిచోటుడల నుపమానంబులు పెక్కులగుచో నివి కడదాని కొక్కటికి చూపట్టెడి (ప్రౌఢ. సమా. ౪౦)."

"అట్టి - పోని - బోఁటి వంటి - శబ్దంబులు వదర్థకంబులు. బోఁటి దనంతఁ బ్రత్యయార్థంబునగు. అట్టి ప్రభృతులు పరంబులగుచో నట్టు ప్రభృతిపరకనామాదులకుంబలెఁ బూర్వపదంబులకు విభక్తులు త్రివిధంబులం బరఁగు, అందు బోఁటి వంటులు సమానంబులు. అవి పరంబులగుచో నాత్మార్థమునకు నామతచ్ఛబ్దంబులకుం బోలెఁ గార్యంబు. పోని పరంబగుచో డువర్ణకంబుమీఁద ద్రుతంబు నిత్యంబు". (ప్రౌఢ. సమా. ౪౩. సూ). ఉదా:—రామునియట్టి - నీయట్టి; మన్మథుండునుంబోనివాని - దేవివోని - దేవియుంబోనిదాని - నన్నుఁబోని - తన్నుఁబోని - నిన్నుఁబోనివానికి - రామునిబోఁటి - రామునివంటి - వానిబోఁటి - వానివంటివానికి - నాబోఁటి-ననుబోఁటి - నీబోఁటి - నినుబోఁటివాఁడు. తనబోఁటివాఁడు - తనవంటివానికి ('తన్నువంటి' అనరాదు). మముబోంట్లకు - పల్కులవంటి = పల్కుల్వంటి (పాండు. ౧. ఆ. ౨౯. ప). వీనికిఁ బ్రమాణములగు కవిప్రయోగములు త్రిలింగలక్షణశేషంబున నాయాసూత్రంబులకడఁ జూపఁబడెను - ఈసూత్రము విషయము లుపమేయ షష్ఠీవిభక్తిలో నున్నను వర్తిల్లును - ఉదా:—"నాబోఁటివాఁడు. నాబోఁటివానికి - నాబోఁటివానిచే మొ. పోనిశబ్దము పోలనిశబ్దసంక్షేపరూపము కానోపును. కావున నే దానికి ముందు'ను' శబ్దస్థితి యంతటను నిత్యమై యుండుట యావశ్యకముగ నుండును. మన్మథుండునుంబోనివాని = మన్మథుడు నైతము పోలఁజాలనివాని యని యర్థము. నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రవరంబునన్ (ఆది. ౧. ఆ. ౭).

కొన్నివిశేషప్రయోగములు:—ఇవశబ్దముతోడి సమాసము సంస్కృతమునందె నిత్యముగా మింజేసి (౨౬౭ X విష.) తెల్గునందును నివార్థకశబ్దములతోడి సమాసమున కనిత్యత నంగీకరించుట వింతకాదు. మఱియు 'ఆదిత్యుండునుబోలె. మన్మథుండునుంబోనివాని' యున్నగుచోటులందలిది ద్రుతాగమము కాదనియు నర్థవిశేషబోధక నుశబ్దమనియుఁ (౭౪ I విష.) జేసిన సిద్ధాంతము నైతము దీనివ్యస్తతను నిర్ణయింపఁజాలును. కావున నివార్థకములతోడి ప్రయోగములం దవధారణార్థకశబ్దప్రయోగమును దుష్టము కానేరదు. 'నదివోలె' యున్నగుచోటులందలి వాదేశమును నిచటి వ్యస్తతను దెల్పును. క........హిమమయూఖుఁడ పోలెన్. (ఆది. ౬. ఆ. ౧౨౫.) చ........వైశ్యులపోలె వశ్యులై. (సభా. ౨ ఆ. ౯౮.) చ. అన

విని సూతసూనుఁడు భయం బెదఁ గూరినవాఁడపోలె నై । వెనుక కొదింగి. (ద్రోణ. ౨ ఆ. ౧౦౬.) మ.........ఆజింగల దీపమ ట్లతఁడు మండుంగాక (కర్ణ. 3 ఆ. ౪౯.) ('దీపమట్లు' అనుచో షష్ఠీసమాస నుమ్ము రాలేదు). క. అనిన.........అమృత ధారాపాతం । బునుబోలె నైన. (ఆర. ౨ ఆ. ౧౫). (ను శబ్దము ప్రాసగతము) సీ. రంగదుత్తుంగతరంగహ స్తంబుల నాడెడునదివోలె.........వఱలెడునదివోలె .........తోడరెడునదివోలె .........నగియెడునదివోలె.........ఓపనియది వోలె నుచ్చభీమ. (ఆ-వె.) నినదమగుచున్న నీరధియొద్దను......... (ఆర. 3 ఆ. 3౮ ప.) 'అనుచో అగుచున్న' అనుదానికర్త 'సంద్రము' అను నుపమేయము ప్రథమాంత మధ్యాహృత మగుచున్న దిగాన బాధ లేదు. సీ. అనఘ సోమము లేని యధ్వరంబును శశి లేని రాత్రియు రవి లేని నభము । ......... పుష్ప సంపద లేని భూజమునుబోలె. (అను. ౨ ఆ. ౧౦౬.) ఇట్లు పెక్కిటి కొక్క వాచకమును ప్రయోగించుట గలదు. (ద్రోణ. ౧ ఆ. ౪౯ ప.). క. పెనుమంట నుఱుకు శలభం । బును బోలెన్.........(ద్రోణ. ౪ ఆ. ౧౧౬.) (ను శబ్దము ప్రాసగతము.) సీ. త్రాసులుంబోని చిత్తంబులతోడుత.........(శాంతి. ౨ ఆ. 3౭౪). మ..., ......ఐరావతం । బునుబోలెన్. (నిర్వ. ౭ ఆ. ౪౭.) చ.........మలపఁగనున్న కల్పలత, మన్మథునారి నమర్పనున్న కో । మలతరపుష్పబాణ మ,హిమద్యుతిఁ జూడఁగ నున్న పద్మకు । ట్మల, మలరంగనున్న మధుమంజరి, నా మధుజృంభితాంగదో । హలరుచి నొప్పె గౌరి...(నన్ని. కు. 3 ఆ. ౨౮3 ప.) (పెక్కిటికొక్కసాన్ శబ్దము) (ప్రౌఢ. క్రియా. 3౦ సూ. చూ.) తే-గీ. విగతజీవుఁడై పడియున్న వేదమూర్తి । యతనిచేత సంజీవితుఁడై వెలింగె । దనుజమంత్రి యుచ్చారణదక్షుచేత । నభిహితం బగుశబ్దంబు నట్లపోలె. (ఆది. 3 ఆ. ౧౨౭.)(వాచకద్వయ) ఆ-వె. అతని మేను కుంతి యట్టుల కైవడి । యరయ నేను జూచి...(శాంతి. ౧ ఆ. ౧౨ ప.)గీ. ఆర్తుఁడైనట్లు వోలె. (హరి. పూ. భా. ౫ ఆ. ౧౫౦.) 'ద్వి. వచ్చు వహిత్రంబు వడువునుబోలె.' (బసవ. ౨ ఆ. ౨౫౫.) కరమర్థి నందిచ్చుకరణియుఁబోలె. (బస. ౨ ఆ. ౨౭౦). ఆ-వె.........అర్చన లిచ్చుపగిదివోలె. (నన్ని. కు. ౧ ఆ. ౪౯.) తే-గీ. బలసి కుల గిరుల్ కొలువున్న భంగివోలె. (నన్ని. కు, 3 ఆ. ౨౫౬.) శారద నీరద సమూహి చాడ్పునఁబోలెన్. (నన్ని. కు,౧౦ఆ. 3౮౫). గీ.........ఉదయించువడువవోలె। .........కరణివోలె । .........అట్లుపోలె । రమణవోలె । .........లెఱఁగు వోలె । .........(నన్ని. కు. 3 ఆ. ౨౭౨). అట్టిప్రభృతులకు:—ఉ. ద్వైత -వనంబు నట్టి సుఖవాసము గోవుల కెందు లేదు (ఆర. ౫ ఆ. 3౬౦). గీ. అనఘ

నవర్ణకము లోపింపని మధ్యమపదలోపిసమాసములును నలుక్సమాసములుగ నెన్నఁ దగును. ప్రౌఢవ్యాకరణమున నివి వేర్వేఱువిధములుగ సూత్రింపఁబడినవి:—కొన్ని యెడల సప్తమీతత్పురుషమునందు నవర్ణకంబునగు (అలుక్సమాసము) ఉదా:— కువలయంబునవారు మొ. కువలయంబునన్+గల+వారు = కువలయంబునవారు- ఇట్లె వారాణావతంబునవారు. - చిత్తమునదుఃఖంబుల్ - మొ. (ప్రౌఢ. సమా. ౩౭. సూ). షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు. ఉదా:—ఎలజవ్యనంబున విలసనంబు (ప్రౌఢ - సమా. ౧. సూ) 'జవ్వనంబునన్+కలుగు+విలసనంబు' అనురీతిని వీనిని సప్తమ్యలుక్కులుగానె సమర్థింపనగును. ఒకానొకచో మతుబర్థంబున నవర్ణంబు చూపబడెడి. ఉదా:—క. అనిలజ.........ఇట్టి దివ్యతేజంబునవాఁ డథమాన్వయమునఁ బుట్టునె...(ప్రౌఢ తద్ధి. ౧౯. సూ). ఇట్టివి సైతము నలుక్కులుగానె గ్రహింపనగును. దివ్యతేజంబునన్+వెలుంగు+వాఁడు = దివ్యతేజంబునవాఁడు. ఇట్లె సీ. వర్గత్రయంబునవలనను సప్తాంగములయందుఁ జిత్తంబు మెలఁగుచుండ.........(శాంతి. ౬ ఆ. ౨౦౦. ప). మున్నగు ప్రయోగాంతరములందును నలుక్సమాసము నెన్నవగును. 'వర్గత్రయంబునన్+గల+వలనను' (వలను= నేర్పు). అనురీతిని సమర్థింపనగును.

షష్ఠీభవేదిత్యాది:—తత్పురుషసంస్థితా = తత్పురుషసమాసగతమగు, నామ్నామ్= ప్రాతిపదికములపయిఁ నిల్చియున్న, షష్ఠీ = షష్ఠీవిభక్తి, ద్వితీయాతుల్యా= ద్వితీయావిభక్తితుల్యమగు నాకారముగలది, భవేత్ = అగును. లోపశ్చ విభక్త్యాదేరిత్యాదిసూత్ర మాచ్ఛికసమాసమాత్రవిషయకము జ్ఞాపకసిద్ధసమాసవిషయకము నగుటచేతఁ దక్కినసాంస్కృతిక మిశ్రరూప సాధ్యసమాసముల విభక్తిలోపము చింతామణి సమ్మతముకాదు. అట్టియెడల సర్వకారకబాధకమగు శేషషష్ఠి నంగీకరించి యట్టిసమాసముమాత్రము చేయనగుననియు నట్టిషష్ఠి ద్వితీయాతుల్యాకారమునంది నిల్చుననియు, నట్టియెడల ద్వితీయకు లోపము ప్రకృతసమాసవిధిచేఁ గల్గనేరదనియు నచ్చోటి ద్వితీయాసంబంధియగు తిఙ్మధ్యశాస్త్రసిద్ధమగు ద్రుతము మాత్రము (౪౨ విష.) 'ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు' (౮౭ విష.) అను

---

మాబోఁటులకుఁ బ్రియంబైనపనికి. (ఆర. ౭ ఆ. ౩౬౮.) సీ.........తే-గీ. సిద్ధులకు ననుఁబోంట్లకుఁ జెప్పనేల. (ద్రోణ. ౧ ఆ. ౧౩౯). తే-గీ. అలిగి జమునాలుకయుఁ బోని యతులశక్తి. (కర్ణ. ౩ ఆ. ౧౬౨ ప.) సీ. గిరిశృంగములఁబోని కరిశిరముల (కర్ణ. ౩ ఆ. ౧౭౬). ఆ-వె. 'తన్నపోనిదానిఁ దన్వి' అనుచో 'తన్నపోలుదానిఁ దన్వి'యని కవిప్రయుక్తమైయుండు. (ఆది. ౪ ఆ. ౨౩౪.)

సూత్రముచొప్పున లోపించునని యెఱుంగనగును. ఉదా:—రామునియొక్క+బాణము = రామునిన్+బాణము = రామునిబాణము. రామునియొక్క+బాణము= రామున్+బాణము = రాముబాణము. రామునియొక్క+కొడుకు = రామునిన్+కొడుకు=రామునికొడుకు. రామునియొక్క కొడుకు = రామున్+కొడుకు = రాము కొడుకు. మొ. "లోపశ్చవిభక్త్యాదేః" అనునది సార్వత్రికముకాదు. సమాసకము లందు సైతము విభక్త్యాదిలోపము సార్వత్రికముకాదు. (౨౭౦ విష) అయ్యాది సమాసకములందును జ్ఞాపకసిద్ధసమాసములందును బ్రయోగానుసారముగాఁ జెల్లును. ఉదా:—'కొమరునియొక్క యునికి = కొమరయునికి' అని యుండనేరదు. 'కొమరుని యునికి'అనియే నిల్చును. కావున సమాసకములందును మిశ్రాదిసమాసములందును నెల్లయెడల నీషష్ఠీభవేదిత్యాదిసూత్రము వర్తిల్లును.

సూత్రమునందలి 'ద్వితీయాతుల్యా' అనుదానికిః దంత్రముచే నావృత్తి నంగీకరించి, షష్ఠి, ద్వితీయాతుల్యాకారము గలదగునపుడె, ద్వితీయాతుల్యా = అట్టి ద్వితీయాంతమువంటి రూపముతో నిల్చునని వ్యాఖ్య చేసికొనవలయును. అనఁగా 'యొక్క' లోపించిన షష్ఠీరూపము తిజ్మధ్యసూత్రముచేత ద్రుతము చేరక ముందటి ద్వితీయాంతరూపమును బోలియున్నపుడే యీసూత్రము వర్తిల్లునని తాత్పర్యము ఉదా:—సీతయొక్క+శక్తి = సీతనున్+శక్తి = (పాక్షికనులోపము) సీతన్+శక్తి = సీతశక్తి. ఇట్లే రూపసిద్ధి నంగీకరింపవలయును గాని 'సీతనుశక్తి' మున్నగు ననిష్టరూపసిద్ధి నంగీకరింపరాదు. 'సీతనున్' అనుద్వితీయారూపములోని 'ను'అనునది "లుక్చస్యాత్"త్తను సూత్రముచొప్పున విభాషను లోపింపఁగా (చూడు. ౧౩౧ విష.)'సీతన్' అనియేర్పడును. అట్టిరూపములోని తిజ్మధ్యసూత్రసిద్ధద్రుతము చేరక ముందటి 'సీత'అనునది 'సీతయొక్క'అనుదానిలోని 'యొక్క' లోపించినదానిని బోలియుండునేకాని 'సీతనున్' అనుదానిలోని ద్రుతముచేరక ముందటి 'సీతను' అను నది యద్దానినిబోలి యుండదుగదా. కాన నిట్టి ద్వితీయాతుల్యాకారము (సీతనున్) నిల్వనేరదు. ఇట్లె నీ-నా-తా-మనశబ్దములయొక్క విభక్తి లోపించిన షష్ఠీరూపములు 'నీ-నా-తా-మన' అనునవి వానిద్వితీయారూపములను, 'నిన్ను-నన్ను-తన్ను-మనల' అను వానిని బోలియుండమిచేత 'నీ-నా-తా-మన'శబ్దములయెడల ప్రకృతమగు షష్ఠీభవేదిత్యాదిసూత్రము వర్తిల్లనేరదు. మనలన్ - ద్వితీయ. (ఆది. ౬ ఆ. ౧౫౭ ప.) మనయొక్క షష్ఠి. (ఆది.౨ ఆ. 38).(౨౧౯ I విష.)ఉదా:—నావాఁడు-మావాఁడు-తనమాట - తమమాట - మనవాఁడు - మనవినత. తక్కినసర్వనామములచోట ద్వితీయాతుల్యతయె గల్గును. ఉదా:—వానిమాట - వారిమాట. మొ. 'నీయొక్క

పుత్త్రుఁడు' మున్నగుచోటులందలి షష్ఠికి ద్వితీయాతౌల్యము లేనపుడు 'యొక్క'కు సాంస్కృతిక మిశ్రసమాసములలో లోప మెట్లు కల్గునని శంకింపరాదు. "శబ్దేభ్యో యుష్మదాదిభ్య ఇత్యాది సూత్రము విశేషవిధిగ వానికి 'యొక్కలోపము' కల్గుట కథర్వణునిచే సూత్రింపఁబడెను. (౨౭౧ విష.) ఇట్టిచోట్ల "యొక్క చ శేషేషష్ఠీ" అనుచోటి చకారముచేత "యొక్క" నిల్వదన్నను ననవచ్చును. కావున' నీయొక్క+పుత్త్రుఁడు = నీపుత్త్రుఁడు' మున్నగురూపములు నిర్బాధముగా సిద్ధించును. షష్ఠి ద్వితీయాకారముతో నుండువానికే యీవిధి చెల్లునపు డింక ద్వితీయాతుల్యాకార విధానము చేయ నేల యని శంకింపరాదు. సాధ్యములగు సాంస్కృతికమిశ్ర సమాసములలో సమాసావయవపదముల విభక్తులకెల్ల సమాసకముందువలెనె లోపము నంగీకరించినచో 'రామునియొక్క+కౌమారుఁడు' అనుచో రాముకౌమారుఁడు" అనురీతి ననిష్టరూపము లుత్పతిల్లును. (విస్తర II. ౨౬౯-౨౭౦-౨౭౧ విష.) యొక్కవిభక్తి వ్యస్తతలోను నిత్యముగా లోపించునుగాన రామునికొడుకు మున్నగురూపములకై షష్ఠీతత్పురుషమునుమాత్ర మంగీకరింపనేల యని శంకింప రాదు. రాజుయొక్క+ఆజ్ఞ = రాజునాజ్ఞ మున్నగుచోట్ల సామాసిక 'ను' మాగమము సమాసాంగీకారములేక సిద్ధింపనేరదుగదా. మఱియు నుత్తరపదలోప రూపకాదుల యర్థముల సిద్ధికి సమాసాంగీకార మత్యావశ్యకముగదా.

స్యా దుత్తరస్యేత్యాది:—ఉత్తరస్య లోపేపి = ఉత్తరపదలోపమందును సమాసపూర్వపదమునకు,ద్వితీయా అనియతా=ద్వితీయా తుల్యాకారము నియతము కానిదై యనఁగాఁ గొన్నియెడలమాత్రమువచ్చునని యర్థము.మతా=సమ్మతమగును. అన్యత్రాపి=ఉత్తరపదలోపేతరసమాసస్థలములందును, తదిష్టిఃస్యాత్ = ఆద్వితీయా తుల్యాకారస్థితి కొన్నియెడల సమ్మతమగును. తత్ర=ఆవిషయమున, ప్రయోగః = మహాకవి ప్రయోగమె, కారణమ్=మూలము. ఉదా:—'జవ్వాది యమ్మకపు సెట్టి = జవ్వాదిన్+సెట్టి = జవ్వాదిసెట్టి. ఊరన్+తిరుగు+పంది = ఊరఁబంది. ఇట ద్వితీయా రూపములేదు. రెండువే లధికమగు నలువది = రెండువేలన్+నలువది = రెండువేల నలువది. ఇట్టివి సైత ముత్తరపదలోపసమాసోదాహృతులె. మో మనెడి తమ్మి = మోముతమ్మి. తీఁగెవంటి కౌను = తీఁగెకౌను. వ్రేపల్లె యను వాడ = వ్రేపల్లెవాడ. ఇట్టివెల్ల 'అన్యత్రాపీత్యాది కుదాహరణములు.క్వచిత్ప్రిత్యయేత్యాదికారిక ౨౫౧ I విషయమున వ్యాఖ్యాతమయ్యెను. ఉదా:—షష్ఠి ద్వితీయాకారముతోనె నిల్చుటకు:—దానియొక్క+కలరూపు = దానిన్+ది+కలరూపు = దానిదికలరూపు. వారియొక్క+నిశ్వాసములు = వారిన్+వి+నిశ్వాసములు = వారివి నిశ్వాసములు.

రామునియొక్క+శక్తి = రామునిన్+ది+శక్తి = రామునిది శక్తి. తథాత్వే మ్మనుట
చేత "సీతనుదిశక్తి - నిన్నుదుశక్తి" మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు. 'సీత
యొక్క+శక్తి = సీతన్+ది+శక్తి = సీతదిశక్తి' అనురీతినిమాత్రమె రూపసిద్ధి
కల్గును. నీ-నా-తా-మనశబ్దములచోటస్సైతము షష్ఠి ద్వితీయాకారముతో నిల్వదు.
కాఁగా 'యొక్క' విభక్తివలెనె వానికి 'దు' ప్రత్యయము చేరును. ఉదా:—
నీయొక్క+శక్తి = నీదుశక్తి - మాదుశక్తి. మొ.

క్వచిదసత్త్వవిభక్త్యర్థ ఇత్యాది కారిక ౨౨౦ మొ ౨౨౮ విషయమున వ్యాఖ్యా
తము. 'ఇరువది యధికము నొకటి' అనువిగ్రహముగల యుత్తరపదలోపిసమా
సమున షష్ఠిచోట ద్వితీయాకారము నిల్వక ప్రథమయొక్క యాకారము నిల్చును.
'ఇరువదియొకటి' అనియే యగును. ఇరువదిటియొకటి యని కానేరదు. ఈసూత్రము
"స్యాదుత్తరస్య లోపేపి........."అనుసూత్రమున కపవాదము. ఉత్తరపదలోపి
సమాసమున షష్ఠి ద్వితీయాకారమున నిల్వక ప్రథమాకారమున స్సైతము నిల్చునని
యర్థము.

బాలవ్యా. సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గాదు. ౨౫.
౨౭౦ I రామునిబాణములు. సరసపువచనములు. వేవెలుఁగు.
విషయము. గుణముల ప్రోక.

సంజీవని. ౨౭౦ I విష:—సమాసావయవపదముల విభక్తికి లోపంబు గలు
గును. బా. తత్స. ౩౧ సూత్రముచే విభక్తికి లడాగమంబు విధింపఁబడుటచే 'లట్టు'
స్సైతము విభక్తిగ గణింపఁబడునుగాన దానికిని లోపము ప్రకృతసూత్రముచే
సూరిమతమునఁ బ్రాప్తించుచుండఁగా నట్టి లట్టునకు లోపంబు గలుగదని వచింప
వలసెను. "రామునియొక్క+బాణములు" అనుచో 'రాముని' అనుదానియందలి
'ని'అనునది బా. తత్స. ౨౩ సూత్రముచేఁ బ్రకృతికి విధింపఁబడినది గాన నయ్యది
లోపింపదని సూరి యాశయము. కాన 'రామునిబాణములు' అనుచో విభక్తులకు
లోపము రాఁగా 'రామునిబాణ' అనుదానికిఁ బ్రాతిపదికత్వముకలిగి ప్రథమా
విభక్తి రాఁగా 'రామునిబాణములు' అనురూపము సిద్ధించెనని సూరి తాత్పర్యము.
ఇట్లె 'సరసములు వచనములు' అనుచో విభక్తిలోపము కల్గఁగా 'సరసము వచన
ములు' అని సిద్ధించెను. ముగాగమము ప్రకృత్యవయవము గాన నయ్యది లోపింప
దని సూరితలంపు. బా. సంధి. ౩౨ సూత్రము చొప్పున ముగాగమ, మువర్ణ
మునకు 'పు'వర్ణాదేశము రాఁగా 'సరసపువచనములు' అనురూపము సిద్ధించెను.
'వే+వెలుఁగులు (గలవాఁడు)' అనుచో బహువ్రీహిని బ్రథమావిభక్తిలోపముకల్గి

ప్రాతిపదికత్వము కల్గఁగా ప్రథమావిభక్తి యుదయించి 'వేవెలుఁగు' అనురూపము సిద్ధించెను. 'గుణములయొక్క ప్రోక' అనుచోఁ బయిరీతినె రూపసిద్ధి నెప్పునది. ప్రకృతసూత్రముచొప్పున లట్టునకు లోపము కల్గలేదని యెఱుఁగనగును. సూరి 'ల' అనుదానినిఁ జింతామణిచొప్పున ద్వితీయావిభక్తి ప్రత్యయముగా నంగీకరింప కుండుటచేతను 'టా'ది పరకత్వమునఁ బ్రకృత్యాగమముగా నంగీకరింపకుండుట చేతను 'షష్ఠీ భవే ద్వితీయాంశుల్యేత్యాగికమగు ప్రక్రియను మార్చుటచేతను బయిరీతిని సూత్రించుకొనవలసివచ్చెను. ఈమార్పులోని యనుపపత్తు లీవలికే కొన్ని చూపఁబడినవి. (వి. స్త. II ౨౬౯-౨౭౦ విహ.)

అలౌకికవిగ్రహవాక్యములోనే సమాససంజ్ఞకల్గి యట్టి సమాసమునకుఁ బ్రాతిపదికత్వము సిద్ధించి తదవయవీభూత సుబ్విభక్తిలోపము కల్గునపుడు 'లట్టునకుఁ బ్రాప్తి యెట్లు? "లట్టునకుఁ గాదు" అనువిధానము సార్థముచేనది రాఁదగినచోటి విభక్తులు లోపింపవన్నచో నందును ననుపపత్తులు తోఁచుచున్నవి. లట్టు లోపింపనపుడు దాని మూలములగు విభక్తులును లోపింప వనక తీరదుగదా. ఇంక లట్టు రానిస్థలముల సమాసవిభక్తులే లోపించునని సూత్రమున కర్థముచేయవలసివచ్చును. 'గుణములప్రోక' అను నుదాహరణమునుబట్టి విభక్తిప్రత్యయము లోపించి 'ల' మిగులు ననుట దుర్ఘటము. 'ల' అనుదానితోఁగూడిన మొత్తము విభక్తియగునపుడందుఁ గొంతభాగము లోపించునను నర్థ మెట్లు లభించును. ఉదాహృతినిబట్టి యంగీకరింతమన్నను 'గుణములప్రోఁకలతో' అనుచో "గుణములప్రోఁకల" అనుదానికిఁ బ్రాతిపదికత్వము సిద్ధించి యనిష్టరూపోత్పత్తి దుర్వారమగును. సమాసపూర్వపద విభక్తి లోపముమాత్రమె సూరికి సమ్మతమన్నచో నుత్తరపదస్థ విభక్తితోఁ గూడిన భాగమునకే యనిష్టమగు సామాసికప్రాతిపదికత్వము సిద్ధింపవలసివచ్చును. సమాసమున నుత్తరపదస్థవిభక్తియే లోపింపదన్నచో సముదాయమున కేకపదీభావమే దుర్ఘటమై సమాసమునకుఁ బ్రాతిపదికసంజ్ఞ లేకపోవలసివచ్చును. మఱియు మధ్యమపదలోపిసమాసమున నుత్తరపదలోపము నుపమానవాచకలోపము మున్నగునవి సిద్ధింపమింజేసి యనేకములగు కవిప్రయోగము లీసూరిమార్గమున సంగ్రహింపఁబడనేరవు. కాన నీసూరిమార్గ మపమార్గ మనకతీరదు.

### తత్పురుష కర్మధారయ ద్విగు సమాసవిధులు.

### అందుఁ దత్పురుషసమాసము.

శబ్దా త్తచ్ఛబ్దాతః. (ఆం. చిం. సంధి. ౮ కా. అహో
౧౯3 పుట)

నన్నయాథ. సంబద్ధే క్వచిదర్థః స్యా । దసంబద్ధే విలక్షణః (వికృ.
౨౭౧.విష. సంధి. ౨౬. కారి. అహో. ౨౨౪. ౩౮౬. పు).
శబ్దేభ్యో యుష్మదాదిభ్య । స్సమాసోపి గురు ర్భవేత్.
౩౭. (వికృ. అజ. ౧౯. కా. అహో. ౨౭౮.పు)

కల్పతరు. ౨౭౧ విష:—'శబ్దాత్..........' అను నన్నయకారికయు 'సంబద్ధే.........'అను వికృతివివేకకారికయు ౧౦౭ విషయమున వ్యాఖ్యాతములు. షష్ఠ్యంతపదములకుఁ దచ్ఛబ్దార్థకము లుత్తరపదములగునపు డట్టి తచ్ఛబ్దార్థకములగు "అది - అవి" శబ్దములు స్వార్థమునె యనఁగా నచటి సంబంధార్థమునే బోధించుననియు వాని 'అ'కారము బహుళముగా లోపించుననియు నట్లె కొన్ని విశేషణములు తచ్ఛబ్దార్థకములతో గర్మధారయ మగునపు డట్టివిశేషణములు విధేయకోటి నధిరోహించుననియు నట్టియెడల సైతము 'అది - అవి' శబ్దముల 'అకారము' వికల్పముగ లోపించుననియు "శబ్దాత్..........సంబద్ధే........." అనుకారికలకుఁ దాత్పర్యము. ఉదా:—రామున+యొక్క+అది = రామునిది, తెల్ల+అది = తెల్లది మొ. 'తెల్లది'. మున్నగునవి కర్మధారయాభాసములు. తెల్లది- తెల్లదానిన్ - తెల్లదానిచేన్ - చిన్నవి - చిన్నవానిచేన్. చదువుచున్నవాఁడు చదువుచున్నవానిచేన్ - మొ. ఆ. వె.........స్వయం । వరము చేయుచున్న వాఁడు వాఁడు (ఆది. ౭. ఆ. ౩౬). "నల్లనివాఁడు.........నల్లనియది......... ఇత్యాద్యాః కర్మధారయాభాసాః". (అహో. ౪౩౩. పు.) కడు మొదలగు కొన్ని విశేషణముల కిట్టి సమాసము చూపట్టలేదు.

శబ్దేభ్య ఇత్యాది:—యుష్మదాదిభ్యః = 'నీ - నా - తా - మన' అనెడి, శబ్దేభ్యః = శబ్దములకంటెఁ బరముగ నున్నశబ్దములకు, సమాసోఽపి = సమాసము సైతము, గురు ర్భవేత్ = సాధువగుచున్నది. యుష్మదాదిశబ్దముల షష్ఠి ద్వితీయాకారమున నుండదుగాన వీని షష్ఠీసమాసము "షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యా......" అనువిధికి (౨౭౦. విష.) విషయము కాదు. సమాససామాన్యపద్ధతిచొప్పున నలౌకికవిగ్రహమునందె సమాససంజ్ఞ కల్గెడిపద్ధతి చొప్పునఁ బ్రక్రియ నడచినచో - మీరయొక్క+ఆన - తమయొక్క+ఆన" మున్నగుచోటులందు "నీయాన - తాయాన" అనురీతి ననిష్టరూపములు గల్గవలసివచ్చును. మఱియు మిశ్రసమాసము నన్నయాథర్వణీయసమ్మతము కామింజేసి నీ యాజ్ఞ మున్నగునవి సాధువులు కాకపోవలసివచ్చును. కాఁగా వాని సమాస మిట్లు ప్రత్యేకముగ నుపదేశింపఁబడినది. ఇట్టి ప్రత్యేకవిధానసజ్ఞాపకముచేత 'నీయాన'మున్నగు సమాసకము లేక 'నీయాజ'

మున్నగు మిశ్రసమాసములును సిద్ధించుచున్నవనియు, వీనియెడల సమాససామాన్య పద్ధతి సయుక్తము వర్తిల్ల నేరదనియు (వర్తిల్లినచో 'మీయాజ్ఞ' యనుచోట 'నీయాజ్ఞ' అని యేర్పడవలసివచ్చును) నిదియునొక జ్ఞాపకసిద్ధసమాసమే యనియు, వీని యీ సమాసవిధి యపి శబ్దముచేఁ బాక్షికమనియు, నీసమాసవిధానము సప్రయోజన మగుటకై సమాసవిభక్తిలోపము మాత్రము జరుగుననియు విశదమగుచున్నది. ఉదా:—నీయొక్క+ఆజ్ఞ = నీయాజ్ఞ. నీయొక్క+ఆన = నీయాన. మీయొక్క+ఆజ్ఞ = మీయాజ్ఞ - మీయొక్క+ఆన = మీయాన, మొ. ఇట్టిసమాసము కలుగని పక్షమున 'నీయొక్కశక్తి = నీదుశక్తి - నీశక్తి మీదుశక్తి - మీశక్తి మున్నగు వ్యస్తరూపములును సమ్మతములగును. వ్యస్తతయందును యొక్క విభక్తి లోపించునుగాన 'నీశక్తి - మీశక్తి' మున్నగునవి వ్యస్తరూపములును నగుచున్నవి. ఇట్టిరూపములు సిద్ధించునపుడింక నేతత్సమాసవిధాయకసూత్ర మేల యని శంకింపరాదు. వీనిసమాసమునే యుపదేశింపనిచో 'నీయొక్క+అది = నీది - మీయొక్క+అది = మీది - నాయొక్క+అవి = నావి మున్నగుస్థలములందు "శబ్దాత్తచ్ఛబ్దాతః" (౧౦౭ విష. ౨౭౦. విష.) అనుసామాసికసంధిశాస్త్రము వర్తిల్లమింజేసి 'అది - అవి' శబ్దముల 'అ' కారమునకు లోపము సంభవింపకపోవలవచ్చును. మఱియు సంబన్ధే క్వచి దిత్యాదిచొప్పున నిష్టార్థసిద్ధియుఁ గల్గకపోవలసివచ్చును. (విస్తర) వీనిసమాసము వైకల్పికముగాన సమాసాభావపక్షమునఁ బయి నుదాహరించిన

---

విస్తర. ౨౭౧విష:—అహోబలపండితుఁడు "శబ్దేభ్య"ఇత్యాదికారికయొక్క యుపయోగమును సరిగ గ్రహింపక దీనిని "షష్ఠ్య నిమిత్తాది జేత్యాది చింతామణి సూత్రసందర్భమున నుదాహరించెను. అట్లయినను 'నీ నా తా మన' శబ్దముల సమాసమునకు సాధుత్వ మెట్లని శంకించుకొని (షష్ఠీ భవే ద్ద్వితీయాతుల్యేత్యాది చొప్పున ద్వితీయాతుల్యాకారము లేదు. సమాసక మనుటకు విభక్తిలోపము ప్రాతిపదికము నిల్చుట మున్నగునవి లేవు) నన్నయప్రయోగములనుబట్టి వానిసమాసము సాధువని యీక్రిందురీతిని వ్రాసెను. "నీ నిమిత్తంబున నిత్యాది తత్పురుషసమాసో ఽపి సాధుః నీ । కారణంబునఁ జేసి సర్వజగంబులోఁగల భూపతుల్. తనకుల బ్రాహ్మణు. తమ తమకులముల్ ఇత్యాద్యాచార్యప్రయోగాత్. సమాసస్య తత్పురుషత్వే వారల కారణమునఁ నెగ్గుపుట్టెఁ గొంచ్యులమున్. ఇత్యాద్యాచార్య ప్రయోగ ఏవ - అథర్వణాచార్యేణ తు - శబ్దేభ్యో యుష్మదాదిభ్య । స్సమాసోఽపి గురు ర్భవే దిత్యుక్తమ్" (అహో. ౨౭౮ పుట.) కవిజనరుండనకర్త పైయహోబల పంక్తుల తాత్పర్యమును సరిగ (దెలిసికొనక మిక్కిలి యసంగతముగ వ్యాఖ్యచేసెను.

"నీశక్తి - మాశక్తి - నీదుశక్తి మాదుశక్తి" అనువానివలె. "నీయది - నాయది - మాయది - మాయవి - తమయవి మున్నగురీతిని "శబ్దాత్తచ్ఛబ్దాతః" అనుసూత్రము (౧౦౭ పిప) చొప్పున 'అ' కారలోపము కల్గని రూపములు సిద్ధించును. నీదుశక్తి-మాదుశక్తి" అనునవి సమాసరూపములని భ్రమింపరాదనియు "నీశక్తి - మాశక్తి" అనురీతివి మాత్రమె సమాసరూపములన్న ననవచ్చుననియుఁ బ్రకృతశబ్దేభ్య ఇత్యాదిసూత్రమె విశదీకరించుచున్నది. దువర్ణకాంతములు వ్యస్తములగుటచేతనే స్వరపరకసంధిలో "షష్ఠ్యా ఉతోఽచి నుమ్ సేచ" అను సామాసిక నుమ్ము రానేరదు. ఉదా:—నీదు+ఆజ్ఞ = నీదాజ్ఞ. నీదు నాజ్ఞ అని కానేరదు. చ.........నీదయ సముగ్రత యాపరిపాటి యేమనన్ (రాఘ. ౧ ఆ, ౪౪ ప.) 'నీదు+అయసముగ్రత+ఆపరిపాటి (అయ శ్శ్మభావహోవిధిః)' అని భారతపక్షమున ఛేదము. 'నీయొక్క+దయ యొక్క+సముగ్రత' అని రామాయణపక్షమున నర్థ మెన్నునది. మఱియు 'ది-వి-దు' ప్రత్యయములు 'యొక్క' విభక్తి పర్యాయములు గాన నివి సదా విశేష్యముతోనె యన్వయించును. క.........తనదుకీర్తి వెలుంగన్. (ఆది. ౫ ఆ. ౩౭.) సీ...... వారివ ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవపుష్ప దామములయు।......వారివ .........వారివ (ఆది. ౩ ఆ. ౧౫౬.) ఇందు "వారి+వి+అ = వారివ" అనురీతి

---

"యుష్మదాదిశబ్దములకంటెఁ బరమైన సమాసమందును నిమిత్తపర్యాయపదంబులకు సర్వవిభక్తుల ప్రయోగము శ్రేష్ఠమగును. ఉదా:—నీ నిమిత్తంబునన్ - ఇచ్చటఁ దృతీయ - నీ। కారణంబునఁ జేసి సర్వజగంబులోఁ గలభూపతుల్ - ఇచ్చటఁ బంచమి. అలుక్సమాసమందును గలదు. వారల కారణమున నెగ్గు పుట్టెఁ గౌరవ్యులకున్ - ఇత్యాదులు గ్రహింపవలయును." అని యిట్లు శబ్దేభ్యోయుష్మదాదిభ్య ఇత్యాది కారికను వ్యాఖ్య చేయఁబడెను. (విశ్వ. అజం. ౧౯ కారికాత్ప.) నారాయణీయాంధ్ర వ్యాకరణగాణపతవివరణకర్తలు పయియహోబలపండితీయపంక్తులనె యనుసరించిరి. "తే గీ.........। సాధువు సమాసమున్ యుష్మదాదులపయి" వివృతి = '...... నీ। కారణంబునఁ జేరి సర్వజగంబులోఁ గలభూపతుల్. వారలకారణమున నెగ్గు పుట్టుఁ గౌరవ్యులకున్' మొ. (నారా. గాణ. ౩౦౨ కారి. సమా. ౩ పద్య. ౨౬౦ పుట.) "వారలకారణమున........." ఇత్యాదిపద్యభాగ మిట నహోబలపండితీయమునఁ బడియున్నదని యెక్కించఁబడెనే కాని దీని కిటఁ బ్రసక్తిలేదు. 'వారలన్' అనునది యుష్మదాదులలోఁ జేర్పఁదగినది కాదు. దానిని 'షష్ఠీ భవే ద్ద్వితీయే'త్యాది చొప్పున 'వారలయొక్క+కారణము = వారలన్+కారణము = వారలకారణము' అని సాధింపనగును.

నవధారణార్థకశబ్దవ్యవధానము నైతను వీని వ్యస్తతను విశదీకరించుచున్నది. (చూడు. ౨౫౧ I వివ.).

సర్వశబ్దంబులు సంబంధంబునందుఁ దచ్ఛబ్దంబుతోడ సమసించును. ౮.

నావాఁడు - నాయది. ఇంటివాఁడు - ఇంటిది. రాముని వాఁడు - రామునిది.

ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు. ౯

బాలవ్యాకరణ. వచ్చినవాఁడు - వచ్చినది. రానివాఁడు - రానియది.

వివరణము. ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టి యను పదంబు

౨౭౧ I వివయము. విభాష ననుప్రయుక్తంబగు. ౧౦.

వచ్చినట్టిరాముఁడు - వచ్చినరాముఁడు - వచ్చునట్టి వాఁడు - వచ్చువాఁడు.

యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగు నపుడు దుగాగమంబు విభాష నగు. ౧౧.

నీదుకరుణ - నీకరుణ - నాదు నేరిమి - నా నేరిమి. తనదు రూపు - తనరూపు.

సంజీవని. ౨౭౧ I వివ:—సమస్తపదములును సంబంధార్థమున తచ్ఛబ్దార్థకములగు "అది - అవి - వాఁడు" మున్నగుపదములతో సమసించునని యర్థము. శేషషష్ఠ్యంతపదము సంబంధార్థకమె యగుచుండఁగా మరల నట్టి యర్థమందే తచ్ఛబ్దము సమసించు ననఁగా నట్టి తచ్ఛబ్ద మచట స్వార్థమునే బోధించునని తాత్పర్యము. 'నాయొక్క+వాఁడు = నావాఁడు' మున్నగు నుదాహృతులలో "సమాసవిభక్తికి లోపంబగు........." (౨౭౦ I వివ.) అను ౨౫ సూత్రముచే యొక్కవిభక్తి లోపమును జేయనగునని సూరి యాశయము. 'ఇంటియొక్క+అది = ఇంటి+అది' అని యేర్పడఁగా, బా. సంధి. ౪౫ సూత్రముచొప్పున 'అది' శబ్దాకార లోపము రాఁగా 'ఇంటిది' అనురూప మేర్పడును. ఇట్లె "రామునియొక్క+అది = రామునిది" అనియు సిద్ధించును. ఇంటిది మున్నగువానినుండి 'ఇంటిని - ఇంటి దానిన్ - ఇంటిదానిచేతన్' మున్నగురూపముల నూహించునది.

౯ సూ-వ్యాఖ్య:—అచ్ఛికవిశేషణములకు విభక్త్యంతరూపభేదములుండవు. అవి స్త్రీసమములు గాన వానికిఁ బ్రథమైకవచనలోపము కల్గి పదత్వము సిద్ధించును.

అట్టి విశేషణము విశేష్యముతోఁ గర్మధారయముగ సమసించును. ఉదా:—చదివిన పుస్తకము. మొ. ఇట్లె ధాతుజవిశేషణములు తచ్ఛబ్దార్థకములగు 'అది - అవి - వాఁడు' మున్నగువానితో సమసించును. కాని యంతలి తచ్ఛబ్దార్థకమున కర్థవిశేష ముండదు. ఉదా:—వాఁడు వచ్చినవాఁడు = వాఁడు వచ్చినాఁడు. మొ. ఇంక నిట్టి తచ్ఛబ్దార్థకముతోడి సమాసముమూలమున- నట్టి ధాతుజవిశేషణమునకు విభక్తి యోగయోగ్యత వాక్యమున విధేయ మగుట మున్నగు ప్రయోజనములు గల్గును. ఉదా:—వచ్చిన+అది = వచ్చినది. (బా. సంధి. ౪౫ సూత్రముచే 'అ' కారలోపము) దీనినుండి 'వచ్చినవి - వచ్చినదానిన్ - వచ్చినదానికిన్ - వచ్చినదాన' మున్నగురూపము లేర్పడును. "అది వచ్చినది" అనుచో "అది వచ్చెను" అను రీతిని విధేయతయుఁ గల్గును. ఇట్లె 'రానివాఁడు - రాని యది' మున్నగువాని నరయునది. బా. సంధి. ౪౫ సూత్రముచొప్పున 'అది' శబ్దపు 'అ' కారము లోపింపనపుడు 'రాని యది' అనురూప మేర్పడును. సూత్రములోని "ధాతుజ విశేషణంబులకు" అనునది పెక్కువిశేషణంబుల కుపలక్షణము. ఉదా:—చిన్న+ వాఁడు = చిన్నవాఁడు - చిన్నవానిన్. చిన్న+అది = చిన్నది-చిన్నదానిన్ - రెండ వది - రెండవదానిన్ - రెండవవాఁడు - రెండవవానిన్. మొ.

౧౦ సూ-వ్యా:—అట్టిశబ్దము తాదృశార్థకమగు విశేషణము. అయ్యది ధాతుజవిశేషణముల తుది నర్థవిశేషబోధము లేకయే విభాషగ నిల్చునని యర్థము. ఉదా:—వచ్చినట్టివాఁడు - వచ్చినవాఁడు. వచ్చినట్టిది = వచ్చినది. సీ. అనవుడు నద్దేవి యాదరభరితయై బాలార్కబోధితపద్మజాత। యైనట్టి దాన శ్రీయను లక్ష్మి నా భూతి యనఁగ వెలుంగుదు. (శాంతి. ౫ ఆ. ౮ ప. సూ. రా. ని.). అట్టి - ఇట్టి- ఎట్టి శబ్దములు మహద్వాచకతచ్ఛబ్దముతో సమసింపఁగాఁ దచ్ఛబ్దలోపమున "అట్టిఁడు - అట్టిరు - ఇట్టిఁడు - ఇట్టిరు - ఎట్టిఁడు - ఎట్టిరు" అనురూపములు సిద్ధించును. (౨౧౦ VIII విష) 'అట్టిది' అనుదానినుండి 'ఆట్టియందు' ఇట్లె 'ఇట్టియందు' అని యేర్పడును. (౨౧౦ VIII విష) ఉ......దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ। బుట్టువు. (ఉద్యో. 3 ఆ. ౧౧౮) ధాతుజవిశేషణములకు 'అట్టి' శబ్దమువలెనె "ఇట్టి" శబ్దమును 'అది' శబ్దమువలెనె 'ఇది' శబ్దమును ననుప్రయుక్తము లగుట గలదు. తే-గీ. అనఘ యూర్వశి యిచ్చిన యిట్టిశాప। ము.........(అర. ౧ ఆ. 3౬౭.) సీ. ఒక్కకర్ణంబు నీలోత్పలశ్యామమై తనువెల్ల శశిహంసధవళమైన। యిట్టిగుఱ్ఱములు వే యొక్కన్యకుంకువ.........(అర. 3 ఆ. ౧3౨.). క. ఏ నిన్ను ఘూను యనియెడు। దీనికిఁ దగ నిమ్ము భారతీకన్యక (నిర్వ ౧ ఆ. 3.) ప్రయోగ

ములు:—ధాతుజవిశేషణములమీఁది తచ్ఛబ్దానుప్రయోగమునకు:—క...... వీని విడువుఁడు। యని నోడినవాని హీనునయశోవీర్యున్. (ఆది. ౭ ఆ. ౪౭.) ('వీనిన్' అనునపుడు 'ఓడినవానిన్' అనుచోటి తచ్ఛబ్ద మర్థవంతము కానేరదుగదా) వ. వీరి నిందఱ రక్షించుట నీకుఁ బ్రియంబే౹......తే గీ. వీరి సుఖసుప్తులై యున్న వారి నిద్ర। సెడఁగ బోధింపనోప.........(ఆది. ౬ ఆ. ౧౯౯). ఉ.........వాఁడిట వచ్చువాఁడొ యే। నందుల కేఁగుదానొ.........(ఆర. ౨ ఆ. ౨౦౩.). విధేయకోటి నధిరోహించునపుడే కాక విశేషణ మగునపుడును దచ్ఛబ్దవకార లోపము గలదు. క. మున్నిట్టి భవదనుగ్రహ। మెన్నఁడు గన్నారు గలరె యివ్వారలు.........(హరి. ఉ. భా. ౮ ఆ. ౫౪ ప.) క. ఎంత యెఱుక గలవారును దు। ర్వారవికారముఁబొందెదు। వారు.........(ఆర. ౧ ఆ. ౩౨.) చ.........తీర్థయాత్ర చనువాఁడు పరాశరుఁ డన్మునీంద్రుఁడు......(ఆది. ౩ ఆ. ౩౬.) (చను పరాశరుఁ డని యర్థము.). విశేష్యమును దొలి నిలిపి కొంతవాక్యము నడువనిచ్చి విలంబాసహానమునఁ దద్విశేషణమును దద్ధర్మార్థకముగను దచ్ఛబ్దానుప్రయోగము గలదానిగనుఁ బ్రయోగించుట నన్నయసంప్రదాయము. "అయ్యుదంకుండు గురుకార్యధురంధరుండై గురుపత్నీనియోగంబునఁ బౌష్యుం డనురాజు దేవికుండలంబులఁ బ్రతిగ్రహించి తేరం బూని వనంబులో నొక్కరుండ చనువాఁ డెదుర...... నొక్కదివ్యపురుషుం గని.........(ఆది. ౧ ఆ. ౯౪. ఇట్టిదె ఆది. ౧ ఆ. ౧౦౨ పద్యమునఁ గలదు.) ఇతరులవాడుకలో నిచట చనువాఁ డనుచో 'చనుచు' నని ప్రయోగింపఁబడును. (ఇట్టి దింకను ఆది. ౭ ఆ. ౩౭. ఇందు రెండుస్థలములు గలవు.) సీ.........ఏ మరుదెంచు। వారము త్రైలోక్యవర్తి నంబుజభవప్రభవు నారదుఁ గని (ఆసె. ౮ ఆ. ౧౬౧.). సీ.........ఆ-వె. కోమలాంగి యిపుడు గుఱుగొని పాంసుల। స్థలమునందు నిద్రతగిలినదియు. (ఆర. ౨ ఆ. ౭౭ ప.) (తగిలినది=తగిలెనును) ఆ-వె. నీరుఁ ఖంబు దీర్ఘనిశ్వాసధూమరం। హాతులఁజేసి కలుషమైన యదియు (సభా. ౨ ఆ. ౯౨) (కలుషమైన యదియు=కలుషమయ్యెనును.) విశేషణములకుఁ దచ్ఛబ్దానుప్రయోగము:—ఉ. ఒక్కొకవానివాకిటన్. (భాస్క. యుద్ధ. ౧౬ ప.) ఒక్కొకవాని (భాస్క. యుద్ధ. ౩౦౫ ప.) ఆ-వె. ఇట్టిదేని మనకు నిందుండఁగా నేల (ఆది. ౬ ఆ. ౧౫౪.) ఆ వె. చెలఁగి లేవ నేడ్చు చిఱుతుకదాని. (ఆది. ౪ ఆ. ౪౭.) ఉ. మానముకంటెఁ బ్రాణములు మందివియే......(ఉ. హరి. ౬ ఆ. ౧౩౭.) అదిశబ్దానుప్రయోగము లేని విశేషణప్రయోగము మత్తకోకిలము:- ...పూజనీయులు వీరిలోఁ। బ్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టి మహాత్ము...

(సభా. ౨ ఆ. ౪ ప.) క...పెద్దల। చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్.
(సభా. ౨ ఆ.౧౯ ప.) ఉ...సూర్యబాణమే। నేసితి నింద్రుఁ డొట్టి సుర లెంతయు సంతస మందఁగా జగ। త్త్రాసి తమిస్రరాశి నిహతంబుగ దిక్కులు తెల్లగా మహో గ్రాసుర లాహవంబున భయంపడ మాతలి మెచ్చి యార్వఁగాన్. (ఆర. ౪ ఆ. ౭౨ ప.) (తెల్లగా = తెల్లవికాఁగా.)

౧౧ సూ-వ్యా:— యుష్మదస్మదాత్మార్థకంబుల కనఁగా నీ-నా-తాశబ్దంబుల కుత్తరపదంబు పరంబగునపు డనుటంజేసి సమాసమం దనునర్థము లభించుచున్నది. సూరి యుదాహృతులందును 'నీదుకరుణ = నీకరుణ' అని దుగాగమరహిత షాష్ఠిక సమాసరూప ముదాహృతమగుటయు దుగాగమము సమాసాశ్రయవిధియే యని విశదపఱుచుచున్నది. 'నీయొక్క+కరుణ' అనుచో బా - సమా - ౨౪ సూత్రము చొప్పున యొక్కవిభక్తి లోపింపఁగా, యుష్మదర్థవాచిశబ్దమునకు 'నీ' అనుదాని కంత్యావయవముగా 'దు' అనునది యాగమంబుకాఁగా 'నీదుకరుణ' అని యగును. దుగాగమాభావపక్షమున 'నీకరుణ' అని యేర్పడును. ఇట్లె 'నాదు నేరిమి' మున్నగు తక్కినవాని ప్రక్రియ నెఱ్ఱునది.

'నీదుకరుణ' మున్నగు రూపములు సమాసములని సూరి తలంచుటసరికాదు. 'దు' అనునది యాగమమనుటయు సరికాదు. చింతామణి "దిః స్యాత్ సంబన్ధార్థే, సర్వస్తు; ద్యుష్మ దస్మదాత్మభ్యః। ద్వితివర్ణకః" అని 'ది-దు' అనువానిని సంబంధార్థక ప్రత్యయములుగా నుపదేశించెను. అథర్వణాచార్యుఁడును "ది-వి-వర్ణకౌ" అని వీఁని ప్రత్యయములనియే వచించెను. కాఁగా నివి "యొక్క చ శేషే షష్ఠీ" అనుదాని కపవాదములగు ప్రత్యయములనుట స్పష్టము. కాన 'దు' అనునది సమాసాశ్రయ విధికాదు. నీదు-నాదు మున్నగునవి షష్ఠ్యర్థకములగుటంజేసి యవి సమాసగతములె యన్నచో "నీదు+ఆజ్ఞ" మున్నగుచోట్ల "షష్ఠ్యా ఉతోఽచి నుమ్ నేచ" అనుచొప్పున నుమ్మురాఁగా "నీదు న్నాజ్ఞ" అనురీతి ననిష్టరూపములు గలుగవలసి వచ్చును. "చ......నీదయ సమగ్రత యాపరిపాటి యేమనన్. (రాఘు. ౧ ఆ. ౪౪.) "నీదయ+యొక్క+సమగ్రత" అని రామాయణార్థము. "నీదు+అయసమగ్రత" అని భారతార్థము. (చూ. ౨౪౧ I విష.) క. ఆదట నీ-నా-తనయను। చో దుత్వము గలుగు షష్ఠి చూపెదు నెడలన్। నాదు కళాసంపదయును। నీదు వివేకంబుఁ దనదు నిపుణతయు ననన్. (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౩౨ ప.) అని 'దు' అనునది షష్ఠీవిభక్తి యనియె పెద్దిరాజు వచించెను.

స్వస్వవిభక్తి వికారై । ర్బహవశ్చ యథాతథం సమ
స్యన్తే. (ఆం. చిం. హలం. ౧౯ కా. అహో. ౪౫౩ పు.)
సంస్కృతాన్ధ్రపదాన్యత్ర । సమస్యన్తే యథాతథమ్।
సమ్మతం. శ్రుతిరఞ్జన మాదాయ । విభక్త్యుపవిభక్తిభిః. (వికృ.
౨౭౨ విషయము హలం. ౨౪-౨౫ అహో. ౪౫౩ పుట.)
పూర్వత్వ మపరత్వం స్యా । న్నామ్నాం నేతు ప్రయోగా
గతః. (వికృ. హలం. ౨౨ కారి. అహో. ౪౪౪ పు.)

కల్పతరువు. ౨౭౨ విష:—బహవశ్చ = అనేకములయిన శబ్దములు, స్వస్వ విభక్తివికారైః = తమతమ విభక్తులు మున్నగువాని వికారముతోఁ గూడినవై, యథా తథమ్ = యథేచ్ఛముగా సంస్కృతము లాచ్ఛికములతోను నాచ్ఛికములు సంస్కృతములతోను యథేష్టముగ, సమస్యన్తే = సమసించుచున్నవి. అథర్వణుఁడు దీనియర్థము విస్తరించి వివరించుచున్నాఁడు. సంస్కృతాంధ్రపదాని = తత్సమాచ్ఛిక పదములు, అత్ర = ఈతెనుఁగుభాషయందు, విభక్త్యుపవిభక్తిభిః = సుబ్విభక్తుల తోడను నుపవిభక్తులతోడను సంకలితములై, శ్రుతిరఞ్జన మాదాయ = పండిత కవీంద్ర సమ్మతముగ, యథాతథమ్ = యథార్థముగా, సమస్యన్తే = సమసించు చున్నవి. సమాసగతపదముల పూర్వనిపాత (పరనిపాత) విషయము సంస్కృత వ్యాకరణమందే నిర్ణయింపరాదయ్యెను గాన సాధ్యసమాసములందును బ్రయో గానుసారముగా నిల్ప నగునని యథర్వణుఁ డుపదేశించుచున్నాఁడు. నేతు = సమాసమందును, నామ్నామ్ = శబ్దములయొక్క, పూర్వత్వమ్ = పూర్వస్థితియు, అపరత్వమ్ = ఉత్తరపదస్థితియు, ప్రయోగతః = పండితకవీంద్రప్రయోగానుసార ముగ, స్యాత్ = అగును. ఉదా:— తటాకము నుదకము - తటాకమునీరు - చెఱువు నుదకము - చెఱువునీరు - అంచలరాయఁడు - రాయంచ. మొ. (౨౬౭-౨౬౭ I విష.) (౨౬౮ I విష.) ఆంధ్రవిభక్త్యుపవిభక్తిచిహ్నితములు కాని శుద్ధసంస్కృత పదము లాచ్ఛికములతో సాధారణముగ సమసింపనేర వని తాత్పర్యము. "బహ వ శ్చానేకశబ్దాశ్చ యథా తథం వైకృతా స్సంస్కృతై స్సంస్కృతా వైకృతైశ్చ స్వస్వవిభక్తిభి రౌపవిభక్తికవికారైశ్చ మిళిత్వా సమస్యన్తే. మేటిమునిరాజు- బ్రహ్మదండపుఁ గైదువు - తెలితమ్మికంటి గేహిని పుట్టినింటి సంపత్తి పెంపు - కలువకంటి కటాక్షంపు గుంపులు. ఇత్యాదయో జ్ఞేయాః, ఏతేన-పాపరాజో (పాములయొక్క+ రాజు)పాపవిషము (పాములయొక్క+విషము) వేఁపగంధము (వేములయొక్క+గంధము) ఇత్యాది సమాసా అపి సాధవః" (అహో. ౪౫౩ పు.) "ప-ఁప-ంప" అను నౌపవిభక్తి

కములు సమాసమందే వచ్చునని యీావఱకు వివరింపఁబడెను. ఇనుపముక్క - వేప చెట్టు - అంపశయ్య - ఎంపముక్క. మొ. (౨౨౭ మొ. ౨౩౩ వ. విష.)

సంస్కృతమునందువలెనె తెలుఁగుసమాసములందును ననేకవిధములగు సమాసాశ్రయవిధులు గలవు. పైని వివరింపఁబడిన వేపచెట్టు మున్నగుచోటులందు వచ్చు 'ప ఁప-ంప' అనునవి సమాసాశ్రయకార్యములె. అట్లె ౮౭ విషయమునందలి సామాసిక ద్రుతలోపము ౮౮ II విషయమునందలి 'సింగపుఁగోదరు' మున్నగు చోటులందువచ్చు ద్రుతాగమము, ౯౬ విషయమునందలి సుమ్ము, (రాజునాజ్ఞ) ౧౦౫ విషయమందలి 'ఇ'దాగమము 'అ'ల్యాగమము (నీతోడిచెలిమి) (నాయందలి కరుణ), ౧౦౭ విషయమునందలి తచ్ఛబ్దాకారలోపము (నాది), మున్నగునవెల్ల తత్పురుషమున వచ్చు సమాసాశ్రయవిధులె యనఁదగును. ఇట్లె యాయాస్థలము లందలి సమాసాశ్రయవిదులు ముస్ముందుఁ జూపఁబడును.

కేవల సంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమ సింపదు. దానంజేసి యనేకమాఱులు అల్పదం డిత్యా దులు దుష్టము లని తెలియునది. (బాల. సమా. 3 సూ. వివృతి.)

బాలవ్యాకరణ వివరణము: కొండొకచో సమాసంబులందు నామ్యాది కనుమ్యా దుల మువర్ణంబులు పవ్వర్ణంబులగు. ౧౯.

౨౭౨ I విషయము. నాఁపచేను - పాఁపటేఁడు, కనుపపులు - జనుపనార, నాము - పాము, ప్రేము - వేము, అమ్ము - ఎమ్ము, ఇవి నామ్యాదులు. కనుము - ఇనుము, ఉడుము, ఎనుము- జనుము - మినుము, ఇత్యాదులు కనుమ్యాదులు.

సంజీవని. ౨౭౨ I విష:—కేవల సంస్కృతేత్యాదికము బా - సమా - 3 సూత్రము వివరణములోని వాక్యము. అయ్యది ౨౬౯ విషయమున వ్యాఖ్యాత మయ్యెను. ఆంధ్రవిభక్త్యాదిచిహ్నితము కాని శుద్ధసంస్కృతశబ్దము వికృతిశబ్దముతో సమసించినచో దానిని వైరిపదమందురు. క. తుద వేఱుచేసి మఱి చ। క్కఁదనపుఁ దెనుఁగున నమర్చి కలవంబుజముల్। పదియు ననక కల వంబుజ।పది యని కృతిఁ జెప్ప వైరిపద మనఁబరఁగున్. (కవిజనా. దోషా. ౨౨ ప.) క. క్షీరార్ణవమూఁతురు సం। సారార్ణవ మోడ శుభ మొసఁగు మీా కనఁగా। వైరిపదంబగుఁ దెనుఁగునఁ। గూరని సంస్కృతముఁ దెనుఁగుఁ గూర్చుటచేతన్. (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౩౫ ప.) క. దినకరతోడునున [illegible] । మనిచి [illegible] వునకు పాటి యన [illegible] న।

దెనిఁగింప సంస్కృతములం। దెనుఁగులు సంధించిరేనిఁ దెగడుదు రార్యుల్. (ఆం. భూ. ౧౩౧ ప.) ఇట్లు లాక్షణికులెల్ల వైరిపదదోషమును నిరాకరించియున్నారు. పాల్కురికి సోమనారాధ్యుఁడు తనపండితారాధ్యచరిత్రమున "ద్విపద. జల్లి ప్రాసక ముపశబ్ద ముక్రమము.........వైకల్య ముక్త్యుక్తి వైరిపదంబు.........ద్రాఘ ఛందోవిరుద్ధం బాదియగు న। లాఘప్రలాపోక్తి లాఘవం బనక। వసి గూర్చు కృతులు...బిలిబిలికృతుల్ కృతులె" అని వైరిపదమును నిరసించియున్నాఁడు. ఇట్టి సోమనారాధ్యుఁడె తనబసవపురాణమున వైరిపదదోషదూషితప్రయోగములు చేసె నని బసవపురాణపీఠికాకర్తగా రిట్లు వ్రాసిరి. "సోమనారాధ్యుఁడు బసవపురాణమున మాత్రము ప్రయోగించిన వైరిపదములఁ జూపుచున్నాఁడను. పుట ౬ దీపగంభంబులు. పుట ౧౫ చౌదశాబ్దంబు. పు - ౨౬ ముల్లోకవంద్య - పుట ౩౦ ముల్లోకనుతుఁడు - పు - ౨౮౦ ముల్లోకనాథుని - పు - ౮౮ నిత్యనేమంబు పు. ౫౫ నిత్యపడి. పుట ౧౬౮ నిత్య ; (ఇట్టివి పెక్కుమార్లు) పు - ౫౫ పుడమిాశ. పు - ౬౦-౬౩ సర్వాంగకచ్చడము - పు - ౧౨౮ భక్తకూటువలు. పు - ౧౭౮ మజ్జనబావి- పు- ౨౦౧ ఇతరవేల్పులు- పు- ౮౫-౨౦౫ తపనిధి- పు- ౨౮౦ తపరాజు- పు- ౧౫౮ తపరాజవల్లభుఁడు-పు - ౨౦౧ సిరిమహాదేవాదిసురలు-పు - ౧౮౦ ధర్మకవిలె ఇత్యాదులు." (బసవ. పీఠిక. ౯౭-౯౮ పుటలు.) సోమనారాధ్యునివంటివాఁడు తాను నిరసించిన వైరిపదమును పలుచోట్లఁ బ్రయోగించె ననుట విశ్వసనీయము కాదు. పై నుదాహరింపఁబడినవానిలో 'దీపగంభము' అనుచో గకారాదేశము ముద్రణస్ఖాలిత్యమనియు 'కంభ'శబ్దము సంస్కృతమునఁ గలదనియు నీవఱకు వివరింపఁబడెను. (విస్త. ౬౦ II విష.) నిత్యనేమము మున్నగుచోట్లులందలి 'నిత్య'శబ్దము 'నిత్య'శబ్ధభవముగు నాచ్ఛికము. (కన్యాశబ్దము కన్నె యయినట్లు) (విస్తర. ౬౦ III విష.). పుడమిశబ్దము సంస్కృతమని యీవఱకు నిరూపింపఁబడెను. (విస్తర. ౬౦ II విష.) 'సర్వాంగకచ్చడము' అనునది ముద్రణసంస్కారలోపకృతము - రెండు స్థలములందును వరుసగ 'కచ్ఛట - కచ్ఛటిక' అనునవి కవిప్రయుక్తము లననగును. "కచ్ఛా కచ్ఛటికా కక్షా పటీ - కౌపీన మిత్యపి" అని యమరము (త్రికాండశేషము). "కట్టితి సర్వాంగకచ్ఛట యనుచు" "అంతకుఁదగిన సర్వాంగకచ్ఛటిక" అని కవిప్రయుక్తపాఠములు కానోపును. 'భక్తకూటువలు' ముద్రణసంస్కారలోపకృతము. 'భక్తకూటములు' అని కవిప్రయుక్తము కానోపును. 'మజ్జనబావి'అను చోటి జకారము దంత్యమని చో [illegible] 'ఇతరవేల్పునకు' అనుచో [illegible]రు వేలు [illegible] ఇతరమతము

వాని వేల్పున కని యర్థము. "కాన కర్తల కర్త మానీలగళుఁడు" (బసవ. ౬ ఆ. ౭౭౭ ప.) అని యిట్లు 'తనవేల్పు - ఇతరునివేల్పు' అనురీతి వాడుక కవి కభిమతము. 'తవనిధి-తవరాజు - తవరాజవల్లభుఁడు' అనురీతి వానిలో 'తప' అను సంస్కృతశబ్దమును దాని తద్భవముగు 'తవము' అను శబ్దమును గ్రహించి సమర్థింప నగును. తపధాతువుమీఁద 'పచాద్యచ్' ప్రత్యయమును నిల్పినను "తప"శబ్దము మీఁద 'అర్శ ఆద్యచ్' ప్రత్యయమును నిల్పినను 'తప' అను 'అ' కారాంతశబ్ద మేర్పడును. కాన "తపనిధి - తపరాజవల్లభుఁడు - తపరాజు" అనునవి సుసాధము లగును. "భువి జను లెల్లను బొగడుచు నుండఁ। దవనిధి తేడరదాసయ్యకీడె. (బస. ౬ ఆ. ౮౯౮.) అను నీప్రాసస్థలమున 'తపనిధి' శబ్దభవము 'తవనిది' యని సమర్థింప నగును. 'తపస్వి' అనుదానికిఁ దద్భవము 'తపసి' అనియు 'కపిల' అనుదానికిఁ దద్భవము 'కవిల' అనియు భట్టారకుఁడె ప్రయోగించెనుగదా. (౬౩ III విష.) (తద్భవవికృతులు. విస్తర. ౬౦ II విష. విస్తర. ౬౦ III విష. చూచునది.) 'ధర్మ కవిలె' అనునది ముద్రణసుసాధ్యరలోపకృతము. 'ధర్మకపిల' అని కవిప్రయుక్త మనం దగును. "మీఁదత్తి మీఁప్రాఁత మీఁధర్మకపిల" (బసవ. ౪ ఆ. ౧౦౩౩ ప.) ధర్మార్థము విడిచిన (వృషోత్సర్జనము) కపిలధేనువు. దీని తద్భవరూపము 'దమ్మకవిల'. 'అవుదల ల్వంచుచు నయ్య మీఁ దమ్మ। కవిలల మంచును గడుదైన్యపడుచు' (బస. ౭ ఆ. ౩౯౭.) ధర్మకపిల నెవ్వరును హింసింపరు. 'దమ్మకవిలె' అనిచెప్పి 'ధర్మముల చిట్టాపుస్తకము' అనుటయు సుసంగతముగా నుండదు. (విస్తర. IV ౬౩ III విష.) ఇంక 'చౌదళాబ్జంబు-ముల్లోకవంద్య - ముల్లోకనుతుఁడు - ముల్లోకనాథుని-సిరిమహాదేవాదిసురలు.' మున్నగువానిలోని 'చౌ - సిరి' మున్నగునవి 'చతుర్ - శ్రీ' మున్నగువాని వికృతిరూపములు - మూఁడు అనునది దేశ్యము. ఇవి సాధ్యసమానాధికరణసమాసగతములయి సిద్ధసమాసపూర్వావయవముతో నన్వయించుచున్నవి. కాన వైరిసదదోషమునకుఁ బ్రసక్తి లేదు. ఇట్టివి సాధువులె యని నిర్ణయించు నేకదేశాన్వయవిషయ మీఁవలకు వివరింపఁబడెను. (౨౬౬ I విష.) పాల్కురికి సోమనారాధ్యుని వైదుష్యము వర్ణనాతీతము. అతఁడు నియమోల్లంఘనము చేయువాఁడని భ్రమింపరాదు. మతవిషయమునందువలెనె భాషావిషయమునందును నాతని పోకడలు వింతవింతలుగా నుండును. (చూ. విస్త. ౬౦ II విష. విస్త. ౬౦ III విష. తద్భవములు. విస్తర. IV ౬౩ III విష. మూఁడుమూలశబ్దములప్రయోగములు.)

బా సమా ౧౯ సూ - వ్యాఖ్య:— నామ్యాది కనుమ్యాదులకు సమాసము లుండు . . . . . . . లౌకవిధ . . . . . . . . . యని

ణీయాశయము. (౨౨౭ మో. ౨33 వ. విప.) తక్కిన యాపవిభక్తికములవలె నివి విభక్త్యంతము ముందు నిలువవుగాన వీనివిధి సమాసాశ్రయవిధులలోని దనుటయె యుచితమని సూరి యాపవిభక్తికప్రకరణమున వీని నుపదేశింపక యిట సమాస ప్రకరణమున వచించెను. నాము+చేను = నాఁపచేను (లేఁత చేను) జెత్తుబిందు పూర్వక మగునుగాన నామ్వాదులకు వచ్చు పవర్ణము బిందుపూర్వకమైయుండును. 'నాఁపచేను' అనుచో దీర్ఘపూర్వకమగుటచే పూర్ణపూర్వకత్వము లేదయ్యెను. ఇట్లె 'అమ్ము+శయ్య = అంపశయ్య. ఎమ్ము+ముక్క = ఎఁపముక్క.' అనుచో మ్ముపర్ణస్థానమున పఙ్ఘురాఁగా నుడి తొలియచ్చుమీఁది దగుటంజేసి ఖండబిందువు రాదయ్యెను. పూర్ణము రాఁగా 'అంపశయ్య' అని సిద్ధించెను. ఇట్లె యంటతనునెఱుంగునది. 'కనుము+పులు' అనుచో ముపర్ణస్థానమున 'ప' అనునది నిల్వఁగా 'కనుపపులు' (రెల్లుగడ్డి) అని యేర్పడెను. ఇత్యాదులు కనుమ్వాదులనుటచేఁ గనుమ్వాదు లాకృతిగణమని తెలియనగును. నామ్వాదులు కనుమ్వాదులు స్త్రీసమములె యని తోఁచెడి. "నాము = దే-వి-జొన్న లోనగువాని కొయ్యగాలునఁ జిగిరించిన మొలక. దీనిని పసులు తిన్నను మృతినొందును" "జనము-వై-వి-ఒకవిధమైనపైరు. 'ద్వి—జనము గలంగె రాజనము మలంగె. (విష్ణు. పూ. 3 ఆ.) (దీనికట్టెలయందు నారతీయుదురు.)" (శ-ర) 'జనుము' అనునది కోశములందు లేదు. పైప్రయోగములోని శబ్దాలంకారనియమమునుబట్టియు శణశబ్దప్రకృతినిబట్టియు 'జేనము' అనియె యుండవలయునని కోశకారుల యాశయము. పయికారణములచే నిదిమాత్రము నపుంసకసమ మనవలసియున్నది. కాని "జేనమ్ము - జేనంబు" అనుప్రయోగములు కానరావు. "శణ-పు. (శణ-అచ్) స్వనామఖ్యాతే తృణభేదే' "తృణ-పు (తృ+ణక్) హ్రస్వశాఖాశిఫాయుక్తే శాఖోటాదిద్రుమే" (శబ్దస్తో) అనుచొప్పున పొట్టికొమ్మలును నూడలును గలచెట్టు జనుము (జనము) కామింజేసి శణశబ్దభవము జేన మనుట విశ్వసనీయమై యుండలేదు. కాన 'జనుము' అని యుకారమధ్యమె యీశబ్దమనియు నిదియు స్త్రీసమమె యనియుఁ దోఁచెడిని.

## కర్మధారయము

సంస్కృతపదేన పరిమిత, మాన్ధ్రిపదం కర్మధారయో భవతి. (ఆం. చిం. హలం. ౧౯ కారి. అహో. ౪౫౨ పుట.)

కన్నయా. ౨౭3 కప గాను.

ద్వ్యత్రురాది చతుర్వర్ణ । పర్యన్త జననామసు । లోపః సాక్షడ్డ్వాదివర్ణానాం । శబ్దే రా (యా) జాదికే పరే । క్వచి దత్త్వం క్వచి చ్చాత్త్వం । క్వచి దిత్త్వం క్వచి

త్పరా । క్వచి న్మత్వం యథాయోగ । మనశ్చ వ్యవ
హారతః. (వికృ. అజం. ౧౦౮-౧౦౯-౧౧౦ కారి.
అహో. ౩౭౬ పు.)

కల్పతరు. ౨౭౩ విధ:—పరిమితమ్ - ఆచ్ఛికపదమ్ = అల్పాక్షరములుగల యాచ్ఛికపదము, సంస్కృతపదేన = ఆంధ్రవిభక్తిచిహ్నితముకాని శుద్ధసంస్కృత పదములతో, కర్మధారయో భవతి = కర్మధారయముగ సమసించును. ఉత్తర సూత్రమందలి "స్వస్వవిభక్తి వికారైః" అనుదాని స్వారస్యముచే నిందలి సంస్కృత పద మాంధ్రవిభక్తిసంపర్కము లేని దనునర్థము లభించును. ఉదా:—రామః+సు+ అన+సు = రామన (౬౯ I విభ.) భీమ+అన = భీమన. పరగెను దొల్లి శ్రీపతి పండి తయ్య (పండితా) భక్తయ్య (బసవ. ౪ ఆ. ౧౮౪.). వెం. 'ఆచ్ఛికపదమ్' అనునది యుపసర్జన సంజ్ఞకలదనియు సమాసపూర్వావయవము కావలెననియు నన్నయ యుపదేశింపలేదు. అన-అయ్య మున్నగునవి పూజ్యతావాచకములు. రామన = పూజ్యుఁడగు రాముఁడు. శ్రీపతి పండితయ్య = శ్రేష్ఠుఁడగు శ్రీపతిపండితుఁడు. ఈసూత్రమున కహోబలపతి వేఱువిధముగ వ్యాఖ్యచేసెను. అది సరికాదు. "స్వల్పం కేవలవికృతిపదం సంస్కృతపదేన సమస్య కర్మధారయసమాసో భవతి-వేఁడి పయోధారలు - వాఁడిమయూఖములు - కలికి భుజంగకన్యకలు - వేల్పువీరభట వర్గము ఇత్యాది. కఱకు దర్భపూరికఱపులు. (ఆది. ౭ ఆ. ౨౨౬ ప.) ఇత్యాచార్య ప్రయోగే 'దబ్బపూరిపఱపులు' ఇత్యేవ పాఠః - నాచులతలు ఇతి ప్రయోగే షష్ఠీతత్పురుషేణ కథంచి త్సాధుత్వ మున్నేయమ్......స్వల్పత్వంచ షడ్వర్ణపరి మిత మితి నియమః ఆచ్ఛిం షడ్వర్ణపర్యన్తం । పదం స్యా త్కర్మధారయే ఇత్యా థర్వణవచనాత్. తేన - అతనిఁ దాఁకె, వేయిమున్నూఱు దంతావళములు ఇత్యాది తిక్కయజ్వాదికవిజనవచనాని సాధూని." (అహో. ౪౫౨-౪౫౩ పు.) ఈయపవ్యా ఖ్యనే "బా.గు-ప్ర" వ్యాఖ్యాతయు (బా. గు. ప్ర. ౨౬౧ పు) గాణపతవ్యాఖ్యా తయు (౩౦౮ కా. ౧౧ ప. సమా.) ననుసరించిరి. ఈయహోబలవ్యాఖ్య సరికాదు. అహోబలపతి యిచ్చిన యుదాహృతులెల్ల నాంధ్రవిభక్తికార్యచిహ్నిత సంస్కృతపద ముల సమాసములె యగుటంజేసి యవెల్ల "స్వస్వవిభక్తివికారై ర్గృహావళ్చ యథా తథం సమస్యన్తే" (౨౭౨ విధ) అను నుత్తర సూత్రమునకును దానివివరణమగు సంస్కృతాంధ్రపదా న్యత్ర । సమస్యన్తే యథా తథమ్......" ఇత్యా ద్యథర్వణకా రికకును లక్ష్యము లయియున్నవి. "వాఁడి-వేఁడి" మున్నగునవియు మయూఖములు- పయోధారలు మున్నగునవియు నాంధ్రవిభక్త్యన్తములె. ఈసూత్రములోని

సంస్కృతపదశబ్దము తెనుఁగు విభక్తుల సంపర్కములేని శుద్ధసంస్కృతపరము. 'వేయి మున్నూఱు' అనునది గ్రైదక్షరములది గాన దాని సమాసము సాధు వననేల ? 'తొమ్మిదివేల తొమ్మన్నూట డెనుబదిశ్లోకములు' (ఆది. ౧ ఆ. ౩౫.) "నాలుగువేల మున్నూట పదునొకొండు శ్లోకంబులు. (ఆది. ౧ ఆ. ౩౭.) ఇట్టి వీసందర్భమున ననేకప్రయోగములు గలవు. ఇవియెల్ల సాధువులు కావా ? 'కటికి చీఁకటి తిండి కరములు' అను కవిపితామహప్రయోగము సాధువు కాదా ? మఱియు సాంధ్రవిభక్త్యంతముల సమాసములలోఁ గర్మధారయమె యననేల ? తత్పురుషద్విగువులు మాత్రము సాధువులు కావా ? వేయి మున్నూఱు దంతావళము లనెడిది ద్విగు సమాసమేకదా ? పయినుదాహరించిన తొమ్మిదివేల తొమ్మన్నూట డెనుబదిశ్లోకంబులు మున్నగునవెల్ల ద్విగువు లేకదా ? 'పంటచెలిపట్టికూఁతు మహిమ' ఇత్యాదులగు తత్పురుషములు సాధువులు కావా ? కావున సంస్కృతపదే నేత్యాదిసూత్రములోని సంస్కృతపదము తెల్గువిభక్తుల సంపర్కమునందని సంస్కృతపదముల పరమె యనుటలో సందేహము లేదు (వి స్తర.) అట్టిచో-రామున-భీమున - సీతమ్మ - కృష్ణరాయఁడు మున్నగునవి యీసూత్రమునకు లక్ష్యములనియు నీ విశేషవిధిచేతనే యిట్టి సామాన్యశాస్త్రవిరుద్ధమగు శుద్ధసంస్కృతపదముతోడి మిశ్రసమాసము సాధువని విశద మగుచున్నదనియు నెఱుంగనగును.

అథర్వణునివరణము:—ద్వ్యక్షరాది = రెండక్షరములు మొదల్కొని, చతుర్వర్ణపర్యన్త = నాల్గువర్ణములవఱకుఁ బరిమితిగల, జననామసు = జనుల

---

విస్తర. I ౨౭౩ విష:—వేటికావ్యాఖ్యాత పైసిద్ధాంతము నంగీకరించియు నిటుఁ బక్షాంతరము యుక్తతర మనుచు నీక్రిందిరీతిని వ్రాసెను. "నిపుణముగఁ బరిశీలింప నన్నయ కాఁ బ్రయోగించిన 'కపిలకన్నులు - కపిలజడలు - కపిలగడ్డము'అను మొదలగు సాంధ్రవిభక్తి చిహ్నాతములు కాని శుద్ధసంస్కృతపదములకుఁ దెలుఁగు పదములతో నైన కర్మధారయసమాసములను సంగ్రహించి సాధుత్వ మొసంగ నీసూత్రము ప్రత్యేకించి యారంభించెనేమో యని యనుమానము గలిగెడి" (బా. సా. వే. ౩౨౬ పు.) ఇట్లనుమానించుట సరికాదు. ఇట్లంగీకరించినచో నింక శ్వేతకన్నులు - విపులగడ్డము మున్నగు ననంతము లగు ననిష్టరూపములు దుర్వారము లగును. ఇంక వైరిపదము దోషమె కాదనవలసివచ్చును. సంస్కృదపదే నేత్యాది నన్నయసూత్రములోని పరిమితశబ్దమె నిష్ఫల మగును. ఇంతకును నన్నయ కపిలకన్నులు మున్నగువానిని బ్రయోగింపనే లేదు. (౬౩ III విష.) అవి యనింద్య గ్రామ్యములు కావు. కేవలము నింద్యగ్రామ్యములు.

బిరుదనామములలోని, రాజా (యా ?) దికే - శబ్దే = రాజు - రావు - రాయఁడు - అన్న - అన - అమ్మ - అమ - దేవి - శాస్త్రి - సెట్టి మున్నగు పూజ్యతను శ్రైష్ఠ్యమును దెలుపుపదము, పరే = పరమైయుండఁగా, డ్వాదివర్ణానామ్ = సువిభక్తులకు, లోపః = లోపము, స్యాత్ = కలుగును. (డ్వాదు లనునది మూలభూత సుప్పులకే వాచకము) వానిలోఁ బూర్వపదము తుదిని - క్వచిత్ = కొన్నియెడల, అత్త్వమ్ = అత్త్వమును, క్వచిచ్చ = మఱికొన్నిచోటులందు, ఆత్త్వమ్ = ఆకారమును, క్వచిదిత్వమ్ = వేఱొక కొన్నియెడల 'ఇ'కారమును, క్వచిత్ = ఇంకొక కొన్నిచోటులందు, పతా = పవర్ణము, క్వచిత్ = కొన్నియెడల, మత్వమ్ = మవర్ణమును, వ్యవహారతః = పండితవ్యవహారానుసారముగ, అన్యచ్చ = ఇతరకార్యజాతమును, యథాయోగమ్ = యథార్హముగ నగును. సంస్కృతపదేన పరిమితమిత్యాది చింతామణిసూత్రసిద్ధ కర్మధారయములు జననామములందె కన్పట్టుచుండుటచే నథర్వణుఁ డిట్లు వివరించెను. సామానాధికరణ్యే ష్విత్యాదిసూత్రముచే సమానాధికరణ సాంస్కృతిక మిశ్రసమాసము లభ్యనుజ్ఞాతము లగుచున్నను (చూ. ౨౭౦ విమ.) నితరశుద్ధసంస్కృతశబ్దము (తెల్గువిభక్తిసంపర్కము లేనిది) మహాత్ పుంలింగముగాని మహాత్ పుంలింగసమాచ్ఛికశబ్దముగాని కర్మధారయసమాస పూర్వావయవముగ నిల్చు ప్రయోగములు లేమింజేసి యట్టి సమాసము లట్లు జ్ఞాపకసిద్ధములు కానేరవని యీవఱకే వ్రాయఁబడెను. (చూ. ౨౭౦ విమ.) "శ్లోకార్థ+సు+మగ+సు = శ్లోకార్థమగఁడు" అనరాదు. అట్టి కవిప్రయోగములులేవు. అవి వైరిపదసమాసములు. కాని బిరుదజననామములందట్టి వైరిపద సమాసములును కవిప్రయోగదృష్టము లగుటచే సాధువులె యని విశదపఱుచుటకై ప్రకృతసూత్ర మారంభింపఁబడెను. 'అ-ఆ ఇ ప-మ' మున్నగునవి యట్టిసమాసమునందలి పూర్వపదాంతమున నిల్చుననియు వచించెను. పురుషవాచకముల తుదిని 'అమ-అప' అనునవి నిల్చెననుట సరికాదనియు, 'కృష్ణమరాజు' మున్నగురీతిని 'అమ' మున్నగువానిపై మరల 'రాజు' మున్నగునవి నిల్చుట సరికాదనియుఁ దలఁచి కావలయు, పత్వ మత్వముల నుపదేశించినవాఁడయ్యెను. ఉద :— రామ+సు+(రాముఁడు) అన+సు+ = రామన. భీమ+సు+అన+సు=భీమన. కృష్ణ+సు+రాయ+సు = కృష్ణరాయఁడు. సుబ్బ+సు+శాస్త్రిన్+సు = సుబ్బశాస్త్రి - సుబ్బాశాస్త్రి. రామ+సు+రెడ్డి+సు = రామరెడ్డి - రామారెడ్డి - రామిరెడ్డి. అప్ప+సు+సెట్టి+సు = అప్పిసెట్టి. సుబ్బ+సు+సెట్టి+సు = సుబ్బిసెట్టి - సుబ్బ+సు+రాయ+డు = సుబ్బారాయఁడు - సుబ్బరాయఁడు. శంకర

దాసు+సు+ము+అయ్య = శంకరదాసుమయ్య. కృష్ణ+సు+ము+రాజు+సు = కృష్ణము రాజు. వెంక+సు+ప+శాస్త్రిన్+సు = వెంకపశాస్త్రి. మొ. ద్వి. కట్టుగ్రలీల శంకర దాసుమయ్య. (బసవ. ౪ ఆ. ౩౩౫. ౪ ఆ. ౩౩౨. ౬ ఆ. ౭౨౨. ౫ ఆ. ౧౨౫.) కృష్ణమరాజు నున్నతిన్. (కళా. ౧ ఆ. ). నడి నన్ను శరణుండు శంకరదాసి. (బసవ. ౪ ఆ. ౨౭౩.) కాక శబ్దభవము కాకి యయినట్లు దాసశబ్దభవము 'దాసి' కానోపును. పిదప 'శంకర+సు+డు+దాసి+సు = శంకరదాసి' అనురీతిని సమాసము నెన్నవగును. లేదా 'కాళిదాసు' అనురీతిని 'శంకరదాసు' అను తత్సమరూపమునె (వృద్ధు-వంటిదె దాసు.) యంగీకరింపవచ్చును. (విస్తర II.) కర్మధారయమునం బూర్వావయవముగ మహత్పుంలింగములు పుంలింగసమాచ్ఛికశబ్దములను నిల్పుట లాక్షణిక కవిసమ్మతముకామింజేసి యిట్టివానిసిద్ధికయి యిట్టి విశేషవిధి యత్యావశ్య మని యెంచుకొనుట. 'నన్నపార్యుండు' తిక్కనామాత్యుండు మున్నగునవి యీసూత్రములకు లక్ష్యములు కావు. అట్టియెడల 'నన్న+అప = నన్నప - తిక్క+ అన=తిక్కన' అనువానిని సంస్కృతములుగ ననుకరించి 'నన్నప శ్చాసౌ వార్యశ్చ - తిక్కన శ్చాసౌ వమాత్యశ్చ' అనురీతిని సిద్ధసమాసములుగ నంగీకరింపనగును. "లక్ష్మమావరతనయా" (పాండు. ౧ ఆ. ౨౪ ప). పైసందర్భమునుబట్టి "ఆన్ధ్రిం షడ్వర్ణపర్యన్తం। పదం స్యా త్కర్మధారయే" ("ఆన్ధ్రైః షడ్వర్ణపర్యన్తం। సంస్కృతేన సమస్యతే" పాఠాంతరము) అనుకారిక యధర్వణాభిప్రేత ప్రక్రియావిలక్షణ మగుటంజేసియు ద్వ్యక్షరాదీత్యాదికారికను బునరుక్తమె యగుటంజేసియు

---

విస్తర. II ౨౭౩ విష:—పలువిషయములను బాలవ్యాకరణకర్త సంగ్రహింపకుండంగాం బ్రౌఢవ్యాకర్త యీ క్రిందిరీతిని సంగ్రహించెను.

౨ "కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదంబగునేని ద్వ్యక్షరాదంతస్త్రీపుంసంజ్ఞావాచకంబగు పూర్వపదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు. అంతట ననంగా సాంస్కృతికాదులు మూఁట నని యర్థము. ఉ. రామా శాస్త్రి - సుబ్బాశాస్త్రి. రామారెడ్డి - సుబ్బారెడ్డి"

౩ "ఇటఁ బూర్వపదంబు నత్వంబున కిత్వంబు బహుళంబుగ నగు.. ఉ. సుబ్బినాయుఁడు - ఎల్లిసెట్టి."

౪ "కొన్నియెడల నిచ్చో నకారాపాయాగమంబులగు. తిక్కన సోమయాజి."

౫.........౬ "కర్మధారయం బియ్యది మిశ్రంబు సిద్ధసమాసం బట్లయగు. ఉ.........కృష్ణరాయఁడు. రామరావు.........మొ." (ప్రౌఢ. సమా.)

నథర్వణప్రోక్తము కాదనియు నథర్వణకారికలను సమగ్రముగా నెఱుఁగనట్టియు ఏవో కొన్ని కారికలను బండితపరంపరాయత్తముగ వచ్చినవానిని మాత్రమె యెఱింగినట్టియు బాలసరస్వత్యాదులచేఁ బ్రక్షిప్తము చేయఁబడినదే యనియు గ్రహింపనగును. (మా. చిం. వి. ప. ౫౬ విమ.). (విస్తర. III)

---

విస్తర. III ౨౭౩ విమ:—అహోబలపండితుఁడు భిన్నమార్గగామి గావున "ద్వ్యక్షరాదీత్యాద" కారిక "సంస్కృతపదేనేత్యాదికారికకు నపవాదమని గ్రహింపలేదు. మఱియు ద్వ్యక్షరాదీత్యాదికారికలు బిరుదనామాక్షరవిషయకములని గ్రహింపక సమాసపూర్వపదీభూత సంజ్ఞానామపరములుగాఁ దలంచి యుదాహరించెను. "ద్వ్యక్షరాదిచతుర్వర్ణ|.........ద్వ్యక్షరేషు రామరాజు.........త్ర్యక్షరేషు-బసవరజు.........బసవసిఁహు.........చతురక్షరేషు - నరసింగరాజు......" (అహో. ౩౭౬-౩౭౭ పు.) ఈయహోబలపండితులె యన్యూనానతిరిక్తముగ నారాయణీయగాణకతవివరణకర్తలచే స్వీకరింపఁబడెను. "తే గీ. సంస్కృతపదంబుతోఁగూడ సాధ్వి పరిమి | తముగు నాంధ్రపదము కర్మధారయ ముగు | ఆఱు వ్రాలకు మీఱని యాంధ్రపదమె | తనకుఁ గావలె ననియె నథర్వణుండు. వివృతి - వేఁడిపయోధారలు - వాఁడిమయూఖములు - కలికిభుజంగకన్యలు. మొ. ఉత్తరార్థ - అతఁడు దాఁకె వేయి మున్నూఱు దంతావళములు ఒక్కచో నాఱువ్రాలకు మీఱిన పూర్వపదములు గనుపట్టుచున్నవి. కటికిచీఁకటి తిండికరముల గిలింత......... (మను. ౧ ఆ.) పాలకడలి పట్టి రామణీయకము..." (నా రా. గాణ. ౩౦౮ కారి. సమా. ౧౧ పద్య.) "తే-గీ. రాయఁడు మొదలైన నుడుల్ పరంబులైన | రెండు మొదలు నాల్గువఱకు నుండు.........విమ. రెండు లిపులుగల.........రామరాయఁడు.........మూఁడు లిపులు.........బసవరాజు.........నాలుగు లిపులుగల:- నరసింగరాజు........." (నా రా. గాణ. సమా. ౩౧౬ కారి. ౧౯ పద్య.) ఈయహోబలపత్యాదులవివరణముల చొప్పున నింక "వీరవేంకటనరసింగరాజు" మున్నగునవి లక్షణసమ్మతములు కావనవలసి వచ్చునుగదా !

ఆంధ్రభాషాచరిత్రకర్తగారిచటఁ జేసిన విమర్శమెల్ల నపరిశీలనమూలకమె యని పైసందర్భమువల్ల విశదమగుచున్నది, వారి విమర్శవాక్యముల నిట మచ్చునకై యొండు రెండు చూపెదను. "ఆంధ్రః షడ్వర్ణపర్యన్త" మను కారిక యథర్వణుని గ్రంథములో నుండుట చింతామణి యాశయమునకు విరుద్ధమగుటకుఁ గారణమేమి?.........కృష్ణరాయఁడు - అంచయాన - కలకంఠుఁడు (కలగాయపులగముగ నుదాహరించిరి.)

ఆర్యామ్బాదికశబ్దాః స్యుః । శ్రేష్ఠతావాచకా యతః ।
తతస్తదన్తశబ్దేభ్యో । నైవ శ్రేష్ఠత్వగోచరాః. (వికృ.
అజం. ౧౧౧ కారి. అహో. ౩౭౭ పుట.)

నన్నయా. ౨౭౪ విష

ముఖ్యాన్తాదపి శబ్దాచ్చ । ముఖ్యశబ్దః ప్రయుజ్యతే.
(అహో. ౩౭౮ పుట)

ఉపమానానువాదేషు । విధి రన్యస్య సమ్మతః । స్యా
ద్విశేషవివక్షాయాం । పునరుక్తిః క్వచిద్ధితా. (వికృ.
హలం. ౧౯-౨౦ కా. అహో. ౪౪౦ పుట.)

కల్పతరు. ౨౭౪. వివ:—ఆర్యామ్బాదికశబ్దాః = "అయ్య-అమ్మ" మున్నగు శబ్దములు, యతః = ఏకారణమునఁ బరముగాఁజెప్పి శ్రేష్ఠతావాచకాః = శ్రేష్ఠత్వమును దెలుపునవి, స్యుః = అగుచున్నవో, తదన్తశబ్దేభ్యః = అట్టి - "అయ్య - అయ అన్న - అన - అమ్మ - అమ" మొదలగు శబ్దములు తుదినిగలశబ్దములకంటెఁ బర ముగ, శ్రేష్ఠత్వగోచరాః = శ్రేష్ఠతావాచకములు, నైవ = మరలఁ బ్రయోజ్య ములు కావు. ఉదా:—కోన+అమ = కోనమ. దీనిని సంస్కృతముగా ననుకరించి "అమ్బా" శబ్దమును జేర్పఁగా "కోనమామ్బా" అని యేర్పడును - ఇట్టివి ప్రాచీన మహాకావ్యములలో లేవు. అర్వాచీనమహాకవు లిట్టివానిని బ్రయోగించిరి. క. తేజమున రాఘవుని యంభోజేక్షణ తిమ్మమాంబఁ బోల్పందగునా (పాండు. ౧. ఆ. ౫౫.) క......శ్రీరంజితకొండమాంబ చిరపుణ్యమునన్ (పాండు. ౧. ఆ. ౫౬). మొ. ప్రభు శబ్దాదులు సయితము శ్రేష్ఠతావాచకములె యనుచు నహోబలపతి యిట్లు వ్రాసెను. "రామయప్రభుఁడు-రామయమంత్రి-రామయప్రధానుఁడు - కోనమాంబ" ఇత్యాద యో న ప్రయోగార్హాః శబ్దాః. కింతు-రామప్రభుఁడు కోనాంబ ఇత్యాద్యాకారేణ ప్రయోగార్హాః........" (అహో. ౩౭౮.పుట.) ఇది సరికాదు. ఈపక్షమున "నన్న పార్యుఁడు నన్నయభట్టు - తిక్కనామాత్యుఁడు మున్నగునవికూడ లక్షణవిరుద్ధ ములె యనవలసివచ్చును. కావున, "నన్నయప—తిక్కనయ్య" మున్నగు నార్యా మ్బాదిశబ్ద పౌనరుక్త్యమాత్రమె సాధువు కాదని యథర్వణాశయమును గ్రహింప వలయును. సీ........అనఘులు కేతన, మల్లన సిద్ధనామాత్యవరుల (విరా. ౧. ఆ. ౧౦. ప.) సీ....గీ....నన్నపార్య...(ఆది. ౧. ఆ. ౯ ప.)

---

ఇత్యాదిసమాసములు 'సంస్కృతవైకృతశబ్దైః........' అనుసూత్రమునఁ జెప్పఁ బడిన మిశ్రసమాసముల కుదాహరణములగును." (ఆం. భా. చం. ౧౬౬౩ పుట.)

ముఖ్యాన్తా దపి శబ్దాచ్చ=ఉత్తమ ప్రధానాదిశబ్దములు తుదినిగల శబ్దములపై మరల - ముఖ్యశబ్దః = ఉత్తమ ప్రధానాదిశబ్దములు, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నవి. ఉదా:—ఉత్తమోత్తముఁడు - ఈ కారికలోని 'ప్రయుజ్యతే' అనుపద మహోబలపండితీయమున లేదు, సందర్భమునుబట్టి నాచే జేర్పఁబడినది - "ముఖ్యాన్తాదపి శబ్దాచ్చ ముఖ్యశబ్ద ఇతివచనంతు సంస్కృతసిద్ధార్థానువాదకమ్. ముఖ్యాన్తాత్ ముఖ్యాదిత్యర్థః, ఎట్టి యాపదవచ్చిన గట్టిపడుచుఁ జిత్త ముండుట యత్యుత్తమోత్తమంబు ఇత్యుదాహరణమ్........." (అహో. ౩౭౮. పు.) ఇట్లగుటం జేసి కవిజనమండన టీకాకర్త ప్రక్షిప్తముచేసిన "న ముఖ్యార్థపదా దుక్తం। కర్తృ (కర్తుమ్? = ప్రయోక్తుమ్) ప్రభ్వాదికం సదా । ఏషార (క?) తి స్సదా గ్రాహ్య । సావధానం విచక్షణైః" (వికృ. ఆజ. ౧౧౨. కారి ) అను కారిక యాథర్వణము కాదని యెన్నవగును. ఈ కారిక యహోబలపండితీయమున లేదు. వికృతివివేకటీకాకర్త పయి యహోబలపండితీయ పంక్తులను వివరించుటకయి యిట్లు ప్రక్షేపించె ననియుఁ దోఁచుచున్నది. ఈ ప్రక్షిప్తకారిక యర్థవంతమును గాదు. న ముఖ్యార్థేత్యాది పూర్వార్థము ముఖ్యాన్తాదపీత్యా ద్యథర్వణకారికకు విరుద్ధము కావునని దానిని కవిజనమండనకర్త త్రోసిపుచ్చుచు నుత్తరార్థమును బ్రక్షేపించి యిట్లు దానికిఁ దాత్పర్యము వ్రాసెను. "ముఖ్యార్థపదముకంటెః బరమందుఁ బ్రభ్వాదివాచక ప్రయోగము యుక్తమైనదిగాదు; ఈప్రయోగము పండితులచేత నిమ్మళముగా గ్రహింపఁదగినది. ఉదా:—రాముయ ప్రభుండు - రామార్య ప్రభుండు ఇత్యాదులు. సంస్కృతసిద్ధార్థానువాదక ముఖ్యార్థవాచకంబుకంటెఁ - బరంబునఁ బ్రయోగింప వచ్చును. గీ. "ఎట్టి యాపదవచ్చిన గట్టిపడుచుఁ। జిత్త ముండుట యత్యుత్తమోత్తమంబు" ఇత్యాదులు. రాముప్రభుండు ఇత్యాదులు నిర్వివాదంబులు......" (వికృ. టీక. ౧౨౬. ౧౨౭. పుటలు). నారాయణీయగాణపతవివరణకర్త లీకవిజనమండనములోని యవలక్షణముల నెల్ల స్వీకరించి యీ ప్రక్షిప్త కారికను వివరించిరి. "తే-గీ. వలదు ముఖ్యార్థముపయిఁ బ్రభ్వాదికర్త। లిద్ది సావధానముగ గ్రహింపవలయు... ఉదా:—రాముప్రభువు మొ. రామయప్రభువు ఇత్యాదులు తగవు. (ఇట్లు తగవని కవిజనమండనకర్త వ్రాయలేదు)........." (నారా. గాణ. సమా. ౩౧౮. కారి. ౨౧. పద్య.)

ఉపమానేత్యాది:—ప్రసక్తానుప్రసక్తముగ నిట యుపమానపౌనరుక్త్య విషయకముగు నథర్వణకారిక వివరింపఁబడుచున్నది. ఉపమానానువాదేతు = ఉపమానము ననువదించునపుడు, అన్యస్యవిధిః = మఱొకయుపమానమును బ్రయో

గించుట, సమ్మతః = సమ్మతమగును. ఉదా:—చంద్రుని నగు మోముతామరసిరులు (రాఘ. ౨. ఆ. ౯. ప.) మొ. (రామచంద్రు నగుమోము తామర. (రామాయ) తన చిన్ని రామ=మాద్రి. చంద్రుని నగు మోము తామర. (భారతా) విశేషవివక్షాయామ్= గుణవిశేషమును వివక్షించునపుడు పునరుక్తిః = దానితోడనే మరలం బోల్చుట, క్వచిత్ = ఒకానొకచో, హితా = సమ్మతమగును. ఉదా:—ప్రసన్నచంద్రునింబోలు నాపె ముఖచంద్రబింబము. ప్రసన్నత - వర్తులత్వము ననెడి సమానధర్మములభేద ముచేఁ బునరుక్తి లేదు—"నను నేత్రమ్ములతమ్ములైన కనుదమ్ముల నిత్యాదేః కవివచనస్య పౌనరుక్త్యగ్రస్తత్వాత్కథం సాంగత్య మితిచేత్ 'ఉపమానువాదేతు విధి రన్యస్య సమ్మతః। స్యా ద్విశేష వివక్షాయాం। పునరుక్తిః క్వచి ద్ధితా' ఇత్య థర్వణోక్త్యా తత్సాధుత్వ మవధేయమ్. విశేషవివక్షాయాం గుణవిశేషవివక్షాయా మిత్యర్థః. ప్రకృతే వైపుల్యలక్షణగుణవిశేష వివక్షాయాం పునర్విశేషణ ప్రయోగ ఇతి న పౌనరుక్త్యమ్. తన చిన్నిరామచంద్రుని నగుమోము తామరసికల్ ఇత్యా దికం (రాఘ. ౨. ఆ. ౯). కవివచన మనువాద ఆన్ధ్రకవీనామ్. ఉభయత్రాపి న సంస్కృతకవీనా మస్వరసః. ముఖాబ్జం భవతి చన్ద్రసన్నిభమ్.......... ప్రసన్నేన్దుని భ స్తస్యా స్తదాసీ న్ముఖచన్ద్రమా ఇత్యాది" (౭హో. ౪౪౦. పు.)'

భవే ద్బిరుదశబ్దేషు। యథేచ్ఛం వర్ణకల్పనా। గ్రామ
మానుష్య బిరుద। శబ్దానామపి సో మతః। గ్రామ
నామ్నః సమాసేషు। వికారోపి క్వచి ద్ధితః। క్వచిత్
స్యా దత ఈ దిచ్ఛ। యణ్చాన్యస్మిన్ న యణ్మతః।
స్వరూపత స్సమాస స్స్య। ద్వికారస్య శ్రుతావపి।
క్వచి దన్తిమవర్ణస్య। సమాసే స్యా త్పరిగ్రహః।
క్వచి దేద స్తతాయాం తు। స్యాదవ్యయ సమస్థితిః।
క్వచి దాన్ధ్రవికారస్తు। సమాసే స్యా ద్విరోధకృత్.
(విక్ృ. హలం. ౯. మొ. ౧౩. కా. అహో. ౪౧౨. పు.)

నన్నయా. ౨౭౫. విషయము.

కల్పతరు. ౨౭౫. విష:—బిరుదశబ్దము ప్రసిద్ధసంస్కృతకోశములలోఁ గాన రాదు—"గద్యపద్యమయీ రాజ। స్తు తి ర్విరుద ముచ్యతే." (సాహి. ద. ౬. పరి. ౫౭౦. శ్లో) "వ. బయో ర భేదః" అనుచోవ్వున 'బిరుద' శబ్దము నంగీకరింపనగును. "బిరుదము. సం. వి. అ. పుం. సామర్థ్యచిహ్నము" (శ. ర) "బిరుదు (వికృతి) - (శూరుఁడు-సమర్థుఁడు - శూరచిహ్నము) బిరుదః ప్రకృతి (వైకృతదీపిక.)" "బిరుదు -

వై. వి. ౧. సామర్థ్యచిహ్నము........౨. శౌర్యచిహ్నము........విశే. ౧. సమర్థుఁడు - సమర్థము.. ......౨. శూరుఁడు......" (శ. ర) బిరుదుశబ్దము నర్థములకు శబ్దరత్నాకరమున భారతప్రయోగములు చూపఁబడెను. "సీ. నవ్వేడు తలలను గ్రొవ్వారుచేతుల బిరుదులు వెట్టిన చరణములను (భార. కర్ణ. 3. ఆ)" (శ. ర.) మొ. కాని ప్రామాణిక సంస్కృతకోశములలో బిరుదశబ్దము కన్పట్టలేదు. "క. బిరుదశబ్దంబు విరోధో। త్కరము మహారాష్ట్రభాషఁ దత్ప్రదవిధులన్। బిరుదములనఁ జనువానిన్। ధర బిరుదావలి యొనర్పఁ దగు నండ్రు బుధుల్. ౨౫. చ. అతులకుల క్రమాగతములై, భుజవిక్రమసంభవంబులై। ప్రతిపదసార్థకంబులయి పార్థివకర్ణకఠోరకంబులై।వితరణశబ్దపూర్వపృథివీవరచిహ్నములై తనర్చు న।ద్యతబిరుదాళి చేత బిరుదార్థము చెప్పుట యొప్పు నెప్పుడున్. ౨౬. క. వినయభుజవిక్రమక్రమ। ఘనవితరణరణవిహారకరుణాదికళా।జననస్థలులగు గుణములఁ।బెనుపొందఁగఁ జెప్పవలయు బిరుదావళికిన్. ౨౭. ........."(కావ్యాలం. ౪. ఉల్లా.) ఇట్టి పెద్దిరాజువివరణమునుబట్టి బిరుదశబ్దమునకు విరోధమును బుట్టించునది యనఁగా నొకవీరుని శూరతాచిహ్నమునుగాని శూరతా ప్రతిపాదకశబ్దముగాని మఱొకవీరునకు హృదయభేదకమగుచు విరోధమును బుట్టించునది యని యర్థము విశదమగుచున్నది. కాఁగా 'వైరద (సం) = బిరుద (మహారాష్ట్రప్రాకృత) = బిరుదు. (తె. తద్భవ)' అనురీతి నద్దానిచరిత్రము నరయఁదగునని తోఁచెడిని. ఇట్లగుటనే యిది (బిరుద) ప్రసిద్ధసంస్కృతకోశములలో లేదయ్యెననియుఁ దోఁచుచున్నది. ఆప్టేనిఘంటువున "విరుదః-దం. Proclaiming 2 Crying aloud 3. Panegyric laudatory poem; గద్యపద్యమయీ రాజ। స్తుతి ర్విరుద ముచ్యతే. (G D ౫౭౦) వదన్తి మదదన్తినః పరిలసన్తి వాజిప్రజాః। పఠన్తి విరుదావలీ మహితమన్దిరే వన్దినః. (R G)" అని యున్నది - ఈపక్షమున విపూర్వక'రుద్'ధాతువునుండి 'విరుద'శబ్ద మేర్పడిన దనుట సరికాదు. 'రుదిర్ అశ్రువిమోచనే' (సి. కౌ. తత్త్వ. అదాది. ౩౭౯. పు) 'రుద రోదనే' (శబ్దస్తో) అనుచొప్పున 'రుద్' ధాతువుతోడి రూపము ప్రకృతార్థబోధనక్షమముగ నగపడదు. ఇంక 'వి' పూర్వక'రు'ధాతువునుండి 'విరు'అను క్విబన్తరూపమును సాధించి 'విరు+ద=విరుద'అనురీతి సమర్థింపవలసియున్నది. అపుడు "రు - ధ్వనౌ - అదా..." (శబ్దస్తో) అని'రు'ధాతువున కర్థమగుటంజేసి "రాజస్తుతిరూపధ్వని నిచ్చునది బిరుద మనునర్థము సంగతము కాఁగలదు. క్విబన్త విరుశబ్దము ప్రసిద్ధమగుటంజేసి పైని వివరించినరీతిని "వైరద"శబ్దమూలకత్వము నంగీకరించుటయె యుక్తమని యెన్ననగును.

భవేదిత్యాది:—బిరుదశబ్దేషు = పౌరుషనామములందనఁగా గ్రామ-మనుష్యాదుల సామర్థ్యాది స్తావక సంజ్ఞలందు, వర్ణకల్పనా = అక్షరములవ్యత్యాసము, యథేచ్ఛమ్ భవేత్ = వక్తృయిచ్ఛానుసారముగ నిల్పనగును. అట్టి సంజ్ఞలయందు వ్యుత్పత్తి సరిగఁడకున్నను క్షతిలేదని భావము. ఈసిద్ధాంతముచేతనే "అహోబలుఁడు అథర్వణుఁడు మున్నగునవి నిర్విచికిత్సముగ గ్రాహ్యములని యెఱుఁగనగును. గ్రామమానుష్యబిరుదశబ్దానామపి = అట్టి లక్షణాతిక్రమవర్ణవ్యత్యాసకలిత వ్యుత్పత్తివిదూర బిరుద భాషాంతరశబ్దములకును, సః - మతః = సిద్ధసమాసఘటన కవిసమ్మతము. ఈసమాసములందును వైరిపదదోషము లేదని తాత్పర్యము. ఉదా:—మనుమన్నృపతి - మన్మభూపాలుఁడు తిరుమలమహారాయాగ్రణి - సిరంగరాయవసుధేంద్రుఁడు - చౌహత్తమల్లుఁడు - జగనొబ్బగండఁడు (జగదేకవీరుఁడు). జగదేవదండనాయకుఁడు (బసవ. ౭ ఆ. ౭౫౮ ప.) 'గ్రామనామ్నః' అనునదిమున్నగు వానితోడి సహచరితన్యాయమున నిచటి బిరుదశబ్దము సంజ్ఞానామమాత్రపరమును ననవచ్చును. సమాసేషు - సమాసములయందు, గ్రామనామ్నః = గ్రామనామములకు, వికారోపి = ఆంధ్రవిభక్త్యుపవిభక్తిరూపవికారముసయితము, క్వచిత్ = ఒకప్పుడు, హితః = సమ్మతమగును. ఇందలి గ్రామశబ్దము మనుష్యాదిశబ్దములకును నుపలక్షణము. భాషాంతరసంజ్ఞ లనుకృతములయి సంస్కృతమున వాడంబడునపుడట్టి గ్రామాదినామములందాంధ్రభాషాసహజములగు విభక్త్యుపవిభక్త్యాదుల సమ్మేళనము సిద్ధసమాసములయందుఁ గల్గినను గల్గవచ్చునని తాత్పర్యము. ఉదా:—మాగల్లుపురము - మాగంటిపురము. అట్టి విికృతిని విస్తరించి చూపుచున్నాఁడు. క్వచిత్ = ఒకానొకచో, ఉతః = నామము తుదినున్న 'ఉ'కారమునకు ఈత్ + ఇత్ + చ = ఈకారము - ఇకారమును, యణ్ చ = యణాదేశమును. స్యాత్ = అగును. ఉదా:—విరూరివేదాద్రిపతి-రూనూరీపురి. తెనాల్యగ్రహారము. మొ. అన్యస్మిన్ = అచ్చికపదాద్యచ్చు పరమగునపుడు, నయణ్ - మతః = యణాదేశము సమ్మతము కాదు. తెనాలి యనుపురము. తెనాల్యనుపుర మనరాదు. వికారస్య = ఆంధ్రవికారముయొక్క, శ్రుతావపి = శ్రుతియందును, స్థలాంతరములందాంధ్రవికారము ప్రయుక్తమైయున్నను, స్వరూపతః = ఆంధ్రవికారము చేరని స్వస్వరూపముతో, సమాసః స్యాత్ = సమాసముగూడయుఁ గలదు. ఉదా:—మాగంటిపురము = మాగల్లుపురము. క్వచిత్ = ఒకానొకప్పుడు, అంతిమవర్ణస్య = పదాంతమందుండెడి 'ము' వర్ణకాదికముయొక్క, పరిగ్రహః = ప్రయోగమును, సమాసే = సిద్ధసమాసమందు, స్యాత్ = సంభవించును. ఉదా:—గుత్తిమువంశము - జమ్ముల

వంశము. మొ. క్వచిత్ = ఒకప్పుడు ఏదన్తతాయాంతు = హ్రస్వమగు 'ఎ'కారము పరముందుఁ గల్గుట సంభవించుచుండఁగా, సంస్కృతమున 'ఎ' అను హ్రస్వము లేమింజేసి 'ఏత్త' న్నను 'ఎ' అని యర్థముచేయు సాంప్రదాయమును గలదు. 'ఏదన్తతా చ నామ్నామ్' అని నన్నయ వాడెను. అవ్యయసమస్థితిః=అవ్యయముతో సమానస్థితియు, స్యాత్ = అగును. అవ్యయమును యథాస్థితముగా నిల్పినట్లె దానిని సైతము 'ఏ' కారముగా మార్పక సిద్ధసమాసమందును 'ఎ'కారమె నిల్పఁబడునని తాత్పర్యము. వ్రేపల్లెవాడనగరి. తెనాల్యగ్రహారము. క్వచిత్=ఒకప్పుడు-సమాసే= సిద్ధసమాసమున, ఆన్ధ్రివికారస్తు=ఆంధ్రభాషాసహజమగు వికారము, విరోధకృత్ = కవిసమ్మతివిరుద్ధము, స్యాత్ = అగును. ఉదా:—'తిర్మలరాయఁడు వంశభూషణుఁడు' అనరాదు. 'తిర్మలరాయవంశభూషణుఁడు' అనవలయును. మొ. ప్రయోగములు:—శా... .....విరూరిపట్టణపతిన్ వేదాద్రిమంత్రీశ్వరున్. (పాండు ౧ ఆ. ౧) సీ.. ......తే-గీ.........| భద్రగుణసీరి విరురి వేదాద్రిశౌరి (పాండు. ౧ ఆ ౨౪ ప.) చ.........మన్మభూ| వరుఁడు దగంగ.........(నిర్వ. ౧ ఆ. ౨ ప.) ఎ-గీ.........మనుమన్నృపతి. (నిర్వ. ౧ ఆ, ౪ ప.) శా......సీ| తాభామాపతి ప్రోచుతన్ దిరుమలేంద్ర శ్రీమహారాయునిన్. (వసు. ౧ ఆ. ౧.) 'తిరు - మల - రాయ' అనునవి యాచ్ఛికములె యైనను సంస్కృతములుగా ననుకరింపఁబడి సిద్ధసమాసగతములైనవి. మ.........తిర్మలమహారాయక్షమావల్లభున్. (వసు. ౧ ఆ. ౩ ప.) బత్తీసాదిరాగములు (బసవ. ౩ ఆ. ౯౧౬) చ......... ఆరఘురాథనృపాలు కూర్మిసో| దరుఁడు సింగరాయ వసుధావరుఁ డాత్మ...... (వసు. ౧ ఆ. ౭౧ ప) "మాగంటి పట్టణ మహేశమ్.........మానూరిపట్టణం గతః.........అధికొండవీడు రివవః......అగ్రహీత్ కొండవీడౌ......జమ్ముల వంశపావనుఁడు. గుజ్జమువంశపావనుఁడు.........రేపల్లెవాడనగరీ........." (అహో. ౪౧౩ పు). (అహోబలపండితీయోదాహృతకవిప్రయోగములు.).

సంస్కృతపదేనేత్యాదిసూత్రలక్ష్యములందువలెనె (౨౭౩ విష.) యీబిరుద శబ్ద సమాసములందును వైరిఁదదోషము లేదని పైసందర్భమునుబట్టి పర్యవసితమగుచున్నది.

నన్న సూ. హ్రస్వో ఒదీర్ఘసమాసేపి | క్వచిన్ జీపః ప్రయోగతః.
౨౭౬ విష (వికృ అజం. ౧౯ కారి. అహో. ౨౯౯ పు)

కల్పతరు. ౨౭౬ విష:—అదీర్ఘసమాసేఒపి = పొడుగయినది కాని సిద్ధసమాసమనఁగా పొట్టిసమాసమందును, జీపః = జీప్ప్రత్యయమునకు, (ఇది 'జీష్' మున్నగు

వానికి సులక్షణము) క్వచిత్ = క్వాచిత్కముగా, ప్రయోగతః = మహాకవి ప్రయోగానుసారముగ, హ్రస్వోఽపి = హ్రస్వమువచ్చుటయు సమ్మతమగును. దీర్ఘసమాసమందుఁ జెప్పెడి దేమి యని భావము. ఇట్లు సిద్ధసమాసాశ్రయవిధుల నాంధ్రవైయాకరణు లుపదేశించుట మిక్కిలి యరుదు. (సూ. ౨౮౬ విఘ.)
ఉదా:—క. నది సుతగురు కర్ణశల్యనాగపురీశుల్. (ఆది. ౧ ఆ. ౬౯ ప.)
ఈపద్యము కొన్ని తాళపత్త్రమాతృకలలో లేదనియు "తరల:—పదిదినంబులు భీష్ముఁ డాహవభారకుండు........." (ఆది. ౧ ఆ. ౬౮) అనుపూర్వపద్యమున కిది పునరుక్తి యనియు నిది ప్రక్షిప్తమనియు. గొందఱు దలంచుచున్నారు. అది సరి కాదు. ఇది పునరుక్త మనుభ్రాంతిచేఁ గొందఱు తాళపత్త్రమాతృకాలేఖకు దీనిని వ్రాయ మానియుండవచ్చునుగాని యిది ప్రక్షిప్తము కాదు. మహాకవు లన్యార్థ మునె భంగ్యంతరముగాఁ బునరుక్తిచేయుట సంప్రదాయమై యున్నది. "స్వకేలిలేశస్మిత నిర్జితేన్దునో। నిజాంశదృక్ తర్జిత పద్మసంపదః। అతద్ద్వయీజిత్వరసున్దరాన్తరే। న తన్ముఖస్య ప్రతిమా చరాచరే. సరోరుహం తస్య దృశైవ నిర్జితం। జితాః స్మితే నైవ విధోరపి శ్రియః। కుతః పరం భవ్య మహో మహీయసీ। తదాననస్యోపమితౌ దరిద్రతా" (శ్రీహర్ష. నైషధము ౧ సర్గము. ౨౩-౨౪ శ్లోకములు)

తే గీ. ఎంతయును సంతసంబునఁ గుంతిదేవి. (ఆది. ౬ ఆ. ౬ ప.) అని కేతొక నన్నయప్రయోగము కన్పట్టుచున్నదిగాని హ్రస్వేకారాంత కుంతిశబ్దమును జూపట్టుచున్నది. "కున్తిః - స్త్రీ - యుధిష్ఠిరాదిపాణ్డవానాం మాతరి.........(శబ్దా. చిం) కున్తి......యుధిష్ఠిరాది మాతరి-స్త్రీ - వాఙీప్"......(శబ్దస్తో) వనవాస క్లేశంబున కోపదు కుంతిదేవి......(సభా. ౨ ఆ. ౨౮౧) ఇట్లయినను హ్రస్వో దీర్ఘసమాసే పీత్యాదికి మూలముగ నన్నయప్రయోగము కేతొకటి లేకపోలేదు. క.. ......।
త్రిదశాలయమునకు మాద్రిదేవియుఁ దానున్. (ఆది. ౫ ఆ. ౧౫౪) సీ ........
సింధు। వారకంకేళి ఖర్జూరశాల్మలిఘన, సారచంపకబీజపూరదేవ। దారు సల్లకికర వీర.........(నన్ని. కు. ౪ ఆ. ౪౬౫ ప) "సల్లకీ. స్త్రీ.. ......గౌరాదిత్వాత్ ఙీప్".........(శబ్దస్తో) "సల్లకీ. స్త్రీ........ గౌరాది (శబ్దా. చిం.)" క......
గం। గానదితీరమునఁ గాంచె గౌరీవనమున్. (నన్ని. కు. ౬ ఆ. ౭౪౪ ప.) దీనిని బట్టి నన్నిచోడుఁడు 'నది సుతగురుకర్ణశల్యేత్యాది పద్యభాగము నన్నయప్రయుక్త మని తలంచియుండు నని తోఁచకమానదు. ఆ-వె. గౌరివనమునందు గౌరిదేవి. (నన్ని. కు. ౬ ఆ. ౭౪౬.) "గౌరిదేవి - మాద్రిదేవి" మున్నగుచోటులందు "ఙ్యాపోః సంజ్ఞాఛన్దసోర్బహులమ్. (౬.3-౬3)" (సి. కౌ. ౧౦౦౧ సూ.) అను

పాణినిసూత్రముచొప్పున హ్రస్వము వచ్చుననుట సరికాదు. జీబంతములగు గౌరీ - మాద్రీశబ్దములె సంజ్ఞావాచకములు. దేవీశబ్దముతోడి సమాసమున సంజ్ఞాత్వము కల్గలేదు. "జ్యాపోః - ఉత్తరపదే హ్రస్వః స్యాదితి శేషః - రేవతిపుత్త్ర ఇతి - కస్య చిత్సంజ్ఞేయమ్......" (బాలమ. వ్యా.)......విపంచిసమంచితము. (జై. ౧ ఆ.) సీ. భావజ్ఞులకుఁ బరాపశ్యంతి మధ్యమా.........(జై. ౧ ఆ. ౪ ప.) సీ...... తే-గీ. ప్రళయసంరంభశుంభదారభటిపటిమ । భయదఫాలాక్షఫాలసంభవదభంగ । దహనమహనీయదివ్యప్రతాపవిసర । దనుజుజయహారి నొడ్డయ యళ్ళశౌరి. (కాశీ. ౧ ఆ. ౭౮ ప.) స్రగ్ధర. జంభారాతీభకోభాచకచకనిభముల్ శంభపీయూట్టహాసా । రంభావష్టంభ రేఖారభటిపటిమముల్......యశః శ్రీనధూవిభ్రమంబుల్. (కాశీ. ౧ ఆ. ౪౬.) "ఆరభటీ - స్త్రీ (ఆరభ్యతేఽనయా - ఆ+రభ+అటి+జీప్) నాట్య - రచనా భేదే" (శబ్దస్తో.).

సంస్కృతమునందే యిట్టి హ్రస్వప్రయోగము కన్పట్టుచున్నది. "రతిదూతి పదేషు కోకిలాం । మధురాలాపనిసర్గమఞ్జులామ్. (కుమా. సం. ౪. స. ౧౬. శ్లో)" "జీబన్తస్యాపి దూతీశబ్దస్య ఛన్దోభఙ్గభయా ద్ధ్రస్వః - అపి మాషం మషం కుర్యా చ్ఛన్దోభఙ్గం త్యజే ద్గిరామ్ ఇతి కేచిత్ - ఉణాదయో బహుళమితి బహుళగ్రహణా ద్ధ్రస్వ ఇతి వల్లభః" (మల్లినాథసూరి సంజీవనీవ్యాఖ్య) కాళిదాసు ఛందస్సు కుదురక హ్రస్వప్రయోగము చేసె ననుట పరిహసనీయము. ఉణాదుల బాహుళ్యము స్త్రీప్రత్యయపాక్షికతను ఘటించునా? సంస్కృతకోశకారులు కాళిదాసప్రయోగప్రామాణ్యమున హ్రస్వాన్తదూతిశబ్దమును సైత మంగీకరించిరి. "దూతి (తీ) స్త్రీ. దూ+క్తిచ్, వాజీప్......రతిదూతిపదేషు ఇతి కుమారః" (శబ్దస్తో) "దూతీ - స్త్రీ...గౌరాది-జీష్" "దూతిః - స్త్రీ - దూతికాయామ్ (దూయతే - దూఙ్ + క్తిచ్") (శబ్దా చిం.) "షిద్గౌరాదిభ్యశ్చ" (౪ - ౧ - ౪౧) (౪౯౭. సూ) అనుసూత్రము పాక్షికము కామింజేసి కోశకారాదుల 'దూతి' శబ్దకల్పనము సరియని తోఁచదు. కావున నిట్టియెడల నథర్వణునిమార్గమె సముచితమని యెన్నవగును. ఈవిషయమున నహోబలపతి యాక్రిందిరీతిని వ్రాసెను. "దీర్ఘాణాం హ్రస్వః స్యా న్నచ దేశ్యపదే న చైకవర్ణేపి (ఆం. చిం.) వ్యాఖ్య............అత్త్రేయం చిన్తా:—హ్రస్వవిధాయకం శాస్త్రం (రమా = రమ - విశ్వపా = విశ్వప - మొ) భిన్నవిషయక మేవ నతు సమాసవిషయకమపి. సమాసే తాదృశప్రయోగ స్యాదృష్టత్వాత్, న చ గ్రామణిపుత్త్ర ఇత్యాది స్తద్విషయ ఇతి వాచ్యమ్. ఇకో హ్రస్వో జ్యో గాలవస్య. (జీప్రత్యయాంతము కానట్టి యుగంతమున కుత్తరపదము పరముగుచుండఁగా హ్రస్వము వికల్ప

ముగా నగును. గ్రామణిపుత్త్రుఁడు గ్రామణీపుత్త్రుఁడు) (సి. కౌ. ౯౯౯ సూ. ౬. 3. ౯౧ సూ.) ఇతి శాస్త్రేణ తత్సిద్ధేః........తర్హి-నది సుతగురుకర్ణశల్యనాగపురీ శుల్. ఇత్యాదౌ కథం హ్రస్వ ఇతిచేత్ హ్రస్వో దీర్ఘసమాసేపి క్వచి న్నికః ప్రయోగతః - ఇత్యథర్వణోక్తేః హ్రస్వః - న చాత్ర ద్వితీయాతుల్యతా ప్రతిపాదకశాస్త్ర ప్రవృత్తిః-యత్ర సమాసాంతిగతపదస్య వచ్ఛ_స్తే సాన్వయ స్తత్రైవ తత్ప్రవృత్తేః. న చ జ్యాపో స్సంజ్ఞాఛ్ఛన్దసో ర్బహుళ మితిసూత్ర (జ్యంతములకు, ఆబంతములకును సంజ్ఞయందు ఛందస్సునందును నుత్తరకతము పరమగుచుండఁగా బహుళముగా హ్రస్వమగును) మత్ర వర్తతే. శబ్దస్యాస్య సంజ్ఞాత్వేన రేవతిపుత్త్రాదివత్ హ్రస్వవిష యత యాద్యప్రకృత్యాం వ్యవహారాభావాత్. అథర్వణవచనం చాత్ర మానమ్. ప్రయోగత ఇత్యనేన స్థితి నిర్వాహార్థమిదం వచనమ్ - నాపూర్వశబ్దకల్పనార్థ మపీ త్యయ మర్థోద్యోత్యతే. వాగనుశాసన స్యాప్యత్ర రుచి ర స్తీతి జ్ఞాయతే ఆదిపర్వణి। చ - నళినరజస్సుగంధియమునానదితుంగతరంగసంగతా। నిలశిశిరస్థలాంతరవినిర్మిత నిర్మలహర్మ్యరేఖలన్ ఇతి పాఠస్య బహుషు పుస్తకేషు దర్శనాత్" (అహో. ౨౯౯. పు.) (ఈయాదిపర్వపద్యమున నేఁటిముద్రణములందు "యమునానదితుంగ......" అనుచో' యమునాహ్రదతుంగ" అని యున్నది (ఆది. ౮. ఆ. ౨3౨. ప.) ఇట 'నది' అను హ్రస్వప్రయోగము సరికాదని ముద్రణసంస్కర్తలు 'హ్రద' అని ప్రక్షిప్తము చేసియుందురని విశ్వసింపనగును. (క. నది సుతగురుకర్ణ...ఆది ౧ ఆ ౬౯).

సంస్కృతమునందువలెనె తెలుఁగునందును సమాసాశ్రయవిధులు గలవు. (౨౭౨ విష) పయినుదాహరించిన సామాసిక హ్రస్వము మున్నగునవి సమాసాశ్రయ విధులె యనఁదగును. సంధిప్రకరణమునందలి సమాసపంధికార్యములెల్ల సమాసా శ్రయవిధులె, యనఁదగును. ౯౬ విషయమునందలి నుక్కు (రాజు రాజ్ఞ) ౧౦౯ విష యమునందలి 'ఇన్ - అలి' అనునవి ౧౦౭ విషయమునందలి యది యవి శబ్దముల 'అ' కారలోపము (నీచేతిరక్షణము - నీవలనిరక్ష - నీతోడిబాంధవము-నాయందలి కరుణ - రామునిది - రామునివి మొ.) తత్పురుషాశ్రయవిధులె.

ఆ - ఈ - ఏ - యను సర్వనామంబులు త్రికంబునాఁ బడు. ౮.

బాలవ్యాకరణ వివరణము
కర్మధారయంబు త్రికస్త్రీసమ ముగంత ధాతుజవిశే షణ పూర్వపదంబయి యుండు. ౫.

౨౭౭ విషయము. అచందము - ఈచిందము - ఏబ్బందము, వాఁడిపాట - వోఁడిపాట - బెడిదపుఁటడిదము, మడిసెడుదడములు.

ఈనియమముచే బల్లిదఁడు - దల్లుఁడు - కావలుఁడు-
రావణుఁడు - ఇత్యాదుల సమాసంబు లేదు.

సంజీవని ౨౭౭ వివ:—'ఆ - ఈ - ఏ' అనుమూఁడు సర్వనామశబ్దములకుఁ త్రికమని సంజ్ఞను సూరి కల్పించెను. కర్మధారయసమాసమునందలి పూర్వపదము త్రికములో నొకటిగాని స్త్రీసమముగాని మువర్ణక ముగాగమాంతములలో నొకటి గాని క్రియాజన్యవిశేషముగాని కావలయును. తద్భిన్నశబ్దము కర్మధారయమునఁ బూర్వావయవమై యుండ రాదని భావము. ఇట్లనుటచేతఁ బుంలింగసమాసికము పూర్వావయవము కారాదని తాత్పర్యము. ఈవిషయమునే "ఈనియమముచే" నిత్యాదివాక్యమున సూరియే వివరించెను. కావున 'బల్లిదల్లుఁడు - కావల రావణుఁడు' మున్నగునవి సాధువులు కావని తాత్పర్యము. త్రికపూర్వకత్వమునకు:— ఆచందము - ఈచందము. ఏబ్బందము. స్త్రీసమపూర్వకత్వమునకు:—వాఁడిమాట - పోఁడిమాట. (వాఁడి = తీక్ష్ణము, పోఁడి = ఒప్పిదము) ముగన్తపూర్వకత్వము నకు:—బెడిదము+అడిదము = బెడిదపుటడిదము. (సంధి. ౩౨. సూత్రముచొప్పున 'పు'వర్ణాదేశము, సంధి ౨౮ సూత్రముచొప్పున 'టు'గాగమము వచ్చెను) ఇచటిది మువర్ణకము. 'బెడిదము+అడిదములు = బెడిదపుటడిదములు' అనునది ముగన్తోదాహరణము - కావున సూత్రమునందలి 'ముగంత' శబ్దము 'మువర్ణకాంతము'నకు నుపలక్షణము. ధాతుజవిశేషణపూర్వకత్వమునకు:—మడిసెడుదడములు. సూరిపక్షమున ధాతుజవిశేషణములు స్త్రీసమములు కావు కావుననే వేఱుగ సూత్రమునఁ బేర్కొనఁబడెను. ఇట్లగుటంజేసియే (౮౮ 11విమ.) బా-సంధి ౨౫ సూత్రముచొప్పున 'మడిసెడుదడములు' అనుచో నుక్కు రాలేదని యెఱుంగునది. 'మడిసెడుందడములు' అనునది యనిష్టరూపమని సూరి తలంపు. ౪. సూత్రములోని 'ఆ - ఈ - ఏ' అనువానికి సంధిచేసి హరికారికాకర్త "అయే" అని వచించెను. (ఆ+ఈ = ఏ+ఏ = అయే) అతఁడు త్రికసంజ్ఞను గల్పింపలేదు. "ముగన్త, సర్వనామాఽయే, స్త్రీసదృగ్ధాతు ఘేనకైః। సపూర్వపదకః కర్మ। ధారయోఽహ్యత్ర దృశ్యతే" అని తెలిఁగించెను. (హరికా. సమా. 3 కా. బా. గు. ప్ర. ౫౫౭ పు. ద్వి. ము.) ఈ స్థితినిబట్టి హరికారికావళియే మూలగ్రంథమనియు సూరి యిట్లు సవరించి తెలిఁగించె ననియు బా. గు. ప్రకర్త యొకదుర్బలయుక్తిని జూపెను (బా. గు. ప్ర. ౫౨౨ పు. ద్వి. ము.) తత్త్వనిర్ణయమున కిది యొకయుక్తి యగునా? త్రికసంజ్ఞను సూరి మఱి రెండుచోటులందుమాత్రమె (బా. సమా. ౧౪. ౧౫. సూ.) యుపయోగించుకొనెను. ఈసూత్రమునకు నూతనసంజ్ఞావిధానగౌరవ మేల యని హరికారి

కాక_ర్త యుపేక్షించుట యర్హముకాదా? "అచిశ్నుధాతుభ్రువాం య్వో రియఙు వఙౌ. (౬. ౪. ౭౭) (సి. కౌ. అజన్త. ౨౭౧ సూ.) అను పాణినీయసూత్రము ననుస రించి (ఇ+ఉ = యు. దీని షష్ఠీద్వివచనము = య్వోః) యా త్రికమునకు సంధిని ఘటించుట సుసంభవమేకదా.

ఈసూత్రద్వయమునకును నన్నయాథర్వణీయమూలము చూపట్టదు. ఇది సూరిగారు కల్పించినదే. ఇం దయిదవసూత్రము (కర్మధారయంబు త్రిక...) సరిగా నున్నట్లగపడదు. పదములకు సమాసము సమ్మతముకాని 'ఆ-ఈ-ఏ' అను ప్రాతిపది కములకు సమసించు నర్హత లేదుగదా. సూరి త్రికము విభక్త్యంతముని యెచ్చటను నిరూపింపలేదు (౨౮౦ విష). బా. తత్స ౪౧ సూత్రముచొప్పున మువర్ణకమున కేదేని కార్యము విధించుటయు ౯ట్టికార్యము ముగాగమమునకును నగుటయు నర్హమై యుండఁగాఁ బ్రకృతసూత్రమున 'ముగంత'ము నుపదేశించుట సరికాదు. 'వాఁడి - పోఁడి'మున్నగు విశేషణములతోపాటుఁగ ధాతుజవిశేషణములును స్త్రీసమములె యైయుండఁగా వానిని వేఱుగ వచించుటయు సరికాదు. మఱియుఁ గర్మధారయమే యననేల? మూఁడులోకములు, నాలుగువిధములు మున్నగు ద్విగు వులు సయితమిట్లుదాహరింపఁదగినవెకదా, ఇంతియెకాక సూరి యీసూత్రమున కాచ్ఛికసమాసములనే యుదాహరించుటలో నభిప్రాయమేమో తెలియకున్నది. సరస పుటలుక (బా. సంధి. ౨౮ సూ.) సరసపువచనము (బా. సంధి. 3౨. సూ.) మున్నగు వానిని గర్మధారయములుగ నీవఱకుదాహరించియుండెనే. మఱియు 'వాఁడి-పోఁడి' మున్నగు విశేషణములు మాత్రమే స్త్రీసమములనుటయెట్లు? "వికృతౌ సర్వేశబ్దాః... ......స్త్రీవత్ స్యుః స్త్రీసమాః" (౧౮౯ విష.) అనుచొప్పున 'వాఁడి-పోఁడి' అనురీతి విశేషణములేకాక మడిసెడు - మడియుచున్న మడిసిన మున్నగు ధాతుజవిశేషణ ములు ఇది తుదికి చేసి - చేయక - చేసినన్ మున్నగు లాక్షణికావ్యయ ములు కటకట - అక్కట - ఔర - ఆహా మున్నగు ప్రతిపదోక్తావ్యయములును స్త్రీసమములెకదా? వానికి స్త్రీసమత్వము నంగీకరించి స్త్రీలింగ ప్రథమైకవచన లోపముచేయనిచో నవి పదములె యనిపించుకొనక వాక్యప్రయోగార్హములె కాకపోవును (౭౨ I విష. ౧౮౯ I విష.). ఇట్లగుటంజేసి కర్మధారయమున స్త్రీసమ మాత్రము పూర్వావయవమై యుండనగుననుట సరికాదు. ఇంక సామానాధిక రణ్యమునఁ గర్మధారయ మగుననుటయె యుక్తము కాఁగలదు. విశేషణములె యగు డుమంతములు పూర్వపదములు కారాదన్నచో నట్లు విశేషవిధి నంగీక రించుట యుక్తము.

నన్నయాథర్వణీయమున "లోపశ్చ విభక్త్యాదే, శ్శబ్దేషు స్యా త్సమాసకా ఙ్గేషు" అనుచోప్పున సమాసకములం దనఁగా నాచ్ఛికసమాసములందుమాత్రమె విభక్త్యాదిలోపము వదింపఁబడుటం జేసి సాధ్యసాంస్కృతిక మిశ్రసమాసముల స్థితి కవకాశము లేకున్నది. అట్లయినచో "స్వాస్వవిభక్తి వికారైః........." "సంస్కృతాన్ధ్రపదాన్యత్ర........." అను (౨౭౩ విష) విధులు నిర్విషయములు కావలసివచ్చునని శంకింపరాదు. "షష్ఠీ భవేద్ద్వితీ యాతుల్యే"త్యాదిచే (౨౭౦ విష.) సార్వత్రికముగా షష్ఠీతత్పురుష మంగీకరింపఁబడుచుండుటచే సాధ్యసాంస్కృతిక మిశ్రషష్ఠీసమాసములు సైతము నన్నయాథర్వణాభ్యనుజ్ఞాతము లగుచున్నవి."ఇద మద ఏత దశ్చ్ఛబ్దాః..."(౨౮౦ విష.) అనుసూత్రమును "సుమో్బ్ తః పరుషే సరళే చైవ। సమాసే ను ముతో భవేత్......స్వరసాత్...... వికారాచ్చాపి........." అను (౮౮ విష.) సూత్రములును "దారాగ్రత ఉదపి రో, మోస్తు విభక్త్యేకవచనకే పుం పూ"(౯౩-౯౪ విష) అనువిధులును "సామానాధికరణ్యే। షూదన్తానాం టుగాగమోఽచిస్యాత్" (౯౧-విష.) అనువిధియు మిశ్రాదికర్మధారయ సమాసస్థితి కభ్యనుజ్ఞ నొసఁగుచున్నవి. "ద్విగో రమిశ్రతా యాంతు। ప్రాయ ఏకత్వ మిష్యతే। మిశ్రతాయాం బహుత్వం స్యా।దన్యత్రాపి క్వచి ద్భవేత్" (౨౮౪ విష.) అను నథర్వణకారిక మిశ్రద్విగువును గంఠోక్తముగ నంగీకరించుచున్నది. "ఇచ్ఛ విభక్త్య న్తిమస్య। జే రలిచ" "అలాన్య గమస్స్యా దంద్వంద్వో। గ్భవే దిన్ జసిచేతరయోః।......" (౧౦౫ విష.) అనుసూత్రములచే నలుక్ తృతీయాదితత్పురుషములును మధ్యమపదలోపసమాసమును సాధ్యసాంస్కృతికమిశ్రసమాసములందు సయితము నభ్యనుజ్ఞాతము లగుచున్నవి. కావున 'స్వాస్వవిభక్తివికారై' రిత్యాది (౨౭౩ విష.) సూత్రములు నిర్విషయములు కానేరవు. ఇంకను బయిరీతి కర్మధారయాభ్యనుజ్ఞా జ్ఞాపకసూత్రములు పెక్కు గలవు. (౨౭౮ విష. అభిన్నస్యాపీత్యాది. చూ.). మువర్ణకాంతముల సమానాధికరణసమాసములు చికీర్షితము లగునపుడు సమాసావయవపదములను బ్రథమాంతములుగా విగ్రహము నిల్పి సామాసికప్రాతిపదికమును సంపాదించి పిదప దత్తద్వాక్యానుకూలవిభక్తివచనములతోడి రూపములను యథాసంభవముగా గ్రహింపవలయునని "మో స్తు విభక్త్యేకవచనకే పుం పూ" అను నన్నయవచనము జ్ఞాపకము చేయుచున్నది. అట్టి సమానాధికరణసమాసములో సమాసపూర్వపదవిభక్తి "సుపో ధాతు ప్రాతిపదికయోః" అనుదానిరీతిగల "లోపశ్చ విభక్త్యాదే"రిత్యాది సూత్రము చొప్పున (౨౬౮ I విష) లోపింపదనియు దానిచోట 'ము'వర్ణకమును దానిచోట

'పుం-పు' లును నాదేశము లగుననియు, "మోస్తు విభక్త్యేకవచనకే పు-ంపూ" అను 'పుం ంపు'ల విధానము జ్ఞాపకము చేయుచున్నది. ఉదా:—'సరస+సు+వచన+సు' అను నలౌకికవిగ్రహమున సమాససంజ్ఞ కల్గి దానికిఁ బ్రాతిపదికత్వము కల్గఁగా 'లోపశ్చ విభక్త్యాదేశ' ఇత్యాదిసూత్రముచే సుత్తరపదస్థవిభక్తి లోపించి పూర్వపద విభక్తిచోట ముపర్ణకము దానిచోట "పు" వర్ణాదేశము రాఁగా "సరసపువచన" అను ప్రాతిపదిక మేర్పడును. దానినుండి సరసపువచనము - సరసపువచనములు - సరసపువచనముచేన్ మున్నగురూపములు సిద్ధించును. 'సరస+జస్+వచన+జస్' మున్నగు నలౌకికవిగ్రహస్థలములందుఁ బూర్వపదవిభక్తికి "మోస్తు విభక్తేకవచనకే పుం-పూ" అనుజ్ఞాపకముచొప్పున లోపము కల్గనేరదు. మఱియు ౨౬౦ విషయము చొప్పున బహువచనమున కేకత్వమును గల్గును. కాన 'సరస+సు+వచన' అను ప్రాతిపదిక మేర్పడును. కావున దానినుండి 'సరసపువచనములచేన్' ఇత్యాదిరూపములు సుసాధము లగును. ఇట్లె "శోకార్తపు టాడలులతో" (స్త్రీ. ౨ ఆ. ౧౨౮.) మున్నగుస్థలములందును రూపసిద్ధి నరయునది. ఇట్లె జ్ఞాపకసిద్ధములగు "మూఁడు లోకములు - ఆచోటులందు - ఆపురుషుఁడు - ఆపురుషులచే" మున్నగురూపములను సాధించికొనవలెను. పైచోట్ల "ఆ+సుప్+చోటు+సుప్" అనురీతి నలౌకికవిగ్రహమును, గల్పించికొనవలెను. గుణవంతుకాంద్రు మున్నగుచోటులందు 'గుణవంత+జస్+ఆలు+జస్' అనురీతి నలౌకికవిగ్రహమును, గల్పింపనగును. ఇట్లు సమానాధికరణసమాసములు సాధ్యములగును. కాని యిట్టి కర్మధారయములలో మహత్పుంలింగములు మహత్పుంలింగసమములు మున్నగునని కవిప్రయోగాభావముచే సమాసపూర్వపదములు కానేరవని గ్రహింపవలయును.

కర్మాదేః కర్తృత్వం, ప్రథమాచ నవర్ణకశ్చ తద్వత్
స్యాత్ (ఆం. చిం. వ్యాకర. ౧౨ కా. అహో. ౪౦౬
పుట.)

నన్నయా థర్వణీయము. ౨౬౧ విషయము.

భూతార్థే ప్రతిషేధార్థే । నశ్చ నిశ్చ భవేత్క్రమాత్ । కర్మాదికర్తృకాయాం చ । తౌ క్రియాచ విశేషణమ్ । (వికృ. వ్యాకర. ౮-౯ కారి. అహో. ౪౦౮ పు.)
స్యాత్ కర్మధారయాభాసః । కర్తృత్వే కారకాశ్రితే । (వికృ. వ్యాకర. ౧౭ కారి. అహో. ౪33 పు.)
అభిన్నస్యాపి నాదేః స్యా । ద్భిన్నేనాపి సమన్వయః ।
(వికృ. వ్యాకర. ౨౫ కారి. అహో. ౪౫3 పు.)

కల్పతరు. ౨౭౮ విష:—కర్త్రాదేః = కర్త్రాదికారకములకు, కర్తృత్వమ్ = ఆభాసకర్తృత్వమును, ప్రథమాచ = యథార్థమగు కర్తృవాచకమునకుఁ బ్రథమా విభక్తియును, తద్వత్ - నవర్ణకశ్చ - స్యాత్ ='భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్' అనుపూర్వసూత్రముచొప్పున యథార్థముగాఁ గ్రియయొక్క కర్తకు విశేషణ మగునపుడు వచ్చు నవర్ణకమువలెనే (సామానాధికరణ్యేపి సమాసః సాధుః - తేన 'ఇంతుల నేచుపాతక మదింతటఁ బోవదు సుమ్ము పాంథలోకాంతక - దీనులఁ బ్రోచు పుణ్యము.........అహో. ౪౧౦. పు.) యీయాభాసకర్తకువిశేషణమగు క్రియకు నవర్ణకమును నగును. 'రాముఁడు రావణుని జంపెను' అనునపుడు హనన క్రియాశ్రితుఁడు రాముఁడుగాన "రావణుని జంపిన రాముఁడు" అని యట్టియర్థమున వ్యవహరించినను గర్తృత్వమునకును గ్రియకును సామానాధికరణ్యము సరిగనే యుండును. అట్టియెడలఁ గర్మకారకము విశేష్యముగను గ్రియ విశేషణముగను నుండునట్లు "రాముఁడు చంపిన రావణుఁడు"అను రీతిని నైతము తెలుంగున వ్యవహరించుట ప్రసిద్ధము - ఏ రావణుని రాముఁడు చంపెనో యారావణుఁ డని యావాక్యమున కర్థము. అట్టియెడల నావాక్యమున విశేషణమగు క్రియకును విశేష్యమునకును సామానాధికరణ్యము సరిపడమింజేసి (చంపినరావణుఁడు—రావణుఁడు చంపలేదు గదా) యచటి విశేషణవిశేష్యభావ మాభాసరూపమే యనియు నచటి సమాసము కర్మధారయాభాసరూపమే యనియు నట్లయినను సహజసామానాధికరణ్యముగల స్థలమందువలెనే యచట నైతము క్రియ భూతార్థక నవర్ణాంతమగుననియుఁ దాత్పర్యము. కావున నిచట "కర్త్రాదేః కర్తృత్వ మిత్యాదిసూత్రములోని కర్తృత్వ మనఁగాఁ గర్త్రాదికారకములకుఁ గర్తృగతక్రియతో సమానాధికరణాన్వయము మాత్రమె యనఁగా విశేషణవిశేష్యభావము శాబ్దముమాత్రమె యని యర్థము. ఇచట సయితము గర్తృత్వము భూతార్థకప్రత్యయముచే నభిహితమె కావునఁ గర్తకుఁ దృతీయ రాక ప్రథమయే వచ్చునని తాత్పర్యము. ఇట్లె "ఎట్టి సాధ్వీలకును బుట్టినయిండ్లను బెద్దకాల మునికి తద్ద తగదు (ఆది. ౪ ఆ. ౬౬ ప.) అనుచోట "ఇంటఁ బుట్టిన సాధ్వీలు" అను సహజమగు సామానాధికరణ్యముగల స్థలమందు వలెనే యధికరణమునకు విశేష్యత్వము (కర్తృత్వము) గల్గునట్లు "సాధ్వీలు పుట్టిన యిండ్లను" అనుసామానాధికరణ్యాభాసముగలచోట (ఏయిండ్లను సాధ్వీలు పుట్టిరో యాయిండ్ల నని యర్థము) (కర్మధారయాభాసస్థలమునందు) నైతము క్రియ 'న'వర్ణకాంత విశేషణ మగుటయు నధికరణమునకుఁ గర్తృత్వము (విశేష్యత) గల్గుటయుఁ గర్తకుఁ బ్రథమ వచ్చుటయు సంభవించునని యెఱుంగునది. ఇట్లె కర్త్రర్థము

నందువచ్చు 'న'వర్ణకాంతస్థలములందే కాక, కర్మార్థమునవచ్చు 'న'వర్ణకాంత విశేషణస్థలములందును రూపసిద్ధి నెఱుంగునది, "రాముఁడు పళ్ళెములో నన్నము తినెను" అనుచోఁ గర్త్రర్థమున, "పళ్ళెములో నన్నము తినినవాడు" అను యథార్థమగు సామానాధికరణ్యము గల రూపమును "రాముఁ డన్నము తినిన పళ్ళెము (ఏపళ్ళెములో నన్నము తినెనో యాపళ్ళెమని యర్థము)" అనియు, "రాముఁడు పళ్ళెములోఁ దినిన యన్నము" అనియుఁ గర్మధారయాభాసరూపములును వెలసినట్లె కర్మార్థమునందు "వానిచే నన్నము తినఁబడిన పళ్ళెము" "వానిచేఁ బళ్ళెములోఁ దినఁబడిన యన్నము" అను నాభాసకర్మధారయరూపములు వెలయుచుండును. అహోబలపండితుఁడును జాలవఱకు దీని కిట్లె వ్యాఖ్య చేసెను. "కర్మాదికారకార్థానాం కర్త్రర్థతా స్యాత్, కర్మార్థతాప్రయుక్తాయా స్తృతీయాయాః ప్రథమా చ స్యాత్. తద్వద్యోతకార్థే నవర్ణకశ్చ స్యాత్. కర్త్రర్థతాయాం (ఇట 'కర్మార్థతామ్' అని తప్పుపడినది. 'భద్రాద్రిశాస్త్రిగా రాతప్పునకే టీక వ్రాసిరి) చ ద్వయం త్రయాణాం సముచ్చయద్యోతకమ్ (కర్తృత్వము ప్రథమ నవర్ణకము) ఇతరత్ర తు ద్వయోః సముచ్చయద్యోతకమ్. కర్త్రర్థత్వం చాత్ర కర్తృగతక్రియా ('వాచకక్రియా అని యిట నధికముగాఁ బొరపాటు పడినది) సామానాధికరణ్యం వివక్షితమ్. నీచేత నుతింపంబడిన రాజు ఇత్యాదయః కర్మార్థాః. ఆకిన్గాధితనూజుచే సగము సేయంబడ్డ మిన్నేఱు. ఇత్యాద్యాః కవీనాం వాచః, 'కర్మణ్యనుబన్ధః స్యా త్పతిధాతు' రితి సూత్రేణ 'పడు'ఇతి పతిధాత్వర్థస్య కర్మణ్యనుబన్ధతా. త్వయా రాజానుత ఇత్యాదౌ ప్రకృత్యా మావ్యాయాం యథా కర్మణి క్త విధానాత్ క్తప్రత్యయేన రాజాదిపదగతార్థ కర్మత్వేఽభిహితే కర్తృకరణయో స్తృతీయేతి తృతీయా 'ప్రాతిపదికార్థేతి సూత్రేణ ప్రథమా చ భవతి తథాత్రాపి పడుధాతునా కర్మత్వేఽభిహితే విభక్తిద్వయమ్" (అహో. ౨౦౬ పు.). 'నీచేత' అనుచోఁ దృతీయయు-'రాజు' అనుచోఁ బ్రథమయు వచ్చెనని భావము. కర్త్రర్థమునందలి "నీవు నుతించిన రాజు" అనురీతి యుదాహృతినిగాని యందువచ్చెడి కర్తృత్వ ప్రథమా నవర్ణకముల వివరణముగాని యహోబలపతి చూపకుండుట మిక్కిలి వింతగానున్నది. మఱియు నీతఁడిచ్చిన ప్రయోగము సయితము కర్మధారయాభాసోదాహరణము కాదు. సహజమగు సామానాధికరణ్యమె యందు వెలయుచున్నది.

చింతామణిలోని పూర్వసూత్రమందుఁ "ప్రతిషేధవాచినాం ని । ర్వ్యాఖ్యాతార్థానాంతు నః క్రియాణాం స్యాత్" అని నవర్ణక నివర్ణకములు రెండు చెప్పఁబడి యుండఁగా నొక్క నవర్ణకమునకే చెప్పనేలయని యథర్వణుడు 'ని' వర్ణకస్థలము

లందును నిట్టికార్యములు గల్గునని వూరించుచున్నాఁడు. భూతార్థ ఇత్యాదిః—
భూతార్థే - ప్రతిషేధార్థే = భూతార్థమునందును వ్యతిరేకార్థమునందును,
క్రమాత్ = వరుసగా, నశ్చ - నిశ్చ = నవర్ణకము నివర్ణకము నగునుగాన, కర్త్రాది
కర్తృతాయాంచ = కర్త్రాదికారకములకుఁ గర్తృత్వమునఁగాఁ గర్తృగతక్రియా
సామానాధికరణ్యముగల్గు నపుడు సైతము, తౌచ = ఆ నవర్ణక నివర్ణకములను
'చ'కారముచే 'ఉన్న' మున్నగువానిని బొంది, క్రియా = క్రియ, విశేషణమ్ =
విశేషణమగుటయు సంభవించును. కర్త్రాదికారకములకుఁ గ్రియ విశేషణమగుట
శాబ్దమేకాని యర్థసిద్ధముకామింజేసి యట్టిచో వచ్చు నవర్ణక నివర్ణకములు పృథ
గుక్తములు కావలసివచ్చెనని యెఱుంగునది.

అథర్వణుఁడు 'ఉన్న' అను వర్తమానార్థకము 'ఉండిన' అనుదానిరూపాం
తరమె యనుచు "క్వచి న్నవర్ణే దేర్లోపః। క్వచి ద్డోశ్చ తథా భవేత్। క్వచి త్తదర్థే
దయుగం। క్వచి న్నస్యేచ్ఛ లోపవాన్" (వికృ. వాలం. ౭-౮ కారి. అహో. ౪౦౪
పుట. ౩౧౫౬పం.) అని ముస్తుందు వివరించును. తద్ధర్మార్థక విశేషణములను "డోశ్చ
థేదకతాపి స్యా" త్తని ముందు (వికృ. క్రియా. ౧౦ కారి. అహో. ౪౪౭ పు.)
(౩౯౬ పం.) వివరింపనున్నాఁడు. 'కలుగు' అనుదాని రూపాంతరమె కలయను
విశేషణము, కావున నిట్టి ధాతుజవిశేషములచోటులందెల్లఁ బ్రకృతసూత్రోక్త
ప్రయోగవిశేషములు సంభవించును. అట్లగుటంజేసి పైయథర్వణకారికలోని నవర్ణక
నివర్ణకములుం దక్కినధాతుజవిశేషణములకెల్ల నుపలక్షణములని యెఱుంగునది.
"క్రియాజన్యవిశేషణే ప్యేవం ప్రయోగః - దానిం బుచ్చుకొనువిధంబు - సుతుల
విద్యాప్రవీణతఁ జూచువేడ్క - ఇత్యాద్యాచార్యవచన మత్ర మానమ్" (అహో.
౪౦౯ పు.) 'క్రియాజన్యవిశేషణేపి' అనునది సరికాదు. నవర్ణక నివర్ణకాంతములు
మాత్రము క్రియాజన్యవిశేషణములు కావా ?

"కర్త్రాదేః" అనుటచేఁ గర్త్రాదికారకస్థలములందేకాక షష్ఠీస్థలమునందు నిట్టి
ప్రయోగము గలదు "క. తెక్కలు విఱిగినపులుఁగులు...........ఇతి నవర్ణకే
షష్ఠ్యా ముదాహరణమ్" (అహో. ౪౦౭ పు.) "గీ. నీనుపదభక్తి లేని యన్ని
చములకి,........ఇతి (నివర్ణకే) షష్ఠ్యా ముదాహరణమ్." (అహో. ౪౦౯ పు.)
తే.గీ. 'నీదు పదభక్తి లభియించు నిర్మలులకు .........ఇతి (తద్ధర్మవిశేషణే)
షష్ఠ్యా ముదాహరణమ్!' (అహో ౪౧౦ పుట).

ఇట్లు సామానాధికరణ్యమయథార్థమై శాబ్దమాత్ర మగుటచే నిది కేవలము
కర్మకారయ మనిపించుకొనదని యథర్వణుఁడు వచించుచున్నాఁడు - స్యాత్కర్మథా

రయేత్యాది:—కర్తృత్వే = కర్తృగతక్రియా సామానాధికరణ్యరూప కర్తృత్వము, కారకాశ్రితే = కర్మాది కారకగత మగుచుండఁగాఁ గ్రియ కర్మాది కారకములకు విశేషణమగుచుండఁగానని యర్థము. కర్మధారయాభాసః = కర్మధారయ మాభాస రూపమైనది, స్యాత్ = అగును. ఉదా:—'వాఁ డన్నము తినిన పళ్ళెము' అనుచో 'తినినపళ్ళెము' అనెడి పళ్ళెరము తినుట యథార్థము కామింజేసి యచటి విశేషణ విశేష్యభావ మాభాస రూపమని తాత్పర్యము - అహోబలపతి యికారిక నీసందర్భమున నుదాహరింపక స్థలాంతరమున నుదాహరించుట సరికాదు. "నల్లని వాఁడు - తచ్ఛబ్దోత్ర పురుషవాచకః - నల్లనియది-అదిశబ్దః స్త్ర్యాదిపరః. ఇత్యాద్యాః కర్మధారయాభాసాః-స్యాత్కర్మధారయాభాసః। కర్తృత్వే కారకాశ్రిత ఇత్యర్థర్వణోక్తేః" "కన్నులు మూఁడు గలవాఁడు ఇత్యాదౌ కర్మధారయాభాస ఏవ"(అహో ౮౩౩-౮౩౬ పుట). 'నల్లనివాఁడు, నల్లనియది' మున్నగు చోటులందు "కర్తృత్వే కారకాశ్రితే" అనుదానికి సంగతియే లేమింజేసి యిటదీనిని బ్రమాణముగాఁ జూపుట కేవలము నసంగత మనకతీరదు. కాని యిట్టివి యాభాసకర్మధారయములు కావన రాదు. విశేషణములకు విభక్తియోగమును సంఘటించి విధేయతా సంపత్తిని గల్గించుచో యిచటి తచ్ఛబ్దవిశేష్యతకు ఫలముగాన నిచటి విశేణవిశేష్యభావ మాభాస రూప మనుటకు సందియములేదు. (౨౭౧ విష) కావున "స్యాత్కర్మధారయాభాస ఇత్యాదికారిక యిట్టివాని కుపలక్షణ మనుట యుక్తము. సీ...ఆ. వె...... తత్స్వయం। వరము సేయుచున్నవాఁడు వాఁడు. (ఆది. ౭ ఆ. ౩౬) ఇందలి రెండవ వాఁడుశబ్దము విశేష్యమగుటంజేసి మొదటిదగు 'వాఁడు' శబ్దము విశేష్యాభాసమె యన నగునుగదా. చ...సు। ప్రతుఁడయి తీర్థయాత్ర చనువాఁడు పరాశరుఁ డన్మునీంద్రుఁ డ। య్యతివ (ఆది. ౩ ఆ. ౩౯) సీ...తన్ వినుచున్నవారల। కభిమత శుభకరం బయినదాని......(ఇందిట్టి "అయిన దాని" అనునవి పెక్కు) చ...విదితంబగుదాని సభాంతరంబులన్. శా...వేదాంత వి। ద్యాయుక్తం బగుదానిఁ జెప్పఁదొడఁగెన్ దద్భారతాఖ్యానమున్ (ఆది. ౩ ఆ. ౯-౧౦-౧౧ పద్య.)

అభిన్నస్యాపీత్యాది:—దీనికీవఱకె ౨౬౬ I విషయమున వ్యాఖ్యచేయఁబడెను. ధాతుజవిశేషణములు విశేష్యములతోఁ గర్మధారయముగ సమసించుననియు నట్టిసమాసపూర్వావయవములతో వ్యస్తములగు పదము లన్వయింపనగుననియు (నేను జదివినపాఠము - వాఁ డన్నముఁ దినిన పళ్ళెము మొ,) నీకారికకుఁ దాత్పర్యము - ఈకారికచే నంగీకరింపఁబడిన సమాస మాభ్యాసమే కావలయుననుటకు

సూచనము లేకుండఁజేసియు నీక్రింది నన్నయాది ప్రయోగములం జేసియు సాధ్యసాం స్కృతిక మిశ్రరూపకర్మధారయమును సమ్మతమగుచున్నది. ప్రయోగములు:- చ... దానము చేసిన తెఱఁగెల్లను... (ఆది. ౧ ఆ. ౧౫ ప). చ... వాఁడు దానవికిఁ జేసిన నెయ్యమెఱింగి (ఆది. 3 ఆ ౧౮౬). ఆ. వె. ఎట్టిసాధ్వులకును బుట్టినయిండ్లను । బెద్దకాల మునికి బెద్ద తగదు (ఆది. ౪ ఆ. ౬౬). క.........ఎఱుఁగని నాఁడెల్లపాట నెఱిఁగింపఁదగున్ (ఆది. ౪ ఆ. ౭౨) క. నా యొఱ గినట్లు యున్నియు । నీ యిచ్చిన వరము నెఱుఁగు (ఆది. ౪ ఆ. ౮౧) ఉ..............ఓడతోఁ । గట్టిన యోడవోలె (సభా. ౨ ఆ. ౪౦) సీ. అర్జును నోర్చెద నవిలోన నేనని, యతనితోఁ బలికిన ప్రతిన నెఱప.........జమదగ్నిసుతు కృపాశ్రయమునఁ బడసిన విలువిద్య కలరూపు వెలయఁజేయుఁ ॥ఆ-వె॥ గనుట...(విరా. ౪ ఆ. ౨౦౫) క.........చేవ చెడిపోయి నప్పుడు (విరా. ౪ ఆ. ౨౧౧). క. నిను నీవ పొగడికొని పల్కిన పల్కులు పెక్కు గలవు (విరా. ౫ ఆ. ౨౨) ఉ.........సుతులు చేరని చెందని యట్టిచోట... (ఉద్యో. ౨ ఆ. ౧౨౦ ప.)

> బాలవ్యాకరణ వివరణము. ౨౭౮. I విష.
>
> కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజ విశేషణంబులు కర్తతోడం బోలె వానితోడ సమసించు. ౨౬. రాముఁడు రక్షించిన భృత్యుఁడు - రాముఁడు వాలి నేసిన బాణము, రాముఁడు గోవు నిచ్చిన విప్రుఁడు రాముఁడు వెడలిన వనంబు. రాముఁడు వసించిన పర్ణగృహము. రాముఁడు వసించిన చోటు.

సంజీవని. ౨౭౮ I విష:—వాక్యమునందుఁ గ్రియ ప్రధానము. తర్వాత నట్టి క్రియతో నన్వయించునది ప్రధానము. ('ఉత్తరపదార్థ ప్రధాన స్తత్పురుషః' ౨౬౮ I విష.) కాఁగాఁ గర్త్రాదికారకములు క్రియతో నన్వయించును గానఁ గర్త్రాదికారకముల యపేక్షచేఁ గ్రియయే ప్రాధాన్యము గలదగుచున్నది. అట్టిక్రియకన్నఁ గర్త్రాది కారకములకే ప్రాధాన్య ముండునట్లు వివక్షించుట యనఁగాఁ గర్త్రాదికారకములతోఁ గ్రియ యన్వయించునట్లు ప్రయోగించుట యని యర్థము. క్రియ విశేషణముగను గారకము విశేష్యముగను నుండునట్లు ప్రయోగించుట యని పర్యవసితార్థము. అట్టిప్రయోగము తెల్గున సుప్రసిద్ధము - అట్టివివక్షయం దట్టిధాతుజవిశేషణములు కర్తతోడంబోలె ననఁగాఁ గర్తతో సహజముగా నర్థవంతముగా సమసించినట్లె వానితో ననఁగాఁ గారకములతో సంయుతము సమసించు ననియర్థము. ఉదా:— 'రాముఁడు భృత్యుని రక్షించెను' అనుచో 'భృత్యుని రక్షించిన రాముఁడు' అని

ప్రయోగించుటలో వింత లేదు - ధాతుజవిశేషణ మిట్లు కర్తతో నన్వయించి సమసించినట్లు కారకములతో సమసించుట యీసూత్రమునఁ జెప్పఁబడిన విశేషము. కర్మకారకముతో సమసించునప్పుడు 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు' అనురూప మేర్పడును. ఇట్లు వాచనికమగు నన్వయము వెలసినను రక్షించినవాఁడు భృత్యుఁడు కామింజేసి యీవాక్యమందలి విశేషణ విశేష్యభావము కుదురుపడి యుండ లేదు. (విస్తర) ఇట్లగుటచేతనే యథర్వణాచార్యుఁ డిట్టిసమాసమును గర్మధారయాభాసమని వచించెను. (౨౭౮ విష.) సూరియిట్లు నన్నయాథర్వణుల యాశయమును సంక్షేపముగా వచించెనేకాని నన్నయాథర్వణులు తలంచిన యీప్రయోగముల లోని యనుపపత్తిని గ్రహించినట్లగపడదు. గ్రహించియున్నచో 'న'వర్ణకాదుల ప్రాప్తిని సయితము విధించియుండఁడా?

---

విస్తర. ౨౭౮ I విష:— బా-గు-ప్ర-వ్యాఖ్యాత కర్తృగతక్రియావ్యాపారము కర్త్రాదులం దారోపితమగుచున్నదనుచు నీక్రిందిరీతిని వ్రాసెను. "కర్తముఖ్యముగా నెఱవేర్చునట్టి వ్యాపారంబు కర్త్రాదికారకంబులపై నారోపింపఁబడినచో ధాతుజ విశేషణంబులు కర్తకుంబలెఁ గర్త్రాదికారకములకును విశేషణంబగునని యర్థము." (బా. గు. ప్ర. ౨౮౫ పుట. ద్వి. ము.) వాచనికమగు విశేషణ విశేష్యభావ మాభాసరూపముగాఁ జెల్లునని నన్నయాథర్వణులు వచించిరేకాని క్రియావ్యాపార మారోపిత మగునని వచింపలేదు. 'రాముఁడు రక్షించిన భృత్యుఁడు' మున్నగు వాక్యములం దారోపణము భాసిల్లలేదు. రాముఁ డేభృత్యుని రక్షించెనో యాభృత్యుఁడని యావాక్యమునకుఁ బ్రామాణికమగుఁకవి వివక్షితార్థమె కాని యందారోపణ మేమియు లేదు. ఇట్లె 'రాముఁ డన్నము తినిన పళ్లెరము'ను వాక్యమునకు "రాముఁ డేపళ్లెరమున నన్నము తినెనో యాపళ్లెర మని యాంధ్ర వ్యవహర్తలు వివక్షించు నర్థము.

వేటికావ్యాఖ్యాత, బా-గు-ప్ర-వ్యాఖ్యావిషయములను సూరి వాక్యములను నూఁతగాఁ గొని ప్రాధాన్యశబ్దమునే యంతటను వాడుచువచ్చెను. ఆతఁ డీసందర్భమును సరిగా నవగాహించినట్లగపడదు. "రాముఁడు వాలి నేసిన బాణము - రాముఁడు బాణముచే నేసిన వాలి యనునది సహజవాక్యము. ఇట బాణముచే నను కరణమునకుఁ బ్రాధాన్యము వివక్షిత మయ్యెఁ గాన బాణము ప్రథమాంతమై యేసిన యను ధాతుజవిశేషణముతో సమసించుటంజేసి యీ ప్రయోగము గలిగెనని గ్రహించునది" (బా. సా. వే. 3౫౭ పు.) "ధాత్వర్థ వ్యాపారాశ్రయః కర్తా" అనుచోట్లనఁ గర్తకుఁ దత్క్రియాజన్య విశేషణము వేదక

నవర్ణకాదే స్తద్ధర్మాత్ । క్వచిత్ స్యా ద్వ్యవధానతా।
నిర్ధారణాదౌ మాత్రం స్యాత్ ।క్వచి న్మాత్రాచ కథ్యతే.

సన్నయూ. (విక్ర. హలం. ౨౩ కారి. అహో. ౬౫౦ పు.)

౨౭౯ విష. విశేషణ సమాసేఽపి । క్వచి దిష్టో భవే న్మయ. (విక్ర. అజం. ౭౪ కారి. అహో. ౩౫౮ పు.)

కల్పతరువు. ౨౭౯ విష:—నవర్ణకాదేః = భూతార్థక నవర్ణకము మున్నగు దానికంటెను, తద్ధర్మాత్ = తద్ధర్మార్థకవిశేషణముకంటెను, క్వచిత్ = ఒకానొకప్పుడు, వ్యవధానతా = విశేష్యమునకు శబ్దాంతరముతో వ్యవధానమునైతము, స్యాత్ = కలుగును. (చూ. విస్తర. ౨౭౯ విష యు) నిర్ధారణాదౌ = నిర్ధారణాద్యర్థములందు, మాత్రంస్యాత్ = మాత్రశబ్దము నపుంసకముగును, క్వచిత్ = ఒకానొకప్పుడు, మాత్రాచ కథ్యతే = స్త్రీలింగమాత్రాశబ్దమును బ్రయుక్తమగును. ఉదా:—"ఎ. గీ. గగనమును రుద్రభూమి నేకతమ తిరుగు।నదరు లుమిసెడు కొఱవిదయ్యంబు వీఁడె (నైష. ౨ ఆ)" అనురీతి ప్రయోగము లథర్వణునిచాఁటికే విస్మృతములయ్యె నేమో యని యాలోచింపవలసియున్నది."ఇచ్చినయంతమాత్రము.........వచ్చిన యంతమాత్రలోన్ - ఇచ్చుమాత్రలోన్......తత్ క్షణమాత్రనె ముక్తజీవుఁడై - దీనిమాత్రము-ఒక్కమాత్రలోన్ ఇత్యాద యో వాగనుశాసనానాం వాచః"(అహో. ౬౫౦). 'మాత్రచ్' ప్రత్యయమేకాక (౨౯౩ విష). 'మాత్రమ్ మాత్రా' అను పదములును సంస్కృతమునఁ గలవు. "మాత్రమ్-న 'కార్త్స్న్యే యథా-జీవమాత్రం నహింసేత' అవధారణే - యథా - పయోమాత్రం భుఙ్క్తే........."మాత్రా - స్త్రీ - కర్ణభూషణే - విత్తే - ద్రవ్యే - మానే - అక్షరావయవే. హస్త్యశ్వాదౌ పరిచ్ఛదే - స్వల్పే........" (శబ్దా - చిం).

---

మగునపుడు మాత్రమె సమానవాక్య మేర్పడును. కావున గర్త్రభిన్నుఁడగు వాలి విశేష్యమగు నపుడు సమానవాక్య మెట్లేర్పడును. 'ఏసిన వాలి' అనుచో నేసిన వాఁడు వాలి కాఁడుగదా. ఏసినవాఁడు రాముఁడుగదా. అది సమానవాక్య మెట్లగును ? మఱియు "బాణము ప్రథమాంతమై యేసిన యను ధాతుజవిశేషణముతో సమసించుటం జేసి" అనుట కేవలము పొరపాటు. బాణము ప్రథమాంత మేల కావలయు ? 'రాముఁడు వాలి నేసిన బాణమందు శక్తిగలదు' మున్నగు రీతిని బ్రథమేతరవిభక్తులు తత్తద్వ్యాఖ్యానుకూలముగా నుండుటలో బాధ యేమున్నది ? "కర్మాదేః కర్తృత్వం ప్రథమాచేత్యాది చింతామణి సూత్రములోని ప్రథమాశబ్ద మీతని కిట్టిభ్రాంతిని గల్గించియుండును. 'అచటఁ గర్తకుఁ బ్రథమ వచ్చునని చెప్పఁబడెను గాని కర్మాదికారకములకుఁ బ్రథమవచ్చునని చెప్పఁబడలేదు.

విశేషణ సమాసోఽపి = విశేషణోభయపదకర్మధారయము సయితము, క్వచిత్ = క్వాచిత్కముగా - మమ=నాకు (అథర్వణునకనుట.) ఇష్టః భవేత్=సమ్మతమగును. ద్విగుకర్మధారయా విత్యాది కారికలోని 'రూపకాఖ్యాద్యాః' అనుచోటి యాద్యశబ్దముచేతనే సంస్కృతమున 'స్నాతానులిప్త' ఇత్యాదిస్థలములందుఁ బ్రసిద్ధమయియున్న యీవిశేషణసమాసము సిద్ధించుచున్నను స్పష్టప్రతిపత్తికయి యథర్వణుఁ డిట్లు ప్రత్యేకముగ వివరించెనని యెఱుంగునది "విశేషణసమాసోపి। క్వచిదిష్టో భవేన్మమ. ఇత్యథర్వణవచనాత్ విశేషణసమాసః - మెత్తనివలుదపాదుఁగు- వినని కనని మహిమలు-సంస్కృతభాషావిదో విశేషణస్యాపి విశేష్యత్వ వివక్షాయాం స్నాతానులిప్త ఇత్యాదౌ 'విశేషణం విశేష్యేణ బహుళ' మితిసమాస నిర్వాహ ఇతి వదన్తి,సూరిచేతోరుచిరాబ్జబోధనరతుండగు దివ్య నిత్యాదౌ ప్రయోగా దాచార్యస్యాపి సమ్మతఏవాయం సమాసః—" (అహో. 3౫౬ పు) (స్నాత = స్నానము చేసినవాఁడు. అనులిప్త = చందనము పూసికొనినవాఁడు అని రెండును విశేషణములే) ప్రయోగములు:—క. హృదయరోచనములగు నేన్ప। ర్వంబులను భీష్మపర్వము। (ఆది. ౧ ఆ. ౪౬) క...ద్రోణాభిషేక మాదిగఁ గలయ। ద్యోగనిమిది పర్వములను... .........(ఆది. ౧ ఆ. ౪౮) ఆ-వె.........శల్యాదికములైన నాల్గుపర్వముల వినంగఁజాలి...(ఆది ౧ ఆ. ౫౨). ఉ......సుతులు చేరని చెందని యట్టిచోట... ......(ఉద్యో. ౨ ఆ. ౧౨౦). ఉ.........కడుతియ్యని కమ్మని పండులు...... (ఆర. ౭ ఆ. ౧౧) (విస్తర.)

---

విస్తర. ౨౭౯ విమ:—"ఆయీత్యాదిఘటితంబులు విశేషణోభయపదకర్మధారయంబులు. ఉదా:-ఆయీ, నేరములు" (ప్రౌఢ. సమా. ౧౭ సూ). ఈ యాదేశం బననేల (స్వా. ౧ ఆ).........."కొన్నియెడల విశేషణోభయపదంబులు త్రికక్రియాజన్యవిశేషణ ఘటితంబులు సందర్భయోగ్య పదవ్యవహితంబులగు. క - ఈ కన్నులు తెఱవని శిశు। వే కీడొనరించె........(భోజ. ౬ ఆ). సీ..........గీ.......... నెఱులుగల మరునీలంపు టురుల సిరుల। నరులుగొనఁజాలి నరులను మరులు గొలుపు నిరులు గెలిచిన తుమ్మెద గఱులఁ దెగడు। కురుల నులికీర్చి విరులిడి కొప్పువెట్టి(భాగ. ౧౦ స్కం ఉ). ఎ - గీ - గగనమును రుద్రభూమి సేకతము తిరుగు। నదరులు మిసెడు కొఱవిదయ్యంబు వీఁడె. (నై. ౨ ఆ) చ. బలిమిఁ గుబేరునిం గెలిచి బాగుగఁ గొన్నరవిప్రకాశమై। యలరుచునున్న పుష్పకమునందు రమింపుము కోర్కులారఁగన్(రా. ఆర. కాం. ౨ ఆ).........క. చిక్కని చక్కని నున్నని। స్రుక్కని తోలూడ్వఁబడని ఛుల్లిసెగలచే। నొక్కఁబడని దండంబులు। తక్కక యుపనయనవేళఁ దాల్పఁగ

ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థంబున కయి
యాయి యను శబ్దములు విభాష నగు. ౨౧

బాలవ్యా. వివరణము. వక్ష్యమాణవిధిచేత నయి యను దాని కైకారాదే
శంబు నగు. ఆయయికాలము - ఆయాయికాలము.

౨౭౯ I విషయము అయ్యయికాలము - అయ్యాయికాలము - ఆయై
కాలము - అయ్యైకాలము - ఆయాకాలము - ఆయ
క్కాలము - అయ్యాకాలము - అయ్యక్కాలము.

సంజీవని. ౨౭౯ I విష:—విశేషణోభయపద కర్మధారయమును నిరూపింప
కున్నను నేతత్సూత్రము విశేషణోభయపదకర్మధారయ విషయకమే యనఁ
దగును. ఈసూత్రము మొదలు గర్మధారయ సమాసాశ్రయవిధు లుపదేశింపఁబడు
చున్నవి. 'ఆ+ఆ+ఈ = ఆ యా యీ' అనుదాని సంక్షేపరూపము లే-'ఆ యా యి-
ఆయ యి' అనురూపములని తోఁచెడిని. ఈ యా దేశంబననేల (స్వా. ౧ ఆ.)
మున్నగురీతి ప్రయోగములు గలవు. శా. ఆ యా వేళల నాసరోజముఖి నా యా
లీలలం దేల్చి (పారి. ౧౪ ౮౦. సూ. రా.) ఆ యా యీ విషయములు మున్నగు
వాడుకలునుగలవు. సూరి శబ్దసిత్యనుసారముగాఁ బ్రక్రియ చూపుచున్నాఁడు.
'ఆ+ఆ' అనుచో నామ్రేడిత తదర్థకము రెండవ 'ఆ' శబ్దము. దానిచోట
'ఆయి' అనియు, 'ఆయి' అనియుఁ బర్యాయముగా నాదేశములు వికల్పముగా
నగును. బా - క్రియా - ౧౦౩ సూత్రముచొప్పున 'ఆయి' అనుదానికి 'ఐ' అను
నాదేశము వైకల్పికముగా నగునని వక్ష్యమాణవిధిచే నిత్యాదివాక్యమున సూరియే
వివరించెను ఉదా:—'ఆయాకాలము (తత్తత్కాలమని యర్థము.). 'ఆయాయి
కాలము - ఆయయికాలము - ఆయైకాలము' అనునవి ప్రకృతసూత్రముచే
సిద్ధించును. పిదప నంతటను బా - రమా - ౧౩-౧౮ సూత్రములచేత వేర్వేఱుగఁ
బ్రికస్వర పరహల్లునకు ద్విత్వమును బ్రికహ్రస్వమును రాఁగా "ఆయాకాలము -
అయ్యాకాలము - ఆయక్కాలము - అయ్యక్కాలము - అయ్యాయికాలము -
అయ్యయికాలము - అయ్యైకాలము" అనురూపములు సిద్ధించును. (విస్తర.)

---

వలయున్ (విజ్ఞా. ఆచా) (ఇట్టిప్రయోగములు కవిత్రయమువారి గ్రంథముల
యందు దొరకినవి కావు)" (ప్రౌఢ. సమా. ౧౭ సూ).

విస్తర. ౨౭౯ I విష:—త్రిలింగలక్షణశేషమునఁ గొన్ని కర్మధారయ
విషయములు చూపఁబడినవి. (విస్తర. IV ౯౭ I విష. చూ.). క్రొత్తాదులు లుప్త
శేషంబులు దేశ్యంబులతోడంబలెఁ దత్సమంబులతోడం గొన్నియెడలఁ గర్మ

ప్రయోగములు. ఉ.........తదీ। యానుమతిం దగం బడసి యయ్యయిచోటుల
నాచరింపరే (అను. ౨ ఆ. ౩౯౪.) క. అయ్యై కర్మంబులదెస। నెయ్యం బెసలార...
(అను. ౩ ఆ. ౩౦౬ ప.). ఆయూయి లోకంబులు. (కాశీ. ౩ ఆ. ౧౪౧.) శా. ఆయా
వేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి. (పారి. ౧ ఆ. ౪౦ సూ. రా. ని.).

ఇద మద ఏత ద్యత్త। చ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుళమ్। హ్రస్వం ప్రపద్య దీర్ఘా। ద్విత్వ ముపర్యత్ర
నన్నయా. రస్య జనయన్తి (ఆం. చిం. హలం. ౯. కా. అహో.
౨౮౦ విమ. ౪౦౧ పు)
ఊష్మరేఫా న్వినా ద్విత్వ। మయుక్తస్య హలో మతమ్।

---

ధారయంబగు. ఉదా:—క్రొంబులకలు. క్రొంబులకల్ జనించె సభకున్. (ఉ. రా.
౬ ఆ.) క్రొన్నారాచములు. క క్రొన్నారాచములు మూఁడు గొని నుదురేయన్.
(రా. ఆర. కాం. ౧ ఆ.) నెమ్మనము చ. అనుపమయోగలీల నమృతాంబుధియం
దుదయించు దేవు నె। మ్మనమున నావహించి.........(లక్ష్మి. ౩ ఆ) పెన్నగము.
ఏడు పెన్నగములు సంచలించె.........(రా. అర. కాం. ౨ ఆ.) ముంగోపము.
ఆ-వె. మొగముఁ బోడువలేని ముంగోప మిఁక నెప్పుడు. (ఉ. రా. ౩ ఆ.) వింజా
మరము. ఎ-గీ. రమణ శ్రీదేవి వింజామరంబు వీవ. (శేష. ౫ ఆ.) ఇవి ౨౮౭ విషయ
మునఁ జేరఁదగినవె.........(ప్రౌఢ. సమా. ౭ సూ.). ధాతుజవిశేషణంబులు
తథార్థకావ్యయంబుతోడం గర్మధారయంబగు. ఉదా:......చదువునట్లు......
(ప్రౌఢ. సమా. ౮ సూ.). ఇది యసావశ్యకము. 'అట్లు' అనునది యవ్యయము
కాదు. అదియు విశేష్యమె. (౨౧౧ విష. దాని విస్తరము ). సమాసఘటితం బీశబ్దం
బొక్కచో సూచనార్థకం బగు. ఉదా:—ఈయున్న పౌష్యపాలికిఁ। బోయి
(ఈయున్న = ఇదిగో నున్న యని యర్థము.) (భార. ఆది. ౧ ఆ.). ఒకా నొకచో
గుణవాచక ధాతుజవిశేషణంబు లవయవవిశేష్య పూర్వకంబులై యవయవితో
సమసించెడి. ఉదా:—ఒడలు తెల్లని తురగోత్తము వాలంబు. (ఒడలు తెల్లని-=
తెల్లని యొడలుగల యని యర్థము.) (భార. ఆది. ౨ ఆ.). తనువు మీఁస్ పోల వల్చు
జాలరిదాన(తనువు మీఁన్ పోల వల్చు=మీఁన్ పోల వల్చు తనువుగల యని యర్థము.)
(భార. ఆది. ౩ ఆ.). తమ్ముఁ గుట్టులు - చిలుక మొకరి యిత్యాదులు విశేష్యపూర్వ
పద కర్మధారయంబులు. ఉదా:—తమ్ముఁ గుట్టులు నీవుఁ దగ విపినంబున। కరిగితిరి.
(భార. అర. ౭ ఆ.) క. ప్రభావతి। మోదము.........చిలుక మొకరిం బలికెన్.
(శుక. ౨ ఆ.). (ప్రౌఢ. సమా. ౧౬ సూ.)

. ఋకారంచ విముచ్యస్యా । త్ప్రాణినాం ద్విత్వ
సంగతిః. (వికృ. హలం. ౬-౭ కా. అహో. ౪౦౧ పు)

కల్పతరువు. ౨౫౦ విమ:—హలంతములగు నిద మాదిశబ్దముల కర్మధారయ రూప మిశ్రసమాసమున కర్థ్యనుజ్ఞ నొసఁగుచుఁ దదాశ్రితవిధుల నుపదేశించు చున్నాఁడు. శబ్దాన్తరాన్వయే = తత్సమ తద్భవదేశ్యములలో దేనితో నైనను సమా నాధికరణ సమాసము నందునపుడు, ఇదమ్.........శబ్దాః = ఇదమాది సంస్కృత శబ్దములకుఁ బర్యాయములగు 'ఆ. ఈ. ఏ' అను నాచ్ఛికశబ్దములు, దీర్ఘాః = దీర్ఘ రూపములగు తమతమ ప్రాతిపదికరూపములతో నసఁగా'ఆ.ఈ.ఏ' అను రూపములతో సమాసపూర్వావయవములై నిల్చి, బహుళమ్ = బహుళముగా, హ్రస్వం ప్రపద్య= హ్రస్వరూపము నంది, ఉపర్యక్షరస్య = ఉత్తరపదాది హల్లునకు, ద్విత్వమ్ = ద్విత్వ మును, జనయన్తి=పుట్టించుచున్నవి. "శబ్దాన్తరాన్వయే" అనుచు శబ్దమాత్రముతో సమసించునపుడని సచించుటచేత సమాసమం దేకాక మిశ్రసమాసమందును నిట్టివిధి వర్తిల్లునని జ్ఞాపిత మగుచున్నది. 'ఇదమ్ - అదస్ - ఏతద్' అనుమాటికిని దెల్గున నొక్క 'ఈ'శబ్దమె పర్యాయముగలదని తెల్పుటకయి వానిమూఁటిని వేర్కొనెను. ఇట్టి మిశ్రసమాసము సంగీకరించుట కీక్రిందిరీతి ప్రయోగములు ప్రమాణములగు చున్నవి. క. ఈయగ్ని దేవుఁడసురకు।.........।ఆయసుర నన్ను...(ఆది. ౧ ఆ. ౩౪ ప)సీ. <u>అప్పురుషుం</u> డిం<u>ద్రుఁ</u> డయ్యుక్షు మైరావతంబు...అయ్యార్యవరు॥ ఆ-వె॥ ఆ తురంగమగ్ని.........(ఆది.౧ ఆ. ౧౧౯). ఇట్టియెడల "ఇతఁడు+అగ్ని దేవుఁడు= ఈయగ్ని దేవుఁడు" అనురీతిని సమానాధికరణ విగ్రహము నెన్నునది.

బహుళశబ్దార్థము నథర్వణుఁడు వివరించుచున్నాఁడు. <u>(విస్తర.)</u> ఊష్మరేఫాన్ వినా = రేఫఊకారములను శషసహలను విడువఁగా, అయుక్తస్య హలః = హలం తర సంయుక్తము కాని హల్లునకు, ద్విత్వమ్ = ద్విత్వము, మతమ్ = కవిసమ్మతము,

---

విస్తర. ౨౮౦ విమ:—"బహుళగ్రహణా దేకాక్షరేపి ద్విత్వమ్. ఎద్ది అద్ది- ఇద్ది - ఏది - ఇత్యాది" (అహో. ౪౦౧ పు.) అను కవిశిరోభూషణ వివరణము సరికాదు. ప్రకృతసూత్రము త్రికసమాసవిషయకము మాత్రమె. 'ఆ+ది' మున్నగు వానిలోని 'ది' వర్ణము ప్రత్యయము గాన 'శబ్దాన్తరాన్వయే' అను భట్టారక వచనమునకు విషయము కానేరదు. అద్ది మున్నగువానికే కాక 'అవ్వి-ఇవ్వి-ఎవ్వి' మున్నగువానికిని, ఉయ్యేల = ఊయేల, ఆయొన్ = అయ్యోన్, ఏలినము = ఎల్లి నము. (బా. ప్రకీ. ౬ సూ.) మున్నగువానికిని "అద్విత్వంచ భవేద్ద్విత్వం । దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్." (౨౧౫ విమ.) అనునది గతియనుట యుక్తము.

ఋకారంచ = ఋౠవర్ణములను సైతము విడువఁగా, ప్రాణానామ్=అచ్చుల కనఁగా సంధికానిచోట్ల నచ్చులకు ముందునిల్చు లఘు యకారమునకును, ద్విత్వసంగతిః = ద్విత్వము, స్యాత్ = అగును. పూర్వస్థితద్రుతలోపాదుల విషయమున ఋౠవర్ణములకు హల్లుల్వత కవిప్రయోగసమ్మత మగుచున్నను, నీద్విత్వవిషయమున హల్లుల్వత లేదనియు ఋౠపరకత్వమున లఘు యకారాగమమె రాదనియు నెఱిఁగింపఁబడు చుట్కై ఋకారంచేత్యాదిక ముపదేశింపఁబడెను. ఉదా:—ఆ+ముదితను = అమ్ముదితను. ఉ. అమ్ముదితన్ విభీతహరిణాక్షి కలాపవిభాసి కేశభా। రమ్మున నున్నదాని (సభా. ౨ ఆ. ౨౪౭.) ఆ+అమలాత్మ = అయ్యమలాత్మ. ఏ+అది = ఎయ్యది. ఉ. అయ్యమలాత్మతోడఁ బవనాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రు నీ। వెయ్యది యుక్త హేతువుగ నిమ్మెయి బాసెను నీదు పన్నుగం। గయ్యము నేసి భూపతి సహాయములం బరిమార్చెఁ దల్లి నీ। కియ్యన లక్ష్మిమూఁది చరియింపక యిప్పుడు వాయఁ బాడియే. (ఆశ్ర. ౧ ఆ. ౧౫౯.) క. అమ్మానిసి ప్రయ్యలు గని। యమ్ముదితలు వెఱది వీని నాత్మజుఁడని నె। య్యమ్మున నెట్టులు చూపుదు। మిమ్మనుజేశ్వరున కనుచు నెంతయు లజ్జన్. (సభా. ౧ ఆ. ౧౪౮) ఉ.........ఎజ్జగఁబులన్. (విరా. ౧ ఆ. ౨౯౫.) మ.........ఎక్కాలము.........(విరా. ౫ ఆ. ౨౪౭.) ఝల్ ప్రత్యాహార వర్ణములు ద్విరుక్తము లగునపుడు వానిలోని మొదటివర్ణమునకు జస్త్వ చర్త్వములుస్వాభావికముగఁ గల్గును. "ఝలాం జశ్ ఝశి. (౮-౪-౫౩) ఝలాం స్థానే జశ్ స్యాత్ ఝశిపరతః. (సి. కౌ. ౫౨ సూ.) ఖరిచ (౮-౪-౫౫) ఖరి ఝలాం చరః స్యుః. (సి. కౌ. ౧౨౧ సూ.). క. వృద్ధు లొక లక్షయున్నను। బుద్ధియె యొవ్వరికిఁ వారిఁ బూజింపంగా। నిద్ధరణీశులలో గుణ। వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్. (సభా. ౨ ఆ. ౨౭.) ఈ+ధరణీశులలో = ఈ+ధ్+ధరణీశులలో = ఈ+ద్+ధరణీశులలో = ఇద్ధరణీశులలో. మొ. శా.........। అద్ధీరాగ్రణి గెల్పు టుత్సవము నందర్యెన్.........(ఆ. ము. ౪ ఆ ౬ ప.) ఇట్టి భట్టారకాది ప్రయోగములను జూచికొనక బా-సా-వే-వ్యాఖ్యాత "వర్గద్వితీయములకును జతుర్థములకును సాధారణముగా ద్విత్వరాహిత్యమె శ్రావ్యమై గనుపట్టుటంజేసి వలసినయెడల నదియు బహుళఫలము క్రిందనే యాదరించుట తగును." (బా. సా. వే. ౩౩౯ పు.) అని వ్రాయుట పొరపాటు.

అసంయుక్త హల్లునకే యిట్లు ద్విత్వము వచ్చుననుచు నథర్వణుఁడు వచించినను దర్వాతిఁవులు సంయుక్త హల్లునకును ద్విత్వమును బ్రయోగించిరి. తగీ. "ఆటు నహెక్షత వ్యాప్తి వర్ణితోతు। లప్పుడిష్టి సిట్లులరు నివిష్ఫభావ।

మెండుఁ బెట్టని కోటగా నెసఁగుచు........(రాఘ. ౨ ఆ. ౧౦౮ ప) ఇందు రామాయణార్థమున "నీ+విప్ప్రభావము = విప్రత్వము = బ్రాహ్మణత్వము." అని పదచ్ఛేదము. భారతార్థమున "నీవు+ఈ+ప్రభావము = నీవు+ఇప్+ప్రభావము = నీవిప్ప్రభావము" అని పదచ్ఛేదము. 'ప్రభావము' అనుచోటి పకారము రేఫ సంయుక్తమై యున్నను బ్రకృతసూత్రము చెప్పున హ్రస్వద్విత్వములు వచ్చినవి. రామాయణార్థమున 'విప్ప్రి' శబ్దములోని పకారమునకును దాని బ్రాసయతి స్థలమగు 'అతులప్ప్రదీప్తి" అనుచోటి పకారమునకును-ద్విత్వము 'అనచిచ' అను పాణినీయ సూత్రముచే లభించును. "అనచిచ (౮-౪-౪౭) అచః పరస్య యరో ద్వే వా స్తో నత్వచి." (సి. కౌ. ౪౮ సూ.) లేదా ౧౯౯ I విషయము చెప్పునఁ త్రికసంధిలో వచ్చిన ద్విత్వములోని యొకహల్లునకు లోపము నంగీకరించియైన నిచటి యర్థాంతరమును సమర్థించుకొన నగును. ఉదా:—ఆ+ప్రమద = అ+ప్+ప్రమద = అప్ప్రమద = అప్రమద. మొ. ఇట్లు సంయుక్తాక్షరమునకు ద్విత్వము కల్గుట ద్వ్యర్థి కావ్యములందు మాత్రమె యని బా-సా-పే వ్యాఖ్యాత వ్రాయుట సరికాదు. "ద్వ్యర్థి కావ్యప్రయోగములందు సంయుక్తము తొలిదానికిని ద్విత్వము త్రికము మీఁద నగపడెడి." (బా. సా. పే. ౩౩౯ పు.) ద్వ్యర్థికావ్యములందే కాక స్థలాంతరములందును విద్వాంసు లంగీకరించుచున్నారు. బసవపురాణమునందును సోమనారాధ్యుఁడు బ్రయోగించెనని యిట్లు చూపఁబడెను. ద్విపద. అక్షతధూప దీపాదులొనర్చి । యక్షణంబునఁ బంచభక్ష్యముల్ గుడిచి. (బస. ౧ ఆ. ౩౦౮ ప.) ఆ+క్షణంబునన్ = అ+క్+క్షణంబునన్ = అక్క్షణంబునన్. ఇందలి 'క్ష' అనుదాని ప్రాసస్థానమగు 'అక్షత' శబ్దములోని కకారమునకు 'అనచిచ' అనుపాణిని సూత్రముచే ద్విత్వముచేసి ప్రాసమును సమర్థించుకొన నగును. ఇట్లే సోమనారాధ్యుఁడు స్థలాంతరమునందును బ్రయోగించెను. ద్వి. అక్షణమాత్ర నెయ్యంబుతోఁ దనదు । వక్షంబుదెఱవి యా వరలింగ మూర్తి. (బస. ౬ ఆ. ౬౭౨.) శారదామూర్తియుఁ బ్రయోగించెను. "అనుచు నక్షత్రకులసిత" (హరిశ్చంద్ర. నలో. ౩ ఆ. ౨౬.) (హరిశ్చం. నక్షత్రకు+లసిత. నలో:—ఆ+క్షత్రకులసిత=అ+క్+క్షత్రకులసిత యని యర్థద్వయము నెన్నునది.) "అక్షత......... । ఆక్షణంబున" అని యిట్లు కవిప్రయోగించెనన్నను క్షతి కానరాదు. ఊష్మరేఫాన్వితేత్యాది చెప్పున 'ఆశంభుఁడు - ఈ షండుఁడు - ఏ సాధువు - ఆ హయము - ఆ రాముఁడు - ఈ ఱెక్క - ఆ ఋషి' అనురీతి స్థలము లందు హ్రస్వద్విత్వములు రానేరవు. ఇచటి రేఫశబ్దముచే శకటమును గ్రహింప నగును.

ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు
దీర్ఘంబునకు హ్రస్వంబగు. ౧౩.

బాలవ్యా. త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు
బహుళంబుగా నగు. ౧౪.

వివరణము అక్కన్య. ఆకన్య, ఇక్కాలము - ఈకాలము, ఎల్లో
అరం 1 విషయము. కము - ఏలోకము, అయ్యశ్వము - ఆయశ్వము,
బాహుళకముచే నూష్మరేఫంబులకు ద్విత్వంబు గలు
గదు. ఆరూపము - ఈశబ్దము - ఏషండము. ఆసు
కృతి - ఆహాయము.

సంజీవని. అరం I విష:—౧౩ సూ. వ్యాఖ్య:—త్రికసమాసస్థలములందే
కాక ముజ్జగములు ముల్లోకములు మున్నగుస్థలములందును, బా. ప్రకీ. ౬ సూత్రము
స్థలములగు - ఊరేల - ఉయ్యేల = ఆయెన్ = అయ్యెన్ - ఏలికము = ఎల్లి
దము మున్నగు సమానపదములందును నీహ్రస్వద్విత్వములు వచ్చునని విశదపఱుట
కయి మార్గాంతరముగ సూరి సూత్రించుచున్నాఁడు. ఆచ్ఛికదీర్ఘమునకు హ్రస్వము
కల్గుననిమాత్రమె చెప్పుటచేత మిశ్రసమాసమునందును ననఁగాఁ సంస్కృతసమశబ్దపు
హల్లుపరమైనను హ్రస్వముకల్గుట నిర్బాధము - 'అక్కన్య - ఇక్కాలము' అను
సూరి యుదాహృతులును బయివిషయమున కనుకూలముగ నున్నవి. ఈవిధి బహుళ
ముగాన 'ఆకన్య'మున్నగు రూపములును నిల్చును.

౧౪. సూ-వ్యాఖ్య:—బా. సమా. ౪ సూత్రముచొప్పునఁ త్రికమనఁగా—
'ఆ-ఈ-ఏ'. అనుశబ్దములు. త్రికంబుమీఁది యసంయుక్తహల్లున కనఁగా సమా
నాధికరణ సమాసమందలి త్రికంబుమీఁది హల్లున కనియె యర్థము. సమానాధికరణ
సమాసేతరస్థలములఁ త్రికమునకుఁ బ్రయోగమే యుండదుగదా. సమానాధికరణ
సమాసమందును విశేష్య మవ్యవహితముగాఁ బరమగునపుడే హ్రస్వద్విత్వములు
గల్గునుగాన "ఈ చంద్రుని నగు మోము"అనుచో "ఇచ్చంద్రుని నగు మోము" అని
కానేరదు. ఇట 'ఈ'శబ్దము 'మోము' అనుదానికి విశేషణము. కాని 'చంద్రుని'
అనుదానికి విశేషణము కాదుగాన 'చంద్రుని' అనుదానిలోని 'చ' కారము
నకు ద్విత్వము రానేరదు - ద్విత్వమె రానపుడు పూర్వస్థదీర్ఘమునకు హ్రస్వ
ప్రసక్తియే లేదు. 'ఈ చంద్రుని నగు మోము' అనియె నిల్చును. (అరం
విష. విస్తర). అజాదిశబ్దపరకత్వమున సంధిలోనిల్చు యకారమునకె ద్విత్వము
కల్గి పూర్వస్థదీర్ఘమునకు హ్రస్వము కల్గునని విశదపఱుచుటకయి 'ఆయశ్వము=అయ్య

శ్వము' అని సూరి యుదాహరించెను. ఈవిషయమునకె మూలమగు "అజాదిశబ్దా
న్యయేతు లఘు యకారస్యైవ ద్విత్వమ్. అయ్యాశ్యర్యుఁడు........" (అహో.
౪౦౧ పు.) అను కవిశిరోభూషణపంక్తి కపార్థముచేసి బా - సా - పే - వ్యాఖ్యాత
"సంధి వశమునసైన యడాగము యకారమునకే యిట్లు ద్విత్వమగునని యహో
బలుఁడనుట విచార్యము" (బా. సా. పే. ౩౩ం పు.) అని వ్రాయుట యుక్తముకాదు.
'అ + యత్నుఁడు=అయ్యత్నుఁడు' అనురీతిని నలఘు యకారమునకు ద్విత్వము రాదని
యాయహోబల పంక్తి కర్థముకాదు.

సూరిగారి యీసహజమగు భాషాశాస్త్రసమ్మతమగు ప్రక్రియచే (విస్తర)
ప్రకృతమగు త్రికసంధిరూపము లేకాక ముల్లోకములు - ఉయ్యేల (ఊయేల)
మున్నగురూపములును సరుద్ధితములగుచున్నవి - కాని - వేన్నీళ్ళు - మూన్నాళ్ళ-
నాన్నాళ్ళు (ప్రౌఢ. సంధి. ౧౫ సూ.) నీళ్ళు - త్రాళ్ళు - కాళ్ళు - నాళ్ళు -
మున్నగు స్థలములందునుగల్గు హ్రస్వమును వైయాకరణులు సమ్మతింపరు. అట్టియెడల
హ్రస్వమును నిర్ణయించు ప్రయోగము దుర్లభము. కాన సూరిగారి యీమార్గము
బాధితమగుచున్నది. క. రు లు డు డు లంత్యములైనన్ । లులనెనయు తదంత్య
ములకు ళ్ళుత్తుగు బహుంతన్।బలుగోళ్లను కొనవ్రేళ్ళను గల గూళ్ళన్ లేళ్ళు వాఁగఁ
గ్రమమై యునికిన్. (అం. భూ. ౭౭ ప.) అనుచోప్పున 'ళ్లు' నిల్వదు. (చూ. ౨౦౧
విష. ౯౯౯ విష.) "అద్విత్వంచ భవేద్ద్విత్వం । దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్"
(౨౧౫ విష.) అని యిట్లు 'కేషుచిత్' అనుచు వచించిన యధర్వణవచనమె యర్థ్యా
మగుచున్న దనఁదగును. 'ఆడ - ఈడ - ఏడ' అనుస్థలములందుఁ బ్రకృతసూత్రముల
చేత 'అడ్డ - ఇడ్డ - ఎడ్డ' అను నసిష్టరూపములు గల్గునని భ్రమింపరాదు. ఉత్తర
పదాద్యక్షర మా మూఁటియందును లోపించినది. సీ.........అ-వె.........ఆడ
నీడ యేడ......వాఁగ గ్రామ్య మయ్యె" (అం. భూ. ౨౫ ప.) అను కేతనవాక్య ము
పరిశీలనమూలకము-తరువోజ, ఏనేడ నింద్రాదు లేడ వారలకు నెప్పుడు మ్రొక్కుదు
నేను నీధనము । భూనాథ.........(అర. ౨. ఆ. ౪౭ ప.) చ. అనమున విూఁదె
ఉంగర మహాగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరన్ । బసులకుఁ గూయిగాఁ జనియెఁ

---

విస్తర. ౨౮౦ I విష:—సమానపదమున నిట్టిహ్రస్వము కల్గుట ప్రాకృతమం
దును గలదు, "సంయోగే (౧. ౨. ౪౦). సంయోగే పరే పూర్వస్య హ్రస్వో భవతి...
(పూర్వః) = పువ్వో............. (షడ్భా. ౨౧-౨౨ పుట.) (ఏకో = ఎక్కో,
రాజ్యమ్ = రజ్జం. మొ.) ప్రాకృతమున ద్విత్వేతర సంయోగము నిల్వనేరదుగాన
నీసూత్రములోని సంయోగశబ్దమునకు ద్విత్వమె యర్థము.

బాపఁడు కౌరవసేన యేడ యెం। టిసనుట యేడ (వి రా. ౫ఆ. ౨౩౪). (‘ఆడ-ఈడ’ అనువానికిట్టి భారతప్రయోగములు లభింపలేదు) ఆ-వె. ప్రాకటముగఁ గృతుల నాకడ నీకడ। యనుచుఁ బల్కుచోట నాడ నీడ। యనినవర్ణలోప మగు......... (సర్వల. ౧ ఆ. ౩ ప. ౮ పుట.) అను తిమ్మకవి పద్యము నుదాహరించి వాని సాధుత్వమునకుఁ బయి భారతపద్యములు బా-గు-ప్రవ్యాఖ్యాతచే నుదాహరింపఁబడెను. పయిభారతపద్యములచే ‘ఏడ’ అనుశబ్దము సాధువని నిర్ణీతమగునుగాని మఱియే మియు నిర్ణయింపఁబడదు. సూ-రా-నిఘంటువునందును ‘ఆడ - ఈడ - ఏడ’ అను శబ్దములు ‘ఆకడ - ఈకడ - ఏకడ’ అనువాని సంక్షేపరూపములనియె చూపఁబడెను గాని ‘ఆడ’ మున్నగునవి ‘ఆయెడ’ మున్నగువాని సంక్షేపరూపములనుట యుక్తమని తోఁచుచున్నది.

భాషేయ మమితా తత్ర। దేశ్యా చిత్ర స్వభావయుక్
తచ్చిత్రతాను మంతవ్యా। పూజ్యపాద సుభాషితే॥

| | |
|---|---|
| సన్న సూ. | (వికృ. క్రియా. ౩౬ కారి = అహో ౫౧౩ పు.) |
| ౨౮౧ విష. | భూయసీ దేశ్యశబ్దేషు। లోపవర్ణాగమ శ్రుతిః (వికృ అజం. ౯౪ కా. అహో. ౩౭౨ పు) |

కల్పతరువు. ౨౮౧ విష:—ఈ కారికలకు ౮౮ I ౨౧౯ విషయములలో వ్యాఖ్య చేయఁబడెను. కర్మధారయాది సమాసాశ్రయవిధులు కొన్ని సూరిచే నీక్రిందిరీతిని జూపఁబడెను. అట్టివానికెల్లఁ బైయథర్వణకారికలె మూలమని యెఱుంగునది.

కృతహ్రస్వంబగు త్రికంబుమీఁది చోటుశబ్దంబు
నోత్వంబున కత్వహ్రస్వంబులు విభాషనగు. ౧౫.

| | |
|---|---|
| | అచ్చోటు - అచ్చటు - అచ్చొటు, ఇచ్చోటు - |
| బాలవ్యా. | ఇచ్చటు - ఇచ్చొటు, ఎచ్చోటు - ఎచ్చటు - |
| వివరణము. | ఎచ్చొటు. వీని ద్విత్వంబునకు వక్ష్యమాణ విధిచేఁ |
| ౨౮౧ I విషయము. | బాక్షికంబుగ లోపంబగు. అచటు - అచోటు, ఇచటు- |
| | ఇచోటు, ఎచటు - ఎచోటు, ముచ్చోటులు - ముచ్చ |
| | టులు - ముచ్చొటులు - అనురూపంబులు ప్రయో |
| | గంబులం గానంబడియెడి. |

సంజీవని. ౨౮౧ విష:—కృతహ్రస్వంబగు.........బా - సమా - ౧౩-౧౪ సూత్రముల చొప్పున ద్విత్వహ్రస్వములు గల్గిన స్థలమునందలి చోటు శబ్దము ‘చో

అనుదాని యోత్వము పోయి యచట "ఒత్వము" గాని 'అ'త్వముగాని పర్యాయ ముగా వికల్పమున నిల్చునని యర్థము. హ్రస్వమునఁగా 'ఒత్వము' వచ్చునపుడు 'అచ్చొటు - ఇచ్చొటు - ఎచ్చొటు' అగును. 'అత్వము' వచ్చునపుడు 'అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు' అని యేర్పడును. అత్వహ్రస్వములు రానిపక్షమున 'అచ్చోటు- ఇచ్చోటు - ఎచ్చోటు' అను త్రికసమాస సంధిరూపములె యథాస్థితముగ నిల్చును. వక్ష్యమాణవిధిచే ననఁగాఁ బ్రకీర్ణము ౮ సూత్రముచొప్పున జడ్డకుఁ బాక్షిక లోపము కల్గఁగా 'అచోటు - ఇచోటు - ఎచోటు - అచటు - ఇచటు - ఎచటు' అనురూపము లేర్పడును. కృతహ్రస్వంబగు త్రికంబుమీఁది చోటు శబ్దంబగుటచేఁ ద్రికమునకు హ్రస్వము కల్గని పక్షమందలి, 'ఆచోటు - ఈచోటు - ఏచోటు' అనువాని చోటు శబ్దము నోత్వమున కత్వహ్రస్వములు రానేరవు గాన "ఆచోటు- ఆచటు" మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. "అచ్చోటు - ఇచ్చోటు - ఎచ్చోటు" అను నత్వహ్రస్వములురాని రూపములు 'అక్కటాదులలోఁ' జేరమిం జేసి 'అచోటు - ఇచోటు - ఎచోటు' అను ననిష్టరూపములు కల్గనేరవు. "మూఁడు+ చోటులు = ముచ్చోటులు = ముచ్చొటులు=ముచ్చటులు = ముచ్చట్లు" అనురూప ములు ప్రయోగదృష్టము లగుచున్నవనుచు సూరివ్రాసెనేకాని యట్టిప్రయోగ ములను జూపలేదు. త్రికముమీఁదనేకాక మూఁడుశబ్దముమీఁద నిల్చునపుడు సైతము చోటు శబ్దము నోత్వమున కత్వహ్రస్వములు గలవని సూరి యాశయము. "హ్రస్వతః స్థానార్థా చ్చోటోః హ్రస్వః స్యా ద్వా త్రిసంఖ్యార్థతః" అను సూరిగారి సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణ సూత్రమున హ్రస్వము మాత్రమె విధింపఁబడెను. సూరిగారి యాంధ్రశబ్దానుశాసనమున "ముచ్చోటులు - ముచ్చొటులు - ముచ్చ టులు" అను నిపాతసూత్రమున 'ముచ్చటులు' అనెడి "అత్వ" రూపము సైతము చేర్పఁబడెను. పరిశీలింపఁగా సూరిగారు వ్రాసికొనుచున్న యాంధ్రనిఘంటువును శిష్యులగు బ. సీతారామాచార్యులుగారు స్వీకరించి శబ్దరత్నాకరమును రచించిరను సూరిగారి చరిత్రము చొప్పున సంగ్రహించిన యీక్రిందిప్రయోగము శబ్దరత్నా కరమునఁ జేర్పఁబడెనని తోఁచెడిని. "ముచ్చట్లు. దే - వి - బ. (మూఁడు+చోట్లు) మూఁడుప్రదేశములు. తే. చరణములు కేళ్ళు గడిగి ముచ్చట్లు చఱచి । పీఠమున నుండి కాళ్ళుఁ దాఁ బృథివి మోపి । యర్థి నాపోశనమును బ్రాణాహుతులును । గొని గృహస్థుండు మౌనియై కుడువవలయు (ఇచట చఱచుటకు తుడుచుట యర్థము.) విజ్ఞా- ఆచా- కాం" (శ-ర). ఈశబ్దరత్నాకరోదాహృతినె బా-గు-ప్ర-వ్యాఖ్యాత స్వీకరించి యుదాహరించి యుండును. (బా. గు. ప్ర. ౨౭౨ పు.) పై విజ్ఞానేశ్వరీయ

పద్యములోని 'ముచ్చట్లు' అనునది 'మూఁడుచోటులు' అగుదాని సంక్షేపమని స్పష్టముగాఁ దోఁపకుండుటచేఁ గావలయు నద్దానిని బా - సా - వే - కర్త స్వీకరింప లేదు. "చరణములు కేళ్ళఁ గడిగి ముచ్చట్లుచఱచి। (విజ్ఞా - ఆచా - కాం.) శుద్ధి యగు ముచ్చట్లున్. (విజ్ఞా - ఆచా - కాం - ౬౦.) ముచ్చాటులునియు నొకచోఁ జూపట్టెడి - ము। చ్చాటులు చఱవంగవలయు సద్ధర్మగతిన్. (విజ్ఞా - ఆచా - కాం - ౭౯.)" (గాణ. సమా. ౨౮౮ సూ. వివ. ౨౭౭ పు.) ప్రయోగములు:—క. చోటు చోటనఁ బొద పద యొ। క్కటి యొక్కొటి........చోటు:—క. కటకట పేరిన పెన్నె। త్తుట జొత్తిలియున్న మోముతోడం గొడు కె। చ్చటఁ బడి యున్నాఁడో య। చ్చోటు చూపెడువారు లేరె చూచెద వానిన్. (ద్రోణ. ౨ ఆ. ౨౫౧ ప.)" (సర్వ్యల. ౨ ఆ. ౬౮-౬౫.) "మోముతోడఁ గొడుకే చ। క్కటఁ బడి" అని నేఁటి ముద్రణముల పాఠము. బా - గు - ప్ర కర్త యీ ప్రయోగమును జూపుటలో "మోముతోడం గొడు కె। చ్చటఁబడి" అని యుదాహరించుట నరయఁగా నతఁడు తిమ్మకవి ప్రయోగమును స్వీకరించెనని తోఁచకమానదు. క. సము। త్కట కాంచన రాసులు న। చ్చటఁ బొడమెన్ జూడ నక్కజంబగు భంగిన్. (అశ్వ. ౧ ఆ. ౨౩ ప.) చ. <u>అచటన</u> యుండి లోకముల నన్నిటి........అట్లుగాన నా। <u>కచటు</u> నివాసమయ్యె విను మన్యతలంబులు దానిఁ బోలునే. (అను. ౮ ఆ. ౮౩౭). మ. ఇటకుం దోకొని రమ్ము నావుడు నతం డేతెంచి విచ్చేయు మ। చ్చోటికిన్ నిన్ను విభుండు రమ్మనియె నంచుం జెప్ప నాశీర్వచ। స్స్ఫుటనాదంబులతో సుమిత్రకొడుకుం భూపుత్త్రియుం దాను నొ। క్కొటఁ దేరెక్కి నృపాల ఫాలముల మ్రొక్కుం గేలుదో యొప్పఁగన్. (భాస్క. అయో. ౩౧ ప.) క........యూరక। చను టధిపతి నరసి తా <u>నిచటఁ</u> గానక యా। తని (విరా. ౮ ఆ. ౨౫౯).

ఉత్తరపదంబగు చోట శబ్దము టాక్షరమునకు
లోపంబు విభాష నగు. ౧౬.

బాలవ్యా. చోటు శబ్దం బౌపవిభక్తికంబు గావున దాని యంతి
వివరణము. మాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం
౨౮౧ II విషయము. బాక్షికంబుగ లోపించునని యర్థము. అచ్చో
నున్నాఁడు - అచ్చోట నున్నాఁడు. ఒకచో నుండె -
ఒకచోట నుండె.

సంజీవని. ౨౮౧ II విష:—'ఉత్తరపదంబగు' అనుటచేతఁ ద్రికసమాస మాత్రమందె కాక యెల్లయెడలను సమాసమాత్రమం దుత్తరపదమయినం జాలు

నను నర్థము లభించుచున్నది. ఉదా:—ఒకచోన్ - ఎల్లచోనో - వచ్చినచో. మొ. చోట శబ్ద మనుటచేత నౌపవిభక్తికములకు సప్తమియందు వచ్చు (ఆచ్ఛి. 3౮ సూ.) 'అత్వముతోఁ' గూడిన శబ్దమున కను నర్థము లభించుచున్నది. ఉదా:—ఆచోటన్ = ఆచోన్. మొ. టాక్షరమునకు లోపమనుటచేత నట్టి యత్వమునకును శబ్దగత టకారమునకును బాక్షికలోపము కల్గునని విశదమగుచున్నది. ఉదా:—అచ్చోటన్= అచ్చోన్ - ఇచ్చోటన్ = ఇచ్చోన్ - వచ్చినచోటన్ = వచ్చినచోన్ - ఆచోటన్ = ఆచోన్. మొ. చోట శబ్ద టాక్షరమునకు లోపమనుటచేత. "అచ్చోటన్ - అచ్చటన్" మున్నగు శబ్దములలోని టాక్షరములకు లోపము రాదని విశదమగుచున్నది. బా - ఆచ్ఛి - 3౮ సూత్రమునందలి 'అత్వము' తృతీయా సప్తములలో విధింపఁబడినను "ఊరు చోటు మేన్వాదులకుఁ దృతీయయం దత్వము ప్రయోగ దృష్టము కామింజేసి (౨33 విమ.) సప్తమ్యాదేశమైన యకారంబని సూరి వివరించెను. భట్టారకునకును నీ టాక్షరలోపము సమ్మతమె. ప్రయోగములు:—
సీ.........ఆ-వె. అతని । యున్నచోన ప్రీతి నుండుద మిందుండ । నేలయనుచుఁ బౌరులెల్లఁ దెరలి. (ఆది. ౬ ఆ. ౧౪3.) చ.........తా జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో । నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై. (సభా. ౨ ఆ. 3౦.) క. దేవతలకైన నొక్కొక । చో వలయున కాదె శత్రుసూదనవిధి...... (విరా. ౧ ఆ. ౫3.) ఉ. తా వెసఁ బోవునప్డు బలదర్పసముగ్రులు పాండుపుత్త్రు లచ్చో వసియింపకున్కిఁ దనచూచిన కార్య మతండొనర్చె........(సౌప్తి. ౧ ఆ. ౨౧౦.) శా.........ఇ । చ్చోనుండన్ సమకూరునే మనకు నంచున్. (ఉ. హరి. ౪ ఆ. ౬౫ ప.) ద్విపద. ఆచ్చోన పోవిడ్చి యవల వైచుదును. (బస. ౪ ఆ. ౯౧౪.) చొచ్చె నగ్గుడియ తా నెచ్చోనో యడఁగె. (బసవ. ౧ ఆ. ౬౦౪.) 'ఎచ్చనో యడఁగె' అనునది ముద్రణసంస్కర్తృ ప్రమాదకృతమగు తప్పుపాఠము.

నన్నయా. నివర్ణకః స్యాద్బహుళ । మదన్తా ద్గుణవాచకాత్.

౭౮౨ విమ. (వికృ. అజం. ౬౯ కారి. అహో. 3౫3 పు.)

కల్పతరువు. ౭౮౨ విమ:—అదన్తాత్ = అకారాంతమగు, గుణవాచకాత్ = గుణవాచకమగు శబ్దముకంటెఁ బరముగా, బహుళమ్ = బహుళముగా, కర్మధారయ సమాసమునందు, నివర్ణకః స్యాత్ = నివర్ణకమగును. ఉదా:—తెల్లని యశ్వము - తెల్లయశ్వము. మొ. "నివర్ణకః స్యాద్బహుళ । మదన్తా ద్గుణవాచకాత్ - నల్లనికలువ - నల్లకలువ, తెల్లనికలువ - తెల్లకలువ, తెల్లనితమ్మి - తెల్లతమ్మి, బహుళగ్రహణాత్ చక్కనివాఁడు ఇత్యేవ. ఉదన్తాదపి క్వచిత్ - సవురనివాఁడు -

ఇతిరూపమ్. తత్రోకార స్యాత్వంన, అదన్తా దిత్యుక్తేః వెలిదమ్మి - వెలిదామర - ఇత్యాదౌ న నివర్తకః" (అహో. ౩౫౩ పు.) అని యీ ట్లహోబలపతి వివరించెను. దీని ననుసరించి యధునాతన వైయాకరణులు పెక్కురు "చక్కశబ్దముకంటె ని ప్రత్యయము నిత్యమని వ్రాయసాగిరి. "బహుళగ్రహణమువలన చక్కనివాఁ డిత్యాదుల నివర్ణలోపంబు లేదు." (కవిజనరంజనవ్యాఖ్య. ౯౬ పుట.) "బహుళంబని చెప్పుటచేత చక్క - చిక్క - ఇత్యాదిగుణవాచకంబుకంటె నిగాగమంబు నిత్యంబు." (బా. గు. ప్ర. ౨౬౯ పుట.) "బహుళ మనుటం జేసి యీ నిగాగమము చిక్క - చక్క మున్నగు గుణవాచకములకంటె నిత్యముగా నగుటయు........" (బా. సా. వే. 33౬ పు.) "బాహుళకముచేఁ జక్కనివాఁ డిత్యాదుల నివర్ణకము నిత్యము" (గాణ. ౨౭౮ పుట) "బహుళమనుటచే చక్క శబ్దమునకు నిత్యము. చక్కనిమాట - చక్కనిమొగము." (ఆం. భా. అ. సమా. 33 సూ. వివ.) ఇ ట్లహోబలపతివ్రాఁత విస్తరించినది. కాని చక్క శబ్దమునకు 'ని' వర్ణకరాహిత్యము కవిప్రయోగములందుఁ గన్పట్టుచున్నది. "సీ. చక్క చాయఁ జరింప సమకూర కుండుట, నిడఁ బింగళను గాలి యొక్క డిగ్గు. (కాశీ. ౨ ఆ. ౧౨౧). వ......... అప్పు డర్కుని రథంబు చక్కచాయ నడచె........(కాశీ. ౨ ఆ. ౧౫౯) (సూ. రా. ని. చక్కశబ్దము). "నిగాగమమునందెడు గుణవాచకములకగు సమాసములు కర్మధారయములుగాక కర్మధారయాభాసములని 'స్యాత్కర్మధారయాభాసః। కర్తృత్వే కారకాశ్రితః (తే?) అని యథర్వణుఁడు పేర్కొనుటను గమనించునది" (బా. సా. వే. 33౬ పు.) అను పేటికావ్యాఖ్య భ్రాంతిమూలకము - నల్లనిగుఱ్ఱము మున్నగునవి కర్మధారయములె - అవి కర్మధారయభాసము లెంతమాత్రము కావు. పేటికావ్యాఖ్యాత యీక్రింది యహోబలపండితీయ పంక్తులుచూచి సరిగా నర్థముచేసికొనక భ్రమించినట్లు తోఁచుచున్నది. "నల్లనివాఁడు తచ్ఛబ్దోత్ర పురుషవాచకః - నల్లనియది - అదిశబ్దః స్త్ర్యాదిపరః - ఇత్యాద్యాః కర్మధారయాభాసాః - స్యాత్ కర్మధారయాభాసః। కర్తృత్వే కారకాశ్రితే ఇత్యథర్వణోక్తేః" (అహో. ౮33 పు.) నల్లనివాఁడు మున్నగునవి కర్మధారయాభాసము లనఁదగును. ఇట విశేషణములకు విభక్తి వివక్షించి తచ్ఛబ్దము ప్రయోగింపఁబడెను గాన వాఁడు శబ్దము సరియగు విశేష్యము కానేరదు. కావున నిచటి కర్మధారయ మాభాసరూప మనుట యుక్తము. (౨౭౧-౨౭౮ వివ.) పై కవిశిరోభూషణపంక్తులలోని కారకాశ్రిత ఇత్యుక్తేః" అనుచోట "కారకాశ్రితః" అని ప్రామాదికముగాఁ బదచ్ఛేదము చేసికొనుటయుఁ గేవలము పొరపాటె.

గుణవచనంబులగు నల్లాదులకుం గర్మధారయంబు

బాలవ్యాకరణ. నందు నిగాగమంబు బహుళంబుగా నగు. ౧౭.

వివరణము. నల్లనిగుఱ్ఱము - నల్లగుఱ్ఱము, నల్ల - తెల్ల - పచ్చ -

౫౦౭ I విషయము. ఎఱ్ఱ - చామ - తియ్య - కమ్మ - ఫుల్ల - విన్న - తిన్న -
అల్ల - ఇత్యాదులు నల్లాదులు.

సంజీవని. ౫౦౭ I విష:—అదన్తా ద్గుణవాచకా త్తని యుపదేశించినను "పెద్ద - చిన్న" మున్నగు కొన్ని యదంతగుణవాచకములకుఁ బరముగ నిగాగమము రాణింజేసి నల్లాదులనుచు సూరి యొక యాకృతిగణమునకు నిగాగమము వచ్చునని నేర్పుగా వివరించెను. ఇట్టి సూరి జాగ్రత్తను దెలిసికొనక గుప్తార్థప్రకాశికాకర్త "మూలంబునందు నదంతగుణవచనంబులనుట యావశ్యకంబు-అందున తెలిదమ్మి వెలిదామర ఇత్యాదులందు నిగాగమంబులేదు." (బా. గు. ప్ర. ౨౬౯ పు.) అని వ్రాయుట సరికాదు.

బాలవ్యాకరణమున నల్లాదిగణము ప్రకృతసమాససూత్ర వివరణమందును దద్ధితప్రకరణమునందలి యాఱవసూత్రపు వివరణమునందును బఠింపఁబడెను. అహోబలపత్యాదులు చక్క శబ్దమునకు నిగాగమము నిత్యమని యుద్ఘోషించుచుండఁగా సూరి దానిని బ్రకృతసూత్రపుగణమునఁ జూపనేలేదు. ఇంక "ఇత్యాదులు" అను దానిచే దానిని సంగ్రహించికొనవలయును. ఇట్లె తద్ధితసూత్రపు నల్లాదిగణమున నుదాహృతములగు 'చప్ప - ఒయ్య - తిమ్మ - ప్రేక' శబ్దములును బ్రకృతసూత్రమునఁ జూపఁబడలేదు. ఒక్కగణమునె యిట్లు పరస్పర భిన్నముగాఁ బఠించుట వింత. చిక్క - నున్న మున్నగు మఱికొన్ని శబ్దములు రెండిటను జూపఁబడలేదు. వానినెల్ల నాది శబ్దముచే సంపాదించికొనవచ్చును. రెండుచోటులందును నల్లాదిగణ మాకృతి గణముగనె సూరిచేఁ జూపఁబడెను. "సవురు (సవురని) మనోజ్ఞము" అను నహోబలపత్యంగీకృతశబ్ద ముకారాంత మగుటచేతను సూరిపఠించిన వెల్ల నకారాంతములె యగుటచేతను నది సూరిచే నుపేక్షితమేమో? సూరిగారు తద్ధి. ౬ సూత్రమున నధికముగఁ బఠించిన 'ఒయ్యన' శబ్దము ప్రత్యాఖ్యేయమె యనఁదగును. "ఒయ్య - ఒయ్యని" అను విశేషణరూపములుగాని 'ఒయ్యన' అను విశేష్యరూపముగాని ప్రయోగదృష్టముకాలేదు. 'ఒయ్యన్-ఒయ్యనన్' అను క్రియావిశేషణరూపములు మాత్రమె ప్రయోగములందుఁ గన్పట్టుచున్నవి. శబ్దరత్నాకరకర్త దీనిని విశేష్యమని పొరపాటుగా వ్రాసినను దానికిఁ బ్రమాణముగాఁ జూపిన ప్రయోగము క్రియావిశేషణమనియె నిరూ

పించును. కావుననే సూ - రా - నిఘంటుకర్తలు 'ఓయ్యన్ - ఓయ్యనన్' అను క్రియావిశేషణరూపములనే యనఁగా నవ్యయములనే చూపిరి. అట్లె 'ప్రేఁకన' అను దానిని సముతము తద్ధిత సూత్రోదాహృతులనుండి తొలఁగించుట యుక్తమని తోఁచెడిని. 'ప్రేఁక' అను విశేషణరూపమే లేనపుడు దానిపై నిలువవలసిన నవర్ణకములకుఁ బ్రసక్తియెట్లు? 'ప్రేకము' అను విశేషణరూపమును, (ప్రేఁకపుఁగీడుఁ నై. ౧ ఆ. శ-ర) ప్రేఁకన (ధరిత్రికంటె ప్రేఁకనయగుదాని. ఆర. ౭ ఆ) యను విశేష్యరూపమును ప్రేఁగుధాతుజన్యము లుండుట విరుద్ధముకాదు. 'ప్రేఁకని బండి వానికిని - ప్రేఁకని మోపు' అని శబ్దరత్నాకరణమునఁ (తెప్పగొంటు శబ్దమునొద్ద) గేతనపద్యభాగముల నుదాహరించుట పొరపాటు. ఆరెండుచోటులందును 'చామన చాయ' అనురీతినె 'ప్రేఁకన' అను ప్రేఁగు ధాతుకృదంతరూపము నంగీకరించుటయె యుక్తము. "ప్రేఁకనయొక్క+మోపు = ప్రేఁకనగలమోపు = ప్రేఁకనమోపు. చామన యొక్క+చాయ = చామనగలచాయ = చామనచాయ" అనురీతి నీరెండుచోటు లందును నాభాస బహువ్రీహి సంగీకరింపనగును. సూరిగారు సమాస తద్ధిత సూత్ర వివరణములు రెండింటను చామశబ్దము నుదాహరించిరే కాని 'నల్లనగు' అనునర్థము గల "చామ - చామని (చాయ)" అను విశేషణరూపములను నిర్వహించు ప్రయోగములుగాని ప్రామాణికలాక్షణికోదాహృతులుగాని లేవు. శబ్దరత్నాకర సూర్యరాయాంధ్ర నిఘంటువులందును నట్టి విశేషణరూపములు లేవు. "చామన చాయ-వి. (చామన్+చాయ) ౧ శ్యామవర్ణము - ఆకుఁబచ్చ" (సూ. రా. ని.) శబ్దరత్నాకరకర్త యీ నిగాగమవిషయమున భిన్నమార్గమును బ్రదర్శించెను. "తియ్య - దే - విణ - మధురము........" (శ-ర) "తియ్యన - దే - వి - తియ్యఁదనము. మాధుర్యము. (విశేషణముగుచో తియ్యనిపలుకులు. మొ. చూ. అలకన)" (శ-ర) "అలకన దే - వి - సూక్ష్మత - విణ - సూక్ష్మము. 'అలకనితెల్వి' హరి. ఉ. ౭ ఆ. 'అలకనిజేబు.' స్వా. ౬ ఆ. (విశేషణమైనప్పుడు సమాసమునందు కడపటి అకారమునకు ఇకారము వచ్చెడి.)" (శ-ర). ఈశబ్దరత్నాకరోదాహృతులనుబట్టి 'తియ్య - తియ్యన - తియ్యని' అను క్రమము 'మధుర - మాధుర్య - మాధుర్యన్' అనురీతిని స్ఫురింపఁ జేయుచున్నది. ఈశబ్దరత్నాకరమార్గము స్వారసము కామిం జేసియే యాధునిక వైయాకరణు లెవ్వరును దీని నంగీకరింపలేదు. తుదికి సూ-రా-నిఘంటుకర్తలును నధర్వణుని నిగాగమమార్గమునె యాదరించిరి. "తియ్య = తియ - తీయ - విణ. (త-తియం) ౧ మధురమైనది. (దీనికి కర్మధారయమందు నిగాగమము వైకల్పికము.)" (సూ. రా. ని). ఇట్లు కర్మధారయసమాసమున వచ్చు నొక

యాగమమె యీ 'ని' అమనదియని సర్వసమ్మతమైయున్నది. నివర్ణకస్థితికిఁ బ్రయోగములు:— క. కొని ప్రచ్చెడు లోపల న। ల్లని క్రిమియై.........(ఆది. ౨ ఆ. ౨౦౦ ప.) చ. అనయము.........ధర్మసూతి మె। త్తనిపులి.........(ఉద్యో. ౨ ఆ. ౧౪.) క.........వె। ఱ్ఱనికన్నులునై యశుచి। త్వనిరూఢుం డొకఁడు.........(శాంతి. ౨ ఆ. ౨౦౬.) మ. అని కోపంబున......అ। ల్లని నవ్వొప్పఁగ.........(శాంతి. 3 ఆ. 3౯౧.) క.........ప్ర। న్ననితలము చందమునఁ దోఁ। చిన నూయింబోలె.........(అను. ౪ ఆ. ౪౦౯.) క. చిక్కని చక్కని నున్నని। స్రుక్కని.........దండంబులు. (విజ్ఞా. ఆచా.) నివర్ణకము చేరనివియుఁ గలవు. సీ. పరమైన చెలువంబు గరగరికయుఁ దియ్య తెలినీరు గలిగిన దీర్ఘికలును. (ఉద్యో. ౧ ఆ. ౯3.) క.........ఒల్ల నవ్వునఁ। దనవదనము వింతచెన్ను దలకొనఁగా... హరి. ఉ. ౬ ఆ. ౧౦౯. (సూ. రా. ని. అల్ల శబ్దమునొద్ద.) క. నరుఁ డలుక వొడమియును సు। స్థిరుఁడై తనయెఱ్ఱ నెసల చెలువున.........(ఉద్యో. ౨ ఆ. ౧3౨.) ఇట్టి 'ని' వర్ణకము ద్రుతమనియు "తెల్లని - నల్లని" మున్నగునవి వ్యస్తములగు ద్రుతప్రకృతికములైన విశేషణములనియు సమాసమున దీనికి లోపము గల్గుననియు నట్టిలోపము గల్గినను బరస్థిత పరుషములు సరళములుగా మాఱుననియు "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అను సూత్రము ద్రుతలోపమునకు మూలమునియు నప్పకవి మిక్కిలి ప్రామాదికముగా నీక్రిందిరీతిని బ్రసంగించెను. "ద్రుతలోప సమాసములు:— మూ. సూ:— ద్రుతస్య సర్వత్ర లుక్సమాసేషు. తే-గీ. వనధితనయేశయయినటువంటి యనుచుఁ। బరపదవిశేషణము లేటపఱచుకొనుచుఁ। తొలుతటి పదంబు కొననుండు ద్రుతముగుడియు। సరుసనమునందుఁ జెందులోపములు కృతుల. (అప్పక. ౫ ఆ. ౧౬౪.) పరపదము విశేష్యమనుట యుక్తముగాన "పరపద విశేష్యతను దేటపఱుకొఱకు" అని ద్వితీయచరణపాఠముండుట గ్రంథకృదభిప్రేతమనఁదగును. క. కడపలిద్రుతమును గుడియును। బొడవడఁగినఁ బయిని బరుషములు సరళములౌఁ। జెడవుపెఱ హల్లులెల్లను। సడలక ప్రాణంబులెల్ల సంధులు గాంచున్. ౧౬౫. తే-గీ. జగతిఁ జప్పనికూరకుఁ జప్పగూర। చయుచు జక్కని చాయకుఁ జక్కజాయ। హెచ్చుపచ్చని టొపికిఁ బచ్చడోపి। గరిమఁ గమ్మని తావికిఁ గమ్మదావి. ౧౬౬. ఆ-వె- చల్లగాలి తీయ విల్లు నా సరళ స్థి।రాక్షరములు తొల్లిటట్ల నిలుచుఁ। బంచబాణజనక పచ్చావు నల్లావు। ననుచు నచ్చులెల్ల నడుకు నిట్లు. ౧౬౭. (అప్పక. ౫ ఆ. శ్రీ గిడుగువారు సవరించిన ముద్రణము.) 'తెల్లని' మున్నగునవి వ్యస్తపదములనుట కేవలము తప్పు. 'తెల్ల - నల్ల' మున్నగు విశేషణ

ములకుఁ గర్మధారయమునఁ బాక్షికముగ వచ్చునది యీ 'ని' వర్ణకమని యథర్వణుఁడు వచించుచుండఁగా నప్పకవి యిట్లు వచించుట కేవలము పొరపాటు. వ్యస్తతలో 'ని' వర్ణకము నిల్వనే నిల్వదు. "తెల్లనివస్త్రము" అనుదానికిఁ బదచ్ఛేదము చేసినచో "తెల్ల+వస్త్రము" అని నిల్చుటయే యథర్వణాశయము. "ద్రుతస్య సర్వత్ర లుక్సమావేశే" అను చింతామణిసూత్రమున కిట్టివి లక్ష్యములు కావు(చూడు. ౧౭-౯౦ విష.). ఇట్టి సమాసాశ్రయవిధి సిద్ధమగు 'ని' వర్ణకము ద్రుతమనుట యొకతప్పు. ఆదేశసరళపరకత్వముండును ద్రుతలోపము గల్గెననుట రెండవతప్పు. "ద్రుతస్య సర్వత్ర లుక్ సమాసేషు" అనుచోఁ జెప్పిన నీ 'ని' వర్ణకము సమాసమున నిత్యముగా లోపించుననుట మూఁడవతప్పు. 'చక్కజాయ' మున్నగురీతిగల కళోపరిస్థగజడదబాదేశస్థితి నంగీకరించుట నాల్గవతప్పు. ఇట్టి ప్రమాదస్థితి యప్పకవివంటివాని కెట్లుతోఁచెనో తెలియకున్నది. ప్రకృతసూత్రోక్త (౭౮౨ విష.) ని వర్ణకము యొక్కయు బా - తద్ధిౙ సూత్రమున విధింపఁబడిన నవర్ణకముయొక్కయు స్వరమునకు లోపము క్వాచిత్కముగఁ గల్గుటయు నట్టియెడల ద్రుతకార్యములు గల్గుటయుఁ గలదు. (చూ. ౪౪-౭౮ III విష.) "గుణవాచకంబులు కొన్నింటి నిగాగమంబునకుఁ బరుషంబులు పరంబులగునపుడు బిందువగు. ఉదా:—కమ్మఁదేని - కమ్మందేని. మ. మరువాలారు శరంబులం దొరఁగు కమ్మందేని........(నైష. ౨ ఆ. ౯౯ ప.)" (ప్రౌఢ. సమా. ౧౩ సూ.) ఇట్లు నివర్ణకమునకు బిందువు గల్గురూపంబులు భారతమునఁ గన్పట్టలేదు. "గుణవాచకంబు క్రియావిశేషణం బగుచో నొక్కెడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడు. ఉదా:—మ. సని చక్కంగఁ బ్రియంబు వర్ధిలుటకై......(కాశీ ౨ ఆ.)" (ప్రౌఢ. సమా. ౧౪ సూ.) (చక్కన+కన్ = చక్కంగన్.) క....మాకుం గుడు మిం। డిదె మీరు వ్రక్క గొనుఁడని। చదు రడిచిన మనసుపొందు చక్కంబడునే (ఉద్యో. ౧ ఆ. ౩౧౨.) క. వారలంగొని। యే చక్కంబెట్టువాఁడ నేఁ బాండవులన్ (ఉద్యో. ౨ ఆ. ౨౪౦.) తెల్లంగన్ - నల్లంగన్" మున్నగు ప్రయోగములు భారతాదిప్రాచీన ప్రబంధములం దెందును గానరావు. తెల్లంగ - తెల్లంగలువ - నల్లంగలువ - మున్నగురీతిని సయితము ప్రబంధములందుఁ జూపట్టలేదు - తెల్లగన్ మున్నగునవి (తెల్ల = తెలుపు. నల్ల = నలుపు) మున్నగు విశేష్యములకు నుజ్యంతమగు నగు ధాతురూపము చేరుటచే నేర్పడెనని యెఱుంగునది.

సం౭. ౭౮౨ II విషయము:—ధ్వన్యనుకరణశబ్దములకు విశేషణత్వ వివక్షచే నీ నిగాగమము వచ్చుట గలదు. "ధ్వన్యనుకరణశబ్దంబులు కొన్నిటి కిందు నిగాగమం

బగు. (ఇందున్ = కర్మధారయసమాసమందని యర్థము.) ఉదా:—గనగనని నిప్పులు. (స్వా. ౪ ఆ) తళతళని తరశిమెలు కుల. (౫ ఆ.) నిగనిగని కుందనపుఁ దగడు. (౪ ఆ.) మొ." (ప్రౌఢ. సమా. ౧౨ సూ.).

పయినుదాహరించినవె కాక సంధిప్రకరణమందును ననేకములగు కర్మధారయ సమాసాశ్రయవిధులు వివరింపఁబడెను.

౭౬ విష. ద్విరుక్త టకారవిధి, (కుట్టుసురు.) ౮౭ I విష - ద్రుతలోపవిధి, (ఇది సమాసాశ్రయవిధి యనఁదగును.) ౮౭ IV విష:—సుమాగమవిధి, ౯౧ విష - టుగాగమవిధి, ౯3 విష - రుగాగమవిధి, ౯౪ విష:—పుంప్వాదేశవిధి, ౯౫ విష:—సంధినిషేధవిధి (నుగాగమవిధి), ౯౮ విష:—ప్రాఁతాదిసంధివిధి, మున్నగునవెల్లఁ గర్మధారయ సమాసాశ్రయవిధులె యని యెఱుంగునది.

ద్విగుసమాసము

అద్విత్వం చ భవే ద్విత్వం। దీర్ఘో హ్రస్వశ్చ కేషుచిత్.

సన్నయాథ (విక్రృ. అజం. 3౭ కారి. అహో. 3౧౦. పు.)

౨౮3 విష భూయసీ దేశ్యశబ్దేషు । లోపవర్ణాగమశ్రుతిః ।

(విక్రృ. అజం. ౯౪. కారి. అహో. 3౭౨. పు.)

కల్పతరువు ౨౮3. విష:—ఈ కారికలు ౮౮ I విషయమున వ్యాఖ్యాతము లయ్యెను (౨౧౯. ౨౮౧. ౨౧౫. ౨౧౫ I విష. చూ.). వీనిచొప్పున మూఁడుశబ్ద మునకు సమానాధికరణమగు నుత్తరపదము పరమగునపుడు, బిందుపూర్వక డువర్ణ కమునకు లోపమును బరిశిష్టమగు'మూ' అనుదానికి హ్రస్వమును నుత్తరపదాది హల్లునకు ద్విత్వమును బహుళముగ నగునని గ్రహింపనగును. ఉదా:—మూఁడు +లోకములు = ముల్లోకములు - మూఁడు + ఏఁడుమాఱులు = ముయ్యేఁడుమా ఱులు - పక్షంబున మూఁడులోకములు . మొ - ఇట్టియెడల నేకదేశాన్వయము కవిప్రయుక్తమగుచున్నదని యీవఱకు వివరింపఁబడెను. (౨౭౨ I విష. ౨౬౬ I విష.) బహుళమను వ్యాఖ్యచే - మిశ్రతలో హ్రస్వద్విత్వములు కవిప్రయుక్తములు మాత్రమె సాధువులని యెన్నవలెను.

సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగునపుడు

బాలవ్యా. మూఁడుశబ్దము డుజ్వర్ణంబునకు లోపంబును మీఁది

౨౮3 I హల్లునకు ద్విత్వంబు నగు. ౧౭.

విషయము. మూఁడు+జగములు = ముజ్జగములు, మూఁడు+లోక

ములు ముల్లోకములు.

సంజీవని. ౫౮౩ I విష:—విశేష్యము నుత్తరపదము పరముగుచుండఁగా విశేషణముగు మూఁడుశబ్దపు డుజ్వర్ణంబున కనఁగా బిందుపూర్వక డువర్ణమునకు లోపంబగుననియు (వి స్తర I-II)యుత్తరపదాది హల్లునకు ద్విత్వము గల్గుననియు నర్థము. అట్టి ద్విరుక్తహల్లు పరమగునపుడు పూర్వస్థమగు 'మూ'అను దాని దీర్ఘమునకు బా-సమా-౧౩ సూత్రము చెప్పిన హ్రస్వము కల్గునని సూరి తలంచిన ప్రక్రియ నరయు నది. ఉదా:—మూఁడు+జగములు - మూ+జ్+జగములు = ముజ్జగములు. ఇట్లె యంతటను బ్రక్రియ నెఱ్ఱునది-సూరి యిట్లు హ్రస్వము వచ్చుట సార్వత్రికమని సూత్రించినను నన్నయాథర్వణీయపద్ధతి చెప్పినఁ బండితకవీంద్ర లాక్షణిక ప్రసిద్ధ్యను సారముగ హ్రస్వము కల్గునని యెఱుంగునది. (చూ. ౫౮౦. I విష-విస్తర. ౫౮౦ I విష.)

---

విస్తర I ౫౮౩ I విష:—"కొన్ని పొత్తంబులలో మూలసూత్రంబునందు "డు జ్వర్ణకంబునకు" అని పాఠము గలదు. అయ్యది ప్రామాదికంబు. నకారాది యైన యుత్తరపదంబు పరంబగునపుడు పూర్వపదాంతిమ డకారంబునకు నకారంబగు ఉదా:—రెన్నాళ్ళు (రెండు+నాళ్ళు) మూన్నాళ్ళు (మూఁడు+నాళ్ళు)......" (బా. గు. ప్ర. సమాస. ౧౨ సూ. వ్యాఖ్య.) (ఇట్లు ప్రౌఢ. సంధి. ౧౪ సూత్రము స్వీకరింపఁబడెను.) "కొన్ని బాలవ్యాకరణప్రతులలో డు జ్వర్ణమునకని పాఠమగపడెడి. కాని త్రిలింగలక్షణశేషము ముందుచెప్పినరీతిని డకారమునకని యనుటను (ప్రౌఢ. సంధి. ౧౪ సూ.).........దీనిని డుజ్వర్ణమని ప్రథమైకవచన ప్రత్యయమువలె జిత్తుగా వ్యవహరింప నాధారములు లేమిని.........డువర్ణమను టయే యుచితము.........ఎవరో దిద్దియుందురు........." (బా. సా. వే. సమా. ౧౨ సూ. వ్యాఖ్య. ౩౮౩ పు.) ఇట్టిద్దఱు వ్యాఖ్యాతలును గ్రంథకృత్ప్రయుక్త పాఠమును డువర్ణంబునకని దిద్దివేసిరి. ఏవోకొన్ని బాలవ్యాకరణప్రతులలో "డుజ్వర్ణ" మను పాఠమున్నదననేల? ఎల్లప్రతులలోను 'డుజ్వర్ణ'మను పాఠమె యున్నది. ఏరో యిట్లు దిద్దినాట సాహసము. ఆంధ్రసాహిత్యపరిషత్తువారి యొద్దనున్నట్టియు సూరిగారి జీవితకాలములో ముద్రితమయినట్టియుఁ బ్రథమముద్రణములోను నాయొద్దనున్న ద్వితీయముద్రణములోను డుజ్వర్ణమను పాఠమే కలదు. ప్రథమైకవచనము డుజ్వర్ణకము. ఇది డుజ్వర్ణము. ఖండబిందుసహితముగ లోపించుటకై బా-తత్స-౧౯ సూ-జిత్తు బిందపూర్వంబగునను బాలవ్యాకరణ సంప్రదాయానుకూలముగ సూరి డుజ్వర్ణమని యుపదేశించె ననుటయె సహజము - సత్యము - నిర్బాధము.

ఆంధ్రభాషానుశాసనమున "సంఖ్యావాచక శబ్దము పూర్వమందున్న కర్మ ధారయము ద్విగువనంబడును." సప్తసముద్రములు - ఏడులోకములు........" (ఆం. భా. అ. సమా. 3౫. సూ.) అని సూత్రించియు "కర్మధారయమున మూఁడు లోని డువర్ణమునకు లోపమును ఊకారమునకు హ్రస్వమును మీఁదిహల్లునకు ద్విత్వమును బహుళముగా నగును. ముజ్జగములు......" (ఆం. భా. అ. సమా. ౪౦. సూ.) అని సూత్రించుట సుసంగతముగాఁ గన్పట్టదు. సంస్కృతవ్యాకరణ సిద్ధాంతము చొప్పున సప్తసముద్రములు మున్నగునవి కర్మధారయ సమాసములె యనవలసి యున్నను "ఏఁడుసముద్రములు" మున్నగువానిని నాంధ్రవైయాకరణులు ద్విగువులెయని వ్యవహరింతురు. (విస్తర. I ౨౬౮ V విష) (౨౬౮ V విష.). "ద్విగోరమిశ్రతాయాంతు। ప్రాయ ఏకత్వ మిష్యతే।మిశ్రతాయాం బహుత్వం స్యా। దన్యత్రాపి క్వచి ద్భవేత్త" (౨౮౪ విష.) సుధర్మిణాకారిక చొప్పున "ఏఁడుసముద్రములు - ముల్లోకములు" మున్నగు మిశ్రసమాసములు ద్విగువులని కంఠోక్తముగ నంగీకరింపఁబడిన వసకతీఁదు. సూరి యుపదేశింపకున్నను నీవిధి బహుళమె యనఁ

---

విస్తర II ౨౮౩ I విష:—"రెండు మొదలగు సంఖ్యలు బహుత్వబోధకము లగుటంజేసి.........ద్విగుసమాసమున నుత్తరపద మేకవచనాంతమె యగునని శాసించుట ప్రసక్తమయ్యె........." (బా. సా. వే. 3౪3-3౪౪ పు.) అని యిట్లు పేటికావ్యాఖ్యాత యీ సందర్భమునఁ గొన్నిసంప్రదాయ విరుద్ధవిషయము లను వ్రాసెను. 'ముచ్చిచ్చు' మున్నగుచోట్లు సమాహారద్విగువులనియు, నక్కా రణమున నచట 'మూఁడుచిచ్చుల మొత్తము'అని విగ్రహమునియుఁ దలంపక 'మూఁడుచిచ్చులు'అని యర్థముచేసికొన్నవాఁడగుటచే నీతఁడు వయిరీతిని వ్రాయ వలసినవాఁడయ్యెను. సంస్కృతభాషావాసనచే సమాహారద్విగువునందుఁ బ్రాచీన మహాకవులు "ద్విగు రేకవచనమ్." (౨౬౮ V విష.) అను పాణినిసూత్రము చొప్పునఁ బ్రాయికముగ నేకవచనముగఁ బ్రయోగించుచువచ్చిరి. ప్రాచీనలాక్షణికు లట్లె యనుశాసించుచువచ్చిరి. మిశ్రద్విగువున సమాహారవిగ్రహము సందర్భ పడమింజేసి యద్దాన బహువచనము నంగీకరించిరి. మహత్సంఖ్యావాచకములగు "మువ్వురు - నలువురు" మున్నగువానితుదనున్న ప్రథమాబహువచన రువర్ణకము లోపించుటయు "ద్విగు రేకవచనమ్" "స నపుంసకమ్" (౨౬౮ V విష.) అను ద్విగు సమాసలక్షణములు గల్గుటయు నసంభవమగుటంజేసి మహాకవిప్రయోగదృష్టము కాకుండుటచేత "ద్విగువు మహదర్థఘటితం బదృష్టంబు" (ప్రౌఢ ముక్తలక్షణవివేచ నము ౯౫ పు.) అని త్రిలింగలక్షణశేషమున సూత్రింపఁబడెను.

దగును. హ్రస్వద్విత్వాదులు డుజ్లోపము రాకుండుటకు:—క......ఉ। ద్దామభుజ వీర్యసంపద। తోమూఁడుజగములు నోపుదురు సాధింపన్ (సభా. ౧. ఆ. ౧౧౫) తే-గీ. అనఘ యేము ముప్పూరము మూఁడగ్నులట్లు। .........(సభా. ౧ ఆ. ౧౨౬). చ.........। కమలహితుండు నేనునయి కాచితి మొక్కట మూఁడువర్షముల్। .........(ఆర. ౨ ఆ. ౨౧౭). తే॥గీ మూఁడు లోకంబులందు నెవ్వాఁడు (విరా. ౨ ఆ. ౫౬). ద్విపద - మూఁడుదినంబులు ముక్కంటియచట। లేఁడో... లేమి...(బసవ ౬ ఆ. ౩౭). మఱియు - మ - పదుమూఁడేఁడులు నీవునుం దిరిగి రాఁబాలికపోవచ్చునే (ఉద్యో. ౩ ఆ. ౯౩ ప.) ఇట్టిచోటులందు "పదుముయ్యేఁడులు" అనురీతి రూపములు సమ్మతములు కావనియు నెన్నఁదగును. డుజ్లోపహ్రస్వ ద్విత్వములు వచ్చుటకు:—శా. ముల్లోకంబుల మూర్తులన్ బటములన్ ముద్రించి—(ఉ-హరి. ౫. ఆ. ౧౩౫). ఉ......భీము కొంచి ము। చ్చిచ్చును నేర్చునట్టులుగ (భీష్మ. ౨ ఆ. ౨౭౭) ఆ-వె. పార్షతుండు శక్తిఁ బరఁగింప నతఁడు ము। త్తునియఁ జేసె మఱియు ద్రుపదసుతుఁడు (భీష్మ. ౨ ఆ. ౫౩ ప.) క.........పశువులు మున్నూ। అలఘు యశోమహిత.........(అశ్వ. ౪. ఆ. ౧౮౧ ప.) ద్విపద - సల్లవో బసవయ్య ముల్లోకవంద్య (బసవ. ౧ ఆ. ౬౦౭) (సల్లవో = ఔరా) ముప్పూట నిమ్మార్గమునఁ జరింపంగ (బసవ. ౬ ఆ. ౧౩ ప). ఉ. దక్షిణ యిచ్చె ముజ్జగము దానగుణప్రవణుం డతండు.........(కాశీ. ౪ ఆ. ౧౭౯).

ఈ డుజ్లోప హ్రస్వ ద్విత్వములు కొన్నియెడల నిత్యముగ వచ్చుటయుఁ గలదు. "౧౬. ముయ్యేడ్వాదులందు హ్రస్వ ద్విత్వంబులు నిత్యంబులు. ఉదా:— రాముఁ డలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ। ప్రీతిన్ వైరిధరాతలేశ్వరులఁ జంపెన్ బల్వురన్ (ఆది. ౧ ఆ. ౭౯.) క. ముయ్యేడుమార్గణంబుల (రా. యు. కాం.) సీ. దీని ముమ్మడుగగు; గణము (ఆది. ౧ ఆ. ౮౧ ప.)" (ప్రౌఢ. సమా. ౧౦ సూ.) ముయ్యేడ్వాదులు మధ్యమపదలోపసమాసములు - మూఁటిచే గుణితమగు నేడు = మూఁడు+ఏడు = ముయ్యేడు = ఇరువదియొకటి.

<table>
<tr><td>నన్నయా</td><td>ద్విగౌ రమిశ్రతాయాంతు। ప్రాయ ఏకత్వ మిష్యతే</td></tr>
<tr><td>థర్వణీయము.</td><td>మిశ్రతాయాం బహుత్వం స్యా। దన్యత్రాపి క్వచిద్భ</td></tr>
<tr><td>౨౮౪ విషయము.</td><td>వేత్ (వికృ. హలం. ౧౬-౧౭ కారి. అహో. ౪౩౧ పు.)</td></tr>
</table>

కల్యాణిరువు. ౨౮౪ వివ:—ద్విగౌః = సమాహారద్విగువునకు, అమిశ్రతాయాన్ = మిశ్రత లేనపుడనఁగా నాచ్ఛికసమాసమందు - ప్రాయః = తఱుచుగా,

ఏకత్వమ్ = ఏకవచనము, ఇష్యతే = సమ్మతమగుచున్నది. సంస్కృతమునందలి "ద్విగు రేకవచనమ్" అను సూత్రముచొప్పున సమాహారద్విగువునఁ గల్గు నేకవచన మాచ్ఛికసమాసమందుఁ బ్రాయికముగఁ గల్గుననియుఁ బ్రాయికమగుట నాచ్ఛిక సమాసమందును గ్వాచిత్కముగా బహువచము వచ్చుట గలదనియుఁ దాత్పర్యము. ఉదా:—ముచ్చిచ్చు - (మూఁడగ్నుల సమాహారము) నల్గడ = నాలుగుదిక్కుల మొత్తము - నల్గడలనియుఁ గ్వాచిత్కముగాఁగలదని యెఱుంగునది. ఇట్టిది ద్విగుమాత్రమే. సమాహారము కానేరదు. ముచ్చిచ్చు మున్నగుచోటులందు, మూఁడుశబ్దమునకు సబిందుక డులోపము, లుప్తశేషమునకు హ్రస్వము, పరహల్లునకు ద్విత్వమును, (౨౮౩-౨౮౩ I వివ.) (కవిప్రయుక్తస్థలములందు మిశ్రతలోఁ గల్గును) గల్గునని తెలియునది. మిశ్రతాయామ్ = మిశ్రద్విగువునందు, బహుత్వం స్యాత్ = బహువచనమె యగును. ఉదా:—ముల్లోకములు - మువ్విధములు - నాల్గుదిక్కులు - అన్యత్రాపి = సమాహారద్విగుసమాసేతరమగు సమాహారద్వంద్వము నందును, క్వచిద్భవేత్ = క్వాచిత్కముగ నేకవచన మగును - ఉదా:—"తరూ డుసీరకై కాంచన మడిగి ఇత్యాదయ స్త్విక్కయజ్వాదికవిప్రయోగా స్సానవః" (ఆహో. ౪౩౨ పుట.) ప్రయోగములు:—ఆచ్ఛిక ద్విగువునందు:—మ...తూలశకలాకారంబులై వారిద। ప్రతతుల్ సాల్పడి నల్గడన్ జెదరఁగా......(ఆది. ౨ ఆ. ౯౨.) ఇట సమాసాశ్రయవిధి సిద్ధము గసడదవాదేశము. (౭౮ IV. ౭౯ వివ.) చ.........భూరిశిఖావళి ఖాండవంబు న। ల్గడఁ గడుఁ బర్వఁగాఁ బెఁగి కాల్పఁ దొడంగె (ఆది. ౮ ఆ. ౨౪౯.) ఉ. చిచ్చున నేయి వోసిన విశేషము దోఁపఁగ భీము నొంచి ము। చ్చిచ్చును నేర్చునట్టులుగఁ జేసెఁ బదూర్జితసేన నంత... .(భీష్మ. ౨ ఆ. ౨౭౭.) చ...రక్కజం। బుగ వెస మాగధుం డని మె భూస్థలి నుయ్యగ పీనఁగుం బడన్ (భీష్మ. ౨ ఆ. ౨౦౯.) ఆ. వె. పార్షతుండు శక్తిఁ బరఁగింప నతఁడు ము। త్తునియఁ జేసె.........(భీష్మ. ౨ ఆ ౪౩ ప.) చ.........త్రిగర్తనా। థులు సరుదెరఁ దద్రథముతో గదియించి.........(విరా. ౩ ఆ. ౨౦౦) చ. అనుటయు భీతి వేఁడికొని యావులు వేయును నెడ్డు లాఱునూ। ఱును రథముల్ శతంబును......దంతిసప్తకముం గొని కాంతిఁ బొందవే। యసనను మానఁడయ్యె... ......(కర్ణ. ౨ ఆ. ౯౧ ప.) (ప్రాసస్థలము.). క. నలుగాలివాన, బతుల। ... .........। పోలిచెం బశువులు మున్నూ। ఱలఘు యశోదహిత........ ... (అశ్వ. ౪ ఆ. ౧౮౧ ప.) ఉ.........నల్దెసఁ దూలి పాఱఁగన్ (హరి. ఉ. ౨ ఆ. ౧౨౮.) ఆచ్ఛికమునబహుత్వము:—చ.............నల్। గడలను విస్ఫులింగములు గప్పఁగ (ఆది. ౨ ఆ. ౧౪.) క. ఉఱుముచు మెఱుముచుఁ బిడుగులు। వఱలఁ

గ నలుగడలఁ బడ నవారిత వృష్టుల్ । గుఱుకొని..... ...(ఆది. ౮ ఆ. ౨౭౦.) క. పెలయఁగ నశ్వమేధం । బులు వేయును నొక్కసత్యమును నిరుగడలం । దులనిడి తూపఁగ......(ఆది. ౪ ఆ. ౯౫.) మిశ్రద్విగువున బహుత్వమునకు:—శా. ఏడ క్షౌహిణు లెన్నఁ బాండవబలం । బు......(ఆశ్ర. ౧ ఆ. ౭౦.) తరల - పదిదినం బులు భీష్ముఁ డాహవభారకుండు.........(ఆశ్ర. ౧ ఆ. ౬౮.) ఉ.......... । ఆదిఁ బొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వ విశారదు లందు వి । ద్యాదయితుం డొనర్చె...
..... (విరా. ౧ ఆ. ౬ ప.) శా. ముల్లోకంబుల మూర్తులం బటముల న్ముద్రించి (ఉ. హరి. ౫ ఆ. ౧౩౫.) తే. గీ. ఆక్కుమారుండు నలుదిక్కులందుఁ గాంచు (మువ్విధములు మొదలగుచోటులందువలెనె 'నాల్గు'నకు 'నలు'నిల్చెను) (నైష. 3 ఆ. ౮౮.) (విస్తర). ౨౨౦ మొ. ౨౨౪ విషయపుఁ గల్పతరువునఁ పదునొకండు - పండ్రెండు - పదుమూఁడు - పదునాలుగు - పదునేను - పదునాఱు - పదునేడు - పదునెనిమిది. పందొమ్మిది - ఇరువది - ముప్పది - నలువది - ఏఁబది - అఱువది - డెబ్బది - ఎనుబది - తొంబది - మున్నగు మధ్యమపదలోప (౨౬౮ IV విష.) స్థలములందలి సమాసాశ్రయవిధులు వివరింపఁబడెను. ఆంధ్రలాక్షణికుల పద్ధతి చొప్పున వీనినైతము ద్విగువులనిన. ననవచ్చునని తలఁచి యిచట బ్రసంగింపఁ బడెను.

---

విస్తర. ౨౦౭ విష:—త్రిలింగలక్షణ శేషమునం దీ సందర్భమునఁ గొన్ని విశేషములు సూత్రింపఁబడెను:—"ఒక్కచో ద్విగువు మిశ్రం బేకవచనాంతఁబు నగు- క.........శివుఁడును..........న । ల్దిక్కులిందిరిగి నిలిచి యావురించుచు నుండెన్ (ఉ. హరి. ౬ ఆ. ౧౬౮) ఉ..........అ । స్తోకనిజప్రభాములు సూపెడి గద్దియ మీఁద నెక్కి ముల్లోకము దాన యేలుగతి......(పారి. ౧ ఆ.) ముమ్మువార్త మునకు (జై. ౭ ఆ.)" (ప్రౌఢ. సమా. ౨౦ సూ.) "ప్రాయో లుక్కగచజతదపయ వామ్. (౧. 3. ౮) అసంయుక్తానా మనాదౌ వర్తమానా నామచః పరేషాం కా దీనాం ప్రాయో లుక్స్యాత్" (షడ్భా. ౧౧.పుట.)అనుచొప్పునఁ గల్గెడి కకారాదుల లోపము ప్రాకృతములలోఁ బైశాచియఁదు "ప్రాయో లుక్కాది ఛల్షట్ ఛమ్యన్త సూత్రోక్తమ్ (3. ౨. ౬3) ప్రాయో లుక్కగేతి సూత్ర మారభ్య ఛల్షట్ఛ మ్యన్త సూత్రపర్యన్తం యే విధయః ప్రాకృతే తే పైశాచ్యాం నభవన్తి (షడ్భా. ౧౯౦. పు.) అనుచొప్పునఁ గల్గనేరదుగాన - లోకము జగము మున్నగునవి పైశాచి ప్రాకృతసమత్వమున నాచ్ఛికములై ముల్లోకములు ముజ్జగములు మున్నగువాని కవిశ్రద్విగుత్వమును ఘటింపఁగలవనుచు నాచ్ఛికమానుఁడుసూత్రమె ప్రాప్యద్వి

బాలవ్యా. ద్విగువున కేకవచనంబు ప్రాయికంబు గానగు, మిశ్రంబు
నకుఁ గాదు. ౧౮.

౨౮౪ I వి. ముచ్చిచ్చు - ముక్కారు - ముప్పాతిక - ముత్త్రోవ-
ముద్వీధములు.

**సంజీవని** ౨౮౪ I విష:—ఆచ్ఛికద్విగు సమాసకము ప్రాయికముగా నేకవచనాంత మగును. మిశ్రద్విగుసమాసము బహువచనాంత మగును. ముచ్చిచ్చు = మూఁడగ్నుల సమాహారము - ముక్కారు = మూఁడుకారుల మొత్తము. ముప్పాతిక = మూఁడుపాతికల సమాహారము. ముత్త్రోవ = మూఁడుత్రోవల సమాహారము. (ముత్త్రోవద్రిమ్మరి = త్రిపథగ) ఇవి యాచ్ఛిక ద్విగువున కుదాహృతులు - ముద్వీధములు - ఇది మిశ్రద్విగువున కుదాహరణము. ఈయుదాహరణము లన్నిటియందును సమాసపూర్వపదమగు మూఁడుశబ్దమునకు డుజ్‌లోపము - లుప్తశేషమునకు హ్రస్వము నుత్తరపదాది హల్లునకు ద్విత్వమును బా-సమా-౧౩-౧౪-౧౭. సూత్రములచొప్పున నయ్యెనని యెఱుంగునది.

బహువ్రీహి

సాదృశ్య దాభాస బహువ్రీహిః। ప్రథమాది ప్రయోగతః (విక్ర. హలం. ౧౯ కా. అహో. ౪౩౬).

---

త్వములు గల్గునను తలంపునఁ గావలయు నహోబలపతి యీక్రిందిరీతిని వ్రాసెను—"ముల్లోకంబులు ముజ్జగంబులు ఇత్యత్ర అమిశ్ర సమాసత్వ మపి సూపపాదమ్. కథమితి చేత్—పైశాచీ సమత్వేన భవతి తత్ - నచ ప్రాయో లుక్క-గ చజతదపయవామితి ప్రాకృతసూత్ర స్యాత్ర మహిమ్నా-న ప్రాయో లుక్కాది ఛల్ పట్ ఛమ్యస్త సూత్రోక్తమితి తన్నిషేధాత్" (అహో. ౪౩౨. పు) ఇది సరికాదు. లోకము మున్నగు వికారలేశము లేని ప్రాకృతపదముల కాచ్ఛికత్వ మాంధ్రలాక్షణిక సమ్మతము కాదు. 'జగము' సంస్కృతసమము - జెగము=తద్భవము గాన 'ముజ్జగము' అనునది యాచ్ఛికసమాస మనుట సమ్మత మనఁదగును. "వారార్థకంబు లద్వ్యర్థకంబులు తలఁచుగ సంఖ్యాపూర్వకంబు లగు - ఉదా:—ఒకతడవ - ఒకతూరి. ఒకతేప - ఒకమాటు - రెండుతడవలు.........అద్వ్యర్థకంబు లనుటచే తేపతేపకు. తలఁచుగ ననుటచే తడవకు ఇత్యాదు లెఱుంగునది." (ప్రౌఢ. సమా. ౨౧. సూ.) ప్రౌఢ - సమా - ౨౨. మొ - ౨౬ వ - గల సూత్రములలోని సంఖ్యావాచకముల సమాసముల నాశ్రయించిన విధానములెల్ల విస్తరము ౨౨౨ విషయమున వివరింపఁబడెను.

కార్యా ఔపవిభక్తికవ దన్తరిధయశ్చ. (ఆం. చిం.
నన్న సూ. హాలం. ౧౬. కారి. అహో. ౪౩౧. పుట.)
౨౮౫ విషయము ఉత్వ మిత్వం తథ్థే వాత్వం । సమాసే మతు ఖర్థకమ్
(వికృ. హాలం. ౨౧. కారి. అహో. ౪౪౪. పు.)
క్వచి దన్తిరు వర్ణస్య । సమాసాన్తత్వ మిష్యతే
(వికృ. హాలం. ౨౨ కారి. అహో. ౪౪౬ పుట.)

కల్పతరువు. ౨౮౫ విష:—ముక్కంటి (మూఁడుకన్నులుగల శివుఁడు) వేవెలుఁగు (వేయి కిరణములుగల సూర్యుఁడు) మున్నగు సమానాధికరణ బహువ్రీహులును కవ్వడి (౨౮౦ I విష. చేతుల కవయందు వడిగల యర్జునుఁడు) మున్నగు క్వాచిత్క-వ్యధికరణ బహువ్రీహులును సంస్కృతమందువలెనే యచ్చాంధ్రము నందును గలవు. బహువ్రీహిఘటితపదములు సాధారణముగా స్త్రీసమములె యై యుండును. "ఆనందపు రూపుని విష్ణుని" అనుజానివంటి సాధ్యసాంస్కృతిక బహువ్రీహు లుండనేరవు. 'ఆనందపురూపము' అనియే యచట 'గవిప్రయుక్తము. (శాంతి. ౨ ఆ. 30). అట్లె మిశ్రబహువ్రీహియు నుండనేరదు. 'కలికంఠుఁడు ఇత్యత్ర మిశ్ర బహువ్రీహిః' (౪౩౬ అహో.) అను కవిశిరోభూషణవాక్యము సరి కాదు. అందలి ఠ కారమును నిర్వహించు ప్రయోగము లేదు. "కలికంటు - సంబోధనము - కలికంటూ" అను రూపములె యచట సాధువులుగ నంగీకరింప నగును (౬3 I విష. చూడు.)

ఆభాసబహువ్రీహులు త్రివిధసాధ్యసమాసములు నుండవచ్చును. ఆభాస బహువ్రీహి నుపదేశించుచున్నాఁడు:—ప్రథమాది ప్రయోగతః = తత్పురుష మున శేషషష్ఠీస్థానమున నిల్చు - ప్రథమా ద్వితీయాకార విభక్తుల ప్రయోగము మూలమున (౨౭౦ విష.), ఆభాసబహువ్రీహిః = బహువ్రీహ్యాభాస ము, స్యాత్ = అగును. బహువ్రీహ్యర్థము లభించుననియు నది బహువ్రీహిలక్షణ లక్షితము కామింజేసి బహువ్రీహ్యాభాస మనిపించుకొనుననియుఁ దాత్పర్యము. 'షష్ఠీ భవే ద్ద్వితీయా తుల్యా తత్పురుష సంస్థితా నామ్నామ్......క్వచి దన్య విభక్త్యర్థే । ప్రథమాపి ప్రదృశ్యతే" అను కారికలచొప్పున (౨౭౦ విష.) వచ్చు ద్వితీయా - ప్రథమా విభక్తుల ప్రయోగమున బహువ్రీహ్యర్థము భాసించు టయుఁ గలదని పర్యవసితార్థము - ఉదా:— పీతాంబరముయొక్క + వాఁడు = పీతాంబరమున్ + వాఁడు = పీతాంబరమువాఁడు = పీతాంబరము గలవాఁడు. ఇరువదింటియొక + రెండు = ఇరువది+రెండు = (ఇట షష్ఠి

ప్రథమాకారమున నిల్చినది.) ఇరువదిరెండు = ఇరువది యధికముగఁగల రెండు. మూఁడుకన్నులవాఁడు = (ముక్కంటి) మొ. ఇట్టిచోటులందు వాఁడుమున్నగు తచ్ఛబ్దార్థకములకు సార్థబోధమందే తాత్పర్య మనఁగా షష్ఠ్యర్థరూపసంబంధమె యర్థమని యెఱుంగునది. (చూ. ౨౭౧ విష. ౨౭౧ I విష.) ఉ. నరుఁడీమానవు వాఁ డనంగవశమే (ఉద్యో. ౪ ఆ. ౨౯౭) హార్ష్య నిమానసంహాతులదాని (ఆర. ౧ ఆ. 3౪౭). "త్రినేత్రః - పీతామ్బర ఇత్యాద్యనుసారేణ మూఁడుకన్నులవాఁడు - పీతాంబరమువాఁడు - పట్టుపుట్టముదొర-ఇత్యాద్యా ఆభాసబహువ్రీహయః పుంసి. స్త్రీత్వేతు మూఁడుకన్నులయది - పట్టుపుట్టమునది - ఇత్యాద్యాః - స్యా దాభాస బహువ్రీహిః। ప్రథమాది ప్రయోగత ఇత్యర్థకర్త్రణః - ప్రథమాన్త శ్చాత్ర తచ్ఛబ్ద శ్చాన్యశబ్దశ్చ. వేఁడివెలుఁగు ఇత్యాదావపి షష్ఠ్యర్థవివక్షాయాం ప్రథమాంత ప్రయోగ ఇష్టఏవ వేఁడివెలుఁగువాఁడు ఇత్యాది" (అహో. ౪3౬). ఇందలి 'ప్రథమాన్త శ్చాత్రేత్యా ద్యహోబలవాక్యములు ప్రామాదికములు. 'వాఁడు - అది' మున్నగు తచ్ఛబ్దార్థకములుగాని యట్టివానివలె నిల్చిన యన్యశబ్దములుగాని ప్రథమాంతములెగాని యుండు ననుట సరికాదు. "పీతాంబరమువానిన్—పీతాంబరము దానిచేతన్ - పట్టుపుట్టము దొరకొఱకున్" మున్నగుచోటులందు మాత్రము బహువ్రీహ్యర్థ సిద్ధి లేకపోదుగదా - మఱియు వాక్యాన్వయయోగ్యముగ నుత్తర పదముం దేవిభక్తి నిల్చిన నేమి? దానిమూలమున బహువ్రీహ్యర్థ మచట లభించు చున్నదనుట కేవలము నసంగతము కాదా? అచటి శేషషష్ఠీ సమాసాను గ్రహమునఁ గదా బహువ్రీహ్యర్థసిద్ధి గలుగుచున్నది!

కార్యాణిత్యాది:—ఔపవిభక్తికవత్ - టి - ంటి - తి-ఇ-మున్నగు వానివంటి కార్యాః = కార్యములు, అన్తవిధయశ్చ = సమాసాంత ప్రత్యయములును నగు చున్నవి - టి ంట్యాదులు విభక్తులు పరముగునపుడు వచ్చుట - సమాసపూర్వపదము లందు నిల్చుట మాత్రమె కాక సమాసాంత ప్రత్యయములును నగుచున్న వనితాత్ప ర్యము. ఉదా:—మూఁడు+కన్నులుగలవాఁడు = ముక్కంటి. (౨౭3 విషయము చొప్పున నిచట సైతము మూఁడుశబ్ద డుజ్వర్ణలోపాది కార్యములు గల్గును). మూఁడు+కన్ను = ముక్కన్ను + ంటి = ముక్కంటి మొ.

'ఔపవిభక్తికసంజ్ఞాః......తేహి విభక్తౌ సమాసేచ' (౨౨౭ మొ. ౨33 వ. విషయ.) అను చింతామణిచొప్పున - "కంటిచేతన్"మున్నగుచోట్ల విభక్తిపరకత్వ మందును - 'కంటిపొర - వేఁపచెట్టు' మున్నగుచోట్ల సమాసపూర్వపదమందును నౌపవిభక్తికస్థితి యుపదేశింపఁబడెనుగానఁ బ్రకృతసూత్రముచే సమాసోత్తరపదము

తుదిని నిల్చు నౌపవిభక్తికవర్ణములంటి సమాసాన్తప్రత్యయము మున్నేశింపఁబడెనని తలంపవలెను. 'ఔపవిభక్తికవత్'అని ప్రాయికాభిప్రాయమునఁ జెప్పఁబడినను నౌపవిభక్తికముల వంటివి కానట్టి సమాసాన్తవిధులును గలవని యెఱుఁగునది. "నాలుగు+వాయి = నలువా+అ = నలువ." అనుచో 'యి' వర్ణములోపించినది. పిదప మత్వర్థీయమగు 'అ'త్వమునిల్చినది. 'వేవెలుఁగు చలివెలుఁగు' మున్నగు వానిలో సమాసాంత ప్రత్యయము నిల్వలేదు.

ఉత్వ మిత్వ మిత్యాది:—ఉత్వమ్ = 'ఉ' అనునదియు, ఇత్వమ్ = 'ఇ' అనునదియు, అత్వమ్ = 'అ' అనునదియు సమాసమునందు, మతుబర్థకమ్ = అస్త్యర్థకములుగాఁ దుదిని నిల్చును. అనఁగా 'అ - ఇ - ఉ' అనునవి మతుబర్థకములయి సమాసాన్తమున నిల్చునని యర్థము. ఉదా:—అలరు+విల్లుగాఁగలవాఁడు—అలరు+విల్లు = అలరువిల్లు+తి+ఉ = అలరువిల్తుఁడు. కమ్మవిల్తుఁడు - పచ్చవిల్తుఁడు మొ. అలరువిలుకాఁడు మున్నగుచోటులు నిట్టివె యన్నను ననవచ్చును. సర్వధని మున్నగు సంస్కృతసమాసములందును నిట్లు మత్వర్థీయములు నిల్చుట గలదు. "చౌదంతీతి (చతుర్దన్తీ) సిద్ధావస్థయా నిష్పన్నం రూపమ్. సుకేశీ - హిరణ్యకేశీ త్యాది భాష్యవచనాత్—నకర్మధారయా న్మత్వర్థీయో బహువ్రీహిరితి నిషేధో ననిత్యఇతి చతుర్దన్తీతి రూపమపి సాధ్వీతి వ్యాకరణపారీణాః. అతఏవ కోకప్రీతిచకోర పారణపటుర్జ్యోతిష్మతీ లోచనే ఇత్యాదీని మహాకవి (మురారి) వచనాని సామంజస్యంలభన్తే" (అహో. ౪౩౭) పయిరీతిని 'అలరువిల్తుఁడు' మున్నగుచోటులందు సమానాధికరణ బహువ్రీహియందు 'తి' అనుసమాసాంత ప్రత్యయముమీఁద మతుబర్థకమగు 'ఉ' ప్రత్యయము నిల్చినది - తమ్మి+చూలు = (పద్మము జననమూలగర్భముగాఁ గలవాఁడు) 'తమ్మిచూలు' దీనిపై మత్వర్థీయమగు 'ఇత్వము' నిల్వఁగా 'తమ్మిచూలి' యని యేర్పడును - నాలుగు+వాయి = (నాలుగుముఖములు గలవాఁడు) నలువా+అ = నలువ. దీనిపై మత్వర్థీయమగు 'అత్వము' నిల్చినది. (నాలుగు = నలు - ఆంధ్ర విష.)

క్వచిదిత్యాది - క్వచిత్ = ఒకానొకప్పుడు, అన్తిమవర్ణస్య = శబ్దముతుదివర్ణమునకే, సమాసాన్తత్వమ్ = సమాసాన్తమందునిల్చు మత్వర్థీయ ప్రత్యయత్వము, ఇష్యతే = అంగీకృతమగుచున్నది. ఉదా:—'చౌదంతి' అనుశబ్దముతుది 'ఇకారము' సమాసాన్తప్రత్యయమని తాత్పర్యము. "చౌదంతీత్యత్ర......... దన్తీతి సిద్ధావస్థయా నిష్పన్నం రూపమ్" (అహో. ౪౩౭ పుట.) 'ఇట్లే—'రాజభారి' శబ్దభవమగు రాయభారి మున్నగునవి దీనికి లక్ష్యములనఁదగును.

అహోబలపతి యీసందర్భమున భిన్నరీతిని వ్యాఖ్యచేసెను. "ఆదిశబ్దేన తావి మొల్ల (తావి+ఇ = తావిగల మొల్ల) పువ్వునీళ్ళు (పువ్వు+ఉ = పువ్వుగలనీళ్ళు)ఇత్యాద్యా మతుప్ సమాసా గ్రాహ్యా ఇతి సరస్వతో క్తమ్. "ఉత్వ మిత్వం తథైవాత్వం। సమాసే మతుబర్థక మితి ఉకారాదే ర్మతు బర్థకతా సమాసేఽస్తీతి ద్వితీయాచార్య సిద్ధాన్తాత్. తత్ర మతుబన్తేన సహ కర్మధారయో బోధ్యః, రవ్వమానిసి ఇత్యాదిక మకారోదాహరణమ్ (రవ్వ+అ+మానిసి = రవ్వమానిసి=రవ్వగలమానిసి)"(అహో. ౨౨౨ పు.) "నడగుఱ్ఱము ఇత్యాదౌ అకారాదేః మతుబన్తత్వేనవా నిర్వాహః (నడ+అ = నడకగల)" (అహో. ౨౨౭ పుట.)సమాసమధ్యమునఁ బూర్వపదాంతిమ వర్ణమునె ప్రత్యయముగాఁ గల్పించి యున్నరూపునే సాధించి దానికిమతుబర్థమును గల్పించుట యనావశ్యకము. అచట షష్ఠీ సమాసముతోనే యట్టియర్థమును సంపాదింపవచ్చును. (౨౮౫ వి.) (౨౭౦ వి.) (౨౯౧ విప.). రవ్వయొక్క మానిసి = రవ్వగలమానిసి = రవ్వమానిసి. "కుసుమరసపక్షే పువ్వునీరు ఇత్యత్ర షష్ఠీసమాసో బోధ్యః" అని యహోబలపతియే వచించెను. (అహో. ౨౨౨ పు.) సమాస పూర్వ పదాంతము సహజవర్ణమును సమాసాశ్రయవిధిసిద్ధప్రత్యయముగ బయిరీతిని వచించి నట్లె సమాసోత్తరపదాంతిమసహజవర్ణమునుసమాసాంత ప్రత్యయముగ, నీక్రిందిరీతి నసంగతముగ నుదాహరించి "క్వ చిదంతిమవర్ణస్యే"త్యాది కారికకు లక్ష్యములను గల్పించికొనెను. "వేఁడివెలుఁగు - ఉకార స్సమాసాంతః - క్వచి దన్తిమవర్ణస్య। సమాసాన్తత్వ మిష్యత ఇత్యర్థర్వణః" (అహో. ౨౨౬ పు.)

"ముజ్జగంబుల చూలిబొడ్డువాఁడు ఇత్యాదయః కవీనాంవాచః - ఉకారాంతపారే త్యధర్వణవచనానురోధేన ఉకారఏవ (చూలుశబ్దముతుది 'ఉకారమే') సమాసాన్త ఇతి ధ్యేయమ్" (అహో. ౨౨౬ పు.) "రాయబారులు ఇత్యత్రాధర్వణోక్త మిత్వమ్"(అహో. ౨౩౬) అని వేఱొకచో నహోబలపతి వ్రాసెను. (రాయబారము+ఇ = రాయబారి). ఔపవిభక్తిక 'వదన్త విధయశ్చ' అను చింతామణి సూత్రమున కుదాహరించుటలో నహోబలపతి "అలరువిల్తుఁడు ఇత్యత్ర తకారః. ముక్కంటీత్యత్ర బిన్దుపూర్వక షికారః.........నెత్తమ్మిచూలీత్యాదౌ ఇకారః........." (అహో. ౨౨౬ పు.) అనురీతి నుదాహరించెను - ఇందలి తకారమౌపవిభక్తికము కాదు. 'త' అనునది యౌపవిభక్తికము. ఇట్లె మఱికొన్ని విధములగు నుదాహృతులు నసంగతముగాఁ జూపఁబడెను.

బాలవ్యాకరణ విభక్తుము. — స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపబడు. ౬.

౭౮ 1 ... ముక్కంటి - వేగంటి - చలివెలుఁగు - వేవెలుఁగు -

మోటబరి. ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు
గ్రాహ్యంబులు.

సంజీవని. అం౹౹ I వివ:— ముక్కంటి = మూఁడుకన్నులు గలవాఁడు = శివుఁడు, వేగంటి = వేయికన్నులు గలవాఁడు = ఇంద్రుఁడు. (బా. సమా. ౨౦ సూత్రముచొప్పున 'యి'వర్ణలోపము) చలివెలుఁగు=చల్లని కిరణములు గలవాఁడు = చంద్రుఁడు. వేవెలుఁగు = వేయి కిరణములు గలవాఁడు = సూర్యుఁడు. "మోట బరి. ద్వి - వి. బరువుమోసెడియెద్దు". (శ - ర) ఇది ద్వ్యయమునటచే బరిశబ్దము భారి శబ్దభవమె యని శబ్దరత్నాకరాశయము నెన్నఁదగును-కావున, "మోటయొక్క (ఎడ్లను గట్టి త్రోలుచు నీరెత్తెడి యంత్రవిశేషము) భారముఁగలది" యని వ్యధికరణ బహువ్రీహి విగ్రహము సూరి కభిప్రేతమా యని యాలోచింపవలసియున్నది. (విసర.) మోటబరిశబ్దమునకు మహాకవిప్రయోగము కన్పట్టలేదు. పూర్వోత్తర పదంబులు రెండును నాచ్ఛికములె స్త్రీసమములె యైనను నెల్లయెడల బహువ్రీహి కానేరదు - ప్రయోగానుసారముగనే గ్రహింపవలయును. 'తెల్లకంటి' మున్నగు రీతిని యథేచ్ఛముగాఁ బ్రయోగింపరాదు. పూర్వపదము స్త్రీసమము కాకున్నను 'మచ్చెకంటి' మున్నగునవి ప్రయుక్తములగుచున్నవి. "మచ్చెకంటి - ద్వి - వి- (మచ్చెము+కన్ను) ౧ చేఁపలవంటి కన్నులుగల యాఁడుది. ౨ ఆఁడుది - మత్త - మచ్చెకంటి మముందలంతువె మానసంబున (కళా. 3 ఆ.)" (శ - ర). క...... ఆనం। దపురూపుని విష్ణుఁ దలఁచెదను మోహోత్థున్ (శాంతి. ౨ ఆ. 3౦.) 'ఆనందపు రూపుని' అనునది (బహువ్రీహి) ముద్రణ స్ఖాలిత్యము. 'ఆనం। దపురూపము విష్ణుఁ దలఁచెదను' అనుపాఠము కవిప్రయుక్తమునఁదగును. ప్రయోగములు:—

---

విసర. అం౹౹ 1 వివ:—"మోటగు బరువు గలది యనుట. 'మోటు=బరువు' బరువుశబ్దమునందలి వువర్ణకము లుప్తమై స్త్రీసమంబై బహువ్రీహిని బ్రవేశము నందె. తన సిరేఁడును స్త్రీసమములె, సమాసాంతకార్య మివర్ణము తుదినిగల్గి మోటబరి యయ్యె, మోటుశబ్దమునందలి టువర్ణము సమాసమున టవర్ణమయ్యెను. లేదా 'మోట'యను వ్యవహారసిద్ధశబ్దమనియేని యనఁదగును" (బా. సా. వే. 3౨౭-3౨౮ పు.) (ఈ కల్పనమునకు బా. గు. ప్ర. ౨౬౪ పుటలోని గ్రంథము మూలము.) బరువుశబ్దములోనిది వువర్ణకముకాదు. 'బరువు' అనునది యే స్త్రీసమము. శబ్దరత్నాకరమున మోటశబ్దమునైతము కలదు. 'మోట - మోటు'అను రెండిటికిని 'దిగ్భ్రమయయిన' యనునర్థము కానరాదు.ఇవర్ణలోపాదికమునకు యుక్తి కన్పట్టదు.

క. మంటి పారుదేవా మంటం।గంటి సుమాధీశు నసురకంటకు పారు ము। క్కంటిఁ గఱకంటుఁ జూడం। గంటిఁ గృతార్థుండ నైతిఁ గడుఁ బుణ్యమునన్ (ఆర. ౧ ఆ. ౩౩౮.) క. ఎఱు కని యెఱుఁగక।......। కఱకంటా క్షమియింపుము...... (ఆర. ౧ ఆ. ౩౨౬.) తరల.........। విడిచి పుచ్చుము యేను గృష్ణుఁడ వీఁడు భీముఁడు వాఁడు గ। వ్వడి.........(సభా. ౧ ఆ. ౯౫౨.)

బాలవ్యా ౨౮౫ IIవి. ఒహుబ్రీహిని సమాసాంత కార్యంబులు చూపట్టెడి ౨౨.

ముక్కంటి - కడలిరాచూలి. నలువ - గట్టువిలు తుఁడు.

సంజీవని ౨౮౫ II వి.ప:—ముక్కంటి = శివుఁడు, కడలిరాచూలి = కడలిరా = సముద్రము, చూలు = జననస్థానముగు గర్భముగాఁగలది = లక్ష్మి. నలువ = నాలుగు వాతులు (నోరులు) గలవాఁడు = బ్రహ్మ. గట్టువిలుతుఁడు = గట్టు = మేరు పర్వతము, విల్లుగాఁ గలవాఁడు = ఈశ్వరుఁడు.

చింతామణిసూత్రములోని 'ఔపవిభక్తికవత్' అనుదళముపేక్షితమయ్యెను-కాని తెలుఁగున వచ్చు సమాసాంత ప్రత్యయములు ప్రాయికముగా నౌపవిభక్తిక వర్ణములవంటివే కాన నట్లుపేక్షించుట సరికాదు - సూరి యట్లుగ నౌపవిభక్తికముల వంటివను దళము నుపేక్షించుటచేత 'ముక్కంటి'అనుచో "ఆచ్ఛికము ౩౩ చే నా 'టి' వర్ణముఁకుముందు నిత్యముగ నిండుసున్నయగును" (బా. సా. వే. ౩౮౮ పు. బా. గు. ప్ర. ౭౭౮ పు. ద్వి. ము.) అని వ్యాఖ్యాతలిద్దఱును వ్రాసిన నిండుసున్న లభింపనేరదు. బా. ఆచ్ఛి. ౩౩ సూత్ర మౌపవిభక్తిక టివర్ణ మూత్ర విషయకము-అట్లుకానిచో 'అచటివారు' మున్నగుచోటులందును నిండుసున్న వచ్చి 'అచంటి వారు' మున్నగు ననిష్టరూపములు గల్గును. కావున బాలవ్యాకరణ పక్షమున 'మూఁడు+కన్ను' అనుసమాసములో బిందుపూర్వక టివర్ణకమె సమాసాన్త మనవల యును. ఇట్లె - కడలిరాచూలి మున్నగుచోట్లను సమాసాన్తకార్యముల ప్రక్రియ నెన్నునది - "కడలిరాజో" అనుచోటి'జు'వర్ణలోపమును, 'నాలుగు' అనుదానిచో 'నలు' అను వికృతియు మున్నగునవి (బా. సమా. ౨౦ సూ) 'నిక్కలాదులు...... ...' అనుదానిచే సాధింపనగును.

బాలవ్యా. వి. బహుబ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబు మీఁదిమేనునకు బోఁడి యగు. ౨౩.

౨౮౫ III వి. అలరుబోఁడి - ననబోఁడి - పూబోఁడి - విరిబోఁడి.

సంజీవని అం౫ III విష:—ఈవిషయమునకు నన్నయాథర్వణీయమున మూలములేదు. "మెఱుఁగుఁబోఁడి తమ్మికంటి ఇత్యాద్యా ఉపమాన గర్భ బహువ్రీహయః" (అహో ౨౩౬ పుట.) అను కవిశిరోభూషణవాక్యమును "అలరు విలుతుఁడు కఱకుఁరుఁడు మొదలైనవి బహువ్రీహులు - మెఱుఁగుఁబోఁడి మచ్చెకంటి మొదలయినవి యుపమానములు" (బాలసర. ౨౧ పుట. ద్విగుకర్మధారయావిత్యాదిసూత్రవ్యాఖ్య - వావిళ్ళవారి ముద్రణము) అనుబాలసరస్వతీయ వాక్యమును నీసూరి కల్పనమునకు మూలములు కానోపును. 'మచ్చెకంటి' అనుదాని సాహచర్యమున "మెఱుఁగుఁబోఁడి" అనునదియు నుపమానగర్భ బహువ్రీహియనియె బాలసరస్వతులుసైతము బహువ్రీహి ప్రస్తావమున వ్రాసినట్లు విశదమగుచున్నది. అహోబలపతి దానినె విశదీకరించెను. సార్ధబిందుకమగు 'బోఁడి' శబ్ద మప్రసిద్ధమగుటం జేసి బాలసరస్వతియు నహోబలపండితుఁడును "పోఁడి" శబ్దమునె యచట నుద్దేశించిరనివిశ్వసింపనగును. మెఱుఁగువంటి పోఁడి = (ఒప్పు)గలది యనఁగా మనోజ్ఞురాలగు స్త్రీయనియర్థము. "పోఁడి - దే - వి - ఒప్పు. ఉత్సాహ......చచ్చియుం। బోఁడి దొఱఁగకున్నయట్టి పొల్పునన్.........(స్త్రీ. ౨ ఆ. ౯౩) (ప్రాసస్థలము). విణ ఒప్పిదము. ఉ.........సిష్టమెయిన్ భవదగ్నిహోత్రముల్ । పోఁడిగ వేల్వఁగాఁబడిరె (ఆది. 3 ఆ. ౧౧౨)" (శ-ర) అనుశబ్దరత్నాకరము చొప్పున "పోఁడి" శబ్దమునకు విశేష్యత్వమున "ఒప్పు" అనియు విశేషణత్వమున "ఒప్పిదమైనది" అనియు నర్థములు ప్రయోగదృష్టములయి యున్నవి. ఇందు విశేష్యత్వమున "మెఱుఁగుఁబోఁడి - ననఁబోఁడి - తీయఁబోఁడి - విరిఁబోఁడి" మున్నగుచోటులందు బహువ్రీహియు విశేషణత్వమున నుపమానపూర్వపద కర్మధారయమును (మెఱుఁగువలె నొప్పిదమైనది = స్త్రీ) పోఁడిశబ్దమునకు సందర్భపడుచున్నవి. ఇట్లు ప్రసిద్ధమగు 'పోఁడి'శబ్దముతోడి సమాసము మూలముననే మెఱుఁగుఁబోఁడీత్యాదులు సిద్ధించుచుండుటం జేసియే నన్నయాథర్వణు లట్టివాని సిద్ధికై ప్రత్యేకముగ సూత్రింపరైరని యూహింపనగును. అలరుంబోఁడి - ననఁబోఁడి - తియంబోఁడి - విరింబోఁడీత్యాది పూర్ణబిందఘటితరూపములు భారతాదిప్రాచీనకవిప్రయోగదృష్టములు కామింజేసి కావలయు నట్టి సమాసములలోని యుత్తరశబ్దము 'బోఁడి'యని సూరితలంచెనని తోఁచుచున్నది. మఱియు 'బోఁడి'శబ్దమె యప్రసిద్ధము గుటంజేసి యచట సం[illegible]ర్భించుచున్న 'మను శ[illegible]మున కది యాదేశమనియు నుప దేశించియుండును. సూ [illegible]
[illegible]

కొన్ని ముద్రణములందును "మేనునకు బోఁడియగు. అలరుబోఁడి. ననఁబోఁడి - పూఁబోఁడి - విరిబోఁడి" అనియా యున్నది. 'అలరుబోఁడి' శబ్దమునందున్నట్లు 'అలరు' అనుదానితర్వాత ఖండబిందువు లేకుండుట నరయఁగా "పూఁబోఁడి" శబ్దములో "పూ" అనుదానితర్వాతి ఖండబిందువు ముద్రణస్ఖాలిత్యమనియు నెల్లయెడలను 'బోఁడి'శబ్దమునకుఁ బూర్వమున ఖండబిందువు లేకుండుటయే సూరిగారికి సమ్మతమనియు నిశ్చయింపవచ్చును. కావున "ఒకకాలపు బాలవ్యాకరణముద్రణము ననుసరించి మేనుశబ్దమున కాదేశమగునది 'బోఁడి' అనునదిగాని 'పోఁడి' అనునదికాదను నొకవివాదమును వెడలియున్నది........ఏలో యననేల........ముద్రణాలయములందలి సంస్కర్తలే 'మేనునకుఁబోఁడి' అనునపుడు 'కు'వర్ణమునకుఁ దరువాతి యర్ధబిందువును దొలఁగించియుందురు........" (బా. పే. వే. 3౫౭-3౫౮ పు) అనుపేటికావ్యాఖ్యాత వాక్యము కేవలము సత్యవిదూరము. బాలవ్యాకరణప్రాచీనముద్రణములందెందును 'బోఁడి'శబ్దమునకుఁ బూర్వమున (ముద్రణస్ఖాలిత్యముగఁబడిన పూఁబోఁడిశబ్దమునందక్క) ఖండబిందువు లేదు. అన్నియెడలను బోఁడిశబ్దమునకుఁ బూర్వమున ఖండబిందు వర్వాచీనులు ప్రక్షిప్తముచేసినదేకాని వేఱుకాదు. పమసవరళ పరకత్వమున వచ్చు నుమా (గా) గమము సంభవించుట 'పోఁడి' 'బోఁడి' అను రెండిటికిని దుల్యమె. రెండిటిలో నేది పరమైనను నుదంతములకు ద్రుతాగమము (౮౭ విష. ౮౭ II విష.) "సరళే పరుషే చైవే"త్యాద్యథర్వణసూత్రముచేతను "సమాసంబుల నుదంతంబులగు...... ..(బా. సంధి. ౨౪ సూ.)" అను బాలవ్యాకరణసూత్రముచేతను సిద్ధించును. ఉదంతేతరములకు రెండిటిచేతను లభింపదు. అచట బిందువు వలయునేని యుదంతేతరములకు రెండిటియందును ద్రుతాగమము ముకుళితమగుచున్నదని వ్యాఖ్య చేసికొనకతీరదు. నిర్బిందుక 'బోఁడి'శబ్దముశ్లీలతాస్ఫోరకమగు ముండితత్వార్థబోధకమగుటం జేసిసూరి (చక్కని స్త్రీని బోధించు సందర్భమున) యద్దాని నుజ్జగించి సబిందు 'బోఁడి'శబ్దము నాదేశించెనని విశ్వసింపనగును. 'పోఁడి'శబ్దము నాదేశముగా నంగీకరించుపక్షమునకు సాధకములుగాఁ బేటికావ్యాఖ్యాత చూపిన "వాఙ్మయమున నెల్లయెడల నిట్టిసమాసముల బకారమున కిరువంకల నర్ధబిందువు తోఁచుచుండుటయు........" మున్నగు యుక్తులెల్ల నకించిత్కరము లగుటచే విచారసహములుకావు. "చిగురుఁ బోఁడి మితోదరాత్త" అను ద్వ్యర్థివాక్యము పేటికావ్యాఖ్యాతృ కల్పితమే కాని కవిప్రయుక్తముకాదు. "పోణి - దే - వి - విణ - పోఁడియొక్క రూపాంతరము. ఎ. గీ. పేటి రతులకు సురతాణి మించుఁబోణి" (శశా. ౪ ఆ.)" (శ-ర) అను రీతిగల

'మించుఁబోఁడి' మున్నగు రూపముల సాధనమునకు "పోఁడి"శబ్దము నాదేశించు నపుడే ౧౧ రూపాంతరముగు 'పోణి'శబ్దము విషయమునఁ బ్రకృతసూత్రకార్యములు సంభవించుననెడి యుక్తియు సరికాదు. 'పోఁడి'యను ప్రత్యేకప్రయోగసిద్ధముగు పదమునకే పోణి యనుపదము రూపాంతరముగునుగాని "పోఁడి"యను నాదేశమునకది రూపాంతరము కానేరదు. బాల ప్రక్ర్న. ౧3 సూత్రమునందలి యడంగ్వాదులలోనిది ప్రత్యేకప్రయోగాశ్ర్హ ప్రసిద్ధ'పోఁడి' శబ్దమేకాని యాదేశరూప'పోఁడి' శబ్దముకాదు. కాన నాదేశరూప 'పోఁడి' శబ్ద డకారము ణకారము కానేరదు. మఱియుఁ బ్రసిద్ధ'పోఁడి' శబ్దము వెలయుచుండఁగా నట్టిదానితో సమాసమును ఘటించుట యుక్తముగాని యట్టిరూపము నాదేశముగ విధించుట కేవలము నసంగతముగదా — 'రామలక్ష్మణులు' అనుదానిని సాధించుటకయి రామసౌమిత్రులని నిల్పి యందలి మిత్రిశబ్దస్థానమున లక్ష్మణశబ్దము నాదేశించుట కేవలము నసంగతము గదా. కావున సూరిగారు తలంచినట్లు 'బోఁడి'శబ్దము నాదేశముగా విధించుటే కొంతమేలు లేదా - బాలసరస్వత్యహోబలపత్యాదులు వ్రాసినట్లు "అలరువంటి పోఁడియనఁగా నొప్పిదముగలది యనుచొప్పున నుపమానగర్భ బహువ్రీహి నంగీకరింపవచ్చును - లేదా 'అలరువలె నొప్పిదమైనది = యనఁగా మనోజ్ఞురాలగు స్త్రీ' అనురీతి నర్థము చేసికొని యీక్రింది త్రిలింగలక్షణశేషమార్గము నవలంబించుటయేని యుక్తము. "అలరుఁబోఁడీత్యాదులుపమానపూర్వపద కర్మధారయంబులు. ఇటఁ బోఁడి పరంబగుచో నెల్లెడల నుమ్మగు. ఆనిపదంబుచే తియ్యఁబోఁడి - ననఁబోఁడి - విరిఁబోఁడి - ఇగురుఁబోఁడి - చిగురుఁబోఁడి - తలిరుబోఁడి - పువ్వుఁబోఁడి - పూవుఁబోఁడి - పూఁబోఁడి ఇత్యాదులం గ్రాహ్యంబులు - (అలరు+పోఁడి) దీనికిఁబువ్వువలె మనోజ్ఞురాలైనదని యర్థము. ఇట్లంతట నెఱుంగవలయు. ఉదా:— ము - చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతి స్త్రీలెవ్వారే నిందులే। రుగదా (కళా. 3 ఆ) శా.....ద్రౌపదన్। తీయంబోఁడి వరింపఁగా వసుధకేతేఁజూచు నాదిత్యులో। (పాంచా. 3 ఆ.) వేల్పుం బువుంబోండ్ల (య. ౧ ఆ.) క. యౌవనము కలిగినప్పుడ। పూవుంబోఁడులకుఁ బతుల భోగంబులుగా। క........(కళా. ౮ ఆ. మొ.)" (ప్రౌఢ. సమా. ౧౯ సూ.) ఇట్టిప్రయోగములందు 'బోఁడి' శబ్దము పరమైనను ద్రుతాగమము రాఁగా - బా - సంధి - ౧౯ సూత్రముచొప్పునఁ బూర్ణబిందుస్థితి సుఘటమె కాఁగలదు. ఖండబిందుస్థితిని నిర్వహించు నాధారము లెవ్వియు లేవు. పూర్ణబిందు స్థితికైనను భారతాది ప్రాచీన ప్రయోగములు లభింపలేవు. నైషధ వసుచరిత్రాది కావ్యముల ప్రయోగములు

ములకొన్ని యుదాహరింపఁబడుచున్నవి. ఉ. అలకుంబోఁడి.........పీకాంతాస్య
ముంబోలఁగా। వలదా యీశశికిన్ (నైష. ౪ ఆ. ౧౫౫. సూ. రా. వి.) ఉ......
...ఆచికురుటాకుంబోఁడి నీకే తగున్ (వసు.౨. ఆ. ౫౨) శా. పూర్ణేందుబోఁడిసుధాంశు
బింబసుషమా పూర్ణాభిషేక.........(వసు. 3 ఆ.)

## ద్వంద్వసమాసము

ద్వన్ద్వః కేషాంచి దిష్టః స్యాత్। త్వార్థశబ్దేన కుత్రచిత్।
(విశ్వ. హలం.- ౧౪ కారి. అహో. ౪3౫ పు.)
పరుషాణాం।గసడదవాః స్యుః పదాద్ ద్వన్ద్వే (ఆం.
చిం. సంధి. ౧౦ కారి. ఆహో. ౨౨౨ పుట)
ఉర్ ద్వన్ద్వే రః (ఆం. చిం. అజం. ౧౬ కారి. అహో.
3౨౪ పుట.)

సన్నద్ధమా ౨౪౬ విషయము.

ఆనజః స్యా ద్వృతో ద్వన్ద్వే। రేఫ శ్చోరిః వే ర్మతే
(విశ్వ. అజం. ౪౭ కారి. అహో. 3౨౪ పు.)
ద్వన్ద్వే తు స్త్రీవ దిష్టం స్యాత్। భవే ద్రూపం మునా
పిచ (విశ్వ. అజం. ౪౫ కారి. అహో. 3౬౫ పు)
అన్యత్రాఽపి క్వచి ద్భవేత్ (విశ్వ. హలం. ౧౭ కారి.
అహో. ౪3౧ పు.)

కల్పతరువు. ౨౪౬ విష:—సంస్కృతమందువలెనె (౨౬౪ I విష. ౨౬౪ VII విష.) యచ్చుతెల్గునందును 'చా'ర్థమున నితరేతరయోగ ద్వంద్వమును-సమాహారద్వంద్వమును నగును. తెల్గు విగ్రహమున చశబ్దార్థకముగు 'ను' శబ్దము నిలిచి సమాసమున లోపించును - సాధారణముగా ద్వంద్వమునఁ బూర్వపద మాచ్ఛిక స్త్రీసమపదము నుత్తరపద మాచ్ఛిక మాత్రమును నై యుండును. సాధ్యసాంస్కృతిక ద్వంద్వమును మిశ్రద్వంద్వమును నుండనేరవు. ఇతరేతర యోగద్వంద్వమున సమాసఘటిత పదార్థముల సంఖ్యనుబట్టి వచనము నిల్చు ననఁగా బహువచనాంతమె యగును - సమాహారద్వంద్వ మేకవచనాంతమే యగును - ఉదా:—తల్లియుఁ దండ్రియును (వచ్చిరి)=తల్లిదండ్రులు (వచ్చిరి), కూడును జీరలు ననువాని సమాహారము = కూడుసీర. "తన కూడు సీరకై కాంచన మడిగి ఇత్యాదయ స్తిక్కయజ్వాది కవిప్రయోగా స్సాధవః" (అహో. ౪3౨ పు.) సమాహార మనఁగా సమాహాము లింపున సమాహారద్వంద్వ మేకవచనాంతమె యగును. ద్వంద్వఘటితపదములు భిన్నగాగకములైనను నుత్తరపదలింగమె సమాసమున కగును - ద్వంద్వఘటితపదముల

పౌర్వాపర్యము సంస్కృతమునందువలె నచ్చతెన్గునందును గ్రహింపనగును. (అకా VII విష.) ఏకశేషవృత్తియు సంస్కృతమునందువలెనె తెల్గున నూహింపనగును (అకా IX విష.). ఉదా:—తల్లియు+తల్లియు=తల్లులు-ఇట "తల్లితల్లు" లనరాదు. సమాహారద్వంద్వమును సయితము సాధారణముగ సంస్కృతమార్గమునని యెన్నునది (అకా VIII విష.)

ద్వన్ద్వః కేషాంచి దిత్యాది:—క్త్వార్థశబ్దేన=భావార్థక కృదంత శబ్దములతో (ఏకవచన మవివక్షితము - లేదా "క్త్వార్థశబ్దైశ్చ" అనుపాఠ మంగీకరింపనగును.)

ఘటితమగు ద్వంద్వసమాసము, కేషాంచిదిష్టః స్యాత్ = కొందఱకు సమ్మతమై యుండును. త్వా ప్రత్యయము భావార్థకతద్ధితము గాన నిట "త్వార్థశబ్దము" భావార్థ మాత్రపరము. లేదా కవిశిరోభూషణములోని "క్త్వార్థశబ్దేన" అనుపాఠమునె యంగీకరించినను నవ్యయములగు క్త్వార్థులు భావార్థకములె కాన "క్త్వార్థశబ్దేన" అనుదానికి భావార్థకశబ్దముతో నని యర్థము చెన్నునగును. (సూ. 30౯ విష.) "టవర్ణకః క్రియాన్తే స్యాద్ । భావార్థే సాసమాసయోః" అని ముందువచింపఁబడును. ఉదా:—ఆటపాటలు - వ్రాఁతకోఁతలు - రాకపోకలు - వచ్చురాములు- (ఇట్టిచోటులందుఁ బూర్వపదాంత్యవర్ణలోపము గల్గునని వ్యాఖ్యానించునది) వచ్చుటయు రామియు). ఔగాములు (ఔటయు+కామియు) విని వినములు (వినికియు+వినమియు) మొ. ఈ తుది యుదాహృతులందువలెనె యుత్తరపదము వ్యతిరేకభావార్థకముగనె యుండెడి భావార్థక ద్వంద్వసమాస మీక్రిందిరీతిని ద్విలింగ లక్షణశేషమున సూత్రింపఁబడెను - "భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపంబగు. టవర్ణకం బిటఁ గృత్ప్రత్యయంబున కుపలక్షణంబు. ఉదా:— ఔగాములు (ఔట+కామి) (పర. 3 ఆ.) చెల్లుచెల్లములు (చెల్లుట+చెల్లమి) (వేం. పంచ. ౧ ఆ.) వచ్చురాములు - (వచ్చుట+రామి) (పాండు. ౪ ఆ) వినివినములు (వినికి+వినమి) (సా. ౨ ఆ.) (వినికి = వినుట)" (ప్రౌఢ. సమా. 3౧ సూ.) కవిశిరోభూషణమునఁ బ్రకృతాథర్వణకారిక యీక్రిందిరీతి నుదాహరింపఁబడి యున్నది. "వచ్చిరాములు - చేసిచేయములు - చొచ్చిచొరములు - ఇత్యాదావపి ద్వన్ద్వ సమాసః సాధురేవ. ద్వన్ద్వః కేషాంచి దిష్టః స్యా త్క్త్వార్థశబ్దేన కుత్రచిత్. ఇత్యాథర్వణవచనాత్. వచ్చి రాని కుచంబులు ఇత్యాదౌ క్త్వార్థపదస్య భిన్నత్వమేవ. వచ్చిరానికుచంబులు ఇతి దీర్ఘప్రయోగస్తు న ప్రామాణికః" (అహో. ౪3౫ పుట.) పై యహోబలోదాహృతులలో ద్వంద్వఘటితపదార్థముల కేకక్రియాన్వయముగాని పరస్పరసాహిత్యరూపమగు నేకార్థీభావరూపసామర్థ్యముగాని లేకుండుటంజేసి యట్టి

యెడల ద్వంద్వసమాసము దుర్ఘటమై యున్నది. "హరిహరావిత్యాది ద్వన్ద్వేతు పరస్పరసాహిత్య మేవాన్వయః (౨౬౮ I విష.)" "పరస్పరాపేక్షితానాం సముదితానా మేకస్మిన్ క్రియాపదేఽన్వయో యత్ర తత్రేతరేతరయోగః-పరస్పరసాహచర్యం, చార్థః, ప్రత్యేతవ్య ఇత్యర్థః, యథా ధవశ్చ ఖదిరశ్చ ధవఖదిరావితి-అత్ర పరస్పర సాహిత్య సూచనాయ చకారద్వయప్రయోగః" (౨౬౮ VII విష.) అను నిట్టి ద్వంద్వ సమాసలక్షణములు పయి యహోబలపతి యిచ్చిన "వచ్చిరాములు-చేసిచేయములు చొచ్చిచొరములు" మున్నగువానియం దెంతమాత్రమును లేవు. వీనియందు సమాసమునకు విషయముకానట్టి వ్యపేక్షాలక్షణసామర్థ్యమే చూపట్టుచుండుటం జేసి "వచ్చిరాని కుచంబులు ఇత్యాదౌ క్త్వార్థపదస్య భిన్నత్వమేవ" (అహో. ౪౩౫ పు.) అనురీతి నవి వాక్యగతములగు భిన్నపదములుగ "వచ్చియు రామి" అనురీతిని బ్రయోగింపఁదగినవె యననగును, లేదా వానియెడల "వచ్చు రాములు (వచ్చుటయు+రామియు) చేయుచేయములు (చేయుటయు+చేయమియు) చొచ్చుచొరములు" (చొచ్చుటయు+చొరమియు.)" అనురీతిని నిల్పనగును. అర్వాచీనులగు కవిజనమండనకారాదులెల్ల నీయహోబలపతిమార్గమునె యనుసరించిరి. "ఏకధాతునిష్పన్నములైన క్త్వార్థకవ్యతిరేక భావార్థకములు ద్వంద్వ మగును. ఉదా:—చేసిచేయములు - ౨ వాళిమనుట భిన్నధాతునిష్పన్నములు ద్వంద్వము క్వాచిత్కమనుటకు - ఇచ్చిపుచ్చుకొనుటలు - మొ." (ఆం. భా. అ. సమా. ౭౮ సూ.) ఇట్టిసమాసములు శాస్త్రవిరుద్ధములగుటచే నగ్రాహ్యములు - గాణపతవివరణకర్త క్త్వాంతమునకే టప్రత్యయాంతార్థమును జెప్పుచు నీక్రిందిరీతిని వివరించెను. "శోభిల్లు నొక్కెడఁ గలిప । యాభీష్టంబగుచు ద్వంద్వ మా<u>క్త్వార్థముతోఁ</u>." (నా రా. ౩౨౮ కారి. ౩౦ పద్య-సమా.) "ఉదా:—వచ్చి రాములు( వచ్చుట రాకపోవుట) చేసి చేయములు - చొచ్చిచొరములు - ఇచ్చిపుచ్చుకొనుటలు - చెల్లిచెల్లములు - వినివినములు - మొ. ఈ యుదాహరణములందు వచ్చి ప్రభృతుల క్త్వార్థకప్రత్యయము భావార్థకము." (గాణ.) అవ్యయములగు కృత్తులు భావార్థకములనుటలో విరోధము లేకున్నను 'ఇచ్చి' మున్నగువానికి 'ఇచ్చుట' అను 'ట' ప్రత్యయాంతార్థము కవిప్రయోగములం దెచ్చటను నప్రసిద్ధమగుటంజేసి యిట్లు <u>క్త్వాంతమును నిల్పి సమన్వయించుమార్గము గ్రాహ్యము కానేరదు. (విస్తర I).</u>

విస్తర. I ౨౮౬ విష:—"ఒకెడ ననుటచేఁ విగాములని యుండఁదగదు. ఔగాము లనురూపముండును - వచ్చిరాని కుచంబు లిత్యాదుల వచ్చి మొదలగునవి వ్యస్తములు - వచ్చిరాని కుచంబులను దీర్ఘరూపము ప్రామాణికముకాదని

గసడదవాః స్యు రిత్యాదికారిక ౭౯ విషయమున వ్యాఖ్యాతమయ్యెను. ఉదా:—తల్లిదండ్రులు - ఔగాములు - "కొన్నియెడల ద్వంద్వంబునం బదంబు మీఁది చతపలకు సదవలుగానంబడవు" (ప్రౌఢ. సంధి. ౬ సూ) (౭౯ I విష.) రాకపోకలు - అందచందములు - మొ. ఇట్టియెడలనున్న కచటతపములనుగాని, వాని చోట రాఁదగిన గసడదవలనుగాని నిర్వహించు ప్రాసాదిగతప్రయోగములు లభింప లేదు. (౭౯ విష. ౭౯ I విష.)

ఉర్ ద్వన్ద్వే ర ఇత్యాది:—ద్వన్ద్వే = ద్వన్ద్వసమాసమునందు, ఊః = ఋకారమునకు, రః = రేఫాదేశము, వా = వికల్పముగా నగును. ఉవ :—మాత్రపితలు (మాతృ+పితృ.) ఈసూత్రమునర్థము నధర్వణుఁడు స్పష్టపఱుచుచున్నాఁడు.

ఆనజః స్యా దిత్యాది - ద్వన్ద్వే = ఋకంతసర్వావయవ ద్వంద్వమునందు, ఋతః = పూర్వపదాంత్య ఋకారమున కా దేశముగా సంస్కృతవ్యాకరణములందు యహోబలపతివ్రాసెను పూర్వకవుల ప్రయోగములుగలవు. చ నియమిత దుందుభి ధ్వని వినీవినమిన్ బురిలోని సైనికుల్ (జైమిని. ౪ ఆ. ౧౧౬ క.) దుర్భాషణముల్ వినీ వినసీ భంగిన్ (శృం. నై. ౬ ఆ. 33.) నమ్మీానమ్మక. (భారశాంతి. ౨ ఆ. 3౪౧ Edn. ౧౯౦౧.)" (గాణ. ౨౮౪ పుట.) అని గాణపతవివరణమున నవిమర్శితముగ వ్రాయఁబడెను. చేసీచేయములు సాధువనుటకును 'ఐగాములు' అసాధువనుటకును బ్రమాణమేమో తెలియకున్నది. 'వచ్చీరాని కుచంబులు' అనుచో 'వచ్చిన్ రాని కుచంబులు' (వచ్చిన్ = వచియున్) అనియు, 'వినీవినమిన్' అనుచోఁ వినిన్ విన మిన్ (వినిన్ = వినియున్ ౮౪ విష. ౮౪ I విష. చూ.) అనియు, 'వినీవినని' అనుచో 'వినిన్ వినని' (వినిన్ = వినియున్) అనియు 'నమ్మీానమ్మక' అనుచో 'నమ్మిన్ నమ్మక' (నమ్మిన్ = నమ్మియున్) అనియుఁ గవిప్రయుక్తపాఠములనుటలోఁ బ్రతిబంధమేమో తెలియకున్నది. ఆఃండితలేఖకులయు ముద్రణసంస్కర్తలయు వ్యావహారికభాషా వాసనా ప్రక్షిప్తములను బ్రమాణీకరించుచుఁ బండితకవీంద్ర సమ్మత భాషాలక్షణముల నన్యథాకరించుట యుక్తమా ? "క. నమ్మమి మృత్యువు పెద్దయు। నమ్ముట యమృత్యు వగుట నరకతి నమ్మీా। నమ్మక పనిగొనునది నిత్యమ్మును సూక్ష్మమతిఁ దాను నరయఁగవలయున్. (శాంతి. ౨ ఆ. 3౪౧.) అను పద్యమున 'నమ్మీా' అనుచోట "మిత్రున్। నమ్మినఁలుగొనునది అని పెక్కుప్రతులు" అనుచుఁ డిప్పణమున వ్రాయఁబడెనుగాని యీపాఠము 'నమ్ముట యమృత్యువ'ను దానికి విరుద్ధముగాన గ్రాహ్యముకాదు. "నమ్మిన్। నమ్మక పనిగొనునది (నమ్మిన్ = నమ్మియున్)" అను పాఠమె సుసంగతమై కవిప్రయుక్తమని విశ్వసింపఁదగియున్నది.

విధింపఁబడిన, ఆనజః = ఆనజాదేశస్థానమున, రేఫః = రేఫాదేశము, శౌరిక వేర్మ తే = శౌరికవిమతమందనఁగా వైకల్పికత్వమున, స్యాత్ = అగును. ఉదా:— మాత్రపితలు - మాతాపితలు. (మాతృ+పితృ) సంస్కృతవ్యాకరణములం దానజాదేశము నిత్యమగుటచేత "మాత్రపితలు" మున్నగు నానజాదేశము లేని రూపము లసాధువులు కావలసివచ్చు నను నుద్దేశముతో నట్టివాని సాధుత్వమున కయి నన్నయాథర్వణు లిట్లు సూత్రించిరని యెఱుంగునది. (విస్తర. II) రేఫాదేశమానజ్సమానస్థానికమని యథర్వణవివృతికిఁ దాత్పర్యము.

సంస్కృతవ్యాకరణములం దానజాదేశవిషయమున నీక్రిందిరీతని వ్రాయఁబడెను. "ఆనఙ్ ఋతో ద్వన్ద్వే. (౬ 3-౨౫.) విద్యాయోని సంబన్ధవాచినాం ఋదన్తానాం ద్వన్ద్వే ఆనఙ్ స్యా దుత్తర పదే పరే. హోతాపోతారౌ. హోతృపోతృ నేష్టోద్గాతారః. (యజ్ఞమునందలి ఋత్విజులు) మాతాపితరౌ. పుత్రేన్యతరస్యామ్. (౯౨౦ సూ) (౬-3-౨౨.) ఇత్యతో వద్ధ్యాఙ్గ్వాప్యా పుత్రే ఇత్యనువృత్తేః - పితాపుత్రౌ" (సి. కౌ. ౯౨౧ సూ) దీని బాలమనోరమావ్యాఖ్య. "ఋదన్తానామితి.........ఋదన్త సర్వావయవ కానా మిత్యర్థః......హోతృపోత్రితి:—అత్ర హోతృశబ్దస్య పోతృశబ్దస్యచ నానఙ్. నేష్టృశబ్దేన వ్యవధానాత్-ఉత్తరపద పరకత్వభావాత్. తథాచ నేష్టృశబ్దస్యైవానఙ్. ఉత్తరపదేన తు న పూర్వపద మాక్షిప్యతే, సమర్థసూత్ర నేష్టృశబ్ద స్యానఙ్ దర్శనాత్.(విస్తర. III) అథ యోనిసంబన్ధ ముదాహరతి, మాతాపితరావితి, పితృపితామహాః ఇత్యాదౌతు నానఙ్, ఋదంతసర్వావయవక త్వాభావా దితిభావః." (సి. కౌ. ౯౨౧ సూ.

---

విస్తర. II ౨౦౬ పిమ. 'మాతరపితలు' అనియుఁ బర్యాయరూపము గలదు. 'మాతరపితరౌ వుదీచామ్ (౬-3-3౨) (సి. కౌ. ౯౨౯ సూ.) చ. వరములు గన్న మోదమున వచ్చి కుమారయుగంబు మున్ను మా। తర పితృవందనంబును బదం పడి.........(ఉ. హరి. ౪ ఆ. ౧౭.) ఏకశేషవృత్తిపక్షమున 'పితలు' అనియు నానజాదేశపక్షమునందు 'మాతాపితలు' అనియు రూపములు గలవు.

విస్తర. III ౨౦౬ పిమ:—"హోతృపోతృనేష్టోద్గాతారః. తస్మిన సిద్ధ్యన్తి. హోతాపోతానేష్టోద్గాతార ఇతి (ఇత్యేవ) ప్రాప్నోతి" (సమర్థసూత్రమహాభాష్యము ౨-౧-౧.) దీని కైయటము:—"యదా బహూనాం సమాస స్తదా సర్వాన్తే ఉత్తరపదే పరత ఏకస్యైవానఙ్ భవిష్యతి. ద్వయో ర్ద్వయోస్తు సమాసే క్రియమాణే ఏకం (నాల్గవదానిని) వర్జయిత్వా సర్వేషా మానజా భావ్యమ్."

వ్యాఖ్య.) ద్వంద్వఘటితపదములు రెండును ఋదంతములే యై యుండఁగా నా రెండిటికిని విద్యాసంబంధముగాని యోనిసంబంధముగాని వెలయుచుండఁగా నట్టి ఋదన్తోత్తరపద పరకత్వమున ఋదన్తపూర్వపదీభూత శబ్దముతుది ఋకారము స్థానమున నానఙాదేశము నిత్యముగా నగును. అట్టి యానఙు స్థానమున వైకల్పికముగా రేఫాదేశము తెల్గునఁ గల్గునని పై యథర్వణవచనమునకు భావము. ఇట్టి యేర్పాటుచేత గీ. మాత్రపితలను సేవించు పాత్రుఁడితఁడు" (కల్పితగీతిచరణము) మున్నగుచోటులందుఁ బ్రయోగబాధ తొలఁగునని నన్నయాథర్వణులు పయిరీతిని సంస్కృతవ్యాకరణవిధిని సవరించిరి. ఇట్లు సవరింపనిచో "మాతాపితలు" అనియే నిత్యమగు నానఙాదేశరూపము గల్గి ప్రయోగబాధ గల్గునని గ్రహింపవలయును.

అహోబలపండితుఁడును జాలవఱకీమార్గముననె వ్రాసెను. "ఋకారాంత ద్వన్ద్వే పూర్వపదసంబన్ధి యో ఋకారః తస్య స్థానే రః స్యాత్. మాత్రపితృబుద్ధి వైదేహాపుత్త్రిఁ దలఁతు ఇత్యాది (విస్తర IV). క్వచిద్గ్రహణ స్యోభయత్రాన్వయః ('ఉర్ ద్వన్ద్వే రః క్వచిద్గకారోవః' అనుచోటి క్వచిచ్ఛబ్దమున కని భావము) మాతాపితృబుద్ధసీతి మదిలో నెంతున్. ఇత్యాదిరూపాన్తరం సిధ్యతి. ఆనఙః స్యాదృతో ద్వన్ద్వే । రేఫ శ్చైకవేష్యతే. ఇతివదద్భి రథర్వణాచార్యై రస్యైకమత్యంచ సిధ్యతీతి జ్ఞేయమ్. ఆనఙ్ ఋతో ద్వన్ద్వే ఇతిసూత్రే ఉత్తరపదేన పూర్వపదం నాక్షిప్యతే. ఇతి మధ్యమపద స్యాప్యానఙ్. తేన హోతాపోతానేష్టోద్గాతార ఇతి భాష్యకైయటాదౌ స్థితమ్. తత్రాపి రేఫప్రయోగే హోత్రపోత్రనేష్ట్రోద్గాతలితి రూపం జ్ఞేయమ్. క్షత్త్రియవంశ్యులై జగల నిత్యాదిపద్య ఏద్యే చతుర్థపాదే మాంధాతృపదస్య సంయుతాసంయుత ప్రాసత్వేన ఋకారాంతత్వమేవ. న స రేఫత్వమితి జ్ఞేయమ్. పితాపుత్త్రా విత్యత్రాపి రేఫే పిత్రపుత్త్రులు ఇత్యపి రూపం సమంజస మేవ" (అహో. 3౨౮-3౨౯ పు.)

ఈకవిశిరోభూషణచర్చయందుఁ గొన్ని విమర్శనీయాంశములు గలవు. "ఆనఙ్ ఋతో ద్వన్ద్వే ఇతిసూత్రే ఉత్తరపదేన పూర్వపదం నాక్షిప్యతే ఇతి మధ్యమపదస్య

---

విస్తర. IV ౨౮౬ విప:—పుత్త్రశబ్ద మేకతకారకమును సాధువగుటచేత "మాత్రపితృబుద్ధి వైదేహాపుత్త్రిఁ దలఁతు" అనుచో ప్రాసము నిర్బాధము. "పుత్త్ర (త్ర) పు. పుత్ త్రాయతే (పుత్ + త్రై + క) 'పున్నామ్నో నరకా ద్యస్మా । త్పితరం త్రాయతే సుతః.........పూ+క్త్ర - హ్రస్వశ్చ........" (శబ్దస్తో.) "పుత్త్ర. (త్ర) పు.........పునాతి పితౄ దీసితి. (పూ+క్త్ర) 'పువోహ్రస్వశ్చ' (ఉణాది. ౪ అ. ౧౬౪.) ఇతిక్త్రః. ధాతోః హ్రస్వత్వంచ." (శబ్దకల్పద్రుమకోశము.)

నజ్" అను నిందలి పంక్తులనుబట్టి యుహోతలపతి 'హోతాచ+పోతాచ+నేష్టాచ+ఉద్గాతాచ' అనెడి బహుపదద్వంద్వవిగ్రహము నాశ్రయించె ననుట స్పష్టము. కానట్టియెడల 'హోతృపోతృనేష్టోద్గాతారః' అనుసమాసరూపమే సిద్ధించునుగాని యీ క్రింద వివరింపఁబోవు ద్వంద్వద్వయగర్భ ద్విపద ద్వంద్వవిగ్రహమునందు సిద్ధింపవలసిన 'హోతాపోతానేష్టోద్గాతారః' అను సమాసరూపము సిద్ధింపనేరదు. కానఁ బయి కవిశిరోభూషణపంక్తులు ప్రామాదికములని తోఁచుచున్నది.

పాణినీయులమతమున నానఙ్ బహుపదద్వంద్వమున మొదటిపదములకు రాకుండుటయు మూఁడవపదమునకు మాత్రము వచ్చుటయు (హోతృపోతృనేష్టోద్గాతారః) బయినుదాహరించిన కౌముదీ బాలమనోరమా గ్రంథములనుబట్టి విశదమగుచున్నను ద్వంద్వద్వయగర్భ ద్విపద ద్వంద్వ విగ్రహక స్థలమున సమాసములోని మూఁడుపదములకును నట్టి యానఙ్ వచ్చుట సమ్మతమయియున్నది. "అనేకోక్తేః హోతృపోతృనేష్టోద్గాతారః. ద్వయోర్ద్వయోర్ద్వన్ద్వం కృత్వా పునర్ద్వన్ద్వేతు హోతాపోతానేష్టోద్గాతారః" (సి.కౌ. "చార్థే ద్వన్ద్వః (౨-౨-౨౯)" అను ౯౦౧ సూత్రపు వివరణము.) దీని బాలమనోరమా వ్యాఖ్య:— "అనేకోక్తే రితి...... హోతాచ పోతాచ నేష్టాచ ఉద్గాతాచ ఇతివిగ్రహే బహూనామపి ద్వన్ద్వ మనేకగ్రహణ మితిభావః. అనఙృతో ద్వన్ద్వే ఇతి నేష్టృశబ్దస్యైవ ఉత్తరపదపరకత్వాత్ 'ఆనఙ్; నతు హోతృపోతృశబ్దయోరపి, ఉత్తరపదస్య మధ్యమపద వ్యవహితత్వేన హోతృపోతృశబ్దయో రుత్తరపదపరకత్వాభావాత్. నను తర్హి హోతా పోతానేష్టోద్గాతారః ఇతి కథ మిత్యత ఆహ, ద్వయోరితి:—హోతాచ పోతాచేతి ద్వయోర్ద్వన్ద్వః. హోతృశబ్దస్యానఙ్. తతశ్చ నేష్టాచ ఉద్గాతాచేతి ద్వయోర్ద్వన్ద్వః. నేష్టృశబ్దస్య ఆనఙ్, తతః హోతాపోతారౌచ నేష్టోద్గాతారౌచేతి ద్వన్ద్వద్వయగర్భో ద్వన్ద్వః. తత్ర నేష్టోద్గాతృశబ్దే ఉత్తరపదే హోతాపోతృశబ్దస్య ఆనజిత్యర్థః. ఆనజి ఙకార ఇత్. ఙిత్త్వా దన్తాదేశః. అకార ఉచ్చారణార్థః. అన్తర్వర్తినీం విభక్తి మాశ్రిత్య పదత్వా న్నస్య లోపః" (బాలమ. సి.కౌ.౯౦౧ సూ). (విస్తర V.)

---

విస్తర V ౨౮౬ విమ:—పయిసందర్భమునుబట్టి బహుపదద్వంద్వ సమాసమధ్యమున నొక్క ఋదంతపద మున్నను నట్టి ఋకారమునకు రేఫాదేశ మగు ననుచుఁ గవిసంశయవిచ్ఛేదమున నడిదము సూరకవి వ్రాయుట మిక్కిలి పొరపాటనుటకు సందియము లేదు. ఇట్టి యపమార్గమునే గుప్తార్థప్రకాశికా కర్తయు ననుసరించెను - ఇందలి ప్రమాదముల నిటఁ జూపుచున్నాను.

తే గీ. ధర ఋకారాంత శబ్దంబు ద్వంద్వ మైన । రేఫమగుచుఁ బ్రవర్తిల్లు దృష్ఠముగాను । పత్త్రివరహాయవాగ్వధూనేత్రముఖను । రాభినందితపాదాబ్జ యన్నయట్లు.

(పత్త్రివరవాయః = గరుత్మాన్ + వాగ్వధూనేతా (తృ = బ్రహ్మ). ప్రయోగము-ఆదిపర్వము. నన్నయభట్టు. ఉ. క్షత్త్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ। క్షత్త్రియవైశ్యశూద్రు లనఁగా నుతికెక్కిన నాలుగుజాతులన్ స్వచా। రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితు గాచినయట్లు రాముఁడుం। ధాత్త్రరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబులన్ (ఆది. ౨ ఆ. ౧౭౭) (కవిసం ౧ తరం-౧౩౨-౧౩౩ ప.) ఇట్లీతఁడీ రేఫాదేశమును నిత్యముగా విధించెను. ఈపక్షమునఁ బైకల్ప తరువులో నుదాహరింపఁబడిన ప్రయోగములెల్లఁ బ్రతిఘటించుచున్నవి. పైనన్నయ ప్రయోగ మహాబల పండితుఁడు వ్రాసినట్లు సంయుతాసంయుత ప్రాసముచే సమర్థిత మగుచుండఁగా నట్టి యలక్ష్యమును మూలముగాఁగొని పై నన్నయాది ప్రయోగములకును నన్నయాథర్వణ వచనములకును విలక్షణముగా సూరకవి యిట్లు లక్షణ సృష్టి చేయుట కేవలము పొరపాటు (చూడు. ౧౯౨౦ క్రీ. శ. రౌద్రిసంవత్సర జ్యేష్ఠాషాఢమాస సాహిత్యపరిషత్పత్త్రికలోని నారచించిన "ఆంధ్రచ్ఛందస్సు" అను వ్యాసము).

ఇట్టిసూరకవి యుపసిద్ధాంతమును రాద్ధాంతీకరించుచు బాలవ్యాకరణగుప్తార్థ ప్రకాశికాకర్త యీక్రిందిరీతి నసంగతముగ వ్రాసెను. క్షత్త్రివంశ్యులై యను పద్యమునందలి ప్రాసములో 'త్త్రి' అనునది ద్విత్వతకారకమను నిశ్చయముతో గుప్తార్థ ప్రకాశికాకర్త యీక్రిందిరీతి నందు సంయుతా సంయుతప్రాస మనుట సరికాదని చర్చించెను. "ఆ-వె. క్రింద జడ్డలును బిఱుంద బిందువులును। నూఁది ప్రాసములకు నుండెనేని। హ్రస్వ మొకటి నిడుదయక్కరం బొక్కటి। వానిమొదల నిలుపవచ్చు నెందు. (అప్పక. 3 ఆ. ౨౭౮) అను లక్షణపద్యము ననుసరించి.........క్షత్త్రియ ఇత్యాదులందు హ్రస్వపూర్వకమైన సంయుక్తతకార ప్రాసంబునకు 'మాంధాతృ'అను నాల్గవపాదమందు సంయుక్తము కాని కేవల తకారప్రాసంబు దీర్ఘపూర్వకంబై ప్రతి భటంబుగా నెట్టు లుండఁజాలును?........." (బా.గు.ప్ర.ప్రకీర్ణ.౪౯ ౭ పు. ద్వి. ము.) ఈ గుప్తార్థప్రకాశికాచర్చ కేవలము నవిమర్శమూలకము. ప్రాసపూర్వాక్షర మొకయెడ గురువైనచోఁ దక్కినపాదంబులందును గురువే కావలయుననియు నొక యెడ లఘువైనచోఁ దక్కినచోట్లను లఘువే కావలయు ననియును సిద్ధాంతము. ఈసిద్ధాంతపువివరణమె పైని వ్రాసిన "క్రింద జడ్డలు" అను పద్యము. క. గురులఘు వులలో నెయ్యది। మురహర తొలిచరణమునకు మొదల నిలుచు ని। ద్ధర నాపై నిడు ప్రాసా। క్షరముల పూర్వమున నదియ కదియింప నగున్। (అప్పక - 3 ఆ. ౨౮౨ ప.) దీని మూలమె యనఁదగు ననంతుని లక్షణము. క.ఆదిని గురులఘువులలో। నేది నిలిచె

నదిరెయి మొదల నిడి పాదములు । త్వాదింపవలయు నుపజా । త్యాదుల మిశ్రములు దక్క నంబుజనాభా (ఛందోద. ౧ ఆ. ౩౦). ఇట్లగుటచేత "క్షత్రియవంశ్యులై...
......" అను నన్నయపద్యము సంయుతాసంయుత ప్రాసమునకు లక్ష్యమనుటలో విరోధమేమియు లేదు. కావుననే యీనన్నయపద్యమునఁ బ్రాసభంగము లేకుండు టకై "మాంధాత్రరఘుక్షితీశులు" అను రేఫాదేశపాఠము నంగీకరించి క్షత్రియ శబ్దము ద్విత కారకమగుటచేఁ బ్రాసములందు ద్విత్వావృత్త్యనావశ్యకతా సిద్ధాంత మును నెఱకొల్పక తీరదనెడి గుప్తార్థప్రకాశికా వాదమునకుఁ బ్రసక్తి లేకున్నది. (బా. గు. ప్ర. ప్రకీర్ణ. ౪౯౭ పు. ద్వి. ము.) "క్షతం నాశం శత్రూణాం రాతి దదా తీతి క్షత్రమ్ = (శత్రులకు నాశమును గలిగించువాఁడు.) క్షత్ + రా + క = క్షత్ర" అను ప్రక్రియచొప్పున నేకతకారక క్షత్రశబ్దమును సాధింపనగును. (రా = దానే - గ్రహణేచ - అదాది ..శబ్దస్తో). సర్వశబ్దసంబోధినీ శబ్దరత్నాకరాది కోశములలో క్షత్రశబ్ద మేకతకారకముగానె చూపఁబడినది. అట్లయినను క్షత్రశబ్దము ద్వితకారక మని ప్రామాణికులు తలంచుచున్నారు. 'క్షత్ - పు. (క్షణ క్విప్. క్షత్) తత స్త్రాయతే (క్షత్ + త్రై + క) క్షత్త్రః. క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః । క్షత్త్రస్య శబ్దో భువ నేషు రూఢః ఇతిరఘుః" (శబ్దస్తో) ఇట్లు క్షత్త్రశబ్దము ద్వితకారకమె యన్న పక్షము నందును హలంతరసంయుక్తమగు ద్విత్వమునందలి యొకహల్లు లోపించు ననెడి (౧౯౯ I విష.) పద్ధతిచొప్పున 'క్షత్ర' అను నేకతకారకరూపము సాధువగుచున్నది. మఱియు ద్వంద్వసమాసఘటితముకాని మాంధాతృశబ్దము సయితము 'క్షత్రియ' శబ్దప్రాసమున నీక్రిందిరీతిని గవిప్రయోగదృష్ట మగుచుండుటచేత క్షత్రియశబ్ద మే కతకార మగుటయుఁ గవిసమ్మత మే యని నిశ్చితమగుచున్నది. గుప్తార్థప్రకాశికాసిద్ధాం తమును నున్మూలిత మగుచున్నది. క. క్షత్రియధర్మంబున మాం । ధాతృఁడు రాజ్యంబు నీతిఁ దగఁ బాలించెన్ । (నందిసింగన బలరామ విజయములోని దని లక్షణ చూడామణియను నామాంతరము గల రంగరాట్ఛందమునఁ దృతీయాంకమున సంయుతా సంయుతప్రాససందర్భములో నుదాహరింపఁబడినది).

గుప్తార్థప్రకాశికాకర్త సమాసపరిచ్ఛేదమునందలి ప్రకృతసూత్రమునకు వ్యాఖ్య చేయునప్పటికి "క్షత్రియవంశ్యులై యనుభారతాదిపర్వపద్యపుఁ జతుర్థచరణమున 'మాంధాతృ' 'మాంధాత్ర' అను రెండుపాఠములు నుండవచ్చునను తలంపుతో నుండి యేవేవో యశాస్త్రీయవిషయములను (౨౮౧. ౨౮౨. ద్వి. ము.) వ్రాసెను. తర్వాత గ్రంథాంతమునఁ (౪౯౭. ౪౯౮. పు. ద్వి. ము.) బయిరీతి నడిదము సూర కవిగారి "యడిదంబె బెడిదంబనుచు" నట్టి యపమార్గము ననుసరించి వ్రాసెను.

సమాసపరిచ్ఛేదమున నింకను ననేకములగు నశాస్త్రీయ ప్రసంగములు చేసెను. "ద్వన్ద్వే వైరూప్యాణికే దీర్ఘా త్పరతోఽపి వికల్పః" అనెడి యొక నిర్మూల నిరాధార కారిక నాశ్రయించి "దీర్ఘంబుతరువాత వచ్చు ఋకారంబునకు రేఫాదేశంబు కలుగునని చెప్పుటచేత 'మాత్రపిత్రుబుద్ధి నంభోధి పుత్రిఁ గొలుతు' ఇత్యాదికవిప్రయోగంబులు సాధువులయ్యె. హ్రస్వంబునకుఁ దరువాతవచ్చు ఋకారంబునకు నీసూత్రంబుచే రేఫాదేశంబుగలుగదు. అందున 'పితాపుత్రులు' అన్న యానజాదేశయుక్తరూపంబే సాధువగునుగాని "పిత్రపుత్రులు' అని రేఫాదేశసంయుక్తరూపంబు శాస్త్రీయంబు కాదు.........కావుననే యీ క్రిందిపద్యంబునఁ బితృశబ్దంబు రేఫాదేశాంతము కాలేదు. క. నాయముల 'బిత్రుపితామహానామంబుల......" (౨౮౧ పుట. బా. గు. ప్ర. ద్వి. ము.) అని యిట్లెన్నెన్నో యశాస్త్రీయ ప్రసంగములను నన్నయాథర్వణు లకు సమ్మతములు కానివానిని బ్రసంగించెను. దీర్ఘము తర్వాత నున్నచో—'మాత్ర పితామహులు'—అనునదిసయితము ఋకారాంతపదకరకము కాకున్న నసాధు వేయని కదా యీయన యభిప్రాయము. సందియమేల? "శాస్త్రంబునమాంధాతృ రఘు కీర్తిశుల అన్నద్వంద్వంబులో రఘుకీర్తిశబ్దంబు సమాసచరమావయవంబు (కడపటిపదంబు) కాన దానికిఁ బూర్వంబునందున్న మాంధాతృశబ్దంబునకు రేఫాదేశంబు రావ చ్చును........." అని కంఠోక్తముగనే వ్రాసిరి. (౨౮౨ పుట. బా. గు. ప్ర. ద్వి ము.) ఇట్టి వింకను నిట ననేకములగు నన్నయాథర్వణ సూత్ర విరుద్ధవిషయములు పెక్కు గలవు. విస్తరభీతిని జూపలేదు.

బా-సా-పే-వ్యాఖ్య (౧౯౩౭ క్రీ. శ. ముద్రితమైనది.) లో ౧౯౨౦ సంవత్సరపు (క్రీ-శ) రౌద్రిసంవత్సర జ్యేష్ఠాషాఢమాస పరిషత్పత్రికలోఁ బ్రచు రితమగు నా రచించిన "ఆంధ్రచ్ఛందస్సు" అనువ్యాసము ననుసరించి యీసంద ర్భము వ్రాయఁబడుటచే "కాన సిద్ధద్వంద్వమునం దానజాదేశమున కవకాశము తోఁచెడి స్థలములందలి ఋకారమునకు రేఫము వికల్పముగ నగునని సూత్రార్థము" (బా. సా. పే. ౩౫౩ పు.) అని యిట్లుగ నథర్వణసిద్ధాంతానుకూలముగ వ్రాయబడి నను వ్యాఖ్యాత కానజ్ఞు వచ్చెడిస్థలము సరిగ బోధపడమింజేసి కావలయును కొన్ని యశాస్త్రీయ ప్రసంగములను వ్రాయఁబడెను. "బహుపదద్వంద్వమునను పూర్వ పూర్వములగు ఋకారములకే రేఫంబగును........." (బా. సా. పే. ౩౫౩ పు.) అని వ్రాయఁబడెను. బహుపదద్వంద్వంబునఁ బూర్వపూర్వముల ఋకారమునకు రేఫాదేశముగాని యానజ్ఞుగాని రాదనుట యీవఱకు విశదీకరింపఁబడెను. ఈతఁడు గప్తార్థప్రకాశికను విమర్శించుచు నీ క్రిందిరీతిని వ్రాసెను. "మఱియుఁ

ఇంక నీవిషయమునఁ బ్రయోగవిమర్శము చేయవలసియున్నది. క...... నిజ మా । తా పితృ పక్ష ప్రబల భ । యాపవాహుఁ డాస్తీకుఁడు......(ఆది. ౨ఆ. ౧౬౨.) క......మాతాపితృ భా । వన నతఁడు వారిఁ బ్రోచిన......(శాంతి. 3 ఆ 33.) పయి పాణినీయసిద్ధాంతముఁ జెప్పునఁ బయి ప్రయోగముల నొకరీతిని సమర్థించుకొననగును. తే-గీ. మాతృపితృహీన యైనను భ్రాతృరహిత । భావ మొందిన... (అను. ౨ ఆ. ౨౨౭.) ఇంకఁ బయిపద్ధతి చెప్పిన "మాతాపితృహీన" అనినచో ఛందోభంగమగునుగాన "గీ. మాత్రపితృహీన యైనను భ్రాతృరహిత" అని యిట్లు రేఫాదేశపాఠము నంగీకరించి సంయుక్తాసంయుత ప్రాసమూలమున సాధుత్వమును గల్పించుకొన నగును. ఈరీతినే యీ క్రిందివానిని సమర్థించుకొనవచ్చును. తే-గీ. మాతృపితృదారపుత్రక భ్రాతృశత స । హస్రకంబులు...... ..(శాంతి. ౧ ఆ. ౨౧౮.) ఇందును "మాత్రపితృదారపుత్రక భ్రాతృశత" అను పాఠము నంగీకరించి పయిరీతిని సమర్థించుకొనవచ్చును. క. మృతుఁడయ్యెను భ్రాతృపుత్రమిత్ర యుతముగన్. (స్త్రీ. ౨ ఆ. ౧3౭.) ఋకారాంతమునకు ఋదంతము పరమయినను బుత్రశబ్దము పరమైనను అనజ్జుగాని రేఫాదేశముగాని రావచ్చునుగాన నిట్టి యెడలసయితము "భ్రాత్రపుత్ర" అనురీతిని రేఫాదేశపాఠము నంగీకరించి సమర్థింపనగును. పయిదానిలోఁ గొన్ని ఋదంతసర్వావయవ ద్వంద్వములు కాకున్నను మొదటి రెంటిటికిని వేఱుగ నొక ద్వంద్వమును దక్కినవానికి వేఱుగ మఱొక ద్వంద్వమును నంగీకరించి యట్టి ద్వంద్వద్వయమునకును మరల ద్వంద్వమును ఘటించుటలోఁ బయి పాణినీయపద్ధతి చెప్పిన విరోధము కల్గనేరదు. ఈరీతిని మొదటి

---

వై సందర్భముంబట్టి గడపటిపదమునకు ముందున్న ఋకారాంతసంబంధమైన ఋకారమునకే యీ రేఫాదేశమనియు, దీర్ఘ ఋకారాంతములుగా నుదాహరించిన ప్రయోగములెల్ల రేఫాదేశాభావపక్షమున సంస్కృతవ్యాకృతి సిద్ధములగు నానజాదేశముచే నైనవనియు నిరూపింపశక్యమగుచుండ........" (బా. సా. పే. 3౫౮ పు.) ఈవ్రాఁత తాను విమర్శించుచున్న గుప్తార్థప్రకాశికవాదము నవగాహనముచేసికొని వ్రాసినట్లు తోఁచదు. గుప్తార్థప్రకాశికాకర్త యుదాహరించిన "మాతృపితృగురులు" మున్నగుచోట్లందు రేఫాదేశము సయితము రాదని కదా యాతఁ డుదాహరించెను. ఇట్టిస్థలములకుఁ దానేమియు సమాధానము వ్రాయలేదే. "దీర్ఘ ఋకారాంతములుగా నుదాహరించిన ప్రయోగములు" అని వ్రాసెను. అట్టిప్రయోగము నొక్కటినేని గుప్తార్థప్రకాశికాకర్త యుదాహరింపనే లేదు.

ఋకరంత సర్వావయవద్వంద్వము తర్వాత నెట్టివానితో నెట్టిసమాసమునందినను క్షతిలేదుగదా.

ఇంక నీక్రిందిప్రయోగములు పయిరీతిగ సంగతము కుదురుపడకున్నవి. క....నె । మ్మది నట్లుగఁ దలఁపఁగవల । వదె పితృపుత్రాది బంధువర్గమునధిపా. (శాంతి. ౪ ఆ. ౧౦.) సీ. పితృమాతృహీనునై యతినైచ్యవృత్తి నే, నెబ్భంగి (కాశీ. ౫ ఆ. ౩౧౧ ప.) వీనిలో మొదటిపద్యమున 'పితృపుత్రాది' అనియు రెండవపద్యమున "పితృమాతృహీనునై' అనియు సవరించినచో ఛందోభంగము వాటిల్లును, కాన నివి యానఙ్ఙు రాఁ దగిన స్థలములు గావని కవిబ్రహ్మ కవిసార్వభౌములు తలంచి రనకతీరదు. లేదా యీరెండు ప్రయోగములను నీక్రిందిరీతిని పాణినీయపద్ధతిని గుదురుపాటు చేయవచ్చునేమో? "ధర్మధర్మిణో రభేదః" అను చొప్పున "మాతుః పితుశ్చ హైన్యం యస్య సః" అను త్రిపదబహువ్రీహియందు "ద్వన్ద్వ తత్పురుషయో రుత్తరపదే నిత్య సమాసవచనమ్" అను (సి. కౌ. తద్ధితార్థోత్తరపద సమాహారేచ (౨-౧-౫౧.) అను ౭౨౭ సూత్రముక్రింద) వార్తికముచొప్పున మాతృపితృశబ్దములకు నిత్యముగు ద్వంద్వసమాససంజ్ఞ (రుహో విభాష కపవాద) యున్నను నుత్తరపదపరకత్వాభావమున "ఆనఙ్ఙు రానేరదు, కావున రేఫాదేశమును రాదు. ఇట్లె ఆనఙ్ ఋతో ద్వన్ద్వే" అను సూత్రమునఁ బుత్రశబ్దపరకత్వ ముపదేశింపఁబడఁ లేదుగాన పుత్రశబ్దము ననువృత్తిచేసి వాక్యభేదమున నన్వయించుటచేత నట్టివిధి లక్ష్యానుసారముగ వర్తించునే కాని సార్వత్రికము కానేర దనెడి పాణినీయ పద్ధతిచొప్పున ననిత్యమగుటంజేసి "పితృపుత్రాదిబంధువర్గము" అను చోట "ఆనఙ్ఙు" రాకున్న రాకపోవచ్చును, కాన రేఫాదేశము నట్టిదేయనవచ్చును. అనియీరీతిని సమర్థింపనగునని యు నాలోచింపనగును.

లేదా! యిట్టిమార్గములం దరుచిచేతనే కావలయు నీక్రిందిరీతి నీ యానఙా దేశవిషయక పాణినీయ వ్యాఖ్యాతల మార్గములను శ్రీరామగంగాధర తర్క వాగీశ భట్టాచార్యుఁడును నంగీకరింపలేదు. "హోతాచ పోతాచ నేష్టాచ హోతృ పోతృ నేష్టారః. ఇత్యత్ర నస్యాత్. నే (సమాసే) సర్వాది దమ్ (ద = పద) ఆనిదమ్. సర్వాన్తద ముత్తరద మితి పూర్వాచార్యవ్యవస్థితమ్. అతః పోతృశబ్దేన వ్యవహిత త్వాత్. హోతృ పోతృ నేష్టారశ్చ ఉద్గాతాచ తే హోతృ పోతృ నేష్టోద్గాతారః ఇత్యత్రతు స్యాదేవ. సమస్తా సముస్తయో ర్దయోః పునశ్చ ఇతి పూర్వోత్తర వ్యవస్థాయా అవిరుద్ధత్వాత్" (ముగ్ధ సమాస. ౩౨౧ సూ. వ్యాఖ్య.) ఈపక్షమున "ఋకారాన్తద్వన్ద్వే పూర్వపదసంబన్ధియో ఋకారః........" అను నహోబల

పండితవ్యాఖ్య చెప్పిన ఋదంతోత్తరపద పరకత్వమున సమాస పూర్వపదీభూత ఋదంతశబ్దమునకే యానజాదేశము వచ్చునని యంగీకరింప నగుటచేత "మాతృపితృభావనే"త్యాది సమాస స్థలములందు మాతృశబ్దమే పూర్వపదమును భావనాశబ్దమే యుత్తరపదమును నగుటచేత నట్టియెడల నానజాదేశము రానేరదని సమాస పూర్వపదోత్తరపద వ్యవస్థచెప్పవఁ జెప్పవలసి యున్నది. 'మాతాపితరౌ - పితాపుత్రౌ' మున్నగు ద్విపదద్వంద్వములందు మాత్రమే యానజాదేశము వచ్చుననియు నట్టిద్వంద్వము సమాసాంతర ప్రవిష్టమగునపు డానజాదేశము రానేరదనియు నీమతమున నేర్పడుచున్నది. ఈపక్షమునఁ బైనుదాహరించిన నన్నయ తిక్కన ప్రయోగములలో "నిజమాతాపితృపక్ష ప్రబలథ। యా పవాఁడు..." (ఆది. ౨ ఆ. ౧౬౨.) "క.....మాతాపితృ భా। వన నతఁడు వారిఁ బ్రోచిన..." (శాంతి. 3 ఆ. ౪33 ప.) అనుచోటులం దానజ్జున కెట్లు ప్రసక్తియని శంకింపరాదు. ఆప్రయోగములలో నానజ్జు రాలేదనియు, నచటి 'మాతా' శబ్దమాకారాంత స్త్రీలింగమనియు నీపక్షమున నెన్ననగును. "మాతా-స్త్రీ. (మా+అతచ్) జనన్యామ్, విశ్వేశ్వరీం విశ్వమాతా మితిదుర్గాస్తవః" (శబ్దస్తో), "మాతా - ఆ - స్త్రీ, జననీ, యథా - విశ్వేశ్వరీం విశ్వమాతాం। చణ్డికాం ప్రణమామ్యహమితి శివరహస్యే దుర్గాస్తవదర్శనాత్" (సర్వశబ్దసంబోధిని.) ఇట్లె యహోబలపండితీయోదాహృతమగు 'మాతాపితృబుద్ధి సీత మదిలోనెంతున్' అను ప్రయోగమునందును నాకారాంత స్త్రీలింగ మాతాశబ్దమె ప్రయుక్తమయ్యెనని గ్రహింపనగును. ఇట్లే యందలి "మాత్రపితృబుద్ధి వైదేహపుత్రిఁ దలంతు" అనుచోట సహితము "మాతృపితృబుద్ధి" అను పాఠము నంగీకరించి సంయుతాసంయుత ప్రాసమున సమర్థించికొననగును.

ద్వన్ద్వేతు స్త్రీవదిత్యాది:—ద్వన్ద్వేతు = వర్ణనిర్దేశవిషయమున, వర్ణములను బదములుగ నంగీకరించి ద్వంద్వసమాసము చేయునపుడు, స్త్రీవత్ - ఇష్టంస్యాత్ = ద్వంద్వసమాసాంతవర్ణము స్త్రీసమరూపముతో నిల్చుటయు సమ్మతమగును. అక్షరము లమహత్తులుగాన మువర్ణకాంతములు కావలసియున్నను స్త్రీసమరూపముతోఁ బ్రయోగింపఁబడుటయు తఱుచని తాత్పర్యము. క్వచిత్ = ఒకానొకప్పుడు - మునాపిచ రూపమ్ = మువర్ణకముతోడిరూపము గన్పట్టును. ఉదా:—చజలు = చకార జకారములు = చాయును జాయును = చజములు. మొ. దీర్ఘః స్యాద్వర్ణనిర్దేశ ఇత్యాదికారికల పరిశిష్టము. (౨౯ I విమ.) ప్రయోగములు:—క.ధర జఝలను నీరెండ। ఖరములు........। మరజలవములను వేన। ఖరములు........

(కవిజ. సంజ్ఞాధి. ౭౨ ప.) క. పోలఁగ పుఫుబుభులకు మూ। పోలికవడి. (కవిజ. సంజ్ఞాధి. ౭3 ప.) క. అ ఆ లై ఔలకు మఱి। ఇ ఈ లు ఋకారసహిత మె ఏలకు నా। ఉ ఊల్ దమలో నొడఁబడి। ఒ ఓ లకు పళ్ళగున్ నయోన్నచరితా. (కవిజ సంజ్ఞాధి. ౬3 ప.) క. వలసినచో లళముల్లు డళ। ములు మఱి ఋక్రాంప వర్ణములు ప్రాసములై।......... (కవిజ. సంజ్ఞాధి. ౯౦ ప) (ఇట్లు గణపగము లైన యక్షరముల ద్వంద్వమునందును స్త్రీసమరూపములు మువర్ణకాంతరూపములును బ్రయోగదృష్టము లగుచున్నవి. ఉ. భానుసమాన విన్ భరనభారలగంబులఁ గూడి.........(కవిజ. వృత్తాధి. ౧౦౨ ప.) చ.........నజభజాజలు రేఫముఁ గూర్చి సత్కవుల్. (అప్పక. ౪ ఆ. ౨౪౬.) పంచచామరము. కనద్యకారరంబుతో జకారమున్ రజంబులున్। జగన్ గకారయుక్తిఁ బంచచామరంబగున్. (కవిజ. వృత్తాధి. ౮౨ ప.) 'ఆ ఐ-ఔలకు' మున్నగు ద్వంద్వములలోని, విసంధులు. 'అ-ఆలు' మున్నగుచోటులందలి పూర్వాక్షరగౌరవములు మున్నగునవి కేవలము వింతప్రయోగములు.

అన్యత్రాపీత్యాది:—అన్యత్రాపి = సమాహార ద్విగుసమాసేతరమగు సమాహారద్వంద్వసమాసమందును, క్వచిత్ = ఒకానొకప్పుడు, ఏకవచనము, భవేత్ = అగును. సమాహారద్వంద్వమున సంస్కృతపద్ధతి ననుసరించి ప్రాణితూర్యసేనాంగాదుల కేకవచన మెట్లును నగును. అదిగాక యితరస్థలములందును సమాహారద్వంద్వము న నేకత్వమగును. "అన్యత్రాపి క్వచి ద్భవే దిత్య నేన కాలు సేయి ఇత్యాదావేకత్వ మితి జ్ఞేయమ్. వస్తుతస్తు ప్రాణ్యంగత్వే నైవాత్రైకత్వం సిద్ధమ్. (౨౬౪ VIII విష.) సూత్రాగమ్యేణతు 'తన కూడు సీరకై కాంచన ముడిగి' (శాంతి. 3 ఆ. ౧౬౪) ఇత్యాదయస్త్విక్కయజ్వాది కవిప్రయోగా స్సాధవః." (అహో. ౪3౨ పుట.) సంస్కృత సమాహారద్వంద్వపద్ధతులు ౨౬౪ VIII విషయమున వివరింపఁబడెను. కాని యవి సాకల్యముగఁ దెనుఁగున నంగీకరింపఁబడలేవు. సంస్కృతమున ప్రాణ్యంగాదుల సమాహారద్వంద్వస్థలములం దితరేతరయోగ ద్వంద్వము వర్తిల్లదు. తెలుఁగున నట్లుకాదు. "ద్వంద్వం బప్రాణివాచక కృదంత శబ్దఘటితం బేకవచనాంతంబు నగు. ఉదా:—కూడు గుడ్డ. కూరగాయ (జై. ౪ ఆ.) దరిదాపు (భోజ. ౨ ఆ.) రేవగలు. (రామా. ౨ ఆ.) కాఁకుందగులు. (హరి. ఉ. ౫ ఆ.) ను శబ్దంబుచే కూరగాయ లిత్యాదులు బహువచనాంతంబులును నగునని యెఱుంగవలయు" (ప్రౌఢ. సమా. 30 సూ.). ప్రయోగములు సీ. కూడు గూరలు దొరకాల్పి.........(శాంతి. 3 ఆ. ౧౭౭.) "..........ఉ..........కూర

గాయలుం । గోయుచు..... (ఎన్ని. కు. సం. ౬ ఆ. ౬౬౭ ప.)" (సూ. రా. ని.) సీ.........ఆ-వె.........కూరగా।యలును వంటకట్టియలును గడ్డి।......... (ఉద్యో. ౧ ఆ. ౯3 ప.) గీ. కూరగాయ కట్టియ విల్చి కొనఁగవలసి. (హరి. పూ. ౬ ఆ. ౫ ప. సూ. రా. ని. కూరశబ్దమునొద్ద) "కాలుసేయూడుతఱియందుఁ గదలవలయు" (కాశీఖండము. గా౹.౨౮౨ పుట.) "కాలుసేయి ఇద్యాద్యావేకత్వమ్." (అహో. ౪3౨.) కాలు+చేయి = కాలుసేతులు. (బా. సంధి. ౧౫ సూ.) సీ. అడవులఁ గొండలఁ బడి యాలుబిడ్డ ల; బ్టెటుఁగని వైరి ధాత్రీశులందు. (విర్వ. ౧ ఆ. 3౭ ప.) ఆ-వె. ఆలుబిడ్డ లేని యట్టి త్రిమ్మరి యగు. (ఉద్యో. ౨ ఆ. ౯.) పయిని జూపిన ప్రయోగములనుబట్టి ప్రాణ్యంగాదులకే సమాహారద్వంద్వ మనెడి సంస్కృతవ్యాకరణ నియమమును దెలుఁగున లేదని విశదమగుచున్నది. "గీ. అత్తమామ నాఁగ నాలు మగండనఁ । గొడుకుగోడలనఁగఁ గొఱుచేయ (కొఱు = నాకెఱుదు. చేను=కొఱుదు.) నాఁగ రేయి పగలు నాఁగ నిట్టి సమాస। ములును గలుగుఁ గవులు దెలియవలయు". (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౪౧ ప.) ఆ-వె తల్లిదండ్రులన్నదమ్ములు గూడ్గూర । లెలమి నాలుబిడ్డ లెద్దుబండ్లు । బఁటుతేఁడు లాటపాటలు నుభయప్ర । ధానమునకు నివి యుదాహరణలు. (ఆ. భూ. ౧౧౭ ప.)

**ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు. ౭.**

బాలవ్యాకరణ వివరణము. ౨౮౬ I విషయము.

అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరువల్లెలు - ఆలుమగలు. మగఁడును+బిడ్డలును, పల్లమును+కళ్లెమును, ఇత్యాదులు సమసింపవని యీ నియమంబున నెఱుంగునది.

సంజీవని. ౨౮౬ I విష:—'ఆచ్ఛికంబుతోడ' అను తృతీయాంత ప్రయోగముసంజేసి ద్వంద్వమున నుత్తరపద మాచ్ఛికమాత్రమయినం. బాలుననియు 'స్త్రీసమంబు' అను ప్రథమాంత ప్రయోగమునంజేసి ద్వంద్వమున మొదటిపదము స్త్రీసమముగు నాచ్ఛికమే కావలయుననియు స్పష్టపడుచున్నది. ఇట్టి లక్షణములుగల యాచ్ఛికద్వంద్వసమాసకమును సిద్ధద్వంద్వసమాసము సర్వము సాధువులనియుఁ దద్భిన్నములు సాధువులుకావనియుఁ దాత్పర్యము. ఈవిషయమునె "మగఁడును+బిడ్డలును" అనురీతి పుంలింగసమపూర్వపదకస్థలములును, 'పల్లము+కళ్లెము' అనురీతి నపుంసకసమస్థలములును ద్వంద్వసమాసయోగ్యములుకావని సూరి వివరించెను. దీనినిబట్టి మిశ్రద్వంద్వసమాసములును సాధ్యసాంస్కృతిక ద్వంద్వములును

సాధువులు కానేరవని విశదమగుచున్నది. "స్త్రీసమములయిన తత్సమములు తత్సమములతోఁగలసి యొక్కొకచో ద్వంద్వములగును. ఉదా:—కర్తకర్మ క్రియలు. మొ........" (ఆం. భా. అ. సమా. ౨౩ సూ.) అను ననుశాసన సూత్రోదాహరణములు సాధువులుకానేరవు. 'కర్త కర్మ క్రియలు' అనునది వ్యావహారిక రూపమేకాని కవిప్రయుక్తముకాదు. ఇట్టి లక్ష్యలక్షణములకుఁ బ్రామాణికకవి ప్రయోగముగాని ప్రామాణికలాక్షణిక సూత్రముగాని యాధారములేమింజేసి యవి గ్రాహ్యములుకావు. తల్లిదండ్రులు మున్నగుచోట్ల సంధి - ౧౫ సూ - చొప్పున గసడదవాదేశము సరయనది. పయి బాలవ్యాకరణనియమములకు లొంగని కొన్నివిధములగు ద్వంద్వసమాసములు కవిప్రయోగదృష్టములు త్రిలింగ లక్షణశేషమునఁ జూపబడినవి. 'ఒకానొకచో ద్వంద్వంబునం బూర్వపదంబు క్లీబపదంబగు. అగుచో నా మువర్ణకంబునకు లోపంబగు. ఉదా:—అందచందములు (కని. ౫ ఆ.) (అందము+చందము). వెచ్చసచ్చములు (వేం. పంచ. ౧ ఆ)" (ప్రౌఢ. సమా. ౨౯ సూ.) (వెచ్చము+సచ్చము = చిల్లర రొక్కమప్పు)

సీ. చెల్లుచెల్లముల కెక్కింపవచ్చిన సొమ్ము మగుడ నీలేని కోమటిగులాము । చే నేత విశ్వసించినవారి వెచ్చసచ్చముల బెల్పులుచు వైజాతితొండ (పంచ. వేం. ౧ ఆ.) (వైజాతితొండ శబ్దము నొద్ద. శ-ర) (వైజాతితొండ = ఊసరవెల్లి - ఊసరవెల్లి వంటి వేసాలమారియని యర్థము.) ("అందచందము = విణ (అందము.) అందమైనది. మనోహరము. గీ....అందచందమగుచు । నొనరు నుచ్చైశ్శ్రవంబు నేత్రోత్సవముగ (దశా. ౨ ఆ. ౨౨౭.)" (సూ. రా. ని.) "ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును, అందలి పూర్వపదంబు క్లీబసమంబునుగఁ గానంబడియెడి. ఉదా:—అవసరముక్కలులు. క. అవసరముక్కలులం గై । దువు కర్జములందు వేఁట దోఁటలయందున్ । దవులైన ప్రాఁతవెంకల । మవుటన్ (రామా. ౨ ఆ)" (ప్రౌఢ. సమా. 33 సూ.) ఇది యనింద్య గ్రామ్య మనఁదగును. కావున దీనికిమాత్రమె సాధుత్వ మెన్నునది. "కొన్నియెడల మహద్ద్వంద్వంబునం బూర్వపదాంత్య స్వరంబునకు దీర్ఘంబును జూపట్టెడు. ఉదా:—అన్నాదమ్ములు. (ఉ. హరి. ౪ ఆ) అప్పాచెల్లెండ్రు. (నిర్వ. 3 ఆ.) తల్లీదండ్రులు (భల్లా. ౪ ఆ.)" (ప్రౌఢ. సమా. ౨౮.) ఈప్రయోగములు కవిప్రయుక్తములని విశ్వసింపరాకున్నవి. క. సన్నిధిఁ బన్నగహారుఁడు । పెన్నిధిఁగని పొంగుచున్న పేదలక్రియ న । య్యన్నాదమ్ములఁ గని మిా । కెన్నఁగ నేవరము లిచ్చు యిచ్చెద వానిన్. (ఉ. హరి. ౪ ఆ. ౧౫ ప.) అను నీ సోమనపద్యమున "అ । య్యన్నందమ్ములఁగని" అని కవిప్రయుక్తమనుటలో

కృతికానరాదు. నిర్వచనోత్తర రామాయణపద్యము:—"క. విను మున్నదితియు దితియును। ననఁ గశ్యపుభార్య లిరువు రప్పఁ జెలియ లి। ట్లనిమిషుల నసురగణముం। గనిరి........" అని తాళపత్త్రమాతృకలలో నున్నది. (విస్తర. ౭౯ I విమ.) ఇట్లె భల్లాణచరిత్ర పద్యమునందును "తల్లిదండ్రియు" అని కవిప్రయుక్తమగుటలో బాధకానరాదు.

| | |
|---|---|
| బాలవ్యాకరణ వివరణము. ౨౮౬ II విమ | ద్వంద్వంబునందు ఋకారంబునకు ర వర్ణంబు విభాష నగు. ౨౮. మాత్రపితలు, మాతాపితలు, ఇత్యాదులు. |

సంజీవని. ౨౮౬ II విమ:—"ఉర్ ద్వన్ద్వే రః" అను చింతామణి సరిగ సూరిచే భాషాంతరీకరింపఁబడినది. అథర్వణాహోబలపతి సమన్వయముల జాడ (౨౮౬ విమ.) యీసూత్రమందుఁ గానరాదు. కాని వారి సమన్వయముల కను కూలముగ వారిచ్చిన యుదాహృతులె సూరిచేఁ జూపఁబడినవి. అనఁగా రవర్ణాదేశ మానజాదేశ సమాన స్థానిక మన్నట్లె రవర్ణాదేశముతోను 'అనజా' దేశముతోను నుదాహరింపఁబడెను.

| | |
|---|---|
| కన్నడా ౨౮౭ విమ | క్వచిత్సమాసే న్తగస్య। శబ్దస్యాదావపి స్థితిః. (విక్ర. హలం. ౧౭ కారి. అహో. ౪౩౫ పు.) |

కల్పతరువు. ౨౮౭ విమ:—క్వచిత్ = ఒకానొకప్పుడు, సమాసే = (ద్వంద్వ) సమాసాంతనమున, అన్తగస్య = తుదినున్న శబ్దముతో నన్వయింపఁదగినట్టి శబ్దస్య = శబ్దమునకు, ఆదావపి = సమాసపూర్వపదమునందును, స్థితిః = ఉనికి యనఁగాఁ బూర్వపదముతో సైత మన్వయించుట సమ్మతముగునని తాత్పర్యము. ఈవిధి ద్వంద్వేతరంబను విశేషణోభయపద కర్మధారయమందును నుపచరించును. ఉదా:— కాల్సేయి వడఁకు, తోవదమ్మి విందు, పుట్టుగ్రుంకు గట్లు - కన్న పెంచినవారు - విన్న కన్నయది. మొ. "కన్నపెంచినవారు ఇత్యత్ర అంతగస్యాపి తచ్ఛబ్దార్థస్య పూర్వత్రాప్యన్వయః - క్వచిత్సమాసే న్తగస్య......ఇత్యాద్యథర్వణవచనాత్" "కన్న పెంచినవారు విన్నకన్నవారు ఇత్యాదౌ ద్వన్ద్వసమాసః" (అహో. ౪౩౫ పుట.) 'కన్న పెంచినవారు' ఇత్యాదులు విశేషణోభయపద కర్మధారయములనుట లెస్స. (౨౭౯ విమ.) (౨౭౧ విమ. ౨౭౧ I విమ.). "ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపం బొండెనగు. ఉదా:—పుట్టుగ్రుంకు గట్లు. (య. ౫ ఆ.) తోవ దమ్మి విందు. (రామా. ౩ ఆ.) విన్నకన్నది. (వి. పు. ౨ ఆ.)" (ప్రౌఢ. సమా. ౩౨

సూ.) పుట్టు గ్రుంకుగట్లనఁగా పుట్టుగట్టు గ్రుంకుగట్టు = ఉదయాస్తాచలములని యర్థము.

భాషేయ మమితా తత్ర । దేశ్యాచిత్ర స్వభావయుక్ ।
తచ్చిత్ర తానురు_త్తవ్యా । పూజ్యపాద సుభాషితే
(వికృ. క్రియా.3౬ కారి. అహో. ౫౧3 పు.) భూయసీ

సన్నయా. దేశ్యశబ్దేషు । లోపవర్ణాగమ శ్రుతిః (వికృ. అజం.

౨౮౫ విషయము. ౯౪ కా. అహో. 3౭౨ పు)

త_త్తత్పదం పరిగ్రాహ్యం । యస్య త్సహ్యాదయే
హితమ్. (వికృ. అజం. ౯3 కారి. అహో. 3౭౧ పు.)

కల్పతరువు. ౨౮౫ విష:—ఈ కారిక లీసఅరు వ్యాఖ్యాతములు. (౮౫ I విష. ౨౮౧ విషయ.)

సమాసములం దనేకవిధము లగు లోపవర్ణాగమాదేశాదులు సంభవించు చుండును. అట్టివి మహాకవిప్రయోగములు మూలమునఁ దెలిసికొనవలయును. "కృత్తద్ధిత సమాసానా । మభిధానం నియామకమ్ । లక్షణం త్వనభిజ్ఞానాం । తదభిజ్ఞానసూచకమ్" (ముగ్ధ. ౧౧౮3 సూ విసృతి) అని సంస్కృతవైయాకరణులు సైతము సమాసవిషయములు దిజ్మాత్రప్రదర్శన యోగ్యమాత్రములె యని వచించి యున్నారు. "పృషోదరాదీని యథోపదిష్టమ్ (౬-3-౧౦౯.) పృషోదరప్రకారాణి శిష్టై ర్యథోచ్చారితాని తథైవ సాధూని స్యుః - పృషత్ + ఉదరమ్ = పృషోదరమ్ (తలోపః)........"(సి. కౌ. సమాసాశ్ర. ౧౦3౪ సూ.) ఉదా:—నలువది - ఆఱువది - ఇరువది - ఎనుబది - డెబ్బది - 'అలవడు' మున్నగు శబ్దపల్లవములందలి కార్యములును నిట్టివె - అలవు+పడు = అలవడు - వెలుపల+పడు = వెలువడు - తలఁపు+పోయు = తలపోయు - తెల్లవాఱు - మొ. కవ్వడి - (కవ+వడి) = రెండుచేతులందును వడిగలవాఁడు - నిక్కల (నిక్కము+కల) = నిజమగుకల. మూఁడు+నాళ్ళు = మూన్నాళ్ళు - నాన్నాళ్ళు (నాలుగు+నాళ్ళు) అంత+దాఁక = అందాఁక ఆవు+తోఁక = ఆఁదోఁక. సగము+పాలు = సగపాలు = సాఁబాలు. ప్రయోగములు:—చ......పిం । గళ నయనుం డుమేశ్వరుఁడు గవ్వడి డాయఁగ వచ్చెఁ జెచ్చెరన్ (అర. ౧ ఆ. 3౦౧.) క. నాకల నిక్కల యయ్యెడు । శోకింపకు మమ్మ (అర. ౬ ఆ. ౪౦౦.) సీ...తే-గీ...సు । ధాంశులును వచ్చు మున్నూట యఱువదింట (శాంతి. ౫ ఆ. ౪౬.) క. ఎనుబదియొనిమిది వేవురు । దనుజుల కాధ్యుండు.........(ఉ. హరి. ౪ ఆ. ౬.) ఏ+నాఁడు = ఎన్నఁడు. క...... గ్రు । చ్చినఁద్రెళ్ళి యున్నఁడో చ । చ్చినయట్లు (ద్రోణ. ౨ ఆ. ౫౧.) మొ.

బాలవ్యాకరణ నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యం
వివరణము. బులు. ౨౦.

౨౮౮ I విషయము. నిక్కల - కవ్వడి - పువ్విలుకాఁడు - ఇత్యాదులు.

సంజీవని. ౨౮౮ I విష:—నిక్కల = సత్యమైనకల. కవ్వడి = సవ్యసాచి. పువ్విలుకాఁడు = మన్మథుఁడు. 'నిక్కము+కల = నిక్కల.' అనుచో గతసూత్రములప్రకారము 'నిక్కపుఁగల' అని యేర్పడును. ఇటఁ బ్రాఁతాదిసంధిచొప్పున 'నిక్కల' అని కానేరదు. "నిక్కము+కల = ని+కల" అనుచో లుప్తశేషమునకు బా. సంధి. 32 సూత్రముచొప్పున నుగాగమము రాఁగా 'నింగల' అను ననిష్ట రూపము సిద్ధించును గావున 'నిక్కల' అనునది మహాకవిప్రయోగానుసారముగ సాధువని ప్రకృతసూత్రమునకు లక్ష్యము కావలసెను. 'కవ+వడి' = కవయందు (చేతులజంటయందు) వడి = బాణమువేయుటలోని వేగము గలవాఁడను విగ్రహము చొప్పున వ్యధికరణ బహువ్రీహిచే నర్థసిద్ధి గల్గుచున్నది. కాని యట్టియెడ 'కవవడి' అనియే కావలసియుండును. అట్టి ప్రయోగములు లేవు. ఇంక 'కవ్వడి' అనురూపమే ప్రయుక్తమగుచున్నది గాన నిది ప్రకృతసూత్రమునకు లక్ష్యమగుచున్నది. (౨౮౫ విష.) మఱియు వ్యధికరణ బహువ్రీహి స్వరసము కామింజేసి (విస్తర. II ౨౬౮ VI విష.) యిది ప్రయోగానురోధమున సాధువగుచుఁ బ్రకృత సూత్రమునకు లక్ష్యమగుచున్నది. "కవశబ్దం బాద్యక్షరశిష్టంబగుటయు ఉత్తర పద వకారంబు ద్విత్వం బొందుటయు తద్ధితపరిచ్ఛేదంబులోని పదునొకండవ సూత్రంబుచే నయిన 'కా' ప్రత్యయంబు లోపించుటయుఁగలిగె." (బా. గు. ప్ర. సమా. ౨౦ సూ. వ్యాఖ్య. ౨౭౬ పుట. ద్వి. ము.) బహువ్రీహి నంగీకరించుటచే సిద్ధించుచుండఁగా, 'కా' ప్రత్యయము ఘటింపనేల? దానికి లోపము చేయనేల? 'పువ్వు+విలు+కాఁడు' అనుచో 'వ్వు' వర్ణలోపమును పరపదాదిద్విత్వమును బ్రకృత సూత్రముచొప్పుననే సంభవించెనని యెఱుంగునది. బా - సంధి - 3౯ సూత్రము చొప్పున (అన్యంబులకు సహితము.........) నీ సూత్రపులక్ష్యములు మాఁటిని సాధింపరాదాయని శంకింపఁజనదు. అన్యంబుల కిత్యాదిసూత్రము సైతము ప్రయోగమూలకమె కావున నిది ప్రకృతసూత్రపు ప్రపంచమె యని గ్రహింపనగును. త్రిలింగలక్షణశేషమున నీసూత్రార్థమె పునరుక్తముగ నీక్రిందిరీతి నుప దేశింపఁబడెను. "అచ్ఛికసమాసంబులం దటఁమగ వర్ణలోపాగమాదేశ వికారంబులు నిత్యవైకల్పికములుగాఁ బెక్కులు గానంబడియెడి. ఉదా:—అందాఁక (అంత+దాఁక) ఇట్లు ఇందాఁక - ఎందాఁక - అచ్చతెల్పు (అచ్చము+తెల్పు) ఆఁడోఁక

(ఆవు+తోఁక) ఆవల (ఆ+వలను) ఇట్లు ఈవల. ఇబ్బంది (ఇరు+పంది) = (అడవి పందికిని ఊరఁబందికిని బుట్టినపంది). ఇరుసెవి (ఇరుకు+చెవి). ఉద్దరి (పెద్ద+దరి) = (వాటమై మిక్కిలి పొడవైన గట్టు) ఎడవంక (ఎడమ+వంక) ఇట్లు వలవంక. ఎగుదల (ఎగువ+తల). ఇట్లు - దిగుదల. ఏటవాలు (ఏటము+వాలు) కప్పురవీడెము (కప్పురము+వీడెము) <u>కవ్వడి</u> (కవ+వడి) కుఱుమాపు (కుఱుచ+మాపు) గందవొడి (గందము+పొడి) గుండ్రకడుపు (గుండ్రము+కడుపు) గొబ్బండు (గొప్ప+పండు) చిత్తరుబొమ్మ (చిత్తరువు+బొమ్మ) చిమ్మనగ్రోవి (చిమ్మనము+గ్రోవి.) చిఱుచప్పుడు (చిఱుత+చప్పుడు) చెంద్రకావి (చెంద్రము+కావి). ఇట్లు చందురకావి. చనుమఱి (చను + మఱిక) చప్పరమంచము (చప్పరము + మంచము) చొక్కసగతులు (చొక్కము+సగతులు = గుఱ్ఱము పల్లము మీఁది చక్కనైన తీఁగమోడిపని). తెగుదారి (తెగువ+దారి) దట్టకెంపు (దట్టము కెంపు) దొంతర (దొంతి+తరఁగ) నడురేయి (నడుము+రేయి) నాన్నాళ్ళు (నాలుగు+నాళ్ళు) నాటకసాల (నాటకము+సాల) <u>నిక్కల (నిక్కము+కల)</u> నిడుమోము (నిడుద+మోము) నెత్తపలక (నెత్తము+పలక) పసిపట్టు (పసిమి+పట్టు) పెందఱుము (పెనుపు+తుఱుము) పెత్తనము (పెద్ద+తనము) పొంగట్టు (పొన్ను+గట్టు) బాపురె (బాపు+పురె) బెబ్బులి (పెద్ద+పులి) బెల్లముండెఁగ (బెల్లము+ముండెఁగ) బొందళము (బొంత+దళము) బోనపుట్టిక (బోనము+పుట్టిక) మిండతపసి (మిండఁడు+తపసి) ముంగల (ముందు+కలను) ఇట్లు - వెనుకల. ముయ్యేడు (మూఁడు+ఏడు) ఇట్లు ముయ్యాఱు (ఈ రెండు శబ్దములు నీవఱకు సాధింపఁబడినవి. ప్రౌఢ. సమా. ౧౦ సూ. కాన నిటఁజేర్చుట సరికాదని తోఁచెడిని.) మోసల (మొగ+సాల) వలిపవెన్నెల (వలిపము+వెన్నెల) వలచెవి (వలను+చెవి) వాతెఱ (వా+తెఱపి) వాలురమ్ము (వాలు+అమ్ము) వేగురుఁజుక్క (వేగు+చుక్క) సగపాలు (సగము+పాలు) సాఁబాలు (సాము+పాలు) సుంకసరకు (సుంకము+సరకు) ఇత్యాదు లూహ్యంబులు........"(ప్రౌఢ. సమా. 3౬ సూ.)

ఇది సమాసపరిచ్ఛేదము = సమాసపరిచ్ఛేద మింతతో ముగిసెను.

# ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వము

## తద్ధితపరిచ్ఛేదము

---

స్వార్థే తసశ్చ వికృతౌ స్యాత్. (ఆం. చిం. హాలం. ౧౨ కారి. అహో. ౪౦౪ పుట.)

క్వచిత్ప్రత్యయ యోగేచ। తథాత్వ ముభిధీయతే.

నన్నయా. (వికృ సంధి. ౨౫ కారి. అహో. ౧౪౯ పు.)

౨౮౯ విష. అన్యేచ కేచిదుపయా।నో త్తర పదలోప రూపకాఖ్యా ద్యాః.........లోపశ్చ విభక్త్యాదేః। శబ్దేషు స్యా త్సమాస కాఙ్క్షేషు. (ఆం. చిం. హాలం. ౧౬-౧౭ కారి. అహో. ౪౩౧-౪౪౭ పు.)

కల్పతరువు. ౨౮౯ విష:—"తద్ధితః - పుం - వృత్తివిశేషే, తద్ధితా ఇత్యధికారవిహిత ప్రత్యయేషు. తేచ ద్వివిధాః - ప్రకృత్యర్థ భిన్నార్థాః - స్వార్థికాశ్చ, తేభ్యః ప్రయోగేభ్యో హితః" (శబ్దా. చిం) అనుకోశము చెప్పిన నాయాయర్థములకుఁ బ్రకృత్యర్థ భిన్నార్థ స్వార్థములకు హితమైనవనఁగా నాయాయర్థములను దెల్పునవి తద్ధితములని యర్థము. "తస్యభావస్త్వతలౌ. (౫-౧-౧౧౯.) ప్రకృతిజన్యబోధే ప్రకారో భావః, గో ర్భావో గోత్వమ్, గోతా." (సి. కౌ. తద్ధి. ౧౭౮౧ సూ.) "గుణవచన బ్రాహ్మణాదిభ్యః కర్మణిచ. (౫-౧ ౧౨౪.) గుణోపసర్జన ద్రవ్యవాచిభ్యో బ్రాహ్మణాదిభ్యశ్చ షష్ఠ్యన్తేభ్యో భావే కర్మణి చార్థే ష్యఞ్ ఇత్యర్థః (బాలమ.) జడస్య కర్మ భావో వా జాడ్యమ్. మూఢస్య భావః కర్మ వా మౌఢ్యమ్, బ్రాహ్మణ్యమ్........." (సి. కౌ. తద్ధి. ౧౭౮౪.) - మున్నగు సూత్రములచేత భావాద్యర్థములందు సంస్కృతవ్యాకరణమున 'త్వ' ప్రత్యయాదు లనేకములు విధింపఁబడినవి. అట్టి తద్ధిత ప్రత్యయాంతములెల్లఁ దెనుఁగునఁ దత్సమములుగ వాడుకొనఁ బడుచున్నవి. ఉదా:—గోత్వము - గోత - జాడ్యము - జడత్వము = జడత - మౌఢ్యము - మూఢత్వము - మూఢత - బ్రాహ్మణ్యము - బ్రాహ్మణత్వము - బ్రాహ్మణత. మొ. "యావాదిభ్యః కన్. (౫-౪-౨౯.) యావ ఏవ యావకః మణికః." (సి. కౌ. తద్ధి. ౨౦౯౭.) మున్నగు సూత్రములచేత స్వార్థిక కన్ ప్రత్యయాదులును

చెప్పఁబడియున్నవి. ఉదా:—యావము = యావకము. (లక్ష్య). మొ. ఇట్లె స్వార్థికాది తద్ధిత ప్రత్యయములును ననేకములు గలవు. అట్టివెల్ల బహులవిస్తృతములగుటచే సంస్కృతవ్యాకరణములవలననె తెలిసికొననగును. ఇంక నాచ్ఛిక తద్ధిత ప్రత్యయములఁనువిస్తృతములె యగుటచేత వానిలో జాతికొకటిగ భావార్థక స్వార్థిక ప్రత్యయములను దిక్ప్రదర్శనముగా భట్టారకుఁ డుపదేశించుచున్నాఁడు. త్వార్థే= సంస్కృతభావార్థక 'త్వ' ప్రత్యయముయొక్క యర్థమందు, వికృతౌ = తెలుఁగున, తనశ్చ స్యాత్ = తనప్రత్యయమును నగును. చ శబ్దముహిమచే 'ఇమి' మున్నగు ప్రత్యయములును భావార్థమునఁ గల్గునని యెఱుంగునది. సమాసవృత్తియందు వలెనె తద్ధితవృత్తియందును దద్ధితవిగ్రహవాక్యమందలి ప్రాతిపదికమున కవయవములగు సుబ్విభక్తులు (౨౬౮ I విష) సంస్కృతవ్యాకరణములోని "సుపోధాతుప్రాతిపదికయోః" అనుచొప్పున లోపించును. అట్టి తద్ధితాంత ప్రాతిపదికముపైని వాక్యాన్వయ యోగ్యములగు సుబ్విభక్తులు నిల్చును. ఈవిషయములకు లోకశ్చ విభక్త్యాదే రిత్యాది చింతామణిసూత్ర ముపలక్షణ మనఁదగును. ఇట్లె కృత్తులవిషయమునను నంగీకరింపనగును. ఉ. బంటుయొక్క+భావము = బంటుతనము=భటత్వము. ఉ. బంటుతనంబు మాటలకుఁ బాఱకు (ఉద్యో. 3 ఆ. ౫౯.) "బానసీఁడు - ద్వ - వి౹ - (బానసము+ఈఁడు.) ఉ......బానసీని నొకనిన్...... (భా. ర. విరా. ౧ ఆ.)" (శ-ర) "జాదరి. జాజరి. వి౹ - జూదము+అరి. ౧ జూదమాడువాఁడు. మ. అరయం దప్పాకయింత నావలన లే దాధర్మపుత్త్రుండు జూ I దరి వెంటన్...(భా. ఉద్యో. 3 ఆ. 3౫3.) (శ-ర)" యయి ప్రయోగములలో "బానసము+ఈ+ఁడు = బానస+ఈ+ఁడు = బానసీఁడు ; జూదము+అరి = జూద+అరి = జూదరి" అని ప్రక్రియ నరయునది. శూరుఁడు ధర్మివాచకము. శూరత్వము ధర్మవాచకము, శూరత్వ ధర్మముగలవాఁడు శూరుఁడు, శూరుని ధర్మము శూరత్వము. త్వప్రత్యయము వలెనే యీ తన ప్రత్యయముసైతము ధర్మివాచకములపైనె నిల్చును. కాన "బంటుతనము = భటత్వముగలవాఁడు = బంటు" అని యర్థము. ఇట్లగుటచే నీభావార్థక ప్రత్యయములు పోఁడిమి వాఁడిమి మున్నగు ధర్మవాచకముల పయి నిలువనేరవు. పెద్దతనము = చిన్నతనము మున్నగుచోటులందు 'పెద్ద-చిన్న' మున్నగు ధర్మివాచకములు స్త్రీసముని శేషణములుగాన వానిపయి షష్ఠీవిభక్తి నిలువనేరదు. కానఁ దద్ధితవృత్తి విగ్రహరచనకై వానికి విభక్తి వివక్షించునపుడు (౧౦౭-౨౭౧-౨౭౧ I విష.) తచ్ఛబ్దముతో నవి సమసించును గాన నట్టిరూపముతో విగ్రహరచనము చేయవలయుననియుఁ దద్ధిత ప్రత్యయము నిల్చునపు డా

విభక్తితోఁ దచ్ఛబ్దము సైతము లోపించి ప్రాతిపదికమే నిల్చుననియు తెలియం
నగును. ఉదా:—పెద్దదానియొక్క+తనము = పెద్దతనము. చిన్నదానియొక్క+
తనము = చిన్నతనము. ఇట్లే 'ఆకొన్నదానియొక్క+తనము = ఆకొన్నతనము'
మున్నగు క్రియాజన్యవిశేషణములును దనప్రత్యయాంతము లగునప్పటి ప్రక్రి
యను వర్ణింపనగును. తే-గీ. దుర్బుద్ధితనము మాని (కర్ణ. 3 ఆ ౧౫) (దుర్బుద్ధివాని
తనము.). సూరి యిట్లు వివరింపకున్నను గొప్పతనము మున్నగు నాతని యుదాహర
ణముల ప్రక్రియకు వేఱుమార్గము లేదు. ఇట్లు వీని ప్రక్రియ చెప్పనగునని తెలిసి
కొనక ప్రౌఢవ్యాకర్త "తనవర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థంబునకు లోపంబు
విభాషనగు.........పెల్లాకొన్నతనాన" (భీమ. ౨ ఆ.) (ప్రౌఢ. తద్ధి. ౨ సూ.)
అని పునరుక్తముగా సూత్రించెను. "తన. ప్ర. భావార్థమున వచ్చు తద్ధిత ప్రత్య
యము. .........కొన్నిచోట్ల క్రియాజన్యవిశేషణముల మీఁద విభక్తి నిమిత్తక
ముగు తచ్ఛబ్దము లేకుండఁగనే యియ్యది కనఁబడుచున్నది. ఉదా:—ఆకొన్న
తనము - ఒర్వలేనితనము. మొ." (సూ. రా. ని.) అని సూ - రా - నిఘంటువు పె
ప్రౌఢవ్యాకరణ విషయములను స్వీకరించెను. ఇది గాణపత వివరణమునందును
స్వీకరింపఁబడెను. (గాణ. తద్ధి. ౨౬౭ పుట.) క్వచిత్ప్రత్యయయోగే చేత్యాది
కారిక యీ (౨౪౧ I విష. ౨౭౦ విష.) వఱకు వ్యాఖ్యాతము. ది-ని ప్రత్యయ
పరకత్వమునందువలెనె (రామునిది శక్తి - దానిది కలరూపు - వారివ—నిశ్వాసముల)
యీ తనప్రత్యయ పరకత్వమునందును షష్ఠి ద్వితీయాకారమునందును. ఉదా:—
రామునియొక్క+తనము = రామునిన్+తనము = రామునితనము. సీతయొక్క+
తనము = సీత తనము. "యొక్క లోపించినట్టి డుమంతేతరాచ్ఛిక రూపములు
ప్రథమైకవచన తుల్యములై యుండును గాన నీప్రకరణమున నెల్లరూపములు
ప్రథమైకవచనములుగనే నిర్దిష్టములగును" (బా. సా. వే 3౬౦ పుట.) అను
వేటికావ్యాఖ్య కేవలము భ్రాంతిమూలకము. ఎల్లయెడలను నీ తనప్రత్యయము
షష్ఠ్యంతమునకుఁ బరముగా భావార్థమున వచ్చును. కొన్ని స్త్రీపరుశబ్దములకు
వచ్చునపుడు మాత్రమే పయి నుదాహరించినరీతిని తనప్రత్యయము చేరిన ప్రాతి
పదికమున కవయవముగు షష్ఠీవిభక్తి లోపించినట్లు కనఁబడు.తక్కిన పుంలింగ పదముల
కును నపుంసకలింగ పదములకును 'పెద్ద' మున్నగువానికిని దనప్రత్యయ పరకత్వమున
నట్టి ప్రక్రియ యుపచరింపదు. క్వచిత్ ప్రత్యయయోగే చేత్యాది కారిక చొప్పున
ద్వితీయాకారముతోనె నిల్చుటయు నచటిద్రుతము ద్రుతస్య సర్వత్రేతి సూత్రముచే
లోపించుటయు సంభవించును. తత్సమ శబ్దములకును నీ తనప్రత్యయము వచ్చు

టయు నచ్చుటి షష్ఠియు ద్వితీయాకారమునని నిల్పుటయు ద్రుతలోపము వచ్చు టయు సంభవించును. ఉదా:—మనుమనియొక్క+భావము (ధర్మము) మనమునిన్+ తనము = మనుమనితనము - విలుకానితనము - రాముని తనము - సీత తనము. మొ. "ఉ. సుందరుఁడు నేనను నసూయతనంబున........(దశకు. ౫ ఆ. ౮౫)... ఇట్లు స్వార్థమున 'తనము' కనఁబడుచున్నది." (సూ. రా. ని. తనము శబ్దమునొద్ద.) ఇట్టి ప్రయోగములు-భారతమందుఁ గన్పట్టవు. ఉదంత స్త్రీసమములకును నదంత గుణవాచకములకును 'తన' వర్ణకపరకత్వమున నుమాగమము ద్రుతకార్యములు నగును. (౨౨౯ ౭ I విష) సొగసుందనము తెల్లఁదనము - పరుసందనము. (ఉద్యో. 3 ఆ. ౨3.) 'పరుస' అను స్త్రీసమరూపమును గలదు. (చూ. శ. ర.) ప్రయోగ ములు:—క. నెట్టన సభలో నేవుర । కల్లెదుర నగాతితనము గాకెంతయు వా। రెట్టి తులువలో ద్రౌపది । నట్టుల వలువెడిదె జూదమాడ రె యొందున్. (ఉద్యో. ౧ ఆ. ౩౮౮.) తే.........<u>దుర్బుద్ధితనములు</u> మాని......(కర్ణ. 3 ఆ ౭౯.) (దుర్బుద్ధి = దుష్టబుద్ధిగలవాఁడు.) క. అని కొలిచి యే బృహన్నల । యను నామముతోడఁ గన్య కాంతఃపురవ । ర్తన మొనరించుచు <u>లాసిక।తనమున</u> నిపుణుండనై యతని మెచ్చిం తున్. (విరా. ౧ ఆ. ౭౯.) "లాసికా. స్త్రీ. (లస+ణ్వుల్) నర్తక్యామ్. లాసకా ఽప్యత్ర" (శబ్దస్తో.) క. వెలి పెట్టిదియో యున్నఁడు । నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో యీ । పిఱికితన మింత యేలవడఁ । గలిపినవా రనుచు శౌరి కలకల నవ్వెన్. (ఉద్యో. 3 ఆ. ౫౭.) ౯౭ I విషయమున 'చెడుగుందనము-అల్లందనము- పరుసం దనము - ఎలుకుందనము' అనువాని ప్రయోగములు గలవు.

| | |
|---|---|
| | తనవర్ణకంబు త్వార్థంబుసం దగు. ౧. త్వార్థంబనఁగా |
| బాలవ్యా. | భావంబు. ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు |
| వివృతి | భావంబు. రామునితనము, మనుమనితనము, సీత |
| ౨౨౯ I విష | తనము - గొప్పతనము - కొంచెతనము - నల్లఁదనము - |
| | పుల్లఁదనము. |

సంజీవని. ౨౨౯ I విష:—ప్రత్యయమునిల్పుటకుఁ బూర్వపుశబ్దము ప్రకృతి. రామునితన మనుచోటి ప్రకృతియగు 'రామునియొక్క' అనుదాని బోధ మున - "రామత్వా వచ్ఛిన్నో రామః=" రామత్వమను ధర్మముతోఁగూడినవాఁడు రాముఁడు = రామునితనముతోఁ గూడినవాఁడు రాముఁడు - రామునితనమను ధర్మము (రామత్వధర్మము) ప్రకారమగుచున్నది యని తాత్పర్యము. 'రాముని యొక్క+భావము (ధర్మము)' అనుచోటి యొక్క విభక్తి బా. సమా. ౨౫

సూత్రముచేత లోపించుననియు నా సూత్రములోని సమాసశబ్దము తద్ధితవృత్తికి నుపలక్షణమనియు లేదా "సమాసము మున్నగువాని, విభక్తికి = విభక్త్యాదులకు" అని యచట వ్యాఖ్యచేయవలయుననియు సూరియాశయము. కావున రెయొక్క విభక్తిలోపింపఁగా "రామునితనము" అని రూపసిద్ధియగునని తాత్పర్యము. ఇట్లె - మునుమునితనము - సీతతనము - మున్నగుచోటులను సమన్వయించుకొనునది. గొప్పతనము మున్నగుచోటులందు 'గొప్పదానియొక్క+తనము' అను విగ్రహమెన్ని విభక్త్యాదులకు లోపమును పైవ్యాఖ్యచొప్పునఁ దచ్ఛబ్దార్థశబ్దమునకు విభక్తితోఁగూడ లోపముగల్గఁగా 'గొప్పతనము' మున్నగురూపముల సిద్ధి గల్గునని గ్రహింపనగును. త్రిలింగలక్షణశేషకర్త యీరీతిని గ్రహింపక "తద్ధితప్రత్యయంబులు పరంబులగునపుడు పదంబుల డువర్ణకాదులకు లోపంబగు" (ప్రౌఢ. తద్ధి. ౧ సూ.) అనియు "తనవర్ణకంబు పరంబగునపుడు తచ్ఛబ్దార్థంబునకు లోపంబు విభాషనగు." (ప్రౌఢ. తద్ధి. ౨ సూ.) అనియు సూత్రించెను. ఈమార్గముచే "ఆకొన్నతనము" మున్నగు క్రియాజన్య విశేషణస్థలములుమాత్రమెకాక గొప్పతనము (గొప్పదానితనము) నల్లఁదనము (నల్లదానితనము) మున్నగునవి నైతము సిద్ధించునుగాని యందట్లు స్పష్టపఱుపఁబడలేదు. సూ. రా. నిఘంటుకర్త లీవిషయములను స్వీకరించుటలోఁ గ్రియాజన్యవిశేషణస్థలములందు మాత్రమె యీరీతి గల్గునని వివరించిరి. (సూ. రా. ని. 'తన' శబ్దము) (అర్వా విష.) కొంచతనము = అల్పత్వము. నల్ల+తనము - మున్నగుచోటులందు బా. సంధి. 3౫ సూత్రముచొప్పున నుగాగమమును ద్రుతకార్యములను నరయునది. ఈతన ప్రత్యయము సంస్కృత సమశబ్దములమీఁదనైతము నిల్చునని పండియుదాహృతులె విశదీకరించుచున్నవి. అట్టి కవిప్రయోగము లీవలకు అర్వా విషయమునఁ బ్రదర్శింపఁబడెను.

ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకంబగు. ౨

స్పష్టము.

బాలవ్యాకరణ వివరణము. అర్వా II విషయము

చిన్నాదులకు ఱికవర్ణకంబగు. 3. చిన్నఱికము. కన్నెఱికము. చిన్న - కన్నె - చుట్టము - దొంగ - పేద - మిండ - లంజె. ఇత్యాదులు చిన్నాదులు.

ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగునపు డగు. ౪

తొత్తఱికము - పెద్దఱికము - వెజ్జఱికము.

సంజీవని. అర్వా II విష:—ఇటననఁగా నీతద్ధితప్రకరణమున నుత్సర్గమునకనఁగా సామాన్యవిధికి విశేషంబు వైకల్పికముగా బాధకం బగును. విశేషవిధి

సామాన్యవిధికి నిత్యముగా బాధకము కావలసియున్నను నిచట వైకల్పికముగా మాత్రమె బాధకమగునని యర్థము. ఆకాదిప్రత్యయములు భావార్థమున విశేషవిధులు విధింపఁబడునుగాని యవి వైకల్పికముగామాత్రమె యగుననియు వానివానిచోటులందు సామాన్యవిధ్యుక్తమగు తన ప్రత్యయము ప్రయోగానుసారముగా నిల్చుచునేయుండుననియుఁ దాత్పర్యము.

3 సూ. వ్యాఖ్య. చిన్న-కన్నె మున్నగుశబ్దములకు భావార్థమున ఆకవర్ణకము పాక్షికముగా వచ్చును. ఆకవర్ణకము రానిపక్షమునఁ దనవర్ణకము నిల్చును. ఉదా:—చిన్నదానియొక్క+భావము (ధర్మము) చిన్నఆకము-చిన్నతనము. కన్నెఆకము - కన్నెతనము. చిన్నాదులాకృతిగణమనుచు గొన్నిటిని సూరియె వివరించెను. చుట్టముయొక్క+భావము (ధర్మము) చుట్టఆకము చుట్టఱికము చుట్టరికము... ఇట్టిచోటులందలి 'ము'అనుదానికి "పుం-పు"లను బా. సంధి. 3వ సూత్రము చెప్పిన నిత్యను గాక నుగాగమంబును 'చుట్టపుదనము' మున్నగురీతిని రూపములను సాధింపవలసి యున్నది. కాని తనప్రత్యయపరకత్వమున 'ము'వర్ణకమునకు 'పు-ంపు' లు వచ్చుటయు వానిపై నుగాగమము వచ్చుటయు లాక్షణిక మహాకవిప్రయోగసమ్మతములు కావు. అధర్వణ కారికకుఁ బొరపాటుగా సూరి యర్థము చేసికొనుటచే నాతఁడీవిధిని సూత్రములో నిల్పెనని యీవఱకు వ్రాయఁబడెను. (అం I విష. అం విష.) (విస్తర.). కావున, 'చుట్టముతనము' అనియె యుండనగును - చుట్టపుఁదనము మున్నగురీతిరూపములు

---

విస్తరము. అంగా II విష:—"తద్ధితవృత్తియైనను 'తన'వర్ణకంబు పరంబగుచోఁ దక్కిన ప్రత్యయంబులందుం బలెఁ బ్రథమావిభక్తి మువర్ణకంబునకు లోపంబు సామాన్యంబుగా రాదు. ఈయర్థంబు సంధిపరిచ్ఛేదములోని ముప్పది యేనవసూత్రముచే 'తన' వర్ణకంబు పరంబగునపుడు 'పుంపు'లకు.........నుగాగమంబు విధించుటంజేసి యనుమేయింపఁబడుచున్నది." (బా. గు. ప్ర. తద్ధి. 3 సూ. వ్యాఖ్య. అంగా పు. ద్వి. ము.) భావార్థక తనప్రత్యయము నిల్చునప్పటి విగ్రహములోఁ బూర్వపదము ప్రథమాంతమగుట యసంభవము. చుట్టముయొక్క భావము=తనము మున్నగుచోటులందలిది ప్రథమా 'ము'వర్ణకము కాదు. అది ముగాగమము. ఇతర తద్ధితములందును నంతటను బ్రథమాంతమె నిల్చుననుట పొరపాటు. "కుంచముయొక్క+పరిమాణము = ఎఁడు = కుంచెఁడు" మున్నగుచోటులందును బూర్వపదము షష్ఠ్యంతమె యగును. సమాసవృత్తియందే సమాసమునకుఁ బ్రాతిపదికత్వము నంగీకరించి తదవయవములకు సుబ్విభక్తులకెల్ల లోపము చేయు సంస్కృతవ్యాకరణపద్ధతి నంగీకరింపక సమాస మధ్యగత విభక్తికి మాత్రము

నంగీకరింపరాదు.) ఱిక ప్రత్యయప్రయోగములు:—గీ...బాల్యమగుఁ జిన్నఱిక మన........(ఆ. ౯. ౨-౧౧౭.) క... । కన్నెఱికపు రతియుఁబోలెఁ గడునిం పొసఁగెన్ (మనుచ. 3 ఆ. ౧౧౭.) ద్వి. కఱపినవాఁడవో కన్నెఱ్ఱ మిడఁగ - (పండితా. పురా. ౧౧౫ పు.) గీ. పాండవులు ధార్తరాష్ట్రులు పుండరీక । నేత్ర చుట్టఱికంబున నీకు నొక్క । రూప (ఉద్యో. 3 ఆ. ౧౨౬.) సీ. కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి, పట్టికి మేనక చుట్టఱికము (మనుచ. ౨౪. ౭3.) ఉ. దుర ముం దుర్గము గాయబారము మఱిన్ దొంగఱ్ఱమున్.........(కాళ. ౪. ౧౧౧.) (పయిఱిక ప్రయోగములు. సూ. రా. ని. లోనివి.) క. కడు పేదఱికంబుకంటెఁ గష్టము గలదే (విక్ర. ౨ ఆ. ౪. ౮.) మిండఱికము = జారత్వము. ఎ-గీ...... ఈ వి । భుండు పదియాఱువే లాండ్ర పిండు నిండు । మిండఱికమున...(షాంచా. ౨ ఆ. ౪. ౮.) ద్వి. ఎసఁగ లంజెఱిక మే నీరాత్రి సేఁత (బసవ. 3 ఆ. ౨౧౬.). ఱిక మనియు నర్వాచీనలువాడిరి. "ఱికము - దే - అప.........చ. అరయఁగఁ దల్లి కక్కసెలియుండ్రకు దక్కను గల్గినట్టి చు । ట్టరికము వారికిన్.........." (ప్రభా.

---

ప్రత్యేకముగా లోపమును విధంచుకొన్న సూరి ప్రక్రియలోఁ దద్ధితవృత్తిలోని విభక్తి లోపించుననెడి సంస్కృతవ్యాకరణపద్ధతి నుపయోగించుట యాతని యుద్దేశ మని విశ్వసింపరాదు. సూరి యీ తద్ధితవృత్తి విభక్తిలోప విషయమును స్మరింప కయె విడిచెనని తోఁచెడిని. ఇంక - బా - గు - ప్ర - వ్యాఖ్యపతుమున "రాముని తనము" మున్నగుచోటులయందు 'ని' మున్నగువాని లోపాభావ మెట్లు పొసం గును? ఇట్టియెడల నట్టిజ్ఞాపకములు లేవే. "చిన్నదానియొక్క+తనము" మున్నగు చోటులందుఁ దచ్ఛబ్దార్థకలోప మెట్లు? అట్లు వృత్త్యర్థకల్పనము చేయక సంప్రదాయ విరుద్ధముగ బా - పా - పే - వ్యాఖ్యాతవలె "చిన్నయొక్కతనము = చిన్నఱికము - తద్ధితవృత్తిని విభక్తిలోపము." (బా. పా. పే. 3౬౧ పు.) అని వచింపరాదుగదా. అచ్ఛికవిశేషణములపైఁ 'యొక్క' మున్నగు విభక్తులు నిల్చుట యాంధ్రవ్యాకరణ కవిప్రయోగ విరుద్ధముగదా. ఇంక సూరిగారి నుగ్విధాన జ్ఞాపకముచే ముపర్ణక లోపాభావమును సాధించుకొందు మన్నచో విరోధము లేదు గాని యట్టి నుగ్విధాన మును దానికి మూలమగు పుంపులస్థితియుఁ దనవర్ణకపరకత్వమున నిరాధారములై యగ్రాహ్యము లగుచుండుటచేత (౯౭ I విష. ౮౮ విష.) చుట్టపుఁ దనము - చుట్టంపుం దనము మున్నగురూపములు గ్రాహ్యములు కానేరవు. గుప్తార్థ ప్రకాశికాకారులేని యట్టి ప్రయోగములు చూపకయె వాని నుదాహరించుట యుక్తముకాదు. (బా. గు. ప్ర. తద్ధి. ౨౮౯ పుట.)

3 ఆ. ౪-౮.) "టెకము - దే. అప.........క.......వధ్యకు నకుం జే। దటెక మొసంగెనని యజా నం। దఱు దూఱుట.. ......(భో. ౨ ఆ. ౯-౯.) ౯. ఎఱుం గమి చీఁకటి నీ పె। ద్దటెకంబు దలంచి నేమి తప్పు కలిగెన్ । ......( ౯. ౫ ఆ. 3౫౭.) అని తిక్కన శకటము ప్రయోగించెనుగాన నదియె ప్రాచీనరూపము. ఇట్లు పెద్దశబ్దమును "చిన్నా"దులలోఁ జేర్పనగును.

౮ సూ. వ్యాఖ్య:—టెకము పరంబగుచో ముందటి 'ఉ'కార మకార మగును. తొత్తు+టెకము = తొత్తటెకము = తొత్తుందనము = దాస్యము. పెద్ద టెకము = వంచన = కాపట్యము. పెజ్జటెకము = వైద్యము. వీనిస్థితి కాధారముగఁ బ్రయోగములు లభింపలేదు. 'తొత్తటెకము' అనుదానికి శబ్దరత్నాకరములోఁ జూపఁబడుటయె ప్రమాణముగ సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెను. తక్కిన రెండును శబ్దరత్నాకరమునందుసైతము చూపఁబడలేదు. అందు పెద్దశబ్దము ధర్మవాచకముగ శబ్దరత్నాకరమునఁ బ్రదర్శింపఁబడియున్నది. ఆపక్షమున టెకము నిల్చుటే సరికాదు. ఇంక నీసూత్రమున కాధారమేమో తెలియకున్నది.

బాలవ్యాకరణ వివరణము. తెలుగు III విష. పేర్యాదుల కిమి వర్ణకంబగు. ౫.

పేరిమి - కడిమి - పేరు - కడు - ముచ్చు - మేలు

చెలి - పోఁడి - వాఁడి - వేఁడి - ఇత్యాదులు పేర్యా దులు.

సంజీవని. తెలుగు III విష:—పేరు మున్నగు శబ్దములకు భావార్థమున 'ఇమి' అను ప్రత్యయము వచ్చునని యర్థము. తనవర్ణకమునుఁ బ్రయోగానుసారముగ నగును. అర్థములు:—పేరు = అధికము - పెద్దది, కడు=గొప్పది, ముచ్చు = దొంగ, మేలు = శ్రేష్ఠము (మేలు = శుభము - శుభమైనది యని యి ట్లిది యర్థవిశేష ములలో ధర్మవాచకము - ధర్మివాచకము నయి యున్నది.) చెలి = మిత్త్రుఁడు పోఁడి = ఒప్పిదమైనది. ('ఒప్పు' అను ధర్మవాచిత్వమును గలదు.) వాఁడి = నిశితము (నైశిత్యమును ధర్మవాచిత్వమును గలదు.) వేఁడి = ఉష్ణము ('ఔష్ణ్యము' అను ధర్మవాచియు.) పేరు+ఇమి = పేరిమి = పేర్మి = ఆధిక్యము - గౌరవము. కడు+ఇమి= కడిమి = పరాక్రమము - బలము. ఈరెండుచోటులందును 'తన' ప్రత్యయ యోగము కానరాదు. 'పేరుతనము - కడుతనము' అనురీతిగల తనప్రత్యయాంత రూపములు లేవు. బలశబ్ద వికృతి బలిమి. కాన శంకాస్పదముకాదు. "కడిమి-యు - దే - వి. ౧ అతిశయము. గీ. కినిసి యొంకటి కడిమి న య్యనిలసుతుఁడు. (భా. రా. ౫ ఆ. ౧౦౧.).........3 పరాక్ర. ము ఆ. వె. సిలుఁ దంతిఁ గణుకుఁ దేలు

వెండ్రుకల రా। కాసిబంటుః బోడివి కడిమి నొక్క। కడిమిఁ బెఱకైనె కె గడి జేజేలు మి। న్నునఁ జెలంగి కన్గొనచుఁ బొగడఁగ. (ఉచ్ఛ రా. గు) (ఈ యర్థము ప్రశస్తముగాఁ దోచలేదు.)" (శ-ర) కడు శబ్ద భావార్థకరూపమగు కడిమి శబ్దమూ ధిక్యమును దెల్పుట సరి కాని పరాక్రమమును నెట్లు తెలుపునని శబ్దరత్నాకరక ర్తయెట్లు తలంచెనో తెలియకున్నది. సూ - రా - నిఘంటుక ర్తలు దీనిని మన్నింపక భట్టార కుఁడె పరాక్రమార్థమునఁ బ్రయోగించె ననుకొనుచు ని ట్లుదాహరించిరి. "కడిమి (డ్మి)వి. (కడు-త - కడుమై) ౧ బలము - పరాక్రమము-శౌర్యము. గీ......... నాకడిమి వినుము.........ఉ. క్రచ్చుఱ నొక్క రక్కసుఁడ కాఁడు సురాసుర లెల్ల నొక్కఁడై। వచ్చిన నీవచూడఁగ నవార్యబలోద్ధతిఁ జేసి వారలన్। చ్చి వధింతు.........(భార. ఆది. ౬ ఆ. ౧౯౮-౧౯౯.) కాని యీ భట్టారక ప్రయో గమున 'నా కడిమి విను మనఁగా నాయాధిక్యము = నాగొప్పతనము-విను మను నర్థము సుసంగతమై యున్నది. ఈరెండర్థములకు నిట్టి సాన్నిధ్య ముండుటచేతనే యర్వాచీనులు పరాక్రమార్థమునందును బ్రయోగింపసాగిరని యెన్నదగును. బా - సంధి - ౧౩ సూత్రము (౨౬ విష.) సమాస సంధి మాత్ర విషయక మగుటచేత 'కడు+ఇమి' అనుసంధిలో ద్విరుక్త టకారము రానేరదు. "చెలి+ఇమి = చెలిమి" మున్నగుచోట్ల బా - సంధి - ౧౧ సూత్రముచొప్పున (౨౫ విష.) నపదాది స్వర సంధి నిత్యముగ వర్తిల్లును. కొన్ని ముఖ్యములగు ప్రయోగములు:—
క. సత్యము। వలనన ములు సూపు గౌరవంబున పేర్మిన్. (ఆది. ౮ ఆ. ౯౫.)
సీ. జను లొక్క తఱిఁ దొల్లి సమయంబుఁ దమలోనఁ జేసి క్రూరతయు మ్రుచ్చి మియు ఆంకు। సైఁపక. (శాంతి. ౨ ఆ. ౨౫౭ శ. ర.) చ.........పగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా.(ఉద్యో. 3 ఆ. ౨౧.) క. చెలిమియు సంభాషణమును। బలిమి.........(ఉద్యో. ౨ ఆ. ౮౬.) చ.........ఘనముగఁ జెల్మి సేయుము... (ఆది. ౨ ఆ. ౧౨౬.) తరోజ. చెలితనంబున గంగ చెల్వ పార్వతికి,.........(హరి. ఉ. ౭ ఆ. ౭౫ సూ. రా. ని.) క. మూఁడక్షౌహిణు లిమ్మెయిఁ। బోఁడిమి సెడి పాఱఁ బవనపుత్త్రుని యెదురన్। వేఁడిమి సూఁపగ నొకఁడున్। వాఁడి మగఁడు లేఁడ యెమ్మనంగల దధిపా. (కర్ణ. 3 ఆ. 3౫౭.) క. వేఁడికొని కృపణులై కను। పోఁడిమి యుడిగియేల రాజపుత్త్రులు దమమై। వాఁడిమి దప్పిన నిప్పులు। వేఁడిమి చెడినట్లు జనులు విసి యులుకుదురే. (ఉద్యో. 3 ఆ. ౧౯౭.)

నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదుల కగు. ఉ.

బాలవ్యాకరణ వివరణము. ౨౮౯ IV విశే.

నల్లన - తెల్లన - నల్ల - తెల్ల - పచ్చ - ఎఱ్ఱ - చాయ - తియ్య - కమ్మ - పుల్ల - చప్ప - విన్న - తిన్న - అల్ల - ఒయ్య - తిమ్మ - చక్క - ప్రేక - ఇత్యాదులు నల్లాదులు.

సంజీవని. ౨౮౯ IV విశే:—గుణవాచకములగు నల్లాదులకు భావార్థంబునందు న వర్ణకమగునని యర్థము. సామాన్య విధ్యుక్తరుగు తనవర్ణకము సైతము పాక్షికముగా వీనికిని వచ్చునని యెఱుంగునది. అర్థములు. "విన్నన=వైవర్ణ్యము - అల్లన = ఒయ్యన = మెల్లన - తిన్నన. తిమ్మన = స్వాస్థ్యము - ప్రేకన = భారము." (శ-ర). సమాసపరిచ్ఛేదమునందును నీ నల్లాదిగణము పేర్కొనఁబడినది. కాని యందు 'చప్ప - ఒయ్య - తిమ్మ - చక్క - ప్రేక' శబ్దము లధికముగఁ జూపఁబడినవి. చక్క చిక్క నున్న మున్నగునవి పేర్కొనఁబడలేదు. ఆకృతిగణమగుటచే నిట్టి వ్యత్యాసము విరోధింపదు. అట్లయినను నీగణమునుండి "ఒయ్య - ప్రేక - చాయ" శబ్దములు తొలఁగింపవలసి యుండునని సమాసపరిచ్ఛేదమున సవిమర్శముగా నిరూపితమయ్యెను. (౨౮౨ I విశే.). 'చాయనచాయ' అనుచో 'చాయన' శబ్దము శ్యామల శబ్దభవ మనఁదగును. బా - సంధి - ౩౫ సూత్రము చొప్పున (౯౭-౯౭ I విశే.) నదంతగుణవాచకములకు వచ్చు నుగాగమ మీ నల్లాదులలోని శబ్దములకు మాత్రమె వచ్చును. నల్ల+తనము = నల్ల+ను+తనము = నల్లఁదనము = నల్లందనము పెద్ద - చిన్న మున్నగువానికిరాదు. పెద్దతనము - చిన్నతనము. మొ.

"గుణవాచకంబు క్రియావిశేషణంబగుచో నొక్కెడ నవర్ణకంబునకు బిందువు గానంబడియెడి. ఉదా:—మ. సపి చక్కంగఁ బ్రియుండు.........(కాశీ. ౨ ఆ.)" (ప్రౌఢ. సమా. ౧౮ సూ.) (చక్కన+కన్ = చక్కంగన్) క. మనసు పొందు చక్కంబడునే. (ఉద్యో. ౧ ఆ. ౩౧౨.) క.........చక్కంబెట్టువాఁడ నేఁ బాండవులన్. (ఉద్యో. ౨ ఆ. ౨౫౦.) తెల్లగన్ - నల్లగన్ మున్నగుచోట్ల 'తెల్ల=తెలుపు' మున్నగురీతిని విశేష్యములగు తెల్లాదులపై 'కన్' శబ్దము నిలువఁగా గసడదవాదేశమయ్యెనని యెఱుంగునది. సూ - రా - నిఘంటువునందు నల్లాదుల న వర్ణకరూపములు విశేష్యములుగఁ జూపఁబడినవి కాని వానిప్రయోగములు చూపఁబడలేదు. కొన్నిటికి ఆంధ్రభాషార్ణవము ప్రమాణముగాఁ జూపఁబడెను. కొన్నిటికి శబ్దరత్నాకరము బ్రౌణ్యనిఘంటువును ప్రమాణములుగాఁ జూపఁబడెను. ఇఁక నీ న ప్రత్యయాంతరూపములెల్ల విశేషణము లనఁగా ధర్మివాచకములుగాను నంగీకరింపఁబడినవి

అట్టి విశేషణత్వమునకుఁ బ్రయోగములు బహుళముగాఁ జూపఁబడినవి. కాని యాప్రయోగములెల్ల నప్రత్యయాంతముల విశేష్యతకే యనఁగా ధర్మవాచకత్వమునకె లక్ష్యములనియు సూ - రా - నిఘంటుకారుల ప్రమాదమున నవి విశేషణతా స్థాపకములుగా నుదాహృతము లయ్యెననియుఁ జెప్పుట సాహసముకాదు. నవర్ణకము ధర్మవాచకమనియు నివర్ణకము ధర్మివాచకమనియుఁ బ్రసిద్ధమయియున్న సంప్రదాయమును సూ - రా - నిఘంటుకారు లుల్లంఘించుట యుక్తముకాదు. "నల్లన. వి. (∠నల్లు) కృష్ణవర్ణము. సీ.........నల్లన నల్పు కప్పు కం దనఁగను నొప్పుఁ గృష్ణ। వర్ణంబు.........(ఆం. భా. ౧-౧౦౮.) విణ - నల్లనిది గీ...... శ్రీహరి తద్విషంబు। ధీరుఁడై యారగించిన దేహమెల్ల। నల్లనయ్యెను వ్యాపించి నాఁటనుండి. (గళా. ౨ ఆ. ౨౨౦.) సీ. మేరుశృంగములపై మేఘముల్ దిగురీతి నాతి చూచుకములు నల్లనయ్యె. (ఉ. రా. ౨ ఆ. ౧౩౩)" (సూ. రా. ని.) ఇట్లె యంతటను వ్రాయఁబడెను. రెం డుదాహృతులందును "నల్లన+అయ్యెన్ – నల్లని దయ్యెను. నల్లనయ్యెను" అని పొరపాటుగా నర్థముచేసికొనుటచే నిట్లు వ్రాయవలసెను. అగు ధాతువునకు 'కలదియగు' అనునర్థ మున్నదని వీరు తలంపరైరి. "దేహము నల్లనయ్యె = దేహము నల్లఁదనముగల దయ్యెను." "చూచుకములు నల్లనయ్యెను = చూచుకములు నల్లఁదనముగల వయ్యెను." అని యచటి కవి వివక్షితార్థముల నెన్నదగును. సూ - రా - నిఘంటుకర్తలు పూర్వోత్తర సందర్భములను జూచికొనక విస్మరించిరేకాని పై యర్థ మగుధాతువునకు వీరే చూపియున్నారు. "అగు = (వు) ఔ - అక్రి.........౧౪. కలదియగు - కలిగియుండు. క.........శంభుం। గనిసతి నివ్వెఱగై ని। ల్చెను వడఁకుచు (నన్ని. కు. సం. ౭ ఆ. ౮౯౬) క.........ప్రతి సై। న్యము దెస మొగమయ్యెఁ బటుగుణధ్వని చెలఁగన్. (ద్రో. ౪ అ. ౧౧౨.) మ. ఖురవిదారన్ సురధాణి నింకకొలువై. (హర. పీఠి ౨౨ ప.) గీ. ఆలుమగఁడును నొకకుత్తుకైనఁగాక। యిట్టి ధర్మంబు మిన్నక యెట్టు కలుగు. (హర. ౨ ఆ. ౬౦.)" (సూ. రా. ని.) శబ్దరత్నాకరకర్త యీ నవర్ణకాంతములు విశేష్యములె యనఁగా ధర్మవాచకములె యనియు నవి 'ఇ' ప్రత్యయముతోఁ గూడి ధర్మివాచకము లనఁగా విశేషణములగుచుండు ననియు ధారాళముగా వ్రాయుచువచ్చెను. "నల్లన - వై - వి. నలుపు. కృష్ణవర్ణము. (విశేషణమగుచో ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు.........(భాగ. ౧౦ స్కం. పూ.) (చూ అలకన) అలకన. దే. వి. సూక్ష్మత.........విణ - సూక్ష్మము. "అలకనితెల్వి" (హరి. ఉ. ౭ ఆ.) 'అలకనిజీబు' (స్వా. ౬ ఆ.) (విశేషణమైనప్పుడు

సమాసమునందు కడపటి అకారమునకు ఇకారము వచ్చెడి)." (శ-ర) ఇట్లే యంత టను వ్రాయఁబడియున్నది.

బాలవ్యా. ఇకవర్ణకం బగ్గలాదులకగు. ౭.

అరా V విషయము అగ్గలిక. ఒమ్మిక - అగ్గలము - ఒమ్ము.

సంజీవని. అరా V విష:—అగ్గలము = అధికము, అగ్గలిక = ఆధిక్యము, ఒమ్ము = ఒప్పిదమైనది, ఒమ్మిక = ఒప్పు - పొలుపు. "అగ్గలము+ఇక=అగ్గలిక = అగ్గలమైనదాని భావము. (ధర్మము)" అనుచో 'ము' మున్నగు భాగము లోపించి 'అగ్గల' అను ప్రాతిపదికము నిల్వఁగా(అరా I విష.) బా - సంధి - ౧౧ సూత్రముచెప్పిన సవదాదిస్వర నిత్యసంధిచే "అగ్గలిక" అనురూపము సిద్ధించును. చ.........అ | గ్గలిక నెదిర్చి యిట్లనిరి. (భీష్మ. ౨ ఆ. 3౨౫.) అగ్గలికయని నపుంసక సమరూపమును గలదు. సీ. చతురంగబలపతి సాంద్రతఁ గవిసిన యగ్గలికమునకు బెగ్గడిలక | ...... (విరా. ౪ ఆ. ౬౨.) సీ. ఆర్చినఁ బేర్చిన యగ్గలికంబున నాసూతనందనుఁ డతని సూతుఁ | జంపి కేతువు ద్రుంచి శాతశరంబుల నంగంబు నొప్పించె. (కర్ణ. ౨ ఆ. ౧౯౧.) "ఒమ్మిక - వి - (∠ - ఒమ్ము.) ౧ పొలుపు - అందము - వ. శ్రీకారంబుల జోకయుఁ దొమ్మిదింటి లెక్కల యొమ్మికయు మోదుగు విరుల సిరులును పోసరించి వాసివడయు శ్రుతిశష్కులికలును (పాండు. 3 ఆ. ౧౭౯. ప్రబంధ. ౫౨.) (సూ. రా. ని.)" అని యిట్లొమ్మిక శబ్దమునకు 'ఒమ్ము' అను ధర్మివాచకము మూలమని యంగీకరించియు సూ - రా - నిఘంటుకర్తలు 'ఒమ్ము' శబ్దమునకు 'పొలుపైనది - అందమైనది' అనునర్థము నీయకుండుట యుక్తముకాదు. "ఒమ్ము.........విశే - (హొమ్ము) స్థూలము-పెద్ద.........క. కుసులో యొమ్మగు తుమ్మెద | గఱులో..." (సూ. రా. ని.) అనుపద్యమునఁ దుమ్మెదగఱుల కొమ్మగు ననఁగా నొప్పిదమగు నను నర్థమె సుసంగతమై యుండును.

మగఁటిమ్యాదులు యథాప్రయోగంబు గ్రాహ్యం
బులు. ౮.

మగఁటిమి - మగతనము - పేదఱిమి - ఒజ్జనము -
బాలవ్యా. కోటరము - కోడంట్రము - కోడంట్రికము - కోడ
వివరణము. ఱికము - కోడులికము - చెలికారము - తెలుపు -
అరా VI విష. ఎఱుపు - పసుపు - నలుపు - ఆకాదులు రానివట
యందుఁ దనప్రత్యయం బన్నింటి కగు. చిన్నతనము -
మ్రుచ్చుఁదనము - నల్లఁదనము - అగ్గలంపుఁ దనము-
ఒజ్జతనము.

సంజీవని. ౨౮౯ VI వివ:—మగఁటిమి మున్నగు భావార్థకరూపములు సుసాధములు కామింజేసి మహాకవి ప్రయోగానుసారముగా వాని వాని రూపములను గ్రహింపవలయునని యర్థము. అట్టివానిలోఁ గొన్ని యిట సూరి ప్రదర్శించుచున్నాఁడు. మగఁటిమి = మగతనము = పౌరుషము=శౌర్యము. (మగ+ట్+ఇమి) నా। మగఁటిమిఁయు లావు మాన్పుట। తగవా గురునకు......(ద్రోణ. ౨ ఆ. 3౫౯.) ఉ.........అర్జునుం। డే విడిపించు మేదిని గడింది మగఁటిమి యుల్లసిల్లఁగా। .........(ఉద్యో. ౨ ఆ. ౨౬౭.) చ.........వ। ద్దైఱ నని సేయఁబూనితిఁ గడింది మగంటిమి తోడు సాలదే. (ఉద్యో. ౨. ఆ. ౨౯౮.) "పేదఱికము - ద్వ - వి - ౧ దారిద్ర్యము (చూ. పేదర్కి.) ౨ పిఱికితనము. తే. దంశివై లెమ్ము మనసు పేదఱిమి విడిచి. (భీష్మ ౧ ఆ. ౯౨.) పేదర్కి - ద్వ - వి. పేదఱిమియొక్క రూపాంతరము. [illegible] సీ. కసుఁ బువ్వులు బూంత కల లోపలను లేక పేదర్కి కతమున బొడ్డి లేక. (పంచ. [illegible] ౫ ఆ.)" (శ-ర) బా - తద్ధి-3 సూ - పేదఱికము= పేదతనము. "ఒజ్జ[illegible] - వి - (∠ఒజ్జ) ఒజ్జతనము. సీ.........నాపసాని। యొజ్జనమొనరిం[illegible] [illegible] [illegible] గడఁ బ్రోలుచొచ్చి. (కళా. ౭ ఆ. ౮౩.)" (సూ. రా. ని.) ఒజ్జనము = ఉపాధ్యాయత్వము. బా - తద్ధి - 3 సూత్రము చొప్పున ఱిక ప్రత్యయము వచ్చుటయుఁ గలదు. "ఒజ్జఱికము = ఒజ్జతనము. ఉ. చిత్రపు బిత్తరుల్ నడ భజించి రసన్ జిగి సిలి కాసె దాల్పొల్చెడు పాత్ర కత్తియల కొజ్జఱికంబు వహించి..... ...(చం రా. 3 ఆ. ౬౪.)" (సూ. రా. ని.). కోటరము=కోడలితనము. చ.. ......చె। చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో...(ఉద్యో. 3 ఆ. ౧౧౨.) కోట్రమనియుఁ గలదు. "సీ. వైవాహిక క్రియావ్యసనంబు గొన్నేండ్లు గొన్నేండ్లు కోడండ్ర కోట్రములును." (వి. పు. ౫ ఆ. ౧౮౭. సూ. రా. ని.) "కోడంట్రము. దే-వి - కోటఱికము. క. ఓ। రమణీమణి నీకోడం। ట్రము నెఱుఁగరు వారు యోగ రసనిశ్చలతన్. (కళా. ౭ ఆ. ౮౯.) కోడంట్రికము. దే-వి- (కోడలితనము.) క. పకపక నగి దశకంఠుడు। సకి నా తనుజునకు నీవు సతివై కోడం। ట్రిక మెప్పుడు చేసితివి.........(ఉ. రా. ౪ ఆ. ౨౦౬.)" (శ-ర) "కోడఱికము = కోడంట్రికము. (కోడలు+ఱికము).........సీ. కోడంట్రమనఁగఁ గోడఱికమంచన స్నుషాత్వ మలరును. (ఆం. భా. ౨-౧౧౧.) కోటఱికమనియుఁ గలదు. "కోటఱికము = కోడంట్రికము. వి (∠కోడలు).........చ. పలుకుఁబడంతియే యువిదొజ్జలఁ గోటఱికంబు సేయు. (రామా. ౧ ఆ. ౨ ప. శ. ర. పా.)" (సూ. రా. ని.). ఈపద్యమున 'కోడఱికంబు' అనియే కవిప్రయోగించి యుండు

ననుటలో బాధయుగపడదు. ఈపదమందలి టకారస్థితికి బలమైన ప్రమాణము కానరాదు. "కోమలికము. వి - (∠కోమలి) సౌందర్యము - చక్కఁదనము. క. ఈ ముక్కు చెవు లీమొగ। మీ మేలిమి పొలుపుగలదె యే చెలువకు నీ। కోమలిక మెఱుఁగుటకు నై।........ (భాస్క. రా. అర. ౧ అ. ౧౪౮.) సీ. మెఱుఁగారు ముంజియు మేని కోమలికంబు. .. (కళా. ౪ ఆ. ౪౪.)" (సూ. రా. ని). కోమలశబ్దము సంస్కృతము. కోమలము = మృదువైనది కోమలా - కోమల = మృదువైనది. దీని స్త్రీలింగము - కోమలి = మృదువైన శరీరముగల స్త్రీ. దీని భావార్థకము. "కోమలికము = మార్దవము" అన్నను యుక్తమె. ఇట్టి స్థితిలో "కోమలి శబ్దంబుపైఁ గ ప్రత్యయంబు లేదా కోమలశబ్దంబుపై ఇక ప్రత్యయము గలుగఁ గోమలిక మను రూపమయ్యెను" అని (బా. సా. పే. ౩౬౪ పు.) పేటికావ్యాఖ్యాత వ్రాయుట సరికాదు. సంస్కృత కోమలశబ్దముపై నాచ్ఛికమగు 'ఇక' ప్రత్యయ మగుటయు నట నపదాది స్వరసంధి వర్తించుటయు నసంభవములు. కోమలి శబ్దంబుపైఁగ ప్రత్యయం బనుపట్ల మీఁక్రింది యసాగతమగు బా - గు - ప్ర - వ్యాఖ్య మూలమున సంభవించియుండును. "కోమలిశబ్దంబుపైఁ గ ప్రత్యయంబు- అపదాదిస్వరసంధి. (చూ. సంధి. ౧౧ సూ.)" (బా. గు. ప్ర. ౨౦౭ పుట. ప్రథమ ముద్రణము. ౨౯౨ పుట. ద్వి. ముద్ర.). హాలాదిక ప్రత్యయవిధానమున నపదాది స్వరసంధి కేవలము నసంగతముకదా. "చెలికారము. వి. (చెలి+కారము) చెలిమి - స్నేహము. క. నెలకొను చుట్టఱికంబును। చెలికారము........(యయా. ౩ ఆ. ౭౯.)" (సూ. రా. ని.). బా - తద్ధి - ౫ సూత్రముచొప్పున "చెలిమి = చెలితనము" అని సిద్ధంచును. ఇట్లు సూరి 'చెలికారము' అనురూపమును సాధించి యుండఁగాఁ ద్రిలింగలక్షణశేషకర్త దీనికిఁ బ్రత్యేకముగా సూత్రించుట (౨౯ V విస్తరము.) పునరుక్తమనఁదగును. "చెలికారము - చెలిశబ్దంబుపై భావార్థంబునందు 'కార' ప్రత్యయంబు. 'నయగారము (మృదుత్వము) నుడికారము, (మాట చమత్కృతి) కొలగారము' ఇత్యాదులుపై దానివలె గ్రహింపవలె." (బా. గు. ప్ర. ౨౯౨ పుట. ద్వి ముద్ర.) అను గుప్తార్థప్రకాశికా వ్యాఖ్య ప్రామాదికము. 'చెలికారము - నయగారము' అనునవి భావార్థకరూపములు. నుడికారములోని కారప్రత్యయము స్వార్థికము. (చూ. ప్రౌఢ. తద్ధి. ౧౩ సూ.). తెలుపు మున్నగునవి తెల్ల మున్నగువాని భావార్థకరూపములు. ఇవి తెల్ల మున్నగువాని స్వార్థికరూపములుగ సైతము వెలయుచున్నవని సూ - రా - నిఘంటువున వ్రాయఁబడెను. శబ్దరత్నాకరమందు నట్లె చాలవఱకు వ్రాయఁబడెను. 'ఎఱుపు' అనుదానికి

మాత్రము రెండిటను విశేషణార్థము చూపఁబడలేదు. "తెలుపు[2] (తెల్పు) వి. [∠ తెల్ల) ౧ ధావళ్యము - తెల్లఁదనము. సీ. తెలుపును గప్పును వెలయఁంగ మెఱుఁగెక్కు తారకంబులఁ గల్కితనము దోడర. (విరా. ౧ ఆ. ౨౮౫.).........విశే - తెల్లనిది - ధవళము. క. తెలుపులగు చీరలను బూఁ। తలఁ బువ్వులను నొప్పి... (విరా. ౫ ఆ. ౩౧౫)" ఇట్టియెడల నంతటను "అగు" ధాతువునకుఁగల "కలదియగు- కలిగియుండు" (చూ. అగు. ౧౫ అర్థము. సూ. రా. ని.) అను నర్థము తత్తత్కవ్యభిప్రేత మనియు నక్కారణమున 'తెలుపు' మున్నగు పువర్ణకాంతములు 'తెల్ల' మున్నగు ధర్మివాచకముల ధర్మమునె తెలుపుననియు (తెల్లన మున్నగు నప్రత్యయాంతములవలెనె) గ్రహింపనగును. (౭౯ IV విష.). కాని వాని ధర్మివాచకతను స్థాపించున వనఁదగు కొన్ని ప్రయోగములు కోశకారులచే నుదాహరింపఁబడియున్నవి గీ. జ్యోత్స్న నాఁగఁ దమిస్ర నా నుభయ భార్య। లుడు పతికి నందు నొకతె తెల్పొర్తు నలుపు। తాను వారికి మెచ్చుగాఁ దాల్పఁ బోలుఁ। దెలుపు నలుపును నగు మేను నెలఁత యితఁడు. (నైష. ౮ ఆ. ౧౮౭ సూ. రా. ని. తెలుపు శబ్దము నొద్ద) ఇం 'దొకతె తెలొర్తు నలుపు' అనుచో 'నొకతె తెల్లనిది యొకతె నల్లనిడ' యని కోశకారుల యర్థము. కాని యచట నొకతె 'తెలుపైనది - యొకతె నలుపైనది' యనురీతి నంతర్భూతమై లోపించియున్న యగు ధాతురూపములచే 'తెలుపుగలది - నలుపుగలది' యను నర్థములు లభించును గాన నచటి తెలుపు నలుపు శబ్దములు ధర్మవాచకములుగనే కవ్యభిప్రేతములని తోఁచెడిని. పయి పద్యము నుత్తరార్థమున "తెలుపు - నలుపును నగుమేను" అని యగు ధాతువుతోనె ప్రయుక్తమగుటచే వివాదమే లేదు. గీ. కలయ జగమునఁ గల యట్టి నలుపులెల్లఁ। దెలుపులుగఁ జేసి నీడలు దెలుపు సేయుఁ। గా వశముగామి..... (మనుచ. ౩ ఆ. ౨౭ సూ. రా. ని. తెలుపు శబ్దము నొద్ద.) ఇందుఁ బూర్వార్థమున 'నలుపులు - తెలుపులు' అను మొదటి రెండును భావార్థకములె యనుటలో విప్రతిపత్తియే లేదు. ఇంక 'నీడలు తెలుపు సేయఁగా' అనుచో నీడలను దెల్లనివిగాఁ జేయుటకను నర్థమును బట్టి యచటి తెలుపు శబ్దము ధర్మివాచకమనఁగా విశేషణమని కోశకారుల యాశయము. కాని యచటను సైతము 'నీడలను దెలుపగునట్లు'గా నని యర్థము చేయవచ్చునుగదా. శబ్దప్రణాళినిబట్టి చూచినను 'నల్లది - నల్లనిది' అనునవి విశేషణము లనియు 'నల్లన - నలుపు నల్లఁదనము' అనునవి విశేష్యములనియుఁ దోఁచుచున్నది. 'అగ్గలంపుఁదనము' అనుచో సూరి పక్షమున. "అగ్గలము+తనము = అగ్గలంపు+తనము = అగ్గలంపు+ను+తనము =

అగ్గలంపుఁదనము" అనురీతిని రూపసిద్ధి - బా - సంధి - 3౫ సూత్రము చొప్పున సంభవించును గాని తనవర్ణక పరకత్వమున నుగాగమమును, దానిచే జ్ఞాపితమగు పు - ంపుల విధానమును కవిప్రయోగసిద్ధములు కావని యీవఱకు నిరూపింపఁ బడెను. (౨౮౯ II విప.)

నామ్నః క వర్ణకః స్యాత్ । స్వార్థే స్యా దుత్వ మపి
పరే తస్మిన్. (ఆం. చిం. వాబం. ౧౭ కారి. అహో.
౪౦౪ పుట.)

నన్నయా.
౨౯౦ విప.

భవే త్కః స్త్రీ సమా న్నామ్న । ఉత్వం తస్మిన్ పరే
భవేత్. (వికృ. క్రియా. ౨౧ అహో. ౫౦౨ పుట.)
అన్యేచ బహవో దేశ్యే । వర్ణకా అర్థభేదకాః । క్వచి
ద న్యస్య లోపః స్యాత్ । క్వచి ద్వర్ణాగమో మతః.
(వికృ. అజం. ౫౨-౫3 కారి. అహో. 3౭౯ పుట.)

కల్పతరువు. ౨౯౦ విప:—నామ్నః = ప్రాతిపదికమునకు, స్వార్థే = స్వార్థమందు, కవర్ణకః = కప్రత్యయము, స్యాత్ = అగును. పూర్వసూత్రము నుండి చ శబ్దానువృత్తిచే నిది వైకల్పిక మననగును. తస్మిన్ పరే=ఆ 'క' ప్రత్యయము పరమగుచుండఁగా, ఉత్వమపి = ముందటి 'అ' కారమునకు 'ఉ' కారము నయింతము. స్యాత్ = అగును. కొన్నియెడల 'ఇ' కారమునకును 'ఉ'త్వమగును. ఉదా:—వెలఁదుక - నాతుక. మొ. దీనిచేఁ బ్రాతిపదికమున కెల్లఁ గ ప్రత్యయము గల్గు ననుకొనరా దనుచు నథర్వణుఁడు నన్నయాశయమును వివరించుచున్నాఁడు. స్త్రీసమాత్ - నామ్నః = స్త్రీసమ నామమునకంటెఁ బరముగా నసఁగా వాచ్ఛికమగు స్త్రీసమ ప్రాతిపదికమునకంటెఁ బరముగా, కః, భవేత్ = కప్రత్యయము వైకల్పికముగ నగును. తస్మిన్ పరే = ఆకప్రత్యయము పరమగుచుండఁగాఁ బూర్వమున, ఉత్వమ్ = ఉత్వము, భవేత్ = నిత్యముగా నగుటయుఁ గలదు. స్త్రీసమ ప్రాతిపదికముపైని 'క - ఉక' అను ప్రత్యయములు పాక్షికముగా నిల్చునని పర్యవసితార్థము. బియ్యము మున్నగు నపుంసక సమాదులపై నివి నిల్వనేరవని యెఱుంగునది. తద్ధితములలో స్వార్థికములెల్లఁ బ్రాతిపదికముపై నిల్చును. భావార్థకాదులు సు బంతములపై నిల్చుట సంప్రదాయము. కావుననె నన్నయాథర్వణులు 'నామ్నః' అని స్వార్థిక కప్రత్యయమును విధించిరి. ఉదా:—మంచుక - ఎముక - ఎమ్ముక - నిప్పుక - మెలిక - పొత్తిక - చిఱుతుక - నాతుక - నెలఁతుక - మెఁతుక - మొలుఁతుక - ఒడఁతుక - మడఁతుక - పొలఁతుక - వెలఁదుక. మొ. ఉత్వము వచ్చెనా నిత్యము

గానే వచ్చును. లేదా రానే రాదు.( కాన, నెలఁతక - ముదఁతక మున్నగురూపము లనిష్టములని యెఱుంగునది. అపిశబ్ద మహిమచే 'క' ప్రత్యయమును బాతీకమని వ్యాఖ్య చేయనగును. మంచు - ఎమ్ము - నిప్పు - మెలి - పొత్తి - చిఱుత - నాతి - నెలఁత (మెలఁత) మెలుఁత - కడఁతి - ముదఁతి - పొలఁతి - వెలఁది. మొ. "౨౧౭ II విష- ౨౨౧ విష-" అను వానిలో 'ఒకర్తు - ఒకర్తుక - ఎవతె-ఎవతుఁక' మున్నగునవి చూపఁబడెను. ప్రయోగములు. ఉ. మూలి శరంబు లొక్క మొగి మంచుక గప్పిన మాడ్కి. (నిర్వ. 3 ఆ. ౨౬.) ఎలమి దధీచిచే నెముకబలసి. (నరస. ౧ ఆ. ౧౧౬.) సీ. మొగిని దధీచి యెమ్మునఁ బుట్టదయ్యెనే, వాసవాయుధమైన వజ్రమదియు. (ఆది. ౬ ఆ. ౫౯.) గీ. ఎమ్ముకలు చల్లినట్టి చో టెఱుఁగఁ దయ్యె. (కాశీ. ౫ ఆ. ౭౩) ద్వి. మఱఁగడ్డ నిప్పుక మాడ్కి నున్నాఁడు. (హరిశ్చం. ఉత్త. ౧౩౩ - ౩౩౪ పం.) (సూ. రా. ని.) క.........కురిసెన్ | గనగనగన మనుచు నిప్పుకలు గుప్పలుగన్. (పాండు. ౫ ఆ. శ. ర.) క. నిప్పులఁ బొరలిన యట్లయి | చొప్పుడ డించుకయు నిద్ర శుద్ధవిచారా. (ఉద్యో. ౨ ఆ ౯౯) చ. ఒకఁడు.........ని | ప్పుకలఁ బొంల్చినట్లు మదిపొక్కెడు. (ఉ. హరి. ౫ ఆ. ౨౮౭) "పొత్తి-వై - వి - ౧ మెత్తని సన్నని ప్రాఁతవస్త్రము.........క. అత్తఱి నఁటివీఁకుల నా | పొత్తులలో శిశువు.........(కళా. ౫ ఆ.)......పొత్తిక - వై - వి - మెత్తని సన్నని చిన్న వస్త్రము. క. కురువీరుల గెలిచి తదం | బరములలోఁ జిత్రవర్ణ భాసురములుగా |... ......బొమ్మ పొత్తికలకుం దెండీ. (విరా. ౪ ఆ. ౪౭)" (శ-ర). ఆ-వె. చిఱుత వాని కింత తఱుసంటి పలుకులు. (సభా. ౨ ఆ ౨౨౮.) ఆ-వె. చెలఁగి లేవ నేడ్పు చిఱుతుకదానిఁ గ్ర | వ్యాద ఘోరమృగము లశనబుద్ధి. (ఆది. ౪ ఆ. ౪౬.) క. ఇమ్ముగఁ దధ్యామా ఘూరి | నమ్మున గర్భములు దాల్చి నాతులు.........(ఆర. 3 ఆ. ౨౧౬.) "క. నను మున్నఁ జేసి యనుచు నాతుక మ్రొక్కెన్. (కళా. ౧ ఆ. ౬౧.)" (సూ. రా. ని.) ఉ. ఆపురి మించుటో వరుల నాడు మెలంతల గానమాధురిన్. హ. న. ౧ ఆ.) క.........ముని | లోకము సేరుటయు నమ్మెలుత యెలుఁ గెసఁగన్. (ఆను. 3 ఆ. ౨౨౧.) పం॥ యానుశాసనిక ప్రయోగమునుబట్టి యంతటను 'ఉ'కారమధ్యముగ దిద్దుట యుక్తము. మెలుఁత - మెలుఁతుక. శబ్దరత్నాకరములోని 'అ'కార మధ్యత నిర్మూలము. క. ఈ నెలత గన్న మన్మథుఁ | డైన. (విరా. ౨ ఆ. ౨౮.) సీ. గంధర్వు లేవురు గలరని చెప్పె నన్నెలతుక మాటలు నిక్క మొకొ. (విరా. ౨ ఆ. ౨౯౫ శ. ర.) క. వెలఁది జూదంబు పానంబు వేఁట.........(ఉద్యో. ౨

ఆ. ౪౪.) "క. వే। వే లింటం జేజే నవ। లా లుండఁగ నీకు నివ్వేలందుక కొంటియే. (అచ్చ. రా. సుం.) (స్వార్థమున ఉక)" (శ-ర.) "స్త్రీ పరూత్ - స్త్రీ లింగా ద్వైకృతాచ్చ ప్రాతిపదికాత్ స్వార్థే క వర్ణ్ణోపి స్యాత్." (అహో. ౪౦౪ పు.) అని యిట్లుగ నహోబలపతి వ్యాఖ్యచేయుటలో నాతని యభిప్రాయమేమో తెలియకున్నది. స్త్రీలింగాత్తని వ్యాఖ్యచేసెనెకాని యట్టి సంస్కృత స్త్రీలింగ శబ్దముల క ప్రత్యయము నుదాహరింప నైన లేదు.

అన్యేచేతి (౨౧౭ I ౨౩౧ విష.) అన్యేచ = నన్నయాథర్వణులు ప్రత్యేకించి వేర్కొన్నవే కాక, బహవః = అనేకములైన, దేశ్యవర్ణ కాః = దేశ్యములగు కృత్తద్ధిత ప్రత్యయములు, అర్థభేదకాః = అర్థవిశేష ములుగలవి, ప్రయోగ దృష్టము లగుచున్నవి. భావార్థమున సూరి చూపిన ఆిక - ఇమి - న - ఇక- మున్నగు ప్రత్యయములును ముం దుదాహరింపఁబోవు సూరి సంగ్రహించిన ప్రత్యయ విశేషములును, ద్రిలింగ లక్షణశేషమున నుదాహరింపఁబడిన ప్రత్యయవిశేష ములును నథర్వణోద్దిష్టములె యని గ్రహింపనగును. క్వచిత్ = ఒకానొకప్పుడు దేశ్య తద్ధిత ప్రత్యయము పరమగుచుండఁగా, అన్త్యస్యలోపః స్యాత్ = ప్రకృతి యొక్క తుదివర్ణమునకు లోపము గల్గును. క్వచిత్ = ఒకానొకప్పుడు, వర్ణాగమో మతః = వర్ణవిశేష మాగమ మగుట సమ్మతమగును. ఉదా:—అంత్య వర్ణలోప మునకు:—కోడలు+ఆిికము = కోడఆికము, ఒండు+టి = ఒంటి, చెలిమి+కాఁడు = చెలికాఁడు. మొ. వర్ణాగమమునకు:—మగ+ఇమి = మగ+ట్ +ఇమి = మగటిమి. పేద+ల్ +ఇమి=పేదఆిమి. ఈసూత్ర మాదేశాదులకును నుపలక్షణము. తెల్ల+పు= తెలుపు. కోడలు+ఇకము = కోడంట్రికము. అందము+కాఁడు = అందగాఁడు. మొ. కవిశిరోభూషణమున నన్యేచేత్యాది కారికల కీ క్రిందిరీతి నుదాహరింపఁబడెను."కల్లరి- వెరవరి (అరి మత్వర్థియము) ముక్కిఁడి - వెరవిఁడి కట్టిఁడి - (ఇఁడి తదభావార్థకము.) ఎద్దడి. (ఎరవు+తడి = ఎద్దడి నీటిదారిద్ర్యము.) (ఇందుఁ దద్ధితప్రత్యయ మెట్టిదో తెలియకున్నది.) చలిమిరి - వలిమిరి (మిరి. స్వార్థిక ప్రత్యయము) (శబ్దరత్నాకరమున వలిమిరి శబ్దములేదు గాని వలి శబ్దమునకును శైత్యమే యర్థము.) కన్నెఆికము. (ఆిక ప్రత్యయము భావార్థకము) 'పలువరము - కనికరము - వేగిరము - తేజరము' (వీనిలోని ప్రత్యయములు శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. 'తేజరము' అను శబ్దమె చూపఁబడలేదు. 'పలు+వా = పలువ = దుష్టుఁడు' అని శబ్దరత్నాకరమున నున్నది. పలుమాటలాడువాఁడని యర్థము చేయనగును. 'అర' 'ఇర' ప్రత్యయ ములు స్వార్థికములని యహోబలపతి యాశయము కానోపును. 'పలువరము. వై-

వి - ప్రలాపము - పలువరింత' అని శబ్దరత్నాకరమునఁ గలదు. 'కనియు = పరిపక్వ మగు' అను ధాతువు కలదు. దీనికృదంతము 'కనిక = మెత్తఁదనము' కానోపును. కనికర మనఁగా మనసు మెత్తబడుటయేకదా. 'వేగ' అను తద్భవముగలదు. వేగ+ ఇరము = వేగిరము. తేజు+అరము = తేజరము = (ప్రకాశము - తేజరిల్లు.) కోమలికము (కోమలి+ఇకము - ఇక భావార్థకము) దొరతనము ఇత్యాద్యా బహవో వర్ణకాః - స్త్రీత్వే - ఒక్కతె - ఒకరు - ఓర్తు - ఎవ్వతె అవ్వతె - ఇవ్వతె (ఈతుది ప్రయోగములందుఁ గాన రావు) ఇత్యాద్యాః - చెలికాఁడు = చెలిమికాఁడు - గట్టివాతనము = గట్టివాయితనము. మిండగీఁడు ఇత్యాదౌ లోపాగమకార్యమ్." (మిండ+గ్+ఈఁడు = మిండగీఁడు.) (అహో. 3౨౯ పు) ఈయహోబల పండితీయోదాహృతులనె మూలముగాఁ గొని సూరి కొన్ని తద్ధిప్రత్యయవిశేషములను సూచించె నని యెన్నవగును.

బాలవ్యా. అరమురాదులకు స్వార్థంబునం దిక వర్ణకం బగు. ౯.

వివరణము. అరమురిక - ఆమిక - అరమర - ఆము - అల్లిబిల్లి-గండి -

౨౯౦ I విషయము. నడవడి - నాడు - నివ్వాళి - పొత్తి - మూన - మెలి - వాలు - ఇత్యాదు లరమరాదులు.

సంజీవని. ౨౯౦ I విష:—"అరమర. ద్వ - వి (అర+మరలుట) సందేహము. భేదము (అరమరము - తా మది నమ్మకున్నది విదర్భ నరేంద్ర తనూజ నిన్ను సు। త్రాముఁడ వంచు నీ యరమరంబునఁ బో మనసీకు నీకు......(నైష. ౮ ఆ. ౭౫.)" (శ-ర). "అరమరిక - అఱమర - భేదము.........అరమరికయు లేక యందఱనోన। నిరవొంద సుగ్రీవు నిష్ఠుఁడై యుండె. (గం౪. రా. ఉ. ౯౭ పా. ౨౮ పం.)" (సూ. రా. ని.). 'అఱమర' అనియుఁ గోశకారు లుదాహరించుచున్నారు. "అఱమర - ద్వ - వి - (అఱ+మరలుట.) ౧ సందేహము. క. మఱియు నొకమాట యెవ్వరు। నెఱుఁగని యది దశరథునకు నేకాంతమునం। దఱమర లేక దృఢంబుగ। నెఱుకవడం జెప్ప వింటి నే నొకరుండన్. (నిర్వ. ౯ ఆ. ౫౭.)" (శ-ర). "ఆము = ఆమి. వి. (సం - అహమ్.) మదము - గర్వము. సీ. ఆము చేసుఁగు సామి ముద్దుల పట్టి.........(రసిక. ౧ ఆ. ౨.) ఆమిక = హామిక. వి. (సం - అహమహమికా.) గర్వము - మదము. సీ. గర్వంబు మేనులు గన్నట్టు లుండెడు దొరల యామిక లెందుఁ దొలఁగిపోయె. (విజ. వి. పీఠి. ౪౨.)" (సూ. రా. ని.) "అల్లిబిల్లి దే - వి - పెనఁకువ. ౨ ఒద్దిక. గీ. అరిగి తనకూర్మి చెలులతో నల్లిబిల్లి। యగుచు......... (పర. 3 ఆ. ౨౭౪.)" (శ-ర). 'అల్లిబిల్లిక' అనురూపమును గోశకారులు చూపలేదు

గాని 'అల్లిక బిల్లిక' అను దానిని జూపిరి. "ఉ......। అల్లిక బిల్లికం దనరు... ......(కృ. శకుం. ౨ ఆ. ౨౨౦ సూ. రా. ని.)" గండి=రంధ్రము - సందు. 'గండిక' శబ్దమునకుఁ బ్రయోగము దొరకక కావలయు సూ - రా - నిఘంటుకర్తలు "గండిక= గండి. (శ-గ)." అని వ్రాసిరి. నడవడి = నడక - ప్రవర్తనము - నడవడిక శబ్దమున కును బ్రయోగము లభింపక కావలయును "నడవడిక - వి......(శ-ర. చి. ని.)" అని సూ - రా - నిఘంటుకారులు వ్రాసిరి. 'నాడు' శబ్ద మీగణములో నిర్బిందువు గానే బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందు సైతము వెలయుచున్నది. శబ్దరత్నాకరకోశమున కాలవాచక మగునపుడు 'నాఁడు' శబ్దము సబిందుకముగను దేశవాచకమగునపుడు నిర్బిందుకముగను జూపఁబడెను. సూ - రా - నిఘంటువున రెండర్థములందును సబిందుక [illegible] దేశ [illegible]చకమగునపుడు తత్వ [illegible] ప్రయోగ [illegible] లే [illegible] వు గన్పట్టుచున్న దని [illegible] వ్రా[illegible]డెను. కావుననె '[illegible]డి' అను [illegible] సైతము సబిందుకము [illegible] బడెను. "క. అ[illegible] తి [illegible] నొడ [illegible] టు। ల[illegible] నీవు కోన కగు దె[illegible]చో। న[illegible] యా[illegible]కొనఁ జాలు నట్టిదె చెప్పుమా" (అచ్చ. రా. అయో. ౧౮౦ శ-గ. నాఁడిక శబ్దమునొద్ద.) నివ్వాళి = నీరాజనము. శబ్దరత్నాకరమున నివ్వాళికయనియుఁ జూపఁబడెనుగాని "ద్వి. వనజ లోచనలు నివాళిక లొసఁగ. (౧౦౫. రా. బాల. ౭౫ పాట.)" (శ-ర). అని నివాళిక శబ్దమునకు మాత్రమె ప్రయోగము చూపబడెను సూ - రా - నిఘంటు వున "నివ్వాళిక" శబ్దమె చూపబడలేదు. నివ్వాళి శబ్దము సప్రయోగముగఁ జూపఁబడినది. పొత్తి = పొత్తిక=మెత్తని సన్ననివస్త్రము. "క. బొమ్మ పొత్తికలకుం దెం‌డీ. (విరా. ౪ ఆ. ౪౭) స్త్రీసమ 'మూన' శబ్దము శబ్దరత్నాకరమున కుడపార్థక ముగఁ జూపఁబడెను. ప్రయోగము లేదు. కాని మానిక శబ్ద మాచ్ఛికము మాన శబ్ద రూపాంతరముగాఁ జూపఁబడలేదు. 'మాన' అను నాచ్ఛికపు స్త్రీసమశబ్దము సంస్కృత మానశబ్ద వైకృతమని వైకృతదీపికలో నున్నది. 'మానిక' అను సంస్కృత మానికా శబ్దము శబ్దరత్నాకరమునఁ జూపఁబడినది. "మానికా - ఆ - స్త్రీ. అఞ్జలి ద్వయ పరిమాణమ్" మద్యమ్. తె. ౧ మానెఁడు" అని సర్వశబ్ద సంబోధినీ కోశమునఁ గలఁదు. "మెలిక - వై - వి - మెలి = మెలుసు = పెన" అని యిట్లు శబ్దరత్నాకరమున 'మెలి = మెలిక' అనునవి రెండును జూపఁబడినవె కాని ప్రయో గము చూపఁబడలేదు. వాలు = వాలిక = దీర్ఘము "శ. అకటకట యుత్తరుఁడు నొం। డొక కాంభోజుండునుం గడుం బాలుఁడు వా1లిక కైదువు లాడిన నే। ల

కొఱఁగి యొప్పి రభిరున్న లక్ష్మణుల క్రియన్. (స్త్రీ. ౨ ఆ. ౮౪ ప.) గీ. వాలుగాఁ
కై వ్రాలు.........(రామా. ౧ ఆ.)" (శ.ర). శా. ఆవాలుం గనుదోయి యానగు
మొగం బాగుబ్బ పాలిండ్ల పెం। పావేణీ భరము......(వి. శకుం. ౨ ఆ. ౧౮౮.)
(శబ్దా. అప్పక. 3 ఆ. 324 ప.)

ఉక వర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు. ౧౦.

బాలవ్యాకరణ చిఱుతుక - నాతుక. చిఱుత - నాతి - నెలఁత -

వివరణము. మెలఁత - పడఁతి - మడఁతి - పొలఁతి - వెలఁది -

౭౯౦ II విషయము. నిప్పు - ఎమ్ము - ఇత్యాదులు చిఱుతాదులు.

సంజీవని. ౭౯౦ II విష:—"నిప్పు - ఎమ్ము" అను రెండిటిలో "ఉ"కార మున్నను వేఱుగ 'క' ప్రత్యయవిధాన మేల యని తలఁచి సూరి వానికిని 'ఉక' ప్రత్యయమునె యుపదేశించెను. అంతటను బా - సంధి - ౧౧ సూత్రము చొప్పున నపదాది స్వరసంధి నిత్యముగా నగును. పఱు వానిలోఁ బెక్కిటికీవఱకు విపుల ముగా ౭౯౦ విషయమునఁ బ్రయోగములు చూపఁబడెను.

కాఁడు గ్గాఁ డుర్భవే దీఁడు।ర స్త్రీత్వా దర్థబోధకాః।

ధన్య సూ. ఏకత్వ వాచకా త్పుంసి। స్యా దాఁడు స్త్వన్యథా

౭౯౧ విష. మతః। స్త్రియాం మాఁడి ర్బహుత్వే స్యాత్। పుంసి

దీర్ఘా న్ని రుచ్యతే. (వికృ. అజం. ౫౦-౫౧ కారి.

అహో. 3౭౯ పుట.)

కల్పతరువు. ౭౯౧ విష:—ఈకారికలు ౧౯3 విషయమున వ్యాఖ్యాత ములు:—ఏకవచనాం తాచ్ఛిక శబ్దములకుఁ బరముగ నస్వార్థమునందును గొన్నియెడల స్వార్థమునందును మహత్త్వమున 'కాఁడు' అని కొన్నిటికిని 'గాఁడు' అని కొన్నిటికిని, 'ఈఁడు' అని కొన్నిటికిని వచ్చును. ఆఁడు ప్రత్యయము ప్రథమా బహువచనమునకుఁ బరముగా వచ్చును. ఆబహు వచన ప్రత్యయము లోపించదు. మహతీత్వమున 'ఆఁడి' ప్రత్యయ మగును. అపు డును లుప్రత్యయము లోపించదు. 'విల్లుకాఁడు - అందగాఁడు . కొండీఁడు - వగ లాఁడు' అనునవి పుంలింగ సమరూపములు. దుమంతరూపములు. ఇవి ఏకాదిగణము లోనివి.'దీర్ఘా న్ని రుచ్యతే' అనుటచేతఁ బయివిషయము స్పష్టపడుచున్నది. 'వగ లాఁడి' అను రీతిగల రూపములు మాత్రము స్త్రీసమరూపములు. ఆఁడి ప్రత్యయవిధి సందర్భమునకయి 'కాఁడు' ప్రభృతు లట్లు పేర్కొనఁబడినవి కాని యవి నిజముగా 'కా - గా - ఈ - ఆ' అను ప్రత్యయములె యని గ్రహింపనగును. మఱియు నీతద్ధి

తాంత ప్రాతిపదికముల దీర్ఘము హ్రస్వము కాదని విశదపఱుచుటకును ప్రథమైక వచనాంత పరినిష్ఠితరూపములు వేఱొకనఁబడినవి. 'స్త్రియా మాఁడిః' అని యుపదేశించియు నథర్వణుఁడు 'కత్తె - కత్తియ - గత్తె - గత్తియ' ప్రత్యయముల నుపదేశింపకుండుట నరయఁగా నవి 'కా-గా' ప్రత్యయములపై ('ఎవ్వతె - ఒక్కతె' మున్నగువానియందు వలెనె) 'తె' అను దానిని నిల్పి సాధించుకొనవలయు నని యాతఁడు తలంచినట్లు విశదమగుచున్నది. ౨౧౭ । విషయమునందును ౨౨౧ విషయమునందును జెప్పఁబడినరీతిగా 'వేఁటకా+త్+ఎ = వేఁటకత్తె' "అందగా+త్+ఎ = అందగత్తె" అని సాధించికొనవలయును. ౨౯౦ విషయమునఁ జెప్పఁబడిన రీతిని దద్ధిత ప్రత్యయ పరకత్వమున వర్ణాగమాదులు ప్రయోగానుసారముగా నంగీకార్యము లగుటంజేసి కా ప్రత్యయ దీర్ఘమునకు హ్రస్వమును తకారద్వయాగమమును గల్గఁగా 'వేఁటకత్తె' అను రూపమేర్పడును. ఇట్లె గా ప్రత్యయ దీర్ఘమునకు హ్రస్వమును 'త' కారద్వయాగమమును గల్గఁగా 'అందగత్తె' అను రూపమేర్పడును. పిదప ౨౧౦ విషయము చెప్పిన 'ఎ' కారమునకు 'ఇయ' అను రూపము గల్గఁగా (అంతె = అంతియ - ఇంతె = ఇంతియ) 'వేఁటకత్తియ - అందగత్తియ' అను రూపాంతరములును సిద్ధించును. 'వేఁటకత్తె - వేఁటకత్తియ' మున్నగునవి స్త్రీసమరూపములు. తత్సమ ప్రకృతులమీఁద సయితమీ ప్రత్యయములు గన్పట్టుచున్నట్లు శబ్దరత్నాకరమందును సూ - రా - నిఘంటువునందును వ్రాయఁబడెను. (౧౯3 విష.) "కోపకత్తె - మి - గ్రా - విశే - (కోపము+కత్తె) కోపముగలది. ఆఁడుది - "కోపకాఁడు - మి - గ్రా - విశే-(కోపము+కాఁడు) కోపముగలవాఁడు." (శ-ర). "కోపకత్తె. మి - విశే - (కోపము+కత్తె) కోపముగలది (స్త్రీ) సీ. సుతపుత్రికులంబు నిత్యత్రముగఁ జేయు । కొడుకుఁ గాంచిన యట్టి కోపకత్తె (క్రీడా. ౧౨౯.) కోపగాఁడు. మి - విశే - (కోపము+కాఁడు) కోపముగలవాఁడు. గీ. నినుఁ గలయు భర్త కోపగాఁ డనఁగ నేల. (పారం. ౨ ఆ. ౧౧౫.) క. ద్వైపాయనముని వెడలం । ద్రోపించిన కోపగాఁడు ధూర్జటి........(భీమ. ౪ ఆ. ౧౩.) గీ. అన్న మీతండ్రి కోపగాఁ డౌనొ కాఁడొ (కాశీ. ౪ ఆ. ౯౦). కార్యకాఁడు. మి - విశే - (కార్యము+కాఁడు) కార్యము నెఱవేర్చుకొనువాఁడు. ఆ-వె......... కార్యకాఁడొ యంకకాఁడొ నృపుఁడు. (ఆము. ౪ ఆ. ౨౬౩.)" (సూ. రా. ని.) (విస్తర.) పయి ప్రయోగములలో 'కోపకత్తె' అనుచో "కోపకర్త్రి" అనియు

---

విస్తర. ౨౯౧ విష:—'కోపకత్తె' అనుచో 'క' కారమును "కోపగాఁడు" అనుచో 'గ' కారమును నిల్పుటలో యుక్తి యేమున్నది. ఇట్లె సూ - రా - నిఘంటు

'కోపకాఁడు' అనునెడల 'కోపకుండు' అనియు 'కార్యకాఁడు' అనుచో 'కర్జకాఁడు' అనియుఁ గవి ప్రయుక్త పాఠములు కానోపునని సమర్థింపనగును. ("కోపకుండు - సం-విశే - (అ. పికా. అ.) కోపించువాఁడు)" (సూ. రా. ని.). కాని తిక్కయజ్వయే తత్సమముపై 'క' ప్రత్యయమును బ్రయోగించి యున్నాఁడు. "సీ......... గీ.........। ఆమిషము గాలకాని కెట్లట్ల.........(అను. ౫ ఆ. ౨౫౬.) (చూ. 3౨౬ I విమ.) 'అంకకాఁడు' అనునది యాచ్ఛికమె యనియు మిశ్రము కాదనియుఁ దలఁచుచు శబ్దరత్నాకరకర్త యొక్కకవి శ్లేష నిర్వాహణమునకై 'అంకకాఁడు' శబ్దము మచ్చగలవాఁడను మిశ్రస్థలముగాఁ బ్రయోగించెనని వ్రాసియుండఁగా సూ-రా-నిఘంటుకర్తలు 'చలపాది' అను నర్థముగల స్థలములందెల్ల నదిమిశ్రపదమె యని వ్రాసిరి. "అంకకాఁడు. దే - విశే - (అంకము+కాఁడు) చేలముపట్టువాఁడు - చలపాది. గీ. ఎలమి యేప్రొద్దుఁ గనువాంఛ నీక మరుఁడు। కలహమున కంకకాఁడయి కాలుద్రవ్వ. (అము. ౫ ఆ. ౮౮.) (అంకశబ్దమునకు వృత్తియందు చలమర్థమని యెఱుఁగవలెను. ఇది యొకా నొక కవిచే శ్లేషయందు గుఱుతుగలవాఁడను నర్థమునఁ బ్రయోగింపఁబడియున్నది. చ. హిమకరుఁ డంకకాఁడు మధు వెప్పుడు జాతి విరోధి.........(కవిక. 3 ఆ. ౯౮.)" (శ-ర). "అంకకాఁడు. మి - విశే - (క - - అంకకాఱ.) బ - అంకకాలు. అంకకాండ్రు. ౧ మొనగాఁడు - ముఖ్యుఁడు - శూరుఁడు. ద్వి.........పండిత మల్లికార్జున ప్రభువు। .........। గరడికెక్కిన యంకకాఁడును బోలె। నెడ విడఁబడ్డ మత్తేభంబుఁ బోలె (పండితా. వాద. ౧౭౬ పా.) గీ. కలహమున కంకకాఁడయి కాలుఁద్రవ్వ. (అము. ౫ ఆ. ౮౮.) ౨ చలపాది- మాత్సర్యశీలుఁడు. ఆ వె. కార్యకాఁడొ యంకకాఁడొ నృపుఁడు. (అము. ౪ ఆ. ౨౬3.) మ.........ప్రాణంబు దా। యలు గాడ్పుల్ శశి యంకకాఁడు పిక మయ్యో యోగ్యకళగ్రాహి......(విజయనందన విలాసము ౨ ఆ. ౧౨౨.) చ. హిమకరుఁ డంకకాఁడు మధు వెప్పుడు జాతివిరోధి.........(కవిక. 3 ఆ. ౯౮.) ఇట 'అంకకాఁడు' అనఁగా నొకపక్షమున 'కళంకముగలవాఁడు' అనియు ఒకపక్షమున 'చలపాది' అనియు నర్థము." (సూ. రా. ని.) 'అంక' శబ్దము 'చేలము'ను నర్థమున నాచ్ఛికమని వ్రాసిన శబ్దరత్నాకరకర్త యాశయమును మార్చి యెల్లయర్థములందును నది సంస్కృతమె యని సూ - రా - నిఘంటుకారులు వ్రాసి "అంకకాఁడు" అనునది యెల్ల, యర్థములందును మిశ్రపదమె యని నిరూపించిరి. అట్లె 'అంక'

---

వున 'కొండెకత్తె - కొండెకాఁ(గా)డు' అని యొకచో ద్వివిధవర్ణములు నంగీకరింపఁబడెను. ఇట్టి యనియమము నిరాధారముగ నేల పాటింపవలయునో ?

శబ్దము పార్శ్వమను నర్థమున దేశ్యరుని వ్రాసిన శబ్దరత్నాకరపు వ్రాఁతయు నుపేక్షింపఁబడెను. పరిశీలింపఁగా "అంకము" అను తత్సమరూపమునకు 'అంక' అను స్త్రీసమరూపము తద్భవమనియు నక్కారణమున 'అంకకాఁడు' అనునది యెల్ల యర్థములందును శుద్ధమగు నాచ్ఛిక శబ్దమె యనియు నందు మిశ్రత లేదనియు నీమార్గమున శబ్దరత్నాకరోదాహృతములగు 'అంక - దేశ్యము' 'అంకించు - దేశ్యము' మున్నగు స్థలములెల్ల నవిరుద్ధము లగుననియుఁ దోఁచుచున్నది. ఇంత యేల ? సూ - రా - నిఘంటుకారులే "అంకించు" అను దేశ్యధాతువు నుదాహరించి దాని కనేకములగు నర్థవిశేషములను జూపిరి. అట్లె, అంకవన్నియ - అంకపొంకములు - అంకాపొంకములు మున్నగు దేశ్యశబ్దములను నుదాహరించిరి. వానిని మిశ్రములన లేదు.

కా-కత్తియ వర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతు
బర్థంబునం దాటాదుల కగు. ౧౧.
కా ప్రత్యయాంతంబునకు మగాది గణంబునం జేరి
డుజ్జగు. ఆటకాఁడు - ఆటకత్తియ. ఆట - అడపము -
ఎమ్మె - ఓయారము - కటారి - కొల్ల - చెలిమి -
చేరువ - చోరవ - జట్టి - జాజర - జూదము - తిండి -
తేర్ప - దొడ్డ - నీటు - నేస్తము - బేరము - వగ -
విలు - వెచ్చము - సొగసు - ఇత్యాదులాటాదులు.

బాలవ్యా. ౨౯౧ I వి.

కా కత్తియల కకారంబునకు గకారంబు కొండొక
చోఁ గానంబడియెడి. ౧౨.
అందగాఁడు - అందగత్తియ - కొండెగాఁడు - కొండె
గత్తియ - బేరగాఁడు - బేరగత్తియ - ఇత్యాదులు.

సంజీవని. ౨౯౧ I విష:—ఆట మొదలగు శబ్దములకుఁ బరముగ మతుబర్థంబున మహాదర్థము వాచ్యమగునపుడు కాప్రత్యయంబును మహాత్యర్థము వాచ్యమైనపుడు, కత్తియప్రత్యయంబును నగును. 'తదస్యాస్త్యస్మిన్నితి మతుప్' (౫-౨-౯౪) (సి. కౌ. ౧౮౯౪ సూ.) అనుపాణిని సూత్రముచే వచ్చు మతుప్ప్రత్యయముయొక్క యర్థంబున 'కా-కత్తియ' లగునని తాత్పర్యము. "అది దీనికిఁ గలదు లేదా - అది దీనియందుఁ గలదు." అని మతుప్ప్రత్యయమున కర్థములు. "భూమనిన్దా ప్రశంసాసు । నిత్యయోగే ఽతిశాయనే।సంసర్గే ఽస్తి వివక్షాయాం । భవన్తి మతుబాదయః" (వార్తి. ౩౧౮౩.) అను శ్లోకరూప వార్తికము మతుబర్థములను

వివరించుచున్నది. 'తిండికాఁడు = తిండిగలవాఁడు' అనుచో నెల్లరుకు దిండి కలవారే యగుటచే నధికముగు తిండిగలవాఁడని యిచటి మతుప్ప్రత్యయము భూమార్థమును బోధించును. 'జూదగాఁడు' నిందార్థము గలుగుచున్నది. 'సొగసు కాఁడు' అనుచోఁ బ్రశంసార్థము భాసిల్లుచున్నది. 'ఒయారకాఁడు' అనుచో నిత్య యోగము భాసిల్లుచున్నది. బా - ఆచ్ఛి - ౨౩ సూత్రము చొప్పున (౨౧౦ విష.) 'ఇకు' అనుదానికి 'ఎ' కారము రాఁగా 'ఆటకత్తె' యగును. ఎకారము రానపుడు 'ఆటకత్తియ' అనియె యుండును. కాప్రత్యయము మగాదిగణములోని దగుట చేత బా - ఆచ్ఛి - ౪ సూత్రముచొప్పున (౧౯౧ I విష.) 'కా - ఈ - ఆ' అను ప్రత్యయములు తుదినిగల శబ్దములు డుమంతంబులగును. 'ఆటకానిన్' మున్నగు రీతిని వీనికి నిత్యముగా నిగాగమంబగును. 'అడపము + కాఁడు = అడపకాఁడు - జూదము + కాఁడు = జూదగాఁడు' మున్నగుస్థలములందు బా - సమా - ౨౫ సూత్రముచొప్పున (౨౭౦ విష.) మువర్ణకము లోపించును. (౨౮౯ I విష) జూదగాఁడు, కొండెగాఁడు మున్నగు నలంతిస్థలములందు 'కా' ప్రత్యయ కకార మునకుఁ బ్రకృతముగు బా - తద్ధి - ౧౨ సూత్రముచే 'గ' కారమగును. కోశములలో 'జూదకాఁడు - జూదకత్తియ' అని కకారముతోనె యుదాహరింపఁబడెను. ఇట్లె 'కొండెకాఁడు - వేరకాఁడు' అనియే చూపఁబడెను. సూ - రా - నిఘంటువునందలి యేతద్విషయకముగు నియమరాహిత్య మీపఱకు విస్తర ౪౯౧ విషయమునఁ జూపఁబడెను. శబ్దరత్నాకరమందును దఱుచుగా "కా - కత్తియ" లే వ్రాయఁబడినను గొన్నియెడల 'అందగాఁడు - ఇబ్బందిగాఁడు.' మున్నగుచోట్ల 'గ' కారమును నిల్పు టలో యుక్తియేమియుఁ గానరాదు. ఈవిషయమును నిర్ణయింపఁజాలు ప్రాసాదిగత స్థలములు లభింపలేదు. అయినను నథర్వణుఁడు 'కాఁడు - గ్గాడుః' అని వచించుట చేతను నేఁటి వాడుకలో 'అందగాఁడు - కొండెగాఁడు' మున్నగుచోట్ల 'గ' కారమె వినఁబడుచుండుటచేతను సూరి యుదాహృతులు సరికావనుట యుక్తముకాదు. ప్రయోగములు:—గీ. అలరి తొలుకరి పేరిటి యాటకాఁడు ।......(ఆటవాఁడు= నర్తకుఁడు) (రామా. ౬ ఆ. శ. ర.) సూ - రా - నిఘంటువున నీపద్యమె "అలరి తొలుకరి పేరిటి యాటవాఁడు।........." అని యుదాహరింపఁబడెను. 'ఆట యొక్క + వాఁడు = ఆటవాఁడు' అను నాభాసబహువ్రీహి రూపముగు షష్ఠీ సమా సము 'కలవాఁడు' అను నర్థముఁ నిచ్చును. కాన నెల్లయెడల "ఆటకాఁడు - ఆటకత్తె - వేఁటకాఁడు - వేఁటకత్తె" మున్నగుచోట్ల "ఆటవాఁడు - ఆటది - వేఁటవాఁడు - వేఁటది" మున్నగునవి పర్యాయము లగుననుటకు సందియము లేదు. 'ఆ-వె' ఓరి

యాటకాఁడ యీరీతి యఱవులా' అను (ప్రభా. ౧ ఆ. ౧౦౬.) పద్యమున నాటకాఁడనఁగా దొమ్మరివాఁడు. అడపము = వక్కలాకులతిత్తి - మంగలతిత్తి. అడపము+కాఁడు = అడపకాఁడు = తాంబూలకరండవాహి. అడపకత్తె = తాంబూలకరండవాహిని. గీ. కప్పురపుఁ దావి చిలుకు బాగాలొసంగ। నడపకత్తెలు తెలనాకు మడుపులొసఁగ. (వైజ. ౧ ఆ. ౧౧౩. సూ. రా. ని.). 'అడప = అడపకాఁడు' (బా. తద్ధి. ౨౮ సూ.) దీనికొక్క ప్రయోగము శబ్దరత్నాకరమునఁ గలదు· చ. కలికివరాటరా జడప కప్పురవీడెము.........(నైష. ౬ ఆ. ౧౪౧.) (చూడు. ౭౯౫ I విష.) ఇందలి 'అడప' అనుచో 'అపుడు' అని సర్వంకషావ్యాఖ్యాపాఠము. అదియు సూ - రా-నిఘంటువుచే నాదరింపఁబడినది. 'అడప' శబ్దము మతుబంత మను పక్షమున దీనిమీఁది కాప్రత్యయము స్వార్థిక మనవలెను. ఎమ్మె=విలాసము - 'ఎమ్మెకత్తె' అనునది కోశద్వయమునందును జూపఁబడలేదు. ఎమ్మెకాడు = విలాసవంతుడు. సీ. అనుపమచ్ఛాయావిహార మందఁగఁ గల్గెఁ, జిమ్మచీఁకటి మ్రింగు నెమ్మెకాని। కి.........(నరస. ౨ ఆ. ౯౨. సూ. రా. ని) ఒయారము = విలాసము. దీనిపైనిగాని దీనిరూపాంతరములగు 'ఒయ్యారము - ఒయారము' అనువాని మీఁదఁ గాని 'కా - కత్తియ' వర్ణకము లేకోశమందును జూపఁబడలేదు. "ఒయారికాఁడు - ఒయ్యారికాఁడు - ఒయారికత్తె - ఒయ్యారికత్తె" అనురూపములు 'ఒయ్యారి' అను నర్థముగలవి లక్ష్మీనారాయణీయ కోశమునఁ జూపఁబడియున్నవి. "చ.........ఒక్కొకతెఱం బువుఁబోండ్లు కటారి కత్తియల్. (కళా. ౧ ఆ. ౩౧.) చ. బిరుదు కటారి కాండ్రు. (కళా. ౮ ఆ. ౧౦౧.) గీ. బల్లిదుండయి చీఁకటి కొల్లకాఁడ। వక్రవిక్రమగతి. (ఘటికా. ౨ ఆ. ౧౪౦.)"(సూ. రా. ని.) 'కొల్లకత్తియ' కలదనుటకు సూ - రా - నిఘంటువున, శబ్దరత్నాకరస్థితియు ప్రమాణముగఁ జూపఁబడెను. "క.........చెలిమికత్తెలు నగరే (ఉ. హరి. ౫ ఆ. ౧౬౩.) గీ.........చెలిమికత్తియలు గాఁగ (వాల్మీకిచ. ౧ ఆ. ౨.) క......। గతకల్మషులొడఁ జెలిమికాఁడై యుండెన్. (వేం. పంచ. ౨ ఆ. ౬౩.)" (సూ. రా. ని.) "చేరువ (ర్వ) (∠ చేరు).........౬ సేనాధిపతి. ద్వి.........ముప్పదిరెండుకోట్ల చేరువలు। నెమ్మి నందొక్కొక్కనికి వేయి వేయి. (రంగ. రా. యుద్ధ. ౩౩౪ పొ. ౨౭ పం)" అని సూ - రా - నిఘంటువునఁ జూపఁబడెను గాని "చేరువకాఁడు = సేనాధిపతి" అనుచోటి కాప్రత్యయము స్వార్థికమె యనఁదగును. 'చేరువ = సమూహము' అను నర్థమును గలదు. గీ.........। కలరు నాకట్టి చేరువకాండ్రు దేవ. (రామా. ౭ ఆ. ౨౭. సూ. రా. ని.) 'చేరువకత్తె' అను శబ్దము కోశద్వయమునందును జూపఁ

బడలేదు. చౌరవకర్త కలదనుటకు శబ్దరత్నాకరమునఁ జూపఁబడుచే ప్రమాణముగ సూ - రా - నిఘంటువునఁ జూపఁబడెను. చౌరవకాఁడు. విశే. (చౌరవ+కాఁడు) ప్రవేశించువాఁడు. (చంద్రా. ౪ ఆ. ౬౧.) ౨ సాహసికుఁడు. గీ......పథలెక్క చౌరవకాండ్రు. (ఆము. ౪ ఆ. ౬౧.) (సూ. రా. ని) (చౌరవ = ప్రవేశము) 'జట్టికర్త' దీనికి శబ్దరత్నాకరస్థితియె యాధారము. "జట్టికాఁడు. విశే......... క్రేత = కొనువాఁడు. గీ. అనుచు గపురమ్ము సరసోక్తి ప్రశంసనొప్పి । జట్టికాండ్ర.. ... (వసు. ౧ ఆ. ౧౦౯.) ౨ వర్తకుఁడు. సీ... .ఆ-వె. జ[illegible]నికేది [illegible] (ఆము. ౫ ఆ. ౭౫.) జాజర = జజ్జర = వంచన; కపటము. జజ్జకర్త - జాజరకర్త అనువాని స్థితికి శబ్దరత్నాకరస్థితియే యాధారము - 'జజ్జరకాఁడ నీ చనుతోఁ జనుము. (ద్వి. హరిశ్చం. ఉ. ౬౭౦ పం.) గీ. నడుము జాజరకాఁడు మన్మథుఁడుండునన్ని. (పి. శకుం. 3 ఆ. ౨౧౫.) (సాం. కూచ. ౧౨.) (సూ. రా. ని). జూజరము - జూదము= ద్యూతము - జూజకాఁడు - జూజకత్తియ యనునవి వేఱుగఁ జూపఁబడలేదు. 'జూదకర్త' అనుదానిస్థితికి శబ్దరత్నాకరస్థితియె యాధారము. 'జూదకాఁడు' (ఆం. భా. ౨-3౦౪.) (సూ. రా. ని.). 'జూదరి' = (జూదకాఁడు) అనుదానికి భారత ప్రయోగములె యుండు చూపఁబడును. 'తిండికర్త' అనుదానికి శబ్దరత్నాకర స్థితియే యాధారము. తిండికాఁడు = తిండిపోతు దురాశావంతుఁడు. క. విను కొడుకు గొన్న వేఁడుట । కొని కొట్టిన తిండికాఁడు......(ఉద్భ. ౧ ఆ. ౫౬) ఆ-వె.........। తీపుఁగోరి యుఱుకు తిండికాఁడును బోలె ।.........(స్త్రీ. ౧ ఆ. ౧౯. సూ. రా. ని.) "తేరకర్త.........అన్యగాలు. ఉ..........। ఇవ్వలఁ దేరకర్త యగు. (ఆము. ౫ ఆ. ౫౬.) తేరకాఁడు..... ...అన్యుఁడు. క. ఉరు బాహుబలము కలిగియు । వెరవిడిన తేరకాని విధమున.........(భాస్క. యుద్ధ. ౧3౯౫ ప.) ౨ క్రొత్తవాఁడు - అపరిచితుఁడు. సీ ఆతఁడు వేఁటకై యరిగినచో వజ్రి; దిగ్భ్రాంతి పుట్టించి తేరకాఁడు । సనునట్లు సేయు. (ఆను. ౧ ఆ. ౨౭౭.) దొడ్డకాఁడు.........గీ..........। దొడ్డకార్లచేఁ బడిపోయెఁ దూర్పుదిక్కు. (శ. హరి. 3 ఆ. 3౪.)" (సూ. రా. ని.). 'దొడ్డకర్త' అనుదానికి శబ్దరత్నాకరస్థితియె యాధారము. "నీటుకత్తియ.........విలాసముకల యాఁడుది - ఆఁడుది...... క......మొ । క్కలపు దొరకరాని నీటుకత్తియ యగుటన్. (కువల. ౨ ఆ. ౧3౯.) నీటుకత్తియ = నీటగు ఖడ్గము అని రెండవయర్థము. నీటుకా (గా)ఁడు......... అందగాఁడు.........ద్వి. కలికిమూరుఁడు నీటుకాఁడనుటింతె. (ద్వి. నల ౧ ఆ. ౬౫౧.) ...... గీ. నిక్కి నిక్కి నిరీక్షించు నీటుగాని । నందముల కెల్ల నెల్ల యౌ

నందగాని. (చంద్రా. ౨ ఆ. ౧౩౬)" (సూ. రా. ని.). సూ - రా - నిఘంటువున 'అందగాఁడు' అనుచో 'గ'కార మంగీకరింపఁబడెను. దానితోడి యంత్యానుప్రాసమున 'సీటుగాఁడు' అనుచో 'గ'కారము సమర్థిత మగుచున్నదని కోశకారుల యాశయము. ఈయెడల 'క-గ'ల సందేహమును నిర్వహించు ప్రయోగము ప్రాపాదికత మొక్కటేని నెచ్చటేనిఁ జూపఁబడలేదు. పంౘ సమర్థనము కేవలము బలహీనమైనది. 'నేస్తకత్తె' శబ్దస్థితికి శబ్దరత్నాకరస్థితియె యాధారము. గీ. కటికి చీకటి నెఱ నేస్తగాఁడు దాను. (శుక. ౨ ఆ. ౧౮౯. సూ. రా. ని.) 'బేరగాఁడు' అనుచోటి గకారము శబ్దరత్నాకరమునలేదు. 'బేరకాఁడు - బేరకత్తె' అనియె యుదాహరింపఁబడెను. ప్రయోగములు శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. 'వగకాఁడు - వగకత్తె' అనువానికిని శబ్దరత్నాకరమునఁ బ్రయోగములు చూపఁబడలేదు. "వగ = సంతాపము - శోకము - విలాసము." అనుదానికిఁ బ్రయోగములు గలవు. 'విలుకత్తె - వెచ్చకత్తె' అనుదానికిని బ్రయోగములు చూపఁబడలేదు. క. అరిది విలుకాని యుజ్జ్వల । శరమొక్కని నొంచు......(ఉద్యో. ౨ ఆ. ౩౬) (విలుకాఁడు = ధన్వి) వెచ్చకాఁడు......విటుఁడు - మిక్కిలి వెచ్చము (వ్యయము) చేయువాఁడు. తే-గీ. సురల యాఁకటికూడు మ్రుచ్చులకుఁ గీఁడు । ......... । లచ్చిసైదోడు రేబోటి వెచ్చకాఁడు. (కవిజనరంజనము. ౩ ఆ.) సొగసుకత్తెకుఁ బ్రయోగము శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. చ.........వన్నెకాఁడవై । కలయ మెలంగు బల్ సొగసుకానికి నెత్తులు పెట్టలేము.........(చంద్రా. ౧ ఆ. ౪-౭.) కోశద్వయమునందును 'అందకత్తె - అందగాఁడు' అనురూపములు చూపఁబడెను. 'కత్తె' అనుచో 'గ'కారము రాకుండుటకును 'కాఁడు' అనుచో వచ్చుటకును యుక్తిగాని కవిప్రయోగముగాని ప్రమాణము చూపఁబడలేదు. తే-గీ అందముల కెల్ల నెల్లయౌ నందగాని. (చంద్రా. ౨ ఆ. ౧౩౬.) 'అందకత్తె' అనుదానికిఁ బ్రయోగము చూపఁబడలేదు. శబ్దరత్నాకరమునందు 'కొండెకాఁడు - కొండెకత్తె' అనియు సూ - రా - నిఘంటువున "కొండెకత్తె - కొండెకా (గా) ఁడు" అనియుఁ జూపఁబడెను. గకారస్థితి విషయమునందలి యిట్టి వ్యత్యాసమునకుఁ బ్రమాణ ప్రదర్శనమెందునులేదు. 'కొండెకత్తె' అనుటకుఁ బ్రయోగము చూపఁబడలేదు. సీ. కుమతియుఁ జుట్టంబుఁ గొండెకాఁడు ప్రియుండు ।.........(రాములిం. ౧౧ ప. సూ. రా. ని.) ఆ-వె కొండెగాఁడు చావఁ గొంపదనుకఁ బోవ । వంతుకింతెగా(?)ని వగుపులేదు (వేమన. ౨-౫౮. ఆం. భా. ౭-౧౩ సూ. రా. ని.) 'బేరకత్తె - బేరకాఁడు' అనియె శబ్దరత్నాకరమునఁ జూపఁబడెను. ప్రయోగములు చూపఁబడలేదు. నాకి

యొక యేలినవాఁడని పూనికాఁడవై. (నన్ని. కు. సం. ౪ ఆ. ౪౧౫.) ఇందు 'పూనిక+వాఁడు = పూనికాఁడు' అని యున్నదగును. వకారలోప మధర్వణవచనము చొప్పున నయ్యె ననఁదగును. అభిమానకత్తె దానగుట నీవనుచు। ......(బరవ. ఆ.) అనుచో 'అభిమానకర్త్రి దానగుట' అని కవిప్రయుక్తపాఠ మననగును. అయ్యగారు - అత్తగారు. (౨౧౧ IV విశ.) గోపాలిగాఁడు. (౧౪౦ విశ.) మున్నగు స్థలములందు 'గారు - ఇగాఁడు' మున్నగునవి వేఱు. ఇచ్చటి 'కాఁడు - గాఁడు' అనునవి వేఱు. "చ. పులియఁడు బూచిగాఁడు.........అను మంతిగాఁడు. (మను. ౪ ఆ ౩౨ ప) ఇయ్యవి శునకభేదములు........" (బా. కు. ప్ర. బా. తద్ధి. ౧౪ సూ. వ్యా.) అని యిట్లు 'బూచిగాఁడు - అనుమంతిగాఁడు' అనువానిని బా. తద్ధి - ౧౪ సూత్రమునకు లక్ష్యములుగా గుప్తార్థప్రకాశికా వ్యాఖ్యాత చూపుట పొరపాటు.

కా - కత్తియలు కొండొక వానికి స్వార్థంబునం
జూపట్టెడు. ౧౩.

బాలవ్యా. చెలికాఁడు - చెలికత్తియ, హెగ్గడికాఁడు - హెగ్గడి

వివరణము. కత్తియ.

౨౯౧ II విశ కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి. ౧౪.
ఇబ్బందిగాఁడు - ఒంటిగాఁడు - కొమ్ముకాఁడు - పరి
కాడు, ఇత్యాదులు మృగవిశేష వాచకంబులు.

సంజీవని. ౨౯౧ II విశ:—కొన్నియెడల నర్థవిశేషబోధము లేకుండఁగనే ప్రాతిపదికార్థమునందె 'కా - కత్తియ' ప్రత్యయములువచ్చును. చెలి = స్నేహితుఁడు స్నేహితురాలు. చెలుకాఁడు = స్నేహితుఁడు. చెలికత్తియ = స్నేహితురాలు. హెగ్గడి = అంతఃపురపుకావలివాఁడు - అంతఃపురపుకావలి యగుస్త్రీ. హెగ్గడికాఁడు = అంతఃపురపుకావలివాఁడు. హెగ్గడికత్తె = అంతఃపురపుకావలి యగుస్త్రీ. "సీ. చెలికత్తె నెలుఁగెత్తి చీరు తొయ్యలిఁ దమ కులముని కోయిలల్ గుంపు గూడ. (ఉ. రా. ౬ ఆ. ౨౭.) క. అత్తతి మురిపపు నడఁ జెలి। కత్తియగమి గొలువ (మనుచ. ౬ ఆ. ౩౦.) తే.గీ. కట్టికమిటారి మొకరిచెల్కత్తె గములు (కువల. ౪ ఆ. ౧౩౯.) చ. అనవుఁడు నిట్లను న్విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం। డును జెలికాఁడునున్.........(ఉద్యో. ౨ ఆ. ౨౪ప)." (సూ. రా. ని). "ఉ.........సఖి। వారముతో రమారమణి వచ్చెను హెగ్గడికత్తె లెందతేఁ। గోరి భజింప (కళా. ౨ ఆ)." (శ-ర).

౧౪ సూ:—తిర్యక్కులలో మగవానిని దెలుపుశబ్దములకుఁ బరముగా 'కా' ప్రత్యయము వచ్చును. ఉదా:—"ఇబ్బంది. దే - వి. (ఇరు+పంది) అడవిపంది కిని ఊరబందికిని పుట్టినపంది" (శ-ర). అనివ్రాసియు "ఇబ్బందిగాఁడు - దే - వి. (ఇబ్బంది+కాఁడు) బెబ్బులికిని చిఱుతపులికిని పుట్టినపులి" (శ-ర). అని మాత్రము శబ్దరత్నాకరమున వ్రాయఁబడుట వింత. ఇబ్బందిశబ్దార్థమునుబట్టి 'ఇబ్బందిగాఁడు' అనుదానికి సంకరజాతిపంది యనియైన నర్థము వ్రాయుట యుక్తము. చిన్నయసూరి (వ్రాఁతప్రతి) నిఘంటువులో "ఇబ్బంది = పెద్దపులికిని జిఱుతపులికిని బుట్టినపులి" అని యున్నదని సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెను. దీనినిబట్టి సూరి బాలవ్యాకరణమునఁ బైరీతిని వ్రాయుట యెంతయు సుసంగతమగుచున్నది. పయిశబ్దరత్నాకరములోని యసంగతి నరసియే సూ. రా. నిఘంటుకర్తలు 'ఇబ్బంది' శబ్దమునకు "సంకరజాతిమృగము" అని యర్థమును వ్రాసిరని యెన్ననగును. 'ఇబ్బంది - ఇబ్బందిగాఁడు' అనువానికిని గోశద్వయమునందును ప్రయోగము చూపఁబడలేదు. "ఒంటి = ఏకాకిత్వము" (శ-ర). ఒంటి+కాఁడు = ఏకాకిత్వముగలవాఁడు - అసహాయశూరత్వముగలది. "తే-గీ. క్రొవ్వి నడ గొండకైవడి గునుకు నొక్క యొంటికాని మహీనాథుఁ డొడిఁగి యేయ। (మనుచ. ౪ ఆ. ౪౭ ప). ఒంటికా (గా)ఁడు = ఒంటరికా (గా)ఁడు. సీ. క్రమ్మి యొంటరిగాని ద్రొమ్మి నొంచు యశంబు........(చంద్రా. ౧ ఆ. ౨౦)." (సూ. రా. ని). "కొమ్ము - దే - వి......క. పందికోఱ. సీ. నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ము కొన నుబ్బ నెత్తిన ఘోణి వీవ (పారి. ౧ ఆ. ౪౯). కొమ్ము+కాఁడు = కొమ్ముగలది = అడవిపంది. "కొమ్ముకాఁడు .దే - వి. ౧ వరాహము. అగసాలెవాఁడు. సీ. నరకహేతు హిరణ్యహరణవృత్తిఁ జరించు కొమ్ముకాని భజించు కొదవ లెల్ల (వసు. ౧ ఆ. ౬౨ ప.)" (సూ. రా. ని). "పరి - దే - వి...... ౨ సమూహము. పరికాఁడు - దే - వి. తెగకు ముఖ్యమైన యేనుఁగు - యూథపము. చ. దంతి ము। ట్టినఁ బరికాఱు మొత్తము వడిం బఱతెంచిన మాడ్కి...... (భీష్మ. ౧ ఆ).

'క్వచి దముహతో౽పి డుజ్ స్యాత్' అను చింతామణిసూత్రముచొప్పున (౧౯౧ విష). కాప్రత్యయాంతము లిట్లు డుమంతములగునని యెఱుంగునది.

అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుం
స్త్వంబునం దగు. ౧౫.
'ఈ,' ప్రత్యయాంతంబు మగాదిగణంబు, అటమ

బాలవ్యా. టీఁడు = కమ్మతీఁడు - అటమటము - కమ్మతము -
వివరణము కన్నడము - కొండెము - బానసము - బూటకము -
౨౯౧ III విష. మండడి - మన్నెము - సుంకము - ఉక్కివంబునకు
వలోపంబగు - ఉక్కీఁడు ఇత్యాదులు.
ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు. ౧౬.
మొక్కలీఁడు - కల్లరీఁడు.

సంజీవని. ౨౯౧ III విష:—అటమటాది శబ్దములపై మతుబర్థంబున మహదర్థము వాచ్యమగునపుడు 'ఈ' ప్రత్యయం బగును, ఈప్రత్యయంబు మగాదిగణములోనిది గాన బా - ఆచ్ఛి - ర సూత్రము చొప్పున (౧౯౧ I విష.) 'ఈ'ప్రత్యయాంతంబులు డుమంతంబు లగును. అటమటము = అటమట = మాయ - వంచన, కమ్మతము = సేద్యము - కృషి, కన్నడము = కన్నడభాష, కర్ణాటదేశము. కొండెము = చాడి, పైశున్యము. బానసము = వంట, వంటసాల. బూటకము = మాయ, వంచన. మండడి = అశ్వశాల, మందుర. మన్నెము = సన్మానించి యిచ్చిన భూమి, సుంకము = పన్ను, ఉక్కివము = కపటము, మౌర్ఖ్యము. మొక్కలము = ముష్కరత్వము, ధైర్యము. కల్లరి = అసత్యముచెప్పువాఁడు. అటమటము గలవాఁడు = అటమటము+ఈ+ఁడు = అటమటీఁడు. ('అటమటకాఁడు - అటమట కత్తె' అనియు మత్వర్థీయరూపములు కోశములందుఁ జూపఁబడెను.) వంచకుఁడు - మోసగాఁడు. ఆ-వె. వాదులానితోడ......... । అటమటీనితోడ నడియరి (లోభి) తోడ ను । వెలకు నెత్తమాడ వెరవుగాదు. (ఉ. హరి. 3 ఆ. ౧౧౨.) సీ. శితికంఠునకును నెచ్చెలికాఁడు కాఁడొకో । యటమటీఁడైన యీ యక్షభర్త. (కాశీ. ౭ ఆ. ౬౦.) కమ్మతీఁడు = కమతీఁడు = సేద్యగాఁడు. '(కమ్మతగాఁడు - కమ్మతకాఁడు - కమతకాఁడు' అనియు రూపాంతరము లుదాహరింపఁబడెను.) సీ...... కల్పకంబుల పంట కమ్మతీఁడు. (మనుచ. ౫ ఆ. ౪౭.) తే-గీ. నమ్మిక వసంతు డనుపేరి కమ్మతీఁడు.........(రాము. ౧ ఆ. ౧౬౮.) కన్నడీఁడు = ఉపేక్ష చేయువాఁ డను నర్థమునందలి దీనిస్థితికి శబ్దరత్నాకరమె యాధారము. కర్ణాటకుఁడు - కన్నడదేశపు వాఁడు. సీ. కన్నడీఁ డనఁగను గర్ణాటకుం డొప్పు. (ఆం. భా. ౨-౧౦౭.) సీ. ఆరెలు కన్నడీ లరవలుం దెలుఁగులు, తనబిరు దందియం దగిలి కొలువ. (ద్వా. ౧ ఆ. ౪౨.) కొండీఁడు = కొండెముచెప్పువాఁడు. సీ. కొండీని నాలుక రెండుగాఁ జీరెదు...... (మార్క. ౨ ఆ. ౯౫.) ('కొండెకాఁడు - కొండెగాఁడు - కొండెకత్తె - కొండెగీఁడు' అనురూపము లుదాహరింపఁబడెను. "కొండియుఁడు' అని భారతమున భావడు

బడెను. ఉ. క్రూరుఁడు లోభియున్ శఠుఁడు కొండియుఁడున్ జడుఁడున్ గృతఘ్నుఁడున్ .........। చేరువ నున్కి భూపతికిఁ జెట్టయొనర్చు నరేశ్వరోత్తమా. (శాంతి. 3 ఆ. ౪౬౯.) (సూ. రా. ని.) (శబ్దరత్నాకరమందును గొండియుఁ డనియె యున్నది. 'కొండెము చెప్పువాఁడు = కొండియఁడు' అనుట యుక్తమని తోఁచెడిని.) బానసీఁడు = వంటవాఁడు. ఉ.........నన్ । మీఱఁగ బానసీని నొకనిం బురిఁ గాననియట్లు. (విరా. ౧ ఆ. ౨౩.) బూటకీఁడు = మాయావి. ఆ-వె. బూటకీఁడు పాటిపోయె నంద్రు. (బస. ౧ ఆ.) (బూటకుఁడనియుఁ గలదు. మందడీఁడు = గుట్టుపు వాఁడు. ఎ-గీ.........। మాటిమాటికిఁ బరికించి మందడీల। కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు. (విరా. ౧ ఆ. ౯౫.) తే. అంతఁ దనపట్టి యగువాలి నడఁగఁజేసి। నీకొమరుఁడంచు వేల్పు మన్నీఁడు ప్రొద్దు। నలమి ముట్ట వేయించె ననఁగమబ్బు। తెగలు వడిఁ బర్వె చుక్కల తెరువునందు. (అచ్చ. రా. కిష్కి౦.) సుంకడు = పన్ను తీయువాఁడు. ('సుంకరి - సుంకరీఁడు' అనియు రూపము లుదాహరింపఁబడెను.) (శ-ర) ('సుంకీడు' అనుటకు బ్రయోగము శబ్దరత్నాకరమునఁ జూపఁబడ లేదు.( ఉక్కీఁడు = మూర్ఖుఁడు. ఉ.........ఉ। క్కీని మనంబు గీను పరికించుని క్రొవ్వునఁ జేటు దప్పునే. (విరా. 3 ఆ. ౨ ప.) ఉ.........ఉ। క్కీలయి నేర్పు లేక తమకించి పయింబడి. (నిర్వ. ౩ ఆ. ౧౧.) ఉక్కివుఁ డనియుఁ గలదు. 'మొక్కలి' యనఁగా మూర్ఖుఁడని యర్థముగాన 'మొక్కలీఁడ'ను పదంబునందలి 'ఈ' ప్రత్యయము స్వార్థికమె. "సీ. మంత్రి విద్వేషంబు మాన్య పరాభవంబును బ్రజాపీడనంబులును గలిగి। మొక్కలీఁ డగుటయు. (అశ్వ. ౧ ఆ.) (మొక్కలికాఁ డనియు నుదాహరింపఁబడెను.)" (శ-ర) 'కల్లరి = అసత్యమాడువాఁడు' ఇట్లగుటచే "కల్లరీఁడు" అను దానిలోని "ఈ" ప్రత్యయమును స్వార్థికమె యనందగును. (దీనికి సాంబనిఘంటువుఁ బ్రమాణముగఁ జూపఁబడెను.) (సూ. రా. ని.)

అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు. ౧౭.

| | |
|---|---|
| బాలవ్యాకరణ | జాలరి - ఓఱకరి. జాల - ఓఱపు. కల్ల - చదువు- |
| వివరణము. | జూదము - టక్కు - తగవు - తీరుపు - తెంపు - |
| ౨౯౧ IV విమ. | తెరువు - నేరుపు - మతకము - పొరవరి - వేఁట- |
| | సిగ్గు - సుంకము. ఇత్యాదులు. |

సంజీవని. ౨౯౧ IV విమః—'జాల'మున్నగు శబ్దములకుఁ బరముగా మతుబర్థమందు 'అరి'అను ప్రత్యయమగును. ఇది స్త్రీసమరూపమగుటచేత, మహాన్మాత్యమహాదర్థంబులు ప్రయోగానుసారముగ వాచ్యములగుచుండును. ఉదా:—

"సీ. దొరలు గద్దింపఁ గల్లరివార్త నిజముని (శుక. ౧ ఆ. ౫౫). తనువు మీన్ పొల వల్చు జాలరిదానను (ఆని. 3 ఆ. ౮౦). క. అల్లదె తాటకయని యెకు। కల్లరి రాకాసి (అచ్చ రా. బాల. ౧౧౨ ప)." (సూ. రా. ని). తీర్పరి పలుకు. (అచ్చ. ఖార. ౧ ఆ. ౪). (అమహదర్థమువాచ్యము). జాల = చేఁపలనుబట్టువల. ఒఱపు = సౌందర్యము. కల్ల = అసత్యము. జూదము = ద్యూతము. చదువు = విద్య. టక్కు = మాయ. తగవు = న్యాయము. తీరుపు = న్యాయము - చక్కఁబాటు. తెంపు = తెగువ - సాహసము. తెరువు = దారి - మార్గము. నేరుపు = నేరిమి - సామర్థ్యము. మతికము = మాయ. వెరవు = ఉపాయము. వేఁట = మృగయ. సిగ్గు = లజ్జ. సుంకము = పన్ను - అరి - కరము. "జాలరి - కైవర్తుఁడు. క,..... అంత వేడుక। కాఱులు జాలరులు సొచ్చి క్రందు కొనంగన్ (శాంతి. 3 ఆ. ౧౯౨). తరలము.........తనువు మీన్ పొల వల్చు జాలరిదాన (ఆని. 3 ఆ. ౮౦). ఒఱ పరి = సుందరుఁడు - విలాసి. చ. ఒఱపరిఁ గన్నఁ గూడఁజను......జార ధారణిన్ (జై. 3 ఆ. ౨౮). కల్లరి = అసత్యమైనది - అసత్యమాడువాడు - దుష్టురాలు - దుష్టుఁడు. సీ. తచ్చుఁగొండి పోతరకత్తె కల్లరి . .........(చెన్న. ౨-౨౪). సీ. దొరలు గద్దింపఁ గల్లరి వార్త నిజముగా నిర్వహింపని చేటి నీటు కత్తె। (శుక. ౧ ఆ. ౫౫). (ఇందు మహదర్థము వాచ్యమగుచున్నది). క. కల్లరి తొలువేలుపు తేఁ। డల్లనఁ జెఱవట్టి.........(అచ్చ. రా. ఆర. ౬౯ ప). చదువరి = విద్యావంతుఁడు. తే-గీ. చదువరులు గాని విప్రులు చాల ముగ్ధులు......(హరి. ఉ. ౧౦ ఆ. ౨౪౪). జూదరి = జూజ మాడువాఁడు. మ. అరయం దప్పొకయింత నావలన లేదాధర్మ పుత్త్రుండు జూ। దరి వెంటం దమకించి సౌబలుని చేతం భూమి (ఉద్యో. 3 ఆ.3౫3). సీ. బొజుఁగులాఁడి లడారి బొల్లిపల్లాకి జూదరి యెబ్బెరాసి గాతలకొటారు. (చెన్న. ౨ ఆ. ౨౪). ('జూదరికత్తె - జూదకత్తె - జూదకాఁడు - జూజకత్తె - జూజకాఁడు' అనియు రూపము లుదాహరింపఁబడియున్నవి). టక్కరి = మాయావి. ఉ. టక్కరు లుక్కుపుల్ బలుతుటారులు క్రూరులు (సమీర. ౪ ఆ. ౨౨). '(తక్కరి. తక్కరీఁడు - టక్కరికాఁడు' అనియు నుదాహరింపఁబడియున్నది). తగవరి = తీర్పరి = న్యాయాధిపతి. క. తగవరియగు తా నొంచినఁ। దగు దండము.........(విజ్ఞా. ప్రా. ౧౨౨). ('తగవులాఁడు = తగవరి' అనియు నుదాహరింపఁబడెను). "తీరుపరి = తీర్పరి = ధర జ్ఞుఁడు. తే-గీ...ఒజ్జ, బాపనయ్యలు తీర్పరుల్ బలసికొలువ (నీలా. ౨ ఆ. ౪౬).......... 3 కార్యకర్త. సీ. రాజాగ్ర సేనుఁడై రాజిల్లఁ దాను దీర్పరి తనంబెంతయుఁ బ్రభుతతోడ। నడపువాఁడయ్యె...........(హరి. ఉ. ౨ ఆ.

౧౭౮ ౬). ౫ మనోహరమైనది. క. జగడంపుఁ గూటి వేలుపు । తెగజడదారి గమి
కాని తీర్పరిపలుకుం । బొగడితె నుబ్బెడు సామికి.........(అగ్ని. భార ౧ ఆ. ౪).
(ఇచట నరుహార్థము వాచ్యమగుచున్నది)." (సూ-రాని) తెంపరి = సాహసికుఁడు.
సాహసికము. క......చావునకుం । దెంపరివై పదరువాని తెఱఁగునఁ గుమతీ (భాగ-
౭ స్కం. ౨౭౦). క. తెంపరిమాటలు పతికని । నింపగునో.........(రుక్మా. ౫
ఆ. ౧౫౨). తెరువరి = బాటసారి. (తెర్వరి) క. కను భ్రమసిన తెరువరి తన । కన
పాయంబైన మార్గ మరసి.........(ఉద్యో. ౨ ఆ. ౨౮౦). నేరుపరి = నేర్పరి =
చతురుఁడు. క. అరిది విలుకాని యుజ్జ్వల । శరమొక్కనిఁ జంపుఁ దప్ప జనినం జను
నే । ర్పరియైనవాని నీతి । స్ఫురణము పగ రాజు నతని భూమిం జెఱుచున్ (ఉద్యో.
౨ ఆ. ౩౬). మతకరి = మాయావి. చ. మతకరి చాలుఁ జాలు నిఁక మాదెస రాకు
మటంచు నల్కతో । నతివ బొమల్ ముడించె (నరస. ౩ ఆ). చ. ...అ । మ్మ
తకరి వేలుపుం దపసి మమ్ముఁ దలంపఁగ నేల యచ్చటన్ (పారి. ౧ ఆ. ౮౪). వెరవరి =
ఉపాయశాలి. చ. వెరవరి గాక వీఁడు కురు వీరులకుం దల సూపువాఁడె (విరా. ౪
ఆ. ౯౧). చ. బళిరె పురే యరే యరరె బాపురె యంచు వచింప వేఁటరుల్ (చంద్రా.
౨ ఆ. ౪-౭). "సిగ్గరి = లజ్జగలవాఁడు - లజ్జగలది - సిగ్గరికత్తియ యనియుఁగలదు.
వ. ఎట్టకేలకుం జిట్టకాలకుం జెవియొగ్గిన సిగ్గరికత్తియలు (వసు. ౪ ఆ). (రూ. సిగ్గరి
కత్తె) (స్వార్థమున కత్తియ)" (శ-ర). "సుంకరి = సుంకరీఁడు = సుంకీఁడు. క. అడి
గినఁ బతితోఁ నిట్లనుఁ । గడవాయెను సుంకరీఁడు తమ లెక్కలకై । ......(హంస.
౪ ఆ. స్వార్థమున. ఈఁడు). ఆదిశబ్దముచే బొంకరి. మొ. ఉ. నేరనివాఁడు బొంక
రియు.........(శాంతి. ౩ ఆ. ౪౬౯). ఉ. అ । బొంకరి దివ్యవాణియుఁ దపో
ధనులున్ మము నిట్లలంతురే (కర్ణ. ౩ ఆ. ౫౯ ప) (వి సర).

---

విస్తర. ౨౯౧ IV విష:—"అప్పకవి........అకాఁ సీసమాలికలో గద్దఱి
శబ్దంబు శకటరేఫయుక్తంబని వచించెను. 'గద్దె (ఉన్నతపీఠము)+అరి' ఇట్లుండ...
దిట్టతనంబు గలవాఁడని లాక్షణికార్థంబునందు నియ్యది గ్రమంబుగాఁ బ్రయో
గింపఁబడుచున్నదనియుఁ గొందఱు లాక్షణికుల మతంబు" (బా. గు. ప్ర. ౨౯౯ పు.
ద్వి. ము.) గద్దఱిశబ్దము శకటరేఫయుక్తంబనుచు రేఫఘటితమగు 'అరి' ప్రత్య
యము నదికి వ్యుత్పత్తి వ్రాయుట యసంగతము. 'గద్దఱి' శబ్ద మరి ప్రత్యయాంత
మని యే కోశమునందును వ్రాయఁబడలేదు. అందు గద్దెశబ్దము ప్రకృతియనియు
నెవ్వరును దలంపలేదు. గద్దరిశబ్దమును నెందును లేదు. ఈగుప్తార్థప్రకాశికలోని
యసంగతవాక్యములను జూచి శబ్దరత్నాకరమును జూడకయె యందీప్రత్యయము

ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు. ౧౮.

బాలవ్యా. వి. ౪౯౧ V విష.

ఓయారి - అక్కసి. ఓయారము - అక్కసము - కడలు - చాగము - జోగము - తమకము - తుటారము - బండారము - బిత్తరము - బిటారము - బేహారము - మచ్చరము - మిటారము - విన్నాణము - వెక్కసము - ఇత్యాదులు.

సంజీవని. ౪౯౧ V విష:—ఓయారాదిశబ్దంబుల కస్త్యర్థంబున 'ఇ' ప్రత్యయం బగును. సంస్కృతమునందును నిట్టి ప్రత్యయము గలదు. ఉదా:—'ధన-ధనిన్, గుణ-గుణిన్.' మొ. "శ్లో. ఉత్వ మిత్వం తథైవాత్వం। సమాసే మతుబర్థకమ్." (౪౮౫ విష.) అనునవి సమాసాంతమున నిల్చు ప్రత్యయములుగాన నవి భిన్నవిషయకములు. ఇప్రత్యయాంతములును స్త్రీపరములె యగును గాన నవి మహన్మహాత్వమహదర్థములను బ్రయోగానుసారముగ బోధించును. (చూ. ఒయ్యారి.) ఒయారము = విలాసము. (ఒయ్యారము - ఓయారము.). "అక్కసము. దే - వి - సంతాపము." (శ-ర.) (ఇది యాక్రోశశబ్దభవమనుట లెస్స.) "కడలు = తరంగము. సీ. తూలెడు పర్యాద దుఃఖాంబునిధిలోనఁ గడలుచందంబునఁ గడలుకొనఁగ (హరి. పూ. ౯ ఆ.). చాగము = త్యాగము, జోగము = యోగము - తమకము = త్వర - మోహము. తుటారము = దిట్టతనము. బండారము = బొక్కసము, బిత్తరము = శృగారచేష్ట. (విలాసము). బిటారము = విలాసవిశేషము, బేహారము = వ్యవహారము - వర్తకము. మత్సరము = మాత్సర్యము - చలము. మిటారము = నిక్కు. విన్నాణము = విజ్ఞానశబ్దభవము = నేర్పు, వెక్కసము = దుస్సహత్వము." (శ-ర). ప్రయోగములు:—ఓయారి = ఒయ్యారి = ఒయారి = విలాసిని. విలాసి. క. ఆయంగన క్రేఁగన్నుల । యోయారపుఁ గలికిచూపు టుమ్మలఁ బడి........(విక్ర. ౫ ఆ. ౧౭౧) శా.........మునీంద్ర మాకు నెపుడున్ జేతోభవుం గన్న యో। య్యారిన్ శౌరి వరించు వేడుకలు మల్లాడున్. (వరాహ. ౯ ఆ. ౪౦.) సీ. కలిమి యొయ్యారి నోముల ఫలంబు. (ఉ. రా. ౧ ఆ. ౮౦.) సీ. వేలుపుఁ బూఁబోండ్లఁ గేలిసేయు నొయారి చెలువలు.........(యయా. ౪ ఆ. ౧౫౯.) శా.........నావలనఁ దప్పేమీ యొయారీ యయో । నామీఁదం దయ లేదటే చెలి ననున్ మన్నింపవే కోమలీ. (సారంగ. ౪ ఆ ౪౧౦)

---

శకటరేఫవంతముగ నున్నదని యు నతిప్రత్యయమనియు వేటికావ్యాఖ్యాత వ్రాయుట కేవలము తప్పు. (బా. సా. వే. 3౭౦.) అసత్యము.

సీ. చిన్ని క్రొన్నెల నెన్నునెన్నొసల్క నొయ్యారి యలంతి కస్తురిరేక లనువుమీఱ. (అచ్చ. రా. బా. ౮౭.) ఇట్లిట మహన్మహత్వ మహదర్థంబులు వాచ్యము లగుచున్నవి. అక్కసి = అక్కసుకాఁడు = ఆగ్రహముగలవాఁడు. కడలి = సముద్రము. సీ. కడలిమత్స్యంబవై నీవు కడలి నడుగు. (నై. ష. ౮ ఆ. ౧౨౦.) చాగి:— ఉ. చాగులు పుణ్యభాగులును శాశ్వతరాగులు......(భాస్క. కిష్కిం. ౪౯౦ ప) జోగి = యోగి. (జోగము+ఇ = జోగి.) (జోగు+ఇ = జోగి = భిక్షుకుఁడు. శ-ర.) క.........। జోగులము మేము మా కట। రాఁకూడదు గాన రాజ రమ్మనుఁ డిటకున్. (ద్వా. ౧౨ ఆ. ౪౨.) ఆ-వె. రాచజోగి రిక్కరాయఁడ నీవు మా। నగరు సేరు టెల్ల మిగులమేలు. (అచ్చ. రా. బా. ౯౦.) (ఇట్టియెడల జోగి భిక్షుకుఁడు గాఁడు.) తముకి = లోభి. క. పతి ధరణీప్రజ। మనికికిఁ దగ నడచునది తముకి గాకెపుడున్. (శాంతి. ౨ ఆ. ౧౭౯.). తుటారి = దిట్టతనముగలవాఁడు. గీ. రాచపుడమి। వేలుపు తుటారి తాపసి వెంట నరుగు। మనుచు నీరాము నేరీతిఁ బనుచువాఁడ. (చం. రా. ౨ ఆ. ౬౪). దిట్టతనముగలది. సీ. చానల తలమిన్నఁ గానరు గద గోర, వంకలార తుటారి జంకలార. (అచ్చ. రా. అర. ౮౬) ఇట నమహదర్థము వాచ్యము. చ. చిలుక తుటారి బోటియును. (నీలా. ౧ ఆ. ౬ ప.) తుటారి = దుష్టుఁడు. ఉ. టక్కరు లుక్కువుల్ బలు తుటారులు క్రూరులు.........(సమీర. ౮ ఆ. ౨౨) (సూ. రా. ని.). "బండారి = బొక్కసమున కధికారి. ఎ-గీ. తనరు చలమర్తి గండప్రతాపరుద్ర। మనుజవరునకు బండారియును మహాధి। కారియును నాప్తుఁడును నయి......(మార్క. ౧ ఆ.). బిత్తరి = విలాసిని - ఆఁడుది. క. చిరుఁజిత్రలిఖితుఁ గని బి। త్తరి వెఱవ.. .. (నరస. 3 ఆ.) బిత్తరి వాలుఁ జూపులున్. (రాజ. 3 ఆ.) బిటారి = విలాసిని. ద్వి. రాజితశైవాల రమణీయ రోమ। రాజిలతల్ బిటారములు వాటింప. (విష్ణుమా. పూ. ౨ ఆ.) బేహారి= వర్తకుఁడు. క. సరకమ్మెడు బేహారులు। నరపతి సుంకరుల లెక్క నమ్మికతోడన్। సరకమ్మిన సొమ్మునఁ దా। రిరువదియగుపాలు సుంక మీఁదగుఁ బ్రీతిన్. (విజ్ఞా. ప్రా. కాం.) (బేహారి బెహారి యనియు రూపములు గలవు.) మచ్చరి= చలపాది. చ. మదమున దేవదానవులు మచ్చరులై కడుఁ బిచ్చలించి సం। మదలను గోరి పోరునెడ.........(భాగ. ౬ స్కం.) మిటారి = నిక్కుగలది. "దే - వి - మదముగల యాఁడుది. ౨ ఆఁడుది. (ప్రమద.) విణ. ౧. మదముగలది. 'మిటారి తొత్తు' 'మిటారిచూపు' ౨ నిక్కుగలది 'మిటారిగుబ్బ' 3 ఉన్నతి గలది. 'మిటారి బల్పిఱుఁదు' విన్నాణి=సన్నాణ్యసి. ఆ-వె. వేదవిదునిచేత విన్నాణిచేతను। దపసిచేతఁ

బిన్నవానిచేత । రాయబారిచేత రాయసుంకరులచేఁ । గూలి పుచ్చుకొనుట చాలఁ దప్పు. (విజ్ఞా. ప్రా. కాం.) విన్నాణి = నేర్పరి. మ. బహువర్షంబులు బ్రహ్మ తొల్లి జగ ముత్పాదింప విన్నాణి గాక. (భాగ. ౨ స్కం.). వెక్కసి. దే-విశే. (వెక్కసము+ఇ) దుస్సహుఁడు - దుస్సహురాలు. మ.........గో గోపక గోపికా నికరముల్ విభ్రాంతిమై బిట్టు మేల్ । కనిచూడం జనుదెంచి రర్భకులకెల్లన్ వెక్కసిన్ రక్కసిన్. (వి. పు. ౭ ఆ.)" (శ-ర.) ఇత్యాదులనుటచే 'జవ్వని' మున్నగువాని నెన్నునది. జవ్వనము+ఇ = జవ్వని = యువతి. చ. అనుపమ దివ్యమూర్తి దరహాస విలాస విభాతి నిండు జ। వ్వని సుకుమారి......(నన్ని. కు. సం. ౮ ఆ. ౧౨౪.) సూ. రా. - నిఘంటుకర్తలు "కైవారము+ఇ = కైవారి" అనుదానిని సంయుత ముదాహరించిరి. "కైవారి = కయివారి. వి. (కైవారము+ఇ) (ఇది ఒయ్యారి వంటిది) స్తోత్రపాఠకుఁడు.........మ. కరులాకుస్మరఘుస్మరాబ్జభవులుం గైవారులు...(హరి. పూ. ౧ ఆ. ౪.)"(సూ-రా-ని) క. నావుడు నిదియా సంజయ। కైవారము సేసె దీవు కౌంతేయుల... .....(ఉద్యో. ౨ ఆ. ౨౨౭.) అనియిట్లు కైవారమనునది భారతమందును గలదు. కాని శబ్దరత్నాకరకర్త 'కైవారము' అనునది సంస్కృత సమమనుచు నీక్రింది ప్రయోగముం జూపెను మ.........కైవార దుర్భాషణంబులకుం గాని యతండు మెచ్చఁడు.........(నైష. ౭ ఆ. ౮౯.) ఇట్లు కైవారశబ్దము సంస్కృతమైనపుడ డస్త్యర్థకమగు 'ఇని' ప్రత్యయముచే 'కైవారి' అను తత్సమరూపము సుసాధమగును. కావుననె శబ్దరత్నాకరకర్త 'కైవారము - కైవారి' అను రెండిటిని సంస్కృత సమములుగ నుదాహరించి పైలక్ష్యములనె చూపెను. మఱియు "లయగ్రాహి. రసాలములవేడ్కఁ గయివారములు సేయుచును ధీర మకురాస్యల్. (భాను. ౨ ఆ.) అను ప్రయోగమును జూపి "కయివారము = కైవారము" అను పదములను సైత మంగీకరించి 'కైవారము' అనునది 'దేశ్యము తత్సమము' నయి యుండుటచే 'ఉభయము' అని పేర్కొనెను. ఈసందర్భమున నీతఁడు త్రొక్కినమార్గము యుక్తతరముగనే యున్న దనఁదగును. కాని "కయివారము - కైవారము" అనునవి దేశ్యములనుట సరి కాదనవలసి యున్నది. శబ్దార్థసామ్యము పూర్తిగా నుండుటచేత 'కయివారము' అనునది తద్భవరూపమనుట యుక్తము. అట్లయినను 'కైవారము' అనునది యచ్చతెలుఁగు కావ్యములలోఁ బ్రయుక్తమైయుండుట ("గీ. అనుచుఁ గైవార మొనరించు" నీలా. ౨ఆ. ౪౨ ప). చేతను దానిని దద్భవమనుట కంటెఁ దత్సమముకన్న భేదమేమియుఁ జూపట్టమిచేతను నతఁ డద్దానిని దేశ్యముగ నంగీకరించవలసినవాఁ డయ్యెనని

తోఁచుచున్నది. ఇట్లేల సంకోచపడవలెనో తెలియకున్నది. 'కయివారము' అను దానిని మాత్రము వైకృతముగా నంగీకరించి దాని స్థితిచే భ్రాంతుండై కూచిమంచి తిమ్మకవి 'కైవారము'నియుఁ దన యచ్చతెల్గు కావ్యములలోఁ బ్రయోగించెననుట యుక్తతరము కాదా? "భాషించినాఁడవు బహుదేశ బుధులతో విద్యాపరీక్షణ వేళలందు" (భీమ. ౧ ఆ.) అనుచొప్పున వేమారెడ్డిగారి యాస్థానమున విద్యా పరీక్షాధికారి పదవి నలంకరించిన కవిసార్వభౌముఁడు భ్రాంతిపడె ననుటకన్నఁ దిమ్మకవికి భ్రాంతినంగీకరించుట యుక్తతరము కాదా? "కైవార దుర్భాషణంబు లనుచో 'ము' లోపమును 'నెత్తపలక - చప్పరమంచము' ఇత్యాదులయందుంబోలె నొండె, రాహుత్తశబ్దమువలె కైవారశబ్దము సంస్కృతేతరమయ్యును సంస్కృత భ్రమచే సిద్ధసమాసమందు ఘటితమైనదనియు దానంజేసి ములోపము కలిగినదనియు నొండె తలంపవలయును." (సర్వంకషావ్యాఖ్య. ౫౮౨ పు. నైష. ౭ ఆ. ౮౯ ప. అని కీర్తిశేషులగు కళాప్రపూర్ణ వేంకటరాయశాస్త్రులవారు వ్రాయుట సరికాదని పైసందర్భమునుబట్టి చెప్పఁదగును. నెత్తపలక మున్నగునవి యాచ్ఛికసమాసములు. వానిపోలిక దీనికెట్లు పొసంగును. మఱియు నిట కైవారశబ్దము భాషాంతరములలో నున్నదని వ్రాయఁబడెను. అదియొక విశేషము కాదు. హిందూదేశభాష లన్నిటి లోను సంస్కృతశబ్దములు విస్తరించి యున్నవని యెల్లరకును విదితమే కదా. సూ - రా - నిఘంటుకర్తలును సర్వంకషామార్గమునే యనుసరించిరి. "శ్రీనాథుఁనకు సంస్కృత సమాసమున సంస్కృతేతరపదములఁ జేర్చు నలవాటు గలదు. ఇట్లె హేరాళపదమునుగూడఁ బ్రయోగించినాఁడు. క.. వసియించున్। హేరాళ క్రీడా సం।చారిణి మాకాంబ భర్త జనరక్షణాకై. (భీమ.౧ఆ. ౧౦౦.)"(సూ-రా-ని) శబ్దరత్నాకరకర్త యీపద్యమునే ప్రమాణముగఁ జూపి హేరాళశబ్దము సంస్కృతమని నిరూపించెను. రాహుత్తశబ్దము కవిపితామహునిచే సిద్ధసమాసమునఁ బ్రయోగింపఁబడెను. శా. ఓరాజన్య మహేంద్ర యోమణిగణ ప్రోతాసి వాతాశన। ప్రారజ్య త్రుటిచక్ర యోముఖరశార్ఙ్గ క్రూరబాహార్గళా। యోరుక్ష్మాచలకల్ప యోకవిచిత్రవ్యాధాంగ కావంగదే। యోరాహుత్త శిరోమణీ నిరవధి ప్రోద్యత్ప్రతాపారణీ. (మనుచ. ౪ ఆ. ౭౧.). ఈమహాకవు లీశబ్దములను సంస్కృతకావ్యములలో నరసియె యిట్లు ప్రయోగించిరని నానమ్మకము. "రాహుత్తః 'అ - పుం' అశ్వారోహకః" (సర్వశబ్దసంబోధిని). ఇట్లె యొకచో శ్రీనాథ కవిపితామహప్రయుక్తములగు "పణినాఘృత్య - పణినసూనుశబ్దములు ప్రామాదికములని వేంకటరాయ శాస్త్రులవారు భ్రమించి వ్రాసిరి. (చిం. వి. పరి. ౮౮ విష.). కైవారశబ్ద మాచ్ఛిక

మనుటకు వీరీక్రిందిరీతి యుక్తులను జూపుదురు. "కయివారము అను రూపాంతర ముండుటచేతను అచ్చ తెనుఁగు గ్రంథములలో (కైవారశబ్దము) నుండుటచేతను సంస్కృత నిఘంటువులలో (కైవారశబ్దము) లేకపోవుటచేతను దీని నాచ్ఛికముగా గ్రహించుటయే యుక్తము" (సూ. రా. ని. "కైవారము I" శబ్దమునొద్ద.). కయి వారమను రూపాంతరము గలదందురే కాని యట్టిరూపము భారతాది ప్రాచీన ప్రామాణికగ్రంథములలోఁ జూపఁగల్గిరా ? ఉన్నను నట్టి వైకృతరూప మేమి నిర్ణ యింపఁగలదు? సామాన్యకవియగు తిమ్మకవిప్రయోగమునుబట్టి శ్రీనాథమహాకవికి భ్రాంతిని గల్పించుటగాని లక్షణస్ఖాలిత్యమును గల్పించుటగాని యుచితమా ? ఇంక సంస్కృతనిఘంటువులో లేదందురే! ఎన్నిశబ్దములు వాచస్పత్యాదులలో లేనివి సంస్కృతమున నున్నవో పరిశీలింతురుగాక "ఏధి వహ్యోశ్చతుః. ఏధతుః = పురుషః. వహతుః రనడ్వాన్" (సి. కౌ. ఉణాది. ౭౮ సూ.) "అఙ్గి మది మన్దిభ్య ఆరన్...మదారో వరాహః...(ఉణా. ౪౧౪. సి. కౌ.) "కుడి కమ్పోర్న లోప శ్చ...కుడి ర్దేహః..."(సి. కౌ. ఉణా. ౫౮౩ సూ.) "భ్రస్జి గమి నమి హాని విశ్యశాం వృద్ధిశ్చ........గాత్రమ్ = శకటమ్, నాత్రమ్ = స్తోత్రమ్, హాత్రమ్ = మరణమ్, వైశ్రవ్ =పిష్టపమ్, ఆష్ట్ర మాకాశమ్." (ఉణా. ౫౯౯ సూ. సి. కౌ.) "కృదరాద యశ్చ - కృదరః = కూసూలః - సృదరః = సర్పః." (సి. కౌ. ఉణాది. ౭౧౯ సూ.) ఈశబ్దములు వాచస్పత్యసార శబ్దస్తోమమహానిధిలో లేవు. ఇంకను బ్రసిద్ధము" లగు "ఆవలీ - ఆలోకన - లోకన - నిటల - ధారుణి - పారావార - కవన - మున్నగు నెన్నెన్నియో యిందు విస్మృతములయ్యెను. మఱియు కైవారశబ్ద మునకు మూలమును వ్యాకరణమునఁ గన్పట్టుచున్నది. "కేవృ సేవే, కర్వ దర్పే" అని కవి కల్పద్రుమమున వాంతధాతువు కన్పట్టుచున్నది. "కేవ - సేవనే, భ్వాదిః ఆత్మ - సక-సేట్ - కేవతే.........."(శబ్దస్తో.) ఉణాదులలో ౪౧౪ మొదలు ౪౩౦ వఱకుఁగల సూత్రములందు ఆరన్ ప్రత్యయ ముపదేశింపఁబడెను. అందు "తుషారాదయశ్చ" (ఉణా. ౪౧౯.) అనుచోష్వనఁ దుషారాదులలోనిదిగా "కైవార" శబ్దము సుసాధ మగుచున్నది. "కుఙ్గి మృజిభ్యాం చిత్.....కుఞ్జా రో మయూరః - మార్జారః" (సి. కౌ. ఉణా. ౪౧౨ సూ.) అను సూత్రము సందర్భము మృజ్ ధాతువునకు వలెనె యీ 'కేవ' ధాతువునకు వృద్ధి బ్రయోగాను సృతి నంగీకరింపనగును. కేవ్ +ఆర = కైవ్ +ఆర = 'కైవార' అనురీతిని సాధింప నగును. "ఉణాదయో బహుళమ్. (3-3 ౧) ఏతే వర్తమానే సంజ్ఞాయాంచ బహులం స్యుః - కేచిదవిహితా అప్యూహ్యాః. 'సంజ్ఞాసు ధాతురూపాణి । ప్రత్య

యాశ్చ తతః పరే । కార్యా ద్విదాశ్య దనూబన్ధ । యేత చ్ఛాస్త్ర మణాదిషు.'
(భాష్యమ్)" (సి. కౌ. ౩౧౬౯ సూ.) అని మహాభాష్యమునఁ జూపఁబడెను. స్తుతి
పాఠకవంది సేవావిషయమని ధాత్వర్థమునకు సందర్భము నరయునది.

తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యంబగునపు
డు మతుబర్థంబునం దగు. ౧౯.

బాలవ్యాకరణ వివరణము. కోయవత - చాకిత - కోయవ - చాకి - బోయ - వానె -
ప్రే - సాలె ఇత్యాదులు కులవాచకంబులు.

౨౯౧ VI విషయము. తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో నెక్కొంబు
చూపట్టెడు. ౨౦. చెంచెత - మాలెత.
యువతి - విటీ - రబస్వాలలు గుబ్బెత - మిండత -
ముట్టుతలు నాఁ బడుదురు. ౨౧. స్పష్టము.

సంజీవని. ౨౯౧ VI విష:—కులవాచకశబ్దంబులకంటె బరముగా 'త' ప్రత్యయంబు స్త్రీత్వము వాచ్య మగునపుడు వచ్చునని యర్థము. 'ఎవ్వత-ఒక్కత' అను చోటులందువలెనె యిచటి 'త' ప్రత్యయము స్త్రీప్రత్యయం బనఁదగును. నన్నయాథర్వణీయపక్షమున 'అ' ప్రత్యయంబు స్త్రీత్వవాచకంబనియు 'త' కార మాగమం బనియు గ్రహింపనగును. "కోయవ = ఒకానొక తక్కువజాతి" (శ-౫). "కోయవ = ఒకానొక కొండజాతి" (సూ. రా. ని.). 'కోయవ+త = కోయవత = కొండజాతి స్త్రీ' ఇట్లె యంతటను లక్ష్యలక్షణసమన్వయము చేసికొనవలెను. ఇట సూరిమార్గము సరియని తోఁచదు. 'చాకి' అనునది చాకలజాతికి వాచకముకాదు. చాకి యనుటకు రజకుఁడను నర్థము ప్రయోగములఁ గన్పట్టుచున్నది. క...కృష్ణుండు శి ము తెగి పడఁ గొట్టెన్ । వారల గుండెలు పగులఁగ । వీరోద్రేకిన్ మదావివేకిన్ జాకిన్(భాగ. ౧౦ స్కం. పూ. ౧౨౬౦ ప. సూ రా. ని). "పుం యోగా దాఖ్యాయామ్ (౪-౧-౪౮). యా పుమాఖ్యా పుం యోగాత్ స్త్రియాం వర్తతే (పుం యోగ మాశ్రిత్య లక్షణయా స్త్రియాం వర్తతే) తతో జీష్ స్యాత్" గోపస్య స్త్రీ గోపీ (సి. కౌ. స్త్రీప్రత్యయ. ౫౦౪ సూ ) అనురీతిని దత్తజ్జాతి పురుషవాచకముకంటె బరముగ 'త' ప్రత్యయము వచ్చు ననుట యుక్తము. ఉదా:—చాకియొక్క (చాకలవానియొక్క) స్త్రీ = త = చాకిత. ఇట్లె కోయవ - బోయ మున్నగునవియును, 'కోయవవాఁడు - బోయవాఁడు' మున్నగునవి పురుషులకును వాచకములె కాన వానిపయి 'త' ప్రత్యయము వచ్చుచున్నదని గ్రహింపవలయును. కోయవయొక్క = (కోయవవానియొక్క) స్త్రీ = కోయవత. బోయయొక్క (బోయవానియొక్క) స్త్రీ =

బోయత. మొ. చాకల - కుమ్మర - మంగల-మున్నగునవి కొన్ని యోయా రాదుల లోనివిగాన నాజాతిగలవాఁడను నర్థమున నవి బా. తద్ధి. ౧౮ సూత్రముచెప్పున 'ఇ' ప్రత్యయాంతము లగును. చాకలి = రజకుండు. (చాకల+ఇ), కుమ్మరి = కులాలుఁడు (కుమ్మర+ఇ). మంగలి = క్షౌరకుఁడు (మంగల+ఇ). ఇ ప్రత్యయ పరకత్వమున 'చాకల' శబ్దములోని 'ల' వర్ణమునకు లోపము విభాష నగును. దీనికిఁ బ్రయోగము క్రిందఁ జూపఁబడెను. చాకలి=(చాకల=చాక) చాకి తే-గీ. వలయుఁ బ్రాహ్మణోదగ్ర్యుత్వముల నొకటి। తారకంబులు దిథులును వారములును। జోస్యులెఱిఁగించినవి మేలు సుప్రతైక। శీల మంగలిపనికిని దైలమునకు (ఆను. ౪ ఆ. ౧౨౧). క. తుదిఁ గుమ్మరి కొకయేఁడును। గుదికొక పెట్టన్న మాటకున్ సరిరచ్చెన్ (కాశీ. ౨ ఆ. ౯౯. సూ. రా. ని). సీ. ఇంక నాల్గావంబు లిడనైతిఁగా యంచుఁ గుమ్మరి నెమ్మదిఁ గుంకికొనఁగ (శుక. ౨ ఆ. ౫౬౩- సూ. రా. ని) బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందుసయితఁ గ్రింకులవాచకములలో 'గుమ్మర' శబ్దము కన్పట్టలేదు. బా. గు. ప్ర. వ్యాఖ్యలో 'కుమ్మరి - గొల్ల' శబ్దంబులు రెండు చేర్పఁబడినవి. అందు 'కుమ్మరి' అని జాతివాచకము చూపఁబడుట సరికాదు. అట్లై బాల వ్యాకరణముచెప్పునఁ గులవాచకములకు 'త' ప్రత్యయము వచ్చునని నిశ్చయించుకొని సూ. రా. నిఘంటుకర్తలును శబ్దరత్నాకరకర్తయు "కుమ్మరత = కుమ్మరది" అని యుదాహరించుటయు సరికాదు. వారును "కుమ్మర = కుమ్మరజాతి" "కుమ్మరి= కులాలుఁడు" అనియు యుదాహరించిరి. పయిసందర్భమునుబట్టి "కుమ్మరిత = కులాల స్త్రీ" అని వ్రాయుట యుక్తముయియున్నది. స్త్రీ ప్రత్యయాంతములోనిది 'ఇ కారమో' 'అకారమో' నిర్ణయించు యతిస్థానగతప్రయోగము లభింపలేదు. ఇట్లే 'కుమ్మరపాన - కుమ్మరసారె' మున్నగుచోటులందును 'అ' కార ఘటితరేఫము సూ. రా. నిఘంటువున (శబ్దరత్నాకరమునందును) నంగీకరింపఁబడుట సరికాదనియు చెప్పనగును. గీ. ధాత్రి కుమ్మరి సారె విధమునఁ దిరిగె (శుకో. ౪ ఆ. ౧౧౬. సూ. రా ని). 'మంగలిత - చాకలిత - కుమ్మరిత' అనువానికిఁ బ్రయోగములు కోశద్వయమునందును జూపఁబడలేదు. ఆశబ్దములును జూపఁబడ లేదు. 'చాకిత' అనుదానికి సూ. రా. నిఘంటువునఁ జూపఁబడెను. "సీ. మితి లేని కూలి చాకిత కిచ్చి కైకొను........(శుక. ౨-౪౩౪. భోజరా. ౪ ౧౪౫ సూ. రా. ని). 'కొఱవత (సూ. రా. ని). వానెత' అనుశబ్దములు శబ్దరత్నాకరమునను నుదాహరింపఁబడెనే కాని వానికిఁ బ్రయోగములు చూపఁబడలేదు. కాని 'వాని' శబ్దముసయితము శబ్దరత్నాకరమునఁ జూపఁబడెను. "వాని. వై. వి. వైశ్యకులవిశేషము. క...

......ఆనందవనమునం దొక | వానె వణిజు నింటనుండి వైశ్యుండు పదార్థానయ నార్థము.........(కాశీ. ౫ ఆ. ౪. ౧). 'సాలెత' శబ్దమునైతము శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. 'సాలె = సాలెకులము' అనిమాత్రమున్నది. బోయ, బోయత = బోయెత = బోయవాని స్త్రీ. "బోయ - దే - వి. కిరాతుఁడు. తే గీ... ...... | అనఁగఁ గొందఱు బోయలు విని కడంగి | యుఱక మొఱకులై...... (సం. తతః కిరాతా స్తద్దృష్ట్వా......) (ఉద్యో. ౨ ఆ)" (శ-ర). "బోయఁడు- దే. వి. బోయవాఁడు. (బోయయొక్క రూపాంతరము" "బోయత - దే - వి - బోయది = (బోయయొక్క స్త్రీ) ద్వి. తనువు జుమ్మన బోయతను బిట్టు గదిసి|...... (విష్ణుమాయా. పూ. 3 ఆ)." బోయెత - దే - వి. బోయతయొక్క రూపాంతరము. చ. అతినవపల్లవోజ్జ్వల తరాంబరయా తొలుసంజ గబ్బిబో | యెత తఱి వేచి వెంటఁ గదియించిన.........(హం-స. ౪ ఆ)." (శ-ర). ప్రేత. "ప్రేఁడు-దే-వి- గొల్లవాఁడు - గోపకుఁడు" 'ప్రేత - దే - వి - గొల్లది - గోపిక. ఉ. ప్రేతలఁ గూడి యుట్లు వనవీథుల.........(వి. పు. ౭ ఆ)." (శ-ర). (ప్రేనియొక్క స్త్రీ = ప్రేత). ఇట్లె గొల్లని స్త్రీ = గొల్లత. "గొల్లత - వై - వి - గోపిక. గీ. అనఁగ వేఱొక్క గొల్లత, యమ్మవినుము |.........."(హరి. పూ. ౫ ఆ. ౪. ౯). "గొల్లత - వి. (గొల్ల I + త) గొల్లది - గోపిక. ఉ. గొల్లతలన్ విరాళి తగఁ గొల్చెడు కృష్ణుఁడు. (మొల్ల రా. పీఠి. 3 ప. హరి. పూ. ౫ ఆ. ౨౨3." సూ. రా. ని). పాఱుత = పాఱుని స్త్రీ - బ్రాహ్మణి - మొ.

బా. తద్ధి. ౨౦ సూ:—స్త్రీ ప్రత్యయమగు 'త'వర్ణకము పరమగునపుడు ముందటి యచ్చునకు 'ఎ'త్వము కొన్నియెడలఁ గన్పట్టుచున్నదని యర్థము. 'బోయతకు రూపాంతరము బోయెత' అనునది సప్రయోగముగ మీఁదఁ జూపఁబడెను. అయ్యది సూరిచేఁ జూపఁబడలేదు. 'చెంచెత = చెంచిత' అను రెండురూపములును సూ. రా. నిఘంటువున నంగీకరింపఁబడెను. శబ్దరత్నాకరమందును త్రిలింగలక్షణశేషమునందును "చెంచిత" అను రూపముమాత్రమె గ్రాహ్యమని వ్రాయఁబడెను. 'ఇ-ఎ' అను రెండిటికిని స్వరయతిచెల్లునుగాన నీవిషయము యతిస్థానగతప్రయోగములనుబట్టి నిర్ణయింపశక్యముకాదు. గీ. చెంచు నింటికిఁ బోయి చెంచెతకుఁ బ్రియము | చెప్పి నమ్మించి......(కాశీ. ౫ ఆ. ౭౧. సూ. రా. ని). ఇట్టిప్రయోగము లిట సందేహనిర్ణాయకములు కాఁజాలవు. శబ్దరత్నాకరకర్త త్రిలింగలక్షణశేషమున నీక్రిందిరీతిని నిర్ణయించెను. "క. మతి వర్ణంబున నెంచఁ జనుఁ దవర్ణకంబు నరంబగుచో నిత్వం బగు. ఉ. చెంచిత. క. చెంచితలన్ బింఛపత్త్రచేలాంచి

తలన్ (భాగ. ౧౦ స్కం. పూ. ౭౯౩ ప). గ్రామ్యజనుల పాటలయందును జెంచీత యని యికారదీర్ఘంబ వినంబడియెడి" (ప్రౌఁఢ. తద్ధి). ఈరెండు యుక్తులును మిక్కిలి బలహీనములై యున్నవి. "చెంచెతలన్ బింఛపత్రచేలాంచితలన్" అనుపాఠము నందును నంత్యానుప్రాసమునకు భంగములేదు. ఇంక దాసరివాండ్ర పాటలనుబట్టి గ్రాంథికభాషాశబ్ద నిర్ణయముచేయుట హాస్యాస్పదమైన విషయము. 'బోయెత - మాలెత - గుబ్బెత' మున్నగుచోట్లఁ బ్రసిద్ధముగా నంగీకరింపఁబడుచున్న 'ఎత' అనురూప మీయకించిత్కర ప్రమాణములచే మార్పఁబడుట యుక్తముకాదు. మాలెత = మాలనిస్త్రీ "క. త్రోయక విప్రుఁడు మాలెతఁ । గాయజ సుఖకేళిఁ గలసి.........(విజ్ఞా. ప్రా. కాం. ౪-౫.)

బా - తద్ధి - ౨౧ సూ:—గుబ్బెతశబ్దము యువత్యర్థకముగను (యువతి = యౌవనవతి.) మిండతశబ్దము విటీశబ్దార్థకముగను ముట్టుతశబ్దము రజస్వలార్థకముగను నీసూత్రముచే నిపతింపఁబడినవి. "నిజముగ నాలోచింప గుబ్బలుగలది గుబ్బెత యనియు, మిండఁడుగలది మిండతయనియు, ముట్టుగలది ముట్టుతయనియు నర్థము విశదమయ్యెడి" (బా. సా. పే. ౩౭౧ పుట.) కుచములుగల దనఁగాఁ గఠినములగు కుచములుగలది. ఇందలి మతుబర్థకము ప్రశంసార్థకమని యెన్నునది. "మిండత" (జారిణి) అనుచో 'మిండనియొక్కస్త్రీ' అని తద్ధిత విగ్రహమునెన్నుట యుక్తము. ముట్టుశబ్దమునకు శబ్దరత్నాకరమున 'రజస్సు' అనియు 'రజస్వల'యనియు నర్థము వ్రాయఁబడెను. ముట్టుశబ్దమునకు సహజమైనయర్థము 'తాఁకుడు' అనునది గాన రజస్సుయొక్క తాఁకుడు గలదియని యర్థముచేయుట యుక్తమని తోఁచెడిని. ప్రయోగములు:—"గుబ్బ - కుచము. ఉ. కుప్పసముల్ వదల్చి వలిగుబ్బల నొత్తిరి.........(ఆము. ౫ ఆ. ౧౦౪. సూ. రా. ని.) "గుబ్బెత=గుబ్బలాఁడి. వి. (గుబ్బ+ఎత) యువతి. ఉ.........ఆ । గుబ్బెత రేపులెల్లఁ దఱిఁ గొంకు నిరంకుశ లజ్జ పెంపునన్. (ప్రభా. ౫ ఆ. ౯౯. సూ. రా. ని.)" "మిండత - ద్వ - వి - (మిండఁడు+త) జారిణి. ద్వి. ధనముంతయును మిండత్తలకిచ్చె." (హరిశ్చ. ౨ భా.) శబ్దరత్నాకరమున "ముట్టుత. దే - వి - ముట్టుది - రజస్వల" అని మాత్రము చూపఁబడెను. ప్రయోగము చూపఁబడలేదు.

వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యంబగు
నపుడు మత్వర్థంబునం దాఁడి వర్ణకంబగు. ౨౨.
వగలాఁడి. వగ - చిన్నె - కులుకు - వన్నె - దొమ్మి -
ఎమ్మె - ఇత్యాదులు వగాదులు.

బాలవ్యాకరణము. వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున
వివరణము. ఋత్తుబథ్ధం బాకారంబగు. ౨౩.
౨౯౧ VII విష. ఆప్రత్యయాంతంబు ఋగాదిగణంబు. వగలాఁడు -
చిన్నెలాఁడు.

సంజీవని. ౨౯౧ VII విష:—ఈసూత్రములకు మూలమగు నథర్వణవచనము ౨౯౧ విషయమున వివరింపఁబడెను. ఆప్రత్యయాంతములు ఋగాదిగణములోనివి గాన నవి డుమంతరూపముల నందును. వగలాఁడు - వగలానిన్ - వగలాండ్రు - వగలాండ్రన్. మొ. ఆఁడిప్రత్యయాంతములు స్త్రీపదములు - వగలాఁడి - వగలాఁడులు - వగలాఁడిని - వగలాడులను మొ. "వగలాఁడు - దే - విణ - (వగలు ఆడు) వగకాఁడు = విలాసవంతుఁడు." "వగలాఁడి - దే - విణ - (వగలు+ఆఁడి) ఉ. ఏవగఁ ద్రోసినన్ విడువ దీ వగలాఁడి బళారె......(శకాం 3 ఆ.)" (శ-ర.) "చిన్నెల+ఆఁడు = చిన్నెలాఁడు = విలాసి. చిన్నెలు+ఆఁడి = చిన్నెలాఁడి = విలాసవతి" వీనికిఁ గోశద్వయమునందును ప్రయోగములు చూపఁబడలేదు. కులుకులు+ఆఁడి = కులుకులాఁడి = శృంగారపు కుదిలికలు గలది = విలాసము గలస్త్రీ. స్త్రీ. కులుకులాఁడు శబ్దము కోశద్వయమునందును జూపఁబడలేదు. "గీ.........సింగార మొలుక ముద్దుఁ। జిలుకకడ నిల్చెఁ గోమటి కులుకులాఁడి. (శుక. ౧ ఆ. ౧౮౮.) చ. అప్పలుకుల కుల్కులాఁడి నను భవ్య కవిత్వధురీణుఁ జేయుతన్. (భోజసుతా. ౧ ఆ. ౬.) వ.........చిలుకలవలెఁ బలుకనేర్చిన కొందఱు కులుకులాఁడులు...... (ఉ. రా. ౫ ఆ. ౨౮౮.)" (సూ. రా. ని.). "వన్నెలాఁడి. ద్వ - విణ - (వన్నెలు+ఆఁడి) విలాసవతి" "వన్నెలాఁడు. ద్వ - విణ - (వన్నెలు+ఆఁడు) విలాసవంతుఁడు. సీ. కలికిరో యాతఁడే కులుకుఁ బాయపు గొల్లకన్నెల వలపించు వన్నెలాఁడు. (రుక్మి. ౫ ఆ.)" (శ-ర) "దొమ్ములాఁడి - దొమ్ములాఁడు" అను శబ్దములు కోశద్వయము నందును జూపఁబడనే లేదు. ఎమ్మెలాఁడు శబ్దము శబ్దరత్నాకరమున లేదు. 'ఎమ్మెకాఁడు' శబ్దమును 'ఎమ్మెలాఁడి' శబ్దమును జూపఁబడినవి. సూ - రా - నిఘంటువునందును 'ఎమ్మెలాఁడు' శబ్దము చూపఁబడలేదు. "ఎమ్మెకాఁడు = అందగాఁడు - ఎమ్మెలాఁడి = విలాసిని" అను శబ్దములు సప్రయోగముగఁ జూపఁబడినవి. "సీ. అనుపమచ్ఛాయా విహార మందఁగఁ గల్గెఁ జిమ్మచీఁకటిత్రిమ్మంగు నెమ్మెకాని। కి......(వరస. ౨ ఆ. ౯౨.) సీ. ఘుమఘుమార్భటితోడ ఘోషించు నదులైన, నీఁది పోవ నిదేటి యెమ్మెలాఁడి. (హంస. ౧ ఆ. ౧౨౨. శుక. ౧ ఆ. ౫౫)" (సూ. రా. ని.). ఆదిశబ్దము చే "రజ్జులాఁడు-

రజ్జులాఁడి" మున్నగువానిని గ్రహించునది. (విస్తర.) ఉ.........వారి భూరి శౌ। ర్యాయుధ నైపుణ క్రియలయందుఁ బదాఱవపాలుఁ బోలఁడీ। వాయపు రజ్జులాఁడు .........(అర. ౬ ఆ. ౬౩ ప. శ-ర).

---

విస్తర. ౨౯౧ VII విష:—"మాయలాఁడు - మాయలాఁడి" అనియు శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడియున్నవి. వీనిలోఁ బ్రకృతిభూత మాయాశబ్దము సంస్కృత మగుటచే దానిపై నీతద్ధితములు నిల్చెననుట యుక్తము కాదు. సీ...... ...తే-గీ. మానుషంబులు నడపంగ మాయకానిఁ। గాఁక.........(అను. ౪ ఆ. ౩౮౪ ప.) ఇట్టియెడల "మాయము+కాఁడు" అని తద్ధితవృత్తి విగ్రహము నంగీకరించి మాయాశబ్దవైకృతమగు 'మాయము' అను తద్భవమును (శబ్దరత్నాకరకర్త దీనిని దేశ్యమనెను) గ్రహించి తద్ధితవృత్తిలో 'ము' విభక్తిలోపమయ్యె ననఁ దగును. "మాయము. దే-వి. మాయ. క. ఏమి యుపాయంబున నే। నీమాయపు పుర్వు వెస జయించి తొలఁగుదున్. (హరి. పూ. ౭ ఆ.) విశే - అదృశ్యము. వ...... ఇతఁ డెవ్వాఁడొకో నేత్రోత్సవంబై డాయం జనుదెంచె నంతటను మాయంబయ్యె. (నైష. 3 ఆ.)" (శ-ర.) 'మాయలాఁడు' అనుదానికిఁ గవిప్రయోగంబు లగపడుచుండుటచే వానిగతి యేమని యాలోచింపవలసియున్నది. "మాయలాఁడు. మి-విశే. (మాయలు+ఆఁడు) మాయాశీలుఁడు - మాయావి. క. అనుఁడు దరహాసరసమునఁ। దనవదన జరద్విధుండు దారుణ్యము నై। కొన మందాందోళన మే। శన మున శిరము మర మాయలాఁ డిట్లనియెన్. (పాండు. ౫ ఆ.)" (శ-ర). మ. ఇవియెల్లం గల మాయలాఁడు. (హరి. పూ. ౮ ఆ. ౬౩.) ఉ. ఓరి నిశాచరాధముఁడ యుగ్రసముద్ధతి మాయలాఁడవై।.........(భాస్క. యుద్ధ. ౧౭౧౩ ప.) అనియుఁ బ్రయోగములు గలవు. కాని శబ్దరత్నాకరకర్త పంపురీతిని సంస్కృత సమములపై నాచ్ఛిక ప్రత్యయములను నిల్పి మిశ్రపదములనుచు ననింద్య గ్రామ్యములనియైన వ్రాయకుండుట సరియై యుండలేదు. ఇట్టి మిశ్రపదము లసాధువులనక తీరదు. కావున నిట్టివాని సాధుత్వము వెనుక వ్రాసిన ౨౧౦ VIII విషయము చొప్పున "తచ్ఛబ్ద వస్య లోపః। స్యా" త్తనురీతిని వాఁడు శబ్దవకారలోపమును జేసి సంపాదించి కవిప్రయోగ విరోధమును వారించికొనవలయును. (౧౯౩ విష.). 'మాయలాఁడు' అనురీతి ప్రయోగములు బాలవ్యాకరణ సాధ్యములు గానేరవు. (చూ. బా. క్రియా. ౧౧౭.) పైయాథర్వణవచనము చొప్పున సాధువులగుచున్నవి. కాని 'వగలాఁడు - వగలాఁడి' అనువాని సామ్యభ్రమచే శబ్దరత్నాకరమున "మాయలాఁడు" అను దానితోపాటు "మాయలాఁడి" అనుపదమును సాధువుగాఁ జూపుట పొరపాటు.

ముక్కులోనగువానికిం దదభావద్యోతకంబయి మతు
బర్థంబునం దిడి వర్ణకంబగు. ౨౪.

బాలవ్యాకరణ వివరణము. ౨౯౧ VIII వివ.

ముక్కిఁడి = ముక్కులేనివాఁడని యర్థము. ముక్కు-
వాలు - సిగ్గు - ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుం
గునది.

సంజీవని. ౨౯౧ VIII వివ:—తదభావద్యోతకంబయి మతుబర్థంబున ననఁగా, ముక్కు మొదలగువానియొక్క "లేమి గలిగినది" యనురీతి మతుబర్థమును సందర్భపఱుచుకొనవలయును - తదభావవత్త్వ మిఁడి ప్రత్యయార్థము. 'వాలు' అనునది వాలశబ్దతద్భవము. (శబ్దరత్నాకరమున దీనికి లాంగూలార్థము వ్రాయఁబడ లేదుగాని శబ్దరత్నాకరకర్త వైకృతదీపికలో నిట్లు వ్రాసెను. "వాలు = (క త్తి - తోఁక - దీర్ఘము). వాలః" (వైకృతదీపిక) "ముక్కిఁడి ద్వ - విశే - (ముక్కు+ ఇఁడి) ముక్కుపోయినవాఁడు - విగ్రుఁడు" "వాలిఁడి. ద్వ - వి. (వాలు+ఇఁడి) తోఁకలేనికోఁతి. తోఁకలేనిది" "సిగ్గిఁడి. దే - విశే (సిగ్గు+ఇఁడి) లజ్జచెడినవాఁడు - లజ్జచెడినది" (శ-ర). వీనికిందుఁ బ్రయోగములు చూపఁబడ లేదు. అహోబలపతి 'ముక్కిఁడి - వెఱవిఁడి - కట్టిఁడి' అనువాని నుదాహరించెను. (౨౯౦ వివ.) "వెఱవిఁడి - దే - విశే - (వెఱవు+ఇఁడి) ఉపాయహీనుఁడు. చ. గురుని యుపేక్షఁజేసి తనకున్ సమరోద్ధతి నెల్లె దాని నీ। వెఱవిఁడి గాన లేఁడు దనవీరము గాఁ గొని విట్టిపిఁ గడున్ (ద్రోణ. ౨ ఆ. ౪౬)." (శ-ర). "కట్టిఁడి - దే - విశే. (కట్టు + ఇఁడి) క్రూరుఁడు. శా......। కానం దెర్వులు గట్టియేఁగు ప్రజలం గట్టిఁడియై దోఁచి... ......(పాండు. ౫ ఆ.)" (శ-ర). ఉ. నెట్టన యూపగా సుకుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా। కట్టిఁడి వీరులు......(భీష్మ. ౧ ఆ. ౬౫). "వేటిఁడి. దే - విశే. (వేఱు+ ఇఁడి) అవివేకి. ఉ. వేటిఁడియైన మానిసికి వెండి వివేకము గల్గనేర్చునే (ఉద్యో. 3

---

మాయమాలాఁడి శబ్దము సాధువుగా నేరదు. దానిని నిర్వహించు మహాకవిప్రయోగము లేదు. తే.గీ. మాయదైవము యేనేమి సేయుదాన. (విరా. ౨ ఆ. ౬౨.) చ. అలమటఁ బొందు మాయవిధియా యని దైవము దూఱు.........(విరా. ౨ ఆ. ౧౦౪ ప.) సీ......మాయదైవంబని మఱుఁగువారు. (విరా. ౨ ఆ. ౧౪౬.) ఇట్టియెడల మాయాశబ్ద శేషషష్ఠ్యంతరూపమునకు నాభాసబహువ్రీహిచొప్పున నస్త్యర్థము లభించును గాన మాయగల దైవమని యర్థముచేయనగును. లేదా "మాయిదైవము" అనురీతిని గవిప్రయుక్త మనఁదగును. "మాయీ - పుం...... మాయావిని (సప్తమ్యంతము)" (శబ్దా. చిం.)

ఆ. ౧౦౭ ప). ఉ.........వే । జేండితనంబుచేత" (ఉ. హ. ౪ ఆ. ౧౪౮)."
"వీజేఁడి - దే - వి. వేజేఁడియొక్క రూపాంతరము" (శ - ర). ముద్రణములలో
'వీజేఁడి' అనియున్నది. కాని 'వీఱు' శబ్దమేని కన్పట్టదు. వేఱు = భేదము =
స్వ పరభేదము - లేదా మంచిచెడుగుల భేదము తెలియనిదని యవయవార్థము
నూహింపనగును. "పరువు......వై...... ౨ గౌరవము." (శ-ర) 'పరువిఁడి'
శబ్దము శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. సీ. పరమేష్ఠి నీకంటెఁ బరువిఁడియే
శిర మొప్పించి నిత్యుఁడై యున్నవాఁడు." (నన్ని. కు. సం. ౨ ఆ. ౧౬౪). పరువు+
ఇఁడి = పరువిఁడి. గౌరవములేనివాఁడు. బ్రహ్మదేవుఁడు నీకంటెఁ బరువిఁడియే =
నీపాటి గొప్పతనములేనివాఁడా యని రతి మదనునితోఁ జెప్పిన సందర్భము.

మానార్థా న్నిత్య మేకత్వ । ఎఁడుః స్యా త్పరిమాణకే ।
(వికృ. సంధి. ౭ కారి. అహో. ౧౯౧ పుట.)
క్వచి న్నిత్యం క్వచి ద్వా స్యాత్ । క్వచి దేసేశ్చ పూర్వ
తః । మానార్థా చ్చైసి రత్ర స్యా । ద్భవే త్తోస్లేఽపి

నన్నయా. విభాషయా । (వికృ. ౫౫ అజం. అహో. ౩౩౫ పు.)
ధర్వణీయము. ప్రసృత్యా దే ర్లివర్ణస్య । లోపశ్చ పరిదృశ్యతే (వికృ.
౯౮౨ విషయము సంధి. ౭ కా. అహో. ? పుట.)

జని చాత్ర భవే దేసి । రిత్యాహ మృదుభాషణః (వికృ.
అజం. ౩౮ కా. అహో. ౩౧౧ పు.)
కథితార్థాత్ క్వచి ల్లు ర్లః । క్వచి ల్లు ర్థానవాచకాత్
(వికృ. అజం. ౫౪ కారి. అహో. ౩౩౫ పుట.)

కల్పతరువు. ౨౯౨ విషః—పరిమాణకే = పరిమాణార్థమునందు, మానా
ర్థాత్ = కొలతచేయు నుపాధిని తెలుపుశబ్దముకంటెఁ బరముగ, నిత్య మేకత్వే =
సదా యేకవచనముమీఁదనే, ఎఁడుః స్యాత్ = ఎఁడువర్ణక మగును. 'గంపయొక్క
పరిమాణము = గంపెఁడు' అనునట్లు. 'గంపలయొక్క పరిమాణము = గంపెడు'
అనియుఁ గావచ్చుననియుఁ దద్ధితవృత్తిలో విభక్తులు లోపించి ప్రాతిపదికమే నిల్చు
ననియుఁ దెలంప కుండుటకయి యిట్లు చెప్పఁబడెను. 'నాలుగు గంపల పెసలు' అనుచో
ఎఁడు ప్రత్యయము రాదని తాత్పర్యము. "పరిమాణార్థంబునం బ్రథమైకవచనంబు
నంద యెఁడు వర్ణకంబగు (ప్రౌఢ. తద్ధి. ౧౬ సూ.)......పుట్టెఁడు తవిదలకు..."
అను ప్రౌఢవ్యాకరణ సవరణమును దీసి సామోదించిన పేటికావ్యాఖ్యయు (బా.
సా. పే. ౩౭౩ పు.) సుసఁగతములుకావు. ఎఁడుప్రత్యయమునకుఁ బ్రకృతియగునది

బహువచనాంతము కాఁగూడఁదని మాత్రమె యాశయము. విశేష్యవిభక్తివచనములతో నెట్లును బ్రసక్తిలేదు. క్వచిన్నిత్యమ్ = అట్టి యేఁడు ప్రత్యయము, కొన్నియెడల నిత్యముగాను, క్వచి ద్వా స్యాత్ = కొన్నియెడల వైకల్పికముగాను నగును. క్వచిత్ = ఒకప్పుడు - ఏసేశ్చ పూర్వతః = ఏసివర్ణకమునకు ముందుగాను నగును. ఏసిశ్చ = ఏసిప్రత్యయము సహితము, మానార్థాత్ = పరిమాణార్థకశబ్దము నకుఁ బరముగ, అత్ర = ఈయాంధ్రభాషయందు, స్యాత్ = అగును. సోఽపి = ఆ యేసిప్రత్యయముసైతము, విభాషయా భవేత్ = వైకల్పికముగనగును. 'ఏసి' వర్ణకము విభాగమందలి పరిమాణమును దెలుపును. ప్రసృత్యాదేః.........= 'పుడిసిలి' (అంజలి) పిడికిలి' మున్నగువానియొక్క, లివర్ణస్య=లివర్ణమునకు, లోపశ్చ= లోపమును గల్గును (ఇది నిత్యముగనె కల్గును) ప్రసృత్యాదేరిత్యాదివచన మహోబలపండితీయమునఁ గానరాలేదు. వికృతివివేకమునఁ గన్పట్టుచున్నది. కవిజనమండన టీకాకర్త కహోబలపండితీయమె మూలమగుటచే నాతని గ్రంథమున నిది యుండుట యకించిత్కరము. కవిజనమండన టీకాకర్త యహోబలపండితీయములోని కారికలను యథేష్టముగా మార్చుచుండుట యనేకస్థలములందు చూపట్టుచున్నది. "అన్యేచ బహవో దేశ్యా। వర్ణకా అర్థభేదకాః। క్వచి దన్తస్య లోపస్స్యాత్ । క్వచిద్వర్ణాగమో మతః" (౭౯౦ విష) అని యథర్వణుఁడు వచించియె యున్నాఁడు కావున నీకారిక యథర్వణోక్తమని విశ్వసింపరాదు. ఉదా:...... బారెఁడు - మూరెఁడు - గంపెఁడు. బారెఁడుత్రాడు = బారత్రాడు. కోసెఁడు దూరము = కోసుదూరము. బారెఁడేసిత్రాడులు. నాలుగేసి పుస్తకములు = ఒకొక్కరికి నాలుగుపుస్తకములు. పిడికిలి+ఎఁడు = పిడికెఁడు - దోసిలి+ఎఁడు = దోసెఁడు - గుప్పెఁడు - పుడిసెఁడు - మొ. ఆమడదూరము, మున్నగుచోటులందు 'ఎఁడు' ప్రత్యయస్థితి కానరాదు. ఇట్లె "పుక్కిలి - దోయిలి" మున్నగు చోటులందు లివర్ణలోపమును గానరాదు. వీనియం దేఁడు ప్రత్యయస్థితియుఁ గన్పట్టదు. 'జసి చాత్ర భవే'దిత్యాదికారికయు 'కథితార్థా'దిత్యాదికారికయు ౨౦౪ విషయమున వ్యాఖ్యాతములు. ప్రథమాబహువచనముమీఁద నేసి వర్ణకము నిల్చుటయుఁ గలదు. ఉదా:—ఇంతలేసి దొరలు. (ఉద్యో. 3 ఆ. ౯౫). ఇంతేసి దొరలు. 'అంత - ఇంత' మున్నగుశబ్దములే పరిమాణవాచకములు. వానిపైని 'లు-ల' వర్ణకములు మరలనిల్చుట గలదు. ఉదా:—అంతసేసి - అంతలుసేసి - తమ యంతలవారితోడ చెలిమిచేయనగును - గోరంత - గోరంతలు - కొండంత - కొండంతలు - మొ. ఇట్టివి తద్ధితప్రత్యయము లనరాదు. ఇవి సుబ్విభక్తులె. జసి చాత్ర

భవే దేనిరిత్యాదిపాఠమున కర్థమే లేదు. కావుననే "మృదుభాషణీయం రూపంతు న ప్రసిద్ధమ్" అని యహోబలపతి వ్రాయవలసెను. (అహో. ౩౧౧ పు). ప్రయోగములు:—౨౦౪ విషయమున నిందలి 'అంత - ఇంత-లు - ల' అనువానికిఁ బ్రయోగములు చూపఁబడెను. "గీ. అతఁడు పుడిసెఁడు నీరన యప్పు డతనిఁ । దెలచి (అశ్వ. ౧ ఆ. ౮౪). చ. పిడికెఁడుకొనుఁ గొప్పు గని......(ఆము. ౧ ఆ. ౮ ప). మ. కదిపెండేసి కొమాళ్ళఁ గూఁతులఁ దగన్ గన్నట్టి యిల్లాండ్రకున్ (కళా. ౭ ఆ. ౧౧౯ కదుపు = సంఘము). ఎఁడు ప్రత్యయ మాపవిభక్తికముగ వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడును. ద్వి. జేనెంట నొక్కొక శివమూర్తి గలదు ।........ మూరెంట నొక్కొక మునిపల్లె గలదు ।...... । బారెంట నొక్కొక పర్వతం బలర ।.........(పండితా. పర్వ. ౩౮౪ పొరట). చ. కెరలక క్రమ్మఱింప నడు గెంటనె నిల్చు నొకింత నూకినన్ । (పాండు. ౧ ఆ. ౧౧౪). సీ. ఇది గాలి కనిన మూకవరాహదను జేంద్రుడైన జొట్టెంటిలో నాఁగఁజాలు (మనుచ. ౪ ఆ. ౩౧). జేనెంట జేనెంటన్ = జేనెఁడు జేనెఁడు దూరమందు. (కాశీ. ౩ ఆ. ౧౦౩)." (సూ. రా. ని). ద్వి. అందంద బారెంట నంత మూరెంట (బసవ. ౪ ఆ. ౮౫౭). ఏసికి:—"ఆ-వె. కృష్ణుఁడిచ్చు నాలుగేసిచీరలు కూర్మి । నింతులకును నాలుగేసి మణులు । రీవితోడ దోసెఁడేసిమాడలు కడు । నింపెసంగ గంపెఁడేసిసొమ్ము (కావ్యచింతామణి. అప్పక. ౩ ఆ. ౨౨౦). క. ఆసమయంబునను దివో । దాసుఁడుఁ గాశీశ్వరుండుఁ దరుణికి నిన్నూ । జేసి హయంబుల నిచ్చె ము । హాసక్త్యుల సుతులఁ బడసి రథిక ప్రీతిన్ (ఉద్యో. ౩ ఆ. ౩౧౭)." అను నీరెండుపద్యములు "వంతుః" అను నర్థమున కుదాహృతులుగ సూ. రా. నిఘంటువునఁ జూపఁబడెను. ఇందలి 'దోసెఁడేసి - గంపెఁడేసి' అనునవి 'ఎఁడు+ఏసి' అనుజంట కుదాహృతులె - ఇంక 'నాలుగేసి - నూతేసి' అనునవియు విభాగార్థమునకే కాక పరిమాణమునకును నుదాహృతులె యనఁదగును. కావుననె యిందలి యతి కప్పకవి 'విభాగయతి' యని పేరిడెను. క. తులసీభూషణ సంఖ్యకుఁ । దెలుఁగునఁ బరిమాణసంజ్ఞ దేట కలుచు న । ట్టుల నేసి యనుపదమునకుఁ నలరు విభాగవడ యనఁగ నచ్చును హల్లున్ । (అప్పక. ౩ ఆ. ౨౧౮ ప). మ. తలఁపంగూడునె యింతలేసి దొర లీదైన్యంబు (ఉద్యో. ౩ ఆ. ౯౫). (చూ. ౨౦౪ విష). ఏసి లెమికి:—క. ఇంతలు పుట్టిన చోటను । శంతనునందన యహీనశాంతిపరుండై । కౌంతేయాగ్రజుఁ డాలము । పొంతం బో నొల్లఁ డనుము బుధు లియ్యకొనన్ (ఉద్యో. ౧ ఆ. ౩౭౫).

మానార్థంబున కేకత్వంబునం దెఁడు వర్ణకం బగు. ౨౫.

తూమెఁడు - ముంతెఁడు - ఎత్తెఁడు - వీసెఁడు -

బాలవ్యా ౨౯౨ I విష. జేనేడు - మూరెడు - కుందెడు - గంపెడు.

ఎడు వర్ణకంబు పరంబగునపుడు లివర్ణకంబు లోపించు. ౨౬.

కమికెడు - కొడిదెడు - దోసెడు - పిడికెడు - పుడిసెడు - సందెడు.

సంజీవని. ౨౯౨ I విష:—ఎత్తు = రెండుపీసెలు. "కమికిలి = వంపఁబడిన వ్రేళ్ళుగల పుడిసిలి." (శ-ర). "కొడిదిలి = కొణిదిలి = బొట్టనవ్రేలుగాక తక్కిన నాల్గువ్రేళ్ళను వంకఁగా నేర్పడిన చేర." (సూ. రా. ని.). "దోసిలి = దోయిలి = వంపఁబడిన రెండు చేరల చేరిక = అంజలి." "పిడికిలి = ముడువఁబడిన వ్రేళ్ళుగల ఆఅచేయి = ముష్టి." "పుడిసిలి = కుదియఁబట్టిన చేరలో సగము = ప్రసృతి" (శ-ర.) "సందిలి = దండచేయి ప్రగండము." "ప్రగండము = మోచేతికి మీఁదిభాగము = సందిలి." (శ. ర) అని శబ్దరత్నాకరమున 'సందిలి' అనుదాని కర్థము వ్రాయఁబడెను. కాని యీయర్థమునఁ బరిమాణము పొసఁగదు. లోకమున "సందెడుగడ్డి" మున్నగు చోటులందు వ్యామ గ్రాహ్యపరిమాణ మను నర్థము ప్రసిద్ధమై యున్నది. వ్యామము= "తతయో ర్బాహ్వో రన్తరం। వ్యామ ఇత్యభిధీయతే". "వ్యామ గ్రాహ్యస్తనీభి।శబర యువతిభిః" అని భట్టుమూరి వ్యవహరించెను. ఇంచుకవంచి చాఁచిన రెండు చేతుల నడిమిప్రదేశము సందిలియనియు వ్యామమనియు గ్రహింపనగు. "వ్యామ = తిర్యక్ పార్శ్వతో విస్తృతయో ర్బాహ్వో రన్తరాళ పరిమాణే" (శబ్దస్తో). త్రిలింగలక్షణ శేషకర్త యిచట చేసిన సవరణము సుసంగతము గాదని యీవఱకు వ్రాయఁబడెను. (౨౯౨ విష.). పీస+ఎడు = పీసెడు. ఈసందర్భపు లక్ష్యములం దంతటను బా - సంధి - ౧౧ సూత్రము చొప్పున నపవాది స్వరపరకసంధి (౭౫ విష.) నిత్యముగానె వర్తిల్లును. ప్రత్యయాచ్ పరకత్వమున నెకారమునకును బరరూప సంధి నిత్యముగానె వర్తిల్లును. ఇట్లె 'దోసిలి+ఎడు' మున్నగుస్థలములందును లివర్ణము లోపింపఁగాఁ బరరూపసంధి నిత్యముగా వర్తిల్లునని యెఱుంగునది.

నన్నసూ. ౨౯3 విష. మాత్ర జర్థేతు బంట్యాది । స్తతః పూర్వత్ర నః క్వచిత్, (వికృ. అజం. ౫౬ కారి. అహో. 33౫ పు.)

కల్పతరువు. ౨౯3 విష:—మాత్ర జర్థేతు = మాత్రచ్ ప్రత్యయార్థమం దనఁగాఁ బరిమాణార్థమందు, బంట్యాదిః = బంటి మున్నగునవి యగును, తతః పూర్వత్ర = ఆ (బంటిమొ.) ప్రత్యయములకుఁ బూర్వమున, నః='న' అనునది, క్వచిత్ = క్వాచిత్కముగ నిల్చును. నిర్ధారణాదౌ మాత్రం స్యాత్ । క్వచి న్మాత్రాచ

కథ్యతే. (౨౭౯ విష.) అనుదానిని స్మరింపక కవిజనరంజన టీకాకర్త యీకారిక పాఠమును "మాత్రో దఘ్నేతు బంట్యాది । స్తతః పూర్వత్ర నః క్వచిత్." (విశ్వ. అజం. ౫౬ కా.) ఆరురీతిగ మార్చుట కేవలము పొరపాటు. 'మాత్రము' అనునది సంస్కృతప్రత్యయము - సంస్కృతశబ్దమును నైయున్నది. ఆచ్ఛికప్రత్యయముగా దానికిఁ బ్రయోగము లేదు. (౨౯3 I విష.). మాత్రచ్ ప్రత్యయము సయితము దఘ్నార్థకముగనె సంస్కృతవ్యాకరణమునఁ జెప్పఁబడెను. "పరిమాణే ద్వయసజ్ దఘ్నఞ్ మాత్రచః. (౫-౨-3౭.) తదస్య ఇత్యనువర్తతే. ఊరూ ప్రమాణమస్య - ఊరుద్వయసమ్ - ఊరుదఘ్నమ్ - ఊరుమాత్రమ్." (సి. కౌ. తద్ధిత. పాఞ్చమిక. ౧౮౩౮ సూ.) "ప్రథమశ్చ ద్వితీయశ్చ । ఊర్ధ్వమానే మతౌ మమ." ఇతిభాష్యే ఉక్తమ్. ప్రమాణ మిహ పరిచ్ఛేదక మాత్రమ్ - తత్ర మాత్రచ్, ప్రస్థమాత్ర మారుమాత్ర మిత్యాది. ఇతికైయటః" (బాలమనోరమ) "యద్యపి మాన మితి సామాన్యే నోక్తం తథాపి దఘ్నద్వయసా వూర్ధ్వమానే స్యాతామ్." (ముగ్ధ. శ్రీరామతర్కవాగీశ వ్యాఖ్య.) ఇట్లు దఘ్నప్రత్యయ మూర్ధ్వమాన మాత్రవాచక మగుటచేత దఘ్నార్థమున బంటి కొలఁది ప్రత్యయములను విధించుట యుక్తము కామింజేసి యథర్వణాచార్యులు దఘ్న ద్వయసముల నుపేక్షించి "మాత్రజర్థేతు బంట్యాదిః" అని సూత్రించినవాఁ డయ్యెను. 'బంట్యాదిః' అనుచోటి యాది శబ్దముచే 'కొలఁది' ప్రత్యయమును సంగ్రహింపవలయును. ఉదా:—బొమ్మబంటి- బొమ్మకొలఁది, ముక్కుబంటి - ముక్కుకొలఁది, ముక్కునబంటి. మొ. "ఆదిశబ్దేన ముక్కుకొలఁది - మోఁకాలిబంటి - మోఁకాలికొలఁది ఇత్యాది శబ్దానాం సంగ్రహో బోధ్యః" (అహో. 33౫ పు.) "బంటి. దే - అప. నీళ్ళకొలఁదిని దెలిపెడు ప్రత్యయము. (మోఁకాలిబంటి - మొలబంటి - పుక్కిటిబంటి - ఈఁతబంటి. మొ.)" (శ-ర.) ఇందలి మొలబంటి మున్నగుచోటులందలి బంటిప్రత్యయ మూర్ధ్వమానమును దెల్పుచున్నను 'ఈఁతబంటి = ఈఁదుటకుఁ దగినలోతు' అనుచో నధోమానమునె తెల్పుచున్నదిగదా. చ. మురహర పద్మజాదులకు ముక్కున బంటిగఁ గేరు లోకభీ। కరు.........(నన్ని. కు. సం. ౧౨ ఆ. ౯౭౭.) గీ. లస్తకంబున కొలఁదికి లక్ష్మణుండు । వెడఁద యమ్మున.........(భీష్మ. ౨ ఆ. ౮౫.) ఉ. జేతికొలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ (పెద్దన యుత్పలమాల). ఇటు నూర్ధ్వమాన మనరాదుగదా. ఇట్లగుటచే బంటి కొలఁదులు దఘ్నార్థకము లనుటకన్న మాత్రజర్థకములనుటయె యుక్తమగుచున్నది. మాత్రశబ్దము ప్రత్యయమగుటయే కాక "నిర్ధారణా దౌ మాత్రం స్యాత్ । క్వచి న్మాత్రాచ కథ్యతే" అను (౨౭౯ విష.) చొప్పునఁ బ్రత్యేకశబ్దమును

నగుచున్నట్లె బంటి కోలఁదులును మాత్రశబ్దమువలెను 'అందు' శబ్దమువలెను ప్రత్యేకపదత్వమును సైత ముందుచున్న యవస్థలో నున్నట్లగపడుచున్నది. కావునని యీరెండును షష్ఠీసమాసోత్తర పదములవలెఁ గన్పట్టును. ఉదా:—కోలఁదిశబ్దము ప్రత్యేకపదముగ సైతము ధారాళముగ నగపడుచున్నది. ఇట్లగుటచేతనే మోఁకాలి బంటి మున్నగుచోటులందుఁ బూర్వపదముమీఁద నాపవిభక్తిక చిహ్నములును గన్పట్టును. కావుననె యివి తత్పురుషపదముల కుత్తరపదములయ్యును జూపట్టును. ఉదా:—మోఁకాలిబంటి - మోకాలికోలఁది - ఎంతబంటి - బొమ్మలబంటి - కటిబాఁటి-శక్తికోలఁది. మొ. ప్రయోగములు:—క. బలశశిహారభాషలకును । బొలుపుగ మితిలేనిమాడ్కి మొలబంటై బొమ్మలబంటై మెడబంటై । తలమునుకలు నయ్యె నరసు ధరణిపుత్రీభర్తల్. (నరసు. ౫ ఆ. ౮౫ ప.) సీ. నరకాసురప్రాణ నాళోత్తరణకేళి రణకేళి వలకేళి రమణుఁజూపె। ......తే-గీ. వీర రససార కాసార విహారణంబు। విన్ననకు నొప్పు నతనితో విగ్రహింప।దొరకొనిన వచ్చు మనకు యుద్ధులు మునింగి। పాఱ వెంపళ్ళ తమకెంత బంటియనుట. (ఉ. హరి. ౪ ఆ. ౧౨౪ ప.) "దఘ్నార్థంబునం దత్పురుషపదంబుల మీఁదను బంటి గానంబడియెడి. ఉ. కటిబంటి నెత్తురు కాలువల్. (రామా. ౮ ఆ.)" (ప్రౌఢ. తద్ధి. ౧౭ సూ.) (ఇట 'బంటి' శబ్దము తద్ధిత ప్రత్యయముగొనుట పొరపాటు.) ద్వి. బలువిడిఁబాఱు నేఱుల నట్టనడుమఁ । జలి కాలమెల్లఁ బుక్కిటిబంటి నిలిచి. (బసవ. ౧ ఆ. ౨౦3 ప.) ఉ.........పె। న్నోఱకు భంగి మాంసములు ముక్కున బంటిగ ద్రింగుచుండు. (భోజరా. ౧ ఆ. ౧౧౫ గాణపతవ్యాఖ్య. ౨౯౮ పు.) చ. మురహర పద్మజాదులకు ముక్కునబంటిగఁ గేరు లోక భీ। కరు (నన్ని. కు. ౧౨ ఆ. ౯౭౭ ప.) తే-గీ. ల స్తకంబున కోలఁదికి లక్ష్మణుండు। వెడఁదయమ్మున నభిమన్యు విల్లు దునియ। నేసి యార్చిన. (భీష్మ. ౨ ఆ. ౮౫.) స్రగ్ధర. ఖడ్గిన్ ఔండాడు మ్రాఁకుల్ కవుఁగిటికోలఁదుల్ కత్తి నొక్కొక్క ఘాతన్......(మనుచ. ౪ ఆ. ౮ ప.) ఉ. చేతికోలందిఁ గౌఁగిటను జేర్చిన కన్నియ చిన్ని పొన్ని పేల్। మూఁతల చన్నుదోయివలె........(అల్లసాని పెద్దనార్య నుత్పలమాల). కోశకారులు 'కోలఁది' శబ్దమును బ్రత్యయముగనె చూపలేదు. అదియొక ప్రత్యేకశబ్దముగనె చూపఁబడెను. "కోలఁది. దే-వి-పరిమితి. విణ-శక్యము:—ఇప్పుడు రాజకులంబులు కోలందికి మిగిలి నాకు భరియింపం గోలందిగాక యున్నయవి. (హరి. పూ. ౫ ఆ.)" (శ-ర.) "ఆ-వె. నిద్ర పెంపె, నిద్ర నిగ్రహించుటయును। గోలఁది మీఱు కడుపు గుడువమియును. (అను. ౫ ఆ. ౨౬3.) క. తలఁపఁగ రిపులకు నిమ్మగు। కోలఁది గడచి వచ్చితిమి........(విరా. ౪ ఆ.

౯3 ప.) చ. కొలఁది యెఱుంగ కిట్టి పలుకుల్ వలుకందగు గాదు నాక. (భార. ఆది. ౫ ఆ. ౨౦3.)" (సూ. రా. ని.)

సంస్కృతమయట్ ప్రత్యయార్థక మయశబ్దము సైతము ప్రత్యేకపదముగ నాంధ్రకవులచేఁ బ్రయోగింపఁబడ సాగెనని చెప్పవగును. "మయద్వైతయోర్భాషాయామభక్ష్యాచ్ఛాదనయోః. (౪-3-౧౪3.) ప్రకృతిమాత్రాత్ మయడ్వా స్యాత్ వికారావయవయోః." (సి. కౌ. ౧౫౨3 సూ) "తత్ప్రకృతవచనే మయట్. (౫-౪-౨౧) ప్రాచుర్యేణ ప్రకృతం ప్రస్తుతమ్ తస్యవచనం ప్రతిపాదనమ్...... అన్నమయమ్ - అపూపమయః" (సి. కౌ. ౨౦౮౯ సూ.) ఇత్యాదిసూత్రములచే మయట్ ప్రత్యయము ముపదేశింపఁబడినది. "ప్రకృత మన్నమయమితి - ప్రచుర మన్నమిత్యర్థః...... అపూపమయఇతి - ప్రచురోఽపూప ఇత్యర్థః." (బాలమ. వ్యా.). ఉత్సాహ. మానినీ జనంబు సేరి మగధనాథుఁడగు జయ । త్సేనుచుట్టు నేడ్వ నధికదీన నాదములకు నా । మానసంబు సాంద్ర కరుణమయతఁ బొందె మోహనం । బైన యట్టి యేడ్పు లెందు నంబుజాక్షి వింటిమే." (స్త్రీ. ౨ ఆ. ౧౪౧ ప.). ఈపద్యమందలి కరుణ శబ్దము రసపరమనుట పొసఁగమింజేసి కారుణ్యపరము స్త్రీలింగ తత్సమ రూపము నవకతీరదు. కాఁగా "కరుణమయతన్ = కరుణామయత్వమును." అని యర్థమగుటంజేసి 'మయట్' ప్రత్యయార్థక 'మయ' శబ్దము ప్రత్యేకపదముగాఁ బ్రయోగింపఁబడెనని యంగీకరింపవలసియున్నది. కాన "ప్రాచుర్యార్థంబునం దెనుఁగుపదంబులమీఁదను మయట్ ప్రత్యయముచూపట్టెడు:—తనమయము..." (ప్రౌఢ. తద్ధి. ౧౭ సూ.) అని త్రిలింగలక్షణశేషమునందు సూత్రింపఁబడుట సరికాదు. పైని వివరించినరీతిని 'మయము = ప్రచురము' అనునది ప్రత్యేకతత్సమ పదమని చెప్పుట యుక్తము. ప్రయోగములు:—"వ. విచ్చలవిడిని దనమయంబుగ గగనంబున నిగుడు నచ్చక్రంబుం గనుగొని. (హరి. 3 ఆ.) తమమయము. ఎ-గీ......చదలు తమమయంబు గాఁగ (నిర్వ. ౬ ఆ. ౪౭.) తే-గీ. ప్రథనభూమి మెఱదు ప్రోజ్జ్వలమయమయ్యె మిక్కుటముగ. (హరి. ఉ. ౧౦ ఆ. ౫౭.)" (ప్రౌఢ. తద్ధి ౧౭ సూ.) ద్వి. ప్రమథుల లోకముల్ తమమయంబుగను. (బసవ. ౫ ఆ. ౧3౭.)

బాలవ్యా. దఘ్నార్థంబున బంటి కొలఁదు లగు. ౨౭.

౨౯3 I విషయము. మోకాలిబంటి - మోఁకాలికొలఁది - ఱొమ్ముబంటి - ఱొమ్ముకొలఁది.

సంజీవని. ౨౯3 I విష:—వెనుక నుదాహరించిన పాణినిసూత్రముచొప్పున (౨౯3 విష). దఘ్నార్థమనఁగా పరిమాణము. పరిమాణార్థమున 'బంటి' 'కొలఁది'

అను ప్రత్యయము లాచ్ఛికశబ్దములకంటెం బరముగా నగునని యర్థము. ఉదా:—
ఱొమ్ముకొలఁది - ఱొమ్ముబంటి - దఘ్న ప్రత్యయ మూర్ధ్వమానమును దెల్పును
గాన "మాత్ర"ఱ్ఱమునం దనుట యుక్తమని యు బంటి కొలఁదు లూర్ధ్వమానమందే
కాక యధోమానమందును 'సాయాము'ది పరిమాణమాత్రమందును వర్తిల్లు
ననియు నీవఱకుఁ బైకల్పతరువులో వివరించియే యున్నాను. కోసుకొలఁది - ఈఁత
బంటి - మొ. బంటికొలఁదులు ప్రత్యేకపదములుగాను "మాత్రశబ్దమునలె"
('అందు' ప్రత్యయమువలెనె) మహాకవులచేఁ బ్రయోగింపఁబడుచున్న వనియు
నీవఱకు సోదాహరణముగ వ్రాయఁబడెను. ఉదా:—మోకాలికొలఁది - మోకాలి
బంటి = ఱొమ్ములబంటి - వేలకొలఁది - కోఁగిటికొలఁది - కొలఁదికిమీఁఱి - మొ.
ఇట్టివి వ్యస్తముగానైతము ప్రయోగింపఁదగిన వగుటచేతఁ దత్సమములమీఁద
నిల్చుటయు వింతకాదు. ఉదా:—కటిబంటి - లస్తకంబునకొలఁది - మొ. కవి
జనరంజన టీకాకర్త యీసూదర్శమునందలి సూరిపొరపాటులకు మూలముగా
నథర్వణకారికాపాఠమును మార్చి యసంగతవ్యాఖ్య చేయఁగా దాని ననుసరించి
వేటికావ్యాఖ్యాత యంతకన్నను నసంగతముగ వ్రాసెను. "మాత్రో దఘ్నేతు
బంట్యాదిః" అని పాఠమును మార్చి "దఘ్నార్థమున మాత్ర బంట్యాదిశబ్దము
లగును.........కటిమాత్ర మిచ్చటి పుష్కరములు - ముక్కునబంటి - ముక్కు
బంటి - ఆదిశబ్దమువలన ముక్కుకొలఁది........." (వికృ. టీక. ౮౭ పుట.)
'మాత్ర' అనునది సంస్కృతప్రత్యయము. దీని నీతఁడు చెప్పనేల? "మాత్ర" అనునది
సంస్కృతశబ్ద మన్నచో నిచటఁ బ్రత్యయములతోఁ జోడించి చెప్పనేల? మఱియు
సందర్భాంతరమున "నిర్ధారణాదౌ మాత్రం స్యాత్........." అని యీవఱకుఁ
జెప్పఁబడిన విషయమును (౨౭౯ విష.) మరలఁ బునరుక్తము చేయనేల? "మాత్రో
దఘ్నేతు బంట్యాది। స్తతః పూర్వత్ర నః క్వచిత్. అను నాథర్వణము నూఁతగాఁ
గొని యీసూత్రమును బ్రౌఢవ్యాకర్త రచించె ననుట స్పష్టము." (బా. సా. వే.
3౭౫ పు.) వేటికావ్యాఖ్యాత యాథర్వణమని చూపిన కారిక యర్థముగల
సూత్రము ప్రౌఢవ్యాకరణమున లేదు. ఆకారిక పూర్వార్థ మాథర్వణము కాదు.

నన్నయా. సమా సేఽవస్తు సర్వదా. (వికృ. అజం. ౮౯ కా.
౨౯౪ విష. అహో. 3౬౫.)

కల్పతరువు. ౨౯౪ విష:—ఈకారిక. "౨౨౦ మొ. ౨౨౪" విషయమునందు
వ్యాఖ్యాతమయ్యెను. దీని బాలవ్యాకరణ వివరణమును ౨౨౪ విషయమున
వ్యాఖ్యాత మయ్యెను. సంఖ్యావాచకములపైని బూరణార్థమున 'అవ' ప్రత్య
-యము నిల్చును. ఉదా:—రెండవజాము. మొ.

నన్నయా. ౨౯౫ విష. — అన్యేచ బహవో దేశ్యా । వర్ణకా అర్థభేదకాః । క్వచి దన్త్యస్య లోపః స్యాత్ । క్వచి ద్వర్ణాగమో మతః (వికృతి. అజం. ౫౨-౫౩ కారి. ఆహో. ౩౭౯ పుట).

కల్పతరువు. ౨౯౫ విష:—ఈకారికలు ౨౧౭ I - ౨౨౧ - ౨౯౦ విషయములందు వ్యాఖ్యాతములయ్యెను. నన్నయాథర్వణులు వచింపనివి యింకను ననేకము లాచ్ఛిక (దేశ్య) తద్ధిత ప్రత్యయములుగఁ బ్రయోగములందు వెలయుచున్నవనియు నట్టి ప్రత్యయములు పరమగునపు డాచ్ఛిక ప్రకృతులందు వర్ణాగమ వర్ణలోప వర్ణాదేశాది వికారములు పెక్కువిధములు గల్గుననియుఁ బైకారికల యభిప్రాయము. అట్టి ప్రత్యయములె కొన్ని సూరిచే వివరింపఁబడెను. త్రిలింగలక్షణ శేషమున నింకను మఱికొన్ని చూపఁబడెను. ఎవరెన్ని చెప్పినను బరిపూర్ణత గల్గనేరదు. సంస్కృతవైయాకరణులె యది శక్యముకాదని యిట్లు వచించిరి. "కృత్తద్ధిత సమాసానా । మభిధానం నియామకమ్ । లక్షణం త్వనభిజ్ఞానాం । తదభిజ్ఞాన సూచకమ్" (ముగ్ధ. ౧౧౮౩ సూ. విష.) (౨౬౮ XII విష.). కృత్తద్ధిత సమాస విషయములను జెప్పుట నియమార్థ మాత్రము. పూర్తిగఁ జెప్పశక్యము కాదు. అట్లయిన వ్యాకరణప్రయోజన మేమని శకింపరాదు. అభ్యాసకులకుఁ గృత్తద్ధితసమాస స్వరూపము సూచించుటకు మాత్రమె లక్షణ మనఁగా వ్యాకరణము ప్రవర్తించుచున్నదని కయియభియుక్తోక్తికిఁ దాత్పర్యము.

బాలవ్యాకరణ వివరణము. ౨౯౫ I విషయము. —

అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహాత్ప్రియోగంబుల నెఱుంగునది. ౨౮.
మంటమారి - తిండిపోతు - లాచ్ఛిల్యంబున మారి - పోతు వర్ణకంబులు. అడప = తాంబూలకరండవాహి - మతుబర్థంబునం ద ప్రత్యయంబు. పెండ్లము = ఊఢ - పెండ్లి శబ్దంబునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు. ఇత్యాదు లూహ్యంబులు.

ఇది తద్ధిత పరిచ్ఛేదము.

సంజీవని. ౨౯౫ I విష:—తద్ధితప్రత్యయములను బూర్ణముగ వివరించుట యశక్యమని తలఁచి సూరియు నీక్రిందిరీతి నుపదేశించుచున్నాఁడు. కొన్ని కొన్ని యర్థములందుఁ గొన్ని కొన్ని యాచ్ఛికతద్ధిత ప్రత్యయములు వచ్చుచుండుననియు నట్టివి మహాకవిప్రయోగైకవేద్యములనియు సూరిసూత్రమునకుఁ దాత్పర్యము. అట్టివానిని గొన్నింటిని సూచించుచున్నాఁడు. లాచ్ఛిల్యంబున మారి, పోతు వర్ణ

కంబులగును. తాచ్ఛీల్య మనఁగాఁ దచ్ఛీలభావము = అట్టిశీలము గల్గియుండుటయని యర్థము. "మంటమారి - దే - విశే. ౧ జ్వలనశీలుఁడు. మ. రవిఁ దీవ్రద్యుతి యం ద్రు పావకుని నేతా (నిండైన) మంటమూ రండ్రు వా। రివిధంబుల్ వెనుపంజా (దివిటీ) క్రిందిదివియల్ రేరాజ నిన్నెన్నుచో। ......(చంద్ర. నేతా శబ్దము నొద్ద) 2 కోపశీలుఁడు. తే........మఱియు నమ్మంటమారి '। గలయ నెక్కించు కొని వచ్చు మల యనఁగ' భు। జంగవిషదిగ్ధపవను పై (జలము వోడను (వసు.౪ఆ.)" (శ-ర). "తిండిపోతు = దే - విశే - తిండికాఁడు = (తినుసట్టిస్వభావముగలవాఁడు) తిండికత్తె. (తిండిఁడనియుఁగలదు)" (శ-ర). ఆ-వె. తిండిపోత నిను భఁడనం బేటికిఁ। గడవఁజేరి మనసు కాంక్షదీఱ। నోపుకొలఁది మ్రింగి యూరక నీవింటికడన యుండు మింక నడిచిపడక (ద్రోణ. ౪ ఆ. ౨౩౯ ప). మతుబర్థంబునందు 'అ' ప్రత్యయంబు - అడపము+అ = (అడపము = తాంబూలకరండము) అడప = తాంబూలకరండవాహి = వక్కలాకులతిత్తిని బట్టుకొనువాఁడు. అట్టియాఁడుది యనియుఁ జెప్పవచ్చును. 'అడపమువాఁడు - అడపకాఁడు - అడపకత్తె' అనునవి యీసందర్భమున నిర్వివాద ములు. 'అడప = తాంబూలకరండవాహి - తాంబూలకరండవాహిని' అను మతు బర్థకమగు 'అ' ప్రత్యయమున కొక నైషధప్రయోగము గన్పట్టుచున్నది. అయ్యది వివాదగ్రస్తము.అయినను సూరిపక్షమె యుక్తము. (విస్తర I). మతుబర్థంబునందు 'అము' ప్రత్యయము ."పెండ్లము - దే-వి-(పెండ్లి+అము) వివాహమైనభార్య (ఊఢ). క. అడ్డము చెప్పక కడపటి। బిడ్డఁడు రాముఁడు సుతులఁ బెండ్లము నచటన్। గొడ్డంటం

---

విస్తర. I ౨౯౫ I పిఠః—"అడప. దె - వి - అడప ముంచుకొనియుండు ఆఁడుది. చ. కలికి వరాటరా జడప కప్పురపీడెము వెట్టి వంచనన్। నలు నడపంబు వానికి ఫణాధరవల్లి దళాంతరంబునన్। బలితపుఁ జేలు మైనమునఁ బన్ని; యతం డది సూచి భీతిఁ దమ్ముల మిల వైచిన న్నగిరి మూఁగిన రాజకుమారు లందఱున్ (నైష. ౬ ఆ. ౧౪౧ ప.)" (ఫణాధరవల్లి = నాగవల్లి). ఇందలి 'వరాటరా జడప' అనుచోట "వరాటరాజుయొక్క+అడప (= తాంబూలకరఁడవాహిని = అడపకత్తె) అని శబ్ద రత్నాకరకారుల యాశయమైయుండును. అప్పుడు. 'వరాటరాజు+అడప' అనుచో ౯౬ II విషయముచొప్పున 'నుక్కు'రాకుండుట వింత కాదు. ఇంతవఱకు సూరి కనుకూలమె. ఈ నైషధపద్యమునకు మూలమగు సంస్కృతనైషధమున నిట్లు న్నది. శ్లో. ముఖే సిధాయ క్రముకం నలానుగై। రథోష్ఠి పర్ణాళి రవేక్ష్య వృశ్చికమ్। దమార్పితా న ర్మఖవాస నిర్మితం। భయావిలైః సంభ్రమహాసితాఖిలైః (శ్రీహర్ష నైష. ౧౬ సర్గ. ౧౦౯ శ్లో.) ఇందలి దమార్పితేత్యాదికి "దముఁడనువానిచే

నీయఁబడినట్టియుఁ బరిమళ ద్రవ్యముచే నిర్మింపఁబడినట్టియు వృశ్చికమును జూచి" అని విశేషణోభయపదకర్మధారయముగా నర్థము చేసికొనుటచే దముఁడను వరాటరాజే మాయావృశ్చికకలిత తాంబూలము నిచ్చెననుట మూలానుసారియై యుండుననియు నక్కారణమున "కలికివరాటరా జప్పుడు" అను పాఠమె యంగీకార్యమనియు రెండవ పక్షమువారి (సూ. రా. ని.) యాశయము. ఈపక్షమున 'అడప' అనుమతుబంత రూపము నిరాధారమై యగ్రాహ్యమగుచున్నది. 'దమునిచేనీయఁబడిన పరిమళ ద్రవ్యముచే నిర్మింపఁబడిన వృశ్చికమును' అని మూలమున కర్థముచేసిన చోఁ (శ. ర. పక్షమున) దాంబూల మిచ్చినవాఁడు దముఁడు కాఁడను నర్థము లభింపఁగలదు సర్వంకషావ్యాఖ్యాత 'వరాటరా జడప' అనుపాఠమును స్మరింపక "వరాటరా జపుడు" అను పాఠమునే యంగీకరించి వ్యాఖ్యచేసెను. "వరాటరాజు = వరాట యువరాజు దముఁడు (కలికి = మనోజ్ఞము. ఇచ్చోట పెద్దరాజునకు ఈచేష్టలను ఆరోపించుట అనుచితముగాన, దానికిట 'చిన్న'యని లక్ష్యార్థమును చెప్పుకొనవలయు)." (నైష. సర్వంకష ౫౩౯ పుట.) సూ. రా. నిఘంటుకారులు చాలవఱకు సర్వంకషావ్యాఖ్యనే యనుసరించిరి కాని పద్యములో 'అడప' అనుచో 'అపుడు' అని నిల్పుట సత్యవిదూరమని కొంత సంకోచించిరి. "అడప అని కొన్ని పాఠములును 'అపుడు' అని కొన్ని పాఠములును కలవు. దీనికి (ఈనైషధపద్యమునకు) ముందటివచనము చివర 'అప్పుడు' అని అన్ని ప్రతులలోను ఉండుటచే 'చి. ని. శ-ర కర్త'లు 'అడప' అను పాఠమును గ్రహించి యుందురు. కాని 'అపుడు' అను పాఠమే మూలానుసార ముగానున్నది. శ్లో. దమార్పితాంతర్ముఖవాసనిర్మితం. సం. నైష. ౧౬ స. ౧౧౦ శ్లో. ఇట దముఁడు = కలికివరాటరాజు. ఆపక్షమున పూర్వపువచనమందలి 'అప్పుడు'అను నది తీసివేయవలయును." (సూ. రా. ని. 'అడప' శబ్దమునొద్ద) పరిశీలింపఁగా "ఔచిత్యం బాదరించియు ననౌచిత్యంబు పరిహరించియు" (నైష. ౧ ఆ. ౨౦౨ వచ) అను తన నియమముచొప్పున శ్రీనాథుఁడు రాజడపకానితో హాస్యప్రచారము చేయుట యనుచితమని తలంచి వరాటరాజుగారి యడపకత్తెనలుని యడప కానితోఁ బరిహాసప్రచారము నడపెననుట యింతయు నుచితముగను రసపోషకము గను నుండుననుచు నిట 'అడప' అను పాఠమునె నిల్పి సవరించెననుట మిక్కిలి యుక్తముగాఁ గన్పట్టుచున్నది. "పెద్దరాజునకు ఈచేష్టలను ఆరోపించుట అను చితము" అని వ్రాసిన (చూడు. మీఁదు) సర్వంకషావ్యాఖ్యాతలు యువరాజునకు మాత్ర మీచేష్టలు తగునా యనియుం నందును నలు నడపకానితో వరాటయువ రాజు హాస్యప్రవర్తనము చేయుట తగునా ? యనియు వివేకింపకుండుట చింత్యము.

డెగనడిచిన । జడ్డనఁ దలయూఁచి మెచ్చె జరుదగ్ని మదిన్ (భాగ. ౯ స్కం.)" (శ-ర) ఇత్యాదు లూహ్యంబులనుటచే 'చిచ్చఱ - చిచ్చుఱ' మున్నగుచోటులందలి మయట్ ప్రత్యయార్థకంబులగు 'ఱ - ఉఱ' మున్నగు ప్రత్యయముల నెన్నునది. "చిచ్చఱ - వై - విశ (చిచ్చు+ఱ) అగ్నిమయము. చ.........ముఁదుచుండె. జి । చ్చఱ పిడుగుల్ వడిం దొరఁగు చాడ్పున సంబర వీధి నుగ్రమై. (విరా. ౫ ఆ ౧౪౩)." (శ-ర). "చిచ్చుఱ - వై - విశ - (చిచ్చు ఉఱ). అగ్నిమయము. చ.........చి । చ్చుఱ పిడు గొట్టు లట్టశరి శూరుల గాత్రము నుగ్గు సేసెదన్ (విరా. ౪ ఆ. ౮౩)." (శ-ర). ఇట్లె మఱికొన్ని తద్ధిత ప్రత్యయములు త్రిలింగలక్షణ శేషమునఁ జూపఁబడెను. (విస్తర II).

సంజీవని:—ఇది తద్ధితపరిచ్ఛేదము ౽ తద్ధితపరిచ్ఛేద మింతటితో ముగిసినది.

---

విస్తర. II ౭౯-౫ I పిప:—"౩. మతుబర్థంబునం దరి వర్ణంబు పరంబగునప్పుడు పూజ సొన్నముల కడ యచ్చునకు వైకల్పికముగాను నిత్యముగాను దీర్ఘంబగు. ఉదా:—పూజారి - పూజరి - సొన్నారి" (ప్రౌఢ. తద్ధి). "పూజరి. ద్వ - వి - (పూజ+అరి). అర్చకుఁడు. సీ. పూజరి బ్రాహ్మణపుత్త్రి యొకర్తు సు - గాత్రి నాఁ బరఁగెడు కాంత గలదు (కళా. ౪ ఆ). పూజారి. ద్వ - వి - పూజరియొక్క రూపాంతరము. ఉ.........పూ । జారి వధూటి వచ్చి జలజాతవిలోచనఁ జూచి యిట్లనున్ (విక్ర. ౬ ఆ.) సొన్నారి. ద్వ - వి - (సొన్నము+అరి) అగసాలెవాఁడు. మ. జత సొన్నారి కెలంకునం దనరె (చంద్రా. ౪ ఆ)." (శ-ర). "౫ చెడుగు - దడుకు - నిడుపులకుఁ బుంస్త్వంబున మతుబర్థంబకారంబగు. ఉదా:—చెడుగఁడు - దడుకఁడు - నిడుపఁడు" (ప్రౌఢ. తద్ధి). ఇయ్యవి మగాదిగణములోఁ జేర్పఁదగినవి - చెడుగనిన్ - దడుకనిన్ - నిడుపనిన్ - మొ. "చెడుగఁడు - దే - వి - (చెడుగు + అఁడు) క్రూరుఁడు. మ........ అ । చ్చెడుగం డుగ్రతఁ దద్ధ్వజంబుఁ జెనకన్...... (పారి. పూ. ౮ ఆ). దడుకఁడు - వై - విశ - (దడుకు+అఁడు) దుష్టుఁడు. క. ఉడుగఁడు మధురిపుకథనము । ......... । దడుకనిఁ జదివింప మాకు దుర్లభ మధిపా (భాగ. ౭ స్కం)." (శ-ర) "నిడుపఁడు. వి.........పాము. (చంద్రికా వర్ణనము) సీ. శశిమౌళి తిరుపుచే జడఁజుట్టు నిడుపఁడు,..... ...(రా. వి. ౩ ఆ. ౧౧)." (సూ. రా. ని) "౬. పేలున కడవర్ణకంబు స్వార్థంబునం దగు. ఉదా:—పేలడము" (ప్రౌఢ. తద్ధి.). "పేలడము - దే - వి. ఖేదము. క.........అం। డ్రకు మగలకు నిట్టి పేలడంబులు గలవే. (భో. ౬ ఆ)." (శ-ర). "౭ వెల్ల కడి వర్ణకంబు స్వార్థంబునం దగు. ఉ. వెల్లడి" (ప్రౌఢ. తద్ధి.). "వెల్లడి - వై - వి. ౧ బయలు. ౨ ప్రసిద్ధి." (శ-ర). ౮. "కెలివి, విరివి, విసికి - లేమి - రాపులకు

స్వార్థంబునం దిడి వర్ణకంబగు. ఉదా:—తెలివిడి - విరివిడి - వినికిడి లేమిడి - రాపిడి” (ప్రౌఢ. తద్ధి.). “తెలివిడి - వి - (∠తెలియు) ౧ జ్ఞానము. గీ. తెలివియునఁగ నెఱుక యనఁ దెలివిడి యనఁ। బరఁగు జ్ఞానంబు. (ఆం. భా. ౧ ఆ. ౧౦౨.)” (సూ. రా. ని.). తెలివిడి పదమునకు ‘తెలివి’ అను ప్రాతిపదికము మూలమనుట యుక్తము. తెలియు ధాతువు జనకపదమని సూ - రా - నిఘంటుకారులు వ్రాయుటసరి కాదు. “విరివిడి - దే - వి - (విరివి+ఇడి) విస్తృతి......” “వినికిడి - దే - వి - (వినికి+ఇడి) వినికి ..” “లేమిడి - దే - వి - (లేమి+ఇడి) దారిద్ర్యము” (శ-ర.). ‘వెల్లడి - తెలివిడి - విరివిడి - వినికిడి’ అనువానికి శబ్దరత్నాకరమునఁ బ్రయోగములు చూపఁబడలేదు. “రాపిడి - దే - వి - ఒరయిక (ఆమ్రేడితమునందు రారాపిళ్ళు) శా. రారాపిళ్ళ భుజాంగదంబుల మణుల్ రాలంగ (మను. ౪ ఆ.)” (శ-ర.). ౯. “ఇతవర్ణకం బింపు బిగి పోరులకు స్వార్థంబునం దగు. ఉదా:—ఇంపితము - బిగితము - పోరితము” (ప్రౌఢ. తద్ధి.). ఇం దింపిత మనుదానికి సూ - రా - నిఘంటువునందు సైతము ప్రయోగము చూపఁబడలేదు. “బిగితము - దే - విశే - (బిగి+ఇతము) దృఢము. సీ. బిగితంపు ముష్టిఁ గంపితమైన యసిధార విమత కరాస్థులు విఱిచి విఱిచి. (హరి. ఉ. 3 ఆ.)” “పోరితము - దే - వి - (పోరు+ఇతము) కలహము. సీ. తనయులిం కేభంగి ధనవిభాగములకై, పోరితంబులు లేక పొసఁగియుందురు. (కాశీ. 3 ఆ.) ౨ యుద్ధము. ఉ......పోరితంబులే। కయ్యెడు కార్యసిద్ధి వెడఁగైనను కొల్లక యొండు సేయునే. (ఉద్యో. ౧ ఆ.)” (శ-ర ) “౧౦. ఇదవర్ణకం బొప్పు తప్పు పెల్లులకు స్వార్థంబునందును క్రొవ్వు బెట్టులకు మతుబర్థంబునందును నగు. ఉదా:—ఒప్పిదము - తప్పిదము - పెల్లిదము - క్రొవ్విదము - బెట్టిదము.” (ప్రౌఢ. తద్ధి.). “ఒప్పిదము. దే - వి - (ఒప్పు+ఇదము) ౧ అందము. సీ. కాళ్ళ యొప్పిద మూఁదు కట్టు నుజ్జ్వలము సేయుంగ. (విరా. ౧ ఆ. ౨౨౮.). క్రొవ్విదము. దే - వి - (క్రొవ్వు+ఇదము) దుష్కార్యము. గీ.........క్రొవ్విదంబులు సేయఁ। జొచ్చు టిచ్చగించి చూతురయ్య. (ఉద్యో. ౨ ఆ. ౯.)” (శ-ర.) “తప్పిదము. వి - (∠తప్పు) ద్వి. తనయుండు సేసిన తప్పిదంబునకు।......(ద్వి. శ-సా. ౧ ఆ. ౪3 పొరట.)” (సూ. రా. ని.) “క. మంత్రంబున బె।ట్టిదముగఁ బడవైచిన యొ।ప్పిదమున. (భీష్మ. ౨ ఆ.)” (శ-ర.) “పెల్లిదము. ద్వ - వి - (పెల్లు+ఇదము) పెల్లు - అతిశయము. క. ఉదవెడు తృష పెల్లిదమున। వదనము వఱువట్లు వట్టె........(విరా. ౨ ఆ.)” (శ-ర.). “౧౧. స్వార్థంబునం దిరి వర్ణకంబు వాఁపున కగు. ఉదా:—వాఁపిరి” (ప్రౌఢ. తద్ధి.) “వాఁపిరి. ద్వ - వి - (వాఁపు+ఇరి) ఏకరుట - ఏఁకట (మిక్కిలి యపేక్ష)” (శ-ర.) “౧౨. అర వర్ణకంబు నాయఁకశబ్దంబునకు భావంబునం దగు. ఉదా:—నాయఁకరము” (ప్రౌఢ. తద్ధి.) “నాయంకరము - ద్వ - వి - (నాయఁకుఁడు+కరము) అధి

పత్యము. గీ. దళవాయి నాయఁకరపు పట్టమున నిలిచి (పాండు. ౧ ఆ.)" (శ-ర). కర ప్రత్యయ పరకత్వమునఁ "నాయఁక" అను నాచ్ఛిక ప్రకృతియొక్క కకారములోపించినది. "నాయఁకుఁడు - వై - వి. ౧ అధిపతి. ఎ-గీ.........ఎలుకురాయంకుఁ డొక్కరుఁడు వచ్చి। పుడమిరా వేల్పు రాయని కడను నిల్చి (చంద్రా. ౨ ఆ)." (శ-ర). "౧౩ కార వర్ణకంబు చెలి నయములకు భావంబునందును, నుడి కొలతలకు స్వార్థంబునందు నగు. ఈ కకారమునకుఁ గొన్నియెడల గకారంబగు. ఉదా:—చెలి కారము-నయగారము, నుడి కారము - కొలగారము." (ప్రౌఢ. తద్ధి). "చెలికారము. వి. (చెలి+కారము) చెలిమి - స్నేహము. క. నెలకొను చుట్టఱికంబును । జెలికారము.........(యయా. ౩ ఆ. ౮౯.)" "నయగారము - వి. (నయము+కారము) మనోజ్ఞత - ఒప్పు - అందము. (మృదుత్వము. శ-ర). క. ప్రియమై రమణీయమణీ। మయమై యతిచిత్రభిత్తిమంజిరు నయమై। నయమైన చిలుకపలుకుల । నయగారమునం జెలంగిన, యగారమునన్ (సారంగ. ౧ ఆ. ౧౩౫)." "నుడికారము - వి.........(నుడి+కారము స్వార్థమున) ౧ పలుకు - మాట మాట మొదలగువానియందలి చమత్కారము - సరసత...... ..ఉ.........నుడికారము సొంపెసలార భారతం। బెట్టు రచించి తీవు..... (కాశీ. ౭ ఆ. ౧౯౨) గీ..........। పలుకు నుడికారమున నాంధ్రభాషయందు । రు.........(భీమ. ౧ ఆ. ౧౫)." (సూ. రా. ని.). "కొలగారము - దే - వి - ధాన్యము కొలత కిచ్చెడు కూలి (శ-ర). "౧౪ చలికి మిరి వర్ణకంబు స్వార్థంబునం దగు ఉదా:—చలిమిరి" (ప్రౌఢ. తద్ధి). "చలిమి (ల్మి) రి వి (∠ చలి) చలువ - శైత్యము. సీ. మలయానిలుం డింత, చలిమిరితోఁ గ్రాలి నడపాడునోజ యెన్నండొ పడసె (నన్ని. కు. సం. ౫ ఆ. ౬౦౦ ప)." (సూ. రా. ని). "౧౫. టివర్ణకం బొండు సంఖ్యవర్ణంబునకు భావంబునం దగు. ఉదా:—ఒంటి" (ప్రౌఢ. తద్ధి) "ఒంటి - విశే (∠ - ఒండు).........ఏకాకి - ఒంటరి. చ.. ......కౌరవసేనయేడ యొం। టి సనుట యేడ.........(విరా. ౫ ఆ. ౨౩౮).........వి. ఏకాకిత్వము - ఒంటరితనము - అసహాయత్వము. క. ఒంటి మెయిఁ దాఁక నా ము। క్కంటికి వశమగునె కృష్ణగాండీవుల (కర్ణ. ౨ ఆ. ౮౫)." (సూ. రా. ని.). "౧౯ ఒకానొకచో మతుబర్థంబున నవర్ణకంబు చూపట్టెడి. ఉ. క.........ఇట్టి దివ్యతేజం। బున వాఁడధమాన్వయమునఁబుట్టునె చెపుమా. దివ్యతేజంబునవాఁడు=దివ్యతేజముగలవాఁడు (ఆది. ౬ ఆ.) ఇతరంబులు ప్రయోగదృష్టంబులు గ్రాహ్యంబులు." (ప్రౌఢ. తద్ధి). ఇట్టిచోటులందలి 'న' అనునది యొక తద్ధిత ప్రత్యయ మనుట సరికాదు. ఇది స్పష్టముగు సప్తమీవిభక్తి ప్రత్యయముగఁ గన్పట్టుచున్నది. ఇట్టివి మధ్యమపదలోపి సప్తమ్యలు క్సమాసములనుట యుక్తము. "దివ్యతేజంబు+నన్+వాఁడు = దివ్యతేజంబునం దుండు వాఁడు = దివ్యతేజముగలవాఁడు" అని ప్రక్రియ నరయునది. (౨౭౦ విష).

# ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వము

## క్రియా పరిచ్ఛేదము

ఆంధ్రశబ్దచింతామణిలో సంస్కృతధాతువులనుండి యేర్పడు క్రియాపదముల రూపనిష్పత్తి మాత్రమె ప్రధానముగా మొదట సాధింపఁబడెను. కావున సంస్కృతధాతువులు తత్సమములగుచుఁ దెలుఁగులోనికి వచ్చురీతి మొట్టమొదట "ఉపకృతి పరిణతి సంవృతి భేదా" దిత్యాదికారికచే నిరూపింపఁబడెను. అట్లు తుదిముట్టఁ దత్సమధాతు రూపసాధనమునె యుపదేశించి తుదిని "అత్త్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియా పదానాంచ" అని యిట్లుగ నాచ్ఛికధాతువులనుండి క్రియారూపములను సైతమిా తత్సమ క్రియాసాధక సూత్రముల మూలముననె సాధించికొనవలెనని భట్టారకుఁడు వచించెను. చింతామణి సంక్షేపాభిప్రాయముతో రచింపఁబడినదగుటంజేసియు నాచ్ఛికధాతురూపసాధనప్రక్రియ మిక్కిలి విస్తృతముగఁ జెప్పవలసి యుండుటంజేసియు నద్దాని నుపేక్షించి భట్టారకుఁడు పైరీతిని క్రియాపరిచ్ఛేదమును నడిపినవాఁడయ్యెను. ప్రకృతగ్రంథము విద్యార్థిలోకమున విద్వల్లోకమునఁ బ్రసిద్ధమైయున్న బాలవ్యాకరణపు వరుస ననుసరించి నడుపఁబడుచుండుటంజేసి యాంధ్రశబ్దచింతామణి క్రమమును వీడి బాలవ్యాకరణక్రమమున యథాపూర్వముగ సందర్భపఱుపఁబడుచున్నది. బాలవ్యాకరణమునఁ దత్సమాచ్ఛికసాధారణముగా భూతాద్యర్థములును నట్టి క్రియావిభక్తిప్రత్యయములును నుపదేశింపఁబడుటంజేసి వానికి మూలమునఁ దగు నన్నయాథర్వణకారికలిటఁ బ్రదర్శింపఁబడుచున్నవి. ఆంధ్రశబ్దచింతామణిలోని క్రియావిభక్తి ప్రత్యయములు మొదటఁ దత్సమధాతువులకె యుపదేశింపబడినను నత్త్వాది తత్సమానా మివ దేశ్యానామిత్యాది సూత్రముచే నట్టి ప్రత్యయములు తత్సమాచ్ఛికధాతు సాధారణములె యనఁదగును. అట్టి నన్నయాథర్వణోపదిష్ట తద్ధర్మాద్యర్థములును క్రియావిభక్తి ప్రత్యయములును నిటఁ బ్రదర్శింపఁబడుచున్నవి.

> తద్ధర్మ వర్తమానాతీ తాగామ్యర్థకాః క్రియా
> జ్ఞేయాః । తత్ర ద్వితీయ తుర్యౌ । యా తౌ స్తః
> సానుబన్ధకా వేవ. (ఆం. చిం. క్రియా. 3 కారి.
> అహో. ౧౫౯-౧౬౧ పు.)

వసతి రనుబన్ధకః స్యా । ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర ।
అస్తి రనుబన్ధకః స్యా । ద్యత్ర లృడర్థో వివక్షితో
ధాతోః. (ఆం. చిం. క్రి. ౪ కారి. అహో. ౪౯౧ పు)
చు రితి క్రియాపదానాం । సర్వేషాం వర్తమానకాలే
స్యాత్. (ఆం. చిం. హలం. ౧౧ కారి. అహో. ౪౦౫ పు)

సన్నయా ౨౯౬ విష

అత్త్వాది తత్సమానా । మివ దేశ్యానాం క్రియాపదా
నాంచ. (ఆం. చిం. క్రియా. ౧౭ కారి. అహో. ౫౧౨ పుట.)
వ్యతిరేకాదా భావిని । చాత్ స్యాత్ క్త్వా భూత
యోః క్రియా న్త స్యేత్. (ఆం. చిం. క్రియా. ౬ కారి. అహో. ౪౭౩-౪౭౪ పు.)
దు తి వర్ణకా క్రమాత్ స్తో । నాద్య స్యాదా ద్వయో
శ్చ భూతార్థే. (ఆం. చిం. క్రియా. ౧౧ కారి. అహో. ౪౮౨ పుట.)
పున రాగమః క్రియాణాం । పర్యాప్తౌ మన్మతే తు
సఙ్కేతః. (ఆం. చిం. క్రియా. ౧౪ కారి. అహో. ౪౯౪ పు.)

కల్పతరువు. ౨౯౬ విష:—క్రియాః = క్రియలు = ధాతువులు, తద్ధర్మ వర్తమానాతీ తాగామ్యర్థకాః = ధాత్వర్థభూతవ్యాపారము, వర్తమానవ్యాపారము, భూతవ్యాపారము, భావివ్యాపారమును నర్థముగలవని, జ్ఞేయాః= తెలియఁదగియున్నవి. వెనుకఁ గారకపరిచ్ఛేదము ౨౩౪ విషయమున వివరించిన రీతిని జాతి వ్యక్తి లింగ సంఖ్యా కారకము లైదును ప్రాతిపదికార్థములె యన్నట్లిచట నయితము "క్రియాత్వము- క్రియ-(వ్యాపారము) వచనము - కాలము - అన్వయము." అను నైదిటికిని ధాతువులె వాచకములనియు లడాది ప్రత్యయములు ద్యోతకములనియు నెఱుంగునది. (విస్తరం. I) తత్ర = అట్టివానిలో, యా ద్వితీయ తుర్యా =

---

విస్తరము I. ౨౯౬ విష:—తద్ధర్మశబ్దార్థ విషయమునఁ జింతామణికిని బాలవ్యాకరణమునకును జాలభేదము గలదు. "తత్ = ఆధాతువుయొక్క, ధర్మము = వ్యాపారము." అని చింతామణి పక్షమునందలి యర్థము. తద్ధర్మ - తచ్ఛీలాద్యర్థములను దెలుపునది యని బాలవ్యాకరణ పక్షమున నర్థము. (చూ. బా. క్రి. ౨౨

వర్తమానార్థక భవిష్యదర్థకము లేవి గలవో, తా = అవి=ఆధాతువులు, సానుబంధకా వేవ = ఈ క్రిందఁ జెప్పఁబడు ననుబంధములతోఁ గూడికొనియే, స్తః = ప్రయోగింపఁబడును. తద్ధర్మ మనఁగా ధాత్వర్థమె. ధాతువులు వ్యాపారమాత్రార్థమందె క్రియావిభక్తులతోఁ గూడి పదములై వాక్యప్రయోగార్హము లగునని తాత్పర్యము. ధాతువు స్వార్థవ్యాపార మాత్రబోధకమగునపు డాయాస్థలములందలి సందర్భములనుబట్టి యాయా చోటులందు వర్తమాన భవిష్య దాద్యర్థములును దచ్ఛీల సంభావ నాశీరాద్యర్థములును గ్రాహ్యములగుచుండునని యెఱుంగునది. ఉదా:—వాఁడు రేపు వండున్ = భావ్యర్థకము. వాఁడిదె వచ్చున్ = వర్తమానార్థకము. అన నతఁ డిట్లనున్ = ఇట్లనెన్ = భూతార్థకము. అగ్ని మండున్ = తచ్ఛీలార్థకము. నీకు శుభం బగున్ = ఆశీరర్థకము. వాఁడు చెప్పి యుండున్ = సంభావనార్థకము. మొ. "భూతా ద్యర్థత్రయ విలక్షణః కశ్చి దర్థ స్తద్ధర్మాఖ్య ఇత్యాచార్యై ర్వ్యవహ్రియతే, వికృతౌ. వర్తమాన భవిష్యదర్థయోః క్రియాయాస్సానుబన్ధకత్వమ్. భూతార్థే ఏకత్వే ఏత్వమ్. బహుత్వే ఇత్వంచ వర్తతే. ఇత్యేతద భావా దస్య తత్త్రితయ విలక్షణత్వమ్,తత్రాచార్యైః కాల మవివక్షిత్వైవ ధాత్వర్థ మాత్రే వివక్షా క్రియతే.అతఏవ తద్ధర్మ ఇత్యన్వర్థా సంజ్ఞా.తస్యధాతోర్ధర్మః వాచ్యార్థ మాత్రమితి. ధర్మోత్తమ మధ్యమవ దిత్యత్ర తచ్ఛబ్దపరిత్యాగేన సోర్థో నిర్దిష్ట సూత్రకారేణ, సఏవ నిర్దేశో ఽన్వర్థ సంజ్ఞాయాం మానమ్, కేవలసంజ్ఞాపక్షేతు తద

సూ. ౫ సూ.) ఇట్టి భేదమును గ్రహింపక పేటికావ్యాఖ్యాత పక్షద్వయ మిశ్రణ కలుషితముగా వ్రాయుచు వచ్చెను. "తత్రాచార్యైః కాల మవివక్షిత్వై" వేత్యాది కవిశిరోభూషణకంక్తుల (అహో. ౨౫౯ పు.) నుదాహరించి "ఒకానొక ధర్మముగల యొకానొక పదార్థమని భావము. ధాత్వర్థమాత్రమున నీ లకార మగునని ఫలితము." (బా. సా. వే. ౩౮౦ పుట) నన్నయల డాదుల విధింప లేదు. డుజాది ప్రత్యయములు పురుషవచనాదిద్యోతకములె కాని తద్ధర్మాదిద్యోతకములు కావు. ఇట్లె యీసందర్భమున మఱికొన్ని ప్రమాదములును గలవు. బా - గు - ప్ర - వ్యాఖ్యనుండి స్వీకరించుటలోఁ గల్గినవి కొన్ని. "భూతకాలికపదార్థము దేవదత్తుఁడు"(బా. సా. వే.౩౭౯.). దేవదత్తుని వంటకము ముగిసెనుగాని దేవదత్తుఁడు ధ్వంసము నంద లేదుగదా. "జాతి వ్యక్తి లింగ సంఖ్యా కారకంబు లేనును బ్రాతిపదికార్థములే గాన ధాతువు వర్తమాన కాలికపదార్థ వ్యాపారబోధక మగుట యవిరుద్ధము........" (ఇట్లె యిచటి ధోరణి) (బా. సా. వే. ౩౭౦) ఇందలి కార్యకారణభావ మసంగతము. ధాతువు ప్రాతిపదికము కాదుగదా.

రోగా దితిధ్యేయమ్." (అహో. ౪౫౯ పు.). ఈసందర్భమున నహోబలపండితుఁడు "ప్రథమ శ్చోత్తమ శ్చైవేత్యా (23 విష.) ద్యథర్వణ కారికలనుబట్టి యథర్వణ మతమున నుదంతములు నాంతములు నగు తద్ధర్మక్రియాపదములకు మాత్రమే తద్ధర్మసంజ్ఞ చెల్లునని వ్యాఖ్యచేయుట సరికాదు. "న స్యా త్తద్ధర్మోక్తః" అను సూత్రమునం (23 విష.) దలి తద్ధర్మశబ్దమునకు వివక్షించిన యర్థము నచట యథర్వణుఁడు వివరించెనేకాని యంతటను దద్ధర్మశబ్దమున కదియే యర్థమని యథర్వణాశయము కాదు. (23 విష.). అట్లు కానిచో 'ఘటింతురు' మున్నగు క్రియారూపముల కథర్వణమతమున సిద్ధి యెట్లు? అథర్వణుఁ డట్టివాని రూపసిద్ధిని వేఱుగ సాధింపలేదే! "తద్ధర్మప్రథమే స్యాతాం డు డి వర్ణౌచ నాంతకా" అనుచోప్పున నాతఁడు (విక్ర. క్రియా. ౯ కారి. ౨౯౬ 1 విష.) 'డి' వర్ణకమును దద్ధర్మప్రత్యయముగ నెట్లంగీకరించెను? కావున "ప్రథమైకవచనాన్తయో ర్నాన్తయోః పదయో రేవ తద్ధర్మసంజ్ఞికత్వ ముక్తమ్........తేన 'చేసెదన్ - ఘటించెదన్' ఇత్యాదా న తద్ధర్మసంజ్ఞా. కింతు భావిక్రియా వ్యవహారఏవ, ఘటింతు రిత్యాదా వపి నాన్తత్వాభావా న్న తద్ధర్మసంజ్ఞా. వాగనుశాసన మతే త్వేషాం తద్ధర్మార్థకత్వమేవేతి." (అహో. ౪౫౯ పు.) అను కవిశిరోభూషణసంక్తులు సరికావని గ్రహింపవలెను. (౪౨౧ పు. అహో. చూ.) అహోబలపతి వివేకింపక కొన్నియెడల నిట్లు నన్నయాథర్వణకారికలు వేర్వేఱు గ్రంథములని భ్రమించుచుండును.

తద్ధర్మక్రియలవంటివి విస్తృతముగ సంస్కృతభాషయందు సఱితము లేవు. సంస్కృతమునఁ దాచ్ఛీల్య సాతత్యాదులందు లట్టునే వాడుదురు. 'వర్తమానే లట్' అనుచోటి వర్తమానశబ్దమునకు భూతభావి లక్షణత్వ మర్థమని వ్యాఖ్యచేయుదురు. ఇట్లు వ్యతిరేకార్థక క్రియలవంటి ప్రత్యేకపదములును సంస్కృతమున లేవు. సంస్కృతమున వ్యతిరేకార్థము 'న' శబ్దముచే సంపాదింపవలసినదే. ఉదా:—(తె.) చదువఁడు = (సం.) నపఠతి. (తె) చదువకుము = (సం.) నపఠ. (తె) చదువమి = (సం.) అపఠనమ్. (తె.) చదువఁబడనిది (చదువనిది) = (సం) అపఠితమ్. (తె.) చదువక = (సం.) అపఠిత్వా. మొ.

నన్నయాథర్వణులు తద్ధర్మశబ్దమున కిట్టర్థము చేసినను సూరి తద్ధర్మాద్యర్థములందు లాట్టును విధించుటచే లాట్టు రూపములకుఁ దద్ధర్మాద్యర్థకములనెడి వ్యవహారము ప్రసిద్ధమయ్యెను. తద్ధర్మార్థకక్రియ యనఁగాఁ దద్ధర్మాద్యర్థబోధక క్రియయని బాలవ్యాకరణపక్షమున నర్థము నెన్నవలెను.

తెలుఁగునఁగల యీ యసాధారణరూపవిశేషములను సరిగా గ్రహింపక యాంధ్రభాషాభూషణ కావ్యాలంకార చూడామణి కర్తలు 'ద' గాగమయుక్త

తద్ధర్మ రూపములను వర్తమానార్థకములుగను, 'దు' గాగమయుక్త తద్ధర్మ రూపములను భావ్యర్థకములుగను నుపదేశించిరి. మఱియు, చింతామణ్యుక్త వర్తమానార్థక భావ్యర్థక రూపములు ప్రత్యేకరూపపదములుగాక శబ్దవ్యయఘటితములను తలంపునం గావలయు వాని నుపేక్షించిరి. క. డును దరు లొరులకు నెఱిఁగఁ । దవరంగా దు దవు దరు లు తనకు దను దముల్ । చను నేకబహువచనములు । మనుసన్నిభ క్రియల వర్తమానార్థంబుల్. క. అడిగెను నడిగెద రనఁగా । .........ఉదాహరణంబుల్ (ఆం. భూ. ౧౪౨-౧౪౩ ప.). క. ఉను దురు లొరులకుఁ జెప్పను । దనరఁగ దువు దురు లెదిరికిఁ దవు దును దుముల్ । దనరఁగ నివి యేక బహువ । చనములగు భవిష్యదర్థ సంసూచకముల్. క. పలుకును బలుకుదురనఁగా । ........ (ఆం. భూ. ౧౪౪-౧౪౫ ప). క. అరిగెను నరిగెద రనఁగా । ........ వర్తమానఫణితార్థ మగున్. క. చేయుం జేయుదు రనఁగా... ..భవిష్యదర్థముఁ జెప్పున్ (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౫౧-౧౫౫ ప.) కేతనయుఁ బెద్దిరాజును వచించిన యీవిషయములు ప్రామాణిక ములనియు, దగాగమయుక్తరూపములు భావ్యర్థమును దుగాగమయుక్తరూప ములు వర్తమానార్థమును రెండును భూతార్థమును దాచ్ఛీల్యాదులను బోధింప వచ్చుననియు నారచించిన చింతామణివిషయ పరిశోధనమున సవిస్తరముగఁ జూపఁ బడెను. (చిం. వి. పరి. ౬౨ ౬౩-౬౪ పిప.) అథర్వణాచార్యుఁ డొకానొకసంద ర్భమున (ఎ) ద గాగమయుక్తరూపములు భావ్యర్థకములని వచించెను. "అథర్వణ గ్రంథేతు పోయెద నిత్యాదౌ 'భావిక్రియాసు యస్య స్యా । దేత్వ మేవ ప్రయో గతః"........' (అహో. ౧౫౩ పు.) అని కవిశిరోభూషణమున నుదాహరింపఁ బడెను. 'ఎద' రూపము భవిష్యదర్థకమగుట:—సీ. పని యేమి పంచినఁ బదపడి చేసెద ననక తన్పంచిన యాజ్ఞ నంబ చేయుచు......(ఆది. ౩ ఆ. ౧౧౦). చ......సుతు లార యీబిలము నొయ్యనఁ బోయి చొరుఁడు దీనిఁ గ । ప్పెద ఘనపాంసుజాల ముల భీమశిఖావలి దాఁకకుండఁగన్. (ఆది. ౮ ఆ. ౩౦). "తతోఽహం పాంశునా ఛిద్ర మపిధాస్యామి పుత్రకాః (ఆది. ౨౫౬ అధ్యా. ౧౬ శ్లో.)

దుగాగయుక్తరూపములు వర్తమానార్థకములగుట:—సీ. మీవంశమున నర దేవోత్తములవైన, సద్ధర్మమార్గంబు నలుపుదయ్య । ధర్మవిదుండవై ధర్మకామం బులొం, డొంటిని బాధింపకుండ నుచిత । కాలవిభక్తముల్ గాఁజేసి సేవింతె ధర్మువు నందుఁ జిత్తంబు నిలిపి । యిమ్ముల నపరరాత్రంబులం దెప్పుడుఁ జింతింతె నిజబుద్ధిఁ జేయఁదగిన. ఆ-వె. రాజకృత్యములు........(సభా. ౧ ఆ. ౨౬ ప). శ్లో. కచ్చి దాచరితం పూర్వై । ర్నరదేవ పితామహైః । వర్తసే వృత్తి మక్షుద్రాం । ధర్మార్థ

సహితాం త్రిషు। కచ్చి దర్థేనవా ధర్మం। ధర్మేణార్థ మథాపివా। ఉభౌవా ప్రీతి సారేణ। న కామేన ప్రబాధసే। కచ్చి దర్థంచ ధర్మంచ। కామంచ జయతాం వర। విభజ్య కాలే కాలజ్ఞః। సదా వరద సేవసే। కచ్చి చ్చా పరరాత్రేషు। చిన్తయ స్యర్థ ధర్మవిత్ (సభా. ౫ అధ్యా.)

దుగాగమరూపములు భూతార్థబోధకములగుట:—క. భూమిమీఁద హంస డిభకులు। నామగధాధీశ్వరుండు నమ్ముప్వురుఁను। ద్దామభుజవీర్యసంపద। తో మూఁడు జగంబు నోపుదురు సాధింపన్ (సభా. ౧ ఆ. ౧౧౫) (హంసడిభకులా పటుకుఁ జచ్చిరి గాన (౧౧౬-౧౧౭.) నిట 'ఓపుదురు - ఓపెడివారు' అని యర్థము. ఇది భావ్యర్థ మెంతమాత్రమును గానేరదు.) చ. ఇది మునికన్యయేని మఱి యే లొకొ యీ లలి తాంగియందు నా। హృదయము దద్దయుం దవిలె నిప్పలు కింకను నమ్మనేరన। య్యెద విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక యిందు నుంచు దా। నిది కల రూ పెఱుంగ నవనీపతి యుత్సుకుఁ డయ్యెనాత్మలో (ఆది. ౪ ఆ. ౩౦ ప.) ఇచట 'యిందు'నను నది యెంతమాత్రమును భవిష్యదర్థము కాదుగదా.

వసతి రనుబంధక ఇత్యాది:—క్రియలు సానుబంధకములయియే క్రియావిభక్తుల నంది ప్రయోగింపఁబడునని యీపటుకుఁ జెప్పెనుగాన నట్టి యనుబంధములను జేర్కొనుచున్నాఁడు. యత్ర = ఎచట, లడర్థః = వర్తమానార్థము, వివక్షితః = వివక్షింపఁబడునో, తత్ర = అచట, ధాతోః = ధాతువునకు, వసతిః = వస్ధాత్వర్థకముగు (వస. నివాసే) 'ఉండు' ధాతువు, అనుబన్ధకః = అనుబంధము, స్యాత్ = అగును. యత్ర = ఎచట, లృడర్థః = భవిష్యదర్థము, వివక్షితః = వివక్షింపఁబడునో, తత్ర = అచట, అస్తిః = అస్ధాత్వర్థకముగు (అస్ = భువి = విద్యమానతాయామ్) కలుగుధాతువు, ధాతోః = ధాతువునకు, అనుబన్ధకః = అనుబంధము, స్యాత్ = అగును. వర్తమానార్థమందు 'ఉండు' ధాతురూపములును భవిష్యదర్థమందు 'కలుగు' ధాతురూపములును నెల్లధాతువులను జేరునని తాత్పర్యము. వస్ధాతువునకు నివసించుట యర్థము. అస్ధాతువునకే, 'కలుగు - ఉండు' అను రెండర్థములు గలవు. అట్లయినను బ్రయోగములచేతను, 'అస్' ధాతువునకు 'కలుగు' అనునర్థము నిచటఁ జెప్పఁదగియుండుటచేతను వస్ధాతువున కిచటఁ బ్రయోగానుసారముగా 'ఉండు' అను నర్థము చెప్పవలసియున్నది. ఇట్టి యనుబంధములగు 'ఉండు - కలుగు' ధాతువుల మీఁదనే క్రియావిభక్త్యాదులు నిల్చును. వర్తమానార్థమున వచ్చు 'చు'వర్ణమును భావిని వచ్చు 'అత్వమును' ననుబంధపరకత్వమున మూలధాతువులకుఁ బరముగ నిల్చును. నన్నయ యాచ్ఛిక క్రియారూపములను బ్రత్యేకించి సాధింపలేదుగాన

'ఉండు - కలుగు' ధాతువుల కెట్టిరూపములు వర్తమాన భావ్యర్థములలోఁ గవి ప్రయుక్తములయి యుండునో యట్టిరూపము లెల్లధాతువులపైని నిల్పుటచే నాయా ధాతువుల వర్తమానభావిరూపము లగుచుండునని తాత్పర్యము. ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్ట ప్రణీతముగుటంజేసి యాతఁడు వర్తమానభావ్యర్థములలోఁ బ్రయోగించిన 'ఉండు - కలుగు' ధాతురూపముల చేరికచే నెల్లధాతువులును వర్తమానభావ్యర్థకము లగుచుండును. అట్లగుటంజేసి "వర్ణాగమో విశేషః। పురుషేష్వర్థేషు చాపి వచనేషు" అను చింతామణివచనముచొప్పున (3౨౨-3౨౭ విష.) వర్ణలోప వర్ణాగమ వర్ణాదేశాదులను గల్పించికొనుచు సాచ్ఛికధాతువులనుండి కవిప్రయుక్తరూపములను సాధించుకొనవలయునని యెఱుంగునది. ఉదా:—వర్తమానము (మహత్.) (ప్ర):—వండుచున్న వాఁడు - వండుచున్న వారు. (మ.) వండుచున్న వాఁడవు - వండుచున్న వారరు. (ఉ.) వండుచున్న వాఁడను - వండుచున్న వారము. (అమహత్) (ప్ర.) వండుచున్నది - వండుచున్నవి. తిర్యగ్జడ కర్తృకత్వమున మధ్యమోత్తమపురుషములు మహద్వివక్ష లేక సంభవింపనేరవుగాన నట్టియెడల మహత్కర్తృకతాపక్షరూపములె వర్తిల్లును. ఏకత్వమున 'దాన' అను దానితోడిరూపములు మహతీత్వమున నిల్చును. ఉదా:—నీవు చదువుచున్న దానవు - నేను - చదువుచున్న దానను - మొ. భవిష్యదర్థము:—(మహత్.) (ప్ర.) వాఁడు చేయఁగలవాడు - వారు చేయఁగలవారు. (మ.) నీవు చేయఁగల వాఁడవు - మీరు చేయఁగలవారరు - నేను - చేయఁగలవాఁడను - మేము చేయఁగలవారము. (అమహత్) ప్ర. అది - చేయఁగలదు - అవి - చేయఁగలవు. తిర్యగ్జడ కర్తృకత్వమున మధ్యమోత్తమపురుషములు మహద్వివక్ష లేక సంభవింపనేరవు. కాన నట్టియెడల మహత్ కర్తృకతాపక్షరూపములె నిల్చును. ఏకత్వమున 'దాన' అను దానితోడిరూపములు మహతీత్వమున నిల్చును. ఉదా:—నీవు చేయఁగల దానవు - నేను+చేయఁగలదానను - మొ. ఇట్లు సాధించిన క్రియారూపములు ౨౬౮ విషయమున సాధింపఁబడిన క్రియాజన్యవిశేషణమూలకరూపములె యగుచుండుట యొకవిరోధమని తలంపరాదు. (౨౯౯ విష.) అహోబలపండితాదులు ప్రామాదికముగా సాధించిన నన్నయానభిమతములగు నర్వాచీనరూపములందును నిట్టి యాకారసామ్యము వర్తిల్లుచునేయున్నది. (౨౯౯ విష.) ఉదా:—వండు+చు+ఉండు+డుఙ్ = వండు+చు+ఉన్న+వా+డుఙ్ = వండుచున్న వాఁడు = వండుచున్నాఁడు. ఇట్లు సమాపకక్రియారూపసాధన ప్రక్రియ నరయునది. వండుచున్న+వాఁడు = వండుచున్న వాఁడు = వండుచున్నాఁడు. ఇట్లు విధేయవిశేషణరూప

సాధన ప్రక్రియ నరయునది. ఇట్లె యమహత్కర్తృకత్వముండును ద్వివిధరూపము లకును నేకాకారము సంభవించును. ఉదా:—వండు+చు+ఉండు+ని = వండు+చు+ఉన్న+ది = వండుచున్నది. ఇది సమాపకక్రియా ప్రక్రియ. వండుచున్న+అది = వండుచున్నది. ఇది విధేయవిశేషణరూపప్రక్రియ. ఇట్లె వండుచున్నవారు = వండుచున్నారు - మొదలగురూపములను సాధించుకొనునది. వర్తమానభవిష్యదర్థకములగు సమాపకక్రియలు ౨౬౪-౨౭౧-౨౭౧ I విషయములలో సాధింపఁబడిన విధేయవిశేషణరూపములవలెనె యుండును. అట్టివానినె సమాపకక్రియలుగఁ బ్రక్రియాంతరమున సాధించికొనవలయుననితలంచినవాఁడగుచు భట్టారకుఁడు సమాపకక్రియావిభక్తి ప్రత్యయములను గా వ్యతిరేకార్థే ల్యుటి లటి డుజ్ స్యాదిత్యాది రీతి (౨౯౬ I విష.) నుపదేశించినవాఁడయ్యెను. (౨౯౯ విష.) (చిం. వి. పరి. ౧౧౩ విష.) పయింగద్గతి భట్టారకసమ్మతమనుటకు విధేయవిశేషణరూపసాధనవిషయమున, "ధర్మోత్తమమధ్యమవత్-బహుషు న మధ్యవత్" అని యాతఁ డుపదేశించుట యొకనిదర్శన మనఁదగును. ఉండు ధాతుభూతార్థక విశేషణమగు 'ఉండిన'అనుదాని రూపాంతరమె 'ఉన్న' అనునది యనుట నిజమెయైనను (చూ. ౩౧౫వి) (ఉండినన్=ఉన్నన్.) 'ఉండిన' అనురూపము భూతార్థకముగను 'ఉన్న' అనురూపము వర్తమానార్థకముగను బ్రయోగములందు—నన్నయప్రయోగములందుఁ - గన్నట్టుచున్నది. ఉ.........అ। వ్వాయుజ సవ్యసాచుల నవార్యబలోన్నతిఁ బోలుచున్న మా। ద్రేయులు......(ఆది. ౮ ఆ. ౪౭.) ఆ-వె. నేఁడు పుణ్యదినము నెఱ్ఱితో రోహిణీ। యుక్తుఁడయి శశాంకుఁ డున్నవాఁడు. (ఆది. ౭ ఆ. ౨౮౨) చ. అలఘులు కృష్ణపార్థులు మహాత్ములు యాదవ కౌరవాన్వయం। బులు వెలిగించుచున్న నృపపూజ్యులు వీరల......(ఆది. ౮ ఆ. ౨౮౭.) ఉ అధృతరాష్ట్రు చేసిన యనర్ఘమణిప్రకరానుకార్థశో। భాధృతి నొప్పుచున్న సభ.........చూచి.........(సభా. ౨ ఆ ౧౬౨.) చ.........ఇప్డు గతగర్వమునన్ మగధేశ్వరుండు ని। శ్చయమతి నున్నవాఁడు.........(సభా. ౧ ఆ. ౧౬౧.) తే-గీ. అయ్య యేము నీ పితరుల మధికనిష్ఠ। బ్రహ్మచారివై నీవు తపంబు సేయు। చున్నవాఁడవు.........(ఆర. ౨ ఆ. ౩౨౫.) సీ. తపనతేజుండైన కపిలుకోపంబున గతజీవులై పుణ్యగతులయందు। నిహతులై మత్పితామహులు లున్నవారు......(ఆర. ౩ ఆ. ౮౦.) 'ఉన్నవాఁడు - ఉన్నవారు' అనురీతినె నన్నయ ప్రయోగించునుగాని 'ఉన్నాఁడు - ఉన్నారు' అనురీతిని వకారలోపము నెన్నఁడును బ్రయోగింపఁడు. ఏధాతుపయిననను వర్తమానార్థక 'చు' వర్ణాంతమగుచు 'ఉన్నవాఁడు - ఉన్నవారు' మున్నగురూపముల చేరికవలన వర్తమానార్థక క్రియగా నేర్పడుచుండును.

భట్టారకుఁడు సూత్రింపలేదుగాని యేధాతువైనను 'అన్' అనుదానితోఁ గూడినపిదప 'ఉన్న - ఉన్నవాఁడు - ఉన్నవారు' మున్నగువాని చేరికవలన (పోవు ధాతువు చేరికవలనను భావ్యర్థము వచ్చును. నేఁ జెప్పఁబోవుదానిని ముందే గ్రహించితివి) భావ్యర్థక క్రియగా నేర్పడును. ఉదా:—చ......రాజసూయ ము। న్నతి నొనరింపనున్న యమనందను యత్నమెఱింగి. (సభా. ౧ ఆ. ౨౪౩.) సీ......। మన చేత జితులైన మనుజేశులెల్లను......ఆజి, వేచి ప్రాణములను విడువనున్న। వారు. (ఆర. ౧ ఆ. ౨౬౯.) వ్యస్తతయందును నిట్టి ప్రయోగములు గలవు. తరలము।......। తివిరి యాతఁడు మత్ప్రియంబున దేవకార్యము దీర్పఁగా। సవినయస్థితి నున్నవాఁడు......(ఆర. ౧ ఆ. ౩౭౪.) తరలము......భవత్కృతదారుణంబను వహ్ని నార్పఁగ నున్న య। క్కడిఁది వీరులు వీరలిద్దఱు......(సభా. ౧ ఆ. ౧౯౩.) ఇట్టి 'ఉన్న' శబ్దమునకు సరియగురూపమే 'కల' యను కలుగు ధాతుజన్యరూపము. 'కలవాఁడు-కలవారు' మున్నగునవి 'అ'న్నంతమగు నేధాతువుమీఁదనిల్చినను నది భావ్యర్థ క్రియఁగా నేర్పడును. (౩౦౧ విష. ౩౪౪ విష. ౨౧౦ VIII విష. చూడు.) ఉదా:—వ. అందులకుం బోవుద మనినం గొడుకులెల్ల వల్లె యని మీాపంచిన విధంబ చేయంగలవారమని యొడంబడి.........(ఆది. ౭ ఆ. ౩౨ వచ.) తే-గీ. అనఘ మామాయ శకుని నాకై కడంగి। జూద మాడెడి నీతోడఁ గాదు నాక। యాతఁడొడ్డిన ధనరాశు లెవ్వియైనఁ। బోఁడిగా నీకు నీఁగలవాఁడ నేను. (సభా. ౨ ఆ. ౧౭౪.) క......మనుజులఁ। గావంగలవార మేము గౌరవయుక్తిన్. (ఆర. ౩ ఆ. ౩౬౪.) నన్నయప్రయోగము లిట్లే యుండును వకారలోప ముండదు. 'కావఁగలాఁడు' అనురీతి రూపమును నన్నయ ప్రయోగింపఁడు. అట్టివి సోమయాజి ప్రయోగించెను. ఉ. ఎవ్వరు సూచినం జగము లిన్నియు గెల్వఁగలారు లావునన్. (భీష్మ. ౨ ఆ. ౧౧.) క. క్రేపులు దోరా దుర్గతి। ప్రాపింపఁగలార.........(అను. ౩ ఆ. ౭౦.) ఎఱ్ఱాప్రెగడ 'కలఁడు - కలరు' అను తచ్ఛబ్ద వాకారలోపముగల (౨౧౦ VIII) వానిని సైతము భావ్యర్థకరూపములలోఁ బ్రయోగించెను. క. జపనియమస్వాధ్యాయ। ప్రపంచములు విడువఁగలరు బ్రాహ్మణులు జనా। ధిప శూద్రులు విపుల తపః। కుపితులు గాఁగలరు వినవె కలికాలమునన్. (ఆర. ౪ ఆ. ౨౪౯.) ఆ-వె... ......సం। కరము సేయఁగలరు కలియుగమున. (ఆర. ౪ ఆ. ౨౬౬.) క...... ధరణీ। సురులు గడఁగి వాణిజ్యము। గరిసనమును జేయఁగలరు కలికాలమునన్. (ఆర. ౪ ఆ. ౨౯౩.)

నన్నయ తిక్కనల భారత భాగములలో నిట్టి భావ్యర్థకరూపములు కన్పట్ట లేదు గాని కలఁడు - కలరు - కలదు - కలవు మున్నగు ప్రత్యేకరూపము లస్త్యర్థక

ములం చూపట్టుచున్నవి. చ. ఉఱఁడు సురేంద్రుఁడైన బలియుండు హిడింబుఁడు వాని ఘాతికిన్ । వెఱవని వారలుం గలరె. (ఆది. ౬ ఆ. ౧౯౫.). క......... అనిష్టుఁడగు తనూజుఁడు గలఁడే. (ఆది. ౬ ఆ. ౨౭౭.) చ. బలయుతు లిట్టి వారలకు భృత్యుల కెందు నసాధ్య మెద్దియుం । గలదె చరాచరాఖిలజగంబులఁ బెద్దల కారె సద్ద్విజుల్. (ఆది. ౭ ఆ. ౧౮౪.) క.........శరణాగతుఁ జూపఁగ నొడఁబడుదు । ర్మతి కిహమ్ముం బరము గలదె మునిఁ బరికింపన్. (ఆది. ౬ ఆ. ౨౭౪.) సీ...... భోగముల్............కలవు నీ కనుభవింప. (సభా. ౨. ఆ. ౧౦౨.) ఇట్టివి భావ్యర్థకములలో ననుబంధముగా నిల్వనేరవు. భావ్యర్థకములలో ననుబంధముగా నిల్చునది ప్రాప్త్యర్థకము కలుగుధాతువు. సామర్థ్యార్థకములలో నిట్టి యస్త్యర్థక కలుగుధాతు రూపములు నన్నయప్రయోగములందే కన్పట్టుచున్నవి. క. అహితులు మద్బాహుఁగదా । నిహతికి మార్కొనఁగఁ బోర నిలువం గలరే. (అర. ౧ ఆ. ౨౫౪.) క............కార్ముకవిద్యం । దనరినవాఁడయ్యు దీనికి । మొనసెంగా కన్యఁ డిట్లు మొనయంగలఁడే. (ఆది. ౭ ఆ. ౧౮౧.) మధ్యార్థము. నడుమఁ బ్రజ్ఞన్యఁ డనుగ్రహింపని నాఁ డేమిసేయుఁ । గడఁగి చేయంగలదానిఁ జేయునుగాక కర్షకుఁడు. (అర. ౧ ఆ. ౨౩౫.) కలుగు ధాతువునకుఁ బైరీతి నస్త్యర్థకత్వమున నకర్మకత్వమును బ్రాప్త్యర్థమున సకర్మకత్వమును నన్నయ భారతభాగమునను గలవు. కలఁడు = కలవాఁడు. తే-గీ. ఎఱుక గలఁడేని మఱి శక్తుఁడేని... (ఆది. ౭ ఆ. ౧౪౬.) ఎ-గీ.........ఎఱుక గలరె మగువ లెందు. (ఆది. ౨ ఆ. ౩౪.) క......ఎఱుక గలరె తరుణులు ధరణిన్. (అర. ౩ ఆ. ౧౨౧ వ.) క......... జ్ఞానము । గలఁడేనిన్ బాలుఁడయినఁ గడువృద్ధు మహిన్. (అర. ౩ ఆ. ౨౪౮.) ఇట్లు నన్నయ తచ్ఛబ్ద 'వా'కారలోపము (౨౧౦ VIII విష.) చేయునే కాని దలోప రేఫలోపములను జేయఁడు. అట్టిది నన్నయప్రయుక్తమని విశ్వసింపఁదగిన ప్రయోగమును లభింపలేదు. ఆ-వె. బలిముఖుండ దయయుఁ గలవేని.........నీవు । రూపుఁ జూడవలతు. (అర. ౩ ఆ. ౩౩౩.) ఇట 'దయయుఁ గలదేని' అనునది నన్నయప్రయుక్తపాఠము కానోపును. ఆ-వె. చనునె నీకు నిట్టి సాహసక్రియఁ జేయ । నెల్లవారికంటె నెఱుక గలవు. (అర. ౩ ఆ. ౩౭౭.) ఇందును 'ఎఱుకగలదు' అనునదె నన్నయప్రయుక్త పాఠ మనఁదగును. ఇట్లె "అంత యెఱుక లేనె." (అర. ౧ ఆ. ౨౩౧) (లేనె = లేనిదాననె.) అనునెడలను 'యెఱుక లేదె' అనియె నన్నయప్రయుక్తపాఠ మనఁదగును. ఇట్లె నన్నయ డకార రేఫలోపముగలవానినె కాక వకారలోపము గలవానిని సైతము వాడఁడు. 'ఉన్నాను - ఉన్నాము - ఉన్నావు -

ఉన్నారు-ఉన్నాఁడు - ఉన్నారు' అనురూపములను నన్నయ ప్రయోగింపఁడు. నన్నయ భారతమున నస్త్యర్థకములగు 'కలఁడు - కలరు - అదికలదు - అవికలవు' అను రూపములు గన్పట్టునేకాని "కలను-కలము-కలవు' అనురూపములును గానిపింపవు. నన్నయ యస్త్యర్థక ప్రాప్త్యర్థక కలుగు ధాతురూపములగు 'కలఁడు - కలరు' అను వానిని బ్రయోగించువాఁడయినను గలుగు ధాత్వనుబంధముగల భవిష్యద్రూపములలో నట్టి 'కలఁడు - కలరు' అనువాని నైతమ మాతఁడు ప్రయోగింపఁడు గాన 'ఘటింపఁగలఁడు - ఘటింపఁగలరు' అనునవి సయితము నన్నయ సమ్మతములు కానేరవు. "ఘటింపుచున్నాను - చేయుచున్నాను - ఘటింపఁగలను - చేయఁగలను." (అహో. ౪౮౦ పు.) "ఘటింపఁగలఁడు - చేయఁగలఁడు - ఘటింపుచున్నాఁడు." (అహో. ౪౭౬.) మున్నగురూపములు చింతామణి సమ్మతములు కానేరవని యెఱుంగనగును. అట్లయినను నట్టివి నేఁ డసాధువు లనరాదు. అర్వాచీన మహాకవు లట్టివానిని నైతము ప్రయోగించియున్నారు. ప్రాచీనాంధ్రమహాకవులు ప్రాప్త్యర్థక కలుగు ధాగురూపములనే భావ్యర్థరూపములలో ననుబంధములుగాఁ బ్రయోగించిరి ప్రాప్త్యర్థకములగు "కలఁడు - కలరు" అనునవి "కలవాఁడు - కలవారు" అనువాని సంక్షేపరూపములయినను "కలను - కలము - కలవు" అనునవి ప్రాప్త్యర్థకములైన "కలవాఁడను - కలవారము - కలవాఁడవు" అనువాని సంక్షేపరూపములు కావనియు నవియు "కలఁడు - కలరు" మున్నగునవియు నస్త్యర్థక కలుగు ధాతువునుండి యేర్పడిన ప్రత్యేకరూపములె యనియు గ్రహింపవలయును.

"వసతి రనుబన్ధకః స్యా"త్తనుచోటి "వసతిః" అనుదానికి 'ఉండు' ధాతువని యర్థమె కాని 'ఉన్న' అనునది యర్థముకాదు. అట్లె 'అస్తిరనుబన్ధకః స్యా'త్తనుచోటి 'అస్తిః' అనుదానికి "కలుగు" ధాతువని యర్థమెకాని 'కల' అనునది యర్థము కాదు. (విస్తర.) కావున "ఉన్న - కల" అనునవి యర్థమనుచుఁ దప్పుగఁ బ్రక్రియను జూపిన యహోబలవ్యాఖ్యను బట్టి చింతామణి నవ్యమనెడి నేఁటి విమర్శకుల వాదము సరి కాదు.

సంస్కృతవ్యాకరణమునందుఁ గ్రియార్థములను గ్రియావిభక్తులను నిరూపించుటలో పదివిధముల లకారములు "లట్ - లిట్ - లుట్ - ల్రుట్ - లేట్ -

---

విస్తర. II ౨౯౬ విషః—"ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే (వా. ౨.౨.౨౬.) పచిః - పచతిః." (సి. కౌ. ఉత్త. కృత్. 3౨౮౫ సూత్రమునొద్ద.). "ధాతుస్వరూపే నిర్దేష్టవ్యే 'ఇక్ - శ్తిపౌ' వక్తవ్యా విత్యర్థః - ధాతుస్వరూప మేవ వాచ్యమితి ఫలితమ్." (వయివార్తికపు. బాలను.)

లోట్ - లఙ్ - లిఙ్-లుఙ్ - ల్ఱఙ్' ఏషు పఞ్చమో లకార శ్ఛన్దో మాత్రగోచరః."
(లఘుకౌముది. ౪౦౪ సూ.) అనునవి యుపదేశింపఁబడెను. వానిలోని లకారముల
కెల్ల "తిప్ - తస్ - ఝి, సిప్ - థస్ - థ, మిప్ - వస్ - మస్, (పరస్మైపదధాతు
వులకు.) త - ఆతామ్ - ఝ, థాస్ - ఆథామ్ - ధ్వమ్, ఇట్ - వహి - మహిఙ్."
(ఆత్మనేపదములకు.), (3-౪-౭౮.) (సి. కౌ. ౨౧౫౪ సూ.)" అను క్రియావిభక్తి
ప్రత్యయములు ప్రథమ మధ్యమమోత్తమ పురుషముల యేక ద్వి బహువచన
ములం దాదేశింపఁబడినవి. వాని కాదేశాగమాది కార్యములను విధించుచు నాయా
లకారముల సమాపక క్రియారూపములను సాధించుకొనిరి. వానిలోని మొదటి
'తి' అనునది తుది యుద్వర్ణముగు జకారముతోఁ జేర్పగా 'తిఙ్' అని క్రియావిభక్తి
ప్రత్యయముల ప్రత్యాహార మేర్పడును గాన "తిఙ్" లనఁగా సమాపక క్రియా
ప్రత్యయములని యెఱుంగునది. అట్టి లకారముల కీ క్రిందిరీతి నర్థముల వివరించిరి.
లట్టు వర్తమానార్థకము. "౨౧౫౧ - వర్తమానే లట్ - (3-౨-౧౨౩.)" (సి. కౌ.)
వర్తమాన మనఁగా "ఆపని కారంభింపఁబడి ముగియకున్నది." పఠతి = చదువు
చున్నాఁడు. అట్టి యర్థమందే కాక తెనుఁగునందలి తద్ధర్మాద్యర్థములవంటి స్థలము
లందును గొన్నిట నీ లట్టె సంస్కృతమున నుపయోగింపఁబడుచున్నది. ఉదా:—
విహాగా డయన్తే = పక్షు లెగురును. అగ్ని ర్జ్వలతి = అగ్ని మండును. ఈశో రక్షతి =
దేవుఁడు రక్షించును. మొ. కావుననే వర్తమానశబ్దమునకు "కాలస్యతు వర్తమా
నత్వం అతీతా నాగత భిన్న కాలత్వమ్. భూతభవిష్యతోః ప్రతిద్వన్ద్వీ వర్తమానః
కాల ఇతిభాష్యమ్." (బాలమ.) అని వ్యాఖ్యచేయఁబడెను. "ఆరబ్ధాఽపరి సమాప్తి
ర్వర్తమానః యథా మహాభారతం పఠతి - సోఽపి చతుర్విధః - ప్రవృత్తోపర
తశ్చైవ । వృత్తావిరత ఏవచ । నిత్యప్రవృత్తి స్సామీప్యో । వర్తమాన శ్చతుర్విధః.
మాంసం న ఖాదతి - ఆదౌ ప్రవృత్తం మాంసభోజనం నివర్తయతీత్యర్థః. (మాంస
భోజనమును మానుచున్నాఁడు.) ఇహ కుమారాః క్రీడన్తి - తదానీన్తన క్రీడనా
భావేఽపి పూర్వక్రీడాయా బుద్ధౌ వర్తమానత్వాత్. (ఇట పిల్లలాడుచుందురు.)
పర్వతా స్తిష్ఠన్తి - నిత్యప్రవృత్తత్వాత్. (పర్వతములున్నవి.)......సామీప్యో
ద్వివిధః - భూతసామీప్యో యథా 'కదాఽగతోఽసీతి ప్రశ్నే అధ్వభేదాదే ర్వర్త
మానత్వాత్ ఏషోఽహ మాగచ్ఛామీతి ఆగతోఽపి వదతి - భవిష్యత్సామీప్యో
యథా - కదా గమిష్యసీతి ప్రశ్నే ఏషోఽహం గచ్ఛామీతి గమనాయ క్రియ
మాణోద్యమోఽపి వదతి." (ముగ్ధ. ౯33 సూ. దుర్గాదాసవ్యాఖ్య.) లిట్ - లఙ్ -
లుఙ్లులు భూతార్థకములు - భూతమనఁగా జరగిపోయినది. సంస్కృతవ్యాకరణమున

భూతకాలమం దవాంతరభేదములు వివక్షితము లగుటచేత మూఁడు లకారము లుపదేశింపఁబడినవి. "లుఙ్ (3-౨-౧౨౦.) భూతార్థవృత్తే ర్ధాతో ర్లుఙ్ స్యాత్. (౨౨౯౮ సి. కౌ) అనద్యతనే లఙ్ - (3-౨-౧౧౧.) అనద్యతన భూతార్థవృత్తే ర్ధాతో ర్లఙ్ స్యాత్. (సి. కౌ. ౨౨౦౫.) పరోక్షే లిట్ - (3-౨-౧౧౫.) భూతాన ద్యతన పరోక్షార్థవృత్తే ర్ధాతో ర్లిట్ స్యాత్." (సి. కౌ. ౨౭౭౧ సూ.) "అతీతరాత్రే ర న్త్యయామేన ఆగామిరాత్రే రాద్యయామేన సహితో దివసః అద్యతన ఇతి లుఙ్ సూత్రభాష్యే కైయటే స్థితమ్. పరోక్షత్వంతు వర్షశతవృత్తత్వ మిత్యేకే - వర్ష సహస్రవృత్తత్వ మిత్యపరే. ద్వ్యహావృత్తత్వం త్ర్యహావృత్తత్వం చేత్యన్యే - కుడ్య కటాద్యన్తరితత్వ మితీతరే. ఏతే పక్షా భాష్యే స్థితాః - తత్రప్రయోక్తు రింద్రియా ఽగోచరత్వం పరోక్షత్వ మిత్యేవ సర్వసమ్మత మిత్యలమ్." (బాలమ. ౨౧౭౧ సూ. వ్యాఖ్య.) ఇట్టి భూతకాలములోని యవాంతరభేదములను (నేఁటి భూతము - అనద్యతనభూతము - పరోక్షభూతము) సంస్కృతమహాకవులు పాటింపమిం జేసి ముగ్ధబోధకారాదు లిట్టిభేదముల నుపేక్షించిరి. "అభూన్నృపో విబుధసఖ ఇతిభట్టిః. స్వహస్తదత్తే మునిమాసనే ముని। శ్చిరన్తనస్తావ దభివ్యవీవిశ దితిమాఘః. ఇత్యాదా అనద్యతనేఽపి 'టీ' (లుఙ్. సంజ్ఞ) దర్శ నాత్ (ఇట్టియెడల లఙ్జుండవలయును). ఏవమ్ - అద్యావద ద్దశముఖై ర్దశకన్ధరో ఽసా ఇతి భట్టిః - ఇత్యాదా వద్యతనేపి 'ఘీ' (లఙ్సంజ్ఞ) దర్శనాత్ (ఇట్టియెడల లుఙ్జుండవలయును). ఏవఞ్చ - వ్యాతేనే కిరణావళీ ముదయన। స్సత్తర్కతేజో మయీమ్ - ఇత్యాచార్యః - ఇత్యాదా వపరోక్షేఽపి 'తీ' (లిట్టునకు సంజ్ఞ) దర్శ నాత్. ఏతా న్యనేన (వోపదేవేన) ఉపేక్షితాని - తతశ్చ చిరాతీతే - నికటా తీతేవా, పరోక్షే అపరోక్షేవా 'ఘీ' (లఙ్) టీ (లుఙ్) తః (లిట్) స్యురితి. ఏవ మద్యతన భవ్యే 'డీ' (లుట్) దూరభవ్యే 'తీ' (లృట్) ఇతి సంప్రదాయః" (ముగ్ధ. ౯33 సూ. దుర్గాదాసవ్యాఖ్య) భవిష్యదర్థక మనఁగా ముందు జరుగఁ బోవుదానిని దెల్పునది. లుట్ లృట్టులు భావ్యర్థకములు. భూతార్థమందు వలెనె భవిష్యదర్థమందును నవాంతరభేదములు సంస్కృతవ్యాకరణమున వచింపఁ బడెను. "అనద్యతనే లుట్ (3-3-౧౫) భవిష్య త్యనద్యతనే లుట్ స్యాత్ (సి. కౌ. ౨౧౮౫ సూ.). లృట్ శేషేచ (3-3-౧3) భవిష్యదర్థా ద్ధాతో ర్లృట్ స్యాత్. (సి. కౌ. ౨౧౯3)." వీని యవాంతరభేదముసైతము భూతార్థము నందువలెనె కవిసమ్మతిలేమిం జేసి యుపేక్షణీయమె యనఁదగును. లృఙ్ఙుసైతము భావ్యర్థక మగుటయే కాక క్రియయొక్క యనిష్పత్తి గమ్యమానమగుట మున్నగు

విశేషము లిందుండును. "లిఙ్నిమిత్తే లృఙ్ క్రియాతిపత్తౌ. (3-3-౧3౯) హేతు హేతు మద్భావాది లిఙ్నిమిత్తం తత్ర భవిష్య త్యర్థే లృఙ్‌స్యాత్ క్రియాయా అనిష్పత్తౌ గమ్యమానాయామ్." (సి. కౌ. ౨౨౨౯ సూ.). ఈలృఙ్ఙు సూరిచే క్రియా. ౧౧౯ సూత్రమున నీషద్భేదముగా సంగ్రహింపఁబడెను. ఇంక సంస్కృతములో లిఙ్ లోట్టులు విధ్యాద్యర్థములం దగును. "౨౨౦౮. విధి నిమన్త్ర ణామన్త్ర ణాధీష్ట సంప్రశ్న ప్రార్థనేషు లిఙ్ (3-3-౧౬౧). లోట్ చ. (3-3-౧౬౨). విధ్యాది ష్వర్థేషు ధాతో ర్లోట్ స్యాత్." (సి. కౌ. ౨౧౯౪ సూ.) "ఆశిషి లిఙ్ లోటౌ. (3-3-౧33). (సి. కౌ. ౨౧౯౫ సూ.)" ఇట్టి లకారములలోనివే చింతామణికర్తచేఁ బ్రకృతసూత్రమున "లడర్థః - లృడర్థః" అని వ్యవహరింపఁబడెను. అట్లె ముందును "వ్యతిరేకార్థే లృటి లటి డుఙ్‌స్యాత్" అని వ్యవహరింపఁబడును. సూరియు వీనిలోని 'లట్ - లిట్ - లృట్టులను వ్యవహరించెను (బా. క్రి. ౨-3-౪ సూ.) సూరి వీనిలోని లిఙ్ లోట్టులు రెండిటికి మాఱుగా లూట్టును గల్పించెను. ఇట్లె యర్థవిశేషములందు 'లాట్టు - ఉజీ' అనువానిని గల్పించెను.

చురితి క్రియాపదానా మిత్యాది:—వర్తమానకాలే = వర్తమానార్థమందు, సర్వేషాం క్రియాపదానామ్ = ఎల్లవిధములగు క్రియలకును చురితి స్యాత్ = 'చు' అనునది నిల్చును. ఇది యనుబంధమునకుః బూర్వమున నిల్చును. ఉదా:—వచ్చు+చు+ఉండు+వా+ఁడు=వచ్చుచున్నవాఁడు. వచ్చు+చు+ఉన్న = వచ్చుచున్న. వచ్చు+చున్ = వచ్చుచున్ బలికెను. (౬౬ I విష.) సర్వేషామనుటచే వర్తమానార్థక సమాపక క్రియలందును, వర్తమానార్థక విశేషణములందును శత్రర్థకమగు లాక్షణికావ్యయరూపమునందును 'చు' అనునది నిల్చునని యెఱుంగనగును. అందు శత్రర్థకము పదమగునుగాన 'కళాత్వము' లేమింజేసి ద్రుతప్రకృతిక మగును. వర్తమానార్థక విశేషణమునైతము "వచ్చుచున్నన్" అనురీతిని జింతామణిపక్షమున ద్రుతప్రకృతికమె యగును.

అత్త్వాదీత్యాది:—అత్త్వాది="వ్యతిరేకాదా భావిని చాత్-స్యాత్" అను చింతామణికారిక మొదలుకొన్న క్రియాపరిచ్ఛేదకారికలలోఁ జెప్పఁబడిన 'అత్' మున్నగు కార్యములు, తత్సమానామివ = తత్సమధాతువులకువలెనె, దేశ్యానాం క్రియాపదానాంచ = దేశ్యధాతువులకును నగును. కావున నింక గ్రియాపరిచ్ఛేద సూత్రము లాచ్ఛికధాతువులచోటను నుదాహరింపఁబడును. చింతామణికర్త తన చింతామణిలో మొదటి నాల్గుపరిచ్ఛేదములందును దత్సమాచ్ఛికమిశ్రితముగా

వ్యాకరణకార్యములను వచించి క్రియాపరిచ్ఛేదమునందుమాత్రము కేవల తత్సమ ధాతువులకుఁగల్గు వ్యాకరణకార్యములనుమాత్ర ముపదేశించుట ప్రధానముగా నిరూపించి యవి యథాసంభవముగా దేశ్యక్రియలకును గల్గునని యీసూత్రమున వచించెను. చింతామణి తత్సమరూపసాధనము ప్రధానముగాఁజేసికొని యుప దేశించుననుట కీయొక్కనిదర్శనమె చాలును. (ఆం. భా. చ. ౧౬౭౭-౧౬౭౮ పుటలవిషయము దీనిచే నిరస్తము.). ఇట్లు తత్సమక్రియారూపసాధన ప్రధానముగు నిందు నన్నయభారత భాగప్రయుక్త తత్సమక్రియారూపములుమాత్రమె సాధింపఁబడినవి. కావుననె "రక్షించెడి (రాముఁడు) రక్షించెడు (రాముఁడు) రక్షిం చెడున్ = రక్షించుతన్" అను జాతిగల తత్సమరూపములు నన్నయభాగమునఁ బ్రయుక్తములు కానివి చింతామణిలో సాధింపఁబడలేదు. నన్నయభారతభాగమున నరుదుగ బ్రయుక్తములగు రక్షింపమి - అపేక్షించుడున్ - రక్షించెడునున్ - రక్షిం తము - రక్షింపకుము - రక్షింపక మున్నగునవిసయితము చింతామణిలో సాధింపఁ బడలేదు. అట్టివానిని సాధించుటకయి యీక్రింద వివరింపఁబడు "పునరాగమ" సూత్ర ముపదేశింపఁబడెను. చింతామణి నన్నయభారతభాగముల కిట్టి యాంతరంగిక సంబంధము పెక్కుచోట్లఁ గలదు. (౭౧ విష.) ఇవి వీని యేకకర్తృకత్వమునకుఁ బ్రబలనిదర్శనములు.

వ్యతిరేకాదావిత్యాది:—వ్యతిరేకాదౌ = వ్యతిరేకాద్యర్థక క్రియారూప ములందును నాదిశబ్దముచేఁ దుమర్థభావలక్షణాద్యర్థములందును, భావినిచ = భవిష్య దర్థకరూపములందును ధాతువు తుదిని, అత్ స్యాత్ = 'అ' వర్ణము నిల్చును. ఉదా:—చేయు+అ+ఁడు = చేయుఁడు. చేయు+అ+కల్గు+వాఁడు = (పునరాగమః క్రియాణా మితిసూత్రముచే 'అత్వము'నకుఁ దర్వాత నకారాగమము చేరఁగా) చేయఁగలవాఁడు. 'భావినిచ' అనుచోటి చ శబ్దముచే సామర్థ్యార్థమునందును 'అత్' అనునది నిల్చును. కలుగు ధాత్వనుబంధమును నుపలక్షణత్వమునఁ గల్గును. చేయఁగలఁడు - నిలువంగలరే (ఆర. ౧ ఆ. ౨౫౮). మొనయంగలఁడే (ఆది. ౭ ఆ. ౧౮౧). చేయంగలదానిని జేయును. (ఆర. ౧ ఆ. ౨౩౫). అహోబలపండి తుఁడు పైస్థలములందుఁ బైరీతిని "పునరాగమ" సూత్రముచే నకారమును సాధిం పక "అన్యేద్రుత ప్రకృతయ" ఇత్యాదిసూత్రముచే సంపాదించుట పొరపాటు. "పోషింపఁగలఁడు ఇత్యాది. భావ్యర్థే ఏతాదృశస్థలేషు సర్వత్ర అకళాత్వా ద్ద్రుత ప్రకృతికకార్యమ్." (అహో. ౮౭౩ పు.). విభక్త్యంతముకానిదే పదము కానేరదు. పదములకే కళాద్రుతప్రకృతికత్వ వివక్ష కావునఁ బ్రక్రియామధ్యమున నకళాత్వ

ములకు ద్రుతప్రకృతికత్వము కల్గనేరదు. పరుషా ద్రుత ప్రకృతికా దిత్యాది సూత్రములోని ద్రుతప్రకృతికశబ్దము ద్రుతాంతములకును నుపలక్షణముగాన సరళాదేశాది ద్రుతకార్యములు గల్గును. వ్యతిరేకార్థకరూపములనుటచేత వ్యతిరేకార్థక సమాపక క్రియలందును, వ్యతిరేకార్థకములగు నసమాపక క్రియలయందును ధాతువు తుదిని 'అ' కారము నిల్చును. అక్లే యచటి యాదిశబ్దముచేత "కర్మార్థక తుమున్నాద్యర్థకాదులందును నీయత్వము కల్గును. ఉదా:—చేయమి (చేయకుండుట.) చేయనిది - చేయక, మొ. చేయఁబడెన్ - చేయన్, మొ. తు మున్నాద్యర్థకాది స్థలమందుమాత్ర మయ్యది పదముగును గాన "అన్యే ద్రుతప్రకృతయ ఇత్యాదిచే ద్రుతప్రకృతిక మగును. 'చేయఁబడెన్' మున్నగుచోట్లఁ బునరాగమ సూత్రముచే నకారాగమము వచ్చును.

క్త్వా భూతయో రిత్యాది:—క్త్వా=క్త్వార్థమందును, భూతయోః = భూతార్థక రూపములందును, క్రియా న్తస్య = ధాతువుతుదిని, ఇత్ = ఇవర్ణము నిల్చును. ఉదా:—వందు+ఇ = వండి - క్త్వార్థకము. లిఙ్మధ్యశాస్త్రముచే నిది తెలియగుచున్నది. వందు+ఇ+తి+వి = వండితివి. భూతార్థసామాన్యమున కిత్వము విధించుటచే వండినది - వండినన్ మున్నగుస్థలములందును 'ఇ'త్వ మగును.

దుతివర్ణ కా విత్యాది:—దుతివర్ణకౌ = 'దు - తి' అనునవి తద్ధర్మభూతార్థములందు, ('డాచోర్లుక్ తద్ధర్మే- ప్రథమైక స్యై ద్భవేచ్చ భూతార్థే' అను పూర్వసూత్రములనుండి యవి వరుసగా ననువర్తించును.) క్రమాత్ =వరుసగా నాగమము లగును. తద్ధర్మార్థమందు 'దు' వర్ణకమును భూతార్థమందు 'తి' వర్ణకమును నగునని యర్థము. ఆద్యస్య = తద్ధర్మార్థకముయొక్క, ఆదౌ = ప్రథమపురుషైకవచనము పరముగుచుండఁగా, న = దువర్ణకము నిలువదు. భూతార్థే = భూతార్థమందు, ద్వయోశ్చ= ప్రథమపురుషైకవచన బహువచనములు రెండును బరముగుచుండఁగా, న=తివర్ణకము నిలువదు. ఉదా:—చదువున్ - చదువుదురు, చదువుదువు - చదువుదురు, చదువుదునున్ - చదువుదుము, చదివెన్ - చదివిరి, చదివితివి - చదివితిరి, చదివితినిన్ - చదివితిమి. మొ.

పునరాగమేత్యాది:—క్రియాణామ్ = క్రియలకు, పునరాగమః = విశేషాగమమును బ్రయోగానుసారముగా నగును. సఙ్కేతః = శబ్దార్థసిద్ధి, మన్మతే = నామతమందు, పర్యాప్తః = కవిప్రయోగప్రసిద్ధి చొప్పుననె సమ్మతమగును. చింతామణికర్త క్రియాపరిచ్ఛేదమునఁ దాను భారతమున నరుదుగఁ బ్రయోగించిన కొన్ని తత్సమక్రియారూపములను సాధింపలేదు. అట్టివానిని దీని చొప్పునఁ బ్రయో

గానుసారముగవర్ణవిశేషాగమాదేశాదులనుజేసి సాధించుకొనవలెనని తాత్పర్యము. 'చదువుదును' మున్నగుచోటులందలి 'దు' వర్ణముపైని దీనిచేఁ బూర్వమున 'ఎ' త్వము పరమున 'అ'త్వమును నాగమములుగాఁ జేసి 'ఎ+దు+అ = ఎద' అను దానిని సంపాదించి 'రక్షించెదనున్' మున్నగురూపములను సాధించుకొనవలెను. ఇట్లె యీ సూత్రముచే రక్షింతము - రక్షింపకుము - రక్షింపమి - రక్షించుడున్ - రక్షింపక - రక్షించు (విశేషణము) మున్నగు తత్సమక్రియారూపములను నట్టి యాచ్ఛిక క్రియారూపములను సాధించుకొనవలెను. చదివెదనున్ - చదివెదము - చదివెదవు- చదివెదరు - చదువున్ - చదివెదరు. (చిం. వి. పరి. ౧౧౧ విష). ఇట్టి 'ఎ'త్వమును "భావిక్రియాసు యస్య స్యా । దేత్వమేవ ప్రయోగతః" (౫3 విష. ౨౯౬ I విష.) అను కారికచే నథర్వణుఁ డనువదించెను. రక్షింపక - (3౦౦ విష.) రక్షింపమి (3౦౦ విష) రక్షింపకుము (౧౦౯-3౦2 విష.) రక్షింతము (3౦౬ విష.)" అను జాతిరూపములను జింతామణి పక్షమున నీ ప్రైనరాగమ సూత్రముచేతనే సంగ్రహింపనగును గాని యట్టి రూపముల నథర్వణుఁడు సాధించియుండుటచేత వానిని విడిచి తక్కిన నన్నయాథర్వణసూత్ర సాధ్యములు కాని రూపములనే యీసూత్రముచేత సంగ్రహించికొననగును. కలుగు పడు ధాత్వనుబంధములు పరమగునపుడు పూర్వస్థిత ధాతువుదీర్ఘాది వ్యతిరేకాదా విత్యాది సూత్రసిద్ధమగు 'అ' త్త్వము పదాంతము కామింజేరి త్వార్థకశాస్త్రసిద్ధ ద్రుతము కల్గనేరదు. కాన నచట ద్రుతాగమ మీ సూత్రముచేతనే సంభవింపవలయును. ఉదా:—రక్షింప బడెన్-రక్షింపఁగలఁడు. మొ. కలుగు ధాతువునకు "త్రర్థ శత్రర్థములందు 'ఆ' త్త్వమును 'గు'లోపమును నీసూత్రముచేతనే కల్గవలెను. ఈసూత్రము సంస్కృత సమపరమె యనఁదగియున్నను 'అత్త్వాదితత్సమానా' మిత్యాది సూత్రముచొప్పున దీనిని దేశ్యక్రియల విషయమునందును నుపయోగించుట విరుద్ధముకాదు. కేవల దేశ్యక్రియల విషయమున ననుక్తములగు వర్ణాగమాదులు "వర్ణాగమోవిశేషః........." మున్నగు సూత్రములచే సంపాదింపఁదగును. ఎడ్యేడు ప్రత్యయాంతములగు తద్ధర్మార్థక విశేషణముల నథర్వణుఁడు వచించినను (3౦౬ విష) 'రక్షించు' మున్నగురీతిగల 'ఉ' ప్రత్యయాంత విశేషణములను సాధింపలేదు. కాన నట్టి 'ఉ' ప్రత్యయమును ప్రకృతసూత్రముచేతనే సంగ్రహింపనగును. ఇట్లె 'చేయుడు = చేయుట' అను రీతిగల భావార్థక డుప్రత్యయమును దీనిచేతనే సంపాదింపనగును. క. కానలఁ బరిభ్రమించెద........(అర ౨ ఆ. ౯౯౫) క.........మనుజులఁ । గావంగల వారం మేము కావఁయుక్తిన్. (అర. 3 ఆ. 3౮౮.) తే గీ. వారు లట్లు నివర్తింపఁ

బడిరి. (ఆర. ౧ ఆ. ౯.) ఉ. ధాత్రిఁ బరిభ్రమించు బలదర్ప పరాక్రమ దక్షుఁడు... ......(ఆది. ౧ ఆ. ౧౦౮.) క............రక్షించు పురుషకారాన్వితులే. (ఆది. ౧ ఆ ౧౩౭.) క. పదరత్ని ధనుర్ధరుఁ డై। యెయ్యెడ నజితుఁడుగాన వాని హీనుంగాఁ జే। యుడు నాకుఁ జతుర్వర్గము........(ఆది. ౭ ఆ. ౧౬). మొ.

ప్రథమైకవచనలోప స్తద్ధర్మాతీతయోః క్రియాణాం
స్యాత్ (ఆం. చిం. క్రి. ౬ కా. అహో. ౪౭౬).
తద్ధర్మ ప్రథమే స్యాతాం। డు డి వర్ణౌచ నాన్తకౌ।
(వికృ. క్రియా. ౯ కారి. అహో. ౪౮౭ పు).
ప్రథమైక స్యై ద్భవేచ్ఛ భూతార్థే (ఆం. చిం.
క్రియా. ౧౦ కారి. అహో. ౪౮౨ పుట).
డు డ్యాదివర్ణే భూతార్థే। చాపి త స్యై ద్భవే త్సదా
(వికృ. సంజ్ఞా. ౨౩ కారి. అహో. ౧౫౧ పు). (తద్వ
ద్భవే త్సదా. అహో. ౪౮౭ పు).

వన్నయా. — ౨౯౬ I విషయము.

వ్యతిరేకార్థే లృటి లటి డుజ్ స్యాత్। త్ర్యర్థే పున ర్ద్దీ భవతః (ఆం. చిం. క్రియా. ౭ కా. అహో. ౪౭౬).
తిర్యగ్జడేషు కర్తృషు। బహువచనం చైకవచన మేవ స్యాత్। భూతే తద్ధర్మేచ (ఆం. చిం. క్రియా. ౮ కారి. అహో. ౪౭౮ పు).
య ద్యన్యసమాయోగః స్యా। ద్రూప మేవం నవిద్యతే
(వికృ. క్రియా. ౬. కారి. అహో. ౪౭౮ పు).
అన్యత్ర పుంవీ స్త్రీవ దేకవచనంతు (ఆం. చిం. క్రియా.
౮ కారి. అహో. ౪౭౯ పు).
దుదీ తిర్యగ్జడస్త్రీషు। తే వ్యర్థ ప్యేకతాం గతౌ। (వికృ.
క్రియా. ౫ కారి. అహో. ౪౭౭ పుట).

ప్రథమైకేత్యాది:—తద్ధర్మాతీతయోః = తద్ధర్మమందును, భూతార్థమందును, క్రియాణామ్ = క్రియలకు, ప్రథమైకవచనలోపః = ప్రథమపురుషైకవచన ప్రత్యయమునకు లోపము, స్యాత్ = అగును. సంస్కృత ప్రథమపురుషైకవచన 'తిప్' ప్రత్యయమునె నిల్పి దానికి లోపమును జేయవలెను. "ప్రథమైక స్యై ద్భవేచ్ఛ భూతార్థే" అనుచోప్పున 'ఏత్వము' భూతార్థమునందు వచ్చును. "అన్యే ద్రుతప్రకృతయః" అనుచోప్పున నీరెండును (తద్ధర్మ-భూత-క్రియలు) ద్రుతప్రకృతి

కము లగును ఉదా:—వచ్చు+ఎ+తిప్ = వచ్చు+ఎ+న్ = వచ్చెన్. ఇది భూతార్థకము. వచ్చు+తిప్ = వచ్చు+న్ = వచ్చున్. మొ.

తద్ధర్థేత్యాది:—తద్ధర్థప్రథమే = తద్ధర్థాద్యర్థక ప్రథమపురుషైకవచనమునందు, నాన్తకౌ - డు - డి - వర్ణౌచ = ద్రుతాంతములగు - డు - డి - వర్ణనములు వైకల్పికముగా, స్యాతామ్ = అగుచున్నవి. ఇందు 'నాన్తకౌ' అనునది "అన్యే ద్రుతప్రకృతయః" అను సూత్రముచే సిద్ధించు ద్రుతప్రకృతికత్వమున కనువాదమగుచున్నది. ప్రథమపురుషైకవచనములు 'డుజ్' వర్ణకాంతములై కళలగుట సహజమగుటచేత నిట నట్లు కాదని తెల్పుటకై యిట్లనువదింపఁబడెను.

ప్రథమైకస్యేత్యాది:—భూతార్థే = భూతార్థమందు ప్రథమైకస్య = ప్రథమపురుషైకవచనాంతమునకుఁ దదిని 'ఏత్ - భవేత్ = హ్రస్వమగు 'ఎ'కారము'నల్చును (సంస్కృతమున హ్రస్వవక్రము లేమింజేసి 'ఏత్' అని పదచ్ఛేదము చేయవలెను). 'క్త్వా భూతయోః క్రియాన్తస్యేత్' అనుచోప్పున భూతార్థక ప్రథమపురుషైకవచనమున 'ఇత్త్వము' గాదనియు 'ఎత్వము' వచ్చుననియు నెఱుంగునది. (చూ. 3౨౦ విమ). అథర్వణుఁడు సవరించుచున్నాఁడు.

డుడ్యాదీత్యాది:—భూతార్థే = భూతార్థమందును, (ప్రథమైక స్యేద్భవేత్తను నన్వయసూత్రమున కనువాదము) డు డ్యాదివర్ణేఽపిచ = తద్ధర్థాద్యర్థకములగు 'డు - డి' మున్నగునవి పరమగు స్థలములందును, తస్య = అట్టిక్రియకు సదా = నిత్యముగా, ఏత్ - భవేత్ = ఎత్వమగును. తద్వ ద్భవేత్తను పాఠము పక్షమునను నిదె యర్థము. 'డు - డ్యాది' అనుచోటి యాదిశబ్దముచేత "పునరాగమః క్రియాణామ్" అను సూత్రముచొప్పున లభించు 'వచ్చెదను' మున్నగు రూపములందలి "ఎత్వమును" ననువదింపఁబడుచున్నది. ఉదా:—వచ్చు+ఎ+తిప్= వచ్చు+ఎ+డున్ = వచ్చెడున్ - వచ్చు+ఎ+డిన్ = వచ్చెడిన్. వచ్చెడువాఁడు - వచ్చెడివాఁడు - వచ్చెదనున్ - మొ. డోస్తు భేదకతాపి స్యాత్తనుచొప్పున ధాతుజ విశేషణరూపములందును, డు - డి వర్ణకములగును (చూ. 3౧౬ I విమ).

'వచ్చెన్' మున్నగువాని ప్రక్రియ నడుపునపుడు 'క్త్వా భూతయోః క్రియాన్తస్యే' త్తను చొప్పున 'ఇత్త్వము' చేసి పరరూపసంధి నహోబలపతి వర్తిల్లఁజేసెను. "డు డ్యాదివర్ణే భూతార్థే । చాపి తస్యైద్భవే త్సదా ఇతి ఎత్వమ్... అచో ఽచి కుత్ర చిల్లోపో । బహ్వాశం స్యాత్ ప్రయోగతః. ఇతి ఇకారలోపః - చనెన్ - ఇత్యాది." (అహో. ౧౫౧ పు.) ఈవిషయములు ప్రామాదికములు. (చూ. 3౨౦ విమ.)

అహోబలపతి డు - డ్వాదివర్ణ ఇత్యాది సూత్రమును బయిరీతిగఁ బ్రథమైక స్యై ర్ధ్భవే దిత్యాది చింతామణి సూత్రమునకు సవరణముగా సమన్వయింపక "భావి క్రియాసు యస్య స్యా" దిత్యా ద్యథర్వణ కారికకె తరువాయి సూత్రముగా సమన్వయించెను. "తద్ధర్మ ప్రథమే స్యాతాం । డు దివర్ణౌచ నాన్తకౌ । డోస్తు భేగకతాపి స్యా । దితి కేషాంచి దీరితమ్ । డు డ్వాదివర్ణే భూతార్థే । చాపి తద్వ ద్భవే త్సదా. ఇతిచోక్తమ్. పోయెడిన్ వచ్చెడున్. నవ్వు రాజిల్లెడు మోమువాఁడు ఇత్యాది. తద్వ ద్భవే దిత్యస్య ఏత్వం భవే దిత్యర్థః. "భావిక్రియాసు యస్య స్యా । దేత్వ మేవ ప్రయోగతః ఇతి పూర్వసూత్రాత్ " (అహో. ౪౮౭ పుట) ఈసమన్వయము సరికాదు. తెనుఁగు పదములలోని యకారముమీఁది స్వరము "ఎత్వమా? అత్వమా?" అను సందేహమునఁ దత్వనిర్ణయమునకై యుపదేశింపఁబడిన (౫౩ విష.) 'అస్యాః క్రియాస్వి'త్యాది సూత్రమును సవరించుటకయి వచింపఁబడిన 'భావిక్రియా స్వి'త్యా ద్యథర్వణకారిక సందర్భమున దాని యను పదముండె డు డి వర్ణకములను విధించు నట్టియు (యకారాంతములకే కాక యెల్లధాతువులకును) నవి పరమగునపుడు 'ఎత్వము'ను విధించునట్టియు సూత్రములను సంజ్ఞాపరిచ్ఛేదమున నథర్వణుఁ డుపదేశించెనుట కేవలము నసంగతము. అవి క్రియాపరిచ్ఛేదమునఁ బ్రథమపురుష ప్రత్యయమును విధించు చింతామణి సూత్రములకు సవరణముగా నుపదేశించుట యెంతయు సుసంగతమై యుండును. పయిరీతి నుదాహరింపఁబడిన 'వచ్చున్ - వచ్చెడున్ - వచ్చెడిన్ - వ న్' మున్నగురూపములెల్ల 'అన్యే ద్రుతప్రకృతకః' ఇత్యాది సూత్రముచే ద్రుతప్ర తికము లయ్యెనని యెన్నునది.

వ్యతిరేకార్థ ఇత్యాదిః—భూత తద్ధర్మ ప్రథమపురుషైకవచన విషయము నుపదేశించి తక్కిన వ్యతిరేకాదు లందలి మహత్కర్తృక ప్రథమపురుషైకవచన విషయము నుపదేశించుచున్నాఁడు. వ్యతిరేకార్థే = వ్యతిరేకార్థమునందును, ల్రుటి = భవిష్యదర్థమునందును, లటి = వర్తమానార్థమునందును, మహత్కర్తృక ప్రథమపురుషైక వచనమున, డుజ్ స్యాత్ = డుజ్ వర్ణకమగును. జిత్తుగాన బిందు పూర్వకమగును (౧౩౦ విష.). స్త్ర్యర్థేపునః = మహతీకర్తృకత్వమునం దన్ననో, దు దీ భవతః = వ్యతిరేకభావ్యర్థములందు 'దు' వర్ణకమును వర్తమానార్థమున 'ది' వర్ణకమును నగును. "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్" అను దానిని బట్టి "వ్యతిరేకార్థే ల్రుటి లటి" అనువాని లోని 'ల్రుటి' అను దానిని "వ్యతిరేకార్థే" అను దానితో జోడించుట యుక్తమగుటచేతఁ బయిరీతిని వ్యాఖ్య చేయఁ బడెను. వ్యతిరేక భావ్యర్థములలో "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్త"ను

చొప్పున (౨౯౬ వివ.) అత్త్వము వచ్చును. భావార్థమున "పుంనరాగమః క్రియాణామితి సూత్రముచే నట్టి 'అ' త్త్వమునకుఁ దర్వాతి నకారము చేరును. కావున వండు+అ+ఁడు = వండఁడు. వండు+అ+న్+కలుగు = వండఁగలుగు+ఁడు = వండఁగలవాఁడు. ఇట 'అస్తి రనుబన్ధకః స్యాద్యత్ర లృడర్థో వివక్షితో ధాతోరితి సూత్రముచే 'అస్' ధాతురూపము నిలువవలెనుగాన "వర్ణాగమో విశేష ఇత్యాది చింతామణిసూత్రముచే నిట్టిరూపములను సాధించుకొనవలెను. (౨౯౬ వివ.) ఇట్లే వండు+చు+ఉండు = వండుచుండు+ఁడు = వండుచున్నవాఁడు. ఇచట సంయుతము పైని వ్రాసిన వర్ణాగమో విశేష ఇత్యాదిసూత్రముచేతనే రూపసాధనము చేసికొనవలెను. మహతీకర్తృకత్వమున - వ్యతిరేకమున - "వండు+అ+దు=వండదు" అనియు లృట్టు "వండు+అ+న్+కలుగు+దు=వండఁగలదు" అనియు లట్టు "వండు+చు+ఉండు+ది = వండుచున్నది" అనియు రూపముల సాధింపనగును.

తద్ధర్మభూతార్థక ప్రథమపురుష బహువచనరూపముల సాధించుచున్నాఁడు. తిర్యగ్జడే ష్విత్యాదిః—తిర్యగ్జడేషు కర్తృషు=తిర్యక్కులు జడములును కర్తలగునపుడు, భూతే తద్ధర్మేచ = భూతతద్ధర్మార్థములలో, బహువచనంచ = బహువచనరూపము నైతము, ఏకవచనమేవ స్యాత్ = ఏకవచనరూపమే యగును. ఉదా:— భూత - పక్షులు వచ్చెన్ (పక్షి వచ్చెన్). వృక్షములు కదలెన్ (వృక్షము కదలెన్). తద్ధర్మ-పక్షులు వచ్చున్ (పక్షి వచ్చున్). వృక్షములు కదలున్ (వృక్షము కదలున్.).

యద్యన్యేత్యాదిః—అన్య సహయోగః స్యాద్యది = తిర్యగ్జడేతరవాచకములతోఁ దిర్యగ్జడవాచకములును కర్తృవాచకములై యుండునపుడు, ఏవం రూపమ్ = ఇట్టిరూపము, న విద్యతే=కలుగదు. ఉదా:—మృగములును వేఁటకాఁడును వచ్చిరి. "కాంచిరి తామరయు నెలయు ఘన సుఖవృత్తుల్." (అహో. ౪౭౭ పుట). (నెల = చంద్రుఁడు - మహత్తు) "అనేక కర్తృకక్రియకు సమీపకర్తయొక్క లింగవచనంబులగు. ఉదా:—క. ఏవాని బంధుమిత్త్రులు। జీవధనంబులును దప్పిఁ జెందును గృశునిం। గా వాని నెన్నఁగాఁ దగు (శాంతి. ౧ ఆ. ౫౨). క. సురగంధర్వ ప్రభృతులు। ధరణీ శైలాపగాబ్ధి ధాత్రీజాదుల్। నరవర నీ కేయుపకృతి। నరయఁగఁ గావించె జగములందు........(రా. అర. కాం. ౨ ఆ. ౩౮౨). తమ సేనలు వారును విశ్రమించిరి (హ. హరి. ౪ ఆ). వ. భూతంబులు దేవాసురులు వినాశగతులు కారె. (రా. అర. ౨ ఆ.) మొ." (ప్రౌఢ. వాక్యపరి. ౧౫ సూ.) చ. ధరణియు సోముఁడున్ నభము ధాత్రియు గాద్పును గాచుచుండెదున్. (ఆర. ౧ ఆ. ౨౮౫.) తే-గీ. ధరణియును బుక్షములుఁ బరాశరుఁడు గోస। మాహాములు

వత్సములు గౌతముండుం గవ్రులుం । దోయధియు నింత పుణ్యంబు సేయునే......
......(శాంతి. ౨ ఆ. ౯౮) ఇట్టివిశేషములు ప్రథమపురుషస్థలమందు మాత్రమె.
(మా. ౨౬౪ వి.) మధ్యమోత్తమపురుషవిషయము ముందుచెప్పఁబడును.

అన్యత్ర వు వీత్యాది:—అన్యత్ర=భూతతద్ధర్మేతర స్థలములందనఁగా వ్యతిరేక భావివర్తమానములందుఁ దిర్యగ్జడంబులు కర్తలగునపుడు - వు వీ= వువర్ణక వి వర్ణకములగు ననఁగా వ్యతిరేక భావ్యర్థములందు 'వు' వర్ణకమును వర్తమానార్థమునందు వి వర్ణకమును బహువచనమునం దగునని తాత్పర్యము. ఏకవచనంతు = తిర్యగ్జడకర్తృకత్వమున వ్యతిరేక భావివర్తమానార్థములం దేకవచనము, స్త్రీవత్ = మహతీకర్తృకత్వ మందువలెనె యగును. అనఁగా "స్త్ర్యర్థే పున స్తు దీభవతః" అను చొప్పున వ్యతిరేక భావ్యర్థములందు 'దు' వర్ణకమును వర్తమానార్థమున 'ది'వర్ణకమును నగునని యర్థము. "వ్యతిరేకాదా భావిని చాత్ స్యాత్" అను సూత్రమునందు జోడించుటయే యంతటను నారెండిటి యేకకర్తృకత్వమునకు సూచకమగుచున్నదని యీవలికె వ్రాయఁబడెను. 'స్త్ర్యర్థే పున ర్దు దీభవతః' "స్త్రీవదేకవచనంతు" అను చింతామణి సూత్రములు సందర్భభేదముల నుపదిష్టము లగుటచేత స్పష్టప్రతిపత్తికయి యారెంటిని జోడించి యథర్వణుఁడు సూత్రించుచున్నాఁడు.

దుదీత్యాది:—తిర్యగ్జడస్త్రీషు = తిర్యగ్జడమహత్యర్థకములు కర్తలగునపుడు తేష్వర్థేషు = వ్యతిరేక భావివర్తమానార్థములందు, దు దీ = 'దు-ది'వర్ణకములు, ఏకతాంగతౌ = ఏకవచనద్యోతకము లగుచున్నవి. ఉదా:—ఆస్త్రీ పలుకదు - పలుకఁగలదు - పలుకుచున్నది; ఆపక్షి పలుకదు - పలుకఁగలదు - పలుకుచున్నది. తిర్యగ్జడకర్తృకత్వమున భూతతద్ధర్మార్థములం దేకవచనరూపమె బహుత్వమును బోధించును. మహతీకర్తృకత్వమున నట్లు బోధింపదు. ఉదా:—ఆపక్షి పలికెను - ఆపక్షులు పలికెను - ఆస్త్రీ పలికెను - ఆస్త్రీలు పలికిరి - ఆపక్షి పలుకును - ఆపక్షులు పలుకును - ఆస్త్రీ పలుకును - ఆస్త్రీలు పలుకుదురు. మొ. సమాపక క్రియా ప్రత్యయములు సాధారణముగా సర్వనామశబ్దముల సంక్షేపరూపములె యనఁగా వాని తుదివర్ణములె యనఁదగియున్నవి. మహతీవాచకసర్వనామముయొక్క యమహ దేకవచనరూపములగు దు-ది అనునవి వ్యతిరేక భావివర్తమానార్థక సమాపక క్రియలందు మాత్రమె భాసించుచున్నవి. (౨౩౫-౨౩౫ I వివ.) 'అదు-అవు' శబ్దములు 'అది-అవి' శబ్దములకుఁ బర్యాయములుగఁ బ్రాచీనకాలపు వ్యవహారమున వెలయుచుండెడివి. అయ్యవి వ్యవహారమున నశించినను వాని మూలమునఁ గల్గిన క్రియారూపములు నేఁటికిని బైరీతిని నిల్చి యున్నవని యెఱుంగునది.

ఉత్వేయుతౌ వనకారౌ । స్యాతాం మధ్యోత్తమైక
వచనానామ్ । సర్వేషాం బహువచనే రు ఇతి స్యాత్ ।
నన్నయా దుత్తమస్యతు భవేన్ముః. (ఆం. చిం. క్రి. ౯ సూ.
థర్వణీయము. అహో. ౪౮౦-౪౮౧ పు.)
౨౯౬ II విషయము భూతా దుతాం పరేషా మిత్. (ఆ. చిం. క్రి. ౧౭
కారి అహో. ౪౮౩ పు.)

కల్పతరువు. ౨౯౬ II విష:—ఉత్వేయుతౌ, వనకారౌ = ఉకారముతోఁ గూడిన వకార నకారములనఁగా 'వు-ను' అనునవి, మధ్యోత్తమైక వచనానామ్ = మధ్యమపురుషైక వచనమునకును నుత్తమపురుషైక వచనమునకును వరుసగా, స్యాతామ్ = అగును. ఉత్తమపురుషైక వచనమునకు 'ను' ప్రత్యయమును, మధ్యమపురుషైక వచనమునకు 'వు' ప్రత్యయమును నగునని తాత్పర్యము. సర్వేషామ్, బహువచనే = అన్నిపురుషముల బహువచనములందును, రు ఇతి = 'రు' అనునది, స్యాత్ = అగును, ఉత్తమస్యతు = ఉత్తమపురుషముయొక్క బహువచనమున నన్నయో, ముః=మువర్ణకము. భవేత్ = అగును, ఉత్తమపురుష బహువచనమున 'ము' ప్రత్యయమును, ప్రథమోత్తమ పురుషముల బహువచనమున 'రు' ప్రత్యయమును నగునని యర్థము.

భూతాదిత్యాది:—భూతాత్ పరేషామ్ = భూతకాలిక క్రియకంటెఁ బరముగనున్న, ఉతామ్ ప్రత్యయముల తుది 'ఉ'కారములకు, ఇత్ = 'ఇ'కారమగును. ఇట్లేర్పడిన ప్రత్యయములలో 'వు-రు-ము' అనునవి "తిజ్మధ్యశేష షష్ఠీత్యాది సూత్రము చెప్పునట్లు దిజ్మధ్యములు గాన (౪౨ విష.) గళలగుచున్నవి 'ను' ప్రత్యయము మాత్రము "అన్యే ద్రుతప్రకృతయ ఇత్యాది సూత్రము చెప్పున ద్రుతప్రకృతిక మగుచున్నది. (౪౨ విష.). ఉదా:—భూతకాలము:— వండు + తి + నన్ = వండు + ఇ + తి + ను+ఇ+న్ = వండితిని. దుతి వర్ణకావిత్యాదిచే (౨౯౬ విష.) 'తి' అనునది వచ్చును. క్త్వా భూతయోరిత్యాది సూత్రముచే (౨౯౬ విష.) ధాతువు తుదిని 'ఇ' వర్ణమునిల్చెను. భూతా దుతా మిత్యాది సూత్రముచేఁ (౨౯౬ II విష.) బ్రత్యయముల మీఁది 'ఉ'కార మికార మగును. ఇట్లె "వండితిమి - వండితివి - వండితిరి." అను రూపముల ప్రక్రియ నడుపునది. "ద్వయోశ్చ భూతార్థే" (౨౯౬ విష.) అను చెప్పున భూతప్రథమపురుషమున 'తి' అనునది రాదుగాన భూతప్రథమపురుష బహువచనము 'వండిరి' అనియే యేర్పడును. భూతప్రథమపురుషైక వచనరూప

ములు (వందెన్ మొదలగునవి.) అం I విషయమున సాధింపఁబడెను వర్త మాన:— ప్ర - వందుచున్నవారు, మ - వందుచున్నవాఁడవు - వందుచున్నవారరు, ఉ - వందుచున్నవాఁడనున్ - వందుచున్నవారము. వందు+చు+ఉండు+ము = వందుచున్నవారము. ఇట్టియెడలఁ గల్గు చింతామణ్యనుక్త వర్ణాగమాదులు "వర్ణాగమోవిశేషః । పురుషేష్వర్థేషు చాపి వచనేషు (3౨౨-3౨౮ విష.) అను చింతామణి సూత్రము చొప్పున సంపాదింపఁదగును. భవిష్యదర్థకరూపములు:- వందు+అ+కలుగు+నున్=వందఁగలవాఁడనున్ - వందఁగలవారము, వందఁగలవాఁడవు, వందఁగలవారరు, వందఁగలవారు (ఇది ప్రథమపురుష బహువచన క్రియ) ఈరూపములందును చింతామణ్యనుక్త వర్ణాగమాదులను "వర్ణాగమోవిశేష ఇత్యాది సూత్రము చొప్పున (3౨౨-3౨౮ విష.) సంపాదింపఁ దగినవి. తద్ధర్మార్థక రూపములు:— ఉత్త - వందు+దు+నున్-వందుదును—వందుదుము. మ. వందుదువు - వందుదురు. ప్ర - బ - వందుదురు రూపాంతరములు:—వందు+ఎ+దు+అ+నున్ = వందెదనున్. ఇట్లే వందెదము - వందెదవు - వందెదరు. మొ. ఇందలి 'ఎత్వాత్వములు' పునరాగమ ఇత్యాది సూత్రముచే (అం విష.) సంపాదింపఁదగినవి. వ్యతిరేకార్థకరూపములు:— ఉత్త - వందు+అ+నున్ = వందనున్ - వందము - మ - వందవు - వందరు - ప్ర - బ - వందరు. పై వానిలో - వర్తమాన భావ్యర్థములందనుబంధములుగాఁ జేరు 'ఉండు - కలుగు' ధాతువులరూపము లాచ్ఛికము లగుటం జేసి పునరాగమ సూత్ర సాధ్యములుకావు. ఆచ్ఛిక క్రియల సాధించునపుడు క్రియాపరిచ్ఛేద సూత్రానుక్త విషయములు "వర్ణాగమోవిశేషం ఇత్యాది సూత్రముచే సంపాదింపఁదగును. తత్సమరూపములను సాధించునపుడు క్రియాపరిచ్ఛేద సూత్రానుక్త విషయములను "పునరాగమ" ఇత్యాది సూత్రముచే సంపాదింపనగును. (విస్తర) (చిం. వి. ప. ౧౧౧ విష.)

విస్తర. అం II విష:—పంౙ నుదాహరించిన సమాపక క్రియారూపములు పయిరీతిని నన్నయాథర్వణీయ సమ్మతములని విశదపఱచుచుండఁగా నాంధ్ర భాషాచరిత్రకర్తగా రాంధ్రశబ్దచింతామణిని బరిహసించు నభినివేశముతోఁ జింతామణిసూత్రముల చొప్పున "రక్షింపుపుండుదున్ - రక్షింపుపుండుదువు - రక్షించుపుండుదువు - రక్షింపుచుండుదువు - రక్షించుచున్నను. (వర్తమానోత్తమ పురుషైక వచనము.) రక్షించుచున్నము - రక్షించుపున్నము - రక్షింపుపున్నము - రక్షింపకలుగవు - రక్షింపకలుగరు." మున్నగు క్రియారూపములు సిద్ధించుచున్న వనుచుఁ గొన్ని యపకతవక క్రియారూపముల పట్టికల నుదాహరించిరి. (ఆం. భా.

అహోబలపండితుఁడు - వండెదనున్ మున్నగువానిని పయిని వ్రాసినరీతిని బునరాగమసూత్రముచే సంపాదింపక భట్టారకుని ప్రయోగములు గలవు గాన నవి సాధువులని వ్రాసెను. "పోయెదన్ - వచ్చెదన్ - ఇత్యాది ప్రయోగాత్ దువర్ణక స్యాత్వం - తస్మిన్ పరే ఏత్వమ్—ఏతదేత్వ ముత్వం చాచార్య ప్రబంధేషు దేశ్య క్రియా స్వేవ ప్రాయశః శ్రూయతే. వై చెదువు ఇత్యాది రూపమపి తదిష్టమేవ. వై చెదవు ఇశ్యత్వసహితం రూపం త్వాథర్వణమ్. 'క్వచి ద్వ్యవర్ణకే చాపి। కేచిత్త స్యాస్తితాంజగుః' ఇత్యాథర్వణం వచనమ్. తచ్ఛబ్దేనాత్వ ముచ్యతే. ఉభయార్థే భవే దత్వ మితి పూర్వసూత్రాత్." (అహో. ౭౮౫ పు.). 'వై చెదువు' అను 'ఉ'త్వ ఘటిత దకారరూపము సైతము నన్నయ సమ్మత మనుట సరికాదు. వువర్ణక పరకత్వ మున 'దకారముమీఁది 'ఉ'త్వమును నిర్వహించు ప్రయోగము నన్నయ భారత భాగమందె కాక మహాకవి ప్రబంధములం దెచ్చటను లేదు. 'వై చెదు' అనురూప మును బట్టి 'వై చెదువు' అని యుండునని యహోబలపతి భ్రమించినట్లు కన్పట్టు చున్నది. (303 విమ.) మఱియు 'వై చెదవు' అనుచోటి దకారముమీఁది 'అత్వము' క్వచి ద్వ్యవర్ణకే చాపీ త్యాథర్వణ సూత్ర సిద్ధమనుటయు సరికాదు. ఈవిషయము ముందు విశదీకరింపఁబడును. (303 విమ.).

ధాతువునకు. ౧.

ఇది యధికార సూత్రంబు. ఇంక నెయ్యది యుపక్ర మింపంబడు నయ్యది ధాతువునకగునని యెఱుంగునది.

వర్తమానంబున లట్టగు. ౨.

బాలవ్యా వివృతి ౭౯ ౭ విమ

వర్తమాన క్రియావృత్తియగు ధాతువునకు లడ్వ ర్ణకం బగు. వర్తమానంబునాఁ బ్రారబ్ధా ఽపరిసమా ప్తంబు. అప్పటికి ముగియకుండునది.

భూతంబున లిట్టగు. 3.

భూతక్రియా వృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకం బగు, భూతంబు నా విద్యమాన ధ్వంసప్రతియోగి. ముందుండి యప్పటికి లేకుండునది.

---

చ. ౧౬౭౨ A. ౧౬౭౨ B మొ. పుటలు.) హాస్యరసావేశమున వ్రాసిన విషయము విమర్శనయోగ్యములు కావుగదా. "పట్టికలందు వివరించిన యనేకరూపములకు నన్నయ భారతమునఁ బ్రయోగములు కానరావు." (ఆం. భా. చ. ౧౬౭౫ పు.) అని వ్రాసిరి. మఱియేగ్రంథముననైన నట్టిరూపము లున్నవా? ఉండునా? నన్నయ భారతమున లేవననేల?

భావిని ల్రుట్టగు. ౪.

బాలవ్యా. భావి క్రియా వృత్తియగు ధాతువునకు ల్రుడ్వర్ణకం
వివరణము. బగు. భావి నా విద్యమాన ప్రాగభావ ప్రతియోగి.
౨౯౭ విషయము. అప్పటికిఁ బుట్టకుండునది.

తద్ధర్మాదులందు లాట్టగు. ౫.

తద్ధర్మాది క్రియా వృత్తియగు ధాతువునకు లాడ్వ
ర్ణకంబగు. తచ్ఛీల - సంభావనా - సంక్రోశ - సా
తత్య - వర్తమాన భావ్యాశీరాదు లాదిపదగ్రా
హ్యంబులు.

ఆశీ శ్శాప సంప్రార్థన విధులందు లూట్టగు. ౬.
ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు.

వ్యతిరేకంబు న లజి యగు. ౭.
వ్యతిరేక విశిష్ట క్రియా వృత్తియగు ధాతువునకు
లజి వర్ణకంబగు.

సంజీవని. ౨౯౭ విష:—౧ సూ - వ్యాఖ్య:—క్రియాపరిచ్ఛేద సూత్రము లందుఁ గృదంతపరిచ్ఛేద సూత్రములందును వలసినపుడెల్ల 'ధాతువునకు' అనుపద మను వృత్త మగుచుండునని సూరిగారి వివరణమున కభిప్రాయము. ఇయ్యది గంగా ప్రవాహ న్యాయమున నెల్లెడలను ననువృత్తియగును గాన దీనికి గంగాస్రోత మను సంజ్ఞ గలదు. "అధికారః - పుం.........వ్యాకరణమతే పూర్వసూత్ర స్థితపదస్య పరసూత్రే షూపస్థితౌ = అనువృత్తౌ, స త్రివిధో యథా:—శ్లో. సింహావలోకి తాఖ్యశ్చ। మణ్డూక ప్లుతి రేవచ। గఙ్గాస్రోత ఇతి ఖ్యాత। అధికారా స్త్రయో మతా ఇతి" (శబ్దా. చిం.).

౨ సూ - వ్యాఖ్య:—ప్రవర్తమాన వ్యాపారమును బోధించుచున్న ధాతు వున కనఁగాఁ బ్రకృతికిఁ బరముగ లట్టు నిల్చునని యర్థము. 'లట్' అనునది సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధసంజ్ఞయని యీావఱకు వివరింపఁబడెను. (౨౯౬ విష.) కాలవచనాదులు ధాత్వర్థములె యనియు నట్టి యర్థములకుఁ బ్రత్యయములు ద్యో తకములనియుఁ బయిని గల్పతరువున వివరింపఁబడెను. (౨౯౬ విష.). ప్రారబ్ధా ఽపరి సమాప్తంబు = ఆవఱకే యారంభింపఁబడి యప్పటికి ముగియకుండున దని యర్థము. అప్పటి కనఁగా వాక్య ప్రయోగ కాలమున కని యర్థము. ఉదా:—చదువు చున్నాఁడు = ఆవఱ కెప్పుడో చదువనారంభించి యింకను జదువుచున్నాఁడని

యర్థము. ఇచటి బా - సా - వే వ్యాఖ్య విమర్శనము ౭౯౬ విషయపు విస్తరమునఁ బ్రదర్శింపఁబడెను.

3 సూ - వ్యాఖ్య:—జరిగిపోయిన వ్యాపారమును బోధించు క్రియకుఁ బరముగా లిట్టు నిల్చును. విద్యమాన ధ్వంసప్రతియోగి = అప్పటికున్న వస్తు ప్రధ్వంసాభావమునకుఁ బ్రతియోగి భూతమని యర్థము. అభావమునకు అనుయోగి యనియు వస్తు స్థితికిఁ బ్రతియోగి యనియు వ్యవహారము. ప్రతియోగి యనఁగాఁ బ్రతిద్వంద్వి. అభావమునకుఁ బ్రతియోగి వస్తు స్థితి. అభావములు నాల్గువిధములు. ౧ ప్రాగభావము. ౨ ప్రధ్వంసాభావము. 3 అన్యోన్యాభావము. ౪ అత్యంతాభావము. ఇంక "ఘటము పుట్టఁగలదు" అను ప్రతీతి కాలములో నుండెడి పుట్టనున్న ఘటముయొక్క 'అభావము' ప్రాగభావము. ఘటము ధ్వస్తమయ్యె నను ప్రతీతి కాలమం దుండెడి ధ్వస్తమగు ఘటముయొక్క యభావము ప్రధ్వంసాభావము. 'ఘటము పటముకాదు - పటము ఘటముకాదు' అను ప్రతీతిలో నుండెడి ఘటమందలి పటత్వాభావమును బటమందలి ఘటత్వాభావమును నన్యోన్యాభావములు. "వంధ్యాపుత్త్రుఁడు లేఁడు - శశవిషాణము లేదు - గగనారవిందము లేదు" అను ప్రతీతులలోని వంధ్యాపుత్త్రాద్యభావ మత్యంతాభావము. ఉదా:—'వాఁడు చదువఁగలవాఁడు = చదువనున్నవాఁడు' అను ప్రతీతులలో నప్పటికి వాఁడు చదువనారంభింపలేదు గావున నప్పుడున్న పఠనాభావము ప్రాగభావము. దానికిఁ బ్రతియోగి భవిష్యత్పఠనక్రియ. పఠనప్రాగభావ నిష్ఠానుయోగితా నిరూపిత ప్రతియోగితా శాలి భావిపఠనక్రియ యని నిష్కృష్టార్థము. 'వాఁడు చదివెన్' అను ప్రతీతిలో నప్పటికిఁ బఠనక్రియలేదు. ఇంకఁ బఠన ప్రధ్వంసాభావమే కలదు. దానికిఁ బ్రతియోగి యతీతపఠనక్రియ. వర్తమాన పఠన ప్రధ్వంసాభావ నిష్ఠానుయోగితా నిరూపిత ప్రతియోగితాశాలి యతీత పఠన క్రియ యని నిష్కృష్టార్థము. లిట్టునకు సంస్కృతవ్యాకరణమున ననద్యతన పరోక్ష భూతమె యర్థమైనను నది సంస్కృతమహాకవులచేతనయిన ముపేక్షితమై యర్వాచీన వ్యాకరణకర్తలచే నుపేక్షితముగుటచే భూత మాత్రమె యర్థమును (౭౯౬ విష.) సిద్ధాంతము నాశ్రయించి సూరి భూతంబున లిట్టగునని సూత్రించిన వాఁడయ్యెను. ఉదా:—వాఁడు నిన్న చదివెన్. మొ.

౪ సూ - వ్యాఖ్య:—భావిక్రియా వృత్తియగు ధాతువున కనఁగా జరుగనున్న వ్యాపారమును దెల్పు ధాతువునకుఁ బరముగ లృట్టు నిల్చునని యర్థము. ధాతువునందుఁగల యట్టి భావిత్వమునకు లృట్టు ద్యోతకమగునని తాత్పర్యము.

ప్రాగభావ ప్రతియోగి యనుదాని యర్థము పూర్వసూత్రవ్యాఖ్యలో విశదీకృత మయ్యెను. ఉదా:—వాఁడు రేపు చదువఁగలవాఁడు = చదువనున్నవాఁడు.

౫ సూ:—తద్ధర్మ తచ్ఛీలాదులు తద్ధర్మాదులని సూరియే వివరించెను. తద్ధర్మ మన = ఆవస్తువుయొక్క లేదా ఆతనియొక్క వృత్తి మొదలగునవి. కులాలుఁడు కుండలు వానును. తచ్ఛీలము=ఆవస్తువుయొక్క స్వభావము - జ్వాలనజ్వాల లుష్ణం బెగయును. (చూ. బా. క్రి. ౨౨ సూ. విస్తృతి) సంభావన=ఊహము - వాఁడచ్చటి కీపాటికిఁ జేరున్. సంప్రశ్నము - నీవు చదువుదువా?. సాతత్యము = సర్వదా వర్తిల్లుట. పర్వతము చలింపకయుండున్. వర్తమానము - నే నిప్పుడు వచ్చెదను. భావి - నేను రేపు వచ్చెదన్. ఆశీరాదులు - నీకు మంగళంబగున్. మొ. లాట్టను నది సూరిచేఁ గల్పితమగు లకారము - సంస్కృతమున నిట్టి యర్థములను దెల్పు లకార మొక్కటి లేమింజేసి దీని కప్రసిద్ధ లకార కల్పనమె యుచితము.

౬ సూ - వ్యాఖ్య:—ఆశీస్సు = ఆశీర్వదించుట. శాపము = శపించుట. సంప్రార్థనము = ప్రార్థించుట. విధి = ఆజ్ఞాపించుట. ఇట్టి యర్థములందు ధాతువునకు లూట్టగును. లూట్టునకు లేని యర్థములు కొన్ని సంస్కృతపు లిఙ్ లోట్టు లకుఁ గలవు. లూట్టున కాదేశములగు 'ఎడున్ - తన్' అనునవి సర్వపురుషవచన సాధారణములు. మఱియు లూట్టున కాదేశమగు 'అది' వర్ణకము విధ్యర్థక మాత్రమె. ముదుజ్ఞులు మధ్యమపురుష మాత్రముననె వచ్చును. కావున లూట్టు సైతము లిఙ్ లోట్టులకంటెఁ గొంత వైలక్షణ్యముగలదె యన నగును గాన దీనికిని లూట్టను నప్రసిద్ధ లకార కల్పన ముచితమె యన నగును. ఉదా:—నీకు మంగళంబయ్యెడున్-వానికి రాక్షసత్వ మగుతన్-వాఁడు నా చెప్పినపని చేయునది-నీవు నను గటింపుము - మీరు పొండు. మొ.

౭ సూ - వ్యాఖ్య:—వ్యతిరేక విశిష్టక్రియావృత్తి = ధాత్వర్థవిరుద్ధక్రియా వృత్తియగు ధాతువునకు ఒజీయగును. ఉదా:—వాఁడు వండఁడు - వీరు చదువరు. మొ.ఇట్టి లకారము సంస్కృతమున లేదు గాన దీనికిని నప్రసిద్ధ లకారసంజ్ఞ యుచితమె యనఁదగును. ఈసందర్భమున బా - గు - ప్ర - వ్యాఖ్యాత "ఒజీ" అను జీత్త్వకల్పనముచేయుట సరికాదని చేసిన యాక్షేప మీవఱకే నిరాకృత మయ్యెను. (౧౨౭ విష. విస్తర I - ౧౨౭ విష. చూ) ఇట్లె సూరి యీనూతన లకారములను గల్పించుటచే నితనికి సంస్కృతములోని లకారములు తెలియవనుట యుఁ దన్మూలమున నీతని గ్రంథము మూలము కాదనుటయు మున్నగు విషయ ములు కేవలము నసంగతములు. (బా. గు. ప్ర. ద్వి. ము. ౫౨౮ మొ. పుటలు.)

"మూలము-'తద్ధర్మ వర్తమానాతీతా గామ్యర్థకాః క్రియా జ్ఞేయాః' అని నాలుగర్థములనే వివక్షించి ప్రక్రియను నడపెను. అయినను సూరి బహుప్రయోగ దృష్టిం జేసి లూట్టు లజీమును మఱి రెంటిని క్రొత్తగ నంగీకరించి......" (బా. సా. పే. ౩౮౨ పు.) అని వ్రాయుట యపరిశీలన మూలకము. "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్.........వ్యతిరేకార్థే లృటి లటి డుజ్ స్యాత్ .........." అనునవి యాదిగాఁగల సూత్రములచే సూరిగారి లజీరూపములను జింతామణి సాధించియే యున్నది. "ప్రార్థనార్థే ము రేకత్వే.........ప్రార్థనే ము మ్ము డుజ్ స్థితిః...... తద్ధర్మ ప్రథమైకత్వే। వాచకాద్ధి క్రియా క్రియాపదాత్। అవిశబ్దప్రయోగః స్యాద్విశేషార్థే నిరితీరితే.........డుదు కాతౌ కావుతాద్యాః.........." మున్నగు కారికలను నథర్వణుఁడు సూరి చెప్పిన లూట్టునకు మూలముగా వచించియే యున్నాఁడు. ఇంకను విస్తరించి యహోబలపండితుఁడు కవిశిరోభూషణమున ననేక విషయముల నుదాహరించియు నున్నాఁడు.

లకారంబునకు డు - ఋ - వు - రు - ను ముజ్ఞగు. ౮.
లడాది లకారంబులం దొక్కొక్కటికి డుజాదు లాదేశంబులగు. ఇందు ఇకారంబు ప్రత్యాహారార్థంబు.
అంచు వరుసను రెండేసి ప్రథమ మధ్యమోత్తమంబు లనంబడు. ౯

బాలవ్యాకరణ వివరణము. ౨౯౮ విషయము.

డుజ్ - రు ప్రథమము, వు - రు - మధ్యమము, ను - ము, ఉత్తమము.
వానిలో రు - ము లు బహువచనంబులు - వెఱ యేక వచనంబులు. ౧౦
నాము యుష్మ దస్మ దర్థంబులందుం బ్రథమ మధ్య మోత్తమంబు లగు. ౧౧

సంజీవని. ౨౯౮ విష:—౮ సూ - వ్యాఖ్య:—లట్ - లిట్ - లృట్ - లాట్ - లూట్ - ౨ిజ్" అనెడి యాఱిటిలోని లకారములలో నొక్కొక్కదానికి 'డుజ్ - రు, వు - రు, ను - ముఙ్' అనునవి యాదేశములగును. లడాదులలోని లకారేతరము లిద్వర్ణములు. సంస్కృతవ్యాకరణ వాసనచేఁ బ్రక్రియోపదేశ సౌలభ్యమునకయి సంస్కృతవ్యాకరణ రీతిని లడాదులు పేర్కొనఁబడినవి. సంస్కృతమున లడాదులకుఁ దిజ్విభక్తు లాదేశింపఁబడినట్లు యిందు డుజ్విభక్తు లాదేశింపఁబడినవి. సంస్కృతమున బరస్మైపదులకు వేఱుగను నాత్మనేపదులకు వేఱుగను గ్రియావిభక్తి

ప్రత్యయములున్నట్లు తెలుంగున లేవు. తెలుఁగున నాత్మనేపదికి 'కొను' ధాతు వను బంధముగాఁ జేరుట మాత్రమె కలదు. డుజ్జులోని జకార మిద్వర్ణమగుటచే బా - తత్స - ౧౯ సూత్రముచొప్పున 'డు' వర్ణకము బిందుపూర్వక మగును. 'ముఞ్' అను దానిలోని ఞకారము ప్రత్యాహార ఘటనకయి యిద్వర్ణముగాఁ జేర్పఁబడెను. (విస్తర. I. ౫ II కప. ౧౨౭ విప) కాన 'డుఞ్' అను ప్రత్యాహారముచే 'డుజ్ రు - వు రు - ను ము' అను ప్రత్యయములు చెప్పఁబడును. ఇట్లె 'వుఞ్' అనుదానిచే 'వు రు - ను ము' అను ప్రత్యయములు చెప్పఁబడును. ఇందలి నుప్రత్యయము ద్రుతాంతమని సూరి వచింపలేదు. కాన నట్టి 'ను' ప్రత్యయమె ద్రుతస్వరూప మనియు దానికి స్వరలోపము గల్గఁగా 'న్' అను వ్యంజనరూపము నందుననియు (చదువఁగలను = చదువఁగలన్ - చదువుదును = చదువుదున్. మొ.) సూరి యాశయము. ద్రుతప్రకృతికముల ద్రుతమును సూరి కంఠోక్తముగ వచించెను. బా - సంజ్ఞా - ౧౧-౧౨-౧౩ సూత్రముల చొప్పున వానికి ద్రుత మంతమందు చేరుట బాలవ్యాకరణ సంప్రదాయము కాదు. కావుననె "లోట్టు ముఞ్ఞున కెడు త వర్ణంబులు ద్రుతాంతంబు లగు." (బా. క్రి. ౨౬ సూ.) అని యిట్లు సూరి వచించు చునే యుండును. ఇట్టి ప్రక్రియ చింతామణికి విలక్షణము. (౧౨౦ విప) చింతా మణిలో నుత్తమ పురుషైకవచనమున విధింపఁబడిన (ఉత్వేయుతో వనకారౌ స్యాతాం మధ్యోత్తమైక వచనానామ్.) 'ను' ప్రత్యయము 'అన్యే ద్రుత ప్రకృతయః' అనుచొప్పున ద్రుతప్రకృతిక మగును గానఁ జింతామణి ప్రక్రియ చొప్పున చేయఁ గలనున్ - చేయుదునున్ - చేయనున్-చేసితినిన్ మున్నగురూపములు సిద్ధించును. తే.గీ. ఏను నీయింతియును గాని యెఱుఁగ రన్యులు.........తే.గీ. అన్య తెఱుఁ గమిఁజేసి లోకాపవాద । భీతి నెటేఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి । యెఱుఁగ నంటిని నిందఱ కిప్డు డెఱుఁగఁ । జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ. (ఆది. ౪ ఆ. ౧౧౮ ప.) 'అంటినిన్' అనుచోటి నకారము ద్రుతమాత్రమె కాని యర్థవిశేష బోధక 'ను' శబ్దముకాదు. (అం. భా. చ. ౯౬౧౨ పుట.) 'ఎఱిఁగియున్' అనుచో 'చా'ర్థక 'ను' శబ్ద ముండుటచేత 'అంటినిన్' అనుచోట 'ను' శబ్దస్థితి సుప్రసక్తము కానేరదు. లోట్టుచోట నీప్రత్యయములెల్ల నిలుకవు. లోట్టు ముఞ్ఞున కెడు త లాదేశింపఁబడును. (బా. క్రి. ౨౬ సూ.)

౯ సూ - వ్యాఖ్య:...ముఞ్ఞునందలి ప్రత్యయము లాఱిటిలోను వరుసగా రెండేసి ప్రథమ మధ్యమోత్తమ పురుషము లనంబడును. మొదటి 'డుజ్ - రు' అను రెండును ప్రథమ పురుష ప్రత్యయములు. తరువాతి 'వు - రు' అను రెండును

మధ్యమ పురుష ప్రత్యయములు. తుది రెండును 'ను - ము' అనునవి యుత్తమ పురుష ప్రత్యయములు.

౧౦ సూ - వ్యాఖ్య:—అట్టి ద్వికములు మూఁడిటిలోను మొదటి దేక వచనము - రెండవది బహువచనము. కాఁగా 'డుజ్ - వు - ను' అనునవి యేకవచన ప్రత్యయములు. 'రు - రు - ము' అనునవి బహువచన ప్రత్యయములు ఈవిషయనే సూరి నిపుణముగా సూత్రించెను.

౧౧ సూ - వ్యాఖ్య:—నాము మనఁగా యుష్మ దస్మ ద్భిన్నము. అస్మదర్థము కర్తగాఁగల క్రియ యుత్తమపురుషమగును. యుష్మదర్థము కర్తగాఁగల క్రియ మధ్యమ పురుషము. తక్కిన యేది కర్తయై యున్నను గ్రియ ప్రథమపురుష మగును. ఉదా:—నేను వండుచున్నాను - మేము వండుచున్నాము - నీవు వండుచున్నావు - మీరు వండుచున్నారు - వాఁడు వండుచున్నాఁడు - వారు వండుచున్నారు - రాముఁడు వండుచున్నాఁడు - రాములు వండుచున్నారు. మొ.

అనుహాదర్థంబునందు డుజ్జులకు దు వు లగు నున్నాను
బంధంబు మీఁద దివి యగు. ౧౨.
ఉదంతంబునకు లట్టు పరంబగునపు డున్నానుబంధం
బగు. ౧౩.
ఉదంతంబయిన ధాతువునకు లట్టు పరంబగునపుడు
బాలవ్యా. 'ఉన్న' అను శబ్దం బనుప్రయుక్తం బగు.
వివరణము. ఉన్న శబ్దంబు పరంబగునపుడు చు వర్ణకంబగు. ౧౪.
౨౯౯ వివ. ది వీతరంబగు డుజ్ఞు పరంబగునపు డున్నానుబంధంబు
నకు దీర్ఘంబగు. ౧౫.
ప్రథమము - వాఁడు వండుచున్నాఁడు - వారు వండు
చున్నారు - అది వండుచున్నది - అవి వండుచున్నవి -
మధ్యమము - నీవు వండుచున్నావు - మీరు వండు
చున్నారు. ఉత్తమము - నేను వండుచున్నాను. మేము
వండుచున్నాము.

సంజీవని. ౨౯౯ వివ:—౧౨ సూ - వ్యాఖ్య:—డుజ్ ప్రత్యాహారము లోని ప్రత్యయములయందలి 'డుజ్ - రు' అను ప్రథమపురుష ప్రత్యయము ల మహత్కర్తృక క్రియలపైని నిలువవు. కావున వాని విషయమున సూత్రించు చున్నాఁడు. అనుహాదర్థంబునందు = అనుహాదర్థము వివక్షిత మగుచుండఁగా ననఁగా

నమహాత్కర్తృక స్థలములందని యర్థము. 'డుజ్ - రు' లకు 'దు - వు' లాదేశము లగును. ఉన్నానుబంధంబు మీఁది 'డుజ్ - రు'లకు 'ది - వి' అనునవి వరుసగా నాదేశము లగును. ఉదా:—అది వండఁగలదు - అవి వండఁగలవు - అది వండదు - అవి వండవు. ఉన్నానుబంధంబు మీఁద - అది వండుచున్నది - అవి వండుచున్నవి. మొ.డుజ్ఞనఁగా సమాపక క్రియావిభక్తి ప్రత్యయములు.అవి పురుషబోధక సర్వనామముల సంక్షేపరూపములై యనఁగా వాని తుది వర్ణములై యనఁదగును. ఉదా:— వాఁడు - డు, వారు - రు, నీవు - వు, మీరు - రు, నేను - ను, మేము - ము, అదు - దు, అవు - వు, అది - ది, అవి - వి. 'అది - అవి' అనువానికిఁ బర్యాయములుగ "అదు - అవు" అనునవి పురాతనకాలమునందుఁ దెలుఁగు దేశమున నైతము వ్యవహరింపఁబడుచుండెడివి. నేఁటికిని కర్ణాటములో నవియె తచ్ఛబ్దార్థ కామహద్రూపములయి యున్నవి. అమహత్కర్తృకత్వమునందును మధ్యమోత్తమ పురుషప్రత్యయములు మహత్కర్తృకత్వమునందలివె నిల్చును. మహన్మహత్త్వమహదర్థములు మాఁటను నీ నా శబ్దరూపము లొక్కతీరుననే యుండును గాని వానికి భేదము లేదుగదా. అమహత్తులకు మహద్వివక్షలేనిదే యుష్మదస్మదర్థ వ్యవహారము సంభవింపదుగదా.

౧౩ సూ - వ్యాఖ్య:—ధాతువులెల్ల సాధారణముగఁ దెలుఁగున నుదంతములై. "సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు." (బా. క్రి. ౬౩ సూ.) అను చొప్పున "అంగల-అడక" మున్నగు ధాతువు లుదంతములు కాకున్నను నవి స్వార్థేంచుక్కతోఁ గూడి 'ఉ'దంతములై యగును. ఇట్లె "అప్పాదులకు నజి యగు." (బా. కృదంత. ౧౩ సూ.) అను సూత్రమునఁ జేర్కొనఁబడిన 'అప్ప' మున్నగు ధాతువులును నంగలాదులలోనివె కాన స్వార్థేంచుక్కతోఁ గూడి యుదంత ధాతువులై యగుచున్నవి. ఉదా:—అంగలించు - అడకించు - అప్పించు - అప్పగించు. మొ. ఇంక "కలుగున" కస్త్యర్థంబునందు లట్టు పరంబగునపుడు కలయగు. (బా. క్రి. ౧౦౪ సూ.) అనుచొప్పున నాదేశభూతమగు 'కల' అను నదంతమునకు "ఉన్నా"నుబంధమును వారించుట యీసూత్రములోని "ఉదంతంబునకు" అనుదళమునకుఁ బ్రయోజనము కన్పట్టుచున్నది.

౧౪ సూ - వ్యాఖ్య:—ఉన్నశబ్దంబు పరంబగునపుడు ధాతువునకు 'చు' వర్ణకం బగును. ఉన్నానుబంధ మనగ "ఉన్నశబ్దంబు" అనుటచేత ఉన్న కలజిన వర్ణకంబులు భవద్భావి శత్రు క్తవదర్థంబులం దగు." (బా. క్రి. ౪౬ సూ.) అను సూత్రము చొప్పున వచ్చు 'ఉన్న' అనునది పరమగునపుడును 'చు' వర్ణక మగునని

రాయెఱుంగునది. ఉదా:—వండు+లట్ = వండు+చు+ఉన్న+ఁడు = వండుచున్నాఁడు. వండు+(భవచ్ఛత్రర్థక) ఉన్న = వండు+చు+ఉన్న = వండుచున్న (రాముఁడు.) మొ.

౧౪ సూ - వ్యాఖ్య:—అనుహాత్కర్తృకత్వమున 'డు ప్రుల' కాదేశ మయిన (బా. క్రి. ౧౨ సూ.) 'ది-వి' అనునవి తప్పఁ దక్కిన డుజ్ఞు పరమగునపు డున్నానుబంధమునకు దీర్ఘము వచ్చును. డుజ్ఞులోని 'డు ప్రుల' కాదేశము లగుటచేత 'ది-వి' అనునవియును 'డుజ్ఞు' లోనివె యనఁదగి యుండుటం జేసి వానిని బృథక్కరింపవలసెనని యెఱుంగునది. వాఁడు వండుచున్నాఁడు:—వండు+లట్ = వండు+డుజ్ = వండు+ఉన్న+ఁడు = వండు+చు+ఉన్న+ఁడు = వండుచున్నాఁడు ప్రకృతసూత్రముచే 'ఉన్నా'నుబంధమునకు దీర్ఘమయ్యెనని యెఱుంగునది. ఇట్లె తక్కిన "వండుచున్నారు - వండుచున్నావు - వండుచున్నారు. - వండుచున్నాను - వండుచున్నాము." అను రూపముల ప్రక్రియ నెన్నునది అది వండుచున్నది:— వండు+లట్ = వండు+డుజ్ = వండు+ఉన్న+ది = వండు+చు+ఉన్న+ది = వండుచున్నది. ప్రకృతసూత్రమున "ది వీతరంబగు డుజ్ఞ"నుటచేత 'ది' వర్ణక పరకత్వమున 'ఉన్న' అనుదాని తుదిస్వరము దీర్ఘము కాదయ్యెనని గ్రహింపవలెను. (ఈసమాపక క్రియలతో సూరిగారు నడపిన ప్రక్రియాంతరము చొప్పున సిద్ధించు ఉండు ధాతు రూపము (బా. క్రి. ౪౬.) లేకాకారము గలవె. (వండు+చున్+ఉన్నాను.) కానివానికి భిన్నములు గావనుబుద్ధి నొదవించుచున్నవి. (౨౯౬ విష.). ఉదా:—ఉండు+లట్ = ఉండు+ఉన్న+డుజ్. (బా. క్రి. ౧3 సూ. చొప్పున ఉన్నానుబంధము.) "ఉన్న శబ్దంబు పరంబగునపు డుండు ధాతువునకు లోపంబగు." (బా. క్రి. ౪౬ సూ.) అను సూత్రము చొప్పున 'ఉండు' ధాతువు లోపించుటం జేసి బా - క్రి - ౧౮ సూత్రము చొప్పున 'చు'వర్ణకము రాకపోఁగా 'ఉన్నాఁడు' (బా. క్రి. ౧౪ సూత్రముచే 'ఉన్నా'నుబంధమునకు దీర్ఘము.) అని సిద్ధించును. ఇట్లె "ఉన్నారు - ఉన్నావు - ఉన్నారు - ఉన్నాను - ఉన్నాము." అను రూపములును సిద్ధించును. (ఈసూరిగారి ప్రక్రియను మఱచి కావలయు ననేకస్థలములందు 'ఉండుచున్న' మున్నగు రూపములను బా - గు - ప్ర వ్యాఖ్యాత ప్రయోగించెను. "వర్తమాన కాలంబునందు దాని ధ్వంసము ఉండుచున్నట్లు" "వస్తూత్పత్తికి ముందుండుచున్న యభావము." "వాక్యప్రయోగ కాలంబునం దుండుచున్నట్లు." (బా. గు. ప్ర. ప్రథమముద్ర. ౨౧౭ పు. 3౦౮. పుట. ద్వి. ము.) ఇట్లు పెక్కుచోట్లఁ బ్రయోగించెను.) పైరీతి నేర్పడిన 'ఉన్నాను-ఉన్నది' మున్నగురూపములెల్ల ధాతువుల శత్ర

ర్థక చువర్ణాకాంత శబ్దములతోఁ గూడి యా యా ధాతువుల వర్తమాన లట్టు రూప ముల కస్యార్థానాసతిరిక్తాకారములు గలవగుచున్నవి. ఇట్లే 'ఉండు' ధాతువు యొక్క భవచ్ఛత్రర్థమున బా - క్రి - ౨౬ సూత్రము చొప్పున వచ్చు 'ఉన్న' వర్ణకము పరమగునపుడు బా - క్రి - ౪౬ సూత్రముచేత 'ఉండు' ధాతువు లోపింపఁగా నేర్పడిన 'ఉన్న' అను క్రియాజన్యవిశేషణము బా - సమా - ౯ సూత్రము చొప్పున విభక్తి వివక్షయందుఁ దచ్ఛబ్దాంతమై 'ఉన్నవాఁడు - ఉన్న వారు' మున్నగురూపముల నొదవింపఁగా బా - క్రి - ౧౧౭ సూత్రము చొప్పునఁ దచ్ఛబ్ద నకారలోపమువచ్చి 'ఉన్నాఁడు - ఉన్నారు' (ఉన్న+అది = ఉన్నది. ఉన్న+ అవి = ఉన్నవి.) మున్నగు రూపములు గల్గును. అట్టివాని మూలమున నైతను 'వండుచున్+ఉన్నవాఁడు = వండుచున్+ఉన్నాఁడు = వండుచున్నాఁడు.' మున్నగు రూపము లేర్పడును.

సూరి యిట్లుగ బాలసరస్వత్యహోబలపండితులు పడిన ప్రమాదమార్గ ముననె పోయి యరీతిగల "ఉన్నాను" మున్నగు రూపములను సాధించినవాఁ డయ్యెను. "వస నివాసే ఇతి ధాత్వర్థోనుబన్ధః 'ఉన్న' ఇతి, అపరత్ర అస భువీతి ధాత్వర్థోనుబన్ధః కలఇతి 'భవతి క్రియాపదానామ్.' (అహో. ౨౬౧ పు.) "వర్తమానార్థ వివక్షయా వసతి రనుబంధః - ఇంచుగాగమః - పాదేశః - చు రితి క్రియా పదానా మితిచుః - వ్యతిరేకార్థ ఇత్యాది వక్ష్యమాణ సూత్రేణ దుజ్ - అనుక్త న్యాయేన సానునాసికోచ్చారణం జిక్. నుతింపుచున్నాఁడు - పోషింపు చున్నాఁడు." (అహో. ౨౬౩ పు) "పునరాగమః క్రియాణామ్........ఘటింపు చున్నాఁడు ఇత్యత్ర దీర్ఘో ప్యనేనైవ సిధ్యతీతి" (అహో. ౨౯౨ పు.) "ఘటింపు చున్నావు... .... ఘటింపుచున్నాను - చేయుచున్నాను." (అహో. ౨౮౦ పు.) బాలసరస్వత్యహోబల పండితులను సూరిని ననుసరించి యర్వాచీనులెల్ల నీరూప ములనె సాధింపసాగిరి. ఇతరుల మాట యటుండఁగా నారాయణీయాంధ్రీకర్త యకారికల నాంధ్రీకరించుటలోఁ గవిజనాంజనములో నుదాహరింపఁబడిన వనుచు రెండు ప్రక్షిప్తకారికల నుదాహరించి వాని నాథర్వణములుగా విశ్వసించి యాంధ్రీకరించెను. వానికి గాణపతవివరణకర్త వ్యాఖ్యచేసి యాధునిక ప్రయోగ ములను బెక్కిటిని జూపెను. (నా. ఆ. క్రియా. 3౪౪-3౪౬ కారి ౨౧-౨౨ ప.) ఇది సరికాదు. (విస్తర.). నన్నయాథర్వణ సూత్రముల నిర్వహించుటకు వారి

---

విస్తర. ౨౯౯ విష:—కవిజనాంజన కారికలు:—శ్లో. లఘుపూర్వ నకా రాన్త। క్త్వార్థోపరి భవేచ్చ యః। భూతార్థ స్యైకవచనే। ప్రథమాయా మితీరితః।

ర్కేత్వాత్వ సైశ్వత్వంచ రిత్వంచ । స్తో భూతే ప్రథమాద్వయోః । తత్ర నాఁడ్వాదికం భూతే । సర్వేషా మితికేచన.” వీని యాంధ్రీకృతి:—క. కని మొదలైన లఘూపధ । క న కారాంతముల క్త్వార్థకంబుల మీఁదన్ । జను యత్వము ప్రథమపురుష । మున నేకవచనమునందు భూతార్థములోన్. ౭౧. 35౬. క. క్త్వేత్వంబునకంటె నెత్వము । రిత్వము భూతమున నగును రెండిటఁ బ్రథమై । కత్వాదుల నన్నిటికిన్ । సత్వగుణా, యెుక్క రంద్రు నాఁడ్వాదికమున్. ౭౭. (నారా. క్రియా.) పయికారికలాథర్వణములు కావు. అహోబలపండితీయమున నివి లేవు. ప్రథమపురుషార్థమున ‘ప్రథమాయామ్’ అని స్త్రీలింగశబ్దమును బ్రయోగించుటచేత నయితము తత్కారికాకర్త యథర్వణాచార్యుఁడు కాఁడని నిశ్చయింపనగును. ప్రథమపురుషము విషయమున నన్నయభట్టు “నాద్యస్య” అని ‘దు తి’ వర్ణకా విత్యాది కారికలోఁ బ్రయోగించెను. ‘కనియెన్ = కనెన్ - కనిరి’ మున్నగురూపములను సాధించుటకయి యథర్వణుఁడు “ఇత్ స్యాత్ భూత బహుత్వేతు । దే శ్య తూభయతో భవేత్ । యః స్యా ద్దేశ్య క్రియాన్తేతు । భూత ఏకత్వ వాచకే । ఇత ఏవ పరః స స్యా” దిత్యాది కారికల నుపదేశించియే యున్నాఁడు. అట్టి కారికలు కవిశిరోభూషణమున నుదాహరింపఁబడి యున్నవి. అట్టి కారికల నాంధ్రీకరించియుఁ బును రుక్తములగు కవిజనాంజన ప్రక్షిప్తకారికలాథర్వణములని నారాయణీయాంధ్ర వ్యాకరణకర్త యెట్లు విశ్వసించెనో తెలియకున్నది. మఱియు నట్టి ప్రక్షిప్తకారికల ప్రక్రియయు కేవలము నవ్యుత్పన్నకృతముగాఁ గన్పట్టుచున్నది. క్త్వార్థకరూప పదమును బ్రకృతిగా నిల్పి దానినుండి ‘కనియెన్’ అనురీతి భూతార్థరూపములను సాధించుట కేవలము సంప్రదాయవిరుద్ధము. “క్త్వా భూతయోః క్రియా న్తస్యే” త్తని ప్రత్యేకముగా భట్టారకుఁడు సూత్రించి యుండెనుగదా. ‘ఇత ఏవ పరః స స్యా త్త్’’ని కదా యథర్వణుఁడు వచించెను. ఇట్లాకారిక లుపేక్షణీయములె య్యైనను రెండవ శ్లోకము నుత్తరార్థమునకై వీనిని నారాయణీయాంధ్ర వ్యాకరణకర్తగారు పీడఁజాలరైరి. కాని యందలి నాఁడ్వాదుల నథర్వణుఁ డుపదేశించె ననుట విశ్వసనీయము కాదని భావింపరైరి. ‘నాఁడు - నారు, నావు నారు, నాను - నాము’ అనునవి నాఁడ్వాదులు నన్నయ ‘వచ్చినవాఁడను’ అని వకారము తోనె ప్రయోగించును. అందు వకారలోపముగల ‘నాఁడను - నారము, నాఁడవు - నారరు = నారు, నాఁడు - నారు.’ అనురీతిగలవి తిక్కయజ్వచేఁ బ్రయోగింపఁ బడినవి. అందలి ‘డ-ర’ వర్ణముల లోపముగల ‘నాను - నాము, నావు’ అను రూపములు ప్రాచీనప్రామాణిక కవిసమ్మతములు కావు. అట్టివి ధూర్జటి మొద

లొక్కన్న మహాకవులచే నంగీకరింపఁబడినవి. ప్రాచీనకావ్యములలోని రంగనాథ రామాయణమునం దట్టి ప్రయోగములు కన్పట్టుచున్నవి. కాని యాకాలపు మహాకవులును దర్వాతి ప్రాచీనమహాకవులును నట్టి ప్రయోగముల నాదరింపలేదు. రంగనాథ రామాయణ ప్రయోగములను బట్టి యాకాలమున నట్టివి వ్యావహారిక రూపములై యుండెడివని (నేఁడు వీనికిఁ బర్యాయములై మహాకవులచే నాదరింపఁ బడని, చేశాను = చేసేను, చేశావు - చేసేవు, మున్నగువానివలెనె.) తోఁచు చున్నది. రంగనాథరామాయణపు యూనివర్సిటీ ముద్రణసంపా_ర్తలు వానిలోఁ బెక్కిటిని దిద్దివేసిరి. ఒకచో నట్లు దిద్దఁబోఁగాఁ బ్రమాదమున యతి భ్రష్టమైనది. నెమ్మది నున్నావు నీకిది తగునె. (వావి. ము. ౧౭౬ పు.) నెమ్మది నున్నాఁడ విది నీకుఁ దగునె. (యూని. ము. ౨౦౧ పు.) (చూ. విస్తర. IV ౬3 III విష.) యూనివర్సిటీ ముద్రణమందు సైత మింకను గొన్ని సంపా_ర్తల ప్రమాదమున మిగిలియున్నవి. "చిరకాల మమరేంద్రుఁ జెఱఁబెట్టిరావు। .........। రాకంటె విక్రమోన్నతి మించినావు. (యూని. ము. 3౦౭ పు.) ఎప్పుడు సూచినా నీభూము లెల్ల. (యూని. ము. ౨౬౧ పు.) వితత విక్రము సైన్య విభుఁ జేసినావె. (యూని. ము. ౧౫౫ పుట.) అర్వాచీన మహాకవులు వీనిని ధారాళముగాఁ బ్రయోగించిరి. "ఇట్లె నాను - నాము - నావ్వంతములున్న శిష్టవ్యవహారముండున్నందున కవులు ప్రయోగించినారు. రంగనాథరామాయణములో.........మునుపఁగా గడి దుర్గ ముల నుంచినావె.........అనిన్ని పిడుపర్తి సోమన బసవపురాణములో 'జరిగి నావు' (పుట. ౬౪.) ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యములో 'ఒనరించినాను' (III ౨౧౮.) కోట శివరామయ సానందోపాఖ్యానములో 'తలంచినాను' (3౭ పు.) వెళ్ళినాను. (౮౪ పు.) మొల్లరామాయణములో నేర్చినాను. (౧ ఆ. ౧౨.) తెరాలి రామయ్య ఘటికాచలమాహాత్మ్యములో 'ఒనరించినాను.' (౨ ఆ. ౧౫౮.) సవరంబిన నారాయణ కువలయాశ్వచరిత్ర - చదువుకొన్నాము. (౨ ఆ. ౭౯.) మల్లారెడ్డి షట్చక్రవర్తి చరిత్రలో చూపించినాను. (3 ఆ. ౧౨౭.) శంకర కవి హరిశ్చంద్రో పాఖ్యానములో 'మోదినావు' (౨ ఆ. ౧౪౭.) రుద్రకవి నిరంకుశోపాఖ్యానములో ఒక్క సీసపద్యములోనే 'పట్టినావు - కోరినావు - నడచినావు - పడినావు కాచినావు' (3 ఆ. ౨౯.)కుందుర్తి వేంకటాచలకవి మిత్రవిందాపరిణయములో 'చదివినావు-రచి యించినావు-ఘటియించినావు-దాటించినావు-అలరినావు.' (కవులచరిత్ర. ౪౪3 పు.) అప్పకవి-దాఁచినావు. (౨ ఆ. 3౦.) ఇచ్చినావు. (౪ఆ. ౪౧3-౪౧౪-౪౧౫ప.) కూచి మంచి తిమ్మకవి రాజశేఖరవిలాసములో 'చాలినావు' (౨ఆ. ౭.)కృష్ణయ ఇందుమతీపరి

కాలములోని ప్రామాణిక కవి ప్రయోగములను జూపుట యావశ్యకము. "ఉన్నాను - ఉన్నావు - ఉన్నాము - చేయుచున్నాను - చేయుచున్నాము - చేయుచున్నావు." అను రీతిగల ప్రయోగములు నన్నయ భారత భాగముందే కాక తిక్కన శ్రీనాథాదుల గ్రంథములందును లేవు. అవి ప్రాచీన ప్రామాణిక కవిప్రయుక్తములు కావు. వీనిని సూత్రి విడిచి తక్కినవానిని సాధించు టుచితము.

ఇంక ౨౯౬-౨౯౯ విషయములలో సాధింపఁబడిన సమాపక క్రియారూపములను ౨౬౪-౨౭౧-౨౩౧ I విషయములలో సాధింపఁబడిన విధేయ విశేషణ రూపములు నేకాకారము లగుట విరుద్ధముకాదు. విధేయ విశేషణముల నొక రీతిని సమాపక క్రియల నొకరీతిని సాధించుకొనుట సంప్రదాయము. విధేయ విశేషణములు సైతము సమాపక క్రియలవలెనె వాక్య సమాప్తిని జేయునవై యుండును. కాన వాని యందలి తచ్ఛబ్ద వకారలోపము గలిగి స్వరసంధి జరిగిన స్థలమందు సంహిత మఖండపదమందు వలెనె ప్రాణి యతని మహాకవులు ప్రయోగించిరి. ఉ.............కొల్వఁబూని యు। న్నా రటు గాక మీ కది మనంబున కప్రియమేని. (ఉద్యో. ౩ ఆ. ౨౮౪.) గీ. అబల నీమంత్రబలమున నరుగుదెంచి। నాఁడ నీవాఁడనైతి మనః ప్రియంబు। (ఆర. ౭ ఆ. ౨౬౦.) సీ.........కల్పించి, నాఁడఁ గావున నీమనంబునందు। (ద్రోణ. ౨ ఆ. ౧౭౦.) తే-గీ. నాకు దక్షిణాయములో 'నేర్చినావు' (౩ ఆ. ౪.) పాపకవి చెన్నబసవపురాణములో 'తలంచినావు' (౧౨౭ పుట.) పుష్పగిరి తిమ్మన సమీరకుమారవిజయములో 'పలికినాను' (౩ ఆ. ౧౦౪.) వ్రాల్చినావు. (౪ ఆ. ౨౨౫) దిట్టకవి నారాయణ రంగరాయ చరిత్రములో 'నడచినాము - పంచినావు' (౨ ఆ. ౧౭౧.) కంకంటి పాపరాజు ఉత్తర రామాయణములో 'హసించినావు' (౮౨ పు.) వచ్చినావు. (౧౮౭ పు.) వచ్చినాను (౧౨౦ పు.) ఇట్లు ౧౬-౧౭-౧౮ శతాబ్దములలో అనేక కవులు.........ప్రయోగించినారు." (బాలక. ౨౨౭-౨౨౮ పు.). "నన్నయ తిక్కన నన్నిచోడుఁడు ఎర్రన-జక్కన - మారన శ్రీనాథుఁడు మొదలు పూర్వాంధ్రకవులు ఇవి ఏవీ వాడలేదు." (బాలక. ౨౩౦ పు.) గాణపత వివరణకర్త చూపినవి చాలవఱకీ ప్రయోగముల లోనివె. "చూచినావు" (శుక. ౧ ఆ. ౧౭.) 'కనుపట్టుచున్నావు' 'తక్కువయినాను' (పార్వ. ౩ ఆ. ౭౯-౮౦.) శా. కానీరా.........వి। న్నా నేనున్. (శశాంక. ౩ ఆ. ౬౯.)" అనునవి చేర్పఁబడినవి. (గాణ. ౩౧౪ పు) ఇట్టి రూపముల నర్వాచీన కవులు ప్రయోగించుటచే నివి నేటి వైయాకరణులు సంగ్రహించు టుచితమే కాని యథర్వణుఁడు వీని నుపదేశించె ననుట సరికాదు.

ణగా నిచ్చినాఁడ వింక. (శాంతి. ౨ ఆ. ౮౭.) తే-గీ.........చెంది। నాఁడ లోభాదు లొందవు నన్ను నింక. (శాంతి. ౪ ఆ. ౫౨.) గీ. నన్నుఁ గనలించి బ్రతుకఁ గన్నారు లేరు. (ఉ. హరి. ౪ ఆ. ౬౦ ప) భట్టారకుఁడు "చదువుచున్న వాఁడను" మున్నగువాని వంటి రూపములను విశేషణరూపములుగనె కాక సమాపక క్రియా రూపములుగను బ్రయోగించుచు వచ్చెను. ఆంధ్రశబ్దచింతామణి యట్టి రూపములనె సమాపక క్రియలుగ సాధించుచున్నది. తరువాతఁ దిక్కయజ్వ మొదలగు నన్న మహాకవులు 'చదువుచున్న వాఁడను - చదువుచున్నాఁడను. చదువుచున్న వాఁడు - చదువుచున్నాఁడు.' అను రీతిగల వకార ఘటిత రూపములు లుప్త వకారక రూపములును విశేషణములుగను సమాపక క్రియలుగను బ్రయోగించిరి. కావున వారి కాలము వాఁడగు నథర్వణుఁడు తచ్ఛబ్ద వకార పాక్షిక లోపము నుపదేశించినవాఁ డయ్యెను. (౨౧౦ VIII విష.) పిదప ధూర్జటి మొదలగు నన్న మహాకవులు డకార రేఫ లోప ఘటిత రూపములను సైతము—చదువుచన్నాను - చదువుచున్నాము మున్నగు వానిని సైతము—ప్రయోగించిరి. నేఁటి కాలపు సూరి యిట్టి వానిని (బా. క్రి. ౫౬ సూ.) సంగ్రహించుట యుక్తమె కాని సూరి ప్రాచీన మహాకావ్యభాషను మాత్రమె సంగ్రహింప నుద్యమించినవాఁ డగుటంజేసి యట్టి రూపములను సాధించుట సరికాదనక తీరదు. (మూ. ౨ విష.) ఇట్టి రూపములు చింతామణి సాధితము లనెడి భ్రాంతి బాలసరస్వత్యహోబల పండితులు చేసిన యపవ్యాఖ్యల మూలమున (౨౯౯ విష.) సూరికి సంభవించుటచే సూరి యిట్టి పొరపాటునకు లోనయ్యెను. ప్రయోగములు:—నన్నయ:—ఆ-వె.........కృష్ణ యనఁగఁ బంకజాక్షి।యుద్భవిల్లెఁ బెరుఁగుచున్నది తత్స్వయం। వరము సేయుచున్న వాఁడు వాఁడు. (ఆది. ౭ ఆ. ౩౬ ప.) సీ. విషయోపభోగాభిలషణ మింకను నాకు వదలక పెరుఁగుచున్నదియుఁ గాన। ......... (ఆది. ౩ ఆ. ౯౫.) సీ.........ధృతరాష్ట్ర నందనుల్.........ఆ-వె. నిద్ర లేక తమకు నిలుచు నుపాయంబు। లొండు దక్క వెదకుచున్న వారు. (ఆది. ౬ ఆ. ౨౮౧.) (ఇచటి స్వరయతిచే నిది సమానపదము కాదని శంకింపరాదు. తే-గీ. అనఘ మా మామ శకుని నాకై కడంగి. (సభా. ౨ ఆ. ౧౭౪.) సీ.....ప్రజాపతు। లందఱింత్యాత్మకుండైన యట్టి. (అశ్వ. ౨ ఆ. ౧౬౨.) ఇట్టివెల్ల—నాకై - ప్రజాపతు లందఱ్—సమానపదములు కావనఁ జాలముగదా.) వ.........అట బకాసురుండును ఆ-వె. ప్రొద్దు నేఁడు పెద్ద వోయె నిత్యము నిట। తెచ్చి యిచ్చు బలియుఁ దెచ్చి యీఁగ। నొల్ల కెలుఁగు లిచ్చుచున్న వాఁ డమ్మను। బాధముండు

మెచ్చఁ డయ్యె నటుచు. (ఆది. ౬ ఆ. ౨౯౨-౨౯౩.) ఈవర్తమాన రూపములు వ్యస్తముగాఁ బ్రయోగింపఁ బడుటయుఁ గలదు. మ. థ్యాత్కరము......తపము। మానుశాఁ జేయుచు నున్నవాఁ డేల మసలెనో రాక।......... (ఆర. ౧ ఆ. ౩౯౨.) చేయుచున్నవాఁడు మున్నగు సమాపక క్రియలందు "చేయుచు+ ఉన్న" మున్నగు రీతిని నపదాది నిత్యస్వరసంధియని యెఱుంగునది. 'చేయుచు నున్నవాఁడు - చేయుచునుండె - చేయుచునున్న' మున్నగు చోటులందు శత్రర్థక చువర్ణక పాక్షికసంధ్యభావమని యెన్నఁగును. 'ఉన్నవాఁడు' అనునది సమాపక క్రియ యన్నను ననవచ్చును. సీ.............ఆ-వె.........కందర్ప బాధిత యగుచు నున్నయది ధరాధినాథ. (ఆర. ౨ ఆ. ౨౬.) ఇచట నైతము 'అగుచున్'। అనునది వ్యస్తమె యనియు 'ఉన్నయది' అనునది విధేయ విశేషణమనియు గ్రహింపవలయును. మత్త. భూరి సత్త్వులు సర్వలోక విభుల్ విభూతి సమృద్ధు లి। ద్ధోరు తేజులు నిన్నుఁ గోరుచు నున్నవా రమరోత్తముల్. (ఆర. ౨ ఆ ౪౯.) చ.........నిన్ను నీ సహో। దరులు నిరంతరంబును ముదంబునఁ జూడఁగఁ గోరు చున్నవా। రరిమదభేది..........(ఆర. ౪ ఆ. ౮౮ ప). సీ.........ఆ-వె............। మునివరేణ్య శాపమునఁ జేసి యిప్పాట। నవము చున్న వాఁడ, నాటఁ గోలె. (ఆర. ౪ ఆ. ౧౭౯.) వ.........నీవు నధర్మ ప్రవృత్తుండవై......... కౌరవుల కాపద యాపాదించుచున్నవాఁడవు. (సభా. ౨ ఆ. ౪౪ గద్యము) ఇట్టివి సమాపక క్రియ లనుటలో బాధయేమియు లేదు.

తిక్కనాదుల వాడుకలు:—క. కరముత్సహించుచున్నాఁ। డరయ నతని వచన రచన నంతయుఁ దెలిసెన్. (ఉద్యో. ౩ ఆ. ౩౭౯.) తే-గీ. భీమతనయుండు మాయఁపుఁ బెనకువలను। గర్ణు నొప్పించుచున్నాఁడు......(ద్రో. ౫ ఆ. ౨౧౨) క. లక్కయిలు గాలినది మొద। లక్కట మాతల్లి మాకునై నెవ్వగతోఁ। బెక్కుడు మలఁ బడుచున్నది... ....(ఉద్యో. ౩ ఆ. ౧౩౬.) తే-గీ.........ఆడుఁ। బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ। వు.........(విరా. ౨ ఆ. ౫౦.) (పుట్టినాఁడవు = పుట్టితివి.) క. గోవులకు వెనుకయై వెసఁ। బోవుచు నున్నారు......... (త్రిగర్తులు కర్త) (విరా. ౩ ఆ ౧౩౮.) క.........ఉ। న్నారమని పలుకుదురు నిజ। మారయ............(ఉద్యో. ౨ ఆ. ౬ ప) సీ దేవలోకంబున నీవిప్పు డెవ్వత.........లోలాత్మఁగాఁ జేయుచున్నాఁడవు.........(స్త్రీ. ౨ ఆ. ౮౧.) మ..........కౌతూహలం। బెలయంగాఁ బ్రియకామినీ సహితుఁడై యేతెంచు చున్నాఁడు.........(ఆరణ్య. ౫ ఆ. ౩౮౩.) చ. అనఘుఁడు మిమ్ముఁ జూచుటకునై

యిట వచ్చుచునున్నవాఁడు.........(అర. ౪ ఆ. ౧౫౦.) (ఎఱ్ఱాప్రెగడ.) గీ. మఱియు నినుఁ జూచుచున్నాఁడు మగువ వాఁడె। దీప్తభుజుఁడైన కాళింగదేశ విభుఁడు. (అర. ౬ ఆ. ౧౫౪.) ఉన్న కలన వర్ణముల మీఁది వకారము లోపింపఁగా నేర్పడిన శబ్దములు పైరీతిగల సమాపక క్రియల వంటి యాకారముతోనె యుండి వాక్యసమాప్తి నొదవించును. సంస్కృతము నందును నిట్టియెడల "అస్తి భవతీత్యాది క్రియాధ్యాహారము నైత మక్కఱలేదని చెప్పఁబడెను. "ఆఖ్యాతా స్తిబాదయః - తేషాంచ ప్రధానత్వం వాక్య సమాపకత్వాత్ - అతఏవా ఖ్యాతే వాక్య సమాప్తిః.........క్త - క్తవతు - కృత్యైశ్చ త్యేకే ప్రాహుః - కృత్యాశ్చ స్తవ్యాదయః - తథాహి రామేణ వనం గతమ్. రామో రావణం హతవాన్-సాధుభిః రామః స్మర్తవ్యః - ఏషు భవత్యాది క్రియాధ్యాహారో నాస్తి." (ముగ్ధ. దుర్గా. వ్యాఖ్య. ౩౧౬ సూ. వ్యాఖ్య.)

పయిరీతిగల వానిని విశేషణములుగా వాడుటయుఁ గలదు. సీ.......... కాలుఁడు చావ నేరి కెద్ది తే-గీ. తఱి యతండప్డు తెగటార్చు దాని నీవు। చేసినాఁడవుగా మదిఁ జింత సొనిపి। యుడుగు టొకవెట్టి. (శాంతి. ౧ ఆ. ౨౮౨.) తే-గీ ........రూప విహీనులు దారు రూపు। గలిగి తోలుమేనఁ గొనటులఁ బలికినారు. (కొనటి = కురూపి.) (అను. ౫ ఆ. ౯౩.) 'పలికినారు' అనునది విశేషణమె. ఇది సమాపక క్రియ వంటిది కాదు. (ఎవరు తోలుమేనఁ గురూపుల (కొనటుల)ను వెక్కిరించిరో వారు రూపహీనులు.) చ. జ్వరమున గుల్మపీడ నతి సారమునన్ బలు పుండులన్ మహా। దరమున వాత పిత్త కఫదారుణ రోగములన్ నిరంతరా। తురు లగు వారు నిర్దయతఁ దొల్లి వినోదము గాఁగ జీవులం। దరమిడి చంపినారు గురుఁ దల్లడ పెట్టినవారుఁ బార్వతీ. (అను. ౫ ఆ. ౧౦౩.) (ఇందు 'చంపినారు' అనునది సమాపక క్రియాస్థానమున నిల్చినది కాదు. జీవులను దొలుమున నిర్దయముగాఁ జంపినవారును, గురుని దల్లడ పెట్టినవారును రోగములచే నిరంతరాతురు లగుదురని యర్థము.) ఈసందర్భమున నిట్టి ప్రయోగములు పెక్కు సోమయాజిచేఁ బ్రయోగింపఁబడెను. "పై పద్యములలో 'పలికినారు' ఉద్దేశ్యము. 'రూపవిహీనులు' విధేయము. అట్లే 'చంపినారు' 'తల్లడ పెట్టినవారు' అనునవి యుద్దేశ్యములు. 'ఆతురులగువారు' విధేయము." అను విషయము పై యానుశాసనిక పద్యసందర్భమును బట్టి యంగీకరింపకతీరదు.

లిఙ్లోట్టుల డుజ్జున కెను - ను-వర్ణంబు లగు. ౯౬.

లిడాదేశంబగు డుజ్ఞునకు - ఎను - అనునదియు

లాఁడాదేశంబగు డుఙ్ఞునకు - ను - అనునదియు నాదే
శంబులగు.

బాలవ్యాకరణ భూతంబునం దిగాగమం బగు. ౧౭.
వివరణము. భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు.
300 విష. లిట్టు వుఙ్ఞు పరంబగునపుడు తివర్ణకం బగు. ౧౫.
ఇకారంబు వీరాఁది కు - ను - వు - క్రియావిభక్తుల
యను సూత్రముచే రుఙ్ఞున కిత్వంబు. ప్ర. వండెను -
వండిరి. మ. వండితివి - వండితిరి. ఉ. వండితిని -
వండితిమి.

సంజీవని. 300 విష:—౧౬ సూ - వ్యాఖ్య:—భూతార్థమునందును
దద్ధర్మాద్యర్థము లందును ప్రథమపురుషైక వచనమున డుఙ్ఞు నిలువదు. కాన లిట్టున
కాదేశమగు డుఙ్ఞునకు 'ఎను' అనునదియు లాట్టున కాదేశమగు డుఙ్ఞునకు 'ను'
అనునదియు నాదేశము లగునని సూరి సూత్రించెను. బా - క్రి - 3 సూత్రముచే
లిట్టును, ౫ సూత్రముచే లాట్టును విధింపఁబడెననియు నట్టి లిఙ్లాట్టుల ప్రథమ
పురుషైక వచనమున 'డుఙ్ఞు' బా - క్రి - ౮ సూత్రమున విధింపఁబడెననియు నట్టి
'డుఙ్ఞునకే' ప్రకృత సూత్రముచే 'ఎను - ను' వర్ణకము లాదేశము లయ్యెననియు
నెఱుంగునది. బాలవ్యాకరణము పక్షమున ద్రుతము నుస్వరూపము గాన 'ఎను-ను'
వర్ణకములలోని 'ను' ద్రుతస్వరూపము. చింతామణి పక్షమున నిట్టి రూపములు
సాధువులు కావు. 'చదివెన్ - చదువుదున్' అని రూపసిద్ధికల్గును. నన్నయ భారత
భాగమున "చదివెను - చదువును" అను 'ను' స్వరూప ఘటిత ప్రయోగ మెచ్చటను
లేదు. (చిం. వి. పరి. ౧3౪-౧3౫-౧3౬ విష.)

యవర్ణము వచ్చు ధాతువుల భూతార్థ ప్రథమైక వచనములగు 'ఆయెన్ -
పోయెన్' మున్నగు వాని లోని 'యె' అనునది వ్యవహారమున నపభ్రష్టమై 'య'
అనునదిగా వినఁబడుటయుఁ గలదు. ఇట్టి యెడల 'అ'త్వ ముండరాదని "అద్యః
క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః" అను చింతామణి వచనము
విశదపఱుచుచునే యున్నది. అట్లయినను నట్టివాఁడుక యాముక్తమాల్యదాకారు
నిచే నాదరింపఁబడినది. చ........వసంతుఁడు దా దయచేసెఁగాక యా। యలె
నిజశక్తి నా యనుచు నా పసకుం గొదవెట్టె నీసునన్. (ఆము. ౫ ఆ. ౧33) ఇట్లే
యొకరిని జూచి యొకరు వాడసాగిరి. "శా. అయోధ్య నీసుతు గ్రద్ద తన్నుకొని
పోయన్. (పంచ. ౧ ఆ.) (వేంకటనాథకవి.) ము. అని శాపావధి చెప్పి ముద్గలుఁడు

పోయన్ బోవ నాలోన. (పాచ. ౪ ఆ.) శా. అయ్యె న్నాలవజాము చొచ్చెఁ దడ వాయన్ వచ్చి.........(పంచ. ౪ ఆ) ఇయ్యవి ప్రాదూదికంబులు." (బా. గు. ప్ర. ౩౧౩ పు. ద్వి. ము.) కవు లిట్టి విశ్రమస్థానమున బుద్ధిపూర్వకముగఁ బ్రయోగించుటచే వీనికి సాధుత్వము నాధునిక వైయాకరణులు ప్రసాదించుట యుక్తమని తోఁచెడిని. ఇందు 'ఆయలె' అను నాముక్తమాల్యదా ప్రయోగమును వ్రాసి వేయఁ జాలక శబ్దరత్నాకరకర్త యీ క్రిందిరీతిని మార్గాంతరమున సమర్థించెను. "ఆయలే. దే - అవ్య. (ఆ+అ+లెమ్ము.) అనాదరమును దెలిపెడిని. చ.........ఆ । యలె నిజశక్తి నా.........(ఆము. ౫ ఆ.)" (శ-ర). కవులు కోరి చేసిన ప్రయోగము నిట్లనర్థాకరించుట సరికాదని తలఁచికావలయు సూ - రా - నిఘంటుకర్త లిట్లు వ్రాసిరి. "ఆయలె (లే) అవ్య (∠. అగు. ఆయెన్+లే = అయినదిలే. ఇది క్రమముగా భ్రష్టమై 'ఆయలే - ఆయలె' అని గ్రాయి యుండును. ('ఆ+అ+లెమ్ము' - అని - శ - ర.) ఆనాదరమును దెలుపును. చ.........ఆ । యలె నిజశక్తి నా...... ...(ఆము. ౫ ఆ. ౧౩౩.)........." (సూ. రా. ని.).

౧౬ సూ - వ్యాఖ్య:—భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమం బగునని భూత సాధారణముగా వచించుటం జేసి 'వచ్చితిని' మున్నగు సమాపక క్రియలందే కాక "వచ్చినది - వచ్చినన్" మున్నగు భూతార్థక విశేషణ చేవాద్యర్థకములందు సైతము 'ఇ' గాగమం బగునని యెఱుంగునది. 'ఇక్' అని కిత్తుగా నుపదేశించుట చేత ధాతువునకుఁ దుదిని నిల్చునని గ్రహింపనగును. క్త్వార్థమందు వచ్చు 'ఇ' అనునది (బా. క్రి. ౩౭ సూ.) ప్రత్యయ మగుటం జేసి వేఱుగఁ జెప్పఁబడెను.

౧౭ సూ - వ్యాఖ్య:—లిట్టున కాదేశమగు 'వుణ్ణు' అనఁగా 'వు - రు, ను - ము' అను వుణ్ ప్రత్యాహారము. ఈ ప్రత్యయములలో నేది పరమైనను ధాతువునకు 'తి'వర్ణకము చేరును. 'వుణ్ణు' పరమగునపు డనుటచేతఁ బ్రథమపురుషైక వచన బహువచనములు పరమగునపుడు 'తి'వర్ణకము రానేరదని యెఱుంగునది. ప్ర. వండు+ఇ+ఎను = వండెను. అపదాది స్వరనిత్యసంధి (బా. సంధి. ౧౧ సూ.) యయ్యెను. వండు+ఇ+రు = వండిరి. ఇట, బా - తత్స - ౨౬ సూత్రమగు "ఇకారంబు మీఁది ఉ - ను - వు - క్రియావిభక్తుల యుత్వంబున కిత్వంబగు." అను సూత్రముచేఁ బ్రథమపురుష బహువచన రుప్రత్యయోకార మికారమయ్యెను. ఇట్టి యుత్వము 'రుణ్ణు' పరంబగునపు డనఁగా 'రు వు-రు-ను-ము' అను రుణ్ ప్రత్యాహార ప్రత్యయములలో నేది పరమైనను వచ్చునని సూరియే వివరించెను. మ-వండు+ఇ+తి+వు = వండితివి. ఇట్లె తక్కినవాని ప్రక్రియ నరయునది. ఉత్తమ

పురుషైకవచన 'ను' ప్రత్యయము ద్రుతస్వరూప మగుటచే వాని యుత్త్వమున కిత్త్వము వచ్చిన 'వండితిని' మున్నగు వాని లోని 'ని' అనునదియు ద్రుతస్వత్వ రూపమె యని గ్రహింపవలెను. కావున బా - సంధి - ౨౦ సూత్రము చొప్పున 'వండితిన్ - వండితి' అను రూపములును లభించును. చింతామణి పక్షమున ద్రుతము నకార స్వరూపమె యయ్యెనను 'వండితినిన్' అనునది చింతామణి సమ్మతరూపముగానఁ దత్పక్షమునందు 'వండితినిన్ - వండితిని - వండితిన్ - వండితి.' అను రూపములు సిద్ధించునని యెఱుంగనగును. ప్రయోగములు:—చ. ఉరుతర.........కాం। చిరి నవభారభ......(సభా. ౧ ఆ. ౧౭౩). క.........కుదో। ద్ధతిమైఁ బరాజితులఁ జే। సితి వారల కిట్లు.........(సభా. ౨ ఆ. ౧౮౬.) ఉ.........ధారుణీతలం। బెల్లను నొడ్డి యోటువడియెన్.........(సభా. ౨ ఆ. ౧౯౪.) క. తెల్లము నేసితిరి బ్రదికితిమి మీకరుణన్. (విరా. ౧ ఆ. ౧౪౨.) క.........అతి నిర్మల సఖ్యము చేసితి బ్రహ్మాదులును...(శాంతి. ౬ ఆ. ౪౫౪.) భావిని వివక్షించు భూతము:— క. మానవపతి నన్నొక్కఁడి। దానవు నీవనియు నేని ద్రౌపదికడ స। మ్మానమ్ము వడసి మెలఁగుదు। నా నగరుల నృత్యగురువ ననఁగలవాఁడన్. (విరా. ౧ ఆ. ౯౦.) సీ.........సిద్ధుఁ డమరుఁడు మీయేడ్పు, లాలించి దయ బాలు నసువు లొసఁగె ఆ-వె. నేని మేలకాదె యిది యేల పోయెద। రనిన.........(శాంతి. 3 ఆ. 322 గృధ్రజంబుకోపాఖ్యానములోనిది.) కొన్ని వింతభూతములు:—క...... వంశహీనత ముమ్ముం। జేరక యుండఁగఁ దగఁ బరి।హారము నేసి తడి యేల యవగుణ మయ్యెన్.('అది యేల యవగుణ మగును'అని వాడఁదగిన స్థలము.)(అను.౨ఆ.౨౧౬) క. నెయ్యము సెడినను మాటల। తియ్యఁ దనము వట్టి పగ మదిన్ మఱచినఁ జా। వయ్యెం జేటయ్యెఁ గలఁక।యయ్యె నొకటి మూఁడుఁగాక యది మేలగునే. (శాంతి. 3 ఆ. ౨౫౬.) (ఇటఁ జావుగాని చేటుగాని కలఁక గాని యొకటి మూఁడు (సంభవించును) నని యర్థము ) ఆ-వె. ఎచట మెలఁగె నేమి! యెట్లుండె నేమి! దా। నేమి నేసె నేమి యెల్ల సంగ। ములును విడిచెఁ గుడుపువలన నియతి గల్గు। యతికి మోక్ష వీథి యాట పట్టు. (అను. ౫ ఆ. ౪3.) (ఎచట మెలఁగుఁ గాక - ఏమిచేయుఁ గాక......... ఏమిలోపము. సుఖానుభవమున నియతిగల మునికి మోక్షము సులభమని యర్థము.) సీ.........। ఎంత కోపించిరో యేమని వగచిరో, తృషనెట్లు తూలిరో దిక్కుమాలి। రి............(భాస్కర. అయో. ౧౮౧ ప.) (దశరథ బాణ హతుఁడై పలవించు బ్రాహ్మణకుమారుని వాక్యములు. అతని తలిదండ్రు లింకను వగచుచునే యుందురు గాన నిట వర్తమాన క్రియలు ప్రయోజ్యములు.). వర్తమానమున

భూతము:— శా.......వీఁడె వ। చ్చెం గుంతీసుత మధ్యముండు.........(విరా. ౪ ఆ. ౯౫.). "కొన్ని యెడలఁ ద్వరితార్థ సూచకంబయి భావిని భూతంబు చూపఁబడెడి. ఉదా: ఉ..........శా। వచ్చె సుదర్శనాయుధుఁడు.........(భాగ. ౧౦ స్క. ప్రాథ. క్రియా. ౭ సూ.)". యత్తచ్ఛబ్దాన్వయ భూతము:— ఈమంత్రంబునని వెయ్యేని నొక్క వేల్పు నారాధించి తద్వేల్పు నీకొసఁగిన యట్టి పుత్రకుల నిచ్చు. (ఆది. ౫ ఆ. ౧౮ ప.) సీ..........। ద్రోణ గాంగేయులు దురిత విదూరులు ని న్నెద్ది గఱపిరి నెమ్మితోడ। దానిన చేయుట ధర్మవు.........(ఆది. ౮ ఆ. ౪౩) ఆ.వె. ఇందు లక్ష్య మెవ్వఁడేసె నాతని వరి। యింపు నెమ్మితోడ నిందువదన. (ఆది. ౭ ఆ. ౧౭౨.) సీ..........కమలాక్షి యెవ్వరి, యింటఁ దానుండె నయ్యింటి వలనఁ। బెఱవారు చనకుండ............(ఆది. ౮ ఆ. ౧౧౫.) తే-గీ. వీర లిరువురు మాన్యులు వీరితోడి। కయ్యమున కిప్డు మనమంత గాలుద్రవ్వ। వలవ దెచ్చోటు నెదురుగా మెలఁగి రచట। మనరథం బల్లనల్లన చనఁగ నిమ్ము. (విరా. ౫ ఆ. ౧౦.) క. ధృతరాష్ట్రుం డిట మీఁదను। సుతులును శకునియును సూత సుతుఁడును దను నే। గతి నడపించిరి వారల। మతమె యనుష్ఠించుఁ గాక మరలం బడు నే. (ఉద్యో. ౧ ఆ. ౩౧౭.) చ..........నీగురువు.........ఎట్లు సె। ప్పె నటుల భక్తిమై నడవు (ము) .........పెంపెసలార.......... (విరా. ౧ ఆ. ౨౫౨.) చ..........ధీరతయున్ వెరవుం జలంబు నె। వ్వారి దెసఁ గాంచి తెక్కుడుగ వారి నుతింపుము......(కర్ణ. ౨ ఆ ౨౮.) ఎ-గీ..........అచ్యుతుండు। నెట్లు దనకు రుచించెఁ దానట్లు సేయు. (ద్రోణ. ౫ ఆ. ౩౭౯.) క. మన సంవాదం బెవ్వరు। విసిరి నియతి నజ్జనులకు విభవము..........కల్గు నుత్పలనయనా. (అను. ౫ ఆ. ౩౦౮.) తే-గీ..........ఆహంస డిభకు లే నాఁట నేది। నడపి రది చెల్లుఁగాక వర్ణములకెల్ల. (ఉ. హరి. ౪ ఆ. ౧౦౩ ప.)

ధాతువుల భూతార్థక విశేషణ రూపములు సయితము విధేయతా వివక్ష యందుఁ దచ్ఛబ్దంబుతోఁ గూడినవై భూతార్థక సమాపక క్రియల స్థానము నధిరోహించును. అయ్యవి విశేషణ మాత్రములుగను నుండవచ్చును. ఉ. ఆదిజుఁడైన బ్రహ్మ యుదయంబున కాస్పద మైనవాఁడు వే। దాది సమస్త వాఙ్మయములందుఁ బ్రశంసితుఁ డైనవాఁడు.........(సభా. ౨ ఆ. ౬౮.) తే-గీ..........ఆఁడుఁ। బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ। వట్లు. (విరా. ౨ ఆ. ౫౦.) తే-గీ. నీతనూజుల నిక్కము నిగ్రహింపఁ। దలఁచినాఁ డమ్మహాత్ముండు.........(ఉద్యో. ౨ ఆ. ౩౧౮.) సీ. సంప్రీతి నొసగంగ జన్మించినాఁడవు. (ఉద్యో. ౪ ఆ. ౫౯.) చ..........ఇమ్మ

హీన్ । జననము నొందినారరు.........(అర. ౪ ఆ. ౧౮౧.) సీ.........కల్పించి। నాఁడఁ గావున నీమనంబునందు.........(ద్రోణ. ౨ ఆ. ౧౭౦.) విశేషణముగాఁ బ్రయోగించుటః—క. జనపతులు రాజసూయం । బొనరించినవారు శక్రునొద్దన్ సురపూ । జ లొందుచుందుదురు. (సభా. ౧ ఆ. ౮౮.) సీ.........తే-గీ......... దాని నీవు । చేసినాఁడవు గా మదిః జింతసొనిపి యుడుకుట. (శాంతి. ౧ ఆ. ౨౮౨.)

కల జ్జానుబంధంబు ల్భట్టు పరంబగునపు డగు. ౧౯.
ల్భట్టు పరంబగునపుడు ధాతునవును 'కలజి' అనునది
యను ప్రయుక్తంబగు.

బాలవ్యా. జీత్తు పరంబగునపు డుత్త్వంబున కత్వంబగు. ౨౦.

వివరణము జీత్తు పరంబగునపుడు ధాతువు నుత్వంబున కత్వంబగు.

౩౦౧ విషయము కలజె పదజులు పరంబు లగునపుడు నుగాగమం
బగు. ౨౧.
ద్రుతకార్యంబు. ప్ర. వండఁగలఁడు - వండఁగలరు.
వండఁగలదు - వండఁగలవు. మ. వండఁగలవు - వండఁ
గలరు, ఉ. వండఁగలను - వండఁగలము.

సంజీవని. ౩౦౧ విష:—౧౯ మొ. ౨౧ సూ:—ల్భట్టు పరంబగునపుడు ధాతువునకు 'కలజ' అనునది యను ప్రయుక్తమగును. వర్తమానార్థమునందు 'ఉన్న' అనునది చేరునట్లె భవిష్యదర్థమున ధాతువు తుదిని 'కల' అనునది చేరును. జీత్తు పరంబగునపుడు ధాతువు తుది నున్న 'ఉ'కార మకార మగును. (విస్తర.) భవిష్య

విస్తర. ౩౦౧ విష:—ఆంధ్రభాషానుశాసనమున నీ జీత్తులగు ప్రత్యయము లెల్ల 'అ'కారాదులుగ నె యుపదేశింపఁబడెను. అట్లగుటచేత పత్వ వత్వాది విధులు "అకారాది ప్రత్యయములును మధ్యమపురుష ము డు వర్ణకములును పరమగు నవుడు చే - ఇంచేల చేకారమునకును తలఁచే మున్నగు కొన్ని ధాతువుల చేకార మునకును పకారము బహుళముగా నాదేశమగును." (ఆం. భా. అ. క్రియా. ౭౬ సూ.) అనురీతి నుపదేశింపఁబడెను. కాని యీ చేసిన మార్పు ననేక స్థలము లందు గ్రంథకర్త మఱచుటచే "చొరుక - చూడుక - తేరుక - (క్రియా. ౭౭ సూ.) ఏతేయక - (క్రి. ౭౮ సూ.) చాయక నోయక" (క్రియా. ౮౫.) మున్నగు ననిష్టరూపములు దుర్వారము లగుచున్నవి. "అకారాది ప్రత్యయములు పరమగు నవుడు అగు - వచ్చు - చొచ్చు - చూచు - ఇచ్చు - తెచ్చులకుఁ గ్రమముగా కా - రా - చొరు - చూడు - ఈ - తే - తేరు - లగును. అగుచోఁ బ్రత్యయ

దర్థము నందలి 'కలజే' యనునదియుఁ గర్థార్థమునందలి 'పడుజే' అనునదియుఁ బరంబు లగునపుడు పైసూత్రము చెప్పిన వచ్చిన 'అ'త్వమునకుఁ దర్వాత 'ను' అనునది యాగమంబగును. 'ను' అనునది ద్రుతస్వరూపము గాన బా - సంధి - ౧౬-౨౭ సూత్రముల చెప్పిన 'కలా'నుబంధ కకారము గకారమగుటయు దానికి ముందున్న ద్రుతమునకు ఖండపూర్ణ బిందుసంశ్లేషములు పర్యాయమున వచ్చుటయు సంభవించును. ఉదా:—వండు+అ+ను+కల+డు=(బా. క్రి. ౭-౮-౧౨ సూ.) వండఁగలఁడు-వండంగలఁడు-వండన్గలఁడు. మొ. ఇట్లె తక్కిన పురుషవచన రూపముల ప్రక్రియ నరయునది. జే+ఇత్ = జీత్ = జీత్తు. జకార మిత్తుగాఁ గలది బింపపూర్వకంబగు. (బా. తత్స. ౧౯ సూ.). 'జే' అనునది యుద్వర్ణముగాఁ గలది పరమగునపుడు ముందటి 'ఉ' కారము 'అ'కారమగును. (౧౨౭ విష. చూ.) తిర్యగ్జడ కర్తృకత్వమున - వండు+అ+ను+కల+దు (బా. క్రి. ౧౨ సూ.) = వండఁగలదు. ఇట్లె 'వండఁగలవు' అనురీతి రూపములను సాధింపనగును. మహతీకర్తృకత్వమున నేకవచనమందు 'వండఁగలదు' అనియు, బహువచనమునందు 'వండఁగలరు' (బా. ఆఖ్యా. ౨౬ సూ.) అనియును రూపములను సాధించుకొననది. "ఈ నుగాగమవిధాన మనావశ్యక మనియు

మూల మొదటి యచ్చు లోపించును." (ఆం. భా. అ. క్రి. ౭౭ సూ.) "ఏ తెంచు మున్నగు వాని లోని తెంచునకును - తే - తేరులగును." (ఆం. భా. అ. క్రి. ౩౮ సూ.) ౭౭ సూత్రము నందువలె ౭౮ సూత్రమునఁ బ్రత్యయాది స్వరలోపమిందు విధింపఁబడలేదు. అనువృత్తి చేయుదు మందురేమో? అనువృత్తి చేసినచో "ఏ తేరుక" అను ననిష్టరూప ముప్పతిల్లును. అనువృత్తి చేయనిచో 'ఏ తేయక' అను రూపము సిద్ధింపకతీరదు. ఇట్లె యీసందర్భమెల్లఁ జెడినది. "అకారాది ప్రత్యయములు ము - డు వర్ణకములును పరమగునపుడు - చచ్చు - నొచ్చులకుఁ గ్రమముగా 'చా (చావు - ముద్రణ భ్రష్టము కాఁబోలును.) నో, నోవు' బహుళముగా నాదేశములగును," (ఆం. భా. అ. క్రి. ౮౪ సూ.) ఇందును బ్రత్యయాది స్వరలోపము విధింపఁబడలేదు గాన 'చాయక - నోయక' అను ననిష్టరూపములు గల్గుచున్నవి. ప్రత్యయాది స్వరలోపము చెప్పినచో "నోవుక - చావుక" అను ననిష్టరూపములు గల్గుచున్నవి. బాలవ్యాకరణ సూత్రములకుఁ దలవిఱుపులుపెట్టి స్వీకరించునప్పుడు జాగ్రత్త యధికముగా నుండవలయును. ఈవిషయమును సంబంధించిన పెక్కు స్థలము లిట్లె దూషితము లయినవి. ఇట్లె ౮౬ సూత్రము నందును 'నాయక = నాయమి' మున్నగు ననిష్టరూపములగు. సూరి ప్రక్రియ కిట్టి చిక్కులెంతమాత్రమును గల్గనేరవు.

నుజ్యంతముల మీఁదఁ గలఁ డిత్యాది కలుగు ధాతురూపములు చేరుటం జేసి పైరూపములు గలిగెననియు ముందె యుక్తము." (బా. సా. వే. ౩౯౧ పు).
ముందె యుక్తముగా ౩౮౬ పుటలోఁ జెప్పఁబడెనని యాశయము. కాని పేటికా కర్త ౩౮౬ పుటలో నీరూపము లనావశ్యకములని చెప్పలేదు. "శత్రర్థ చువర్ణ భావ లక్షణ నుజులకు వర్తమాన భావికాల స్పష్టీకరణశక్తి లక్షణము ననుసరించి కలదని చెప్ప నవకాశము లేమిం జేసి లక్షణకర్త యుప్మార్గము ననుసరించెనని తోఁచెడి." (బా. సా. వే. ౩౮౬) అని వ్రాసెను, శత్రర్థక చువర్ణాంతములతో నుండు ధాతు లద్రూపములు చేరునపుడు వర్తమానార్థ స్పష్టీకరణము సంభవింపదనుట సత్యము కాదు. భావలక్షణార్థక నుజ్యంతముతోఁ గలుగు ధాతు లద్రూపములు చేర భావ్యర్థము తోఁచునని తలంచుటయు నసంగతమె. "భావలక్షణము - చైత్రుం డు వండ నతిథి వచ్చెను." (బా. క్రి. ౪౦ సూ. వి.) అనురీతిగల భావలక్షణార్థక నుజ్యంతముతోఁ గలుగు ధాతు లద్రూపములు చేరుననుట కేవలము నసంగతము. భావలక్షణార్థమున నేమో వివేకింపక పేటికాకర్త యట్లు భ్రమించెను.

కలుగు ధాతుజన్యరూపములు - కలఁడు - కలరు మున్నగునవి ప్రత్యేక ప్రయోగార్హము లయి వెలయుచున్నను నందు "కలను - కలము - కలవు" అను రూపములు భవిష్యదర్థక క్రియలలో నిల్పుట ప్రాచీనమహాకవి సమ్మతము కాదు.

"కలుగున కర్త్రర్థంబునందు లట్టు పరంబగునపుడు కల యగు. ౧౦౪ సూ. ప్ర. కలఁడు. కలరు. కలదు. కలవు. మ. కలవు. కలరు. ఉ. కలను - కలము". (బాల. క్రియా). "త్రర్థంబునం గలాదేశంబు విభాషనగు. ౧౦౫ సూ. ఎకి యెడుల లోపంబిట నిత్యంబు, కలవాఁడు - కలుగువాఁడు." (బా. క్రి. ౧౦౪-౧౦౫ సూ). ఈకలా దేశము కలుగు ధాతువున కర్త్రర్థకత్వమందును త్రాత్వర్థకత్వమందును లట్ పరకత్వమున నిత్యముగాఁ గల్గును. అర్త్రర్థకమగు నకర్మక కలుగు ధాతురూపములు కలాదేశకలితములు:—"(వాఁడు) కలఁడు - (వారు) కలరు - (అది) కలదు - (అవి) కలవు - (నీవు) కలవు - (మీరు) కలరు - (నేను) కలను - (మేము) కలము" అను నవి ప్రత్యేకప్రయోగార్హములై మాత్రమే కన్పట్టుచున్నవి. అందు "కలను కలము కలవు" అనునవి నన్నయభారతభాగమునఁ జూపట్టలేదు. ఇంకఁ త్రాత్వర్థక కలుగు ధాతుజన్య కలాదేశకలితరూపములు:—"కలవాఁడను - కలవారము - కలాఁడను - కలారము - కలవాఁడవు - కలవారరు - కలాఁడవు - కలారరు - కలఁడు - కలరు - కలవాఁడు - కలాఁడు - కలవారు - కలారు" అనునవి ప్రత్యేకప్రయోగార్హములగుచును భవిష్యదర్థకక్రియానుబంధములగుచును మహాకవులగ్రంథము

లందు వెలయుచున్నవి. భవిష్యదర్థకక్రియలలో "కలను - కలము - కలవు". అను తచ్ఛబ్దరేఫ దకార లోపకలితరూపములను నన్నయతిక్కనలే కాక ప్రాచీన మహాకవు లెవ్వరును బ్రయోగింపరు. అట్టి 'చేయఁగలను - చేయఁగలము చేయఁగలవు' అనియెడు భవిష్యదర్థక సమాపకక్రియారూపములను బ్రాచీన భాషానుశాసనతత్పరుఁడగు సూరి సాధించుట యుక్తముగా దనకతీరదు. అట్టి రూపములు చింతామణిచే సాధింపఁబడుచున్నట్లుగ బాలసరస్వత్యాహోబలపండితులు చేసిన చింతామణిసూత్రముల యపవ్యాఖ్యలే సూరిగారి యిట్టిరచనకు మూలముగ గ్రహింపనగును. (౭౯౬ విమ). "ఘటింపఁగలవు - చేయఁగలవు - ......ఘటింపఁగలను - చేయఁగలను.........ఇత్యాది". (అహో. ౪౮౦పుట). సోమయాజిసైతము భవిష్యదర్థకక్రియలను బ్రయోగించునపుడు నన్నయరీతిని దచ్ఛబ్దవకారఘటితరూపములను మఱియు లుప్తవకారకరూపములను వాడెనేకాని రేఫ దకారలోపరూపములను (చేయఁగలను. చేయఁగలము. చేయఁగలవు) దచ్ఛబ్దవాకార లోపరూపములను (చేయఁగలఁడు. చేయఁగలరు) వాడలేదు. ఎఱ్ఱాప్రెగడ వాకారలోపరూపములను వాడినను రేఫ దకారలోపరూపములను వాడలేదు. ఇట్లని "చేయఁగలను - చేయఁగలము-చేయఁగలవు" అనుఁరీతి రూపములు నేఁడసాధువు లనరాదు. అట్టివి సయిత మర్వాచీనకవులచే బ్రయుక్తములయి యున్నవి.

ప్రయోగములు:— నన్నయ— వ.........మీపంచిన విధంబ చేయంగలవారము. (ఆది. ౭ ఆ. ౩౨ వచ). తే-గీ. ఈతఁ డొడ్డిన ధనరాశు లెవ్వియైనఁ । బోఁడిగా నీకు నీఁగలవాఁడ నేను (సభా. ౨ ఆ. ౧౭౪ ప). క......మనుజులఁ । గావంగలవార మేము గౌరవయుక్తిన్. (అర. ౩ ఆ. ౩౮౪). తిక్కన:— క... మానవపతి నన్నెక్కుడి । దానవు నీ వనియెనేని ద్రౌపదికడ స । న్మానంబు వడసి మెలఁగుదు । నానగరుల నృత్యగురువ ననఁగలవాఁడన్ (విరా. ౧ ఆ. ౯౦). వ. అయ్యుర్వీశ్వరుండు తత్పూర్వ వృత్తం బడిగె నేనియు ధర్మపుత్త్రుతోడి మైత్త్రిం దగిలి యతని పాల వసియింతు ననఁగలవాఁడ. (విరా. ౧ ఆ. ౭౩ వచ.) వ......... అమ్మహీపతి నీ వెవ్వరివాఁడవని యడిగెనేనిఁ బాండవాగ్రజునకు బానసంబు సేయుదు ననంగలవాఁడ. (విరా. ౧ ఆ. ౮౪.) ఎవ్వరైనను మనవార్త లడిగిరేని ద్వైతవనంబున మమ్ము విడిచిపోయి రట యెఱుంగ మనఁగలవారు (విరా. ౧ ఆ. ౧౧౫ వచ). మ.........ఉ । న్నతిఁ బొందంగలవారమై యునికి కృష్ణా నేఁడుగా వచ్చెనే (ఉద్యో. ౩ ఆ. ౮౦). చ. జనులు వినంగ రాజ్యమున సాము గొనంగలవార మన్న. (ఉద్యో. ౩ ఆ. ౧౪౨). క. కయ్యము సేయక తగు సా । హాయ్యము సేయఁగలవాఁడ

నని పలికితి (భీష్మ. 3 ఆ. ౨౮౬). మ........ఏతత్ప్రాకారతా ఘోరచే। ష్టలు మానంగలవాఁడఁ బటు కురువై సాధించె సద్యోవధమున్ (శాంతి 3 ఆ. 3౨౫). ఉ. ఎవ్వరు సూచినం జగము లిన్నియు గెల్వఁగలారు లావునన్ (భీష్మ. ౨ ఆ. ౧౧). క. క్రూరులు, ద్రో, రా ద్దుర్గతి। ప్రాపింపఁగలారు (అను. 3 ఆ. ౭౦). ఆ-వె. సం। కరము సేయఁగలరు కలియుగమున (ఆర. ౪ ఆ. ౨౮౮). క. జపనియమస్వాధ్యాయ। ప్రపంచములు విడువఁగలరు బ్రాహ్మణులు జనా। ధిప శూద్రులు విప్రులతపః। కుపితులు గాఁగలరు వినవె కలికాలమునన్. (ఆర. ౪ ఆ. ౨౮౯). క.........ధరణీ। సురులు గడఁగి వాణిజ్యము। గరిసనమును జేయఁగలరు కలికాలమునన్। (ఆర. ౪ ఆ. ౨౯3). మ. ధరణీరక్షణ మాచరింపక నృపుల్ దర్పంబునం బక్కతో। హారులై సాధులఁ ద్రోచి చేకులు తదీయ స్త్రీధనక్షేత్రముల్। హరియింపంగలవారు. (ఆర. ౪ ఆ. ౨౯౯). ఇట్టిరూపములను జూచి భ్రమించి కావలయు నర్వాచీనకవులు రేఫడకారలోపకలుషితరూపములను బ్రయోగించిరి. "కలఁడు మున్న గురూపముల మధ్యస్వరము దీర్ఘ మగుటయుఁ గలదు. ౧౨...... దైత్యారికాఁబోలు నీ। యన గాకున్నఁ గలావె యున్నృలకు నీ యంచత్త్రిభావోన్నతుల్. (ఉ. రా. ౧౮౨ పుట). సకలమహీశులు నీకు పట్టికిని జేకు। అంగలా వంగలార్వఁ గురంగనయన.. ......కలాను (పమిూర. ౨ ౧౭౧; ౪-౪౦; 3-౨౫౪; ౫ ౧౭౯)". (ఆం. భా. అ. క్రియా. ౧౨ సూ). "కలాను ప్రభృతిరూపంబులుం గొన్నియెడలఁ జూపట్టెడి. ఉదా:—కసి మొక్కంత గలాడొ లేదొ? (మల్లభూ. నీతి ౨౨).........ఇటువంటి ఛాందసము లెన్నెన్నం గలాపు (దశా. 3 ఆ. ౬౬)... ......వియోగవేదనం జిక్కఁగలాఁడె. (దశా. ౨ ఆ, ౮౪). ఇవి ప్రౌఢప్రయోగములు" (గాణ. క్రియా. ౩౪౭ సూ. వివ). ఇట్టివి ప్రౌఢప్రయోగము లనుట కంటె నప్రౌఢప్రయోగము లనుట లెస్స.

ప్రాచీనులు ప్రాప్త్యర్థక కలుగు ధాతు రూపములను "కలఁడు=కలవాఁడు" అనురీతిని బ్రత్యేకముగాను బ్రయోగించిరి. క. మగఁటిమి గలఁడనియెడు న। మ్మిగఁ జూచుచునుండు విషము మ్రింగిన యేకిన్. (ఉద్యో ౧ ఆ. 3౧౫) సీ......... మహితవిభవ। ఖనియగు శిశుపాల తన యుండు దోర్దర్ప, ధుర్యుండు ధృష్టకేతుండు సమర. తే-గీ. లంపటుండు శిఖండియు లావు తెంపు। గలరు నీయెడ ననురక్తి గలరు సాలఁ। బెంపు గల యుక్కుముట్టిన తెంపు గలరు। కోరి పతులంగఁ జేయు మహీప్రాణులకు. (ఉద్యో. ౪ ఆ. ౧౮౯.) ఉ. పాడియు సత్యముం గలరు పాండు తనూజులు.........(భీష్మ. ౨ ఆ. ౨౬౦.). అస్త్యర్థమునందలి "కలఁడు - కలరు - కలవు"

మున్నగు వానికి సమంతము ప్రత్యేక ప్రయోగము గలదు గాని "కలవు - కలను - కలము" అను వానికి భవిష్యదర్థక సకూంపక క్రియలలో ననుబంధరూపములగు ప్రయోగము లేదు. క......భూవరులెల్ల ప నొక్కట। ద్రోవదికై తొడరి యత నితోఁ బెనఁగి కడుం। జేవ సెడి పోవునప్పుడు। నీ వచ్చటఁ గలవా లేవా నిక్కము చెపుమా.' (విరా. ౪ ఆ. ౨౧౧.)ఆ-వె. ఎచట నున్నవాఁడ వేమైతిఁ బ్రాణానఁ గలవె యేను నిన్నుఁ గాన కునికి. (ద్రోణ. ౧ ఆ. ౨౬౨.) క. వసుదేవసుతుం। డా నేనఁ గలఁడు దత్సము। నీసేనం జూపుమా నరేశ్వర నాకున్. (ఉద్యో. ౨ ఆ. ౩౦౮). క.........దు। ర్మతి కిహముం బరము గలదె.........(ఆది. ౬ ఆ. ౨౭౪.) చ.........వాని ఘూతికిన్। వెఱగని వారునుం గలరె. (ఆది. ౬ ఆ. ౧౯౫.) (చూ. ౨౯౬ విష. ౨౧౦ VIII విష. ౩౪౪ విష.)

లాట్టు రక్షు పరంబగునపుడు దుగాగమం బగు. ౨౨.
ప్ర. వండుదును - వండుదురు. మ. వండుదువు - వండు
దురు. ఉ. వండుదును - వండుదుము. లాడర్థంబుల
యందోలి నుదాహరణంబులు వక్కాణించెద - తద్ధ
ర్మంబు:—కులాలుఁడు కుండలు వానును. తచ్ఛీలంబు -
జ్వలనజ్వాలంబు లుష్ణరం బెగయును. సంభావన:—
ఇప్పుడు వాఁడింట నుండును. సంప్రశ్నము:—ఉండు
నా? పోదునా? సాతత్యము:—సర్వంబునం దీశ్వరుం
డుండును. సర్వం బీశ్వరునియం దుండును. వర్తమా
నంబు:—మేన నిప్పుడుం బులకలు వొడమెడును.

బాలవ్యా. ౩౦౨ విషయము.

వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబు
నం దెడుగా ద్యాగమంబు లగు - భావి - తేపువచ్చును.
ఆశీస్సు - శుభం బగును. వచ్యర్థంబుల కొకా నొకచో
భూతంబున లాట్టు గానంబడియెడును.

లాట్టు రక్షు పరంబగునపు డెదగాగమంబును బ్రథమ
'ను' వర్ణకంబు పరంబగునపు డెడు గెడి గాగమంబు
లును బహుళంబుగా నగు. ౨౩.

ప్ర. వండెదను - వండెడిని - వండెదరు. మ. వండె
దవు - వండెదరు. ఉ. వండెదను - వండెదము.

తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్టుల

ప్రథమ బహువచనంబున కేకవచనంబగు. ౨౫.
చిలుకలు పలికెను - చిలుకలు పలుకును - చిలుకలు
పలికెదును. మేఘములు గర్జిల్లెను- మేఘములు గర్జి
ల్లును. మేఘములు గర్జిల్లెదును.

సంజీవని. 30౨ విష:— ౨౨ సూ - వ్యాఖ్య:—'దుజ్ రు వు రు ను ము ఇళ్' అను వానిలో (బా. క్రి. ౮ సూ.) దుజ్జునకుఁ దర్వాతి 'రు' అనునది తుది ఇకార ముతోఁ గూడి 'రఇళ్' ప్రత్యాహారమగుచున్నది. కాన రుఇళ్లనఁగాఁ బ్రథమపురుషైక వచనేతరములగు పురుషబోధక ప్రత్యయములని యర్థము. అవి పరమగునపుడు ధాతువునకు దుగాగమం బగునని యర్థము. దుక్కు కిత్తుగాన ధాతువు తుదిని జేరును. వందు+దు+రు = వందుదురు. మొ. 'వందు+దుజ్' అనుచో బా - క్రి - ౧౬ సూత్రము చెప్పిన 'దుజ్జునకు' 'ను' అనునది యాదేశము కాఁగా 'వందును' అని యేర్పడు. ఇది చింతామణి సమ్మతరూపము కాదు. చింతామణిచే 'వందున్' అనియే యేర్పడును. నన్నయ భారతభాగమున నెచ్చటను 'వందును' అను ను స్వరూ పమును నిర్వహింపఁజాలు ప్రయోగము లేదు. (చూ. 300 విష. చి. వి. పరి. ౧3౪-౧3౫-౧3౬ విష.) వందు+దు+వు = వందుదువు. ఇట్లె తక్కిన వాని ప్రక్రియ నరయునది. ఉత్తమ పురుషైక వచనమున 'వందుదునున్' అనురూపము చింతామణి చెప్పిన నేర్పడును. (చూ. ౨౯౬ II విష.) బాలవ్యాకరణ పక్షమున 'వందు దును' అని మాత్రమె సిద్ధించును. తిర్యగ్జడ కర్తృకత్వమున లాట్టునందలి ప్రథమ పురుష బహువచన మేకవచన రూపముతోనే యుండును గాన (బా. క్రి. ౨౫ సూ.) "చిలుకలు పలికెను మేఘములు గర్జిల్లెను" అని యుండును. బా - క్రియా - ౨3 సూత్రము చెప్పినఁ బ్రథమ పురుషైక వచనమున 'ఎదు' 'ెడి' గాగమంబు లగును గాన 'చిలుక పలికెడును - చిలుకలు పలికెడును - మేఘము గర్జిల్లెదును - మేఘములు గర్జిల్లెడును' మున్నగు రూపములును గల్గును. లాడర్థంబులయం దనఁగా బా - క్రి - ౫ సూత్రమున నుదాహరింపఁబడిన తద్ధర్మాద్యర్థములం దొలి దనఁగా వరుసగా నుదాహరించుచున్నానని యర్థము. వరుసగా ననఁగా నట్టి ౫ సూత్రమునఁ జెప్పఁబడిన తద్ధర్మ తచ్ఛీల సంభావనా సంప్రశ్న సాతత్య వర్త మాన భావ్యాశీరాదు లనెడి వానిని వరుసగా నుదాహరించుచున్నానని యర్థము. తద్ధర్మంబు:—కులాలుఁడు = కుమ్మరవాడు. కుండలను వానుట కుమ్మరికి ధర్మము = విహితకృత్యము = వృత్తిగాన నిది తద్ధర్మార్థమున కుదాహరణ మని భావము. తచ్ఛీలంబు = దాని స్వభావము. జ్వలన జ్వాలంబులు = అగ్నిజ్వాలలు, ఉప్పరంబు=

ఆకాశమునందు, ఎగయును. "ప్రసిద్ధ మూర్ధ్వజ్వలనం హవిర్భుజః." (భారవి.) అగ్నిజ్వాలలు మీఁదికి లేచుట స్వభావము. సంభావన = ఊహము. ఇప్పుడు వాఁడిట నుండును. సంప్రశ్నము = ప్రశ్నించుట. ఉండునా ? పోదునా ?. సాతత్యము= సతతత్వము = సదావర్తిల్లుట:—సర్వంబు నందీశ్వరుం డుండును. సర్వం బీశ్వరునియం దుండును. వర్తమానము = మేన నిప్పుడుం బులకలు పొడమెడును = శరీరమునం దిప్పుడు సైతము గగుర్పాటు గలుగుచున్నది. బా - క్రి - ౨3 సూత్రము చెప్పిన 'ఎడు' గాగమము వచ్చిన తద్ధర్మాద్యర్థక ప్రథమ పురుషైక వచన రూపము. పొడము+ఎడు+ను = పొడమెడును = అంకురించుచున్నవి. వక్ష్యమాణవిధిచే ననఁగా బా - క్రి - ౨3 సూత్రముచే బ్రాయికంబుగ వర్తమానంబునం దెడు గాద్యాగమంబు లగునని సూరి వివరించెను. కాని ఎడు గెడి గాగమంబులు వర్తమానమునందె కాక యర్థాంతరము లందును బ్రయుక్తము లయి యున్నవి. క. వన వాస పరిక్లేశం । బున కోర్వదు కుంతిదేవి భోజాత్మజ గా । వున నాగ్రహాహ్వయమున నుండెడు । ననవరతము భక్తితో మదభ్యర్చితయై. (సభా. ౨ ఆ ౨౮౧.) తరలము..................యాదవ సైన్య స । న్నహానదుందుభిరావముల్ గగనంబు దిక్కులు నిండ దు । స్సహము లయ్యెడు ధార్తరాష్ట్రుల సైన్యవీర భటాళికిన్. మ.........మదీయాస్త్రౌఘమున్ ధార్తరా । ష్ట్రనికాయోత్తము కాయఖండన పటిష్ఠం బయ్యెడుం బోరిలోన్. (అర. 3 ఆ. ౧౬౬ ౧౬౭ ప.) ఈ తుది పద్యములు రెండును బలదేవ సాత్యకి ప్రభృతులు కౌరవులపై దాడి చేయ యత్నించు సందర్భములోనివి. భావ్యర్థము లాద్రూపములకు:—వాఁడు రేపు వచ్చును=రాఁగలఁడు. ఆశీస్సు - శుభంబగును = శుభంబగుఁగాక. వచ్యర్థంబు లనఁగా 'అను - చెప్పు - పలుకు - ఆడు' మున్నగు ధాతువులు. ఇట్టి ధాతువుల లాట్టు రూపము లొకానొకచో భూతంబునఁ బ్రయోగింపబడునని సూరి వివరణమున కాశయము. ఆశీరాదు లనుచోటి యాదిశబ్దమున కిట్టి స్థలము సూరిచే జూపఁబడెను. క.........శైలతనయ.........ఈశా । నునితో మృదురీతి నిట్లనుం గమలేశా. (అను. ౫ ఆ. ౨౮౪.) (ఇట్లనున్ = ఇట్లు పలికెను.) (యతిస్థలము). ఒకానొకచో ననవేల ? ఇట్టిరీతినే తఱుచుగాఁ బ్రయోగింపఁబడును. 'అనెన్' అను రూపము ప్రాచీనమహాకవి సమ్మతము కామింజేసి 'అన నతఁ డిట్లనున్' అను రీతినె ప్రయోగింపఁబడుచుండును. వచ్యర్థ స్థలములందే కాక పెక్కు స్థలముల భూతమందును లాట్టు రూపములు గన్పట్టుచున్నవి. బా - గు - ప్ర - వ్యాఖ్యాత వచ్యర్థంబుల లాట్టునకు భూతార్థ ప్రయోగమున కీ క్రిందిరీతి నుదాహరించెను.

తే-గీ. సర్వతీర్థాభి గమనంబు సర్వవేద । సమధిగమము సత్యంబుతో సమముఁ
గావు । ఎఱుఁగు మెల్ల ధర్మంబులకెల్లఁ బెద్ద । యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన
మునులు. (భార. ఆది. ౪ ఆ ) ఇట్టివె 'అండ్రు' అనునవి మఱికొన్ని యుదాహరింపఁ
బడెను. పిదప "పై నుదాహరింపఁబడిన 'అండ్రు' ఇత్యాది లాట్ప్రత్యయాంతంబు
లకు 'అనిరి' అని భూతకాల మర్థము." (బా. గు. ప్ర. ౩౧౮ పుట. ద్వి. ము.)
అని వ్రాయఁబడెను. అట్టి సత్యాది ధర్మంబు లుత్కృష్టములని యప్పటి పెద్దలే
కాదు, తర్వాతి పెద్దలును జెప్పుచునే యుందురు గాన నచటి లాట్టు భూతార్థక
మనుట సరికాదు. మునులు చెప్పుదురని శకుంతల పలుకుట భూతవ్యాపారము
గాని పెద్ద లట్లు చెప్పుట భూతవ్యాపారము కానేరదు. ఇట్టి ప్రయోగము లనేక
ములు గలవు. ఇట్టివే భూతార్థ విషయమున లక్ష్యము లగునపుడు సూరి
"వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును." అని
వివరించుట యసంభవము కాదా ? 'ఒకానొకప్పుడు గానంబడియెడి' అని ప్రకాశికా
కర్తయు వ్యాఖ్య చేసెను.

౨౩ సూ - వ్యాఖ్య:—ఇచటను 'రుఙ్'ను ప్రత్యాహారము మొదటి రువర్ణ
ముతోనే ఘటింపఁబడెనని గ్రహింపవలెను. కాన - ప్ర - బ - రు ప్రత్యయము మధ్య
మోత్తమ పురుషైకవచన బహువచన ప్రత్యయములును బరమగు నపుడును
ధాతువునకు ఎదగాగమంబు బహుళంబుగా నగునని యున్నది. ఎదగాగమము
కిత్తు గాన ధాతువు తుదిని నిల్చును. బా - క్రి - ౧౬ సూత్రముచే నాదేశింపఁబడిన
ప్రథమపురుషైకవచనమునందలి 'ను' ప్రత్యయము పరమగునపుడని విశదపడుట
కయి ప్రథమ 'ను' వర్ణకంబని సూరి వచించెను. లేనిచో నుత్తమైకవచనద్యోతక
'ను' ప్రత్యయ పరకత్వమునం దనెడి యపార్థము స్ఫురించునుగదా. ప్రథమ 'ను'
వర్ణక పరకత్వమున "ఎడుక్ - ఎడిక్" అనెడి యాగమములు రెండును బహుళ
ముగా నగును. ఈసూత్రమునందలి విధులకు బహుళత్వమును వచించుట లోని
ప్రయోజన మంతగాఁ గన్పట్టకున్నది. నన్నయేతర కవుల ప్రయోగములం దివి
వైకల్పికముగనే ప్రయోగింపఁ బడుచున్నవి. ఆంధ్రశబ్దచింతామణి యం దివి వచింపఁ
బడలేదని కావలయు సూరి వీనిని బహుళమని సూత్రించెను. భట్టారకుఁడు తన
భారత భాగమునఁ దత్సమ ధాతువుల పైని 'ఎద' గాగమమును మిక్కిలి యరు
దుగఁ బ్రయోగించెను. ఎడు 'ఎడి గాగమములను దత్సమ ధాతువుల పైని నిల్పి
ప్రయోగింపనేలేదు. (చిం. వి. పరి. ౫౮ విష. ౧౧౧ విష.) (విస్తర.) తిక్కనాదులు

---

విస్తర. ౩౦౭ విష:—వేటికా వ్యాఖ్యాత నా రచించిన చింతామణి విషయ

దుగాగమయుక్త రూపములతోపాటుగ 'ఎద' గాగమయుక్త తత్సమ ధాతు రూపములను, 'ఎడు గెడి' గాగమయుక్త తత్సమ ధాతురూపములను ధారాళ ముగాఁ బ్రయోగించియున్నారు. పయివిషయములను సరిగాఁ బరిశీలింపక యాంధ్ర భాషాభూషణకర్తయుఁ గావ్యాలంకార చూడామణికర్తయు దుగాగమయుక్త రూపములు కేవల భావ్యర్థకములనియు 'ఎద' గాగమయుక్త రూపములును 'ఎడు' గాగమయుక్త రూపములును గేవల వర్తమానార్థకము లనియు వ్రాసిరి. అట్టి వ్రాఁత కేవలము నపరిశీలన మూలకమని యీపయి ౨౯౬ విషయమున సోదాహరణముగ విశదీకరింపఁబడెను. (ఈవిషయము నా రచించిన చింతామణి విషయ పరిశోధనమునందు విశదపఱుపఁబడెను. ౬౨-౬౩-౬౪ విష.)

ప్రకృత సూత్రమున సూరి 'ఎడు గెడి' గాగమములు వర్తమానార్థకములని వచింపకున్నను బూర్వ సూత్ర వివృతిలో నట్టి యభిప్రాయమును జూపెను. అది సరికాదనియు నీ 'ఎడు గెడి' గాగమములు వర్తమానేతరార్థములందును బ్రయోగింపఁబడిన వనియు నచట కొంత విమర్శింపఁబడెను. ఈవిషయము ముందు ప్రయోగ ప్రదర్శన సందర్భమున నింకను విపులముగఁ జూపఁబడును.

౨౫ సూ - వ్యాఖ్య:—తిర్యగ్జడ కర్తృకత్వమున, భూత, తద్ధర్మాద్యర్థక ప్రథమపురుష బహువచన మేకవచన రూపముతోనె యుండునని యర్థము. అనఁగాఁ దిర్యగ్జడ కర్తృకత్వమున బా - క్రి - ౧౬ సూత్రము చొప్పున నాదిష్ట మగు 'ఎను' వర్ణకమె భూతార్థక ప్రథమపురుషైకవచన బహువచన రూపములందు నిల్చుననియు, నట్లె యీ సూత్రముననె డుజ్వర్ణకమున కాదేశింపఁబడిన 'ను'వర్ణ

పరిశోధనమును జూచియుఁ దడఁబడి యీ క్రిందిరీతిని వ్రాయుట వింత! "తత్సమ ధాతువు లెడు గెడిగాగమములతోడను దుగాగమము తోడను నన్నయ భారత భాగమునఁ జూపట్టు టరుదు." (బా. సా. పే. ౩౯౫ పు.) ఎడు గెడిగాగమముల తోడి తత్సమ ధాతువు లరుదుగా మాత్రము నన్నయ భారత భాగమునఁ గలవా? ఒక్కటేని మచ్చునకైనఁ గానరాదే! ఇంక దుగాగమముతోడి తత్సమ ధాతు రూపములు నన్నయ భారతమునఁ ధారాళముగా వెలయుచుండఁగా నరుదనుట కేవలము పొరపాటు. ఇంకను ఎదగాగమయుక్త తత్సమ ధాతురూపముల నన్నయ మిక్కిలి యరుదుగా వాడె ననుట యుక్తము. సేవింతె - చింతింతె - రక్షింతె- వర్తింతురయ్య - పాలింతె - వీక్షింతె - ఉత్సహింతె. (సభా. ౧ ఆ. ౨౬-౨౮-౩౩-౪౨-౪౯-౫౪ ప.) కీర్తిఁతువు - నిందింతువు. (సభా. ౨ ఆ. ౧౮౮.) అతి క్రమిఁతురే. (సభా ౨ ఆ. ౨౨౪.) ఆస్వాదిఁతున్. (సభా. ౨ ఆ. ౨౩౩.). మొ.

కమె తద్ధర్మార్థకార్థక ప్రథమపురుషైకవచన బహువచనములందు నిల్చుననియుఁ గ్రహింపవలెను. భూత:—చిలుక పలికెను - చిలుకలు పలికెను. తద్ధర్మ:—చిలుక పలుకును - చిలుకలు పలుకును. ఇవి తిర్యక్కర్తృకతోదాహృతులు. ఇంక జడకర్తృకత్వమునందలి భూత:—మేఘము గర్జిల్లెను - మేఘములు గర్జిల్లెను. తద్ధర్మ:—మేఘము గర్జిల్లును - మేఘములు గర్జిల్లును. బా - గు - ప్ర. వ్యాఖ్యాత 'పలికెను' అనుదాని రూపసాధన ప్రక్రియలో "పలుకు+రు, ఇట్లుండఁ బ్రకృత సూత్రంబున నేకవచన దుఙ్ఞురా 'పలుకు+ను' అయ్యె, పదునాఱవ సూత్రంబున 'ఎను' వర్ణకంబు గలిగి 'పలుకు+ఎను' అయ్యెను. అపదాది స్వర నిత్యసంధియు, ఎనుబది యైదవ సూత్రంబుచే లకారంబు యొక్క 'ఉ'త్వంబున కిత్వంబును గలిగి 'పలికెను' అయ్యె" అని చూపెను. (బా. గు. ప్ర. ౩౨౦ పు. ద్వి. ము.) కాని "భూతంబునం దిగాగమంబగు" (బా. క్రి. ౧౭ సూ.) అను సూత్రము చొప్పున ధాతువు తుదిని జేరు 'ఇ'గాగమము నేల చూపలేదో తెలియకున్నది. "పలుకు+ఇ+ఎను" అనురీతిని బ్రక్రియ చూపి యపదాది స్వర నిత్యసంధిని జేయుట యావశ్యకము. 'పలికిరి' మున్నగు చోట్ల లన్నిటను వచ్చెడి "ఇ"గాగమంబు ప్రథమపురుషైక వచనమున మాత్రము రాకుండునా? కొన్ని ధాతువులకుఁ బ్రథమపురుషైక వచనమునందును నీ 'ఇ'గాగమము (అనియెను - పడియెను. మొ.) వచ్చి నిల్చుచునే యున్నదిగదా. (చూ. ౩౨౦ విష.) "చిలుకలు పలుకును" అనుచో "పలుకు+లాట్ = పలుకు+రు= పలుకు+షుజ్ = పలుకు+ను = పలుకును" అని ప్రక్రియ నరయునది.

౨౨-౨౩-౨౫ సూత్రముల విధులకుఁ బ్రయోగములు:—క......... భుజవీర్య సంపద। తో మూఁడు జగములు నోపుదురు సాధింపన్. (సభా. ౧ ఆ. ౧౧౫) ఇందలి దుక్కు యతి స్థానగతము. ఓపుదురు సమర్థులగుదురు. తరలము. ఇది కుబేరు వనంబు దీనికి నెవ్వరుం జనుదేర నో। డుదురు నీవిట వచ్చి యేల కడుం బ్రమాదముఁ జేసి తిం। దు.........(అర. ౩ ఆ. ౩౬౦.) దీనిని బట్టి 'ఉదు' కాదు 'దు' అని విదితమగును. క. దమయంతి రోయంగా జూ। దము నీతో నాడఁ గడగెదను ధరణీ రా। జ్యము.........(అర. ౨ ఆ. ౨౨౨.) 'ఎద' లోని 'ద' యతి స్థానగతము. ఇందలి 'ఎద'రూపము భావ్యర్థకము. చ. ఇదె ప్రళయాగ్నిపోలె దెసలెల్లను గప్పఁగ విస్ఫులింగముల్। వదలక వాయు సారథి జవంబునఁ దానిట వచ్చె నేమి సే। యుదు సుతులార యీబిలము నొయ్యన పోయి చొరుండు దీనిఁ గ। ప్పెద ఘనపాంసు జాలముల భీమశిఖావళి దాఁక కుండఁగన్. (ఆది ౮ ఆ. ౩౦౫) ఇందు 'ఎ'దగాగమ దుగాగమ దకారములు ప్రాసగతములు. ఎదగా

గనుము నందలి 'ఎ' కార ఘటిత ద్విత్వపకారము ప్రాణి యతి స్థానగతము. కప్పెద ననునది భవిష్యదర్థకము. ఏమిచేయుదు ననునది యశక్తతను బరితాపమును దెల్పుచున్నది. క. పరమాన్న భక్ష్య భిక్షా । పరిపూర్ణ తరంబులైన పాత్రముల య్యే । పురు నిత్యంబు నివేదిం । తురు దల్లికిఁ గరము భక్తితో వినయమునన్. (అది. ౬ ఆ. ౨౮౦ ప) 'నివేదించుదురు' అను దానినుండి యేర్పడిన 'నివేదింతురు' అను దాని లోని 'తు' యతి స్థానగతము నివేదింతురు = నివేదించుచుండెడివారు. (భూత వ్యాపారమె) చ..............విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ బాయక విందు నంచు.. . ............ (ఆది. ౮ ఆ. 3౦.) (విందున్ = వినుచున్నాను.). తే-గీ. పాండుపుత్త్రులకెప్పుడుఁ బక్షపాతి । విదురుఁ డనిచెప్పఁ దొల్లియు విందు..............(సభా. ౨ ఆ. ౧౨౬). విందున్ = వింటిని - భూతార్థకము. క.........జూదం । బునకుం బ్రియుఁడవు దక్షుఁడ । వన విందుము నిన్నుఁ బ్రీతి నక్షజ్ఞులచేన్ (సభా. ౨ ఆ ౧౬౮). విందుము = వినుచున్నాము. వర్తమానార్థకము. సీ. వివిధోపభోగముల్ దివిజేశునకుఁగల యట్టుల కలవు నీకనుభవింప । సకలభూపతులుఁ బాయక భక్తియుక్తులై కొలిసి సేవనుపుసేయుదురు పేర్మి ।.........(సభా. ౨ ఆ. ౧౦౨). చేయుదురు = చేయుచున్నారు. సీ. పరులగుణంబులు పలుమారుఁ గీర్తింతు పక్షంబ పలుకుదు పాండవులకు । ధార్తరాష్ట్రుల సంతతంబు నిందింతువు.........(సభా. ౨ ఆ. ౧౮౮). దుర్యోధనుఁడు విదురుని నిరసించు సందర్భములోనిది. ఇందలి విదురునిగుణము లాతనిధర్మములుగా జెప్పఁబడెను గాన నిందలి దుగాగమ ఘటితరూపములు తద్ధర్మార్థకములు. తాచ్ఛీల్యమును బోధించుచున్న వన్నను ననవచ్చును. క. అన్న సహదేవ నీవును । నన్నలతో నరిగె దయ్య యట యడవుల కీ । వున్నను సుతులందఱు నిం । దున్నట్టుల నాకుఁ జిత్తమూఁడి యుండున్ (సభా. ౨. ఆ. ౨౮౮). అరిగెదు+అయ్య = అరిగెదవా = పోవుచున్నావా ? చిత్తమూఁడియుండున్ = ప్రత్యాశాత్మక సంభావనార్థకము. చ. అమలచరిత్ర నిట్లు దమయంతిఁ బతివ్రతఁ బల్కుదే నృపా । త్రమ.........(ఆర. ౨ ఆ. ౨౧౭). పల్కుదువు+ఏ = పల్కుదు+ఏ = పల్కుదే = పల్కఁదగునా? సంప్రశ్నార్థకము - పల్కరాదను వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకము. చ. ఇతనికిఁ గూర్తురేని ధన మిత్తు రభీష్టములైన కార్యముల్ । మతి నొనరింతు రిష్టుఁడని మంతురు గాక.........(సభా. ౨ ఆ. ౧౦ ప.) కూర్తురేని = ప్రియపడుదురేని. ధనమిత్తురు గాక = ఇచ్చుట యుక్తము. "ఎదక్కు - డుక్కును" సందర్భమునుబట్టి కాలత్రయ ద్యోతకములగునని యీవలఁ నుదాహరణములు పెక్కు (౨౯౬ విష.) భట్టారక

ప్రయుక్తములు చూపఁబడెను. ఎదగాగమయుక్తరూపములు తత్సమములు మిక్కిలియరుదుగా భట్టారకునిచేఁ బ్రయోగింపఁబడెను క......... । కానలఁ బరిభ్రమించెదఁ । గానరె మీరు.........(అర. ౨ ఆ. ౧౦౫ ప.) క. త్ర్యంబక నాకు ననభీష్ట వ । రంబుఁ బ్రసాదించెదేని.........(ఆర. ౧ ఆ. ౩౨౮ ప.) వచనములలో మఱి నాల్గు గనంబడుచున్నవి. రచియించెద. (ఆది. ౧ ఆ. ౨౦ వచ.) వివరించెద (ఆది. ౩ ఆ. ౭౩ గద్య.) ధరియించెద (ఆర. ౩ ఆ. ౮౧ గద్య.) జీవించెద (ఆది. ౭ ఆ. ౫౧ వచ) ఎడు గెడి గాగమంబుల రూపంబులు తత్సమంబులు నన్నయప్రయుక్తములు గానంబడ లేదు.

తర్వాతికవులు ధారాళముగా 'ఎద'గాగమ ఘటితతత్సమరూపములను 'ఎడు'గాగమ యుక్తరూపములను వ్యవహరించిరి. సేవించెదను - కీర్తించెదను - విస్తరించెద. (నన్ని. కు. ౧ ఆ. ౧౪-౧౫-౪౮). ఉ.........పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్. (విరా. ౧ ఆ. ౩౦). క. నృపధర్మములన్నియు నీ । కుపదేశించెద...... ...(శాంతి. ౨ ఆ. ౧౬౪). క.........కొలిచి వ । ర్తి ల్లెడు తెఱంగులెంతయుఁ । దెల్లము.........(విరా. ౧ ఆ. ౧౪౨). మ...... నిర్దోషత్వమున్ రాజసం । బును శోభిల్లెడు నెవ్వఁడే నొకజగత్ పూజ్యుండు... ......(విరా. ౧ ఆ. ౨౩౧). క. చని పెడ విశసిల్లెడు నా । ననపద్మముతోడ... ......(విరా. ౨ ఆ. ౨౭౦). ఇట్లు విశేషణములుగను సమాపకక్రియలుగను దత్సమక్రియలు "ఎడు గెడి" గాగమయుక్తరూపములును నన్నయేతర ప్రాచీనకవుల గ్రంథములందుఁ గన్పట్టుచున్నవి. ఎడు గెడి గాగమములు వర్తమానకాలద్యోతకము లేకాక భూతభావ్యర్థకములును గలవు. ఈ విషయమునందలి నన్నయప్రయోగము లీవలకుఁ జూపఁబడెను. క. మనమొక యేవుర మీాయం । గనయుం దో నరుగుదేరఁగా నెయ్యెడఁ బో । యిన నెఱుఁగకుండుదురె యి । ద్దినములు గడవంగ నెద్ది దెలఁగయ్యెడినో. (విరా. ౧ ఆ. ౬౦). ఈదినములు గడచుట కేది యుపాయము కాఁగలదోయని యర్థము. చ. తడఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రము దప్పెడున్ గడున్ । వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబు గాదు వీ । ద్వడిరొడు చెయ్వు లంగము గడంక దొఱంగెడు నేఁటిభంగిఁ గ । వ్వడి దనపూన్కి దీర్చుట ధ్రువంబని బుద్ధి జనించెఁ బుత్ర, శా. (భీష్మ. ౩ ఆ. ౩౫౧). తనకు జరిగిన తడఁబాటులను ద్రోణుఁడు కొడుకుతోఁ జెప్పిన సందర్భముగాన నిందలి 'ఎడు గెడి' గాగమ ఘటితరూపములు భూతార్థకము లనఁదగును. ఇంక వర్తమానార్థకప్రయోగములు:—చ......ఈ । కొడు కిటు వోకకున్ మనము కుందెడు

నిన్నని యూరడిల్లెడున్. (విరా. ౨ ఆ. ౨౧౩). కుందెడున్ = సహదేవుఁ డరణ్యావాసమున కేఁగుటచేఁ దనమనసు కుందుచున్నదనియు సంరక్షించు ద్రౌపది యుండుటచే నూరడిల్లుచున్నదనియుఁ గుంతి పల్కినవాక్యము. చ. మనుజులు సేయ నెవ్వరు సమస్తము నీశ్వరు నాజ్ఞఁ జెల్లెడున్ (శాంతి. ౧ ఆ. ౨౭౭). చ. మునివర్గవాహనుఁడవై చనుదెమ్మను మంత దీతెడున్ (ఉద్యో. ౧ ఆ. ౧౭౬). తీతెడున్ = చక్కఁబడఁగలదు. (ఉద్యో౧ఆ౧౭౬)ము. అదె కౌరవ్యు లశక్తదుర్జనత సేయుంబూని పైఁ బాఱఁజూచెద రమ్మెఁ దమచేతఁ దీఱునె జయశ్రీకాంతు దైత్యాంతకున్।బొదువన్...... (ఉద్యో. ౩ ఆ. ౩౯౬). చూచెదరు = చూచుచున్నారు. చ.........వినాశము పొందెద రేమిసేయుదున్ (ఉద్యో. ౩ ఆ. ౪౦౩). (పొందెదరు = పొందఁగలరు - ఏమిచేయుదున్ = ఏమిచేయఁగలను). సీ. అదయుఁ। డని పల్కుదురు కొంద ఱప్పార్థుఁ జేరి గాం, గేయుని ద్రోణుని గడయఁ బొదువ ఆ-వె. బనుప నెట్లు నేర్చె తని పల్కుదురు కొంద। అతఁడు మోము వాంచి యరుగుచుండ. (స్త్రీ. ౧ ఆ. ౧౨౧). (యుద్ధానంతరమున యుద్ధభూమి కేఁగిన ధర్మజునిఁ గురుకాంతలు తిట్టినసందర్భము.) (పల్కుదురు = పల్కిరి). ఉ. బకపుంగవుఁ డెట్లగు నొక్కదైవమా (శాంతి. ౩ ఆ. ౫౦౨). (ఎట్లగునొక్క = ఏమయ్యెనొక్క). శా. తానున్ భార్యయు వేఁగుఁ బేరడవికిన్ దానొక్కఁడైనం జనున్ । .........వానప్రస్థధర్మములు. అడవికిఁ జనుట మున్నగునవి వానప్రస్థాశ్రమధర్మములు. ఇట్టిక్రియ లీసందర్భమునఁ బెక్కు గలవు. మ. హరిఫాలంబునఁ బుట్టి ధర్మమున కాలై యర్థమున్ పుత్రకున్ । సిరిగాంచెన్ దగవారు మువ్వురును సుస్థేమోన్నతిన్ సంశ్రయిం । తురు భూపాలకు .........(శాంతి. ౨ ఆ. ౨౧౭). (ఆ మువ్వురును సతతమును రాజు నాశ్రయింతురు. సాతత్యార్థకము). సీ.........పాండునందను లాంబికేయు । నెడ భక్తి వినయంబు లెసఁగంగ వర్తింతురు...... । తే-గీ. అతఁడును సాదరంబు । గాఢవత్సలత్వంబును గలిగియుండు. (ఆశ్ర. ౧ ఆ. ౮ ప.). (వర్తింతురు = వర్తించిరి = వర్తించుచుండెడివారు. ఉండును = ఉండెను = ఉండెడివాఁడు). (యుద్ధానంతరమునందలి ధృతరాష్ట్రపాండవుల వర్తనము). కం. వాదున నీ హరి వేధయుఁ । గాదే యురు లింగమూర్తి కడగానక యే । డాఁగ వెదకెద రట్టి మ । హాదేవుఁడ పూజ్యుఁ డఁగ నగునే నీకున్ (నన్ని. కు. ౨. ఆ. ౧౬౫) (వెదకెదరు = వెదకిరి). (ఈశ్వరశరీరము పాదములు బ్రహ్మవిష్ణులు తెలియ యత్నించి యసమర్థులైరని పురాణగాథ గలదు).

బా-క్రి ౨౫ సూత్రము ప్రయోగములు. మాలిని. సురపతి సభఁ జూడం జూడ నంగారవృష్టుల్ । గురిసెఁ గులిశధారల్ గుంఠితంబయ్యె దిక్కుం । జర

ముదము లడంగెన్ సర్వదిక్పాలకాంతః। కరణములు భయోద్వేగంబునన్ సంచలించెన్. (ఆది. ౨ ఆ. ౮౨.) సీ. ధృతరాష్ట్ర విభుని మందిరమున నఱచుచుఁ బఱచె గోమాయువుల్.........విద్యుత్ సహస్రముల్ విలసిల్లె.........(సభా. ౨ ఆ. 300) క. మూసె నభోమణి నక్కలు। కూసెన్ గలయంగ దెసలకుం బలుచాయల్। నేసెం బఱమొయిళు లడరి। మ్రోసెం దమయంతఁ దూర్యము లపధ్వనులై. క. ఇగ్గజములు మిన్నకయును। మ్రొగ్గెడు నుత్తమ తురంగములు బాష్పజలం। బగ్గలము విడుచుచున్నవి। దగ్గెడుఁ గారణము లేక తడఁబడి పడగల్. (విరా. ౪ ఆ. ౮౬-౮౭ ప.) ఈవిషయ మాచ్ఛిక పరిచ్ఛేదమున విస్తరింపఁబడెను. (౨౧౦ XII విష.) త్రిలింగ లక్షణ శేషమున "మహద్బహుకర్తృక క్రియకు నేకవచనంబు విభాషనగు. ఉదా:—క. తన యొఱఁగిన యర్థం బొరుఁ। డనఘా యిది యెట్టు చెప్పుమని యడిగినఁ జె। ప్పని వాఁడును సత్యము సె। ప్పని వాఁడును ఘోర నరక పంకమునఁ బడున్. (ఆది. ౧ ఆ. ౧౩౭.) పక్షమున. క బలవంతుఁడు పైనెత్తిన। బలహీనుఁడు ధనము గోలుపడిన యతఁడు ప్రము। చ్చిల వేఁగు నతఁడు కాముఁ। కుల చిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా. (ఉద్యో. ౨ ఆ. ౨౧.) మొ." అని సూత్రోదాహృతులు వ్రాయఁబడెను. కాని 'తనయెఱఁగిన' యను పద్యమున "చె। ప్పని వాఁడును సత్యము సె। ప్పని వాఁడును ఘోరనరక పంకమునఁ బడున్' అని ముద్రణసంస్కర్తలు సవరించిరి. కాని యట్లు సవరించుట సరికాదు. ఇట్టియెడల 'పడున్' అను క్రియకుఁ బ్రత్యేకాన్వయమును ఘటించి భిన్నవాక్యములుగా సమర్థించుకొనుట యుక్తము. నన్నయ స్థలాంతరమునందును నిట్లు ప్రయోగించెను. అట సంస్కర్తలు సవరింపను లేదు. క. కులము గలవాఁడు శౌర్యము। గలవాఁడును నధికసేన గలవాఁడును భూ। తలమున రాజను నామము। విలసిల్లఁగఁ దాల్చు మూఁడు విధముల పేర్మిన్. (ఆది. ౬ ఆ. ౪౭ ప.) ద్వి. ఆరాము విభునకీ యంగనామణియు। నీరాము కారాము నృపతియుఁ దగును. (రంగ. రా. సుందర. యు. ము. ౨౮౬ పు. ౪ పం.). పురుషభేదము లేనపు డిట్టి భిన్నవాక్య కల్పనము సంస్కృతమున మిక్కిలి ప్రచురముగఁ గలదు. "పాఞ్చజన్యం హృషీకేశో। దేవదత్తం ధనఞ్జయః। పౌణ్డ్రం దధ్మౌ మహాశఙ్ఖం। భీమకర్మా వృకోదరః. (మహాభార. భీష్మ. భగవద్గీత. ౧ అధ్యా.) (చూ. బా. గు. ప్ర. కారక. ౩౬ సూ. వ్యా. ౨౪౭ పు.) ఇట్టి భిన్నవాక్య కల్పనమునందు బహుకర్తృకత్వమె క్రియకు సంభవింప నేరదు గాన పై త్రిలింగలక్షణ శేష సూత్రము గ్రాహ్యము కాదని యెఱుంగునది.

నన్నయా. భూతే తయో ర్వికల్పత్వ। మితి కేచి ద్బభాషిరే।
303 విష. క్వచి ద్వర్ణకే చాపి। కేచిత్త స్యాస్థిరం జగుః.
(విక్రి. క్రియా. ౮ కా. ఉదా. ౪౮౬-౦౮౫ పుటలు.)

కల్పతరువు. 303 విష:—భూతే = భూతార్థమునందు, తయోః = ఆరెండిటికిని ననఁగా 'ఉత్వయుతే । వనకారా' విత్యాది సూత్రోక్తములగు 'ను-వు' అను వాని యుత్వమున కిత్వము వచ్చిన (భూతా దుతాం పరేషా మిత్.) 'ని-వి' అను రెండిటికిని, వికల్పత్వమ్ = వైకల్పికత్వ మగును. ఇతి - అని, కేచి ద్బభాషిరే = కొందఱు చెప్పిరి. ఉదా:—వండితినిన్ = వండితిన్, వండితివి - వండితి. మొ. 'వండితినిన్' అను దానినుండి, 'వండితిన్' అను రూప మేర్పడుట 'కవిభల్లట' సూత్రముచేతనే సంభవించును. (౨౧౦ II విష.) ఈయధర్వణ వచనము నందలి 'ని'వర్ణకలోపకథన మనువాద మాత్ర మె యని యెన్నునది. 'వండెదనున్ - వండు దునున్' మున్నగు రూపములనుండి, 'వండెదన్ - వండుదున్' మున్నగు రూపములు కవి భల్లట సూత్రముచే (౨౧౦ II విష.) సిద్ధించునట్లె, 'వండితినిన్' అను రూపము నుండి, 'వండితిన్' అను రూపము లభించుననుట కేవలము యుక్తముకదా. 'వి'వర్ణక లోపకథన సందర్భమున 'ని'వర్ణకమునకుఁ గల్గుచున్న లోపమును సయితి మను వదించుట సుసంగతమని యధర్వణుఁడు తలంచి యట్లు సూత్రించెనని యెఱుంగ నగును.

క్వచి ద్వువర్ణక ఇత్యాది:—క్వచిత్ = ఒక కొన్నియెడలను, వువర్ణకేచాపి= వువర్ణక విషయమునందును, తస్య = ఆ వికల్పస్థితికి, అస్తితామ్ = అస్తిత్వమును (వువర్ణకము నిల్చుట - పాక్షికముగా లోపించుట.) కేచిత్ = కొందఱు, జగుః = చెప్పిరి, కొన్నియెడల వువర్ణస్థితికిని బాక్షికత్వము కలదని భావము. ఉదా:—వండు దువు = వండుదు, చదువుదువు = చదువుదు, రక్షింతువు = రక్షింతు. మొ. ఇట్టి వులోపము క్వచిత్తనఁగాఁ దద్ధర్మ క్రియలయందు మాత్ర మె సంభవించునని మహా కవిప్రయోగములను బట్టి వ్యాఖ్య చేయనగును. తద్ధర్మ క్రియల యందును వులో పము గల్గుతఱిని "పునరాగమ సూత్రము చొప్పున, 'వండెదవు' 'రక్షించెదవు' మొదలగు చోటులందు వచ్చు 'ఎ'త్వాత్వములలో అత్వము రానేరదనియుఁ బ్రయోగములను బట్టి వ్యాఖ్య చేసికొనవలయును. ఉదా:—వండుదువు = వండుదు, వండెదవు = వండెదు. రక్షింతువు = రక్షింతు, రక్షించెదవు = రక్షించెదు. మొ. వులోపపాక్షికస్థితి తద్ధర్మ క్రియలందు మాత్ర మె కల్గు ననుటచేత "వండఁ గలవు - వండవు" మున్నగు చోట్ల వువర్ణకము నిత్యముగనె నిల్చునని యెఱుంగు నది. ఇట్లు సమన్వయించికొనక యహోబలపండితుఁడు 'వండెదు' మున్నగు రూప ముల స్థితికై "వండెదువు" మున్నగు రూపములు కూడ సమ్మతములె యని నిరా ధారముగా ననఁగాఁ బ్రయోగవిరుద్ధముగా వ్రాయుటయు, 'క్వచి ద్వువర్ణ కే చాపీ

త్యాది ప్రకృతాథర్వణ వచనమునందలి 'తస్య' అను దానికి 'అత్వమునకు' అని యర్థముచేసి "చేసెదవు" అను రూప మాథర్వణ మనుటయు సమీచీనములు కానేరవు. 'చేసెదవు' అనుచోటి 'అత్వము' క్వచి ద్వ్యవర్ణకే చాపీత్యాది వచనముచే సంపాదించునపుడు 'ఎత్వము'ను సంపాదించు నథర్వణ వచనమెద్ది? ఎత్వము పునరాగమసూత్ర సంపాద్యమై చింతామణిచే సిద్ధించునన్నచో 'అత్వము' మాత్రమేల తత్సంపాద్యము కారాదు. ఒక్కరూపమును సాధించుటలో నసంపూర్తిగా 'ఎత్వ'మును మాత్రము సంపాదింపనెంచి "అత్వము"ను స్మరింపక చింతామణికర్త విడిచె ననుట విశ్వసనీయ మగునా? మఱియు "క్వచి ద్వ్యవర్ణకేచాపి" అను ప్రకృత సూత్రముచే 'వండెదవు' అను మధ్యమ పువర్ణక పరకస్థలమును మాత్ర మథర్వణుఁడు సాధించి "వండెదనున్ - వండెదము - వండెదరు - (మధ్యమపురుషము) వండెదరు. (ప్ర - పు.)" అనురీతిగల తక్కిన పురుషవచనముల రూపములనెల్ల సాధింపక యుపేక్షించె ననుట మిక్కిలి యసంభావ్యము కాదా? అట్లు మధ్యమ పువర్ణకమాత్ర పరకత్వమునందు మాత్రము 'అత్వము'ను విధించుటచే 'వండెదునున్ - వండెదుము - వండెదురు' మున్నగు ప్రయోగ విరుద్ధములగు ననిష్ట రూప పరంపర దుర్వారము కాదా? పై సందర్భమును బట్టి యీక్రింది కవిశిరోభూషణ పంక్తులు గ్రాహ్యములు కావనకతీరదు. "వైచెదవు ఇత్యాది రూపమపి తదిష్టమేవ, వైచెదవు ఇత్యత్వసహితం రూపం త్వాథర్వణమ్. 'క్వచి ద్వ్యవర్ణకేచాపి। కేచిత్తస్యాస్తితాం జగుః' ఇత్యాథర్వణం వచనమ్. తచ్ఛబ్దే నాత్వ ముచ్యతే. ఉభయార్థే భవేదత్వమితి పూర్వసూత్రాత్. ఘటియించెదువు - ఘటియించెదవు - ఘటియించెదన్ ఇతి తత్సమ రూపాణితు ద్వితీయాచార్యస్య సామాన్య వచనేన జ్ఞేయాని." (అహో. ౪౮౫-౪౮౬ పు.) ఇట్లి యహోబలపండితుఁడు ౪౮౫ పుటలో వ్రాసిన 'తలంపుదయ్య - సేవింతె.........ఇత్యాద్యాచార్య వచనాత్' అను వ్రాఁతయుఁ బ్రామాదికమె. 'ఘటియించెదువు' అనునది యపశబ్దము. 'తలంపుదయ్య' అనునది నన్నయ సమ్మతమనుట కేవలము పొరపాటు. అట్టి దానికి సరియగు నన్నయ సమ్మత రూపము 'తలంతయ్య' అనునది. (దాచో ర్లుక్త తద్ధర్మే. బిందుపరస్య తకారో దోః స్యాత్. ౩౩౨. విమ.) 'తలంపుదువు' అను దాని లోని పత్వమునుగాని 'చుదు' అను వాని స్థితిని గాని నిర్వహించు ప్రయోగము భట్టారక భారత భాగమున మచ్చునకేని లేదు.

ప్రయోగములు:—భూతమునందలి 'వి' లేకుండుటకు:—క. ఆయతభుజ నీవు తాల్చితభిషిక్తుఁడవై (ఆది. ౨ ఆ. ౨౦౨). (తాల్చితివి = తాల్చితి+అభిషిక్తుఁ

డవై). క.........మంత్రులఁగా । నొనరించితె కార్యసంప్రయోగముపొంటెన్. (సభా. ౧ ఆ. ౨౭). సీ. ఋత్విజుండని విచారించి పూజించితే ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి (సభా. ౨ ఆ. ౧౧). గీ. నీవివేకంబు నాప్తియు నెఱపి తీవు । తల్లిదండ్రుల మాడ్కి హితంబు సెప్పి । తేను నారాక కెఱఁగెల్ల నేర్పడంగఁ । జెప్పి......(ఉద్యో. 3 ఆ. ౨3౬). 'వు' లేకుంటకు:—కం.........దామో । దర దూఱెదుగాని తెగవు తలఁపవు కంటే. (ఉద్యో. 3 ఆ. 3౫౬). తే-గీ......... చెప్పవయ్య వాని । నెఱుఁగుదేని మాపడియెదు నీయవస్థ (ఆది. ౨ ఆ. ౧౪౫). (ఎఱుఁగుదువు = ఎఱుఁగుదు+ఏని). సీ.........రద్ధర్మమార్గంబు సలుపుదయ్య । .........సేవింతె......చింతింతె నిజబుద్ధిఁ జేయఁదగిన । .........(సభా. ౧ ఆ. ౨. ౬). (చలుపు+దు + వు = చలుపుదు+అయ్య, సేవింతువు = సేవింతు+ఎ, చింతింతువు = చింతింతు+ఎ). ఉ.........జీవితఁబులా । యత్తముసేసి యిత్తె...... (ఇచ్చు+దు+వు = ఇత్తె). చ. వినుము కిరీటి దివ్యశరవేదివి నాఁ జను దేనులేనిచో । టను.........పాండురా । జనకు జనించితేనిఁ దెగి చూపుము శౌర్యము నస్త్రవీర్యమున్ (ద్రోణ. 3 ఆ. ౧౯౫).

లిఙ్లోట్టుల వకారంబునకు లోపంబు విభాష నగు. ౨౪.
వండితి - వండితివి. వండుదు - వండుదువు. వండెదు - వండెదవు.

1 బాలవ్యా. 303 I విషయము. 30 సూ. వివృతి:—జీత్తుపరంబగునపు డుత్వంబున కత్వం బగునను సూత్రముచే లజీ పరంబగునపు డత్వంబు:—ప్ర - వండఁడు - వండరు - వండదు-వండవు ; మ. వండవు-వండరు; ఉ. వండను - వండము.

సంజీవని. 303 I విష. ౨౪ సూ. వాఖ్య:—లిడాదేశ ప్రత్యయముల లోని 'వి'వర్ణకముయొక్కయు లాడాదేశ ప్రత్యయములలోని 'వు'వర్ణకముయొక్కయు వకారరూపవ్యంజనమునకు లోపము వికల్పముగా నగును. అట్టి వకార వ్యంజనము లోపింపఁగా దానిమీఁదియచ్చుతోఁ బూర్వస్వరమునకు నపదాదిస్వర నిత్యసంధి కల్గును. ఉదా:—వండితి+వ్+ఇ = వడితి+ఇ = వండితి = వండితివి. వండుదు+వ్+ఉ = వండుదు+ఉ = వండుదు = వండుదువు. వండెద + వ్ + ఉ = వండెద+ఉ = వండెదు = వండెదవు. అహోబలపతి "వండెదవు" మున్నగు నవిష్ట రూపములను వెనుక వ్రాసినరీతి సంగీకరించినను (303 విష.) మహాకవిప్రయోగములం దట్టిరూపములు మృగ్యము లగుటంజేసి సూరి యట్టివాని నుపేక్షించెను. "వండి

తివి - వండుదువు" అను రెండుస్థలములందును 'వి - వు' వర్ణములకు స్వరసహిత ముగా లోపమువిధించిన రూపనిష్పత్తిలోను భేదముకల్గదుగాని,'వండెదవు' అనుచో 'వు'వర్ణమునకు స్వరసహితముగా లోపము కల్గెనేని 'వండెద' అను ననిష్టరూపము కల్గవలసివచ్చును. కావునఁ బ్రక్రియాలాఘవమునకై వకారవ్యంజనమునకు మాత్రమె యన్నిటను లోపము విధింపఁబడెను. వండెదను - వండెదము - వండె దవు - వండెదరు మున్నగువానిని సాధించుటలో నన్నయాథర్వణీయమునకును బాలవ్యాకరణమునకు మార్గభేదముండుటచేత నన్నయాథర్వణీయమున నీరూప ములలోని స్వరసహితవకారమునకు స్థితిలేదని (పాక్షికముగ) చెప్పుటలో విరోధము లేదయ్యెను. (విస్తర I). తద్ధర్మ ప్రథమపురుషైకవచనముగు 'చనున్' అనుదానికిఁ బర్యాయముగ 'చన్' అని నన్నయ ప్రయోగించెను (౨౧౦ II విష.) ఆ-వె.

---

విస్తర. 303 I విషః—త్రిలింగలక్షణశేషకర్త క్రియాపరిచ్ఛేదమునఁ దద్ధర్మక్రియల ప్రయోగవిశేషములను గొన్నిటిని సూత్రించెను. "3 సూ-తద్ధర్మ భూతక్రియ లారాధ్యాద్యర్థపరకంబులయి ప్రశ్నార్థకంబులగు. ఉదా:—సీ. విూవంశ మున నర । దేవోత్తములదైన సద్ధర్మమార్గంబు సలుపుదయ్య । (సభా. ౧ ఆ. ౨౬). క. సన్నానితులయి వర్తింతురయ్య నీదైవజ్ఞుల్ (సభా. ౧ ఆ. 33). ౪. సూ-ఒక్కొ కచోఁ దద్ధర్మక్రియ యారాధ్యాద్యర్థపరకంబయి వ్యతిరేకవ్యంజక ప్రశ్నార్థకంబగు. ఉదా:—చ. తనయుఁడు తండ్రి యగ్రజుఁడు తమ్ముఁడనం జనునయ్య రాజ్యముం । గొనునెడ.........(నిర్వ. 3 ఆ.) ఉ.........సురాంగనలెల్ల నిట్టి నీ । చేతకు మెత్తురమ్మ (స్వా. 3 ఆ.) ౫. సూ-ఆరాధ్యాద్యర్థ మొకచో నటుశబ్దపూర్వకంబు నగు. ఉదా:—చెల్లునటయ్య - చెల్లునటమ్మ. ఉ.........దయసేయక తిన్న నిమేను వెన్నె లన్। వేఁతురటమ్మ యింత కనువేదురు సెల్లునటమ్మ యింతికిన్. (స్వా. 3 ఆ.) మొ." ౪ సూత్రమునకు భారతప్రయోగములును గలవు. ఉ.........అంతఁ బో । కేచిన సూతు లీ రొండలి కింత యపాయ మొనర్తురమ్మ (విరా. 3 ఆ ౪౫). (ఒనర్తు రమ్మ = ఒనర్పఁదగదనిభావము). చ.........ఇట్లనఁదగునయ్య యే నిచట నైనది యేటిది యింత యేటికిన్. (విరా. 3 ఆ. ౨౨౬). (అనఁదగునయ్య = అనరాదు). చ. తులువలుగాక యిట్టిదొర దుర్ణయవృత్తికిఁ జొత్తురయ్య.........(ఉద్యో. 3 ఆ. 33౧). (చొత్తురయ్య = చొరరు.). తద్ధర్మక్రియలెకాక భూతక్రియలును వ్యతి రేకవ్యంజకము లగును. వ్యతిరేకక్రియలును నారాధ్యాద్యర్థపరకములై వ్యతిరేకవిశిష్ట క్రియావ్యతిరేకము ననఁగా స్వార్థమును బోధించును. (ద్వౌ నఞౌ స్వార్థం ఘుట యతః). సీ.........శరస్తంబ జన్ముఁడు గాఁడె ధర్మవిదుఁడు తే-గీ. నృపుఁడు,

విప్రసతికి నూఱువేఁడఁ జన్ వరములు (సభా. ౨ ఆ. ౨౬3). దీనినిజూచి కాలవయఃపాల్కురికి సోమనారాధ్యుఁ డనుప్రయుక్తముగు 'కొనున్' అనుదానికిఁ బర్యాయముగ 'కొన్' అనుదానిని వ్యవహరించెను. ద్వి. అద్దుకొన్ వీరెవ్వరయ్యరో యనుచు. (బసవ. 3 ఆ. 3౪౬). (అద్దుకొన్ = అద్దుకొనును). ఇట్టిరూపములను బట్టియె, "చన్+ఎ = చన్నె' దొరకొన్+ఎ = దొరకొన్నె" యున్నగురూపములు బయల్వెడలినవి. ప్రయోగములు:—ఆ-వె. విప్రసతికి నూఱు వేఁడఁ జన్ వరములు (సభా. ౨ ఆ. ౨౬3). ద్వి. అద్దుకొన్ వీరెవ్వ రయ్యరో యనుచు. (బసవ. 3 ఆ. 3౪౬). క.........ధర్మక్రియలకు । బాధ యగున్ గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నె (ఆది. ౨ ఆ. ౧౭౪). చ.........ఱం । డొరుల మొగంబు చూచి నగుచుండఁగ జన్నె యుపాయహీనతన్ (ఆది. ౫ ఆ. ౨౧౦). ఆ-వె. చిఱుతవాని కింత తఱుపంటి పలుకులు । సన్నె వృద్ధజనము లున్నచోట (సభా. ౨ ఆ. ౨౨౮). ఎ-గీ. నా।పనుపు సేయకుండఁ జనునె నీకు (ఆది. ౬ ఆ. ౨౦౨). ఉ. మునీంద్ర నీకుఁ జ । న్నె నళినాక్షులందు మతి నిల్పఁగ నంచును.........(ఆది. ౮ ఆ. ౧౭౯). ఉ.........అహితమున్ భయమున్ దొరకొన్నె నాకు నా।పుత్త్రులకున్.........(సభా. ౨ ఆ. ౧33). క. నన్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ । జన్నే.........(కర్ణ. 3 ఆ. ౮౭). ఉ.........నన్నెడఁబాయ నీకుఁ జ । న్నే యనుఁ దల్లి నేఁపఁ జనునేయను......(ద్రో. ౨ ఆ. ౨౪౨). ద్వి. ముక్కంటి ముట్టనే మూర్కొన్నె చెపుఁడు (బసవ. 3 ఆ. ౪౬౫). 'మూర్కొనెనె' అనుదాని పరిణామ మనుట సరికాదని కావలయు 'మూర్కొనెనె' అను ఛందోభంగపాఠ మీఁబడెను. 'మూర్కొనునె' యనుదాని పరిణామమె యని యంగీకరించి యచటి తద్ధర్మక్రియ భూతార్థమందు వాడఁబడె ననుట యుక్తము.

పయి నుదాహరించిన విశేషరూపములలోఁ గొన్ని త్రిలింగలక్షణశేషకర్తచే నీక్రిందిరీతిని జూపఁబడెను. "ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు చను చేరు కొనులు ప్రశ్నార్థకైకారపరకంబు లగునపుడు వాని కడయచ్చులకు లోపంబు

ఘటసంభవుఁడుగాఁడె కీర్తిపరుఁడు । వరుఁడు ద్రోణుండు, విప్రులవలనఁ బుట్ట । రైరె సత్క్షత్త్రియప్రభు లవనిఁ గావఁ । గడఁగి, మీజన్మములు నిట్లు కావె వినఁగ (ఆది. ౬ ఆ. ౬౦). (కాఁడె = అగును. పుట్టరైరె = పుట్టిరి). కొన్నియెడల నామములపైని 'ఏ'దాదలునిల్చి వ్యతిరేకవ్యంజకములగును. ఉ.........వారి మూర్కొనుట కోర్చితి నేనొక బ్రాహ్మణుండనే. (ద్రోణ. ౫ ఆ. 3౨). (బ్రాహ్మణుం డనే = బ్రాహ్మణుఁడను గాను).

విభాషనగు. అగుచో నుండు దకారంబునకు నకారంబగు. చేకొను అనఁగా వను ప్రయుక్తమగు కొను ధాతువని యర్థము. (ప్రౌఢ. క్రియా. ౨ సూ.)

303 II విష. 30 సూ. వ్యాఖ్య. మూఁడు పురుషములందును బూర్ణముగా గతసూత్రములచేతనే సిద్ధించియుండుటచేత లజీరూపములు సూరిగారి వరుస తప్పించి ముందుగాఁ జూపుచున్నారు. చింతామణియందును నిట్టివరుసయే యనుసరింపఁబడెను. లజి జేత్తుగాన నయ్యది పరమగునపుడు ధాతువు తుది 'ఉ' కారమునకు 'అ' కార మాదేశ మగును. (బా. క్రి. ౨౦ సూ.) బా-క్రి-౮-౧౨ సూత్రముల చొప్పున నాదేశములగు పురుషవచన ప్రత్యయములను జేర్పఁగా వండఁడు మున్నగురూపములు సిద్ధించుచున్నవి. ఉదా:—వండు+అ+ఁడు = వండఁడు-మొ-ప్రథమపురుషమున మహత్కర్తృకత్వమునందు 'వండఁడు - వండరు' అను రూపములును నమహత్కర్తృకత్వమున 'వండదు - వండవు' అను రూపములును వరుసగా నేకవచన బహువచనములం దగుచున్నవని యెఱుంగునది. లజికిఁ గాలవిషయముపదేశింపఁబడమిచే నయ్యది కాలత్రయ ధాత్వర్థాది వ్యతిరేకములను బోధించు నను నభిప్రాయము విశదమగుచున్నది, (విస్తర). ప్రయోగములు:—సీ......
ఆ వె. ఎఱిఁగి యెఱిఁగి వారి నేటికి వారింప।రిట్టి గోత్రకలహ మేల పుట్టె (ఆది. 3 ఆ. ౫౯ ప.) (వారింపరు = వారింప లేదు). మత్తకోకిలము.........అన్యులు । క్రీతలేశ్వర దీనిఁ జేయరు......(ఆది. ౨ ఆ. ౨౦౮). (చేయరు = చేసినవారు కారు = చేయలేదు.) ఉ.........కచుండు నేనియున్ । రాఁడు......(ఆది. 3 ఆ. ౧౧౨) (రాఁడు = రాలేదు.) ఉ.........పార్థుఁడు వైరివాహినీ । వ్యూహము వ్రచ్చుచోట మఘువుండును వానికి మార్కొనంగ ను । త్సాహము సేయఁడు (ఆది. ౮ ఆ.

---

విస్తర. 303 II విష:—ఈవిషయమును త్రిలింగలక్షణశేషకర్త యిట్లు వివరించెను. "వ్యతిరేకక్రియ యర్థత్రయ బోధకంబగు. అర్థత్రయము = వర్తమాన భూత భవిష్యదర్థములు:—ఉదా:—వర్తమానమునకు:—ఉ. పాఱఁడు లేచి దిక్కులకు (భాగ. ౮ స్కం). (పాఱఁడు = పాఱుచున్నవాఁడు కాఁడు.) పలుకదు సఖులతో లలితాంగి. (ఆర. ౨ ఆ.) (పలుకదు = పలుకుచున్నది కాదు). భూతమునకు:—క. నలుఁ గాన మివ్వనంబున (ఆర. ౨ ఆ). (కానము=కనినవారము కాము.) ఱెక్కలు రావు పిల్లలకు (భాగ. ౭ స్కం.) (రావు = వచ్చినవి కావు). భవిష్యత్తునకు:—వాసుదేవుఁడున్ రాఁడను (భాగ. ౧౦ స్కం. పూ.) (రాఁడు = రాఁగలవాఁడు కాఁడు). నలున కాని నళినదళనేత్ర వరియింప, దక్టై. (ఆర. ౨ ఆ.) (వరియింపదు = వరియించునది కాదు). ఇత్యాదులెఱుంగునది" (ప్రౌఢ. క్రియా. ౮ సూ.)

౪౬). (చేయఁడు = చేయఁజాలఁడు చేయఁదలఁపఁడు). క. ధరణీధరు చక్రము నకుఁ । బురుహూతతనూజు బాణముల కని లోనై । వ్వరు మార్కొననోపర (ఆది. ౭ ఆ. ౨౭౪). (మార్కొననోపర = మార్కొనఁజాలరైరి. ఖాండవదహన సందర్భము.) చ.........శూరులైన దీ । నిని మది మెచ్చ రీబలము నీదెసఁ దేఱియుఁ జూడ దింతకున్ । మను భయహేతువైనవిధముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. (విరా. ౪ ఆ. ౬౧). (ఉత్తరుఁడు దూరమునఁ గౌరవసైన్యముఁ జూచి వెఱచి పాఱు నప్పటి యర్జునవాక్యములు). (శూరులు మెచ్చుట స్వభావము కాదు. తేఱియుఁ జూడదు = నీవైపు చూడనైన లేదు). ఉ. కావలివారిఁ దోలి యొకకంబున గోవులఁ బట్టికొంటి నం । చీ వెడ మాటలేల ? ధరణీశ్వర యింతకు మున్న వీటికిం । బోవవు శత్రు నేఁపుడిపి పోయెదు వాఁడవు కావు, నీవు సై । న్యావళియైనఁ జేడ్పడక యాతల కేఁగుట లేదు నేనియున్ (విరా. ౪ ఆ. ౧౯౨). (వీటికిం బోవవు = వీఁపురికిఁబోలేదు-పోయినవాఁడవు కావు. పోయెదు వాఁడవు కావు = బోవుచున్న వాఁడవు కావు). చ. సవినయవృత్తిఁ గొల్వఋటఁ జన్మనంబుల.........(విరా. ౫ ఆ. ౩౫౧). (కొల్వము-కొల్వలేదు). చ. అన విని నప్డ యొక్కఁడు మదస్త్రబలంబున కోర్వఁడు .........(భీష్మ. ౨ ఆ. ౩౨౮). (ఓర్వఁడు = ఓర్వఁజాలఁడు.) క. భూనాథుఁడు బొంకఁడు విను । మేనుచు ధర్మంబు దప్పను.........(ద్రోణ. ౫ ఆ. ౩౬౩). (బొంకఁడు = బొంకలేదు. తప్పను = తప్పలేదు). గీ. ఒరుల యున్నతి సైరింప నోపఁ డధిక । బలుఁడు...... . గాన వైరంబు విడువఁడు కౌరవేంద్ర (స్త్రీ. ౧ ఆ. ౨౯). (సైరింపఁడు = సైఁచు స్వభావముగలవాఁడు కాఁడు - విడువఁడు = విడువలేదు). చ.........తారకాసురున్ । గెలువఁడు పోరిలో.. ......(నన్ని. కు. ౪ ఆ. ౩౭౬). (గెలువఁడు = గెలువఁజాలఁడు).

డుమ కాతే కావు కాద్యా । ఆశీర్థేతు సమ్మతాః
(వికృ. అజం. ౬౬ కా. అహో. ౩౫౩).
నిబన్ధనేషు ప్రాచాం చే । చ్ఛబ్దోన్యః పరిదృశ్యతే ।
సూత్రస్థితాద్యశబ్దేన । గ్రాహ్యాః సంఖ్యావదుత్తమైః.
సన్నయా. (అహో. ౧౨౧ పు). (వికృతివివేకమున నిదిలేదు).

౩౦౪ విషయము. క్వచి ద్ధర్మక్రియామాత్ర । మార్థై రత్ర ప్రయుజ్యతే । (వికృ. అజం. ౬౬ కారి. అహో. ౩౫౩).
తద్ధర్మప్రథమైకత్వ । వాచకాద్ధి క్రియాపదాత్ । అది శబ్దప్రయోగః స్యాద్ । విశేషార్థే సరిత్యతే । (వికృ. క్రియా. ౧౭-౧౯ కారి. అహో. ౪౯౬ పు).

కల్పతరువు. 3౦౪ వివ:—డుము కాతౌ = 'డుము' అనునదియు, 'కాతన్' అనునదియు, కావుతాద్యాః = 'కావుతన్' మున్నగునవియు, ఆశీరర్థేతు సమ్మతాః = ఆశీర్వాదార్థకములుగ సమ్మతములగుచున్నవి. 'ఆద్యాః' అనుటచేతఁ చేయుతన్ (కళా. ౧ ఆ. ౧). (రాఘ. ౧ ఆ. ౨) మున్నగునవి గ్రాహ్యములగుచున్నవి. 'డుము' అనునది ధాతువులపైని నిల్చు ప్రత్యయము. "కాతన్ కావుతన్" అనునవి ప్రత్యేకశబ్దములు. 'కావుతన్ - కాతన్' అనునవి యాశీరర్థక 'త' ప్రత్యయాంతములగు 'అగు' ధాతురూపము లనఁదగును. వీనినిబట్టియే కాలక్రమమునఁ జేయుతన్ - మున్నగు 'త' ప్రత్యయాంతరూపములు వెలసిన వనఁదగును. ఆంధ్ర సాహిత్య పరిషన్ముద్రిత బాలసరస్వతీయోపేత చింతామణియందును దదనుసారి నారాయణీయాంధ్రవ్యాకరణమునందును "ఆశిషి కావుత కాతా। వెడుతేత్యాద్యా భవన్తి కాకశ్చ" (బాలస. ౬౬ పుట. నారా. క్రియా. 3౭౬ కారి. ౪౨ పద్య). అనునది భట్టారకకృతముగాఁ జూపఁబడెను. వివరణములును వ్రాయఁబడెను. అయ్యది ప్రక్షిప్తమని "డుము కాతా" విత్యాది ప్రకృతాథర్వణసూత్రమె విశదీకరింపఁజాలును. చింతామణిలోనె కాత కావుతాదులు చెప్పఁబడియున్నచో నీయథర్వణకారిక యారంభింపఁబడ నేరదుగదా. పరిషత్తువారు మాతృకాంతరమునఁ గలదనుచుఁ జూపినం జూపుదురుగాక. నన్నయాథర్వణకారికల సంబంధము నరసిన నారాయణీయకర్త యెట్లు దీనిని నన్నయకృతమని తలంచెనో తెలియకున్నది. మఱియు నీతఁడు "డుము కాతా విత్యాది ప్రకృతసూత్రములోని 'డుము' ప్రత్యయమును బరిశీలింపక యీకారికను "డు జ్ము కారౌ కావుతాద్యాః" అనురీతిని దిద్దివేసి "3౭౭.........డు జ్ము కావుత ప్రభృతులు.........౪3" (నారా. క్రియా.) అని తెల్గించెను. డుజ్ములను జింతామణికర్తయే వచించియుండఁగా నథర్వణుఁడు మరల వాని నేల చెప్పుననియైనఁ దలంపకుండుట వింత! "ఈ డు జ్ములు మధ్యమ పురుషమునందలి వని తెలియునది" అని గాణపతవివరణమున వ్రాయఁబడెను. (గాణ. 3౨౫ పు).

నిబన్ధనేష్విత్యాది:— ప్రాచాం నిబన్ధనేషు = ప్రాచీనమహాకవుల ప్రబంధములందు, అన్యైః శబ్దైః పరిదృశ్యతే చేత్ = కళగా మఱే పేసి శబ్దము కినఁబడినచో, సూత్రస్థితాద్య శబ్దేన = ఇజ్మధ్యసూత్రములోని యాద్యశబ్దగ్రహణముచేత, సంఖ్యావదుత్తమైః = పండితశ్రేష్ఠులచే, గ్రాహ్యాః = కళాశబ్దములుగా గ్రహింపఁ దగినది. ఈకారికను వికృతివివేక టీకాకర్త చూచికొని గ్రహింపలేదు. ఈపద్ధతి చొప్పున "మము - అది" అనునవి (ఆశీర్వాదర్థసందర్భములోనివి) కళలని యెన్న

ఆశీరర్థక 'డుము' ప్రత్యయము. 'కాతన్' మొ.న కారము మకారము కాదు[ ౩౦౮వి.కల్ప.]

నది. ఇంకేవేనిఁ గవిప్రయుక్తములై యున్నచో వానిని గళలనుగా భావించునది. తక్కిన 'కావుత - కాత' - అనునవి 'అన్యే ద్రుతప్రకృతయః' అనుచెప్పిన ద్రుత ప్రకృతికములనియుఁ బ్రయోగానుసారముగ గ్రహింపనగును. డు డ్వాదివర్ణే ........ఇత్యాదిసూత్రములోని యాదిశబ్దమునుచే (౭౯౬ I విష). 'డుము' పర కత్వమున ధాతువు తుదిని 'ఏ'త్వము నిల్చును. ఉదా:—పొందెదు మంచు. (ఆది. ౭ ఆ. ౧౮౨). ఉ........శాంబరీ। భిల్లుఁడు కృష్ణరాయల కభీష్ట శుభ ప్రతిపాది గావుతన్ (మనుచ. ౧ ఆ. ౨). 'డుము' = అని కొన్నియెడలఁ దాళపత్రమాతృ కలలోఁ గన్పట్టుచున్నది.

క్వచిదిత్యాది - క్వచిత్ = ఒకానొకప్పుడు, అత్ర = ఈయాశీర్వాదార్థమందు, ధర్మక్రియామాత్రమ్ = తద్ధర్మక్రియామాత్రమె, ఆర్యైః = పూజ్యులగు కవు లచే, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడుచున్నది. ఉదా:—చ........వాసుకి మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్ (ఆది. ౧ ఆ. ౧౦౬). ఇట్లె. ౧౦౫-౧౦౭-౧౦౮ పద్య ములలోసయితము ప్రయుక్తమయ్యెను. శా........రా। జీవాత్ముండు గృతార్థుఁ జేయు శుభదృష్టిం గృష్ణరాయాధిపున్. (మనుచ. ౧ ఆ. ౧ ప). (చేయున్ - ఆశీరర్థ కము - తద్ధర్మక్రియ).

సూరిగారు 'ఎడు - త' - ల ద్రుతమున కచ్చుపరంబగునపుడు మకారంబగు (బా. క్రి. ౨౮ సూ). అని సూత్రించిరి. 'ఎడున్ - తన్ - కాతన్ - కావుతన్' అనున వెల్ల ద్రుతప్రకృతికములె యనియు నట్టిద్రుతము స్వరపరక మగునపుడు మకార మగుననియు సూరిగారి యాశయము. అథర్వణుఁడు వీనిని వచించుటలో 'డుము' అనుదానినిమాత్రమె 'మ'వర్ణఘటితముగఁ జేర్కొని తక్కినవాని నట్లు వేర్కొన కుండుటచే "డు" మేతరములందు మవర్ణస్థితి లేదని తోఁచుచున్నది. వీనిలో నెద్దాని యందును మకారస్థితిని నిర్వహింపఁజాలు ప్రామాణిక కవిప్రయోగము కానరాదు. కాని ముద్రణములందే కాక తాళపత్రమాతృకలందును వీనిలో మకారస్థితి కన్పట్టు చున్నది. 'డుమ' లోని మకారమునుబట్టి సామ్యభ్రమచేఁ దక్కిన కావుతాదు లందును స్వరసంధిలో మకారస్థితి యర్వాచీనులచేఁ బ్రతిప్తమగుచువచ్చెనని తోఁచుచున్నది. తద్ధర్మక్రియల కాశీరర్థకత్వము సర్వసమ్మతమగుటచేఁ "ఇష్టసిద్ధులఁ జేయు నెల్లప్పు డీశ్వరుఁడు" మున్నగుచోటులందువలెనె, 'చేసెడున్ - చేసెడిన్' మున్నగువానియందును స్వరసంధిలో మకారాభావము న్యాయ్యము. ఇట్లగుట చేతనేకదా 'డుము' అని మకారఘటితము నథర్వణుఁడు విధింపవలసెను. కాఁబట్టి కావుతాదుల ద్రుతమునకును స్వరపరకత్వమున మకారాదేశము రానేరదనుట యుక్తము.

తద్ధర్మప్రథమైకత్వేత్యాది:—విశేషార్థే = అర్థవిశేషము, నిరీక్షితే = కనఁబడుచుండఁగా, తద్ధర్మప్రథమైకత్వ వాచకాత్ క్రియాపదాత్ = తద్ధర్మప్రథమ పురుషైక వచనరూపముకంటెఁ బరముగ, అది శబ్దప్రయోగః = 'అది' అనుదాని ప్రయోగము, స్యాత్ = అగును. ఉదా:—చేయున్+అది = చేయునది = తప్పక చేయవలయునను విధివాచ్యమగుచున్నది. 'తద్ధర్మ' అనుటచేత 'చేసెడునది' మున్నగు రూపములును సాధువులె యననగును గాని యట్టి కవిప్రయోగములు లభింపలేదు. దుమాదులకు:—ఉ........తత్కార్యసంసిద్ధి ను। త్తముఁడై పొందెడు మంచు నుండిరి........(ఆది. 2 ఆ. ౧౮౨ ప). వ. నీకు లగ్గయ్యెడుమని (సభా. ౨ ఆ. ౨౬౪ వచనము). వ. మిమ్ము చంద్రాదిత్యులు........రక్షించుచుండెడు మెల్ల కార్యములయందును........భవత్పునర్దర్శన మయ్యెడు మరుగుందు........ (సభా. ౨ ఆ. ౨౮౩ వచనము). సీ........ఇష్ట। సంసిద్ధి యయ్యెడు సర్వవిఘ్నములును శాంతిఁ బొందెడుమని (ఆర. ౧ ఆ. ౨౮౩). క........పు। ట్టువు కాకుండెడు....... .బ్రాహ్మణకులమునందయయ్యెడు నాకున్ (అర.౧ అ. ౨౮౪). చ........నభము ధాత్రియుఁ గాడ్పును గాచుచుండెడున్ (అర. ౧ అ. ౨౮౫). (ఇవెల్ల ద్రౌపదీవాక్యములు). సీ........ధర్మనందనుఁడు. ఆ. వె........ఒనరించు। చుండుఁ గావుతమ యఖండితముగ (ఆది. ౮ ఆ. ౬౩ ప). 'ఒనరించు। చుండుఁ గావు తన్న ఖండితముగ' అని కవిప్రయుక్త మనఁదగు. వెనుకవ్రాసినరీతిని 'కావుతా' దుల లోని మకారస్థితి విశ్వసనీయము కాదు. క. దీవెన లగునెడఁ గాతయుఁ। గావు తయుం దెనుఁగుకవుల కబ్బంబులలో। శ్రీకలిగెడు నధిపుడు మే। ల్గాంచుంగాత మేలుగావుత యనఁగన్ (ఆం. భూ. ౧౬౦). (విస్తర). (ఇందు 'యనఁగన్' అనుట

---

విస్తర ౩౦౪ వివ:—"ఎడము - తము - ఇవి ప్రాచీనరూపములు, క. 'దీవన కెడమయుఁ గాతయుఁ। గావుతమును దెలుఁగులందుఁ గల వండ్రు మహిన్। శ్రీ వెలుఁగెడ మధిపుఁడు మే। ల్గాంచునుగాత, మేలుగావుత మనఁగన్' అను కేత నార్యుని లక్షణము ముద్రణములో మాఱిపోయినది. 'అయ్యెడమ - కావుతము' అనురూపములు పూర్వశాసన తాళపత్ర గ్రంథములఁ గనవచ్చుచున్నవి........" (ఆం. భా. అ. క్రియా. ౨౩౪ పు. తృతీయముద్రణము). విమర్శకులు చూచు కొనుట కనువుపడునట్లు పైప్రమాణములు గల స్థలముల ననుశాసనకర్తగారు నిర్దేశింపరైరి. ఆశాసనములేవో? ఆతాళపత్రమాతృక లెచటివో? ఆ కేతనపద్యము గల మాతృక యెచటిదో? తెలియదయ్యె - మఱియు నధర్వణకారికనుబట్టియు భారతప్రయోగములనుబట్టియు 'ఎడమ' అనుస్థితి సరియైయున్నట్లు తోఁచదు. 'ఎడున్' అనుదానినిబట్టి 'ఎడుము' అనునదియె నిజరూపమనియుఁ దోఁచుచున్నది.

యచ్చుత శ్వనకతీరదు. "కాంవుత ననఁగన్ లేదా కావుత మనఁగన్" అని యుండ వలెను. ఈపద్యము ధోరణినిబట్టి 'కాత - కావుత'ల తుదిని స్వరసంధిలో మకార స్థితిని ప్రాచీనుఁడగు కేతనయు నుద్దేశింపలేదనుట స్పష్టము. కావున 'మేలు కావుత ననఁగన్' అనునదియే కవిప్రయుక్త మనఁదగును, విన్నకోట పెద్దిరాజును 'కాత' అను దానితుదిని మకారస్థితి నుద్దేశింపలేదు. ఆ-వె. ఉరు - దురు - లకు - మీఁద నొగిఁ గాత యున్న నా । శీర్వచనమునకును జెల్లు నదియు । శివము చేయుఁగాత శివుఁడు శోభనము చే । యుదురుగాత మీకుఁ ద్రిదశు లనఁగ (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౫౮ ప). తద్ధర్మ క్రియలమీఁదనేకాక ప్రత్యేకముగను "కాత - కావుతలు" ప్రయోగింపఁబడును. సీ. నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావు తము । సమగ్రదక్షిణ......... (అను. ౫ ఆ. ౪౪౨). (కావుతను అని కవిప్రయుక్తమనఁదగును). చ. దైవము తోడుపాటునుం । గలిగెడుఁగాక.........(కర్ణ. ౧ ఆ. ౪౯). అనురీతిని 'కాక' శబ్దముసయితము తద్ధర్మక్రియలపై నిల్చి యాశీరర్థమును బోధించును. 'డుము' అనునది యట్టిదికాదు. అయ్యది ధాతువుపై నిల్చు ప్రత్యయము. సీ......... జిహ్వాస్ఫూర్తిలేక, రసాలివివేక మెడలి (తే-గీ.) యుండెడుము కప్పలు......... (శాపము) (అను. ౩ ఆ. ౧౪౩). డుములోని మకార మిట్లు తాళపత్రమాతృక లందును వెలయుచున్నది. కొన్నియెడలఁ గొన్ని తాళపత్రమాతృకలో 'ఉండెడు ము కప్పలు' అనియున్నది. ఇట్టివానినిబట్టి యీప్రత్యయము 'డురు' అనియో 'డుము' అనియో నిర్ణయింపరాకున్నది.

తే-గీ.........వార । లొక్కమొగి వింటిగొనయంబు పెక్కు తునియ । లయ్యెడుము యనవుడు నది యట్ల యయ్యె (సౌప్తి. ౨ ఆ. ౧౨౪) తే-గీ. కలుగ కుండెడు మెల్లలోకముల నని శ । పించె శక్తికర్త. (శాంతి. ౧ ఆ. ౪౧). తే-గీ......... విష్ణుఁడు । ఇష్టదాయి ప్రసన్నుఁ డయ్యెడుము నాకు (శాంతి. ౪ ఆ. ౨౨౨). తే-గీ. వైభవము నయ్యెడుము నీకు.........(అను. ౨ ఆ. ౨౮౭). చ......... గోస ము । త్కరమును నన్ను నెప్డు గనుఁ గావుత మంచెద గోవులం దలం । తురు (అను. ౩ ఆ. ౩౪). ('కనుఁగావుతనంచెద' అని కవిప్రయుక్త మనఁదగును). పయి ప్రయోగములందెల్ల 'మ'కార ఘటితపాఠములె తాళపత్రమాతృకలందును గలవు. సీ.........ఇచ్చుచుండుఁ । గాత మిన్నుసుమతి యీతఁడు (హరి. పూ. ౧ ఆ. ౧౨౪). ("ఇచ్చుచుండుఁగాత నిన్నుసుమతి" అని కవిప్రయుక్తపాఠ మనఁదగును). తద్ధర్మక్రియ మీఁది 'అది' శబ్దప్రయోగము:—క......... । ధర్మువ తాత్పర్యముగా । నిర్మలమతి నెగడునది వినీతాత్ములరై (ఆది. ౭ ఆ. ౩౫). వ్యాసుఁడు

పాండవులతోఁ బల్కినమాట. ఇది విధి యన్న ననవచ్చును. సూరి దీనిని విధ్యర్థక మనెనే కాని వివిధములగు నర్థములు దీనియందు నిలిచియున్నవని చెప్పలేదు. అది పొరపాటు. యయాతిపూరునకుఁ దనపుత్రునకుఁ జేసిన సదుపదేశములు:—క. ఎఱుకగల వారిచరితలు। గఱచుచు సజ్జనులగోష్ఠి గదలక ధర్మం। బెఱుఁగుచు నెఱిఁగినదానిని। మఱవ కనుష్ఠించునది సమంజసబుద్ధిన్. (ఆ. 3 ఆ. ౨౦3). క. ఇచ్చునది ధనము పాత్రున। కిచ్చుగ నొరు వేఁడకుండునది యభిముఖులై। వచ్చిన యాశార్థుల వృథ। పుచ్చక చేయునది సర్వభూతప్రీతిన్. (ఆది. 3 ఆ. ౨౦౪). ఇట్టి వీఁటందగ్భమునఁ బెక్కు గలవు. ప్రార్థనార్థమందు:—క. ద్వారవతి నుండి యును నిట। యారసి యుండునది దానవాంతక...... (సభా. ౨ ఆ. ౮౨). సమ్మతిని దెల్పుట:—క. ఇమ్మని వరునకు నన్నుఁ బ్రి। యమ్మున నిచ్చునది మీకు నతిచింతాభా। రమ్మేల......... (అర. ౨ ఆ. 33౨). హితము తెల్పుట. సీ......... । శాపంబు నీకిచ్చె...... ఆ-వె... ...... । మంత్రతంత్రవిధు లమర్చి యేమఱకుండునది. (ఆది. ౨ ఆ ౧౮౧). పెద్దలు పిన్నవానిని వేఁడుట:—తే-గీ. కడఁగి నీకెగ్గు సేసె నా కొడుకు దీని। మఱచునది నీవు నేనొండ్లు గఱపనేల (సభా. ౨ ఆ. ౨౬౫). ఇట్టి యర్థవిశేషము లింకను ననేకములుగలవు. కాన దీనిని సూరివలె విధ్యర్థక మనుటకంటె నర్థవిశేష ద్యోతక మని యధర్వణుఁడు వచించుట యెంతయు సమంజసముగనున్నది. ఈరీతినె 'ఉండునది' అనునది 'ఉన్నది' అనురీతిగఁ బరిణమించుట 3౧౫ విషయమునఁ బ్రదర్శింపఁబడెను. (ఆది. 3 ఆ. ౨౧౬-౬ అ. ౨౭౦ శాంతి. 3 ఆ. ౨3౯ పద్యములు చూపఁబడెను.) సీ. ధనములు సెడిన బాంధవులు సచ్చినఁ దదీ, యములగు గుణములయందు మనసు। పెట్టక యున్నది యెట్టన్న వగచిన, దాపంబువొందుట దక్క నొండు। గలుగునే సుఖము.........(అను. ౫ ఆ. ౨3౦). వలయ్యాదిశబ్దములతోను నిట్టియర్థములు ప్రకాశితములగును. నీవు నాచెప్పినపని చేయునది = నీవు నాచెప్పినపని చేయవలయును.

బాలవ్యాకరణ వివరణము. ౩౦౪ I విషయము.

లూట్టు డుఙ్ఙున కెడు - త - వర్ణంబులు ద్రుతాంతంబులగు. ౨౬.

ఆశీస్సు - మీకు మేలుగలిగెడును - మీకు మేలు గలుగుతను. శాపంబు-నీకు రాక్షసత్వంబు గలిగెడును. నీకు రాక్షసత్వంబు గలుగుతను. సంప్రార్థనంబు - హరి ననుఁ గృపఁ గాంచెడును. హరిననుఁ గృపఁ గాంచు

తను. విధియందు లూట్టునకు మాఱుగ నది యను
తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబు నగు. ౨౭.
మైత్రుండు నా నిర్దిష్టకార్యంబు చేయునది. వానికి నీవు
బాసటగాయె యుండునది.
ఎడు తల ద్రుతంబున కచ్చుపరంబగునపుడు మకారం
బగు. ౨౮.
నీకు మేలు గలిగెడు మనియెను. నీకు మేలు గలుగుత
మనియెను.

సంజీవని. 308 I విమ:—౨౬ సూ:—విధ్యర్థమునందలి లూట్టు డుజ్ఞున
కుత్తరసూత్రముచే 'అది' శబ్దము నాదేశింపుచున్నాఁడుగాన నీసూత్ర మాశీర్వాప
సంప్రార్థన మాత్రవిషయకమని (బా. క్రి. ౬ సూ. ఆ శీర్వాపసంప్రార్థనవిధులు
లూడర్థములు) సూరిగారియాశయము. ఆశీర్వాప సంప్రార్థనార్థములందు ధాతు
వునకు 'ఎడున్-తన్' అను రెండుప్రత్యయములుమాత్రమె వచ్చునని తాత్పర్యము.
సూరి నన్నయాథర్వణీయ విలక్షణముగ లూడాదేశము లగు డుజాది పురుషబోధక
ప్రత్యయము లన్నిటికిని నాదేశముగా "ఎడు - త - అది" అనువానిని విధించుటచేత
నయ్యవి పురుషత్రయమునందును బ్రయోగింప నర్హములకు నపార్థము సూరి
పక్షమున దుర్వార మగుచున్నది. సూరిగారి యుదాహరణ స్వారస్యమునుబట్టి
ప్రథమపురుషమునందు మాత్రమె యేకత్వ బహుత్వభేదములేక 'ఎడు - త'
లు వచ్చుననియు ద్రుతపూర్వకమగు 'అది' శబ్దము, ప్రథమ మధ్యమపురుషము
లందుమాత్రమె వచ్చుననియు 'ఎడు - త' లాశీర్వాప సంప్రార్థనములందు వచ్చు
ననియు ద్రుతపూర్వకమగు 'అది' శబ్దము విధ్యర్థమందుమాత్రము వచ్చుననియు
సూరి తలంచినట్లు తోఁచుచున్నది. కాని 'ఎడు - త' లాశీర్వాపములందు మాత్రమె
ప్రథమపురుషమునందుమాత్రమె వచ్చుటయు ద్రుతపూర్వకమగు 'అది' శబ్దము
విధ్యర్థమందేకాక ప్రార్థనాద్యర్థవిశేషములందును మధ్యమపురుషమందుమాత్రమె
వచ్చుటయు మహాకవిప్రయోగములందుఁ గన్పట్టుచున్నవి. (విస్తర). సంప్రార్థ
మందలి 'ఎడు - త' లకు సూరిగారు "హరిననుఁ గృపఁగాంచెడును - హరిననుఁ

---

విస్తర. 308 I విమ:—"(౧) అతండు శుభప్రతిపాదిగావుతన్. (౨) వారు
శుభప్రతిపాదులుగావుతన్. (3) నీవు శుభప్రతిపాదివిగావుతన్. (౪) మీరలు
శుభప్రతిపాదులరుగావుతన్. (౫) నేను శుభప్రతిపాదినిగావుతన్. (౬) మేము
శుభప్రతిపాదులుగావుతన్..."సంస్కృతభాషలోఁగూడ సమానప్రత్యయాంతమైన

[బా. క్రి. ౨౬ మొ. ౨౭ సూ.] ఆశీరర్థకమధ్యమోత్తమములుగలవను 'బాగు. ప్ర. తప్పు'

గృహఁ గాంచుతను" అని యుదాహరించిరేకాని యవియును నాశీరర్థోదాహృతులె యనఁదగియున్నవి. 'హరి నన్ను దయతోఁ గాంచుఁగాక' అను నాత్మాశీర్వాదమె యందుఁ దోఁచుచున్నదిగాని ప్రార్థనార్థస్ఫూర్తి కానరాలేదు. యుష్మదర్థకశబ్దము కర్తగా లేనపుడు ప్రార్థనార్థ మెట్లు పొసఁగును? సూరిగారి యుత్తరసూత్రము విధ్యర్థమాత్రవిషయకము కాదనియు నయ్యది విధిప్రార్థనాద్యర్థ విశేషవిషయకమనియు విశదపడునట్లు పూర్వవిషయంబున ననేకోదాహరణంబులు ప్రాచీనకావ్యములనుండి (౩౦౪ విష.) ప్రదర్శింపఁబడెను, కాన నుత్తరసూత్రము విధ్యర్థమాత్రవిషయకమనుట పొరపాటు. ప్రకృతసూత్రమున 'మీకు మేలు గలిగెడును' అనునది యాశీరుదాహృతియు రాక్షసత్వము గలిగెడుననునది శాపమనియు స్పష్టమగుటచే విస్తరించి వివరింప నక్కఱలేదు. 'కలిగెడున్' మున్నగురూపములు లోట్టు ప్రథమపురుషైకవచనరూపములె యగుటచేతను (బా. క్రి. ౨౩ సూ.). లోడర్థములలో నాశీరర్థ మొకటి యగుటచేతను సూరి ప్రకృతసూత్రమునం దుపదేశించిన 'ఎడున్' అనునది పునరుక్తమని శంకింపరాదు. 'నీకు బహుపుత్త్రులు కలిగెడున్' అనురీతి వాక్యములందలి 'కలిగెడున్' మున్నగునవి లోడ్రూపములని సమర్థింపరాదుగదా. మహత్కర్తృక బహువచనమున 'కలుగుదురు' మున్నగురీతి నుండవలెను

---

శబ్దంబుల యర్థంబులకు యుష్మదస్మదాది శబ్దార్థంబులతోడి సంబంధంబు గానంబడుచుండు ..కాఁబట్టి సర్వపురుషంబులయందును నాశీరాద్యర్థవిషయంబున ద్రుతాంతమైన యెడు - త వర్ణంబులును విధ్యర్థవిషయంబున నది శబ్దంబును నిరాతంకముగాఁ బ్రవర్తిల్లవచ్చును...పూర్వకవిప్రయోగంబులలోఁ బ్రథమపురుషక్రియలయందుం బలె మధ్యమోత్తమపురుషక్రియలయందు 'ఎడు త'వర్ణంబులు గానంబడ వందురేని ...కవిప్రయోగంబులు గనుంగొనంజాలని స్వదౌర్బల్యదోషంబును శాస్త్రంబునం దారోపించుట యుక్తంబుగాదు గావున నిబ్బహుళాంధ్రోక్తిమయ ప్రపంచంబునఁ బండితపుంగవులు పరమశ్రద్ధాపూర్వకంబుగాఁ గవిప్రయోగంబుల గవేషింతురుగాక!" (బా. గు. ప్ర. ౩౫౯ పు. మొ. ౩౯౪ పు. వఱకు. ద్వి. ము) సంస్కృతభాషలోని భావార్థక ప్రథమపురుషైకవచనసామ్యము పట్టుచున్నదిగాని నీపద్ధతి నిరాతంకముగను నప్రతిహతముగను వర్తిల్లవలసినదేయఁట! ఈపద్ధతి యుత్తమపురుషాదులందు వర్తిల్లెడి ప్రయోగములు లేవన్నచో బహుళాంధ్రోక్తిమయ ప్రపంచములో వెదకికొవలెనంట, లేనిదానిని వెదకిన ప్రయోజనమేమి? చేతనయినచోఁ దానట్టి ప్రయోగములను జూపి నిర్వహించుట యుక్తముకాని లేనివానిని వెదకికొమ్మనుట యుక్తమా?

గదా. ఇట్లు సూరిగ్రంథము సురంగతముగుచున్నను "నీకు బహుపుత్త్రులు కలిగెడున్" అనురీతి వాక్యములు నన్నయాథర్వణీయసమ్మతములు కామింజేసియు నట్టి మహాకవిప్రయోగములు లేమింజేసియు నవి సాధువులు కానేరవు. అట్టియెడల "నీకు బహుపుత్త్రులు కల్గెదురు" అని ప్రయోగింపనగునని దురు కాతా విశ్వా దథర్వణవచనముచొప్పున గ్రహింపనగును. "వ.....మిమ్ము భూమియు గాడ్పును జంద్రాదిత్యులు నెల్లకాలము రక్షించుచుండెదు మెల్లకార్యంబులయందును నప్రమత్తులరయి వర్తిల్లునది. భవత్పునర్దర్శన మయ్యెడు మరుగుండని కలిసిన ....." (సభా. ౨ ఆ. ౨౮౩). తాళపత్త్రమాతృకయందును 'దురు' అనునదియె యున్నది. కావున లాద్రూపేతరముగు 'కలిగెడున్' అను బాలవ్యాకరణ సమ్మతముగు లూప్రూపము నన్నయాథర్వణీయ విరుద్ధముగుటంజేసి యసాధువని యెన్నవగును. ప్రకృత సూత్రోపదిష్టములగు "ఎడు - త"ల లో "త" ప్రత్యయముచే సిద్ధించు "కావుత - కాత" అను 'అగు' ధాతుజన్యరూపములు ౩౦౮ విషయమున విపులముగా నుదాహరింపఁబడెను. తక్కినచోటులందలి 'త' ప్రత్యయాంతరూపములకు భారతమునఁ బ్రయోగములు లభింపలేదు. కాని నవ్యాచీనుల ప్రయోగములు దాహరింపఁబడుచున్నవి. శా.........నం। దావ్యల శ్రీనరసింహకృష్ణవిభు నిత్య శ్రీయుతుం జేయుతన్ (కళా. ౧ ఆ. ౧ ప). శా.........కృష్ణమేఘము జగత్ ప్రీతిం గడుం జేయుతన్. (రాఘ. ౧ ఆ. ౨ ప) "ఈవుత - ద్రు - ఇచ్చుధాతువుయొక్క ఆశీరర్థక రూపము. 'ఇచ్చుతన్' అనుదానికి రూపాంతరము. చ. సరస్వతీశ్వరుఁడు దారత మారెఁ జిరాయు వీవుతన్ (ఉ. రా. ౧ ఆ. ౫)" (సూ. రా. ని.) 'ఈవుతన్' అనునది సాధువగుటకు మార్గముకన్పట్టదు. అందలి "చకారము వకారముగుట మున్నగునది శాస్త్రవిరుద్ధము - ప్రయోగవిరుద్ధము. "చిరాయు విచ్చుతన్" అనియె కవి ప్రయుక్తమునఁదగును. ఇట్లె నేటిముద్రణములలోని 'ప్రోవుతన్' మున్నగునవియు నసాధువులె. 'ఈవెడున్ - ప్రోవెడున్' అనియు సూ- రా. నిఘంటుకారు లంగీకరింతురు కాఁబోలును ?

౨౭ సూ: వ్యాఖ్య:—విధ్యర్థమున లూడాదేశములగు డుఙాదులస్థానమున ద్రుతపూర్వకముగు 'అది' శబ్దము నిల్చునని యర్థము. ఉదా:—మైత్త్రుండు నానిర్దిష్టకార్యము చేయునది = మైత్త్రుఁడు నేను జెప్పినకార్యము చేయవలయును. ఇట్లు మధ్యమపురుషేతరస్థలములందు దీనివాడుక మహాకవిప్రయోగములందుఁ గన్పట్టలేదు. "దేవదత్తా నీవు నానిర్దిష్టకార్యము చేయునది" అనురీతినే ప్రయోగములు మధ్యమపురుషమునందే వెలయుచున్నవి. 'నీవు వానికి బాసటవై యుండు

నది' అను సూరియుదాహృతి యిట్టిదే. ఇది విధ్యర్థమందే కాక ప్రార్థనాద్యర్థవిశేషములందును బ్రయుక్తమగుచున్నది. ఇట్టి యర్థవిశేషములందలి ప్రయోగములు ౩౦౪ విషయమున ననేకములు ప్రదర్శింపఁబడెను. ద్రుతవిధానము లేమింజేసి 'అది' శబ్దాంతక్రియ కళయని యెఱుంగునది.

౨౮ సూ. వ్యాఖ్య:—బా. క్రి. ౨౬ సూత్రమున విధింపఁబడిన 'ఎడు-త'లు ద్రుతాంతములుగ నుపదేశింపఁబడినవి. అట్టి ద్రుతమునకు హల్లుపరమగునపుడును నవసానమునందును ద్రుతకార్యములు గల్గుననియు నచ్చు పరమగునపు డాద్రుతము మకారముగాఁ బరిణమించుననియుఁ బ్రకృతసూత్రమునకుఁ దాత్పర్యము. ఉదా:— నీకు మేలు గలిగెడున్+అనియెను=నీకు మేలు గలిగెడు మనియెను. నీకు మేలు గలుగుతన్+అనియెను = నీకు మేలు గలుగుత మనియెను. "పొందెడుమంచు" (ఆది. ౭ ఆ. ౧౮౨). మున్నగు నన్నయ తిక్కనల ప్రయోగముల నరసియు సూరి "డుము కాతా విత్యాది" కారికను సరిగ గ్రహింపమింజేసి యట్టి మకారస్థితిని సమర్థించుటకయి ప్రకృతసూత్రము నుపదేశించెనని యెన్నవగును. "పొందెడుమంచు" అనురీతిగల నన్నయాదుల ప్రయోగములలో "పొందెడున్+అంచున్' అని సూరి పక్షమందుఁ బదచ్ఛేదమనియు, 'పొందెడుము+అంచున్' అని నన్నయాథర్వణీయ పక్షమునఁ బదచ్ఛేదమనియు నెఱుంగునది. ఇందలి సూరిపక్షము నన్నయాథర్వణీయ విరుద్ధమగుటంజేసి నిర్మూలమని చెప్పనగును. ఈక్రింది మహాకవిప్రయోగములును సూరిపక్షమును విరోధించుచున్నవి. తే-గీ.........వార। లొక్క మొగి వింటి గొనయంబు పెక్కుతునియ। లయ్యెడుము యనవుడు నది యట్ల యయ్యె। (సౌప్తి. ౨ ఆ. ౧౨౪ ప.) తే-గీ.........। ఇష్టదాయి ప్రసన్నుఁడయ్యెడుము నీకు (శాంతి. ౪ ఆ. ౨౨౨). తే-గీ వైభవము నయ్యెడుము నీకు.........(అను. ౨ ఆ. ౨౮౭). ఇట్టి ప్రయోగము లథర్వణవచన సమ్మతములగుచుండఁగా సూరికై వీనిని సవరించి యన్యథాకరించుట యుక్తము కాదుగదా. ఈప్రయోగములన్నిటను దాళపత్త్రమాతృకలందు 'మ'కారస్థితి నియతముగఁ గన్పట్టుచున్నది.

ఏకత్వే ఒథ ఒహుత్వే, ము డుజా సంప్రార్థనార్థకే
షుస్తః. (ఆం. చిం. క్రియా. ౧౦ కారి. అహో.
౪౮౧ పు.)

నన్నయాథర్వణీయము. ౩౦౫ విషయము.

ప్రార్థనార్థే ము రేకత్వే। కథ్యతే మధ్యమార్థకః।
విభాషాతో వదన్త్యేకే। న ప్రాణేతు కదాపిచ. (వికృ.
క్రి. ౭ కా. అహో. ౪౮౪ పుట.)

13.6 స్వరపరకత్వమందును 'ము'లోపము. తిక్కనాదులువాడిరి [30వ I వి. సంజీ.]

కల్పతరువు. 30వ విభ:—ఈ కారికలకు ౧౦౯ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. 'సంప్రార్థనార్థకేషు' అను బహువచన స్వారస్యముచే ప్రార్థనార్థమందే కాక యాశీశ్శాప విధ్యాద్యర్థములందును మధ్యమపురుషమున నేకత్వమున 'ము' వర్ణకమును బహుత్వమున 'డుఁజ్' వర్ణకమును నగుననియు జిత్త్వముచే 'డు' వర్ణకము బిందుపూర్వక మగుననియుఁ జింతామణి కారికకుఁ దాత్పర్యము. అందలి ముర్ణకము హల్పరకత్వమందును నవసానమునందును వైకల్పికమనియు స్వరపర కత్వమున నిత్యమనియు నథర్వణుఁడు నవరించెను. స్వరపరకత్వమునందును 'ము' వర్ణకలోపమును దిక్కనాదులు ప్రయోగించిరి. (౧౦౯ I విభ.) ఉదా:—నీవు నన్ను రక్షింపుము - రక్షింపు. మీరు రక్షింపుఁడు - రక్షింపుఁడు. రక్షింపు నన్ను - రక్షింపుము నన్ను. మొ. ప్రయోగములు:—క. తక్షకుఁ డతిభీతుండై । యాక్షణ మున నరిగె సురగణాధిప నన్నున్ । రక్షింపుము రక్షింపుము । రక్షింపుము యనుచు నప్పురందరు కడకున్. (ఆది. ౨ ఆ. ౨౧౭ ప.) క. పుట్టిన విధమెట్లు చెప్పు, పాలు పుగ నాకున్. (సభా. ౧ ఆ. ౧౩౪ ప.) ఆ-వె. ప్రియము హితంబును । నాత్మఁ గోరు వారి నడిగి చూడు. (ఉద్యో. ౧ ఆ. ౩౦౦.) (క.........ము । త్సాయక ముల నినుఁ గూల్చెదఁ । జూ యొవ్వత నైతి నేమి చూచెదు నన్నున్. (భీష్మ. 3 ఆ. 3౨౫.) ఉ. ఆ డిదె నీదు పందెము. (కళా. ౬ ఆ.) (ప్రౌఢ. సంధి. ౧౮ సూ.) వీనిలో స్వరపరకము లోపము. చూడు—(౧౦౯-౧౧౯ I విభ.) మ......... మోహాంధుండు భీష్ముండుఁ గే। శవ నీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామ రంగంబునన్. (సభా. ౨ ఆ. ౬3.) మత్తకోకిలము.. ......ఈతని బుద్ధి మీ । రేవగింపక చేకొనుం డిది.........(సభా. ౨ ఆ. ౨3౬.).

| | |
|---|---|
| | లూణ్మధ్యమ పురులకు, ము డుఁజ్లు లగు. ౨౯. |
| | ఆశీస్సు - దీర్ఘాయువగుము - దీర్ఘాయువుల రగుఁడు. |
| బాలవ్యాకరణ. | శాపంబు - రాక్షసుఁడ వగుము - రాక్షసుల రగుఁడు. |
| 30వ I విభ | సంప్రార్థనంబు - నన్ను రక్షింపుము-నన్ను రక్షింపుడు. |
| | విధి - నా చెప్పినపని చేయుము - నా చెప్పినపని చేయుఁడు. |

సంజీవని. 30వ I విభ:—లూణ్మధ్యమ పురులకు = లూట్+మధ్యమ+పు-రు లకు: బా - క్రియా - ౮ సూత్రము చొప్పున నాదేశింపఁబడిన లూట్టు మధ్యమ పురుష 'పు-రు' లకు పరుసగా 'ము డుఁజ్లు' లాదేశమగు ననఁగా 'పు' అనుదానికి 'ము'అనియు, 'రు' అనుదానికి 'డుజ్' అనియు నాదేశము లగునని తాత్పర్యము.

ఇట్టి ప్రక్రియ చొప్పున లూఁడర్థములగు నాశీర్వాద సంప్రార్థన విధులయందు, మధ్యమపురుషమున 'ము డుఙ్లు' లగునని పర్యవసిత మగుచున్నది. సూరియే వరుసగ నుదాహరించుచున్నాఁడు. ఆశీస్సు:—దీర్ఘాయువు+అగు+వు = దీర్ఘాయువు+అగు+ము = దీర్ఘాయువగుము. ఇచట బా - కార - 33-3౪ సూత్రముల చొప్పున 'దీర్ఘాయువ వగుము' అను రూపము సిద్ధింపవలసి యున్నను వాని వివరణములోని "మీరలు పెద్దలు ఇత్యాదులు ప్రాయిక గ్రహణముచే రక్షితంబు లయ్యె" అను చొప్పున 'వు' ప్రత్యయము రాకపోవుటచేత నట్టి రూపము కలుగ లేదు. బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందు సైతము "దీర్ఘాయువ వగుము" అను రూపము లేదు గాన నట్లు నవరింపరాదు. పయిని జూపిన ప్రక్రియ చొప్పుననే "దీర్ఘాయుల రగుఁడు" మున్నగు వాని ముడుఙ్లు రూపములను సాధించుకొనవలయును. బా - క్రి - ౨౭ సూత్రము చొప్పున, ద్రుతపూర్వకమగు 'అది' శబ్దమును, ప్రకృతసూత్రము చొప్పున 'ము డు'ఙ్లులను విధ్యాద్యర్థములం దగునని యెఱుంగునది. ఉదా:—నీవు నా చెప్పినపని చేయునది = చేయుము. మీరు నా చెప్పినపని చేయునది = చేయుఁడు. మొ. సూరి ప్రక్రియ చొప్పున "ఎడు తలును ము డుఙ్లులకుఁ బర్యాయములుగ వచ్చునని చెప్పవలసియున్నను నట్టి స్థితికి మహాకవి ప్రయోగ ప్రామాణ్యము గాని నన్నయాథర్వణీయ మూలకత్వము గాని లేమింజేసి యుపేక్షణీయ మనఁదగును. కాన "ఆశీర్వాద సంప్రార్థనంబులందు "ఎడు-త-వర్ణంబులు ఇరువదియాఱవ సూత్రంబుచే విధింపఁబడఁగా 'నీవు దీర్ఘాయువయ్యెడున్ - నీవు దీర్ఘాయువగుతన్' ఇత్యాదికమైన రూపంబులును.........అగునని తెలిసికొనునది." (బా గు. ప్ర. 3౨3 పు. ద్వి. ము.). "ఆశీశ్శాప సంప్రార్థనముల, నెడు - త, వర్ణములును గలుగ నగుననియుఁ గాన 'నీవు దీర్ఘాయువయ్యెడున్ - నీవు దీర్ఘాయువగుతన్' అను మొదలగు రూపములును నుండునని గ్రహించునది." (బా. సా. పే. ౪౦౦ పుట.) అను వ్యాఖ్యలు సరికావని గ్రహింపనగును.

"కాతన" అను రూపములోని 'త' వర్ణము లోపించిన 'కాన్' అను రూపమును నాశీర్వాదార్థములం దర్వాచీనకవులు ప్రయోగించుట గలదు. అట్లె "కలియుతన్" మున్నగు వానిలోని వ్యంజన తకారలోపము చేసి "కలియన్" మున్నగు వాని నాశీర్వాదార్థములం దర్వాచీనులు ప్రయోగించుటయుఁ గలదు. ఉదా:— నీవడి ధూళి పాలు గాను. నీచేతివిల్లు మంటఁ గలియ. ఇట్టి వాడుకలు వ్యావహారికాంధ్రమున ధారాళముగా నున్నవి. "నీవెట్టి బంగారుగాను ఇత్యాదీనాం

గ్రామ్యత్వేపి ప్రయోగార్హతేతి సరస్వత్యాశయో వర్ణనీయః." (అహో. ౧౭౭ పుట.) అను కవిశిరోభూషణ పంక్తుల చొప్పున "నీయిల్లు బంగారుగాను నీమొగాన పసుపు కుంకము పెట్ట." మున్నగు రీతి నాశీరర్థమందును నిట్టి వ్యావహారిక ప్రయోగములు పెక్కు గలవని గ్రహింపనగును. "కేవల తుమున్నంతంబు చేతను గూడ శాపార్థమును బ్రకటించుట వసుచరిత్ర కాలమునుండియుఁ జూపట్టెడి 'ధూళిపాలుగాన్ = ధూళిపా లగుఁగాక = అగుత = అయ్యెడి అని దీని యర్థము." (బా. సా. పే. ౪౦౦ పుట.) పేటికాకర్త యీక్రింది బా - గు - ప్ర. వ్యాఖ్యను స్వీకరించుటలోఁ బ్రమాదపడి "వసుచరిత్ర కాలమునుండి" అని వ్రాసెనే కాని వసుచరిత్రలో నిట్టి ప్రయోగము కానరాదు. బా - గు - ప్ర. వ్యాఖ్యాత ప్రమాద వశమునఁ జూపిన వసుచరిత్ర పద్యములోని నుజ్యంతమున కిట్టి యర్థము కాదు. మఱియు 'తు' మున్నంతమునకు శాపార్థము గల్గుననుటయు నసంగతమె. ఇదియు బా - గు - ప్ర. వ్యాఖ్యను స్వీకరించుటలోఁ గల్గిన ప్రమాదమె. "కేవల తుమున్నంతముచేతను సైతము శాపార్థము తెలుపంబడు..............చ......... పవమాన.........నీవడి ధూళిపాలుగాన్. (కళా. ౨ ఆ.) .........తే-గీ. నీరజారాతి నినుఁ దన నెలవు గూల నేల సృజియించె విధి సృజియించుఁగాక । యేల జైవాతృకునిఁ జేసె. (వసు. ౪ ఆ. ౩౫ ప) (ఇది యిట లక్ష్యముగఁ జూపఁబడుట పొరపాటు. ఇందు "తననెలవు గూలన్" అను దానికి "నెలవుకూలుంగాః" అని యర్థముకాదు. తననెలవు గూలిపోవునట్లుగా నీరజారాతి నిను నేల సృజియించెనని యర్థము.) తే-గీ.........ముగుదలఁ దెరువరులను । బూని యేతువె నీ పూవి్ల బుగ్గిగాను । ...... ...(నీలా. ౩ ఆ.) క......... । మరుఁడా నీచేతివిల్లు మంటం గలియన్. (నీలా. ౩ ఆ.) (ఇట్టి విచట నీలా సుందరీ పరిణయములోనివె పెక్కు చూపఁబడినవి.)" (బా. గు. ప్ర. ౩౨౩-౩౨౪ పుటలు. ద్వి. ముద్ర.). కేవలతుమున్నర్థకమున కిట్టి శాపార్థము లభించుననుట సరికాదు. కావుననె పైరీతిని 'తన్' ప్రత్యయాంత సంక్షేపరూపముగాఁ జూపఁబడెను. లేదా తుమున్నంతమున కనక 'నుజ్యం'త రూపమునకే యాశీశ్శాపాద్యర్థములు కవిప్రయోగాదులందు గలవన్నను విరోధములేదు. (చూ. ౨౧౫ II విష.)

"ఇంద(ము) అవ్య. (త-ఇంద) 'ఇదిగో పుచ్చుకొమ్ము' అను భావము దెలుపును. గీ. బొమ్మ పాత్రిక ఒడిగితి కొమ్ము యింద । మనుచు నిచ్చెఁ దాఁ దెచ్చిన యంబరములు. (భార. విరా. ౫ ఆ. ౩౦౪.) ఆ-వె......... । శార్ఙ్గమింద నీవు సమరంబె కోరదు । .........(ఉ. హరి. ౧ ఆ. ౧౫౫.)" (సూ. రా. ని.). ఇందలి

'ము' ప్రత్యయ తల్లోపముల నరయఁగా నివి 'ఇంద' అను ధాతువుయొక్క లోణ్మధ్యమైకవచన రూపములనుట యుక్తమని తోఁచెడిని "సదృశం త్రిషు లిఙ్గేషు । సర్వాసుచ విభక్తిషు । వచనేషుచ సర్వేషు । యన్నవ్యేతి తదవ్యయ మ్"ను రీతిగల యవ్యయ లక్షణ మిందుఁ జూపట్టలేదు.

నన్నసూ. ఉభయార్థే భవే దత్వ । మర్థభేదే క్వచి న్న తత్.

౩౦౬ విమ. (విక్ర. క్రి. ౬ కారి. అహో. ౪౮౪ పు.)

కల్పతరువు. ౩౦౬ విమ:—బాలవ్యాకరణపు వరుస చొప్పున నన్నయాథర్వణ సూత్రములు చూపఁబడుచుండుటచే నీసూత్ర మిటఁ జూపవలసెను, గాని దీనిని "దు తి వర్ణకౌ క్రమాత్ స్తో । నాద్య స్యాదేః." అను దాని యొద్దఁ జూపుట యుక్తము. వండుదము' మున్నగు 'అ'త్వఘటిత రూపము లుభయకర్తృక ప్రార్థనార్థకములుగా సూరిచే నుద్దేశింపఁబడుటచే నాతఁ డీ ప్రార్థనార్థకరూప ప్రకరణమున నిట్టి రూపముల ప్రక్రియను బ్రదర్శించెను. నన్నయాథర్వణులు "మనము వండుదము" అనురీతి రూపములను దద్ధర్మక్రియలను గానె తలంచిరి. అట్లగుట చేతనే యీ రూపములందు "దు"క్కునకుఁ బ్రసక్తి కల్గెను.

ఉభయార్థే = యుష్మదస్మ దుభయకర్తృకత్వమున, అత్వమ్ = దు తి వర్ణకా విత్యాది చింతామణిసూత్రముచే విధింపఁబడిన 'దు'వర్ణకముయొక్క 'ఉ'కారమునకు 'అ'కారము, భవేత్ = అగును. క్వచిత్ = కొన్నియెడల, అర్థభేదే = అర్థవిశేషమునందు, తత్ = ఆ 'అ'త్వము, న = కాదు. నన్నయాథర్వణులమతమునఁ దద్ధర్మమునఁగా ధాత్వర్థమాత్రమె యగుటచేతను (౨౯౬ విమ) సందర్భవశమున నట్టియెడల దచ్ఛీలసంభావనా సంప్రశ్నసాతత్య వర్తమాన భావ్యాశీరాద్యర్థములను గల్పించుకొనవలసియుండుటచేతను 'మనము వండుదుము - మనము వండుదము' మున్నగువాక్యములలోని యర్థవిశేషములు కల్పించుకొనఁదగినవై యుండును. ఉత్తమపురుష బహువచనక్రియలకు సందర్భవశమున, 'మేము-మనము' అను వానిలో నేదేని కర్తృవాచకము కావచ్చును. ౧. మనకు వండవలసియున్నదని తెలిసియున్నచో మన మపుడే వండుదుము. ౨. తరుణీ మన కీశాపము గల్గియుండనిచో నీదినములలో మనము భోగసక్తులమై యుండుదుము. ఇట్లుభయకర్తృకత్వమున 'దు'గాగరు ఘటితతద్ధర్మక్రియలును నిలువవచ్చును. ౩. మనము వండుదము. ఈవాక్యమున యుష్మదస్మచ్ఛబ్దవాచ్యు లిరువురును గలసి పచనవ్యాపారము జరపికొనుట కభ్యనుజ్ఞ మాత్రమె బోధ్యమగుచున్నది. ౪. మనము వీనిని రక్షింతము. ఈవాక్యమున రక్షణక్రియలో యుష్మచ్ఛబ్దవాచ్యుని సాహాయ్యము నస్మచ్ఛబ్ద

వాచ్యుఁడు ప్రార్థించుచున్నట్లు బోధ్య మగుచున్నది. ఇట్టిస్థలములనే సూరి యుభయకర్తృక ప్రార్థనార్థకములుగాఁ జేర్కొనెను. పరిశీలింపఁగా నిట్టిస్థలములం దెల్లఁ బ్రార్థన మంతగాఁ గన్పట్టదు. అస్మచ్ఛబ్దవాచ్యుఁడు యుష్మచ్ఛబ్దవాచ్యుని బ్రేరించుటమాత్రమె తెలుచుగాఁ దోఁచుచుండును. ఇట్టి యర్థవిశేషముగల తద్ధర్మ క్రియలందలి 'దు'వర్ణకముయొక్క 'ఉ'త్వమునకె 'అ'త్వమును బ్రకృతసూత్రము విధించుచున్నది. ఇట్టివాక్కులకు విలక్షణములగు పైని జూపినస్థలములవంటివాని యందలి (మొదటి. ౧-౨ వాక్యములవంటి స్థలములందలి) దువర్ణకోత్వమున కత్వము కల్గదు. ఈవిషయమునె "అర్థభేదే క్వచి" న్న తత్తను వచనము చెప్పుచున్నది. ఇట్లె "మనము వండుదము" మున్నగు నుభయకర్తృక ప్రార్థనస్థలములందెల్ల 'అ'త్వము కల్గుచుండునని యెఱుంగునది. ఉదా:—మనము వండుదము = (వండు+దు+అ+ము = వండుదము). ఇందలి "ము" ప్రత్యయ ముత్తమపురుష బహువచన సంబంధియని యెఱుఁగునది. (౨౬౮ II విష). ఇట్లె వర్తమానాదులలో నైతము మనశ్శబ్దవాచ్యకర్తృకత్వమున మనము వచ్చుచున్నాము - మనము వచ్చితిమి - మనము రాఁగలము - మనము వచ్చెదము మనము రాము మున్నగురీతిని ముప్రత్యయ మస్మత్కర్తృకత్వమందువలెనె వచ్చును. దుగాగమము వచ్చు తద్ధర్మక్రియ లందుమాత్రమె వెనుక నుదాహరించినరీతి నర్థవిశేషములనుబట్టి 'అత్వ - తదభావ ములు (౧-౨-3-౪ వాక్యములు - వండుదుము - ఉండుదుము - వండుదము - రక్షింతము) వచ్చుచుండును. అహోబలపండితుఁడు దుగాగమమున కత్వము నన్నయప్రయోగములనుబట్టి చింతామణిపక్షమున "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యా" త్తనుచొప్పునఁ జేయవలెనని వ్రాసెను. "తద్ధర్మేతు (మనము) ఘటింతము - రంజిల్లుదము ఇతి విశేషః. 'సలుపుద మీ నిదాఘదివసంబులు నీవును నేను' (ఆది. ౮ ఆ. ౨3౨). 'ఇత్తరుణిఁ బరిగ్రహింతము' (ఆది. ౭ ఆ. ౨౧౫). ఇత్యాద్యాచార్య ప్రయోగాత్ వ్యతిరేకాదౌ ఇత్యనేన అత్వమ్. అధర్వణేనతు 'ఉభయార్థే భవే దత్వ । మర్థభేదే క్వచి న్న తత్' ఇత్యుక్తమ్. గీ. భూమినందన సాకేతపురము నందు । మిగుల దీపించు కనకపుమేడలోన । చారుతర పుష్పమయమైన శయ్య మీఁదఁ । బవ్వళింతుము మనము సంభ్రమముమీఱ. ఇత్యాదా వర్థభేదః (విస్తర)

---

విస్తర. 3౦౬ విష:—కవిశిరోభూషణమున 'పవ్వళింతము మనము' అని తప్పుగ ముద్రితము య్యెను. 'పవ్వళింతము మనము సంభ్రమము మీఱ-ఇత్యాదా వర్థభేదః' అను నహోబలపతివాక్యమె 'అర్థభేదే క్వచిన్న త' త్తనుచొప్పున 'అ' త్వము రాలేదని విశదీకరించుచుండుటచేత "పవ్వళింతము' అను పాఠము తప్పు.

'ఇపుడు మన మొనరింతుమె యిట్టిపనులు' ఇత్యాదౌ వ్యతిరేకార్థో ద్యోత్యతే క్వ చిత్. ఇపుడు మనమొనరింతుమె ఇత్యాదౌతు ప్రశ్నమాత్రం ప్రతీయతే" (అహో. ౪౭౪ పు). "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్తు"ను చింతామణి సూత్రముచే ధాతువులతుది నత్వము నిల్చుట మాత్రమె విధింపఁబడెను గాన నిట దువర్ణకోత్వమున కత్వమును వేఱుగ విధించుటయె యుక్తమని తలఁచి యథర్వణుఁడు ప్రత్యేకముగ సూత్రించెను. మఱియుఁ జింతామణిపక్షమున 'వండుదము' మున్నగు నుభయకర్తృక ప్రార్థనార్థక క్రియలయందలి 'అ'త్వము పునరాగమ సూత్రముచేత (చిం. వి. కరి. ౧౧౧ విష) సంపాదింపనగును (౨౯౬ విష). కాని పునరాగమసూత్ర మగతికగతి స్థలమగుటచేత నథర్వణుఁడు వేఱుగ నుపదేశించుట పునరుక్తము కానేరదు. మఱియుఁ జింతామణి క్రియాపరిచ్ఛేదము సంస్కృతసమ క్రియల రూపసాధనమె ప్రధానముగా రచింపఁబడిన దగుటచేతను నట్టి యుభయ కర్తృకప్రార్థనార్థక తత్సమక్రియలు నన్నయభారతమున మిక్కిలి యరుదగుటచేతను జింతామణియందు వాని రూపసాధనప్రక్రియ సువిస్తరముగాఁ జూపఁబడదయ్యెను. నన్నయతిక్కనాదుల భారతాదులలో నాచ్ఛికములగు నీయుభయకర్తృక ప్రార్థనార్థక క్రియలు ప్రచురప్రయుక్తములై యుండుటచేత నట్టివాని రూపసాధన ప్రక్రియ సువిస్తరముగఁ బ్రత్యేకించి చూపఁబడుట యత్యావశ్యకమగుటచే నథర్వణుడు వేఱుగ సూత్రించెనని యెఱుంగునది. ప్రయోగములు:—చ. జలరుహనాభ రమ్యగిరిసానువనంబుల వేఁటలాడుచున్ । జలువుద మీరు నిదాఘదివసంబుల నీవును నేను.........(ఆది. ౮ ఆ. ౨౩౨). సీ. జనమేజయునిచేయు సర్పయాగమునకు విఘ్నమందఱము గావింతము. ....అదుగుద మీరు క్రతు వుడుగు మనియు .........దోషంబులని హేతువులు సూపి యుడిగింతము.........ఆ-వె.........వెఱపింతము.. ......(ఆది. ౨ ఆ. ౧౩౧). ఇందుఁ గొందఱు నాగకుమారులు దక్కినవారిని బ్రేరించుట మాత్రమె తోఁచును. క,.........ఇ । తరుణిని బరిగ్రహింతము । .........(ఆది. ౭ ఆ. ౨౭౫). ఇందు ధర్మజుఁడు తన నిశ్చయమును వచించెనుగాని ప్రార్థింపలేదు. పరిగ్రహించుటలోని ప్రేరణము మాత్రమె కలదు. ఉ. వీఁడొక మంత్రసిద్ధుఁడు.. ......ఇతనిం జని చూతము యంచు.........భూసురులాదిగ వచ్చిచూచిరి (ఆది. ౬ ఆ. ౩౦౯). ఇందొకరి నొక రాహ్వానింపనైనలేదు. వీని చూత మనుకొనుచు వచ్చి చూచిరి. మానసోద్దిష్టప్రేరణము

---

ఇది విచారింపక గాణపతవివరణకర్త 'పవ్వళింతము' అను తప్పు పాఠమునె యాదరించుట చింత్యము (గాణ. క్రియా. 3౬౨ కారి. 3౪ పద్యపు వివరణము).

మాత్రము తోఁచుచున్నది. "పౌరులెల్ల.........సీ.........లోభి దుర్యోధ నుండు । రాజుగా నీతని రాజ్యంబుగాం దెట్టు । లుండంగ నేర్తు మీయుర్వి నింక । నేదిధర్మువు.........పాండుసుతుల । యరిగినచోటికి యరుగుదమని......... (అర. ౧ ఆ. ౫ ప). ఇందును పౌరులు పాండవులవెంట నరుగుటను భావించికొను టలో మానసోద్దిష్టప్రేరణముమాత్రమె తోఁచుచున్నది. ఉత్తరోక్తము - వీర భోజ్యముసుమ్ము రాజ్యము వింటె నీవును నేను దు । ర్న్యాయవృత్తిఁ ధర్మంబులెక్క- యసంఖ్యవిక్రము మేర్పడన్ । భూరి వీరరణం బొనర్తము.........(ఆర. ౨ ఆ. ౨౨3). నలుఁడు విరోధియగు పుష్కరునితోఁ జేసిన ప్రసంగమిట్యది. ఇందుఁ బ్రార్థనమునకుఁ బ్రసక్తిలేదుగదా, ఢీకొనుటలోని ప్రేరణము గలదనిన, ననవచ్చును. క. ధీరమతి విదురుతోడ వి । చారింతము.........(సభా. ౨ ఆ. ౧౨౮). ధృత రాష్ట్రుఁడు దుర్యోధనునితోఁ బల్కినవాక్యము కావున నిందుఁ బ్రార్థన మున్నదన వచ్చును. క. విను నీ వదితిసుతుండవు । వినతకొడుక నేను విజ్ఞపీఁగెదు మనకున్ । జనకుఁడు కశ్యపుఁ డొక్కడ । దనుజుల శోధించి చంపుదము యీరువురమున్ (ఉద్యో. 3. ఆ. ౨౬౫). (అత్యఘటిత 'ద'వర్ణము యతిస్థానగతము).

ఈసందర్భమున బయల్వెడలిన వింత యొకటి యిటఁ బ్రదర్శింపఁబడుచున్నది. పోవు ధాతువునకు దుక్కు ముత్తును బరముగ నపుడు వు వర్ణలోపము కవిప్రయోగ సిద్ధమైనది. క. మేదిని నిలుతురె క్రమమునఁ । బోదుసుగా కెల్లజనులుఁ బోవు తెరువునన్. (ద్రోణ. ౨ ఆ. ౨౬౭) సీ.. ......ఆ-వె. పొదలలోన డాఁగి పొడ సూప కిట్లేల । యున్నవాఁడ విట్టి యుగ్రభావ । మేల నీకు వలసె నెటవోదు నింకెట్లు । గాంతు నిన్ను నుగ్రకాననమున. (ఆర. ౨ ఆ. ౭౨.) ఇట్టి వులోప ము భయకర్తృక స్థలములందును బ్రయుక్తమయి యున్నది. చ. వలవదు వీని యిటఁ గుదువన్ మనకున్ ధన మిచ్చునేని ని । మ్ముఁ గొనిపోద మిప్పుడని......(ఆర. ౨ ఆ. 3౮౮.) క. అతులతపో వీర్యబలో । న్నతిఁ బోదము గంధమాదనంబునకు... ......(ఆర. 3 ఆ. ౨౭౭.) క. మనదేశమునకుఁ బోదము । మనమల్లన తెరువు వట్టి.........(విరా. ౫ ఆ. ౨౨౦.) ఇట్టి 'పోదము' అను నుభయకర్తృక రూప మునకు సంక్షేప రూపమనెడు భ్రాంతి నొదవించుచున్న "పాదము - పదము" అను రూపము లర్థవిశేష బోధకము లగుచు మధ్యమపురుషైక వచనములుగాఁ దిక్కయజ్వచేఁ బ్రయోగింపఁబడినవి. క. పలువురకుఁ బుట్టి నిచ్చలుఁ । గలుఁ ద్రావుచుఁ బెరిఁగి యిట్లు గఱతురు శీలం । బులు నుచితములగు భాషణ । ములు నీ విమ్మాట లుడిగి పాధపాద మనికిన్. (కర్ణ. ౨ ఆ. ౮౭.) క. కదపదఁ డంచు దిశలు

క్రక్కదలఁగ.........(నిర్వ. ౬ ఆ. ౯౨.) (పోదము+పోదము = పోద పోదము. పోదఁడు+పోదఁడు = పోద పోదఁడు. సూ. ౧౧౧ i విష.) పోదము = మన మిద్దఱము కలసి పోవుదము. పోదము=నీవు వెళ్ళుము. నీవెంట నేనును వచ్చెదను. 'పోద' మనునది యుభయకర్తృక ప్రార్థనాద్యర్థకోత్తమపురుష బహువచన రూపము. "పోగము = పదము" అనునవి ప్రార్థనాద్యర్థక మధ్యమపురుషైక వచన రూపములు. (పదమూ యెల దోఁటఁ జరింప కింటికిన్. మనుచ. 3 ఆ. 38.) ఇవి "పోవుము = పొమ్ము" అను వానికి రూపాంతరము లనుటకును వలనుపడదు. "పోవుము = పొమ్ము" అనుటకు 'నీవు వెళ్ళుము' అని మాత్రమె యర్థము. "పోదము = పదము" అను వానికి "నీవు వెళ్ళుము నేను నీవెంట వచ్చెదను" అని యర్థము. ఇట్టివి (పదము - పోదము) యుభయకర్తృక ప్రార్థనాద్యర్థక రూపములు ('పోదము' అను దానివలె) కాకున్నను గేవల ప్రార్థనాద్యర్థక మధ్యమపురుషైక వచనములె యైనను 'నేను నీవెంట వచ్చెద' నను నస్మదర్థ సహావస్థానమును సైతము బోధింపఁ జాలియున్నవి. అట్లే వీని బహువచన రూపములగు "పోదఁడు=పదఁడు" అనునవి సయితము "మీరు వెళ్ళుఁడు. మీవెంట నేనును వచ్చెదను" అను నర్థమును బోధించుచున్నవి. ఇట్లగుటచేత నివి సయితము "పోదము = పోవుదము" అను వానివంటి యుభయకర్తృక ప్రార్థనాద్యర్థకోత్తమపురుష బహువచన రూపములు కాక ప్రార్థనాద్యర్థక మధ్యమపురుష బహువచన మాత్రములె యగుచున్నవి. ఇట్టివి మధ్యమపురుష క్రియలె యైనను వీనియందున్న "అత్వ"సహిత దుగ్ధకార మహిమచే నివి "మీరు పదండు మీవెంట నేనును వచ్చెదను" అను నస్మదర్థ సాహిత్యమును బోధింపఁ గల్గుచున్నవి. ఇంతమాత్రమున వీని నుభయకర్తృక ప్రార్థనాద్యర్థక క్రియలని వచింతుము. ఈరీతిని సోమయాజి "పోదము=పదము. పోదఁడు=పోదండు =పదఁడు = పదండు" అను రూపముల నంగీకరింపఁగా సోమనారాధ్యాదులగు నితర కవులు వీని సామ్యమున "వెదకుదండు-మూతండు-చెప్పుదండు." మున్నగు రూపములను బ్రయోగింపసాగిరి. కాని "పోదము - పదము" అను వాని వంటి యేకవచన రూప విశేషముల నెవ్వరును బ్రయోగింపలేదు. "వెదకుము-మూదుము-చెప్పుము" మున్నగునవి వాని యేకవచన రూపము లనరాదు. "వెదకుదండు" అను బహువచన రూపమునకు "మీరు వెదకుఁడు - మీవెంట నేనును వెదకెదను" అను నర్థవిశేష మున్నట్లు 'వెదకుము' అను నేకవచన రూపమునకు "నీవు వెదకుము - నీవెంట నేనును వెదకెదను" అను నర్థవిశేషము లేదుగదా. ఈవిషయములను సరిగాఁ బరిశీలింపక సూరి యీ క్రిందిరీతిని సూత్రించెను. "పోవునకు దుఙ్ముత్తులు,

ముజ్ఞు, బరంబగునపుడు పులోపంబుం బొద పదలును విభాష నగు. పోదురు - పోవుదురు, పోడు - పోవడు. పొదము - పదము - పొమ్ము." (బా. క్రి. ౯౮ సూ.). ఇందు ముజ్ఞు పరమగునపుడు - పొద పదల నాదేశించుటయు, 'పొదము - పదము' అనునవి 'పొమ్ము' అను దానికిఁ బర్యాయము లనుటయు సరి కాదనక తీరదు. "పొమ్ము = నీవు వెళ్ళుము. పొదము = నీవు నేను వెళ్ళుము. నీవెంట నేనును వచ్చెదను" అని యర్థమగుటచేత నివి వేర్వేఱు జాతుల రూపములె కాని పర్యాయములు కావు. 'పొద - పద' - ల లోని యుభయార్థ బోధకమగు 'అ'త్వ సహిత దుర్గకారపు మహిమచే వీనియం దస్మదర్థ సాహిత్య రూపార్థవిశేషము వెలయుచున్నది. ఈతిక్కన ప్రయోగములందలి రహస్యమును గనిపెట్టి యసాధారణ పాండిత్య ప్రతిభాశాలియగు పాల్కురికి సోమనారాధ్యుఁడు "పదండు = పొదండు" అను వాని సామ్యమును మూలముగాఁ గొనియే కావలయును "పోదండు - చూతండు - చెలువుదండు" మున్నగు వానిని బ్రయోగించెను. తర్వాతి కవులును దదనుసార ముగ వెదకుదండు మున్నగు వానిని బ్రయోగించిరి. తిక్కన ప్రయోగించిన 'పొదండు' అను దానికి "పోదండు" అనునది పూర్వరూపమని సోమనారాధ్యుఁడు తలంచియుండును. పోదండు పదండు పొదండుల యేకవచన రూపములు 'పొదము పదము' అనునవి వెలసినట్లు "చూతండు" మున్నగు వాని కేకవచన రూపములు వ్యవహారమున లేమిం జేసియు "చూతము - చెలువుదము" మున్నగునవి యుభయ కర్తృక ప్రార్థనాద్యర్థకోత్తమ పురుష బహువచనములుగ వ్యవహారమందును (చూతాము చెలువుదాము. మొ.) కవిప్రయోగములందును బ్రసిద్ధములయి యుండుటం జేసియు నట్టి యేకవచన రూపముల కల్పనమునకు సాహసింపఁ డయ్యెను. ఇట్లగుటచేతనే యుభయకర్తృక ప్రార్థనాద్యర్థకములందలి యుత్తమ పురుష బహువచన 'ము' ప్రత్యయమునకును గేవల ప్రార్థనాద్యర్థక మధ్యమ పురుషైకవచన 'ము' ప్రత్యయమునకును భేదము పాటింపక కవులు భ్రమించిరని శబ్దతత్వశాస్త్రజ్ఞులు వచించుటకు సాహసింపరాదు. పయి విషయములను సరిగా గ్రహింపక బసవపురాణ పీఠికాకర్త యీక్రిందిరీతిని వ్రాసెను. "యుష్మదస్మత్సమాహార సంప్రార్థనాద్యర్థక క్రియః—పు. ౧౫౦ చెప్పుదండు. పు. ౧౭౭ చెలువుదండు. పు. ౧౭౯ పోదండుగాక. పు. ౨౧౫ చూతండు. పండితారాధ్యచరిత్ర. ౩ వ. ప్రకరణమున పడుదండు - ఉండుదండు - తీర్తండు - ఇత్యాదులు పెక్కులు. ఇవి యితరకవుల కృతులలో - చెప్పుదము - చెలువుదము - పోదము - పొదము-పదము-పదండు - చూతము - పడుదము - ఉండుదము - తీర్తము. అను రూపములతో

వ్యవహృతము లగుచున్నవి. ఒక్క 'పోవు' ధాతువునకు మాత్ర మీ కవి ప్రయోగించిన పోదండు - పొదండు - పొదరు - రూపము లితరకవులును బ్రయోగించిరి. తక్కిన ధాతువులపై నాకిట్టి రూపములు శివకవుల కృతులలోనే తక్క నింక నెక్కడను గానరాలేదు. ఈరూపములు క్రొత్తగానున్నవి." (బసవపురాణ పీఠిక. ౧౦౨-౧౦౩ పుటలు.). 'చెప్పుదండు' మున్నగునవి 'చెప్పుదము' మున్నగు వానికి రూపాంతరము లనుట సరికాదు. "చెప్పుదండు" మున్నగు వాని లోని 'డుఁ' మధ్యమ పురుష బహువచన ప్రత్యయము. 'చెప్పుదము' మున్నగు వాని లోని 'ము' అనునది యుభయార్థకోత్తమపురుష బహువచన ప్రత్యయము. మఱియు 'పోదండు' అనుదానికి 'పొదము - పదము' అనునవి సైతము రూపాంతరము లనుట కేవలము భ్రాంతిమూలకము. 'పోదండు' అను దాని లోని డుఁ మధ్యమపురుష బహువచన ప్రత్యయము. 'పొదము - పదము' అను వాని లోని 'ము' అనునది మధ్యమ పురుషైకవచన ప్రత్యయము. పోవు ధాతువు సంబంధమయిన సోమనారాధ్యుఁడు ప్రయోగించిన 'పొదరు' అనునది యితరకవులు ప్రయోగించిరని వ్రాసిరే కాని యిట్టి ప్రయోగమును జూపరైరి. అట్టి 'పొదరు' శబ్ద మశ్రుతచరము. యుష్మదస్మత్సమాహార సంప్రార్థనాద్యర్థక క్రియలు "శివకవుల కృతులలోనే తక్క నింక నెక్కడను గానరాలేద"నియు వ్రాసిరి. ఇదియు సత్యము కాదు. చ. అరయఁగ నుండ లోఁపుఁ గమలాకరమందు జలంబు ద్రావి వే। ధరణి తనూభవన్ వెదకుదండు పదండు కపీంద్రులార యం। చరిగి........(భాస్కర. కిష్కిం. ౬౮౧ ప.) క... ......। పోవుఁ జామీ పలక వ్రాయి పోదండనినన్. (ఉత్తరహరి. ౩ ఆ. ౧౩౯.) వావిళ్లవారి ముద్రణమున 'పోదండనినన్' అనుచోట "పొద పొదఁడనినన్" అని సవరింపఁబడియున్నది. బసవపురాణ ప్రయోగములు:—ద్విపద. కల్పవృక్షం బీగి ఘన మందమేని। యల్పభోగము కాక యపవర్గ మిద్ది। చింతామణుల యీగి చెప్పుదండేని। చింతింప శాశ్వత సిద్ధియం దెద్ది. (బసవ. ౫ ఆ. ౨౧౩ ప. ౧౫౦ పుట.) (ఇట్టి ప్రయోగములె 'అందము' మున్నగు వాని వలెనె 'చెప్పుదండు' మున్నగునవియు నుభయార్థకోత్తమ పురుష బహువచన రూపాంతరములనెడి భ్రమ నొదవించుచుండును.). జినసమయులు దీనిఁ జెలుపుదఁ డనుచుఁ। గనుఁగొని పెక్కువిఘ్నములు గావింప. (బసవ. ౬ ఆ. ౧౨౭ పద్య. ౧౭౮ పుట.) (నాకులభించిన రెండు తాళపత్త్రమాతృకల లోను 'చెలుపుదండు' అనియె యున్నది.) చచ్చు। నా, దీనఁ దప్పేమి పోదండు గాక. (బసవ. ౬ ఆ. ౨౫౦.) (తాళపత్త్రమాతృకలు రెంటను 'పోదండు' అనియె యున్నది.) ఉంపుడు బండి పోకుండఁ జూతండు. (బసవ. ౭ ఆ. ౨౦౩-౨౧౫ పుట.)

ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు. 30.

బాలవ్యా. మనము వందుదము. (బాలవ్యాకరణమున నిచట
వివరణము. వ్రాయఁబడిన ఒజీ రూపముల యుదాహృతి యీ
306 I విషయము. వఱకు 303 I విషయమునఁ జేర్పఁబడెను గాన నిట
మరల వ్రాయలేదు.)

సంజీవని. 306 I విష:—ఉభయ ప్రార్థనంబునఁ=యుష్మదస్మ దుభయాకర్తృక ప్రార్థనార్థమున మన శబ్దము ('నీవు నేను' అని కాని 'మీరు మేము' అని కాని యర్థము) కర్తగా నుండునపుడు దాని సమాపక క్రియలోని "దుక్కు" చోట 'ద' వర్ణము నిల్చునని తాత్పర్యము. ఉదా:—మనము వందుదు+ము = మనము వందుదము. సూరి లాడర్థములలోఁ బ్రార్థనార్థమును జేర్కొనలేదు. లాడ్రూపముల కట్టి యర్థము నుదాహరింపనులేదు. చింతామణికర్తవలె సూరి తద్ధర్మశబ్దమును ధాత్వర్థ పరముగా వ్యవహరింపమింజేసి తద్ధర్మక్రియకు సందర్భవశమునఁ బ్రార్థనార్థమును గల్పించుట కవకాశము లేదు. మఱియు లూడర్థములలోఁ బ్రార్థనార్థమును జేర్చెను. కాని లూట్టు పరమగునపుడు ధాతువునకు దుగాగమమును విధింపలేదు. ఇట్టి స్థితిలో 'ఉభయ ప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు'ననుట యెట్లు పొసఁగునో తెలియకున్నది. పేటికాకర్త "సంప్రార్థనము లాడర్థములలో నొకటి యని ముందే యుక్తము." (బా. సా. పే. 200 పుట.) అనుట సత్యవిదూరము. ఇంక సంస్కృత వ్యాకరణ వ్యాఖ్యల పద్ధతి ననుసరించి ప్రార్థనమున దుక్కు కత్వమును విధించిన సామర్థ్యముచే "అత ఏవ దక్" అనురీతి నుభయప్రార్థనార్థమున "దుక్కు"ను ఘటించికొనవలయును. మనము వందు+దు+అ+ము = మనము వందుదము. బా కార - 36 సూత్రము చొప్పున దీనియుష్మ దస్మదర్థములలో నస్మదర్థము బలీయము గాన నుత్తమపురుష బహుత్వము నందలి "ము" నిల్చెను.

మన్నయా వ్యతిరేకే ప్రార్థనార్థే । కుః స్యాత్ స్మ ఫు పరశ్చ సః.
302 విషయము. (వికృ. క్రి. ౯ కారి. అహో. ౨౮౭ పుట.)

కల్పతరువు. 302 విష:—౧౦౯ విషయమున నిది వ్యాఖ్యాతము. ప్రార్థ నార్థే - వ్యతిరేకే = ప్రార్థనార్థ వ్యతిరేకమునందు, కుః స్యాత్ =(ముఁడుజ్ పరకత్వ మున) ధాతువు తుదిని 'కు' అనునది నిల్చును. సః = ఆ 'కు' అనునది మువుపరశ్చ = మువర్ణక పరమే కాక వువర్ణక పరమును నగును. ప్రార్థనార్థమున "ఏకత్వే ౨థ బహుత్వే । ముడుజౌ సంప్రార్థనార్థకేషు స్తః" అను చింతామణి చొప్పున నెట్లును 'ము డుజ్' వర్ణకములగును. అట్లయినను "ము వుపరశ్చ సః" అను ప్రత్యేక విధాన

ముచే నేకత్వమున ము వర్ణకమే కాక వు వర్ణకము సైతము నిల్చును. చ శబ్దముచే నందలి 'వు' వర్ణకము కవిప్రయోగ ప్రామాణ్యమున "ఎ - వే" శబ్దములతోఁ గూడియే యుండునని వ్యాఖ్యానము చేసికొనవలయును. "చేయకుము" అనురీతిని 'చేయకువు' అని ప్రయోగింపరాదనియు 'చేయకువే చేయకువె' అనురీతి నెత్వ సహితముగ మాత్రమె ప్రయోగింప నగునని యుఁ దాత్పర్యము. ముడుఙ్ఙులపైని ౩౦౮ విషయము చెప్పిన 'ఆ-ఆ ఈ-ఊ' అను స్వరములు స్వార్థమున నిల్చును. "వ్యతిరేకాదా భావిని చాత్ స్యాత్" అను చింతామణి సూత్రము చెప్పిన 'కు' వర్ణపరకత్వమున ధాతువు తుదిని 'అ'త్త్వము నిల్చును. డుఙ్ఙు జిత్తుగాన బిందు పూర్వక మగును. (౧౩౦ విష.). ఉదా:—చేయకుము - చేయకువె-చేయకుఁడు - చేయకుడు - చేయకుమా - చేయకుమీ - చేయకుము. 'సంప్రార్థనార్థకేషు' అను బహువచన స్వారస్యముచేత విధ్యాద్యర్థ విశేషములందును నీరూపములు వర్తిల్లును. విధి - నీవు చేయకుము - మీరు చేయకుఁడు. మొ. హల్పరకత్వమందును నవసానమందును నీ 'ము' వర్ణకస్థితియుఁ బాక్షికమె. ఉదా:—చదువకుము+ దానిని = చదువకుము దానిని - చదువకు దానిని. దానిని జదువకుము - దానిని జదువకు, చదువకుమిప్పుడు. 'చదువకిప్పుడు' అనునదియు భారతేతర కవిసమ్మతము. నన్నయాధర్వణ సమ్మతము గాదు. (చూ. ౧౦౯-౧౨౯ I-౧౧౨ విష.) వ్యతిరేక ప్రార్థనార్థ కువర్ణక పరకత్వమున "మఱవకుము" అను రూపము "మఱాకుము" అను రూపముగాఁ బరిణమించుటయు మహాకవి ప్రయోగములందుఁ గన్పట్టుచున్నది. చ. అనుపమ సత్య విస్ఫురణ నాడిన మాట మఱాకుమన్న......(ఉద్యో. ౪ఆ ౭౦ప.) ద్విపద. నమ్మి పోరెదము సుమ్మన్న మఱాకు। మమ్మ. (బసవ. ౩ ఆ. ౪౦౭ ప.) ఉ. బాంధవ మెల్ల ప్రొద్దుఁ దలఁపందగు నాత్మ మఱాకు మింక. (భాస్కర. యుద్ధ. ౧౭౭౦ ప.) క. అమరఁగ నెప్పుడు మఱవకయ్య ముకుందా. (హరి. ఉ భా. ౯ ఆ. ౨౫౫.) 'అమరఁగ నెప్పుడు మఱాకుమయ్య ముకుందా' అని పాఠాంతరము. "యమరంగ నెప్పుడును మరకుమయ్య ముకుందా" (తాళపత్రమాతృక) "వ్యతిరేక ప్రార్థనార్థే। కుః స్యాన్మువు పరస్తు సః ఇతి తేనైవ(అధర్వణేనైవ)కు వర్ణకో విహితః. కుః ప్రార్థనార్థవ్యతిరేకే ముపర్ణక పూర్వః వ్యతిరేకమాత్రే వు వర్ణక పూర్వ ఇత్యర్థః. ము వు పర ఇత్యత్ర బహువ్రీహి సమాసః. 'ము వు' వర్ణకయో రుపలక్షణత్వేన 'డుజ్-రు' వర్ణకయో ర్బహువచనయోరపి గ్రహణమ్. ఘటింపకుము - ఘటింప కుఁడు. అలుగకువే ఇత్యాది" (అహో. ౪౮౬ పు.) అని యిట్లహోబలపతి యీ సందర్భమున నపమార్గమున వ్యాఖ్యచేసెను. ఈ యపమార్గమె కవిజనమందన

నారాయణీయాంధ్రవ్యాకరణముల ప్రమాదములకు మూలమయ్యెను. ౩౦౭ I విషయమునఁ జూపఁబడు సూరి గారి తప్పుదారులకును మూలమయ్యెను. (వికృ. క్రియా. ౯ కారి. వ్యాఖ్య. నారా. ౩౨౦ పుట. క్రియా. ౩౬౭ కారి. ౩౪ ప.) వ్రవర్ణకమును మువర్ణక తుల్య కోటికముగా నహోబలపతి వ్యాఖ్యచేసెనే కాని ఎ-ఏలతోఁ గూడునపుడే 'వు' వర్ణకము ప్రార్థనాద్యర్థక సుశబ్దము (చేయుదువె) కాఁగలదు. ము వర్ణకము 'ఎ - ఏ'లతోఁ గూడెనేని యప్రసిద్ధచరము వింతయైన (చేయుమే) యపశబ్దమగును. ప్రార్థనాద్యర్థక బహువచన మురుటచేతనే సిద్ధించిన డుజ్ వర్ణకమును లక్షణాశక్తి మూలమున సంపాదించుటేల? అట్టి డుజ్ వర్ణకమునకుఁ బర్యాయముగా 'రు' వర్ణకము నుపలక్షణ మూలమున సంగ్రహించుటంజేసి లోకమందుఁగాని వాఙ్మయమందుగాని యెన్నఁడును వినఁబడని "చేయురు=(చేయుడు)" మున్నగు రీతిగల యపశబ్దపరంపర యవతరింపవలసి వచ్చెను. అహోబలపతి యుదాహరింపకున్నను 'అలుగకువే' (అహో. ౪౭౬ పు.) అను నుదాహృతి సామ్యమున చేయకురె=(చేయకుఁడు) అలుగకురె (=అలుగకుడు)మున్నగునవి యహోబలపత్యభిప్రేతములని యందమున్నను నట్టిరూపములకు సైతము ప్రాచీన ప్రామాణిక ప్రయోగ ప్రామాణ్యముగాని ప్రామాణిక లక్షణగ్రంథ సమ్మతిగాని లేమింజేసి యట్టి శబ్దములు సైతము కేవలము నపశబ్దము లనుటకు సందేహములేదు. ఇట్టి నిర్మూల రూపములను లక్షణాశక్తిచే సంగ్రహించుటేమి? ప్రాచీన ప్రామాణిక ప్రయోగ ముండియు వ్యాకరణము సాధింపఁజాల నపుడుగదా యుపలక్షణత్వ కల్పనమునకుఁ బ్రసక్తి.

ప్రయోగములు:—క..... ...పరా। శరుఁ గని యందఱుఁ బ్రార్థిం। చిరి రాక్షసమారణంబు సేయకు మనుచున్. (ఆది. ౨ ఆ ౧౫౪). క. బహురథగజవాహన భట। సహితులు బలవంతులని విచారింపకు నీ। యహితులు.........(ఆర. ౧ ఆ. ౨౫౪). కం.........అట్టిది। యే చెప్పకు తద్విధాతి హీనవచనముల్ (విరా. ౧ ఆ. ౩౨౨). ఉ. ఎన్నఁడు నిట్టిసాహసము లింక నొనర్పకుమయ్య.........। సన్నుత దీనికొండొక విషాదముఁబొందకుమీ మనంబునన్ (ఆర. ౫ ఆ. ౪౩౪). వశబ్ద సహిత వ్రవర్ణస్థితికి:—కం.........పా। పావేశము లేదు దీని కడ్డపడకువే.(శాంతి. ౩ ఆ. ౨౯౨)—చ-.........విచారహీనవయి కంపము నొందకువే తలోదరీ (హ. హరి. ౫ ఆ. ౭౨). (కాగితపువ్రాఁత ప్రతిలో నయిత మిట్లేయున్నది). మానిని. అంత మదింపకువే యని పల్కిన నంత మదింపకువే యనుచున్.(కళా. ౩ ఆ. ౧౯౫). డుజ్ వర్ణకమునకు:—క.........ఓడకుఁ డోడకుఁ। డని పలుకుచుఁ దాఁకెఁ గర్ణుఁ

దమరేంద్రసుతున్ (ద్రోణ. ౧ ఆ. ౩౮౭). చ. డిగకుఁడు వాహనంబులుం గడింది దగంటిమి గోలుపోవ విూ । రు గడఁక దక్కి పెట్టకుఁడు రూపఱ సాయుధముల్ (ద్రోణ ౫ ఆ. ౩౮౧).

బాలవ్యాకరణ వివరణము. ౩౦౭ I విషయము. మధ్యము ము డుఙులు ముఙు నాఁబడు. ౩౧. వ్యతిరేకంబున ముఙ్ పరంబగునపుడు కుజి యగు. ౩౨.నీన్ వండకుము, మీరు వండకుఁడు.

సంజీవని. ౩౦౭ I విష:—౩౧ సూ. వ్యాఖ్య. 'ము - డుఙ్' అను రెండును 'ముఙ్' అను సంజ్ఞ గలవని యర్థము. బా. క్రి. ౨౯ సూత్రమున విధింపఁబడిన 'ము - డుఙ్' అనువానిలోని 'ము' అనునది 'డుఙ్' అనుదానిలోని యుదర్ణమగు ఙకారముతోఁగూడి 'ముఙ్' అను ప్రత్యాహారముగ నేర్పడునుగాన నది 'ము - డుఙ్' అను రెండిటికిని సంజ్ఞయగుచున్నదని తాత్పర్యము.

౩౨ సూ. వ్యాఖ్య:—బా. క్రి. ౨౯ సూత్రముచొప్పున ముఙు ప్రార్థనా ద్యర్థక మనుట స్పష్టము. వ్యతిరేకార్థమున నట్టి ముఙు పరమగునపుడు 'కుజి' యాగమ మగును. బా. క్రి. ౨౨ సూత్రముచొప్పున జిత్తగు కుజి పరమగు చుండఁగా ధాతువుతుది 'ఉ'కార మకార మగును. వండు+అ+కు+ము = వండకుము. వండు+అ+కు+డుఙ్ = వండకుఁడు - వండకుండు. డుఙు జిత్తుగాన బిందుపూర్వక మగుచున్నది. పయిరీతిని ఙిత్త్వ - జిత్త్వములు రెండిటికిని వేర్వేఱ ఫలద్వయము సరయునది. (విస్తర. I ౧౨౩ విష. చూ). "వ్యతిరేకమున ననఁగా ఌజియందు........వండుధాతువుకు ఌజి మధ్యమపురుషైకవచనమున ౨౯ చే ముఙర్థకమును నది పరముగా నీవిధిచే కుజియు........పైరూపము సిద్ధించె (వండకుము). ఇట్లె 'వండకుఁడు' అనురూపము ప్రక్రియ సరయునది" (బా. సా. వే. క్రియా. ౩౨ సూ. వ్యాఖ్య. ౮౦౧ పుట). ఇది కేవలము పొరపాటు. 'వండకుము-వండకుఁడు' అనునవి ఌజి వ్యతిరేకరూపములు గావు. అవి లూఙ్ వ్యతిరేక రూపములు. బా. క్రి. ౨౯ సూత్రము లూట్టు పురులకె ముఙును విధించుచున్నది.

సన్నయా ధ్వనీయము. ౩౦౮ విషయము.
సంప్రార్థనార్థకాదీ, చోదాతౌ ప్రశ్నలక్షణౌ భవతః।
ఏదోతౌ వ్యతిరేకా, దపి సంప్రార్థనపరౌ క్రియా
ణాం స్తః. (ఆం. చిం. క్రియా. ౧౫ కారి. అహో. ౮౯౫ పుట).

అచ్చుతుష్కం భవేత్ ప్రాణి । స్థితం ప్రశ్నాదివాచ
కమ్ । తత్రా దిచ్చు భవే ద్దీర్ఘ । ఏదోతౌ పుభయా

త్మకా । క్వచి దూచ్చ భవే దర్థ । విశేష ఇతి కేచన.
(వికృ. అజం. ౧౭-౭౮ కా. అహో. ౩౫౮ పుట).
ఆర్యాదిశబ్దో యుక్తః స్యా । దసంబద్ధార్థ బోధనే
(వికృ. క్రియా. ౧౫ కారి. అహో. ౪౯౬ పు).

కల్పతరువు. 30ా విష:—౨౧౦ XII విషయమున నీకారికలు వ్యాఖ్యాతము లయ్యెను. సంప్రార్థనాద్యర్థక క్రియలమీఁద "ఈ-ఉ-అ-ఆ" శబ్దములు స్వార్థబోధకములై యగుచు నిల్చును. ఇవి అయ్య - అమ్మ - అన్న - మున్నగువాని కిని నుపలక్షణములు. ఉదా:—చేయుము+ఈ - చేయుమీ, చేయుము+ఉ - చేయుము, 'ఉ' శబ్దవిధానముచే "ఈ - అ-ఆ" అనువాని పాక్షికత్వము విశదమగు చున్నది. చేయుము+అ = చేయుమ, చేయుము+ఆ = చేయుమా, ఇవిమాత్రము చేరుననెడి యీవిధానముచేఁ దక్కినస్వరము లీక్రియలపై నిల్చుట సమ్మతము కాదని విశదపడుచున్నది. చేయుము+అయ్య = చేయుమయ్య. కలుగుము+అమ్మ = కలుగుమమ్మ మొ. ఎ-ఏ-ఒ-ఓ-లు వ్యతిరేకక్రియలపయిని (వ్యతిరేక మధ్యమ పురుషనిలిచి ప్రశ్నార్థకములగుచుఁ బ్రార్థనాద్యర్థములను దెల్పును. ఉదా:— చెప్పవె = చెప్పవే = చెప్పుము. చెప్పవొ = చెప్పవో = చెప్పుము, ఇట్లే - చెప్పరె = చెప్పరే = చెప్పరొ = చెప్పరో = చెప్పుడు - మొ.

అచ్చతుష్క—మిత్యాది:—గింతాడుణికారికలోఁ బ్రసంగింపఁబడిన (అ. ఇ. ఉ. ఎ. ఒ.)స్వరము లైదిటిలోను 'ఉ'కారమును గుఱించి వేఱుగ నుత్తరకారికలోఁ జెప్పుచున్నాఁడు గాన నిందు "అచ్చతుష్క"మ్మనుట సుసంగతమగుచున్నది. అచ్చతుష్క మ్మనఁగా 'అ-ఇ-ఎ-ఒ' అనునవి. హ్రస్వదీర్ఘములగు, నట్టి యచ్చులు—'అ - ఆ - ఇ - ఈ - ఎ - ఏ - ఒ - ఓ' అనునవి సుప్తిఙంతపదముల తుదిహల్లులపై నిల్చి ప్రశ్నాద్యర్థవిశేషములను బోధించును. ఉదా:—చెప్పితివ - చెప్పితివా - చెప్పుమి - చెప్పుమీ - చెప్పితివె - చెప్పితివే - చెప్పితివొ - చెప్పితివో - ఇది పుస్తకమె - పుస్తకమా - నేనొక బ్రాహ్మణుండనే - వాఁడి - వాడీ (రాముఁడు). మొ. ఇవి కవి ప్రయోగానుసారముగ గ్రహింపవలెను. (౨౧౦ XII విష.) ఒకానొకప్పుడు ఉకారమును నర్థవిశేష బోధకమగును. ఉదా:—ఎట్టు. మొ. అయ్య - అమ్మ అన్న మున్నగునవి సైతము ముదుజ్జులపై స్వార్థమున నిల్చును. ఉదా:—చెప్పుమయ్య. మొ మఱియు నయ్యవి సుప్తిఙంతములు తుదిని నిల్చి వ్యతిరేకార్థమును బోధించును. ఉదా:—ఇది పుస్తకమయ్య = పుస్తకము కాదు. నీవు పండితుఁడవయ్య = పండితుఁడవు కావు. చెప్పితివయ్య = చెప్పలేదు. చెప్పవయ్య =

చెప్పుము = చెప్పుగయ్య = చెప్పుఁడు. 'అచ్చతుప్య' మిత్యాది కారికలును "ఆద్యాది శబ్ద" ఇత్యాది కారికయు నెల్ల సుప్తిఙన్త సాధారణములు గాన నివియు నట్టి యర్థ విశేషములలో నొక టగుఁదగు ప్రార్థనార్థమును సైతము బోధింపనగుటచే నిట నివి సుసంగతములని యెన్నవగును. సంప్రార్థనార్థకా దిత్యాది చింతామణి కారిక కేవల ప్రార్థనాద్యర్థ విషయకమె. అట్టి దానిని సవరించుటలో నథర్వణుఁడు చింతామణి పేర్కొన్న స్వరములె కాక మఱికొన్ని స్వరములు శబ్దములును ప్రార్థనాద్యర్థము లనే కాక యనేకములగు నర్థవిశేషములను సైతము బోధించునని వచియించెను, సంప్రార్థనార్థకా దిత్యాది చింతామణి కారికకు వివిధములగు పాఠాంతరములు గలవు. అవెల్ల నా రచించిన బాలసరస్వతీయ పీఠికయందు విపులముగ విమర్శింపఁబడెను. (చూ. బాలస. పీఠి. ౭౯ మొ. 3౨ విష) (విస్తర.). ప్రస్తుతమగు ప్రార్థనాద్యర్థ

---

విస్తర. 30వ విష:—సంప్రార్థనార్థకా దిత్యాది చింతామణి కారిక పాఠ భేదముల విషయమునందలి చర్చ సంక్షేపముగా నిటఁ జూపఁబడుచున్నది. సంప్రార్థ నార్థకా దిత్యాదికారిక ప్రార్థనాద్యర్థ బోధక క్రియల ప్రపంచమును విశదపఱుచుటకు భట్టారకునిచే నుపదేశింపఁబడెను. ఏకత్వేథ బహుత్వే ము డుజా విత్యాది కారికచేఁ బ్రార్థనాద్యర్థక క్రియా ప్రత్యయముల నుపదేశించి యట్టి క్రియలపై స్వార్థమాత్రమందు నిల్చు స్వరాది శబ్దములను, వ్యతిరేక క్రియలపై నిలిచి ప్రార్థనార్థము బోధించు స్వరాది శబ్దములను, ని క్కారికతో నుపదేశించుచున్నాఁడు. పాఠభేదముల నెల్లఁ బరిశీలించి యుక్తమని తోఁచిన పాఠమె పైని మూలముగాఁ జూపఁబడెను. సంప్రార్థనార్థకా దీ। చ్చో దాతౌ ప్రశ్నలక్షణౌ భవతః। ఏదోతౌ వ్యతిరేకా। ద. సంప్రార్థన పరౌ క్రియాణాం స్తః. దీనిని నిర్వహించు తాళపత్త్ర మాతృకా పాఠములు:—"సంప్రార్థనార్థకా ధీ।శ్చో దాతౌ ప్రశ్నలక్షణౌ భవతః। ఏదోతౌ వ్యతిరేకా। దపి సంప్రార్థన పరౌ క్రియాణాం స్తః. ప్రార్థనార్థకమైన ప్రత్యయము మొదలను ఈత్ = ఈకారము వచ్చును. రక్షింపుమీ - పొందింపుమీ - పొందుమీ - ఘటింపుడి - ఘటింపించుడి - దేశ్యక్రియలకు సేయుమీ - సేయింపుమీ - ఉదాతౌ = ఉకార అకారములు, ప్రశ్నలక్షణౌ = ప్రశ్నార్థ సూచకములు, భవతః = అవును. శేవింపుడు - పోషింపుడు - పోషింపుమా - అనుసరింపుమా - అనుభవింపుడా - ఏదోతౌ = ఏకార ఓకారాలు, వ్యతిరేకాదపి = వ్యతిరేక ప్రత్యయములమీద, సంప్రార్థనపరౌ = యాచ్ఞార్థపరములైన, క్రియాణాం = క్రియలకు. స్తః = అవును. రక్షింపవే - రక్షింపవో - హరింపవే - హరింపవో - భజింపవే - భజింపవో." (విజయనగర మాతృక. బాలసరస్వతీయ టీక ౪౧ తాటాకు. కిరకవలసమాతృకా పాఠమును బైరీతినే యున్నది.)

"సేవింపుఁడు+ఉ = సేవింపుఁడు, పోషింపుఁడు+ఉ = పోషింపుఁడు, పోషింపుము+అ = పోషింపుమా." అను నుదాహృతులలోఁ బ్రశ్నార్థభానము లేమింజేసి "ప్రశ్నలక్షణౌఘవతః" అను దానిని 'ఉదాత్తా' అను దానితోఁ జేర్చి యన్వయించుట సరికాదు. 'ఉదాత్తా' అను దానిని "ఉత్" అను దానితో జోడించి, 'ప్రశ్నలక్షణౌఘవతః' అను దానిని "ఏదోతౌ వ్యతిరేకా ౽పీశ్యా ద్యుత్తరార్ధములోఁ జేర్చి సమన్వయించుట యుక్తము. అక్రమమున 'ఈ' శబ్దముఁ గలెని "ఉత్ + అ+ ఆత్ = ఉదాత్తౌ" అను శబ్దములును ప్రార్థనార్థక్రియలమీఁద స్వార్థమునఁ జేయుననుటయు, వ్యతిరేక క్రియలమీఁద "ఏఓత్తు"లు చేరి ప్రశ్నార్థకములగుచుఁ బ్రార్థనార్థమును బోధించుననుటయు సుసంగతములై యుండును. ఉదా:— చేయుమీ - చేయుము - చేయుమా. చేయవు+ఏ = చేయవే = చేయుము. చేయవు+ఓ = చేయవో = చేయుము. 'చేయుము - చేయుము - చేయుమా' అను స్థలములందుఁ బ్రశ్నార్థభాన మెంతమాత్రము లేదు. "ఉత్" అని వచించుటచే "ఈత్+అ-ఆత్" అను వాని యోగము నిత్యము కాదని విశదమగుచున్నది. 'ఆత్' అనుచో 'అ+ఆత్' అని 'అ'కార ప్రశ్లేషము విరుద్ధము కాదు. "రక్షింపురు - రక్షింపురు - రక్షింపుమ" (ఆది. ౨ ఆ. ౨౧౭.) అను భట్టారక ప్రయోగ మట్టి ప్రశ్లేషమునకు మూల మగుచున్నది. 'చేయవు+ఏ = చేయవే' మున్నగు చోటులందు వ్యతిరేక క్రియలపైఁ బ్రశ్నార్థక స్వరము చెప్పుటచేఁ బ్రార్థనార్థభానము స్పష్టమే కదా. బాలసరస్వతియు నిట్లే సమన్వయించి యున్నను 'అర్థార్ధాంతమునకు సూత్రము తెగవలయునని తలఁచి పైరితిని లేఖక పాఠకాదులు సవరించిరో బాలసరస్వతియే యట్లు పొరపాటుగా వ్యాఖ్యచేసెనో తెలియకున్నది.

బాలసరస్వతీయములోని తప్పుపాఠము సరికాదని తలఁచి కావలయు నహోబలపండితుఁడు "ఉదాత్తౌ ప్రశ్నలక్షణౌఘవతః" అనుచో "సంప్రార్థనార్థకాః । దేదాత్తౌ ప్రశ్నలక్షణౌఘవతః" అని సవరించెను. "చేసితివే? చెప్పితివా?" మున్నగు ప్రశ్నార్థక స్థలములు దీని కుదాహృతులగును గాన నిది సుసంగతమువలె స్థూలదృష్టికిఁ దోచును గాని ప్రార్థనార్థక రూపోపదేశ సందర్భమునఁ బ్రశ్నార్థక రూపోపదేశము కేవలము నప్రసక్తము కాదా? పూర్వోత్తర సూత్రములు రెండును (I-సంప్రార్థనార్థకాదీత్ - చేయుమీ, II ఏదాత్తౌ ప్రశ్నలక్షణౌఘవతః - చేసితివే? చేసితివా?; III ఏదోతౌ వ్యతిరేకా । దపి సంప్రార్థనపరౌ క్రియాణాం స్తః - చేయవే = చేయుము - చేయవో = చేయుము) ప్రార్థనార్థక రూపములను సాధించునవై యుండఁగా వాని నడిమి సూత్రము ప్రార్థనార్థక రూపముల కెంత

మాత్రము సంబంధింపని కేవల ప్రశ్నార్థక రూప సాధకమయి యుండునా ? "చేయుమే" అనురూపము నెవ్వరును సమ్మతింపఁ జాలరుగదా. మఱియు నిట్టి పాఠమె చింతామణిలో నున్నచో నథర్వణుఁడు "అచ్చుతుష్క–మి" త్యాది కారికలలో 'ఏదాత్తులను' ప్రశ్నార్థకములుగాఁ బూరించి పునరుక్తముచేసి యుండఁడుగదా.

అహోబలపండితీయములోని పై యసంగత పాఠముల వ్యాఖ్య యిట చూపఁబడుచున్నది. "సంప్రార్థనార్థకాదిత్ - వ్యాఖ్యః—సంప్రార్థనార్థక ముఃజ్వర్ణకాన్తాత్ క్రియాపదా దిత్ స్యాత్. నను రక్షింపుమీ......రండి. నాయం నిత్యో విధిః - వివాహ మొనర్పు మిత్యాద్యాచార్య వచనాత్. ('ఉదాత్తౌ' అనుపాఠమును విడిచి కొనుటచే నిట్టి వ్యాఖ్యకుఁ బ్రసక్తి కల్గెను.) 'అచ్చుతుష్కం భవేత్ ప్రాణిస్థితం ప్రశ్నాదివాచకమ్' ఇత్యాద్యథర్వణ సామాన్యోక్తి మహిమ్నా ఏ డీ నీపాటి-వరినీ సాటివారు - ఏఁడీ - ఏరి ఇతి రూపాణి సిద్ధాని" (అహో. ౪౯౫ పు.) "ఏదాత్తౌ ప్రశ్నలక్షణౌ భవతః-వ్యాఖ్యః—ఏదాత్తౌ ప్రశ్నార్థకౌ భవతః - కాచితివే మమ్ము నిపుడు కమలనాభా - ... దితివా మమ్ము నిపుడు భువనాధీశా ఇత్యాది...... వ్యతిరేకేతు సుబన్తా దపీత్యుక్తే రథస్తాత్ - పల్కవి దేటికే వధూమణీ - ఏమే బాల శిరీషగాత్రి - ఇత్యాది." (అహో. ౪౯౬ పుట.) "ఏదోత్తౌ వ్యతిరేకాదపి సంప్రార్థనపరౌ క్రియాం స్తః-వ్యాఖ్యః—వ్యతిరేకాదపి క్రియా పదా దేదోత్తౌ సంప్రార్థనార్థకౌ స్తః - నన్ను రక్షింపవో రామ నళిన నయన, ప్రోవవే నన్ను........." (అహో. ౪౯౬ పుట). ఇట్టి కవిశిరోభూషణ వ్యాఖ్య వెలసిన పిదప - బాలసరస్వతీయ మాతృకలందును నీపాఠమె విస్తరిల్ల సాగెను. ఇంకను విచిత్రముగా నహోబల వ్యాఖ్యాన పంక్తులతోడి పాఠాంతరము సైతము వెలసెను. అట్టి పాఠాంతర మసంగతమని యుపేక్షింపక యాంధ్రసాహిత్య పరిషన్ముద్రిత బాలసరస్వతీయ పుస్తకములోఁ బాఠవిశేషముగఁ జూపఁబడెను. "సంప్రార్థనార్థకము డు। జ్వర్ణాద్యన్తాత్ క్రియాపదా దిత్ స్యాత్ ।వ్యతిరేకేతు సుబన్తా। దే దాత్తౌ ప్రశ్నలక్షణౌ భవతః" (పరిషన్ముద్రిత. బాలస. 3 పుట.). కవిశిరోభూషణ వ్యాఖ్యాన పంక్తులలోని "వ్యతిరేకేతు సుబన్తా దపీత్యుక్తేః." అను వాక్యము సైతము చింతామణి కారికా భాగముగా నీప్రక్షిప్త పాఠకర్త భ్రమించెను. ఆవాక్యము 'అచ్చుతుష్క మిత్యాద్యథర్వణ కారికార్థము నహోబలపతి ప్రదర్శించిన వాక్యములలోనిదే కాని చింతామణి కారికా భాగముకాదు. మఱియుఁ బైరీతిని జింతామణి కారికలో లేని వాక్యములను జింతామణి కారికా భాగములనుగాఁ గవిత్వము చెప్పుటచేఁ బ్రక్షిప్త కారికాకర్త చింతామణిలోని నిజమైన కారిక యుత్తరార్థమగు "ఏ దోత్తౌ వ్యతిరేకా।

విషయకములగు ప్రయోగములు:—క........కనుఁగొను। మీ నీవును బంధు లును సమీపస్థులైరె. (భీష్మ. ౨ ఆ. ౧౨౫.) (యతిస్థలగతములు) మ......బదిగినం దైన్యంబు వచ్చుం జుమీ. (శల్య. ౨ ఆ. ౬౧ ప.) ఉ.........। నన్నుత దీని కొండొక విషాదముఁ బొందకమీ మనంబునన్. (అర. ౫ ఆ. ౪౩౪.) చ...... హితముఁ జుమ్మీ. (అర. ౬ ఆ. ౬౪.) క.........। మనకొక్కటి నిశ్చయింపుమా తగు బుద్ధిన్. (అర. ౭ ఆ. ౪౪) ఉ.........ని। ధారణ సేయుఁడా హితము ధర్మము.........(ఉద్యో. ౪ ఆ. ౯౦.) క.........। ఎటువారోయిదొ పొమ్ము మానమీ వలవని త్రు। భ్యట.........(శాంతి. ౪ ఆ. ౩౯౮.) క. నీకట్టిన మైల గట్ట నేర్తునె చెప్పుమా. (ఆది. ౩ ఆ ౧౩౫.) క.........పుట్టునె చెపుమా. (ఆది. ౬ ఆ. ౫౯ ప.) క........ సురగణాధిప నన్నున్। రక్షింపుము రక్షింపుము। రక్షింపుము యనుచు నప్పురందరు కడకున్. (ఆది. ౨ ఆ. ౨౧౭.) క......... పాండవాగ్రజుఁ డయ్యర్జునుఁ జూచి వీని విడువుము। యని నోడిన వాని హీను నయశో వీద్యున్. (ఆది. ౭ ఆ. ౪౭.) క. తన తన మదినున్న తెఱఁగు తథ్యము చెపుడా. (విరా. ౧ ఆ. ౬౫.) క... ....దైవంబు కతం। బున నాకు నొక్క చందం। బునువై యున్నయది దీని నొంగా దనుఁడా. (విరా. ౧ ఆ. ౮౬ ప.) క. సుందరి మాయిద్దఱలో। నిందెవ్వరి వలతు చెప్పుమీ యనవుడుఁ బూ। ర్ణేందు ముఖి సూచి మీలో। నం దెవ్వఁడు పాడిచి యొడిచె నతనిన వలతున్. (ఆది. ౮

దపి సంప్రార్థన పరో క్రియాణాం స్తః" అనునది వేఱొక కారికయొక్క పూర్వార్థముగ సంగీకరింపవలసి వచ్చెను. (చూ. నా రచించిన బాలసరస్వతీయ పీఠిక. ౨౯ విష. ౫౭-౫౮ పుటలు. వావిళ్లవారి ముద్రణము.) ఇట్టి ప్రతిక్షిప్తపాఠము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని '౧౧-౧౨-౫' నెంబరుగల బాలసరస్వతీయ మాతృకలోను 3-౨౨ నెంబరుగల కవిజనాంజనమును పేరితో ముద్రింపఁబడిన బాలసరస్వతీయ టీకా భాగములోను 'క - శే - రావుసాహేబు - కళాప్రపూర్ణ - గిడుగు రామమూర్తి పంతులుగారు నాకొసంగిన బాలసరస్వతీయ మాతృకలోను వేఱొక కాకినాడ మాతృకలోను నున్నది. పరిష్కృతముద్రణమున దీనిని పాఠాంతరముగఁ జూపుటలో "ఏదోక్తా వ్యతిరేకాదపి సంప్రార్థనపరో క్రియాణాం స్తః" అను నర్థచ్చ ముపేక్షింపఁబడెను. ఈయర్ధచ్ఛమే వ్యతిరేక క్రియలు ప్రార్థనార్థమును బోధించుట కుపదేశింపఁబడిన (చేయుమీ = చేయుము. మొ.) యీసందర్భములోని చింతామణి గ్రంథమునకు ముఖ్యవిషయమని సంస్కర్త వివేకింపకుండుట శోచనీయము!

ఆ. ౧౧౦.) వావిళ్లవారి ముద్రణమున నిది పాఠాంతరముగాను "అందెవ్వరి వలతు
చెప్పుము" అనునది గ్రంథముస్థగాను బ్రదర్శింపఁబడెను. తిలోత్తమయు సుందోప
సుందులును సమీపస్థులయి హస్త నిర్దేశ యోగ్యులుగా నుండుటచే నిట
"ఇందెవ్వరి." అను పాఠమె యర్హము. పరోక్షస్థల ప్రయోజ్యమగు "అందెవ్వఁ"
అనునది సంగతము కాదు. ఉత్తరార్థమున "అందెవ్వఁడు" అనునదే యర్హము.
అందు = ఆయుద్ధ సందర్భ మందని యర్థము.

వ్యతిరేక క్రియలు ప్రార్థనాద్యర్థముల నిచ్చుటకు:—శా. లదు.........
పితామహా మీరి కిచ్చుటఁ జిత్తశాంతి యొనర్పవే. (సభా. ౨ ఆ. 3౫ ప.) చ. వ్యాపగత
మైన జీవమిది వచ్చు నుపాయము సేయ కొల్పోఁ (ఆది. ౧ ఆ. ౧౫౦). ఆ-వె. నన్నుఁ
జూచి నగరె నళినాక్షి నాకేల। విప్రయోగ మేల వినవె తొల్లి। (అర. ౨ ఆ. ౧3౭).
'నగరె' అనుచోట (నవ్వుదురు జనులు) 'ఎ' శబ్దము వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థ
కము. 'వినవె' అనుచో "ఓ జీవలుఁడా వినుము" అని యర్థము. (వినవు+ఎ =
వినవె). క.........మత్పదముఁ గైకొనవే (విరా. 3 ఆ. ౨౨3). క. విన
వలతుం జెప్పవే వివేకనిరూఢా (స్త్రీ. ౧ ఆ. ౫౦). అయ్యాదులు ముద్దుఁజుల
మీఁద నిల్చుటకును:—అయ్యాదుల యోగమున వ్యతిరేక క్రియలు ప్రార్థనార్థకము
లగుటకును:—చ. అమలచరిత్ర యేల చెప్పవు యయ్య వినం గడు వేడ్కయయ్యెడున్.
(ఆది. ౧ ఆ. ౧౨౮). తే. గీ.........చెప్పు। మయ్య తపఃశి కపత్యులమైన కెఱుఁగు.
(ఆది. ౭ ఆ. ౬౬ ప) తే.గీ.। ఆ జరత్కారుఁ గని చెప్పవయ్య వాని। నెఱుఁగ
దేని మాపడికొడు నీయవస్థ (ఆది. ౨ ఆ. ౧౪౫). చ .........కడసె వారి
రుహాయతనేత్రఁ గృష్ణ నీ। ధరణి సురాన్వయోత్తముఁడు ధర్మవిధిం జెప్పడయ్య
యింక నె। వ్వరికిని జన్నె మీని నవవద్యపరాక్రము నాక్రమింపఁగా (ఆది. ౭ ఆ
౨౦౭). సీ.........। ఆ-వె.........। కరుణ గలుగుమమ్మ కమలనేత్ర. (ఆది.
౮ ఆ. ౪ ప.) ఆ-వె.........చేయకుమయ్య యిట్టి చెయ్యు లనఘ యింక (అర.
3 ఆ. 3౭౭). ఉ. వెన్నుఁడు ప్రీతి జెప్పిన సవిస్తరవాక్ప్రచయంబు త్రోవఁ
బో। వన్న కుమార.........(ఉద్యో. 3 ఆ. 3౪౮). చ. అనుపము సత్యవిస్ఫు
రణ నాడినమాట మఱాకుమన్న (ఉద్యో. ౪ ఆ. ౭౦ ప.) క. నాచిత్తము వసు
దేవునిఁ। జూచుటఁ గోరియును నీవు సుమనోన్నత్తిం। జూచి యనుమతి యొనర్చుట।
వేచినయది నన్నుఁ బుచ్చవే ద్వారకకున్. (మలిస్థలము.) (ఆశ్వ. 3 ఆ. 3 ప.)
క. వినుమయ్య శమథనాగ్రణి। వనగతులయి వేటలాడవల దెప్పాటన్। (హరి. ప.
౨ ఆ. 3౬). (వినుము+అయ్య = వినుమయ్య - శమథనాగ్రణి - నలకథాపక్షము,

వినుము+ఆ+అశమథనాగ్రణి = విను మ య్యశమథనాగ్రణి - హరిశ్చంద్ర కథా
సహేమము. క.........పురుషోత్తము నీ । పీ జన్మంబున నన్నుని । రాజికి వెలుఁగగు
తపశ్చరణ మొందవనా (అను. ౪ ఆ. 33౫ ఇట్టివిపెక్కు). అచ్యుతుపక్కమిత్యాదికి
౨౧౦ XII విషయమున ననేకప్రయోగములు చూపఁబడెను. సీ.........విను
శంతను సుతుండు । గురుఁడును విదురుండు గూర్కొని కూర్కొని చెవులఁ బోయ
మె సవిశేషకార్య (తే-గీ.) వచనములు సంజయుఁడు పెక్కువరుస లుభయు । బల
విధఁబులు తెలియఁగఁ బలుకఁడెట్లు ।.........(స్త్రీ. ౧ ఆ. ౧౪౨). పోయమె =
పోసితిమి - పలుకఁడెట్లు = పలికెను. ఆ-వె. నన్నుఁ జూచి నగరె.........(అర.
౨ ఆ. ౧3౭). (నగరె = నవ్వుదురు). క.......... । నీ వచ్చుటఁ గలవా తేవాని
క్కమ చెపురూ (విరా. ౪ ఆ. ౨౧౧). "అపిశబ్దాత్ క్వచి దన్యత్రాపి. ఉ. వచ్చునో
రాఁడో వాఁడనుచు.........సీ. వెలఁది యైరావతస్వాప కుంభకుచకుంభ సంభార,
హారిదదీశ్వరుని వలతో. ఇత్యాదివచనాని సాధూని........."(అహో. ౪౯౬
పు.) మొ.

సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష నను
ప్రయుక్తంబు లగు. 33.

వండుము - వండుమా - వండుమి - వండుమీ -
వండుఁడ - వండుఁడా - వండుఁడి - వండుఁడీ. అ-
ఆ - ఇ - ఈ - ఎ - ఏ - ఒ - ఓ అమ్మ-అయ్య ఇత్యాదు ల
దాదులు.

బాలవ్యాకరణ వివరణము. 30౦ I విషయము.

ఎదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజ్జునకు
వ్రజీ- రజీ యగు. 3౪.

వినవె - వినవే - వినరె - వినరే- వినకువె - విన
కువే - వినకురె - వినకురే.

సంజీవని. 30౦ I విషః—(౨౧౦ XIII విషయము చూడు). 'సంప్రార్థనం బులన్' అను బహువచనమునకు సూరిప్రయోజనమును వివరింపలేదు. చింతామణియందువలెనె యిందును ప్రార్థనాద్యర్థములందని సూరియాశయము కానోపును. అదాదులను సూరియే వివరించెను. ఇత్యాదు లనుటచేత 'అన్న' మున్నగు వానిని గ్రహింపనగును. అదాదులలోని 'ఇ' శబ్దమును నిర్వహించు ప్రబల ప్రయోగము కానరాదు. నన్నయ 'సంప్రార్థనాస్థకా దీ'త్తని వచించుటచేత 'ఇ' శబ్దమిట నన్నయకు సమ్మతముకాదని తోఁచుచున్నది. అదాదులలోని 'ఎ' శబ్దము

మొదలుగ నున్నవి "ఏదాదులని" యుత్తరసూత్రముచే విశదమగుచున్నది. కాన 'అదా'ద్యంతర్గణము 'ఏదాదు'లని యెన్నఁదగును. అదాదులెల్లఁ బ్రార్థనాద్యర్థక ముడుఞులపై స్వార్థమందె నిల్చు ననఁదగును. అదాదులలోని "ఏదాదులు" చేరిన రూపములు నిలువవు. వానికి నిత్యముగా నుత్తరసూత్రము 'వుజీ రజు'లను విధించుచున్నది. కాన - ముడుఞులపై - అ. ఆ. ఇ. ఈ శబ్దములుచేరిన రూపములె నిల్చి యుండునని తెలియనగును. 'అయ్య - అమ్మ' అనువాని నదాదులలోఁ జదివెనె కాని సూరి వానితోడిరూపముల నుదాహరింపలేదు. అయ్యాదు లెవాదులలోనివి గాన నవి పరమగునపుడు "వుజీ రజులు" వచ్చుననియు సూరియాశయమనక తీరదు గాని యుత్తరసూత్రములో నయితము వానితోడి రూపములను సూరి యుదాహరింపలేదు. బా - గు - ప్ర - వ్యాఖ్యాత "అయ్యా"దులు పరమగునపుడు "వుజీ రజు"లుఁ వచ్చినరూపముల నుత్తరసూత్రమునందలి మూలములోఁ బ్రక్షిప్తము చేసెను. బాలవ్యాకరణ ముద్రణములం దెందును "వినవమ్మ - వినరమ్మ - వినవయ్య - వినరయ్య" అను నుదాహృతులు లేవు. వీనినిబట్టి యీతఁడు "వినకువమ్మ - వినకురమ్మ - వినకువయ్య - వినకురయ్య" అనురూపములు సైత ముత్తరసూత్రమునకు లక్ష్యములని చెప్పుటకు వెనుదీయఁడని చెప్పనగును. పేటికావ్యాఖ్యాత "అమ్మ - అయ్య" అనునవి యేగణమునందును జేరవని యీక్రిందిరీతిని వ్రాసెను. "అదాదు లెదాదు లనువిభాగ మచ్చులకు సంబంధించినదే గాని యయ్య - యమ్మ - యప్ప - యన్న మొదలగు పూజ్యార్థకము లందుఁ జేరవనియు దాన నదాదులు (అ. ఆ. ఇ. ఈ) నాలుగనియు నెదాదులు (ఎ. ఏ. ఒ. ఓ.) నాలుగనియు గ్రహించి పైనాలుగచ్చులు పరమగునపుడె యీవిధి వర్తించునుగాని యయ్య మున్నగునవి పరమగునపుడు గాదనియు గ్రహించుట యుక్తమని తోఁచుచున్నది. ఆపక్షమున 'వినవమ్మ - వినవయ్య - వినరమ్మ - వినరయ్య' అనురీతిరూపములు కుదురవని శంకింప నగుం గానివాని నమ్మాదుల యోగముగల వ్యతిరేక క్రియారూపములనుండి సాధింప నగును..........." (బా. సా. పే. ౪౦౩ పు.) ఇట్లీతఁడు "అమ్మ - అయ్య" అనువానిని సూరియుదాహరించిన గణములనుండి ప్రత్యాఖ్యానము చేసినే కాని యీ ౩౩-౩౪ సూత్రములు రెండిటిని నేల ప్రత్యాఖ్యానము చేయఁడయ్యెనో తెలియకున్నది. "వినవమ్మ - వినరయ్య" మున్నగునవి వ్యతిరేకక్రియలనుండి సాధింపనగునపుడు "వినవె - వినవే - వినరె - వినరే - వినవా" మున్నగు రూపములుమాత్ర మేల వ్యతిరేకక్రియలనుండి సాధింపరాదు? నన్నయాథర్వణీయ మార్గ మదియేకదా. సూరి యట్టి యుక్తమార్గము నుపేక్షించి యీయపమార్గమున

నేల పడవలసెనో తెలియరాదు. ఈసూరిపక్షము "వినుడయ్య శమధనాగ్రణి" (హ.న. ౨ ఆ. ౩౬). వినుమన్న (ఉ.కో. ౪ ఆ. ౭౦) ద్వి.....వినుమ । మమ్మ.........(బసవ. ౩ ఆ. ౪౦౭). క..........వినుమయ్య ముకుందా (హరి. ఉభా. ౯ ఆ. ౨౪౪ ప.) చెప్పుమయ్య (ఆది. ౧ ఆ. ౧౨౫, ౭ ఆ. ౬౬), చెప్పుడయ్య (ఆది. ౭ ఆ ౨౦౭). కలుగుదుమ్మ (ఆది. ౫ ఆ. ౪ ప). చేయుడు మయ్య (ఆర. ౩ ఆ. ౩౭౭). మున్నగు వెనుక నుదాహరించిన (౩౦౭-౩౦౮ విష.) నన్నయతిక్కనాది మహాకవిప్రయోగములెల్ల విరోధించును. ఇంక నహోబల పండితీయము ననుసరించి 'వినకురె వినకుడయ్య - వినకుడమ్మ' మున్నగురూపములును సాధువులె యనుకొని వానిసాధనమునకయి సూరి యిట్టి యపమార్గమునఁ బడవలసె నని తోఁచుచున్నది. "ము వు వర్ణకయో రుపలక్షణత్వేన డు ఱు వర్ణకయో ర్బహువచనయోరపి గ్రహణమ్" (అహో. ౪౮౬ పు.) (౩౦౭ విష.). మఱియు-'వినకువె' అను నేకవచనరూపము సాధువైనపుడు 'వినకురె' అను బహువచనరూప మేల సాధువు కాదని తోఁచునుగాని యట్టి బహువచనరూపముల సాధుత్వమును నిర్వహించు ప్రామాణిక కవిప్రయోగములుగాని ప్రాచీన ప్రామాణిక లాక్షణికసమ్మతి గాని లేదు. 'వినకువె' అను నేకవచనరూపమునకు మహాకవిప్రయోగములె కాక "ము వు పరశ్చ సః" అను నథర్వణాచార్య సమ్మతియు నాధార మగుచున్నది. ఏకవచనమందును "వినకువయ్య - వినకువమ్మ" అనురీతిగల ప్రయోగములు లేమిం జేసి 'వు'వర్ణకము 'ఎ - ఏ' లతోఁ గూడిమాత్రమె సాధు వగుచున్నదని వ్యాఖ్యచేయఁబడెను. (౩౦౭ విష.). అయ్యాదు లేకవచనాంతములయినను డుజ్జు పైనిసైతము 'అ-ఆ' మున్నగుస్వరములవలెనె నిలువనగును. వ. వారలఁ జూచి కృష్ణుం డిట్లనియె. చ.........పడసె వారి రుహాయతనేత్రఁ గృష్ణ నీ । ధరణి సురాన్వయోత్తముఁడు ధర్మవిధం జెప్పుడయ్య యింక నె । వ్వారికిని జన్నె వీని ననవద్యపరాక్రము నాక్రమింపఁగా. (ఆది. ౭ ఆ. ౨౦౬-౨౦౭ ప.) వ. వలన దుడుగుండు.........(ఆది. ౭ ఆ. ౨౦౫,. క.......... । అనువై యున్నయది దీని నొఁ గాదనఁడా ? (విరా. ౧ ఆ. ౫౬). సూరిపక్షము "వినవె - వినరె - వినకువె - వినకురె - వినవయ్య" మున్నగుచోటులందు "వినుము+ఎ = వినవె; వినకుము+ఎ = వినకువె; వినుఁడు+ఎ = వినరె - వినకుఁడు+ఎ = వినకురె - వినుము+అయ్య = వినవయ్య" అనురీతిని బదచ్ఛేదము నరయునది. ఇదియెంతయు నస్వాభావికము - నసత్యము ననుటకు సందియము లేదు.

చ ర్దేశ్యే మధ్యమార్థే స్యాత్ । ప్రార్థనే ము మ్ము
నన్నయసూ దుజ్ స్థితిః । ఏతి వాన్తో హ్రస్వ దీర్ఘౌ । ద్విత్వ మూ
3౦౮ II వివ. దన్తతా క్వచిత్. (వికృతి. క్రియా. ౧౬-౧౭ కారి.
అహో. ౪౯౬ పుట.)

కల్పతరువు. 3౦౮ II వివ:—చుః = 'చు' అనెడి నిశ్చయాద్యర్థవిశేషబోధక శబ్దము, దేశ్యేః=దేశ్యము, మధ్యమార్థే - ప్రార్థనే = ప్రార్థనాద్యర్థక మధ్యమ పురుషమున, స్యాత్ = ప్రయుక్తమగును. అట్టియెడల మధ్యమపురుషమున, ముమ్ముదుజ్ స్థితిః = ఏకత్వమున 'ము-మ్ము' అను ప్రత్యయములును, బహుత్వమున దుజ్వర్ణకమును నగును. ఉదా:—చుము - చుమ్ము - చుఁడు - చుండు - చేసెదను జుమ్మీ = చేసెదనుజుమీ - చేసెదనుజుఁడీ - చేసెదవుసుమీ - చేసెదవుసుమ్మీ - చేసెదరుసుఁడీ - చేసెదరుసుఁడీ - (చేయువలదను ప్రార్థనము వ్యక్తమగును). ఏతి = 'ఎ-ఏ' అనునవి పరమగునపుడు, వాన్తః - హ్రస్వదీర్ఘః స్యాత్ = 'చు' శబ్దము వకారాంతమై, హ్రస్వరూపము దీర్ఘరూపము గలదగును. ద్విత్వం స్యాత్ = ప్రయోగౌచిత్యమునుబట్టి హ్రస్వముగా నుండు నపుడా వకారము ద్విరుక్తమగును. ఉదా:—చువ్వే = చూవె. వకారము రేఫమునకు నుపలక్షణము గాన 'చూరె' అని బహువచన రూప మెన్నునది. వెళ్ళెదను జూరె - వెళ్ళెదవుసువ్వే - వెళ్ళెదవు సూవె - వెళ్ళెదరుసూరె, గసడదావాః స్యు రిత్యాది సూత్రము చొప్పున (౭౭ వివ.) చకారము సకారమగును. క్వచిత్ = ఒకానొకప్పుడు, ఊదంతతా = చు శబ్దమున నూకారాంతత్వమును గల్గును. ఉదా:—చూ - నూల్చెదం జూ - చేయుదువు సూ. మొ.

ఈయధర్వణ ప్రదర్శిత ప్రక్రియనుబట్టి 'చూ' అను దాని దీర్ఘము 'ము' వర్ణకలోప మూలకము కాదనియు 'చూ' అనునది ప్రత్యేకముగాఁ బైరీతిని సాధింపనగుననియు నిట్లు వెనుక నుదాహరించిన భారత ప్రయోగమున స్వరపరక 'ము' వర్ణకలోపము లేదనియు సమర్థించుట కవకాశము గోచరించుచున్నది. కాని 'మధ్యమార్థే - ప్రార్థనే' అని యధర్వణుఁడు వచించుటచేతను, 'ము - మ్ము - దుజ్' అను ప్రార్థనార్థక మధ్యమపురుష ప్రత్యయములను విధించుటచేతను నిట స్వర పరక ము లోపమున 'చూ' అను రూపము కల్గలేదనుట సరికాదని తోఁచుచున్నది.

కవిజనమండనకర్త కవిశిరోభూషణమును సరిగాఁ జూచికొనక "ఏతి = పొందు చున్నది." అని టీక వ్రాసెను. "ఏతి = ఏకారేపర ఇత్యర్థః - ద్విత్వపక్షే హ్రస్వః - తదభావే దీర్ఘ ఇత్యర్థః." (అహో. ౪౯౭ పు.) శబ్దతత్త్వమునుబట్టి పరిశీలించు

నపుడు చుమ్ము - చూవె మున్నగునవి 'చూడు' ధాతు ప్రాగ్నాద్యర్థక మధ్యమ పురుష రూప మూలకములని తోఁచును. ఉదా:—చూడుము = చూ+ము = చుమ్ము - చూడుఁడు = చూ+డుజ్ = చుఁడు. చూడవె = చూవె = చూడరె = చూరె. ఈరూపములందు మాత్రమె చూడు 'డు' లోపము కన్పట్టును. 'చూడుము = చుమ్ము.' మున్నగు వాని కర్థమునం దించుకంత భేదస్ఫూర్తి కన్పట్టు చున్నది. ప్రయోగములు:—క.........నిర్గత। శోకస్థితి నున్నదానఁ జూవె ఖగేంద్రా. (ఆది. ౨ ఆ. ౫౧.) క.........బన్నము వడి యేఁదఁ। దలఁపక యున్న తఁడ చూవె తత్ప్రాఁడిలన్. (ఆది. 3 ఆ. ౧౮౭) చ. సురల వరప్రసాదమునఁ జూరె సుపుత్త్రులఁ బాండురాజు భా। సురముగఁ గాంచె............(ఆది. ౫ ఆ. ౧౫౦) క.........భా। సురతేజుఁ డుపేంద్రసఖుఁడు సువ్వె మునీంద్రా. (ఆర. ౧ ఆ. 323.) ఉ. భావిపురాతనాద్యతన.........ఏఁ। జూవె సహింప నోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్. (సభా. ౨ ఆ. ౧౧౮.) మ.........ఒదిగిఁ దైన్యంబు వచ్చుం జుమీ. (శల్య. ౨ ఆ. ౬౧.) క......వాఁదగు। పలుకు వినఁగదయ్య హితము పథ్యముఁ జుమ్మీ. (ఆర. ౬ ఆ. ౬౮.) క......సం భా। పాతరళత నొందమి సూ। రే తెరవు విమోక్ష సుఖగరిష్ఠత వడయన్. (శాంతి. ౬ ఆ. 3౧౮.) క. ప్రజ్ఞయ నాకం బనంగఁ బ్రజ్ఞయ చువ్వే. (శాంతి. ౪ ఆ. ౬౮.) క. నావ్రడు సాత్యకి.........వచ్చుం। జూవె. (ఉ. హరి. ౫ ఆ. ౨౮3.) ద్వి. నమ్మి పోయెదము సు మ్మమ్మ మహాను। మమ్మ.........(బసవ. 3 ఆ. ౪౦౭.) బాల వ్యాకరణ పక్షమున 'చూవె' అనుచో 'చుమ్ము+ఎ' = చువ్వె - చూవె అనియు 'చూరె' అనుచో "చుఁడు+ఎ" అనియుఁ బదచ్ఛేద మసంగతముగఁ జెప్పవలసి యుండును. సూరి యీక్రింది వానిని సంగ్రహింపలేదు.

రయోగం మధ్యమైకత్వే। క్వచి దర్థే ప్రయుజ్యతే।
దీర్ఘో హ్రస్వశ్చ తత్రస్యా। దేశోప్యర్థ విశేషదః.
మధ్యమస్థే క్రియార్థేతు। నిత్య మత్వ మిహేష్యతే।
నన్నయా. నైకవర్ణస్యతు తథా। రయోగస్య తథా గతేః.
30౮ III విష. అన్యత్రాపి త దిష్టః స్యా। త్సద్వ్యాక్యస్య తథా గతేః.
(వికృ. క్రియా. ౨౬-౨౭-౨౮-౨౯ కా. అహో.
౫03 పు.).

కల్పతరువు. 30౮ III విష:—మధ్యమపురుషైక వచనమునందు; రయుగమ్ = అత్వవిశిష్ట రేఫద్వయము, క్వచిదర్థే = అర్థవిశేషమందు, నీచత్వము భక్తి

మైత్రి మున్నగు నర్థవిశేషములందు, ప్రయుజ్యతే = ప్రయోగింపఁబడును. దీర్ఘో హ్రస్వశ్చ=ఆ రయుగములో రెండవది 'అ'కారవంతము 'ఆ'కారవంతమును నగును. (చూడు. క్రి. ౨౫౫ శా. ౩౦౭ V విష. ప్రత్యయార్థే ఇత్యాది.) తత్ర = రద్వయమున, ఏకోపి = ఒక్కటి సైతము, అర్థవిశేషదః=అర్థవిశేషము నిచ్చునది, స్యాత్ = అగును. ఉదా:—రారా, = రార, = రా = రమ్ము. ఒక్కటి ప్రత్యేకముగాఁ బ్రయుక్తమగునపుడు హ్రస్వాకారముండదు. "ర = రమ్ము" అని వాడరాదు. క్రియార్థే మధ్యమస్థేతు = అట్టి యేకరా శబ్దము ర శబ్దమును వేఱొక మధ్యమ పురుష క్రియ తుదియక్షరము మీఁద నిల్చినచో, ఇహ = ఈసందర్భమున, అత్వం, నిత్యమ్, ఇష్యతే = పూర్వస్థిత క్రియాంత్య వర్ణమునకు, 'అ'త్వము సమ్మతమగుచున్నది. ప్రార్థనార్థమున మధ్యమ 'ము' వర్ణకము లోపించునపుడె క్రియాంత్యము రా శబ్దపరకమగుచుండఁ బూర్వస్థిత స్వరమునకు'అ'కారాదేశ మగును. ఉదా:—పాలింపుము+రా = పాలింపు+అ+రా = పాలింపరా = పాలింపుము. మువర్ణక లోపము లేనపుడు ర శబ్దపరకత్వమున ముప్రత్యయాకార మకారము కానేరదు. ఉదా:—చ. జననముఁ దెల్పి యేఁ బిలువ సత్యము సుమ్మర కుంతి భాషణం। బని............(శాంతి. ౧ ఆ. ౩౯.) ఇట్లగుటచేతనే మధ్యమ పురుష క్రియల మీఁద 'అ'కారవంతము గాని 'ఆ'కారవంతము గాని రేఫము నిల్చుట గలదని వ్యక్తమగుచున్నది. ఏకవర్ణస్యతు = ఏకాక్షరకమగు క్రియ ర శబ్ద పరకమగునపుడు పూర్వ స్వరమునకు 'అ'కారాదేశము, న = కాదు. రయోగస్య తథా గతేః = ర శబ్దయోగ మట్లు కవిప్రయోగ సిద్ధమగుటవలన నట్లు చెప్పఁబడె నని యర్థము. "ప్రయోగస్య తథా గతేః" అను పాఠము యుక్తతరము. ఉదా:—పోరా - లేరా - తేరా. మొ. అన్యత్రాపి = మధ్యమపురుష క్రియేతర పదముల మీఁద సైతము, తదిష్టః స్యాత్ = ఆద్వివిధ ర శబ్దప్రయోగమును సమ్మతమగును. సద్వాక్యస్య తథా గతేః = కవిప్రయోగము లట్లుండుటవల్ల నని తాత్పర్యము. ఉదా:—నే నా పని చేసితినిరా - వాఁడు వెళ్లెనురా, ఏమిర కర్ణ. (ద్రోణ. ౪ ఆ. ౨౮౮.) ప్రయోగములు:—చ. జననము దెల్పియేఁ బిలువ సత్యము సుమ్మర కుంతి భాషణం। బని తనుజత్వ జాతకృప నంబుజ మిత్రుఁడు వల్కె......... (శాంతి. ౧ ఆ. ౩౯.) ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టితిఁ తతఁడు దోలసి। గ్గె మియు లేక.........(ద్రోణ. ౪ ఆ. ౨౮౮.) శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ కస్తూరికా। భిక్షా దానము సేయరా సుకవిరాడ్ బృందారక శ్రేణి కిన్।.........కవుల చరిత్రలోఁ 'బృందారకస్వామికిన్' (శ్రీనాథుఁడు) అను పాఠ

యంగీకరింపఁబడెను. మఱియు నందు రెండుచోటులం దీపద్య ముదాహృత మయ్యెను. రెండిటను 'చేయురా' అని యకార ముత్వఘటితముగాఁ బడియుండుట సరికాదు. (కవులచరిత్ర, రివైజ్డ్ ఎడిషను ౩౮౪-౩౫౭-౪౯౧-౫౧౦ పు.) మ... ......కస్తూరికా। ఘన సారాది సుగంధి వస్తువుల వేగం బిచ్చి లాలింపరా. (కవు. రివై. ౩౮౩ పు.) ఉ. ఏలర యీ చలం బుడిగి యేలర బాల రసాల మాలతీ। జాలములో.........(మను.చ. 3 ఆ ౯3 ప.) ఇందలి శబ్దాలంకారము "ఏలు ము+రా = ఏలు+ర = ఏలు+అ+ర = ఏలర" అను చోటి 'అ'త్వమునకుఁ బ్రమాణ మగుచున్నది.

శబ్దతత్త్వమును బరిశీలించినచో వచ్చు ధాతు ప్రార్థనాద్యర్థక మధ్యము పురుషైకవచన రూపమగు 'రమ్ము' అను దాని లోని 'ము' వర్ణకము పాక్షికముగా లోపింపఁగా మిగిలిన రూపము 'రా' అని యేర్పడుననియు దానినుండి యేర్పడినదే 'ర' అనునది యనియు (సూ. ౩౦౮ V విష. ప్రత్యయార్థ ఇత్యాది.) నట్టి రెండు శబ్దములును (రా - ర) వ్యవహారవశమున నర్థమునందును బరిణామము నంది వివిధస్థలములందుఁ బ్రయుక్తములగుచు వచ్చెననియుఁ దోచుచున్నది. ఇట్లు శక్తి మాఱుటచే నథర్వణాచార్యుఁడు ర శబ్దపరకత్వమున ధాతూకారమునకు 'అ'కారాదేశము చేసెను కాని పరిశీలింపఁగా "ఏలన్+ర = ఏలుట నిమిత్తము రమ్ము" అనురీతి నత్వస్థలములం దెల్ల నుజ్యంత ధాతు రూపము [illegible]బడియున్నదని తోఁచక మానదు. అర్థశక్తి మాఱుటచేతి నచట 'రమ్ము' అను నర్థమునకు స్ఫూర్తి బాగుగఁ దోఁచకున్నను సూక్ష్మముగ నరసినచోఁ గొంత వ్యక్తము కాకపోలేదు. కాలక్రమ మున నట్టి 'అ'త్వ మేదో పొరపాటనుకొని కొందఱు సామాన్య గ్రంథకర్తలును ముద్రణ సంస్కర్తలును నట్టియెడల 'ఏలురి' అనురీతి నుకార ఘటిత లకారాదులనే నిల్పుచున్నారు. అథర్వణాచార్య వచనమునైన స్మరింపకున్నారు. కవులచరిత్రము నందు ౩౮౩-౩౮౪-౩౫౭-౪౯౧-౫౧౦ పుటలలో "చేయురా' అనునది పడియున్నదని పైనివివరించియే యున్నాను. ఇట్లర్థమునందుఁ బరిణామము గల్గుటచేతనే 'రా' శబ్ద మవ్యయము నపదము ('అపద' మనఁగాఁ బ్రత్యయాదికము) నని శబ్దరత్నాకరమున నీక్రిందిరీతిని వ్రాయఁబడెను. "ర.........దే - అప - ౧ నీచ మిత్రోద్దేశముల యందు ఉద్దేశ్య వాచకమునకు ఏకత్వంబున అంతాగమంబగును. (నీచోద్దేశ మునకు:— ఉ. వంచన రాము దేవిఁ గొని వచ్చిన యట్టులు గాదు రోరి న। క్తం చర.........(రా. యు. కాం.) మిత్రోద్దేశమునకు:—"ఏలర యీచలం బుడిగి యేలర. (స్వా. 3 ఆ.). అవ్య-ప్రశంసార్థక శబ్దమున కనుప్రయుక్తమగును. (పౌర.

బలిర. మొ.)" (శ-ర). 'ఔను+ర - ఔర' అనుచోఁ "ఔను" శబ్దము ప్రశంసార్థకము కాదు. రయోగమున నది ప్రశంసార్థక మయ్యెను. "రా - యు - దే - అప - ర అను దాని యొక్క రూపాంతరము. నీచోద్దేశమునకు:—'కానీరా' ఆము. ౬ ఆ. (కానీ = కానిమ్ము+రా.) మిత్రోద్దేశమునకు:—రారా నందకుమారక - ప్రశంసార్థక శబ్దములకు అనుప్రయుక్తరుగుటకు:—'ఔరా వలరాచ వేగిరము' ఉ. హరి. ౫ ఆ.)" (శ-ర). ఇంకను బ్రయోగములు:—"మ. బళిరా సత్కవి సౌమ...(కళా. ౧ ఆ. ౪౪.) శా. ఏరా తమ్ముఁడ నన్నుఁ జూడఁ జనుదే వెన్నాళ్ళనో యుండి...... (పాండు. ౩ ఆ. ౩౩.) "ఏరా = ఏర. అవ్య. (ఏమి+రా.) మైత్రీకోపాదులతో చేయు సంబోధనమం దుపయుక్తము.........." (సూ. రా. ని.) "ఏర = ఏరా - శివధ ౧ ఆ ౧౦౩" (సూ. రా. ని.) "క్వచిదర్థే - హీనత్వార్థే - ప్రియత్వార్థేచ - రారా శ్రీరాము మమ్ము రక్షింపన్ - రారా ప్రహ్లాదము లేల రణ మొనరింపన్...... రారా దాసుల రక్షింప రామచంద్ర....... రా యింకఁ బ్రహ్లాదము లేల రణ మొనరింపన్........." (అహో. ౫౦౭ పుట.) బాలవ్యాకరణమున నీవిషయములు సంయుతము సంగ్రహింపఁబడ లేదు.

సన్నయాథర్వణీయము. ౩౦౪ IV విష.

ప్రార్థనార్థే భవేన్నాన్తా । త్కదేత్యర్థ విశేషదః ।
అన్యతశ్చాపి స భవేత్ । క్వచి దర్థ విశేషదః । ఉత్త
మాదావపి భవే । త్ప్రశ్నాద్యర్థ విశేషదః । (వికృ.
క్రియా. ౧౪-౧౫ కారి. అహో. ౪౯౬).
ఆర్యాదిశబ్దో యుక్తః స్యా । దసంబద్ధార్థబోధనే ।
(వికృ. క్రియా. ౧౫ కారి. అహో. ౪౯౬).
కిలార్థా దుభయోరర్థ్యోః । నోభయోపరి వర్ణకః ।
(వికృ. క్రియా. ౧౬ కారి. అహో. ౪౯౬).

కల్పతరువు. ౩౦౪ IV విష:—ప్రార్థనార్థే = ప్రార్థనార్థమునందు, నాన్తాత్ = నుజ్యంతముకంటెఁ బరముగ, కదేతి = 'కద' అనుశబ్దము, భవేత్ = అగును. అర్థవిశేషదః = అర్థవిశేషబోధకమును నగును. ఉదా:—ననుఁ గావఁగదే = కావుము. సః = ఆ 'కద' శబ్దము, క్వచి దర్థవిశేషదః = ఒకప్పు డర్థవిశేషము నిచ్చునదై. అన్యతశ్చాపి = నుజ్యంతేతరములకంటె బరముగను, భవేత్ = అగును. ఉదా:—ఆపనిచేసికదా రావలయును. అవిచేసినంగదా ఫలము గల్గును. దయాబ్ధి గదా. లేతగదమ్మ (రుసు. ౩ ఆ.) మొ. సః = ఆకదశబ్దము, ప్రశ్నాద్యర్థవిశేషదః = ప్రశ్నాద్యర్థవిశేషముల నిచ్చునదై - ఉత్తమాదావపి భవేత్ =

ఉత్తమపురుషాది క్రియలకంటెఁ బరముగాను నిల్చును. ఉదా:—నేను జేసితినిగదా, నీవు చేసితివా? వాఁడు చేసెనుగదా, నీవేల చేయలేద? మొ. ఇంకను వివిధములగు నర్థవిశేషములు దీని వాడుకయందు గన్పట్టును. వాఁడు రాఁడుగదా, ఏమిచేయుననగును? నీ వదువచ్చునుగదా, ఇంకనెవరు రారు. ('కాదు+ఆ = కాదా = కదా = కద' అనురీతి నీశబ్దము వ్యుత్పత్తి నరయనగును). అర్థబోధనే, అసంబద్ధః = జనకాదిసంబంధార్థకము కాని, ఆర్యాదిశబ్దః = అయ్య - అన్న మున్నగుశబ్దములు, యుక్తః స్యాత్ = అర్థవిశేషములందు బ్రయుక్తములగును. ఉదా:—చెప్పన్+కద+అయ్య = చెప్పఁగదయ్య = చెప్పుము. చెప్పన్+కదా+ఎ=చెప్పఁగదె=చెప్పుము. వచ్చితివిగదయ్య - వచ్చితివిగదమ్మ - మొ. "ఆర్యశబ్దభవః అయ్యేతిశబ్దః ఏకారాది స్వరసంబన్ధరహితః. అర్థవిశేషే ప్రయుజ్యతే = పోవవయ్య - రావయ్య - నను మఱతువయ్య - వినవమ్మ - వినరమ్మ ఇత్యాది - నీ రెవ్వరయ్య ద్రుపదమహారాజులె ఇత్యాచార్యవచనమ్" (అహో. ౪౯౭ పు) 'అసంబద్ధః' అనుదానికే కారాదిసంబంధరహితమని యహోబలపతి యర్థముచేసెను. "అయ్య+ఏ=అయ్యే" మున్నగునవి కేవలము నప్రసిద్ధములు కాన వానిని నిషేధించువ్యాఖ్య యుప్రసక్తము. ఆర్యాదిశబ్దములతోఁగూడిన కదేతి శబ్దము నాంతక్రియలపై నిల్చి ప్రార్థనాద్యర్థకమగునని పర్యవసితార్థము. 'కద' అను శబ్దము "కాదు+ఆ = కాదా = కదా = కద" అని యేర్పడినదేయని యీావఱకు జెప్పఁబడెను. "రక్షింపఁగదయ్య = రక్షింపన్+కాదు+ఆ+అయ్య = రక్షించుటకాదయ్య = రక్షించుటజరగదయ్య = రక్షింపుము" అని యచటి యర్థక్రమము నరయునగును. (సూ. 30౦ా V వివ. ప్రత్యయార్థ ఇత్యాది). కిలార్థాత్ = కిలశబ్దార్థవాచకమగు 'అఁట' శబ్దము నకుఁ బరముగ, ఉభయో రోర్యగః = 'కద - అయ్యాదులు' అను రెండిటియోగము గల్గును. ఉదా:—వచ్చితివఁటకద - వచ్చితివఁటయ్య - వచ్చితివఁటమ్మ - వచ్చితివఁటె. మొ. 'వచ్చితివిగదయ్య' అను రీతిరూపములు "ఆర్యాదిశబ్ద" ఇత్యాది సూత్రముచేతనే ('చెప్పఁగదయ్య' అనుదానిరతినే) సిద్ధించును. ఉభయోపరి = "కిలార్థకము (అఁట) మీఁదను, "కద" అనుదానిమీఁదను, వర్ణకః = మధ్యమ 'వు'వర్ణకముకాని మధ్యమ 'రు'వర్ణకముకాని, న = నిల్వదు. ఉదా:—'వచ్చితివఁటె, వచ్చితివిగదె వచ్చితిరఁటె - వచ్చితిరిగదె' అనియే యుండునుగాని 'వచ్చితివఁటవె - వచ్చితివిగదవె—వచ్చితిరటరె - వచ్చితిరిగదరె.' అనురీతిని రు - వుప్రత్యయాంతము లుండనేరవని తాత్పర్యము. "మొదటి యుభయశబ్దముచే 'కద'శబ్దమును, అయ్యాదులును, జెప్పఁబడును. రెండవ యుభయశబ్దముచే "అఁట, కద" అనునవి చెప్పఁ

బహును. "అచటికి వచ్చితివఁటకద, వచ్చితివఁటయ్య, వచ్చితివటమ్మ, పరస్పరం
యోగోపి - వచ్చితివిగదయ్య ఇతి ఉభయశబ్దేన కదా కిలార్థకౌ గృహ్యేతే.
తయో రుపరి కైశ్చిత్ 'వు-రు' వర్ణకౌ ప్రయుజ్యేతే. వచ్చుఁగదవె - కదరె,
వచ్చునటవె - వచ్చునఁటరే ఇతి-తాదృశం రూప మసమంజసమితి నిరాచష్టే, నోభ
యోపరివర్ణక ఇతి. తత్ర వచ్చుంగదె ఇత్యాద్యేవ రూపం సమంజసమ్" (అహో.
౪౯౭ పుట). అథర్వణునినాఁటి కిట్లు 'కదవె - కదరె' "అఁటవె - అఁటరె" అను
రూపములు లేమింజేసి యాతఁ డట్లు వచించెను. కాని తర్వాతికవులట్టి యథర్వణ
నిరాకృతరూపములను బ్రయోగించిరి. అథర్వణుఁ డట్టివానిని, నిరసించుట వర
యఁగా నాతనికాలమునకె యట్టివి వ్యవహారమున నుండెడివని తోఁచుచున్నది.
ఉ.........పురంబుఁ జేర నిం । కెవ్విధిఁ గాంతు: దెల్పుఁగదవే తెరువెద్ది శుభంబు
నీకగున్ (మనుచ. ౨ ఆ. 3౯). "కదవె (కదవే) = కద. I ప్రార్థనమునకు. సీ...
......చిలువవ్వు నవ్వఁగదవె. (రసిక. ౫ ఆ. ౧౪౨). శా.........తెల్పుఁగదవే
యేతత్పురావృత్తమున్ (దశా. ౧ ఆ. ౨౨౭)" (సూ. రా. ని). "ఉ. వీయపురాల
వైతిగదవే యిపుడు. (విజయ. 3 ఆ.)" (ప్రౌఢ. క్రి. ౨౯ సూ.) "కదవయ్య -
(య్యా) = కద. I ప్రార్థనమునకు. గీ. కావఁగదవయ్య యర్థార్థికల్పశాఖ (నైష.
౧ ఆ. ౧౦౭). మ......అ । యమరుల్ నీకెవరే జయింపఁగదవయ్యా......
(ఉ. రా. ౧ ఆ. ౭౮)." (సూ. రా. ని). "కదవమ్మ (మ్మా) = కద. I సంతాపము
నకు. గీ. కమ్మవిలుకానితూపులఁ గ్రమ్ముకాఁక । ముమ్మరంబయ్యెఁ గదవమ్మ ముద్దు
గుమ్మ (ఇందు. 3 ఆ. ౯ ప)." (సూ. రా. ని). "కదరె. దే. అవ్య. (కద+రె)
సంతాపమును దెలిపెడి......గీ........ ఎంత బడలెనొ కదరె యయ్యెమ్మెకాఁడు
(రసిక. ౪ ఆ. ౧౭౭). (రూ కదరే. శా. ఈ । వ్యాజస్వాంతుఁడు రుక్మి యబ్బు
గదరే (రుక్మి. ౨ ఆ. ౭3)." (శ - ర). ("కద+ర+ఎ" అని ఛేదము చూపుట
యుక్తము). "కదరయ్య - (య్యా) = కద. I ప్రార్థనమునకు. గీ.........మా
పద్మగంధిఁ దోడ్తెచ్చి నన్నుఁ । గూర్పఁగదరయ్య మిము వేఁడుకొనెదఁగాక(సారంగ.
౨ ఆ. ౧౭౦)." (సూ. రా. ని). "కదరమ్మ - (మ్మా) = కద. I సంతాపమునకు.
గీ.........ఎంత । వంత నడలెనొ కదరమ్మ యింతులార (రసిక. ౪ ఆ. ౪౪)."
(సూ. రా. ని). 'అఁటవె - అఁటరె' అనువానికిఁ బయిరీతిని గోశములలోఁ బ్రయో
గములు చూపఁబడలేదు. కవిజనమండనకర్త 'కదవే' మున్నగునవి యథర్వణ
నిరాకృతములు కావనియు, "నోభయోపరి వర్ణకః" అనుటచే "చదివితివఁట కదవె"
అనురీతిని "అఁటకద"ల యుభయముమీఁద 'వు'వర్ణకము నిల్వదని యథర్వణాశయ

మనియును వ్రాసెను. (వికృ. క్రియా. ౧౬ కారి. టీక). త్రిలింగలక్షణశేషమున "ప్రార్థనంబునం దన్విత్యర్థాంత క్రియలమీఁదఁ గద కదవు పూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబు లగు" (ప్రౌఢ. క్రియా. ౯ సూ). "తఱచుగం గ్రియలమీఁది కద - కదవుల కన్నాదులు పర్యాయంబున ననుప్రయుక్తంబులగు......తఱచుగ ననుటచే లేఁత గదమ్మ. (మనుచ 3 ఆ) దర్పంబు గాశిలి గదమ్మ (భాగ. ౧౦ స్కం. పూ.) ఇత్యాదు లూహ్యంబులు (అనఁగాఁ గ్రియలమీఁద నేకాక నామముల మీఁదను కద కదవులు నిల్చును)" (ప్రౌఢ. క్రియా. ౨౯ సూ). అని సూత్రింపఁ బడెను. నాంత క్రియలమీఁద అయ్యాదిశబ్దములతోఁ గూడిన కదశబ్దము ప్రార్థ నార్థ మిచ్చుటకు: క.........భవ । చ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే (ఉద్యో. 3 ఆ. ౪౦౮). ప్రసాదింపఁగదే = ప్రసాదింపుము. క.........పాండ వులం । గలసి మనవయ్య నాదగు । పలుకు వినఁగదయ్య హితము పథ్యముఁ జుమ్మీ (ఆశ్వ. ౬ ఆ. ౬౪). ప్రార్థనాద్యర్థక క్రియల విశేషరూపములుగాఁ ద్రిలింగలక్షణ శేషమున నీక్రిందివి సూత్రింపఁబడెను. "ప్రార్థనాదులం దన్విత్యర్థాంత క్రియల మీఁది యిమ్ము కిఁకాగంబు విభాషనగు సీ. ఓర్పు మై నుప్పొండి యుపవాసముండ నీ । మగనాలి పరిపోల్పఁదగదు విధవ. (ఉప్పొండి = ఉప్పొంపిగ) (కాశీ. ౨ ఆ)... ......" (ప్రౌఢ. క్రియా. ౧౦ సూ), "ఎంత జడుఁడైనంగాని కానిమ్ము ఇత్యస్మి న్నర్థే కానీశబ్దః.........ఇత్యాదిశబ్దా అన్యశబ్దేన గ్రాహ్యాః."(అహో. ౪౯౭ పు). అని యహోబలపతి వైరిశబ్దములను 'అన్యే ప్యర్థవిశేషే స్యు । ర్యత్ర శ్రుతి మనో హరాః' (30ఆ V విష). అను సధర్వణకారికకు లక్ష్యములనుగా నుదాహరించెను. ఇట్టివి ప్రత్యయార్థ (30ఆ V విష) ఇత్యాదిలక్ష్యములనుట యుక్తము. "ఇమ్ము=ఈ - కానిమ్ము = కానీ" మున్నగునవి ప్రార్థనాద్యర్థక మువర్ణకలోపముననే (౧౦౯- ౧౦౯ I విష). తెమ్ము = తే - పొమ్ము = పో - రమ్ము = రా మున్నగువానివలెనే సమర్థింపఁగనవి. ఇంక నిట నొక్కవిశేషము గలదు. 'కానిమ్ము = కానీ' శబ్దమె 'కాని' అనురూపముతోఁ బ్రయోగింపఁబడుచున్నది. తే-గీ ఏను నీయింతియును గాని యొలుగ రన్య । లు.........(ఆది.౪ ఆ. ౧౦౭ ప). "ఒకానొకచో రండు పాండులకు రాపాండవ రూపఁబు గానంబడియెడి. క. నిండుదలంపునఁ దగ రా । పాండసు గౌరవములేని.........(యయా. 3 ఆ)" (ప్రౌఢ. క్రియా. ౧౧ సూ). బాలవ్యాకరణమున సీవిషయములు సైతము సంగ్రహింపఁబడలేదు.

నన్నయా. ప్రత్యయార్థే విశేషేఽపి క్వచి ద్దేశ్యపదం మతమ్।
30ఆ V విష అన్యే ప్యర్థవిశేషే స్యు । ర్యత్ర శ్రుతిమనోహరాః.
(వికృ. క్రియా. ౧౭ ౧౮ కా. అహో. ౪౯౬).

కల్పతరువు. 30౮ V వివ:— ప్రత్యయార్థే=ము ప్రత్యయార్థము, అవి
శేషేఽపి=అభిన్నమే యైనను, దేశ్యపదమ్=అట్టియర్థమునందే దేశ్యపదమును, క్వచిత్ =
ఒకప్పుడు, మతమ్ = సమ్మతమగును. ఉదా:— కానిమ్ము = కాని = కాని. 'కాని'
అను దేశ్యపదము "కానిమ్ము = కానీ" అను ముప్రత్యయాంత పదములకు
భిన్నము కాకున్నను నట్టిది వ్యాకరణసాధ్యము కామింజేసి ప్రత్యేకపదముగా నంగీక
రింపఁబడుచున్నది. తే-గీ. ఏను నీయంతియును గాని యెఱుఁగ రస్య । లు......
...(ఆది. ౮ ఆ. ౧౦౭). వినుము నరేంద్ర పాండుపృథివీపతి యగ్రసుతుండు
సంధిసే । యన తుదిఁ గోరు మీరు తమయయ్య సగంబును భూమి యీక తక్కిన
మఱికాని ముందర లోక కీడు దలంపఁడు.........(ఉద్యో. ౨ ఆ. ౧౭౦). దండ
కము:— విద్వాంసులెల్లన్ హకారంబె కానీ నకారంబె కానీ (అశ్వ. ౮ ఆ ౨౫౬ ప).
"రమ్ము=రా=ర" అను ర శబ్దమును నిట్టిదె. చ. జననముఁ దెల్పి యేఁ బిలువ సత్యము
సుమ్మర కుంతి భాషణం । బవి.........(శాంతి. ౧ ఆ. ౩౯). "కాదు+ఆ = కాదా=
కదా = కద" అనురీతిగల "కదా - కద" శబ్దములును నిట్టివె. మ. అనుమానింపక
తోడఁబుట్టులనె కాదా తున్మి.........(        ) శా......నుయిదా...
వానికిం జింత యూ । కంతైనం గడమేనియుం గడను కాదా యంచు...(పాండు.
౮ ఆ. ౨౭౫). మ.........కూల ప్రే । సెద నా కోర్కిగదా గదారణము వచ్చెం
బెద్దకాలంబునన్ (ఉద్యో. ౨ ఆ. ౨౧౮). క. కురుసేనఁగదా గెలుచుట । కరము
భరం బద్దుమనకు.........(ఉద్యో. ౨ ఆ. ౧౯౭). ఉ.........నా । దయ్యము
నెత్తికోలు తుదిఁ దాఁకుట గాదె భుజంగభంజనా. (ఉద్యో. ౩ ఆ. ౬౭). అర్థ
విశేషే = అర్థవిశేషములయందు, అన్తే = క్రియలతుదిని నిల్చి, అన్యపి=మఱికొన్ని
శబ్దములును, శ్రుతిమనోహరాః = మహాకవి శ్రుతిహితములై ప్రయుక్తములగు
చున్నవి. ఉదా:— 'పొమ్ము = పో' అనురీతిగల 'పో' శబ్దము నిశ్చయార్థకముగాఁ
బ్రయుక్తమగుచున్నది. శా,.........లా పెట్టెఁగియుం జా వేఁడి మూర్కొందు
రిం । తే పో తమ్ముఁ గపిధ్వజప్రభులె యంధీభూతులం జేయవే (ఉద్యో.౧ ఆ 3౨౧)
"కాదు+ఆ = కాదా = కా" అనురీతిగల 'కా' అను కళాశబ్దము కదార్థకముగా
వాడఁబడుచున్నది. సీ. కేఁడుగ్గా మూకనిందితపర్వపాము గ్రి.........(వసు. 3
ఆ. ౫౫). "కా.........అవ్య - కదా.........దే - ద్రుతప్రకృతికము. ఇది
యవధారణార్థకావ్యయము మీఁద వచ్చినపుడు ఇత్యర్థకము. 'అదియును దనకమ్మ
నుజేశ్వరం డపాయంబు సేయున కాఁ దలఁచి' (భార. అర. ౨ ఆ)." (శ - ర).
సూ.రా. నిఘంటుకారులును నీయర్థమనే యనుసరించిరి. కాని యీచోటులందలి 'కా'

శబ్దము ద్రుతప్రకృతిక మనుటను నిర్వహించు ప్రయోగము లెవ్వియుఁ జూపఁబడ లేదు. కాన నిట్టిచోటులందలి 'కా' శబ్దమునైతము కదార్థక కళాశబ్దమె యనియు నిత్యర్థ మధ్యాహార్య మనియు నంగీకరించుట యుక్తమనితోఁచెడిని. "ఎంత జడుఁడైననుగానీ - కానిమ్ము ఇత్యస్మిన్నర్థే కానీశబ్దః. అవధరింపుము ఇత్యస్మిన్నర్థే. అవధారు దేవీతి - చేయుదొకో - చేయునొకో - వచ్చులేవాఁడు - తనవె పో నేరములు-తనదె కా భక్తి - ఇత్యాదౌ ఒకో ఇత్యాదిశబ్దాః అన్యశబ్దేన గ్రాహ్యాః" (అహో. ౪౯౭ పు). అని యహోబలపతి ప్రకృతసూత్రమును వివరించెను. ప్రార్థనార్థక ము వర్ణకపరకత్వమున ముందటిదీర్ఘమునకు హ్రస్వమును ముపర్ణకమునకు మామిడియు నగును. ముపర్ణకలోపమున నట్టి ము నిమిత్తక హ్రస్వాదిత్వములు పోయి యెప్పటిదీర్ఘమె నిల్చును. ఉదా:—లెమ్ము = లే. పొమ్ము = పో. తెమ్ము = తే. మొ. ఇట్టి క్రియల రూపసాధనము బాలవ్యాకరణ క్రియాపరిచ్ఛేదమున ౬౧ సూత్రమున సంగ్రహింపఁబడెను. "అవధారు - అవధరింపుము" అను శబ్దము "అనిందగ్రాహ్యము" అని బాలవ్యాకరణపటమున గ్రహింపనగును. ఇట్లాచ్ఛిక సమాపక క్రియల రూపములను వివరించి యసమాపక క్రియల వివరింప నారంభించుచున్నాఁడు.

భావే ట వర్ణకో౽న్తే । సర్వేషాంచ క్రియాపదానాం
స్యాత్. (ఆం. చిం. క్రియా. ౧౬ కారి. అహో.
౪౯౯ పు.)

టవర్ణకః క్రియాన్తే స్యాద్భావార్థే సాసమాసయోః।
పూర్వస్య న వికారో నో। స్తస్మిన్ లోపశ్చ కస్యచిత్
విభక్తిమాత్రం సర్వత్ర। మహితం స్యాట్టవర్ణకాత్
ప్రతిక్రియ మదాన్తత్వం। ప్రతీతంతు న గీయతే।
క్వచి దింప్వన్తతాం కేచి। దూచిరే నహి మే రుచిః
(వికృ. క్రియా. ౧౯-౨౦ కారి. అజం. ౯౮ కారి.
అహో. ౪౯౯ పు. ౩౭౫ పు).

నన్నయా దర్వణీయము. ౩౦౯ విషయము.

కేచిన్నాన్తాచ్చ గుర్వాదే। ర్ధ్వ్యర్థరాత్పట్టి మూచిరే
(వికృ. క్రియా. ౨౦ కారి. అహో. ౪౯౯ పుట).
వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్ (ఆం. చిం. క్రి.
౬ కా. అహో. ౪౭౩ పు).

కల్పతరు. ౩౦౯ విష:—క్రియాప్రకరణమునందు సమాపక క్రియల రూపములను సాధించుటమాత్రమె సంప్రదాయము. చేయుట మున్నగు భావార్థకాది

రూపంబులు కృదంతములు. అట్టి కృత్ప్రత్యయములు "కృదంత ప్రకరణమునందె చెప్పఁదగును. కాని నన్నయాథర్వణీయముల గృదంతపరిచ్ఛేద మనునది వేఱుగ లేదు. మఱియు నీ 'ట'వర్ణాద్యసమాపక క్రియాసాధక ప్రత్యయములు సమాపక క్రియా ప్రత్యయములవలెనె ప్రతిధాతువునకును, సాధారణముగా వచ్చున వగుటం జేసియు ననఁగాఁ దత్సమధాతువులపైని సయితము నిల్చున వగుటం జేసియు వీనియర్థమునందు ధాత్వర్థవ్యాపారస్ఫూర్తి స్పష్టముగా సమాపకక్రియలందువలెనె భాసిల్లుచుం డుటం జేసియు నీ ప్రత్యయములు నన్నయాథర్వణీయములందును బాలవ్యాకరణ మందును క్రియాప్రకరణముననె యుపదేశింపఁబడెను. బాలవ్యాకరణమున గృదంతపరిచ్ఛేదము వేఱుగ నున్నను గృత్తులు కేవల భిన్నవిషయములు. కృదంత శబ్దముల యర్థమునం దిట్లు వ్యాపారరూపార్థము సాధారణముగ స్ఫురింపమింజేసి యవి వీనికంటె విభిన్నస్వభావము గలవనుటలో విప్రతిపత్తి లేదు. ఉదా:—'చేయు+ఇ=చేయి-హస్తము' పనులు చేయునదిగాన హస్తము 'చేయి' అయ్యెను. చేయిశబ్దము నకు "హస్తము" అనునర్థము స్ఫురించునుగాని 'చేయుట' అనుదానికివలె వ్యాపా రార్థము స్ఫురింపదు. అట్లె "ఎండు+అ=ఎండ-తడివాని నెండించునది." ఎండ శబ్దమున కాతప మనునర్థము స్ఫురించునే కాని 'ఎండించుట' అను వ్యాపారము స్ఫురింపదు. కావున చేయుధాతువుపై నిల్చిన 'ఇ' ప్రత్యయము, 'ఎండు' ధాతు వుపై నిల్చిన 'అ' ప్రత్యయము మున్నగునవి కృత్తులు. 'వ్రాఁత-కోఁత' మున్నగునవి సైతము "వ్రాయుట-కోయుట" మున్నగువానివలెనె భావార్థక తజ్ప్రత్య యాంతములగుచు వ్యాపారార్థస్ఫూర్తిగలవె యగుచున్నను నట్టి తజ్ప్రత్యయ మెల్లధాతువులకును 'ట' ప్రత్యయమువలె వచ్చునది కాదు. కావున 'తజ్' ప్రత్య యము 'ట' ప్రత్యయాదికమువలె క్రియాప్రకరణమునఁ బ్రసంగింపఁబడదయ్యె. (విస్తర I). క్రియాప్రకరణమునందలి యసమాపక క్రియలెల్ల సమాపకక్రియలవలెనె వ్యాపారార్థభానము గలవె యైయుండును. సమాపకక్రియ యనఁగా వాక్యసమా

---

విస్తర I. 3౦౯ విష:—ఇట్టి భావార్థక కృదంతములు మఱికొన్నిగలవు. తే-గీ. భవ్యసంభాషణము <u>సేఁత</u>. (అను. ౧ఆ.౧౬౨) క. నకులము నులూకమును బో। కకు సంతస మంది......(శాంతి. 3 ఆ. ౨౧౧). ఉ. శత్రుల సాజి నోర్చుటయు... ......కాచుటయున్.........। పాత్రుల కర్థ <u>మీగియును</u>.........। క్షత్రియ ధర్మముల్.........(ఆర. ౧ ఆ. ౨౪౭). ఉ. కర్మఫలంబు నర్పితముగాఁ దగ నీశ్వరునందుఁ జేఁత (శాంతి. ౧ ఆ. ౧౪౯). చ. క్రమమునఁ నైన శాత్రవుల...... చావఁ జేఁత ధ। ర్మము.........సంధి సేఁత దో। షము (శాంతి. ౧ ఆ. ౧౭౪).

పిని జేయు క్రియ, అసమాపక క్రియ యనఁగా వాక్యసమాప్తి చేయఁజాలని క్రియ. ఉదా: సమాపక:— వాఁడు పాఠమును జదువుచున్నాఁడు అసమాపక:—వాఁడు పాఠమును జదువఁగా నేను వింటిని. మొ.

భావే టవర్ణక ఇత్యాది.—భావే = భావార్థమునందు, అన్తే = ధాతువు తుదిని, టవర్ణకః = ట ప్రత్యయము, సర్వేషాంచ క్రియాపదానామ్ = సమస్త ధాతువులకును, స్యాత్ = అగును. భావ మనఁగా ధాత్వర్థము. ఉదా:— రక్షించు+ట = రక్షించుట, రక్షింపించుట - రక్షించికొనుట. చదువు+ట = చదువుట. చదువుధాతువునకు "చదువుట" యని యర్థము. అథర్వణుఁ డీసూత్రమును సవరించుచున్నాఁడు. క్రియాన్తే = ధాతువు తుదని, టవర్ణకః = ట ప్రత్యయము, భావార్థే = భావార్థమందు, సాసమాసయోః = (సశ్చ+అసమాసశ్చ = సాసమాసౌ - తయోః) సమాసమందును నసమాసమం దనఁగా వ్యస్తమందును, స్యాత్ =నిల్చును. ఉదా:—అసమాస - వచ్చుట - పోవుట - మొ. సమాస. పోఁగాములు = (పోట - కామి). (చూ. ౨౦౬ పుట). ఆటపాటలు (ఆడుట = ఆట. పాడుట = పాట.) నాచేయుట (నాయొక్క+చేయుట = నేను చేయుట). ఈ టవర్ణకమును సూరి క్రియాపరిచ్ఛేదమందును (౩౪ సూ.) కృత్తులందును (౭ సూ.) వేర్వేఱుగాఁ జెప్పెను. నన్నయాథర్వణీయమునఁ గృత్ప్రకరణము వేఱుగ లేమిం జేసి యిచ్చ టనే ద్వివిధములును నుపదేశింపఁబడెను. "సాసమాసయోః.........అతఁడు వచ్చుట - మిమ్ము రక్షించుట - సమాసే సాటివచ్చుట ఇత్యాది". (అహో. ౪౯౯). అను కవిశిరోభూషణవివరణము సరిగా నుండమిం జేసి కాఁబోలుఁ గవిజనమండన కర్త ప్రకృతకారికను మార్చి "ఉవర్ణకః క్రియాన్తే స్యా ద్భావార్థే స్యాట్ట వర్ణకః.........తా... క్రియాంతమం దుకారమును భావార్థమందు టకారము నగును. ఉద:—కను - చూచు - పోషించు - ఇత్యాదులు. కనుట - చూచుట - పోషించుట - ఇత్యాదులు' (వికృ. క్రియా. ౨౦ కారి. తా.). 'కను - చూచు - పోషించు' ఇత్యాదులు కృదంతనామములనుట కేవలము పొరపాటు. అట్టి వ్రాఁత నిర్మూలము. భావార్థక కృదంతములు సమాసపూర్వావయవముగా నుండునని యీవల నుపదేశించియున్నాఁడు. (చూ. ౨౦౬ పుట). కావున దానిచొప్పునఁ బ్రకృతసూత్రమునకు "పోఁగాములు. (పోఁటయు+కామియు) వచ్చురాములు (వచ్చుటయు+రామియు)" మున్నగునవి యుదాహృతులు.

పూర్వస్యేతస్మిన్:— తస్మిన్ = ఆటవర్ణకము పరమయియుండఁగా, పూర్వస్య నోః = పూర్వస్థితమగు 'ను'వర్ణకమునకు, వికారః = అనుస్వార రూపవికారము,

[బా. క్రి. 38 మొ. 32-౧౨౨ సూ.] అంట-మొ. నన్నయాథర్వణసమ్మతములుకావు.

న = సాధువు కాదు కస్యచిత్ = ఒకానొకవర్ణకమునకు (ము - మున్నగువానికి) లోపశ్చ = లోపమున్నైతము కల్గును. ఉదా:—'అనుట - వినుట కనుట' (ఇట్టి మొదల 'అంట - వింట - కంట' ఇత్యాదిరూపములు నన్నయాదుల్యముక్తములు కామిం జేసి తనకును సమ్మతములు కావని భావము. పూర్వోక్తలోపమునకు:—ఆడుట = ఆట. పాడుట = పాట. మండుట = మంట. పండుట = పంట. తేలుట = తేట. ఊటుట = ఊట. ఉండుట = ఉంట. మొ. (బా. క్రియాత 2 సూ). ఆ-వె... ......ఇ। ప్పాటకక్కు గుటిచి పాడితేటంగు। తేట వడంగ మాట లాట దా నేల విరా। రెక్కుం డరదముల మహీంశులాక (శల్య. ౨ ఆ. 3౨3 ప). (మాటలు+ ఆట = ఆమట). ఉ. బంటుతనంబు మాటలకు.........అక్కడ రా। కుంట యొఱుంగవే మును సుయోధను.........(ఉద్యో. 3 ఆ. 85). ఉ. మంట నుం బోని శాత్రవ..........యా। వంటవాని చేసిన.........(విరా. 3 ఆ. ౨౨౯). అథర్వణ సమకాలికకవులు 'అంట - వింట - తింట' మున్నగువానిని ప్రయోగించి యుండ నన్నయ ప్రయోగింపమింజేసి యథర్వణుం డట్టిరూపములను నిరసించెనో? అట్టివానిని ప్రయోగించిన తిక్కనాదుల కథర్వణుం డించుకపూర్వుం డగుటనో? కాని తిక్కనాదులు 'అంట - వింట' ప్రభృతులను బాహుళకముగాం బ్రయోగించియున్నారు. "పూర్వస్య న వికారో నో రిత్యనేన "అంట-వింట-కంట' ఇత్యాది ప్రయోగస్య భావార్థే న సాధుత్వమ్. కింతు అనుట' ఇత్యాదిరేవ - ఏతేన "మధు కైటభారాతి మఱది వమ్మని పిల్చి। పనిగొంట నీకుం బ్రాభవముగాదె" ఇత్యాది వచనస్య ప్రామాదికత్వ మేవే త్యవధేయమ్." (అహో. ౪౯౯ పు) నన్నయాథర్వణు లువేక్షించినను (విస్తర. II) నీక్రిందిరీతిని గేకన తిక్కనాదు లాదరించిన 'ను'వర్ణాను

విస్తర. II 3౯ విమ:—'ఉంట - అంట - వింట' మున్నగురీతిప్రయోగ ములు నన్నయభారతభాగమున నెంతమాత్రమును లేవు. అథర్వణునినాంటి కట్టి రూపములు బయల్వెడలినను నాతండు తనకును నట్టిరూపములు సమ్మతములుకామిం జేసి "పూర్వస్య న వికారో నోః........." అని వానిని నిరసించియుండును. తర్వాత నట్టిరూపములు ధారాళముగాం గవులచేం బ్రయోగింపంబడినవి. నన్నయా థర్వణు లంగీకరింపని యెన్నెన్నో ప్రయోగములు తిక్కనాదులచే నంగీకృతము లయి ప్రయోగింపంబడుటయు నవి సాధువులుగా నంగీకరింపంబడుచుండుటయుం గొత్తవిషయము కాదు. (చూ. విస్తర. I ౬3 I విమ). ఇంతమాత్రమునం దిక్క నాదులప్రయోగములను జూపి శరణ్యకర్త యేదో గొప్పఛిద్రము దొరకినట్లు ప్రగ ల్భించి యీక్రిందిరీతి నథర్వణుని నిరసించుట యుక్తము కాదు. "ఏమంటినట్లు అథ

స్వార వికారమును నవ్యుఁడగు నహోబలపతి యసాధువనుట సరికాదు. (వి_స్తర. III).
క. తినుటకును దింట యగు మఱిఁ । గొనుటకుఁ గొంట యగుఁ గనుటకుం గంట యగున్ । వినుటకు వింట యగుం దా । ననుటకు నంటయగు వలసినప్పుడు గృతులన్ (ఆం. భూ. ౧౫౪ ప). ప్రయోగములు:—ఉ......పాండునృపాలు పాలుఁ గై । కొంటయ చాలు నన్న నృపకుంజరుమాటకు నడ్డమాడ రా । కుంట యెఱుంగవే .........(ఉద్యో. 3 ఆ. ౫౯ ప). కం. కంటకలను పొలికల నిది । గంట నిధా నంబు గంటకాదే మనకున్ (భీష్మ. ౧ ఆ. ౯౯) ఉ. మిత్త్రుల చెద్దఁలన్ సుఖము మేకొను నంటయుఁ జెందు దుఃఖముల్ । శత్త్రులచెద్దు నంటయును......(శాంతి. ౧ ఆ. ౨౦౭). (శల్య. ౨ ఆ. ౧౧౫). (అను. ౧ ఆ. ౨౮-౨౨3. అను. ౫ ఆ. ౬). మొ.

విభక్తిమాత్ర మిత్యాది:—సర్వత్ర = అంతటను టవర్ణకాత్ = ఈ 'ట' ప్రత్యయమునకుఁ బరముగ, విభక్తిమాత్రమ్ = ప్రథమాదివిభక్తులు నిల్పుట మాత్రమే, మహితమ్ = సాధువైనది, స్యాత్ = అగును. ఉదా:—చదువుట చేతన్ - చదువుటకొఱకున్ - చదువుటకంటెన్ - మొ. ఇట్లుచెప్పుటచేత నీక్రిందిరీతి గల టవర్ణకలోప విధానప్రక్రియ గ్రాహ్యము కాదనియు "చేయుకంటె" మున్నగు ర్వాణాచార్యులంతవారు చెప్పినకారిక ?" (బాలక. ౫౭ పు). "అథర్వణుని అప్రమాదిత్వము ఎట్టిదో తెలిసినదికదా." (బాలక. ౬౧ పుట).

"అథర్వణుఁడు కేతనలక్షణము తప్పని ఎందుకుచెప్పినాడు ? అంటే, ఆతఁడు తిక్కనకు పూర్వుడు అని కొందఱు చెప్పవచ్చినారు" (బాలక. ౫౯ పుట) అని యిట్లు వ్రాసి యథర్వణుఁ డాధునికుఁ డనుటకుఁ గొన్ని హేత్వాభాసములను శరణ్యకర్త గారు చూపిరిగాని తుదికి "పోనీ తిక్కనకు పూర్వుఁడే అయినా అథర్వణుని...... ...అథర్వణుఁడు ఎప్పటివాఁడో తెలియకపోయినా ?" (బాలక. ౫౯ పు). అని యిట్లు తుదకట్టి వాదమునుండి మరలిరిగావున నిటఁ దద్విషయమును విస్తర భీతి నుపేక్షించితిని.

విస్తర. III 3౦౯ విష:—త్రిలింగలక్షణశేషమునందు భావార్థక ప్రత్యయ విశేషములు కొన్ని వివరింపఁబడెను. ఆ. వె. పొగడికోలుఁ బ్రచ్చికోలు (సభా. ౨ ఆ. ౪౯). ఉ.........విల్చికోలు (సభా. ౨ అ. ౧౮౧). "౧3. భావంబునం దనుప్రయుక్తంబగు కొనుసకుం గోలు విభాషనగు. ఉదా:—ఇచ్చుకోలు = ఇచ్చు కొనుట.........(ప్రౌఢ. క్రియా)." క. నరు నప్పటి యెత్తికోలునకు (విరా. ౫ ఆ. ౬౪). చ.........ఎ । క్కటి దివి చూఱకోల్ ప్రియము కాకిది యప్రియమే తలంపఁగా (ద్రోణ. ౨ ఆ. ౨౫౭).

బా. క్రి. 3౯ వెం. 3౬ ౧౨౨ పూ.] అహోబలపతి భాస్కరాదుల నిరసింపరాదు.

రూపములు మార్గాంతరమున సమర్థింప నగునని యూ నెఱుంగునది. "కొఱకు-కంటె లు పరంబులగునపుడు భావార్థక టవర్ణకంబునకు లోపంబు విభాషనగు. ఉదా:—క. దాని జూపుకొఱకునె కాదే। యీ మయ్యుఁ బట్టి తెచ్చుట (కళా. 3 ఆ). తే. భూమి పాలించుకొఱకునై పుట్టిరాఁడ (వి. పు. ౧ ఆ). క. పతి కలుగుకంటె సౌఖ్యము। సతులకు నొండొకటి కలదె.........(విక్ర. ౬ ఆ). క. ఏపగిదిని బ్రతుకరాదె యిటు చెడుకంటెన్ (హరి. పూ. ౫ ఆ. ౨౨౦)............వెం. పక్షంబున చూపుటకొఱకు - కలుగుటకంటె - పట్టుటపాంటె - వెం." (ప్రౌఢ. క్రియా. ౧౪ సూ). ఈ ప్రౌఢవ్యాకరణసూత్ర మీక్రింది కవిశిరోభూషణమును బట్టి యవతరించి యుండును. "సర్వత్ర టవర్ణ కాదేవ విభక్తయః". ఏవంస్థితే. 'సుతులఁ గనియెడుకొఱకు (భాస్క. బాల. కాం. ౪౧). నీవు ఘటించుకంటె, ఇత్యాదీనాం భాస్కర తిక్కయజ్వాది కవివచనానాం కిం మూల మితి వయం న విద్మః". (అహో. ౫౦౦ పు). ఈ యహోబలపండ్తులు కేవలము ప్రమాదికములు - పఱి భాస్కర తిక్కయజ్వాది కవి ప్రయోగముల కీక్రింది భట్టారక ప్రయోగములె మూలము. క.........। కరుణను శరణాగతులకు। పురుషుల రక్షించుకంటెఁ బుణ్యము గలదే. (ఆది. ౮ ఆ. ౨౯౧ ప). తే.........। ఎలుకచేఁ జచ్చుకంటె నీజ్వాలన శిఖలఁ। గ్రాఁగి పుణ్యలోకంబులఁ గాంతు మేము (ఆది. ౮ ఆ. 3౦౮ ప). ఇట్టి భట్టారక ప్రయోగముల మూలముగాఁ గొనియే సోమయాజి యిట్టిరూపముల నీక్రిందిరీతిని ధారాళముగఁ బ్రయోగించెను. చ.........అంబుజనాభునిఁ బ్రీతుఁ జేయుకంటె। హితమైన కృత్య మొకటిం గలదే (ఉద్యో 3 ఆ. ౧౫౮). ఆ. వె. పాండవులకుఁ దగిన పాలు మేదినిఁ బంచి। యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు (ఉద్యో. 3 ఆ. ౨౭౫). కం......। చేరం జనుకంటె నొప్పు చెప్పం గలదే (ద్రోణ. ౧ ఆ. 3౬). ఆ-వె. సత్యరక్షణంబు సలుపుపాంటె (కర్ణ. 3 ఆ. ౭౪). సీ......। ఆ. వె.........అధర్మంబునఁ। జంపుకంటె... .....(శాంతి. ౨ ఆ. ౪౨౦). కం... ......సం। జాత మనోదుఃఖభారసహాయుఁ డగుకంటెన్ (శాంతి. 3 ఆ. ౪౬౪). ఇట్లయిన నింక "విభక్తిమాత్రం సర్వత్ర। మహితం స్యాట్టవర్ణ కాత్తను నథర్వణ కారిక విరోధింపదా యని శంకింపరాదు. భావార్థక టవర్ణకలోపము ప్రామాణిక సమ్మతము కాదు. "రక్షించుకంటె" మున్నగుచోటులందెల్ల 'రక్షించుదానికంటె' మున్నగువానిలోని తచ్ఛబ్దము "తచ్ఛబ్దస్య లోపః స్యాత్" త్తను నథర్వణసూత్రముచే లోపించుచున్నదని సమర్థించుకొననగును. (౨౧౧ VIII విమ). ప్రౌఢవ్యాకర్త దదనుయాయి నారాయణీ యాంధ్రవ్యాకరణకర్త మున్నగువా రిట్లు టకారలో

స్ఫూర్తి భావార్థ 'డు' ప్రత్యయములను దలుచుగా నిల్పుచువచ్చెను. చ. వడిఁ ద్రిద శాలినోర్చుడాక వారిరి బీరము.........(నన్నె. కు. ౧౦ ఆ. ౫౧౬). “ఓర్చుటాక వారిరిబీరము” అన్నను క్షతి లేదుగదా.

సుశబ్దయోగమునం దానంతర్యాద్యర్థ విశేషములు దోఁచుట నిత్యము కాదు. చ. కటుగతి నాశిని ప్రవరు బాహువు దోమఁ బీడితంబు సే। యుటయును గాక త్రుంచె ధను వుగ్రకృపాణము వైచి... .....(ద్రోణ. ౪ ఆ. ౩౮).

ప్రతిక్రియమిత్యాది:—ప్రతిక్రియమ్ = సర్వధాతు సాధారణముగా, అడాన్తత్వమ్ = అడప్రత్యయాంతత్వము భావార్థమున వినఁబడుచున్నది (వ్యవహారమున) గాని, ప్రతీతఁతు = కవిప్రయోగములందట్లు ప్రసిద్ధముగా నసఁగాఁ దలుచుగా, నగీయతే = వచింపఁబడ లేదు. అలంతిధాతువులుమాత్రమే కవిప్రయోగములందు 'అడ' ప్రత్యయాంతభావార్థకములు గన్పట్టుచున్నవని తాత్పర్యము. అడ ప్రత్యయాంతము నపుంసకము. ట ప్రత్యయాంతము - డు ప్రత్యయాంతమును స్త్రీలింగసమములు - ట ప్రత్యయసమాన న్యాయమున నివి తత్సమధాతువుల పయిని నైతము నిలుచును. ఉదా:—రక్షించడము - పోషించడము - రక్షింపు - బోధింపు. మొ. కేరుట - కేరుడు - కేరడము. మొ. క్వచిత్ = ఒకానొకప్పుడు, ఇంప్వన్తామ్ = భావార్థకమగు 'ఇంపు' ప్రత్యయాంతమును - కేచిత్ = కొందఱు, ఊచిరే = వచించిరి - మే = నాకు, రుచిః, నహి = అది రుచింపకున్నది. ఉదా:—రాణింపు - రక్షింపు - ఆరగింపు - మొ. అడ ప్రత్యయాంతములు సమతము ప్రయోగార్హములు గావనియె కవిశిరోభూషణమున వ్రాయఁబడెను “అందడము - పొందడము - విడువడము - నిలువడము - పిలువడము ఇత్యాదయోఽడాన్తాః శబ్దాః ప్రతీయన్తే సర్వత్ర. తథాపి తత్ర గానం నసంభవతి- తేషాం గ్రామ్యత్వాన్న ప్రయోగార్హతే త్యర్థః.........” (అహో. ౩౭౫). అహోబలపతి యిట్లుగ 'అడ' ప్రత్యయాంతములనెల్ల నిరాకరించుట సరికాదు. అడ ప్రత్యయాంతములు కొన్నిటికిఁ గవిప్రయోగములు గలవు. కవిప్రయుక్తముల సాధుత్వము నిర్వివాద మనక తీరదు గదా! ఆ-వె. అనిన బాహ్లికాదులగు కురువృద్ధుల। నాత్మజనకుఁ గృష్ణు నాదరింప। కతఁడు రాజసమున నప్పుడు దిగ్గన। లేచి పోయె సంచలించెఁ గొలువు. తే-గీ. అతని వెనుకన కర్ణుండు ననుజగణము। శకునియును వారి పొందైన జనపతులును। బోయి రమ్మెయిఁ జని యొక్క ప్రోవు గట్టి। వేఱ యంతంత నుండిరి గోఁజడమున (ఉద్యో.౩. ఆ. ౩౭౩-౩౭౪ ప.)(గోఁజడము=ప్రాతికూల్యము). “గోఁజడము. వి. ౧ క్రోధము. కోపము. ౨ క్రౌర్యము. ౩ ప్రతికూలవచనము” (సూ. రా. ని). ఈ

కోశమున 'కోటు' ధాతువు పేర్కొనఁబడలేదు. ఈ భారతపద్యము కోశద్వయము నందును జూపఁబడలేదు. పరిశీలింపఁగా "కోటు = ప్రతిఘటించు" అను ధాతువు నంగీకరింపవలయునని తోఁచుచున్నది. క్రోడాడు ధాతుపర్యాయ మనుచుఁ గోరాడు ధాతువు గోశద్వయమునందును జూపఁబడియున్నది. అందలి రేఫమును (లఘువు) నిర్ణయించు ప్రామాణిక ప్రయోగము కన్పట్టదు. "కోటాడు" ధాతువు నంగీకరించుటే యుక్తమని తోఁచెడిని. దంష్ట్రాగ్ర 'కోట' శబ్దము సర్వసమ్మతమే కదా. క. ఈపడములుఁ గోఁటడములు । గాసఁబిరలు పైన కట్టి డిపల్కుల్ (కావ్యాలం. ౬ ఉల్లా. ౨౧). ఉ. నావుడు నవ్వుటాలకు నిదం బవనాత్మజ యింత యేటికిన్ । గేవల యోధ వే పదుల కిల్బిషముల్ దలపోయ కిమ్మెయిం । జావడ మెన్నఁ జూచి యిది చందము గాదని యంటి గాక...... (ఉద్యో. 3 ఆ. ౬౧ ప.). (చావడము = చచ్చుట = నిస్తేజమగుట) వ్యవహారమున నిది చచ్చుటకుఁ బర్యాయమై ధారాళముగా వాడఁబడుచున్నది. కాని, శబ్దరత్నాకరమునందును సూ. రా. నిఘంటువునందును నీశబ్దము చూపఁబడలేదు. అవుధాతువునుండి 'కావుట' అని యేర్పడినట్లు చచ్చుధాతువు నుండి 'చావడము' అని యేర్పడుటలో విరోధము కన్పట్టదు. చ. . సిద్ధము కావు లెఱింగి........ (ఆది. ౧ ఆ. ౧3౮). చావటము - రావటము - పోవటము మున్నగురీతిని సర్వధాతు సాధారణముగ గోదావర్యాది మండలములందును, చావడము - రావడము - పోవడము మున్నగురీతిని సర్వధాతు సాధారణముగా విశాఖపట్టణాది మండలములందును నాగరక జనవ్యావహారికభాషలోఁ బ్రయోగములు గన్పట్టుచున్నవి.

"కేరడము - వి (√కేర) .......పరిహాసము.. .. గీ. తప్పు గల భర్త మ్రోల సోత్ప్రాసఫణితి । కేరడము లాడు సతి మధ్యధీర. .... (నర. ౨ ఆ.౭౭) ......సీ.........। అద్దేవు మనుమని నద్దిరా యెటుమాటు, ననక కేరడ మెన్నఁ డలవరించె (ఉ. హరి. ౫ ఆ ౨౮౨).........సీ.........గీ. ముప్పురను గేరడము సేయ నవ్విధంబు । సైఁపలేక.........(హరి. పూ.౧ ఆ. ౧౭౭ ప)." (సూ. రా. ని). సీ.........వెలుచదనంబులు ప్రేలడములు । ......... । కేరడంబులు పాళగింపులు కిల్బిషక్రీడనంబులు నడకించువగలు । .........తే-గీ.........ఇవి యాదియైన । దుర్గుణంబుల ప్రోవులు......। వారకాంతలఁ దడవిన వచ్చుఁ గీడు (పాండు. 3 ఆ. ౭3 ప). 'కేరడము - ప్రేలడము' అను నడప్రత్యయాంతములే కాక "పాళగింపులు" (= ఒడలు చాచుటలు) అను నింప్వంతమును బ్రయుక్తమయ్యెను. (పాళగింపుశబ్దమును దానికి మూల మనఁదగు 'పాళగించు' ధాతువును

శబ్దరత్నాకరమున లేవు. "సీ. తమ కేచూపులు నెలత్రావడంబులఁ బ్రోచు (నెలత్రావడము = వెన్నెలపుల్గు = చకోరము) (హ. వ. ౪ ఆ. ౪౩). 'మోర త్రిప్పడమ్ము లలరఁ గేళి కరుగుదెంచి' (పార్వతీ. ౫ ఆ)." అని గాణపత్యవివరణమునఁ జూపఁబడెను గాని, సూ. రా. నిఘంటువున "త్రిప్పటము" అను రూప మంగీకరింపఁబడెను. "త్రిప్పడము" అనునది చూపఁబడలేదు. పై పాఠ్యోదాహరణపద్యము 'డ' కారమును నిర్వహింపఁజాలదు. ఇక్కృతములు కేవల ప్రాచీనగ్రంథములం దగపడవు. "ఆరగింపు = ఆరగింత - వి. (∠ ఆరగించు) భోజనము.........గీ. వైష్ణవ సహస్రమునకు సద్భక్తి నారగింపు సేయించి కాని భుజింప నొల్లఁ। డా.. .. ...(పర. ౪ ఆ. ౧౯౯)." (సూ. రా. ని). "అడ్డగింపు - వి. (∠ అడ్డగించు) అడ్డాట. సీ. అడ్డగింపులకు లోనైరి మిత్రులు...... (ఉ. రా. ౧ ఆ. ౨౩౫). తాటింపు - వి. (∠ తాటించు).........సీ. కలికి కాంపిల్య దాకటి తాటింపు పులకనులు చేరనిరాతి కుముదహితుఁడు (పి. శకుం. ౧ ఆ. ౧౯). (కనులు = కందు)." (సూ. రా. ని).

కేచిన్నాన్తాచ్చేత్యః:-౧౩౫ III విషయమునందును విస్తర. అర్థం విషయమునందును నీకారిక వివరింపఁబడెను. 'కేచిన్నాన్తాచ్చ. గుర్వ్యాదేర్ద్వ్యక్షరాత్పట్టి మూచిరే' అని యీకారిక రెండు సూత్రములుగా పఠింపఁబడెను. కేచిత్=కొందఱు, నాన్తాచ్చ =వలయ్యాదిపరక నజ్యన్తమునుండియు భావార్థము దోఁచునని తలంతురు. గుర్వ్యాదేః-ద్వ్యక్షరాత్ =గుర్వక్షర మాదినిగల ద్వ్యక్షరాత్ = రెండక్షరములుగలయట్టి నాన్తాత్ =నజ్యంతమునకుఁ బరముగ, పట్టిమ్='పట్టి'అను పంచమీవిభక్తి ప్రత్యయమును మాత్రము, ఊచిరే=సెల్లువానినిఁగా వచించిరి. 'వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యా' త్తను సూత్రముచొప్పున (౭౧౩ పుట) నాదిశబ్దమహిమచే భావార్థమున 'అత్త్వము' రాఁగా 'లజ్జధ్య........అజ్యే ద్రుత ప్రకృతయః' అను చొప్పున నయ్యది ద్రుత ప్రకృతిక మగుటచే నది నాంతక్రియ యగుచున్నది. చేయు+వలయును=చేయు+అ+న్+వలయు = చేయవలయున్ = చేయుట వలయునని యర్థము. భావార్థకముగుటచే 'చేయుట' మున్నగువానివలెనే యిదియును ('చేయ' అనునదియు) ప్రాతిపదికమనియు సందర్భయోగ్య సుబ్విభక్తి నందునుగాన 'చేయవలయున్' అనుచోటి 'చేయన్' అనునది ప్రథమాంతమనియుఁ దలంపరాదు. అట్లైనచో 'పట్టి' విభక్తికిఁ బ్రత్యేకముగా విధింపవలసిన ప్రసక్తి యుండదుగదా. కాన 'గుర్వాదేర్ద్వ్యక్షరాత్పట్టి మూచిరె' అను 'పట్టి' విధాయక సూత్రసామర్థ్యమున నీనాంతక్రియ పట్టితరవిభక్తి యోగయోగ్యముగాక నిపాతరూపమైయుండుననియుఁ గేవలపదత్వసిద్ధికయి దనిపైని స్త్రీసమత్వాంగీకారమున సుప్రత్యయముఁ జేర్చి లోపించుననియు

నంతమాత్రమున దానికిఁ బ్రథమాంతత్వసిద్ధియును క్త్వాత్వము కల్గనేరదనియు గ్రహింపవలయును (చూ. ౪౨ I విష. ౧౯౯ I విష). వలయున్ - కూడున్ - తగున్ - అగున్ - కూడదు - తగదు - మున్నగునవి వలయ్యాదులు. ఈ నాంత క్రియలు పట్టివానితో సన్నిహితములు. ద్వ్యర్థకములు గుణార్థకాదికములు నగు నీనాంతములమీఁద 'పట్టి' విధిమాత్రము కవిప్రయోగము లుండుటచే నది (పట్టి) నిల్చునని యెఱుఁగునది. ఉదా:— చేయన్+పట్టి = చేయఁబట్టి = చేయుటం బట్టి యని యర్థము. ప్రాచీన కవిప్రయోగములనుబట్టి ద్వ్యర్థకక్రియలకు మాత్రమే యని వచింపఁబడెనుగాని త్వర్థకరాది ధాతువుల భావార్థకనాంతముల మీఁదఁ బట్టి నిల్చుటయుఁ గాలక్రమమునఁ బ్రయుక్తమగుచువచ్చెను. ఉదా: విడువఁబట్టి చదువబట్టి - మొ. వలయ్యాదియోగమునకుఁ బ్రయోగములు:— క. లోకో చ్ఛేదముఁ గర్మ । వ్యాకులతయుఁ గాక యుండవలయుటకై సు । శ్లోకా........ (శాంతి. ౬ ఆ. ౨౭౮) ఆ.వె. అట్టి నీదుబుద్ధి యతిశోకముకంటయుఁ । దెలిసికొనఁగ సాకు వలయునట్టి । ధర్మకోటి నీవ తగఁ జెప్ప వినవలె । యుటయుఁ జెప్పె నంబుజోదరుండు (శాంతి. ౨ ఆ. ౧౬౧). పట్టి:— మ. గతవిద్వేషుఁడు ధర్మనందనుఁడు గల్గంబట్టి యిప్పాటదు । గ్గతికిం దప్పితి (ఆర. ౬ ఆ. ౬౧). తే.గీ. ఈవు గల్గంగఁబట్టి గా కిందువదన (కాశీ. ౩ ఆ. ౪౪). (విస్తర. ౨౫౦ విష).

టవర్ణకంబు భావంబునం దగు. ౩౫.

భావంబనఁగా ధాత్వర్థంబు. వండుట - పండుట - విరుట - కనుట.

కజేవర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునం దగు. ౩౬.

వండకమునుపు = వండుటకుమునుపు = చేయకమునుపు = చేయుటకుమునుపు - ముందు - మున్ను - తొల్లి.

బాలవ్యాకరణ వివరణము

వలయ్యాదిక్రియలకుం గర్తకగు భావంబునందు నుజేయగు. ౧౨౨.

౩౦౯ I విషయము.

వలయ్యాదిక్రియలకుం గర్తృభూతక్రియావృత్తి యగు ధాతువునకు నుజేవర్ణకంబగు. వాఁడు చూడవలయు - వారలు చూడఁగావలయు - నీవు చూడవలయు - మీరు చూడవలయు - నేను జూడవలయు - మేము చూడవలయు - ఘనము చూడవలయు.

వలయును - వలదు - కూడును - కూడదు - చెల్లును -
చెల్లదు - తగును - తగదు - ఇత్యాదులు వలయ్యాదులు.

సంజీవని. 3౦౯ I విష:—"భావ-పుం-.........భూ ఘఞ్-సాధ్యరూపే సిద్ధరూపే వా క్రియారూపే ధాతో రర్థే........." (శబ్దర్త్న) అనుచొప్పున స్వత స్సిద్ధఫలకమగునట్టికాని, ఫలమును సాధించునట్టికాని వ్యాపారము భావ మనిపించుకొనును. సిద్ధరూపవ్యాపారమునకు:—వర్షము కురిసెను. సాధ్యరూప:—దేవదత్తుఁడు వంటకమును వండెను. కురిసెను = కురియుట సంభవించెను - వండెను = వంటయను వ్యాపారమును జేసెను. ఇట్టి వ్యాపారము స్వరూపముగాఁగల ధాత్వర్థము ట ప్రత్యయముచే ద్యోత్యమగునని యర్థము.

"భావశబ్దము ణిజంతంబైన భూధాతువుకంటె...... ..అచ్ ప్రత్యయము రాఁగా నిష్పన్నమైనది.........కాఁబట్టి ప్రేరణార్థక ణిజంతంబైన భావశబ్దంబునకు 'కావించుట' అని యర్థంబగును.........'కావించుట చేయుట' అనునవి పర్యాయ పదంబులు...... ..ఉదా:—వండుట వంటచేయుట. 'నడచుట' అనఁగా నుత్తర దేశసంయోగమును జేయుట.......... ఫలంబులు భిన్నంబులై యుండునుగాని వ్యాపారంబుమాత్రము సర్వధాతువులకు సామాన్యార్థంబె యగును." (బా. గు. ప్ర. 3౨౭-3౨౮ పు. ద్వి. ముద్ర). ఈవ్రాఁతయెల్ల సాధ్యరూపవ్యాపారమున సందర్భపడునేకాని "వర్షము కురిసెను - చీఁకటి క్రమ్మెను" మున్నగు సిద్ధరూప వ్యాపారస్థలములందు సందర్భపడనేరదు. పేటికావ్యాఖ్యాత బా. గు. ప్ర. వ్యాఖ్యావిషయముల నెక్కించుటలో "పండుట యనఁ బండఁజేయుట, యని యు-వినుట యన వినునట్లొనర్చుట యనియు నర్థము లూహించునది" (బా. సా. పే. ౧౦౫ పుట). అని యిట్లు 'పండుట - వినుట' అనువానికిఁ బ్రేరణార్థములను బ్రామాదికముగ వ్యాఖ్యానించెను. ఇట్టి పొరపాటు గుప్తార్థప్రకాశికాకర్త చేయలేదు. పండుటయనఁగా ఫలించుట యర్థముగాని "పండఁజేయుట" కాదు. 'వినుట'యనఁగా నాలకించుట యర్థముగాని వినునట్లుచేయుట కాదు.

3౬ సూ. వ్యాఖ్య:—ముందు - మున్ను - మునుపు - తొల్లి - మున్నగునవి పురార్థకములని సూరియె వివరించెను. అట్టివానితో నన్వయము కల్గునపుడు భావార్థమునందు ధాతువునకు "కజీ" వర్ణకంబు విభాష నగునని యర్థము 'కజీ' వర్ణకము జిత్తుగాన ధాతువుతుది 'ఉత్తు'నకు 'అత్త్వము'కల్గును (బా. క్రి. ౨౦ సూ). వండు+అ+క = వండకమునుపు = వండుటకు ముందనియర్థము. భావార్థకము

షష్ఠ్యంతమయినయే పురార్థకములతో నన్వయించుట సంభవించును. కాన "వండక మునుపు" అనుదానిలోని 'వండక' శబ్దమునకు "వండుటకు" అనియే యర్థము. వేటికా వ్యాఖ్యాత "వంటచేయుటకుముందు వంటచేయకుండుటయె యుండెడిఁగాన పురార్థకముల యోగమున వ్యతిరేకరూపప్రయోగమె తోఁచుట సహజము. వండకమునుపు" (బా. సా. వే. ౪౦౫-౪౦౬ పుటలు). అని యిట్లు కేవలము పొరపాటుగా వ్రాసెను. 'వండక మునుపు' అనువానిలోని 'వండక' శబ్దము భావార్థకమె కాని వ్యతిరేకార్థకము కాదు. ఈ సూత్రమునందలి 'కజీ' భావార్థమున విధింపఁబడెనే కాని భావవ్యతిరేకమున విధింపఁబడలేదు. పురార్థకశబ్దముతో నన్వయించినపిదప వ్యతిరేకార్థ స్ఫూర్తి గల్గిన గల్గనగును గాని పురార్థకశబ్దము వేఱ నిల్పియుండఁగా ధాత్వర్థమునకు వ్యతిరేకార్థస్ఫూర్తి యెట్లు కల్గును? వేటికా వ్యాఖ్యాత వ్రాసిన పై రీతిగల వ్రాఁత ప్రామాదికము. మఱియు నీ పురార్థకయోగ ప్రయోగములందలి 'కజీ' ని భావార్థకముగాఁ బ్రత్యేకించి సూరివిధించుట సరికాదనియు నట్టిప్రయోగములు మార్గాంతరమున సమర్థించుట యనఁగా నట్టి ప్రయోగముల లోని 'కజీ'ని వ్యతిరేకక్త్వార్థక 'కజీ' గానె యంగీకరించి యయ్యది 'ఉండు' అను నధ్యాహార్య ధాతుజవిశేషణముతో నన్వయించునట్లు సమన్వయించికొని సమర్థించుట యుక్తమనియుఁ దోఁచెడిని. ఇట్టి యభిప్రాయము కలవాఁడగుటచేతనే కావలయు నథర్వణాచార్యుఁడు వేఱుగ దీని నుపదేశింపఁడయ్యె. అథర్వణాచార్యుఁడే కాక ప్రాచీనులెవ్వరును నిట్లు సూత్రపద్ధతి నుపదేశింపలేదు. నాతలంచిన రీతిని 'ఉండు' ధాతుజవిశేషణాదికము నధ్యాహారము చేయుటయె (వ్యతిరేకక్త్వార్థమున కిట్టిరీతినె సమానకర్తృకత్వము కుదురును. ౩౧౧-౩౧౨ విష.) కవిసమ్మతమని యీ క్రింది సోమయాజి ప్రభృతుల ప్రయోగములు నిర్ణయింపఁజాలియున్నవి.

చ. తునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్త్రుఁడు గ్రుంకకుండు ము । న్న నరవరేణ్య.........(ద్రో. ౨ ఆ. ౨౮౧). ఉ. పొన్నలు పూచెఁ బొన్నలొగిఁ బూవకముందఱఁ బూచె గోఁగు లా । పొన్నలుఁ గొండగోఁగులును బూవకముందఱఁ బూచె బూరువుల్ । పొన్నలు గొండగోఁగులును బూరువులున్ మొగిఁ బూవకుండఁగా । మున్న వనంబునం గలయ మోదుఁగు లొప్పుగఁ బూచె సామనిన్. (నన్ని. కు. ౪ ఆ. ౪౪౭ ప). మహాకవు లీరీతిగా 'ఉండు' ధాతుజవిశేషణాదికమును వీడియుఁ బ్రయోగించుటచేఁ గావలయుఁ దర్వాతి మహాకవు లెల్ల నట్లె ప్రయోగింపసాగిరి. అట్లు 'ఉండు' ధాతుజవిశేషణాదికము నధ్యాహార్యముగాఁ దలఁచి కవులు దానిఁ బ్రయోగింపలేవని గ్రహింపక సూరి యీ భావార్థక 'కజీ' వర్ణకమును

సూత్రించెనని తోఁచుచున్నది. 'ఉండు' శబ్దమును వీడిన ప్రయోగములు:—
తే.గీ. వారు గానక మున్దఱ తేరు దోలు। కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి
(విరా. ౪ ఆ. ౬౪). ద్వి. పుట్టక యట మున్న పుట్టె మచ్చింత (బసవ. ౧ ఆ. ౧౯౭).
సీ. పాడిదగ్గు కంఠంబు పొరిపుచ్చకయ మున్న తల ప్రకంపంబు పొందకయ మున్న।
బొమలు కన్నులమీఁదఁ బొదవి వ్రాలకమున్న పొర నేత్రముల కడ్డు చొరకమున్న।
శ్రుతిపుటంబుల శక్తి సుంగి పోవకమున్న పళ్లు లాననమునఁ బాయకయ మున్న। హృద
యంబులోఁ జేగ పదను దప్పకమున్న గాత్రంబు శిథిలంబు గాకమున్న। గీ. పండ్లు
వేర్వాసి కదలు చూపకయ మున్న। కాకిఁ దకంటిపైఁ జూపు రాకమున్న। కాలు
సేయాడు తఱియంద కదలవలయుఁ। దీర్ఘసేవకు దేహ మస్థిరము గాన (కాశీ. ౩ ఆ.
౭౪ ప). ఉ. కూఁకటి వేణితోఁ గురులు గూడకమున్న కుచప్రరోహముల్। పోఁకల
తోడి సామ్యమును బొందకమున్న నితంబ సీవులున్। ప్రేంకదనంబు కొంత ప్రభవింపక
మున్న ప్రసూనబాణుఁడ। ట్టాఁకలఁ బెట్టఁ దానలవసామెత బాలికకై పిటాలికన్
(కళా. ౧ ఆ. ౨౬౫). ఉ.........ఇనుండు పశ్చిమాం। భోనిధిలోనఁ గ్రుంగ
కయ మున్న రయంబున హవ్యవాహనా (మనుచ. ౨ ఆ. ౭౬).

౧౨౨ సూ. వ్యాఖ్య:—(౨౬౩ I వివ. మూడు.) బా. క్రియా. ౪౧ సూత్ర
మున నుపదేశింపఁబడు 'నజ' తుమర్థక మగుటం జేసి యట్టి తాదర్థ్యార్థక నజ్యంతము
వలయ్వాదులకుఁ గర్తయై యన్వయింపనేరదు. కావునఁ బ్రకృతసూత్రముచే నట్లు
కర్తయై నిల్చుట కర్హమగు భావార్థకము సాధింపఁబడుచున్నది. ఈ సూత్రముచే
నుపదేశింపఁబడిన భావార్థక నజ్యంత క్రియ వలయ్వాది క్రియలకుఁ గర్తయగు
చుండును. (చూ. ౨౬౩ I వివ). నజ జిత్తుగాన బా. క్రియా. ౨౦
సూ. చెప్పిన ధాతువృత్తుడి యుకార మకారమగును. ఉదా:—చేయు+అ+ను+
వలయును = చేయవలయును = చేయుటవలయునని యర్థము. చేయుట యావ
శ్యకమని పర్యవసితార్థము. ఈ నజ్యంతముతో జంటగా వలయ్వాదులు ప్రయో
గింపఁబడుట తెలుచయ్యెను నిది భావార్థకము వ్యస్తము నగుటం జేసి వలయ్వాదు
లకుఁ దర్వాత సయితము ప్రయుక్తమగుచుండును. తర్వాతనె యవ్యవహితముగ
నుండవలసినఁ బ్రవృత్తియు లేదు. సందర్భయోగ్యముగ వాక్యములోని స్థానాంతర
మందును బ్రయుక్తము కావచ్చును. వలయ్వాది క్రియలయందలి యాఖ్యాతముచే
నీకర్త యభిహితమగును గాన నియ్యది ప్రథమాంత మనఁదగును. "కర్తయగు
భావంబునందు నజియగు" నని సూత్రించుటచే నిది కర్తగనే యుండునను నియమ
మేర్పడుచుండుటం జేసి దీనిపయి నితరవిభక్తులు నిల్వనేరవు. ఈ నజ్యంతము ప్రథ

 భట్టారకుఁడిట్టియెడల షష్ఠిని బ్రయోగించును.

మైకవచనముగనె యుండును. ఇది స్త్రీపదము గాన దీనిపై 'సు' ప్రత్యయము నిల్చి లోపించునని సూరిపక్షమందు ప్రక్రియ నెఱ్ఱవచ్చును. (బా. తత్స. ౫౭ సూ. ౧౬౧ I విమ). ఉదా:—నీ వీపనిఁ జేయవలయును. ఇటఁ 'జేయన్' అనుదానికిఁ గర్తయగు 'నీవు' అనుచోఁ బ్రథమ వచ్చెను. (సూ. ౨౬3 I శ.ప. బా. కార. 3౨ సూ) (ప్రౌఢ. క్రియా. ౨౭ సూ. చూడు). చేయుట వలయును - చేయుట వలదు- చదువుట కూడును - చదువుట కూడదు మున్నగురీతిని భావార్థక ప్రత్యయము వరయు నది. ఇట్లు వలయ్యాదులకుఁ గర్తయగు భావార్థమునందు ధాతువునకు 'నజే' సంయి తము ప్రాయికముగా నగును. ఉదా:—నీవు చేయుట వలయును = నీవు చేయవల యును. 'చేయు+నజే వలయును.' అనుచో బా. క్రి. ౨౦ సూత్రము చొప్పున నజే పరక ధాతూకారమునకు 'అ'త్వము "రాఁగా చేయను+వలయును = చేయవలయు" నని యగును. బా. సంధి. ౧౮ సూత్రము చొప్పున ద్రుతసంధిలో ద్రుతలోపము వచ్చె నని యెఱుంగునది. సూరిపక్షమునందలి సశ్లేషరూపము చేయన్వలయునని యుం డును. నజ్యంతమునకుఁ బరముగా బా. క్రి. ౧౧౫-౧౧౬ సూత్రములచొప్పున 'బాహుళకముగా - 'కాను-కను' శబ్దము లనుప్రయుక్తము కాఁగా, 'చేయఁగావలయు, చేయఁగవలయు' అను రూపములు సిద్ధించును. ఈ నజే జేత్తుగాన బా. క్రి. ౮౬ సూత్రము చొప్పున నుత్తగుచున్నది. కాఁబట్టి యిది పరముగునప్పుడు బా. క్రి. ౯౧ సూత్రముచేత చూచుధాతువునకు 'చూడు'అను నాదేశము గల్గునుగాన - వాఁడు చూడవలయును-వారు చూడ గావలయును మున్నగురూపములు సిద్ధించును. నీవు చూడవలయును మేము చూడఁగావలయును మున్నగురీతి నియ్యవి మూఁడుపురుష ములందును నొక్కరీతినే యుండుటను సూరి యుదాహరించెను. ఇట్లె వాఁడు చూడ వలదు-వారు చూడవలదు - నీవుచూడవలదు - నీవుచూడఁగూడును - మీరుచూడఁ గూడదు - వాఁడుచూడఁజెల్లును- మేముచూడఁజెల్లదు - నీవుచూడఁదగును-వాఁడు చూడఁదగదు - మున్నగరూపముల నెఱుంగునది. ఇత్యాదులు వలయ్యాదు లను నాదిశబ్దముచేత "అగును - కాదు - వచ్చును - రాదు - చను - పోలు" మున్నగు వానిని సంయితము గ్రహింపవలెను. నీవుచేయనగును - వారుచదువఁగాదు - మీరు చూడవచ్చును - నేనుజూడరాదు - మొ. 'నీ కీపని చేయవలయును' అనురీతి షష్ఠిని భట్టారకుఁ డిట్టియెడలఁ బ్రయోగించుచుండును. వలయ్యాదులు సాధారణముగాఁ దద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనమున నుండును. 'వలసెను' అనురీతిని భూతార్థక ప్రథమైకవచనమును గలదు. అసమాపకముగాఁ బ్రయుక్తమగునపుడు 'ట' ప్రత్య యాంతముగను 'న' ప్రత్యయాంతాది ధాతుజవిశేషణముగను గన్పట్టును. తే.గీ.

శ్రుతము నరునిఁ బరిజ్ఞానయుతుఁ జేయు । .........కాన శ్రుతవంతుఁ డగుట వలయు" (అను. ౫ ఆ. ౧౪౮). అనురీతిని "వలయు" అనుదానికిఁ గర్త భావార్థకమె యగుట సహజము. ఇట్టి భావార్థక 'ట' ప్రత్యయమునకుఁ బర్యాయముగ "ను" జ్యంతము ప్రయోగింపఁబడునని ప్రకృతసూత్రార్థము. తే-గీ. బలసి నీపుత్త్రులెల్ల నొండొరులతోడ । నెట్లొడంబడియుండుదు రట్లచేయ । వలయు......... (సభా. ౨ ఆ. ౧౩౧). 'వలయు' అనునది మునుమనిల్చుటకు:—క. వెలయ విధిదృష్టనయ మున । వలయుఁ బరాక్రమము సేయ వసుధేశ్వర య । గ్గలముగు బుద్ధియుఁ గడఁకయుఁ । గల పురుషుల కిదియ చూవె కర్తవ్య మిలన్ (సభా. ౧ ఆ. ౧౩౧). వాక్యమున నెచ్చటనేని యుండుట కుదా:—క. పితృసంకల్పము సేయఁగ । సుతుల కవశ్యమును వలయు.........(సభా ౧ ఆ. ౯౪). క. అనఘా మద్విషనిహతుల కగునే బ్రదుకన్ (ఆది. ౨ ఆ. ౬౯౦). ఆ-వె. కాన యింక వేఁడఁ గాదు నాకు (సభా. ౨ ఆ. ౨౬౩). చ.........ఇంక బలుకన్ వలసెన్.........(సభా. ౨ ఆ. ౨౪). ఇంక నాకుఁ బల్కుట వలసెనని యర్థము. సూరి ప్రథమాంతములను మాత్రమె యుదాహరించినను నంతటను నన్నయ భావార్థకక్రియకుఁ గర్తయగుదాని ప్రథమాంతము నధ్యాహార్యముఁ జేసి యద్దాని షష్ఠ్యంతము వలయ్వాదులతో నన్వయించురీతిగఁ బ్రయోగించుచుండును. అట్లని యట్టికర్తకుఁ బ్రథమాంతప్రయోగము లేదనరాదు. తిక్కనాదులు ద్వివిధముగను బ్రయోగించుచువచ్చిరి. ప్రథకు:— ఉ.........దైవము తోడ్పడన్ వలయు. (ఉద్యో. ౩ ఆ. ౭౩). క......... నాకు నీ వేమియుఁ జె । ప్పను వలవదు సంజయ (ద్రోణ. ౧ ఆ. ౯౪). క. వినవలయు వాని నెల్లను । జననాయక వింటి వీవు.........(అశ్వ. ౧ ఆ. ౮౫). వలయు ధాతు వీసందర్భమున 'ట'వర్ణకాంతముగ నయితము ప్రయుక్తమగును. ఆ-వె. అనఘ నీదు బుద్ధి యఖిలోక మగుటయుఁ । దెలిసికొనఁగ నాకు వలయునట్టి । ధర్మకోటి నీవ తగఁ జెప్ప వినవల । యుటయుఁ జెప్పె నంబుజోదరుండు (శాంతి. ౨ ఆ. ౧౬౧). క. లోకోచ్ఛేదముఁ గర్మ । వ్యాకులతయుఁ గాక యుండ వలయుట్కై సు । శ్లోకా... ......(శాంతి. ౬ ఆ. ౨౭౮). వలయును - వలదు - కూడును - కూడదు - చెల్లును - చెల్లదు - తగును - తగదు. ఇత్యాదులు వలయ్వాదులని సూరి యుదాహరించెను. ఆదిశబ్దముచే, వలవదు - వచ్చును - చనును - రాదు - కాదు - అగును - పోలును - మున్నగువాని నెన్నునది. మఱికొన్ని ప్రయోగములు:— క. చనునె యధర్మద్యూతం । బున నిట్టులు పాండురాజపుత్త్రులఁ బ్రభులన్ । వనఁగతులఁ జేయ దుర్యో । ధన ధృతరాష్ట్రులకు విగతదయహృదయులకున్ (ఆర. ౧ ఆ.

౩౫). మ.........మహోగ్ర కాననాం। తరముల నుండకుండ నతిదారుణ దుర్మృగసంగమంబునం। బొరయక యుండఁగా మనకుఁ బోలు నమందమనః ప్రియం బుగాన్. (ఆర. ౧ ఆ. ౨౪౨). ఆ-వె. అతఁ డెవ్వఁడొక్కొ యమ్మహాత్మునిఁ గనుం। గొనఁగఁ గౌఁగిలింప వినయ మొప్ప। నర్ఘ్యపాద్యవిధుల నర్చింప భక్తి సం। యుక్తి నెపుడు గొలిచియుండ వలయు. ఇట్టులొక్క వలయ్యాదిధాతువుతో ననేక నుజ్యంతము లన్వయించుటయు సమ్మతమె. ఉ..... ...దైవము తోడ్పడన్ వలయు (ఉద్యో. ౩ ఆ. ౭౩). ఇందు నుజ్యంతక్రియయొక్క కర్త ప్రథమాంతము. సాశ్లేష సంధియుఁగలదు. (౨౬౩ I విశ. బా. క్రి. ౩౨ సూ). చ.........ఎట్టులైనఁ జం। పన తగు (భీష్మ. ౩ ఆ ౩౧౦). (చంపన తగు = చంపుటయే తగును). సీ. అనిన మరుత్తుఁ డయ్యమర గురుండు నాయాగంబు నడపుట కాత్మరోసి। రాకున్న సంవర్తుఁ బ్రార్థించి తెచ్చితి నింక నట్టులు సేయ నెట్లు వచ్చు.........(అశ్వ. ౧ ఆ. ౯౦). (అట్టులు సంవర్తుని విడుచుటలు) ('అట్టులు సేయ కెట్లు' అను ముద్రణము తప్పు. అనన్వితము. నాయొద్దనున్న తాళపత్రమాతృకలు రెంటను 'చేయ నెట్లు' అనియె యున్నది.) ఇందలి వచ్చుధాతువున కాగమన మర్థము కాదు. "వచ్చున్ = తగును = వలనుపడును" అని యర్థము. ఇట్లె వలయ్యాదులలోని 'రాదు' అనుదానికిని 'వలనుపడదు - తగదు' అనియె యర్థము. తే-గీ. తేఁటిచూడను రాకున్కి తెల్ల మధిప (శల్య. ౧ ఆ. ౪౮). చ.........తప మాచరించి నిగమాధ్యయనం బొనరించి కానరా। దనఘ మదీయ దివ్యపరమాకృతి (భీష్మ. ౧ ఆ. ౨౨౦). ఆ-వె. అగ్నిశిఖయుఁ బోలె నంటను డాయను। జూడ రాని యట్టి శుభచరిత్ర. (ఆర. ౨ ఆ. ౯౧) (చూడ రాని=చూచుట వలనుపడని) క. నరుఁడును సాత్యకియు వృకో। దరుఁడును మనసేనఁ గలఁ డెవరు సైంధవుఁ జే। రిరి నీకుఁ దగునె నరుసిం। జొరనిచ్చితయేని వారిఁ జొరనీ ననఘా. (ద్రోణ. ౪ ఆ. ౧౬౩). (చొరనీన్+చొరనిచ్చుట, తగునె). క. వెగడొంది యిట్లు పలుకఁగ। నగునే పగతురు ప్రమోద మందఁగ.........(విరా. ౪ ఆ. ౬౬). తే.........। అనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల (ఉద్యో. ౨ ఆ. ౪౪). క. క్షీరోదకవృత్తి మనము। వారలుచుం గలసి బ్రదుక వలదే నెమ్మిన్ (ఉద్యో. ౧ ఆ. ౨౬౩). మ. మన కీకుండఁగ వచ్చునే.........(ఉద్యో. ౧ ఆ. ౨౬౬). ఆ-వె. కాన యింక వేడఁ గాదు నాకుఁ (సభా. ౨ ఆ. ౨౬౩). సీ.........ఆ-వె. కాన గాలము నేమనఁ గాదు తండ్రి (శాంతి. ౪ ఆ. ౨౩). ఆ-వె. నమ్మఁదగని వారి నమ్మక యున్నది। తగినవారి నైనఁ దద్ద నమ్మి। యుండఁదగదు......(శాంతి. ౩ ఆ. ౨౩౯). మ. తలఁకుం గూడునె యింత లేసి దొర లీ దైన్యంబు (ఉద్యో. ౩ ఆ. ౯౫).

చ. అకలిన తారకాసముదయంబుల నెన్నను సర్వవేద శా। స్త్రముల యశేష పారము ముదంబునఁ బొందను బుద్ధిబాహు వి। క్రమమున దుర్గమార్థజలగౌరవ భారత భారతీ సము। ద్రము దరియింగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే (ఆది. ౧ ఆ. ౯౯). నేరఁబోలునే = నేర్చుట పోలునే = నేర్చుట వీలుపడునా. ఇందలి 'ఎన్నన్ - పొందన్ - ఈఁదన్' అనుఁవి తుమర్థకములె కాని భావార్థకములు కావు. "ఎన్నుటకును - పొందుటకును - ఈఁదుటకును - నేర్చుట" అని యర్థమగుటం జేసియు భావార్థక నజ్యంతము చతుర్థ్యర్థక షష్ఠ్యంతమగుట సమ్మతము కామింజేసియుఁ 'తుమ్' ప్రత్యయము తాదర్థ్యార్థకమగుటచే నట్టి షష్ఠ్యర్థక నజ్యంతములు తుమర్థకములనుట యుక్తమగుటంజేసియు నవి భావార్థక నుజ్యంతములు కానేర వనఁదగును. ఇట్లె యీ క్రింది ప్రయోగములందలి నుజ్యాంతములు భావార్థకములు కావనియుఁ దుమర్థకములనియు గ్రహింపవలెను. ఆ-వె......... । ఏమిసేయ నేర్తు రింకఁ గులుఁడ. (సభా. ౨ ఆ. ౩౧౩) (చేయనేర్తురు = చేయుటకు నేర్తురు = చేయుటను నేర్తురు). సీ.... . కుక్క। లిభకుంభదళన మహిష్ఠ సింహ రనఖ ముఖుఁడగు హరిమీఁద మొఱఁగెఁదేమి. ఆ వె. సేయనోపు......... (సభా. ౨ ఆ ౩౮) (చేయనోపున్ = చేయుటకు సమర్థుఁడగును). సీ......... ఆ-వె........ ఇ। ట్లయినఁగాని చాలవతని బొగడ (సభా. ౨ ఆ. ౪౧). ఇట్టి యెడల నొకొక్కప్పుడు తాదర్థ్య చతుర్థ్యర్థక షష్ఠియే ప్రయోగింపఁబడుటయుఁ గలదు. చ..... ...కరలోకసౌఖ్యముల్ । గనుటకు నేరరిక్కడి సుఖంబులు... ......(అర. ౪ ఆ. ౧౭౬). ఇట్లె శక్త్యర్థకాది యోగమందును దాదర్థ్య చతుర్థ్యర్థక షష్ఠీస్థానమందెఁ దుమర్థక నుజె నెన్నఁదగును గాని భావార్థక నుజె నెన్నరాదు. క........ బ్రాహ్మణులకుఁగా । క.........ఖరుల కలవియె.........(అర. ౪ ఆ. ౧౨౫). దీని చొప్పున నె నుజ్యంతమును దుమర్థకమె యని యెన్నవగును. క. మున సేనల నొక్కెత్తునఁ । గొనఁదలచి కడంగి వచ్చు గురుపుత్త్రుని మా। ర్కొన దృష్టద్యుమ్నునిఁ గా। వను శక్యమె నీకు నిచటివారికి నధిపా. (ద్రోణ. ౫ ఆ ౩౫౫ ప). చ. విశ్వసం। హరు నఱకెత్తిపోయి కలహంబున నోర్వఁగ నీయలంతియే (నన్ని. కు. ౪ ఆ. ౪౩౨). మ...విశ్వసం। హరు వర్తించు మహా ప్రతాపహతి సేయం బూన నీప్రాప్తియే (నన్ని. కు. ౪ ఆ ౪౩౩). ఉ. చావఁగ నేయ నెవ్వఁడును జాలఁడు (భీష్మ. ౩ ఆ. ౩౧౩). ఉ. వింతయె కామశక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్ (ఆది. ౭ ఆ. ౫౯ ప). వలయ్యాదుల కర్థవిశేషములందుఁ బృథక్ ప్రయోగమును బ్రథమపురుషైకవచనాదీతర స్థలప్రయోగములును గలవు. క. వరుసత్యద్భుతవిక్రము!

పరిణతి సూడఁ గనుదోయి పదివేల్ వలయున్ (కర్ణ. ౨ ఆ. ౨౮౩) (మాడు. శ. ర. వలయుశబ్దము). ఆ-వె. ఇట్టి వర్తనముల నెప్పుడు పాండవులకుఁ। దగిలి ప్రీతిసేయఁ దగితిఁ గాని (ఆర. ౫ ఆ. ౩౦౯) (ఇచట 'చేయన్' అనునది భావార్థకము కాదు. తుమర్థక నఙ్యంతము. ఉ. నా భుజవీర్య విక్రమగుణంబులకుం దగుచున్న యీ ధను। శ్లాఘము (సభా. ౧ ఆ. ౧౨౮) పద్యకవృత్తము - కొడుకుపల్కు విని కూడదు నాక దురాత్ముఁడై (ఆది. ౬ ఆ. ౨౩౦). క. తగునిది తగదని యెదలో। వగవక.........(ఆది ౧ ఆ. ౮౬ ప). క.........నీకు దురాగ్రహ మగునే (ఉద్యో. ౩ ఆ. ౩౩౦). (అగునే = తగునా!)

నన్నయా. ౩౧౦ విషయము

భవేత్కః స్త్రీసమా న్నాద్యు। ఉత్వం తస్మిన్ పరే
భవేత్। క్త్వార్థే చ వ్యతిరేకార్థే। ధాతో స్తత్రైవ
మి ర్భవేత్. (వికృ. క్రియా. ౨౧ కారి. అహో.
౫౦౨ పుట).

కల్పతరువు. ౩౧౦ విష:—భవేత్క ఇత్యాది పూర్వార్థమునకు ౨౯౦ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. కవర్ణక ప్రస్తావమున వ్యతిరేకక్త్వార్థక 'క' ప్రత్యయమును నట్టి వ్యతిరేకార్థక ప్రస్తావమున వ్యతిరేకభావార్థక 'మి' ప్రత్యయమును నుపదేశింపఁబడుచున్నవి. వ్యతిరేకార్థే క్త్వార్థే చ=వ్యతిరేక క్త్వార్థమున, ధాతోః= ధాతువునకు, కః = 'క' ప్రత్యయ మగును - చశబ్దమహిమచే పూర్వార్థమునుండి 'కః' అనునది యనువృత్త మగుచున్నది. "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్" అను చొప్పున ధాతువుతుదిని "అత్త్వము" నిల్చును. ఉదా:—చేయు+అ+క = చేయక= 'అకృత్వా' అని యర్థము. తత్రైవ = ఆ వ్యతిరేకార్థమునందె, ధాతోః = ధాతువునకు, స్వార్థే = ధాత్వర్థమునందు, మిః = 'మి' ప్రత్యయము, భవేత్ = అగును. 'స్వార్థే' అనునది 'నాద్యుః కవర్ణకః స్యాత్ । స్వార్థే' అను మూలభూతచింతామణి సూత్రమునుండి యనువృత్తమగుచున్నది. "ధాతో స్స్వార్థే వ్యతిరేకార్థే" అనఁగా వ్యతిరేకవిశిష్ట ధాత్వర్థమునం దనునర్థము లభించుచున్నది. వ్యతిరేక విశిష్టభావార్థమున ధాతువుతుదిని 'మి' ప్రత్యయము నిల్చునని పర్యవసితమగుచున్నది. "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్" అను చింతామణిసూత్రముచొప్పున ధాతువుతుదిని 'మి' ప్రత్యయమునకుఁ బూర్వమున 'అత్త్వము' నిల్చును. ఉదా:— చేయు+అ+మి = చేయమి = 'చేయకుండుట - చేయకపోవుట' అనియర్థము. ఇట్లె - వండమి - చదువమి - తినమి-మొ. వ్యతిరేకక్త్వార్థము ముందు విస్తరింపఁబడును. (విష. ౩౧౨). ఆంధ్రశబ్దచింతామణి "పునరాగమః క్రియాణామ్" అనుసూత్రముచే

సాధించురూపములనే యథర్వణుఁ డిట్లు వివరించెను. (చిం. వి. వ. ౧౧౧ విష).
ప్రయోగములు:—క. సమరవిముఖత్వమును రణ । విముఖులఁ జంపుటయు శరణు వేఁడిన రక్షిం । పమియును యాదవవంశో । త్తములం దివి గలవె చెప్పుడు దారుక తనయా (ఆర. ౧ ఆ. ౧౭౦). (రక్షింపమి = రక్షింపకుండుట 'రక్షించుట' అను దానికి వ్యతిరేకార్థము. 'మి' ప్రాసస్థలగతము). క.........తనవా । క్యము లంఘింపమికిఁ బ్రస । న్నమనస్కుండై.........(ఆర. 3 ఆ. ౧౪3). సీ. త్రేతాగ్ను లెల్లను దేజరిల్లమిఁ జేసి.........(ఆది. ౧ ఆ. ౧౪౧). క. క్షమియింపవలయు నొకఁ డెఱుఁగమి నేమే నన్నంతఁ గటకటఁబడి.........(విరా. ౪ ఆ. ౨౨౫) ('మి' ప్రాసస్థానగతము). క. ...దైత్యాన్వయు । మృత్యువయై యెసఁగు నొప్పమికి మితిగలదే. (హరివం. పూ. భా. ౪ ఆ. ౧౬3) (మి. యతిస్థానగతము) క. క్షమియించువారిఁ గని చా । లమి వెట్టుదు రైననుం దలంప ననూన । క్షమయ కడు మెఱయు......
...(ఉద్యో. ౨ ఆ. ౪౦).

బాలవ్యా. వ్యతిరేకభావంబున మిజీయగు. 3౭.
3౧౦ I విషయము. వ్యతిరేక విశిష్టక్రియాభిధాయి ధాతువునకు మిజీ
యగు - వండమి - పండమి.

సంజీవని. 3౧౦ I విష:—వ్యతిరేకభావార్థమనఁగా వ్యతిరేకముతోఁగూడిన ధాత్వర్థము. ఈవిషయమునె సూరి వివరించుచున్నాఁడు. వ్యతిరేకముతోఁ గూడిన వ్యాపారమును దెల్పు ధాతువునకు మిజీప్రత్యయ మగునని యర్థము. మిజీ జిత్తు గాన బా. క్రియా. ౨౦ సూత్రముచొప్పున ధాతూకారమున కాదేశముగా 'అ' కారమువచ్చును. వండు+అ+మి = వండమి = వండకుండుట. ఇట్లె - పండు+అ+మి = పండమి = పండకుండుట. కల్పతరువున దీనికిఁ గవిప్రయోగములు యతిప్రాస స్థానగతములు చూపఁబడెను.

వన్నయా. క్త్వాభూతయోః క్రియాన్త స్యేత్. (ఆం. చిం.
3౧౧ విషయము. క్రియా. ౬, కారి. అహో. ౪౭౪ పు).

కల్పతరువు. 3౧౧ విష:—౨౯౬ విషయమున నీసూత్రము వ్యాఖ్యాత మయ్యెను. క్త్వార్థమందును భూతార్థమందును గ్రియ తుదిని 'ఇ' వర్ణకము నిల్చునని యర్థము. క్త్వార్థమందనఁగా సంస్కృతమున "క్త్వా" ప్రత్యయము వచ్చునర్థము నందని యర్థము. "33౨౦. సమానకర్తృకయోః పూర్వకాలే (3-౪-౨౧) సమాన కర్తృకయోః ధాత్వర్థయోః పూర్వకాలే విద్యమానాద్ధాతోః క్త్వాస్యాత్. భుక్త్వా వ్రజతి, ద్వివచన మతన్త్రమ్. భుక్త్వా పీత్వా-వ్రజతి........" (సి. కౌ. ఉత్తర

కృదన్తప్రకృతికర్త యనేకవ్యాపారములను జేయునప్పుడందలి తుది వ్యాపారమునకుఁ బూర్వమందు జరపిన క్రియలను దెలుపుధాతువులతుదిని సంస్కృతమున "క్త్వా" ప్రత్యయము వచ్చును - తెల్గున 'ఇ' ప్రత్యయ మగును. భుక్త్వా వ్రజతి = భుజించి వెళ్ళుచున్నాఁడు. "సమానకర్తృకయోః" అనుచోటి ద్వివచనము లెక్కించునది కాదు. భుజించి త్రాగి వెళ్ళుచున్నాఁ డనియు నిట్లు క్త్వా ప్రత్యయ మనేకధాతువులకు రావచ్చును.

ఇట్లు పాణినీయమునఁ జెప్పఁబడియున్నను నిందులకు విరుద్ధములగు ప్రయోగములు మహాకవుల కావ్యములందుఁ గన్పట్టుచున్నవి. "శ్లో. అనుభవతి శచీత్థం సా ఘృతాచీముఖాభి । ర్న సహ సహచరీభి ర్నన్దనానన్ద ముచ్చైః॥ఇతి మతి రుదయాసీ త్పక్షిణః ప్రేక్ష్య భైమీం।విపినభువి సఖీభి స్సార్థ మాబద్ధఖేలామ్" (నైష. ౨సర్గ. ౧౦౯ శ్లో.) ఉద్యానమునఁ జెలులతోఁగూడి క్రీడించు దమయంతిని జూచి ఘృతాచి మున్నగు నప్సరసలతోఁగూడి నందనవనమునఁ గ్రీడించు శచి కిట్టి యానందము గల్గ లేదను బుద్ధి హంస కుదయించెనని పై శ్లోకమున కర్థము. ఇందు 'దమయంతిని జూచి హంసకు బుద్ధి యుదయించెను వాక్యమున భిన్నకర్తృకత్వమునందును 'క్త్వా' ప్రత్యయము వచ్చుట సంభవించి యున్నది. చూచుటకుఁ గర్త హంస; ఉదయించుటకుఁ గర్త బుద్ధి. ఇట్టియెడల 'స్థితస్య=ఉన్నట్టి' అను పద మధ్యాహృత మగుచున్నదనియు దమయంతిని జూచి యున్నట్టి హంసకు బుద్ధి యుదయించెనని యన్వయించినచో వ్యాకరణవిరోధము తొలంగుననియుఁ బండితులు సమర్థించుచున్నారు. అట్టి యన్వయమునఁ 'దమయంతిని జూచియున్నట్టి' అనుచోఁ జూచుటకును నుండుటకును గర్త హంస యొక్కఁడే యగునుగాన సమానకర్తృకత్వమునకు భంగము లేదని తాత్పర్యము. "ప్రేక్ష్యేతి క్త్వా ప్రత్యయాన్తస్య అనన్తరక్రియయా సహైకకర్తృత్వనియమాత్ స్థితస్యేతి పక్షిణ ఇత్యస్య విశేషణ మధ్యాహార్యమ్" (జీవానన్దవ్యాఖ్య). "ఏకకర్తృకత్వా భావాత్ క్త్వా ప్రత్యయానుపపత్తే స్థితస్యే త్యధ్యాహార్యమితి" (ప్రేమచంద్రన్యాయరత్న విరచితాన్వయబోధినీవ్యాఖ్య) "అత్ర క్రియాణామేక కర్తృత్వ ఏవక్త్వాచ్ స్యాత్-తేన గురౌ గతే శిష్యో భుఙ్క్తే ఇత్యాదౌ న స్యాత్-కిన్తు <u>పుత్రం దృష్ట్వా సుఖం</u> భవతి - శత్రుం దృష్ట్వా దుఃఖం భవతీత్యాదౌ స్థితస్యే త్యధ్యాహారా దేకకర్తృకత్వే క్త్వాచ్" (ముగ్ధ. ౧౧౬౭ సూ. దుర్గాదాసవ్యాఖ్య). ఇట్టి ప్రయోగములు సంస్కృతమున ననేకములు గలవు. శ్లో. యద్దృష్ట్వా నాఽపరం దృశ్యం।య ద్భూత్వా న పునర్భవః॥యజ్జ్ఞాత్వా నాఽపరం జ్ఞేయం । తద్ బ్రహ్మే త్యవధారయేత్ (శ్రీమచ్ఛంకర భగవత్పాదకృతాత్మ

బోధము. ౫౫ శ్లో.) 'యద్ - జ్ఞాత్వా స్థితస్య అపరం దృశ్యం న భవతి' అనురీతి నిందును 'స్థితస్య' అనుదాని యధ్యాహార మావశ్యకమె. ఇట్లె నోరు తెఱచికొని పరుండెను మున్నగుచోటులయందు సమానకర్తృకక్రియలలోని పూర్వకాలి కత్వము వివక్షాధీనమనియు గ్రహింపవలయును. "యద్యపి కంసపతనాన న్తరమేవ ఝనత్కారో భవతి తథాపి ఝనదితి కృత్వా కంసః పతతి ఇత్యాదౌ ఝనత్కారస్య పూర్వకాల వివక్షయా క్త్వాచ్ స్యాత్. ఏవం ముఖం వ్యాదాయ నిద్రాతీత్యాది" (ముగ్ధ. ౧౧౬౬ సూ. దుర్గా. వ్యాఖ్య.)

పయి నుదాహరించిన యుద్దేశముతోనే కావలయు నీక్రిందిరీతి నాంధ్రమహా కవులును బ్రయోగించియున్నారు. క. అమరారిరుగ్ణనుఁడు చ । క్రము గ్రక్కున నేయ రాహుకంఠము దెగి దే । హము ధరణిఁ బడియె......(ఆది. ౨ ఆ. ౧౯) ఇచట 'కంఠము దెగియున్న దేహము' అనురీతిని 'ఉన్న' (స్థితస్య) అను పద మధ్యా హార్యము తెగుటకు నుండుటకును గర్త కంఠమె యగుటచే సమానకర్తృకత్వము సిద్ధించుచున్నది. సీ. ఈ వెండ్రుకలు పట్టి యీడ్చిన యాచేయి.........రా । పతి యున్నఁ గని యుండు కాలుఁగాక......(ఉద్యో. 3 అ. ౧౨౭). ఇచట "కని = చూచియున్న నాకు" అని యన్వయము. 'నాకున్' అనునది యెట్లు నధ్యాహార్యము కావలసినదె. సమానకర్తృకత్వసిద్ధికయి 'ఉన్న' (స్థితస్య) అనునది యధ్యాహా ర్యము. "ఆ-వె.........అత్తఱి నాకల । కల మెఱింగి కీచకవ్రజంబు "చ. కడు వెస వచ్చి రూపఱిన కాయము సున్న తెఱంగుఁ జూచి బి । ట్టడలు మనంబునం గదిరి హా యనువారును.........పలవించువారునై (విరా. 3 ఆ. ౫ ప.) ఇచట 'కదిరి= కదిరియుండన్' అని యన్వయముగాన 'ఉండన్' అనునది యధ్యాహార్యము. సీ.........భీము గదాహతి భూమిఁ గూలి । యాతనిచేత సర్వాంగంబులందును, గలుగు క్రొన్నెత్తురు కాంతఁ దోఁగి । బడి మఱి తెగటారి పడి యున్న వాఁడు దు శ్శాసనుఁ డీతఁడు......(స్త్రీ...౨ ఆ. ౫౫ ప). ఇచట "త్రావఁబడి యుండఁగా" అని యర్థముగాన 'ఉండన్' అను పద మధ్యాహార్యము. ఇట్లె యంతటను నధ్యా హారముచేసి యేకకర్తృకత్వమును ఘటింపఁజేయవలయును. ద్విపద. ఎనయంగ నార్యాలు నేఁబదియేండ్లు।సనియె నీ విట వచ్చి సంయమివర్య (బసవ. 3 ఆ. ౧౧౫౯) సీ. వెఱపులు పైకొని.........కామ మలరి.........చింతలు విజృంభించి...... ...విముగ్ధతలు బలసి.........ఎ-గీ. గోవిందునిఁ దగిలిరి......గోపకాంతలు... ......(హరి. పూర్వ. ౮ ఆ. ౧౮౪ ప). ఇట క్త్వార్థకము లన్నిటిచోటులందును 'ఉండన్' అనునదియె యధ్యాహార్యము.

సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దిగర్థకం బగు. 3౮.

బాలవ్యాకరణ వివరణము. ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలికంబగుం దద్వాచియగు ధాతువున కి వర్ణకంబగు.

3౧౧ I విషయము. ఇదియె క్త్వార్థంబు నాఁబడు. వండి - పండి - విని - కని. సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లనుటం జేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టఁబడి మడిసె నిత్యాది సిద్ధంబయ్యె.

సంజీవని. 3౧౧ I విష:—సమానాశ్రయంబు లనఁగా నేకాశ్రయంబులని సూరియే వివరించెను. ఒకకర్త నాశ్రయించియున్న క్రియలలోఁ బూర్వకాలమును బోధించుధాతువులకు 'ఇ' ప్రత్యయము వచ్చునని యర్థము. ఉదా:—రాముఁ డన్నమును వండి దాని భుజించి కొంతసేపు విశ్రమించి వచ్చెను. అనుచో 'అన్నమును వండుట భుజించుట విశ్రమించుట' అను క్రియలు మూఁడును వచ్చుటకుఁ బూర్వకాలికములె. నాలుగుక్రియలకును రాముఁడే కర్త. నాలుగుక్రియలును రామునే యాశ్రయించియున్నవి. ఇదియె క్త్వార్థక మనఁగా నీ 'ఇ' ప్రత్యయమె క్త్వార్థక మని వ్యవహరింపఁబడుచున్న దని తాత్పర్యము. క్త్వార్థకమనఁగా సంస్కృతమునందలి క్త్వాప్రత్యయముయొక్క యర్థము గలదనిభావము. పాణినీయమున "సమానకర్తృకయోః పూర్వకాలే" అని చెప్పఁబడియున్నను నట్లుచెప్పుట యాంధ్రమహాకవిప్రయోగానుకూలము కాదనియు సమానాశ్రయముల కని తెలుఁగునఁ జెప్పుకొనుట యావశ్యకమనియు సూరి "సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబులనుటంజేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టఁబడి మడిసె నిత్యాది సిద్ధంబయ్యె" అను వాక్యముచే విశదపఱిచెను. సూరి యుదాహరించిన వాక్యమునఁ గొట్టుటకుఁ గర్త చైత్రుఁడు, మడియుటకుఁ గర్త మైత్రుఁడు. ఇట్టివాక్యమున "కొట్టుట, మడియుట" అను రెండుక్రియలును విభిన్నకర్తృకములగుటంజేసి సంస్కృతపద్ధతిని క్త్వాప్రత్యయము రాఁజాలదనియుఁ దాను జెప్పినరీతిని, "కొట్టంబడుట యనుక్రియాఫలమును మడియుటయు మైత్రు నొక్కనినే యాశ్రయించి యుండుటచే నవి సమానాశ్రితములగుటంజేసి క్త్వాప్రత్యయము వచ్చుట కవకాశము కల్గెననియు సూరి యాశయము. "సంస్కృతంబులో నీ వాక్యంబు తెలుంగునందువలెఁ గ్త్వార్థకంబుతో వచింప వలను పడదు. 'చైత్రేణ హతో మైత్రో మమార' అని కర్మార్థకక్త ప్రత్యయాంతంబుతో రచింపఁబడును. ఇవల శైలిఁజేసి వాక్యంబులు తత్పర్యంబులో నేకంబైనను

రచనంజేరి భిన్నంబు లగును" (బా. గు. ప్ర. ౩౩౧ పుట; ద్వి. ము.) అని గుప్తార్థ ప్రకాశికా వ్యాఖ్యాత వివరించెను. ఈ వివరణము బా. సా. వే. వ్యాఖ్యాత స్వీకరించి యెక్కించెను. బాలవ్యాకర్తగాని తద్వ్యాఖ్యాతలుగాని వెనుకఁ గల్ప తరువులో (౩౧౭ విష.) జూపఁబడినరీతిని సంస్కృతమందును నిట్టియెడల క్త్వాప్రత్య యముతోఁడి ప్రయోగము సమ్మతమెయని గ్రహింపరైరి. మఱియుఁ జైత్రునిచేతఁ గొట్టఁబడఁగా మైత్రుండు పడిసె ననురీతిని సమానాశ్రయంబులం బూర్వకాలంబు నందు భావలక్షణార్థక నజివచ్చుటయుఁ బ్రసిద్ధమె యగుటం జేసి (బా. క్రి. ౮౦ సూ.) సూరిలక్షణ మతివ్యాప్త మగుచున్నది. అట్లె చైత్రునిచేతఁ గొట్టఁబడుటచే మైత్రుండు పడిసె ననురీతిని భావార్థక ట ప్రత్యయఘటితస్థలములందు నద్దాని కతివ్యాప్తి దుర్వార మగుచున్నది. కావున నేకకర్తృకత్వాదళమును వీడరాదు. ఈ విషయమునే దుర్గాదాసపండితుం డీక్రిందిరీతిని వక్కాణించెను "అత్ర క్రియా ణా మేకకర్తృకత్వే ఏవక్త్వాచ్ స్యాత్. తేన గురౌ గతే శిష్యో భుఙ్క్తే- ఇత్యాదౌ నస్యాత్." (ముగ్ధబోధ వ్యాకరణము. ౧౧౬౬ సూ. వ్యా.) ఇంతియకాక సూరి సూత్రము "రాహుకంఠము తెగి దేహము ధరణిఁ బడియె" (ఆవె. ౨ ఆ. ౧౯). మున్నగుప్రయోగములం దవ్యాప్తమును నగుచుండుటచేతఁ బ్రౌఢవ్యాకరణకర్త "ఒక్కొకచో భూతార్థ కాసమానకర్తృకక్రియ హేత్వర్థకంబు నగు" (ప్రౌఢ. క్రియా. ౧౫ సూ.) అని సూత్రించి "రాహుకంఠము దెగి........" మున్నగు నుదా హృతులను జూపెను. దేహము ధరణిఁ బడుటకుఁ గంఠము తెగుట హేతువగు చున్నదిగాన "తెగి" అనుచోట "ఇ" ప్రత్యయము హేత్వర్థమున వచ్చెనని తాత్ప ర్యము. ఇట్టి స్థలములునైతము వెనుక వ్రాసిన (౩౧౧ విష.) ముగ్ధబోధవ్యాఖ్యాత వ్రాఁతచొప్పున కంఠము 'తెగియున్న దేహము ధరణిఁ బడియె' అనురీతిని 'ఉన్న' శబ్దాధ్యాహారముచే సమర్థితమగుచున్నది. ఇది యట్లుండఁగాఁ ద్రిలింగలక్షణశేష సూత్రమునైతమంతటను గార్యకారి కాలేదు. వెనుక నుదాహరించిన (౩౧౧ విష.) ప్రయోగములు కొన్నిటిలో హేత్వర్థకత్వమునైతము కానరాదు. "ద్విపద. ఎసయంగ నార్యులు నేఁబది యేఁడ్లు। సరిగొ నీ విట వచ్చి సంయమివర్య" (బసవ. ౩ ఆ. ౧౧౫౯). ఇట సంయమివర్యుఁడు వచ్చుటచేత నార్యులు నేఁబదియేండ్లు సనలేదుగదా. ఇట్లె యచటి తిక్కయజ్వప్రయోగమునందును హేత్వర్థకత్వము కుదురుపడలేదు. సీ........భీము గదాహతి భూమిఁ గూలి। యాతనిచేత సర్వాం గంబులందును, గలుగు క్రొన్నెత్తురు కాంతిఁ ద్రావఁబడి మఱి తెగటారి పడియున్న వాఁడు దు, శ్శాసనుఁ డీతఁడు........(స్త్రీ. ౨ ఆ. ౫౫ ప.) ఇందు "కూలుట,

తెగటారుట, పండియుండుట" అను క్రియలకుఁ గర్త దుశ్శాసనుఁడు త్రాగుటకుఁ గర్త భీముఁడు. పానక్రియాఫలాశ్రయము రక్తమగుటచే సమానాశ్రయత్వమును లేదు. దుశ్శాసనుఁడు భీముగదాహతిచేఁ గూలి పడియున్నవాఁడని చెప్పఁబడుటచేఁ బడియుండుటకు రక్తము త్రాగఁబడుట హేతువు కానేరదు. గదాహతి చేఁబడి యున్నపిమ్మటనే యాతనిరక్తము భీమునిచేఁ ద్రాగబడెను. ఇచటనయినను, "భీమునిచే రక్తము త్రాగఁబడి యుండఁగాఁ దెగటారి పడియున్నవాఁడు దుశ్శాసనుండు" అనురీతిని 'ఉండఁగా' అనుదాని యధ్యాహారముచే సమానకర్తృకత్వము సుఘటితమగుచున్నది. త్రాగుటకును నుండుటకును గర్త భీముఁడనియు, గూలుటకును దెగటారుటకును బడియుండుటకును గర్త దుశ్శాసనుండును నగుటచేత సమానకర్తృకత్వము కుదురుపడుచున్నది. ఇట్లుండు ధాతురూపాధ్యాహారముచే "సమానకర్తృకయోః పూర్వకాలే" అను పాణినీయమందలి క్త్వాప్రత్యయలక్షణము నిర్బాధమగుచున్నదనియు సంస్కృతభాషారీతిని బాగుగఁ జూచికొనక సూరిప్రభృతులు చేసిన సవరణములు సరికావనియు గ్రహింపవలెను. ఇట్లె "క్త్వార్థకంబు కొన్నియెడల విశేషార్థకంబు నగు. (గాణ. క్రియా. ౩౦౭ సూ.) ఉదా:—ఇచటి కిమ్మునివరేణ్యుఁ। డేతేర దొరకొని యున్నియా నాళ్ళయ్యె.........కళా. ౨ ఆ. ౩౦. (దొరకొని = మొదలుకొనుట).........మఱి యిట్టులేగి యెఱుంగవు (ఏగి= ఏగుట) (కళా. ౩ ఆ. ౧౨౯).........అనుభవించి యెఱుంగ (అనుభవించి = అనుభవించుట) పిలిచి పుచ్చవలయు (ఉద్యో. ౧ ఆ ౩౭). (పిలిచి = పిలుచుటకు)......" అనుగాణపత వివరణకర్త చూపిన ప్రయోగములు సయితము "ఏఁగియెఱుంగవు = ఏఁగియుండుట యెఱుంగవు" అనురీతినె యుండుధాతుజ రూపాధ్యాహారముచేతనె సమర్థితములు కానోపును.

సంస్కృతమున "సమాసే ఽనఞ్పూర్వే క్త్వో ల్యప్ (౭-౧-౩౭) అవ్యయపూర్వపదే ఽనఞ్ సమాసే క్త్వో ల్యబాదేశః స్యాత్. తుక్ - ప్రకృత్య (నిపీయ మొ.) అనఞ్ కిమ్ - అకృత్వా........" (సి. కౌ. ౩౩౩౨ సూ.) అనుచొప్పున క్త్వాప్రత్యయస్థానమున ల్యప్పు వచ్చుటయుఁ గలదు. కావున నీ 'ఇ' ప్రత్యయమును "ల్యబర్థక" మనియు వ్యవహరింపనగును. "గ్రహించి = గృహీత్వా - సంగ్రహించి = సంగృహ్య" అని యిట్లవ్యయపూర్వకత్వమున సంస్కృతమునఁ గల్గు భేదము తెలుంగున గల్గదు.

"మిక్కిలు. దే. అ - క్రి. మీఱు - అతిశయించు" (శ-ర). అనుచొప్పున "మిక్కిలు ధాతు క్త్వార్థకరూపము 'మిక్కిలి' యగును. క. తలఁదలతోఁ దాటిం

చినఁ । దల మీఁదున్ గాలు గాలు దాటించిన మి । క్కిలు.........(ఉ. హరి. ౬ ఆ. ౪. ర). అట్లయినను "మిక్కిలి = అధికమైనది" అనురీతిని విశేషణమును గలదు. క. గ్రక్కున నొక్కట నడఁగెను । మిక్కిలి చేతులును వాని మిక్కిలి కన్నుల్ (సభా. ౨ ఆ. ౫౭ ప). క. పాండవుల విభవ మది యా । ఖండలు విభవంబుకంటెఁ గడు మిక్కిలియై ।.........(సభా. ౨ ఆ. ౧౦౪). సీ.........దేవుడు మిక్కిలి మానవులకు (అశ్వ. ౨ ఆ. ౧౬౧). ద్విపద. కరమర్థి మిక్కిలి కన్నిచ్చుట యును (బసవ. ౪ ఆ. ౩౦౮.) (మిక్కిలి కన్ను = ఈశుని మూఁడవకన్ను)

"ఎత్తుకొని=ఎత్తుక=ఎత్తుకు" అనురీతి నను ప్రయుక్తముగు కొనుధాతువు క్త్వార్థక రూపము 'క-కు' అను నాకారములతో నర్వాచీనకవులచేఁ బ్రయుక్త మగుచున్నది. నన్నయాథర్వణీయ సమ్మతిగాని భారతాది ప్రాచీన మహాకవిప్రయోగసమ్మతిగాని యట్టిదానికిఁ గానరాదు. "శబ్దరత్నాకరములోని 'చీకిలించు' అనే శబ్దము క్రింద కాశీఖండములోని 'చీకిలించుక యుండు' అనేపద్యము నుదాహరించినారు......... కాని వ్రాతప్రతులలో 'చీకిలించుకొనియుండు' అనియున్నది" (బాలక. ౧౭౯ పు). ఆముక్తమాల్యదాదులలోని 'పట్టుక - పట్టుకు' అనురూపములు పెక్కు బాలకవిశరణ్యమున నుదాహరింపఁబడెను (౧౭౩ మొ. ౧౮౦ పుటలు) కాని- '(పట్టు) క' - అనియో ? '(కట్టు) కు' అనియో నిర్ణయింపఁజాలు యతిస్థానగత ప్రయోగ మొక్కటేని చూపఁబడలేదు. వాడుకలో 'పట్టుకు - తీసుకు' అనురీతి నుకారము వినఁబడుచున్నది.

నన్నయా ధర్వణీయము. భవే త్కః స్త్రీసమా న్నాద్యు । ఉత్త్వం తస్మిన్ పరే భవేత్ । క్త్వార్థే చ వ్యతిరేకార్థే । (వికృ. క్రియా ౩౧౨ కమయము. ౨౧ కారి. ఆహో ౫౦౨ పుట.)

కల్పతరువు. ౩౧౨ విమ: ఈకారికలకు ౩౧౦ విమయమున వ్యాఖ్య చేయఁబడెను. వ్యతిరేకార్థే క్త్వార్థేచ = వ్యతిరేక క్త్వార్థమునందును, కః=క ప్రత్యయము, భవేత్=అగును. 'వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్' అను చొప్పున (౨౯౬ విమ.) ధాతువుతుదిని 'అత్త్వము' నిల్చును. చేయు+అ+క = చేయక = 'అకృత్వా' అని యర్థము. "పునరాగమః క్రియాణామ్" అను నాంధ్రశబ్ద చింతామణి సూత్రమున సాధింపఁబడు రూపములనే యిట్లథర్వణుఁడు విశదీకరించుచు వచ్చెను. (చిం. వి. ప. ౧౧౧ విమ.) ఇది క్త్వార్థమునకు వ్యతిరేకమాత్రమే యగుటంజేసి యిందును సమాన కర్తృకత్వాదినియమము లావశ్యకములే యని యెఱుంగునది. ఉదా:—వాఁడు చదువక చెడెను. చదువుటకును జెడుటకును 'వాఁడు' అనునదే కర్త. అట్టి యేకర్తృక

క్రియలలోఁ బూర్వకాలికమగు చదువుటను దెల్పు చదువుధాతువునకు 'క' ప్రత్యయము వ్యతిరేకార్థమున వచ్చెను. ప్రయోగములు:—క. సకలత్రిభయంకరు। నకు బార్హద్రథికి నని మొనన్ మార్కొననో। ప్రక వలియం బాఱఁడె యీ। ముకుందుఁడు భయాతిరేకమునఁ బడి మాఱుల్ (సభా. ౨ ఆ. ౪౬ ప. భట్టారక ప్రయోగము-ప్రాసగతము). సీ. వినవమ్మ తృణముష్టిఁ గొని వాఁడు పీచుఁడు, నందగ్ని యుదయించి యతనివంటిలమరు నంతను నింధనము <u>లపేక్షింపక</u> <u>యుడుగక</u> మండుచు నుండు మఱియు (అర. ౨ ఆ. ౧౯౭) ఆ-వె-చదువకయును నాకు సర్వవేదంబులు। సర్వశాస్త్రములును సంభవిల్ల। వలయు నని తలంచి వదలక నిష్ఠతో। నుగ్రతపముఁ జేయుచున్నవాఁడ (అర. ౩ ఆ. ౨౫౪). ఈపద్యమునందు, చదువకుండుటకు నస్మదర్థకమగు నేను (యవక్రీతుఁడు) కర్త. సంభవిల్లుటకు సర్వవేదములు శాస్త్రములును కర్తలు. ఇట్లు సమానకర్తృకత్వము లేదు. కావున "చదువకయున్న నాకు సర్వవేదములు సంభవిల్లవలయు" అనురీతిని 'ఉన్న' అను దాని యధ్యాహారమావశ్యకము. ఇట్లె యంతటను నెఱుఁగునది, (౩౦౯-౩౦౯ I విష.). ఇట్టియెడల సూరిగారి సమానాశ్రయత్వముగాని ప్రౌఢవ్యాకర్త హేత్వర్థముగాని సమర్థింపఁ జాలవు గదా. 'వారక - ఉఱక, వారని - ఉఱఁడు' మున్నగురీతిని "వారు - ఉఱు" ధాతువులకు వ్యతిరేకార్థకత్వముండె ప్రయోగము మహాకవిసమ్మతము. క. అడవికిఁ బువ్వులు దేరఁగ। వడి నరిగిన కచునిఁ జంపి వారక దనుజుల్। (ఆది. ౩ ఆ. ౧౧౪). క. కడు ననురక్తియు నేర్పును। గడఁకయుఁ గలవారి నుఱక కడవఁగ నెగ్గుల్। నొడివెడు వివేకశూన్యులకడ నుండెడు నంతకంటెఁ గష్టము గలదే (ఆది. ౩ ఆ. ౧౪౯). చ. ఉఱడు సురేంద్రునైన బలియుండు హిడింబుఁడు...... (ఆది. ౬ ఆ. ౧౯౫. ఉఱఁడు - ఉఱుధాతువ్యతిరేక ప్రథమపురుషైకవచనము). క. <u>వారని</u> యలజడి పడియెడు। వారల చూ యేడుగడయు వారికి నధిపా (ఉద్యో. ౨ ఆ. ౭౬. వారని వ్యతిరేకార్థకవిశేషణము). "ఉఱు....స-క్రి- లక్ష్యపెట్టు......(దీనికి వ్యతిరేకమునందు ప్రయోగము కానఁబడుచున్నది" (శ-ర). "వారు...వై-అ-క్రి-ఉడుగు... (దీనికి వ్యతిరేకక్త్వార్థమందును, వ్యతిరేకార్థక విశేషణమునందును మాత్రము ప్రయోగములు కానఁబడెడి)" (శ-ర).

బాలవ్యా. కజి వ్యతిరేక క్త్వార్థంబునం దగు. ౩౯

౩౧౨ I విష. వండక - పండక - కొట్టక - తిట్టక.

సంజీవని - ౩౧౨ I విష:—కజి జేత్తుగాన బా. క్రియా. ౨౦ సూత్రము చొప్పున ధాతువుతుది 'ఉ' కారమునకు 'అ' కారాదేశమగును. వండు+అ+క = వండక. ఇట్లె తక్కినరూపముల రూపసాధనప్రక్రియ నరయునది,

వ్యతిరేకాదా భావిని చాత్ స్యాత్. (ఆం. చిం. క్రియా. ౬ కారి. అహో. ౮౭౩ పుట).

నన్నయాథర్వ ౩౧౩ విష.

తుమున్నర్థక నాన్తేన। మి సమాసః క్వచి ద్భవేత్
(విక్ర. క్రియా. ౨౨ కారి. అహో. ౫౦౨ పు.)

కల్పతరువు. ౩౧౩ విష:—పైచింతామణి సూత్రమునకు ౨౯౬ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. వ్యతిరేకాద్యర్థక క్రియారూపములందును భవిష్యదర్థక క్రియలందును ధాతువుతుదిని 'అత్త్వము' నిల్చునని యర్థము. కావున నాదిశబ్ద గ్రాహ్యములగు తుమర్థ భావలక్షణార్థములందును ధాతువు తుదిని 'అత్త్వము నిల్చును. అన్యే ద్రుతప్రకృతయ ఇత్యాదిసూత్రముచే నది ద్రుతప్రకృతిక మగును ఉదా:—చదువు+అ+న్ = చదువన్ = చదువుట నిమిత్తము. చదువఁగన్. వాఁడు చదువ వచ్చెను = వాఁడు చదువుటకొఱకు వచ్చెను (చూ. ౩౦౯ I విష). వాఁడు చదువ నేను వింటిని=వాఁడు చదువఁగా నేను వింటిని=వాఁడు చదువఁగ నేను వింటిని అహోబలపతియు నీరూపముల నిట్లు సాధించెను. "వ్యతిరేకాద్యర్థేచ అత్త్యనుబన్ధే పరేచ క్రియాన్త్యవర్ణ స్యాకారాదేశః స్యాత్. ఘటింపఁడు-ఘటింపింపఁడు. చేయుం పక-ఆదిశబ్దేన ఘటింపలేఁడు - ఘటింపరాఁడు - ఘటింపవచ్చు - ఘటింపనయ్యె - ఘటింపఁగన్ - ఇత్యాది ర్థాః - (తుమాద్యర్థాః). నన్ను వర్తిలఁజేసెన్ - నన్ను ఘటింపఁజేసెన్ ఇత్యాది ణిజర్థవివరణవాక్యమ్. నా। రాయణభట్టు వాఙ్మయధు రంధరుఁడున్......నిర్వహింపఁగన్ (ఆది. ౧ ఆ. ౨౫ ప.) ఇత్యాదయ స్సత్యర్థా దయశ్చ గ్రాహ్యాః...అకళాత్వా ద్ద్రుతప్రకృతికకార్యమ్" (అహో. ౮౭౩ పు). సంస్కృతమునందలి 'తుమున్' ప్రత్యయముయొక్క యర్థమునందును, భావలక్షణార్థమునందును 'అన్' ప్రత్యయ మగునని తాత్పర్యము. భావలక్షణార్థ మీావఱకు వివరింపఁబడెను. (౨౫౩ విష.) అన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ భావ లక్షణం బనఁబడునని సూరియు నిట వివరించును. ఇంక తుమున్నర్థము వివరింపఁబడు చున్నది. "తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్ (3-3-౧౦). క్రియా ర్థాయాం క్రియాయా ముపపదే భవిష్యదర్థే ధాతో రేతౌ స్తః-మాన్తత్వా దవ్యయ త్వమ్. కృష్ణం ద్రష్టుం యాతి. కృష్ణం దర్శకో యాతి........" (సి. కౌ. ఉత్తర కృత్ ౩౧౭౫). క్రియాంతరము ప్రయోజనముగాఁగల క్రియ యుపపదముగా యుండఁగా నని యర్థము. "క్రియోద్దేశ్యభూత క్రియావృత్తి ధాతో రుపపదే ఇత్యర్థః......కృష్ణకర్మక భవిష్య ద్దర్శనార్థం యాన మిత్యర్థః. అత్ర యాతీత్యుప పదమ్"(బాలమ-వ్యా). దర్శనక్రియ కుద్దేశ్యము యానము 'యాతి' అనునది యుప

పదము. యీనము కృష్ణకర్తృకభవిష్యద్దర్శనార్థమని యర్థము. ఇట్టి తుమర్థమందుఁ దెల్గున 'అన్' ప్రత్యయ మగును. కృష్ణు దర్శింప నేఁగుచున్నాఁడు. (దర్శించు+అన్= దర్శించన్ = దర్శింపన్) = కృష్ణుఁ జూడ నేఁగుచున్నాఁడు. 'ఏఁగుచున్నాఁడు' అను నది యుపపదము. 'తిన వాంఛించుచున్నాఁడు' మున్నగు నిచ్ఛార్థక ధాతువు లుప పదము లగునపుడు 'ఇచ్ఛ భోజన విషయక మగునుగాని భోజనప్రయోజనికము కాదు. క్రియాంతర ప్రయోజనికత్వము లేదు. అట్లయినను నచట "తుమ్" ప్రత్య యము వచ్చునుగాన నెల్లెడలను వర్తించునట్లు సూత్రించుచున్నాఁడు."సమానకర్తృ కేషు తుమున్ (3-3-౧౫౮). అక్రియార్థోపపదార్థ మేతత్. ఇచ్ఛార్థే ష్వేక కర్తృ కే షూపపదేషు ధాతో స్తుమున్ స్యాత్. ఇచ్ఛతి భోక్తుమ్........" (సి. కౌ. ౩౧౭౬ సూ). "అత్ర ఇచ్ఛతీ త్యుపపదార్థస్య ఇచ్ఛాయాః భోజనోద్దేశ్య త్వా భావేపి తుమున్" (బాలమ. వ్యా). "పాణిన్యాదౌ ఇచ్ఛార్థేషు ధాతుషు ఉప పదేషు ఏకకర్తృకత్వ మభిహితమ్. (పా. 3-3-౧౫౮). ప్రాథమికోరమాదౌతు ఏకకర్తృత్వాభావే క్రియార్థాయాః క్రియాః అసంభవాత్ సర్వత్రైవ తుమున్ ప్రయోగే ఏకకర్తృకత్వ ముక్తమ్" (గిరీశచంద్రవిద్యారత్నకృత (టిప్పణి) ముగ్ధ. వ్యా. ౧౧౬౪ సూ). "తాదర్థ్యే చతుమ్ ధోః. (వృత్తి) (ధాతోః) చతుమ్ స్యాత్ తాదర్థ్యే, కృష్ణం ద్రష్టుం యాతి." (ముగ్ధ. వ్యా. ౧౧౬౪ సూ). "యస్య ధాతో రర్థః అన్యధాత్వర్థస్య ప్రయోజనం భవతి తస్మా ద్ధాతో ర్భావే భవిష్య త్కాలే చతుమ్ స్యా దిత్యర్థః...అత్ర క్రియయో రేకకర్తృత్వే సత్యేవ చతుమ్ స్యాత్- తేన విప్ర మన్నం భోక్తుం నిమన్త్రయతే ఇతి నస్యాత్ - అన్నభోజనాయ విప్రం నిమన్త్రయతే ఇత్యేవ స్యాత్" (దుర్గా. వ్యా.). తాదర్థ్యార్థమునఁ గ్రియల కేకకర్తృ కత్వమందు 'తుమ్' ప్రత్యయ మగునని యర్థము. ఇట్టియెడల 'తుమ్' ప్రత్యయ మును దాదర్థ్యచతుర్థియుఁ బాక్షికముగ రావచ్చును. కృష్ణుఁడు భుజింప నేఁగు చున్నాఁడు=కృష్ణుఁడు భోజనముకొఱకు నేఁగుచున్నాఁడు. భుజించుటకును నేఁగుటకును గృష్ణుఁడే కర్త. సంస్కృతమున నిట్టినియమ మున్నను దెలుఁగున లేదు. "కృష్ణుఁడు విప్రుని నన్నమును భుజింప నిమంత్రించుచున్నాఁడు" అని యి ట్లేకకర్తృకత్వా భావమందును "తుమర్థః"మగు 'అన్' ప్రత్యయము తెలుఁగున రావచ్చును. ఇట్టి యేకకర్తృకత్వాభావము తుమున్నంతక్రియలతో నీక్రింది రీతిగల వ్యతిరేకార్థక సంక్షేపవాక్యము లన్వయించు పట్టునందుఁ గన్పట్టుచున్నది. ఈవిషయము నథర్వ ణుఁడు వివరించుచున్నాఁడు.

తుమున్నర్థక నాన్తేనేత్యాది:—తుమున్నర్థకనాన్తేన = తుమర్థకమగు 'అన్' ప్రత్యయము తుదిని గలశబ్దముతో, మిసమాసః = వ్యతిరేకార్థక సంక్షేపవాక్య

మదుకుట, క్వచిత్ = కొన్నియెడల, భవేత్ = అగును. 'మి' ప్రత్యయము వ్యతిరేకభావార్థకము. (చూ. ౩౧౦ విష.). సమాసశబ్దమునకు సంక్షేపార్థమును గలదు. కాన మిసమాస మనఁగా వ్యతిరేకసంక్షేపము. "సమాస. పు. (సమ్, అస్. ఘఞ్) సంక్షేపే - సమర్థనే - సమాహారే - వ్యాకరణోక్తే ద్వ్యాదిపదానా మేకపదతాసంపాదకే........" (శబ్దస్తో). ఉదా:—క.........ధారుణిప్రజ। కొక నిమిషం బయినఁ బ్రకృతి నుండఁగ లావే (ఆది. ౪ ఆ. ౨౪౯). (ఉండుటకుఁ బ్రజ కర్త. లావే = లావుగలదా' అనుచో, లావుకర్త). ప్రకృతి నుండఁగన్ = ప్రకృతితో నుండుటకు, లావే = శక్తిగలదా; ఉండదని యర్థము. ఇట్టివి పెక్కుగలవు. సీ......... విప్రు నలుకయు విధికృతంబు। ఆ వె. గ్రమ్మఱింప లావె...... (ఆది. ౮ ఆ. ౧౬౧) తరువోజ .....కర్మవిపాకంబుఁ గడవంగ, లావె (ఆది. ౬ ఆ. ౨౫౦). క...... విధికృతము కడవనేరఁగ లావే (ఆది. ౮ ఆ. ౩౦౪). ఉ.........వారలన్। లావె రణంబులో మన కలంఘ్యబలాఢ్యుల నింక నోర్వఁగా. (సభా. ౨ ఆ. ౨౭౩). క. అవనీతల సామ్రాజ్య। శ్రీవమునకును యోగ్యమైన సతి ద్రౌపది పాం। డవ ధర్మపత్ని నీకం। తవమానము సేయ నేమి యనపాశ్రయవే (సభా. ౨ ఆ. ౨౦౩). తర్వాతి కవులును బ్రయోగించిరి. ద్వి. నెట్టన శరణుల నిలుకడ లరసి। పట్టి చూడంగ నీప్రాప్తియే చెపుమ (బసవ. ౪ ఆ. ౨౯౮). (బసవ. ౭ ఆ. ౫౦). మ......... విశ్వాసం। హారు వర్తించు మహావ్రతోపహతి సేయం బూన నీప్రాప్తియే (నన్ని. కు. ౪ ఆ. ౪౩౩). చ......విశ్వాసం। హారు నుఱ కెత్తిపోయి కలహంబున నోర్వఁగ నీ యలంతియే (నన్ని. కు. ౪ ఆ. ౪౩౨). క.........గురుపుత్త్రుని మా। ర్కొన ధృష్టద్యుమ్నునిఁ గా। వను శక్యమె నీకు నిచటివారికి నధిపా (ద్రోణ. ౫ ఆ. ౩౫౫ ప). ఉ. వింతయె కాము శక్తి యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్ (ఆది. ౭ ఆ. ౫౯). అహోబలపండితుఁడు 'తుమున్నర్థక నాస్తేనేత్యాది సూత్రమునకు వేఱువిధముగ వ్యాఖ్య చేసెను. కవిజనరంజన గాణపతవివరణాదులు దానినె యనుసరించెను. గాణ. క్రి. ౪౧౪ కా. ౮౧ పు) "ఘటింపమి-చేయమి... సమాసే 'నానేరమి' ఇత్యాది. 'తుమున్నర్థకనాస్తేనామి సమాసః క్వచి ద్భవేత్ 'ఇత్యుక్తత్వాత్ వానిఁ జూడఁజాలమి ఇత్యాదిసిద్ధమ్. వానిఁ జూపోపమి ఇత్యాదిరూపసిద్ధిస్తు 'క్వచి ద్రూఢ్యాపి సాధుత్వం। దృశ్యతే కవిభాషితే' ఇత్యుక్తే ర్జ్ఞేయా" (అహో. ౫౦౨ పు). ఇది సరికాదు. "చూడన్ = చూచుటకు, చాలమి = సమర్థముకాకుండుట" అని యిట్లు సయిరీతి గలవాని కర్థముగుటం జేసి యేకార్థీభావరూపసామర్థ్యము లేమిం జేసియు మఱి యే సమాసలక్షణములును లేమిం జేసియు

నట్టివి సమాసము లనిపించుకొనవు. అవి వ్యస్తపదములు. "చూపోవు. ద్వి. అ. క్రి. చూడసహించు. క.........భూపాలుఁడు ధనము గలుగు పురుషుల సిరిఁ దాఁ। జూపోపక కొనఁదగడు. (శాంతి. ౨ ఆ. ౩౯౬ శ. ౮)" అని యిట్లు కోశములం దిది శబ్దపల్లవముగాఁ జూపఁబడినది. ఒక్క మి ప్రత్యయముతోనే కాక వ్యతిరేకార్థకము లన్నిటితోను దీనికి బ్రయోగములు గలవు (చూ. సూ. రా.ని). కొన్నియెడల మి సమాస మనఁగా వ్యతిరేకసంక్షేపవాక్యము లేకున్నను భిన్నకర్తృక స్థలములందుఁ దుమున్ప్రత్యయము వచ్చుట కలదు. ఆ-వె. కరుణతోడ నాకు వరము ప్రసాదింప। బుద్ధియేని లోకపూజితుండు మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు। వలనఁ బాయువలయు వసుమతీశ. (సభా. ౨ ఆ. ౨౧౯). 'వరము ప్రసాదింపన్' అనుటకు నీవు కర్త. 'బుద్ధియేని = బుద్ధికల్గునేని' అనుచో బుద్ధికర్త.

చదువఁజేసెన్ మున్నగుప్రేరణార్థక స్థలములందును 'చదువన్' మున్నగునవి తుమర్థకములేయని యెన్నఁనగును. ఇవియు భిన్నకర్తృకస్థలగత తుమ్ వర్ణకస్థలములె చ. మదరుడఁగించి భూపతి సమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁజే।యుదు ననిపూని... (ఉద్యో. ౩ ఆ. ౨౫౦ ప.) చ...భీష్ముని నెసకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీవని యబ్బుఁ జేసి...ఉద్యో. ౪ఆ. ౨౦౭ ప.). 'చైత్రుఁడు మైత్రునిఁ జదువఁజేసెను' = చైత్రుఁడు మైత్రునిఁ జదివించెను.' అనుచో 'చదువన్' అనుదానికి మైత్రుఁడు కర్త. "చేసెను= ప్రేరించెను = ప్రేరణముచేసెను" అనుదానికిఁ జైత్రుఁడు కర్త. ఇట్టిచోటులు భావలక్షణార్థస్థలములు కానేరవు. (చూ. ౨౧౩ విష).

వలయ్యాదియోగము గల భావార్థమందును వ్యతిరేకాదౌ భావినిచేత్యాది ప్రకృతసూత్రముచే నాదిశబ్దమహిమంజేసి 'అత్వము' వచ్చును. ఇది పదాన్తస్థల మగుటచే అన్యే ద్రుతప్రకృతయ ఇత్యాదిచొప్పున ద్రుతప్రకృతిక మగును. చేయు+అ+న్+వలయున్ = చేయవలయున్ = చేయుట వలయునని యర్థము. ఈవిషయమే కేచి న్నాన్తాచ్చేత్యాది సూత్రమున ననువదింపఁబడెను. (చూ. ౩౦౯ విష.) తే-గీ. ఒలసి నీపుత్త్రులెల్ల నొండొరులతోడ। నెట్టొడంబడి యుండుదు రట్ల చేయ। వలయు...(సభా. ౨ ఆ. ౧౩౧). క. వెలయ విధిదృష్టనయమున। వలయుఁ బరాక్రమము సేయ వసుధేశ్వర.........(సభా. ౧ ఆ. ౧౩౧). ఈవిషయమున విపుల ప్రయోగప్రదర్శన పూర్వకముగ వెనుక వివరింపఁబడెను. (౩౦౯ I విష).

కర్మార్థమందును భవిష్యదర్థమందును నీ 'అ' త్త్వము కల్గును. వానిలోనిది పదమధ్యగత మగుటంజేసి "అన్యే ద్రుతప్రకృతయః" అనుచొప్పున ద్రుతప్రకృతికత్వము కల్గదు. పునరాగమః క్రియాణా మిత్యాదిచే నకారవర్ణాగమము కల్గును.

(౨౯౬ విష). "సర్వత్ర అకళాత్వాద్ద్విత ప్రకృతికకార్యమ్" అను నహోబలపతి యభిప్రాయము సరికాదు (అహో. ౪౭౩ పు. ౨౯౬ విష.). చేయు+అ+న్+పడు = చేయఁబడు మొ. చాలుధాతుజముగు 'అన్' ప్రత్యయాంతము విశేషణముగఁ గనపట్టుచున్నది. క. నాలవదినంబు పతిమృతి। కాలంబని మది నెఱింగి కడునిష్ఠమెయిం। జాల భరంబుగఁ బూనెన్ । బాల త్రిరాత్రోపవాస పరమవ్రతమున్ (అర.౭ఆ.౨౦౦) తే-గీ......ఇది చ్చాల నబల దీని । కలుగఁజనదు (ఆది. ౬ ఆ,౨౨౦) 'ఇది బాల యబల' అని పాఠాంతరము వావిళ్ళవారి ముద్రణమునఁ జూపఁబడెను. నాయొద్దనున్న తాళపత్రమాతృకలయందును 'బాల' అని యున్నది. ద్విపద-చాల మే లంద్రు సజ్జన విరోధంబు (హరి ౭ ఆ, ౭౪౬ ప). శా-చాలన్ గౌరవమొంద...(హరి. పూ. ౬ ఆ. ౧౪౭).

తుమర్థ భావలక్షణంబులందు నజీ యగు. ౪౦.

| | |
|---|---|
| | భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ. తుమర్థంబందును భావలక్షణంబునందును నజీ |
| బాలవ్యాకరణ | వర్ణకంబగు. తుమర్థంబు-చైత్రుండు వండను బోయెను. |
| వివరణము. | పాకక్రియార్థము పోయె ననియర్థము. భావలక్షణము- |
| ౩౧౩ I విషయము. | చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇచట వండుట లక్షణము. వచ్చుట లక్ష్యము. (౩౦౯ I విషమున బా. క్రి. ౧౨౨ సూత్ర ముదాహరింపఁబడెను.) |

సంజీవని. ౩౧౩ I విష:—తుమర్థ మనఁగాఁ దాదర్థ్యార్థమునందును భావలక్షణార్థమం దనఁగా సతిసప్తమ్యాద్యర్థము నందును 'నజీ' వర్ణకమగును. చైత్రుండు వండను బోయెనని తుమర్థోదాహరణము. చైత్రుండు వండుట కొఱకుఁ బోయెనను తాదర్థ్యచతుర్థీఘటిత వాక్యమె పై తుమర్థ ఘటితవాక్యమునకుఁ బర్యాయము. చైత్రుండు వండ నతిథివచ్చె ననునది భావలక్షణార్థోదాహరణము. 'చైత్రే పచతి సతి అతిథి రాజగామ'అనురీతిని సంస్కృతమున నుండు దానికి సరిగఁ జైత్రుఁడు వండుచుండ నతిథి వచ్చెనని తెల్గువాక్యము ప్రయుక్తమగును. (చూ. ౨౫౩ విష.) భావమనఁగా "క్రియ"యని యర్థము. ఏవ్యాపారముచేత వ్యాపారాంతరము లక్షిత మగునో యనఁగఁ దెల్పఁబడునో యట్టి వ్యాపారమును దెల్పు ధాతువుపైని భావలక్షణార్థక 'నజీ' వర్ణకము నిల్చునని తాత్పర్యము. అతిథి వచ్చుట చైత్రుఁడు వండు కాలమం దనియర్థము. చైత్రునిచే వండఁబడుచుండఁగా నతిథి వచ్చెనునది కర్మార్థమునందలి యుదాహృతి.

౩౦౯ I విషయమున 'తు'రర్థోదాహృతులు చూపఁబడెను. అందే భావలక్షణార్థక సుబ్బ్యుదాహరణములును విపులముగఁ జూపఁబడెను. ఉ. అతులోర్వీ సురముఖ్య మంత్రమహితమాహాత్మ్యంబునన్ వాసవ। చ్యుతుఁడై సుందరతక్షుఁడురువిషాద్భుల్ ధూమ వాత్యాకరయో। ద్ధతి నుద్ధూతవివర్ధితాయత బృహద్దావాగ్నివోలెన్ విచే। ష్టి తుఁడై మేఘపథంబునం దిరుగుచుండెన్ విస్మితుల్గా జనుల్ (ఆది. ౨ ఆ. ౨౩౪ ప)
సీ. ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే పసుదేవుఁ డుండంగ వసుమతీశ। బుత్విజుండని విచారించి పూజించితే ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి। నాచార్యుఁడని వినయమునఁ బూజించితే కృతమతుల్ ద్రోణుండుఁ గృపుఁడు నుండ।...(సభా. ౨ ఆ.౧౧౫.)
ఇట్టివి యనంతముగాఁ గలవు. ఇట్టివాని యందెల్ల సూరి యుపదేశించిన లక్ష్యలక్షణ భావము నుపచరింపఁజేసికొనవలయును.

నన్నయా చు రితి క్రియా పదానాం।సర్వేషాం వర్తమానకాలే
౩౧౪ విష. స్యాత్ (ఆ. చిం. హలం. ౧౧ కారి. అహో ౪౦౫ పుట.)

కల్పతరువు. ౩౧౪ విష:— ఈకారికకీవఱకు ౨౯౬ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. ఎల్లవిధములగు క్రియాపదములకును వర్తమానకాలార్థమున 'చు'వర్ణము చేరును. "సర్వేషా"మ్మనుదాని మహిమచే వర్తమానార్థకవిధేయ విశేషణాభిన్న సమాపకక్రియారూపములందును వర్తమానార్థక ధాతుజవిశేషణము లందును వర్తమానార్థక లాక్షణికావ్యయములందును నీ 'చు'వర్ణము నిల్చునని యర్థము, 'వసతి రనుబన్ధకః స్యాదత్ర లడర్థో వివక్షితస్తత్ర' అని యిట్టు 'లట్టు' యొక్క యర్థము వివక్షిత మగునపుడె 'ఉండు' ధాతుజరూపము లనుబంధముగా నిల్చుననుటచేత వర్తమానార్థక లాక్షణికావ్యయమునందు "ఉండు"ధాతుజరూపాను బంధము నిలువనేరదు. వర్తమానార్థక సమాపకక్రియయందును లడర్థకమై యగు శతృప్రత్యయార్థ విశేషణమునందును మాత్రమె 'ఉండు' ధాతుజరూప మను బంధముగా నిల్చును. సంస్కృతమందలి శతృప్రత్యయాంతము విధేయ విశేషణమె యగుచుఁ గ్రియతోనె యన్వయించునని సంస్కృతవ్యాకరణపండితుల యాశయము (చూ. ౩౧౫ II విష). 'గుణవంతులగుచున్న కొడుకులు గలవాఁడు.........(ఆది. ౮ ఆ. ౨౫). చ. అలఘులు కృష్ణపార్థులు మహాత్ములు యాదవకౌరవాన్వయం। బులు వెలిగించుచున్న నృపపూజ్యులు.........(ఆది. ౮ ఆ. ౨౮౭) మున్నగు ప్రయోగము లట్టియాశయమును విరోధించుచున్నవి. కావునఁ దెలుంగున లడర్థకమగు శత్రంతము నామాన్వయియె యనకతీరదు. తెలుంగునందలి 'చు'వర్ణాంత లాక్షణికావ్యయమువంటి రూపము సంస్కృతమున లేనేలేదు. 'వచ్చుచున్న

వాఁడు'-అనుదానిని జెంకావణిపక్షమున వర్తమానార్థక సమాపకక్రియ, లేదా వర్తమానార్థక విధేయవిశేషణము ననవచ్చును. 'చదువుచున్న పాఠము' అనుదానిలోని 'చదువుచున్న' అనునది వర్తమానార్థక విశేషణము. "వాఁడు చదువుచుం బోవుచున్నాఁడు. అనుదానిలోని "చదువుచున్" అనునది వర్తమానార్థక లాక్షణికావ్యయము. (చూ. ౩౧౫ II విష). సూరి. 'చు' వర్ణమును లద్రూపసాధనమున వర్తమానార్థద్యోతకముగా విధింపక "ఉదంతంబునకు ఉట్టుపరంబగునప్పు డున్నానుబంధంబగు. ౧౩. ఉన్న శబ్దంబు పరంబగునప్పుడు చువర్ణకంబగు. ౧౪" అని (బాల. క్రియా.) యపమార్గమున విధించుకొన్నవాఁడయ్యెను. చువర్ణకము వర్తమానార్థకమనియు దానికిఁ బరముగా "ఉండు" ధాతురూపము నిల్చుననియుఁ బ్రక్రియఁజూపుట యుక్తముగదా.

చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున
బాలవ్యా. శత్రర్థంబునం దగు. ౪౩.
౩౧౪ I విష. చూచుచుం బోవుచున్నాఁడు. చూచుచుం బోయెను-
చూచుచుం బోవఁగలఁడు.

సంజీవని. ౩౧౪ I విష:—'చువర్ణకంబు ద్రుతాంతంబు అనఁగా 'చున్' ప్రత్యయము శత్రర్థమునం దనఁగా వర్తమానార్థమునఁ గ్రియాన్వయము గల్గుచుండఁగా ధాతువున కగునని యర్థము. 'చూచుచున్' అనుపదము 'పోవుచున్నాఁడు' అను క్రియతో నన్వయించుచున్నది. ఇట్లె యంతటను నెఱుంగునది. "పోయెను - పోవఁగలఁడు" అను క్రియలు వరుసగా భూతార్థమును భావ్యర్థమును బోధించుచున్నను బోవునప్పటి సరనక్రియ వర్తమానకాలిక మగుటలో విరోధము లేదని సూరి యాశయము నెన్నునది. (విస్తర) (చూ. ౩౧౫ II విష.) బా. క్రి. ౧౪ సూత్రముచే విధింపఁబడిన చువర్ణకము 'ఉన్న' శబ్దపరకత్వమున వచ్చును. ప్రకృత

---

విస్తర. ౩౧౪ I విష:—పయిసూరి యాశయము సరి కాదు. "చూచుం బోయెను." మున్నగుచోటులందలి 'చు' వర్ణకము వర్తమానార్థకము కాదు. ప్రధాన క్రియ యనఁగా సమాపకక్రియ భూతార్థకమగు నపుడా వాక్యములోని గౌణక్రియ యనఁగా దానితో నన్వయించు నసమాపకక్రియయు భూతార్థకమె యగుననుట వైయాకరణ సంప్రదాయము. "ధాతుసంబన్ధే ప్రత్యయాః (౩-౪-౧). ధాత్వర్థానాం సంబన్ధే యత్ర కాలే ప్రత్యయా ఉక్తా స్తతో ఽన్యత్రాపి స్యుః. తిజన్తవాచ్య క్రియాయాః ప్రాధాన్యా త్తదనురోధేన గుణభూత క్రియావాచిభ్యః ప్రత్యయాః వసన్ దదర్శ-భూతే లట్. అతీతవాసకర్తృకం దర్శన మర్థః..."(సి. కౌ. ౨౨౩౪ సూ.). "వసన్దదర్శేత్యత్ర లడాదేశః శతృప్రత్యయో భూతకాలే ఇతి సిద్ధం భవతి" (బాలమ. వ్యాఖ్య).

సూత్రమున విధింపఁబడిన 'చు' వర్ణకమునకు 'ఉన్న' శబ్దపరకత్వ ముండదు-మఱియు నది 'చు' వర్ణకము. ఇది 'చుఁ' వర్ణకము. ఇది క్రియాన్వయి. అది క్రియతో నన్వయింపదు.

బాలవ్యా. ఆనంతర్యంబున డు వర్ణకంబు ద్రుతాంతం బగు. ౪౨
౩౧౪ II విష జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె.

సంజీవని. ౩౧౪ II విష:—ఆనంతర్యము—అంతర మనఁగా నెడము - అది లేనిది 'అనంతరము' దాని భావార్థకరూపము - ఆనంతర్యము = వెంటనె-తోడ్తోఁ. జాబిలి తోఁతెంచుడున్=చంద్రుఁ డుదయింపఁగానే = ఉదయించినతోడనే, కువలయంబులు వికసిల్లెను=కలువలు వికసించెను. దీని ప్రయోగమునఁ గార్యకారణ భావ ముండునని బా. గు. ప్ర. వ్యాఖ్యాత వ్రాయఁగా. బా. సా. వే. వ్యాఖ్యలో నది యొక్కిలింపఁబడెను. (బా. గు. ప్ర. 333 పు. ద్వి. ము) (బా. సా. వే. ౪౧౨ పు). సూరి యిచ్చిన యుదాహృతియందుఁ గార్య కారణభావము కుదిరినను నది సార్వత్రికము గాదు. ఉ. అంబుజమిత్రుఁ డంబుద లవాంతరితుండగుడుం దదీయ తేజంబు జగజ్జనంబులకు శక్యమె కప్పఁగ......(ఆది. ౭ఆ. ౨౨౧) (ఇచట-అగుడున్=అయినంత మాత్రముచే ననియర్థము) కాననిట్టిది యానంతర్యమునే కాక యర్థవిశేషములను బోధించునని యెఱుంగనగును.

సూరి యిట్లు సూత్రించుట సరికాదనియు నిందలి 'డు' అనునది భావార్థకమనియు 'ట' ప్రత్యయ మవంటిదె యనియు 'ట' ప్రత్యయమునైతము 'చా'ర్థకమగు 'ఉను' శబ్దముతోఁగూడి యానంతర్యమును బోధించుననియు ౩౦౯ విషయమున విపులముగా విమర్శితమయ్యెను.

నన్నయా భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్ (ఆం.చిం.
౧౨ కా. అహో. ౪౦౫ పు).
థర్వణీయము. క్వచి న్నవర్ణే దే గ్లోఁః। క్వచి డ్డోశ్చ తథా భవేత్ ।
౩౧౫ విషయము. క్వచి త్తదర్థే డ యుగం। క్వచి న్నస్యేచ్ఛ లోపవాన్
(వికృ. పాలం. ౭ కారి. అహో. ౪౦౭ పు).

కల్పతరువు. ౩౧౫ విష:—భూతార్థానాం క్రియాణామ్ = భూతార్థక క్రియలకు, నః = నవర్ణకము, స్యాత్ = అగును. భూతార్థకముల కని సామాన్యముగా బహువచనమున నిర్దేశించుటచేత, భూతార్థక క్రియాజన్య విశేషణము లందును, చేదాద్యర్థక లాక్షణికావ్యయములందును నీ 'న'వర్ణకము వచ్చును. క్త్వా భూతయోః క్రియాంత్య స్యేత్తనుచొప్పున (౮౬ విష) నీ నవర్ణకమునకుఁ బూర్వ

ముగ 'ఇ'త్వము కలుగును. అన్యే ద్రుతప్రకృతయ ఇత్యాది సూత్రముచొప్పున నిది ద్రుతప్రకృతిక మగును.

సంస్కృతమున "చేత్ = యది" అనుశబ్దములు వాడునప్పుడు గల్గెడియర్థమందును, 'అపి' అనునది వాడునప్పటి యర్థమందును, నింకను భూతార్థమందలి భావలక్షణార్థమునందును క్త్వవదర్థమందును (భూతార్థకవిశేషణార్థమునందు) నీరీతిగల 'ఇనన్' అను ప్రత్యయము నిల్చును. చేదర్థమునఁ గార్యగారణభావము భాసిల్లును. చేదర్థవ్యవహారమునఁ గ్రియాద్వయమును భావ్యర్థకములె యై యుండుట సహజము. అట్లయినను గార్యభూతక్రియాపేక్షచేఁ గారణభూతక్రియ పూర్వకాలికమై యుండునుగాన నట్టిది భూతకాలికక్రియగ నైతము ప్రయోగింపఁబడును. ఈవిషయమునే సూరి "చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. (బాల. క్రి. ౧౧౯ సూ). భూతార్థకములపై నపవ్యర్థము నిల్చునపుడును 'నన్ = ఇనన్' ప్రత్యయము వచ్చును. చేదర్థ:—చ.........ఉత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గు సేసినం। జెడు నిహాముం బరంబు.........(ఆది. ౧ ఆ. ౧3౯). అపవ్యర్థయోగమునకు:—చ. అడిచినఁ దిట్టిన న్మఱి మహాపరుషంబులు పల్కి యల్కతోఁ। బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు (ఆది. ౧ ఆ. ౧3౯). భావలక్షణ:—క. అనినవిని రోమహర్షణ। తనయుండు (ఆది. ౧ ఆ. 2౬). వండిన యన్నము. ఇది భూతార్థకవిశేషణము. ఇట్టివానిని ధాతుజవిశేషణములు క్రియాజన్యవిశేషణములు నని వ్యవహరింతురు. నవర్ణకము క్రియాజన్యవిశేషణమగునప్పటి వ్యాకరణకార్యవిశేషము లీవలకు వివరింపఁబడెను (౩2౮-౩2౯ విషు). పయి నుదాహరించిన నాల్గువిధముల రూపములును భూతార్థకములె. మహాకవి ప్రయోగములనుబట్టి నాల్గువిధములుగాఁ జూపఁబడినవి.

క్వచి దిత్యాది:—చింతామణి యం దాచ్ఛికక్రియల రూపసాధన ప్రక్రియ యుపదేశింపఁబడలేదు. అత్వాది తత్సమానా మివేత్యాది సూత్రముచొప్పునఁ దత్సమక్రియారూపసాధన విధులచే యథాసంభవముగ నాచ్ఛికక్రియల రూపములను సాధించుకొనుచు యథావసరముగ వర్ణలోపాగమాదేశములను గల్పించుకొనుచుండవలయునని "వర్ణాగమో విశేషః; పురుషే ష్వర్థేషు చాపి వచనేషు" అను గ్రంథాంతసూత్రము వక్కాణించుచున్నది. అట్టివర్ణలోపాగమాదేశాదివిధులు కొన్నిటి నధర్వణుఁ డుపదేశించుచున్నాఁడు:—నవర్ణే=భూతార్థక విశేషణాదుల 'న' వర్ణకము పరమగుచుండఁగా, క్వచిత్ = ఒకానొకప్పుడు, డేర్లోపః = పూర్వస్థిత డి వర్ణమునకు లోపము సంభవించును. క్వచిత్=ఒకప్పుడు, డోఙ్ఛ=పూర్వస్థిత 'డు'

వర్ణమునకును లోపము కల్గును. క్వచిత్=ఒకానొకప్పుడు, తదర్థే = ఆనవర్ణకాంతశబ్ద
ముందు, దయుగమ్=ద్విత్వ దవర్ణము చూపట్టును. క్వచిత్ = ఒకానొకప్పుడు, నస్య-
ఇచ్ఛ=నవర్ణము మీఁది 'ఇ' వర్ణము, లోపవాన్ = లోపము కలదగును. ఉదా:—
డిలోపము:—ఉండినన్ = ఉం+నన్=ఉన్నన్ (నకారపరకానుస్వారము నకారముగఁ
బరిణమించెనని యెఱుంగునది) = ఉండినచోన్ (చేదర్థకము). ఉండినప్పటికిని
(అప్యర్థకము). వాఁడున్నన్ వీఁడు వెడలెను (భావలక్షణార్థకము). ఉన్నవాఁడు
(వర్తమానార్థక విశేషణము). ఇది భూతార్థకమె కావలసియున్నను వర్ణ లోపాది
వికార మందినదిగాన నన్నయాది మహాకవులు దీనిని వర్తమానార్థకముగా వాడిరి.
'ఉండినవాఁడు' అనునది భూతార్థక విశేషణము. పూర్వక్షణమున ముగిసినది
భూతము. ఈక్షణమున నున్నచో నది వర్తమానకాలిక మగును. "వసతి రనుబద్ధకః
స్యా,ద్యత్ర లడర్థో వివక్షిత స్తత్ర" (౨౯౬విష.) అనుచెప్పున నితరధాతువుల వర్త
మానార్థకరూపములందు 'ఉండు' ధాతు వనుబంధముగా నుండునుగాన వర్తమానా
ర్థక విశేషణరూప ముత్పన్న మగునపుడు ధాతువు తుదిని, "చురితి క్రియాపదానా"
మిత్యాది చెప్పున (౨౯౬ విష.) చువర్ణపూర్వకమయి యీ'ఉన్న'శబ్దము నిల్చి
యాయాధాతువుల వర్తమానార్థక విశేషణరూపము లేర్పడును. ఉదా:—
చదువు+చు+ఉన్న = చదువుచున్న పాఠము. ఇట్లె నన్నయాది మహాకవులెల్ల వర్త
మానార్థక విశేషణములందు నియతముగ 'ఉన్న' అను నీరూపమునే ప్రయోగిం
చుచు వచ్చుటంజేసి (౨౯౬ విష. ౧౪ పుట) 'ఉండిన' అనుదాని రూపాంతర
మె యయ్యు 'ఉన్న' అనునది వర్తమానార్థక విశేషణమె యని విశదమగుచున్నది.
(౨౯౬-౨౯౯ విష.) 'ఉన్న' అనుదానికి భూతార్థకత్వమునఁ బ్రయోగములు లేవు.
డు లోపమునకు:—ఉండునే=ఉన్నే. (ఇందును నకారపరకానుస్వారము నకారముగఁ
బరిణమించెనని యెఱుంగునది.) క. పరిపూర్ణములై । కరమొప్పుచున్నె చెఱువులు...
(సభా. ౧ ఆ. ౪3) సీ. దుర్జనయోధవరుల।కడ నుండకున్నది కరుణ యార్జవము...
నిల్పునది, శత్రుషడ్వర్గ జయ ముందునది. (ఆది. 3 ఆ. ౨౦౬) ఉండకున్నది = ఉండ
కుండునది) ఉ...... మేలుగాఁ బడసి యాళ్ళను నున్నది......(ఆది. ౬ ఆ. ౨౭౦)
(ఉన్నది=ఉండునది). ఆ-వె. నమ్మఁ దగనివారి నమ్మక యున్నది।...(శాంతి. 3ఆ.౨౩౯)
(ఉన్నది=ఉండునది). గీ. కాని తెరువున నడుచుచున్నేని గురుని । నైన శాసింపఁగాఁ
దగు......(శాంతి. 3 ఆ. ౨౭౫) (ఉన్నేని=ఉండునేని) సీ......రహస్యంబుగాక ।
యున్నేనిఁ జెప్పవే యన్న నద్దేవుండు (అను ౪ ఆ. ౪౨౨). దయుగమునకు:—పడి
నన్=పడ్డన్=పడ్డచోన్ (చేదర్థకము). పడినప్పటికిని (అప్యర్థకము). నీవుపడ్డన్ వాఁడు

వెడలెను (భావలక్షణార్థకము). పడ్డవాఁడు=పగముసేయంబడ్డ మిన్నేలు (నైష.) (భూతార్థక విశేషణము) ఇట్లె-ఇడినన్=ఇడ్డన్, చెడినన్=చెడ్డన్, మొ. దీర్ఘముమీఁద నిట్టిరూపము కల్గనేరదు. 'నస్యేచ్ఛ లోపవాన్' అనుచోటి చ శబ్దపు మహిమచే "తగినన్=తగ్గన్" అనియు నుండునని యెఱుంగునది. నకారోపరి గతేకారలోపము నకు:—వినినన్ = విన్నన్. విన్నన్ = వినినచోన్ (చేదర్థకము). విన్నప్పటికిని (అప్యర్థకము; నీవు విన్నన్ వాఁడు పల్కఁడు. భావలక్షణార్థకము). విన్నవాఁడు=భూతార్థక విశేషణము. ఇట్లే=అను-కను-కొను-తిను-చను-మొ. దీర్ఘపూర్వక స్థలములలో 'ఇ' లోపమురాదు. ఉదా:—మానినన్-ఊనినన్-మొ. (విస్తర) ప్రయోగములు:—చ. అడిచినఁ దిట్టినన్ మఱి మహాపరుషంబులు పల్కి యల్కతోఁ।బొడిచిన నుత్తము ద్విజులు పూజ్యులు వారల కెగ్గుసేసినన్ । జెడు నిహముం బరంబు.........(ఆది. ౧ ఆ. ౧౩౯). అడిచినన్ = అడిచినప్పటికిని, తిట్టినన్ = తిట్టినప్పటికిని, పొడిచినన్= పొడిచినప్పటికిని, ఇవి 'అప్యర్థకములు'. ఎగ్గుచేసినన్ = కీడుచేసినచోన్, కీడుచేసిన యెడల. ఇది చేదర్థకము. చ. అవని విదీర్ణమైనను హిమాద్రి చలింపఁగల్గినన్ మహా। ర్ణవజలమింకినం దివసనాథుఁడు.........తేజమేదినన్ । ......... । కువలయనాథ నీకు నొకకుత్సితభావము గల్గనేర్చునే ( ). ఇంక భావలక్షణార్థమునకు:—క. అనిన విని రోమహర్షణ । తనయుండు.........(ఆది. ౧ ఆ ౭౬). అనినన్ = అనఁగా,విని. ఉ.........పయోధి రిక్తమై । నందిమి కూర్మకర్కటక నక్ర.........కాలకేయులు బయల్పడి తోఁచిరి. (ఆర. ౩ ఆ. ౩౯). (నన్. యతి ప్రాసస్థానగతము). క.........భారతీకన్యక నా । కీ నర్హుఁడ వగుదనినన్ । భూనా

---

విస్తర. ౩౧౫ విష:—పయి యథర్వణకారికలోని పూర్వార్థమును సూరి సంగ్రహింపమిచేఁ ద్రిలింగలక్షణశేషమున సంగ్రహింపఁబడెను. "ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు 'ఉండు - చను - చేరుకొనులు ప్రశ్నార్థకైకారపరకంబు లగునపుడు వానికడ యచ్చులకు లోపంబు విభాషనగు. అగుచో 'ఉండు' డకారంబునకు నకారంబగు. (ఉండులోని సున్న స్థిర నకారపరకత్వంబున లోపించునని చెప్పఁబడెను. 'వేసఁగి = వేసవి' ఇత్యాదులలో నరసున్న లోపించుచున్నది గదా). 'చేరుకొను' అనఁగా నను ప్రయుక్తంబగు కొనుధాతువని యర్థము. ఉదా:—క.........।పురుషార్థఁబునకు హాని పుట్టక యున్నే (భార. విరా.౧ ఆ). ఉ.........మునీంద్ర నీకుఁ జన్నే నళినాక్షులందు మది నిల్పఁగ (భార. ఆది. ౮ ఆ). ఉ.........అహితమున్ భయమున్ చొరకొన్నె నాకు పుత్త్రులకున్ (భార. సభా. ౨ ఆ). పక్షమున ఉండునే. మొ." (ప్రౌఢ. క్రియా. ౨ సూ).

యకుపల్కు చిత్తమున కింపగుడున్ (నిర్వ. ౧ ఆ. ). ఉ...ఇది యొయ్యెడ నెమ్మెయిఁ బుట్టినన్ననున్...తండ్రి కిట్లనున్ (నిర్వ. ౨ ఆ. ౨౪). (అన్ననున్ = అనఁగాన్ - భావలక్షణ). క. తనచేలి పుష్పములఁ జ | ల్లిన నంతటఁ జెదరి యవి యళి ప్రకరనిషే | వన మొప్ప.........(అర. 3 ఆ. ౧౦౯). 'ఇనన్' 'ఇ' యతిస్థానగతము ప్రాణియతి). క. దయమాలి పోవ నేఁటికి | ......... | ప్రియ మెసఁగ బ్రదుకు బ్రదుకం | డయినను మఱి పోవరాదె యని చెప్పుటయున్ (శాంతి. 3 ఆ. 3౭3). బ్రదుకండైనన్ = బ్రదుకనిచోన్ (ఇది వ్యతిరేకచేదాద్యర్థకము.

సంస్కృతమునఁ జేదర్థము నప్యర్థము భావలక్షణార్థమును నిచ్చు నిట్టిప్రత్యయములేదు. భూతార్థక విశేషణరూపములును (3౧౪ II విమ). (క్త - క్తవతు ప్రత్యయాంతములు) వర్తమానార్థక విశేషణరూపములు (శతృ. శానచ్ ప్రత్యయాంతములు) మాత్రము సంస్కృతమునఁ గలవు, సంస్కృతమున నిట్టి చేదాద్యర్థక ప్రత్యయము లేమింజేసియే యట్టియర్థము సుప్తిఙంతపదములపైని (ధాతుజవిశేషణములపైని సమాపక క్రియలపైని) "చేత్ = యది, అపి" మున్నగుశబ్దములను జేర్చి చేదర్థమును నప్యర్థమును సంపాదించికొందురు. ఇంక సతిసప్తమ్యాదులచే ననఁగా భావలక్షణార్థక సప్తమ్యాదులచేఁ దెనుఁగులోని భావలక్షణార్థక ప్రత్యయముల యర్థమును సంస్కృతమున సంపాదించుకొందురు. పై సంప్రదాయముచొప్పుననే నన్నయాది మహాకవులును దెనుఁగున నీచేదాద్యర్థక ప్రత్యయార్థములను 'ఏనిన్' మున్నగుశబ్దములను జేర్చి నిర్వహింపసాగిరి. ఇవి సుబంతములవయిని సమాతము నిల్చును. తే-గీ. హితములగు నాదువచనంబు లిపుడు వినని | వాఁడవైతేని నప్పుడు వారు వడిరి | వీరు వడిరను పల్కులు విందుగాక | శకుని కర్ణదుశ్శాసనుల్ సమ్మతింప (ఉద్యో. ౨ ఆ. ౧౫౫). (వినని వాఁడవైతేనిన్ = విన నప్పటికిని, వ్యతిరేకమునందలి యప్యర్థకము) చేదాద్యర్థాతిశయ ద్యోతనమునకయి యిట్టియెడల 'చా'ర్థకమగు నున్ శబ్దమునైతము చేరుచుండును. క. అయిదుర్వురు నొకతలయై | యాయోధనమునకు నడచునట్టిద యేనిన్ | వేయేల మనము కా దెదు | రై యేడ్తెఱఁ దాఁక పారు నకైనను వశమే (ఉద్యో. ౨ ఆ. ౧౫౧). క. సారథియు రథియునై యొక | తేరం గృష్ణు లతిఘోరతేజస్స్ఫార | స్ఫారతఁ దోఁచిన నైనను | ధీరత వాటించి చూచి తెలిసెదవు బలే (ఉద్యో. ౨ ఆ. ౧౫౨). (తోఁచిననైనన్ = తోఁచినచో నైనను) = కొన్నియెడల సముచ్చితస్థలములందును 'చా'ర్థకశబ్దము నిల్వకుండుటయుఁ గలదు. క. వినినఁ దలంచిన వ్రాసినఁ | గొనియాడిన దురితపీడకుం దొలఁగి (శాంతి. 3 ఆ. 3౮౨). (చూ. ౮౪ I విమ). ఏనాదిశబ్దములతోఁ జేదాద్యర్థ నిర్వాహణము:—ఇందు

'నాఁడు' శబ్దము ధాతుజవిశేషణముమీఁదను 'ఏని' సుప్తిఙంతములమీఁదను నిల్చును. క. గుఱుతొని కార్యాకార్యము । లెఱుఁగక దుశ్చరితుఁడై యహితుఁడగునేనిన్ । దఱవక గురునైనను జను । లెఱుఁగఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్ (ఆది. ౬ ఆ. ౧౦౩) (అగునేనిన్ = అయినన్ = అగుచోన్) (స్యాచ్చేత్) (గురునైననున్ = గురుసినైనప్పటికిని). ఉ.........అట్లు కానినాఁ । డేల గృహస్థవృత్తి......... (ఆది. ౬ ఆ. ౨౭౦). (కానినాఁడు = కానిచో). సీ.......... । నేఁడు పోవని నాఁడు నిష్ఫలం బిమ్మహా, యత్నమంతయు.........(ఆది. ౧ ఆ. ౧౧౫). (పోవని నాఁడు = పోవనిచో). క. కడుఁ గ్రూరుఁడవయి నృపతుల । విడువనినాఁ డాజిఁ బాండవేయులు......... । విడిపింతురు.........(సభా. ౧ ఆ. ౧౯౪). ఉ......... ప్రొద్దును బోయెఁ గ చుండు నేనియున్ । రాఁడు వనంబులోన మృగరాక్షస పన్నగ బాధ నొందెనో (ఆది. ౩ ఆ. ౧౧౨). (కచుండు నేనియున్ = కచుండన్ననో రాఁడు). క. తనయెఱిఁగిన యర్థం బొరుఁ । డనఘా యిది యెట్లు చెప్పు మనియడిగినఁ జె । ప్పని నాఁడును సత్యముఁ జె । ప్పనినాఁడును ఘోరనరకపంకమునఁ బడున్ (ఆది. ౧ ఆ. ౧౩౭). ఇట్లగుటచే "మహద్బహు కర్తృకక్రియకు నేకవచనంబు విభాషనగు. ఉదా:—క. తనయెఱిఁగిన యర్థం బొరుఁ డనఘా యిది యెట్లు........." (ప్రౌఢ. క్రియా. ౬సూ). అను త్రిలింగలక్షణసూత్రము నిరాధార మగుటంజేసి యగ్రాహ్యమని గ్రహింపవలయును. ఉ. ఇంతులగోష్ఠి నున్న యతఁ డెంత వివేకము గల్గెనేని య । త్యంత మదాభిభూతుఁడగు (ఆది. ౭ ఆ. ౫౯). వచనము. నాకు సంజీవని పని సేయదయ్యెనేని నాచేత నుపదేశంబు గొన్నవారికిఁ బని సేయుంగాక......... (ఆది. ౩ ఆ. ౧౩౨). చ. ఇతనికిఁ గూర్తురేని ధన మిత్త్రులుగాక (సభా. ౨ ఆ. ౧౦). తే-గీ. కడఁగ నమబుద్ధి వీనికిఁ గల్గెనేనిఁ । గాదు శాపఫలం బట్లుగాక బుద్ధి । హీనుఁడై గర్వితుం డగునేని శాప । హవ్యవాహఫలంబు వీఁ డనుభవించు (అర. ౧ ఆ. ౧౦౩) (చూ. చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. బా. క్రి. ౧౯ సూ). క. ధర్మసుత, ధార్తరాష్ట్రుల । ధార్మికులై పెఱిఁగిరేనిఁ దడయక విధిచే । నిర్మూలితు లగుదురు... ......(అర. ౨ ఆ. ౩౧౪). ఆ-వె. నాకు విహితభక్షణం బిది యిప్పుడుఁ బూని కావ నీకు బుద్ధియేని । .........(అర. ౩ ఆ. ౨౩౪). (బుద్ధియేనిన్ = బుద్ధి కల్గినచోన్.) ఏని శబ్దముచోట నిట్టియెడల 'ఏమి'శబ్దమును దిక్కన యొకచోఁ బ్రయోగించెను. ఆ-వె. ఎచట మెలఁగనేమి యెట్టుండెనేమి దా । నేమి సేసెనేమి యెల్లసంగ । ములను విడిచెఁ గుదుపువలన నియతి గల్గు । యతికి మోక్షవీథి యాట పట్టు (అను. ౫ ఆ. ౪౩ ప). (ఎచట మెలఁగనేమి = ఎచట మెలఁగిననేమి ? మొ). ఇందు 'ఏని'శబ్దమును నిల్పినచో నన్వయము కుదురదు.

చేదర్థంబునందు, వృత్తంబగు భావలక్షణంబునందు
న వర్ణకంబు ద్రుతాంతం బగు. ౪౧.

బాలవ్యాకరణ వివరణము. వానలు గురిసినం బంటలు పండును. వాఁడు రమ్మనినఁ బోఁయితిని.

3౧౫ I విషయము. చేదర్థయోగంబున ల్రుట్టునకు లిట్టగు. ౧౧౯.
ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్.
వాఁడు తేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము.

సంజీవని. 3౧౫ I విష:—౪౧ సూ. వ్యాఖ్య:—సూరిపక్షమున ద్రుతము 'ను' స్వరూపము. చేదర్థంబునందు, = 'చేత్' అనెడి సంస్కృతశబ్దముయొక్క యర్థమందును,వృత్తంబగు భావలక్షణంబునందు=భూతార్థకముగు భావలక్షణార్థంబునందును 'వను' అనెడి ద్రుతాంత న వర్ణక మగునని యర్థము. "చేదర్థంబునం దున్నట్టి భావలక్షణంబునందు ద్రుతాంతంబైన న ప్రత్యయంబు వచ్చును"(బా.గు.ప్ర. 333 పుట. ద్వి. ము) అని ప్రామాదికముగా గుప్తార్థప్రకాశికాకర్త వ్యాఖ్య చేసెను. సర్వథాయంతము లగు రెండు ప్రత్యేకదళములతో సూత్రించి రెండిటికిని వేర్వేఱ వరుసగా రెండుదాహరణములు చూపిన సూరిసూత్రమున కిట్లుగ నేకార్థవిశేషణ సమాసముగ నన్వయించుట గ్రంథకృదభిప్రేతము కాదనుటకు సందేహము లేదు. మఱియు రెండిటికిని నైక్యము దర్ఘటము. భావలక్షణార్థమునందుఁ జేదర్థ మెట్లు వర్తించును.'వాఁడు రమ్మనినఁ నేఁ బోయితిని'అనుచో యదర్థ(చేదర్థ)మునకుఁ బ్రసక్తియే లేదుగదా.మఱియుఁ జేదర్థము వర్తించునపుడు కార్యభూతక్రియ నియతముగా భావ్యర్థకము యుండును. 'పోఁయితిని' అను భూతార్థ మెట్లు పొసఁగును? కావున ' వానలు గురిసినం బంటలు పండును' అనునది మాత్రమె చేదర్థకమున కుదాహరణము కానోపును. పోవుటకు రమ్మనుట లక్షణ మగుటంజేసి 'వాఁడు రమ్మనినన్.........' ఇత్యాదికము భావలక్షణోదాహరణము. (సూ. 3౧3-3౧3 I విష). 'వానలు కురిసినన్......' అను వాక్యమునకు నైతము చేదర్థమును విడిచి "వానలు కురిసినన్ = వానలు కురియఁగా" అని యర్థముచేసినచో నదియు భావలక్షణోదాహరణమె యగును. కాని సూరి 'చేదర్థమునం'దని వక్కాణించుటచే"వానలు కురిసినన్=వర్షములుకురిసినచోన్= వర్షములు కురిసినయెడలన్ (వర్షపతనం స్యాద్యది - వర్షపతనం స్యాచ్చేత్). అని చేదర్థకథన మావశ్యకమై యున్నది. భావలక్షణార్థమున నట్టి చేదర్థమునకుఁ బ్రసక్తి లేదు. పేటికావ్యాఖ్యాతయు నీ బా. గు. ప్ర. వ్యాఖ్య సరికాదనియె వ్రాసెను. బాలకవిశరణకర్త యీ బా. గు. ప్ర. వ్యాఖ్య ననుసరించుటచే గావలయు

"చిన్నయ సూరికి ఇది (వి?) చేదర్థకములని తోఁచి ఉండును. 'వాఁడు రమ్మనిన నేఁ బోయితిని' అనే వాక్యమున సంస్కృతమందుగాని ఇంగ్లీషునందుగాని అనువదిస్తే చేదర్థకము ప్రయోజ్యమా?" (బాలక. ౨౧౮ పు). అని వ్రాయుట తటస్థించెను. పాపము! వా రనుకొన్నట్లు సూరికిని దోఁచలేదే? సూరి యీవాక్యమును చేదర్థమున కుదాహరింపలేదే. దీనిని భావలక్షణ వర్ణకమునకుమాత్రమె సూరి యుదాహరించెను. శరణ్యకర్త యింకను సాహసముగా నన్నయవాడుకలో నీ 'నన్ = ఇనన్' ప్రత్యయమునకుఁ జేదర్థమే లేదని వ్రాసెను. "తెలుఁగులో చేదాద్యర్థకముగా నన్నయాదులు సమాపకక్రియారూపమునకు 'ఏని' చేర్చేవారు. నేను జేసితినేని........" (బాలక. ౨౧౭ పుట). "చిన్నయసూరి మొదలయినలాక్షణికులు ఈరూపములు ఉపేక్షించినారు. బాలవ్యాకరణము (క్రియా). సూ. ౪౧ లో కురిసినన్ - రమ్మనినన్ - మొ. రూపములు చేదర్థకములని ఉన్నది. గాని కావు... ......" (బాలక. ౨౧౮ పు). వీనిలో 'రమ్మనినన్' అనునది చేదర్థకముగా సూరిచే నుదాహరింపఁబడలేదని పైని వివరించియున్నాను. 'కురిసినన్' అనునది చేదర్థకముగా నుదాహరింపఁబడెను. "వానలు కురిసినం బంటలు పండును (బా. క్రి. ౪౧ సూ). 'రమ్మనినన్' అనునదియు నీక్రిందిరీతిని వాడినచోఁ జేదర్థకము కావచ్చును. 'నీవు రమ్మనిన నిటకు నే వచ్చెదను' (నీవురమ్మనినన్ = నీవురమ్మన్న చో). 'నన్' ప్రత్యయము చేదర్థకముగా నన్నయచే వాడఁబడలేదను వీరియభిప్రాయము పరిశీలన రాహిత్యకృతము. చ.........ఉత్తముద్విజులు పూజ్యులు వారల కెగ్గు సేసినం । జెను నిహమం బరంబు.........(ఆది. ౧ ఆ. ౧౩౬). ఉ.........భారతియు భా । రత్యమురాపగౌఘము నిరంతరసంతత పుణ్యసంపద । న్నత్యభివృష్టి సేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్ (ఆది. ౧ ఆ. ౭౩) తే-గీ. అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు। నల్లగలిగిన నీవిప్ప నాకు దాసి । వగుము మఱియందు నల్ల లేదయ్యె నేని । నీకు నే దాసి నగుదుఁ బన్నిదము సుజను (ఆది. ౨ ఆ. ౩౨ ప). సోమయాజియు బహుళముగఁ బ్రయోగించెను. ఉ. అక్కట భీముఁడైన మనయర్జునుఁడైనను మాద్రిపుత్త్రులం । దొక్కరుఁడైన నీకగఱ నుక్కడఁగింపరె యొక్క ప్రేల్మిడిన్ (ఉద్యో. ౧ ఆ. ౨౮౭) (అయినన్ = ఐనన్ = ఉండినన్ = ఉండినచోన్.) "అగు...౧౮ ఉండు" (సూ. రా. సి.). 'ఐనన్' అనుచో 'ఏని' శబ్దము నిల్పుదుమనుటకు వలనుపడదు. అట్టియెడ 'ఉండు' అనునర్థము రానేరదు. ఉ.........ఆ । తండును నేము నైన విబుధప్రకరంబును మాకు నడ్డమే (శాంతి. ౧ ఆ. ౧౪). క. వినినఁ బఠించిన వ్రాసినఁ । గొనియాడిన దురితపీడకుం దొలఁగి (శాంతి. ౩ ఆ. ౩౮౨).

సంస్కృతమందలి 'చేత్ = యది' అనువానికిఁ దెల్గున 'ఏనా'దులు పర్యాయములు. ఇవి సమాపక క్రియారూపములపై నిల్చి చేదర్థకము లగును. అట్లు ప్రయోగింపరాదని సూరిప్రభృతులు చెప్పలేదు. "చిన్నయసూరి మొదలయిన లాక్షణికులు ఈరూపములు ఉపేక్షించినారు (బాలక. ౨౧౭)." అని శరణ్యకర్తవ్రాయుట సాహసము. "చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. ఆఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్. వాఁడు తేపు వచ్చెన్నే నీవు కార్యంబు దొరఁకొనుము"(బా. క్రియా. ౧౧౯ సూ). అని యిట్లు సూరి యుద్ఘోషించుచుండఁగా నాతఁడు సమాపక క్రియా ప్రయోగ ముపేక్షించెనని వ్రాయుట సరికాదు. ఇంత వారే యిట్లువ్రాసిన నింక వెనుదీయనేల? యని పేటికావ్యాఖ్యాతయు నిట్లు శరణ్యంగ్రథమును స్వీకరించెను. "నన్నయకాలమున నిట్టివి (నన్ = ఇనన్) చేదర్థకమై ప్రయుక్తమై నట్లగపడదు. సమాపక క్రియారూపముల కేవి పదముఁ గూర్చి చేదర్థమును సూచించుట గాననగును.........కాన నీ నవ్యకరూపసాధన ప్రక్రియ 'చేస్తే - చెప్పితే' అను నవీనవ్యావహారికరూప సంస్కారమునుబట్టి యేర్పడిన దనఁదగును" (బా. సా. వే. ౪౧౧ పుట).

ఈచేదర్థము నర్వాచీనులు 'చోన్ - (చోటన్) - ఎడన్ - ఎడలన్' అను రూపములను భూతార్థకవిశేషణమునకుఁ జేర్చినరూపములతోఁ దెల్పుచున్నారు. వాఁడుచెప్పినన్ నేనువత్తును = వాఁడుచెప్పినచో నేను వత్తును. ఇట్లె 'చెప్పినయెడ - చెప్పినయెడలన్' అనువానిని సయితము చేర్చి యాధునికరూపముల నెన్నినది. "ఇప్పుడు గ్రాంథికభాషలో తదుభావములు తెలియఁజేసేవారు చేదర్థకముగా 'చో - ఎడ' ప్రయోగిస్తున్నారు. నన్నయ వీటిని ఏ అర్థమందువాడెనో తెలియదు కాఁబోలు........." (బాలక. ౨౧౯ పు). అని శరణ్యకర్తగారు వ్రాయుట సరి కాదు. నన్నయవాడుకలకు విలక్షణముగ నెన్నెన్నిపండితకవి సమ్మతములై యాధునికకావ్యములలో వాడఁబడలేదు. అంతమాత్రమున నింత గొప్పవిషయమును వారికిఁ దెలియ దనవలెనా? వీరియాక్షేపముఁ జూడ నొకచరిత్ర స్మరణాతిథి యగుచున్నది "శ్రీజగన్నాథమున నొకపండితుఁడు మఱ్ఱియాకుల విస్తరి కుట్టుచుండెనఁట. అంత నొకమత్స్యభుక్కగు పండా బ్రాహ్మణుఁడు వచ్చి 'స్వామి వటపత్త్రశాయి కదా. ఇచట మఱ్ఱియాకుల విస్తరిపై భుజింపనగునా' అనెనఁట. అంతట నాపండితుఁడు "మీరవతారములనే భుజింతురే! "స్వామి పరుండు వటపత్త్రమున భుజింపరాదా?" అని పల్కెనఁట." "చెప్పినచోన్ - చెప్పినయెడన్" మున్నగుపండితకవి సమ్మతరూపములు "చెప్తే - చెబితే - చెప్పితే - వస్తే - పోస్తే - ఒస్తే - వాడొస్తే

నేనొస్తాను" అనురీతిగల "భాషాదేవి చాలాకాలము కష్టపడి కనిన" (బాలక. ౨౧౭ పుట) రూపములవంటివి కాకపోయినా ? ఈ 'తే' ప్రత్యయపుచరిత్రము మిక్కిలి వింతైనది. "నీవుచెప్పితివేని = నీవుచెప్పితేని = నీవుచెప్పితేన్ = నీవుచెప్పితే" అని యిట్లు మధ్యమపురుషైకవచనమందు మాత్రమిది వైయాకరణసమ్మతమై యుండును. తక్కిన పురుషవచనములలో నెందును దీనికి శబ్దసిద్ధముగు సాధుత్వము లేదు. ఎల్ల పురుషములందు నెల్లవచనములందును దీనికిఁ బండితవ్యవహారమందును ప్రసిద్ధి వెలసి యున్నది. ఇట్లె అప్యర్థకము వ్యవహారమున "ఎంత చెప్పినా వినఁడు - ఎంతచెప్పి ననూ వినడు" మున్నగురీతిని వెలసియున్నది.

౧౧౯ సూ. వ్యాఖ్య:—చేదర్థ యోగంబునన్ = చేదర్థము దోఁచునపుడు లృట్టునకు భవిష్యదర్థక సమాపక క్రియచోట భూతార్థకసమాపక క్రియ నిలుచును. ఉదా:—ఆ ఋషీశ్వరుండు వచ్చెనా కార్యములు ఫలించును = ఆ ఋషీశ్వరుండు భావిని వచ్చునేని కార్యము లావిడప ఫలించునని యర్థము. ఇందు రెండునుభావ్యర్థక ములె యైనను ఫలించునను దానియపేక్షచే 'వచ్చుట' పూర్వభావి గావునఁ జేదర్థ ప్రయోగమునఁ బూర్వక్రియ లిడంతముగా నుండుట విరుద్ధముకాదు. సూరి యిట్టి లిడంతత్వము నిత్యమని సూత్రించుట సరికాదు. రెండు క్రియలును భావ్యర్థకము లైనం గావచ్చును. గీ. కడఁగి సమబుద్ధి వీనికిఁ గల్గెనేని । కాదు శాపఫలం బట్లు గాక బుద్ధి । హీనుఁడై గర్వితుండగునేని శాపఁ । హవ్యవాహాఫలంబు వీఁ డనుభవించు (అర. ౧ ఆ. ౧౦౩). ఇట్టియెడలఁ జేదర్థక ప్రత్యయము నిల్చినను నిలువవచ్చును. ఆ ఋషీశ్వరుండువచ్చినం గార్యంబులు ఫలించును. వాఁడు తేపువచ్చినం గార్యం బునకు నీవు దొరఁగొనుము. మొ. చ. ఇతనికిఁ గూర్తురేని ధన మిత్తురుగాక (సభా. ౨ ఆ. ౧౦). ఇతనికిఁ గూర్చినం ధనమిత్తురుగాకయనియుఁ జెప్పనగును. అప్యర్థను నందును నిట్టి సమాపక క్రియా ప్రయోగములు గలవు. "నీవచనంబున సంజీవని నాకుఁ బనిసేయదయ్యెనేని నాచేత నుపదేశంబు గొన్నవారికిఁ బనిసేయఁగాక (ఆది. 3 ఆ. ౧3౨ వచనము). తే-గీ. వనమునందుఁ బండ్రెండు సంవత్సరంబు । లుండ నేర్చితి మేనియు నొరులెఱుంగ । కుండ నజ్ఞాతచర్య యందొక్కదివస । మైన నుండంగ నేర నెట్లనిన వినుము (ఆర. ౧ ఆ. ౨౬౫). ఉ. ఇంతుల గోష్ఠి నున్న యతఁ డెంతవివేకముఁ గల్గెనేని య । త్యంత మదాభిభూతుఁడగు.........(ఆది. ౭ ఆ. ౫౯). "కొన్ని యెడలఁ ద్వరితార్థసూచకంబయి భావిని భూతంబు చూపబడెడి. ఉదా:—రావచ్చె సుదర్శనాయుధుఁడు (భాగ. ౧౦ స్కం. పూ.) మొ." (ప్రౌఢ. క్రి. ౭ సూ). చ. ఇదె ప్రళయాగ్నివోలె......వాయుసారధి జవంబునఁ దా నిటవచ్చె......

...(ఆది. ౭ ఆ. ౩౧౫). శా.........కాంతారనివాస ఖిన్నమతి నస్మత్సేనపై
వీఁడె వ। చ్చెం గుంతీసుతరుద్ధ్యముండు. (విరా. ౪ ఆ. ౯౫).

ఉన్న - కలజి - నవర్ణకంబులు భవ ద్భావి శతృ క్తవ
దర్థంబులం దగు. ౪౬.

బాలవ్యాకరణ వివరణము. ౩౧౫ II విషయము.

ఉన్న వర్ణకంబు వర్తమానార్థక శత్రర్థంబునం దగు -
కలజి వర్ణకంబు భవిష్యదర్థక శత్రర్థంబునం దగు-నవర్ణ
కంబు క్తవదర్థంబునం దగు. ఇవి సత్త్వాభిధానంబునం
దగునని యెఱుంగునది. సుబంతవాచ్యంబు సత్త్వంబు
నాఁబడు. వండుచున్నవాఁడు - వండఁగలవాఁడు -
వండినవాఁడు.

సంజీవని. ౩౧౫ II విష:—"ద్వంద్వాన్తే శ్రూయమాణః సర్వత్ర సంబధ్యతే"
అనుచొప్పున 'శతృ' అనునది ద్వంద్వఘటితపదములు రెండిటికొడను సంబంధించును.
కాన 'భవ ద్భావి శతృ' అనఁగా 'భవచ్ఛతృ - భావిశతృ' అని యర్థము. 'భవత్'
అనునది భూధాతువర్తమాన శత్రంతరూపము. కావున 'భవత్' అనుదానిచే వర్త
మానార్థకత్వము చెప్పఁబడును. అట్లగుటంజేసి 'భవచ్ఛతృ' అనఁగా వర్తమానార్థక
శతృప్రత్యయమని యర్థము. 'భావిశతృ' అనఁగా భవిష్యదర్థక శతృప్రత్యయమని
యర్థము. కావున, వర్తమానార్థక శతృప్రత్యయార్థమున 'ఉన్న' ప్రత్యయమును,
భవిష్యదర్థక శతృప్రత్యయార్థమున 'కలజి' ప్రత్యయమును సంస్కృతమునందలి క్త
వతు ప్రత్యయము నర్థంబున ననఁగా భూతార్థమున 'న'వర్ణకంబును నగునని సూత్రా
ర్థము. ఈవిషయమునె "ఉన్నవర్ణకంబు" మున్నగువాక్యముచే సూరి వివరించెను.
ఉదా:—వండుచున్నవాఁడు - వండఁగలవాఁడు - వండినవాఁడు. వర్తమాన శత్ర
ర్థమున 'ఉన్న'వర్ణకము వచ్చునపుడు, "ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకం
బగు" (బా. క్రి. ౧౪ సూ). అనుచొప్పున ధాతువుతుదిని 'చు'వర్ణకము నిల్చును.
"ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తంబగు"
(బా. సమా. ౯ సూ). అనుచొప్పున 'వాఁడు' అనునది యనుప్రయుక్తమగును.
కాఁగా 'వండు+చు+ఉన్న+వాఁడు = వండుచున్నవాఁడు' అనురూపము వర్తమాన
శత్రర్థమునందు సిద్ధించును. భావిశత్రర్థమునఁ బ్రకృతసూత్రముచే 'కలజి' ప్రత్య
యంబు రాఁగా 'కలజి' జిత్తుగాన 'జిత్తు పరంబగునపు డుత్వంబున కత్వంబగు' (బా.
క్రి. ౨౦ సూ). అనుచొప్పున ధాతువు తుది 'ఉ'కారమున కత్వమును, 'కలజిపదము
బులు పరంబగునపుడు నుగాగమంబగు' (బా. క్రి. ౨౧ సూ). అనుచొప్పున నుగా

గమంబును వచ్చును. పై నుదాహరించినరీతిని బా. సమా. ౯ సూత్రముచొప్పున 'వాఁడు' శబ్ద మనుప్రయుక్తమగును. కాఁగా 'వండు+అ+ను+కల+వాఁడు = వండఁగలవాఁడు' అను రూపము భావికర్త్రర్థమున సిద్ధించును. భూతార్థమునఁ బ్రకృతసూత్రంబుచే, 'న'వర్ణకము రాఁగా "భూతంబునం దిగాగమంబగు"(బా. క్రి. ౧౭ సూ). అనుచొప్పున 'ఇ'గాగమం బగును. పై రీతినె బా. సమా. ౯ సూత్రము చొప్పున 'వాఁడు' అను తచ్ఛబ్ద మనుప్రయుక్త మగును. కాన 'వండు+ఇ+న+వాఁడు = వండినవాఁడు' అను రూపము క్తవదర్థంబునం దనఁగా భూతార్థమున సిద్ధించును. సత్వ మనఁగా ద్రవ్యము. ఇవి=ఈ ధాతుజవిశేషణములు, సత్వాభిధానంబునం దనఁగా ద్రవ్యమును బోధించునపుడె యగుననియు, సత్వమనఁగా సుబంతవాచ్యమనియు, సూరి వివరించెను. ఈధాతుజవిశేషములు నామాకాంక్షములె యగునని తాత్పర్యము. అనఁగా నీప్రత్యయములు తుదిని గలశబ్దములు విశేషణములె యగుచు విశేష్యభూత సుబంతమునె యాకాంక్షించునని పర్యవసిత మగుచున్నది. "క్తక్తవతూ నిష్ఠా (౧-౧-౨౬) ఏతౌ నిష్ఠా సంజ్ఞౌ స్తః." (సి. కౌ. కృదన్త. 3౦౧౨ సూ). "నిష్ఠా. (3-౨-౧౦౨) భూతార్థవృత్తే ర్ధాతోః నిష్ఠా స్యాత్. (నిష్ఠా = క్త-క్తవతు)"(సి. కౌ. కృదంత. 3౦౧3 సూ). అను పాణినిసూత్రములచొప్పున 'క్తవతు' ప్రత్యయము భూతార్థకమని విశదమగుచున్నది. "విష్ణు ర్విశ్వం కృతవాన్ (= విష్ణువు ప్రపంచమును జేసినవాఁడు) అని యిట్లు క్తవదంత ముదాహరింపఁబడెను. (సి. కౌ. కృదంత. 3౦౧3 సూ.) "వర్తమానే లట్. (3-౨-౧౨3) వర్తమానక్రియావృత్తే ర్ధాతోర్లట్ స్యాత్." (సి. కౌ. భ్వాది. ౨౧౫౧ సూ). "లట శ్శతృ శానచా వప్రథమాసమానాధికరణే (3-౨-౧౨౪). అప్రథమాన్తేన సామానాధికరణ్యే సతి తద్యథా......పచన్తం చైత్రం పశ్య" (వండుచున్న చైత్రుని జూడుము)" (సి. కౌ. కృదన్త 3౦౦౦ సూ). "వర్తమానే లట్" ఇతి పూర్వసూత్రవిహితస్యైవ ఏతౌ శతృశానచౌ...పచన్త మితి, పాకానుకూలవ్యాపారాశ్రయ ఇత్యర్థః. 'క్రియా. ప్రధాన మాఖ్యాతమ్. సత్వప్రధానాని నామాని, ఇతిసిద్ధాన్తాత్" (బాలమ. వ్యా). అను పాణినిసూత్రములచొప్పున వర్తమానశతృప్రత్యయము నెలుఁగునది. ఈ సందర్భమునుబట్టి "పచత్ - పచన్ - చైత్రః = వండుచున్న చైత్రుఁడు" అనుట పాణిని సమ్మతము కాదని (ప్రథమాసామానాధికరణ్య మున్నదిగాన) చెప్పవలసియున్నది, కాని "లడిత్యనువర్తమానే పునర్లడ్ గ్రహణ మధికవిధానార్థమ్. తేన ప్రథమాసామానాధికరణ్యే ౭పి క్వచిత్ - సన్ (సత్. శత్రంతము) బ్రాహ్మణః (= ఉన్న బ్రాహ్మణుఁడు)" (సి. కౌ. కృదన్త. 3౦౦౧ సూ. వివరణము). అను భట్టో

జిదీక్షితులవారి వృత్తిచొప్పున నట్టి యనుపపత్తి లేదు. ప్రయోగములు:—
"శ్లో. తథాపి జిహ్మః స భవజ్జిగీషయా । తనోతి శుభ్రం గుణ సంపదా యశః ।
సమున్నయన్ భూతి మనార్యసంగమా । ద్వరం విరోధోపి సమం మహాత్మభిః
(భారవి). శ్లో. స్మర త్యదో దాశరథి ర్భవన్ భవా । నముం వనాన్తా ద్వని
తాపహారిణమ్ । .........(మాఘము) శ్లో. శ్రియఃపతి శ్శ్రీమతి శాసితుం
జగ । జ్జగన్నివాసో వసుదేవసద్మని । వసన్ దద ర్శావతర న్త మమ్బరా । ద్ధిరణ్య
గర్భాఙ్గ భువం మునిం హరిః (మాఘము. ౧ స. ౧) (I శ్లో:—యః - దుర్యోధనః
భూతింసమున్నయన్ = ఐశ్వర్యము నభివృద్ధిచేయుచున్నవాఁడై, యశః - తనోతి.
II శ్లో. భవాన్=నీవు, దాశరధిః=భవన్=దశరథపుత్త్రుఁడవగుచున్నవాఁడవై. III శ్లో.
జగన్నివాసః=కృష్ణుఁడు, వసుదేవసద్మని=వసుదేవునింట, వసన్=వసించుచున్నవాఁడై)
"శా. శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షో ముఖాఙ్గేషు యే..." అని భట్టా
రకుడును బ్రయోగించెను. "యే = ఏ త్రిమూర్తులు, శ్రీవాణీగిరిజాః = లక్ష్మీసర
స్వతీపార్వతులను, వక్షోముఖాఙ్గేషు = వక్షమున, ముఖమున, నర్ధాంగమున,
దధతః = ధరించుచున్నవారగుచున్నారో" అని యర్థమునెన్నునది. భట్టోజీపండి
తులు "క్వచిత్" అని చెప్పిరేకాని సంస్కృతమున నిట్టివి పెక్కుగలవు.

"తౌసత్ (3-౨-౧౨౭) తౌ శతృశానచౌ 'సత్' సంజ్ఞౌ స్తః" (సి. కౌ. కృదన్త.
3౧౦౬ సూ). "లృటః సద్వా. (3-3-౧౪) వ్యవస్థిత విభాషేయమ్.....ప్రథ
మాసామానాధికరణ్యే ఽపి క్వచిత్ - కరిష్యతీతి కరిష్యన్." (సి. కౌ. కృదన్త.
3౧౦౭ సూ). "ఇదంచ 'లృట్ శేషేచ' ఇతి భవిష్యదధికారవిహితే లృట్యేవ
ప్రవర్తతే......" (బాలమ. వ్యా). అను పాణినిసూత్రములచే భవిష్యచ్ఛతృ
ప్రత్యయము నెలుంగునది.

మయిరీతిని వర్తమానార్థక శతృ - శానచ్ ప్రత్యయములును భావ్యర్థక శతృ
శానచ్ ప్రత్యయములును బ్రథమాసామానాధికరణ్యమునందును వచ్చుట సమ్మత
మగుటచేతనే వోపదేవుఁడు 'అప్రథమా సమానాధికరణే' అను పాణినీయ దళము
నుపేక్షించెను. "కీ పమౌ వత్ శతృశానౌ" (ముగ్ధ. క్త్వాది. ౧౧౦౦ సూ). (కీ = వర్త
మాన - ప = పరస్మైపద - మ = ఆత్మనేపద - ముగ్ధబోధసంజ్ఞలు). "వర్తమాన
కాలే కర్తరి పరస్మైపదిభ్యః శతృ-ఆత్మనే పదిభ్యః శానః - ఉభయ పదిభ్యో ద్వయం
స్యాత్ - ఏవం వర్తమానే కర్మణి సకర్మకేభ్యః, భావే త్వకర్మకేభ్యః శానః స్యాత్
ఇత్యర్థః" (కంఖ ముగ్ధబోధ సూత్రపు దుర్గాదాసవ్యాఖ్య) తెనుఁగున ధాతువులకుఁ
దిఙ్విభక్తులు చేరుటలో పరస్మైపదాత్మనేపదోభపద భేదములులేవు గాన నంతటను

'శత్రర్థము' అనుదానినే వర్తమానార్థముగా నాంధ్రవైయాకరణులు వ్యవహరింతురు.

ఈశతృప్రత్యయము విషయమున సంస్కృతాంధ్రపండితుల కింకను జాలభేదముగలదు.

'దుష్కార్యమును జేయుచున్న పురుషుఁడు నింద్యుఁ డగును.' అనురీతిని "దుష్కార్యం కుర్వన్ పురుషః నిన్ద్యో భవతి" అని యిట్లుద్దేశ్యకోటిలోని దగుచు 'కుర్వన్' అనునది పురుషశబ్దమునకు విశేషణముగ నట సంస్కృత సంప్రదాయము కాదు. 'దుష్కార్యమును జేయుచుఁ బురుషుఁడు నింద్యుఁడగును' అనురీతిని "చేయుచున్" (బా. క్రియా. ౮3 సూ). అని యిట్లు లాక్షణికావ్యయముగాఁ బ్రయోగింపఁబడుటయు సంస్కృతసంప్రదాయముకాదు. 'చేయుచున్' మున్నగువానివంటి లాక్షణికావ్యయరూపములె సంస్కృతమున లేవు. 'పురుషః దుష్కార్యం కుర్వన్ నిన్ద్యో భవతి' అనురీతిని "కుర్వన్" అనునది పురుషశబ్దమునకు విధేయవిశేషణముగాఁ బ్రయోగింపఁబడుట సంస్కృతసంప్రదాయము. "పురుషుఁడు దుష్కార్యముఁ జేయుచున్నవాఁడు నింద్యుఁడగును. పురుషుఁడు దుష్కార్యమును జేయుచున్నవాఁడయి నింద్యుఁడగును" అనువాక్యములు పయిసంస్కృతవాక్యమునకు సరియైయుండును. ఇట్టి విధేయవిశేషణస్థలములందు సాధారణముగ శత్రర్థక చువర్ణక ప్రయోగమె తెల్గునఁ బ్రచురమైయున్నది. సీ. నిజరుహిరుండలప్రజఁ బ్రీతిఁ బెంచుచుఁ బరమండలంబుల ధరణిపతుల। నదిమి కప్పంబుల ముదముతోఁ గొనుచును, బలిమి నీయని భూమివలయపతుల। నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ, వెలిఁగించుచును విప్రకులము నెల్ల। బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల, నగ్రజన్ములకు ననుగ్రహమునఁ। ఆ-వె. జారుతెరు మిహాగ్రహంబులిచ్చుచు। దేవభోగముల మహావిభూతిఁ। దనరఁజేయు నిట్లు మనుమార్గుఁడగు విష్ణు। వర్ధనుండు వంశవర్ధనుండు. (ఆది. ౧ ఆ. 2) ఇందలి 'పెంచుచున్ - కొనుచున్' మున్నగు లాక్షణికావ్యయ శత్రర్థక చువర్ణకస్థలములందెల్ల సంస్కృతమున శత్రంతరూపములనే విధేయ విశేషణములనుగాఁ బ్రయోగింపవలసినదే కాని యాభాషయం దీలాక్షణికావ్యయ రూపమే లేదుగదా. శ్లో. లతాకుఞ్జం గుఞ్జన్ మదవదలిపుఞ్జం చపలయన్। సమాలిఙ్గ న్నఙ్గం ద్రుతతర మనఙ్గం ప్రబలయన్। మరు న్మన్దం మన్దం దలిత మరవిన్దం తరళయన్। రజోబృన్దం విన్దన్ కిరతి మకరన్దం దిశిదిశి. (సాహిత్యదర్పణ) లతాకుంజములందు ధ్వనించుచుఁ దుమ్మెదలఁ జలింపఁజేయుచు నంగము నాలింగించుచు మదనునిఁ బ్రబలఁజేయుచు వికసించిన పద్మమును గదల్చుచుఁ బుప్పొడినందుచు

మారుతము, మెల్ల మెల్లగా మకరందము సంతటను జల్లుచున్నదని యర్థము. 'గుఞ్జన్' మున్నగునవెల్ల శతృంతవిశేషణములె.

ఇట్టి లాక్షణికావ్యయ శతృర్థక చువర్ణకాంతస్థలములలోఁ దద్ధర్మార్థక విధేయ (తద్ధర్మక్రియలకు వర్తమానార్థబోధము సంయుతము విరుద్ధముకామిం జేసి) విశేషణములవాడుక యగపడుచున్నది. అయ్యుదంకుఁడు........ఒక్కరుండ చనువాఁ డెదుర........ఒక్క దివ్యపురుషుం గని (ఆది. ౧ ఆ. ౯౪ వచ). ఇట్టియెడల "ఉదంకుఁడు చనుచు నెదుర దివ్యపురుషుం గని" అనురీతిని బ్రయోగించుటే తలుచు. (ఉదఙ్కః గచ్ఛన్ పురతః దివ్యపురుష మపశ్యత్). "ఉదంకుఁడు సంతోషించి చనువాఁ డెదుర నొక్క జలాశయంబు గని (ఆది. ౧ ఆ. ౧౦౨) ఇట్లచ్చటచ్చటఁ గన్పట్టును.

ఈసూత్రములోని భూతార్థక విశేషణరూపమందలి 'న'వర్ణకమును, వర్తమానార్థక విశేషణరూపములోని 'ఉన్న' వర్ణకరూప 'న'వర్ణకమును, బా. క్రియా. ౪౧-౫౭ సూత్రములచే సిద్ధించు చేదాద్యర్థక రూపములందలి 'నన్' ప్రత్యయమును, బా. క్రియా. ౧౩-౧౪-౧౫ సూత్రములచేతను, బా. క్రియా. ౫౬ సూత్రముచేతను సాధింపఁబడు 'ఉన్నాఁడు - ఉన్నారు - ఉన్నవాఁడు - ఉన్నవారు' మున్నగురూపములందలి "ఉన్న" అనుదాని 'న'వర్ణమును నన్నయాథర్వణీయమునందలి "భూతార్థానాం తు నః క్రియాణాం స్యాత్" (ఆం. చిం) "క్వచిన్న వర్ణే దే ర్లోపః......" (వికృ.) (౩౧౫ విష) అను సూత్రములచే సిద్ధించు నవర్ణకమునకు భిన్నములు కావు. 'ఉండిన' అను భూతార్థక విశేషణమునందలి 'డి' వర్ణమునకు లోపము గల్గఁగా నేర్పడు 'ఉన్న' అను విశేషణము వర్తమానార్థకముగా మహాకవిప్రయోగానురోధమున నంగీకరిఁపవలెనని యీవఱకె వ్రాయఁబడెను. (౩౧౫ విష) అట్లె "వసతి రనుబంధకః స్యా దిత్యాది సూత్రముచొప్పున 'ఉండు' ధాతుభిన్నములగు ధాతువులనుండి వర్తమానార్థక విశేషణములను సాధించునపుడును నాయాధాతువులకు "చు"వర్ణపూర్వకముగ నీవర్తమానార్థకమగు 'ఉండు' ధాతుజ విశేషణరూపమైన 'ఉన్న' అనునది చేరుననియు నీవఱకె (౩౧౫ విష) వ్రాయఁబడెను. అట్లె యితరధాతువుల వర్తమానార్థక సమాపకక్రియలను సాధించునపుడు "వసతి రనుబన్ధకః స్యాదిత్యాది సూత్రముచొప్పున నాయాధాతువులకుండు ధాతురూపములు చువర్ణకపూర్వకములై చేరుననియు నీవఱకె వ్రాయఁబడెను. (౨౯౬ విష). సూరి యీసందర్భమున మార్గాంతరమును ద్రొక్కుటచేత నసహజములగు బా. క్రి. ౪౬-౫౬-౧౩-౧౪ ౧౫ సూత్రములలోని విధులచొప్పునఁ బ్రక్రియ నడుపవలసినవాఁడయ్యెను. (చూ. బా. క్రియా. ౫౬ సూ. ౩౧౫ III విష).

ఉన్న కలజి - వవర్ణకంబుల ప్రయోగములు:— ఉన్న:— చ. అల
ఘనులు కృష్ణపార్థులు మహాత్ములు యాదవకౌరవాన్వయం। బులఁ వెలిఁగించుచున్న
నృపపూజ్యులు వీరల........(ఆది. ౮ ఆ. ౨౮౭). చ.........ఇప్డు గతగర్వము
నన్ మగధేశ్వరుండు నిశ్చయమతి నున్నవాఁడు (సభా. ౧ ఆ. ౧౬౧). 'ఉన్నవాఁడు'
అనునది చింతామణిపక్షమున 'ఉండిన' అనుదానిలోని 'డి' లోపముచే నేర్పడి కవి
ప్రయోగానుసారముగ వర్తమానకాలవాచక మయ్యెను. బాలవ్యాకరణపక్షమునఁ
బ్రకృతసూత్రముచే 'ఉన్న' ప్రత్యయము వర్తమానార్థమున రాఁగా నుండుధాతువు
ఖా. క్రి. ౫౬ సూత్రముచే లోపించుటంజేసి యేర్పడిన 'ఉండు' ధాతువు
యొక్క వర్తమానార్థక విశేషణరూపము "ఉన్న" అగును. ఆ - వె.
నేఁడు పుణ్యదినము నెమ్మితో రోహిణీ। యుక్తుఁడై శశాంకుఁ డున్నవాఁడు. (ఆది.
౭ ఆ. ౨౮౨). తే-గీ. అయ్య యేము నీవితరుల మధికసిద్ధ। బ్రహ్మచారివై నీవు
తపంబు సేయు। చున్నవాఁడవు ...... (అర. ౨ ఆ. 3౨౫). (చూ. ౨౯౬ విష)
ఇట్లు పెక్కుచోట్ల నిది వర్తమానార్థకమె యని నిస్సంశయముగాఁ దోఁచుచున్నను
గొన్నియెడల దీఁకి (ఉన్న యనుదానికి) భూతార్థకత్వమును గలదేమో యను సందే
హము పొడముచుఁడును. సీ......। గుణవంతులగుచున్న కొడుకులు గలవాఁడు
పాంచాలుఁ డేల యపాండుసుతుల। వినయసంపన్నుల విడుచువాఁడగు.........
(ఆది. ౮ ఆ. ౨౫ వ).ఇందుఁ గొడుకులు గుణవంతులగుట నేఁటికిని నున్నదనఁదగును
గాన నిందు భూతార్థకత్వము గలదని భ్రమింపరాదు. తే-గీ. పురమువెలి మూఁ
డహోరాత్రములు వసించి। యున్న నలుపాలి కెవ్వరు నోడి రరుగ।(అర.౨ఆ. ౬౬)
జను లరుగ నోడునమయమునకు నైతము నలుఁడు పురము వెలినున్నవాఁడె కావున
నిచట భూతార్థము చెప్పక తీరదని వచింపరాదు. ఈవర్తమానాద్యర్థము లాపేక్షిక
ములు-వైవక్షికములును. కావున "అరుగ నోడిర"న్నది భూతార్థకమె యైనను నట్లు
రుగ నోడునపు డుండుట వర్తమానార్థకముగ వివక్షింపఁబడుట విరుద్ధము కానేరదు.
మహాకవిప్రయోగములలో - 'ఉండిన' అనునది భూతార్థకముగుట నిస్సందేహముగా
యుండుటచేతను గొన్నిప్రయోగములందు 'ఉన్న' అనునది వర్తమానార్థకమేయ
గుట నిస్సందేహమైయుండుటచేతను బైరీతిగలచోటులందలి 'ఉన్న' అనునదియుఁ
బైరీతిని వర్తమానార్థకమే యనుట యుక్తము. కలజి భావ్యర్థకమగుటకు:—
తే-గీ. ఈతఁ డొడ్డిన ధనరాశు లెవ్వియైనఁ। బోఁడిగా నీవు నీఁగలవాఁడ నేను
(సభా. ౨ ఆ. ౧౩౪) వ..........అరంగల దీపము ట్లతఁడు మండుంగాక యే
నార్చెదన్ (కర్ణ.3 ఆ. ౪౯) ఇట్టివి ౨౯౬-3౦౧ విషయములలో విపులముగా

నుదాహరింపఁబడెను. "ఈఁగల+వాఁడు+ అ+ను = ఈఁగలవాఁడను" అనురీతి నిట్టి వానిని విధేయ విశేషణములనుగా నెన్నవలెను. 'చేయనున్న వాఁడు - వండనున్న వాఁడు' మున్నగునవియు భావ్యర్థక విశేషణరూపములె యనఁదగును. (చూ. ౨౯౬ విష). భూతార్థక నవర్ణకము:—క. తనయొతేఁగిన యర్థంబు......... (ఆది. ౧ ఆ. ౧౩౭). చ.........దానము చేసినతత్ఫలంబు (ఆది. ౧ ఆ. ౧౫). చ. అనయము పుట్టి జూదమున యప్పుడ యొంతయుఁ జిచ్చువెట్టి కా। ల్చినయది నీయుపేక్షయ వశీకృతచిత్తుఁడు ధర్మసూతి......(ఉద్యో. ౪ ఆ. ౧౮ ప).

ఉన్నశబ్దంబు పరంబగునప్పు డుండు ధాతువునకు లోపంబగు. ౫౬.

బాలవ్యాకరణ వివరణము. ౩౧౫ III విష.

ప్ర - ఉన్నాఁడు - ఉన్నారు, ఉన్నది - ఉన్నవి,
మ - ఉన్నావు - ఉన్నారు, ఉ - ఉన్నాను - ఉన్నాము.
ఉన్నవాఁడు.

చేదాద్యర్థకనాంతంబైన యుండున కున్నాదేశంబు విభాషనగు. ౫౭.

ఉన్నను - ఉండినను.

సంజీవని. ౩౧౫ III విష:—౫౬ సూ. వ్యాఖ్య:—ఉన్నశబ్దంబు = I- బాల. క్రియా. ౧౩ సూత్రముచే విధింపఁబడిన "ఉన్న" అనెడి యనుబంధము, II - బా. క్రియా. ౮౬ సూత్రముచే విధింపఁబడిన 'ఉన్న' అనెడి భవచ్ఛత్రర్థక (వర్తమానార్థక విశేషణ) ప్రత్యయము. ఇట్టియర్థములు లభించుటకే సూరి దీనిని 'ఉన్నశబ్దము' అని వ్యవహరించెను. ఇట్లు బా. క్రి. సూ. ౧౮ సూత్రమునందును బ... రెండుస్థలము లందును 'చు' వర్ణప్రాప్తికయి "ఉన్నశబ్దంబు పరంబగునప్పుడు 'చు' వర్ణంబగు" నని యుపదేశించెను. అట్లె ప్రకృతసూత్రమునందును "ఉన్నా"ను బంధము పరంబగు నపుడును భవచ్ఛత్రర్థకంబగు 'ఉన్న' ప్రత్యయంబు పరంబగునపుడును 'ఉండు' ధాతువు లోపించుననెడియర్థము లభించుచున్నది. ఉదా:—ఉండు+లట్ = ఉండు+ చు+ఉన్న+ను = ఉన్నాను. ఇటఁ బ్రకృతసూత్రముచే 'ఉండు'ధాతువు లోపించుటచే దానితుదిని నిల్వవలసిన 'చు'వర్ణమును లోపించినది. ఏతత్సమాన న్యాయమున 'ఉన్న' అనెడి యనుబంధమునయితము (బా. క్రియా. ౧౩ సూ). లోపింప వలసియేయున్నను నేతత్సూత్రవిధాన సామర్థ్యమున నట్టిలోపము కలుగదని సూరి యాశయము. బా. క్రియా. ౧౫ సూత్రముచొప్పున ది వీతరంబగు 'డుఙ్లు' పరమగు టచే 'ఉ'న్నాను బంధము తుది 'అ' కారమునకు దీర్ఘము రాఁగా 'ఉన్నాను' అను

రూపము సిద్ధించినది. ఇట్లు తక్కిన వర్తమానార్థక పురుషవచనరూపములను సాధించునది. పయిరీతిని భవచ్ఛత్రర్థమునందు 'ఉండు' ధాతువునకు బా. క్రియా. ౪౮ సూత్రముచొప్పున 'ఉన్న' ప్రత్యయమును బా. క్రియా. ౧౪ సూత్రముచొప్పున 'చు'వర్ణకమును బా. సమా. ౯ సూత్రముచొప్పునఁ దచ్ఛబ్దాసు ప్రయోగమును గల్గఁగా "ఉండు+చు+ఉన్న+వాఁడు = ఉండుచున్నవాఁడు" అని యేర్పడవలసియుండఁగాఁ బ్రకృతసూత్రముచే 'ఉండు' ధాతువును దానిని జేరవలసిన 'చు'వర్ణకమును లోపింపఁగా 'ఉన్నవాఁడు' అను రూపమేర్పడును. బా. క్రియా. ౧౧౭ సూత్రముచొప్పునఁ దచ్ఛబ్దవకారము పాక్షికముగా లోపింపఁగా 'ఉన్నాఁడు' అను రూపమేర్పడు నిట్లు సాధింపఁబడుటంజేసి యిది యుండు ధాతుభవచ్ఛత్రర్థక విశేషణరూపమని యెన్నవలయును. పయిరీతిని ప్రథమపురుషైకవచన 'డు' ప్రత్యయమునునిల్పి సాధించిన 'ఉన్నాఁడు' అను రూపమును వర్తమానార్థక ప్రథమపురుషైకవచనమునుగా నెన్నవలయును. "ఉన్నవాఁడు = ఉన్నాఁడు" అను భవచ్ఛత్రర్థక విశేషణరూపములనుండి బా. కార. 33-3౮ సూత్రములచొప్పున 'ఉన్నవాఁడను = ఉన్నాఁడను' అను విధేయవిశేషణరూపములను సాధింపనగును. 'ఉన్నాఁడను' అనుదానిలోని 'డ'వర్ణలోపముగల్గిన "ఉన్నాను" మున్నగురూపములు ప్రాచీన మహాకవిసమ్మతములు కామింజేసి నన్నయాథర్వణీయము సాధింపలేదు. "ఉన్నాను - ఉన్నాము - ఉన్నావు' అను రూపములను నన్నయగాకున్ను దిక్కనయైనఁ బ్రయోగింపలేదు. అట్లగుటంజేసి వానిని బ్రాచీనాంధ్రభాషాస్వరూపమును నిరూపింపఁదలఁచిన సూరిసాధించుట యుక్తముకాదు. వాని నర్వాచీనమహాకవులు ప్రయోగించి యుండుటచే నవి యుగ్రాహ్యములనరాదు. కావున వానిని బ్రౌఢవ్యాకర్త సాధించుటుచితము. (చూ. ౨౯౯ విమ. విస్తర. ౨౯౯ విమ).

సహజరుగు చింతామణిమార్గము ననుసరించి లడర్థము వివక్షితమగునపుడు 'ఉండు' ధాతురూపము లితరధాతువుల కనుబంధములగుననియు 'ఉండిన' అనుదానిలోని 'డి'వర్ణలోపమున 'ఉన్న'శబ్దమేర్పడెననియు నట్టి వికృతిచే దానిభూతార్థము పోయి వర్తమానార్థము గల్గెననియుఁ నట్లగుటచేతనే దానికి మరల లడర్థమున వసత్యనుబంధ మక్కరలేదయ్యెననియుఁ బ్రయోగానురోధమునఁ బ్రక్రియను చూపకుండుటచే సూరి 'ఉన్న' అనునది యేదో శబ్దవిశేషమునునట్లు సమాపకక్రియారూపములలో ననుబంధముగాను వర్తమానార్థక విశేషణప్రత్యయముగాను వచ్చుననియు నది పరమగునపుడు 'ఉండు' ధాతువే లోపించుననియు నిట్లసహజముగాఁ బ్రక్రియాకల్పనము చేసికొనవలసివచ్చెను. ఎక్కువసంఖ్యగల సూత్రముల నుపదేశింపవలసి

వచ్చెను. అట్లె 'ఉండినన్' అను చేదాద్యర్థకమునకు 'ఉన్నన్' అనునది పాక్షికముగ నాదేశమగునని వేఱొకసూత్రము నుపదేశింపవలసెను.

౫౨ సూ. వ్యాఖ్య:—చేదాద్యర్థకమగు 'నను' ప్రత్యయము (బా. క్రి. ౪౧ సూ). 'ఉండు' ధాతువుపై నిలువఁగా "ఉండు+ఇ+నను = ఉండినను" అని యేర్పడును. బా. క్రి. ౧౨ సూత్రముచొప్పున 'ఇ'గాగమము వచ్చెనని యెఱుంగునది. అట్టి 'నను' అనెడి ప్రత్యయములో బూర్వభాగమగు 'న' అనుదానితోఁ గూడిన 'ఉండు' ధాతువునకు 'ఉన్న' అను నాదేశమును బ్రకృతసూత్రము విధించుచున్నది. అట్టి యాదేశము 'ను' అను ద్రుతముతోఁగూడి 'ఉన్న ను' అనురూపము నందుచున్నది. ఉండినను = ఉన్నను = ఉన్నయెడల, ఉన్నప్పటికిని. మొ. ప్రయోగములు - చేదర్థ:— చ. దొరకొనునే ఫలంబు తఱితోఁ దగు వర్షము లేక యున్న................................ (ఉద్యో. 3 ఆ. ౭౯ ప). క. కడుఁ బెద్దకాల ....................| ఒడఁబడి యుండెంతకాల మున్నను మనక య్యెడు లాభ మేమి.........(ఆది. ౭ ఆ. ౨౯). 'ఉన్నన్+ఐనన్ = ఉన్ననైనన్'. అప్యర్థ:— ఆ వె. ఎచటనున్ననైన నెల్లప్పుడును నిన్నుఁ | గన్నులారఁ జూడఁ గాంచుఁ గాన (అర. ౭ ఆ. 3౪౦ ప).

పడ్వాదుల న వర్ణకంబున కత్వంబును గడపల్లునకు

బాలవ్యా. ద్విత్వంబును విభాషనగు. ౫౧.

3౧౫ IV విష పడ్డ - పడిన - పడ్డను - పడినను. పడు - ఇడు - చెడు - తగు - అను - కను - కొను - తిను - మను - విను - చను - ఇవి పడ్వాదులు-

సంజీవని. 3౧౫ IV విష:—'క్వచి త్తదర్థే దయుగం|క్వచి న్న స్యేచ్ఛ లోప వాన్' అను నర్థర్ఫమునకు వివరణ మీసూత్రము - పడ్వాదుల న వర్ణకం బనఁగాఁ బడ్వాదులపై నిల్చిన భూతార్థకవిశేషణ 'న' ప్రత్యయము (బా. క్రి. ౪౬ సూ), చేదాద్యర్థక ద్రుతాంత న ప్రత్యయము (బా. క్రి. ౪౧ సూ) నని యర్థము. పడ్వాదులలోని 'పడు' అనునది, పతనార్థక ప్రాప్త్యర్థక పడు ధాతువును, గర్తార్థమున వచ్చు పడు ణ్యనుబంధము నని యెఱుంగునది. ఉదా:—క్తవదర్థకమగు 'న' ప్రత్యయమును, బా. క్రియా. ౧౨ సూత్రముచొప్పున 'ఇ'గాగమమును - పతనాద్యర్థక పడుధాతువుపై నిల్వఁగా 'పడు+ఇ+న = పడిన' అని యేర్పడును. ప్రకృతసూత్రముచే నందలి 'న' ప్రత్యయమునకు 'అ' అను నాదేశమును డకారమునకు ద్విత్వమును రాఁగా 'పడ్డి+అ' అని నిల్చును. బా. సంధి. ౧౧ సూత్రముచొప్పున నిత్యమగు

పదాదిస్వరసంధి జరుగఁగా 'పడ్డ' అను భూతార్థక విశేషణ మేర్పడును. ప్రకృత సూత్రవిధి వైభాషికమగుటంజేసి 'అత్వద్విత్వములు' రానిపక్షమున 'పడిన' అను రూపమే నిల్చును. పతనార్థః—చెట్టునుండి పడినవాఁడు - చెట్టునుండి పడ్డవాఁడు. ప్రాప్త్యర్థః—భయపడినరాముఁడు-భయపడ్డరాముఁడు-కర్మార్థక పడు జ్యనుబంధః—రామునిచేఁ జంపఁబడిన రావణుఁడు - రామునిచేఁ జంపఁబడ్డ రావణుఁడు. 'పడిన వాఁడు' అనుచోఁ బా. క్రి. ౧౧౭ సూత్రముచొప్పునఁ దచ్ఛబ్ద వకారము లోపింపఁగా "పడిరాఁడు" అని సిద్ధించును. ప్రకృతసూత్రముచే నిందు 'అత్వద్విత్వములు' కల్గఁగా 'పడ్డాఁడు' అనురూపము జనించును - లేదా 'పడ్డవాఁడు' అనుదానిలోని 'అ'త్వము నవర్ణక స్థానీయమగుటంజేసి దానిపైనున్న తచ్ఛబ్ద వకారము బా. క్రి. ౧౧౭ సూత్రముచొప్పున లోపించుటచే 'పడ్డాఁడు' అను రూపము సిద్ధించునన్నను ననవచ్చును. ఇట్లె 'చెడు' మున్నగువానినుండియు 'చెడినవాఁడు = చెడ్డవాఁడు = చెడ్డాఁడు' మున్నగురూపముల నరయునది. ఈరీతినే చేదాద్యర్థకమగు 'నను' ప్రత్యయముఁగల రూపములందును. "పడినను = పడినన్ = పడ్డను = పడ్డన్" = మున్నగునవి సిద్ధించునని యెఱుంగునది. ఇట్లె నువర్ణాంతములగు 'అను - విను' మున్నగు ధాతువులందును 'అత్వద్విత్వములు' రాఁగా 'అనినన్ = అన్నన్, అనినవాఁడు=అన్నవాఁడు=అనినాఁడు=అన్నాఁడు' మున్నగురూపములు సిద్ధించును. ప్రకృతసూత్రమునందలి విభాష వ్యవస్థిత విభాష యగుటచేతను దీనికి మూలమగు "క్వచి న్న స్స్వేచ్ఛ లోపవాన్" అను వికృతివివేకకారికలోని క్వచి చ్ఛబ్ద మహిమచేతను దీర్ఘపూర్వకస్థలములం దీ 'అత్వ-ద్విత్వములు' కల్గవేరవని గ్రహింపనగును. ఉ. పాడినన్ - మూసినన్ - ఊనినన్ - మొ. మూలమునలేని "తగు" ధాతువును గవిజనమండనమునుండి సంగ్రహించి (వికృ. హలం. ౭ కా. వ్యా). సూరి పడ్వాదులలోఁ జేర్చెనుగాని 'తగ్గరని - చంపఁదగ్గవాఁడు' మున్నగు వ్యవహారములలో నిట్టిరూపము లగపడుచున్నవేకాని మహాకవిప్రయోగములం దిట్టివి కన్పట్టలేదు. 'తగినన్' అను చేదర్థకమునకు 'తగ్గన్' అను రూపాంతరము వ్యవహారమునందునైతము వినఁబడలేదు. కావునఁ బ్రాచీనాంధ్రభాషా స్వరూపప్రదర్శన తత్పరుఁడగు సూరి 'తగు'ధాతువును'పడ్వా'దులలోఁ జేర్చుట సరికాదు. కాన 'తగినవాఁడు'అను రూపంబునకు 'తగ్గవాఁడు' అను రూపాంతరముండునుగాని 'తగ్గాఁడు' అనునది యనభిధానంబుననుండదు" (బా. గు. ప్ర. 3౪౪ పు. ద్వి. ము. బా. సా. వే. ౪౨ళి పుట). అనువ్యాఖ్యలును నిరాధారములె. బా. సంధి. ౪౬ సూత్రమునఁ జెప్పఁబడిన పడ్వాదులు వేఱు. ప్రకృతసూత్రములోని(బా-క్రి-౫౧ సూ)పడ్వాదులు వేఱు.కాన

నిందొకచోట నాగణములలోని ధాత్వంతరమును గణాదిగా వచించుట యుక్తము.
ప్రయోగములు:—సీ.........విప్రకులమునెల్లఁ । బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల.........(ఆది. ౧ ఆ. ౭ ప). చ. అనుజుఁడు వడ్డ శంఖుఁడు.........(భీష్మ. ౧ ఆ. ౨౮౬). ఉ.........పతి లేఁడనఁబడ్డ కాంత.........(కర్ణ. 3 ఆ. ౨౨౪). సీ. పేద వడ్డాఁడవు ప్రియజనంబును బరి, వారంబు లేదు.........(శాంతి. ౪ ఆ. ౪౧౨). శా. కింకందా నొకరుండు గెల్చు కడిమిం గీర్తింపఁబడ్డాఁడు (హరి. ఉ. భా. ౫ ఆ. ౧౨౭). చ. తన మునుపడ్డ బన్నములు.........(ఉద్యో. 3 ఆ. ౧౦౨). సీ. తనయులఁ గన్నాఁడు తన్నెల్లవారును వినుతింప మన్నాఁడు దన మనమున (శాంతి. ౬ ఆ. ౫౪౭). (మన్నాఁడు = మనినాఁడు) చ.........కిన్క మాను మ। న్న వచనవృత్తి నాదగు మనంబున.........(అశ్వ. ౪ ఆ. ౬). కం. కొన్ని......... వెసం । జన్న వెనుకొనుటయున్ మిా । యున్నెడ కేనపుడు.........(విరా. ౨ ఆ. ౧౭౪). సీ.........ద్రుపద । తనయ గాననమునఁ గొని చన్నవాఁడ కాఁ । దెగినాఁడు గాదె (స్త్రీ. ౨ ఆ. ౯౫). మ.........ఏ। గతిఁ జన్నం జనని చ్చెఁ గాని.........(శాంతి. ౧ ఆ. ౪౬). సీ.........తే-గీ. అన్నరేంద్ర చంద్రుం డును జన్నవాఁడ (శాంతి. ౧ ఆ. ౨౪౨). ద్విపద. ఎత్తికొన్నాఁ డిఁక నిటమిాఁద నెంత (బస-౫ ఆ. 3౬3). శా. ఆదిం గాధి తనూజుచే సగము సేయంబడ్డ మిన్నేలు (శృం. నై. ౨ ఆ. ౪౧).

నన్నయా డోస్తు ఖేదకతాపి స్యా । దితి కేషాంచి దీరణా (విశ్వ. 3౧౬ వివయము. క్రియా. ౧౦ శా. అహో. ౪౮౭ పు).

కల్పతరువు. 3౧౬ వివ:—నన్నయ డు ప్రత్యయాంత తత్సరు ధాతు రూపములు బ్రయోగింపఁడు.అథర్వణు డద్దాని నుపదేశించుచున్నాడు."తద్ధర్మప్రథ మే స్యాతాం।డు డివర్ణౌచ నాన్తకౌ । డోస్తు ఖేదకతాఽపి స్యాత్ ......"అను కారికలోని(౨౯౬ I వివ)యుత్తరార్థము ప్రకృతసూత్రమై యున్నది.కాన 'డోస్తు' అనుదానికి 'అ డు డి వర్ణకములలో నొకటగు 'డున్' అను ప్రత్యయమున కని యర్థ ము, ఖేదకతాఽపి = విశేషణత్వమునైతము, స్యాత్ =అగును. నాన్తములగు డు డి వర్ణకములు తద్ధర్మార్థక ప్రథమపురుషమున వచ్చుటే కాక యందలి 'డున్' అనునది తద్ధర్మార్థక విశేషణమగుటయుఁ గలదని యర్థము. ఇతి = ఇట్లని, కేషాంచిదీరణా = కొందఱిపలుకు గలదు. కేషాంచి త్తనుటచేత నిది రాకుండుటయు ననఁగాఁ దద్ధర్మ ప్రథమపురుషైకవచనమువంటి (చదువున్ వాఁడు) యాకారముతో నీ విశేషణము నిల్చుట సైతము గలదను నర్థము లభించుచున్నది. చింతామణిచొప్పునఁ బునరాగమ

సూత్రముచే "ఉ" ప్రత్యయము వచ్చి తద్ధర్మార్థక విశేషణరూప మేర్పడనగును గాన నట్టియెడల నిట్టి 'డు' ప్రత్యయాంతరూపమును బాక్షికముగ నిల్పునని తాత్ప ర్యము (చూ. ౨౯౬ విష. చిం. వి. ప. ౧౧౧ విష). డుడ్వాదివర్ణే భూతార్థే। చాపీత్యాది సూత్రముచొప్పున (౨౯౬ I విష). డువర్ణకము పరమగునపుడు 'ఎ'త్వము కల్గును. "అన్యే ద్రుతప్రకృతయః........" అనుచొప్పున నెట్టును నిది ద్రుతప్రకృతిక మగును. అట్టి ద్రుతమునె "డు డి వర్ణౌచ నాన్తకౌ" అను వాక్య ముతో నథర్వణుఁ డనువదించెను. "రక్షించున్+వాఁడు=రక్షించువాఁడు" అనియుఁ బ్రకృతసూత్రముచే 'డు' ప్రత్యయమును 'ఎ'త్వమును రాఁగా "రక్షించు+ఎ+ డున్+వాఁడు = రక్షించెడువాఁడు" అనియు రూపద్వయము సిద్ధించును. తద్ధర్మ ప్రథమపురుషైకవచనమున వచ్చు 'డు - డి' వర్ణకములలో నొకటగు 'డు' అను దానిని మాత్రమె యథర్వణుఁడు 'డౌస్తు' అని వక్కాణించుటచే 'డి' ప్రత్యయ మథర్వణసమ్మతము కాదని విశదమగుచున్నది. క.........వ్ర। స్వెడు రవమును దిగ్వలయము। గడుకొని.........(ఆది. ౨ ఆ. ౨౧౬). క.........ఇం దెంత కాలమున్నను మనక। య్యెడు లాభమేమి.........(ఆది. ౭ ఆ. ౨౯). క. కడఁగి మదీయాస్త్రము లని। యెడు పటుమంత్రముల.........(ఆది. ౭ ఆ, ౧౯౩). క.........చె। ప్పెడువారుఁ గాక నీకున్। మడవక.........(సభా. ౨ ఆ. ౧౯౦(

ఇట్లు నన్నయప్రయోగములలో బ్రాసస్థలగతము 'డు' వర్ణకమె యని యథర్వణ వచనమునుబట్టి నిర్ణయింపనగును. 'డి' వర్ణకస్థితిని నిర్వహింపఁజాలు ప్రయోగము లభింపలేదు. కాని యీక్రింది సోమయాజి ప్రయోగములచే 'డి' వర్ణకము సముచితము - గ్రాహ్యమె యనక తీఱదు. క.........ద్రౌపది। నట్టులు పతిచెడిదె. (ఉద్యో. ౧ ఆ. ౩౪౪). క. నీ యట్టివాఁడు నిస్సీ। పోయెడిదే యిట్లు పోవు పోవు మనుడు.........(విరా. ౫ ఆ. ౨౦౬) ఇచట 'డు' ప్రత్యయమును నిల్పి సవరించినచో "నస్యాత్తద్ధర్మోతః" (౭౩-౯౫ I విష). అనుచొప్పున "పతిచెడు నదె - పోయెడునదె" అని రూపము లేర్పడి ఛందోభంగము కావలసివచ్చును. కాన నచట 'డి' ప్రత్యయమె నిల్పినదనియు "శబ్దాత్తచ్ఛబ్దాతః" అనుచొప్పున (౧౦౭ విష. ౧౦౭ I విష). "పతిచెడిది - పోయెడిది" అను రూపములె కవి ప్రయుక్తములనియు (నిర్ణయింపక తప్పదు. ఇట్టిప్రయోగము లింకను గలవు. క. పనిఁ గొనఁదలఁచిన నేలెడి। దనుమానము గలిగెనేని నరిగెద నధిపా (విరా. ౧ ఆ. ౨౭౦). క. ద్విరదము లొరగెడివియు నె। త్తురు.........కూలెడివి.........పడియెడివి .........పొరలెడివి (భీష్మ. ౨ ఆ. ౨౧౩). ఉ. చెప్పెడిదేమి నాకుఁగల జీవన

మంతయు నీకుఁగూర్చి.........(వసు. ౨ ఆ. ౧౩౦). డు డి ప్రత్యయములు రాక కేవలము 'ఉ' ప్రత్యయముతో నిల్చురూపముల ప్రయోగములు:—ఉ... ......ధాత్రిఁ బరిభ్రమించు బలదర్పపరాక్రమ.........(ఆది. ౧ ఆ. ౧౦౮ ప). క. శరణనినవారిఁ గరుణా। కరులయి రక్షించు పురుషకార్యాన్వితులే......... (ఆది. ౧ ఆ. ౧౩౭). చ.........గొంతి ముద్దుసే। యుకొడుకు మేను లేఁత దన యుల్లము మెత్తన.........(విరా. ౧ ఆ. ౯౮).

తృవర్ణకార్థంబునం దెడి యెడు వన్నియ లగు.౨౨.

బాలవ్యాకరణ వివరణము. ప్రహరించెడివాఁడు - ప్రహరించెడువాఁడు-ప్రహర్త యని యర్థము.

౩౧౬ I విషయము. వానికి లోపంబు బహుళంబుగా నగు. ౨౫.

ప్రహరించువాఁడు - ప్రహర్తయని యర్థము.

సంజీవని. ౩౧౬ I విష:—౨౨ సూ. వ్యాఖ్య:—తృవర్ణకార్థంబునన్ = సంస్కృతవ్యాకరణమునఁ బ్రసిద్ధమగు 'తృచ్' ప్రత్యయముయొక్క యర్థమునందు, ఎడి యెడు వన్నియలు = 'ఎడి - ఎడు' అను ప్రత్యయములు, అగును = ('వన్నియ' అనునది వర్ణశబ్దభవము.) ధాతువుతుదిని నిల్చును. ప్రథమ ద్వితీయ ముద్రణము లందు సయితమెడి యెడు వన్నియలనియే యున్నది.

ప్రహరించు + ఎడి + వాఁడు = ప్రహరించెడివాఁడు. ప్రహరించు+ఎడు+ వాఁడు = ప్రహరించెడువాఁడు. రెండుదాహృతులందులను బా. సమా. ౯ సూత్రముచొప్పునఁ దచ్ఛబ్దము 'వాఁడు' అనునది యనుప్రయుక్తమయ్యెను. ఇట్లె ప్రహరించు + ఎడి + అది = ప్రహరించెడిది. ఇట బా. సంధి. ౨౫ సూత్రము చొప్పున ననుప్రయుక్తమగు 'అది' శబ్దముయొక్క 'అ' కారము నిత్యముగా లోపించును. ప్రహరించు+ఎడు+అది = ప్రహరించెడునది. ఇట బా. సంధి. ౨౫ సూత్రముచొప్పున 'అది' శబ్దముయొక్క 'అ' కారమునకు లోపాభావము నిత్యమని యెఱుంగునది. 'ప్రహరించువాఁడు' అనఁగా ప్రహరించుటకుఁ గర్తయనఁగా ప్రహరించుటయను వ్యాపారము చేయువాఁడని యర్థము. ఇట్టి యభిప్రాయముతోనే సూరిగారు కర్త్రర్థక తృచ్ ప్రత్యయాంత సంస్కృతశబ్దమును 'ప్రహర్త' అనుదానిని బర్యాయముగాఁ జూపిరి.

"ణ్వుల్ తృచౌ (3-౧-౧33) ధాతోః రేతౌ స్తః.........కర్త్రర్థే....." (సి.కౌ. కృదంత. ౨౮౯౫ సూ.) "అనయోర్వర్తమానకాలా దన్యత్ర న ప్రయోఁగ

ఇతి భాష్యమ్" (బాలమ. వ్యాఖ్య.) తద్ధర్మములకుఁ దెలుఁగున నిట్టి నియమ మున్నట్లు కనుపట్టదు. క. కదుఁ బెద్దకాల ముండితి। మొదఁబడి యుండెదె తకాల మున్నను మన క। య్యెడు లాభమేమి........" (ఆది. ౭ ఆ. ౨౯) కావునని యథర్వణుఁడు తద్ధర్మాద్యర్థముల 'డు' ప్రత్యయమును విధించినవాఁడయ్యెను - కానఁ దద్ధర్మాద్యర్థములలో వర్తమానార్థమును బరిగణింపఁబడుటచేత వర్తమానార్థకస్థలములం దీ ప్రత్యయములు వచ్చినను రావచ్చును. సంస్కృతమునందు సైతము తృచ్ ప్రత్యయము తద్ధర్మాద్యర్థములయందును వచ్చునని చెప్పఁబడియున్నది. "తచ్ఛీల తద్ధర్మ తత్సాధు కారిణ్యపి కర్తరి తృన్స్యాత్. అధికంతు ప్రవిష్టం నతు తద్దాని రితి న్యాయాత్" (ముగ్ధ. వ్యా. ౯౯౦ సూ. దుర్గాదాసవ్యాఖ్య). "అర్హే కృత్య తృచశ్చ (3-3-౧౬౯)" (సి. కౌ. ౨౮౨౨ సూ ) "యోగ్యే కర్తరి గమ్యే కృత్యాః-తృచ్ - లిజ్ చేత్యర్థః" (బాలమ. వ్యా.) "వోఢు మర్హో వోఢా = (వహింపఁదగిన వాఁడు) (సి. కౌ. ౨౮౯౫ సూ. వివరణము) ఇట్లు పాణినీయులును వచించి యున్నారు.

౪౫ సూ. వ్యాఖ్య:—వానికి లోపంబు బహుళంబుగా నగు ననఁగా నట్టి "ఎడి - ఎడు" అను ప్రత్యయములకు బహుళముగా లోపంబు కలుగునని యర్థము. 'ప్రహరించెడు వాఁడు' అనుదానిలో 'ఎడు' లోపింపఁగా 'ప్రహరించువాఁడు' అని యేర్పడును. ఎడి లోపించినను నిట్టి రూపమె నిల్చును. తచ్ఛబ్దానుప్రయోగము లేనపుడు ప్రహరించు రాముఁడు ప్రహరించెడు రాముఁడు. మొ. తద్ధర్మాద్యర్థ బోధక విశేషణ ప్రయుక్తవాక్యమునఁ గాలనిర్ణాయక శబ్దవిశేషప్రయోగము లేనపుడయ్యది కాలత్రయమునందును నైచ్ఛికముగ వర్తించునను విషయము నీక్రింది రీతిని ప్రౌఢవ్యాకర్త సూత్రించెను. "తద్ధర్మార్థక విశేషణం బసహాయతం త్రికాల వాచి యగు. ఉదా:—సీ. వారి యనువయించు। సితకృష్ణతంతు రాజితతంత్రమిది. (ఆది. ౧ ఆ. ౧౧౯ ప). (అనువయించు = అనువయించుచున్న = నేయుచున్న) వ. నానేర్చువిధంబున. (నేర్చు = నేర్చిన) (భార. ఆది. ౧ ఆ.) నాకడు ప్రయాసము లూరక పోకయుండ (కళా. ౪ ఆ.) (కడు = పడిన). ఆ.వె. ద్రుపదు వీటిలోన దొమ్మికయ్యము రేఁచె। బసులఁ బట్టె విరటు పట్టణమున। మఱియు నెన్ని లేవు మార్తాండతనయుండు। తోడరి మనకుఁ జేయు దుఁడగములు (జైమి. ౧ ఆ.) (చేయు = చేసిన). సీ. జనమేజయుని చేయు సర్పయాగమునకు (ఆది. ౨ ఆ. ౧3౧) (చేయు = చేయఁగల)." (ప్రౌఢ-క్రియా-౧ సూ)

కన్నయా. ప్రతిషేధవాచినాం నిః (ఆం. చిం. హలం. ౧౨ కా. ౩౧౭ విషయము. అహో. ౪౦౫ పుట).

కల్పతరువు. ౩౧౭ విష:—ప్రతిషేధవాచినామ్ = వ్యతిరేక తద్ధర్మార్థక విశేషణవాచక క్రియలకు, నిః = ని ప్రత్యయ మగును. "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్" అను చొప్పున ని ప్రత్యయ పరకత్వమున ధాతువుతుదిని 'అ'త్వము నిల్చును. చదువు+అ+ని+వాఁడు = చదువనివాఁడు. ఇట్లె చదువనిది (చదువు+అ+ని+అది). మొదలగురూపములు సిద్ధించును. చదువనిపాఠము - చదువని చైత్రుఁడు - మొ. ౨౭౮ విషయముచొప్పున, 'అన్నముతినని విస్తరి' మున్నగు కర్మధారయాభాసరూపములును గ్రహింపనగును.

ప్రయోగములు:—క. ధర లుబ్ధుల ముచ్చులఁ గూ । ర్పని వారలఁ బగఱ వలనివారల ధృతి చా । లనివారల దుర్జనులం । బనుపవుగా రాచకార్యభారము దాల్పన్ (సభా. ౧ ఆ. ౪౧) ('ని' ప్రాసగతము). క. దనుజాహిత నీ కావవ । మున నెదిరి మహోగ్రదహనమునఁ బడియును గా । లని మిడితవో లె నతిఠో । వనుఁడు జరాసంధుఁ డెట్లు బ్రదుకఁగ నేర్చున్ (సభా. ౧ ఆ. ౧౩౩). ('ని' ప్రాసగతము). క. తన యెఱిఁగినయర్థం బొరుఁ(డనఘా యిదియెట్టు చెప్పు మనియడిగినఁ జె । ప్పని నాఁడును సత్యము చె । ప్పనినాఁడును ఘోరనరకపంకమునఁ బడున్ (ఆది. ౧ ఆ. ౧౩౭). ('ని' ప్రాసగతము). సీ......... । నేఁడు పోవనినాఁడు నిష్ఫలం బిమ్మహా । యత్నమంతయు నని యధికచింత । (ఆర. ౧ ఆ. ౧౧౫). ఇట్టి 'ని' ప్రత్యయార్థమును వ్యతిరేక సమాపక క్రియతో ఘటించుటయుఁ గలదు. చ......... శరంబులన్ సురా । సురులకుఁ గట్టరాదవుట.........(భాస్క. సుందర. ౪౩౭ ప). (కట్టరాదవుటన్=కట్టరానిదగుటచేత)

బాలవ్యాకరణ వ్యతిరేక తృవర్ణ కార్థంబున నిజేమగు. ౪౭.

వివరణము. వండనివాఁడు. ఎడి ప్రభృతివర్ణ కాంతంబు లేఁడును

౩౧౭ I విషయము. ధాతుజవిశేషణంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు.

సంజీవని. ౩౧౭ I విష:—తృవర్ణకార్థము లీవఱకు వివరింపఁబడెను. వాని వ్యతిరేక మర్థ మగునపుడు నివర్ణక మగునని యర్థము. వండనివాఁడు = పచన వ్యాపారము జరపనివాఁడు. (వండు+అ+ని+వాఁడు.). బా. క్రియా. ౨౦ సూత్రముచొప్పున ధాతువుతుదిని 'అ'త్వము నిల్చును. ప్రకృతసూత్రముచే 'ని' వర్ణకమువచ్చును. బా. సమా. ౯ సూత్రముచొప్పున తచ్ఛబ్దానుప్రయోగము గల్గును. విభక్తి వివక్షింపఁ నపుడు - వండని రాముఁడు - వండనియన్నము - మొ.

వంశు ౨+౧+౨౩ = ౫౧౫౧౩ = వాడ౧యుక్తి. బా. సంధి. ౪౫ సూత్రముచొప్పున 'అది' శబ్దాకారలోపము పాక్షికముగ నయ్యెనని యెఱుఁగునది. ఎడి ప్రభృతి వర్ణకాంతంబులు:—బాల. క్రియా ౪౪-౪౫ సూత్రములచే విధింపఁబడిన త్ర్యర్థకము లగు 'రక్షించెడి - రక్షించెడు - రక్షించు' అనురీతిని మూఁడును, బా. క్రి. ౪౬ సూత్రముచే విధింపఁబడిన 'రక్షించుచున్న - రక్షింపఁగల - రక్షించిన' అనురీతిని మూఁడును, బా. క్రి. ౪౭ సూత్రముచే విధింపఁబడిన 'రక్షింపని' అనురీతి దొకటియుఁ గలిసి—ఏడును ధాతుజవిశేషణంబులని వ్యవహరింపఁబడుననుచు సూరి వివరించెను. ధాతుజవిశేషణము లనఁగా ధాతువునుండి పుట్టిన విశేషణములని యర్థము. ఇక్లే వీనిని క్రియాజన్యవిశేషణములనియు వాడుదురు. ఇవి నామపదముతో నన్వయించు నవిగాన వీనిని నామాకాంక్షోపసమాపకములనియు వ్యవహరింతురు. ఏతత్స మాన న్యాయమున 'క్త్వార్థకము - వ్యతిరేకక్త్వార్థకము - శతృ-తు-మానంతర్య-చే దాద్యర్థకములును ననెడి యాఱు'ను క్రియాపదముతోనె యన్వయించునుగాన వానిని క్రియాకాంక్షోపసమాపకములని వాడుదురు.

లః కర్మణిచ భావే చాకర్మకేభ్యః. (3-౪-౬౯) లకారాః

| | |
|---|---|
| సన్నయా | సకర్మకేభ్యః కర్మణి, కర్తరిచ, స్యు రకర్మకేభ్యో భావే |
| థర్వణీయము. | కర్తరిచ (సి. కౌ. భ్వాది. ౨౧౪౨ సూ.) |
| ౩౧౮ విషయము. | అకర్మణ స్సకర్మత్వాదకర్మత్వం స కర్మణః(క్రియా. ౧౧ కారి. అహో. ౪౯౧ పు.) |

కల్పతరువు. ౩౧౮ విష:—అనుక్త మన్య శబ్దానుశాసనవర్తనున్యాయము రీతి నథర్వణుఁడు వచించిన "త దనుక్తస్య కార్యస్య । వక్ష్యాథవతి పాణినిః" (౧ V విష. విభ. సంజ్ఞా. ౬ కారి). అను సూత్రముచొప్పున లడాదులగు సమాపక క్రియాప్రత్యయములు సకర్మధాతువులకుఁ గర్త్రర్థమందును గర్మార్థమందును నగును. అకర్మకధాతువులకుఁ గర్త్రర్థమందును భావార్థమందును నగు నను పాణిన్యుక్తవిషయ మిచట మూలముగఁ జూపఁబడెను. అకర్మకధాతువులకుఁ గర్మార్థకత్వము లేదు. తెల్గున భావార్థక సమాపక క్రియలకుఁ బ్రయోగమే లేదు. సంస్కృతమున నకర్మక క్రియలకు భావార్థమున లడాదులు వచ్చును. అవి వచ్చునపుడు ప్రథమపురుషైక వచనమందుమాత్రమె వానికిఁ బ్రయోగ ముండును. అకర్మకధాతువులకుమాత్రమె భావార్థమున నట్లు వచ్చును. "భావో - భావనా = ఉత్పాదనా - క్రియా ......యుష్మ దస్మద్భ్యాం సామానాధికరణ్యాఽభావా త్ప్రథమపురుషః. తిఙ్వా చ్యభావనాయా అసత్వరూపత్వేన ద్విత్వా ద్యప్రతీతే ర్న ద్వివచనాది. కిం త్వేక

వచనమేన. తస్యాత్పర్ణకత్వేన సంఖ్యానపేక్షత్వాత్........త్వయా, మయా, అన్యైశ్చ భూయతే." "సత్వం ద్రవ్యం లిఙ్గసంఖ్యాన్వయయోగ్యమ్" (బాలమ. వ్యాఖ్య. సి. కౌ. ౨౨౫౨ సూ.) (నీచేతను నాచేతను నితరులచేతను గాఁబడును తెల్గునఁ బ్రయోగము చూపఁబడుటకయి గత్యంతరము లేక 'గాఁబడును' అను పద శబ్దము (వ్యావహారికము) వాడఁబడెను. అకర్మకధాతువులకు "పడు" జ్యను బంధము బా. క్రియా. ౪౯ సూత్రముచే రానేరదు. సకర్మకములకు భావార్థకత్వము లేనపుడు పచనము = పాకము = వండుట - వంట మున్నగు భావార్థక రూపములకు సాధుత్వమెట్లని శంకింపరాదు. తిఙ్ఙుల కనఁగా సమాపక క్రియలకుఁ జెప్పిన నిషేధము కృత్తులకుఁ జెల్లనేరదు. కానఁ దెల్గునందును సకర్మకములకుఁ గర్తృకర్మార్థములందును నకర్మకములకుఁ గర్త్రర్థమాత్రమందును భావార్థక ట ప్రత్యయాదికృత్తులు వచ్చుట నిర్బాధము. ఇచటి కర్తృత్వమాభాసరూపము. (చూడు. ౨౮౫ II విష.) "అకర్మకా ద్ధాతో ర్లేవ భావే త్యాది (తిబాది) విభక్తయః స్యుః. నతు సకర్మకాత్. కృత్ప్రత్యయాస్తు సకర్మకా దకర్మకాచ్చ భావే స్యుః - తేన కాం దిశం గన్తవ్యమ్, సభాం వా న ప్రవేష్టవ్యమ్ ఛాత్రేణ గ్రన్థస్య పాఠః - శిశోశ్శయనమిత్యాది." (ముగ్ధ. ౯౨౫ సూ. దుర్గాదాసవ్యాఖ్య). ఇట్లైనచోఁ గృత్తులకు భావార్థక ట ప్రత్యయాదులు సమాపక క్రియా ప్రకరణమునఁ జెప్పఁబడనేల యని శంకింపరాదు. ట ప్రత్యయాదికృత్తులు తక్కిన కృత్తులవలెఁగాక ప్రతిధాతువునకును వచ్చును. మఱియు 'ట' ప్రత్యయాద్యన్తములందుఁ దక్కిన కృదంతములందువలెఁ గాక నియతముగాఁ గ్రియార్థమనఁగా వ్యాపారరూపార్థము స్ఫురించుచునే యుండును. తక్కిన కృదంతములందట్లు వ్యాపారార్థము భాసిల్లదు. చేయు+ఇ = చేయి = హస్తము - ఎండు+అ = ఎండ = సూర్యాతపము. (౩౦౯ వి.)

లః కర్మణీత్యాది:—లకారాః = లడాది లకారము లనఁగా సమాపక క్రియా ప్రత్యయములు, సకర్మకేభ్యః = సకర్మకధాతువులకంటెఁ బరముగా, కర్మణి - కర్తరిచ = కర్మార్థమందును గర్త్రర్థమందును స్యుః = అగును. అకర్మకేభ్యః = అకర్మకధాతువులకంటెఁ బరముగ, భావే, కర్తరిచ = భావార్థమందును గర్త్రర్థమునందును నగును. రామః రావణం హన్తి = రామేణ రావణో హన్యతే. త్వం భవసి - త్వయా భూయతే. సంస్కృతమునందు సైతము భావార్థమున నన్నిటను బ్రథమపురుషైక వచనముమాత్రమె నిల్చునని పైని వివరింపఁబడెను. తెల్గున భావార్థక సమాపక క్రియాప్రయోగమె సమ్మతము కాదు. ఉదా:—రాముఁడు రావణుని జంపును. రామునిచే రావణుఁడు చంపఁబడును - నీ వుంటివి - మొ. "నీచే నుండఁబడెను"

అని తెల్పునఁ బ్రయోగింపరాదు. ఇట్లె నీచేత రాఁబడెను - నీచేతఁ గాఁబడెను మున్నగునవి యసాధువులు.

అకర్మక ఇత్యాది:—అకర్మకాః = అకర్మక ధాతువులకు, సకర్మత్వమ్ = కర్మాకాంక్షగల్గుటయు, సకర్మకాః = సకర్మకధాతువులకు, అకర్మత్వమ్ = కర్మాకాంక్షారాహిత్యమును, మహాకవిప్రయోగములందుఁ గన్పట్టుచున్నది. వివక్షావశమునఁగాని, ధాతువుయొక్క యర్థమందు మార్పుగల్గుట మున్నగు కారణములచేతఁగాని యట్టి వైపరీత్యము గల్గును. ఉదా:—కన్ను మాయను నాపుక్ (ఆర. ౧ ఆ. ౨౭౦ ప.). జయతు జయ త్యార్యః = ఆర్యుఁడు సర్వోత్కర్షముగ వర్తించుఁగాక. వాఁడు రిపులను జయించెను. (విస్తర.) ఇట 'జి' ధాత్వర్థపు మార్పువలన సకర్మక మకర్మకమగుచున్నది. 'హితాన్న యః సంశృణుతే స కింప్రభుః = హితమునుండి యెవఁడు వినఁడో వాఁడు చెడ్డప్రభువు' (గాణ. 330 పు. ఇట కర్మత్వము వివక్షింపఁబడలేదు. అపాదానము వివక్షిత మయ్యెను. రామునకు నమస్కరించి - రాముని

---

విస్తర. 3౧౮ విష:—అహోబలపతి 'జి' ధాతువు నకర్మకమనుచు "క్వచి దకర్మణస్స కర్మత్వమ్ - జయించె రిపుల......" (అహో. ౪౬౧ పుట). అని యిట్లు వ్రాయుట సరికాదు. "జి - జయే - భ్వా - పర - సకర్మక - అనిట్ - జయతి - అజైషీత్" (శబ్దస్తో) అనుచొప్పున 'జి' ధాతువు సకర్మకమె. "స జయ త్యరిసార్థసార్థకీ । కృతనామా కిల భీమభూపతిః" (నైష. ౨ సర్గ. ) ఇత్యాదులం దర్థభేదమున నది యకర్మకముగా వాడఁబడును. గాణపత వివరణకర్త సంస్కృతమున నకర్మకము తెల్గున సకర్మకమగునని యర్థముచేసెను. అదియు సరికాదు. ఉత్కర్షప్రాప్త్యర్థక మగునపుడు 'జి' ధాతువు సంస్కృతాంధ్రములు రెంటను నకర్మకమె. "శత్రులను జయించెను" అను రీతిగల స్థలములం దది సంస్కృతాంధ్రములు రెంటను సకర్మకమె. సత్కర్మము పాపమును హరించును. వాఁ డుద్యానమున విహరించెను. ఉపసర్గవశమున నిట హృధాత్వర్థము మాఱుటచే సకర్మక మకర్మక మయ్యెను. అహోబలపతి "క్వచి దర్థవిశేషే నకర్మకత్వం చింతింతు రాము నెప్పుడు - క్వచి దరవిశేషే అకర్మకత్వం చింతిల్లె దేల యిప్పుడు" (అహో. ౪౬౧ పు). అని యుదాహరించుట సరికాదు. "చితు ణౌ భవేచ్చ లోపో హ్యర్థే యో వర్తతే పరే తస్మిన్" అను చింతామణిచొప్పునఁ దెలుఁగున "చింతించు" ప్రేరణార్థకము. 'చింతిల్లు' అప్రేరణార్థకమనఁగా స్వార్థికము. గాణపత వివరణకర్తయు నీయహోబల ఖండితమార్గమునె యనుసరించెను (గాణ. క్రియా. 3౭౫ కారి. ౫౧ పద్య. వివరణము). "చిత - స్మృతౌ. చు ఉభ. సక........." (శబ్దస్తో).

నమస్కరించి. (౨౮౫ I ౬ ప). "వేఁటఁ బోయెరి (భార. అర. ౬ ఆ). అవ్విభుండు పాల మేఁగెను. (వి. పు. ౭ ఆ) ............................ చ. అడవికి వేఁటకై యరిగి (పాండు. ౫ ఆ)" (ప్రౌఢ. కార. ౧౩ సూ. వివ). (విస్తర. I ౨౮౮ I విష). ఇట నకర్మకముగు 'ఏగు' ధాతువు సకర్మకముగ వాడఁబడెను. అకర్మకముల పట్టిక ౨౩౬ విషయమున వివరింపఁబడెను. కొన్ని సకర్మకము లకర్మకము లగునని సంస్కృత వైయాకరణులును వచించిరి. "తథాచ - గోయీచన్ద్రః - ధాతో రర్థాన్తరే వృత్తే - ర్ధాత్వర్థే నోపసంగ్రహాత్ । ప్రసిద్ధే రవివక్షాతః । కర్మణో౽కర్మికా క్రియేతి. ధాత్వర్థేన సహ కర్మణ ఉపసంగ్రహా దిత్యర్థః. క్రమే ణోదాహరణాని:—నదీ వహతి - క్షరతీత్యర్థః. అఘుయతి వ్యాఘ్రః. భవతి ఘటః - ఆహతే జనః - తపస్యతి మునిః" (ముగ్ధ. ౯౩౨ సూ. దుర్గా. వ్యాఖ్య).

లకారాదులు సకర్మకంబులకుం గర్తృకర్మంబులందును
బాలవ్యా. లాఁతికిం గర్తయందు నగు. ౮౦.
౩౧౮ I విషయము. సకర్మకంబు నాఁ గర్మాకాంక్షోత్థాపకంబు. అకర్మకం
బనాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు.

సంజీవని. ౩౧౮ I విష:—లకారాదులు 'లట్టు - లిట్టు - మున్నగు సమాపక క్రియా ప్రత్యయములును, సాదిశబ్దముచే - భావార్థకాదులనఁగా - "ట" ప్రత్యయము మున్నగు (బా. క్రి. ౩౫ సూ. మొ. ౮౩ సూ. వ). నసమాపకక్రియా ప్రత్యయములును బా. క్రి. ౧౨౨ సూత్రముచే విధింపఁబడిన భావార్థక నజి ప్రత్యయమును సకర్మకధాతువులకుఁ గర్త్రర్థమునందును,గర్మార్థమునందునువచ్చును. అకర్మకధాతువులకుఁ గర్త్రర్థమందుమాత్రము వచ్చును. అకర్మకక్రియలకుఁ గర్మార్థక ప్రయోగము లేదు. కర్మాకాంక్షోత్థాపక మనఁగాఁ గర్మాకాంక్షను బుట్టించునది. కర్మాకాంక్షానుత్థాపక మనఁగాఁ గర్మాకాంక్షను బుట్టింపనిది. ఆకాంక్ష యనఁగా 'కోరిక'. అన్వయయోగ్యతకై పదము పదాంతరమును గోరుట. "ఆకాఙ్క్షా. స్త్రీ. (ఆ+కాఙ్క్ష+అఙ్)........న్యాయమతే వాక్యార్థజ్ఞాన హేతౌ. యత్పదం వినా యత్పద స్యాననన్వయ స్తత్పదే తత్పదవత్త్వ రూపే సంబన్ధే........" (శబ్దస్తో). "ఆకాఙ్క్షా-స్త్రీ......వాక్యార్థజ్ఞాన హేతౌ పదస్య పదాన్తర వ్యతిరేక ప్రయుక్తాన్వయాభావే. ఆకాఙ్క్షా హితం వాక్యం న ప్రమాణమ్. యథా గౌ రశ్వః పురుషో హస్తీతి న ప్రమాణ మాకాఙ్క్షావిరహాత్. న్యాయమతే యత్పదఘృతే యత్పదాన్వయబోధో నభవతి తత్పదే తత్పద వత్త్వేతి. ప్రతీతి పర్యవసాన విరహ ఇత్యాలఙ్కారికాః" (శబ్దా. చిం). 'రాముఁడు రావణునిఁ జంపెను' అను వాక్యమునఁ జంపె

ననుపదము 'రావణునిన్' అను కర్మపదము నన్వయబోధమునకయి యాకాంక్షించు చున్నదనఁగాఁ గోరుచున్నది. కానఁ గర్మము నాకాంక్షించుచున్న 'చంపెను' అను నది సకర్మకము. 'రాముఁడు వచ్చెను' అనునపుడిట్టి యాకాంక్ష 'వచ్చెను' అను దానికి లేదు గాన నది యకర్మకము. ఉదా:—సకర్మకమునకుఁ గర్త్రర్థమున లకార ములు వచ్చుటకు:—రాముఁడు పాఠమును జదివెను. రాముఁడు పాఠమును జదువు చున్నాఁడు. రాముఁడు పాఠమును జదువఁగలఁడు-రాముఁడు పాఠమును జదువును-రాముఁడు పాఠమును జదువఁడు. రాముఁడా పాఠమును జదువుము. రాముఁడా పాఠమును జదువకుము - మొ. సకర్మకమునకుఁ గర్మార్థమున లకారములు వచ్చు టకు:—రామునిచేఁ బాఠము చదువఁబడెను - రామునిచేఁ బాఠము చదువఁబడు చున్నది. రామునిచేఁ బాఠము చదువఁబడఁగలదు. రామునిచేఁ బాఠము చదువఁ బడును. రామునిచేఁ బాఠము చదువఁబడదు. ఓదేవా నాచేఁ గొలువఁబడుము. ఓదేవా నాచేఁ గొలువఁబడకుము - మొ. అకర్మకమునకుఁ గర్త్రర్థమున లకార ములు వచ్చుటకు:—రాముఁడువచ్చెను - రాముఁడు వచ్చుచున్నాఁడు - రాముఁడు రాఁగలఁడు - రాముఁడు వచ్చును - రాముఁడు రాఁడు - రామా రమ్ము - రామా రాకుము- మొ. అసమాపకక్రియ లనఁగా వాక్యసమాప్తిని జేయఁజాలని క్రియలు. ఉదా:—'బాలుఁడు పాఠమునుజదువుట యింపుగానున్నది' ఈవాక్యము 'చదువుట' అనుదానితో ముగియలేదు. చదువుట యెట్లున్నదో తెలుపునట్టి యింపుగా నున్న దనునది లేనిచో నన్వయము కుదురఁడలేదు. వాక్యము ముగియలేదు. కావున 'చదువుట' అనునది యసమాపకక్రియ. ఇట్లె "బాలుఁడు పాఠమును జదివి నిద్రిం చెను. బాలుఁడు చదువుచున్న పాఠము పెద్దది." మున్నగు వాక్యములలోను "చదివి - చదువుచున్న" మున్నగునవి యసమాపకక్రియలు. ఇట్టి క్రియలయందలి 'ట - ఇ - చున్న' మున్నగు ప్రత్యయములుసయితము సకర్మకములకుఁ గర్త్రర్థము నందును గర్మార్థమునందును వచ్చును. అకర్మకములకుఁ గర్త్రర్థమునందు మాత్రము వచ్చును. ఉదా:—రాముఁడు రావణుని జంపుట లోకహితమయ్యెను. రామునిచే రావణుఁడు చంపఁబడుట లోకహితమయ్యెను - రాముఁ డడవి కేఁగుట లోకహిత మయ్యెను - మొ. పయివాక్యములలో మొదటివాక్యమున 'చంపుట' అనుదాని లోని 'ట' ప్రత్యయము కర్త్రర్థక మగుటచేతనే 'రాముఁడు' అను కర్తృపదము కర్త్రర్థక తృతీయాంతము కాదయ్యెను. ఇంకఁ బ్రాతిపదికార్థక ప్రథమాంత మయ్యెను. భావార్థకములందలి కర్త్రర్థకత్వ మాభాసరూపము (చూ. ౨౬౫ II విప). (చూడు. బా. కారక. 3౨ సూ. ౨౬3 I విప) బా. క్రియా. ౧౨౨

సూత్రముచొప్పున వచ్చు భావార్థక నజీకి నుదాహృతులు:—నీవు పాఠమును జదువవలెను - నీచేఁ బాఠము చదువఁబడవలెను. ఇవి సకర్మకోదాహృతులు - 'రాముఁడు రావలయును' అనునది యకర్మకోదాహరణము. 'రాఁబడవలయును' అనురీతి రూపము లసాధువులు.

సంస్కృతమున ధాతువులనుండి యర్థవిశేషబోధక ప్రత్యయముల చేరికచేత ననేకములగు ధాత్వంతరము లేర్పడును. "సనాద్యన్తా ధాతవః. (3-౧-3౨). సనాదయః కమేర్ణిఙన్తాః ప్రత్యయాః అన్తే యేషాంతే ధాతుసంజ్ఞాః స్యుః. ధాతుత్వాల్లిఁడాదయః" (సి. కౌ. ౨3౦౪ సూ.) "శ్లో. సన్ క్యచ్ కామ్యచ్ - క్యఙ్ క్యషో ఽథాఽఽచార క్విప్ ణిఙ్ యఙ్ తథా। యగాయ ఈయఙ్ ణిఙ్ చేతి। ద్వాదశామీ సనాదయః" (బాలమ. వ్యా. సన్నన్త - జిగీషతి (జయింపఁ గోరుచున్నాఁడు) ణిజన్త - కారయతి (చేయించుచున్నాఁడు). యఙన్త - జేగీయతే (అత్యంతము మాటిమాటికిఁ గీర్తించుచున్నాఁడు). ఆచారక్విప్ - విజయతి (అర్జునునివలె నాచరించుచున్నాఁడు). యగన్త - క్రియతే = (చేయఁబడుచున్నది).

ఇట్లే తెలుగునందును నొక్కొక్క ధాతువునుండి పెక్కు ధాతువు లేర్పడి లడాదుల నందుచుండును. ఉదా:—చదువుధాతువు—ఆత్మనేపదార్థమున ధాతువునకు 'కొను' అనునది చేరును. చదువుకొనెను. ప్రేరణార్థమున ధాతువునకు 'ఇంచు' మున్నగునవి చేరును. చదివించెను. కర్మార్థమున ధాతువునకు 'పడు' అనునది చేరును. చదువఁబడెను. ప్రేరణాత్మనేపదార్థకము - చదివించుకొనెను. ప్రేరణకర్మార్థకము. చదివింపఁబడెను. ప్రేరణాత్మనేపదకర్మార్థకము - చదివించికొనఁబడెను. మొ. ఇందు ప్రేరణార్థకరూపములు 3౨౬ VI విషయమునందును నాత్మనేపదార్థకరూపములు 3౨౧ I విషయమునందును నిరూపింపఁబడును. ప్రకృతమునఁ గర్మార్థకరూపములు నిరూపింపఁబడుచున్నవి.

సన్నయా. కర్మణ్యనుబన్ధః స్యా। త్పతిధాతుః కర్త్రవచ్చ తద్విధయః. (ఆం. చిం. క్రియా. ౧౬ కా. అహో. ౫౦౨ పుట).
3౯౯ విష

కల్పతరువు. 3౯౯ విష:—కర్మణి - కర్మార్థకత్వమునందు ధాతువునకు, పతిధాతుః = 'పడు' అనునది, అనుబన్ధః స్యాత్ = అనుబంధముగాఁ దుదిని నిల్చును. తద్విధయః = ఆకర్మార్థకత్వమందలి వ్యాకరణవిధానములు, కర్త్రవచ్చ = కర్త్రర్థమందువలెనే, యగును. పడ్వనుబంధము పరమగునపుడును "వ్యతిరేకాదా భావిని చాత్ స్యాత్" అను సూత్రమునందలి యాదిశబ్దముచేత 'అత్త్వమును' "పునరా

గమః క్రియాణా"మ్మను దానిచొప్పున నకారాగమమును నగును. (౨౯౬-3౧3 విప). చదువు+అ+న్+పడు =చదువఁబడు. దీనినుండి కర్త్రర్థకముందువలెనె - చదువఁబడెన్ - చదువఁబడున్ - చదువఁబడుచున్నది, మొదలగు సమాపకక్రియారూపములను, చదువఁబడుట - చదువఁబడమి - చదువఁబడన్ - చదువఁబడి - చదువఁబడక - చదువఁబడుచున్ - చదువఁబడినన్ - మున్నగు నసమాపకక్రియారూపములను సాధింపనగును. ఇట్లె చదువఁబడవలయును మున్నగు వలయ్యాదియోగభావార్థక నవ్యంతరూపములను గర్త్రర్థమున సాధించుకొననగును. అకర్మకధాతువులకుఁ గర్త్రర్థకత్వము లేదు. "రమణీ నీకతమున మాకు రాఁబడె నిటకున్ ఇత్యాదౌ పడుధాతో ర్ఘటక క్రియాత్వమేవ, యథా మాకు రానయ్యెన్-పోనయ్యెన్ ఇత్యాదౌ భ్వాది ధాతూనామ్" (అహో. ౫౦3 పు) అని కవిశిరోభూషణమున నుదాహరింపఁబడెను. మాకు రాఁబడె ననఁగా మాకువచ్చుట సంభవించెనని యర్థము గాన నట్టిప్రయోగమున 'పడు'ధాతువు కర్త్రర్థకము కాదనియు ఘటనార్థకమనియుఁ బయి కవిశిరోభూషణపంక్తులకుఁ దాత్పర్యము. రాఁబడె ననుచోటి 'రాన్' అనునది వచ్చుధాతు భావార్థకరూపమనియు నచటి పడుధాతువు వలయ్యాదులలోనిదనియు గ్రహింపవలయును (బా. క్రి. ౧౨౨ సూ). సూరి స్వార్థికములని వివరించిన (బా. క్రియా. ౧౦౯ సూ) చొరఁబడు - నిలువఁబడు - కూడఁబడు మున్నగుచోటులందలి 'పడు' ధాతువుసైత మిట్టిదే యనుట యుక్తము. చొరఁబడెను = చొచ్చుట సంభవించెను - మొ. సకర్మకధాతువులందును నిట్టి ఘటనార్థకత్వము కన్పట్టుచున్నది. క......అన్య ని। నాదఁబు జనంబులకు వినంబడకుండన్ (సభా.౧ ఆ. ౨౯౨ప) ఇట్టి ప్రయోగములయెడలఁ బయిరీతిని ఘటనార్థకత్వము నంగీకరింపవలసినదే(వినన్=వినుట పడకుఁడన్=సంభవింపకుండ)."అత్ర తృతీయా షష్ఠీచ।విభక్తీ సమ్మతే ఉభే ఇత్యథర్వణ వచనాత్ విభక్తిద్వయమ్. మాచే ఘటింపఁబడియెన్, మాకిది ఘటింపఁబడియె నితి" (అహో. ౫౦3 పు). అను నహోబలపంక్తులచొప్పునఁ గర్త్రర్థక ప్రయోగస్థలములందుఁ గర్తకుఁ దృతీయ రాకుండుటయు షష్ఠి వచ్చుటయు సమ్మతమని భ్రమింపరాదు. అహోబలుఁడిట చూపిన కర్త్రర్థకోదాహృతి వాక్యద్వయమును నేకరీతిది కాదు. (౨3౭ విప. దీని విస్తరమును జూచునది). 'మాకది ఘటింపఁబడియె' అనుదానిలోని పడుధాతువు ఘటనార్థకము. తక్కినవాక్యము లోనిది కర్త్రర్థకము. పడుధాతు వనుబంధముగాఁ బ్రయోగింపఁబడుట కర్త్రర్థక ప్రయోగమందు మాత్రమె యని యహోబలపండితుఁడు వచించెను. "అనుబంధకత్వేతు నీచే రావింపఁబడితివి. ఇత్యాదౌ కర్తరూపమ్" (అహో. ౫౦3 పు.) వచ్చుధాతు వకర్మకమె యైనను బ్రేరణార్థమున

నది సకర్మకము కును గాన నట్టియెడల నది కర్మార్థక ప్రయోగయోగ్యమై పర్యాయుం ధము నొందుచున్నదని తాత్పర్యము.

కర్మార్థక ప్రయోగము తెనుఁగునకు సహజము కాదనియు నది సంస్కృతభాషా వాసనచే లభించెననియు నట్టిప్రయోగము భారతమున లేదనియుఁ గొందఱాధునికులు వచింతురు. అది సరికాదు. భారతమందె కర్మార్థకప్రయోగములు పెక్కు గలవు:—"కొన్నిచోట్ల నుచితముగా నున్నను పెక్కుచోట్లఁ గర్మార్థకప్రయోగము శ్రావ్యము గాదు. ఉదా:—నన్నయార్యునిచే భారతము తెనిఁగింపఁబడెను. ఇది శ్రావ్యముగను గాని నాచే భారతము చదువఁబడినది. నేను వానిచేఁ జూడఁబడితిని. మొదలగు ప్రయోగములు శ్రావ్యము గావు" (ఆం. భా. అ. కార. ౮ సూ. ౧౭౩ పు. తృ. ము.) ఉదాహృతవాక్యములందలి శ్రావ్యతకు నశ్రావ్యతకును వినిగమక మేమియుఁ గానరాదు. ఈ క్రింది ప్రయోగములను జూచునప్పుడిట్టి వాక్యములు సత్యవిదూరములని తోఁచకమానదు. సీ.........ఆ-వె. దానములును బహువిధ క్రతుహుత జప। బ్రహ్మచర్యములను బడయఁబడిన పుణ్యఫలము.........(ఆది. ౧ ఆ. ౭౧). క. తనయుండు దల్లిదండ్రులు। పనిచినపని సేయఁడేని పలుకెడలోఁ జే। కొనఁడేని వాఁడు తనయుం। డనఁబడునే పితృధనమున కర్హుం డగునే (ఆది. ౩ ఆ. ౯౯.) క. పురుషులచే ధర్మస్థితిఁ। బరిగ్రహింపంగఁబడిన భార్యలకు.........(ఆది. ౫ ఆ. ౮౭). తే-గీ. భర్తచేత నియోగింపఁబడక సతికి। వృద్ధియును జేయఁగాఁ దగ దెద్దియైన। భర్తచేత నియోగింపఁబడినదానిఁ। జేయకునికి దోషంబని చెప్పె మనువు. (ఆది. ౫ ఆ. ౮౮). క. పిలువంగఁబడక సభలకు। బలిమిం జని.........(ఆది. ౬ ఆ. ౩౬). మ.........గర్వముం దాల్చువాఁ। డనఘా సత్సభలందు మెచ్చఁబడునే హాసాస్పదీభూతుఁడై (ఆది. ౭ ఆ. ౫౦ ప). క.........। ధారుణి నట్టి యపూర్వ సభారచనలు వినఁగఁ జూడఁ బడ వెవ్వరిచేన్. (సభా. ౨ ఆ. ౧౩౯) క. పరమసుఖోపాయంబునఁ। బరసంపద సేకొనంగఁబడునేని............(సభా. ౨ ఆ. ౧౪౨) (యతిస్థల). క. బలవద్వ్యాఘాతార్థముగాఁ। బిలువంబడిరి మగుడ నగునె.........(సభా. ౨ ఆ. ౧౭౨). తే. ప్రాయులట్లు నివర్తింపఁబడి (యతిస్థలగతము). (ఆర. ౧ ఆ. ౯). చ. తడయక ఘోరదర్శన సుదర్శనపావకుచే దహింపఁగాఁ। బడి పరమేశ్వరోగ్రశరపావక దగ్ధపురత్రయాభమై। యొకరి ధరి త్రిమీఁదఁ బడియెం జెడి సౌంభకంబు.........(ఆర. ౧ ఆ. ౧౯౭) (ప్రాసగతము). 'కాన్ - కన్' అనునవి పైరీతిని గర్మార్థకములందలి నుక్కునకుఁ దర్వాతనైన మనుప్రయుక్తములు కన్పట్టును. (బా. క్రియా. ౧౧౫-౧౧౬ సూ.) క. గురుముఖమునఁ బడయక దు।

ష్కారతపమునఁజేరి పడయఁగాఁబడు విద్యల్ (ఆర. ౩ ఆ. ౨౫౬ వ). (కా ననునది యతిస్థలగతము). క........త్రిశూలా । కారములై పంకజములు కానంగఁ బడున్. (ఆర. ౨ ఆ. ౨౫౨ వ). తే-గీ........పట్టు । వడిఁ బెను వలుచేత విడువంగఁ బడిన పాంప (ఆర. ౨ ఆ. ౧౭). క. దుస్తరమగు నీ । పదుమూఁడవయేఁడు గడవఁ బడుట యరిది........ఉద్యో. ౧ ఆ.౯ వ). ఉ........పతి లేఁడనఁబడ్డ కాంత ........(కర్ణ. ౩ ఆ. ౨౨౪ వ). క. వినఁ జూడం బడునం దె । ల్లను........ (శాంతి. ౬ ఆ ౨౮౫). ఇట్టు రెండు మూఁడిటికి నొక్కటే పద్యానుబంధము నిల్పం బడుటయుఁ గలదు. ఆ-వె. దానఁజేసి మీరు నేనును బ్రయ్యఁ బా । సంబు లేక వెడల బడితిమి........(ప్రయ్య+ఉను = ప్రయ్యను). (మౌస. ౧ ఆ. ౨౦౧). ఇందు 'వెడలు' ధాతు వకర్మకముగాన దానికిఁ గర్మార్థకత్వము దుర్ఘటము కావున "వెడలన్+వెడలునట్లుగా, పడితిమి = ఇటఁబడినారము." అని యర్థము చేసికొనవలయును. సీ ........తే-గీ.........। విడువు మీశునకము దీని విడువఁబడుట । నాకలోకసౌఖ్యంబు నొనర్చు నీకు (మహా. ౧ ఆ. ౫౫). ఇట "నీవు దీనియొక్క విడుచుట"=అను కర్త్రర్థకమునకు సరియగు "నీచేత దీనియొక్క విడువఁబడుట" అను కర్మార్థమందుఁ గర్మము వివక్షితమై యట శేషషష్ఠి వివక్షితమయ్యెనని యెఱుంగునది. వివక్షావశమునఁ గదా కారకములు సంభవించును. ఆ-వె........రాజుఁ బెద్ద దొరలుఁ । జీర లొలువఁబడిరి........(విరా. ౫ ఆ. ౨౨౨). "రాజును పెద్దదొరలను జీరలను నొలిచితిమి" అనునది దీనికర్త్రర్థకవాక్యము. ఇందు గర్మములు రెండును నభిహితములై ప్రథమాంతములయ్యెను సంస్కృతమున నిట్లు కాదు. ముఖ్యకర్మము కొన్ని ధాతువులందును గౌణకర్మము కొన్ని ధాతువులందును దిజ్ఞుచేఁ జెప్పఁబడును. "గౌణే కర్మణి దుహ్యాదేః। ప్రధానే నీహృకృష్వహామ్ । బుద్ధిభక్షార్థయో శ్శబ్ద । కర్మణాంచ నిజేచ్ఛయా । ప్రయోజ్యకర్మణ్యన్యేషాం । ణ్యన్తానాం లాదయో మతాః గౌర్దుహ్యతే పయః=(గోవుపాలను గొల్లనిచేఁ బిదుకఁబడెను.) అజా గ్రామం నీయతే=(గొల్లనిచే మేక గ్రామమును బొందింపఁబడెను) ......" (సి కౌ. భావకర్మ తిఙ్ ప్రకరణము. ౨౭౬౫ సూత్రము తరువాత. ౧౦౯౦-౧౦౯౫ వార్తి).

బాలవ్యాకరణ పడు జ్యనుబంధంబు కర్మంబునం దగు. ౪౯.

వివరణము. కొట్టఁబడుచున్నాఁడు - కొట్టఁబడుచున్నది. కొట్టఁ

౩౧౯ I విష. బడుట - కొట్టఁబడనివాఁడు.

సంజీవని. ౩౧౯ I విష:—కర్మార్థమునందు ధాతువునకు "పడుజి" అనెడి యనుబంధము వచ్చును. బా. క్రియా. ౨౦ సూత్రముచెప్పిన 'జి'వర్ణ మిత్తుగాఁ

గల 'పడుజి' పరమగునపుడు ధాతువుతుది 'ఉ'కారమున కత్త్వము వచ్చును. బా. క్రి. ౨౧ సూత్రముచొప్పున 'పడుజి' పరమగునపుడు ధాతువునకు నుగాగమమును ద్రుతకార్యములు నగును. (చూ. ౨౯౬ పిప). ఉదా:—కొట్టు+అ+ను+పడు = కొట్టఁబడుచున్నాఁడు. అమహాత్కర్తృకత్వమునఁ గొట్టఁబడుచున్నది - కర్త్రార్థ ప్రయోగమునందును భావార్థకాదులు వచ్చును - కొట్టఁబడుట - కొట్టఁబడనివాఁడు- మొ. బా. క్రియా. ౪౮ సూత్రమునందలి లకారాదులనెడి యాదిశబ్దముచే భావార్థకాదులును గర్త్రార్థమునఁ బ్రయోజ్యములేయని సూరివచించియేయున్నాఁడు. భావార్థకాదులలో మొదటిదగు 'ట' ప్రత్యయమును దుదిదగు 'నిజి'యును సూరిచే నుదాహరింపఁబడెనుగాని కర్త్రార్థమున బా. క్రియా. ౧౨౩ సూత్రముచొప్పున వచ్చు 'నజి'యుఁ బ్రయోజ్యము కానోపును. ఉదా:—కొట్టఁబడవలయును - కొట్టఁబడనగును - మొ. "ఈసూత్రముచే సాధ్యములగు క్రియారూపములనెల్ల నుజ్యంతములమీఁదఁ గల్గిన యాయా పడుధాతురూపములుగ నిరూపింప నవకాశ మగపడుచుండుటయు నది భాషాసహజమార్గముగఁ దోఁచుచుండుటయు వీనిని వేఱుగ సాధింప సూత్రించుట యనావశ్యక మనఁదగును..." (బా. సా. వే. ౪౧౯ పు). అనివ్రాసి పేటికాకర్త మరల 'కర్త్రార్థము నజ్యంతముచే రాదేమో'యని సంకోచించెను. కాని యనుశాసనకర్త తుమున్నంతరూపములనుండియే యీకర్త్రార్థకరూపములు మున్నగు పెక్కువిధములగు క్రియలరూపములను సాధించెను:—"సకర్మకముల తుమున్నంతరూపములపైఁ గర్త్రార్థమందు 'పడు' అనుప్రయుక్తమగును. ౫౫.........నాచే నన్నము తినఁబడెను' అని.........ప్రయోగింపరాదు" (ఆం. భా. అ. క్రియా. ౫౫ సూ). "కొన్ని తుమున్నంతరూపములపై భావార్థమందు 'పడు' చేరును. ౫౬. అది కనఁబడదు. నీమాట నాకు వినఁబడదు........." (ఆం. భా. అ. క్రి. ౫౬ సూ). "తుమున్నర్థకావ్యయములమీఁది 'ఇమ్ము' నకు 'ఈ' వైకల్పికముగ నగును. ౧౨౪. చేయనీ - చేయనిమ్ము" (ఆం. భా. అ. క్రియా. ౧౨౪ సూ). మొ. ఈవిషయము చాలవింతగ నున్నది. తుమున్నర్థకరూపముపై "పడు" అనునది యనుప్రయుక్తమగునపుడు తుమర్థమె కల్గునుగాని కర్త్రార్థకత్వ మెట్లు సంభవించును ? 'పడు' అను నచుప్రయుక్తశబ్దముతోఁ గూడిన తుమర్థకముపై మరల లడాదుల ప్రత్యయము లెట్లు నిల్చును. అవి ధాతువుపై నిల్చునేకాని తుమర్థక పదము పయిఁ నిలువనేరవుగదా ? అట్లె తుమర్థకముపైఁ బడు శబ్దము చేరుటచే భావార్థ మెట్లు లభించును ? భావ మనఁగా ధాత్వర్థముగదా ? తుమర్థకమునుండి యట్టియర్థ మెట్లు పొసంగును? అట్లె - 'చేయనిమ్ము' అనుదానినుండి వీరిరచనచొప్పున

“చేయుటనిమిత్త మిమ్ము” అను ననిష్టార్థము గల్గదా ? ఇంతియకాక “నాచే నన్నము తినఁబడెను” అను కర్త్రార్థకరూపము నేల ప్రయోగింపరాదు ?

> లఘ్వ్యేకాక్షర పూర్వ । క్రియా న్తిమ స్యానయో భవే దిద్వా. (ఆం. చిం. క్రియా. ౧౨ కారి. అహో. ౮౭౮ పు).

నన్నయాథర్వణీయము. ౩౨౦ విషయము.

> న ప్రాద్యవ్యయ సంబద్ధ । స్తన్నిషేధే ప్రయోజకః. (వికృ. క్రియా. ౧౦ కారి. అహో. ౮౭౮ పు).
>
> ఇత్ స్యా ద్భూతబహుత్వేతు । దేశ్యే తూభయతో భవేత్ । యః స్యా ద్దేశ్యక్రియా న్తేతు । భూత ఏకత్వవాచకే । ఇతఏవ పర స్స స్యా । ది ద్భవే న్నాన్తకాత్ పరః (వికృ. క్రి. ౮-౫ కారి. అహో. ౧౫౧-౮౭౫ పు).

కల్పతరువు. ౩౨౦ విష:—వీనిలో లఘ్వ్యేకాక్ష రేత్యాదికారికలు “ఇంచుగాగమ” విధులను బ్రదర్శించినపిమ్మటను, “ఇత్ స్యా” దిత్యాదికారికలు భూతకాలిక ప్రథమపురుషైకవచన రూపసాధన సందర్భమునందును నిల్పఁదగినవయ్యును నీ గ్రంథము బాలవ్యాకరణ సూత్రముల వరుస ననుసరించి సందర్భపఱుచుచుండుటం జేసి యిచట నిల్పఁబడినవి.

అనయః = అయ్ పరిణతి లేనట్టియు, (యాంతములు కానట్టి యన నగును) లఘు=లఘువగునట్టియు (విస్తర. I. ౩౦, IV విష). ఏకాక్షర=ఏకాచ్కమగునట్టియు, పూర్వక్రియా = సమాసోత్తరపదము కానట్టియు, ధాతువుయొక్క, అన్తిమస్య = తుదియక్షరమునకుఁ బరముగా నించుగాగమము నిల్పి యున్నపుడు, ఇద్వా=హ్రస్వమగు 'ఇ'కారము వికల్పముగా నగును. ఉదా:—వచ్+ఇ+ఇంచు = వచియించు - మొ. ఇదాగమ విధానసామర్థ్యముచేత నిట నపదాదిస్వరసంధి. (౭౫ విష) వర్తిల్ల నేరదు. ఆంధ్రశబ్దచింతామణి - అందును గ్రియాపరిచ్ఛేదము - తత్సమక్రియారూపముల సాధించుటకె ముఖ్యముగ నుపదేశింపఁబడుటం జేసియు సంస్కృతధాతువులు తత్సమములుగఁ దెల్గునఁ జేరుట కించుగాగమము నిత్యముగాఁ జేరవలయుటం జేసియు నిందు “ఇంచుగాగమ పరకత్వమున” అని వేఱుగఁ జెప్పఁబడనక్కఱ లేదయ్యెను.

“అనయః” అనుటచే “శయియించు జయియించు” మున్నగు ననిష్టరూపములు జనింపనేరవు. 'లఘు' అనటచేత “యాచించు రక్షించు” మున్నగుచోట్ల

'ఇదాగమము' రానేరదు. 'యాచియించు' మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. 'ఏకాక్షర' అనుటచేత 'అర్థించు శయనించు' మున్నగుచోటులందు 'అర్థియించు శయనియించు' మున్నగు ననిష్టరూపములు సంభవింపనేరవు. క. అసమస్తలఘు ద్వ్యక్షర। లసితములగు తత్సమంబులం జెప్పెడిచోఁ। బొసఁగు నియిఁచుటయుఁన్ క్రియ। లసదృశ, యించుటయె క్రియల నగుఁ బెఱయెడలన్. క. వరియించుటయు వరించుట। తిరముగ నుతియించుటయు నుతించుట బలిమిన్। బరు భంజించుటయును సం। హరించుటయు వరుసతో నుదాహరణంబుల్. (ఆం. భూ. ౧౫౧-౧౫౨). ఇట్లు కేతన ద్వ్యక్షర ధాతువులకును, 'ఇదాగమము'ను వచించినను "వరించుట, నుతించుట" అనువానిని లక్ష్యములుగ నొసఁగుటచేత నేకాచ్కధాతువులే యుద్దేశింపఁబడెనని విశదమగుచున్నది. 'వరించు' అనునది 'వృ' ధాతురూపము. 'నుతించు' అనునది "ను" ధాతురూపము కాని చింతామణిమతమున 'నుతి' అనునది యుపకృతి సంజ్ఞగల ధాతువగుటచేత నేకాచ్కము కానేరదు. కేతన నాఁటి కిట్టిధాతువులకును 'ఇదాగమము రాఁదొడంగెను. ఇట్టి వాసనచేతనే కొన్ని నన్నయగద్యములలో 'స్తుతియించు' అనునది ముద్రణసంస్కర్తృ ప్రభృతులచేఁ బ్రక్షిప్తమయి యున్నది. "......హరిహర హిరణ్యగర్భపద్మా మావాణీపతుల స్తుతియించి......" (ఆది. ౧ ఆ. ౨ గద్యము). నాగపతులనెల్ల స్తుతియించి (ఆది. ౧ ఆ. ౧౧౮ గద్యము) ధర్మరాజు ధర్మనిత్యతను స్తుతియించి (సభా. ౨ ఆ. ౨ గద్య). 'నుతి - స్తుతి' మున్నగునవి యుపకృతిత్వమున ద్వ్యక్షరకములె యైనను 'ను - స్తు' మున్నగు ధాతువు లేకాక్షరకములె కాన వీనికి సయితము 'ఇ'దాగమము వచ్చుట చింతామణి సమ్మతమె యనరాదాయని శంకింపఁజనదు. అపక్షమున 'పోష' మొదలగునవి యుపకృతిత్వమున గుర్వక్షరకములె యైనను 'పుష్' మున్నగుధాతువులు లఘ్వక్షరకములె యగుటచేత నట్టివానికిని "ఇ"దాగమము వచ్చుటచే 'పోషియించు' మున్నగు నప శబ్దములును జింతామణిసమ్మతములె యనవలసివచ్చునుగదా. కేతన వచించినట్టె నుతియించు మున్నగువానికి భారతేతర గ్రంథములందుఁ బ్రయోగములు కన్పట్టుచున్నవి. లయగ్రాహి. కాలధరు నుజ్జ్వల కపాలధరు సన్నిశిత శూలధరు నీశ్వరు దయాళు నుతియింతున్. (నన్ని. కు. ౨ ఆ. ౨౩౨). ఇట్లే సందర్భమున నయిదు పద్యములతుది నీప్రయోగము మకుటముగాఁ బ్రయుక్తమయి యున్నది. ద్వి. స్తుతియింపఁ గనుఁగొనఁ జొప్పడె నేఁడు (బసవ. ౧ ఆ. ౬౦౫ ప). "నుతి (యి)ంచు. సం. స. క్రి. పొగడు.........సీ. రతి నైపుణము చూచి నుతియించువిధమున.........(వరాహ. ౪ ఆ. ౧౬౨ ప.)" (సూ. రా. ని).

వచ్ - ఘుట్ (వచించు, ఘుటించు) మున్నగువానిలోని - వ - ఘు - మున్నగునవి వ్యంజనపరకములగుటచేత (చూ. వి స్త. I. 30 IV విష). గురువు లనఁదగియున్నను సంస్కృత సంప్రదాయముచొప్పున నవి లఘువు లనుటయె యుక్తము. వచ్ - ఘుట్ - మున్నగు సంస్కృతధాతువులందలి గురుత్వ లఘుత్వములను సంస్కృత సంప్రదాయముచొప్పున నిర్ణయించుటయె యుక్తముగదా.

లఘ్వేకారేత్ రేఫాద్యదిసూత్రమున "పూర్వక్రియా" అనుటచేత సంస్కరించు మున్నగుచోటులందు సంస్కరియించు మున్నగు ననిష్టరూపములు సంభవింపనేరవు. ఈయభిప్రాయముతోనే కేతన 'సంహారించుట' అను ప్రత్యుదాహరణము నొసంగెను.

అథర్వణుని వివరణము:—ప్రాద్యవ్యయ సంబన్ధః = ప్ర - ప్రతి - మొదలగు నవ్యయముల సంబంధము, తన్నిషేధే=పూర్వక్రియేతి నన్నయ సూత్రనియమముచే నగు 'ఇదాగమ' నిషేధమునందు, నప్రయోజకః = ప్రయోజకముకాదు. ఉదా:— ఉత్తరియించు - ప్రతివసియించు - సంభరియించు - మొ. ఇట్టి ప్రయోగములు భారతమునఁ గన్పట్టలేదు. కవిజనమండనకర్త యీక్రింది యహోబలపండితీయ గ్రంథమును జూచి "ఉత్తరియించు" అను నొక్కకవిప్రయోగమే కలదని భ్రమించి కావలయును నీప్రకృతాథర్వణకారికను విడిచికొని "ఉ దిత్యవ్యయ సంబన్ధ । స్తన్నిషేధే ప్రయోజకః" అనుపాఠము నంగీకరించి యుదాహరించెను. "న ప్రాద్యవ్యయ సంబన్ధ । స్తన్నిషేధే ప్రయోజక ఇత్యథర్వణవచనాత్ విఘుటియించు నిత్యాదీని రూపాణి నిర్బాధాని, ఏతేన 'చదలేఱు పాతెను జాడ యుత్తరియించి' ఇత్యాదీని శ్రీనాథాది కవీనాం వచనాని ప్రామాణికానీత్యవగన్తవ్యమ్" (అహో. ౪౮౮ పు). ప్రాద్యవ్యయ సమాసమందలి 'ఇదాగము'మునకుఁ బ్రయోగములు:—ప్రతివసియించు (కాశీ. ౨ ఆ. ౧౮). గీ. భక్తిసంభరియింతు రో పద్మబంధు.........(కాశీ 3 ఆ. ౧౭౪ పు). క. పారావారంబుతోడఁ బ్రతిఘుటియించెన్ (శృం. నై. ౪ ఆ. ౯౫).

బాలసరస్వతీ యాహోబలపండితీయములందు లఘ్వేకారేత్ రేఫాద్యది చింతామణికారికకు వేఱువిధముగ వ్యాఖ్య చేయఁబడెను. "అనయః = అయ్ పరిణతిలేని, లఘ్వేకారర పూర్వక్రియాస్తియస్య = లఘువైన యేకారరము పూర్వమందుఁ గల, క్రియయొక్కటువను, ఇత్ =ఇకారము, వా = వికల్పమున వచ్చును" (బాలస. క్రియా. ౧౨ కారి. టీక).

"లఘు ఏకారరం పూర్వం యస్యాస్తి మాత్రా త్తస్మా దయన్త క్రియావర్జితాత్ క్రియాపదా దిత్వం వాస్యాత్" (అహో. ౪౮౮ పు).

పయిరీతిగల వ్యాఖ్యల పక్షమునఁ గ్రియ యుత్తరపదము కారాదను నియమము తప్పిపోవునుగాన "న ప్రాద్యవ్యయసంబధ ఇత్యాద్యథర్వణ కారికకుఁ బ్రసక్తియే లేకపోవును కావున నాచేసినవ్యాఖ్యయే యథర్వణ సమ్మత మనఁదగును. క. అసమస్త లఘు ద్వ్యక్షర । లసితములగు తత్సమంబులం జెప్పెడిచోఁ । బొసఁగు నియించుటయున్ గ్రియ । లసమ్మళ, యించుటయె క్రియల నగుఁ బెఱయెడలన్ (అం. భూ. ౧౫౧ ప). అని యిట్లు ప్రాచీనుఁడగు కేతనయు సమాసఘటితక్రియలలో 'ఇదాగమము' రాదనియె వచించెను. ఈపక్షమున నీక్రింది నన్నయప్రయోగము విరోధించుచున్నది. సీ. పత్నితోఁ దన పరిభ్రమియించుటయు నప్డు దలఁచి శోకించి .........(ఆర. ౨ ఆ. ౭౭ ప). ఇట్టిప్రయోగము నన్నయభారత భాగమందే కాక విశాలమగు తిక్కనభారతభాగమందుసైతము మఱొక్కటి గన్పట్టమింజేసియు నథర్వణాఖ్యనుజ్ఞంజేసియుఁ బయి చింతామణ్యాంధ్రభాషా భూషణముల వచనములంజేసియుఁ బయి నన్నయసీసమున "పత్నితోఁ దనదగు భ్రమియించుటయు" అని నన్నయప్రయుక్తపాఠమై యుండునని విశ్వసింపనగును. లఘ్వక్షర పూర్వ క్రియేత్యాది చింతామణికారికకు బాలసరస్వతీ యాహోబలపండితీయ వ్యాఖ్యల చొప్పున నర్థమునంగీకరించినచోఁ బయి నన్నయసీసము విరోధింపనేరదు కాని ప్రాచీనులగు నన్నయాథర్వణ కేతనల యభిప్రాయమునకు విలక్షణముగా నిట్టియర్థము చేయుటకుఁ బయి నన్నయ సీసప్రయోగ మంత బలవత్తరమైనది కాదు. అథర్వణుని నాఁటికె కల్గినమార్పుయొక్క వాసనచే నర్వాచీను లట్టి "పరిభ్రమియించు" అనుపాఠమును బ్రక్షిప్తము చేసియుందు రనఁదగును. కేతన ద్విస్వరధాతువులందును 'ఇయించుట' అనురూప ముండునని చెప్పినను నట్టియునికి తత్సమక్రియల యందే యని వచించెను. దేశ్యద్విస్వరధాతువుల కట్టిరూపము కన్పట్టదు. సూరి 'నగియించు' అను రూపమును సాధించెనే కాని యట్టిరూపమును నిర్వహింపఁజాలు మహాకవి ప్రయోగము కన్పట్టలేదు. సూ. రా. నిఘంటువునందును నట్టిరూపము చూపఁబడెనే కాని దానిని నిర్వహించు ప్రయోగము చూపఁబడలేదు. క......... । అప్పుడు నగుపించె నచటి యబలాజనమున్' (విరా. ౪ ఆ. ౩౯). అను పద్యము టిప్పణమున 'నగియించె' అనెడి పాఠాంతరము చూపఁబడెను. తాళపత్త్రమాతృకలందుసైతము 'నగుపించె' అను పాఠమె చూపట్టుచున్నది. సూ. రా. నిఘంటువునందును "నగుపించె" అను పాఠమె యాసందర్భమున నుదాహరింపఁబడెను। "ఉ. ఎంతకు నేర రంత తెగియించినవా రది యున్న దేకదా" (శుక. ౪ ఆ. ౨౫ ప). అను నర్వాచీన సామాన్యకవిప్రయోగము సూ. రా. నిఘంటువున "తెగి(యి)ంచు"

శబ్దమునొద్దఁ జూపఁబడెను. మ. నిరవద్య స్థిరభక్తితోఁ దనసుఁగాని శంభుఁగాని రమే। శ్వరుఁగాని గుతించుంచి యెవ్వరఁట యీసార స్తవంబుం జపిం। తురు......... (కాశీ ౨ ఆ. ౮ ప). ఇందు 'గుతిచుంచి' అని కవిప్రయుక్తపాఠ మనఁదగును.

పయిరీతిని దేశ్యద్విస్వరధాతువులందు 'ఇయు' డాగమమును నిర్వహించు మహాకవిప్రయోగములు లభింపమింజేసి సూరి "గురువిరహితంబులయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు" అను సూత్రమునకు 'నగియించు' అను నుదాహృతి నొసంగుట సరికాదని చెప్పకతీరకున్నది.

లఘ్వోకాతః రేత్యాదికిఁ బ్రయోగములు:—చ.........వీని నశేషధారుణీ। శ్వర నికరాపరాధు నతిసాహసికున్ వధియించి.........(సభా. ౧ ఆ. ౨౦౮ ప). సీ.........ప్రమత్తు। లయియున్నవారల నదయుఁడై వధియించె......... (సభా. ౨ ఆ. ౬౫). చ.........మానధనాఢ్యుఁడైన భూ। పతి సహియింపనోపునె సపత్నుల వృద్ధియు నాత్మహానియున్. (సభా. ౨ ఆ. ౯౮). క. క్షమియింపవలయు నొకఁ డెఱుఁ। గమి నేమే నన్న.........(విరా. ౪ ఆ.౨౨౫). క. భ్రమియింతురు జను లతిదు। ర్గమగిరి.........(అర. ౪ ఆ. 3౦౮ ప). సీ. కోల నక్కజంబుగ నలుఁగుల మొన ఘటి, యించి యమ్ముల దాని కిల్లు గట్టి (ద్రోణ. 3 ఆ. ౧౬౮ ప). (యతిస్థలము). క్రిక్కిఱిసియించుచున్ (విరా. ౫ ఆ. ౨౦౫). (క్రిక్కిఱియు+ఇంచు). ఇది లక్ష్యము కానేరదు.

ఇత్ స్యాదిత్యాదిః—'ప్రథమైక స్యైత్వ ద్ధ్వ వేచ్చ భూతార్థే' అనుదానిని వివరించుచుఁ బ్రథమపురుషైకవచనమున వచ్చు 'ఎ'త్వమునయితము 'ఇ'దాగమపూర్వకముగఁజు దేశ్యక్రియలం దఁడునని చెప్పెడిసందర్భములోని దీసూత్రము. భూతార్థ క్రియలందు నిల్చు నీ 'ఇ'దాగమము వేఱు. లఘ్వోకాతః రేతి సూత్రసిద్ధమగు 'ఇ' దాగమము వేఱు. ఇట్టి విభిన్నవిషయకములను సూరి కలుపుటచే నిట్టిచట రెండిటిని జోడింపవలసెను. 'భూతబహుంత్వేతు=భూతార్థక ప్రథమపురుష బహువచనమునందు మాత్రమె, ఇత్ స్యాత్ = సంస్కృతధాతువు తుదిని 'ఇదాగమము' నిల్చును. ఇట్లనుటచేతఁ బ్రథమపురుషైకవచనమున నియ్యది నిలువనేరదని విశదపడుచున్నది. "త్వా భూతయోః క్రియా న్తస్యే" త్తను దానివెంటనె "ప్రథమైకవచనలోపః" అని ప్రథమపురుషైకవచనలోపము విధింపఁబడుచున్నదిగాన నద్దానినుండి ప్రథమపురుషమునకే యీయథర్వణుని నవరణమని గ్రహింపవలయును. కావున "రక్షించితివి - రక్షించితిరి - రక్షించితినిన్ - రక్షించితిమి" మున్నగు మధ్యమోత్తమ పురుషైక

వచన బహువచనములలో "ఇ వాగమము" వచ్చుట నిర్బాధము గుచున్నది. ఉదా:— రక్షించు+తిప్ = రక్షించు+ఎ+న్ = రక్షించెన్. ప్రథమైకవచనలోప ఇత్యాది సూత్రముచే "తిప్పునకు" లోపమును బ్రకృతాథర్వణసూత్రముచే "ఇదాగమ" నిషేధమును, "ప్రథమైక స్యైత్వ ద్భవే" దిత్యాదిచే "ఎ"త్వమును వచ్చెనని యెఱుంగు నది. రక్షించు+ఇ+రు = రక్షించిరి. భూతాదుతాం పరేషా మి దితి సూత్రముచేఁ దుది "ఉ"కార మికార మయ్యెను. రక్షించు+ఇ+తి+వు = రక్షించితివి. రక్షించి తిరి - రక్షించితినిన్ - రక్షించితిమి - మొ. దేశ్యేతు = దేశ్యక్రియలయందన్ననో, ఉభయతో భవేత్ = ప్రథమపురుషైకవచన బహువచనములు రెండిటను "క్వా భూతయో క్రియాన్త స్యేదితి సూత్రోక్తమగు 'ఇదాగమము' తక్కిన పురుషము లందువలెనె వచ్చును. ఇట్లు భూతకాలిక ప్రథమపురుషైకవచనమునందును "ఇదా గమము"వచ్చుట యుత్తరసూత్రమగు "ఇ ద్భవే న్నాంతకాత్ పరః" అనుచో నున్న ను వర్ణాంత క్రియలకును దదుపలక్షితములగు 'దు'వర్ణాంత 'గు'వర్ణాంతాదులకును మాత్రమె యగునని గ్రహింపవలయును. (కనియెన్ - పడియెన్-మొ) ఇట్లగుటచే దక్కిన దేశ్యక్రియల ప్రథమపురుషైకవచనమున రానేరదని గ్రహింపవలెను. (గెలు చు+ఎ+న్=గెలిచెన్-మొ.) భూత ఏకత్వవాచకే దేశ్యక్రియాన్తేతు=భూతకాలిక ప్రథమపురుషైకవచనమునందు దేశ్యక్రియలతుదిని, అనఁగా 'ఇ'దాగమమువచ్చు దేశ్యక్రియల భూతార్థప్రథమ పురుషైకవచనమునందని యర్థము. యః స్యాత్ = "య"అనునది, వచ్చును. సః=ఆయువర్ణము, ఇతః పరఏవ స్యాత్=అట్టి 'ఇదాగమము నకుఁ బరముండే నిల్చును. ఇత్ = ఆ 'ఇ'దాగమము, నాన్తకాత్=నువర్ణాంతధాతువు లకుఁ బరముగా మాత్రమె భూతకాలిక ప్రథమపురుషైకవచనమునందు, వచ్చును. 'నాన్తకాత్పరః' అనునది 'దు'వర్ణాంతాదులకును నుపలక్షణముగుచున్నది. కాన మహా కవిప్రయోగానుసారముగా, దువర్ణాంతధాతువులకును, గువర్ణాంతధాతువులకును 'ను' వర్ణాంతములకువలెనె పయికార్యము లగుననియు, నువర్ణాంతాదులు లఘు ద్వ్యక్షరధాతువులె యట్టికార్యముల నందుననియుఁ దద్ధర్మార్థక్రియలందును 'ఎ' వర్ణ మాదిగాఁగల ప్రత్యయము పరముగునపుడును బైకార్యములు గల్గునసియు నెఱుంగు నది. ఉదా:—కను+ఇ+య+ఎ+న్ = కనియెన్. పడు+ఇ+య+ఎ+న్ = పడియెన్. తగు+ఇ+య+ఎ+న్ = తగియెన్. ఇట్లె - వినియెన్ - చెడియెన్ - మొ. తే-గీ...... వీడుకొనియె నవ్వ్యాసవృందు (శాంతి. ౪ ఆ. ౩౮౭). క. అనవుడు ననిమిషపతి యే। యనువున నీశాంతి నీకు నగపడియె మహా। జనపూజ్య చెప్పవే నా। కని యడిగిన నిట్టులనియె నతఁడాతనితో (శాంతి. ౪ ఆ. ౩౮౨ ప). ఇట్టు శబ్దపల్లవాదులలోని

ద్విస్వరధాతువులకును 'ఇ'దాగమము వచ్చునని యెఱుంగునది. తే-గీ.........
దివ్య । పదవి యే వర్తనమునఁ జొప్పడియె నీకు. (అను. ౪ ఆ. ౩౫౬). క......
మూర్ఛ మునుఁగుచుం బడియె ధరన్ (అను. ౨ ఆ. ౪౪౭). క......... । చనియె
.........(అను. ౫ ఆ. ౩౦౯). ఇట్టివి పెక్కుగలవు. ఇట్లె తద్ధర్మక్రియలందును
బ్రక్రియ నడపవలయును. కను+ఇ+య+ఎడున్ = కనియెడున్; కను+ఇ+య+
ఎ+ద+న్ = కనియెదన్; కను+ఇ+య+ఎ+డు+వాఁడు = కనియెడువాఁడు - మొ.

పై ప్రక్రియలో స్వరసంధి చేయనపుడు "యశ్రుతి మార్యా" ఇత్యాది సూత్రముచే సంహితలో యకార మెట్లును నిల్చుచుండఁగా నథర్వణాచార్యుఁడు "యః స్యా"దిత్యాది సూత్రముచే య వర్ణాగమము నేల పునరుక్తముగ విధింప వలయునని శంకింపరాదు. పయిస్థలము లన్నిటను నపదాదిస్వరసంధి (౭౫-౭౫ I విష). నిత్యముగా వచ్చినచో "కను+ఇ+ఎ+న్ = కనెన్'' మున్నగు ననిష్టరూపముల ప్రాప్తియు, "కనియెన్ - పడియెన్ - తగియెన్ - కనియెడున్ - కనియెదన్ - కనియెడు వాఁడు" మున్నగు సాధురూపములు సిద్ధింపకుండుటయు సంభవించును. ఇట్లగుటచేత "అచోఽచి క్వచి ల్లోపో । బహుళం స్యా త్ప్రయోగతః ఇతి ఎకారలోపః-'చనెన్' ఇత్యాది" (అహో. ౧౫౧ పుట). అనురీతిని "చనెన్ - వినెన్ - కనెన్" మున్నగు రూపముల నహోబలపతి సాధించుట నన్నయాథర్వణ సమ్మతముకాదని విశదమగు చున్నది. 'చనెన్ - వినెన్ - కనెన్' అనురీతిగలరూపములు నన్నయభారతభాగమునం దెచ్చటను లేవు. తరువాతి కవు లట్టిరూపములను బ్రయోగించిరి. కాని సూరి యట్టిరూపముల నేల సంగ్రహింపఁడయ్యెనో ? ప్రౌఢవ్యాకర్తయైన నేల సంగ్రహింపలేదో తెలియకున్నది.

"కనియె ననవలసిన భూతాద్యర్థక్రియాపదైకవచనంబునందు వర్ణలోపము చేసి కనెనఁట యని గ్రామ్యపదముగా వాగనుశాసనులు ప్రయోగించినారు.........
ఆదిపర్వమునందు. క. వనకన్యకయఁట నేనఁట । వనమున గాంధర్వమున వివాహం బఁట నం । దనుఁ గనెనఁట మఱచితినఁట । వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్"
(అప్పక. ౧ ఆ. ౧౨౯-౧౩౦). అని యప్పకవి వ్రాసెను. "ఈపద్యము ('వనకన్యక యఁట........' అనుకందము) పిడపర్తి భద్రుని శృంగారశాకుంతలమునందుఁ గనఁ బడునుగాని (చూ. పు. ౯౫ శృం. శా) ఆదిపర్వమునందుఁ గనఁబడదు." అని యప్పకవీయముద్రణ సంస్కర్తలు టిప్పణమున వ్రాసిరి. నన్నయభారతములోని యాదిపర్వ చతుర్థాశ్వాసమందలి శకుంతల వృత్తాంతము సందర్భమున నిట్లున్నది.
ఏనెట నీవెట సుతుఁడెట । యే నెన్నఁడుఁ దొల్లిచూచి యెఱుఁగను నిన్నున్ ।

మానిను లసత్యవచనలు । నా నిట్టు లసత్యభాషణం బుచితంబే (ఆది. ౪ ఆ. ౧౦౦ ప). దీని టిప్పణమున ముద్రణసంస్కర్తలు "వనకన్యకయట నేనట వనమున గాంధర్వమున వివాహంబట నం । దను గనెనట యటవిని । నట వినఁగూడునె యిట్టిభంగి విపరీతోక్తుల్. ఈపద్యమాది పర్వమున నున్నదని అప్పకవి వ్రాసి యున్నాఁడు. అయినచో నిచ్చోనిచ యుండఁబోలు" అని వ్రాసిరి. అహోబలపండితుఁ డీయప్పకవివాక్యములను విమర్శించుచు నీక్రిందిరీతిని వ్రాసెను. "అప్పకవినాపి 'వినెన్- కనెన్ - చనెన్' ఇత్యాదిశబ్దానాం గ్రామ్యత్వేఽపి మహాకవిప్రయోగసాధుత్వాత్సాధుత్వ మిత్యుక్తమ్ - తన్న - చనె నిత్యాది శబ్దానాం శాస్త్రసాధుత్వేన అదన్తః క్రియాస్వితి సూత్ర ఉక్తత్వాత్. 'నం । దను గనెనట యటవిని' నిత్యాదిప్రయోగా దాచార్య స్యాప్యేతాదృశ ప్రయోగోఽభీష్ట ఇవ" (అహో. ౧౭౭ పుట). కవిశిరోభూషణములోని పయి తుదివాక్యమునుబట్టి "వనకన్యకయట" మున్నగు కందపద్యము భారతాదిపర్వములోనిదని యహోబలపండితుఁడును నంగీకరించుచున్నాఁడు. కనెన్ - వినెన్ - చనెన్ మున్నగురూపములు నన్నయాథర్వణ సమ్మతములుకావని యప్పకవి వచింపఁగా దానిని నిరసించుచు నహోబలపండితుఁ డీక్రిందిరీతిని 'అదన్తః క్రియాస్వి' త్యాది సూత్రవ్యాఖ్యానసందర్భమున నట్టిరూపములకు వ్యాకరణసాధుత్వమును వివరించెను. "చనియెన్ - కనియెన్ - ఇత్యాద్యుదాహరణమ్ - తత్ర క్రియాయాం క్త్వాభూతయోః క్రియాన్తస్యే దితీత్వమ్. వర్ణాగమోవిశేష ఇతి యత్వమ్. ప్రథమైక స్యైద్భవేచ్చ భూతార్థే ఇతి ఎత్వమ్. చనెన్- వినెన్ - కనెన్ ఇత్యాది క్రియాప్రయోగోఽపి ప్రబన్ధేషు వర్తతే. తత్ర 'ఏదన్తతాచ నామ్నా । మన్యతరస్యా మియాన్తానా మితిసూత్రం నప్రవర్తతే. నామ్నామితి నామమాత్రస్యైవ గ్రహణాత్. కింతు వికృతి వివేకసూత్రేణ తన్నిర్వాహః. యఃస్యా ద్దేశ్య క్రియాన్తేతు । భూత ఏకత్వవాచక ఇతి యః. ఇత్స్యా ద్భూతబహుంత్వేపి । దేశ్యే తూభయతో భవేదితి ఇత్వమ్. డుడ్యాదివర్ణే భూతార్థే । చాపి తస్యై ద్భవే త్సదా ఇతి ఎత్వమ్. చనియెన్ - కనియెన్ - వినియెన్ - ఇత్యాది. ఇయాన్తా స్సాధవ శ్శబ్దాః । క్వచి దేదన్తతాపివా ఇతివా ఎత్వమ్. అచోఽచి కుత్రచి ల్లోపో । బహుళం స్యాత్ ప్రయోగతః । ఇతి ఎకారలోపః. చనెన్ ఇత్యాది" (అహో. ౧౫౦-౧౫౧ పు). "కనియెన్" మున్నగువానిలోని "ఇయ" అనుభాగమునకు "ఎత్వము" చేయఁగా "కనెన్" అను రూప మేర్పడునని యొకమార్గము నహోబలపతి చూపెను. ఈమార్గమున "ఏదన్తతాచ నామ్నా"మిత్యాది చింతామణిసూత్రమున నామ్నామ్మనియుండుటచే నది వర్తిల్ల నేరదనియు "ఇయాన్తాస్సాధవ శ్శబ్దాః ।

క్వచి దేద స్తథాపిచ" అను నథర్వణవచనముచే "కనియెన్ = కనెన్" అను రెండు రూపములు సాధువులగుననియు నహోబలపతి యాశయము. అనఁగా "కను+ఇ+య+ఎ+న్ =" అను ప్రక్రియలో "ఇయాన్తా స్సాధవ ఇత్యాదిచే 'ఇయ' అను భాగముఁనకు, "ఎత్వము" రాఁగా "కను+ఎ+ఎన్" అని యేర్పడుననియు 'అచోఽచీ' త్యాది సూత్రముచే మొదటి "ఎ"వర్ణము లోపింపఁగా "కనెన్" అను రూప మే ర్పడుననియు నహోబలపతి యాశయము. కానఁ బై యహోబలపతి తుదివాక్య ములో "ఇకారలోపః" అనునది ముద్రణప్రమాదమనియు నచట "ఎకారలోపః" అనియె యుండవలయు నను తలంపుతో నట్లు దిద్దినది పై నుదాహరింపఁబడెననియు గ్రహింపనగును. అట్లు సవరింపనిచో నచటి గ్రంథము సమన్వితమె కానేరదు. ఇట్టి యచ్చుతప్పును జూచికొనకయె గాణపత వివరకర్త "చనెన్ (చని+ఎన్)" అని (గాణ. క్రియా. ౩౫౮ కారి. ౨౦ ప) 'ఇ'కారమునె చూపి ప్రక్రియ నడపుటకేవ లము భ్రాంతిమూలకము. "ఇయను" "ఎకారము" వచ్చునపు డింకను "ఇ"కార మెచట నున్నదని తలంచెనో తెలియకున్నది.

అనెన్ - చనెన్ - కనెన్ మున్నగురీతిగల రూపములు భారతమునం దను వరు దుఁగఁ గన్పట్టుచున్నవందురుగాని కవిప్రయుక్తములని విశ్వసింపఁదగిన యతిస్థాన ఘటి తములు కన్పట్టలేదు. క. సురసారథి ననుఁగానక । హరినందన యెందుఁ బోయి తనెఁ గడు భీతిన్ (ఆర. ౪ ఆ. ౬౫ నన్నయభాగము). "ఎందుఁ బోయి తనియెన్ భీతిన్" అని తాళపత్రమాతృకలో నున్నది. క.........ముదం। బున వచ్చితి ననె జనకుని। మన మానందరస పూర్ణమయతం బొందన్ (అను. ౨ ఆ. ౪౬౨ ప). 'ముదం। బున వచ్చితిననియె జనకు। మనము......' అని తాళపత్రమాతృకలో నున్నది. చ. నడప ఁ దాల్చ యగ్నియయి నావదనంబున నిర్గమించి యె। న్కుఁడు వడి పద్మగర్భు కడకుం జనె సమ్మహితుండు మన్మథుం। గొడుకుగఁ బంచి........." (అను. ౪ ఆ. ౪౦౭). "చ......... ఎ। న్కుఁడు వడి పద్మగర్భుకడకుం జన సమ్మహితుండు మన్మథుం। గొడుకుగఁ బంచి........." అని తాటాకుమాతృకలోనున్నది. అర్వాచీన కవి గ్రంథములనివి ధారాళముగా వెలయుచున్నవి. వెనుక నుదాహరించిన "క. వన కన్యక యంట చేనఁట। వనమున గాంధర్వమున వివాహంబఁట సం। దనుఁ గనెనఁట మఱచితివఁట। వినఁగూడునె యట్టిభంగి విపరీతోక్తుల్" (పినవీర. శృం. శా. ౯౫ పుట). అనుపద్యము శృంగారశాకుంతలమున నిర్వివాదముగా వెలయుచున్నది.

తద్ధర్మాద్యర్థక క్రియలందును వక్రపరకత్వమున వచ్చు "ఇ"దాగమమునకుఁ బ్రయోగములుఁ—చ. ఎడపక యర్థి మచ్చరితమున కిచ్చితి మిచ్చినదాని కిందొడం।

బడమని దుర్జనత్వమునఁ బల్కెడువారల మస్తకంబుపై। నిడియెద నంచుఁ దాఁ జరణ మెత్తె సభన్ సహదేవుఁ డట్టిచో।.........(సభా. ౨ ఆ. ౩౦ ప). క. కడఁగి మదీయాస్త్రము లని। యెడు పటుమంత్రముల నిప్పు డీ నృపురిపులన్। కడిఁది విషా హుల దర్పం। బుడిగించెదఁ దొలఁగి చూచుచుండుఁడు మీరల్ (ఆది. ౭ ఆ. ౧౯౩ ప). (యతిప్రాసస్థలగతము). సీ.........। భూనాథుఁ డనిరెడు బుద్ధిఁ బూజింతే .........(సభా. ౨ ఆ. ౧౧ ప). క.........తగిరెడు। వరు రోయుచునుండె సుతకు వైదర్భుండున్ (ఆర. ౨ ఆ. ౩౨౭). సీ......... ధుర్యవఫేనవితతుల, నగి యెడునదివోలె.........(ఆర. ౩ ఆ. ౩౮ ప). క. ఇల నర్ధరాత్రమును సం। ధ్యలు రెండును భూతయక్షదానవ గంధ। ర్వుల త్రిమ్మరిరెడు ప్రొద్దులు। వెలయఁగ నింక వనిచరులు వెఱతురు నడవన్ (ఆది. ౭ ఆ. ౩౮). ('గంధ। ర్వులు గ్రుమ్మరిరెడు ప్రొద్దులు' అని పాఠాంతరము). వ. ఇవ్వేళలయందుఁ గ్రుమ్మరిరెడువారి నెంత బల వంతులనైనను.........(ఆది. ౭ ఆ. ౩౯ గద్యము). 'క్రుమ్మరు - త్రిమ్మరు' అను నవి లఘురుంతములు కావు. ద్విస్వరకములును గావు. ఇట్టివానిని వాశబ్దవ్యవస్థా వాచిత్వమున సంగ్రహింపవలయును. క.........అధికం। బునఁ దగిరెడు దాన మెద్ది యన్నిటిలోనన్ (అను. ౨ ఆ. ౩౪౮ ప). క. కవదొనలును గాండీవము। నవల నిడం బనుపు ముంద రరదము డిగు మే। ను విదప డిగిరెద.........(శల్య. ౨ ఆ. ౩౩౩). మొ.

"లఘుపూర్వ నకారాన్త। క్త్వార్థోకరి భవేచ్చ యః। భూతార్థ స్యైకవచనే। ప్రథమాయా వితీరితః॥ క్త్వేత్వ స్యేత్వంచ రిత్వంచ। స్తో భూతే ప్రథమాద్వయోః .........." మున్నగు కారికలు కవిజనాంజన టీకోదాహృతము లనుచు నాథర్వణ ములుగా నారాయణీయవ్యాకర్త తెల్గించుట యవిమర్శమూలకము. ఆకారికలు కేవలము ప్రక్షిప్తములు - పునరుక్తిదూషితములు - సంప్రదాయవిరుద్ధములు. క్త్వార్థకరూపము పై యకారము నిల్పి సమాపకక్రియ యగుట కేవల మసంభవము గదా.

గురువిరహితంబులయి యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు. ౫౦.

ఏకస్వరధాతు ద్విస్వర ధాతువుల మీఁది యించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాష'నగు. గురుమంతం బగు ధాతువునకును యాంతంబగు ధాతువునకును

బాలవ్యాకరణ వివరణము. 3౨౦ I విషయము.

మీఁదియించు ప్రత్యయంబుల కియుడాగమంబు రాదు. భుజ్ - ఇఁయ్ - ఇంచు = భుజియించు - పక్షంబున - భుజించు. గుణ - ఇయ్ - ఇంచు = గుణియించు - గుణించు. ఇంచు ప్రత్యయవిధానంబునంజేసి సంస్కృత ధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుంగునది. యాచ్ - అర్థ - ఇత్యాదులు గురుమంతంబులు. వ్యయ - ఇది యాంతము. యాచించు - అర్థించు - వ్యయించు. జి - ఇంచు - అనుచో నిత్యంబగుటంజేసి యియుగాగమంబు రాఁగా యాంతంబగుటంజేసి యియుడాగమంబు లేదని యెఱుంగునది. కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు. నగు - ఇయ్ - ఇంచు = నగియించు - నగించు. నగు - ఇయ్ - ఎను = నగియెను - నగెను. పడు - ఇయ్ - ఎను = పడియెను - పడెను. ఇత్యాదులెఱుంగునది.

సంజీవని. 3౨౦ I విమ:—'ఏకస్వర ద్విస్వరంబుల' అనుదానికి 'ఏకస్వరధాతు ద్విస్వరధాతువుల మీఁది' అని వివరించుటచేత నుపసర్గముచే నధికసంఖ్యాకస్వరవంత మయినను క్షతిలేదనియు ధాతుమాత్ర మేకస్వరకముద్విస్వరకమునైయుండినం జాలు ననియునర్థము చేయనగునుగాని సూరియీవిషయమును వివరించి యుదాహరింపలేదు. కాన 'ఇ'ంచుగాగమయోగమున ధాతువున కధికసంఖ్యాక స్వరవత్త్వము గల్గినను క్షతిలేదని మాత్రమె సూరి యుద్దేశించియుండునని తోఁచుచున్నది. గురుత్వ లఘుత్వ వివరణము 3౦ IV విషయమునఁ జేయఁబడియున్నది. ఆంధ్రలాక్షణిక మహాకవి సంప్రదాయముచొప్పున వ్యంజనపరకము గురువైయైనను సంస్కృతచ్ఛందస్సంప్రదాయమున "తత్ - వచ్" మున్నగువానిలోని 'త-వ' మున్నగునవి లఘువులె యగుచున్నవి. ఇచట సంస్కృతధాతుగత వర్ణ గౌరవలాఘవములు పరిశీలింపవలయును గావున సంస్కృత సంప్రదాయ మవలంబింపఁబడెనని తోఁచెడిని. సంస్కృతమందు మాత్రము "సర్వవ్యాపీ సర్వధారీ । భాతిభాసయతేఖిలమ్" మున్నగు స్థలములందు చరణము తుదినున్న 'ల' మున్నగునవి గురువులు కావాయని శంకింపఁగొనరాదు. అచటిగురుత్వము వ్యంజనపరకత్వమునఁ గల్గలేదనియుఁ బాదాంతస్థితిచేఁ గల్గెననియు సంస్కృతచ్ఛాందసికుల యాశయము. యాంతత్వము ధాతువునకు సహజమైనను వ్యాకరణకార్య జన్యమైనను నియుడాగమప్రతిబంధక మగునని యెన్నునది.

వ్యయ్ - శయ్ - మున్నగుధాతువులలోని యకారము సహజము. జి - జయ్ నీ - నయ్ - మున్నగువానిలోనిది వ్యాకరణకార్యజన్యము. "ఇంచుక్" స్వార్థికమైనను ప్రేరణార్థకమైనను నియుడాగమునిమిత్తమె కాఁగలదు. వక్రమనఁగా "ఎ - ఏ - ఒ - ఓ" అను స్వరములలో నొకటియని యర్థముకాని యిచటఁ బ్రయోగానుసారముగా "ఎ" అనునదిమాత్రమె యుద్దేశింపఁబడెనని యెఱుంగునది. "ఇయఁట్టు" టిత్తు గాన నించు గ్వక్రములకుఁ బూర్వాగమ మగును. అనఁగా "ఇయ్+ఇంచు = ఇయించు, ఇయ్+ఎన్ = ఇయెన్" అనురీతి నేర్పడునని భావము. ఏకస్వరద్విస్వరంబుల యించు గ్వక్రంబుల కనుచోఁ గ్రమాన్వయము నెన్నరాదనియు నేకస్వరము లకించు గ్వక్రములలో నేది పరమైయున్నను ద్విస్వరములకును నించు గ్వక్రములలో నేది పరమైయున్నను నియుడాగమం బగునని యే సూరి యుద్దేశించెనని "నగియించు - నగించు, నగియెను - నగెను" అనునాతని యుదాహరణములె విశదీకరించుచున్నవి. అట్లయినను నేకస్వర ద్విస్వర సంస్కృతధాతువులకుమాత్రమించుక్ పరమగునపుడును ద్విస్వరములగు నలంతియాచ్ఛిక ధాతువులకు మాత్రము వక్రము పరమగునపుడును నియుడాగమము వచ్చుట ప్రయోగదృష్టమగుచున్నది. ఏకస్వరాచ్ఛిక ధాతువులు లేనే లేవు. సంస్కృత ధాతువుల కించు గ్వ్యవధానముచే వక్రపరకత్వము సంభవింపనేరదు. ద్విస్వరాచ్ఛిక ధాతువులమీఁది యించుక్న కియుడాగమ ప్రయోగము కానంబడదని ముందు విశదీకరింపఁబడును. సంస్కృత ధాతువుల కించు గ్వ్యవధానంబున వక్రపరకత్వము సంభవమని సూరియు 'ఇంచు గ్వ్యవధానంబునం జేసి' త్యాదివాక్యముచే వివరించెను. 'భుజ్' అనునది యేకస్వర సంస్కృతధాతువు. కాన 'భుజ్+నయ్+ఇంచు = భుజియించు - భుజించు' అను రూపద్వయము లభించును. "గుణ" అనునది "అదంత"మగు సంస్కృతధాతువు కావున నది ద్విస్వరధాతువుగా నుదాహరింపఁబడినది. "గుణయతి" మున్నగు సంస్కృతరూపములలో దాని "అదంతత్వము" ప్రసిద్ధమైయున్నది. "గుణ+ఇయ్+ఇంచు" అనుచో నపదాదిస్వరసంధి. (౨౫-౨౫ I విమ). కల్గఁగా "గుణియించు-గుణించు" అను రూపద్వయము కల్గును. 'అర్థ' అనుదానిలో నిది వర్గచతుర్థ ధకారము కాదనియే తోఁచుచున్నది. వర్గచతుర్థ ధకారము గల 'అర్ధ' శబ్దము ధాతువుకాకున్నను "అర్ధించు=సగముచేయు" అను నామధాతువు కలదు. వర్గద్వితీయమగు థకారముతోడిది "అర్థత్క్ జ్ యాచనే" (కవికల్పద్రుమము) అను ధాతువే కలదు. బాలవ్యాకరణ ముద్రణములలో వర్గద్వితీయ ఘటిత రూపమే కన్పటుచున్నది. "యాచ్ - అర్థ" అనుధాతువులు గురుమంతములగుట

చేత వానికి "ఇయుట్టు" రానేరదని సూరియే యుదాహరించెను. ఇట్లె 'వ్యయించు' అనునది యాంతమగుటచే 'ఇయుట్టు' రాదు. యాచించు - అర్థించు - వ్యయించు. మొ. 'జి' ధాతువునకు 'బా. క్రి. ౬౮ సూత్రముచొప్పున 'అయుక్కు' రాఁగా 'జయ్' అని యేర్పడును. అయ్యది యాంతమగుటచే 'ఇయుట్టు' రానేరదుగాన 'జయించు' అని మాత్రమె యేర్పడును. "అయుక్కు - ఇయుట్టు" అను రెండిటిలో "అయుక్కు" పరశాస్త్రము నిత్యశాస్త్రము నగుటచేత నట్టి "అ" యుగాగమమును ముందుగఁ జేయవలసెను. పరశాస్త్రమగుటచేతనే 'అ' యుగాగమము ముందుగఁ జేయఁదగు ననుచు "పరనిత్యాన్తరఙ్గాపవాదానా ముత్తరోత్తరం బలీయః" అను చొప్పున వచింపవలసియుండఁగా "జి+ఇంచు అనుచో నిత్యంబగుటం జేసి...... ..." అను వాక్యముచే సూరి నిత్యత్వమువఱకుఁ బోనేలయని శంకించుకొని గుప్తార్థప్రకాశికాకర్త "ద్వి ర్బద్ధం సుబద్ధం భవతి" అను న్యాయము నాశ్రయించి దార్ఢ్యాతిశయార్థముగా సూరి నిత్యత్వపర్యం తానుధావనము చేసెనని విస్తరించి వ్రాసెను (బా. గు. ప్ర. ౩౮౧ పుట. ద్వి. ము). కృతాకృత ప్రసంగి నిత్యంబు నాఁబడు ననఁగా, నియుడాగమము చేసినను జేయకున్నను నయుగాగమము వచ్చుటకుఁ బ్రతిబంధములేదు. అయుగాగమము చేసినచో నియుడాగమము రానేరదు. కాన నయుగాగమము నిత్య మనిపించుకొనును. ఒక్కచో సంభవించువిధులు రెండిటిలో నేది చేసినను జేయకున్నను రెండవది ప్రసక్తమగునో యది నిత్యమనిపించుకొనునని యర్థము. సూరి "నగియించు - నగించు" అని యుదాహరించెనేకాని 'నగియించు' అను రీతి గల కవిప్రయోగము కన్పట్టలేదు. ఇంచు స్వరకత్వమున నాచ్ఛికధాతువుల కియుడాగమము వచ్చుటకుఁ బ్రామాణిక ప్రబలప్రయోగము మృగ్యము. "నగించు - నగుపించు" అను రూపములుమాత్రమె ప్రయోగదృష్టము లగుచున్నవని కల్పతరువులో వివరింపఁబడెను. సూరి నగు ధాతువునకు "నగియించు నగించు." అను రూపములను జూపియు "పడు" ధాతువున కట్లు చూపకుండుట కొఱంత యనుకొని కావలయును బా. సా. పే. వ్యాఖ్యాత "నగించు - పడించు అను నియుడాగమము గలుగని రూపములకుఁ గ్రమముగ నవ్వించుట - పడఁజేయుట యర్థము లనియు నెఱుంగునది" (బా. సా. పే. ౮౨౩ పుట). అని ప్రామాదికముగా వ్రాసెను. పడు ధాతుప్రేరణరూపము బా. క్రి. ౧౨-౧౩ సూత్రములచొప్పున "పడుచు - పెలువరించు - వెలువఱుచు" మున్నగురీతి నేర్పడుననియు "పడించు- పడియించు" అనురూపములు సాధువులు కావనియు స్మరింపకుండుట శోచనీయము. ఆచ్ఛిక ద్విస్వరధాతువులకు వక్రపరకత్వమున "నగియెను = నగెను. పడియెను -

పడెను" అను సూరి యుదాహృతులు నిర్బాధములు. సూరి యుదాహరింపలేదు గాని వక్రపరకము లనుటచే "నగియెదను - నగియెడిని - నగియెడువాఁడు" మున్నగు పాఠికములగు నియుడాగము ఘటితరూపములు బాలవ్యాకరణ పక్షమునందును సంగ్రహింపఁబడుచున్నవని గ్రహింపనగును. "చను - తగు - అలు" మున్నగు కొన్ని యాచ్ఛికధాతువులకు 'చనించు - తగించు అలించు' మున్నగు ప్రేరణరూపములు కన్పట్టలేదు గాన నట్టివానికి "ఇయుట్టు" వచ్చునా ? రాదా ? యని చర్చింపవలసిన ప్రసక్తియే లేదు.

నన్నయా 3౨౧ విషయము. చో రాత్మనే పదేర్థే । గృహ్ణాతా, వాగమస్య వేత్త్వం స్యాత్ ! (ఆం. చిం. క్రి. ౧3 కారి. అహో. ౪౮ా పు).

కల్పతరువు. 3౨౧ విష:—ఆత్మనే పదేఽర్థే = ఆత్మనే పదార్థముగల, గృహ్ణాతా - కొను ధాతువు పరముగుచుండఁగా, ఆగమస్య = ఇంచుగాగమము యొక్క, చోః = చువర్ణమునకు, వా = వికల్పముగా, ఇత్త్వమ్ = ఇదాగమము, స్యాత్ = అగును. ఏతత్సూత్రార్థ స్వారస్యముచేతనే యాత్మనేపదార్థమునఁ దెల్గున "కొను" ధాతువు, ధాతువుకుదిరి నిల్చు ననునర్థము జ్ఞాపితమగుచున్నది. క్రియాఫలము కర్తను బొందు నర్థమున నాత్మనేపదము ప్రయుక్తమగునని భావము. "స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే. (౧-3-౭౨) స్వరితేతో ఞితశ్చ ధాతో రాత్మనే పదం స్యాత్ కర్తృగామిని క్రియాఫలే" (సి. కౌ. ౨౧౫౮ సూ). దీని బాలమనో రమావ్యాఖ్య:—"కర్తృగామి నీతి - ఏవంచ హోతా యాజ్యయా యజతీత్యాదౌ యాగఫలస్య స్వర్గస్య యజమానగామిత్వేన హోతృగామిత్వాభావాత్ నాత్మనే పదమ్. తథా వేతనేన యజ్ఞదత్తభృతః దేవదత్తః పచతీత్యత్ర పాకఫలస్య భోజనస్య పక్తృగామిత్వాభావాత్ నాత్మనేపదమ్. దక్షిణాదిలాభస్తు నఫలమ్. లోకతో వేదతో వా య దుద్దేశేన క్రియాప్రవృత్తిః తస్యైవ వాత్ర క్రియాఫలశబ్దేన వివక్షితత్వాత్ (౨3౫-౨3౫ I విషయములలోఁ జెప్పఁబడినరీతి నిచట ఫలశబ్దార్థము నెప్పరాదు) కర్తృగామి ఫలక క్రియావృత్తే ర్ధాతో రిత్యర్థః. ఆత్మనేపదంతు ధాత్వర్థఫలస్య కర్తృగామిత్వం ద్యోతయతి". "దేవదత్తుఁడు పచించుకొనెన్" అనుచో పచనక్రియాఫలమగు భోజనము కర్తయగు దేవదత్తునకె యనునర్థము లభించుచున్నదిగాన నది యాత్మనేపదార్థక మనఁబడును. దేవదత్తుఁడు పచించుచున్నాఁడనుచో నట్టియర్థము రానేరదుగాన నది యాత్మనేపదార్థక మనఁబడదు. కాని యట్టిదానిని సంస్కృతమందువలెఁ బరస్మైపదార్థకమనుట తెల్గుసంప్రదాయము

కాదు. సంస్కృతమున నాత్మనేపదార్థ ద్యోతనము చేయు లిజ్ ప్రత్యయములు వేఱురీతిగను పరస్మైపదార్థ ద్యోతనము చేయు లిజ్ ప్రత్యయములు వేఱురీతిగను నుండును. తెల్గున నట్టిపద్ధతియే లేదు. ఆత్మనేపదార్థకత్వమున ధాతువు తుదిని "కొను" ధాతువు నిల్పుట మాత్రమే తెలుఁగుసంప్రదాయము. ఉభయపదములలోఁ క్రియాఫలము కర్తృగామియగునపుడే యాత్మనేపద మనెడి పాణినీయుల నియమము సంస్కృతకవులచేఁ బాటింపఁబడలేదు. "అకరో దచిరేశ్వరః క్షితౌ। ద్విషదారబ్ధ ఫలాని భస్మసాదితిరఘుః - తనోతి శుభ్రం గుణసంపదాయశః (భారవి) ఇత్యాదౌ ఫల వత్కర్తరి పరస్మైపదమ్. ఫలం విశ్వేపకారాయ। ధత్తే పర్వాణి పర్వణీతి. కమల వనోద్ఘాటనం కుర్వతే యే (సూర్యస్య రశ్మయః) ఇత్యాదౌ అఫలవత్కర్తర్యాత్మనే పదమ్" (ముగ్ధ. ౯౧౯ సూ. దుర్గా. వ్యా). ఇంచుగాగమ 'చు'వర్ణకమున కని చెప్పుటచేత స్వార్థేంచుక్కు చువర్ణమునకే కాక ప్రేరణేంచుక్కుచువర్ణకమునకును 'ఇ'త్త్వముకల్గును - వాఁడు తన్ను రక్షించికొనుచున్న వాఁడు - రక్షించుకొను చున్న వాఁడు. (ఇది స్వార్థేంచు గుదాహృతి). వాఁడు రక్షింపించికొనుచున్న వాఁడు. రక్షింపించుకొనుచున్న వాఁడు. (ఇది ప్రేరణేంచు గుదాహృతి). అత్త్వాది తత్సమా నామివ దేశ్యానా మనుచొప్పున నాచ్ఛికధాతువుల యించుక్కు చువర్ణమునకును 'ఇ'త్త్వము పాక్షికముగాఁ గల్గును. ఉదా:—వండించికొనెన్ - వండించుకొనెన్ - మొ. ఆచ్ఛికధాతువులకుఁ బ్రేరణమున నించుక్కే కాక చుగాగమమును వచ్చును కావున నద్దానికిని 'ఇ'త్త్వము వచ్చును - మాన్చుకొనెన్ - మాన్చికొనెన్. - మొ. సూత్రములోని వా శబ్దము వ్యవస్థావాచి యగుటచేత నించుగాగమ చువర్ణకమునకే కాక యాచ్ఛికధాతుమాత్రము తుదిని సైత మాత్మనేపదార్థమున 'కొను' ధాతువు నిల్పుటయు నట్టి ధాతువునకును "కొను" పరకత్వమున బహుళముగా "ఇ" త్త్వము కల్గుటయుఁ గలదు. ఉదా:—వండుకొనెన్ - వండికొనెన్ - గెల్చికొనెన్ - గెల్చు కొనెన్ - మొ. బహుళమనుటచే యాంతధాతువులయాకు సకారాదేశ మగుటయు నట్టియెడల 'ఇ'త్త్వము నిత్యముగా నగుటయుఁ గలదు. ఉదా:—చేసికొనెన్ - వ్రాసికొనెన్ - మొ.

"ఇంచు గభావేఽపి - నేర్చుకొని - నేర్చికొని, అందుకొని - అందికొని, ఇత్యాదా విత్త్వం భవత్యేవ. అత్త్వాది తత్సమానా మిత్యుక్తేః. అత ఏవ - నగి యించెన్ - తెగియించెన్ - మునిగియించెన్ - ఇత్యాదిరూపమపి సమంజసమితి ధ్యేయమ్" (అహో. ౪౯౦ పుట). అహోబలపతి యిట్లుగ నాత్మనేపదార్థక ధాతువిషయమగు "ఇ" త్త్వవిధాయక శాస్త్రమునుండి యించుక్పరకత్వమునందలి

[బా. క్రి. ౫౨-౫౩-౧౦౯ సూ.] ఇత్వము రాని యతిస్థానగతములు ప్రాచీనము లేవు. 'ఇ' త్త్వమును సాధించుట కేవలము నసంగత మనందగును. మఱియు "నగిలించు - తెగిలించు - ముగిలించు" అనురీతిగల రూపములు కవిత్రయసమ్మతములు కావని యీవలనె వివరింపఁబడెను (3౨౦-3౨౦ I విష. చూ).

ప్రయోగములు:—చ.........ప । ట్టికొనుటఁ గోరి తివ్విధము డెప్పర మెంతయు.........(ద్రోణ. ౧ ఆ. ౧౦౯ ప). సీ.........। చిత్తంబు దీనిఁ బుచ్చి కొని నిన్ను (అశ్వ. ౪ ఆ. ౨3౭). సీ.........గీ. అచ్చటికి వచ్చి కృత్తిక లార్వు రును మ । దీయ పుత్త్రకుఁ డనుచు నెత్తికొని రనఘ (అను. 3 ఆ. ౧౫౦). (మూఁడిటియందును 'ఇ' త్త్వము యతిస్థానగతము. ఇత్వము రాని యతిస్థానగత ప్రయోగము లభింపలేదు). ఆ-వె. .........తప్పించు । కొను తెఱంగెఱింగికొనుట మేలు (శాంతి. ౨ ఆ. ౨౮౨). వ.........కుండలంబులు.........మద్వచనంబున వాని నిప్పించుకొమ్ము (ఆది. ౧ ఆ. ౯౬ వచనము) (ఇప్పించుకొమ్ముఁ = ఇచ్చునట్లుచేసి కొమ్ము = పుచ్చుకొమ్ము) ఆ-వె. అతని నాశ్రయించి యవ్వైర విప్పించి । కొనిన మేలు పొందు ననిరె.........(శాంతి. 3 ఆ. ౧3౫ ప). (ఇప్పించికొను = పుచ్చుకొను = పొందు). క. అనిన విని యెఱిఁగికొని.........(విరా. ౪ ఆ. ౯౨ ప). (ఎఱిఁగికొని = తెలిసికొని). కొన్నియెడల 'కొను' శబ్దప్రయోగము లేకున్నను నాత్మనే పదార్థము భాసిల్లును. "..........సగరుం డనురాజు............. ............
క. దక్షమఖక్షయకరు............ప్ర । త్యక్షము గావించె నుగ్రతపమున పేర్మిన్ (అర. 3 ఆ ౪౮. ౪౯). (ప్రత్యక్షము గావించెను = ప్రత్యక్షము గావించికొనెను). సీ. జను లొక్కతఱిఁ దొల్చి సమయంబు దమలోనఁ । జేసి......దుర్జను నందఱును గూడి శాసించువారుగా.........(శాంతి. ౨ ఆ. ౨౫౭). (చేసి = చేసికొని). అకర్మకధాతువుల కాత్మనేపద ప్రయోగము తెల్లున లేదు. (బా. క్రి. ౧౨౪ సూ. విప్పృతి). కవిప్రయోగములం దట్టిధాతువుల తుదిని గొను ధాత్వనుప్రయోగము చూపట్టెనేని యది స్వార్థికమె కాని యాత్మనేపదార్థకము కాదని యెఱుంగునది. ఉదా:—పండెను = పరుండెను. పండుకొనెను = పరుండెను. మొ.

క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు
వనుప్రయుక్తం బగు. ౫౨.

బాలవ్యాకరణ వివరణము. ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు. వండుకొనుచున్నాఁడు.

3౨౧ I విషయము. కొనుధాతువు పరఁబగునపు డిగాగమంబు బహుళంబుగా నగు. ౫3.

వండికొనియె - [illegible]కొనియె. బహుళం బగుటచే
యాంశంబునకు ని[illegible]. చేసికొనియె.
పచుజికొను లో[illegible]చో స్వార్థంబునందు ప్రయు
క్తంబు లగు. ౧౦౯.
చొచ్చు - చొరఁబడు, నిలుచు - నిలువఁబడు, కూడు -
కూడఁబడు, పండు - పండుకొను.

సంజీవని. ౩౨౧ I విష:—౫౨ సూ:—క్రియాఫలంబు = క్రియాప్రవృత్తి ఫలము, కర్తృగామియగుచో = కర్తను జెందునపుడు ధాతువునకు 'కొను' ధాతు వనుప్రయుక్తమగునని యర్థము. ఇట్టి స్థితిగల ధాతువునే యాత్మనేపదార్థకమందు రని సూరివివరణమున కభిప్రాయము. ఉదా:—'దేవదత్తుఁడు వండుకొనెను' అనుచో దేవదత్తుని పచనక్రియాప్రవృత్తిఫల మగునట్టి వంటకపుభోజనము కర్త యగు దేవదత్తునకే యనునర్థము లభించుచున్నది. ఇట్లె సంస్కృతమున నుభయ పది ధాతువులకు ఫలవత్ కర్తృకత్వమునందే యాత్మనేపద ప్రత్యయయోగము కల్గునని పాణినీయుల సిద్ధాంతము. 'దేవదత్తుఁడు వండెను' అనునపుడు పైరీతిగల యర్థవిశేషము లభింపనేరదు.

౫౩ సూ:—కొనుధాతువు పరంబగునపుడు = ఆత్మనే పదార్థకత్వమునందలి కొనుధాతువు పరంబగునపుడు ధాతువునకు బహుళముగా 'ఇ'గాగమం బగును. ఈయాగమము కిత్తుగాన ధాతువుకుదిని నిల్చును. ఉదా:—వండు+ఇ+కొను = వండికొను - వండికొనియె - ఇగాగమాభావపక్షమున:—వండుకొనియె. బహుళ మగుటచేత యకారాంతధాతువులకు 'ఇ'గాగమము నిత్యముగా వచ్చునని సూరి గారు వివరించిరి. చేయు+ఇ+కొను = చేసికొను - చేసికొనియె. 'చేసుకొనియె' అనురీతిగల 'ఇ'గాగమాభావరూపము సాధువుకాదని తాత్పర్యము. "చేసికొనియె" అనునపు డుత్తరసూత్రముచే (బా. క్రి. ౫౮ సూ). యాకు నిత్య సకారాదేశము కల్గెనని యెఱుంగునది. ఆత్మనేపదార్థక కొనుధాతువు పరమగునపు డనుటచేత "పండుకొను -" మున్నగుచోటులం దిగాగమము రానేరదని యెఱుంగు నది. "యువర్ణాంతములకు ఇకారాదేశము (ఆదేశముకాదు. ఆగమము). నిత్య మని చిన్నయసూరి చెప్పెనుగాని పూర్వగ్రంథములందు ఉకారముతోడి రూప ములు గనవచ్చుచున్నవి. (ప్ర. సూ. ౨౬)". (ఆం. భా. అ. క్రి. ౫౩. సూ). అని యనుశాసనకర్తగారు వ్రాసిరికాని 'ప్రయోగవిశేష ప్రకరణమునందలి ౨౬ సూత్రములోని ప్రయోగములలో నొక్కటేని ప్రాచీనప్రామాణిక కవిప్రయో

గము కాదు. సీ. బలుతోలు కుళ్ళాయి పై నిప్పగొల్పును, జుట్టి జందెంబు వేసుకొని విల్లు। .........(రంగ. ఛం). క. ఆసవమును గడువడిగాఁ। బోసుకొని యచటికిఁ దాఁ బ్రముదమున వచ్చెన్ (కవిజన చకోరచంద్రోదయము. ౪ ఆ. ౫౩). ఇట్టి ప్రయోగములు చూపఁబడెను. ఇందును నీరెండవ ప్రయోగమువంటివానిలోఁ 'పోసికొని' అనురీతిని గవిప్రయోగించె నన్నను ననవచ్చును. ఇకారపరకత్వమున ధాతువు తుదియాకు సకారమువచ్చుటకు మహాకవిప్రయోగములు కన్పట్టుచున్నవి. సీ. వేసవివడగాలి నోసిన లేఁదీఁగ, క్రొక్కారుఁగని మువ్వమెక్కినట్లు (నన్ని. కుమా. ౭ ఆ. ౮౫ ప). (నోయు = నొచ్చు). క. నోసినడెందము పగులఁగ। నాసతి... ......(భాస్క. సుంద. ౨౨౪ ప). ఉకారపరకత్వమున యాకు సకారాదేశము వచ్చుటకుఁ బ్రామాణిక ప్రాచీన మహాకవిప్రయోగము లుపలబ్ధము కాలేదు. "బహుళ మనుట యీసకారాదేశము - ట - సు - పరమగునపుడుగూడఁ బూర్వకావ్యములఁ గనవచ్చుచున్నదనుటకు." (ఆం. భా. అ. క్రి. ౫౩ సూ. వివృతి) అనియు ననుశాసనకర్తగారు వ్రాసిరి. కాని యందులకును బ్రామాణిక పూర్వకావ్యప్రయోగమును జూపలేదు. "సుందరుఁ డింపుతోడఁ గలసుం బలసూదన భోగభాగ్యుఁడై (ద్రౌపదీపరిణయము - అల్లమరాజు రామకృష్ణకవి). ఉ. వ్రాసుటకుం జతుర్భుజవిలాసము పూనిన వేల్పు సత్కృపోల్లాస మెలర్పఁ బ్రోచు శుభలక్షణు... ......(రాజరాజాభిషేకము. అంగర నృసింహకవి. ౫౦౦ పు). (ఆం. భా. అ ప్రయోగవిశేష ప్రకరణము. ౨౭ సూ)." అనునవి మొదలగు సామాన్యకవిప్రయోగములు మాత్రమె చూపఁబడినవి. ప్రయోగసంచయ సంపాదకులగు కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారిట్టి ప్రయోగము లెల్ల నుత్తరాంధ్రకవులవె యని యీక్రిందిరీతిని వ్రాసిరి (చూ. బాలకవిశరణ్యము. ౨౦౦ పుటమీఁది యాఱు పంక్తులు). "యుకారాంత క్రియలకు ఉత్తరాంధ్రములో ఇట్టిరూపములు ఏర్పడ్డవి. గాని ప్రాచీనాంధ్రమందు లేవు" (బాల. ౨౪౦ పు). "తెలుసును మొ. నవి అసాధువులని విడిచిపెట్టరాదు. ఇవి క్రమమించుగా 300 సంవత్సరములయి వాడుకలో నెలకొనియున్నవి" (బాల. ౨౪౦ b). అని వ్రాసిరి. ఇట్టివానిని సూరి సంగ్రహింపకుండుట వింతకాదుగాని... ట్టవానిని [illegible] సంగ్రహింపఁడయ్యెను.

"అనుప్రయుక్తమైన [illegible] ధాతువు [illegible] - ట - కు - [illegible] వైకల్పికముగా [illegible] కారము ఇకారము కాదు. ఉదా:— ఎత్తుక - ఎత్తుకు. ఎత్తుకొని - ఎత్తుకొని, తీసుక - తీసుకు, తీసు

కొని - తీసికొని, మొ. చండగతినేగి యీడ్చుకు రండిప్పుడు కడఁగి (మార్క. వ్రాఁతప్రతి). ఉత్తరస్య కొనో ధ్గాతోః। కం బుధాః కేచి దూచిరే (హరికా) చేసుక-చదువుక - మొదలగురూపము లెల్లెడఁ గలవు. చిన్నయసూరి యనుశాసనము చేయకున్నను ఇవి దుష్టములుకావు" (ఆం. భా. అ. క్రి. ౫౪ సూ). ప్రయోగ సంచయకర్తగారగు (బాలకవిశరణ్యము. ౨౦౦ పుట. మొదటి యాఱుపంక్తులు చూచునది). కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు 'కొ'అను దానిని సయితము చేర్చియున్నారు "అనుబంధముగా ఉండే 'కొని'......... ఉచ్చారణలో బలములేనిదై అందులోని అంత్యవర్ణమైన 'ని' లోపించడమే కాక, కవర్ణము పైనున్న అచ్చుకూడా అస్పష్టముగానో వివిధముగానో ఉంటుంది. అందుచేత, పట్టుకొ పోయెను - పట్టుకు పోయెను - పట్టుకపోయెను.........అనే రూపములు వినఁబడుతున్నవి" (బాలక. ౧౭౮ పుట). ఈసందర్భమున వీరు నలువది ప్రయోగములకుఁ బైఁగాఁ జూపిరిగాని యొక్కటైన 'కొ - కు - క' అను వానిలో నొకటిని నిర్ణయింపఁజాలు యతి ప్రాసాదిగతము కాదు. ఈ ప్రయోగములలోఁ గొన్ని ప్రామాణికకవుల ప్రయోగము లున్నవి గావున వీనిని సూరికాకున్నను ప్రౌఢవ్యాకర్తయేని సంగ్రహింపకుండుటకుఁ గారణము తోఁపకున్నది. ఇట్టి ప్రయోగములు ప్రాచీన ప్రామాణికకవులవి కాకుండుటచే సూరి యుపేక్షించిన నుపేక్షించుఁగాక. "ఈరూపములు కవిత్రయమువారి గ్రంథములలో మాకు కనబడలేదు... ......పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని కాలమునకు ఈసంగ్రహరూపములు కవులు తరుచుగా వాడినట్లు కనఁబడదు.........శబ్దరత్నాకరములో 'చీకిలించు' అనేశబ్దము క్రింద కాశీఖండములోని 'చీకిలించుక యుండు' అనేపద్యము ఉదాహరించినారు. అచ్చుప్రతులలో ఈపాఠమే కనబడుతున్నది, గాని వ్రాతప్రతులలో 'చీకిలించుకొని యుండు' అని ఉన్నది........." (బాలక. ౧౭౮-౧౭౯ పు) అనివ్రాసి శరణ్యకర్తగారీక్రింది పెక్కుప్రయోగములను జూపిరి. బా. గు. ప్ర. వ్యాఖ్యాదులందును బెక్కుప్రయోగములు చూపఁబడెను. (బా. గు. ప్ర. ౩౪౬ పు. ద్వి. ము). (నారా. గాణ- క్రి. ౩౯౧ కారి. ౫౭ ప. ౩౩౭ పు). క. సొరిది ఢకారము గూడుక । సరి నేఁబది యయ్యె వర్ణసంఖ్య ధరిత్రిన్ (అనంతఛందో) ఉత్కలిక. అరద మెక్కక పూని పురికి వచ్చినవాని (అప్పక. ౪ ఆ. ౩౧౬). క.........పొల్లటకా । రము పెట్టుక సంధిఁ జెందుఁ బ్రాణముతోడన్ (అప్పక. ౫ ఆ. ౯౧ ప). క. చండగతి నేఁగి యీడ్చుక । రం డిప్పుడు.........(మార్కం. ౩౫౮పు). మ... ...। అరయంగా మెడఁ బెట్టుకొయ్యఁ దిరుగన్ హారంబులే భామినుల్ (శకుంత

౭౦ పు). ఉ. అందుక యుగ్రతుండమున........(తారాశశాంక. ౫ ఆ. ౩౧). ఉ......। పట్టుక వచ్చి మట్టికడఁ బ్రాణముఁ దీసెఁగదయ్య భాస్కరా (భాస్కర శతకము). క. తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ (సుమ). ఉ.........వి। శ్రాంతుని నన్నుఁ గావలు డిసంతులు గొట్టుచు మోచు కేగుచోన్ (ఆము. ౬ఆ. ౭౮). ఉ. మించినవేడ్క రక్కసులు మీసలు దీటుచు దిక్కుడుంగముల్ । చించుక పాఱ నార్చుచు (కాళ. మా. ౨ ఆ. ౧౫౫). ఉ. ఉక్కున వాని తేరు దివి కుప్పర మెత్తుక పోవ నేసినన్ (జైమిని. ౫ ఆ. ౬౨ ప). సీ........ క్రింద నంటుక సంతరించుకొనిరయి (హర. ౨ ఆ ౧౧౫ ప) ఇట్టి ప్రయోగములందెల్ల 'క' అనుచో 'చున్'అనెడి శత్రర్థక చువర్ణకము కవిప్రయుక్తమైయుండఁగా వ్యావహారికవాసనచే లేఖకాదు లీరూపముఁను బ్రక్షేపించిరా యని యాలోచింపవలసియున్నది. (విస్తర.) కాని యనేకస్థలములందు విస్తరించియున్న యీప్రయోగము కవిప్రయుక్తమె యనుట విశ్వసనీయమై యున్నది. ప్రామాణిక కవులగ్రంథములలో సందేహానిర్ణాయక యతిప్రాసాదిస్థలగత ప్రయోగములు లేమిఁజేసి యర్వాచీనగ్రంథములలో "కొన్ - కొ - కు - క - కన్'' అని వివిధగతుల నీసంగ్రహరూపములు కన్పట్టుచున్నవి. క. ఇచ్చిన మెచ్చికఁ బుచ్చుక । యచ్చెలి మెచ్చుచు మునీంద్రుఁ డౌదలఁ దాల్చెన్ (దశా. ౮౫ పు). చ.. ......పొమ్మనినఁ దర్లిరి పుత్త్రిని వెంటఁబెట్టుకన్ (పట్టాభి. ౨ ఆ. ౮౫ పు). ఉ. క్రోధము గల్గి చెల్లెలిని గొబ్బునఁ బుత్త్రిని వెంటఁ

---

విస్తర. ౩౨౧ [1] విష:—హరికారికావళికర్త ప్రకీర్ణపరిచ్ఛేదాంతమున "సర్వత్ర న ద్రుతః క్త్వార్థేఽవ్యతిరేకేతు వాభవేత్ । ఉత్తరస్య కొనో ర్ధాతోఃకం బుధాః కేచి దూచిరే. ఓర్వకనుండె - ఓర్వకుండె ఊరడక నడవిలో వేఁటాడె - ఊరడకడవిలో వేఁటాడె........" (బా. గు. ప్ర. ౫౬౭ పుట. ద్వి. ము). అని చేర్చెను. బాలవ్యాకరణ ముత్తరగ్రంథ మగుటచేత దీనిని సమ్మతింపక విడిచెనని, బా. గు. ప్ర. కర్త పదునాల్గవ యుక్తిచూపి చర్చించెను. (బా. గు. ప్ర. ప్రకీర్ణ. ౫౩౧ పు. ద్వి. ము). ఇదియు మిక్కిలి బలహీనమైన యుక్తియె. ప్రౌఢవ్యాకర్తయేని సమ్మతింపని పఱురెండువిషయములను భారతాది ప్రాచీనమహాకవిసమ్మతి లేమింజేసి సూరి యుపేక్షింపఁగా హరికారికావళీకర్త సూరిగ్రంథమును సంస్కృతీకరించునపుడు చేర్చెనని యేల చెప్పరాదు? హరికారికావళికర్త క్రొత్తగాఁ జేర్చుటచేతనే పైకారిక క్రిందఁ గవిప్రయోగములను సఱితము చూపవలసినవాడయ్యెను. అందలి భారతప్రయోగము "ఊరడక నడవిలో" అనునది ద్రుతప్రకృతికతా నిర్వాహకము కాఁజాలదని యీావఱకె విమర్శిత మయ్యెను (విస్తర. ౮౭ II విష).

బెట్టుకన్ । బాధలు.........(శశిరే. ౮౩ పు). సీ. సకలంబు నాక్రమించుక నొక్క రూపమై... .(శ్రీ. ప్ర. వేం. వి. ౬౮పు). బాలక. ౧౯౩-౧౯౦ పు) (పైప్రయోగ ములలో 'కన్' అనుచో'కొన్' అనువానిని శరణ్యకర్తగారునిల్పి యుదాహరించిన లెస్సయైయుండు శరణ్యమున నుదాహరింపఁబడిన ప్రయోగములలో నొకరెండు ప్రాసగతములుగలవు. క. అకటకటాయను వారుఁ జు । ట్టుక చుట్టుక తిరుగు భ్రమ నిటునటును మదిలో । ......(పిడపర్తి. సోమన. బసవ. ౧౧౯ పు). క. ఒకతెవలె నాడి యాడిం । చుకొనుటనే యిరుగుపొరుగు చూచెనొకో యు । ప్పుకు జప్పకు గానను జూ । చుక నడువఁగవలెఁ గులీన శుకసల్లాపల్ (నిరంకు. ౨ ఆ. ౫౯ ప). ఇట్లుగ ననుప్రయుక్తకొను ధాతుపరకత్వమున 'ఇ'త్వము కాని ప్రయోగము ప్రాచీన ప్రామాణికగ్రంథములలోనిది లభింపలేదు.

ఆత్మనేపదార్థక చరిత్రమును బ్రదర్శించుటలో బాలకవి శరణ్య కర్తగారు ధాతువుల క్త్వార్థకరూపములపైని "కొను" ధాతువు నిల్పుచువచ్చె ననియు నట్టి క్త్వార్థకరూపములు ప్రాచీనకాలమున 'ఇ' ప్రత్యయరూపముననే కాక 'ఉ' ప్రత్యయరూపమున సయితము వెలయుచుండెడివనియుఁ దమిళ కన్నడభాషల సామ్యమును జూపుచు వివరించి యట్టి చరిత్రనుబట్టియే యనుప్రయుక్త కొనుధాతుపరకత్వమున 'ఇ'త్వము బాహుళికమని వైయాకరణులు చెప్పుచున్నారనియు విస్తరించి వ్రాసిరి. 'కొను' ధాత్వనుబంధము ధాతువుపై నిల్పుటచే నాత్మనేపదార్థబోధము కల్గునుగాని క్త్వార్థకముపై నిల్పుటచే నెట్లుగల్గును? "క్త్వార్థకరూపములు అరవములోను కన్నడములోను,కొండాడు(కొనియాడు)అనే తెలుగుభాషలోని క్రియారూపములోను తరుచుగా ఉకారాంతముగానే ఉండడంచేత'కొని'అనుబంధమునకు పూర్వమందున్న క్రియారూపములు ఉకారాంతములయినా అవి క్త్వార్థకరూపములే అనిన్ని" (బాలక. ౧౯౨ పు). "పట్టుకొని - చేసికొని మొదలయినరూపములలో అనుబంధ ముగా ఉన్న కొనికి పూర్వముండుండే క్రియారూపము వాస్తవముగా క్త్వార్థక రూపము.........పట్టుకొని - వండుకొని - తెచ్చుకొని - మొదలైనరూపములలో పట్టు - వండు - తెచ్చు - మొదలైన క్రియారూపములు క్త్వార్థకములంటే నేటి తెల్గువారికి వింతగా తోచకమానదు. కాని సజాతీయమైన కన్నడభాషలోను అరవ భాషలోను ఉకారాంతముగా ఉన్న క్త్వార్థకరూపములు చూచినయెడల ప్రాచీనాంధ్రములోకూడా క్త్వార్థకములు ఉకారాంతముగానే ఉండియుండవచ్చుననిపి తోచకమానదు. కన్నడభాషలో.........ఇత్తు (ఇచ్చి) ఈఱు (ఈని) కొండు (కొని) బందు (వచ్చి).........ఇకారాంత క్త్వార్థకరూపములు.........చాలా

తక్కువగా ఉన్నవి. అగి (అయి) హోగి (పోయి). అరవములో వందు (వచ్చి)సెయ్దు (చేసి)........." (బాలక. ౧౮౦ ౧౮౧ పు). ఈవ్రాంత సరికాదు. తమిళ కన్నడ ములను నెఱింగి వ్రాసినది కాదు. భూతార్థద్యోతకమగు ద(త)కారము గాని 'ఇ'కారముగాని చేరకయే "పట్టు - తెచ్చు" మున్నగునవి భూతార్థకక్త్వా ప్రత్యయార్థము నెట్లొసంగఁగల్గును? తమిళ కన్నడములలోని భూతార్థక క్త్వార్థమున 'దు' అనునదియు దాని పరిణామములగు 'తు' మున్నగునవియుఁ బ్రత్యయములు తఱుచుగాను, 'ఇ' ప్రత్యయ మరుదుగాను వచ్చును. అట్టి 'దు' ప్రత్యయముమీఁద మఱికొన్ని ప్రత్యయములు నిల్చి భూతార్థక సమాపకక్రియ లేర్పడును. అట్టి 'దు' ప్రత్యయములోని 'ఉ'కార ముచ్చారణార్థము చేరినది. తెల్గున నన్నో క్త్వార్థమున 'ఇ' ప్రత్యయము మాత్రమె నిల్చును. భూతార్థక సమాపకక్రియలలో 'ఇ' 'తి' అనునవి రెండును నిల్చును. కావునఁ దమిళ కన్నడ ములలోఁగాని తెల్గునఁగాని ద (త) కారముతోఁగూడకయే 'ఉ'కారమాత్రముతోఁ గూడిన క్రియారూపము క్త్వార్థకమగుననుట కేవలము భ్రాంతిమూలకము.

కాల్డువెల్లుదొరగారి ద్రావిడవ్యాకరణము మొదటిముద్రణము ౪౯౭ పుట 3 వేరాలోని గ్రంథమునకుఁ దెలుఁగుతాత్పర్యము:—"I. కన్నడభూత కాలము - కన్నడమునఁ బ్రాయికముగ ధాతువునకు శ్రుతి సుఖార్థమై 'దు' అను 'ఉ'కారాంతరూపమునందిన 'ద'కారమును జేర్చుటవలన సహజముగ భూతకాల మేర్పడుచున్నది. దకారమేళనమున క్త్వార్థ మేర్పడుచున్నది. ఉదా:—కన్నడ - ఇళిదు (దిగి) నుడిదు (పలికి). ఈరూపములకుఁ బురుషబోధక ప్రత్యయములను జేర్చుటవలన భూతార్థక సమాపకక్రియ లేర్పడును. ఉదా:—కన్న - ఇళిదెను (దిగితిని) నుడిది (నీవు చెప్పితివి).........వీనియందుకలుగు వ్యత్యాసమెల్ల దకార పరిణామమును సంబంధించినదిమాత్రమె. కాఁగా 'ద'కారము 'త'కారమగుటయుఁ గలదు. ఉదా:—అఱితను (ఎగిరెను). తమిళమున దీనికి సరియగురూపము 'అఱిన్దాన్' అనునది. కొన్నియెడల భూతార్థక దకారము ధాతువు తుదిహల్లుతోఁ గలిసి "ద్ద"అనియు "త్త" అనియు మాఱును. ఉదా:—ఇద్దను (ఉండెను)......దీనికి సరియగు తమిళరూపము'ఇరున్దాన్'అనునది. ఎళుదు=ఎద్దు(లేచి). దీనికి సరియగు తమిళ రూపము "ఎలున్దు" అనునది......". పయిసందర్భమునుబట్టి దకారయోగము లేని 'ఉ'కారాంత క్రియారూపము క్త్వాంతమగుట శబ్దచరిత్ర సంప్రదాయవిరుద్ధమని విశదమగుచున్నది. అది యట్లుండఁగాఁ బ్రాచీనశబ్ద చరిత్రమునుబట్టి "తీసుకొని - చేసుకొని" మున్నగు నాధునికరూపము లేర్పడెననుట మఱియు నసంభవము,

ప్రాచీనశబ్దచరిత్రము ననుసరించి యేర్పడినరూపములు ప్రాచీనకవిప్రయోగములలో వచ్చునకేని లేకుండఁగా నట్టి చరిత్రశాస్త్రగంధమునైన నాఘ్రాణింపని పదునేనవ శతాబ్దపుఁ గవులగ్రంథములలో నవతరించెననుట మఱియు నసంభవముగదా! ఈయనుప్రయుక్త కొను ధాతువునకు (ముత్తుపరంబగునపుడు). "కో" అను నాదేశమువచ్చునని మున్ముందు సూరిగారు వివరింతురు. (బా. క్రి. ౬౦ సూ).

౧౧౯ సూ. వ్యాఖ్య:—పదుజ్యనుబంధమును 'కొను' ధాత్వను ప్రయోగమును స్వార్థమునం దగుట ప్రయోగదృష్టమగుచున్నదని తాత్పర్యము. చొచ్చు నిలుచు - మున్నగుధాతువు లకర్మకములగుటచేత వానికిఁ గర్మార్థకత్వము దుర్ఘటము గాన "చొరఁబడు - నిలఁబడు" మున్నగుస్థలములలోని "పడు" అనునది కర్మార్థకము కాదనియు స్వార్థమందె నిల్చినదనియుఁ దాత్పర్యము (చూడు. 3౧౯ విష). అట్లె "పండు = నిద్రించు" అను ధాతువునయిత మకర్మకమె కావున నాత్మనే పదార్థకము కానేరదు. (బా. క్రి. ౧౨౪ సూ.). మఱియు "పండుకొను = పండు = నిద్రించు" అను ధాతువులోని "కొను" ధాతువున కర్థవిశేషము లేమింజేసి యది స్వార్థికమె (ధాత్వర్థమాత్రబోధకమె) యనుట స్పష్టము. పదుజ్యనుబంధము విషయ మీావఱకు 3౧౯ విషయమున వివరింపఁబడెను ముందు (బా. క్రియా. ౧౨౨ సూత్రము) వలయ్యాదిసూత్రమునొద్ద నింకను విమర్శింపఁబడును. 'చొచ్చు+పడు' అనుచో, బా. క్రి. ౪౯ సూత్రముచొప్పునఁ గర్మార్థమందు 'పదుజి' రాఁగా, బా. క్రి. ౨౦-౨౧ సూత్రములచొప్పున 'అ'త్వము నుగాగమమును రాఁగా బా. క్రి. ౯౧ సూత్రముచొప్పున 'చొ'ర్యాదేశమును ద్రుతకార్యములును రాఁగా "చొరు+అ+ను+పడు = చొరఁబడు" అను రూపమేర్పడును. ఇట్లె తక్కినరూపముల ప్రక్రియను నరయునది. "పండుకొను" అనుచో నాత్మనేపదార్థకము కామింజేసి 'ఇ'త్వమురాదని యెఱుంగునది. 'చేకొను - పైకొను - మేలుకొను - ఇయ్యకొను - ఆఁకొను' మున్నగుచోటులందలి కొనుధాతు వాత్మనే పదార్థకము కాదు, స్వార్థికమును గాదు. ఇంక బా. క్రి. ౧౧౮ సూత్రముచొప్పున నేర్పడిన శబ్దపల్లవములోని యుత్తరావయవముని గ్రహింపవలెను.

వన్నయా ధర్వణీయము. 3౨౨ విషయము.

అత్వాది తత్సమానా। మివ దేశ్యానాం క్రియాపదానాంచ। వర్ణాగమో విశేషః। పురుషే ష్వర్థేషు చాపి వచనేషు. (ఆం. చిం. క్రియా. ౧౭ కారి. అహో. ౫౪౨-౫౪౩ పు).

భాషేయ మమితా తత్ర । దేశ్యాచిత్ర స్వభావయుక్ ।
తచ్చిత్ర తానుమస్తవ్యా । పూజ్యపాద సుభాషితే.
(వికృ. క్రియా. ౩౬ కారి. అహో. ౫౧౩ పు).
భూయసీ దేశ్య శబ్దేషు । లోపవర్ణాగమశ్రుతిః. (వికృ.
అజం. ౯౮ కారి. అహో. ౩౭౨).
తత్తత్పదం పరిగ్రాహ్యం । యదస్య త్సహ్యదయే హి
తమ్ (వికృ. అజం. ౯౩ కారి. అహో. ౩౭౧ పు).

కల్పతరువు. ౩౨౨ విష:—వీనిలో, 'అత్వా'దీత్యాదికి ౨౯౬ విషయము నందును, 'భాషేయ'మిత్యాదికి, 'తచ్చిత్రతే'త్యాదికిని, ౮౮ I విష. ౨౮౧ వి. ౨౮౮ విషయమునందును 'భూయసీత్యాదికి' ౮౮ I. ౨౧౯-౨౮౧-౨౮౩-౨౮౮ విషయములందును, 'తత్తత్ప'దమిత్యాదికి. ౮౮ I. ౨౩౩ V - ౨౮౮ విషయము లందును వ్యాఖ్య చేయఁబడెను. ఆంధ్రశబ్దచింతామణి క్రియాపరిచ్ఛేదమున శబ్ద శాసను డు సంస్కృత సముక్రియారూపసాధన ప్రక్రియను "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాదిత్యాది సూత్రములచే వివరించి యట్టి సూత్రములనెల్ల నాచ్ఛిక క్రియల విషయమున యథాసంభవముగా నుపయోగించుకొనవలయునని యుపదేశించి యట్టి యాచ్ఛిక క్రియల రూపములం దనంతములగు వర్ణాదేశాది వికారములు గల్గును గాన నట్టి కార్యవిశేషలనెల్ల మహాకవిప్రయోగానుసారముగాఁ గల్పించుకొన వలయుననుచు వర్ణాగమో విశేష ఇత్యాదిసూత్రము నుపదేశించినవాఁడయ్యెను.

వర్ణాగమ ఇతాది:—పురుషేషు=ఉత్తమపురుషాదులందును, వచనేషు = ఏక త్వాదివచనములందును, అర్థేషు చాపి = తద్ధర్మాద్యర్థములందును. వర్ణాగమః = (ఇది యాదేశాదులకును నుపలక్షణము) వర్ణాగమ వర్ణాదేశాదికార్యములు, విశేషః = చింతామణిలోఁ జెప్పఁబడిన సామాన్యవిధులకు విశేషవిధులగుచు వర్తి ల్లును. ఈవిషయములనే భాషేయ మమితా తత్రే త్యాద్యథర్వణకారికలు విస్త రించి చెప్పుచున్నవి. కాని యట్టికార్యజాతము నంతగాఁ బ్రత్యేకించి ద్వితీయా చార్యుఁడును వివరింపఁడయ్యె. బాలవ్యాకరణమున నట్టికార్యములు కొన్ని వివరింపఁబడినవి. అట్టివిషయములనెల్ల బాలవ్యాకరణాదులనుండి గ్రహింపనగును.

ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబులగుచో
బాలవ్యా. యాకు సకారంబగు. ౫౮.
౩౨౨ I విష. చేయు - చేసిరి - చేసి - చేసికొను - చేసెను - చేసె
డిని - ఇత్యాదులెఱుంగునది.

సంజీవని. 3౨౨ I విష:—కల్పతరువులో 3౨౨ విషయమునఁ జెప్పఁబడిన రీతిగా సూరిగారు వివరించిన యాచ్నిక క్రియారూపసాధనవిషయక విధులలో నిది యొకటి:—ఉక్తంబులందలివి = బాలవ్యాకరణమున నీసూత్రముచఁ జెప్పఁబడిన ప్రత్యయాగమాదేశాదుల మొదటనున్న ఇదన్యక్రంబుః = ఇకారమును 'ఎ - ఏ' లును (ఇకారసాహచర్యమునఁ బాలస్యములు గాని 'ఒ - ఓ'లకు గ్రహణములేదని యెన్నునది), బరంబులగునపుడు పూర్వస్థితధాతువు తుదియున్న యకారమునకు సకారాదేశంబగును. ఉదా:—చేయు+ఇ+రి = చేసిరి. ఇందలి 'ఇ' అనునది బా. క్రి. ౧౭ సూత్రమున విధింపఁబడిన "ఇ"గాగమము. చేయు+ ఇ = చేసి. ఇందలి 'ఇ' అనునది బా. క్రి. ౩౮ సూత్రమున విధింపఁబడిన 'ఇ' ప్రత్యయము. చేయు+ ఇ+కొను = చేసికొను. ఇందలి 'ఇ' అనునది బా. క్రి. ౫3 సూత్రమున విధింపఁ బడిన 'ఇ'గాగమము. చేయు+ఎ+ను = చేసెను. ఇందలి 'ఎ' అనునది బా. క్రి. ౧౬ సూత్రమున విధింపఁబడిన డుజ్జున కాదేశమైనది. చేయు+ఎడి+ని = చేసెడిని. ఇందలి 'ఎ' అనునది బా. క్రి. ౨3 సూత్రమున విధింపఁబడిన "ఎడి" గాగమ సంబంధమైనది. ఆదిశబ్దముచే బా. క్రియా. ౧౭-౨3-౨౬-౪౪ సూత్రములచే సాధింపఁబడిన చేసినవాఁడు - చేసిన౯ - చేసెదను (తద్ధర్మార్థక) - చేసెదను - చేసెడున్ - (ఆశీరర్థక) చేసెడివాఁడు - చేసెడువాఁడు మున్నగుచోటులందును సకారాదేశంబగునని యెన్నునది. ఉక్తంబులందలివి యనుటచేతఁ బ్రకృతసూత్రమునకుఁ దర్వాత బా. క్రియా. ౭౦ సూత్రమున విధింపఁబడిన ప్రేరణేంచుగాగమ సంబంధి యగు 'ఇ'కారము పరమగునపుడు సకారాదేశము రానేరదు. ఉదా:—చేయు+ ఇంచు = చేయించు - వ్రాయించు - మొ. ఇట్లె - అరయు+ఇక = అరయిక (బా. కృ. ౧౨ సూ) అలయు+ఇక = అలయిక. చేయు+ ఇ = (బా. కృ. ౨౨ సూ). చేయి. మున్నగుచోటులందును సకారాదేశము యాకుఁ గలుగదని యెఱుంగనగును.

ప్రయోగములు:—క.......చే। సితి వారలకిట్లు నికృతి సేయుట లగ్గే (సభా. ౨ ఆ. ౧౮౬ ప). క. ఊ। ర్జితుఁడయి దానిచుట్టు విడిసెన్ (అర. ౧ ఆ. ౧౫౧). క. చే సమరిగొంచుఁ బోడువఁగ। డాసినఁ దద్భుజముతోడ.........(ఆది. ౬ ఆ. ౨౦౬ ప). క. చేసె నఘము తత్ఫలముం। జేసేతం గుడిచెఁగాని శిశువునెడన్ నా। చేసిన క్రౌర్యములే దే। జేసితి మాటొండుగిడు సెందదు నన్నున్ (శాంతి. 3 ఆ. ౨౫౧). శా. చేసేతం బృథివీశు లందికొనఁగా శ్రీ పుణ్యతోయంబులం। జేసెన్ మజ్జన......(నిర్వ. ౧ ఆ. ౨౬). సీ. వేసవి వడగాలి నోసినలేఁ దీఁగ క్రొక్కారుఁ గని మవ్వ మెక్కినట్లు (నన్నె. కు. ౭ ఆ. ౮౭ ప). (నోయు+ఇన = నోసిన).

క. నోసిన డెందము పగులఁగ । నాసతి.........(భాస్క. సుంద. ౨౨౪). (పై ప్రయోగములెల్ల యతిప్రాసగతములు).

వన్నయా 3౨3 విషయము. శత్రర్థే తూత శ్చౌ, నోస్తస్య స్యాచ్చ పూర్ణబిన్దురపి (అం. చిం. సంధి. 3 కారి. అహో. ౧౯౫-౧౯౬ పు).

కల్పతరువు. 3౨3 విష:—దీనికీవలకు ౨౧౦ X విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

బాలవ్యా. 3౨3 I విషయము.

చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబే
ని నుస్థానంబున బిందు వేని విభాష నగు.౫౫.
అన్చున్నాఁడు - అంచున్నాఁడు - అనుచున్నాఁడు -
అన్చును - అంచును - అనుచును. అను - కను -
కొను - తిను - మను - విను. ఇవి యన్వాదులు.

సంజీవని. 3౨3 I విష:—దీని కీవలికె ౨౧౦ XI విషయమున వ్యాఖ్య చేయఁబడెను. సూత్రములో "చువర్ణకము" అనుటచేత బా. క్రి. ౧౪ సూత్రమున విధింపఁబడిన 'చు'వర్ణకమును, బా. క్రి. ౪3 సూత్రమున విధింపఁబడిన 'చున్' వర్ణకమును గ్రహింపఁబడుచున్నవి. కావుననె సూరి 'అంచును - అంచున్నాఁడు.' అను ద్వివిధములగు నుదాహృతుల నిచ్చెను. చింతామణిపక్షమున నిట్టి ద్వైవిధ్యము లేదు. "చురితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్" (౨౯౬-3౧౪ పిమ). అని యందు విధింపఁబడెను. ఆ-వె. అంచుఁ బ్రీతిఁ గౌఁగిలించుకొనియె (సభా. ౨ ఆ. ౨౯౧ ప). శా. ప్రాంచద్భూషణ.........పై । యంచుల్.........శ్రీహరీ । యంచున్.........పా । మ్మంచుం ద్రోచె...... (మను. ౨ ఆ. ౬౮ ప). మున్నగు ప్రయోగములు ౨౧౦ X విషయమునఁ జూపఁబడెను.

బాలవ్యాకరణమందలి యీసందర్భములోని "౫౬. ఉన్నశబ్దంబు పరంబగునపుడు........." "౫౭. చేదాద్యర్థనాంతంబయిన యుండునకు........." అను సూత్రము లీవలకు 3౧౫ III విషయమున నుదాహరింపఁబడినవి. అచటనె వీనికి వ్యాఖ్య చేయఁబడెను.

వన్నయాథర్వ 3౨౪ విషయము.

టవర్ణకః క్రియా న్తే స్యా । ద్భావార్థే సాసమాస
యోః । పూర్వస్య చ వికారో నో । స్తస్మిన్ లోపశ్చ
కస్యచిత్. (వికృ. క్రియా. ౧౯-౨౦ కారి. అహో. ౪౯౯ పు).

నాత్పరస్య భవేద్దస్య। డాదేశో వా రువర్ణకే(వికృ.
క్రియా. ౩౮ కారి. అహో. ౫౦౮-౫౧౧ పు).
అన్యేషాంచ ప్రయోగమహితానామ్. (ఆం. చిం.
౧౩ కా. సంధి. అహో. ౨౩౭).

కల్పతరువు. ౩౨౮ విష:—పయి కారికలలో "టవర్ణకః.........కస్యచిత్" అను కారిక కీవలకె ౩౦౯ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. అన్యేషాంచేత్యాదికి ౨౧౦ X విషయమున వ్యాఖ్య చేయఁబడెను. వికృతివివేకకర్త మార్చిన 'ఉవర్ణకః క్రియాన్తే స్యా'త్తను పాఠము సరికాదనియు ౩౦౯ విషయమునందె విమర్శింపఁబడెను. "పూర్వస్య న వికారో నోః" అనుచోప్పున 'అంట-వింట - తింట - ప్రభృతులు నన్నయాథర్వణసమ్మతములు కాకున్నను దిక్కన శ్రీనాథాది మహాకవులచే నంగీకృతములయి ధారాళముగాఁ బ్రయోగింపఁబడి యుండుటచేత సూరి యట్టివాని నిట సంగ్రహించుచున్నాఁడు. (బా. క్రి. ౫౮ ౫౯ సూ) "తస్మిన్ లోపశ్చ కస్య చి" త్తనుటచేత "ఉండుట = ఉంట, ముంచుట = ముంట, పండుట = పంట" మొదలగునవి సర్వసమ్మతములగుటచే వానినియంతము సూరిగారిచట నుపదేశించుచున్నారు. (బా. క్రి. ౫౮-౫౯ సూ).

నాత్ పరస్యేత్యాది:—రువర్ణకే = రువర్ణక పరకత్వమున, నాత్ పరస్య - దస్య = అను - కను - విను మున్నగు ధాతువులలోని నకారమువకంటెఁ బరమైన దకారమునకు, డాదేశః = దకారాదేశము, వా = వికల్పముగా నగును. అనుదురు మున్నగు 'ను'వర్ణాంత ధాతురూపములలోని నకార దకారములకు నడుమ నున్న 'ఉ' కారము 'నాత్పరస్యేతి విధానసామర్థ్యమునఁగాని "అన్యేషాంచ ప్రయోగమహితానామ్" అనుచోప్పునఁగాని (౨౧౦ X విష) వికల్పముగాలోపించును. అందలి నకారము నిండుసున్న వైకల్పికముగ నగును. ఉ. అంద్రు. అంద్రు. డాదేశాభావపక్షమున నెల్లెడలను "అన్యేషాంచే"త్యాది సూత్రముచేతనే (౨౧౦ X విష). పాక్షికోల్లోపము కల్గుచుండును. తే-గీ. అమర లోకనివాసుల యంద్రు విబుధు। లా కురుక్షేత్రవాసుల......(అర. ౨ ఆ. ౨౫౯). తే గీ. ఎఱుఁగు మెల్లధర్మములకు నెందఁబెద్ద। యంద్రు సత్యంబు ధర్మజ్ఞులైన మునులు. (ఆది. ౪ ఆ. ౯౬ ప). చ.........నీ। కరుణయి వేచి మండ్రు (ఆది. ౨ ఆ. ౪౭). ఉల్లోపము కల్గఁగా మిగిలిన నకారము నెఱసున్న యగుటకును దానిమీఁది దకారము డకారమగుటకును బ్రాసగత నన్నయప్రయోగము లభింపలేదుగాని భాషాస్వభావమునుబట్టి యట్టి లుప్తోకారక నకారము నెఱసున్న యగునని యెన్నవగును. ప్రాసగతములు

కామింజేసి పైచోట్ల డాదేశము నన్నయప్రయుక్తమని నిర్ణయింపఁరాదు గాని "సాత్పరస్య భవే ద్దస్య । డాదేశో వా 'రు'వర్ణకే" అను నథర్వణవచనమునుబట్టి డాదేశమును నన్నయ ప్రయోగించెనని యథర్వణుఁడు విశ్వసించె ననుటలో సందేహము లేదు. రువర్ణక పరకత్వమందే కాక తిజ్ ప్రత్యయమెద్ది పరమైనను 'దు - తి' వర్ణకములకు మందున్న 'ను'వర్ణకముఁ జోట వికల్పముగా నెఱసున్నను భట్టారకుఁడు ప్రయోగించెనని యీక్రింది ప్రయోగములచే విశదమగుచున్నది. మఱియు నట్టి యెడల నున్న బిందువుమీఁది 'తి' వర్ణకము నిత్యముగా 'టి' వర్ణ మగుననియు విశద మగుచున్నది. ఉ.........ద్రోహులై యెదిరి చత్తురొ యుందురొ మానవేశ్వరా (ఆది. ౮ ఆ. ౪౬ వ). చ.........ఉ। త్పలదళనేత్ర విందుము, యపత్యము మేలని (ఆది. ౫ ఆ. ౯౦). క.........మీ మహాగుణకులు ని। త్యము విందు నారద... ......(ఆది. ౭ ఆ. ౫౬). మధ్యాక్షరము.........। ఆతత తేజోధికుండు నా విందును. (ఆర. ౨ ఆ. ౩౨౦). ఆ-వె.........ఆరెంటిఁ జే। కొందురయ్య యొట్టి కుమతులైన (ఆది. ౩ ఆ. ౧౯౩). క. మంటి హారు దేహ మంటం। గంటి సుమాధిశు ససురకంటకు హారు ము। కృంటిఁ గఱకంటుఁ జూడం। గంటిఁ గృతార్థుండ నైతిఁ గడుఁ బుణ్యమునన్ (ఆర. ౧ ఆ. ౩౩౪).

తిక్కయజ్వ పయి నన్నయాథర్వణ సమ్మతరూపముల తుల్యన్యాయమున రువర్ణకేతరవర్ణక పరకత్వమందును 'దు' వర్ణక 'ద'కారమునకు డాదేశమును వికల్పముగాఁ బ్రయోగించెను. అట్లె 'ఉందు' ధాతువునందును "దు"వర్ణక పరకత్వమునఁ బాక్షిక 'దు'వర్ణలోపమును (టవర్ణక పరకత్వమునందువలెనె చూ ౩౧౯ విష). నట్టియెడల నిల్చు నెఱసున్నమీఁది 'దు'వర్ణక దకారమునకుఁ బాక్షిక డాదేశమును సోమయాజి ప్రయోగించెను. మఱియు నన్నయ ప్రయోగించినరీతినే యీసందర్భములోని నువర్ణాంతధాతులందలి నెఱసున్నమీఁది 'తి'వర్ణక తకారమునకు 'ట'త్వమును దిక్కనాదులును నిత్యముగానే ప్రయోగించిరి.

భట్టారకుఁ డెచ్చటను "ఉందు" ధాతు 'దు'వర్ణమును "దు - తి" వర్ణక పరకత్వమునఁ లోపింపఁజేసి యెంతమాత్రమును బ్రయోగింపలేదు. "ఉందుదును - ఉండితిని" అనురీతినే ప్రయోగించుచువచ్చెను. అట్లె రువర్ణకేతర పరకత్వమున 'దు'వర్ణకమునకు డత్వమును సైతము నన్నయ ప్రయోగింపలేదు. ఆ 'కొందును' మున్నగువానికిఁ బర్యాయముగ 'ఆకొందును' అనురీతి ప్రయోగము నన్నయ భారతభాగమున మచ్చునకేని లేదు.

ప్రయోగములు:—ఉ. ఎండకు వాన కోర్చి తనయిల్లు ప్రవాసపుఁజోటు నాక యాఁ। కొండ్రు నలంగితి న్నిదురకుం దఱి దప్పె.....అనక.........(విరా. ౧

ఆ. ౧౩౫). (ఆఁకలి+కొండున్ = ఆఁ కొండున్). గిడుగువారు సంస్కరించిన యప్పకవీయ ముద్రణమున నీపద్యము "థ = ధ. ద = ధ" యున్నగువానివంటి వర్గప్రాస సందర్భమున "ఆఁ కొంటి నలంగితిన్" అను పాఠముతో నుదాహరించుట యవిమృశ్యసమాలోకము. తాళపత్ర మాతృకలలో నిట 'ఆఁ । కొందు' అని ప్రాసభంగముతో లేఖక ప్రమాదమునఁ బడియున్నది. క. గాండీవధన్వ నాహవ । పాండిత్యముఁ దలఁప నతని భండనమున మా । ర్కొండునని యొకఁడు గడఁగుట । గొండం గని తగరు దాఁకఁ గోరుట గాదే (ఉద్యో. ౧ ఆ. ౨౩౭). క. దండము గాషాయంబును । ముండితయుఁ గమండలువును మోతుమొనఁగ వె । ట్లుండేని లింగములకు న । ఖండజ్ఞాన ప్రదత్వకలనము గలదే (శాంతి. ౬ ఆ. ౧౭౮). తే-గీ. విండు నారాయణ పరాయణుండు పాత । కములు గెలిచి వెలుంగుచుకాదు తన్ను । నాశ్ర యించినవారికి సతులమైన । వెలుఁగు నొసఁగంగఁ జాలుట వేధచేఁత. (అను. ౪ ఆ. ౩౭౪ ప). ('వేధచేఁత' అనుచో 'వేదచరిత' అని తాళపత్రమాతృకలు). క. కృతా । ర్థుండనయి పెంపుతేజముఁ । గండును (సౌప్తి. ౧ ఆ. ౫౮). సీ.........ఆ-వె... ......స్వదేశవర్తులమై చూచి । కొండ మెల్లపనియు ండుదు వేగ (మౌస. ౧ ఆ. ౧౭౩). చ. అనుటయుఁ గ్రీడి యిట్టులను నాద్రుపదాత్మజు జన్మ మాపగా । తన యవథార్థ మం ద్రదియుఁ దప్ప దతండును వాని నేయఁడేను నతని నేయుచుందమున నూల్కొని యన్యుల నేయుచుందు, వాఁడనితర వధ్యకాయుఁడగు నాయనఁ దాఁ బడనేయు నుగ్రతన్ (భీష్మ. ౩ ఆ. ౩౧౧ ప). (నేను ఏయుచుందున్ = ఏయుచుందుదును.) ఇచట - ఏను = అర్జునుఁడు. వాఁడు = శిఖండి. ఆయన = భీష్ముఁడు. వావిళ్ళ వారి ముద్రణమున 'ఏయుచుందు' అనియె యున్నది. ఇట 'ఏయుచుందువాఁడన్' అనుపాఠము నంగీకరించినచో భీష్ముఁ డితర వధ్యకాయుఁ డనవలసివచ్చును. 'ఏయుచుందున్' అను పాఠము తాళపత్ర మాతృకాగతమగుటచే నది గ్రాహ్యమని బాలకవిశరణ్య కర్తగారి యాశయము (బాలక. ౭౫ పు. టిప్పణము). ఆపక్షము నందును "ఉందును" అను రూపమునుండియేకదా 'ఉందును' (నేను) అనుదాని డత్వమును సాధించికొనవలయును. సీ.........। ఉందురు విదుర యుయుత్సు సంజయులు (ఆశ్ర. ౧ ఆ. ౩ ప). (ఉందు రన్నను క్షతిలేదు). (విస్తర.)

విస్తర. ౩౨౮ విప:—ఇట్టియెడలనెల్ల "ఉందు" దులోపముగల్గిన 'ఉందును' మున్నగురూపముల నంగీకరించినపిమ్మటనేకదా యందలి సున్నమీఁది 'ద'వర్ణమునకు డత్వము గల్గునని చెప్పవలయును. అందును - విండును మున్నగుచోటులలో "నా త్పరస్య భవే ద్దస్య । డాదేశో వా 'రు'వర్ణకే' అనుదాని సమానన్యాయముననే

కదా సున్నమీఁది 'దా'కు 'డా'వచ్చి నవవలయును. 'ఉంమురు' మున్నగు పర్యాయ రూపముల స్థితియుఁ బయిప్రక్రియకు మూలమనఁదగును. సోమయాజి 'ఉంమురు - ఉండురు' అను ద్వివిధరూపములను వాడినప్రయోగములు కల్పతరువుఁ జూపఁ బడెను. రంగనాథరామాయణమున నట్టివి ప్రాసస్థలమునఁ గలవు. ద్విపద. ఉండురే యందఱకై యుగ్రభావమున । సందేహ మేటికి సౌమిత్రి యిటకు । (రంగనా. కిష్కిం. ౩౫౪ పు. యూ. ము). అందుపై గంధర్వులచ్చరల్ సురలు । నుందు రాచోటుల నోడక వెదకి (రంగనా. కిష్కిం. ౩౫౯ పు. యూ. ము). ప్రాసేతరములగు పెక్కు చోటులందు రంగనాథరామాయణమున 'ఉంమురు' అనునది చూపట్టుచున్నది. ఇట్టిస్థితిలో బాలకవి శరణ్యకర్తగారీక్రిందిరీతి వ్రాయుట (ఎవరుచూతురని ?) మిక్కిలి సాహసము. "వీటిలో విశేష మేమి టంటే-నన్నయకాలము మొదలుకొని మూడు నాలుగువందల సంవత్సరములవరకు 'ఉందును - ఉందుము - ఉందువు - ఉందురు' అనేరూపములు కవు లెవరూ వాడలేదు........." (బాలక. ౨౫ పుట). ప్రాచీనగ్రంథముల ముద్రణములలో 'ఉందును'అనురూప మెచ్చటనైనఁ బడియుండి నచో నది సరికాదనియు నచట 'నేను ఉండును' అనురీతినే సరియగుపాఠమని యెన్నఁ దగుననియు నీక్రిందిరీతిని నొక్కి వక్కాణించినారు. "అచ్చుపుస్తకములలో తప్పి దారి ఎక్కడనయినా క్రొత్తరూపము కనబడితే తాటాకుపుస్తకాలలో ఆపాఠము అట్లా ఉండదనే మాకు నమ్మకము. మేము లెస్సగా పరిశీలించి మరీ చెప్పుతున్నాము" దీని టిప్పణము:—"అచ్చుభారతము భీష్మ III ౩౧౧ లో 'ఏయుచుందు వ్రాత ప్రతిలో 'ఏయుచుండు' శాంతి. V ౧౪౧ లో 'ఉందు' వ్రాతప్రతిలో 'ఉండు' ఇట్లె తక్కినచోట్ల" (బాలక. ౨౫ పుట).

బాలకవి శరణ్యకర్తగారు స్థలాంతరమున 'ఉను' ధాతువు నంగీకరించి యీ క్రిందిరీతిని వ్రాసిరి. "నన్నయతిక్కనలు అక్కడక్కడ 'ఉన్నె' అనేరూపము వాడి నారు. ఏమిరూపము ఇది ? ప్రశ్నార్థకమైన ఏకారము తీసివేస్తే 'ఉన్ను' నిలుచును. ఇది 'ఉనును' యొక్క వికారము. తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనము. ధాతువు 'ఉను' కావలెను. విను - తిను వంటిది. ఉనుదును - ఉనుదుము. ఉనుదువు - ఉనుదురు. ఉనును - ఉనుమురు - తద్ధర్మ, ఉనితిని - ఉనితిమి, ఉనితివి - ఉనితిరి, ఉనెను (?) ఉనిరి (?) భూత, ఉనుచు - ప్రేరణ - ఉనికి (కృదం)" (బాలక. ౨౪-౨౫ పు). ఇట్లు 'ఉను' ధాతువునే అంగీకరించునపుడు "ఉనుదురు = ఉందురు" అను రూపములు "నా త్పరస్య భవేద్దస్య । డాదేశో వ్యార వర్ణకే" అను ప్రకృతాథర్వణ కారికచొప్పున పాక్షికముగు 'ఉందురు' అనురూప మథర్వణసమ్మతమే యనకతీరదే! 'ఉందురు' ప్రాచీనరూపము కాదని వీరెట్లు చెప్పనగును ?

సీ.........తమ్ములందఱు, సుఖ ముందురే నీదు సఖులు సుఖులె (ఆశ్ర. ౨ ఆ. ౪౭). ఇట 'సుఖరుందురే' అని కాని 'సుఖముందురే' అని కాని పఠింపనగును. నన్నయ యిట్టి 'ఉండు' ధాతు 'డు' లోపము నెచ్చటను బ్రయోగింపఁడు. ఉండు ధాతుభావార్థకరూపమును 'ఉంట' అను 'డు' లోపముతోఁ బ్రాసస్థలమున సోమ యాజి ప్రయోగించెనేకాని నన్నయ యెచ్చటను బ్రయోగింపలేదు. (30౯ విష. చూ). క. హరియును గిరీటియును.........చలుపుచుండుదు రంద। య్యిరువురు నేకాత్ములు.........(సభా. ౨ ఆ. ౧౧౨ ప). తే.గీ.........। త్రిదశులకు బాధ సేయుచుండుదురు వారు।.........(అర, ౪ ఆ. ౫౫ నన్నయదె) (ప్రాస యతిగతము). క. నాయొద్ద నుండుదేని మ। దీయ రథాశ్వములకు.........(అర. ౨ ఆ. ౧౩౧ ప). ఇట్లు "ఉంటిని" మున్నగురూపములను నన్నయప్రయోగింపఁడు. 'ఉండితినిన్' అనురీతినే ప్రయోగించును. క. మీ రిందుల కందఱుఁ జను। దేరఁ గ నే నంద యుండితిని సభఁ జూడన్।.........(సభా. ౨ ఆ. ౧3౯). క. కడుఁ బెద్దకాల ముండితి। మొండఁబడి.........(ఆది. ౭ ఆ. ౨౯). తిక్కనాదు లిట్టియెడల 'ఉంటిని - ఉండితిని' అనురీతిని ద్వివిధముగాను బ్రయోగింతురని నేఁటి పెక్కు పండితుల యాశయము. సీ.........తే-గీ. ఆడ కుండితి భీష్ముండు నస్త్రగురుఁడు ......(ఆశ్ర. ౧ ఆ. ౨౧), తే-గీ.........శోక। వనధిఁ దేలుచు నుంటి వివ్వనటఁ గంటి।......(ఆశ్ర. ౧ ఆ. 3౧ తాళపత్ర మాతృక) తేలుచునుండితివ్వనట(వావిళ్ల వారిప్రతి). సీ. నీవరయంగ సుఖావాప్తిఁ గొఱఁత లేకుంటినిఁ జనవును.........(ఆశ్ర. ౧ ఆ. ౨౫. తాటాకుప్రతి) 'లేకుండితి' వావిళ్ళవారి ముద్రణము. 'ఉంటిని' అనుదాని 'టి'వర్ణము ప్రాసస్థానగత మయియున్న ప్రయోగము తిక్కనభారతభాగ మందును గన్పట్టలేదు.నువర్ణాంత ధాతువులందుమాత్రమె యట్టివానిని సోమయాజి ప్రాసస్థలములందుఁ బ్రయోగించెను. కం. వింటే......। కంటే......। అంటం గట్ట దగునే (అను. ౧ ఆ. ౨౮). ఉ......ఈ। వంటలవానిచేసిన యవార్యపరా క్రమ మొందుచోటులం। గంటిమె వింటిమే .....(విరా. 3 ఆ. ౨౨౯).క. మంటల .........అ। కొంటిం గంటే.........(ఉ. హరి. 3 ఆ. ౧3౨). ఉండుధాతు 'డు'లోపము చేయని రూపమును దిక్కయజ్వ ప్రాసమునఁ బ్రయోగించెను. క. ఒండొరులకు రక్షకులై। యుండుదు రట్లుండ.........(శాంతి. ౨ ఆ. ౨౦౦). క. అని మునిపతి.........ఆతని। వినితిమి యిఁక నొకటి వినఁగ వేడుక యనుచున్. (నిర్వ. ౭ ఆ. ౯౭ ప). ఉ. ఉండితిరే సహింపఁ గని యున్న విధంబున నుండ కిప్పుడీ। కొండుకవాని నమ్మి.........(నన్ని. ౧౦ ఆ. ౫౨౮). గీ.........అతనిఁ। జంపి

కా కే నయోధ్యకుఁ జనితినేని । (భాస్క. యుద్ధ. ౯౭౭ ప). ద్విపద. వండినఁ దిన నెట్టివారైన శిశువు । లుండంగఁ దార కై కొందురే యిట్లు (బసవ. ౪ ఆ. ౪౯౭)· దీర్ఘపూర్వక నువర్ణాంత ధాతువులకును 'చను' మున్నగు ధాతువులకును 'ను' స్థానమున బిందువుగాని 'ను-తి' వర్ణకములకు 'దు-టి' అను నాదేశములుగాని రానేరవు· చనితిని - ఆనితిని - పూనితిని - మానితిని. చనుదును - చనుదుము - పూనుదును - పూనుదుము మొ.

బాలవ్యాకరణ వివరణము. ౩౨౪ I విషయము

తి - దు - టలు పరంబులగునపు డన్వాదుల 'ను' స్థానంబున సున్నయు నుండు దు లోపంబును విభాష నగు. ౫౮.

అందురు - అంట, ఉందురు - ఉంట, పక్షంబున అనుదురు - అనుట, ఉండుదురు - ఉండుట - ఇత్యాది.

సంజీవని. ౩౨౪ I విష:—'అను - కను - కొను - తిను - మను - విను' ఇవి యన్వాదులని సూరి బా. క్రియా. ౫౫ సూత్రపు వివరణమున వ్రాసియున్నాఁడు. బా. క్రి. ౧౭ సూత్రముచే విధింపఁబడిన 'తి'వర్ణకమును, బా. క్రి. ౨౨ సూత్రమున విధింపఁబడిన 'దు'వర్ణకమును, బా. క్రి. ౩౫ సూత్రమున విధింపఁబడిన 'ట'వర్ణకమును బరం బగునపుడు 'అను' మొదలగు ధాతువులతుది 'ను'వర్ణముచోటఁ బూర్ణబిందువు నిల్చును. అట్లె 'ఉండు' ధాతు 'దు' వర్ణము లోపించును. పై వాని లోని 'దు'వర్ణకమె, బా. క్రి. ౩౦ సూత్రముచొప్పున 'ద' వర్ణకముగఁ బరిణమించును గాన నయ్యది పరము గునపుడును పై కార్యములు గల్గునని యెఱుంగునది. అన్వాదిగణము పరిగణ ముకుటంబేసి 'చను - పూను' మున్నగు ధాతువులందుఁ బయి కార్యములు జరుగునా యని సందేహింప నక్కఱలేదు. కల్పతరువున నుదాహరించిన ప్రయోగములచొప్పున నేతత్సూత్రత్రయీ (౫౭-౫౯-౬౨ సూ). సాధిత రూపములన్నియుఁ బ్రాచీనములే యని గ్రహింపవలయును.

'అను+దు+రు' అనుచోఁ బ్రకృతసూత్రముచే దువర్ణక పరకత్వమునఁ బూర్ణానుస్వారము నిల్వఁగా 'అందురు' అనురూపము సిద్ధించుచున్నది. ఇట్లె 'అను+ట' అనుచో భావార్థక 'ట'వర్ణక పరకత్వమున ధాతువుతుది నువర్ణకము చోట నెఱసున్న నిల్వఁగా 'అంట' అనురూపము లభించుచున్నది. ఇట్లె 'దు - ట' వర్ణకములు పరము గునపుడు 'ఉండు' ధాతువునకు 'దు' వర్ణలోపము కల్గఁగా "ఉందురు, ఉంట" అను రూపము లేర్పడును. ఇట్లె తక్కిన 'అందును - అందుము - ఉందును - ఉందుము' మున్నగురూపములను సాధించుకొననగును. ఈసూత్ర

ముచే వచ్చు నెఱసున్న వైభాషికము గాన నయ్యది రానిపక్షమున 'అనుదురు - అనుట - ఉండుదురు - ఉండుట' మున్నగురూపములు నిల్చును. 'తి'వర్ణకము పరమగునపుడు కార్యవిశేషము నుత్తరసూత్రమున విధింపవలసియుండుటంజేసి యిట నుదాహరింపలేదు.

ఇట బిందువుమీఁది త ద ల కు నిత్య వైకల్పికంబు

బాలవ్యా. లయి ట డ లగు. ౫౯.

౩౨౮ II విషయము. అంటివి - అనితివి, అండురు - అందురు, ఉంటివి - ఉండితివి, ఉండురు - ఉందురు.

సంజీవని. ౩౨౮ II వివ:—ఇట = పూర్వసూత్రముచేత సిద్ధించిన, బిందువు మీఁది = పూర్ణబిందువునకుఁ బరముగా నిల్చిన, త - దలకు = తకార దకారములకు, నిత్య వైకల్పికంబులయి = వరుసగా నొకట నిత్యముగను, నొకట వైకల్పికముగను, 'ట - డ' లగున్ = 'టకార, డకారము' లగును. నెఱసున్నమీఁది తకారమునకు 'ట'కారము నిత్యముగా నగుననియు నట్టి నెఱసున్నమీఁది దకారమునకు వైకల్పికముగా డకారమగుననియుఁ దాత్పర్యము. డకారాదేశము పాక్షికము గాన డత్వాభావపక్షమందలి యథాస్థిత దకారమునకుఁ బూర్వసూత్రమున నుదాహృతు లీయఁబడెను. ప్రకృతసూత్రములోని "ఇట" అను శబ్దపు స్వారస్యముచేఁ బూర్వసూత్రముచే విధింపఁబడిన నెఱసున్నమీఁదమాత్రమె యిట్టి 'ట - డ' ల యాదేశము కల్గు ననునర్థము నెచ్చునది. కావున "పంతము, అందము" మున్నగు చోటులం దిట్టి 'ట - డ' ల యాదేశము కల్గనేరదని గ్రహింపవలెను. "బిందువు పోకున నీమార్పు జరుగుట సహజమనుట సరళాదేశాది ద్రుతకార్య ప్రక్రియంబట్టి విశదంబు" (బా. సా. పే. ౮౩౩ పుట). ఈ పేటిక వ్రాఁత సరికాదు. ఇచటి 'ట-డ'ల యాదేశము సరళాదేశమువంటిది కాదు. పరుషమగు (బిందుపూర్వక) తకారము చోట (బిందుపూర్వక) పరుష టకారమే నిల్చుచున్నది. అట్లె సరళమగు దకారము చోట సరళమే యగు డకారము నిల్చుచున్నది. మఱియు "పంతము - అందము" మున్నగుచోట్ల సున్నపోకున నిట్టి యాదేశము రానేరదు గాన నిది కేవలము సహజము కానేరదు. ఉదా:—'అను+తి+వి' = అనుచోఁ బూర్వసూత్రముచొప్పున 'ను' వర్ణముచోట నెఱసున్న నిల్వఁగా 'అంతివి' అను రూప మేర్పడును. అందలి సున్న మీఁది తకారరూపహలంశమునకు టకారాదేశము రాఁగా "అం+త్+ఇ+వి=అం+ట్+ఇ+వి=అంటివి" అను రూపమేర్పడెను. సూత్రములోని త ద ల కనఁగా 'తకార దకారము' లనెడి హలంశములకు 'ట - డ' లగు ననఁగా "టకార-డకారము" లనెడి

హలంతమము లాదేశము లగునని తాత్పర్యము. "త ద లు - ట డ లు" అను స్థలముల లోని 'అ'కార ముచ్చారణార్థకమని యెఱుంగనగును. పూర్వసూత్రముచొప్పున నెఱసున్న వచ్చుట వైభాషిక మగుటంజేసి సున్నరానిపక్షమునఁ బ్రకృతసూత్రము నకుఁ బ్రసక్తియే యుండదు గాన 'అనితిపి' అనురూపమే యథాస్థితముగా నిల్చి పోవునని భావము. పాక్షికముగు నెఱసున్న వచ్చినపిమ్మట 'ట'కారాదేశము నిత్యము గాన 'అఁటిని' అను రూపముమాత్రము సిద్ధించును. డకారాదేశము వైభా షికముగాన 'అందురు. అండురు' అను రూపద్వయము లభించును. నెఱసున్నయే రానిపక్షమున రెంటను యథాస్థితముగా 'అనితిని - అనుదురు' అను రూపములె నిల్చిపోవును.

రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది త - ద - డ -
బాలవ్యా ల యుత్వంబునకు లోపంబు విభాషనగు. ౬౨.
3౨౮ III విష పోషింత్రు - పోషింతురు, కొంద్రు - కొందురు -
కొండ్రు - కొండురు.

సంజీవని. 3౨౮ III విష:— ప్రథమ మధ్యమ పురుష బహువచన 'రు' ప్రత్య యంబు పరంబగునపుడు పూర్వస్థితములగు 'తు - దు - డు' అనువానిమీఁది 'ఉ' కారము వైకల్పికముగా లోపించునని సూత్రార్థము. త - ద - డల యుత్వ మనఁగా తకార దకార డకారములమీఁద నున్న 'ఉ'కారం బని యర్థము. ఈ బాలవ్యాకరణసూత్రము 'అన్యేషాంచ ప్రయోగ మహితానామ్' అను చింతా మణిసూత్రమునకు వివరణము. ౨౧౦ X విష యమున వ్రాయఁబడెను. ప్రయోగ ములును జూపఁబడెను. సీ.........తే-గీ. కొండ్రు భూపతి లేకున్న మంద్రె జనము। లధిప (శాంతి. ౨ ఆ. ౨౫౫). ఇందు 'కొంద్రు - మంద్రు' అని ఠరించినను క్షతిలేదు. ఆ-వె. తగిలి జరయు రుజయు దైవవశంబున। నయ్యెనేని వాని ననుభవింత్రు। గాక......(ఆది. 3 ఆ. ౧౯౩). గీ. "ఉందు రందురు కందురు కొందు రనఁగ। మందు రెంతురు తగ భుజియింతు రనఁగఁ। దగు క్రియలమీఁది రేఫలు దాఁపలిదెస। యక్కరముతోడ శ్లిష్టమై యలరు నథవ. (౧3౦). ఉందురు:— గీ. మమ్ము రక్షించి తని యేల మాటి మాటి। కభినుతింపంగ దక్షవాటాధినాథ। తల్లిదండ్రులు రక్షింపఁ దలఁప కుండ్రె। (విస్తర). ప్రజల భీమేశ బహువిధోప

---

విస్తర. 3౨౮ III విష:— ఇందు "తలఁపకుండ్రి" అని ముద్రణ ప్రమాద మున సర్వలక్షణసార సంగ్రహమునఁ బడియున్నది. దానినిజూచియే కాఁబోలును నధునాతన లాక్షణికులెల్ల "ఉండ్రి" అని శ్రీనాథుఁడు ప్రయోగించెనని వ్రాయ

ద్రవములు । (౧౩౧). (భీమఖండము). అందురు:—సీ. వట మంద్రు గొందఱు వట మేని యూడలు...(౧౩౨) (కవికర్ణరసాయనము). అనుభవింతురు:— ఆ-వె. తగిలి ......అనుభవింత్రు । .........(౧౩౩) (ఆదిపర్వము). తే-గీ. బలయుగలవానిఁ బలువురు బలవిహీను । లొక్కటై కూడి నిర్జింప నుత్సహింత్రు । మధువుఁ గొన నుత్సహించిన మనుజుఁబట్టి । కుట్టి నిర్జించు మధుకరకులము నట్లు (౧౩౪) (అరణ్యపర్వము)." (సర్వల. ౧ ఆ. ౨౯ పుట). బా. ప్రకీ. ౧౭-౧౮ సూత్రములు విభక్తిప్రత్యయ పరకత్వమునందలి స్వరలోపమును విధించునవి కావుంజేసి (౨౧౦ X) సూరి యీట నీసూత్రము నుపదేశించినవాఁడయ్యెను.

| | |
|---|---|
| | ముజ్జు పరంబగు నపుడు కో శబ్దంబు కొనునకు బహు |
| బాలవ్యాకరణ | ళంబుగా నగు. ౬౦. |
| వివృతి | బహుళం బనుటచేత దీనికి నొకానొకచో నతిచారం |
| 3౨౪ విషయము | బని యెఱుంగునది. |

సాగిరి. తిమ్మకవి యీపద్యమును 'ఉందురు = ఉంకురు' అనుగాని నుదాహరించుచున్నానని వ్రాసినవ్రాతను సైతము పాటింపరైరి సాధారణముగాఁ బూర్వపూర్వు లుదాహరించిన ప్రయోగములను స్వీకరించుచుఁ దలకిందులుపెట్టి లక్షణగ్రంథములను వ్రాయుట యలవాటగుటచే నిట్టి ప్రమాదములు ప్రబలుచున్నవి. 'ఉండ్రియనుటకుఁ తల్లిదండ్రులు రక్షింపఁదలఁచకుండ్రి. భీమ." (ఆం. భా. అ. ౧౦౦ సూ. వివృతి. ౨౬౫ పు. తృ. ము). "పఱియచ్చో యెడఁ బ్రయోగ । విధమెఱుఁగఁదగున్" "(అన్యేషాంచ ప్రయోగమహితానామ్) అనుటచే (ఇకారమునకును లోపము గల్గును. మమ్ము రక్షింతు వని యేల మాటిమాటి । కభినుతింపఁగ దక్షవాటాధినాథ । తల్లిదండ్రుల రక్షింపఁ దలంచకుండ్రి. అను నీ భీమఖండ ప్రయోగము నిర్దుష్టము." (నారా. గాణ. ౩౯౮ కారి, ౬౫ పద్య. క్రియా. ౩౪౭ పుట). ఈగాణపత వివరణకర్త 'తల్లిదండ్రుల' అనిదిద్ది యవధారణార్థక శబ్దమును జొనిపి యచటి గ్రంథకృద్వివక్షితార్థము నడఁగింప యత్నించెను. "ఈశ్వరుఁడా నీవు రక్షించుచున్నావని మాటిమాటికి శ్లాఘింపనేల ? తల్లిదండ్రులు బిడ్డల రక్షింపకుందురా. ఈశుఁడు తండ్రివలె రక్షించునని భావము." అనునది గ్రంథకృద్వివక్షితార్థము. "నీవు రక్షింతు వని తలఁచి తల్లిదండ్రులె రక్షింపకుండిరి" అను నపార్థము నీతఁడు బలపఱిచెను. బా. గు. ప్ర. వ్యాఖ్యలో ప్రథమ ద్వితీయ ముద్రణములు రెంటను "ఉండ్రి" అనియే పడియున్నది. కాని పైవారివలె నీతఁడు బయలుపడలేదు.

ముజ్ఝు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును
మువర్ణకంబునకు మాముడియు నగు. ౬౧.
కొమ్ము - కొనుము, కొండు - కొనుఁడు.

సంజీవని. ౩౨౪ విష:—౩౨౨ విషయమునఁ జూపఁబడిన భాషేయ మమితా తత్రే త్యాద్యథర్వణకారికలను వివరించుచు సూరి బాలవ్యాకరణమున ననేకము లగు నాచ్ఛిక క్రియారూపవిశేషములను వివరించెను. అట్టివానిలో నిది యొక విషయము. 'ము - డుజ్' అనెడి ప్రార్థనాద్యర్థక మధ్యమపురుష ప్రత్యయముల ప్రత్యాహారమె 'ముజ్' అనునది యని చెప్పిన జాలును. అట్లయినను సూరి యట్టి విషయమునె బా. క్రి. ౩౧ సూత్రమున "మధ్యరు ము డుజ్ఝులు ముజ్ఝునాఁబడు" అని స్పష్టార్థముగా వచించెను. అట్టి ముజ్ఝు పరంబగునపుడు 'కొను' ధాతువునకు 'కో'అను నాదేశంబు బహుళంబుగా నగునని సూత్రార్థము. బహుళ మనుటచేత 'కో'అను నాదేశమున కతిచారంబును గలదని సూరియె వివరించెను. అతిచార మనఁగా నతివ్యాప్తియని యర్థము. (వి సర). "అలక్ష్యే లక్షణ ప్రవృత్తి రతి వ్యాప్తిః" అని యతివ్యాప్తిశబ్దమున కర్థము. అనఁగా ముజ్ఝు పరమగునపుడే కాక తదితరములగు వ్యతిరేకార్థకాద ప్రత్యయములు పరమగునపుడును 'కో' అను నాదేశము క్వాచిత్కముగాఁ గల్గునని యభిప్రాయము. ఉదా:—కొను+ము = కొనుము. ఇటఁ బ్రకృతసూత్రముచొప్పున 'కో+ము' అని యేర్పడఁగా 'ము'వర్ణకమునకు మాముడియు 'కో' అనుదానికి హ్రస్వమును నుత్తరసూత్రముచొప్పునఁ గల్గఁగా "కొమ్ము" అను పాక్షికరూపము సిద్ధించును. ఇట్లె 'కొను+డుజ్.=కొనుఁడు' అనుచోట పాక్షికము 'కో+డుజ్'అని ప్రకృతసూత్రముచొప్పున నేర్పడఁగా నుత్తర సూత్రముచొప్పున 'కో' అనుదానికి హ్రస్వము కల్గఁగా 'కొ+డుజ్'అని యేర్పడును. జిత్తు బిందుపూర్వంబగు నను (బా. తత్స. ౧౯ సూ). చొప్పున బిందువు రాఁగా 'కొండు' అనురూపము సిద్ధించును. బా. సంధి. ౨౨ సూత్రముచొప్పున నుడితొలి హ్రస్వమునిఁదిది గాన 'కొఁడు' అను సార్థబిందుకరూపము కల్గనేరదు. ఇట్లె యాత్మనేపదార్థకస్థలములందును, శబ్దపల్లవస్థలములందును "చదివికొనుము =

---

విస్తర. ౩౨౪ విష:—జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధమగు కుజాదిగ్రహ పంచకము నకుఁ గల్గు శీఘ్రగమన మర్థమని బా. గు. ప్ర. వ్యాఖ్యలో (బా. గు. ప్ర. ౩౪౩ పు. ద్వి. ము.) విస్తరింపఁబడెను. కాని యట్టియర్థ మిచటఁ బొసఁగియుండలేదు. "అతిచారః. పుం - అతిశయేన చారః - అతిక్రమ్య వా చారః - అతిశయితగమనే జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధే కుజాది గ్రహపఞ్చకస్య.........(శబ్దస్తో).

చదివికొమ్ము - చదివికొనుఁడు = చదివికొండు, కైకొనుము = కైకొమ్ము - కైకొనుఁడు = కైకొండు" మున్నగురూపములు నేర్పడును. "కొ" అనునాదేశమున కతిచారము గల్గునపుడు - చదివికోఁగలఁడు - (చదివికొనఁగలఁడు) చదివికోఁడు (చదివికొనఁడు) - చదివికోన్ (చదివికొనన్) మున్నగురూపములు మహాకవి ప్రయోగానుసారముగ గ్రాహ్యములగును. కవిత్రయము వారిభారతమునం దెచ్చటను నీ "కొ" అనునాదేశపు రూపములు చూపట్టలేవు. "మ తుదిరాజ్యంబు సగంబు గొన్నడవియందుం జేరువంచించియున్.........(ఉద్యో. 3 ఆ. ౯౭)" అను పద్యమున ముద్రితపుస్తకములలో "తుదిరాజ్యమ్ము సగమ్ము గొమ్మడవియందున్" అనుపాఠమె కన్పట్టుచున్నది. పొమ్ము - రమ్ము మున్నగువాని సామ్యమునను శబ్దాలంకారోత్సుకత్వమునను నిట్టి పాఠమేర్పడెనని విశ్వసింపనగును. 'కొ' అనునాదేశమును ముజ్జుపరముగునపుడు సైతము భారతకవులు ప్రయోగించిరని విశ్వసింపఁదగిన ప్రాసాదిస్థలగత ప్రయోగ మొక్కటేని లభింపలేదు. నన్నయాథర్వణీయమున నట్టి విధానమును లేదు. భారతేతరకవుల కావ్యములలో మాత్రమె యట్టిప్రయోగములు చూపట్టుచున్నవి. నారాయణీయాంధ్రవ్యాకరణమునఁ గవిజనాంజనములోనిదనుచు నీక్రిందికారిక యాంధ్రీకరింపఁబడినది. '3౯౨.గృష్ణాతౌ విక్రుతౌ యత్ర । ప్రతిషేధవిశేషణే । లుజ్నకారస్య కో దీర్ఘ స్తత్రోక్తం పూర్వసూరిభిః. = క. కొనుక్రియ వ్యతిరేక విశే । షణమగు నెడఁ దొంటిబుధులు సాధ్వీమణి, చాఁ । పును బొసరించి కొకారం । బునకున్, దుదిలిపికి లోపముం బొసరింతుర్ (నారా. క్రియా. ౫౭ ప). బాలవ్యాకరణ ప్రసిద్ధముగు 'ముత్తు'నందెల్లనీకార్య మర్వాచీన కవులగ్రంథములలోఁ గన్పట్టుచున్నది. భారతమునం దెచ్చటనులేదు. ఇట్టిస్థితిలో నథర్వణునివంటివాఁడు ముజ్ పరకత్వమందైన విధింపక వ్యతిరేక విశేషణస్థలమందుమాత్రము విధించునని విశ్వసింపఁదగి యుండలేదు గాన నీకారిక ప్రక్షిప్తమనుటలో సందియము లేదు. "కొనుధాతువునకును, ౫౨చే నాత్మనే పదార్థమున నైన 'కొను' అనుదానికిని 'కొ'అనునది బహుళముగా నాదేశమగునని సూత్రార్థము" (బా. సా. పే. ౪౩౪ పుట). ఇట్లనుటచేత, కైకొమ్ము - చేకొమ్ము - కైకొండు - చేకొండు - మున్నగుచోట్ల రాదను నపార్థము గల్గదా ? సూరి 'కొను, నకు' అని చెప్పియుండఁగా నిట్టివ్యాఖ్య యర్హమగునా ? "కాని యీయతిచారము మాత్ర మనుప్రయుక్తమగు కొనునకేగాని సహజమగు కొనుధాతువునకుఁ గాదని గ్రహించునది" (బా. సా. పే. ౪౩౪ పు). ఇది సరికాదని విశదమగునట్లు గాణపతవివరణమున నీక్రిందిరీతి నున్నది "ఇది వ్యస్తముగను బ్రయో

గింపఁబడినది. 'కాముం జీరికిఁ గోక క్రోధము నహంకారంబు' (హరవిలా. ౪ ఆ. ౩౭) 'జవ్వనం బిచ్చి ముదిమి కోఁ జాల మనుచు' (విష్ణు. ౬ ఆ. ౧౭౭ ప)." (గాణ. క్రియా. ౩౯౨ కారి ౫౮ ప. వివరణము). ఉ. కొండని వేడ్కతోఁ బసిఁడికొండ ధనార్థులకెల్లఁ బంచి యీ । కుండుట (నైష. ౧ ఆ. ౫౧. సూ. రా. ని. 'కొను' శబ్దమునొద్ద. ౫౦౫ పు). తే గీ. మనసు ముచ్చిలి పొచ్చెవ మత్తకాఁడు । వీఁడు గొమ్మని చేసాచి వెలఁది యపుడు । (ఉ. హరి. ౫ ఆ. ౧౪౯ ప). దీనినిబట్టి-మువర్ణక లోపమునఁ గలిగిన "అదిగొ - అదిగో మున్నగు కళాపూర్ణోదయాది ప్రయోగ ములును (౭౧౫ II విష. చూ) 'కో' ఆదేశమునకుఁ బ్రమాణములె యగు చున్నవి. (౧౦౯ విష. చూ). ఇంకను బ్రయోగములు:—ద్విపద. కర్మంబు త్రాళ్ళ దాఁ గట్టుకోఁ దగునె (బసవ. ౧ ఆ. ౪౩౫). ద్వి. అదిగొ మ్మనుచుఁ జల్లి నందందు నెగయుఁ । సదమలోదక కణజాల మంతయును (బసవ. ౪ ఆ. ౭౪౦). ద్వి. కిప్పుకో రాజ్యంబు తప్పేమి యనుఁడు (బసవ. ౫ ఆ. ౮౦ ప). ద్వి. అదిగో మహారాజ యంతటఁ బోక (బసవ. ౭ ఆ. ౧౮).ద్వి.నీవ కో విషములు దేవున కిచ్చి। చావకున్నను దత్ప్రసాదంబు మీఱ । చేకొండు (బసవ. ౭ ఆ. ౫౯౭). "గీ. వాని మార్పునఁ జేకొని మానవతియు । (శృం. నైష. ౧ ఆ. ౬౭). మ......... నిమేషవ్యాప్తిఁ గైకోని దృక్ । సరసీజమ్ములు.........(శృం. నైష. ౫ ఆ. ౧౮౭) ఏను బ్రార్థింపఁ గైకోక యిట్టివాని (కళా. ౪ ఆ. ౪౯).........శా......తలపై నెక్కించుకో జాహ్నవీ (విజయ). పయోధి లోఁతు గైకో నెఱకొల్పెనో (పాండు. ౩ ఆ. ౧౪౪)........ ఇట్టివి పెక్కుప్రయోగములు గాణపతవివరణమునఁ జూపఁబడినవి.

కొనుధాతువునకు వ్యతిరేక ప్రార్థనార్థక ము డుజ్ఞులు పరమగునపుడిట్టి "కో" అనునాదేశము కల్గనేరదు. ఉదా:—కొనకుము - కొనకుఁడు - చేకొనకుము - చేకొనకుఁడు - చదివికొనకుము - చదివికొనకుఁడు - మొ. "కోకుము" మున్నగు నవి సాధువులు కానేరవని యెఱుఁగునది. అట్టి ప్రయోగములును లేవు.

౬౧ సూ. వ్యాఖ్య:—ము డుజ్ఞులు పరంబులగునపుడు పూర్వసూత్రోక్త మగు 'కో' అనుదాని దీర్ఘమునకు హ్రస్వమును 'ము'వర్ణకమునకు మాముడియు నగునని యర్థము. ఉదా:—కొను+ము – కో+ము = కొమ్ము. కో+డుజ్ = కొ+ డుజ్ = కొండు. 'కో' అనునాదేశము రానిపక్షమున, 'కొనుము - కొనుఁడు' అగును. బాల. సమా. ౧౩ సూత్రముచొప్పున ద్విరుక్తటకార పరకత్వమున హ్రస్వము సిద్ధించునుగాని 'డుజ్ఞు' పరంబగునపుడు హ్రస్వము వచ్చుట కీసూత్ర

మావశ్యక మగుటచే ముపర్ణక పరకత్వమునందలి హ్రస్వవిధాన మనువాదమని యెఱుంగునది. 'ము డుజ్జు' లలో 'డుజ్' పరకత్వమునందుమాత్రమె హ్రస్వము వచ్చు ననునది మొదలగు నపార్థములు కల్గకుండుటకై యట్టియనువాదమును నావశ్యకమె యనఁదగును.

కొనుధాతువును సంబంధించు రూపసాధనప్రక్రియయుఁ దద్విషయక మహా కవిప్రయోగములును బూర్వసూత్ర వ్యాఖ్యలో విస్తరింపఁబడెను. ఇంకఁ బ్రకృత సూత్రము రమ్ము - రండు, పొమ్ము - పొండు, తెమ్ము - తెండు, కమ్ము - కండు, లెమ్ము - లెండు మున్నగు పెక్కుస్థలములకు సాధకమైయున్నది. అట్టి యుప యోగ మాయావిషయముల సందర్భమునఁ బ్రదర్శింపఁబడును.

ఉపకృతి పరిణతి సంవృతి । భేదా త్త్రివిధా క్రియా
భువ ణ్ణాదిః । ఉపకృతి రథ భూ జ్యాదిః । పరిణతి
రన్యా తు రజ్జ్వ పస్యాదిః. స్యా దుపకృతిః కృదన్తా ।
సా పరిణతి ర యవ రస్వైత్యైవ భవేత్ । సంవృతి రహా
కాకారా।జ్ఞేయం త్రివిధాసు చ క్రియా స్వేవమ్ ।
(ఆం-చిం-క్రి-౧-౨ సూ.) (అహో. ౪౫౭-౪౫౮ పు).

నన్నయా ధర్వణీయము. 3౨౬ విష.

స్యా త్సంవృతే రుపకృతే । రప్యభేదః క్వచి న్మతః ।
స యథా శాస్త్ర మున్నేయ । స్సో శబ్దజ్ఞాన దక్షిణైః
(వికృ. క్రి. ౧ కా. అహో. ౪౬౬).
యథాప్రసిద్ధి ధాతూనాం । ప్రయోగ స్సమ్మతో
భవేత్ । ఏవోప పదభాజః స్యు।స్సాధవో భ్వాదయః
క్రియాః (వికృ. క్రి. ౨ కా. అహో. ౪౬౮).
భవతి క్రియాపదానాం।త్రివిధానా మించు గాగమో
జేశ్చ (ఆం. చిం. క్రి. ౫ కారి. అహో. ౪౬౨).
కేచిత్తు ణిచ మిచ్ఛన్తి।ధాతో రే వాత్రుగాగమాత్
(వికృ. క్రి. ౧౪ కా. అహో. ౪౯3 పు).
అన్యస్తా చ్చాధాతో । ర్ధాతుత్వే వివక్షయైవ భవ
తీంచుక్ (ఆం. చిం. క్రి. ౭ కా. అహో. ౪౭౭ పు).
భుగాదిక విశేషస్య । సంగ్రహోపి క్వచి న్మతః (వికృ.
క్రి. 3 కా. అహో. ౪౬౮ పు).

కల్పతరువు. 3౨౬ విష:—ఉపకృతి - పరిణతి - సంవృతి-భేదాత్ = ఉపకృతి= ఉపకృతియు, పరిణతి=పరిణతియు, సంవృతి = సంవృతియు ననెడి, భేదాత్ = భేదము

బలన, క్రియా = సంస్కృత సమధాతువు, త్రివిధా = మూఁడువిధములు గలది యగుచున్నది. పుషణ్వాదిః = పుష - ణు - మొదలుగాఁగల ధాతువు, ఉప కృతిః = ఉపకృతియను సంజ్ఞగలది. అథ = పిమ్మట, భూ - జ్యాదిః = భూ - జి మొదలుగాఁగల ధాతువు, పరిణతిః = పరిణతి సంజ్ఞగలది. రజ్జి వస్యాదిః = రజ్జ్ - వస్ మొదలుగాఁగలది (చూ. వి స్త. II ౨౯౬) అస్యాతు = తక్కిన సంవృతి యను సం[illegible] యగును. ఉపకృతిః = పష్ [illegible] ధాతువు, కృదన్తా = కృత్ ప్రత్య యా[illegible] వంటి యాకారము గలది, [illegible] సంజ్ఞగ "భూ" ప్రభృతిధాతువు, అ[illegible] = 'ఇయ్ - వ్ అర్' అనువానిలో నొకదాని పరిణామముతోఁ గూడినదె యగును. సంవృతిః = సంవృతి సంజ్ఞగలధాతువు, అహతాకారా = ఆకారమందు మార్పు లేనిదగుచు ననఁగా సంస్కృతధాతు పాఠమున నుపదేశింపఁబడిన యాకారము గలదే యగుచుఁ, దత్సమధాతువుగా నేర్పడునని యర్థము. త్రివిధాసు = మూఁడువిధములగు ధాతు వులందును, ఏవమ్ = ఈవిధమగు వ్యవస్థ, జ్ఞేయమ్ = తెలియఁదగినది. బాలసరస్వ త్యహోబలపండితులును దదనుయాయి కవిజనమండన నారాయణీయకారాదులును, కృత్ప్రత్యయాన్తములగు రూపములె (ప్రాతిపదికములె) యుపకృతి ధాతువులుగ నేర్పడునని వ్యాఖ్యచేసిరి. ఇది సరికాదు. ప్రాతిపదికములు ధాతువులెట్లగును? ప్రాతిపదికములపై సుప్పులు నిల్చునేకాని తిఙ్ఞులు నిలువనేరవుగదా. కావున సుబంత ప్రక్రియా సందర్భమున సంస్కృత జంత ప్రాతిపదికములె తత్సమ ప్రాతిపదిక ములుగ నేర్పడుననియు హలంత ప్రాతిపదికములు ప్రథమైకవచనాన్తాది సద్భవ రూపమునఁ దత్సమత్వ విషయమున నేర్పడుననియు నుపదేశించినట్లె (౧౬౫ విషయ) యీపట్టున సయితము సంవృతులు సంస్కృతధాతు పాఠోపదిష్టధాతువులె తత్సమధాతువులుగ నేర్పడుననియు నుపకృతులు కృదంత ప్రాతిపదికములవంటి యాకారముతోఁ దత్సమధాతువులుగ నేర్పడుననియుఁ జింతామణికర్త యుపదే శించె ననుట విశ్వసనీయమై యుండునుగదా. "ఉపకృతిక్రియా కృత్ప్రత్యయాన్తా స్యాత్.........సంవృతిక్రియా.........ఉపదేశకాలే యత్ స్వరూపం తేనైవ తిష్ఠతీత్యర్థః" (అహో. ౮౫౭ పు). "ఏవంచ సంజ్ఞాత్రయ మన్వర్థకమ్ - ఉప = సమీపే - అన్తే ఇత్యర్థః, కృతిః = కృత్ ప్రత్యయవిధానం యస్యాః సా=ఉపకృతిః, అయాద్యన్తత్వేన పరిణమత ఇతి పరిణతిః.........సమ్యక్ వృతిః = వరణం నైయ త్యేన స్వరూపస్య ప్రాప్తి ర్యస్యాః సేతి......" (అహో. ౮౬3 పుట). ఇట్టి వివ రణము సరికాదనియుఁ గృదంత ప్రాతిపదికమువంటి యాకారముతో నుపకృతిధాతు

వేర్పడుననియుఁ జెప్పుటయు యుక్తము. పరిశీలింపఁగా నట్టియర్థము వాచ్యమగు నట్లు "స్యాదుపకృతిః కృదన్తాభా పరిణతి రయవరన్విత్తైవ భవేత్" అనునది (కృద న్తాఽభా = కృదంత ప్రాతిపదికమువంటిది = కృదన్త+ఆభా) గ్రంథకర్తృప్రయుక్త పాఠమేమోయని యాలోచింపనగును. అందు "స్యా" అనునది నిరర్థకముగను గన్పట్టుచున్నది.

కృత్ప్రత్యయములు ధాతువునకుఁ బరమగునపుడు సంభవించు మార్పులలో నీక్రిందిది ప్రధానమై యున్నది. "పుగన్త లఘూపధస్యచ. (౭-3-౮౬) పుగన్తస్య లఘూపధస్య చాఙ్గస్య ఇకః గుణః స్యాత్ - సార్వధాతు కార్ధధాతుకయోః." (సి. కౌ. భ్వాది. ౨౧౮౯ సూ). అను సూత్రముచొప్పున ధాతువుయొక్క యుప ధాభూతములయి యున్న లఘువులగు "ఇ - ఉ - ఋ" అను వర్ణములకు గుణాదేశ మగుట కృత్ప్రత్యయ పరకత్వమందు సంభవించును. "అదేఙ్ గుణః. (౧-౧-౨) అత్ - ఏఙ్ చ గుణ సంజ్ఞః స్యాత్" (సి. కౌ. సంజ్ఞా. ౧౭ సూ). "ఉరణ్ రపరః. (౧-౧-౫౧) ఋ ఇతి త్రింశత స్సంజ్ఞేత్యుక్తమ్. తత్స్థానే యోఽణ్ స ర పర స్సన్నేవ ప్రవర్తతే. తత్రాన్తరతమ్యాత్ కృష్ణర్ధి రిత్యత్ర (ఋవర్ణవిషయమున) అర్. తవల్కార ఇత్యత్ర (ౡవర్ణవిషయమున) అల్........." (సి. కౌ. అచ్ సంధి. ౭౦ సూ) అను సూత్రములచొప్పున 'ఇ' కారమునకు 'ఏ' కారమును, 'ఉ' కారము నకు [illegible] 'ఋ' కారమునకు 'అర్' అను [illegible] గుణాదేశము లగును.
ఉదా:— [illegible] - [illegible]+ఇ - [illegible] [illegible] ష్+[illegible] = [illegible] ష్+[illegible] - [illegible] ద్వేష ధృష్+ణిచ్ = [illegible] ష్+ఇ = [illegible] = ధర్ష్ - [illegible].
ఇట్టి కృదంతరూపములవంటి యాకారమే తెల్గున నుపకృతిధాతు వగుచుండును. కాన వీనిపై "భవతి క్రియాపదానాం। త్రివిధానా మించు గాగమః" అను చింతామణి సూత్రముచొప్పున స్వార్థేంచుక్కు నిల్పఁగా 'పోషించు - ద్వేషించు - ధర్షించు' అను రూపములేర్పడును. (విస్తర I). కృత్ప్రత్యయముల పరమగునపుడు 'ఇ - ఈ,

---

విస్తర I 3౨౬ విష:—ఘుఞన్త పోషాది కృదంత శబ్దములు పోషణాది శబ్దములవలె సుప్రసిద్ధములు గాకున్నను వ్యాకరణసిద్ధములగునట్టి కృదంతరూప ములవంటి వానిని నుపకృతిధాతువులుగ నెన్నఁదగునని విశదపఱుచుటకై సుప్రసిద్ధ కృదంతశబ్దములు పరశ్శతము లున్నను 'పుష' ధాతు కృదన్త పోషశబ్ద సదృశరూప ముపకృతి కానోపునని గ్రంథకర్త వచించెను. అట్లె 'నుతి' శబ్దమే గ్రాహ్యమనియు 'నవించు' అనునది గ్రాహ్యము కాదనియు విశదపఱుచుటకై ను ధాతు వుపకృతి యని యుపదేశించెను.

ఉ - ఊ, ఋ - ౠ' అను నచ్చులు తుదినిగల ధాతువులతుదిని 'అయ్ - అవ్ - అర్'అను పరిణామము గల్గును. అట్టి పరిణామము నందు నట్టిధాతువులె పరిణతిసంజ్ఞ గలవని యెఱుంగునది. "సార్వధాతు కార్ధధాతుకయోః. (౭-3-౮౪) అనయోః పరయో రిగన్తస్యాఙ్గస్య గుణః స్యాత్." (సి. కౌ. భ్వాది. ౨౧౬౮ సూ). అను సూత్రముచెప్పిన ధాతువుతుదినున్న 'ఇ - ఈ, ఉ - ఊ, ఋ - ౠ' అనుస్వరము లకుఁ గృత్ ప్రత్యయపరకత్వమున గుణాదేశ మగును. అనఁగా నట్టి 'ఇ - ఈ' లకు 'ఏ' అనియు, 'ఉ - ఊ' లకు 'ఓ' అనియు, 'ఋ - ౠ' లకు 'అర్' అనియు నాదే శములగును. అట్టి 'ఏ - ఓ - అర్' అనువాని కజాదికృత్ ప్రత్యయము పరమగు నపు డీక్రిందిరీతిగల స్వరసంధి గల్గును. "ఏచోఽయవాయావః. (౬-౧-౭౮) ఏచః క్రమాత్ 'అయ్ - అవ్ - ఆయ్ - ఆవ్' ఏతే స్యు రచి." (సి. కౌ. అచ్ సం. ౬౧ సూ). ఏ - ఓ - ఐ - ఔ లకు నచ్చుపరమగుచుండఁగా 'అయ్ - అవ్ - ఆయ్ - ఆవ్' అనునవి యాదేశములగునని యర్థము. దీనిచెప్పిన ధాతువుతుదినున్న 'ఇ - ఈ' లకాదేశముగవచ్చిన 'ఏ' కారమునకు 'అయ్' అను నాకార మేర్పడును, ధాతువుతుదినున్న 'ఉ - ఊ' లకాదేశముగా వచ్చిన 'ఓ' కారమునకు 'అవ్' అను నాకారము గల్గును. ధాతువుతుదుదినున్న 'ఋ - ౠ'ల కాదేశముగా 'అర్' అనునదియే నిల్చును. ఇట్టి ప్రక్రియచెప్పిన నేర్పడిన 'అయ్ - అవ్ - అర్' అను పరిణామములుగల సంస్కృతధాతువులె పరిణతిసంజ్ఞగలవని యెఱుంగునది. ఇవి కృదన్తములు కావు. కృత్ప్రత్యయయోగ సందర్భమునందుఁ గల్గు పరిణామములతోఁ గూడు సంస్కృతధాతుమాత్రములె. వీనిపైని స్వార్థికమగు నించుగాగమము నిల్చును. ఉదా:—('జయ - పు - జి - భావే - అచ్' శబ్దస్తో). జి = జయ్+ఇంచు = జయించు; ('అనుభవ - పు - అను+భూ+అప్' శబ్దస్తో) అనుభూ = అనుభవ్ + ఇంచు = అనుభవించు; (తరి. (రీ) స్త్రీ. తౄ+ఇ+(వాజీమ్) - శబ్దస్తో) తౄ - తర్+ ఇంచు = తరించు. మొ. "ణుస్తుతౌ - ణు = ను+అన (ల్యుట్) = నో+ అన = నవ్+అన = నవన." అనుచెప్పిన 'ను' ధాతువునుండి "ను = నో = నవ్+ ఇంచు = నవించు" అను పరిణతిధాతురూపము కల్గనేరదు. "పుష ణ్యాది రుపకృతిః" అను చింతామణిసూత్రముచే నయ్యాది క్తి ప్రత్యయాంతమగు కృదంత ప్రాతిపది కమువంటి యాకారముతోనె తత్సమధాతువగుచు 'ఇంచు'గాగమము నెనయునని యెన్నునగును. "స్త్రియాం క్తిన్. (3-3-౯౪) స్త్రీలిఙ్గే భావాదౌ క్తిన్ స్యాత్ - ఘఞోఽపవాదః........కృతిః......"(సి. కౌ. 3౨౭౨ సూ). ఈ క్తిన్ ప్రత్య యము పరమగునప్పుడు లఘువులు నుపధాభూతములు నగు 'ఇ - ఉ - ఋ' అను

వానికి గుణమురాదు. అట్లె ధాతువుతుదినున్న 'ఇ - ఈ - ఉ - ఊ, ఋ - ౠ' అనువానికిని గుణము రాదు. "క్ఙితిచ. ౹ (౧-౧-౫). గిత్ - కిత్ - ఙిన్నిమిత్తే ఇగ్లక్షణే గుణవృద్ధీ న స్తః" (సి. కౌ. భ్వాది. ౨౨౧౭ సూ). దీనిచొప్పున - నుతి - కృతి - భూతి - మున్నగుచోటులందు గుణాదేశము రాదని యెఱుంగునది. అట్లగుటనే 'నుతించు' మున్నగు నుపకృతిధాతురూపములు సిద్ధించుచున్నవి.

స్యాత్సంవృతే రిత్యాదిః—సంవృతేః = సంవృతిధాతువునకును, ఉపకృతేః = ఉపకృతిధాతువునకును, అభేదోపి = భేదము లేకుండుటయు, స్యాత్ = కొన్నియెడల సంభవించును. సః = ఆయభేదము, శాబ్దికజ్ఞాన దక్షిణైః = శబ్దశాస్త్రజ్ఞానమందు దాక్షిణ్యమనఁగా సమర్థత గలవారిచేత, యథాశాస్త్రమ్ = సంస్కృతవ్యాకరణశాస్త్రానుసారముగా, ఉన్నేయః = తెలిసికొనఁదగినది. ఉదా:—'నినాదము నినదము' మున్నగు ద్వివిధ కృదంతరూపములును బ్రసిద్ధములయి యున్నవి. అట్టియెడల 'నినదించు' అనునది యుపకృతియు, సంవృతియుఁగా నొప్పును. "నద్" (ణద అవ్యక్తే శబ్దే) అను ధాతువుయొక్క కృదంతరూపము 'నినద' అని యేర్పడును - దానివంటి యాకారముగల 'నినద' అను నుపకృతిధాతువుపై నించుగాగమము చేరఁగా సవుదాది స్వరసంధి నిత్యముగాన (౭౫ విష.) "నినదించు" అను నుపకృతిధాతు వేర్పడును. 'నద్' అనుధాతువునందు మార్పేమియు లేమింజేసి యది సంవృతి యనిపించుకొనునుగాన "ని+నద్+ఇంచు = నినదించు" అను సంవృతి ధాతురూప మేర్పడును. ఇట్లుపకృతి సంవృతి ధాతువుల కభేదము వరయునది. ఈ సూత్ర ముపలక్షణమగుటంజేసి యుపకృతి పరిణతులకును గొన్నియెడల భేదములేక పోవచ్చునని యెఱుంగనగును. "ప్రభవ.............ప్ర+భూ - భావే అప్ = ప్రథమారంభే జన్మనిచ" (శబ్దార్థ) అనుచొప్పున 'ప్రభవ' శబ్దము కృదంతము గలదు. దానివంటి యాకారముగల 'ప్రభవ' అను నుపకృతధాతువునుండి "ప్రభవ+ఇంచు = ప్రభవించు" అను నుపకృతిధాతు వేర్పడనగును. 'ప్ర+భూ' అనుధాతువు "ప్ర+భో = ప్రభవ్" అను పరిణామమందునుగాన 'అవ్' పరిణతిగల 'ప్రభవ్' అను పరిణతిధాతువుపై నించుగాగమము చేరఁగా 'ప్రభవ్+ఇంచు = ప్రభవించు' అను పరిణతి తెలుఁగుధాతు వేర్పడును. ఇట్లు కొన్నియెడల నుపకృతి పరిణతి ధాతువుల కును నభేదము సంభవించుచుండునని యెఱుంగునది. పయివిషయములను సహేతుకముగ నుడివితిని. డి క్రింది విధమున వ్రాసెను.

"నినాదాద్యా ఇవ వాంతా శబ్దా నామలిఙ్గానుశాసనోక్తాః, అస్తావాప్త వద్గ్రాహోపగ్రహౌ ప్రమాద ప్రముదాద్యాః నిక్వాణాద్యై నిక్వాణ

[బా. క్రి. ౬3-౭౦-౧౨౧ సూ.] ఉపకృత్యాదులు ప్రయోగానుసారముగనే గ్రాహ్యములు

దయశ్చాత్ర విజ్ఞేయాః." "స్యాత్సంవృతే రుపకృతే। రప్యభేదః క్వచిన్మతః। స యథాశాస్త్ర మున్నేయ। స్సాశబ్దజ్ఞాన దక్షిణైః" (అహో. ౪౭౬ పు). "ప్రసవ్ - ఇత్యాదౌ పరిణ త్యుపకృత్యో ర భేదో విజ్ఞేయః" (అహో. ౪౬౬ పుట). "అగ్రహాదిషు సంవృత్యు పకృత్యో రభిన్నరూపం జ్ఞేయమ్" (అహో. ౪౬౭ పు).

యథాప్రసిద్ధీతి:—యథాప్రసిద్ధి = కవి ప్రయోగ ప్రసిద్ధి నతిక్రమింపకుండు నట్లుగ, ధాతూనామ్ = ఉపకృత్యాది త్రివిధ ధాతువులయొక్కయు, ప్రయోగః = ప్రయోగము, సమ్మతః = సమ్మతమైనది, భవేత్ = అగును. అసంఖ్యములగు కృదంతములు సంస్కృతభాషలో వెలయుచున్నవనుచు నట్టి కృదంత సదృశములకెల్ల నించుగాగమము చేర్చి ప్రయోగింపనగునని కాని యట్లె పరిణతి సంవృతు లనుచు నాయా ధాతువులను యథేచ్ఛముగఁ బ్రయోగింపనగునని కాని తలంపరాదు. మహాకవు లేయేధాతువుల నేయేయాకారములతోఁ బ్రయోగింతురో యట్టిరూపములతో మాత్రమె ప్రయోగింపవలయునని తాత్పర్యము. 'ను' ధాతువును బరిణతిగఁ బ్రయోగింపరాదనియు నుపకృతిగా మాత్రమె ప్రయోగింపవలయుననియు నీవ లను వ్రాయఁబడెను. ఇట్లె, 'రమ్' (క్రీడాయామ్) ధాతువుయొక్క 'క' ప్రత్యయాంత కృదంతమగు 'రామ'శబ్దమువంటి రూపముపంబు నించుగాగమమును నిల్పి 'రామించు' అని యుపకృతిగాఁ బ్రయోగింపరాదు. ఇంక నద్దానిని 'రమించు' అనెడి సంవృతిరూపముతోనె కవిప్రయోగానుసారముగఁ బ్రయోగింపనగును. 'శీజ్' (శయనే) అను ధాతువున కుపకృతిగాను బరిణతిగాను బ్రయోగములు వెలయుచుండుటచే ద్వివిధప్రయోగములును సాధువులని తలంపవలయును. శీ = శే = శయ్+ఇంచు = శయించు. (ఇది పరిణతిధాతురూపము,) శీ+అన (ల్యుట్) = శే+అన = శయ్+అన=శయన+ఇంచు = శయనించు, (ఇది యుపకృతి ధాతురూపము,) దీనిని నామధాతువుగా సూరి వ్రాయుట (బా. క్రి. ౬౫ సూ) సరికాదు. "శయనమ్ - న - శయ్యాయామ్ - నిద్రాయామ్-శీజో భావే ల్యుట్........," (శబ్దా. చిం) అనుచొప్పున శయనశబ్దము కృదన్తము గాన తత్సదృశధాతువు 'ఉపకృతి' యనఁదగును. నామధాతువు కానేరదు. (3౨౬ III విమ). కవిశిరోభూషణమునం దుపకృత్యాదులు మిక్కిలి విపులముగా నుదాహరింపఁబడెను. "సంస్తుతిం - ప్రస్తుతిం. (ష్టుఞ్ స్తుతౌ). అనుమతిం - సమ్మతిం - (మన అవబోధనే). సంతోషిం - సంతోసిల్లుచున్నాఁడు ఇల ప్రాకృత సమం రూపం-షాస్స ఇతి సాదేశాత్. సంతసించు ఇతి సంస్కృతభవమ్. (తుషతుష్టౌ). రోషిం (రుష రోషే)........" అని యీరీతిగా ననేకములగు నుపకృతిధాతువులు చూపఁబడెను. (అహో. ౪౬౪-౪౬౫ పు).

ఇట్లు చూపుటలో "స్తుతిం - రోషిం" మున్నగురీతిని ధాతువులతుదిని 'ఇం' అను
దానిఁ జేర్చియే యహోబలపండితుఁ డుదాహరించెను. అట్లె సంవృతిధాతువుల నన్ని
టిని 'ఇం' అనుదానిని జేర్చియే యుదాహరించెను. పరిణతిధాతులకు మాత్ర మట్లు
చేర్పక 'ఆయ్' మున్నగురీతి నుదాహరించెను. దీనినిబట్టి 'ఇంచు' అనుదానిలోని
పూర్వభాగముమాత్రము సంక్షేపాభిప్రాయమునఁ జేర్చెననియుఁ, బరిణతులందు
సంస్కృత ప్రకృతులకంటెఁ గొంతవైలక్షణ్య (అయ్. అవ్. అర్. పరిణా
మము) ముండుటచే వానికి 'ఇం' అని చేర్పకున్నను భేదము తెలియునని వానికిఁ
జేర్పలేదనియుఁ దోఁచుచున్నది. ఉపకృతి సంవృతుల కట్లు చేర్పనిచో నవి సంస్కృత
ప్రకృతులె (ప్రాతిపదిక. ధాతు) యను భ్రాంతి కల్గునని తలంచియుండును. "జయ్-
(జి - జయే) పరాయ (పరా జి జయ) సంశ్రయ్ (శ్రి - శ్రయే)" అనురీతిని ననేకము
లగు పరిణతిధాతువులు చూపఁబడెను. (అహో. ౪౬౬). "అర్థిం - (అర్థ యాచ్ఞా
యామ్) ఖచిం (ఖచ. బన్ధనే)" అనురీతిని బెక్కుసంవృతిధాతువులు చూపఁ
బడెను. (అహో. ౪౬౭ పు). ఇట్లుదాహరించుటలోఁ గొన్ని పొరపాటు లున్నట్టు
కనుపట్టుచున్నది. "వచిం (వచ సంభాషే) ప్రణమిల్లుచున్ (ణము ప్రహ్వత్వే శబ్దే).
అనువర్తిం - వర్తిం (వృత్ వర్తనే) చుమ్బిం (చుబి. చుమ్బనే)" అనురీతిగలవి కొన్ని
యుపకృతిధాతువుల పట్టికలో నుదాహృతములయ్యెను. "వచ - ప్రణమ - అను
వర్త - చుమ్బ" మున్నగు కృదంతశబ్దములు కేవలము నప్రసిద్ధములు. కోశము
లందు లేవు. ఇట్టివానిని సంవృతిధాతుపట్టికలోఁ జేర్చుట యుక్తమని తోఁచెడిని.
"అగ్రహాదిషు సంవృత్యుపకృత్యో రభిన్నం రూపమ్" (అహో. ౪౬౭ పు) అను
రీతిని బయిటవానివిషయమునందును నుపకృతుల పట్టికలో వ్రాయనైనలేదు. "ప్రజ్వ
లిం సంవృతిరూపం వా" (అహో. ౪౬౪ పు). అనురీతి నుపకృతుల పట్టికలోఁ
గొన్నిటియుద్ధమాత్రమే వ్రాయఁబడెను. మఱియు 'ప్రజ్వల' అను కృదంతశబ్దము
ప్రసిద్ధ మగుటచే దీనిని గేవలసంవృతిగానే యుదాహరించుట యుక్త మనఁదగును.

ఏవోపపదేత్యాదిః—భ్వాదయః క్రియాః = 'భూ - కృ - సృ' మున్నగు
కొన్నిధాతువులు, ఉపపద భాజఏవ = ఉపపద సమాసగతములయి యున్నపుడు
మాత్రమె, సాధవః = తెలుఁగునఁ దత్సమములై ప్రయోగార్హములగును. ఇట్లు
నుటచేత 'భవించు - కరించు - సరించు' మున్నగురీతి నియ్యవి రక్షించు, పోషించు
మున్నగువానివలెఁ గేవలరూపములోఁ బ్రయోగార్హములు కానేరవని భావము.
ఇంక నట్టి కతిపయధాతువులు, గతిసమాసగతములగుచునే తెలుఁగునఁ బ్రయో
గార్హము లగునని యెఱుంగునది. ప్రకృతసూత్రములోని 'ఉపపద' శబ్దము గతి

[బా. క్రి. ౬3 మొ. ౨౦ వ. ౧౨౧ సూ.] 'భూ-కృ'మొ. గతిసమాసముండె వాడుక.

సంజ్ఞాశబ్దపరమని యెఱుంగునది. (వి స్తర II). ఉపపదశబ్దమునకు వ్యాకరణ ప్రసిద్ధ మగు "తత్రోపపదం సప్తమీస్థమ్ (3-౧-౯౨)" (సి. కౌ. తత్త్వ. ౭౮౧ సూ.) అను సూత్రమునఁ జెప్పఁబడిన యర్థమేకాక పై రీతి నర్థముచేయుటకును బ్రమాణము గలదు "ఉపపదమ్ - న - పదస్య సమీప పదే - సమీపోచ్చారితే పదే - వ్యావర్త కే యథానామోత్తరే శర్మవర్మాది - లేశే - సముభివ్యాహృత స్వార్థ పోషక పదే యథా ప్రహారాదౌ ప్రాది - ఉపోచ్చారితం పదమ్" (శబ్దా. చిం). సంస్కృత వ్యాకరణమున గతిసంజ్ఞయు దాని సమాసము విషయమును నీక్రిందిరీతిని సూత్రింపఁబడెను.

"ఉపసర్గాః క్రియాయోగే (౧-౪-౫౯). గతిశ్చ (౧-౪-౬౦). ప్రాదయః క్రియాయోగే ఉపసర్గ సంజ్ఞా గతి సంజ్ఞాశ్చ స్యుః - ప్ర - పరా-అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి - ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు - ఉత్ - అభి - ప్రతి - పరి - ఉప - ఏతే ప్రాదయః". (సి. కౌ. సంజ్ఞా. ౨౨-౨3 సూ). (వి స్తర III). "కుగతిప్రాదయః (౨-౨-౧౮). ఏతే సమర్థేన నిత్యం సమస్య న్తే".

---

వి స్తర. II 3౨౬ వి:—"తత్రోపపదం సప్తమీస్థమ్ (3-౧-౯౨) సప్తమ్య న్తే పదే 'కర్మణి'—(సూ. ౭౯౧3) ఇత్యాదౌ వాచ్యత్వేన స్థితం కుమ్భాది తద్వాచకం పద ముపపద సంజ్ఞం స్యాత్ - తస్మింశ్చ సత్యేన వక్ష్యమాణః ప్రత్యయః స్యాత్." (సి. కౌ. తత్త్వ. ౭౮౧ సూ). "ఉపపద - న.........వ్యాకరణే ప్రత్యయా భిధాయక సూత్రే సప్తమ్య న్తపదేన నిర్దిశ్యమానే ప[illegible] (చ యథా - క[illegible] ఇత్యాదౌ కర్మణీతి స[illegible]న్తం పదమ్ అణ్ ప్ర[illegible] మభిధానే ఉపపదమ్" (శబ్దస్తో). (కుంభం కరోతీత్యాది స్థలములందు కుంభాదులకు లుపపద సంజ్ఞగలవి). గతిసంజ్ఞకములును నుపపదములు కావచ్చును. "వస్తుతస్తు (వ్యాఘ్రీశబ్దసలే) ఆఙ్పూర్వే ఘ్రాశబ్దే నోపపద సమాసః. 'అతశ్చోపసర్గే' 'ఇతి సమీ నిర్దేశాత్ - వేస్తు ఆఘ్రీ శబ్దేన గతిసమాస ఇతి" (బాలమ. వ్యా. ఉపపదమతిఙ్ఙేతి సూత్ర (౭౮౨ సూ). వ్యాఖ్య.) మఱియు సప్తమీనిర్దేశస్థలములందెల్ల నిట్టి యుపపదము స్థితి సంభవిం పదు. "భః కర్మణి ష్ట్రన్. భువోభావే. ఇత్యాదౌ సప్తమ్య న్త మ్యనిర్దేశమేవ, వ్యాఖ్యానాదితి భాష్య కైయటాదిషు స్పష్టమ్" (బాలమ. తత్రోపపద మిత్యాది సూత్ర (౭౮౧ సూ.) వ్యాఖ్య). ఇట్లగుటచేతనే యుపపదశబ్దమునకుఁ బైరీతిని శబ్దార్థచింతామణ్యుక్తరీతి నర్థము చేయఁబడెను.

వి స్తర. III 3౨౬ విష:—"ఉపసర్గ బలా ద్ధాతూనా మనేకార్థత్వమ్. తదుక్త మభియుక్తైః:—ఉపసర్గేణ ధాత్వర్థో। బలా దన్యః ప్రతీయతే। ప్రహారాహార సం

(సి. కౌ. తత్త్వ. ౭౮౧ సూ). (విస్తర IV)........."గతిశ్చ (౨3 సూ). ఇత్యను వర్తమానే. ఊర్యాది చ్వి డాచశ్చ. (౧-౪-౬౧). ఏతే క్రియాయోగే గతి సంజ్ఞాః స్యుః - ఊరీకృత్య (ఊరీకరించు = అంగీకరించు) శుక్లీకృత్య (శుక్లీకరించు = తెల్లనిదిగాఁజేయు) పటపటాకృత్య (పటపటాకరించు = పటపటయను శబ్దము చేయు)........ఊరీ - ఉరరీ - అనిస్ - ఆదరానాదరయోః సదసతీ (౧-౪ ౬3) సత్కృత్య (సత్కరించు) [illegible]........[illegible] (౧-౪-౬౪) అలం [illegible] (౧-౪-[illegible]) పురస్కృత్య (పురస్క [illegible] ౪-[illegible]) తిరోऽన్తర్ధౌ. విభాషా కృఞి. (౧-౪-౭౨) తిరస్కృత్య (తిరస్కరించు). సాక్షాత్ప్రభృతీని చ (౧-౪-౭౪) కృఞి వా గతి సంజ్ఞాని స్యుః. చ్వ్యర్థ ఇతి వాచ్యమ్ (వా. ౧౧౪౨) సాక్షాత్కృత్య సాక్షాత్కృత్వా". (సి. కౌ. తత్త్వ. ౭౬౧ మొ. ౭౭౫ వ. సూ). "సాక్షాత్ - ప్రాదుస్ - నమస్", మొ. ప్రాదుర్భవించు - నమస్కరించు - మొ.

పయిరీతిని గతిసంజ్ఞగలవానితో సమసించియున్నపుడే భూ. కృ. సృ మున్నగు ధాతువులకుఁ దెల్లునఁ దత్సమరూప ప్రయోగము గల్గును. వీనికి వ్యస్తముగఁ బ్రయోగము లేదు. భవించు - కరించు - సరించు మున్నగునవి యసాధువులు.

---

హార । విహార పరిహారవత్. ఇతి - కైశ్చి త్తూపసర్గసంబన్ధ మనపేక్ష్యైవ ధాతూనా మనేకార్థత్వ ముక్తమ్ - క్రియావాచిత్వ మాఖ్యాతుం । ప్రసిద్ధార్థః ప్రదర్శితః । ప్రయోగతో ఽనుమన్తవ్యా । అనేకార్థా హి ధాతవ ఇతి. అతఏవ పాదౌ కుర్వీత్యాదౌ వ్యాకరణ భాష్యే కరోతే ర్నానార్థకత్వం ప్రపఞ్చితమ్" (అహో. ౪౬౮ పు).

విస్తర. IV 3౨౬ వివ:—'కుగతిప్రాదయః' అను సూత్రమున యోగ విభాగముచేసి యర్థమును గ్రహింపవలయును. 'కుప్రాదయః - గతిః' అని రెండు సూత్రములనుగా విభజింపవలయును. "కుప్రాదయః - ఇతి, గతిః ఇతిచ యోగో విభజ్యతే. కుప్రాదయః సుబన్తేన సమస్యన్తే. గతిస్తు సమర్థేన సమస్యతే. అతి జన్తశ్చ సమాస ఇతి వ్యాఖ్యేయమితి యావత్ ...... గతికారకోపపదానాం కృదన్తైస్సహ సుబుత్పత్తేః ప్రాక్ సమాసో వక్తవ్యః.........గతిసమాస ముదాహరతి - వ్యాఘ్రీతి - వ్యాజిఘ్రతీతి వ్యాఘ్రః - వ్యాజ్ పూర్వాత్ ఘ్రాధాతోః 'ఆతశ్చోపసర్గే' ఇతికః.........ఆజో ఘ్రాశబ్దేన గతిసమాసః. ఆఘ్రశబ్దేన వేః గతి సమాసః." (సి. కౌ. బాలమ. వ్యా. ఉపపద మతిఙితి సూత్ర (౭౮౨ సూ) వ్యాఖ్య).

చింతామణిసూత్రములోని "భ్వాదయః" అనుదానికి "భ్వాదయ్యదాదీ జుహోత్యాది। ర్దివాది స్స్వాది రేవచ। తుదాదిశ్చ రుధాదిశ్చ। తన క్ర్యాది చురాదయః" అను దానిలోఁ జెప్పఁబడిన భ్వాదిగణము ని యర్థముచేయరాదు. 'భూ - స్మృ' అనునవి భ్వాదులలోనివి. 'కృ' అనునది తనాద్యాదులలోనిది. (భూసత్తాయామ్ - స్మృగతౌ డుకృఞ్ కరణే).

భవతి క్రియాపదానా మిత్యాదిః—త్రివిధానామ్ = ఉపకృత్యాదులగు మూఁడువిధములైన, క్రియాపదానామ్ = ధాతువులకును, ఇంచుగాగమః = 'ఇంచుక్' అనెడి యాగమమును, భవతి = అగును. ణేశ్చ = ణిజర్థమునకును నఁగాఁ బ్రేరణార్థమునను ధాతువునకు 'ఇంచుక్' అనెడివి యగును 'పోష - భవ్ - వస్ -' మున్నగు త్రివిధములగు ధాతువులపైని "ఇంచుక్" అనునది యాగముముగ నిల్చును. ఇది స్వార్థమందే వచ్చునుగాన నిది చేరుటవలన నర్థవిశేష మేమియుఁ గల్గదు. ఇట్టి స్వార్థేంచుక్కు చేరినపిమ్మటనే వానిపయిని 'తిఙ్లు' నిల్చును. ఇంకఁ బ్రేరణార్థమున నెల్లధాతువులకును నఁగా నించుగాగమాంతములగు నుపకృత్యాది ధాతువులకును నించుగంతములగు నంగలాదిధాతువులకును నించుగంతములగు నామధాతువులకును వండు మున్నగు నాచ్ఛికధాతువులకును 'ఇంచుక్' అనునది వేఱ నిల్చును. ఇది యర్థవంతముగాన దీనిని బ్రత్యయమునియు వ్యవహరింపవచ్చును. కిత్తగుచు వర్ణవృద్ధిరూపమునఁ జేరుటచే దీని నాగమముని వ్యవహరించుటలో విరోధములేదు. కిత్తుగాన నంత్యావయవముగ నిల్చును. ఉదా:—పోష+ఇంచు = పోషించు - అను+భవ్+ఇంచు = అనుభవించు, వస్+ఇంచు = వసించు. ఇట్టి ధాతువులపై లడాదుల కాదేశములగు తిఙ్లు నిల్చి సమాపకక్రియలును, టాది ప్రత్యయములు నిల్చి యసమాపకక్రియలును నేర్పడును. పయిరీతిగల యించుగా గమాంత ధాతువులకును 'వండు' మున్నగు నాచ్ఛికధాతువులకును తుదిని బ్రేర ణార్థమున 'ఇంచు' అనునది నిల్చినపిదప దానిపైఁ దిఙ్లును 'టా'ది ప్రత్యయము లును నిల్చుటచేఁ బ్రేరణార్థకములగు సమాప కాసమాపక్రియ లేర్పడును. వాక్య సమాప్తిని జేయు క్రియలు సమాపకములు. వాక్యసమాప్తిని జేయఁజాలనివి యసమా పకక్రియలు. ఉదా:—పోషించెన్ - అనుభవించెన్ - వసించెన్. పోషించుచున్న వాఁడు - అనుభవించుచున్నవాఁడు - వసించుచున్నవాఁడు - మొ. ణిజంతములకు:— పోషింపించెన్ - అనుభవింపించెన్ - వసింపించెన్ - చవివించెన్ - వండించెన్ - మొ. వీనిరూపసాధన ప్రక్రియ ముందు విశదీకరింపఁబడును.

సంస్కృతవ్యాకరణమునఁ బ్రేరణార్థమందు 'ణిచ్' అను ప్రత్యయము విధింపఁ బడెను. కాన "ణేశ్చ" అనుదానికిఁ బ్రేరణార్థమునకని వ్యాఖ్యచేయఁబడెను.

"తత్ప్రయోజకో హేతుశ్చ. (౧-౪-౫౫) కర్తుః ప్రయోజకో హేతుసంజ్ఞః - కర్తృసంజ్ఞశ్చ స్యాత్" "హేతుమతిచ. (౩-౧-౨౬) ప్రయోజకవ్యాపారే ప్రేషణాదౌ వాచ్యే ధాతోః 'ణిచ్' స్యాత్ - భవన్తం ప్రేరయతి = భావయతి......
..." (సి. కౌ. ణిచ్ ప్ర. ౨౫౭౫-౨౫౭౬ సూ). "తస్య కర్తుః ప్రయోజకః ప్రవర్తయితా = తత్ప్రేరకః......భవన్తమితి:—దేవదత్తో యజ్వా భవతి - తం ప్రేరయతి యాజకః ఇత్యాద్యర్థే భూధాత్వర్థస్య భవనస్య ముఖ్యకర్తా యజ్వా - తస్య యజ్వభవనే ప్రవర్తయితా యాజకాదిః ప్రయోజకః......" (బాలమ. వ్యా).
'రాముఁడు వనవాసమును జేసెను' అనుటలో రాముఁడు కర్త. 'కైక రామునిచే వనవాసమును జేయించెన్' అనునపుడు రాముని వనవాసము చేయుటను బ్రేరించినది కైక కావున వనవాసకరణమునందు రాముఁడు ముఖ్యకర్త. ప్రయోజ్య కర్తయనిన ననవచ్చును. కైక ప్రయోజకకర్త.

కేచిత్తు ణిచ మిత్యాది:—కేచిత్తు = కొందఱు, అప్రత్యాగమాత్ = ఇంచుగాగమును జేర్పనట్టియే, ధాతోః = ధాతువునుండి, ణిచమ్ = ణిజర్థమును, ఇచ్ఛన్తి = తలంచుచున్నారు. ఉదా:—కురియు = కురియించు, మెఱయు = మెఱయఁజేయు, ఆఁగు = ఆఁగునట్లు చేయు - ఉ. క.........శితశర | పరంపరలు గురిసె నుగ్రబంధురగతులన్ (విరా. ౫ ఆ. ౧౪౫). ఆ-వె.........| కలయఁ బెరసినపుడు కలితసంబు | మెఱయుదుగ........(విరా. ౪ ఆ. ౨౨౩). మెఱయు = మెఱయించు. క. దవ్వుల విఱిగిఁ బోకలు | నవ్వదుగటు మేలుమేలు ననఁ నాఁగకు ........(ఆఁగు = ఆఁచు) (విరా. ౪ ఆ. ౭౧). గీ. కుసుమబాణుని బాణముల్ గూడ నైదు | కరఁగి నేరిమి నాటించి కరువు గట్టి (కరఁగి = కరఁగించి) (విరా. ౨ ఆ. ౨౭). "కరఁగు తలఁగు మెఱయ్యాదు లంతర్భావిత ప్రేరణంబులు" (ప్రౌఢ. క్రి. ౩౪ సూ).

అన్యస్మా చ్చాధాతో రిత్యాది:—అధాతోః=ధాతువు కానట్టి, అన్యస్మాత్ + చ = ఇతరశబ్దముకంటెను, ధాతుత్వ వివక్షయైన = ధాతువునుగా వివక్షించుట చేతనే, ఇంచక్ = ఇంచుగాగమము, భవతి = అగుచున్నది. ఈయించుక్కు సంయుతమర్థ విశేషబోధకము కాదు. స్వార్థమందే యనఁగా నామార్థమునుబట్టి యర్థముగా వివక్షించిన యర్థమందే యగును. ఇదియు 'కిత్తే' గాన ధాతువుగా వివక్షింపఁబడిన శబ్దమునకుం దుదినే నిల్చును. ఇది యిట్లు స్వార్థిక మనఁగా నప్రేరణ ధాతువే యగునుగాన దీనిపైని బ్రేరణేంచుక్కు నిలువవచ్చును. ఉదా:—కరుణా + ఇంచు = కరుణించు (౭౫-౭౫ I విషయములఁజొప్పున నిత్యమగు నపదాది స్వర

సంధియయ్యెను. ఇట్లె యంతటను గ్రహింపనగును). పల్లవ+ఇంచు = పల్లవించు - మొ. అంగలాద్యాచ్ఛిక శబ్దములపయిని సయితము మీరీతిని 'ఇంచుక్కు' చేర్చి ధాతువుగా నెన్నదగును. ఉదా:—అంకించు. అప్పగించు. మొ. "కరుణ - పుం - (కృ+ఉన) కరుణార్త్యే రసభేదే.........దీనే - అనాథే - దుఃస్థితే - కరుణావతిచ-త్రి. దయాయామ్ - స్త్రీ - టాప్" (శబ్దస్తో). ఇందు దయార్థక కరుణాశబ్దముపైనే ధాతుత్వ వివక్షచేసి యించుగాగమము చేర్పుటచే 'కరుణించు' అను నామధాతు వేర్పడెననుట యుక్తము. పైనుదాహరించిన వ్యుత్పత్తిచొప్పునఁ గరుణాశబ్దము కృదంతమె యగుటచే దీని నుపకృతిగా నేల యంగీకరింపరాదని శంకింపఁజనదు. ధాత్వర్థస్ఫురణ విదూరములగు కృదంతములనుబట్టి యుపకృతిత్వ మంగీకరించుట సంప్రదాయముకాదు. 'కరుణించు' అనుధాతువునందుఁ గృధాత్వర్థభానము లేదుగదా. భట్టారకుని నామధాతూపదేశమే యిరీతిగల సంప్రదాయమునకు స్ఫోరకమగుచున్నది.

పల్లవశబ్దము:—"పల్లవః - పు - న - కిసలయే.........పల్యతే - సంపదాదిత్వాత్ క్విప్. (వార్తి) పల్ - లూ ము తే ఇతి, లవః - లూఞ్. ఋదోరప్ (3-3-౫౭). పల్ చాసౌ లవశ్చేతి పల్లవః........." (శబ్దా. చిం). అనుచొప్పున నియ్యది సమాస మగుటంజేసి యుపకృత్యాగి. త్రివిధధాతువులలోఁ జేరదనగును. కావున 'పల్లవ' అను నామముపై 'అన్యస్తా చ్చాధాతో' రిణ్యది ప్రకృత సూత్రముచే ధాతుత్వ వివక్షఁజేసి యించుగాగమము చేరఁగా 'పల్లవ+ఇంచు = పల్లవించు' అను నామధాతు వేర్పడును. (విస్త. V) "అన్యస్తా దధాతోశ్చ

---

విస్తర V ౩౭౬ పుట:—"ఇంచు(1)......అ. క్రి. ౧ ఇంగు...... స. క్రి. అభిలషించు,......" (శ. ర) అనుచొప్పున 'ఇంచు' ధాతువే "ఇంచు" గాగమమునకు మూలమా? యని యాలోచింపవలసియున్నది. "ఇంచు (2) అప. (క. ఇచు. ఇసు. త. ఇక్కు. పూర్వశాసనములు కొన్నిటిలో.........'ఇంచు' నకు బదులుగా 'ఇచ్చు' కనఁబడుచున్నది. 'అందిచ్చు (1)' అనుచోటఁగూడ ఈరూపమే కనఁబడుచున్నది.........మొదట నిది 'ఇచ్చు' అనురూపముగానుండి పిదప 'ఇంచు' గా మాఱియుండునని యూహా పొసగుచున్నది.........)" (సూ. రా. ని). 'ఇచ్చు' పూర్వరూప మనుటకుఁ దగిన బలముగు నిదర్శనములు మాపలేదు. "ఇంచు" నుండి 'ఇచ్చు' జనించుట సహజము. (వై. పా. ౩౬౮ విష). పరిశీలింప నిట్టిసామ్యము ఘుణాక్షరన్యాయముగఁ గల్గుచున్నదనియు నిది వాస్తవము కాదనియుఁ దోఁచెడిని. 'ఇచ్చు' నకు మూలము 'ఈ' అనునది. 'ఇంచు' నకు మూలము 'ఇన్ = మాధుర్యము.' అనునది.

ధాతుత్వ వివక్షయైవ ఇంచుగాగమో భవతి - తత్ర - అస్తమ్ - అహామ్ - అంతర్ - ఇత్యాద్యవ్యయానాం సుఖ - కరుణా - వర్ష - మత్సర - పల్లవాదీనాం సుబంత తత్సమానాంచ ఉదాహరణస్యాన్. అస్తమించె నిత్యాదిరూపమ్. ఉరవడి - ఇనుమడి - ముమ్మడి తురగలి - చెంగలి - తొలుకరి - తల్లడ ఇత్యాదిదేశ్య శబ్దానామపి ఏతత్సూత్రే, నైవేంచు గంతత్వమ్......అప్పగించె నతనిన్ ఇత్యాదీని తద్భవ శబ్దరూపాణ్యత్రోదాహరణ మితి జ్ఞేయమ్" (అహో. ౪౭౭-౪౭౮ పు), అని కవిశిరోభూషణమున నుదాహరింపబడెను. పై నుదాహరించినరీతిని "కరుణా-పల్లవ" అనువానిని 'ఉరవడీ' త్యాద్యాంధ్రిక శబ్దములను నామధాతువు లనుటలో వివాదములేదు. మిక్కినవాని విషయము విమర్శనీయముగ నున్నది. "అస్తమ్ - అవ్య - (అసు+తమి) నాశే - అదర్శనేచ." "అహామ్ - అవ్య - (అహ+అము) అహాద్యార్థే........" "అన్తర్ - అవ్య - అన్+తుడాగమశ్చ. మధ్యే........" (శబ్దస్తో) "అమే స్తుట్చ" (సి. కౌ. ఉణాది. ౭౩౮ సూ.) "అమ గత్యాదిషు - అస్మాదరన్ స్యాత్ - తస్య తుడాగమశ్చ" (బాలమ). వర్ష:—"వృతౄ వది హని కమి కాషిభ్యః సః" (సి. కౌ. ఉణాది. ౩౪౫ సూ.) "వృఞ్ వరణే......ఏభ్యః స ప్రత్యయ ఇస్యాత్ - వర్షమితి:—ప్రత్యయావయవత్వాత్ షత్వమ్" (బాలమ). (అహోబలపతి 'వర్షించ' అను నుపకృతి నుదాహరించి యిట నామధాతు వనుట వింత). మత్సరః—"కృ ధూమదిభ్యః కిత్. శౌవాయిశాస్య షత్వమ్......మత్సరః ......" (సి. కౌ. ఉణాది. ౩౫౩ సూ). "మత్సరః - పు. మాత్సర్యే............ మాద్యతి పరకృచ్ఛ్రే - మదీ హర్షే - కృ ధూమదిభ్యః కిదితి సః" (శబ్దా. చిం). అనుచెప్పిన 'అస్తమ్ - అహామ్ - అన్తర్ - వర్ష - మత్సర' అనుశబ్దములు "ఉణాద్యంతములు గాన నవి కృదంతములు కామింజేసి యుపకృతిధాతువులు కానేరవు. మరినతి సంస్కృతులనుటకు ప్రసక్తియే లేదుగదా. 'అస్తమ్ - అహామ్' అనువానిని సాధించు 'ఉణాది' సూత్రములు లేకున్నను "సంజ్ఞాసు ధాతురూపాణి । ప్రత్యయాశ్చ తతః పరే । కార్యాద్విద్యా దనూబంధ । మేత చ్ఛాస్త్ర ముణాదిషు" (సి. కౌ. ఉత్తరకృత్. ౩౧౬౯ సూత్రమునొద్ద). అను భాష్యోక్తిచొప్పున శబ్దస్తోమ మహానిధికోశమున నట్టివి కల్పింపబడుటలో ననుపపత్తి లేదు. "తానిచేమాని (ఉణాది) సూత్రాణి శాకటాయనముని ప్రణీతాని. నతు పాణినా ప్రణీతాని.........ఉణాది ప్రత్యయాన్తాః శబ్దాః పాణినిమతే అవ్యుత్పన్నా ఏవ......ఉణాదయో వ్యుత్పన్నాని ప్రాతిపదికా నీతి భాష్యే ఉక్తమ్" (బాలమ. సి. కౌ ఉణాది. ౧ సూ). మయిరీతి నుణాది ప్రత్యయాంతములు 'అన్యస్మాచ్చాపి ధాతో' రిత్యాది ప్రకృత

సూత్రముఁనకు విషయములని యహోబలపండితుఁడు తలంచి యుండును. ఇఁక 'సుఖ' శబ్దము "సుఖమ్ - న......శోభనాని పరిపుష్టాని, ఖా నీంద్రియాణి యేన తత్." (శబ్దా. చిం.) అనుచోప్పున సమాసమగుటచే నయ్యది యుపకృత్యాది భేదత్రయమునఁ జేరదని యహోబలపతి యుద్దేశించి యుండును. ఇట్లె 'దుఃఖ' శబ్దమునైతము "దుఃఖమ్ - న......కష్టాని ఖా నీంద్రియా ణ్యస్మిన్" (శబ్దా. చిం.) అనుచోప్పున సమాసమె యనఁదగునుగాన నదియుఁ బ్రకృతసూత్రమున కుదాహృతి కానోపును. అట్లైన నహోబలపండితుఁడే సంవృతిధాతూదాహరణ పట్టికలో "దుఃఖం - దుఃఖ తత్క్రియాతౌ.........సుఖం.........సుఖ తత్క్రియాతౌ" (అహో. ౪౬౭ పు). అని యుదాహరించుటయెట్లు పొసఁగునని శంకింపరాదు. 'సుఖ - దుఃఖ' అనుధాతువులును గలవుగాన 'సుఖించు - దుఃఖించు' అనువానిని సంవృతులని చెప్పుటలోను విరోధము లేదు. మఱియు నీక్రిందిరీతిగల ప్రక్రియ చొప్పున 'సుఖ - దుఃఖ' శబ్దములు కృదంతములును గల వనఁదగును గానఁ దత్సదృశ రూపము లుపకృతిధాతువు లగు నన్నను ననవచ్చును "సుఖమ్ - న......యద్వా - సుఖయతీతి (సుఖమ్) సుఖదుఃఖ తత్క్రియాయామ్. చురాదిః - పచాద్యచ్" "దుఃఖమ్ - న.........యద్వా - దుఃఖయతీతి దుఃఖమ్ - సుఖదుఃఖ తత్క్రియా యామ్ - చురాదిః - పచాద్యచ్" (శబ్దా. చిం). "నన్దిగ్రహి పచాదిభ్యో ల్యుణి న్యచః. (3-౧-౧౩౪). "నన్ద్యాదే ర్ల్యుః - గ్రహ్యాదే ర్ణినిః - పచాదేరచ్ - స్యాత్ ........." (సి. కౌ. కృదన్త. ౨౮౯౬ సూ).

పయిరీతి నహోబలపండితుఁ డుద్దేశించి యుదాహరించినను భట్టారకుఁడు పాణినిసాధించిన కృదంత సదృశరూపములె యుపకృతులని వచింప లేదుగదా. ధాతువుపైని 'తిజ్' భిన్నప్రత్యయము నిల్పుటచే నేర్పడిన నామమెల్లఁ గృదన్తమె యనఁదగి యుండునుగాన నట్టి యుణాద్యంత ప్రాతిపదిక సదృశరూపములును నుప కృతులెయని భట్టారకహృదయమై యుండునని తోఁచుచున్నది. పాణినిమునియొక్క "ఉణాదయో బహుళమ్ (3-3-౧) (సి. కౌ. 3౧౬౯ సూ) అను సూత్రమునకు విస్తరమె శాకటాయనమునిచే నుణాదులు విపులముగాఁ బ్రదర్శింపఁబడినంత మాత్రమున నట్టి యుణాద్యంత సదృశము లుపకృతులు కానేరవనుట యుక్తము గాదని తోఁచెడిని. కావున 'ఇంచుక్కు' చేరిన ధాతువునందు మూలధాత్వర్థభానము లేకుండువానిని నామధాతువులుగ నంగీకరింపనగుననుటయె యుక్తమని యెఱుంగ నగును. సంస్కృతమునందును నామధాతువులు గలవు. "సుప ఆత్మనః క్యచ్ (3-౧-౮) ఇషి కర్మణః ఏషితృ సంబన్ధినః సుబన్తా దిచ్ఛాయా మర్థే క్యచ్ ప్రత్యయో

వాస్యాత్ - ధాత్వవయత్వా త్సు ల్లుక్." "క్యచిచ (౭-౪-33) అస్య ఈత్ స్యాత్ - ఆత్మనః పుత్ర మిచ్ఛతి పుత్రీయతి... ....." (సి. కౌ. నామ. ౨౬౫౭-౨౬౫౮ సూ). "పుత్రీయతీతి:—క్యచి - పుత్ర+య - ఇతిస్థితే - ఈత్వే 'పుత్రీయ' ఇతి ధాతోః లడాది రిత్యర్థః" (బాలమ). అటువొప్పున "పుత్రీయ" యున్నగు ధాతువునుండి "పుత్రీయించు" మొదలగు తత్సమ ధాతువులను గ్రహించు సంప్రదాయము తెలుంగున లేదు. ఇట్లె "జిగీషించు - కాంయించు" మున్నగురీతిగల సన్ - ణిజంతాది ధాతువులకును దెలుంగున బ్రయోగము లేదు. "రక్షయతి" మున్నగు ణిజంతముల యర్థమును "రక్షింపించుచున్నాఁడు - రక్షింపఁజేయుచున్నాఁడు" మున్నగురీతిని ణిజర్థకములగు నించు గాగమాదులచే సంపాదించుకొనుటయే తెలుఁగు సంప్రదాయము. అట్లయినను "పుగాగమముతోఁ గూడిన సంస్కృత ణిజంతధాతువు ప్రయోగ మరుదుగఁ గలదని యథర్వణుఁ డీక్రిందిరీతిని సూత్రించెను.

పుగాదికేత్యాది:—పుగాదిక విశేషస్య = పుగాగమాదికముతోఁ గూడిన రూపవిశేషముయొక్క సంగ్రహోఽపి = సంగ్రహము సయితము, క్వాచి త్కతః = క్వాచిత్కముగా సమ్మతముగును. ఉదా:—స్థాపించు - స్థాధాతుప్రేరణరూపము. యథాప్రసిద్ధీతి సూత్రము చొప్పునఁ గేవల స్థా-జ్ఞా - మున్నగువానికి ప్రయోగము లేదు. "ప్రస్థాపించు = చక్కఁగా స్థాపనముచేయు" (శ - ర). సంస్కృతధాతువులలోఁ జురాదులకు స్వార్థమందును ధాతుమాత్రమునకును బ్రేరణమందును ణిచ్చు వచ్చును. అట్టి ణిచ్చుపరమగునపుడు పుగాగమ మాకారాంతధాతువుల కగును. అట్టి పుగాగమముతోడి ధాతువు తెల్గునఁ దత్సమధాతువుగా నిల్చునని పై యథర్వణ వచనమునకుఁ దాత్పర్యము. "అర్తి హ్రీ వ్లీ రీ క్నూయీ క్ష్మాయ్యాతాం పుగ్ణౌ (౭-3-3౬) ఏషాం పుక్ స్యాత్ ణౌ." (సి. కౌ. చురాది. ౨౫౭౦ సూ). "అర్తి - హ్రీ - వ్లీ - రీ - క్నూయీ - క్ష్మాయీ - ఆత్ - ఏషాం ద్వన్ద్వాత్ షష్ఠీ." (బాలమ) (సూ. ౨౫౭౦). "అర్పయతి - హ్రేపయతి - వ్లేపయతి - రేపయతి - యలోపః - క్నోపయతి - క్ష్మాపయతి - స్థాపయతి" (సి. కౌ. ణిచ్. ప్ర. ౨౫౭౨ సూత్రమునొద్ద). "అర్పయతి ఋధాతో రుదాహరణమ్. (ఋగతౌ)......... హ్రేపయతీతి 'హ్రీలజ్జాయామ్' ఇత్యస్యరూపమ్. వ్లేపయతీతి - వ్లీవిశరణే ఇత్యస్యరూపమ్. రేపయతీతి - రీక్షయే ఇత్యస్యోదాహరణమ్ - క్నూయీశబ్దే - ఇత్యస్య క్నోపయ తీత్యుదాహరిష్యన్.........క్ష్మాపయతీతి - క్ష్మాయీ విధూననే... ......ఆదన్తస్యో దాహరతి - స్థాపయతీతి........." (బాలమ). వయివానిలోఁ గొన్నిటికి "యథాప్రసిద్ధిత్యా ద్యథర్వణకారికచొప్పునఁ బ్రయోగప్రసిద్ధి లేనందునఁ

దెల్గునఁ బ్రవేశము లేదు. 'అర్పించు - స్థాపించు - ప్రస్థాపించు - విజ్ఞాపించు - ఆజ్ఞాపించు' మున్నగువానికి మాత్రము ప్రయోగప్రసిద్ధి చూపట్టుచున్నది.

"క్వచిద్ధేతుమత్పరా ధాతో ర్గ్రహణమ్. ప్రస్థాపించె రాజన్యులన్. అర్థవేదయో రాపుగ్వక్తవ్యః. అర్థం కరోతి అర్థాపయతీతి పాణినీయమ్. అర్థాపిం - ఉత్థాపిం - అధ్యాపిం." (అహో. ౪౬౮ పు). 'అర్థాపయతి' అనునది నామధాతువు. అహోబలపతి 'అర్థాపిం' అని సంస్కృతిధాతువుగా నుదాహరించెనే కాని 'అర్థాపించెను' మున్నగువానికిఁ దెల్గునఁ బ్రయోగము కన్పట్టదు. కాన నీసంగర్భమున "అర్థ వేదయో రాపుగ్వక్తవ్యః" (సి. కౌ. నామధా. ౨౬౭౭ సూత్రమునొద్ద. ౧౭౫౪ వార్తిక). అనుదాని నుదాహరించుట యనావశ్యకము.

సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు. ౬3.

సంస్కృతధాతువుల కంగలాదుల కించుగాగమం బగు.

బాలవ్యా. 3౭౬ I విష

పఠించు - వచించు - త్యజించు - భజించు - అంగలించు. 'అంగల - అడక - ఆరగ - ఆవుల - ఉంక - ఉగ్గడ - ఓరగ - కార - గాల - జాడ - తిలక - తులక - పంక - పరక - పలవ - అప్ప - ఒప్ప - ఆల - ఇత్యాదు లంగలాదులు.

సంజీవని. 3౭౬ I విషః—ఈసంధ్భమున సూరి నన్నయాథర్వణీయ మార్గము నుజ్జగించి మార్గాంతరమున బ్రక్రియను నడపుచున్నాఁడు. సంస్కృతధాతువు నకును 'అంగలా'ద్యాచ్ఛిక ధాతువులకును 'ఇంచు'గాగము మగునని సూత్రార్థము. ఇంచుక్కు కిత్తుగాన నట్టి ధాతువుల కంతావయవముగా నిల్చును. "పచ్ - పాకే" మున్నగువాని కించుక్కుచేరఁగా "పచ్+ఇంచు = పచించు" మున్నగు తత్సమ ధాతువు లేర్పడునని సూరియాశయము. (విస్తర.) ఈనియమమున నుపక్రమాద్యాది

---

విస్తర. 3౭౬ I విషః—"ఈ యించు గాగమ యుక్తంబయిన 'ధరించు' ఇత్యాది ధాతువులందు నించుగాగమ సంబంధి యికారంబుగాని యట్టి యికార యుక్త హల్లుగాని యతిగా నుండవచ్చును ........కాన నప్పకవి వచనం బొప్పఁ దగినది కాదు........." (బా. గు. ప్ర. 3౫౬ పుట. ద్వి. ము). అని యిట్లు గుప్తార్థ ప్రకాశికాకర్త విస్తరించి వ్రాసెను. 'ధరించు' మున్నగుచోటులం దించుగాగ మేకారంబునకు స్వరయతి నిల్పుట భారతాది ప్రాచీనకవి సమ్మతము కామింజేసి యప్పకవి యొప్పలేదు. అట్టి యాతనిపద్ధతిని నిరసించుట యుక్తము కాదుగదా. మఱియు నీసందర్భమున నప్పకవీయములోని 'అభిన్నయతి - అభేదయతి' అనువానికిఁ

భేదములు లేవు. సూరి యుదాహరించిన నాల్గు తత్సమధాతువులును జింతామణి మతములో సంస్కృతిధాతువు లగుచున్నవి. పరిణతి ధాతువులను సంగ్రహించుట కయి బా. క్రి. ౬౪ సూత్రమును నుపకృతిధాతువులను సంగ్రహించుటకు బా. క్రి. ౬౬ మున్నగు సూత్రములను నుపదేశించినవాఁడయ్యెను. అట్టి ౬౬ మున్నగు సూత్రములచేత నుతించు - స్తుతించు - శయనించు - ఆలాపించు - ఆహారించు - సంతాపించు - ఆపాదించు - ప్రసాదించు - సంపాదించు - ఉత్పాదిల్లు - నివారించు - సంభావించు - అనురాగిల్లు - విచారించు - సమ్మానించు - మాయించు - పారించు - ధ్యానించు - ఆచ్ఛాదించు - జీర్ణించు - ఆఘూర్ణించు - మొదలగు పరశ్శతములగు నుపకృతిధాతువులు సూరిపక్షమున సంగ్రహింపఁబడవయ్యె. అట్లగుటంజేసియే "నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు" (బా. క్రి. ౬౫ సూ) అని సూత్రించి "నుతించు-స్తుతించు ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్షయం దించు గాగమం బగునని యెఱుఁగునది. శయనించు - పయనించు." అని వివరించుకొను నవస్థ సూరికి సంభవించెను. ఏవో యులంతిధాతువులు జ్ఞాపకసిద్ధములనుట యుక్తముగాని పరశ్శతములగు ధాతువుల నట్లు సంగ్రహించుట యుక్తమా? మఱియు నిట్లు ప్రాతిపదికములనెల్ల నిట్లు సంగ్రహించుకొనునపు డింక ద్వేషించు మున్నగువానికై బా. క్రి. ౬౬ సూత్రము నుపదేశించుట సిద్ధసాధనమె యగుచున్నదికాదా? మఱియు నీతఁడిట్లు నామధాతువులను సృజించుట కారభించుటంజేసి కరుణాది కృదంతములనుండి 'కరుణించు' మున్నగు ధాతువులను 'పల్లవా'ది సమాసములనుండి 'పల్లవించు' మున్నగు ధాతువులను 'కృత్తద్ధిత సమాసాశ్చ' (౧-౨-౪౬) (సి. కౌ. ౧౭౯ సూ) అనుచొప్పున నామత్వము నడఁగాఁ బ్రాతిపదికత్వమును సంపాదించి సంగ్రహించుకొను నవస్థయు దుర్వార మగుచున్నది. ఇంతియు కాక "అంగలా" దులో 'గాల'మున్నగు వానితోపాటుగ 'పయన'మున్నగు వానిని జేర్చుకొనుటచే "పయనించు" మున్నగు ధాతువులు సిద్ధించుచుండఁగా నట్టి వానిని సైతము జ్ఞాపకసిద్ధములనుచు సంగ్రహించుకొను చిక్కు నేల పడెనో తెలియకున్నది.

---

గలభేదమును దెలిసికొనంజాలకయు "శాకుప్వారయతి యనఁదగు। ........" అను ననంతుని పద్యములోని యుదాహృతులను సరిగ నర్థముచేసికొనఁజాలకయు నప్పకవి యట్టిపద్యము సభేదయతి కెట్లుదాహరించెనో గ్రహింపఁజాలకయు నీగుప్తార్థప్రకాశికాకర్త యప్పకవిని నిరసించుట—"బధిరశ్రవణంబునొద్దఁ బట్టిన శంఖధ్మానంబును స్మరింపఁజేయుచున్నది." (బా. గు. ప్ర. 3౪౭ పు). అని నిరసించుట యెంతయు శోచనీయము. అప్రసక్తమగుటచే నిట నద్దానిని విస్తరించి చూపలేదు.

శబ్దరత్నాకరాది కోశములలో "అంగలించు" అనుధాతు వుదాహరింపఁ బడలేదు. "అంగలార్చు" మున్నగువానినిబట్టి 'అంగలించు = దుఃఖించు' అను ధాతువు గ్రాహ్యముగు కానోపునని సూరి యుద్దేశించియుండును. శబ్దరత్నాకరాది కోశములలో 'అంగవించు' అను ధాతు వుదాహృతమైయున్నది. "అంగవించు - దే - అ - క్రి. ఉత్సహించు.........స - క్రి - అతిక్రమించు. సీ. ఈతుణ జిత పద్మ నితని నేక్రమమున. విరుతపద్మము లంగవింపఁజాలు. (నై. ౫ ఆ. ౧౪౫ ప). (అంగలించు అని కొన్ని ప్రతులయందున్నది. ఆపాఠము ఛుతికి విరుద్ధము ......)"(శ-ర). ఈశబ్దరత్నాకరపు ధోరణినిబట్టియు 'అంగలించు' అనుధాతువుదాహరింపఁబడకుండుటంబట్టియు "అంగలాడు" లనుటకు బదులుగా "అంగవాడు లనఁ దగునని శబ్దరత్నాకరకర్త తలంచినట్లు తోఁచెడిని. సీ. మొనలావులించి వాసన సల్లఁ బసిఁగొని, లేఁదేఁటికము లేఁగులింపకుండ (నన్ని. కు. 3 ఆ. 3౫౧). ఈపద్య భాగము సూ. రా. నిఘంటువున 'ఆవులించు' శబ్దముకొఱ్ఱ సుదాహరింపఁబడెనే కాని 'ఏఁగులించు' ధాతువె యుండుఁ జూపఁబడలేదు. 'ఏఁగులించు' అనునది యపశబ్దమని తోఁచెడిని. ఇది సంస్కృతప్రత్యేక్షపుని తోఁచెడిని. 'ఏఁగులించు' అనునది యేకోశమునను లేదు. 'లేఁత' అను విశేషణము 'తేఁటు'ల కసంగతము. కాన "వే దేఁటికము లంగవింపకుండ" అని కవిప్రయుక్తపాఠముని తోఁచుచున్నది. అంగవించు = ఉత్సహించు = వచ్చు. గాల-తిలక మున్నగువానిని ధాతువులనుటకంటె "గాలము-తిలకము" మున్నగు నామములనుండియే 'గాలి చు-తిలకించు' మున్నగు ధాతువుల సంగ్రహించుకొనుట యుక్తమని తోఁచుచున్నది. 'అడకించు' అనుదానికి 'అడకము' అను నామము కన్పట్టుచున్నది. "అడకము - దే - వి - లోపల నడఁగినది. అంత ర్భాగము. ద్వి. నానామరేంద్ర బృందము మాయలెల్ల। హరిమాయలోపల నడకముల్........" (విష్ణు. పు. ౧ ఆ). (శ. ర). ఆరగ = ఆరగించు = ఆహరించు = తిను. "ఆరగించు = భుజించు, త్రాగు - ఆహారః" (వై. దీ). ఆవుల = ఆవులించు = జృంభించు. సూ. రా. నిఘంటువున 'ఆవలించు' అను ధాతువునైతె ముదాహరింపఁబడెనుగాని "ఉత్కాత్వ" నిర్ణాయక ఛుతిస్థానగత ప్రయోగము లభింపలేదు. ఆంధ్రభాషార్ణవకోశమె 'ఆవలించు' అను 'అ'కార ఘటితరూపమున కాధారము. జృంభించునప్పటి శబ్దముయొక్క యనుకరణమె 'ఆవుల' శబ్దమని తోఁచెడిని. అట్టి 'ఆవులింత' లో 'అ'కారశ్రుతి యనుభవ విరుద్ధమునియుఁ దోఁచుచున్నది. ఉంకె = ఉంకించు = యత్నించు, పూను. ఉగ్గడ = ఉగ్గడించు = ఉద్ఘాటించు. "ఉగ్గడించు= శబ్దించు, స్తుతించు - ఉద్ఘాటనమ్" (వై. దీ). ఓసర = ఓసరించు = తొలఁగఁజేయు,

విడుచు. "ఓసరిల్లు - ఓసరు = ఒదుఁగు - అపసరః" (వై. దీ). కార = కారించు. "కారించు సం - స - క్రి. బాధించు - పీడించు." (సూ. రా. ని). ఇట్లగుటచే నిది యాచ్ఛికధాతువుగా సంగలాదులలో నుదాహరింపఁబడుట ప్రమాదమని తోఁచెడిని. "కారణ - న.........కౄఞ్ హింసాయామ్ - స్వార్థేణిచ్ - భావే ల్యుట్ - వధే.........కౄఞ్ హింసాయామ్ - ణిచ్ - యుచ్ - టాప్ - కారణా - యాతనాయామ్ - స్త్రీ." (శబ్దస్తో). "కారికా - స్త్రీ.........యాతనాయామ్." (శబ్దస్తో) అనుచొప్పున "కారించు" అనునది సంస్కృత సమధాతు వనఁదగును. "కాటియ = తీవ్రవేదనా - కారికా" (వై. దీ). అనుచొప్పున కారికా శబ్దభవము కాటియశబ్దము గన్పట్టుచున్నది. కాని "కాటించు = పీడించు" అనుధాతువు కోశములలోఁ జూపఁబడలేదు. గాలః—సంస్కృతమందలి "గల భక్షణే - స్రావే" "గల క్షారణే" (భ్వాది. చురాది. శబ్దస్తో) అనుచొప్పున గల ధాతువు దీనికి మూలము కానోపును. దీనినుండి పుట్టిన కృదంతరూపములు కంఠార్థక గల శబ్దము మున్నగునవి శబ్దస్తోమ మహానిధి ప్రభృతి ప్రసిద్ధ సంస్కృతకోశములలోఁ గన్పట్టుచున్నవి. అన్నాదికము కంఠమునుండి జాఱునుగాన నట్టి శబ్దములు సమర్థములగుచున్నవి. ఱాలతోఁగూడిన బియ్యమును నీటిలోఁబోసి ఱాలను జార్చి బియ్యము తీయుటకు "గాలించుట" అను పదము వాడుకలోఁ బ్రసిద్ధముగా నున్నది. ఇట్టి యర్థమునుండియే "గాలించుట=వెదకుట" అను నర్థము గౌణముగా నేర్పడియుండ నగును. ఈయర్థమునకుఁ గవిప్రయోగములు గన్పట్టుచున్నవి. దీని ననుసరించియే గాలశబ్దము 'బడిశ'మను (మత్స్యబంధనము) గౌణార్థమునందుఁ బ్రసిద్ధమయ్యెనని తోఁచెడిని. ఈయర్థమునకును గవిప్రయోగములు చూపట్టుచున్నవి. దీని ననుసరించి 'నూతిలోని చేదను దీయు'నుపకరణము'అనునర్థమును దీనికి వాడుకలోఁ బ్రసిద్ధమయ్యెనని తోఁచెడిని. ఇట్టి యర్థవికృతులు పెక్కులున్నను నాకారమం దించుకేని మార్పు చూపట్టమింజేసి 'గాలము' అనుశబ్దమునుగాని 'గాలించు' అనుధాతువును గాని వైకృతమనుట కవకాశము లేకున్నది. ఇంక వానిని దత్సమములనియే చెప్పక తీరకున్నది. ఈ యభిప్రాయమునకు హస్తావలంబముగా "కేశవమిశ్రుని నానార్థార్ణవ సంక్షేపమను కోశములోనిదనెడి సూ. రా. నిఘంటువునందలి యీక్రింది వ్రాఁత గన్పట్టుచున్నది. "గాలము - సం - వి - అ - పుం - ౧ గళనము. ౨ ముదనము ఉన్మత్త. స. ౧ ఉన్మత్తకాయ. ౨ బడిశము - గాలము. (కే-ని)" ఇట్లుదాహరించియు సూ. రా. నిఘంటుకారులు -'గాలము - గాలించు' అనుశబ్దముల నాచ్ఛికములనుగా నుదాహరించుట వింతగానున్నది. శబ్దరత్నాకరమున నివి దేశ్యము

లుగా నుదాహరింపఁబడుటయే యీ సూ. రా. నిఘంటువు వ్రాఁతకు మూలమయ్యె
నని తోఁచుచున్నది. గాలము = గాలాము శబ్దమునుమాత్రము వైకృతమునుగాఁ
జూపి 'గాలించు' శబ్దము నట్లుచూపక సూ. రా. నిఘంటుకారు లాచ్ఛికముగా
జూపుట నరయఁగా వారును దీనిని దేశ్యమని తలంచిరనియె విశ్వసింపనగును.
సూ. రా. నిఘంటుకారులు తద్భవక్రియలను "ఉగ్గడించు - స - క్రి. (సం. ఉద్ఘాట్
......)" అనురీతిని వైకృతములను జూపుచువచ్చుటచేఁ బైరీతిని వ్రాయవలసెను.
"ఉద్ఘాటించు-రం-స-క్రి......"అనురీతిచే తత్సమములను జూపుచుందురు."గాలము
దే-వి. చేఁపలను బట్టుటకు ఉక్కుకమ్మితో వంకరగాఁ జేసిన సాధనము, బడిశము...
..." (శ-ర). "గాలము = గాలాము. వి. (సం. గాలమ్. క. తుగ్గాళ). ౧ చేఁప
లను బట్టుటకు ఉక్కుకమ్మితో వంకరగాఁ జేసిన సాధనము, బడిశము......౨ నూతి
లోని చేద మున్నగునవి తీయుట కుపయోగించు సాధనము (వాడుక)" సూ. రా.
ని). "గాలించు - దే - స - క్రి ౧ బియ్యము లోనగువానిని నీళ్లలో పోసి రాళ్లు
లేక శోధించు ౨ వెదకు........" (శ. ర). సూ. రా. నిఘంటువునఁ బైశబ్ద
రత్నాకర విషయములె స్వీకరింపఁబడినవి. ఇంక వీని నాచ్ఛికములనుటకుఁ గొన్ని
కారణములు గన్పట్టుచున్నవి. "గాలకాఁడు - దే - వి - (గాలము+కాఁడు) చేపలను
బట్టువాఁడు - కైవర్తుఁడు. సీ.........గీ......... | ఆమిషము గాలకాని
కెట్లట్ల........(అను. ౫ ఆ. ౨౫౬)" (శ-ర) దీనినెల్ల స్వీకరించి సూ. రా.
నిఘంటుకారులు "గాలగాఁడు"అని మాత్రముమార్చి యుదాహరించిరి. ఈ తిక్కన
ప్రయోగమునుబట్టి 'కా' ప్రత్యయాంత గాల శబ్ద మాచ్ఛిక మనవలసియున్నది.
(౫౯౧ విష. చూ). "గాలాము - దే - వి. గాలముయొక్క రూపాంతరము. సీ.
వాలారుగోరు పెన్ గాలాము నేసె నే, జేజే హిరణ్యాక్షు శిశుకమునకు...(పాండు.
౨ ఆ. ౧౩౭)" (శిశుక = మత్స్యవిశేష). (శ-ర) ఈవిషయములె సూ. రా. నిఘం
టువునందును నుదాహరింపఁబడెను. "ఏతము = ఏతాము, లాతము = లాతాము,
బొండ్లము = బొండ్లాము, గోతము = గోతాము." (బా. ప్రకీ. ౧౫ సూ. చూ).
అనువానివలెనె యియ్యదియు నాచ్ఛికము కానోపు ననవలసియున్నది. పై పాండు
రంగ మాహాత్మ్య పద్యమున దీర్ఘమధ్యగాలాము శబ్ద మంగీకరింపవలసిన ప్రసక్తి
యగపడదు. తగణమువలెనే భగణమునైతము సీసగణమేకదా. ఇంక సోమయాజి
ప్రయోగములోని 'గాలకాఁడు' అనుచోట 'కా' ప్రత్యయము తత్సమములపై
నైతము నిల్చునన్న పక్షముచొప్పున నద్దాని కాచ్ఛికత్వము నంగీకరింపక తీరదనరాదు
గదా. సూ. రా. నిఘంటుకారు లుదాహరించిన కువలయాశ్వచరిత్ర పద్యము

సైతము సరియగు ప్రమాణము కానేరదు. క. చాలఁ గుఱుగంటి మదుఁగుల । గాలా
పు స్వేటలాడఁగా దొలకఁ బ । ల్లీలు.........(కుచేల. ౨ ఆ ౧౦౮). ఇందును
"గాలఁపు స్వేటలాడఁగా" అని విప్రయుక్తపాఠ మునఁదగును గదా.
పయిన దర్శితమునుబట్టి 'గాల' యను ధాతు వాఙ్మికములగు సంగలాదులలోఁ
జరింపఁబడుట సరికాదని తోఁచుచున్నది. వాడ:—"వాడించు - దే - స - క్రి.
౧ కంపమొందఁజేయు, ౨ గడ్డలు నీళ్ళలో వేసి అటు నిటు పొర్లించి యెత్తు" (శ.ర).
తిలక:—"తిలకించు. దే - అ - క్రి. ౧ ప్రకాశించు.........౨ స - క్రి - చూచు
......ఈయర్థము ఆధునికుల ప్రయోగములందు కానఁబడును." (శ.ర.) సూ రా.
నిఘంటువునందును నిది యాచ్ఛికముగనె చూపఁబడెను. "తిలక - పు - (తిల+క్వన్.
తిల ఇవార్థే కాన్ వా.........స్వనామఖ్యాతె నాసాదౌ ధార్యే చన్దనాది విశే
షకే - పు - న. ప్రధానే - త్రి. ఘుతులల ........." (శబ్దస్తో) అను నర్థ
ములుగల తిలకశబ్దము యిది యొకవిధాలోని కలసియున్నది. తిలకముచే
ముఖము ప్రకాశించును. బొట్టును నిడానించి చూచి పెట్టుకొందుము. వెనుకకుఁ
దిరిగియున్నవారు తిల ముగల ముఖభాగము ద్రిప్పటయె చూచుటలో సంభవించు
ను. తుల :—"తులకించు-దే-అ - క్రి. ప్రకాశించు........." (శ. ర). పంక:—
"పంకించు.........వై - అ - క్రి - చలించు" (శ. ర). "కంపించు = కంపించు -
కమ్పః" (వై. దీ.) (వర్ణవ్యత్యయ వికృతి). పరి:—"పరికించు = పరీక్షించు -
పరీక్షా" (వై. దీ.). పలవ:—"పలవించు = వై - అ - క్రి - పలవరించు......"
(శ.ర). 'ప్రలాపించు' అను దాని వికృతరూపమై నదగి యుండుటచే నిదియుఁ దద్భవ
ధాతువె యనఁదగును. ఒప్ప. ఒప్ప:—'అప్పించు - ఒప్పించు' అను నవియు
'అర్పించు' అనుదాని వైకృతరూపములె యనఁదగునుగాని "అప్పించు" అను
ధాతువు కోశములం దుదాహరింపఁబడలేదు. "ఒప్పించు, ఒప్పగించు (అప్పించు =
ఇచ్చు).........క.........। ఒప్పించిన నిట్టు నట్టు నొఱవలుగా.........(వి రా.
౪ ఆ. ౩౯)" (సూ. రా. ని). ఆల:—"ఆలించు = ఆలక్షించు (విను) = ఆలక్షమ్"
(వై. దీ). ఇత్యాదులనుటచేత "ఉడిపడి - ఇనుమడి - ముమ్మడి (తురగలి) చెంగలి -
తొలుకరి - తెల్లడ ఇత్యాద" (అహో. ౪౭౮ పు). మున్నగునవియు సంగలాదుల
లోనివే యని యెఱుంగునది.

ప్రయోగములు:—క. గర్వించి పటికి తగు, సీ । గర్వము భుజవీర్యమును
బ్రకాశంబుగ నీ । పర్వతవివరము తెర్చి వి । గర్వింపుము చూతె మనిన గోత్రభిదుం
డున్ (ఆది. ౬ ఆ. ౨౭౫). "విగుర్వించు - దే - స - క్రి. (విఱుచు + విఱుచు =

విగుర్వించు) చక్కగా విలుచు. క. గర్వించి పలికితిని........." (శ. ర). ఇట్లు దీనిని దేశ్యమనుట ప్రామాదికము. "గు ర్వుద్యమే గర్వ ఇతదే" (కవికల్పద్రుమము). అనుచొప్పున 'గుర్వ' అను సంస్కృతధాతువు గలదుగాన 'విగుర్వించు' అనునది సంస్కృతిధాతువే యనదగును. క. తనకుం దోడ్పడి యని నా । చ్చినవానింగాంచి కడిఁగి చేష్టింపక యున్న.........(శాంతి ౨ ఆ. ర౨౨ ప). క. నా దేహంబునఁ బుట్టిన । యాదిసుతున్ విడువ నెట్టుల ఓ నాత్మజులం । గాదనక ఘూర్ణించు ద।యా దూరులు గలరె యిట్టు లన నీకగు నే (ఆ. ౧ ఆ. ౫౩). క......... । ఘూర్ణింపఁగ .........(హరి. పూ. ౧ ఆ. ౮౧). శా. ఆరూఢోర్జగన్నైదయైన శతపత్రాక్షుం బ్రవీక్షించి.........(ఉ. హరి. ౬ ఆ. ౧౮౫). ద్వి. ఆట్టిద కాక యహంకరించి నను (బసవ. ర ఆ. ౫౬౧). క. కొనియాడి కథింతు నీదు కోరిక యలరన్ (హరి. ఉ. భా. ౫ ఆ. ౧౧౦). అభ్యర్థించుచున్ (కాశీ. ౧ ఆ. ౧ర ప). ఆహారించు. (కాశీ. ౨ ఆ. ౮౦). (నై. ౧ ఆ. ౧౨౩). అహంకరించు (జైమి. ౨ ఆ. ర౩). సీ....అత్యయంబున బ్రహ్మాండ మాస్వదించు (కాశీ. ౫ ఆ. ౮౧). (౬ ఆ. ౩౯). కం. క్రతుపరులు నన్ను నొగ సం । స్తుతించి ఫలమందఁ గంద్రు......(అశ్వ. ౩ ఆ. ర౦ ప). గీ. అమరపతిఁ దొట్టి వేల్పుల నవమతించె (ఆర. ర ఆ. ర౦౧ ప). చ......... ధర్మసుస్థితి మతినైతి నన్నునుమతింపు గుణాకర పోయి వచ్చెదన్ (ఆర. ఆ. ౧రర). శా......రాత్రియా । నచ్చో నిష్ఠ శయించు (శాంతి. ౨ ఆ. ౨౩౩). సీ...... ఆ-వె. బ్రహ్మచర్యమునకుఁ బరమాయు వుపవాస । ములకుఁ జిత్తశుద్ధి, ఫలజలంబు । లాహారించి (ఆహారించి = తిని) యునికి రాధిరాజ్యము పత్త్రి । భక్షితకు దివంబు ఫలము లభిప (అను. ౧ ఆ. ౧ర౩). ద్వి. శ్రీరమ్యముగ నలంకారింపఁ బంచి (బసవ. ౨ ఆ. ౨౭). శా. చండావాతములం దటద్రుమము లుచ్చాటించి......... । డిండీరాంతర వీచులం బెనుప నుడ్డీనించె.........(హరి. పూ. ౬ ఆ. ౧౧౬). క... ......శౌర్యాది గుణో । జ్జ్వలులు విశేషించి మదీ । యులు మిగుల (హరి. ఉ. భా. ౧౦ ఆ. ౨౩౩). క.........భూతే । శ్వరు వినుతించి సమూహిం । చిరి... ......(హరి. పూ. భా. ౬ ఆ. ౭౦). అంగలాదులకు:—అంగలశబ్దవిషమున నీవలి కుదాహరింపఁబడెను. "ఆరగించు - ఓసరించు - ఉగ్గడించు - పంకించు - ఒరిసించు - పలవించు - అప్పించు - ఒప్పించు - ఆలించు" అనునవి వైకృతధాతువులనియు 'కారించు - గాలించు - తిలకించు' అనునవి తత్సమధాతువులె యనియు నీవలికె వివరింపఁబడెను. చ. వినయము దగ్గఱన్ సయిఁపు కెంతయు (హరి. పూ. ౧ ఆ. ౧౭౦ ప). (సహించు—వికృతులు - సయించు=సయిఁచు = సైఁచు). ద్వి. అవధారు వేదవేదాం

తావగమ్య । అవధారు విన్నపం బాశ్రితసులభ (బసవ. ౨ ఆ. ౫౬౫). (అవధరించు—వికృతి—అవధారు. దీనిని 'అవదారు' అని యంగీకరించు టుచితము. 'ధా' అను మహాప్రాణము ప్రాసఘటితముగఁ బ్రయోగములందుఁ గన్పట్టలేదు. కాని లాక్షణికులెల్ల దీనిని వర్గచతుర్థముతోనె యుదాహరింతురు. "అవధారు దేవి ఇతిరూపమ్- అవధరింపుము ఇతి తదర్థః" (అహో. ౪౬౬ పు). "అవధారు - వై-గ్రా-ని. వినుము. (దీనిని వర్గ తృతీయయుక్తముగాఁ జెప్పవచ్చునుగాని ప్రయోగములయందంతట నిట్లేయున్నది)." (శ. ర). (అట్టి ప్రయోగములను జూపలేదు). "అవధారు - అవ్య. (సం. అవధారయ. క. అవధారు). అవధరింపుము - వినుము......... సీ. అవధారు దేవ మధ్యాహ్న సంధ్యావేళ.........(నైష. ౮ ఆ. ౯౧3 ఆ. ౧౨౦. ఉ. రా. ౪ ఆ. ౨౮౨).........." (సూ. రా. ని). క.........కదిసి ననున్ గడిమిన్ । మానుప దిక్కు గలిగినన్ । రాని మ్మెలుగింపు మీా మొనం గలవారిన్ (కర్ణ. 3 ఆ. ౨౧౨ పు). (ఎలుఁగు = కంఠధ్వని - పిలుచు). సీ. ఇనుఁ డున్న దెస నుండి యెలుఁగింపఁ దొడఁగెఁ బక్షులు.........(అర. ౬ ఆ. ౧౯౪). మొ. "అడకము - దే - విశ - అంతర్యాకము - లోపల నణఁగినది. ద్వి. నానామరేంద్ర బృందము మాయలెల్ల । హారి మాయలోపల నడకముల్" (విష్ణు. పు. ౧ ఆ). (శ. ర). క. ముసురుకొను జర భరంబున । నసు రుసురై యున్న మమ్ము నడకించితి... ......(మనుచ. ౪ ఆ. ౮౪ పు). "ఉంకు - దే - అ - క్రి. ఎగురు. గీ. నీర ముంచిన సొరకాయ యెగసినట్లు । ......... । ఉంకు చెండు విధంబున......... దాఁటె నిట్టి. (ఉ. హరి. ౪ ఆ. ౨౮ పు). దీనినిబట్టి. 'ఉంక' అనుటకంటె 'ఉంకు' అనుట యుక్తమని తోఁచెడి.

బాలవ్యా 3 ౨౬ II విష.

ఇ - ఉ - ఋల కించుక్కు పరంబగునపు డయు గవు గరుక్కులగు. ౬౪.

జి - జయించు, నీ - నయించు, ద్రు - ద్రవించు, లూ - లవించు, ధృ - ధరించు, తౄ - తరించు.

సంజీవని. 3 ౨౬ II విష:—అయుక్+అవుక్+అరుక్ = అయు గవు గరుక్కులు. ఇ - ఉ - ఋల కనఁగా "ఇ - ఉ - ఋ" అనునవి తుదినిగల ధాతువుల కించుక్కు పరంబగునప్పుడు వరుసగా "అయుక్కు - అవుక్కు - అరుక్కు" అనునవి యాగమంబు లగునని యర్థము. అయుగాదులు కిత్తులుగాన ధాతువున కంతాగమము లగును. 'ఇ - ఉ - ఋ' అనునవి తపర కరణము లేకుండ నిర్దేశింపఁబడినవి గాన వాని దీర్ఘములు తుదినిగల ధాతువులకును నంతాగమము లగునను నర్థము

లభించును గావున నించుక్కు పరంబగునపుడు 'ఇ - ఈ' లు తుదినిగల ధాతువులకు 'అఙ్' అనునదియు, 'ఉ - ఊ' లు తుదినిగల ధాతువులకు 'అవ్' అనునదియు, 'ఋ - ౠ' లు తుదినిగల ధాతువులకు 'అర్' అనునదియు నంతాగమములగు నని సూత్రార్థము. "అయవర న్విత్రైవ భవే" త్తను చింతామణి యుపదేశించిన 'అయవర్' పరిణతి ప్రక్రియయే యిందు సూత్రింపఁబడెనని యెఱుఁగునది. ఉపకృతుల కృత్ ప్రత్యయ పరకత్వమునందు ధాతువు తుది స్వరమునకు వచ్చు గుణమును దర్వాత నగు 'అయ్' మున్నగు సంధికార్యములును నిట్లు నిర్వహింపఁబడెను. ఇంక లఘూపధంబులకగు గుణాదేశ మెట్లును బా. క్రి. ౬౬ సూత్రమున నుపదేశించుచునే యున్నాఁడు. ఇట్లు మార్గాంతరమును ద్రొక్కుటచే గల్గిన లోపములను 3౨౬ I విషయమునఁ గొన్నిటిని జూపియే యున్నాను. ఇంకను 'యథా ప్రసిద్ధి ధాతూనాం। ప్రయోగః సమ్మతో భవే' త్తను రీతిని సూరి వచింపమింజేసి ప్రకృత సూత్రము చొప్పున 'ను' మున్నగు ధాతువులనుండి "నవించు" మున్నగు ధాతువులు సాధువులె యను నపసిద్ధాంతము దుర్వారమె యగుచున్నది. మఱియు, బా. క్రి. ౬౫ సూత్రము - 'నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు' - మున్నగు సూత్రముల నుపదేశించుకొను ప్రక్రియా గౌరవమును గల్గుచున్నది. ఉదా:—'జి' ఇది 'ఇ' కారాంత ధాతువు - దీనికి 'అయ్' అను నాగమము రాఁగా 'జి+అయ్+ఇంచు' అని యగును. ౭౫ విషయము చొప్పున నిత్యమగు నపవాది స్వరసంధి కల్గఁగా 'జయ్+ఇంచు = జయించు' అను తత్సమ ధాతురూప మేర్పడును. ఇట్లే - 'నీ+ఇంచు = నీ+అయ్+ఇంచు = నయించు' అను ధాతురూప మేర్పడును. ద్రు - ద్రవించు, లూ - లవించు, ధృ - ధరించు, తౄ - తరించు - మొ. అనుభవించు - సంభవించు మున్నగు చోటులందును నిట్టి రీతినే రూపసిద్ధి నెన్నునది.

నిర్జి నామంబుల కయు గాగమంబు గలుగదు. ౬౫.

బాలవ్యా. 3౨౬ III ౧౪ — నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు. నిర్జించు - నుతించు - స్తుతించు. ఈ జ్ఞాపకంబు చేతనే నామంబులకు ధాతుత్వ వివక్షయం దించు గాగమం బగునని యెఱుంగునది. శయనించు - పయనించు.

సంజీవని. 3౨౬ III వివ:—నిర్జి యనఁగా 'నిర్' అనునది పూర్వమందుఁగల జి ధాతువు, నామంబనఁగాఁ బ్రాతిపదికము. "నామము లనఁగా ధాతువులనుండి గలిగిన నామవాచకములు" (బా. సా. పే. ౪3౮ పు). అను నిర్వచనము సరికాదు. ఇది యింగ్లీషు సంపర్కమున వచ్చిన శబ్దము. నామవాచకమనఁగాఁ బేరిని దెల్పునది,

వేరును దెల్పునవి మాత్రమే కాక విశేషణ సర్వనామావ్యయములెల్ల నామములే ప్రాతిపదికములే కదా. నిర్ పూర్వక 'జి' ధాతువును 'నుతి - స్తుతి' మున్నగు నామ ధాతువులను 'ఇ' వర్ణాంత ధాతువులెయ్యైనను వాని కించుగాగమము పరమగునపుడు 'అయుక్' అనునది రాదని సూత్రార్థము. ఉదా:—నిర్జించు - నుతించు - స్తుతించు - మొ. 'నిర్జయించు - నుతయించు' మున్నగు ననిష్టరూపములు గల్గనేరవని తాత్పర్యము. శా. శ్రీరామాన్యాభయము ప్రమాదమున నిర్జించున్ దృఢస్వాంతుడై (శాంతి. ౫ ఆ. ౧౧౬). ఉ.........పురంబులోన ని। ర్జింతునకాక యంచు వికసిల్లె.........(అర. ౬ ఆ. ౫౦).

బా. క్రి. ౬3 సూత్రముచొప్పున సంస్కృతధాతువులకును సంగలాద్యాచ్ఛిక ధాతువులకును మాత్రమే యించుగాగమము విధింపఁబడుటంజేసి 'నుతి - స్తుతి' మున్నగు సంస్కృతనామముల కించుగాగమప్రాప్తియే లేకున్నను నట్టివానికి ధాతువులకు విధింపవలసిన యాయుగాగము నిషేధము వచింపఁబడుటంజేసి నామములకును ధాతుత్వ వివక్ష చేయనగు నను నర్థ మీ సూత్రముచే జ్ఞాపకవిషయము మగుచున్నది. కావున నామంబులకును ధాతుత్వ వివక్ష చేసి ధాతువులకువచ్చు కార్యములను ఘటింపనగునని "ఈజ్ఞాపకంబు చేత నే........." ఇత్యాదివాక్యముచే సూరి వివరించినవాఁడయ్యెను. దీనిచే - 'నుతి - స్తుతి' అను 'ఇ' వర్ణాంత నామములే కాక పెక్కునామములు ధాతువులగుచున్నవని విశదపఱుచుట కుదాహరణాంతరము లియ్యఁబడుచున్నవి శీ - ధాతు ల్యుడంత రూపమగు 'శయన' శబ్దమునుండి 'శయనించు' అను నామ ధాతు వేర్పడుచున్నది. సూరి 'పయనించు' అనుదానిని నామధాతువుగా నుదాహరించుట సరికాదని తోఁచెడిని. 'అడకము - తిలకము' మున్నగు నాచ్ఛిక శబ్దములనువలెనె ప్రయాణశబ్దభవమగు 'పయనము' అనుదానిని సయితము 'అంగలాదుల' లోఁ జేర్చి సాధించుకొనుట యుక్తము అనన్యగతిక స్థలములందు మాత్రమె నామములకు ధాతుత్వ వివక్షచే ధాతుత్వమును జ్ఞాపకసిద్ధముగా నంగీకరించుట యుక్తముగదా. కాన నిట సంస్కృతనామములకువలెనె యాచ్ఛికనామములకు ధాతుత్వ వివక్ష చేసికొని కొన్ని యగతికములగు "ఎదురు+చు = ఎదురుచు - చిగురు+చు = చిగురుచు" మున్నగు రీతిని 'చుగాగమము' (బా. క్రి. 23 సూ) చేర్చిన ధాతువులను సాధించుకొనుట యావశ్యకము. (బాల. ప్రకీ. ౨౦ సూ. చూడు.)

సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగు
నపుడు గుణంబగు. ౬౬.

ఆ - ఏ - ఓ - ఈ మూఁడును గుణంబులు నాఁబడు.

౩౨౬ IV విష. ఋస్థానికంబగు గుణంబు రపరంబయి యుండు.

బాలవ్యా. సంస్కృత ధాతూపధలకు ఇ - ఉ - ఋ - అనువానికి సొరిదిని ఏ - ఓ - అర్ - అనునవి యించుక్కు పరం బగునపు డగునని యెఱుంగునది. ఛిద్ - ఛేదించు, భిద్ - భేదించు, ఘుష్ - ఘోషించు, పుష్ - పోషించు, వృష్ - వర్షించు, హృష్ - హర్షించు.

సంజీవని. ౩౨౬ IV విష:—ఇంచుక్కు పరమగునపుడు లఘూపధంబగు సంస్కృతధాతువు నుపధయగు స్వరంబునకు గుణాదేశం బగునని సూత్రార్థము. బా. క్రియా. ౧ సూత్రమగు. 'ధాతువునకు' అనునది యనువృత్తి కాఁగా దానికి ధాతూపధలకని యర్థముచేయుచు సూరియే 'సంస్కృత ధాతూపధలకు' ఇత్యాదివాక్యమున వివరించెను, సొరిది ననఁగా వరుసగానని యర్థము. కాన 'ఇ'కారమునకు 'ఏ' కారము 'ఉ' కారమునకు 'ఓ' కారము 'ఋ' కారమునకు 'అర్' అనునదియు నాదేశంబులగునని యెఱుంగునది. గుణాదేశస్వరూపము కల్పతరువున ౩౨౬ విష యమున విశదీకరింపఁబడెను. ఆవిషయమునే సూరియు 'అ - ఏ - ఓ' ఇత్యాదివాక్యమున వివరించెను. ఉపధ యనఁగా "అలో ఽన్త్యా త్పూర్వ ఉపధా" (౧-౧-౬౫). "అన్త్యాదలః పూర్వో వర్ణ ఉపధాసంజ్ఞః స్యాత్" (సి. కౌ. అజం. ౨౮౯ సూ) అనుచెప్పఁబడుదువర్ణమునకు ముందటి యక్షర ముపధ యనం బడును. ఉదా:—'ఛిద్' మున్నగు సంస్కృతధాతువులు లఘూపధంబులు. తుది వర్ణమగు దకారమునకు ముందఱనున్న ఛకారముమీఁది 'ఇ'కారము 'ఛిద్' ధాతువులోని యుపధాక్షరము - సంస్కృతమునఁ బొల్లు హల్లు పరమయియున్నను బూర్వ స్వరము గురువు కావేరదనియు నది లఘువే యనియు నీవఱకు (విస్తర. I. ౩౦ IV విష) విశదీకరింపఁబడెను. కావున నట్టి 'ఛి' వర్ణముమీఁది 'ఇ'కారమునకు 'ఏ'అను గుణాదేశము రాఁగా 'ఛే' అగును. ఛిద్+ఇంచు = ఛేదించు. ఇట్లె "భిద్+ఇంచు= భేదించు, ఘుష్+ఇంచు = ఘోషించు, పుష్+ఇంచు = పోషించు, వృష్+ఇంచు = వర్ష్+ఇంచు = వర్షించు, హృష్+ఇంచు = హర్షించు." అనువాని ప్రక్రియ నరయునది. 'పీడ్ - భూష్' మున్నగునవి లఘూపదంబులు కామింజేసి గుణాదేశంబు రాదు. పీడించు - భూషించు - మొ. ఉపసర్గములతోఁ గూడినను నిట్టిరూపములు గల్గును. ఆమోదించు - సమ్మోదించు - మొ. సంతాపించు మున్నగు నుపకృతులకు వెనుకఁజెప్పిన (బా. క్రి. ౬౫ సూ) జ్ఞాపక శాస్త్రపద్ధతియే గతియని సూరి పక్షమున నెఱుంగునది.

స్పృశికి గుణంబు విభాష నగు. ౬౭.

స్పర్శించు = స్పృశించు.

లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబులేదు. ౬౮.

బాలవ్యాకరణ వివరణము. 3౼౩౬ V విషయము.

లిఖించు - భుజించు - రుచించు - కృశించు. కుచ ధాతువునకు గుణంబు లేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు గాదు.

సృజికి నిర్మితిని గుణంబులేదు. ౬౯.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె. అతండు విషయం బుల విసర్జించె.

సంజీవని. 3౼౩౬ V విష:—ఘూపధంబులకు గుణం బెల్లయెడలను గన్పట్ట కుండుటచేఁ గల్గు కొన్ని విశేషములను సూరి మూఁడుసూత్రములతో వివరించెను. 'స్పృశ్+ఇంచు' అనుచో గుణంబు వైకల్పికంబు - స్పృశించు - స్పర్శించు. లిఖ - భుజ - రుచ - కృశ ధాతువులకు గుణము రాదు. లిఖ్+ఇంచు = లిఖించు, భుజ్+ ఇంచు = భుజించు, రుచ్+ఇంచు = రుచించు, కృశ్+ఇంచు = కృశించు. బా. క్రి. ౬౬ సూత్రముచొప్పున వీనికి గుణంబు వచ్చిన "లేఖించు - భోజించు - రోచించు - కర్శించు" అను నపశబ్దములు గల్గునుగాన నట్టివాని నీసూత్రముచే సూరి నివారించెను. సృజ్ ధాతువునకు నిర్మించు అనునది యర్థమగునపుడు గుణంబు లేదు. సృజ్+ఇంచు=సృజించు = సృష్టిచేయు. క. ఏవిధి సృజించు లోకము! లే వాఁడు... (శాంతి. ౬ఆ. ౪౮౨ ప). 'వి' అనుదానితోఁ గూడునపుడు దానికి విడుచుట యను నర్థముకల్గును. వి+సృజ్+ఇంచు=వి+సర్జ్+ఇంచు=విసర్జించు=విడుచు. సం+కుచ్+ ఇంచు=సంకోచ్ + ఇంచు=సంకోచించు=వెనుదీయు. గుణాభావముతోఁడి రూపమును శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడెను.ఈధాతువునకు బా. క్రి. ౧౨౧ సూత్రము చొప్పునఁ బ్రత్యేక ప్రయోగములేదు. "సంకుచించు-సం-అ-క్రి - సంకోచమునందు. ఎ-గీ. సుందరత్వమునకుఁ జోటిచ్చి తా సంకుచించె ననఁగఁ గడుఁ గృశించె నడుము (కవిక. ౧ ఆ)." (శ. ర). "సంకోచించు - సం - అ - క్రి - సంకోచముకొందు" (శ. ర). సూరివివరింపలేదుగాని, సంపూర్వక కుచ ధాతువునకుఁగూడ "ముణిఁగిపోవు" అను నర్థమున గుణంబు రాదనియు 'వెనుదీయు' అను నర్థమున గుణంబు వచ్చుననియుఁ జెప్పుట యుక్తమని తోఁచెడిని.

బాలవ్యా. సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు. ౭౦.

3౼౩౬ VI విష. పచింపించు - వచింపించు - ఆవులింపించు - వండించు - పండించు.

సంజీవని. ౩౨౬ VI విష:—సర్వంబునకున్ = సర్వవిధములగు ధాతువులకును ప్రేరణార్థంబునం దించు గాగమం బగునని యర్థము. సర్వవిధములనుటచేత స్వార్థేం చు గాగమముతోఁ గూడిన సంస్కృతధాతువులకును, స్వార్థేంచు గాగమముతోఁ గూడిన యంగలాదులకును జదువు-వండు మున్నగు నాచ్ఛికధాతువులకును బ్రేరణార్థమున నించుగాగమం బగునని తాత్పర్యము. ధాత్వర్థీభూత వ్యాపారము నొరు జరుపునట్లు వేఱొకరు ప్రేరించుట ప్రేరణార్థ మనఁబడును. వచ్+ఇంచు = వచించు- స్వార్థేంచు గాగమ యుక్తరూపము. రాముఁడు సత్యమును వచించెను. కైక రాముని సత్యమును వచింపించెను. రాముఁడు సత్యము వచించునట్లు కైక ప్రేరించె నని యర్థము. 'వచించు+ఇంచు' అనుచో బాల. క్రి. ౮౭ సూత్రముచొప్పునఁ బ్రేరణేంచు క్పరకత్వమున స్వార్థేంచుక్ చకారమునకు "ప" కారాదేశము రాఁగా "వచింపు+ఇంచు = వచింపించు" అనురూపము సిద్ధించును. ఇట్లె - పఠింపించు - రక్షింపించు - మొ. 'ఆవుల' అను ధాతువునకు బా. క్రి. ౬౩ సూత్రముచొప్పున నంగలాది స్వార్థేంచుక్కు రాఁగా "ఆవులించు" అని యేర్పడును. దానిపైఁ బ్రే రణేంచుక్కు నిల్చునపుడు స్వార్థేంచు క్పకారమునకు 'ప' కారాదేశము రాఁగా 'ఆవు లింపించు" అను రూప మేర్పడును. ఇట్లె 'ఆరగింపించు' మున్నగు రూపములు సాధించుకొనునది. 'వండు - పండు' మున్నగు నాచ్ఛికధాతువులపైని బ్రేరణార్థ మున 'ఇంచుక్కు' నిలువఁగా. వండించు - పండించు - మొదలగురూపములు గల్గును. ఆప్రేరణార్థంబునందలి కర్త కర్మంబగును. రాముఁడు పాఠమును జదివెను- గురువు రాముని పాఠమును జదివించెను. భరతుఁడు రాజ్యము నేలెను. రాముఁడు భరతునిచే రాజ్యము నేలించెను మున్నగుచోటులందుఁ గల్గు కారకవిభక్తుల విష యము ౨౩౬-౨౩౭ విషయములందు విస్తరింపఁబడెనుగాన నిట వ్రాయబడు. "తత్ర తృతీయా షష్ఠీచ। విభక్తీ సమ్మతే ఉభే" అను నథర్వణకారిక ప్రేరణార్థవిషయ కమె యనియుఁ గర్త్రార్థవిషయకముగాఁ గవిశిరోభూషణాదులలో వ్రాయఁబడుట సరికాదనియు ౩౧౯ విషయమునందును - విస్తర. 1 ౨౩౭ విషయమునందును విశ దీకరింపఁబడెను. సంస్కృతవ్యాకరణమునఁ బ్రేరణార్థమున ణిచ్ ప్రత్యయము విధింపఁబడెను (చూ. ౩౧౬ విష). కానఁ బ్రేరణార్థమును ణిజర్థమనియు వ్యవహ రింతురు. ప్రేరణార్థక ధాతుప్రయోగ విశేషములు సవిస్తరముగ ౨౩౬ విషయ మున బ్రదర్శింపఁబడెను. అంతర్గత ప్రేరణార్థక ధాతుప్రయోగములు సైత మవ టనె చూపఁబడెను. ఇంచుగాగమము చేరకున్నను బ్రేరణార్థమును సైతము తెలుపు ధాతు వంతర్గత ప్రేరణార్థక మనఁబడును. క.........శిత శర। పలం

పరలు గురిసె నుగ్రబంధుర గతులన్ (విరా. ౫ ఆ. ౧౮౫). (కురిసెన్ = కురియిం చెన్ = కురియునట్లు చేసెను). ఆ-వె......... । కలయఁ బెరసినపుడు కలితనంబు । మెఱయుదురు.........(విరా. ౪ ఆ. ౨౨3). (మెఱయుదురు = మెఱయింతురు). నుజ్యంతముపై ని 'చేయు' ధాతువు నిల్పి ప్రేరణార్థమును బోధించును. చ. మద మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁజే । యుదునని పూని...... (ఉద్యో. 3 ఆ. ౨౮౦ ప). మొ.

అగతికంబు లగుభ్వాదులకింపు యోగంబులేదు.

౧౨౧. భూ-స్పృ - కృ - రేకృ-లోకృ - లోచ-పచి-లప - ఇత్యాదులకు గతివిరహితంబులగు ధాతువుల కీభాషం బ్రయోగంబు లేదు. ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ - నిర్ - దుస్ - దుర్ - వి - ఆజ్ - ని - అధి - అపి - అతి - సు - ఉత్ - అభి - ప్రతి - పరి - ఉప - ఊరి ప్రభృతులును సాక్షాత్ ప్రభృతులును గతిసంజ్ఞాకంబులు. ప్రాదు లిరువదిరెండు నుపసర్గంబులు నాఁబడు. ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు - సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతి రేకించు - ఆలోకించు - ప్రపంచించు - ప్రలపించు - ఇత్యాదు లార్య ప్రయోగంబుల నెఱుంగునది.

బాలవ్యా. 3౼౬ VII విష.

సంజీవని. 3౼౬ VII విష:—అగతికంబులగు = గతిసంజ్ఞగల ప్రాదులతోఁ గూడని భూ. స్పృ. కృ. మొదలగు ధాతువుల కాంధ్రభాషయందుఁ బ్రయోగము లేదు. ఈ సూత్రములోని భ్వాదులు సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధములగు భ్వాదులు కావు. భ్వా దద్యదా దిత్యాది దశవిధ గణ ధాతువులలోనివి పెక్కుధాతు వులు ప్రాదుల కూడిక లేనిచోఁ దెల్గునఁ బ్రయోగార్హములు కావని తాత్పర్యము. "ప్రాదులును ఊరి ప్రభృతులును సాక్షాత్ ప్రభృతులును గతిసంజ్ఞాకంబులు" అను సూరివాక్యము సరికాదు. ప్రాదులును 'ఊరీ-సాక్షాత్' ప్రభృతులును క్రియాయోగ మునననఁగా క్రియతోడి సమాసమున గతిసంజ్ఞ గలవగునని చెప్పుట యుక్తము. ఊరీ ప్రభృతులును సాక్షాత్ ప్రభృతులును వాని సమాసవిధులును 3౼౬ కల్ప తరువున విస్తరింపఁబడెను. (విస్తర. I). "ప్రభవించు - ప్రసరించు - సంస్కరించు -

---

విస్తర. I 3౼౬ VII విష:—సూరి ప్రాదు లిరువదిరెండిటిని జూపి యవియు "ఊరి" ప్రభృతులును సాక్షా త్ప్రభృతులును గతిసంజ్ఞాకంబులని వచించి కొన్ని

'అతిరేకించు - ఆలోకించు - సంస్కరించు - ప్రపంచించు - ప్రలపించు' అనునవి 'ప్ర-సమ్ - అతి - ఆ' అను ప్రాదులతో సమసించిన 'భూ - సృ - కృ' మున్నగు ధాతువుల కుదాహృతులు. "ఆవిర్భవించు - సాక్షాత్కరించు" అనునవి "ఊరి - సాక్షాత్ప్రభృతులతో సమసించిన "భూ - కృ" అను ధాతువుల కుదాహృతులు. ఆవిశ్శబ్ద మూరి ప్రభృతులలోనిది. ప్రాదుల కుపసర్గసంజ్ఞ ప్రసక్తానుప్రసక్తముగఁ జెప్పఁబడినదే కాని యిట దాని కావశ్యకత లేదు.

ప్ర+భూ - ప్రభవ్+ఇంచు = ప్రభవించు = (పుట్టు) (భూ సత్తాయామ్). ("ఊరీ = ఉరరీ అవ్య. అఙ్గీకృతౌ" శబ్దా. ౭౦). ఊరీకరించు = అంగీకరించు.

---

ప్రాదులతోను, "ఊరి - సాక్షా" త్ప్రభృతులతోను సమసించిన ధాతువుల నుదాహరించి యుండఁగా గుప్తార్థప్రకాశికాకర్త ప్రాదులకు గతిసంజ్ఞను సూరి విధింపలేదనియు నుపసర్గసంజ్ఞను మాత్రమే విధించెననియు నర్థముచేసికొని యీక్రింది రీతిని భ్రామాదికముగా వ్రాసెను. "మూలవాక్యంబునందు నూరిప్రభృతులకును సాక్షాత్ప్రభృతులకును గతిసంజ్ఞయున్నట్లును ప్రాదులకు నుపసర్గసంజ్ఞ మాత్రమే యున్నట్లును విభజింపఁబడినరీతిని దోఁచుచున్నది. ఇచ్చట యుపసర్గశబ్దంబు గతిసంజ్ఞకుంగూడ నుపలక్షణంబు లేదా యావాక్యంబునకు నీరీతిగా నన్వయించికొనవలయు........" (బా. గు. ప్ర. ౪౧౪ పు. ద్వి. ము). అని యీరీతిగా వ్రాసి యేదో యపమార్గమున నట్టియర్థము సంపాదించుటకుఁ గొంతగ్రంథమును వ్రాసెను. ఇటఁ బ్రాదుల కనావశ్యకమగు నుపసర్గసంజ్ఞ నుపదేశించి యత్యావశ్యకమగు గతిసంజ్ఞ నుపదేశింపకుండుటకు సూరి యున్మత్తుఁడు కాఁడుగదా ? "గతివిరహితంబులగు ధాతువుల కీభాషం బ్రయోగంబు లేదు" అని వ్రాసినవెంటనె "ప్ర - పరా......" మున్నగు నిరువదిరెండు ప్రాదులను సూరి యేల వ్రాసెనని గుప్తార్థప్రకాశికాకర్త తలంచెనో ? ఆశబ్దముల కచట నన్వయ సంబంధ మేమని తలంచెనో ? పిదప నుదాహృతుల నిచ్చుటలో "ప్రభవించు - ప్రసరించు - సంస్కరించు" మొదలగు ప్రాదులతోఁ గూడిన భూ-సృ మున్నగువాని నేల చూపెనని తలంచెనో ? తెలియకున్నది. ఇట ననావశ్యకమగు నుపసర్గసంజ్ఞ వానికిఁ గలదని చెప్పుటకై ప్రాదుల నుదాహరించెనని ప్రకాశికాకర్త చెప్ప సాహసించునేమో ? అట్లయిన "ఊరిప్రభృతులకును సాక్షాత్ప్రభృతులకును గతిసంజ్ఞ నుపదేశించినపిదప నుపసర్గసంజ్ఞను వచించు సందర్భమున వానిని సూరి పేర్కొని యుండఁడా ? ఇంతకును సూరి "ప్ర - పరా......" మున్నగు నిరువదిరెండు ప్రాదులను వ్రాసి "ఇవి ప్రాదులు" అనియైన వ్రాయలేదే! ఆశబ్దముల కచట దేనితో సంబంధము గలదని గుప్తార్థప్రకాశికాకారుఁడు భ్రాంతి నందెనో తెలియకున్నది.

ఆవిర్భవించు = ప్రభవించు = పుట్టు. ప్ర+సృ = ప్ర+సర్+ఇంచు = ప్రసరించు = వ్యాపించు (సృ = గతౌ). సమ్+కృ = సమ్+కర్=సమ్+స్+కర్+ఇంచు = సంస్కరించు = చక్కఁజేయు. (కృఞ్ = కరణే). భస్మన్+కృ = భస్మ+చ్వి+కర్+ఇంచు = భస్మీకరించు = భస్మముగాఁజేయు. సాక్షాత్+కర్+ఇంచు = సాక్షాత్కరించు = ప్రత్యక్షమగు. అతి+రిచ్+ఘఞ్ = అతిరేక+ఇంచు = అతిరేకించు = అతిశయించు. (రిచ = సంపర్కే - వియోగేచ). "అతిరేక - పు. (అతి+రిచ్+ఘఞ్) అతిశయే - భేదే - ప్రాధాన్యే - ఆధిక్యేచ" (శబ్దస్తో) అనుచొప్పున "అతిరేకించు" అనునది "రిచ్" ధాతుసంబంధి యనుట యుక్తము. సూరి 'రేకృ' ధాతు సంబంధిగా నుదాహరించుట సరికాదని తోఁచెడిని. "రేకృ శఙ్కాయామ్" అను ధాతువునకు సంబంధి యన్నచో ప్రసిద్ధమగు 'అతిశయించు' అనెడి యర్థము సంగతము కానేరదు. "రేక - పు......(రేక+అచ్) శఙ్కాయామ్ - నీచే - భేకేచ - (రేక+అ) సన్దేహే - స్త్రీ - టాప్" (శబ్దస్తో) అని రేకధాతుజ శబ్దార్థములు వెలయుచున్నవి. ఆ+లోక+ఇంచు = ఆలోకించు = చూచు (లోకృ = దర్శనే). ఆ+లోచ+ఇంచు = ఆలోచించు = ఆలోచనముచేయు (లోచ దీప్తౌ) (లోచ దర్శనే). ప్ర+పచి+ఇంచు = ప్రపంచించు = విస్తరించు. (పచి వ్యక్తీకరణే). ప్ర+లప+ఇంచు = ప్రలపించు = జల్పించు - పలవించు (లప = కథనే). "ఇత్యాదు లార్యప్రయోగంబుల నెఱుంగునది" అనుటచేత గతిసంజ్ఞగల ప్రాదులతో సమసించిన ధాతువుల ప్రయోగము నార్యప్రయోగంబుల ననఁగా మహాకవి ప్రయోగముల ననుసరించి తెలిసికొనవలయునని తాత్పర్యము. ఈసూత్రముచేతనే "యథాప్రసిద్ధి ధాతూనాం। ప్రయోగ స్సమ్మతో భవేత్" అను (౩ఆ. విస). నధర్వణకారికార్థమును సంగ్రహించుటకు బా. సు. ప్ర. కర్త యత్నించెను. కాని యీసూత్రము గతి సంజ్ఞగల ప్రాదులతోఁగూడి ప్రయోగింపఁబడు ధాతువులను బ్రసంగించునదగుటచే నిందలి సూరివాక్య మట్టిధాతువుల విషయమునే వచింపఁగల్గునుగాని సంస్కృత ధాతువులెల్లఁ దెల్గున యథేచ్ఛముగా బా. క్రి. ౬3-౬౯ సూత్రములచొప్పునఁ బ్రయోగింపరాదనియు మహాకవి ప్రయోగానుసారముగా మాత్రమె సంస్కృత ధాతువులను దెల్గున వ్యవహరింపవలయుననియు నుపదేశించుచున్న "యథాప్రసిద్ధి ధాతూనాం। ప్రయోగ స్సమ్మతో భవే" త్తనెడి యధర్వణ కారికయర్థమును సంగ్రహింపఁజాలదు. (విసర). 11

విస్తర. 11 3ఆ. VII విస:—"ఈ సూత్రస్థమైన యగతికశబ్దమున కేక శేషముగాని లేక యావృత్తిగాని చేయవలయును. ఇపుడు గతిసంజ్ఞావిరహితములయిన ఖ్యాదులకు నిందుఁ బ్రయోగములేదన్న యొకయర్థమే కాక యగతికంబు లనఁగా

నకరణంబులు=కవిప్రయోగ కరణములుకాని భ్వాదులకు నీభాషయందుఁ బ్రయో గంబులేదన్న యర్థాంతరమును నగును. కవిప్రయోగము లుండెనేని గతిసంజ్ఞా శబ్దగహితంబులైనను సాధువని ద్వితీయార్థ తాత్పర్యము. కనుకనే జయించు - ఈక్షించు - భ్రమించు - స్మరించు - హరించు - బోధించు - రక్షించు - ఇత్యాదులు రక్షితంబులయ్యె." (బా. గు. ప్ర. ౪౧౫ పు. ద్వి. ము). ఈవాక్యముల నరయఁగా "అగతికంబులగు భ్వాదులకనెడి ప్రకృతసూత్రము (బా. క్రి. ౧౨౧ సూ) సంస్కృతధాతువులెల్ల గతిసంజ్ఞగల ప్రాదులతోఁ గూడినపుడే తెలుపఁ బ్రయోగార్హములగుననియు నిందలి భ్వాదులనునది సంస్కృత ధాతువులన్నిటిని దెలుపు ననియు గుప్తార్థప్రకాశికాకర్త యపార్థముచేసికొనెనని స్పష్టపడుచున్నది. ఇది కేవలము భ్రాంతిమూలకము. సంస్కృతధాతువులెల్ల సాధారణముగాఁ దెల్గున నించుక్కుతోఁగూడి ప్రయోగార్హము లగుననియు కేవలకొన్నిమాత్రమె భూ - స్పృ - కృ - మున్నగునవి గతిసంజ్ఞగల ప్రాదులతోఁ గూడినంగాని ప్రయోగార్హములు గానేరవనియు నట్టి ప్రాదులతోఁగూడినను గూడకున్నను గొన్ని (అద్. భక్షణే. తనువి విస్తృతౌ. కము = కాన్తౌ. క్షుధ = బుభుక్షాయామ్. పా = పానే - దా = దానే. ధా = ధారణే - మొ). తెల్గునఁ బ్రయోగార్హములె కావనియు (అనుబంధము) నట్టి విశేషములు మహాకవిప్రయోగ వేద్యములనియు నీయనకు బోధపడలేదు. బా. సా. పే. వ్యాఖ్యాతయును నీ బా. గు. ప్ర. వ్యాఖ్యాతృ భ్రాంతి కొంత యావేశించిన దయ్యెను. "ప్రాదు లిరువదిరెండు నుపసర్గములును నాఁబడు ననుటంజేసి వానికి గత్యుపసర్గసంజ్ఞలు రెండును గలవని యర్థము గ్రహింపవలెను. నాఁబడునను పదమునకు ముందటిసముచ్చయ ను వర్ణము స్థిరము పరముగ లోపించెనుగాన నద్దాని నూఁతగఁ గొని........." (బా. సా. పే. ౪౮౫ పు.) మొదలగు నసంగత ప్రసంగము లట్టి భ్రాంతిచేతనే చేయవలసిన వాఁడయ్యెను.

---

అనుబంధ. విస్తర. II 3౨౬ VII విష:—'గమ్' ధాతువునకుఁ బ్రత్యేక ప్రయోగమున నించుగాగమయోగము భారతాది గ్రంథములలోఁ జూపట్టలేదు. కాని సోమనారాధ్యాదులు ప్రయోగించిరి. ద్విపద. గమియింపరానట్టి గమకంబువాఁడు। గమియించువారికిఁ గడసూపువాఁడు. (బసవ. ౬ ఆ. ౪౦౮ ప). క... ......శీ। తనగంబు గమించి షడా। వన జన్మస్థాన.........(భాస్క. బాలకాం. 3౫౭ ప). ఉ.........త్రిపథంబుల నిట్లు గమించెఁ గాన.........।...... త్రిపథగాహ్వయయై.........(భాస్క. బాలకాం. ౪౫౯). సూ. రా. నిఘంటువున నీశబ్దము చూపఁబడెను.

రఞ్జతి ఘటాద్యాదీనాం। బిన్దో శ్చస్యాపి లా వుభౌ
భవతః.(ఆం. చిం. క్రి. ౧3 కా. అహో. ౪౯౦ పు).

నన్నయా-
థర్వణీయము.
3.ఒ2 విషయము.

తత్రోభయో ర్భవే దేకో। లకార ఇతి కేచన (వికృ.
క్రి. ౧3 కా. అహో. ౪౯ఒ పు).
నతు ణౌ భవేచ్చ లోపో। ణ్యర్థే యో వర్తతే పరే
తస్మిన్ (ఆం. చిం. క్రి. ౧౪ కా అహో. ౪౯3 పు).
తద్యతాం క్వచి ద్వైక్యం స్యా। చ్ఛబ్దశ్ క్రిర్హితా
దృశీ (వికృ. క్రి. ౧౧ కా. అహో. ౪౯౧ పు).

కల్పతరువు. 3.ఒ2 విష:—రఞ్జతీత్యాది:—రఞ్జతి ఘటాద్యాదీనామ్ = "రఞ్జ్ ఘట్" మున్నగు ధాతువులయొక్క, బిన్దోః - చస్యాపి = బిందుపూర్వక చవర్ణమున కనఁగా "ఇంచు" అనుదానిలోని 'ంచ్' అను భాగమునకు, లౌ - ఉభౌ = రెండు లకారము లాదేశములుగ, భవతః = అగును. కావున నించుగాగను పరిశిష్టభాగ ముతో లద్విత్వము కూడఁగా "ఇ+ల్+ల్+ఉ=ఇల్లు" అని యేర్పడును. "రఞ్జ్+ ఇంచు = రంజిల్లు = అను రాగిల్లు. ఘట్+ఇంచు = ఘటిల్లు = కలుగు = సంభ వించు" అను రీతిని రూపము లేర్పడును. 'రంజించు = రంజిల్లఁజేయు; ఘటించు = ఘటిల్లఁజేయు.' ఇవి ణిజంతములు ముందు సాధింపఁబడును. ("రన్జ రాగే...... ఆసక్తౌ - అక. భ్వాది.........రజతి.........ఘటచేష్టాయామ్ - భ్వాది - ఆత్మ - అక.........ఘటతే". శ॰స్తో).

తత్రేత్యాది:—తత్ర - ఉభయోః = ఆరెండు లకారములలో, ఏకో లకారః = ఒక లకారముమాత్రమె, భవేత్ = అగుననఁగా నిల్చుటయుఁ గలదని, కేచన = కొందఱు చెప్పుదురు. ఇది వైకల్పికమని భావము. 'ఉదా:—రంజిల్లు = రంజిలు, కంపిల్లు = కంపిలు - మొ.

నతు ణా విత్యాది:—నతుణౌ = ప్రేరణార్థకంచుక్కు పరమగునపుడు స్వార్థేంచు గ్భాగమునకు లకారద్వయాదేశము రాదు. మఱియుఁ బ్రేరణేంచు గాగ మునకును లకారద్వయాదేశము రాదు. ణ్యర్థే యః వర్తతే = ప్రేరణార్థమందు వర్తిల్లునట్టి యే యించుక్కు గలదో, తస్మిన్ పరే=అది పరమగుచుండఁగా, భవేచ్చ లోపః=స్వార్థేంచుక్కునకు లోపమునైతము కల్గును. "రంజిల్లించు - రంజించించు - రంజింపించు" మున్నగు ననిష్టరూపములు కల్గనేరవని తాత్పర్యము. ఉదా:—రాజు జనులను రంజించుచున్నాఁడు = రాజు జనులను రంజిల్లఁజేయుచున్నాఁడు = రాజు జనుల ననురాగపడునట్లు చేయుచున్నాఁడని యర్థము. ఇట్టియెడల, రాజు నద్భుత

వర్తనముచే జనులె స్వయముగా ననురాగపడుచున్నారను నర్థమున, ననఁగాఁ గర్మమునందుఁ గర్తృత్వ వివక్ష గల్గునపుడు, (దీనినె సంస్కృత వైయాకరణులు కర్మకర్త యని వ్యవహరింతురు) కొన్నియెడల ధాతుస్వార్థంచు గాగమమునకు 'ఇల్లు' అనునది యాదేశమగునని ఫలితార్థము. ఇట్లె రాముఁడు శివధనువును భేదించెను (భేదిల్లఁజేసెను). దీని కర్మకర్తృత్వమున - "శివధనువు స్వయముగ భేదిల్లెను." అనినిల్చును. ("బాలస్వభావ సులభేన కుతూహలేన । కృష్టం ధను ర్భగవతో వృషభధ్వజస్య । తత్రానుషఙ్గిక మకుఙ్గళ మిాదృశంతు । సంవృత్త మత్ర న మయా గణితస్త్వ మాసీః" అనర్ఘరాఘవము ౪ అం.) ఇట్టియెడల ధాతువు స్వయముగా సకర్మకమె యైయునను నకర్మకముగ నేర్పడుచుండును. ఈవిషయమును సంబంధించిన సంస్కృత వ్యాకరణవిషయము లిట నుదాహరింపఁబడుచున్నవి.

"కర్మవ త్కర్మణా తుల్యక్రియః. (౩-౧-౮౭) కర్మస్థయా క్రియయా తుల్యక్రియః కర్తా కర్మవత్ స్యాత్.........కర్తు రభిహితత్వాత్ ప్రథమా - పచ్యతే ఓదనః - భిద్యతే కాష్టమ్ = (కట్టెభేదిల్లుచున్నది).........(సి. కౌ. కర్మకర్తృ. ౨౭౬౬ సూ)."

"ధవత్ ధఘోఽఢే.........క్రియమాణంతు యత్ కర్మ । స్వయమేవ ప్రసిద్ధ్యతి । సుకరైః స్వై ర్గుణైః కర్తుః । కర్మక ర్తేతి తద్విదుః" (ముగ్ధ. ౯౨౭ సూ). దీని దుర్గాదాసవ్యాఖ్య:—"కర్మస్థ భావధాతూనా మేవ కర్మణః కర్తృత్వవివక్షా. యథా - పచ్యతే ఓదనః స్వయమేవ, భిద్యతే కాష్ఠం స్వయమేవేత్యాది. అతిదేశిక మనిత్య మితిన్యాయాత్ కర్తృస్థ భావధాతూనాం న స్యాదితి బోధ్యమ్. తేన ఖాద్యతే ఓదనః స్వయమేవ-గమ్యతే గ్రామః స్వయమేవ-ఇత్యాది న స్యాత్. తథాచ కర్మస్థః పచతే ర్భావః । కర్మస్థాశ్చ భిదాదయః । బుధస్తు భావః కర్తృస్థః । కర్తృస్థాశ్చ గమాదయ ఇతి ప్రాఞ్చః. పచతే ర్భావ స్తణ్డులాదీనాం విక్లిత్తి స్తణ్డులాదిష్వేవ భవతి నతు పాకకర్తరి. ఏవం భినత్త్యాదే ర్భావః భేదాదిః కాష్ఠాదిష్వేవ నతు భేదాదికర్తరి. బుధే ర్భావో జ్ఞానం శిష్యేష్వేవ నతు గ్రన్థాదౌ. ఏవం గమాదీనాం భావః పాదచలనాది ర్గమనాదికర్తృష్వేవ నతు గ్రామాదా విత్యర్థః"- దీనినిబట్టి సంస్కృతమున సకర్మక ధాతువులందే కర్మకర్తృత్వము గల్గునని తేలుచున్నది. 'రన్జ్-ఘట్' మున్నగు నకర్మకముల యించుగ్భాగమునకే లకార ద్వయాదేశము నన్నయచే విధింపఁబడెనుగాన వాని ప్రేరణార్థకత్వమందలి కర్మమునుబట్టి వానియందుఁ గర్మకర్తృత్వమును జింతామణికర్త వివక్షించెనని తలంపవలెను.

ప యీరీతినె తెల్గునందును సకర్మ కాకర్మకములకుఁ గర్మస్థభావధాతువులగు 'భిద్' మున్నగువానికే లకారద్వయాదేశము కల్గును. కర్తృస్థభావములగు బుధా

దులకు రానేరదు. రాజు జనులను రంజించుచున్నాఁడనఁగా రాజు జనులను రంజిల్లఁ జేయుచున్నాఁడు. రంజధాతుభావమగు రంజనము జనులయందే యుండునుగాన రంజధాతువు కర్మస్థభావ మనఁబడును. కావున "జనులు స్వయముగ రంజిల్లుచున్నారు" అని యగును. ఇట్లె రాముఁడు కఱ్ఱను భేదించుచున్నాఁడనఁగాఁ గఱ్ఱను భేదిల్లఁ జేయుచున్నాఁడనఁగా విఱుచుచున్నాఁడని యర్థము. ఇట 'భిద్' అనుదాని భావమగు భేదమనఁగా విఱుగుట కర్మమగు కఱ్ఱయందే యుండునుగాని రామునం దుండనేరదుగాన 'భిద్' ధాతువు కర్మస్థభావ మనిపించుకొనును. కావుననే దాని యించ్గ్యాగమునకు లకారద్వయాదేశము గల్గును. కఱ్ఱ స్వయముగా భేదిల్లుచున్నది యను రూపము గల్గును. గంగ సముద్రమును సంగమించుచున్నది. ఇట సంపూర్వక గమిధాతుభావ మనఁగా సంగమము కర్తృభూతమగు గంగయం దుండును గాని సముద్రమం దుండునది కాదు గాన నది కర్తృస్థ భావధాతు వనఁదగునుగాఁ బట్టి దానియందు లకారద్వయాదేశము గల్గ దనఁగా "సముద్రము స్వయముగా సంగమిల్లుచున్నది" అను ననిష్టరూపము కల్గనేరదు. ఇట్టి వాడుకల పోలికలు సంస్కృతాంధ్రముల యత్యంతప్రాచీన నిరూఢసంబంధమును విశ్వసింపఁజేయుచున్నవి.

తద్వతా మిత్యాది:—తద్వతామ్ = అట్టి "ఇంచు - ఇల్లు" అనునవి గల ధాతువులకు, క్వచిత్ = ఒకానొకప్పుడు, ఐక్యం స్యాత్ = అభిన్నార్థ బోధకత్వమును గల్గును. అనఁగా నించుగాగమ ఘటితరూపము ప్రేరణార్థము నియ్యక "ఇల్లు" అను దానితోఁ గూడునప్పటి యర్థమునే యనఁగా స్వార్థమునే బోధించుటయుఁ మహాకవి ప్రయోగములందుఁ గన్పట్టుచున్నదని తాత్పర్యము. ఇట్టి నియమభంగము నన్నయ భారతభాగమున యతిప్రాసఘటితములగు మూఁప్రాసస్థలములందుఁ గన్పట్టలేదు. "ఇంచు - ఇల్లు" అను రెండిటికొడను నొక్కధాతువే పర్యాయముగాఁ గూడుటయు (వర్తిల్లు - వర్తించు) రెండురూపములలో 'ఇల్లు' అనుదానితోఁ గూడినది యకర్మకమగుచు స్వార్థమునే బోధించుటయు 'ఇంచు' అనుదానితోఁ గూడినది స్వార్థమును ప్రేరణార్థమును వేర్వేఱుగా నిచ్చుటయుఁ గలదు. మఱియుఁ గొన్ని ధాతువులకు స్వార్థమునందు 'ఇల్లు' అనునది నిల్చుటయు దానికి ప్రేరణార్థబోధకమగు 'ఇంచు' చేరకయే యుండుటయుఁ గలదు. మూర్ఛిల్లు (ద్రోణ. ౨ ఆ. ౨౭౮). ఇట్టివెల్ల మహాకవి ప్రయోగములనుబట్టి తెలిసికొననగును. 'ఇల్లు' అనుదానితోఁ గూడిన దెన్నఁడును సకర్మకము కానేరదు.

ప్రయోగములు:—(౧) స్వార్థమున 'ఇల్లు' ప్రేరణార్థమున 'ఇంచు' వచ్చు స్థలములు:—క. వల్లెయని రాజనందను । లెల్లరు సమకట్టి రథము లెక్కి దిశల్ భే ।

దిల్లగ గర్జిల్లి నిశా। తోల్లసిత కృపాణ కార్ముకోద్యత్కరులై (ఆది. ౬ ఆ. ౬౫ ప). క. తనసుతులు పాండుసుతులని। మనమున భేదింప కతిఁడుఁ జన భావింపం। బున నొక్కరూపకా చే। కొనియుండెన్...(ఆది. ౫ ఆ. ౧౬౩ ప). మ. ఇది యెట్లున్ సమకూర దెవ్వరికి మున్ స్త్రీవిల్లు మోపెట్టఁబో। లదు మోపెట్టియు నంతరిక్షమున నాలక్ష్యంబు భేదింపఁగా। నదిబ్రహ్మాదులకైన నిందలవి గాదంచున్ విచారించి ని। ర్మదులై కొందఱు రాజు లేఁగిరి నిజస్థానమార్గముల్ చూచుచున్. (ఆది. ౭ ఆ. ౧౭౮). పై వానిలో 'భేదిల్లు' అనుచోటి లకారద్వయాదేశము (స్వార్థపరము) ప్రాసగతము. 'భేదించు' అను లుప్తస్వార్థణిచుప్రత్యయాంతరూపము ప్రేరణార్థకము ప్రాసగతము కాకున్నను నర్థసందర్భమునుబట్టి మాఱ్పరానిదై యున్నది. ఇట్టి చింతామణి నియమమును భంజించు ప్రయోగములు నన్నయభారతభాగమున యతిప్రాసస్థల ఘటితములై కవిప్రయుక్తములని విశ్వసింపఁదగినవి కన్పట్టలేదు. అట్టినియమమును నవరించిన యథర్వణకారిక కుదాహృతులు.— సీ. సపథాద్రయం దనిమిషపతి ప్రచ్ఛన్న సంచరణమున వర్తించుటయును. (విరా. ౧ ఆ. ౫౮). ఉ.........వు। ర్తించెద సౌమ్యు నొక్కరు మదీయ మనోగతి వారిఁ గూడి వ। ర్తించు తెఱంగు గైకొనుట తెల్లము కౌరవజాతి కెంతయున్ (ఉద్యో. ౧ ఆ. ౩౫౬). ఉ. అంచిత......... ఎ। క్కించి.........। సంచయ.........వ। ర్తించుచు.........(అను. ౩ ఆ. ౮౫౬ ప). తే-గీ.........మందడీల। కెల్ల నూఁటయగుచు వర్తిల్ల నేర్తు (విరా. ౧ ఆ. ౯౫). క.........ఇట్లు గొలిచి వ। ర్తిల్లెడు తెఱంగులెంతయుఁ। దెల్లము సేసితిరి బ్రదికితిమి మీకరుణన్ (విరా. ౧ ఆ. ౧౮౩ ప). ఇటు సోమయాజి 'ఇల్లుఁ ఇంచు' అనువాని కర్థభేదము లేకుండఁ బ్రయోగించియు నన్నయోపదిష్ట పద్ధతిని బ్రేరణార్థకముగా సైతము "వర్తించు" అనుదానిని బ్రయోగించెను. సీ. పదపడి విప్రులు పథముదప్పి.........। అధ్వరాదిక సత్క్రియల్ ప్రవర్తింపక......... (శాంతి. ౩ ఆ. ౮౯ ప). (ఇందు - "ప్రవర్తింపక = ప్రవర్తిల్లఁజేయక" అని యర్థముచేయక తీరదుగదా). నన్నయఁ యీ ధాతువును 'ఇలు'తోఁ గూడినపుడు స్వార్థకముగాను 'ఇంచు'తోఁ గూడినపుడు ప్రేరణార్థకముగాను దనచేసిన నియమము చొప్పుననే ప్రయోగించెను. తరువోజ.........। వరుసన తమతమ వర్ణధర్మముల వర్తిల్లుదురు గడవక దండనీతి। .........(అ.. ౬ ఆ. ౧౦౩). సీ. కడఁగి యత్యుత్తమ శ్రీ త్రింశచ్చరితంబునందు వర్తిలుచు నంటి (?).........(-భా. ౧ ఆ. ౧౮౯) పై రెండుస్థలములందును 'వర్తించుడు' అని కాని 'వర్తింపుము' అని కాని దిద్దనగునసరాదు. నన్నయ యొచ్చటను "దా చోష్లక్ తద్వర్తే' "టస్టు...

దోః స్యాత్" అనెడి తన నియమమును మీఱలేదు. అనఁగా "చువర్ణంబుతోడ దుగ్ధకారమునకు 'త'కారము చేయని ప్రయోగమును (బా. క్రి. ౧౦౮ సూ) జేసి యుండలేదు. ఇంక 'వర్తించు' అనుదానిని ప్రేరణార్థమునవే నన్నయ ప్రయోగించుచునచ్చెను. "పాండవపరాజయ దహనంబుఁ దనరూక్షకటాక్ష వీక్షణ వచనంబులం బ్రవర్తించుచున్నదాని........." (సభా. ౨ ఆ. ౨౨౦ గద్య). (ప్రవర్తించుచున్నదానిన్ = ప్రవర్తిల్లఁజేయుచున్నదానిని). "శకుని కైతవం బెఱింగియుం బాపద్యూతంబుఁ బ్రవర్తించి యధర్మ ప్రవృత్తుండ వైతివి" (సభా. ౨ ఆ. ౨౨౩ గద్య). ఇట్టె "ప్రకాశిల్లు" అను స్వార్థంబునకుఁ జోటఁ బ్రేరణార్థకమగు 'ఇంచు' క్కనునిల్పి 'ఇల్లు' అనుదానికి లోపమును స్థలాంతరములయందు నన్నయ ప్రయోగించెను. "అపర్ణాదువలన నిన్నెఱింగినదాననై నిన్నిట రావించు నుపాయంబు దలంచి యెల్లి దమయంతీ ద్వితీయ స్వయంవరంబగునని ఋతుపర్ణునందుఁ బ్రకాశింపను దేవుండను బ్రాహ్మణుం బుత్తెంచితి" (ఆర. ౨ ఆ. ౨౧౩ గద్య). (ప్రకాశింపన్ = ప్రకాశిల్లఁజేయన్). "ఋతుపర్ణుండు బాహుకుం జూచి నాకు దమయంతీ ద్వితీయ స్వయంవరంబు జూడ నొక్కనాఁటన విదర్భకుం బోవలయు. నీయశ్వనైపుణ్యంబుఁ బ్రకాశింపు మనిన........." (ఆర. ౨. ఆ. ౧౬౪). (ప్రకాశింపుము = ప్రకాశిల్లఁజేయుము.) చ. అతులతపంబునన్ వరుణుఁ డస్మునిచే బహుపుణ్య కర్మసు। స్థితిఁ బ్రభవింపఁగాఁ బడిన దివ్యమునీంద్రుఁడు...(ఆది. ౪ ఆ. ౧౫౭). (ప్రభవింపఁగాఁ బడిన = ప్రభవిల్లఁజేయఁబడిన). తే-గీ. పౌరులట్లు నివర్తింపఁబడి.........(ధర్మసుతుచేత).........(ఆర. ౧ ఆ. ౯). (నివర్తింపఁబడి = నివర్తిల్లఁజేయఁబడి). సీ. రోదసీకుహరంబు రుచిరాంశుతతిఁజేసి యర్కుండు వెలిఁగించునట్లు, లమృత। సందోహ నిష్యంద చంద్రికఁజేసి శీతాంశుఁ డానందించునట్లు సకల। జనులకుఁ దనదైన సదములద్యుతిఁజేసి తనరంగఁ దేజంబుఁ దనపుదాన। చేయుచునున్న సత్సేవ్యుండు పుండరీకాక్షుఁడు కృష్ణుఁడు.........(సభా. ౨ ఆ. ౬ ప). (ఆనందించు= సంతోసిల్లఁజేయు). ఇట్టిధాతువు నంతర్భావిత ప్రేరణార్థకమనుట సుకరమని (చూ. 3౨౬ విమ) తోఁచునుగాని సంస్కృత సమధాతువులందు "కేచిత్తు ణిచ మిచ్ఛన్తి" త్యాద్యాచ్ఛిక ధాతుమాత్ర విషయకమగు నంతర్భావిత ప్రేరణార్థము నంగీకరించుట యుక్తముకాదని పయిరీతిని వ్రాయఁబడెను.

తిక్కన పయిరీతిని నన్నయపద్ధతి నుల్లంఘించుటచేతను నథర్వణుఁడును 'ఇల్లు - ఇంచు' అనువాని కభేదమును సూత్రించుటచేతను గావలయు లేఖక పాఠక ముద్రణ సంస్కర్తృ ప్రభృతులు నియమమువీడి యథేష్టముగా నంతటను దుదికి

నన్నయభారత భాగమందును 'ఇల్లు - ఇంచు' అనువానిని బర్యాయములుగా నిల్పి చున్నారు. మ........నాకద్వీపస్మ స్తక । ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు కంపింపఁగా. (ఆది. ౨ ఆ. ౨౪ వావిళ్ళవారిముద్ర). ఇచట 'కంపిల్లఁగా' అని నన్నయ ప్రయోగించియుండును. ఆయనమతమున "కంపించు = కంపిల్లఁజేయు" అనియె ప్రయోగింపవలయును. 'కంపిల్లు' అనునర్థమున 'కంపించు' అని ప్రయోగించుట నథర్వణ తిక్కనాదు లంగీకరించిరిగాని నన్నయ సమ్మతింపలేదు. క. ముంచినఁ జప్పుడు విని కం । పించు శరీరములు......(నన్నె.కు. ౯ ఆ. ౩౨౮)· చ.........వీఁ । డనికిఁ గడంగినప్పుడు సురాసురముఖ్యులు తల్లడింతు రీ । ఘనునతిశౌర్యుఁ డండ్రు........(భాస్క. యు. ౧౦౨౦ ప). ఇట భాస్కరుఁడు 'తల్లడిల్లుదురు' అనునర్థమున 'తల్లడింతురు' అని ప్రయోగించెను. సీ. ధర్మతనూజుండు ధర్మువు దప్పిన ధరణీతలంబెల్లఁ దల్లడిల్లు (సభా. ౨ ఆ. ౨౨౪). ఇట్లని నన్నయపద్ధతి ననుసరించిన ప్రయోగములు తిక్కనాదుల గ్రంథములలో లేకపోలేదు. ఉ...... అందుఁ బో । కొల్ల నఁ గరా దచటి కూరక పోవఁగరాదు నేర్పు సం । ధిల్లఁగ దీనిఁ బాపికొను దిమ్మప మెట్టిది యొక్కొ దైవమా. (విరా. ౨ ఆ. ౯౧). సీ...... బాణ మవ్వీరవరుఁడు । గైకొని బ్రహ్మాస్త్రకలిత మంత్రాభియుక్తంబుగా నొనరించి కార్ముకమున । సంధించి జగములు జయపెట్టఁ జెచ్చెరఁ, దివిచి యేయుటయును దీప్రభంగి । .........(ఆర. ౭ ఆ. ౧౫౧ ప). (సంధించు = సంధిల్లఁజేయు). క......... ఈ । పురుషులం గూడిన సృష్టికి । వెరవగునది సంఘటిలదు వేర్పడి రేనిన్ (శాంతి. ౫ ఆ. ౬౧). క.........ఈ । యితిహాసము శ్రుతమైనఁ బ । రితమైనను నెఱయ సంఘటించును లక్ష్మిన్ (శాంతి. ౫ ఆ. ౧౬ ప). (సంఘటించు = సంఘటిల్లఁజేయును). తే-గీ. అఖిలసిద్ధులు నఱచేత నావహిల్లు (శాంతి. ౩ ఆ. ౪౧౫). తే-గీ.........ప్రతిమఁ గావించికొని యందుఁ బరము నావ । హించి పూజావిశేషంబు లెల్లఁ జేసి (ద్రోణ. ౫ ఆ. ౪౧౬). (ఆవహించు = ఆవహిల్లఁజేయు). (కర్ణ. ౧ ఆ. ౧౭౮, కర్ణ. ౩ ఆ. ౪౨, అను. ౨ ఆ. ౬౯). ఈయర్థమునందు 'ఆవాహించు' అనియు నన్నెచోడకవి ప్రయోగించెను. శా........ఆవేల్పు, నం, । దావాహించిన మీఁద నెవ్వరికి డాయన్ ముట్టఁగా వచ్చునే (నన్నె. కు. ౯ ఆ. ౨౫౩ సూ. రా. ని). క.........తనరాగంబునఁ ద్రిజగము । ననురాగిల్లెనొ జగంబు సనురాగముతో । ననులాగిల్లెనొ తా మఱి। యన జగములతోన చంద్రుఁ డనురాగిల్లెన్ (నన్నె. కు. ౮ ఆ. ౧౦౯). సూ. రా. నిఘంటువున "అనురాగించు = అనురాగము చూపు" అనుదానికి భీష్మ. ౧ ఆ. ౧౭౦ వచన ముదాహరింపఁబడెను. 'ఇల్లు' అనుదానితోఁ

గూడిన కొన్నిరూపములకుఁ బ్రేరణార్థ కేంచుగంతరూపములు గానరావు. కం... ......తెల్లముఁగ.........మూ । ర్ఛిల్లె నరుఁడు బంధులెల్లఁ జేష్టలు దక్కన్ [ద్రోణ. ౨ ఆ. ౨౭౪). ఉ. తెల్లనిజోడు వెట్టుకొని.........శో । భిల్లుచు నుండ శంఖుఁడు విభీషణశంఖనినాద మొప్పఁగన్ (విరా. 3 ఆ. ౧౪౯). శా. విల్లుం గేతువు.........శో । భిల్లన్ వైచిన శక్తియుం దునిమి.........(భీష్మ. 3 ఆ. 3౯౧). (శల్య. ౧ ఆ. ౧౨౬, ౧33). 'శోభించు = శోభిల్లఁజేయు' అనురీతిని బ్రాచీన మహాకావ్యములందుఁ బ్రయోగము లభింపలేదు. "శోభించు - సం - అ - క్రి - ప్రకాశించు - (శోభిల్లు)" (శ. ర). శబ్దరత్నాకరకర్త యిట్లుదాహరించెనే కాని ప్రయోగములను జూపలేదు. మఱియు వ్యావహారికస్థితి ననుసరించి 'శోభించు' అనుదానికి "శోభిల్లు" అను రూపాంతరమును జూపెను.'శోభించు = శోభిల్లఁజేయు' అను నర్థమును దడవనైనలేదు.

రంజాదుల యించుక్చ్ప్రకారంబునకు సబిందుకంబున కప్రే
రణంబున ద్విరుక్త లకారం బగు. ౨౧.
రంజిల్లు - భాసిల్లు - వర్ధిల్లు - విలసిల్లు - రాజిల్లు - ఈ
యాదేశయోగంబున భిదాదు లకర్మకంబు లగు -
భేదిల్లు - కంపిల్లు - సంధిల్లు.

బాలవ్యా 3.౨౭. I వివయము.

ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు
లోపంబగు. ౨౨.
లాదేశంబున కపవాదంబు. రంజించు - భేదించు -
సంధించు.

సంజీవని. 3.౨౭ I విమ:—సబిందుకంబునకు = బిందువుతోఁగూడిన, రంజాదుల యించుక్చ్ప్రకారంబునకు=రంజ మున్నగు కొన్ని ధాతులవులకు బా. క్రియా.౬3 సూత్రముచే నగు నించుక్కుయొక్క చకారరూప హల్లునకు, అప్రేరణంబునన్ = ప్రేరణార్థము లేనపుడు, ద్విరుక్త లకారం బాదేశం బగును. ఉదా:—రంజ్+ఇంచు= రంజ్+ఇ+ల్ల్+ఉ=రంజిల్లు. ఇట్లే భాసిల్లు మున్నగువాని ప్రక్రియను నైత మర యునది. అప్రేరణంబున ననుటచే బ్రేరణార్థకేంచుగాగమునకు ద్విరుక్త లాదేశము గల్గదు. ఇంకఁ గేవల స్వార్థేంచు గ్భాగమునకు మాత్రమె ద్విరుక్త లకారాదేశము గల్గును. "ఈ యాదేశయోగంబున భిదాదు లకర్మకంబు లగు" అను వాక్యముచే భిదాదులు సకర్మకంబులయ్యు నీ లకారాదేశముతోఁ గూడునపు డవియు నకర్మకం బులె యగు నను నర్థము లభించుచున్నది. అట్టి భిదాదులలో 'కంప' ధాతువు నుదా

హరించుట సరికాదని తోఁచుచున్నది. "కప - చలనే, భ్వాది......అకర్మక......కమ్పతే........." (శబ్దరత్నా) "ఈద్విరుక్త లకారమునంజేసి సకర్మకములును నకర్మకములగు ననుటంజేసి యట్లకర్మకములు గాదగువానికే యీ యాగమం బగుననియు నట్లయ్యును - వర్షించు - ఉదయించు - అస్తమించు మొదలగు నకర్మకములకుఁ గాదనియు.........గ్రహింపవలయును" (బా. సా. పే. ౪౪3 పు). ఈవాక్యము పరస్పర విరుద్ధార్థములు గల్గి యున్నది. మఱియు నీయాగమ మనుట పొసఁగి యుండలేదు. ఈ ద్విరుక్త లకారవిధి యాగమ రూపము గాదు. ఆదేశరూపము. "అట్లకర్మకంబులు గాఁదగువానికే" యనుటచేత సకర్మకము లయియుండి యాదేశ మొంగమున నకర్మకములు గాఁదగువానికే యీ యాదేశమగునను నర్థము లభించుచున్నది. కాఁగా "అట్లయ్యును" అనుటచేత 'సకర్మకములకే రాఁదగియున్నప్పటికిని' అను నర్థము లభించుచున్నది. అట్టియెడ "వర్షించు" మున్నగు నకర్మకములకు రాకుండుటలో వింతయేమున్నది? ఇందు 'అట్లయ్యును' అను హేతువాక్య మెట్లు పొసంగును ?

పరిశీలింపఁగా నకర్మకముల కీద్విరుక్త లకారాదేశము రాదనిచెప్పుట గ్రంథకృదాశయము కాదని చెప్పకతీరదు. "భాస్ - వృధ్ - లస్ - రాజ్ - కమ్ప్" అనునవి యకర్మక ధాతువులేకదా. అట్లగుటచేత లకారద్వయాదేశ ఘటిత రూపములెల్ల నకర్మకములేకాని సకర్మకములు కానేరవనుటమాత్రము నిర్వివాదము. అకర్మకము లకర్మకములుగానే నిల్చును. సకర్మకములునైత మీయాదేశ మొంగమున నకర్మకములగునని సూరి వివరణమునకుఁ దాత్పర్యము. సంపూర్వక 'ధా' ధాతువునుండి "సమ్+ధా+ఇంచు = సమ్+ధా + ఇ + ల్ల్ + ఉ = సంధిల్లు" అని సాధించుకొనఁదగి యుండఁగా కొందఱు 'సంధి' అను నామధాతువు నిటఁ జూపుట యుక్తముకాదు. "సంధిల్లు - సంధిశబ్దము నామవాచకము - దీనికి ధాతుత్వవివక్ష యందు నలువదిరెండవ సూత్రంబుచే నించుక్కు రాఁగా 'సంధించు' అయ్యె.........." (బా. గు. ప్ర. ద్వి. ము. 3౬౨ సూ). "సంధిల్లు:—౭౫ సూత్రజ్ఞాపకముం బట్టి సంధియను నామవాచకమునకు స్వార్థము ధాతుత్వవివక్ష యందించుక్కు రాఁగా సంధించనురూప మేర్పడి యీవిధిచే నిత్యముఁగ ద్విరుక్తలకారాదేశమగుట సంధిల్లునమరూపముగల్గె" (బా. సా. పే. ౪౪3 పు). బా. క్రి. ౬3 సూత్రము చొప్పున సంస్కృతధాతువునుండి తత్సమధాతువును సాధించుటకు వీలులేనియప్పుడు గదా, బా. క్రి. ౭౫ సూత్రపు వివరణముచొప్పున జ్ఞాపకసిద్ధముగ సాధించుకొన వలసియుండును. సూరి 'సంధిలు' మున్నగు లుప్తైక లకారకరూపము నుదాహ

రింపకుండుట వింత. బా. ప్ర. ౮ సూత్రముచొప్పున నాకృతిగణమగు సక్కటాదుల పట్టికలోనైనఁ జేర్చి యుదాహరింపఁడయ్యె. "తత్రోభయోర్ఛవేదేశో। లకార ఇతి కేచన" (3౨౭ వివ). అని యధర్వణుఁడు వచించెను. కం.........అది సంఘు టిలదు వేర్పడిరేనిన్ (శాంతి. ౫ ఆ. ౬౧). ఆ-వె. అనఘ విషమమైనయట్టి కార్యంబు పా। టిలినఁజూచి పెద్దవలచియైన (అను. ౨ ఆ. ౨3౧ ప్రాసగతము). మొ.

౭౨ సూ. వ్యాఖ్య:—'ఇంచుక్కు' పరంబగునపుడనఁగాఁ బ్రేరణేంచుగాగ మము పరంబగునపుడు, రంజాదుల యించుక్కునకనఁగా, రంజాదుల స్వార్థేంచుక్కు నకు, లోపంబగునని యర్థము. ప్రేరణేంచు క్వరకత్వమున రంజాదుల స్వార్థేంచు గ్యాగమునకు ద్విరుక్త లకారాదేశము పూర్వసూత్రముచేత (బా. క్రి. ౭౧ సూ). సిద్ధించుచుండఁగా దాని కపవాదముగాఁ బ్రకృతసూత్రముచేత లోపము విధింపఁ బడినదని గ్రహింపవలెను. ఈవిషయమునే సూరి 'లాదేశంబున కపవాదంబు' అను వాక్యముచే వివరించెను. దీని కుదాహరించుటలో సూరి పూర్వసూత్రములోని యుదాహృతులలో (బా. క్రి. ౭౧ సూ). మూఁడిటినిమాత్రమె గ్రహించి వాని వింఁది స్వార్థేంచుక్కునకుమాత్రమె లోపమును రంజించు - ఛేదించు - సంధించు - అని చూపుటనరయఁగా "భాసిల్లు-వర్ధిల్లు - విలసిల్లు - రాజిల్లు కంపిల్లు" అను కొఱ వడినవానియం దీవిధి వర్తిల్లనేరదని తలంచినట్లె యగపడుచున్నది. వానియం దీవిధిని వర్తిల్లఁజేసినచో "భాసించు (భాసిల్లఁజేయు,) వర్ధించు (వర్ధిల్లఁజేయు) విలసిల్లు (విలసింపఁజేయు) రాజించు (రాజిల్లఁజేయు) కంపించు (కంపిల్లఁజేయు) అనురూపము లుప్పతిల్లవలసియుండును. అట్టి ప్రేరణార్థకరూపములు ప్రాచీన మహాకావ్యములందుఁ జూపట్టలేదు. కావున నీ ౭౧-౭౨ సూత్రములు మహాకవి ప్రయోగానుసారముగ వర్తిల్లుచుండునని గ్రహింపవలయును. నన్నయేతరుల కావ్యములలో 'కంపించు' మున్నగునవి 'కంపిల్లు' మున్నగువానికిఁ బర్యాయము లుగా నైతము ప్రయోగింప బడియున్నవి. కం.........ముంచినఁ జప్పుడువిని... ......కం। పించు శరీరములు (నన్ని. కు. ౯ ఆ. 3౨౮). మొ. ఈవిషయమునె 'తద్వతామిత్యా ద్యధర్వణకారిక విశదీకరించుచున్నది. (3౨౭ వివ). అట్టి యుదా హృతులును నందు విస్తరించి చూపఁబడెను.

వర్ణాగమో విశేషః।పురుషే ష్వర్థేషు చాపి వచనేషు
(ఆం. చిం క్రి. ౧౭ కారి. అహో. ౫౭౨ పు).
వచనే పురుషేచార్థే । లోపవర్ణాగమాదయః । (మో
మతః పాఠాః)(విక్ర. క్రి. 3౫ కా. అహో. ౫౧3 పు).

భాషేయ మమితా తత్ర । దేశ్యా చిత్ర స్వభావయుక్
తచ్ఛిత్ర తానుమన్తవ్యా । పూజ్యపాద సుభాషితే.
(విక్ర. క్రియా. 36 కారి. అహో. ౫౧3 పు).
తత్త త్పదం పరిగ్రాహ్యం । యద్య త్సహృదయే హి
తమ్ । భూయసీ దేశ్యశబ్దేషు । లోపవర్ణాగమ శ్రుతిః
(విక్ర. అజం. ౯3-౯౪ కా. అహో. 32౧-322 పు).

(సన్నయా ధర్వణీయము. 3౨౮ విషయము.)

కల్పతరువు. 3౨౮ విష:—పయివానిలో మొకటి రెండు కారికలు తప్పఁ దక్కినవానికెల్ల 3౨౨ విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

వర్ణాగమ ఇత్యాది:—చింతామణికర్త క్రియాపరిచ్ఛేదమునఁ దత్సమక్రియల ప్రక్రియను మాత్రము "వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యాత్" మున్నగు సూత్రములతో నుపదేశించి యాచ్ఛికక్రియల రూపసాధనమును "అత్వాది తత్సమానా మిన దేశ్యానా"మిత్యా ద్యర్థర్చముచేఁ దత్సమక్రియా కార్యాతిదేశమున నుపదేశించెను. అతి విస్తృతమగు నాచ్ఛికక్రియా రూపసాధన మట్టి తత్సమక్రియా కార్యాతిదేశమున సాధ్యము కాదని తలఁచి "వర్ణాగమ" ఇత్యా ద్యర్థర్చమును సూత్రించుచున్నాఁడు. పురుషేషు = ఉత్తమ మధ్యమ ప్రథమపురుషములందును, వచనేషు = ఏకవచన బహువచనములందును, అర్థేషుచాపి = (తద్ధర్మాద్యర్థములందును) ప్రేరణాద్యర్థ విశేషములందును, విశేషః - వర్ణాగమః = చు - పు - మొదలగు వర్ణవిశేషాగమములును నగునని యర్థము. ఇందలి యాగమశబ్దము వర్ణలోప వర్ణాదేశాదులకును నుపలక్షణము. ఈవిషయమునే "వచనే పురుషేచేత్యాద్యథర్వణకారిక నవరించుచున్నది. వచనే = ఏకత్వాదివచనమందును, పురుషే = ప్రథమాది పురుషమునందును, అర్థే = ప్రేరణాత్మనే పదాద్యర్థ విశేషమందును, లోప వర్ణాగమాదయః = వర్ణాగమ వర్ణలోప వర్ణాదేశాదులు గల్గును. అట్టి వర్ణలోపాగమాదేశాదు లనంతము లగుటచే వివరింప శక్యముగాదనియు మహాకవిప్రయోగములనుబట్టి తెలిసికొనవలసినదేయనియు "భాషేయ మమితే"త్యాది కారికలచే విశదీకరించెను. అట్టి కారికల కీవలను 3౨౨ విషయమున వ్యాఖ్య చేయఁబడెను. అథర్వణుఁ డిట్లు సంక్షేపించిన వర్ణాగమాదుల నీక్రిందిరీతిని బాలవ్యాకరణమున సూరి కొంతవఱకు వివరించుచున్నాఁడు.

చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్త న ల డ రాంతం
బునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు. 23.

పూను - పూనుచు - పూనించు, తేలు - తేలుచు -

తేలించు. మగుడు - మగుడుచు - మగిడించు.
బాలవ్యా. కుదురు - కుదురుచు - కుదిరించు. విను - వినుచు
3 అ॥ I విషయము. వక్ష్యమాణంబు పుగాగమంబు - వినిపించు. బాహు
ళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు. అను -
అనిపించు. తిను - తినిపించు కను - కనిపించు.
దీని యత్వంబునకు - దీర్ఘంబు నగు - కానిపించు

సంజీవని. 3 అ॥ I విష:—హలంతరసంయోగము తుదిని లేనట్టియు 'న - ల- డ - ర' అనువానిలో నే దేనిఁ దుదిని గల్గునట్టియు నచ్చు తెలుఁగు ధాతువునకుఁ బ్రేరణార్థమునందు 'చుక్' అను నాగమము బహుళముగా నగునని యర్థము. ఇయ్యది ప్రేరణేంచుక్కును బహుళముగా బాధించి నిల్చును. "అచ్ఛికమనుటం జేసి సంస్కృత ధాతువులకుఁ బ్రేరణమున నించుక్కేగాని చుగాగమము గాదు" (బా. సా. పే. ౨౨౫ పు). అనుట సరికాదు. సంస్కృతధాతువులెల్లఁ నించు గాగమాంతము లయి యుండియే ప్రేరణప్రత్యయము నందుచుండుటగాన నవి యసంయుక్త న ల డ రాంతములు కానేరవుగావున వానికి 'చుక్కు' సంభవింపనేరదు. కాని సంస్కృత సమములగు ధాతువులలోఁ గొన్నిటితుదిని 'ఇల్లు' అను స్వార్థికము నిల్చుటగలదుగాన 'అచ్ఛికంబునకు' అనుదళము సార్థకమగుచున్నది. లేనిచో 'పాటిల్లు' మున్నగు ధాతువులకుఁ బ్రేరణ 'చుక్కు' ప్రసక్తము కావలసివచ్చును. ఈసూత్రమందలి చుక్కు కిత్తుగాన ధాతువున కంతాగమముగ నిల్చును. బహుళమనుటచే 'చుక్కు' రానిపక్షమున బా. క్రి. ౨౦ సూత్రముచొప్పునఁ బ్రేరణమున 'ఇంచు' గాగమమే యగును. ఉదా:—నాంతములకు:—పూను+చు = పూనుచు - పూనించు, లాంతములకు:— తేలు+చు = తేలుచు - తేలించు, డాంతములకు:—మగుడు+చు=మగుడుచు - మగిడించు, బా. క్రి. ౨౫ సూత్రముచొప్పున 'గు' అనుదానిమీఁది 'ఉ' కార మికారమగునని సూరియాశయము. రాంతములకు:—కుదురు+చు = కుదురుచు - కుదిరించు, ఇందును 'కుదిరించు' అనుచో 'రు' అనుదానిమీఁది 'ఉ'కారమునకు బా. క్రి. ౨౫ సూత్రముచొప్పున 'ఇ'త్వము కలిగెనని సూరితాత్పర్యము. నన్నయాథర్వణీయము దేశ్యక్రియారూపసాధనము సువిస్తరముగాఁ జేయకున్నను "చా రే రుపధాత్మనశ్చలు గ్వా స్యా" త్తను సూత్రజ్ఞాపకముచేతఁ బ్రేరణార్థమునవచ్చెడి యీ చుగాగమము చింతామణి కర్త్రభిప్రేతమే యని యెఱుంగునది. (చూ. ౨౧౦ X విష). బా. క్రి. ౨౨ సూత్రముచొప్పునఁ బైనుదాహరించిన రూపములలో నుత్వలోపము కల్గఁగా 'పూన్చు - తేల్చు - మగుడ్చు - కుదుర్చు' అను రూపములు కల్గును. అందు

'పూన్చు' అనుదానికి 'పూంచు' అనురూపాంతరమును గల్గును. (౨౧౦ XI విష. చూడుడు). (౨౧౦ X విష. చూ). బా. ప్రకీ. ౧౭ సూత్రము ప్రత్యయాగమాది పరకత్వమునఁ బ్రవర్తించునది కామింజేసి దానిచే నుత్వలోపము కల్గు ననరాదు. (3౨౮ III విష. ౨౧౦ X విష. ౨౧౦ XI విష. చూచునది). నాంతమగు విను ధాతువునకు 'చుక్కు' చేరఁగా 'వినుచు' అను రూపమేర్పడును చుక్కురానిపక్షంబున నించుక్కు నిల్చునపుడు బా. క్రి. ౭౮ సూత్రముచొప్పున 'పుగాగమము రాఁగా 'వినిపించు' అను రూపమేర్పడునని "వక్ష్యమాణంబు పుగాగమంబు" అను వాక్యముచే సూరిగారే వివరించిరి. అను - తిను - కను మున్నగువానికి "చుక్కు" వచ్చుట కవి సంప్రదాయసిద్ధము కామింజేసి యట్టివానికి 'చుక్కు' రాదనుచు సూరి 'బాహుళకంబుచే.........' అనువాక్యముతో విశదీకరించెను. (విస్తర.) బాహుళకమనఁగా బహుళత్వము = బాహుళ్యము. బా. క్రి. ౭౮ సూత్రముచే 'పుక్కు' రాఁగా నేర్పడెడి 'కనిపించు' అనుదానిలోని 'క'కారముమీఁది 'అ'కారమునకు దీర్ఘంబును గల్గునని సూరియే వివరించి 'కానిపించు' అనియు నుదాహరించెను. 'కాంచు' అనునదియుఁ గనుధాతు ప్రేరణరూపమే యని తోఁచుచున్నది. "కను (దీనికి - కానన్ - కానక - కానమి - కాఁని - కానఁడు - మున్నగు విశేషరూపములుకూడ సిద్ధించును.) స. క్రి. ౧ చూచు.........సీ. కానరే కానలలోన లోకోత్తరు, నని మ్రాని మ్రానికి నరిగి యరిగి (అర. ౨ ఆ. ౯౮ ప)..." అను సూ. రా. నిఘంటువుచొప్పునఁ గనుధాతు 'క'కారముమీఁది 'అ'కారమునకు దీర్ఘము పెక్కుచోటులందుఁ గన్పట్టుచున్నది. కావున 'కను+చు = కాను+చు = కాంచు' అనురీతిని ప్రేరణ రూపము నంగీకరించుట (బా. క్రి. ౭౭) యుక్తమనితోఁచెడిని. శబ్దరత్నాకరమున

---

విస్తర. 3౨౮. 1 విషయము:—పయిరీతిని సూరి. 'వినుచు - వినిపించు' అను రూపముల నుదాహరించి 'అను - తిను - కను' అనువానికి 'చుక్కు' రాదని మాత్రమె వచించియుండఁగాఁ బేటికావ్యాఖ్యాత యీ క్రిందిరీతిని వ్రాయుట యెంతయు వింతగా నున్నది. "బహుళమనుటంజేసి యను - కను - తిను - విను మొదలగు నాచ్ఛికధాతువు లసంయుక్త నాంతంబులయ్యును ప్రేరణమున ౭౦ చే నించుగాగమమునే గాని చుగాగమము నీవిధిచే నందఁజాలవనియు......అభిప్రాయము" (బా. సా. వే. ౮౮౫ పుట). సూత్రములోని సూరివివరణమునైన సరిగాఁ జూచికొనక వ్యాఖ్యాత పయిరీతిని వ్రాయుట (విను-ధా - చేర్చుట) యెంతయు శోచనీయము. చ. గొనకొని......దివ్యవాణిదా। వినిచె ధరాధినాథునకు.........(ఆది. ౮ ఆ. ౧౦౫). అని భట్టారకుండె 'వినుచు' అనురూపముం బ్రయోగించెను.

'కానిపించు - కనిపించు' మున్నగునవి ప్రేరణార్థకములని తెలియునట్లు 'ప్రే' అని గుఱితించినట్లు 'కాంచు' అనుదానియొద్ద "ప్రే" అని వ్రాయఁబడ లేదు. "కాంచు - దే - స - క్రి. ౧ చూచు........." "కానిపించు - దే.........ప్రే - కనఁజేయు" (శ. ర). కవిప్రయోగములందు 'కాంచు' అనునది 'చూచు' అనునర్థము కలదిగఁ గన్పట్టుచున్నదిగాని యట్టియెడలఁ బ్రేరణకర్తను వేఱుగ నిల్పుటలేదు. అట్లయినను నట్టిచోటులందు "కను+చు = కానుచు = కాన్చు = కాంచు" అను ప్రక్రియచొప్పునఁ బ్రేరణరూప మగపడుచున్నది. కావున 'రాముఁడుఁ గృష్ణునిఁ గాంచెను' అనుచో "రాముఁడు తన్నుఁ గృష్ణుఁడు గాంచు నట్లుచేసెను" అనురీతిని వేఱువిధమగు ప్రేరణము నెన్నవగును. ఉ...దివంబునకా। వెలయఁగ సాదువాదములు విన్చె......... (సభా. ౨ ఆ. ౩౧). ఉ......... మహామధురధ్వని వించె వానికిన్ (ఆర. ౧ ఆ. ౨౨౭ ప.) అని యిట్టి వేఱువిధమగు ప్రేరణమునైతము భట్టారక సమ్మతముగ యున్నది. "సాధు సాధు" అను దేవతాదుల పలుకులు తమ్ము పభ్యులను వినిపించెనని యర్థము. దేవదత్తుఁడు రామునకు, 'కృష్ణునిఁ జూపెను' అను ప్రేరణమునఁ బ్రయోజకకర్త ప్రయోజ్యకర్తను ప్రేరించుట భాసిల్లును. "రాముఁడు కృష్ణుని గాంచెను" అను నీప్రేరణమునఁ గర్తయగుఁ రాముఁడే కర్మమగు కృష్ణునిఁ (తన్నుఁజూచునట్లు) ప్రేరించుట భాసిల్లుచున్నది. అట్లగుటంజేసియే సామాన్య ప్రేరణార్థకరూపములగు 'కనిపించు = కానిపించు' మున్నగునవి "గోచరించు = ప్రత్యక్షమగు" అను నర్థము గలవిగా నర్వాచీనకావ్యములలోఁ గన్పట్టుచున్నవి. రామునకుఁ గృష్ణుఁడు గనిపించెను = కానిపించెను. వేఱువిధమగు నీప్రేరణమునందలి "కాంచు" అనురూపము "చూచు" అనునర్థము గలదిగ వాడుక కెక్కెను. 'రామునిచే మిథిల కనఁబడెను = చూడఁబడెను' అను కర్మార్థకవాక్యమున "రామునకు మిథిల కనఁబడెను = గోచరించెను = ప్రత్యక్షమయ్యెను" అను నర్థ పరిణామము గల్గలేదా.

పయిరీతిని 'కాంచు' అనెడిదానిలోఁ బ్రేరణార్థమగు 'చున్కు' వెలయు చుండుటచేతనె యట్టి చకారము, ముత్పరకత్వమున (ముత్తు సూచేరిసిన సంజ్ఞ బా. క్రి. ౮౬ సూ). 'ప'కారముగఁ బరిణమించుచున్నది. తే-గీ. నీవుధర్మజుపాలికి నెమ్మి నరుగు। మతఁడు పేరోలగంబున్న యవసరమునఁ। గాన్పు మతనికి.......... (ఉద్యో. ౧ ఆ. ౨౭౦ ప). (కాన్పుము = ఆయనకు నిన్నుఁ జూపుము). ఇట్లగుటచేతనే 'కాంచు - వాంచు - పూంచు' మున్నగు దీర్ఘపూర్వక పూర్ణబిందువులు ప్రత్యేక విధానమున విరుద్ధములు కావనియు గ్రహింపవగును.

చువర్ణము కొన్నిధాతువులం దావయవికముగాఁ గన్పట్టుచున్నది. ఉదా:—అదురుచు = చలించు - ఇది 'అదురు' ప్రేరణరూపముగరాదు. (30 V విషయముననిది 'చౌరే'రిత్యాదికి వివరణమనుచుఁ బ్రేరణార్థకమని వ్రాయఁబడెను.). (చూ. 3౨౬ III వి.) అదురు ధాతువు కోశములందు చూపఁబడినదిగాని యది 'అదరు = చలించు' అనుధాతువుయొక్క స్వరశక్తి (Vowel hormony) జన్యమగు వ్యావహారికరూపమె కాని కవిసమ్మతము కాదు. అది ఉకారమధ్యమని నిర్వహించు ప్రయోగములు లేవు. 'అద్రుచు - అద్రువన్' అనురూపములనుబట్టి 'అదురుచు' ధాతువు నంగీకరింపక తీరదు. అదురు ధాతువు గలదనుచు దాని 'ఉకార'మధ్యతను నిర్వహించుటకు శబ్దరత్నాకరమున నీక్రింది ప్రయోగ మీయఁబడెను. క. అదురుదురే పగదాయకుఁ । జెదురుదురే ధైర్య మెడలి జీవితవాంఛన్ । ముదురుదురే మూలల నరి । కెదురుదురే కాక శూరు లెచ్చోట్లనయినన్ (చంద్రభానుచరిత్రము). ఇఁదలి ప్రక్రమభంగము నోర్వని సమతయేకదా యుకారమధ్యతను నిర్వహింపవలయును. రెండవచరణమున భ్రమించి శబ్దరత్నాకరకర్త 'చెదురుదురే' అనుపాఠము చూపెనే కాని 'చెదురు' ధాతువే లేదు. 'చెదరు' అను ధాతువుమాత్రమె శబ్దరత్నాకరమునఁ జూపఁబడినది. ఇట్టి యసంగతిని గనిపెట్టి సూ. రా. నిఘంటుకర్తలు 'చెదురు' ధాతువునుసైతము చూపి దాని నిర్వాహమునకును బైచంద్రభాను చరిత్రపద్యమునే యించుకేని సంకోచింపక యుదాహరించినవారైరి. ఇట్టి ప్రమాణములు వ్యాకరణనియమపరిశీలన విషయమున గ్రహింపఁదగినవి కావుగదా.

పయిరీతిని 'అదురుచు' అనునది యొక ప్రత్యేకధాతువనియు 'అదురు' ధాతు ప్రేరణరూపము కాదనియు నీక్రింది ప్రయోగములలోని దాని యప్రేరణార్థమె బోధించుచున్నది. ఉ. ధరణీచక్రము దిర్దిరం దిరిగె మార్తాండుండు కుంతీ భవ । త్కిరణుం డయ్యె దిశావితానము వడంకెన్ మిన్నదిర్చెన్.........(ద్రోణ. ౫ ఆ. 3౨౨). ఆ-వె. కురిసెఁ బుష్పవృష్టి సురదుందుభి ధ్వనుల్ । చెలఁగె సకలభువన వలయ మద్రువ (ఆది. ౫ ఆ. ౧౨౮ ప).

'అద్రువన్' మున్నగురీతినున్న ప్రయోగములలోని వత్వము (బా. క్రి. ౮౮ సూ). ప్రామాదికమనియు 'అద్రుపన్' అనియే యుండఁదగుననియుఁ దలంచి కావలయును సూరి (అందలి వత్వమును నిర్వహించు ప్రాసాదిగత ప్రయోగము కానరాదు) 'అదురుచు' ధాతువులోని 'చు'అనునది "ఎద్రుచు - విద్రుచు - పద్రుచు" అనువానియందువలెనె ప్రేరణార్థక (బా. క్రి. 23 సూ) "చుక్కే" యనుచు

"చుక్పరక రువర్ణంబునకు ముందలి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాషనగు. అగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు. అదురుచు=అ్రదుచు, ఎదురుచు = ఎ్రదుచు, పదురుచు = ప్రదుచు" (బా. ప్రకీ. ౨౦ సూ). అని (సూరి) సూత్రించినవాఁడ య్యెను. తదను రోధంబున నేను 3౦ V విషయమునఁ దత్సూత్రమున కట్లె వ్యాఖ్యానము చేసితిని. కాని 'అ్రదుచు - అదుర్చు' అనువాని కవిప్రయోగము లలోఁ బ్రేరణార్థభానము తోఁపకున్నది. శబ్దరత్నాకరకర్తయు, సూ. రా. నిఘంటు కారులును 'అ్రదువన్' అనుచోటి "వత్వము" కవిసమ్మతమె యనుతలంపున 'అదు రుచు' ధాతువులోని "చు" వర్ణము ప్రేరణార్థకము కాదనియు నావయవికమే యనియు 'అదురుచు' అనునది 'అదురు' ధాతువు రూపాంతరమె యనియు నట్లగుటచే 'అ్రదు వన్' అనుచోటి "వత్వము" నిర్బాధమనియు నభిప్రాయపడిరి. "అదురుచు - దే - అ - క్రి - అదురుయొక్క రూపాంతరము. (రూ. అదుర్చు)........" (శ. ర). "అదురుచు (ర్చు)=అ్రదుచు (∠అదురు) అ - క్రి - చలించు-వడంకు" (సూ. రా. ని). పయినివ్రాసినరీతిని వీరి యదురు ధాతువు కవిప్రయుక్తము కాదుగదా. మఱియు 'చు'వర్ణ మర్థవిశేషశూన్యమై యావయవికమే యగునపు డింక వ్యావహారికము నిరాధారము ననఁదగు 'అదురు' ధాతువు నంగీకరింప నేల? కవిప్రయోగానురోధమున 'అదురుచు' అను ధాతువునుమాత్రమె యంగీకరించుట యుక్తముకాదా? ప్రసంగ వశమున నిట 'ఎ్రదుచు - ప్రదుచు - వి్రదుచు' అనునవి విమర్శింపఁబడుచున్నవి. సంస్కృతనామములకు ధాతుత్వ వివక్షయందు 'ఇంచు' ఆగమము చేరునట్లే యౌ చ్ఛికనామములకు ధాతుత్వ వివక్షయందు 'చు' ఆగమము చేరునని (బా. క్రి. ౬౫ సూ). (చూ. 3-౭౬ III విష.) వ్యాఖ్య చేసికొననగునుగాన 'ఎదురు=విరోధి' అను నామమునకు స్వార్థమున 'చుక్కు' చేరఁగా 'ఎ్రదుచు' అను ధాతు వేర్పడును. క. పదపడి దుస్తరమగు నీ। పదమూఁడవయేఁడు కడవఁబడుట యరిదిత। మ్మెదురెలుఁగ మిక్కైయాపద। లొదవిన సైరించి రిట్టి యునికియుఁ గలదే (ఉద్యో. ౧ ఆ ౯). ఈరీతిని 'ఎదురు' అనునామమును "అంగలాదులలోఁ" జేర్చినచో (బా. క్రి. ౬3 సూ). 'ఎదిరించు' అనురూపము సిద్ధించును. 'ఎదురు - ఎదురుచు - ఎదిరించు' అను నవి యప్రేరణార్థక పర్యాయరూపములె యగుచున్నవి. కాన 'ఎ్రదుచు - ఎదిరించు' అనువానిలోనిది యాగమ చకారముగ టంజేసి 'ఎదురుపన్ - ఎదిరింపన్' అనియె రూపములు కల్గును. 'ఎ్రదువన్' అనురూపము కల్గనేరదు. "విదురు = విదులు = రాలు" అను ధాతువునకుఁ బ్రేరణరూపము 'విదురుచు' అగుచున్నది. అట్లె "పదురు = త్వరపడు" అనుదాని ప్రేరణరూపము 'ప్రదుచు' అగును. కాన వానినుండియు

'విద్రుపన్ - పద్రుపన్' అనురూపములే నుజ్యంతములు కల్గునుగాని 'విద్రువన్ - ప్రద్రువన్' అను నసిష్టరూపములు కల్గనేరవు. కం. ఎదురుపలేరైరి కురుకులేంద్రుఁడు వారన్ (కర్ణ. ౨ ఆ. ౧౬౪). చ. దిశల ద్రువంబెలంగ.........(విరా. 3 ఆ. ౧౫). "అదుర్చు - అద్రుచు - అద్రువన్ - అన్నట్లె ఎదుర్చు - ఎద్రుచు - ఎద్రువన్ అన వచ్చునో అనరాదో ఎవరు సాహసించిచెప్పఁగలరు ?" (బాలక. ౭౯ పు). ఈశరణ్యకర్తగారి సందేహమును బైరీతిగల నన్నయ తిక్కన ప్రయోగములే తీర్చినవి గదా.

"ఎదురు అనేది నన్నయకాలమందు క్రియ. ఎదిరితిని ఎదిరితివి అనేరూపములు అప్పుడు వాడుకలో ఉండేవి. ఎప్పుడురూఢిసనదో తెలియదుగాని ఎదుర్చున్ను దానినుండివచ్చిన ఎదిర్చితిని - ఎదిర్చితివి - ఎదుర్చును మొదలయిన రూపములున్ను కొన్నిగ్రంథములందున్నవి........" (బాలక. ౭౫-౭౬ పు). అని యిట్లు శరణ్యకర్తగారు సరిగాఁ జూచికొనకయె సాహసించి వ్రాసిరి. నన్నయయే రెండిటిని బ్రయోగించెను. క. ఎఱుకని యెఱుఁగక నిన్నున్ । మఱకువ నెదిరితిని......... (అర. ౧ ఆ. 3౨౬ ప). చ. అనిలజనంబునం బఱచు నస్మదనాగ మెదిర్చి క్రమ్మఱం । చిన పరిగాఁడపోలె.........(ఆది. ౪ ఆ. ౨౦౬). తిక్కనాదులు నిట్లె వ్యవహరించిరి. ఆ-వె. అనఘ నీకెదిర్చి యని సేయువాఁడనై (భీష్మ. ౧ ఆ. ౧౫౬). క......... । ఎదురుపలేరైరి కురుకులేంద్రుఁడు వారన్ (కర్ణ. ౨ ఆ. ౧౬౪ ప). చ.........వా । నికి నెదురంగ శక్యముగునే (అర ౫ ఆ. 3౬౬). సీ. గర్వంబు మెఱయ శిఖండి యశ్వత్థామ । నెదిరిన నాతండు మద మెలర్ప (భీష్మ. ౧ ఆ. ౨౫౯). చ. ఇరువురు నీలనీరద నిభేభుల లించిన వేడ్కతోఁ బర । స్పర మెదిరించి...... (నైష. 3 ఆ. ౯౫ సూ. రా. ని). "పఱచునుండి పఱవక వచ్చునా ? శబ్దరత్నాకరములో 'పఱపు' శబ్దమునకు 'పఱవఁజేయు' అని వ్యుత్పత్తిచెప్పిన సీతారామాచార్యులవారి మతమున పఱచునుండి పఱవక రావచ్చునని తేలినది. గాని కవిప్రయోగములు కనఁబడవు.........కడుదుర్గభంగంబుగన్ బఱపకుమయ్య. (అర. ౫ ఆ. ). అకల్మషులం బఱపంగఁ జూడియే (ఉద్యో. ౧ ). ఈప్రయోగాలు తాము చూచి నిఘంటువులో గనబరచి యుండిన్ని సీతారామచార్యులవారు పఱవఁజేయు అని ఎట్లు వ్రాయగలిగినారో తెలియదు" (బాలక. ౧౬౭ పు). ఈవ్రాఁత యపరిశీలనమూలకము. పఱచుశబ్దము "పరుగెత్తు = పాఱు" అనునర్థమున నప్రేరణార్థకముగాన నందలి యాగమయాదికఁ 'చ' కారమునకు వత్వము వచ్చుటలో విప్రతిపత్తియే లేదు. అందులకుఁ బ్రయోగము లేదనుట సాహసము. ఉ.........వారణ ।

వ్రాతము లుజ్జగించి పఱవంగఁ దొడంగిరి......(హరివం. పూర్వభా. 3 ఆ. ౧౨౬ ప). ఈ 'పఱచు' అను నకర్మక క్రియయొక్క ప్రేరణరూపమగు 'పఱపు' అను ధాతువునకు 'పఱవఁజేయు' అని యర్థము వ్రాయుటలో శబ్దరత్నాకరకర్త చేసిన యపరాధ మేమియు లేదు. బాలకవి శరణ్యకర్త యిట వింతగ భ్రాంతిపడి పైరీతిని వ్రాసెను. 'పఱుచు' ధాతురూపాంతరమగు 'పఱచు' ధాతువు పడుధాతుప్రేరణరూపమగు నపు డందలి 'చు'వర్ణము ప్రేరణార్థకముగాన నావయవికము కానేరదు. కావున నర్దాని నుదాహరించుటలో "పఱపకుమయ్య - పఱపంగఁబాడియే" అను పత్వఘటిత రూపముల నుదాహరించెను. అదియే యుక్తము. పఱపు ధాత్వర్థమగు 'పఱవఁ జేయు' శబ్దములోని పఱచు ప్రేరణార్థకము కాదు. స్వార్థికము. కావున నట్టియావయవిక చకారమునకు పత్వము శాస్త్రసమ్మతము. ఒక్కరూపమె ఘుణాక్షరన్యాయమునఁ బ్రేరణా ప్రేరణార్థకమగుటచే శరణ్యకర్త నిట్లు వంచించినదని యెఱుంగునది.

'పరుగెత్తు' అనునర్థముగల 'పఱచు' శబ్దమునందువలెనె అదురుచు-అద్రుచు - మోచు - గెలుచు - నిలుచు - పిలుచు మున్నగు ధాతువులందెల్ల నావయవిక చకారము గలదు గాన ముత్పరకత్వమున దానికి (బా. క్రి. ౮౮ సూ) పత్వము గల్గుచుండును. వెనుక వ్రాసినరీతిని 'ఎదురు' అను నామమునుండి 'ఎదురుచు' అను నామధాతు వేర్పడినట్లె (బా. క్రి. ౬౫ సూ) చిగురు - చిగురుచు, చెమరు - చెమరుచు, ఇగురు - ఇగురుచు, తలిరు - తలిరిచు, మున్నగు నామధాతువు లేర్పడును గాన వాని స్వార్థికరూపములలోని యాగమచకారము ముత్పరకత్వమున 'ప'త్వఘటితమై చిగుర్పన్ - చెమర్పన్ - మున్నగురీతిని వెలయుచుండును. మఱియు నట్టి నామము లంగలాదులలోని పగుటంజేసి (బా. క్రి. ౬౩ సూ) చిగిరించు - చిగిరింపన్ - మున్నగురూపము లుసైతము వెలయుచుండును.

ప్రకృతసూత్రములోని బహుళశబ్దమహిమచేఁ గొన్ని యాచ్ఛికధాతువులకు స్వార్థమందును 'చు'గాగమమువచ్చుట కన్పట్టుచున్నది. ఉదా:—తనరు+చు = తనరుచు = తనర్చు. "తనరు - అ - క్రి. ౧ అతిశయించు.........క.......... హలాయుధుండు సనుదెంచిన నె। మ్మనము తెలివొందె మూఁపులు। తనరె మొగం బలరె నీదు తనయుఁన కధిపా. (శల్య. ౨ ఆ. ౨౨౮). చ. కనుంగొని కోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల నంగముల్। దనరఁగ సాంద్రఘర్మ సలిలంబులు గ్రమ్మ...... (విరా. ౨ ఆ. ౧33)" (సూ. రా. ని). "తనరుచు (ర్చు) = తనరు. అ - క్రి - (తనరు+చు - స్వార్థము). ౧ పొంగు - అతిశయించు - అధికమగు. చ. బొమలల్కన్ ముడివడ్డ రౌద్రరస ముప్పొంగన్ దనర్పన్ భుజా। గ్రము.........

(ఉద్యో. ౨ ఆ. ౧౮౮). మానిని - ఏచి తనర్చి తలిర్చిన క్రోవుల......(ఆది. ౪ ఆ. ౨౦). స్వార్థికమయ్యు నిది యోగరుచకారమె యగుటచేత ముత్పరకత్వమున 'ప' త్వమె కల్గుచుండును వత్వమురానేరదు (బా. క్రి. ౮౮ సూ).

ప్రయోగములు: ఉ. గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు...శకుంతల సత్యను పల్కె...అని దివ్యవాణి దా। వినిచె ధరాధినాథునకు......(ఆది. ౪ ఆ. ౧౦౫). క......అవనీధర మా। తనిఁ బూన్చి......(సభా. ౧ ఆ. ౧౫౯). సీ.........ద్వారకాపురిఁ గాల్చె (సభా. ౨ ఆ. ౬౫). చ. ఇతనికిఁ గూర్చరేని ధనమిత్త్రు రభీష్టములైన కార్యముల్ । మతి నొనరింతు రిష్టుఁడని మంతురు గాక.........(సభా. ౨ ఆ. ౧౦ ప). తరల.........చె। చ్చెర పితామహా వీరికిచ్చుటఁ జిత్తశాంతి యొనర్చవే. (సభా. ౨ ఆ. ౩౫). (ఒనరు. ప్రే. ఒనరుచు = ఒనర్చు). ఉ.........ధర్మనందనుఁడు క్రమ్మఱిచెక్క యదువీర కోటముల్ (ఆర. ౩ ఆ. ౧౭౦). చ.........దివంబునన్ । వెలయఁగ సాధువాదములు విన్చె.........(సభా. ౨ ఆ. ౩౧). ("సాధు సాధు" అనెడి దేవతాదుల వాక్యములు, విన్చెన్ = తమ్ము వినునట్లు చేసెను ("వినఁబడెను = శ్రుతిగోచరమయ్యెను" అని తాత్పర్యము). మ.........ఈవచ్చు ను। న్నద వీరావళికిం భుజావిభవ విన్యాసంబు కాన్పించి మా। న్పెద గర్వంబు మరల్చెదం బసుల నాచేఁ జిక్కఁగా జెప్పియున్ (విరా. ౪ ఆ. ౨౬౩). మ.........ఆ। దరమున వారిసేరు ముచితంబుగ నారసి వెండి కాన్పవిగా। (ఉద్యో. ౧ ఆ. ౩౬౫). ఉ. ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మన వీడ్చి (విడ్చి) వెండ్రుకల్ । దా వంచేతఁ బూని (ఉద్యో. ౩ ఆ. ౧౧౪). తే-గీ.........అన్నగేంద్రు। నతఁడ కాన్పించు మనల రయమునఁ బోవ। వలయు......(శల్య. ౨ ఆ. ౩౮). ఉ.........అవక్రచరిత్రుఁడు దానవేశ్వరుం। జెచ్చెరఁ గానుపించె.........(నిర్వ. ౪ ఆ. ౨౫). ఉ. పెంచితి ధర్మమార్గమునఁ బ్రీతి యొనర్చుచు ధారుణీ ప్రజల్ । మంచి త్వలోకయాగముల బూనుగ దక్షిణలిచ్చి విప్రులన్ । నించితి సజ్జనస్తుతుల నిర్మలమైన యశంబు దిక్కులన్ । సంచితపుణ్య సర్వగుణసంపద నెవ్వరు నీసమానులే. (ఆశ్ర. ౨ ఆ. ౨౦౩). (మను - మనుచు = మంచు) (బా. క్రి. ౭౭ సూ. చూ.). సీ. మొంగి విచ్చు పసిఁడిగేదఁగి తేకు గమి మించు విశదచ్ఛదమ్ముల విద్రిచి విద్రిచి (పాండు. ౪ ఆ). బిట్టుదూలి నల్దిక్కులఁ గూల గాత్రము విదిర్చె (రా. యు. కాం) (శ. ర). చ. ఎద్రిచిన కాలపాకమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికం। బద్రిచినవారు మన్నిశిత బాణపరంపర వైవ మిణ్గురుల్ । విద్రుపఁగఁ దత్ఫలంబుల చవిం జరితార్థులుగా శరీరపుం। జిద్రుపలు చేరుఁ దత్సుతుల చేతులఁ గాక

కులంబు వాతులన్ (ఉ. హరి. ౪ ఆ. ౧౦౯). ఎద్రుచులోని చుక్కుస్వార్థికము. విద్రుచులోనిది ప్రేరణార్థకము.

బాలవ్యా అట్లు పుగాగమంబును మాన్వాదుల కగు. ౨౪.

3౨ా II వివ. మాను - మానుపు - మానుచు. మను - మనుపు - మనుచు. బాహుళకంబున దీని కించుక్కు లేదు.

సంజీవని. 3౨ా II వివ:—అట్లు........ప్రేరణంబున బహుళంబుగా మాన్వాదులకు 'పు'గాగమంబును నగునని యర్థము. మాన్వాదుల కనుటచేత "అచ్ఛికంబులకు - అసంయుక్త న ల డ రాంతములకు" అను వానిని బూర్వసూత్రము నుండి గ్రహింప నక్కఱ లేదయ్యెను. 'పుగాగమంబును' అనుచోటి 'ను'శబ్దముచే "చు"గాగమము పూర్వసూత్రముచొప్పున నెట్లును గల్గునను నర్థము లభించుచున్నది. మాను - మానుపు - మానుచు. ౨౩ సూత్రముచొప్పున 'మానించు' అనియు నగును (చూ. బా. క్రి. ౨౦ సూ). మనుధాతువునకు. 'మనుపు - మనుచు' అని మాత్రమె యగును. 'మనించు' అనురూపము సిద్ధింపనేరదనుచు 'బాహుళకంబున దీని కించుక్కు లేదు' అని సూరి వివరించెను. మేల్కను - మేల్కను పు= మేలుకనుపు. మేల్కొను - మేల్కొలుపు = మేలుకొలుపు. వీనికి "పు"గాగమంబు నిత్యమగుట బాహుళమనుటచేతనే యని యెఱుంగునది. శబ్దరత్నాకరమున "మానించు" అను ధాతువు చూపఁబడలేదు. కాని "మానుచు" ధాతువున కర్థము వ్రాయునపుడు- 'మానఁజేయు - మానించు' అని వ్రాయఁబడెను. క. వినవు నిప్పటిదుఃఖము । మానింపఁగ మనకు నొండు మందెయ్యది.........(కర్ణ. 3 ఆ. ౧౪౦). మ. అని మేషస్థితి మాన్చె బిత్తరపు చూపస్వేదతావృత్తి మా । న్పె నవస్వేద సమృద్ధి బోధకళ మాన్చెన్ మోహవిభ్రాంతి......(మనుచ. ౨ ఆ. 33). క. అని తనుఁ గౌశికముని మే । ల్కనుపంగా లేచి.........(భాస్క. బాల. 33౦ ప).

చు క్కువర్ణంబులు పరంబులగునపు డిత్వంబున కుత్వం బగు. ౨౫.

అట్లు చు క్కుపగాగమంబు లడంగ్వాది మాయ్యాదుల కగు నగుచో వాని కడవ్రాలు లోపించు. ౨౬.

అడఁగు - అడఁచు - అడఁగించు. మాయు - మాపు - మాయించు. అడఁగు - కరఁగు - కలఁగు - నలఁగు - ఇత్యాదు లడంగ్వాదులు. మాయు - ఉడుగు - కడగు - కుడుచు - బిగియు - ఇత్యాదులు మాయ్యా

దులు. ఆఁగు ప్రభృతు లుభయగణంబులు. బాలవ్యాకరణ వివరణము. 3౨౮ III విష బాహుళకంబునం జేసి కొన్నింటి కించు క్పు క్పుగాగమంబులు రాఁదును, గొన్నింటి కందు యథాసంభవముగా రెండును, గొన్నింటి కొక్కటియు నగునని యెఱుంగు నది. ఆఁగు - ఆఁచు - ఆఁపు - ఆఁగించు. రేఁగు - రేఁచు - రేఁపు - రేఁగించు. పాయు - పాచు - పాపు. విఱుగు - విఱుచు, చూచు - చూపు, నేరుచు - నేరుపు, మేయు - మేపు, లేచు - లేపు, కలియు - కలుపు, తడియు - తడుపు, తెలియు - తెలుపు. ఇత్యాదు లెఱుంగునది.

సంజీవని. 3౨౫ III విష:—౨౫ సూ:—చు క్పువర్ణంబు లనఁగా బా. క్రి. ౨౩-౨౪ సూత్రములచే విధింపఁబడిన "చు - పు" అను ప్రేరణార్థక ప్రత్యయములు పరములగునపు డిత్వంబున కనఁగా నవ్యవహిత పూర్వస్థితమగు 'ఇ'కారమునకు 'ఉ' త్వ మాదేశ మగునని యర్థము. అవ్యవహిత పూర్వస్థితమను వ్యాఖ్యచే 'బిగియు - బిగుచు' మున్నగుచోటులందు "బుగుచు" మున్నగు నని ష్టరూపములు కల్గనేరవు.

౨౬ సూ. వ్యాఖ్య:—అట్లు = ప్రేరణంబున వచ్చు చుక్ - పుగాగమంబుల లోని 'చుక్కు' 'అ'డంగ్వాదులకును 'పుక్కు' మాయ్వాదులకును బహుళముగా నగును. అట్లగుచో నా రెండుగణములకును దుదివర్ణము లోపించును. అడం గ్వాదులు న ల డ రాంతములు కానక్కఱ లేకుండుటయు రెండిటికిని నంత్యవర్ణ లోపము కల్గుటయు నేతత్సూత్రారంభమునందలి విశేషము. అడఁగు మున్నగువా నికి 'చుక్కు'ను దదభావపక్షమున 'ఇంచుక్కు'ను (బా. క్రి. ౨౦ సూ) మాయు మున్నగువానికి 'పుక్కు'ను దదభావపక్షమున 'ఇంచుక్కు'ను వచ్చుటయు 'చు క్పు క్కులు' వచ్చునపు డంత్యవర్ణములు లోపించుటయు వరుసగా నుదాహరింపఁబడెను.

సూత్రమున నడంగ్వాది మాయ్వాదుల యంత్యవర్ణములకు లోపము చెప్పవలసెనుగాన సూరి "తుదివ్రాలు" అని ప్రయోగించెను. తుదివ్రా లనఁగా 'తుది యక్షరము లు" అని యర్థము. (బా. అచ్చు. ౨౧ సూ. ౨౦౮-౨౦౮ I విష). పేటికావ్యాఖ్యాత యీవిషయమును స్మరింపక 'వ్రాలు' అనుదాని నేకవచనస్థలము లందుఁ బ్రయోగించుట పొరపాటు. "అడఁగు+చు:—చుక్కు పరముగా గువర్ణము తుదివ్రాలు లోపింప నడఁచని రూపమగును........'మాయు+పు = మాపు' అని కడ వ్రాలు లోపింపఁగా నీరూపమేర్పడెను" (బా. సా. పే. ౪౪౨ పు)

ఇంకను వింతగా "కడవ్రాలునకు" (బా. సా. వే. ౪౪౭ పు). (కడవ్రాలకు అనవల యును) అనియుఁ బ్రయోగించెను. బహుత్వమునందు నగాగమ మగుట యశ్రుత చరము. బహుత్వమునఁ బ్రాయికముగా లట్టు నిల్చుచుండునుగాన సూరి "సువర్ణ కంబు పరంబగునపు డుకార ఋకారంబులకు నగాగమంబగు" (బా. తత్స. ౨౫ సూ). అని సూత్రించెనేకాని యేకవచనమునఁ గాఁ వక్కాణింపఁడయ్యె. లు ప్రత్య యముమీఁద "నఁకొ" అను చొప్పున "కు ప్రత్యయము పరమగుట యెట్లు ఘటిల్లునని పేటికావ్యాఖ్యాత తలంచెనో తెలియకున్నది.

సూరి బిగియు ధాతువును మాయ్యాదులలోఁ జరించుట ప్రామాదికము. బిగియుధాతు ప్రేరణరూపము 'బిగుచు' అగునుగాన నది యడంగ్వాదులలోని దన వలయును. 'బిగుపు' అను బిగియుధాతు కృదంతరూపమును స్మరించి యిట్లు భ్రమించెనా యని యాలోచింపవలసి యున్నది. పేటికాకారు "బిగియు+చు=బిగుపు" (బా. సా. వే. ౪౪౬ పు. క్రియా. ౭౫ సూ. వ్యాఖ్య). అని వ్రాయుట మిక్కిలి వింతగా నున్నది. "బిగుచు - దే - ప్రే - బిగియఁజేయు" "బిగుపు - దే - వి - బిగిము" "బిగుతు - దే - విణ - వదులుకానిది" (శ. ర).

ఆఁగుప్రభృతు లుభయగణంబులను సూరివాక్యముచే 'ఆఁగు' మున్నగు వానికి 'చుక్కును - పుక్కును' బహుళముగా నగునని యట్టి చుక్పుక్కులు పర మగునపు డాఁగుప్రభృతులకును సంశ్లేష్టవర్ణలోపము గల్గునని యును విశదమగుచున్నది.

బాహుళకంబునం జేసికొ్యది సూరివాక్యముచే నీసూత్రమున బహుళ శబ్దము నుపదేశింపకున్నను ౭౩ సూత్రమునుండి వరుసగా బహుళశబ్ద మనువృత్త మగుచున్నదని విశదమగుచున్నది. అక్కారణమున 'ఇంమక్ - చుక్ - పుగా గమములు' మూఁడును యథాసంభవముగాఁ బ్రయోగానుసారమున ధాతువుల కగు చుండునని గ్రహింపవలయును. అనఁగాఁ గొన్నిటి కించు క్పు క్పుగాగమములు మూఁడును గొన్నింటి కండలివి రెండును గొన్నిటి కొక్కటియు నగునని బాహుళ కంబునం జేసికొ్దివాక్యముచే సూరియే వివరించెను. 'ఆఁగు - ఆఁచు - ఆఁపు - ఆఁగించు. రేఁగు - రేఁచు - రేఁపు - రేఁగించు' అనునవి "కొన్నింటికి మూఁడును" అనుట కుదాహరణము. "ఆఁగు" అనునది యంతర్భావిత ప్రేరణార్థకమగుటచే దానికిని 'ఆఁగించు' అనునర్థముగలదు. "పాయు - పాచు - పాపు" అనునవి "కొన్నింటియందు యథాసంభవముగా రెండును"అనుట కుదాహరణము. "విఱుగు- విఱుచు" అనునది "కొన్నింటి కొక్కటియు" అనుట కుదాహరణము. చూచు -

చూపు మొన్నగునవి యీ యుభయధాతువులు సంయుతము "కొన్నింటి కొకటియు" అను దానికే యుదాహరణమని సూరియాశయ మనఁదగును. కాని 'చూపించు' మొన్నగు రీతిని వానిలోఁ గొన్నింటికి స్వార్థంబుగాఁగను ఘటితరూపములును ప్రసిద్ధమై యున్నవి. 'చూచు - నేరుచు - లేచు' అనుధాతువులపైని స్వార్థంబునకు నిల్పిన 'చూపించు - నేరిపించు - లేపించు' (బా. క్రి. ౮౭ సూ.). అనురూపములు సిద్ధింపవచ్చును. కాని శబ్దరత్నాకరమున నిట్టిరూపములు చూపఁబడలేదు. అదొక ప్రమాణమనియుఁ జెప్పఁజాలము. 'రేఁగించు' అనునదియు శబ్దరత్నాకరమునఁ జూపఁబడలేదు. సూ. రా. నిఘంటువున "తెలిపించు" అనునది స్వార్థంబుగంత ముగఁ జూపఁబడినది. "తెలిపించు - స - క్రి. (తెలుపు+ఇంచు - స్వార్థము). ౧ తెలియఁబఱచు - ఎఱిఁగించు - వ. అది తమ కుమారులఁ బిలిచి తెలిపించిన వార లిట్లనిరి. (కళా. ౬ ఆ. ౧౫౧). ౨ మేలుకొలుపు - లేపు. ఉ. కొండలపాటునన్ మనము గుందినఁ గంటికి నిద్రరాక నే। నం దెలిపించి యప్డు పయనంబుగ దైత్య విభుండు వోవ........(నిర్వ. ౬ ఆ. ౮౦). ౩ తెలియఁబఱుచు - ప్రకటించు - ద్విపద. లీలమైఁ దెలిపించు లేజవ్వనముల। నోలి వినోదించుచున్న యంగనల (రంగ. రా ఉ. ౮౭ పొ. ౨౬ ప). ౪ తెలుపు+ఇంచు - (ప్రేరణమున). తెలుపునట్లు చేయు - ఎఱుకపఱిపించు. (వ్యవ) వానిచే ఆతని కావార్త తెలిపించితిని" (సూ. రా. ని). "చూపించు - స క్రి. (చూపు+ఇంచు - స్వార్థమున) చూపు - కనఁ బఱచు. (బ్రౌ. వా). (వ్యవ). వాఁడు మచ్చునకై కొన్ని కాగితములు చూపించి నాఁడు" (సూ. రా. ని). ఇట్లాచ్ఛిక ప్రేరణరూపములపై స్వార్థంబుగాఁగను వచ్చుట శాస్త్రవిరుద్ధము. నిర్మూలము. పలు కవిప్రయోగములలోని "తెలిపించు" అను రీతి చోటులందు 'తెలుపునట్లు చేసెను' అనురీతినిఁ బ్రేరణపై ప్రేరణంబునకునే శాస్త్రసమ్మతముగ సందర్భపఱుచుకొననగును. (నేనం దెలిపించి=నేనునుగూర్చి తెలుపు నట్లుచేసి- మొ).

ప్రయోగములు:—తరల. తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రుల న్వైన భీ। కర పరస్పర కోపవేగము గ్రన్నఁ బాచి........(సభా. ౨ ఆ. ౨౬౮) (పాయు - పాచు). తే గీ........విప్రు। కడుపు వ్రచ్చుచు వెలువడి క్రాఁచె విప్రు (అర. ౨ ఆ. ౩౨౩). (క్రాఁచు = క్రాఁగఁజేయు). ఎ-గీ........ఎట్టివారి నైనఁ। గ్రాఁచుఁ దక్షిణంబ గర్వంబు........(అర. ౩ ఆ. ౨౬౦). ఆ-వె...... ఎగచి యొగచి యందు నెగయ కుండఁగ నొక్క। హంస.....(అర. ౨ ఆ. ౧౨). ('ఎగచు - ఎగుచు' అను రూపద్వయము కోశములంగలదు. వానిలోని స్వరమును

నిర్ణయించు ప్రయోగము లభింపలేదు. ఎగయుధాతువునుబట్టి 'ఎగచు' సమూల మనఁదగు). చ.........ని। న్నొడఁబడ నిష్టుఁడై కలిపి.........(సభా. ౨ ఆ. ౯). (కలచు కలపు). క.........స। త్కారంబులఁ దనిపి వారి (ఆర. ౨ఆ.౧3౯). (తనియు తనుపు). ఉ.........భీష్మ మహాభ్ర మెట్లడం। గించెనొకో శిఖండి యను కృత్రిమవాయువు......(భీష్మ. ౧ ఆ. ౫౨). గీ. అది ప్రసిద్ధము విను తృష్ణ యడఁచి కర్మ। వృత్తి విడిచి..... ...(శాంతి. ౧ ఆ. ౧౪౦). చ. కౌరవసేన రూపు మా। పుట యవలీల నాకు ననుఁ బొల్లుగఁ జేయుట నీకుఁ బాడియే (భీష్మ. ౨ ఆ. ౧౬౧). క. వంచనయును మాయయు మా। యించి పరాక్రాంతి (ఆర. ౪ ఆ. ౭౬.) మ ...... మందర మంబుధిం గలఁచు దర్పం బొప్ప.. .. .. (భీష్మ. 3 ఆ. ౧౫). క. దవ్వుల విఱిగినఁ బౌరులు। నవ్వుదురని మేలు మేలు నను సాఁగకు......... (విరా. ౪ ఆ. ౭౧). శా.........కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్ (మనుచ. ౨ ఆ. ౬౭). సీ.........యతినైన గుండె జల్లనఁ గలంప (ఆము. ౧ ఆ. ౫౯) అని యిట్లు 'కలఁచు' ధాతువు 'మదనవికారముచే క్షోభింపఁజేయు' అనునర్థమునునైతము గల్గియున్నది. కాని "చ.. ..... నీవు తన్నుఁ గ। ల్చిన నొరుఁ దాను గల్చి చను చేడియ గల్గినఁ జూపు తెచ్చెదన్ (నన్ని. కు. ౪ ఆ. 3౯౯ ప). మున్నగుచోటులందు 'కలఁచు' ధాతురూపము గాదనియుఁ గలుచు ధాతురూపమనియుఁ గావుననె యట ముత్పరకత్వమున వత్వము గల్గునవియు నందలి చకారమాగమాది సంబంధికాక యావయవికమె యగుచున్నదనియు గ్రహింపవలెను. చ. కలుచుట దోసమే మగలఁ గల్వక యాండురు తొల్లి యాండురా। గలుతురె (నన్ని. కు. ౭ ఆ. ౧౫౧). "కలుచు (ల్పు) స - క్రి - మోహించు - వలచు." (సూ. రా. ని).

నన్నయా క్వచి ద్బిందు ర్నినౌ దృష్టాః। క్వచిత్తేషు న నూ మతౌ.
3.౨ర IV విమ. (విశ్వ. అజం. ౯౦ కారి. అహో, 3౬౯ పు).

కల్పతరు. 3.౨ర IV విమః—"శత్రర్థే తూత శ్చో।నో స్తస్య సాశ్చచ్చ పూర్ణ బిన్దురపి" (౨౧౦ X విమ) అను చింతామణిసూత్రము సందర్భమున లుప్తస్వరక నకారవిధి ప్రస్తావమున నుపదేశింపఁబడిన సూత్ర మియ్యది. క్వచిత్ = ప్రేరణార్థక స్థలములలోఁ గొన్నియెడల, బిన్దుః = లుప్తస్వర నకారస్థానమున బిందువును స్వర లోపాభావపక్షమున, ని, నౌ = నివర్ణ - వ్యంజన నకారములును, దృష్టాః = కనఁబడుచున్నవి. క్వచిత్ = కొన్నిరూపములలో, తేషు = వానిలో "ని న"ల చోట ననఁగా నివర్ణ నకారములచోట 'న నూ' మతౌ=నువర్ణ నకారములు సమ్మతములగు

చున్నవి. అనఁగా భూతార్థకరూపములలో 'ని'వర్ణమును దిద్ధర్థాద్యర్థక వ ర్త మానార్థక ప్రభృతులలో 'ను'వర్ణమును నిల్చుననియు స్వరలోపపక్షమున నంతటను బొల్లు నకారమును బిందువును బర్యాయముగా నిల్చుననియు నర్థము. ఉదా:— పూంచెన్ - పూన్చెన్ - పూనిచెన్ - పూంచున్ - పూన్చున్ - పూనుచున్ - పూంచుచున్నవాఁడు - పూన్చుచున్నవాఁడు - పూనుచుచున్నవాఁడు - పూన్పఁ గలఁడు - పూన్పఁడు - మొ. అహోబలపండితుఁడును జాలవఱకిట్లే యర్థముచేసి కొన్నను నిందలి యుత్తరార్థమునకు వ్యాఖ్యచేయమి నరయఁగా నాతనికి దాని సందర్భము సరిగఁ గుదురుపడలేదని తోఁచును, కావుననే దానిపాఠము కొంత సవ రింపవలసివచ్చెను. "క్వచి ద్బిన్దు ర్నినౌ దృష్టాః। క్వచిత్తే చ న నీ మతా।......బిన్దుః పూర్ణబిన్దుః - పూనిచెన్ - పూన్చెన్ - పూంచెన్ ఇతిరూపత్రయమ్, పూఁచె నితి రూపం త్వ ప్రామాణికమేవ. దీర్ఘాచ్ఛే త్తణ్ణ ఏవ స ఇత్యు క్తేః. దీర్ఘా త్పరస్యాను స్వార స్యోభయ విధత్వాఙ్గీకార విరోధాత్ -అతఏవ ముద్దరాజు రామభద్రకవినా. క. పూంచె న్మంచె న్మన్చె న। టంచుఁ బ్రయోగింపఁజెల్లు నమరశ్రేణిః। మంచి మనోరథనికరము।పూంచె రమాధిపుఁడు భక్తపోషకుఁ డనఁగన్. ఇతిలక్షణ ముక్త్వా క. కాంచన మాలాలంకృత। చంచత్తనులీల మెఱయ జవనాశ్వములం। బూంచిన రథమున మణిమయ! పంచాననకేతు వెత్తె బంధురభంగిన్ - (కవిజన సంజీవని. ప్రథమతరంగము. ౭౫-౭౬ ప). (వావిళ్ళవారి ముద్రణమునఁ బై లక్షణ పద్యాది చరణము "పూంచెం బూనిచెఁ బూన్చె న। టంచు........." అని యున్నది). ఇతి తిక్కయజ్వవచన ముదాహృతమ్. 'మనిచెన్ - మంచెన్ - మన్చెన్-ఇతి రూప త్రయమ్" (అహో. 3౬౯-3౭౦).

ఇంచుక్ = చుక్ - పుగాగము పరకత్వమున నాచ్ఛికధాతువులందుఁ గలుగు వర్ణాగము వర్ణలోప వర్ణాదేశాది వికారములలో సీయొక్కటిమాత్రమె పైరీతిని బ్రసక్తానుప్రసక్తముగ నథర్వణునిచే నుపదేశింపఁబడెను. ఇంకను నిట్టివి యనేక ములు గలవు. అట్టివానినెల్ల "వర్ణాగమో విశేషః........." "వచనే పురుషే చార్థే........భాషేయ మమితా తత్ర........." ఇత్యాద్యథర్వణ వచనముల చొప్పున (3౭౫ విష) మహాకవి ప్రయోగానుసారముగ గ్రహింపవలెను. అట్టి వానిలోఁ గొన్నిటిని సూరి యీక్రిందిరీతిని వివరించుచున్నాఁడు.

ఇంచుక్ - చుక్ - పుగాగమంబులు పరంబులగునపు
డాగమాదేశలోపంబులు పెక్కుదెఱంగులం గానం
బడియెడి. ౭౭.

బాలవ్యాకరణ వివరణము. 3 ఆ V విష.

అగు - కావించు. వచ్చు - రావించు - రప్పించు.
విన్నపము - విన్నవించు మోఁకాలు - మోఁకరించు.
కేక - కేకరించు. పలవ - పలవరించు - పలవించు.
ఆల - ఆలకించు - ఆలించు. వ్రక్క - వ్రక్కలించు.
నొచ్చు - నొంచు - నొప్పించు. ఉండు - ఉనుచు -
ఉంచు. డిగు - డించు - డిగించు. పెరుగు - పెనుచు -
పెంచు. తునుగు - త్రుంచు. మునుఁగు - ముంచు -
మునుచు. మొగుడు - మొగుడుచు - మొగుచు -
మోడుచు - మొగిడించు. చొచ్చు - చొనుపు -
చొప్పించు. చిదుఁగు - చించు - చింపు. త్రెగు -
త్రెంచు - త్రెంపు. తిరుగు - త్రిప్పు. చచ్చు - చంపు.
నిలుచు - నిలుపరించు - నిలుపు. కొను - కొలుపు.
పోవు - పుచ్చు - పనుచు - పంచు - పనుపు - పంపు -
అనుచు - అంచు - అనుపు - అంపు. అను ప్రయుక్తం
బగు పోవునకుం బుచ్చుమాత్రంబగు. మోపపోవు -
మోసపుచ్చు. ఇత్యాదు లెఱుంగునది.

సంజీవని. 3 ఆ V విష:—(ఆగం XI వి. దీని లఘు వ్యాఖ్యకలదు). అగు+ఇంచు = కావించు = అగునట్లుచేయు. వచ్చు+ఇంచు = రావించు = వచ్చునట్లు చేయు. ఇవి 'అగు - వచ్చు' ధాతువులకు బా. క్రి. 20 సూత్రముచొప్పునఁ బ్రేరణేంచు క్ప్రత్యయముచేఁ గలుగు వికారములు విన్నపము - ఇది అంగలాదుల లోనిది. కాన స్వార్థేంచు క్ప్రత్యయమున 'పాకు' వకారాదేశము. విన్నపము+ఇంచు = విన్నవించు = విన్నపముచేయు. విన్నవించు - ఆలించు - పలవించు మున్నగు నుదాహృతులనుబట్టి ప్రేరణేంచు క్ప్రత్యయముచే కాక స్వార్థేంచు క్ప్రత్యయమందును శాబ్దికధాతువులకుఁ గొన్నియెడల నాగమాదేశలోపాది వికారములు గల్గునను సూరియాశయము విశదమగుచున్నది. మోఁకాలు - మోఁకరించు. ఇందు 'కేకరించు' అనుదానియందువలెనె రేఫముగలదని సూరి యుదాహరించెను. కాని శబ్దరత్నాకరకర్త యీ క్రింది యుత్తరహరివంశ ప్రయోగమునుబట్టి యిందు శకటము నంగీకరించి యుదాహరించెను. "మోఁకటించు - దే - అ - క్రి - మోఁకాళ్లు వేల కాన, ముందటి కొఱగు." "మోఁకటిల్లఁబడు. ద్వ - అ - క్రి. (మోఁకటిల్లన్+పడు) మోఁకటిల్లు. తే-గీ.........తత్త। ఱించి పొండ్రుఁడు ధర మోఁకటిల్లఁ

బడఁగ (ఉ. హరి. 3 ఆ. ౬౫)" "మోఁకారించు - దే - అ - క్రి - మోకతించు యొక్క రూపాంతరము" (శ. ర). దీనినిబట్టియు 'మోఁకతించు' అనుదానిలోని శకటము విశ్వసనీయము కాకున్నది. ఇందలి 'ఇంచు' గాగమమును స్వార్థికమె యగుచున్నది. కేక+ఇంచు = కేకరించు. "కేకరించు - ఉభ - దే - అ - క్రి. ౧ కేకలువేయు.........సం - స - క్రి - కటాక్షించు" "కేక - ఉభ - దే - వి - పెద్ద కూఁత - సం - ఆ - స్త్రీ. నెమలికూఁత" (శ. ర). ఇట్లు శబ్దరత్నాకరకర్త దేశ్యమగు 'కేక' శబ్దమునె వీనికి మూలముగ నంగీకరించెను. "కేకరించు - సం - అ - క్రి - కడగన్నుపెట్టు" అనుచోఁ బ్రాన "కేకరించు" తత్సమధాతువుగ నంగీకరించునపు డయ్యది "కేకరము - సం - వి - అ - వ" అను శబ్దమునుండి యేర్పడెననియు నర్థానికి "పెద్దకూఁతకూయు" అనునర్థము లేదనియు నెఱుంగునది. పలవ+ఇంచు = పలవించు = పలవరించు = ప్రలపించు. ఆల+ఇంచు = ఆలకించు = ఆలించు = విను. వ్రక్క+ఇంచు = వ్రక్కలించు = భేదించు=వ్రక్కలుచేయు. ఈమూఁడును నంగలాది గణములోని వగుటనే వీని కించు గాగమము స్వార్థమం దయ్యెనని యెఱుంగునది. 'ఆల - పలవ' అనువానిని సూరిగారు 'అంగలా'దులలోఁ బఠించియున్నారు. (బా. క్రి. ౬౩ సూ). 'ఆలకించు' అనునది "ఆలక్షించు" అనుదాని వైకృతమనియు 'పలవించు' అనునది 'ప్రలాపించు' అనుదాని వికృతియనియు నెన్నునది. నొచ్చు+ఇంచు = నొంచు = నొప్పించు. 'నొప్పించు' అనుచో 'పత్వము' బా. క్రి. ౮౨ సూత్రముచేఁ గల్గెను. ఇందలి "నొంచు" అను రూపము చుగాగమాంత మనఁదగును. ఇంకంత్యలోపమే కాక బింద్వాగమమును నయ్యెను. ఇట్టి ధాతువులకెల్ల బా. క్రి. ౨౬ సూత్రమువే "చు ర్పు"గాగమములు వచ్చుననియు, అవి వచ్చునపు డాసూత్రమునఁ జెప్పఁబడిన యంత్యలోపము కొన్నిటి కగుననియుఁ గొన్నిటి కంత్యలోపమె కాక ప్రకృతసూత్రముచొప్పున నాగమాదేశలోపాదులు పెక్కువిధములు గల్గుననియు నెఱుంగునది. అట్టి యాగమాదేశలోపములను యథాసంభవముగా బుద్ధిమంతులు సులభముగా నూహింపనగుననియు గ్రహింపవలెను.

ఉండు+చు = (అంత్యలోపము) ఉంచు, బిందువునకు నువర్ణాదేశము - ఉనుచు. డిగు+ఇంచు = డిగించు (బా. క్రి. ౨౦ సూ). డిగు+చు = అంత్యలోప బిందాగమములు - డించు. పెరుగు+చు = అంత్యలోపము - రువర్ణమునకు నువర్ణాదేశమున - 'పెనుచు' అనియు బింద్వాదేశమున - 'పెంచు' అనియు రూపసిద్ధి గల్గును. ఈధాతువు సబిందుకముగ శబ్దరత్నాకరమున నీక్రింది ప్రయో

గముచొప్పున నుదాహరింపఁబడెను. "పెరుఁగు - దే - అ - క్రి. ౧ వర్ధిల్లు. క. అనఘ మదాలస కడుపున । జనియించియు యోగిరూత చనుగుడిచి పెరిం । గిన తనయు లితర........(మార్కం. 3 ఆ). ౨ ఎదుగు. గీ. వింధ్య మమరాద్రి మాద్రికి వి విధతార । కములు మొలపూసలుగఁ బెరుంగ మదిఁ దలఁచె (పాండు. ౫ ఆ)...... ..." (శ. ర). తునుగు+చు = త్రుంచు. అంత్యవర్ణలోపము నువర్ణముచో బింద్వాదేశమును 'తు' అనుదానికి రేఫాగమమును రాఁగా 'త్రుంచు' అయ్యెను. బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములలోనిందు ఖండబిందువు లేదు. తర్వాతి ముద్రణములలో నందు బిందువు ప్రక్షిప్తమయ్యెను. ఇందుకు మూలము శబ్దరత్నా కరాదులె యని తోఁచెడిని. "తునుఁగు - దే - అ - క్రి. ఖండితమగు. క. స్రుక్కి తునింగిన కాళ్ళను । తెక్కలు........(అచ్చ. అర. కాం." (శ. ర). సూ రా. నిఘంటువునందును నీ తిమ్మకవి ప్రయోగమె బిందుస్థితి కాధారముగ నెక్కింపఁబడెను. తిమ్మకవి ప్రయోగమును బ్రమాణీకరించి యిట్లు సవరించుట సరి కాదని తోఁచెడిని. బా. గు. ప్ర. వ్యాఖ్యాత బిందువును నిల్ప లేదు. పేటికావ్యాఖ్యాత సబిందుక ముగ నుదాహరించెను. సూ. రా. నిఘంటువున 'తునుచు' అనురూపము సయుక ముదాహృత మయ్యెను. "తునుచు - స - క్రి. (✓ తునుఁగు). త్రుంచు - ముక్కలుచేయు. సీ. అనుకువెన్నెలఁ దాల్చి తునిచి సేవెలుచేసి వెన్నెలపాలను జున్నొనర్చి (యయా. ౨ ఆ. ౮౪ ప). మునుఁగు+చు = మునుచు - ముంచు. మొగుడు+చు = మొగుడుచు - మొగుచు - మోడుచు. మొగుడు+ఇంచు = మొగిడించు. చొచ్చు+పు = చొనుపు. చొచ్చు+ఇంచు = చొప్పించు బా. క్రి. ౮౭ సూ. చొప్పున చకారద్వయమునకు 'పకార' ద్వయము. ఇత్యాది మాన్యావి యగుటచేఁ బ్రేరణమున 'పు'గాగమము వచ్చెను. చినుఁగు+చు = చించు. చినుఁగు+పు = చింపు. ఇత్యాది "ఆఁగు' ప్రభృతులలోని దగుటచే. "చుక్కను, పుక్కను" వచ్చి యంత్యలోపంబును 'ను'వర్ణకస్థానమున బింద్వాదేశమును రాఁగా రూప ద్వయము గల్గెను. త్రెగు+చు = త్రెంచు - త్రెంపు. పై రీతినె 'ఆఁగు' ప్రభృతు లలోఁ జేర్చి యంత్యలోప బింద్వాగమముల నరయునది. తిరుగు+పు = త్రిప్పు. చచ్చు+పు = చంపు. మాయ్యాదులలోఁజేర్చి లోపాదికార్యముల నూహించునది. నిలుచు+పు = నిలుపు. నిలుచు+ఇంచు = నిలువరించు - దీనిని 'ఆఁగు' ప్రభృతు లలోఁజేర్చి 'చుక్ పుక్కు' లనుజేర్చి లోపాదికము నూహించునది. కొను+పు = కొలుపు. మాయ్యాదుల లోనిదిగాన 'పుగాగము' నంత్యలోపము రాఁగా లువర్ణ మాగమమయ్యెను. క. అలిగి దశార్ణాధీశుఁడు । కొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూర

గజము.........(భీష్మ. 3 ఆ. ౧౫౧). మ.........అ । గ్గలికం దార్కొని తీవ్ర బాణతతి యాకాశంబునం జేఁకటుల్ । గొలుపన్ నిల్చి పెనంగి.........(హరి. ఉ. భా. 3 ఆ. ౧౧౦). ఇచట "కొలుపు = పురికొలుపు - కొలుపు = పుట్టించు" అను రీతి నర్థము ల నెన్నునది. "కొను = వెలుఁగుదీయు" అనునర్థము గలదాని ప్రేరణమున "కొనిపించు" అనురూపము ప్రసిద్ధమయి యున్నది. శబ్దపల్లవాది స్థలములందు - "పురికొలుపు" మున్నగురీతిని 'పు'వర్ణకము మాత్రమె యగును. పోవు+చు = పుచ్చు - పనుచు - పంచు - అనుచు - అంచు. పోవు+పు = పనుపు - పంపు - అనుపు - అంపు. లోపాగమాదేశము లూహ్యములు. అను ప్రయుక్తం బగునపుడొక్క 'పుచ్చు' అనురూపము మాత్రమె యగునని సూరిగారే వివరించి యుదాహరించిరి. మోసపోవు+చు = మోసపుచ్చు.

పోవుధాతు ప్రేరణరూపములుగా సూరిచే నుదాహరింపఁబడిన యీరూపముల విషయమున నభిప్రాయభేదములు గలవు. 'పోవు+చు = పుచ్చు' అనుచోటి లోపాదేశాగమాది వికారములు కొంత సుసంభవము లనఁదగును గాని "అనుచు-పనుచు" మున్నగునవి పోవుధాతు ప్రేరణరూపము లనుట విశ్వసనీయముగ నుండలేదు. అర్థము సరిపడినను రూపము పోవు ధాతువును సంబంధించి యుండ లేదు. కావుననే శబ్దరత్నాకరకర్త పుచ్చు అనుదానికి మాత్రమె 'పోఁజేయు' అను నర్థము జూపెను. తరలము.........చెచ్చెరన్ ధరణీశులన్ । విడిచి పుచ్చుమ (సభా. ౧ ఆ. ౧౯3). "పుచ్చు - దే - అ - క్రి - పుచ్చిపట్టు, ప్రే, పోఁజేయు.........." (శ. ర). 'పనుచు' అనునది ప్రేరణరూపమని యాతఁడు తలంపలేదు. ఇది యొక ప్రత్యేక సకర్మక క్రియ యని యాతఁడు తలంచెను. ఇయ్యది. 'పంచు-పనుపు-పంపు' అనువానికి మూలరూపము కానోపును. ఈతనిపక్షమున 'పనుపన్' మున్నగుచోటులందు 'పనుపన్' మున్నగు ననిష్టరూపములు సంభవింపవలసి వచ్చునుగాన 'పని' అను నామము పయిని స్వార్థిక 'చు' ప్రత్యయము చేరుటచే 'పనుచు' (తనరు. తనర్చు. 3౨౮ I విషయము.) అనుధాతు వేర్పడెననియు నక్కారణమున 'పనుచు' ప్రభృతులనుండి 'పనుపన్' మున్నగు పత్వ ఘటితరూపములు సుసంభవములగుచున్నవనియు గ్రహింపనగును. ఇది యంతర్భావిత ప్రేరణార్థకమగుచు 'ఆజ్ఞాపించు-పోవఁజేయు' అను నర్థముల నిచ్చు ననఁదగును.

ఇంక 'అంచు-అనుపు-అంపు' అనువానికి మొదటి రూప మనఁదగు 'అనుచు' అనునది 'అరుగు' ధాతు ప్రేరణరూపమని శబ్దరత్నాకరకర్త తలంచినట్లున్నది "అనుచు-దే - ప్రే - అరుగఁజేయు పుచ్చు.........(ఇది పెరుఁగుధాతువు వంటిది)" (శ.ర).

దీనిని బట్టి పెరుఁగుధాతువునుండి 'పెనుచు' అను ప్రేరణరూప మేర్పడినట్లె 'అరుగు' ధాతువునుండి 'అనుచు' అను ప్రేరణరూప మేర్పడెననుట యుక్తమని శబ్దరత్నాకర కర్త తలంచెనని యూహింపనగును. కాని యీపక్షమున నిచట 'ఆజ్ఞాపించు' అను నర్థము సహజము కాదని తలఁచి కావలయును సూ. రా. ఘంటుకారు లీసూర్థము నుపేక్షించిరి. ఇంకఁ బ్రేరణార్థకము. 'పంచు' అనుదాని యాకారము లోపింపఁగా (అం VI VII విష.) 'అనుచు' అను రూప మేర్పడెనని వీరు తలంచినట్లు తోఁచుచున్నది. "అనుచు = అంచు, అనుపు - అన్పు - అంపు - ప - క్రి - (√పనుచు) ౧ పోవునట్లుచేయు - పుచ్చు. క. అవనిని పత్త్కవతికిఁ జెప్పిన నాయమ వనుప నంబ. బెంపుగ వృద్ధాం । గనలం దోడుగ నప్పుడు । పనిచి యనిచితని జనంబు ప్రస్తుతిసేయన్ (ఉద్యో. ౪ ఆ. ౨౭౬). (ఆయము పనుపన్ = ఆజ్ఞాపింపఁగా - వృద్ధాంగనలను దోడుగఁ బోఁజేసి యాయంబను పోవఁజేసితి నని యర్థము)." (సూ. రా. ని).

ప్రయోగములు:—సీ.........నిదురుఁడు మొగము వాయ । సిడి తల వాంచి తన్నెఱుఁగక దుఃఖితుండై యుండె........ (సభా. ౨ ఆ. ౧౯౮). చ మతి నోనరింతు రిష్టుఁ డని మంతురుగాక......(సభా. ౨ ఆ. ౧౧). (మను - మంచు). క. బలహీను లైనవారలు । బలవంతుల నోడుచు నపుడు బహుమానముల ...... (సభా. ౨ ఆ. ౧౭౦). చ.........సౌబలుండు ని । న్నోడిచె దురోదరంబున (సభా. ౨ ఆ. ౨౧౪). ఆ-వె. జలజనాభు పగతు జంభకుం డనువాని । భూరి బలుని పుత్త్రుఁ బోరిలోన । నోడిచి.... ...(సభా. ౧ ఆ. ౨౪౭). (ఓడు ధాతు ప్రేరణము - ఓడుచు - ఓడించు) ఆ-వె. కరము భక్తి మ్రొక్కి కరములు మోగిచి యు । ట్లనియె (ఆర. ౧ ఆ. ౨౯౨). (మొగుడు. ప్రే. మొగుచు) క. దేవతలకు నపకారముఁ । గావించిన (ఆర. ౧ ఆ. ౩౭౬). (అగు. ప్రే. కావించు). క...... ...నా । నావిషయాధీశ్వరులను । రావించెం దత్స్వయంవర వ్యాజమునన్ (ఆర. ౨ ఆ. ౨౮). (వచ్చు - ప్రే. రావించు). క. కాంచన మాలాలంకృత । చంచత్తను లీల మెఱయు జవనాశ్వములం । బూంచి రథంబున.........(విరా. ౪ ఆ. ౪౫). (పూను. ప్రే. పూనుచు. పూన్చు. పూంచు). క. కసి యనుమతుఁడై యందఱు । ననుపఁగ మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్ (ఉద్యో. ౧ ఆ. ౬౧). చ......ఓండు విల్లునై । కొనియెదు సందునన్ నినిచెఁ గ్రూరశరంబు లుఱంబునందు......... (విరా. ౫ ఆ. ౧౭౬). (నిండు+చు=నినుచు = నించు). క.........హైడింబుం । డనిఁ గర్ణుని నోర్చుఁ । బనుత మతని నతనికిన్ (ద్రోణ. ౫ ఆ. ౧౯౮). (పనుచు = ఆజ్ఞాపించు - పనుచుదము - పనుతము). సీ........, జనముల సుగతికి నునుతు

రధిప (అను. ౨ ఆ. 333). (ఉండు - ఉనుచుదురు - ఉనుతురు = ఉంతురు).
తే-గీ.........సేన నరుడు। నొంపఁగా నిట్టు లొప్పరిరిం దగునె (భీష్మ. ౨ ఆ.
౨౮౦). ఉ.........। నొంచుచుఁ గొంపు సొంపుగ గనుంగన యొప్పున.........
విల్। ద్రుంచి తుపంగవక్త్రము......... మే సొ। ప్పుచిన దేరితోడ......
...(ద్రోణ. ౨ ఆ. ౭౪). చ.........। సు దొల ... వ్వవాఁడతని నొంపక
.........(నిర్వ. ౬ ఆ. ౧౩౦). ఆ-వె. చాప ... కొంపు సూచితె...
...... (భీష్మ. 3 ఆ. ౨౮౮). చ ......మే। పిపికి డిగింపఁగాఁ గొని (హరి.
పూ. 3 ఆ. ౮౦). చ.........నే। బిగిచెక వజ్రము జముని పాలికి నన్నరనాథు
వేగమే। యనుచుట కింత యెల్లిరమె యూతనికి మునియాజ్ఞ పూరయన్. (అశ్వ.
౧ ఆ. ౮౧). ఉ......... ఈతఁడు। ఒంచితి సైన్యము ... బార్థివ యిట్లని
పల్కి తత్తతిన్ (శాంతి. ౨ ఆ. ౪3౨). ఆ-వె. భూరిభుజు ... గానె పోయెనో నీ
వెట। యేని పుచ్చితో సజేచ్ఛ నతని।.........(ఆ. 3 ఆ. 3౭౨). "అనుచు -
దే - ప్రే - ౧ అరుగఁజేయు - పుచ్చు - ఆ - వె.........విజయలక్ష్మిఁ జేకొని
రమ్మని।యధిపుఁడనిచి పుచ్చె నతని వెంట. (నిర్వ ౯ఆ-౧౦౧ ప). ౨ ఆజ్ఞాపించు
చ.........నే। బిగిచెన వజ్రము జముని పాలికి నన్నరపాలు వేగమే। యను
చుట.........(అశ్వ. ౧ ఆ. ౮౧)" (శ. ౭). 'పుచ్చు' అనునర్థమునకు నిర్వచ
నోత్తర రామాయణపద్యము నుదాహరించుట సరికాదని తోఁచెడి. అందు "అనిచి=
ఆజ్ఞాపించి, పుచ్చన్ = పోవఁజేయఁగా" అని యర్థముచేయుట యుక్తమని తోఁచు
చున్నది. అట్లె యాజ్ఞాపించనెడి యర్థమున కశ్వమేధ పర్వపద్యము నుదాహరించు
టయు సరికాదని తోఁచెడి. అందు వజ్రమును ప్రస్థాపించెన అని యర్థముచేయు
టయె సుసంగతమై యుండును.

అన్వాదుల కించుక్కు పరంబగునపుడు 'పు'గాగము
బాలవ్యా. బగు. మానునకు విభాష నగు. ౭౮.
3౨౮ VI విష. అనిపించు. అను - కను - తిను - విను. మానిపించు -
మానించు.

సంజీవని. 3౨౮ VI విష:—అను మున్నగు ధాతువులకు ప్రేరణేంచుక్కు
పరమగునపుడు 'పు'గాగమును వచ్చును. ధాతువుతుదిని 'పు' అనునది నిల్చునని
యర్థము. మాను ధాతువునకు 'పు'గాగము వైకల్పికముగా నగును. మాను
ధాతు వన్వాదులలోనిది కాదు. దానికి 'పు'గాగమును వైభాషిక మనుటచే
నిది యప్రాప్తవిభాష యని యెఱుంగునది. ఉదా:—అను+ఇంచు = అను+పు+

ఇంచు = అనిపించు. అను - తిను - కనులకు 'పు' గాగమము రాదని బా. క్రి. 23 సూత్రపు వివరణమున సూరియే వచించెను. వినునకు 'వినుచు - వించు' అను రూపాంతరములు గలవనియు నం దుదాహరించెను. ప్రకృతసూత్రముచే "విను+ఇంచు = విను+పు+ఇంచు = వినిపించు" అను రూపాంతరమును గల్గును. సూరి బా. క్రి. 44 సూత్రమునందును 'అన్వాదులను' బేర్కొనెను. ఆసూత్రపు వివరణమునందు 'కొను - మను' అనునవి మఱి రెండుధాతువు లన్వాదులుగఁ జేర్పఁబడినవి. ఈసూత్రములోని 'అన్వాదులలో' వానిని సూరి యుజ్జగించెను. కాన వానికి 'పు'గాగమమే కాక 'ఇంచుక్కును గాదనియె సూరి తలంచినట్లు తోఁచుచున్నది. బా. క్రి. 28 సూత్రపు వివృతిలో 'మను' ధాతువున కించుక్కు లేదనియు 'మనుచు - మనుపు' అని మాత్రమె యుండుననియు సూరి కంఠోక్తముగనే వచించెను. శబ్దరత్నాకరమున 'మనించు - మనిపించు - కొనించు - కొనిపించు' అను రూపములు చూపఁబడలేదు. సూ. రా. నిఘంటు విప్పటికి నకారాది శబ్దములవఱకు మాత్రమె ప్రకటితమయి యున్నది. అందు 'కొనిపించు' అనునది చూపఁబడెను. కాని దానికొక వ్యావహారికవాక్య ప్రయోగమమాత్రము చూపఁబడెను "కొనిపించు - స - క్రి - (√కొను) కొనఁజేయు. (విలువకు పుచ్చుకొనఁజేయు). ఉదా:— మగనిచే ఆమె జరీచీర కొనిపించినది" (సూ. రా. ని). ఇంక దీనిప్రేరణము "కొలుపు" (బా. క్రి. 22 సూ) అని మాత్రమె కవిసమ్మతము. విను+పు+ఇంచు = వినిపించు. బా. క్రి. 23-22 సూత్రములచొప్పున 'వినుచు - వించు' అను రూపములును గల్గును. కను+పు+ఇంచు = కనిపించు - కానిపించు (చూ. బా. క్రి. 23 సూ). (విస్తర.). తిను+పు+ఇంచు = తినిపించు - మాను+

---

విస్తర. 3-ఆ VI విమ:—"కనిపించు - వినిపించను రూపములు ప్రేరణార్థకములుగా వ్యవహారమున నేఁడు విననయ్యెడి - యథార్థముగా నాయాగణంబులం జేర్చి యాయావాని కాయారూపంబుల సంపాదించునది. వీని నంతర్భావిత ప్రేరణార్థకములుగఁ బ్రయోగములంబట్టి గ్రహింపఁదగును." (బా. సా. వే. ౪౫౧ పుట). 'కనిపించు - వినిపించు' అనువానికి వ్యవహారమున 'గోచరించు - వినఁబడు' అనునర్థములు ప్రసిద్ధములగుటచే నీపేటికావాక్య మనర్థకమయి యున్నది. కాన నివి యప్రేరణార్థకములుగా వ్యవహారమున విననయ్యెడినని పేటికావ్యాఖ్యాత వ్రాసి యుండుననియు నచ్చుతప్పున 'ప్రేరణార్థకములుగ' అని పడియుండుననియుఁ దోఁచెడిని. ఈపక్షమున నివి యంతర్భావిత ప్రేరణార్థకము లని వచించుట కేవలము నయుక్తము. "కరఁగు = కరఁగించు" అనురీతి నించుక్కుచేరకయే ప్రేరణార్థము నిచ్చువాని నంతర్భావిత ప్రేరణార్థకము లనుట సంప్రదాయము.

పు+ఇంచు = మానిపించు - మానించు - మానుచు - మాన్చు - మానుపు - మాన్పు (చూ. బా. క్రి. ౭౮ సూ). చనుధాతువునకు 'చనఁజేయు' అని మాత్రమె ప్రేరణార్థకరూపము. క. అప్పుడు నగుపించె నచటి యబలాజనమున్ (వి సా. ౪ ఆ. ౩౯). ఇంచు ప్రకరకత్వమున 'నగు' ధాతువునకు 'పు'గాగమము వచ్చునని కల్పించికొననగును. (చూ ౩౨౦ విష)

అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమం బగు
నప్పాదులకు విభాషనగు. ౭౯.

బాలవ్యా ౩౨౦ VII విష

అడ్డము - అడ్డగించు. అడ్డము - ఓర - చిత్తము - పంతము - పెల్ల - బోర - మట్టము - మేళము-ఇత్యాదు లడ్డాదులు. అప్ప - అప్పగించు - అప్పించు. అప్ప - ఒప్ప - పల్లము - కోపము - ఇవి యప్పాదులు.

సంజీవని. ౩౨౦ VII విష:—అడ్డాదులు నప్పాదులును బా. క్రి. ౬౩ సూత్రములోని 'అంగలాదులలో'నివని గ్రహింపనగును. "అప్ప - ఒప్ప అనునవి యంగలాదులలో సూరిచేఁ జూపఁబడియు నున్నవి. ఆసూత్రముచే వీనికి స్వార్థమున "ఇంచుక్కు"రాఁగాఁ బ్రకృత సూత్రము ౭౭ సూత్రపు వివరణముగా "గుగాగమము" వచ్చునని యెఱుంగునది. అడ్డము మొదలగువాని విభక్తిచేరని ప్రాతిపదికములె "ఇంచుక్కు"నకుఁ బ్రకృతులని యెఱుంగునది. ఈవిషయమును "అడక - గాల - తిలక" అనువాని నంగలాదులలోఁ జదివిన సూరివివరణమె విశదీకరించుచున్నది. అట్లె యింకను అడ్డాదులని సూరివచించుటయుఁ దద్విషయమును స్పష్టపఱుచుచున్నది. కావునఁ దత్తచ్ఛబ్దముల స్వస్వరూపజ్ఞానమునకై సూరి 'అడ్డము - చిత్తము - పంతము - మట్టము - మేళము - పల్లము - కోపము' అని వచించినను 'అడ్డ - చిత్త - పంత - మట్ట - మేళ - పల్ల - కోప' అనునవే యీ స్వార్థేంచుక్ప్రత్యయమునకుఁ బ్రకృతులని గ్రహింపవలయును. ఉదా:—అడ్డ+గు+ఇంచు అడ్డగించు = 'అడ్డు' అను నాచ్ఛికధాతువును 'అడ్డగించు' అను నర్థము గలది వెలయుచున్నది. 'పెల్ల - బోర' అనువానికి రంజాదులకువలెనె (బా. క్రి. ౭౧-౭౨) "పెల్లగిల్లు = పెల్లగిలు - బోరగిల్లు = బోరగిలు" అను స్వార్థేంచు గ్రూపములును, "పెల్లగించు-బోరగించు" అనెడితదీయ ప్రేరణరూపములును సాధించుకొనవలయును. కోపమును బొందునది = 'కోపగ' అనియు, చిత్తమును బొందునది = "చిత్తగ" అనియు మేళమును బొందునది 'మేళగ' అనియు సంస్కృతశబ్దములను గ్రహించి వానిపైని "అన్యేష్వపి దృశ్యతే" ఇత్యాది సూత్రముచొప్పున

(చూ. 3౨౬ విష. 3౨౬ III విష) ధాతుత్వ విషయ చే "ఇంచుక్కు"ను జేర్చి "చిత్త గించు - మేళగించు - కోపగించు" అను రూపములను సంపాదించికొనుట యుక్తము. అందు 'మేళగించు' అనుదాని తద్భవరూపము 'మేళవించు' అనుదానిని సంగ్ర హించుకొనవలయును. కాని సూరి యుపదేశించినట్లు 'కోప - చిత్త - మేళ' అను సంస్కృతశబ్దములపై నించుక్కు నిలుపునపు డాచ్ఛిక మాత్రవిషయ మనదగు 'గు'గాగమము చేయుట యుక్తము కాదు. అట్లగుటంజేసి యడ్డాదులలోని చిత్త - మేళ - శబ్దములను నప్పాదులలోని కోపశబ్దమును బ్రత్యేకత్వేయములని యెన్న నగును. అప్పాదులలోని 'ఉప్పు - ఒప్పు' అనునవి తద్భవధాతువులని యంగలాది వ్యాఖ్యాసందర్భమున వ్రాయఁబడెను. అందలి పల్ల శబ్దముపై తము వైకృతమె. "పల్లము - కట్టము లోనగువాని విూఁది గంత - పల్యాణమ్" (వైకృతదీపిక). పల్యాణశబ్దము శబ్దస్తోమ మహానిధిలోఁ జూపఁబడలేదు. శబ్దార్థచింతామణి కోశ మున "పర్యాణమ్" అని యుదాహరింపఁబడెను. 'పల్యయనమ్' అనునది యీ రెండు ప్రామాణిక కోశములందును గాదు. కావున వైకృతదీపికలో "పల్యా ణమ్" అని ప్రకృతిని జూపుట సరికాదని తోఁచెడిని. ప్రయోగములు:—"ఓర గించు - ఓరగిల్లు" రెండును సార్థంచు గంతరూపములె. ("ఓరసించు - స - క్రి. (√ ఓర) తప్పుకొను........" "ఓరసిల్లు (లు). ఓసరిల్లు అ. క్రి. (√ ఓర. సం. అపస్ప. ప్రా. ఓసర. అపసరిల్లు - తొలఁగు......" (సూ. రా. ని). ఇట్లు "ఓరసించు - ఓరసిల్లు" అనియు రూపములు గలవు. తే గీ. చేది పాంచాలకేకయు లాదిగాఁగ । గల్గు భూపాలకోటి మొగ్గరములెల్లఁ । గలఁగఁ దిరుగుడువడ నోరఁ గిలఁగఁ బెల్లు । గిల్లఁ దల్లడపడ రణక్రీడ సల్పె (భీష్మ. ౧ ఆ. ౨౬౯ ప). ద్విపద. బోరన నెగయుచుఁ బొంగుచుఁ గొమ్ము । లోరగించుచు మలయుచు వంగికొనుచు (బసవ. ౫ ఆ. ౭౮౦ పంక్తి) "పెల్లగించు - దే - ప్రే. పెల్లగిలఁజేయు - ఉన్మూ లించు" (శ-ర). క. అని కలు ద్రావుట యెవ్వరి । కిని గాదని పలికి పంతగించుచు .........(యయా. 3 ఆ. శ. ర. చ. ఉతమున ముక్కులం జెవులఁ గన్నుల నొల్కెడు రక్త మంగ మాప్లుతముగఁ జేయఁగా నతఁడు బోరగిలం బడియెఁ ధరణ .........(శల్య. ౧ ఆ. ౨౮౫). "బోరగించు - నే - ప్రే - బోరగిల్లఁజేయు" (శ. ర). శా.... ....కభా తాయాతి వాతాహతా । లోల త్తంత్రుల మేళగింపఁ గదవే లోలాక్షి గేళాక్షికిన్ (కసచు. 3 ఆ. ౫౭). "మేళవించు - వై...... తే.గీ. వీరశృంగారములు మేళవించినట్టి । చెలువమున.........(వై. ౫ ఆ. శ. ర). ఉ. వావిరి కప్పసీరు మృగనాభిరసంబున మేళవించి" (నై. 3 ఆ. శ. ర). గీ......

ఆరయంగ యుద్ధంబు గాదందుఁ బుట్టు । కీడు మేలేమియును జిత్తగింపకుండు (అశ్వ. ౧ ఆ. ౧౧౬). ఉ. ఐనను జిత్తగింపు ద్రుపదాత్మజ నాసభ నట్లుచేసినన్ (ఉద్యో. 3 ఆ. ౭౫ ప). 'కోపగించు - కోపగిల్లు' అను రెండును స్వార్థంచుగంతములుగనె సూ. రా. నిఘంటువున నుదాహరింపఁబడెను. ఆ-వె. కొడుకుపాటుచూచి కోపించి కాళింగ । పతి........(భీష్మ. ౨ ఆ. ౬౫). 'కోపగించు' అనుదానికిఁ బ్రాచీన కవిప్రయోగము లభింపలేదు.

ఆడోడు కూడుల డకారంబునకుం జుక్కుపరంబగు
బాలవ్యా. నపుడు రేఫంబగు. ౮౦.
3౨౮ VIII విష. ఆడు - ఆరుచు - ఆడించు. ఓడు - ఓరుచు - ఓడించు.
కూడు - కూరుచు - కూడించు.

సంజీవని. 3౨౮ VIII విష:—ఆడు = తడుపు = స్నానమాడు, మాటలాడు - ఆటలాడు. ఓడు = అపజయపడు. కూడు = పొందు. ప్రేరణార్థకముగు చుక్కు (బా. క్రి. ౭3 సూ) పరంబగునపుడు 'ఆడు - ఓడు - కూడు' అను ధాతువుల డకారమునకు రేఫాదేశ మగును. ఆడు+చు = ఆరుచు = స్నానమాడించు = తడుపు - ఆటలాడించు - మాటలాడించు. ఓడు+చు = ఒరుచు = ఓడించు = పరాజయముందించు. కూడు+చు = కూరుచు = కూడునట్లుచేయు. ఈ విషయము కొంత పరిశీలింపవలసియున్నది.

ఆడుధాతు ప్రేరణరూపములలో డకారము నిల్చినది "ఆడించు" అనునది మాత్రమె గలదు. "ఆడుచు" మున్నగురూపములు లేవు. "ఆర్చు = ఆడించు" అనరూపములు గలవుగాన "ఆడుధాతు డకారంబునకు రేఫాదేశము చేయుట యుక్తమె. క. నేర్పరి పెక్కువిధంబుల । నార్పఁగ బొమ్మలు గడంగి యాడెడు చందం । బేర్పడఁ గాన్పుము........(శాంతి. ౧ ఆ. ౨౮3). చ. మదిమది నుండ నీసుతుఁడు మిత్రులు సొబలు జూచ మార్చి...... ..(ఉద్యో. 3 ఆ. ౨౮౦). అనురీతిని 'ఆటలాడు' అనునర్థమునందు ప్రేరణరేఫాదేశము నిర్వివాద మనఁదగును. అల్లె - సీ. కెంగేలు కేలితోఁ గీలించి నెయ్యంపు మాటలఁ దగు ముద్దుమాట లార్తు। (విరా. ౨ ఆ. 3౧౦). (ఆర్తును = మాటలాడింతును). అనుచొప్పున "మాటలాడించు" అనునర్థమునందును ప్రేరణరేఫాదేశ మంగీకరింపఁ దగినదే యనఁదగును. కాని "అఱచు = ఆఱుచు = ఆర్చు = బొబ్బరించు" అను వేఱొకధాతువు గలదు. అయినను "ఆడు" ధాతుప్రేరణరూపమగు 'ఆర్చు' అనునది పెద్దకేకలు వేయుట యనునర్థమునఁ బ్రయోగింపఁబడదు గానఁ దద్విషయము శంకాస్పదము కాదు.

క. విఱిచి వధియించి యార్చెన్ । వఱలఁగ భీముండు భువనవలయం బద్రువన్ (సభా. ౧ ఆ. ౨౧౨). ఆర్చు=బొబ్బరించు ప్రేరణార్థకము కాదు. మ. జలకం బార్చెల తాంగి యోర్తు....... (పారి. ౨ ఆ. ౧౧). సీ. నీహార సలిలంబు నించి కాంచన కలశముల మజ్జన మార్పఁ జనవు లేదు. (వరాహ. ౭ ఆ. ౪౮ సూ. రా. ని). 'ఆర్పన్' అనురీతిని 'స్నానమాడించు' అను నర్థమునఁ బ్రాచీనవి ప్రయోగములు లభింపలేదు. కాని 'నీటితోఁ దడుపు' అనునర్థమున శాస్త్రీయప్రయోగములే చూపట్టుచున్నవి. సీ.....ఆ-వె. ఎఱుక గల మహాత్ముఁ డెఱుక యన్ జలములఁ నార్చుఁ గ్రోధమను మహానలంబు (అర. ౧ ఆ. ౨౨౨). తరల.........ఏను గృష్ణుఁడ వీఁడు భీముఁడు వాఁడు గాండివాది భవత్కృతదారుణం బను వహ్ని నార్పఁగ నున్నయ । క్కడిఁది వీరలు........(సభా. ౧ ఆ. ౧౯౩). ఈసందర్భమున నొకవిషయ మాలోచింపఁ దగియున్నది. "ఆఱు = చల్లగాలిచే దానియంతట నది చల్లాఱు." అనునర్థముగల 'ఆఱు' ధాతు ప్రేరణ రూపము 'ఆర్పు' ధాతు ప్రేరణ రూపమునకు సన్నిహితముగాఁ దోఁచును. సీ.........ఆ-వె. ఇంద్రియములఁ నెల్ల నివురంగఁజేయుచు । నడరు శోకవహ్ని యాఱనేర । డింద్రపదము సేరె నేఁయు (భీష్మ. ౧ ఆ. ౧౯౩). ఇట్టియెడల 'ఆర్చు = నీటితోఁదడుపు' అనునర్థమునకు మూలముగు నాఱు ధాతువు చెల్లనేరదు గాన భేదమును గ్రహింపవగును.

ఓడుధాతు ప్రేరణరూపములగు "ఓడించు=ఓరుచు=ఓర్చు" అనువాని యర్థమును "ఓర్చు = స - క్రి. సహించు" అనుధాతువు నిర్వహింపఁజాలి యున్నది. కావున "ఓడు" ధాతు డకారమునకు రేఫాదేశము చేయ వలయని శంకింపవలసి యున్నది. ఆ-వె. పరశురాముఁ డొండె హరుఁడొండె నరుఁడొండె । గాక యొరులు గలరె కర్ణు నోర్వ । బలిమి భీముఁడొండె బలదేవుఁడొండె గాఁ । కొరులు నరుల కల్గ నోర్వఁగలరె. (ఆది. ౭ ఆ. ౨౦౩). క.........నను మార్కొనంగఁ బురుషుల నుర్విం । గానఁ గిరీటికి నొక్కని । కే నోర్వ నతండు శరము లెక్కడెఱుఁగున్ (ఉద్యో. ౪ ఆ. ౧౪౯). (ఇటఁ గిరీటిని నొక్కనినే నోర్వనని కవిప్రయుక్త మన్నచు క్షతి లేదు). ఇట్టియెడలఁ గల వత్వముచే నివి యప్రేరణరూపములనుట యుక్తము. ఇట్టి ప్రయోగములను సూ. రా. నిఘంటుకారులు "ఓర్చు (రుచు) ఓడించు - స - క్రి. (√ ఓడు) ఓడఁజేయు. జయించు" అనుదానికి లక్ష్యములనుగా నుదాహరించుట యుక్తముకాదు. వత్వముతోనే యుదాహరించుట మఱియు వింత (చూ. ఎగచు సూ.రా.ని). ఇట్టియెడల జయింపఁ జాలనను దానివలెనె సహింపఁజాల ననునర్థమును సుసంగతమె యననగును. సీ. సురసమూహంబుతో సురరాజు నోడించి ఖాండవం

బెక్కటి కాల్చి-యున్న।వీరున కఖిలాబ్ధివృతవసుంధరం గల రాజుల నోర్చి పరాక్రమ
మున। .........(ఆర. ౧ ఆ. ౩౭౮). ఇట్టియెడల రాజులనోర్చె సహించె ననుట
గ్రంథకర్త్రభిప్రాయము కాదు. సుసంగతమును గాదు. ఓడించె ననునర్థమె సందర్భశుద్ధి
గల్గియుండును. క. ఆరంభరహితుం బొందు నె।యారయ సంపదలు హీనుం డయ్యును
బురుషుం। డారంభశీలుండయి యక్క। ఆరంభుల నోర్చు నెంత యధికుల నైనన్
(సభా. ౧ ఆ. ౧౨౩). ఇట్టియెడల "ఓర్చు=సహించు" అనునది యర్థవంతమె కాదు.
ఇంక "ఓడించు = హీనుంజేయు" అని యర్థము చెప్పక తీరదు. కావున నిట్టి ప్రయో
గములను సంగ్రహించుటకయి "ఓడు" ధాతు డకారమునకుం బ్రేరణార్థక చుత్పర
కత్వమున రేఫాదేశ ముపదేశించుట యత్యావశ్యకము. ఇట్టిచోటులందు ముత్పర
కత్వమున నత్వము రాదు. పత్వమె గల్గును. ఇందులకు బాధక ప్రయోగములు లేవు.
శత్రురాజుల నోరుపంగలండను రీతిసే ప్రయోగింపందగును. క.........డు। మ్రా
రసమెత్తి కీడ్పటిచి యింతలు సేసినదాన నీమదిం। గూరిన నొవ్వ సొంపునను గోపము
పెంపునంగాదె యారయన్ (ఉద్యో. ౩ ఆ. ౭౪). క. వారని సంక్లేశంబులం। గూరు
నరుండు దానిం జేయంగొనకొంత్రె బుధుల్. (శాంతి. ౬ ఆ. ౨౪౨ ప). అను సోమ
యాజి ప్రాస్థగిత ప్రయోగములం జొప్పునం బ్రేరణముం దేకాక యన్ని యర్థము
లందును 'కూడు' ధాతువునకుం బర్యాయముగ 'కూరు' ధాతువు వెలయుచున్న
దనుటలో సందియము లేదు. కావున "ఆడోడు కూడుల.........." (బా. క్రి.
౮౦ సూ.) అను ప్రకృతసూత్రమున "కూడు" ధాతువును బ్రత్యాఖ్యానము
చేయుట యుక్తము. "ఆడోడు కూడుల" అనెడి సిద్ధద్వంద్వమున నాచ్ఛికపర
రూపసంధిని దొలంగించుటయుం గర్తవ్యమె. ఇవి స్త్రీయములు కామింజేసి
యాచ్ఛికద్వంద్వమనుట పొసంగదు.

బాలవ్యా. చెడుపసుం జొప్పగాగమంబులును డాక లఘురేఫంబు
౩౭౮ IX విష నగు. ౮౧.

చెఱుచు - చెఱుపు.

సంజీవని:—౩౭౮ IX విష:—బా. క్రి. ౭౩ సూత్రముచొప్పున డాంత
మగు చెడుధాతువునకు "చుక్కు" ను, ౭౪ సూత్రముచొప్పున 'పుక్కు' ను రాంగా
చెడుధాతు డకారవ్యంజనమునకు శకటరేఫాదేశం బగునని యర్థము. ఉదా:—
'చెడ్+ఉ+చు = చెఱ్+ఉ+చు = చెఱుచు. చెడ్+ఉ+పు = చెఱ్+ఉ+పు =
చెఱుపు. రెంటికిని 'చెడజేయు' అని యర్థము. ఇట్లనుటచేత "చెడించు" అను
ప్రేరణంచు గాగమాంతరూపము దీనికి లేదని విశదమగుచున్నది.

శబ్దరత్నాకరమున "చెఱచు - చెఱపు - చెఱుచు - చెఱుపు" అను నాల్గు రూపములు చూపఁబడెను. 'ఉ'కారమధ్యము కొందఱ మతమునియు 'అ'కార మధ్యము కొందఱ మతమునియు వ్రాయఁబడెను. సూ. రా. నిఘంటువందు 'చెఱచు' అనురూపముమాత్రము చూపఁబడలేదు. కాని "చెఱపు - చెఱుచు - చెఱుపు" అనువాని వివరించుటలో నయిదుచోటులందుఁ 'చెఱచు' శబ్దము వాడఁబడెను. ఉకారమధ్యతనుగాని 'అ'కారమధ్యతనుగాని 'చు'వర్ణమునుగాని 'పు'వర్ణమును గాని నిర్ణయించు ప్రయోగ మేకోశమునందును జూపఁబడలేదు. శకటమును నిర్ణయించు ప్రయోగము చూపఁబడెను. "సీ.........ఎఱిఁగి వానితపము చెఱుపఁ బనిచె।.........(ఆది. ౫ ఆ. ౧౮౫). 'చెర్చె' అనియుఁ గలదు. ద్విపద. యజ్ఞే శుఁడేనిఁ గ్రియాదక్షు దక్షు। యజ్ఞ మేటికిఁ జెర్చె (రంశితా. వాద. ౨౦౫ పా. సూ. రా. ని).

చెడుశబ్దమూలకముగుటంజేసియు 'అ'కారమధ్యతను నిర్వహింపఁజాలు ప్రయోగము లేమింజేసియు సూరిగారిమతముచొప్పున 'ఉ'కారమధ్యముమాత్రమె యంగీకరించుట లెస్స.

పడునకుం జక్కును డా కలఘురేఫంబు నగు. ౮౨.

బాలవ్యాకరణ పఱుచు.

వివరణము. శబ్దపల్లవంబగు పడున కించుక్కు విభాషనగు నగుచో

3-౨౮ X విష. డాకు లఘురేఫం బగు. ౮3.

వెలువడు - వెలువరించు - వెలువఱుచు - చొప్పడు -

చొప్పరించు - చొప్పఱుచు.

సంజీవని. 3 ౨౮ X విష:—బా. క్రి. ౭3 సూత్రము చొప్పున 'పడు' ధాతువునకుఁ బ్రేరణంబున 'చుక్కు'రాఁగా దాని డకారవ్యంజనమునకు శకటరేఫాదేశ మగునని యర్థము. ఉదా:—పడ్+ఉ+చు = పఱ్+ఉ+చు = పఱుచు = పొందఁ జేయు. పతనార్థకమగు 'పడు' ధాతువునకు "ఏనుఁగును గోతిలోఁ బఱిచెను" అను అనురీతిప్రయోగము కన్పట్టదు. "ఏనుఁగును గోతిలోఁ బడఁజేసెను" అనియె వాడఁబడుట గలదు. కాని బాణమును బడునట్లు చేసె ననుచో "బాణమును బఱ పెను" అను రీతి ప్రయోగములు కన్పట్టును. 'పఱపు పయిని దుప్పటి పఱచెను' అను రీతిని బతనార్థమందు 'పఱచు' అను ప్రేరణరూపము కొన్నియెడలఁ గన్పట్టుచున్నది. ఇట్లె 'తడఁబడు' అనుదాని ప్రేరణమునందును 'తడఁబఱచి' అను 'అ'కార మధ్య రూపము కవిప్రయుక్తమై యున్నది. క. రంగీతకళలఁ జెలఁగుచు। రంగాఢ్యు బెడం

గులం గరంగుట తప్పో। భంగించి యితరకాంతఁ దో। ఱంగుట తప్పో తడఁబఱచి పురుషులకున్ (కళా. ౭ ఆ. ౨౨౮ శ. ర. పఱచు - తొలఁగు శబ్దములయొద్ద) ఈయర్థమున 'పఱపు' అనురూపము గన్పట్టుచున్నది. 'శరశతంబు పఱపెను' అనురీతి ప్రయోగములు గలవు. ప్రకృతసూత్రమునఁ జెప్పిన "పొందు" అను నర్థముగల 'పడు' ధాతువునకుఁ బ్రేరణార్థమున 'పఱుచు' అను 'ఉ' కార మధ్యధాతువేర్పడుచున్నది. పఱుచు= పొందించు - బాధలనొందించు. క. నెట్టన సభలో వేపుగ। కట్టెదుర నరాతితనముగా కెంతయు వా। రెట్టితులువలో ద్రౌపది। నట్టుల పఱిచెడిదె జూద మాడరె యెందున్ (ఉద్యో. ౧ ఆ. ౩౪౪). శబ్దరత్నాకరకర్త యిట్టివ్యవస్థను జేయలేదు. ప్రేరణార్థకములగు 'పఱచు = పఱుచు' అనునవి పర్యాయములని తలఁచి యీ క్రింది రీతిని వ్రాసెను. "ప్రేరణార్థకమైన పఱచు ఒకన్యాయమునుబట్టి ఉకారమధ్యముగా నుండవలసి యున్నను వ్రాఁతప్రతులయం దంతట తఱచుగా అకారమధ్యముగా నుండుటవల్లను ఒక ప్రామాణికవి ప్రయోగమున (పింగళిసూరన కళాపూర్ణోదయమున. తడంబఱచి యతియందు కానఁబడుటవల్లను ఇట్లకారమధ్యముగానును వ్రాయఁబడియెను" (శ. ర. 'పఱచు' శబ్దము). 'పఱుపంగ' అని 'ఉ' కారమధ్యముగా వావిళ్ళవారి ముద్రణమున నున్నదాని నీతఁడు సవరించి "పఱపంగ" అని యిట్లుదాహరించెను "పఱచు - యు - దే.........వై. ప్రే..........3 పాలుపడఁజేయు. అకల్మషులం బఱపంగఁ బాడియే. (భార. ఉద్యో. ౧ ఆ)." (శ. ర). శబ్దరత్నాకరకర్త దీనితోఁ పాటుగ నిచ్చిన యితరోదాహృతులు పతనార్థక పడు ధాతురూపము లనఁదగును. "పఱచు - యు - దే.........ప్రే. ౧ పడఁజేయు. చ.........కడు దుర్భవంబునన్। పఱపకుమయ్య..... ...(భార. ఆరణ్య. ౫ ఆ). ౨ దుష్పటి లోనగువాని పఱచు......" (శ. ర). కడయినుదాహరించిన యారణ్యపర్వ పద్యమున "దుష్టనీచజన్మమునఁ బడఁద్రోయకుమయ్య యని యర్థముగాన నదియుఁ బతనార్థకమె యనఁదగును "ఆ.వె.........క్రవ్యాద జన్ముండ। వగుము మీఁద ననియె ననిన నేను. చ. ఎఱుఁగక తప్పునేసితి సహింపఁగదే కడుదుర్భవంబునన్। బఱపకుమయ్య నావుడుఁ గృపన్......(ఆర. ౫ ఆ. ౧౩౩-౧౩౪ ప). ఇట్లు శబ్దరత్నాకరకర్త "పఱచు - పఱుచు. పఱపు - పఱుపు" అను ప్రేరణరూపములను వ్యవస్థారహితముగఁ గలగాయపులగముగ నుదాహరించెను. "పఱచు - యు - దే - ప్రే - పఱపఁజేయు.........3 ప్రయోగించు. దివ్యశరంబులు ద్రోణుతేరిపైఁ బఱపు కిరీటి. (భార. ద్రోణ. ౧ ఆ)." (శ. ర). "పఱుచు - దే - ప్రే. ౧ పడఁ

జేయు. వ. పదంబులు విఱిచియు - పార్శ్వంబు లగలఁ జెఱిచియు గజంబులం బఱిచియు గాత్రంబుల నుఱిచియు. (భాగ. ౬ స్కం). ౨ దుప్పటిలోనగువానిఁ బఱచు........." (శ. ర). "౩ఱుపు. దే - ప్రే - ౧ పడఁజేయు - పాటుపడఁజేయు.........." (శ. ర).

౮3 సూ. వ్యాఖ్య:—శబ్దపల్లవంబగు పడునకు=బా. క్రి. ౧౧౮ సూత్రము చెప్పిన శబ్దపల్లముగ నేర్పడి శబ్దమునకుఁ గుత్తగావయవమైయున్న పడుధాతువునకుఁ బ్రేరణంబున బా. క్రి. ౭3 సూత్రముచెప్పిన 'చు'గాగమంబును "ఇం"చుగాగమంబును నగును. అందు "చుక్కు"వచ్చినపుడు పూర్వసూత్రము (బా. క్రి. ౮౨ సూ). చెప్పిన డకారవ్యంజనమునకు శకటరేఫాదేశం బగును. వెలి+పడు+చు = వెలువఱుచు. ఇంక నించుక్కు వచ్చునపు డట్టి పడు ధాతువ్యంజన డకారంబునకు లఘురేఫాదేశం బగును. ఉదా:—వెలువడ్+ఉ+ఇంచు = వెలువర్+ఉ+ఇంచు = వెలువరించు = వెలుపలికిఁ బడునట్లుచేయు. "వెలుఁగు+పడు అను నీరెండుధాతువులును గలిసి వెల్లడియను విలక్షణార్థమును బోధించును" (బా. సా. పే. ౮౫3 పు) అను పేటికవివరణము సరికాదు. వెలువడుశబ్దమునకు వెల్లడి యనునర్థము సరికాదు. "వెలువడు - ద్వి - అ - క్రి - (వెలి+పడు) ౧ బయలుపడు. నూతిలో వెలువడఁ గోమలిం దిగిచె (భార. ఆది. 3 ఆ). ౨ బయలుదేఱు - వెలువడినా నశేషరాజ్య విభవచ్యుతుఁడై (భార. ఆర. ౨ ఆ)........" (శ. ర). "చొప్పడు - ద్వి - అ - క్రి. (చొప్పు+పడు). కలుగు. ఉ.........పే। రుక్కునఁ బోరినన్ సుగతి యొండె జయంబును నొండెఁ జొప్పడున్ (భార. శల్య. ౧ ఆ)." (శ. ర). చొప్పడ్+ఉ+ఇంచు = చొప్పర్+ఉ+ఇంచు - చొప్పరించు = కలుగఁజేయు. ప్రయోగములు:—సీ.........। నీయట్లు క్రూరులై నృపతులఁ జెఱఁబెట్టి పసువరించుచుఁ బశుపతి నుమేశు। వరదుఁ బూజించినవారును గలరె. (సభా. ౧ ఆ. ౧౮౯). క. తనయుఁ బసువఱిచి తద్వపఁ। గొని వేల్పినఁ జూచి.........(అర. 3 ఆ. ౨౯౫). (పసువరించు = పసువఱుచు = యజ్ఞపశుత్వమును బొందించు = యజ్ఞపశువుగాఁజేయు). సీ.........తే-గీ. ధారుణీ సురముఖ్యు లధ్వరములందుఁ। బసువరింపరె పశువులఁ బరమ పుణ్య।గతులు గలుగవె...(అర. ౫ ఆ. ౫౫). పైస్థలములందెల్ల 'పశువరించు - పశువఱచు' అని శవర్ణమె భారతమున ముద్రింతమైయున్నది. శబ్దరత్నాకరమున 'స'వర్ణముతోఁగాని 'శ'వర్ణముతోఁగాని యీశబ్దమె చూపఁబడలేదు. ఇది 'భయపడు' మున్నగువానివంటిది గాదు. ఇయ్యది శబ్దపల్లవము. సాధారణముగా శబ్దపల్లవావయవము లాచ్ఛికశబ్దములై యుండుట సంప్రదాయము. మఱియు నందలి

వాదేశము - రేఫాదేశము - సర్థవిశేషము మున్నగునవి మిశ్రస్థలములందు సంభవించునవి కావు. అందలి వాదేశము గ స డ ద వాదేశము కాదు. శబ్దపల్లవములందుఁ గల్గు వాదేశ విశేషము. "పసుపు+పడు+ఇంచు = పసువరించు = పసువఱుచు" అని యాచ్ఛికశబ్దరూపముగ నంగీకరించుట యుక్తమనితోఁచెడి(ని). ఉ. పాలితదుర్నయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల భూ। పాలక నీకుఁ బట్టుపఱుపన్ (సభా. ౨ ఆ ౨౨). (పట్టుపడు. ప్రే. పట్టువఱచు). మత్తకోకిల. ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యథావిధిన్। దేవమంత్రియపోలె ధర్మువుఁ దెల్పె నీతఁ బుద్ధి మీఁ। రేవగింపక చేకొనం డిది యెల్లయందును ధర్మ స। ద్భావ మొక్కని నేర్పరింపఁగ బ్రహ్మకైనను బోలునే (సభా. ౨ ఆ. ౨౩౬). (ఏర్పడు. ప్రే. ఏర్పరించు). శ.........అదియె। ల్లను నేర్పరించి.........(విరా. ౧ ఆ. ౬౫). మ.........దర్పంబు సొం పేర్పరిం। చుటకుం జొచ్చిన.........(కర్ణ. ౧ ఆ. ౮౬). తే గీ. ఎట్టులం టేని వినుఁడది యేర్పరింతు (అను. ౫ ఆ. ౫౭). ఆ వె. వృద్ధు కొడుకుపలుకు విని క్రూరుఁడై పాప। బుద్ధిఁ జేసి మిమ్ము భూతలంబు। వెలువరించి రాజ్యవిభవంబు గొని।.........(ఆశ. ౧ ఆ ౨౦౮). (వెలి+పడు+ఇంచు= వెలువరించు). ఉ. పాండవసైన్యముల్ సెనరి పాతెఱఁ గర్ణుఁ జేర నొచ్చి యు। ద్దండత నీదుశౌర్యమును దర్పము నేర్పడ నిల్వరింపుమీ। (ద్రోణ. ౫ ఆ. ౨౦౨). (నిలుచు+పడు = నిల్వడు. నిలుపు+పడు = నిల్వడు. నిల్వడు = నిలువడు - ప్రే - నిలువరించు - నిల్వరించు = పాఱిపోకుండ నిలుచునట్లు చేయు). కోశములందిది వేఱు రీతిని వివరింపఁబడెను. "నిలువరము - దే - విణ - స్థిరమైనది." "నిల్వరించు - దే - అ - క్రి. చలింపకనిలుచు. ఆ-వె. వీఁడె వచ్చుచున్నవాఁడు పార్థుఁడు మన। మేమి సేయువార మీఁవు దక్క। నొరులు నిలువరింప నోపరువారలె। యోటలేక కాఁకి యోర్వవలదె (భార. విరా. ౫ ఆ). అం. ప్రే. చలింపకనిలుపు.........౨ నిలుపు........." (శ. ర). ఇది యిట్లు "అకర్మక క్రియ"యనియు నంతర్భావిత ప్రేరణార్థకమనియుఁ జెప్పుట సరికాదు. ఒరులు నిలువరింప నోపెడువారె=ఇతరులు సేనలను బాఱిపోకుండ నిలుపుటకు శక్తులా యని యర్థము. అంతియకాని "అర్జునుతో నెదిర్చి నిల్చుట కోపెడువా రెవరని యర్థముకాదు. సూ. రా. నిఘంటుకారులు దీని నంతర్భావిత ప్రేరణార్థక మనక సకర్మక క్రియగానె యంగీకరించిరి. అకర్మక క్రియ కేదో చంద్రాంగద చరిత్రమనెడి యర్వాచీన గ్రంథమునుండి ప్రయోగమును జూపిరి. కాని యది 'నిలువడు' అను శబ్దపల్లవపు ప్రేరణరూపమని వ్రాయలేదు. "నిలువ (ల్వ) రించు. స. క్రి. (√ నిలువరము) ౧ నిరోధించు - ఆఁపు........." (సూ. రా.

ని). ('నిలువరము' శబ్దమునకుఁ బ్రాచీన కవిప్రయోగములు సూ. రా. నిఘంటువునఁ జూపఁబడలేదు). "నిల్వరించు - దే - అ - క్రి. అం - ప్రే. నిలువరించుయొక్క రూపాంతరము. చలింపక నిలుచుటకు:—క.........పాం | డవయోధులు నిల్వరించుటకుఁ జాలక తే | చ్చపడిన.........(భీష్మ. ౨ ఆ. ౨౪౧)." (శ. ర). ఇందును పాండవయోధులు తమ సేనలను నిల్వరించుటకుఁ జాలక తేచ్చపడిరని సకర్మకముగానె యర్థము నెన్నఁదగును. క.........| భగదత్తుఁడు మత్తగజముఁ బఱపి యతని నా | శుగముల బొదివిన.........(భీష్మ. ౨ ఆ. ౨౩౮)......... క. కవిసి బలము జంపఁగఁ బాం | డవయోధులు నిల్వరించుటకుఁ జాలక......... (భీష్మ. ౨ ఆ. ౨౪౧). అనియున్న యీసందర్భమున "బలముల నిల్చునట్లుచేయఁ జాలక" యని యర్థముచేయుటయె సుసంగతమై యుండునుగదా.

నన్నయా ణిజన్తా౽పి కేచిత్తు | ణిచ మాహు రనీశ్వరాః (వికృ).
౩౨౯ విమ. క్రియా. ౧౩ శా. అహో. ౪౯౩ పు).

కల్పతరువు. ౩౨౯ విమ:— కేచిత్తు = కొందఱు, అనీశ్వరాః = స్వతంత్రులగు మహాకవులు, ణిజన్తాదపి = ప్రేరణార్థక ధాతువుకంటెఁ బరముగానైతమ, ణిచమ్ = మఱొక ప్రేరణార్థక ప్రత్యయమును, ఆహుః = ప్రయోగింతురు. "అనీశ్వరాః = స్వతన్త్రాః" అనుటచే స్వారస్యముచే నట్టిప్రయోగము లరుదని వ్యక్తమగుచున్నది. ణిజన్తాత్తనుటచేతఁ బ్రేరణించుక్కపయిని బ్రేరణించుక్క నిల్వరాదనియు స్వార్థించుక్కమీఁదఁ బ్రేరణించుక్క నిలువవచ్చుననియు మఱియుఁ బ్రేరణార్థకములగు 'చుక్కగాగమముల'మీఁదఁ బ్రేరణించుక్క నరుదుగ నిల్పఁగుననియు వ్యాఖ్యానము చేయనగును. ఉదా:— రక్షించు+ఇంచు = రక్షింపించు (బా. క్రి. ౮౭ సూత్రముచే స్వార్థించుక్పకారమునకు 'ప'త్వం బయ్యెనని యెఱుంగునది) చచ్చు - ప్రే - చంపు - మరల ప్రేరణార్థము - చంపించు - రాజు భటులచే మృగములను జంపించెను. ఈశ్వరుఁడు రాజుచే జనులను రక్షింపించును. "వివాహ మొనర్పు మొప్పంగ నిత్యాద్యాచార్యోక్తిషు సకర్మకేషు ఒనర్పింపుము ఇత్యాదిరూపం క్వచిత్సాధు. ప్రయోగస్తు న ప్రాయః ప్రబన్ధేషు దృశ్యతే." (అహో. ౪౯౩ పు). అని యిట్లహోబలపతి దీనికిఁ బ్రయోగ మరుదని వచించెను. అట్లయినను నథర్వణాంగీకృతిచే దీనిప్రయోగము సాధువే యనఁదగును.

ప్రేరణంబునం దించుక్కమీఁద నించుక్క లేదు. ౮౪.

బాలవ్యా. ఇ టనుటంజేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబు
౩౨౯ I విమ. మీఁదం బ్రేరణార్థంచు గాగమం బగునని యెఱుంగు

నది. నొచ్చు - నొంచు - నొంపించు. చచ్చు - చంపు - చంపించు.

సంజీవని. 329 I విష:—ప్రేరణంబునం దించుక్కు మీఁద నించుక్కు లేద నుటంజేసి యించు గ్భిన్నములగు ప్రేరణార్థక చుగాగమ పుగాగమములమీఁదఁ బ్రేరణార్థ కేంచుగాగమము నిల్వవచ్చుననియుఁ బ్రేరణేతర స్వార్థేంచుగంతము మీఁదఁ బ్రేరణార్థ కేంచుగాగమము నిల్వవచ్చుననియు నర్థము లభించుచున్నది. చదువు - ప్రే - చదివించు. దీని ప్రే. 'చదివింపించు' అను రీతిరూపము లుండ నేరవని తాత్పర్యము. 'పఠించు' అనునది స్వార్థేంచుగంతము గాన దానిపైఁ బ్రేరణేంచుక్కు నిలిచి 'పఠింపించు' మున్నగురీతిని దత్సమధాతురూపములు సాధువులే యగునని యెఱుంగునది. 'చచ్చు - ప్రే - చంపు - ప్రే - చంపించు' అనురీతిని బ్రేరణార్థక చు క్పుక్కులమీఁద సైతము పునఃప్రేరణవివక్షయం దించుగాగమము నిల్వవచ్చు ననియు నెఱుంగునది.

ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో ననాద్యం

| | |
|---|---|
| బాలవ్యాకరణ | బగు నుత్వంబున కిత్వం బగు. ౨౯. |
| వివరణము. | నిగుడు - నిగిడి - నిగిడె. మగుడు - మగిడి - మగిడె. |
| 330 విషయము. | ఉడుగు - ఉడిగి - ఉడిగె. మునుఁగు - మునిఁగి - మునిఁగె. |

సంజీవని. 330 విష:—ధాతువుపైని 'ఇ - ఎ' అనునవిగాని యవి యాది యందుఁగల ప్రత్యయాదికముగాని నిల్చునపుడట్టి ధాతువుయొక్క శబ్దాదిగతమగు 'ఉ' కారము తప్పఁ దక్కిన 'ఉ'కారములు 'ఇ'కారములగు నని యర్థము. ఉదా:— నిగుడుధాతువుపైని క్త్వార్థకారము నిల్వఁగా 'నిగుడు+ఇ' అనుచో 'నిగిడి' అని యేర్పడును. ఇందుఁ బదాదీతరమగు గ కారముమీఁది 'ఉ'కార మికార మయ్యెనని యెఱుంగునది. ఇట్లే 'నిగుడు' అను ధాతువుపైని భూతార్థక ప్రథమైకవచనము 'ఎను' అనునది (బా. క్రి. ౧౬ సూ) నిల్వఁగా 'నిగుడు+ఎను = నిగిడెను' అనుచో ఎకారముమూలమున గ కారముమీఁది 'ఉ'కార మికారమయ్యెను. ఇట్లే తక్కిన వానియందును బ్రక్రియ నెన్నవగును. 'నిగుడు+ఇంచు = నిగిడించు' అని యిట్లిం చుక్కు నిల్చునపుడు సైత మనాదిస్థితోకార మికార మయ్యెను. ఇట్టిస్థితికి బా. క్రి. 23 సూత్రము మున్నగుసూత్రముల వివరణోదాహరణములలోని - మగిడించు - కుదిరించు - వినిపించు - కనిపించు మున్నగునవెల్ల లక్ష్యములె యని యెఱుంగునది. ఇట్లే పురిటిల్లు - (పురుడు,) చదివెదను - చదివితిని- మొదలగునవిసైతము దీనికె లక్ష్య

ములగుచున్నవని యెఱుంగునది. అసాధ్యంబయిన యుత్వంబున కనుటంజేసి కుది రించు - కుడిపించు మొన్నగుచోట్ల శబ్దాదినున్న కకారముమీఁది 'ఉ'కారమున కికారము రానేరదు. అట్లె కుదిరెను - కుడిచి మున్నగుచోటులందును 'క'కారము మీఁది 'ఉ'కారమున కికారము రానేరదు.

ఈసూత్రము సార్వత్రిక మనుటకుఁ బ్రామాణిక ప్రాచీన వైయాకర ణాంగీ కారముగాని యిట్టి యిత్వమును నిర్వహించు యతిస్థలఘటిత ప్రాచీన ప్రామాణిక కవిప్రయోగముగాని లభింపలేదు. ఇంతియకాక దీనికి విరుద్ధమగు ప్రాచీన మహా కవి ప్రయుక్త యతిస్థానఘటిత ప్రయోగముసైతము కన్పట్టుచున్నది. సీ. ఆలోన గదవూన్చి యభ్రమాతంగంబు కుంభపీఠంబు పగుల్చి యసుర (హరి. పూర్వ. ౪ ఆ. ౧౫౪). శబ్దరత్నాకరమున "పురుటియాలు - పురుటిల్లు - పురుడించు" అనురీతిని బ్రకృతసూత్ర విరుద్ధరూపములు కొన్ని యుదాహృతములై యున్నవి. తాళపత్ర మాతృకలందును నిట్టిరూపములు కన్పట్టుచున్నవి. పయిసందర్భమునుబట్టి యిది బహుళమనుట యుక్తము.

సన్నయా. అనుబన్ధ ప్రార్థనయో, ర్ణౌ వ్యతిరేకాదికేచ చోః పః
330 విషయము. స్యాత్ (ఆం. చిం. క్రి. ౫ కా. అహో. ౪౬3 పు)

కల్పతరువు. 330 విష:—అనుబన్ధప్రార్థనయోః = అ_స్త్రి రను బన్ధకః స్యాది త్యాదిచే విధింపఁబడిన (చూ. ౨౯౬ విష) 'కలుగు ధాతురూపమగు ననుబంధ మును, గర్హ ణ్యనుబంధః స్యా దిత్యాద్యచే విధింపఁబడిన (చూ. 3౧౯ విష) పదు ధాత్వనుబంధమును, బ్రార్థనాద్యర్థక ప్రత్యయములును (30౫ విష) బరమగు చుండఁగాను, ణౌ = ప్రేరణార్థకమగు 'ఇంచుక్కు' (చూ. 3౨౬ విష) పరమగు చుండఁగాను, వ్యతిరేకాదికేచ=వ్యతిరేకాదౌ భావిని చాత్ స్యా దితి సూత్రముచే విధింపఁబడిన (చూ. ౨౯౬ విష) (303 II. 30౭-3౧౦-3౧౨-3౧3-3౧౭ వల యాద్యాది. విష. చూడు) 'అత్తు' మున్నగునవి పరమగుచుండఁగాను, చోః = ఇంచు గాదుల చకారమునకు, పః - స్యాత్=పకారాదేశ మగును. ణి చ్ఛనఁగాఁ బ్రేరణార్థ కము. అది పరమగునపుడు, ధాత్వవయవ చకారమునకును, "ఇంచుక్కు - చుక్కు" అనువాని చకారమునకును 'ప'కారాదేశము నిత్యముగా నగును. ద్విత్వచకారము నకు ద్విత్వ పకార మగును. తక్కిన యనుబంధప్రార్థన పరకత్వమందును వ్యతిరేకాది పరకత్వమందును 'ఇంచుక్కు - చుక్కు' అనువాని చకారమునకుమాత్రమె పకారా దేశమగును. ధాత్వవయవ చకారమునకు 'ప'కారాదేశము రాదు. అంతేకాక ధాత్వవయవ చకారమునకు వకారాదేశ మగును. ప్రేరణార్థకస్థలములు ప్రస్తు

తము లగుటంజేసి యవి పరముగుచుండఁగా వచ్చు పత్వము ముందుగ నుదాహరింపఁబడుచున్నది. ఉదా:—ధాతుసహజ చకారమునకు:—ఉదా:—గెలుచు-గెలుచ్+ఉ+ఇంచు = గెలుప్+ఉ+ఇంచు = గెలుపించు, బా. క్రి. ౧౫ సూత్రముచొప్పున 'ఇ'త్వము రాఁగా "గెలిపించు" అనురూపము సిద్ధించుచున్నది. ఇట్లె - వలచు (ప్రే) వలపించు, పిలుచు - (ప్రే) - పిలిపించు. ద్విరుక్త చకారమునకు బహుళముగ ద్విరుక్త పకార మగును. మెచ్చు (ప్రే) మెప్పించు - మెచ్చించు. ఇచ్చు - (ప్రే) - ఇప్పించు. తెచ్చు - (ప్రే) - తెప్పించు. చొచ్చు - (ప్రే) - చొప్పించు = చొనుపు. హెచ్చునకుఁ బత్వము ప్రయోగదృష్టము కాలేదు. హెచ్చు-(ప్రే)-హెచ్చించు. చచ్చుధాతు ప్రేరణరూపము - చంపు. (బా. క్రి. ౭౭). వచ్చు - (ప్రే) - రావించు-రప్పించు (బా. క్రి. ౭౭). నొచ్చు - (ప్రే) - నొంచు - నొప్పించు - మొ. ఇంచుక్ చకారమునకు:—రక్షించు - (ప్రే) - రక్షింపించు. పోషించు - (ప్రే) - పోషింపించు. వసించు - ప్రే - వసింపించు - మొ. చుక్ చకారమునకు:—మనుచు - (ప్రే) - మనిపించు. అణఁచు - (ప్రే) - అణఁపించు. విఱుచు - (ప్రే) - విఱిపించు. ఉంచు - (ప్రే) - ఉంపించు. దంచు - (ప్రే) - దంపించు (దనుగు ధాతువు). మొ.

అనుబంధాదులు పరముగునపుడు చకారమునకుఁ బకారాదేశము గల్గుట కుదాహరణములు:—రక్షింపఁగలవాఁడు - రక్షింపఁబడియెన్ - రక్షింపుము - రక్షింపుఁడు - రక్షింపఁడు - రక్షింపమి - రక్షింపక - రక్షింపని - రక్షింపవలయున్ - మొ. 'అనుబంధ' అనుటచే 'ఉండు' ధాత్వనుబంధ పరకత్వమందును 'ప'త్వము గల్గుననుచుఁ గవిశిరోభూషణకర్త, "వర్తమానార్థ వివక్షయాం వసతి రనుబంధకః - ఇంచుగాగమః-పాదేశః-చురితి క్రియాపదానామితి చుః - వ్యతిరేకార్థే ల్యుటి లటీత్యాది సూత్రేణ డుజ్. అనుక్తన్యాయేన సానునాసికోచ్చారణం జిత్-నుతింపుచున్నాఁడు - పోషింపుచున్నాఁడు" (అహో. ౭౬3 పుట), అని యిట్లు వివరించెను ఇది సరికాదు. భారతాది ప్రాచీనప్రబంధములందుఁగాని తుదికి శ్రీనాథకవి పితామహ గ్రంథములందుఁగాని యట్టి పత్వము వచ్చిన ప్రయోగములు లేవు. మఱియు "నుతించు+చు+ఉన్నవాఁడు" అనుచో వర్తమానార్థక చువర్ణక వ్యవధానమున ధాతువుయొక్క యించుక్కున కనుబన్ధపరకత్వము లేమింజేసి చింతామణిసూత్రముచొప్పున నైతము పత్వము రానేరదు. కావున నహోబలపతి చింతామణిసూత్రముల కుదాహరణముగా "నుతింపుచున్నాఁడు - పోషింపుచున్నాఁడు" అను పత్వమును జూపుట సరికాదు. అట్లె చింతామణిచొప్పునఁ దచ్చుద్భవ కారలోపము గల్గినరూపములు సిద్ధింప

నేరవుగాన "నుతించుచున్నవాఁడు" అని చింతామణిపక్షమున నుదాహరింపవలెను గాని 'నుతింపుచున్నాఁడు' అని యుదాహరింపరాదు. ఇంతియకాక "సానునాసికోచ్చారణం జిత్" అను ప్రాకృత వ్యాకరణసూత్రము చెప్పిన జిత్తగు డుజ్ఞులోని 'డు' అనుదానిమీఁది 'ఉ'కారము సానునాసికము కావలయునుగాని 'డు'వర్ణకము నకుఁ బూర్వస్వరము సానునాసికము కానేరదు. (చూ. ౧౨౭ విష). కాన నట్టి ప్రాకృత వ్యాకరణసూత్రముచే డుజ్ఞు బిందు పూర్వక మగునను కవిశిరోభూషణ వ్యాఖ్యయు సరికాదు. ఇంక ౧౨౭ విషముచెప్పిన జిత్తు బిందుపూర్వక మగునని గ్రహింపవలయును.

పయిరీతిని నన్నయాథర్వణీయమునకును బ్రాచీన మహాకవిప్రయోగముల కును "నుతింపుచున్నవాఁడు - నుతింపుచున్నాఁడు" మున్నగుచోటులందలి పత్వము సమ్మతము కాకున్నను మధ్యకాలపు మహాకవుల ప్రయోగములం దట్టి పత్వము కన్పట్టుచుండుటంజేసి యట్టిరూపములు నేఁ డసాధువు లనరాదు. కావుననే త్రిలింగ లక్షణశేషకర్త యీక్రిందిరీతిని సూత్రించి కవిప్రయోగముల నుదాహరించెను. "పకారంబు కొన్నియెడల శత్రర్థక చువర్ణకంబునందుఁ గానంబడెడి. ఉదా:— చ. మోవిమోవిఁ జే। రుపుచును.........(కళా. ౭ ఆ). ఉ.........గ। ర్జింపుచు.........(జై. ౨ ఆ). మొ." (ప్రౌఢ. క్రి. ౧౭ సూ). చ. కపటపు నిద్రవోవుతఱిఁ గౌఁగిట నానుచు మోవి మోవిఁ జే। రుపుచును గొన్నిరాత్రులు వరుం దనియించె లతాంగి......(కళా. ౭ ఆ. ౧౬౨). ఉ. కంపిత దిగ్విభాగముగఁ గాసిలి వచ్చిన నన్నొకింత వీ। క్షింపఁడు సైన్యముల్ సరకుసేయఁడు సింహకిశోరవృత్తి గ। ర్జింపుచునున్నవాఁడు మది మృత్యుభయంబు.........(జైమి. ౨ ఆ. ౪౬ ప). ఇట్లు పింగళి సూరనార్యుఁడును బిల్లలమఱ్ఱి పిన వీరభద్రుఁడును వర్తమానార్థక చువర్ణక పరకత్వమునందును "ఇంచుక్ - చు" గాగముముల చకారమునకు "ప" కారాదేశమును బ్రాస్థల ఖచితముగాఁ బ్రయోగించియుండుటంజేసి "చేరుచు+ చు+ఉన్నాఁడు = చేరుపుచున్నాఁడు. గర్జించు+చు+ఉన్నాఁడు = గర్జింపుచున్నాఁడు" అను వర్తమానార్థక రూపములు సుసాధములగుచున్నవిగదా. ప్రాచీనమహాకవిప్రయోగములు లేమింజేసి సూరి యీపత్వమును సంగ్రహింపఁడయ్యె. తదుకాలమున నియ్యది సాధువేయను నిశ్చయ మహాబల పత్యాముల మనసున నాటికొనియుండుటచేఁ గవిశిరోభూషణమునఁ జింతామణికిని నట్టిరూపములు సమ్మతములని ప్రామాదికముగా నహోబలపతిచే వ్యాఖ్యచేయఁబడెను. పెక్కుభారత ముద్రణములలో నీ చువర్ణక పరక

చకారమునకు 'ప'త్వము గల రూపములు ప్రక్షిప్తము చేయఁబడినవి. కాని భారతాదులలోని యిట్టిపత్వ మెంతమాత్రమును గవిప్రయుక్తము గాదనుటకు సందేహము లేదు. క. చంచుల.........అనురా। గించుచు.........(నిర్వ. ౬ ఆ. ౪౭ ప). క. పాంచాలురుఁ బాండవులు ను। దంచిత గర్వమున ననికిఁ దఱిమి యుండలు మం। డించుచు నుండఁగ.........(ద్రోణ. ౫ ఆ. ౩౫). ఉ. ఇంచుక యేనియున్.........దుః। ఖించుచునుండఁ జూచితి సకిల్బిషచిత్తున కింత పెద్దయే (అశ్వ ౪ ఆ. ౭౩). ఇట్లు తిక్కనకాలమునకు నయిత మిట్టి పత్వము కవిసమ్మతము కాలేదు. భాస్కరుఁడు నయిత మీ పత్వమును బ్రయోగింపలేదు. క. నీచేసిన.........। వేచుచునున్నది పున్నమ। ఏచులచేఁ బొంగు జలధి విధమున నీచా(భాస్క. కిష్కిం. ౪౧౧). ఉ. వంచన సీత నేల కొని వచ్చితి.....భ। ర్త్సించుచుఁ గాలఁ దాఁచి నిరసింపఁగఁ బంచె సభాంతరంబునన్ (భాస్కర. యుద్ధ. ౧౬౬ ప). ఇట్లు పైమహాకవులు ప్రాసస్థానములందుఁ బత్వాభావమునె ప్రయోగించిరి. పాల్కురికి సోమనారాధ్యుఁడును నిట్లె ప్రాసస్థానములందు వర్తమానార్థక చువర్ణక పరకమగు "ఇంచుక్" చకారమునకుఁ బత్వాభావమునె ప్రయోగించెను. ద్వి. అంచు వెండియుఁ బ్రస్తుతించుచు శంభు" (బసవ. ౨ ఆ. ౬౩౪). "ద్వి. శుభకార్యమాచరించుచు నొక్కనాఁడు (బసవ. ౭ ఆ. ౭౫౫). ఇట్టి సోమనారాధ్యుని యభిప్రాయమును జూచికొనక యర్వాచీన కవిప్రయోగసిద్ధ 'పత్వ' వాసనావాసితులయి బసవపురాణముద్రణ సంస్కర్తగారు యతిప్రాసేతరస్థలములం దెన్నెన్ని యో చోటులందీ పత్వమును బ్రక్షేపించినారు. ద్వి. అని యెల్లవారును నంకింపుచుండ (బసవ. ౧ ఆ. ౬౧౧ ప). ద్వి. శివున కర్పింపుచు శివశివ యనుచు। నవధానవంతుఁడై యారగింపుచును. (బసవ. ౭ ఆ. ౬౮౮ ప). ద్వి. నిక్కుచు నీల్గుచు నక్కలింపుచును। జొక్కుచుఁ సోలుచుఁ జక్కలింపుచును (బసవ. ౭ ఆ. ౬౯౦). ద్వి. మురియుచు గునియుచు మఱికటింపుచును (బసవ. ౭ ఆ. ౬౯౬). ద్వి. కర మనురక్తిమైఁ గౌఁగిలింపుచును। నరు దొందఁ బొత్తుల నారగింపుచును (బసవ. ౭ ఆ. ౬౯౮). ఇటొక్కపుటలోఁ బెక్కుచోటుల నీపత్వమునే నిల్పుట నరయఁగా వీరియ్యది యహోబలపతి వలెనె నిత్యమనియు భావించిరా యని తోఁచుచున్నది. వ్యావహారికశబ్ద ప్రయోగకుతూహలియగు (౬౩ III విష. చూడు) రంగనాథుఁడు ప్రాచీనుఁడయ్యు నీపత్వమును బ్రయోగించెను. ద్వి. వెడలి కాననముల వేఁటలు సల్పి। పుడమియంతయుఁ బరింపుచుఁ జాల బడలి (రంగ. బాల. ౧౫౩౫ ప. యూ. ము). పెక్కురు ముద్రణ సంస్కర్త లీ పత్వమును ననేక ప్రాచీనగ్రంథములలోఁ బ్రక్షిప్తము చేయుచున్నారు.

ప్రేరణేంచు క్వరకత్వమునందలి పత్వమునకుఁ బ్రయోగములు:—సహజ చకారమునకు:—సీ. మొగిజరా సంధుచే నిగ్రహీతు లయియున్న, పృథివీపతుల విడిపించి చెఱలు (సభా ౧ ఆ. ౨౧౫). (యతిస్థానగతము). క. కోపమున గంగ మడువునఁ । ద్రోపించె సుయోధనుఁడు దురితకరుండై (ఆది. ౫ ఆ. ౧౭౧). (ప్రాసగతము) తరల. వగవనేటికి నింకనైనను వారలం బిలిపించి.........(సభా. ౨ ఆ. ౩౧౩). సీ.........। పెడతలపట్టి త్రోపించె వరుణుఁ । డు (అను. ౫ ఆ. ౩౮౫). ద్వి. బిజ్జలునకు వినిపింపంగ నతఁడు (బస. ౬ ఆ. ౫౮౩). ద్విరుక్త చకారమునకు:—తే.గీ. పుట్టఁ గొప్పించి యారెంటి పొలుపుఁ గాన । కుడిగి వచ్చితి. (ఆర. ౩ ఆ. ౧౭౯). క. తెప్పించి తొడుగు మీవని । యొప్పించిన.........(విరా. ౪ ఆ. ౩౯) (ప్రాసగతము). ద్వి. రప్పించి కన్నులు పుప్పించె నంత (పుచ్చు = పెఱుకు - శ. ర). సీ.........వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించిన యాజగజెట్టి యతఁడె (ఉద్యో. ౩ ఆ. ౧౭౫). సీ.........। శివునితోఁ బెనఁగి మెచ్చించె నతని (కర్ణ. ౧ ఆ. ౨౧౧). సీ......సంగరంబు తే. గీ. చేసి యింద్రాదిసురుల మెచ్చించి వారిఁ । కటీథిరైయి చని (స్త్రీ. ౧ ఆ. ౧౦౫). "మెప్పించునకు" నిట్టి యతిప్రాసగత ప్రయోగము లంభింపలేదు.

ముఙ్జీత్తులు ముత్తునాఁబడు. ౮౬.
ప్రేరణేంచుక్కు పరంబరం బగునపుడు పకారంబు
చకారంబున కగు. ౮౭.
పచించు - పచింపించు. వచించు - వచింపించు. పిలుచు-
పిలిపించు. వలచు - వలపించు. పత్వంబు హెచ్చు
నకుం గలుగదు. మెచ్చునకు విభాషనగు. హెచ్చించు.
మెప్పించు - మెచ్చించు.

బాలవ్యాకరణ వివరణము. ౩౩౧ I విషయము.

సంజీవని. ౩౩౧ I విష:—చింతామణిలోఁ జెప్పఁబడిన యనుబంధాదులనెల్ల సంగ్రహించుటకై వాని నన్నిటిని సూరి జీత్తులనుగా నుపదేశించి యట్టి జీత్తులకు 'ముత్తు' అను సంజ్ఞ నుపదేశించుచున్నాఁడు. బా. క్రి. ౨౯ సూత్రముచే విధింపఁబడిన ప్రార్థనాద్యర్థక ము డుఙ్లులను జీత్తులనుగా విధింపమిం జేసి వానికిని ముత్తను సంజ్ఞగలదని వేఱ వచించెను. ముఙనఁగా 'ము - డు'ఙ్లులు. 'ము - డుఙ్' అనువాని ప్రత్యాహారమె 'ముఙ్' అని వ్యవహరింపఁబడెను. (బా. క్రి. ౩౧ సూ. చూచునది). 'జీత్తు' అనఁగా 'జీ' అనునది యిద్వర్ణముగాఁ గలది. పత్వమునకు నిమిత్తములయిన యనుబంధాదులకెల్ల 'జీ' అనుదాని నిత్తుగాఁ జేర్చి సూరి బాలవ్యాకరణ

క్రియాపరిచ్ఛేదమునందు "లజీ (౭ సూ) కలజీ (౧౯ సూ) కుజీ (౩౨ సూ) వుజీ రుజీ (౩౪ సూ) కజీ (౩౬-౩౮ సూ). మిజీ (౩౭ సూ) నుజీ (౪౦-౧౨౨ సూ) నిజీ (౪౭ సూ)" అని వానిని విధించెను. ఇయ్యవి (జీ+ఇత్) జీత్తులు. బా. తత్స. ౨౨ సూత్రము మున్నగువానియందు విధింపఁబడిన డుజాదులు (జ్+ఇత్) జిత్తులు వీనికి భిన్నములని యెఱుంగునది. ప్రాగర్థాదర్థక ము - డుజ్జులును జీత్తులును ముత్తులనుచు సంగ్రహార్థము సూరి ముస్తుందు వ్యవహరించుచుండును. 'ము-డు (జ్) జీత్' అనువాని ప్రత్యాహారమువంటిదే యీ 'ముత్' అను సంజ్ఞయను నని సూరిహృదయము నూహింపనగును. కాని 'జీత్' అనుదానిలోని 'త్' అను నది 'ఇత్' అనుశబ్దముయొక్క యవయవమేకాని యది 'ఇద్వర్ణము' కామింజేసి, దానిని బ్రత్యాహారమనుట పొసఁగనేరదు. (విస్తర. I. ౫ II విమ).

ఇందు "జీ" అనునది యిద్వర్ణముగా నిల్వరాదనునది మొదలగు బా. కు. ప్ర. వ్యాఖ్యాత యాక్షేపము సరికాదని యీవఱకె విమర్శితమయ్యెను. (౧౨౭. విస్తర. I. ౧౨౭ విమ).

౧౭ సూ. వ్యాఖ్య:—ప్రేరణేంచుక్కు పరంబగునపుడు ముందున్న చకారమునకు 'ప'కారాదేశ మగును. ఆముందున్న చకారము ధాతువునకు సహజమైనను 'ఇంచుక్ - చుక్' అను నాగమముల సంబంధిగ్యైనను దానికి 'ప'కారాదేశ మగునని యెన్నవలయును. ప్రేరణేంచుక్కు పరమగునపు డనుటచేత స్వార్థేంచుక్కు పరమగునపు డిట్టి పకారాదేశము రానేరదు. 'పచ్+ఇంచు' అనుచో 'పచించు' అనియె యగునుగాని 'పపించు' అని కానేరదని యెఱుంగునది. ఆగమాన్య చకారముల పత్వమును సూరి యుదాహరించుచున్నాఁడు. ఇంచుక్ చకారమునకు:— పచించు = పచించ్+ఉ+ఇంచు = పచింప్+ఉ+ఇంచు = పచింపించు. ఇట్లె - వచించు - వచింపించు. సహజచకారమునకు:—పిలుచు+ఇంచు = పిలిపించు. వలచు+ఇంచు = వలపించు. హెచ్చునకుఁ బత్వంబు గలుగదు. హెచ్చు - హెచ్చించు. 'హెప్పించు' అని కానేరదు. మెచ్చునకు విభాషనగు:—మెచ్చించు - మెప్పించు. ఇట్లుదాహరించెనె కాని 'మెప్పించు' అనుపత్వమునకు భారతమున యతిప్రాసగత ప్రయోగము లభింపలేదు. 'మెప్పించు' అని ప్రసిద్ధముగు వాడుక గలదు.

| | |
|---|---|
| | ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు |
| బాలవ్యా. | పరంబగునపుడు ప-వ లగు. ౧౧. |
| ౩౩౧ II విమ | ఆగమంబు - పచింపఁడు - పచింపుము. అడఁపఁడు - |
| | అడఁపుము. అన్యము - పిలువఁడు - పిలువుము. |

సంజీవని. ౩౩౧ II విష:—ఆగమ = ఇంచుగాగమము - చుగాగమమును. అన్య = ధాతు సహజసిద్ధ మగునది. ముత్తు పరంబగునపుడు (బా. క్రి. ౮౬ సూ) ద్విరుక్తము కానట్టి "ఇంచుక్ - చుక్' అనువాని చకారమునకు 'ప'కారాదేశము నిత్యముగా నగును. ముత్తుపరంబగునపుడు ద్విరుక్తము కాని ధాతుసహజ చకారము నకు వకారాదేశము నిత్యముగా నగును. ఉదా:—ఇంచుక్కునకు:—పచ్+ఇంచు (బా. క్రి. ౬౩ సూ) = పచించు+లజీ = పచింప్+ఉ+అ+డుజ్ = పచింపఁడు (బా. క్రి. ౨౦ సూ). పచించు+ము (బా. క్రి. ౨౯ సూ). పచింప్+ఉ+ము = పచింపుము. చుక్కునకు:—అడఁగు - ప్రే - అడఁచు (బా. క్రి. ౭౬ సూ). అడఁచు+లజీ = అడఁప్+ఉ+అ+డు = అడఁపఁడు (బా. క్రి. ౨౦ సూ). అడఁచు+ము = అడఁపుము. ఆగమేతర చకారమునకు:—పిలుచు+లజీ = పిలువ్+ఉ+అ+డుజ్ = పిలువఁడు. పిలుచు+ము = పిలువ్+ఉ+ము = పిలువుము. ఇట్టి పకారాదేశ నిత్యత భారతాది ప్రాచీనకవుల గ్రంథములందె కన్పట్టుచున్నది. కావుననె త్రిలింగ లక్షణ శేషకర్త "కవిత్రయేతర ప్రయోగంబులం గొన్నియెడల నన్ ప్రత్యయా దులు పరంబులగునపుడు పకారం బించు క్చకారంబునకేనిఁ గానంబడదు. ఉదా:—క......ఎవ్వారినిఁ బో। రించని తీక్ష్ణమొక్కటియుఁ దరింపఁగ వశమే (కళా. ౨ ఆ). క.........ఊ। హించ నొక నాల్గుగడియల। సంచారము వలయు......... (కళా. ౩ ఆ). అపి శబ్దార్థముచే-చ.........అంగన భీతులకెల్ల భీతిఁ దీ। ర్చుము వెసఁబొమ్ము నమ్ము మనుచుం గదలెన్ (కళా. ౬ ఆ). మొ." (ప్రౌఢ. క్రి. ౧౬ సూ). ద్వి. కార్చిచ్చునైనను గరువలినైన। నార్చను మార్చను నాతఁడే నేర్చు (రంగ. ౯౯౧ పు. యూ. ము). ద్వి. పట్టున.........తీర్పను జాలి కొలువ (రంగ. ౧౦ పు. యూ. ము). ద్వి. పట్టి నా కనుభవింపక పోవదనియు (రంగ. ౧౨౬ పు. యూ. ము). నన్నయాథర్వణీయ పక్షమున "అనుబన్ధ ప్రార్థనయో" రిత్యాది సూత్రముచే (౩౩౧ విష) నాగమ చకారమునకు 'ప'త్వాదేశముమాత్రమె నిత్య ముగ విధింపఁబడెను. ఆగమేతర చకారమునకు ముత్పరకత్వమునందలి నిత్య వకారాదేశము ౩౨౮ విషయమునందలి "వర్ణాగమో విశేషః.........భూయ సీదేశ్య శబ్దేషు......" మున్నగు సూత్రములచొప్పున సంపాదించికొనవలసినదే. ప్రయోగములు:—ఆగమ చకారమునకు:—క: దివిజాధిప నీకెఱిగిం। పవలసె నీయాజ్ఞ నాకుఁ బడయఁగవలసెన్ (ఆది. ౨ ఆ. ౧౧౮). క. ధనవృద్ధుల మెచ్చులఁ గూ। ర్పనివారలఁ బగఱవలనివారల ధృతిచా। లనివారల.........(సభా. ౧ ఆ. ౪౧). (కూడు - ప్రే- కూర్చు. కూచు - ప్రే - కూర్చు). క. పంపం దగుఁ దగదని

శం। కింపక నీ కిష్టమయిన కృత్యముల నియో। గింపుము నన్ను......(సభా. ౧ ఆ. ౨౭౦ ప). ఆ-వె. పెంపుమెఱసి నిర్వహింపవలయు (సభా. ౧ ఆ. ౨౭౮). ఉ.........భూ। పాలక నీకు పట్టుపఱుపన్.........(సభా. ౨ ఆ. ౨౨). గీ. పాపకౌరవ్యులకు సహింపంగనేల. (ఆర. ౧ ఆ. ౨౧౯). సీ........., పాపంగ నోపక యేపుటడవి (ఆర. ౧ ఆ. ౨౯౪ ప). (పాయు - ప్రే - పాచు). అన్యచకార మునకు:—ఉ. ద్వారవనందనుండు గుదువ్వం గుదువం బటు మూరు తాపాతిం। జేసి .........(ఆది. ౫ ఆ. ౨౨౭ ప). క.........అ। జేయుపరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్. (సభా. ౨ ఆ. ౩౮). ఆ-వె. వానిబుద్ధి నెగడవలవదు......... (సభా. ౨ ఆ. ౧౫౦). ఉ.........విషాదవేదనం। గావఁగలేక.........(ఉద్యో. ౩ ఆ. ౧౧౪). చ. వలవదు వీనియింటఁ గుడువన్.........(ఆర. ౨ ఆ. ౩౪౪). సీ........., కావ్వుము కృప దేవదేవ మమ్ము (అను. ౫ ఆ. ౩౭౯). చ. వరుణుఁడు పద్మగర్భుఁ గొలువం జనియెన్ (నిర్వ. ౫ ఆ. ౯౨). ద్విపద. సర్వజ్ఞనొట్టన శరణుల రాక। కోర్వఁగ నెమ్మెయి నోపుదే యనిన (బసవ. ౮ ఆ. ౮౫౯). క. పూవని కావని తరువులు। లే పమ్ముని యాశ్రమమున.........(భాస్క. కిష్కిం. ౮౨౬ ప). ద్విరుక్త చకారమునకుఁ బవలు రామికి:—క.........పుత్త్రుఁడు బల ద। ర్పోద్ధ తుఁడై మెచ్చుఁ డసు। బద్ధంబులె కాని వినఁడు పలికిన పలుకుల్ (ఆర. ౧ ఆ. ౩౭౭). శా.........రాజు మె। చ్చుం గేళిగతి యుల్లసిల్లఁ జని యశ్వత్థామ......... (భీష్మ. ౨ ఆ. ౩౦౪). తే-గీ. త్రోచిపుచ్చంగఁ దగునయ్య నీచవృత్తి (ఉద్యో. ౪ ఆ. ౩౦౨). ఆగమచకారమునకు ద్విత్వ మసంభవము. సహజచకారము ద్విరుక్తమై యున్నపుడిట్లు 'వ'త్వము రాదని సూరి వచించెనుగాని "నొచ్చు"నకు వత్వ మిాక్రింది తిక్కన ప్రయోగమునఁ గన్పట్టుచున్నది. గీ. నొవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వకొల్ల। కేను గురుపతిఁ జూచి సహించి పోదు. (ఉద్యో. ౪ ఆ. ౨౩౭). సూరి దీనిని వేఱు మార్గమున సంగ్రహించెను. "చావు నోవులు చచ్చు నొచ్చుల కగు" (బా. క్రి. ౯౪ సూ). "ఊరయేలాదులం దొలియచ్చుమిాఁది హల్లునకు ద్విర్వచనం బొండె నగు" (బా. ప్రకీ. ౬ సూ). "ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వం బగు" (బా. సమా. ౧౩ సూ). అను సూత్రములచొప్పున "నొచ్చు" ధాతువునకు "నోవు" అను నాదేశమును నట్టి వకారమునకు ద్విత్వమును ద్విత్వ పరకదీర్ఘమునకు హ్రస్వమును రాఁగా. "నొచ్చు+నుజే = నోవు+అ+న్ = నోవ్వు+అ+న్ = నొవ్వు+అ+న్ = నొవ్వన్" అను రూపము బాలవ్యాకరణముచొప్పున సుసాధ మగుచున్నది. ఇంక వచ్చునకు 'రా' చొచ్చునకు 'చొరు' (బా. క్రి. ౯౧

సూ.) ఇచ్చునకు 'ఈ' (బా. క్రి. ౯౨ సూ.) తెచ్చునకు 'తే - తేరు' (బా. క్రి. ౯3 సూ.) చచ్చునకు 'చావు' (బా. క్రి. ౯౪ సూ.) అను నాదేశములు వచ్చును గాన వానిచోటఁ బ్రకృతసూత్రముచొప్పున వకారాదేశము వచ్చుటకుఁ బ్రసక్తియే కలుగదు. "ఇచ్చు - ఇవ్వక" మున్నగునవి యసాధువులనియె సూరియాశయము. రంగనాథరామాయణమున "ద్వి. త్రెవ్విరాలుచు నెడత్రెవ్వని తలలు। గ్రువ్వని వేరులై కొమరొప్ప......" (రంగ. యుద్ధ. ౬౦౯ పు. ౧౦పంక్తి. యూ. ము.) అని ప్రయుక్తమయ్యెను. ఈగ్రంథమున నిట్టి యసాధువులు పెక్కుగలవు. త్రెచ్చు ధాతువే కోశమందును లేదు. ఇచ్చు - 'ఇవ్వక' అనియు నిందుఁ గలదు (రంగ. బాల. ౭ పు. ౯ పం. వావిళ్ళ. ము). (చూ. ౬3 III విప). గ్రుచ్చు - గ్రుచ్చక - ప్రిచ్చు - ప్రిచ్చక - హెచ్చు - హెచ్చక - మెచ్చు - మెచ్చక - పుచ్చు - (పంపు) పుచ్చక - మున్నగురీతిని ద్విరుక్త చకారస్థలములందెల్లఁ బత్వాభావమె సాధువని సూరియాశయము. ఈవిషయము నిర్వహించుటకు "శా.........రాజు మె। చ్చం గేళీగతి యుల్లసిల్లఁ జని యశ్వత్థామ" (భీష్మ. ౨ ఆ. 3౦౪.) అను ప్రయోగమువూత్రము యతిస్థానగతము ప్రమాణమై యున్నది. ఇట్టి సూరిమార్గము నరయకయో యరసియు సమ్మతింపకయో పలువు రుదాహరించిన తిక్కనగారి "నొవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వకొల్ల। క" అను నుద్యోగపర్వ పద్యమును మూలముగాఁ గొనియో కోశకారు లిర్వురును 'గ్రుచ్చు' మున్నగు ధాతువుల వత్వఘటితరూపముల నుదాహరించి యున్నారు. శబ్దరత్నాకరమున:—చ......మూఁడు మూఁడు శితకాండములం దగ గ్రువ్వ నేసినన్. (భాగ. ౪ స్కంధ). (గ్రుచ్చు శబ్దమునొద్ద). సీ...సొమ్ము, కొలఁది యెవ్వరికి వాక్రువ్వరాదు (విక్ర. ౫ ఆ. వాక్రుచ్చుశబ్దము). సూ. రా. నిఘంటువున "గ్రుచ్చు" శబ్దమునొద్ద:—శా......కృతవర్ముండు......। నారాచంబులు పెక్కులొక్క మొగి మేనం గ్రువ్వ మూర్ఛిల్లె......(కర్ణ. ౧ ఆ. ౧౬౫ ప.) అనురీతిని పెక్కుస్థలములు వకారాదేశఘటితము లుదాహరింపఁబడెను. వీనిలో నొక్కటేనియుఁ గవిప్రయుక్తమని విశ్వసింపఁదగిన యతిప్రాసస్థల ఖచితము కాదు. వావిళ్ళవారి ముద్రణమున నిట 'గ్రువ్వ' అనుచో 'గప్ప' అను పాఠాంతరము వెలయుచున్నది. ఉద్యోగపర్వములోని "చ. పుడమిజనంబులెల్ల నినుఁ బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు" (ఉద్యో. ౨ఆ.౧౦.) అనుచోట వావిళ్ళవారి ముద్రణమున "ప్రివ్వఁగ" అనియున్నది. కాని యిట 'బ్రుయ్యఁగ' అని కవిప్రయుక్తము కావచ్చు ననఁదగును. "బ్రుయ్యు - దే - అ - క్రి - నశించు. ఆ-వె. దానఁజేసి మీరు నేనును బ్రుయ్యఁ బా। పంబులేక పడఁ బడితిమి" (మాస. ౧ ఆ. ౨౦౧). (శ. ర.)

చ.........పాండురాజ నం। దనతతిఁ బ్రువ్వఁ దిట్టరె.........(శల్య. ౨ ఆ. 3౭౫). (వావిళ్ళవారి ముద్రణము). ఇచట "పాండురాజ నం। దనతతి బ్రుంగఁ దిట్టరె (లేదా) బ్రుయ్యఁదిట్టరె" అని కవిప్రయుక్త మన నోపును. "బ్రుంగు - దే. అ - క్రి. పూఁడు. ఆ-వె. అశ్వ సుభటతతుల యంగఖండంబులు। రుధిర కర్దము మున బ్రుంగి యున్న ।.........(భార. ద్రోణ. ౧ ఆ).........." (శ. ర). 'తివ్వన్' అనునది ద్విరుక్త చకారస్థలము కాదు. 'తిగుచు = తివుచు' (బా. ఆచ్ఛి. ౨౭ సూ.) అను ధాతువు న ఙ్యంతరూపము 'తివువన్' అనియుఁ గా నోపును. ఇట నుచ్చారణస్వభావ సులభముగా నోష్ఠ్య వకారద్వయ మధ్యగతముగు 'ఉ'కారము పాక్షికముగా లోపించుటచేత 'తివ్వన్' అనియు నొకవకారము లోపింపఁగా 'తివన్' అనియు రూపము లేర్పడును. ఈవిషయమునె ప్రౌఢవ్యాకర్త యిట్లు వచించెను. "తిగుచు ధాతువు నన్నంతరూపములు తివ్వఁ దివ ననియు. ఉదా:—క. ఎవ్వరికిని మోపెట్టను। దివ్వను శక్యంబు గాని దృఢకార్ముకమున్।......(అది. ౭ ఆ. ౨౬ ప). కొప్పు వట్టి తివం బోవ (కళా. 3 ఆ)." (ప్రౌఢ. క్రియా. ౨౦ సూ). మత్త .........పాశసం। బద్ధంజేసి జముండు తివ్వఁగ (స్త్రీ. ౧ ఆ. ౪౧). మ......... వాసుకుఁగ। వ్వము త్రాడై గిరి సుట్టఁబాచె వడిఁ దివ్వం బంచె దేవాసురౌఘము (నన్ని. కు. ౨ ఆ. ౧౭౨).

తిక్కనసయాజి తన విశాలభారతభాగమున నొక్కటనైన నీ 'ప - వ' ల యాదేశము నుపేక్షింపలేదు. ఉ. సంపద దక్కఁ[illegible]ండఁగ నశక్తులనం జను మమ్ముఁ బిల్చి పూఁబింపఁగ నంతెబెలె......మ। న్నింపఁడ......రిత్తఁ గా। రింపక మాను మా తని.........(ఉద్యో. ౧ ఆ. 3౧౪). శా. పెంపేదన్.........విచా। రింపన్... సా। ధింపన్......శం। కింపం ఒట్టొకొ......(ఉద్యో.3 ఆ. ౧౦3). తే-గీ. నేర్పు వాటించి కార్యంబు తీర్పవలయు (ఉద్యో. ౧ ఆ. ౫౪). సీ......కౌఁగిలింపఁగ భీముఁ డును నీవుఁ బరమహర్ష। మున......, పరిరంభణం బొనర్పంగ నరుఁడు।...... (ఉద్యో. 3 ఆ. 3౫3). (ఒనరు. ప్రే. ఒనర్చు = ఒనరఁజేయు). సీ......॥గీ॥...... విశ్ర। మింపుఁ డంతకు మఱి రండు సొంపు సూప (శల్య. ౨ ఆ. ౬౪). (శాంతి. ౧ ఆ. ౧౬-౪ ఆ. 3౭౦-౫ ఆ. ౨౯౭). ఈవిషయమునఁ గొన్ని వివాదస్థలము లును గలవు. 'విడుచు' ధాతువు విడు = 'వీడు' ధాతువుల ప్రేరణార్థమున భారత ములో వాడఁబడినది. ఉ. ద్రోవది బంధురంబయిన క్రొమ్ముడి గ్రమ్మున విడ్చి వెంద్రు కల్। దావలచేతఁ బూని...... (ఉద్యో. 3 ఆ. ౧౧౪). క. తదీయానూన బంధ పీడితులైన శ్రుతుల విడిచి తెచ్చి యజునకు నిచ్చెన్ (శాంతి.౬ఆ.౪౭౬). ఇట్టి విడుచు

ధాతువు ముత్పరకత్వమున 'విడుపన్ - విడుపక' అనురీతినె పత్వఘటితమయియే యుండును. అర్వాచీనులు "విడుచు = త్యజించు" అనురీతిని విడుధాత్వర్థమునందే వ్యవహరించిరి. (విడుచు = తన్ను విడునట్లు చేయు = త్యజించు.). శబ్దరత్నాకరకర్త "విడుచు - దే - ప్రే. విడునట్లు చేయు - విమోచనముచేయు" అని వ్రాసెను. విమోచనముచేయుటకును విడఁజేయుటకును గొంతభేదముగలదు, 'రాముఁడయోధ్యను విడిచెను' అనుచోట 'వీడఁజేయు' అనునర్థములేదు. శబ్దరత్నాకరకర్త 'విడి' శబ్దమున కర్థము వ్రాయు సందర్భమున "విడి.........విణ - విడువఁదగినది" అని విడుచుధాతువు నిట్లు 'త్యజించు - వీడు' అను నర్థమునందె వాడెనుగాని విడుధాతుప్రేరణమున వాడలేదు. కావుననే 'విడువన్' అనువత్వ ఘటితరూపము విరుద్ధము కాదయ్యెను. ఇట్టి యర్థవ్యత్యాసము గల్గుటచేతనే 'విడుపన్' అనునది వ్యవహారవాసనచే శ్రుతికటువుగా వినంబడును.

విఱుగు ధాతుప్రేరణరూపము 'విఱుచు' అగును. ముత్పరకత్వమున "విఱుపన్ - విఱుపక" అనురీతిని 'ప'త్వఘటితరూపములు సాధువులగును. కాని 'ఇచ్చు' ధాతువునకు 'ఇవ్వక' అనియుఁ గురియుధాతువునకు 'కురవక' అనియు వ్యవహారవాసనచే శ్రుతిహితముగా వినఁబడుచున్నట్లు 'విఱుగు - విఱవక' అను వత్వఘటితరూపము వ్యవహారవాసనచేత శ్రుతిహితముగా వినంబడును. ఇట్లె 'ఆ-వె.....రాజుఁ బెద్దదొరలుఁ/జీర లొలువఁబడిరి.........(విరా. ౫ ఆ. ౨౨౨)' అని ముద్రణములు వెలయుచున్నవి. "ఒలుచు - దే - ప్రే - ఒలియఁజేయు - తొలూడ్చు.........." (శ.ర). అనుచోనున్న 'ఒలుచు' ధాతువు ప్రేరణార్థకము. "క.........పవనజుఁ । డదయుండై వీఁపు లొలియ నందఱ నీడ్చున్ (ఆది. ౫ ఆ. ౧౬౬)." అను రీతిని 'ఒలియు' ధాతువు భారతప్రసిద్ధము. కావున దీని ప్రేరణరూపము ముత్పరకత్వమున 'ఒలుపఁబడిరి' అనియే యుండనగును. 'ఒలువఁబడిరి' అను ముద్రణము సరికాదని తోఁచెడిని. ఎగయు ధాతుప్రేరణము 'ఎగచు' అనునది. 3౨౮ III విషయమున నుదాహరింపఁబడెను. అయ్యది ముత్పరకత్వమున 'ఎగపన్' అని పత్వఘటితముగానె యుండునని తోఁచుచున్నది. సూ. రా. నిఘంటుకారులు 'ఎగచు = ఎగుచు' అనువాని సాంకర్యమునుగూర్చి విమర్శించి "ఎగయుయొక్క ప్రేరణమగు 'ఎగచు'నకు 'ఎగవన్' అనురూపము సిద్ధించుటయుఁ జింత్యము. చూ. ఎగుచు" అని వ్రాసిరి. ఎగుచు శబ్దమును వివరించు సందర్భమునఁ బెక్కుచోట్ల 'ఎగువన్' అను వత్వఘటితరూపమును ముద్రించిరి. అందొక్కటేని కవిప్రయుక్తమని విశ్వసింపఁదగిన యతిప్రాసఖచిత ప్రయోగము కాదు. ఇందు వకారాదేశము వచ్చు

ననుట కాధారమేమో ? తెలియకున్నది. తాలిమి మున్నగు జన్యశబ్దములనుబట్టి "సహించు = ఓర్చు" అను నర్థముగల "తాలు" ధాతు వంగీకార్యమనియు నద్దాని ప్రేరణరూపము 'తాలుచు' ధాతువనియు దానికి 'ధరించు = వహించు' అను నర్థములు (సహింపఁజేయు = ఓర్వఁజేయు) ప్రసిద్ధములగుట విరుద్ధముకాదనియు గ్రహింపవలయును. కావుననే చ.........ఈ వియ। త్తలమను కంబమొక్కటియ తాల్పఁగ సుస్థిరమై.........(సభా. ౧ ఆ. ౭౯) మున్నగు పత్వఘటితరూపములు ముత్పరకత్వమున సంగతములగుచున్నవని యెఱుంగనగును.

పయిరీతినె చువర్ణక విధానసందర్భమునఁ (బా. క్రి. 23 సూ) గొన్నిధాతువుల విషయ మీగ్రంథమున విమర్శితమయ్యెను. 'అదరుచు' ధాతువులోని 'చు'వర్ణకము ధాతువునకు సహజమనియు 'ఎద్రుచు' మున్నగువాని చువర్ణక మాగమచకారమనియు వ్రాయఁబడెనుగాన ముత్పరకత్వమున'అద్రువన్-ఎదురుపన్-విద్రుపన్' మున్నగురూపములు సంగతము లగుచున్నవి. ఇట్లె యచట ననేకధాతువులలోని యాగమాన్య చకారములు నిరూపింపఁబడినవి. దానినిబట్టి వానివాని పత్వ వత్వములు గ్రహింపనగును.

| | |
|---|---|
| బాలవ్యాకరణ | ఖండబిందుపుమీఁది సిద్ధచకారమునకు ముత్తుపరంబగు |
| వివరణము. | నపుడు పకారంబు ప్రాయికంబుగా నగును. ౨౯. |
| 33౧ III విమ. | తలఁపక - త్రేఁపక - తోఁపక - ఏఁచునకు వైభాషికంబు- |
| | ఏఁపక - ఏఁచక - నోఁచునకుం గలుగదు. నోఁచక. |

సంజీవని. 33౧ III విమ:—ఖండబిందుపూర్వకమగు ధాతుసహజ చకారమునకు ముత్తుపరమగునపుడు పకారాదేశంబు తఱుగా నగును. బా. సంజ్ఞా. ౧౬ సూత్రముచొప్పున (౫౦. I విమ. ౫౨ విమ) స్థిరపరకబిందువు తెల్గున నిల్వనేరదుగానఁ బూర్వసూత్రముచొప్పున ఖండబిందు పూర్వకసిద్ధ చకారమునకు 'వ'కారాదేశము గల్గనేరదు. కావున బా. గు. ప్రకర్త 'అర్ధానుస్వారముమీఁది సిద్ధ చకారము ౨౫ సూత్రాంశమున వకారము రాక యీసూత్రమునఁ బకారంబే వచ్చునని పూర్వవిధికి నపవాదము" అని వ్రాయుట యవిమర్శమూలకము. పై సందర్భమునుబట్టి ముత్పరకత్వమున "తలఁచక - త్రేఁచక - తోఁచక - ఏఁచక - నోఁచక-సైఁచక" అనురీతిని 'పత్వవత్వములు' లేనిరూపములె నిల్వవలసియుండఁగా నీసూత్రముచేత 'ప్రాయిక పకారాదేశము విధింపఁబడెను. ప్రాయికమనుటచేత నెచ్చటనేని రాకున్న రాకపోవచ్చునుగాని సాధారణముగా 'ప'త్వము కల్గుచునే యుండుునను నర్థము లభించుచున్నది. అట్టి ప్రాయికగ్రహణముచేతనే ఏఁచునకు

వైకల్పికమనియు నోఁచునకుఁ గల్గనేరదనియు సూరి వివరించినవాఁడయ్యెను. అట్టి వివరణమును నిర్వహింపఁజాలు ప్రయోగములు నాకుభారతాది ప్రాచీనప్రబంధములలో లభింపలేదు. ఉదా:—తలఁచ్+అ+క = తలఁప్+అ+క = తలఁపక. ఇట్లె తక్కినవాని ప్రక్రియ నరయునది. త్రేఁపక (ఉద్గారింపక). తోఁపక. ఏఁపక = (పీడింపక = బాధపెట్టక) ఏఁచక. నోఁచక (నోము నోమక).

ప్రయోగములు:—చ......ఇట్టు లేఁ। ప నగునె ద్గైన నీదయిన పం పెదఁ గైకొని చేయువాఁడ.........(విరా. ౨ ఆ ౨౬3 ప). శా. ఆతన్వంగి యనంగఝాంకరణవ జ్యాముక్త చూతాస్త్ర ని। ర్ఘాతం బోర్వక తమ్ములంచుఁ దటినీ గర్భైక సంజాత కం । జాతవ్రాతము మాటుఁజెంద నవి యేఁచన్ సాగె మున్నున్నగా । జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడి వాచారూఢి సత్యమ్ముగా. (వసు. 3 ఆ. ౧౦౧). క. కవలన్ సమయించుట తలఁ । ప వృథాస్ఫురణంబుగాదె పరబలభేదీ (కర్ణ. ౨ ఆ. 3౯3). చ.........బం। ధుర తరవారివాహములు తోయజ బాంధవుఁ గప్పి చాడ్పు దోఁ । ప రయముమైఁ గడంగి యవి పైకొని యవ్విభుతోఁ బెనంగఁగా. (శల్య. ౧ ఆ. 33౫). ఉ.........క్రూరవిచేష్టిత విభ్రమంబు దోఁ। ప న్నురుమాడుఁ బ్రౌఢ బలభాసిత భూరిభుజా విహారుఁడై (సాక్షి. ౧ ఆ. ౧౭౫). (చూ. ౪౮ V విష). 'త్రోఁచు - తోఁతెంచు' శబ్దములలో ఖండబిందువులేదని శరణ్యకర్తగారు సాహసముగాఁ బ్రసంగించిరి (బాలక. శ. ౧౬౮-౧౬౯ పుటలు). ఇం దర సున్నయే లేనిచో 'త్రోవన్' మున్నగు ననిష్టరూపములు వకారాదేశఘటితములు దుర్వారము లగును గదా. ఉ......... । డాఁచినసొమ్ము చేరె నిచటన్ మదిఁగోరని సత్యభామకున్ । నోఁచినవారి సొమ్ములవి నోఁచనివారికి వచ్చునే ధరన్ (ఉ. హరి. ౧ ఆ. ౧౬౮).

దా చో ర్లుక్ తద్ధర్మే. (ఆం. చిం. క్రియా. ౧౦ కా.
సన్నయా. అహో. ౪౮౦ పు).
33౨ విషయము. బిన్దుపరస్యతకారో దో స్స్యాత్ (ఆం. చిం. క్రియా.
౧౧ కారి. అహో. ౪౮3 పుట).

కల్పతరువు. 33౨ విష:—తద్ధర్మార్థక క్రియయందు, దా = దువర్ణకము పరమగుచుండఁగా, చోః = ముందున్న 'చు'వర్ణమునకు - ఇంచు ప్రుక్కుల చువర్ణమునకును ధాతుసహజ చువర్ణమునకును, లుక్ = లోపము కల్గును. అట్టియెడ నిల్చియుండెడి, బిన్దుపరస్య దోః = ఖండపూర్ణాన్యతర బిందువునకుఁ బరముగానున్న దు'వర్ణక (ముందుబిందువు లేకున్నను చులోపము గల్గినఁ జాలును గెలుతును)

దకారవ్యంజనమునకు, తకారః - స్యాత్ = తకారాదేశము నిత్యముగా నగును. ఉదా:—రక్షించు+దు+నున్ = రక్షిం+ద్+ఉ+నున్ = రక్షిం+త్+ఉ+నున్ = రక్షింతునున్; అణఁచు+దు+నున్ = అణఁ+ద్+ఉ+నున్ = అణఁ+త్+ఉ+నున్ = అణఁతునున్. గెలుచు+దు+నున్ = గెలు+ద్+ఉ+నున్ = గెలు+త్+ఉ+నున్ = గెలుతునున్. నన్నయాథర్వణపక్షమున నీ తాదేశము నిత్యమయి వర్తిల్లును. ఆంధ్రశబ్దచింతామణి తత్సమక్రియామాత్ర సాధన ప్రవణమగుటం జేసియుఁ దత్సమ క్రియలతుది నించుక్క నియతముగా నుండఁదగుటం జేసియు 'బిందుపరస్య' అను దళము నిల్పఁబడెను. అరయనరయ నట్టి బిందుశబ్దమునకు ఖండబిందు పరముగా నయిత మర్థముచేయుట చింతామణి కర్త్రభిప్రేతము కాదనియె చెప్పనగును గాని, "అత్త్వాది తత్సమానామివ దేశ్యానాం క్రియాపదానాంచ" అను చింతామణ్యతి దేశము నాశ్రయించి యథాసంభవముగా బిందు వుండఁదగుననుచు వ్యాఖ్య చేయఁ బడెనని యెఱుంగునది. అట్లని 'దు'వర్ణక దకారమున కెల్లయెడలను 'త'కారాదేశము వచ్చునని తలంపరాదు. పూర్వస్థిత 'చు'వర్ణలోపము గల్గునప్పుడు పరిశిష్టమయి యున్న 'దు'వర్ణక దకారమునకుమాత్రమె తకారాదేశము నిత్యముగా నగునని యెఱుంగునది. ఉదా:—గెలుచు+దు+నున్ = గెలుతునున్. ఇట్టి వ్యాఖ్యచే 'చంపుదురు' మున్నగుచోటులందు 'చంపుతురు' మున్నగు ననిష్టరూపములు గల్గ నేరవని యెన్నునది. ఉదా:—సీ.........॥ఆ-వె॥.........నీ। కేమి కీడొనర్చి రెట్టిపాటి। సాహసికులొ వారిఁ జంపుదు నొంపుదు। భంగపఱుతు నిడుముఁబఱుతుఁ జెఱుతు (విరా. ౨ ఆ. ౧౫౬).

ప్రయోగములు:—ఇంచుక్కమీఁది దకారమునకు:— క............ నివేదిం। తురు దల్లికిఁ గరము భక్తితో వినయమునన్ (ఆది. ౬ ఆ. ౨౮౦). మత్తకోకిల........ప్రతిపక్షవీరుల నేమ ని। ర్జింతు మెవ్వరు మాకు మీఁదయఁ జేసి మార్కొనునంత య। త్యంతవీరులు లేరు భూవిదిత ప్రతాప బలోన్నతిన్. (ఆర. 3 ఆ. 3౫3). చుక్కమీఁది దకారమునకును ధాతు సహజ చువర్ణముమీఁది దకారమునకును:—చ. ఇతనికిఁ గూర్తురేని ధన మిత్తు రభీష్టములైన కార్యముల్। మతి నొనరింతు రిష్టుఁడని మంతురుగాక.........(సభా. ౨ ఆ. ౧౦ ప). క...... తృష్ణఁ బాతురు సుమతుల్. (ఆర. ౧ ఆ. ౨౫). (పాయు. ప్రే. పాచు+దురు = పాతురు). అక్కర......పదుంద్రఁ బోలెదు సుకుల నూర్వురఁ బడయంగ వలతొ। ......వలతొ। ......వలతొ......। ......వలతొ......(ఆర. ౨ ఆ. 3౫౧). ధాతువు తుదిని ద్విరుక్త చకారమున్నచో దానికి లోప కలిగి దువర్ణ

దకారమునకు ద్విరుక్త తకారాదేశ మగును. క.........అసదృశు నీ। కొడుకని యీతని నెంతయు। నెడ మడుగుగఁ జూపఁ దెత్తె యుందటు నగఁగాన్ (ఆది. ౮ ఆ. ౧౦౧). (తెచ్చు+దు+వు+ఎ = తెత్తువె = తెత్తె). బా. క్రి. ౩౦ సూత్రము చెప్పిన 'అ'త్వము చేసినను నీ తకారాదేశము జరపనగును. ఉ.........ఇతనిం జని చూతరు యంచు.........చూచిరి.........వృకోదరు నెల్లవారలున్ (ఆది. ౬ ఆ. ౩౦౯). తిక్కయజ్వయు నీతీరుననే ప్రయోగించి యున్నాఁడు. ఉ. ఎత్తునఁ గొందుఁ గౌరవుల నెల్లను మూర్కొని తేనె గోవులం। దెత్తు ముహూర్తమాత్రమున .........(విరా. ౮ ఆ. ౯). ఉ. అంతలునేసి పోవిడిచి యక్కట సంజయు చేతఁ జెప్పి వు। త్రెంతురె యిట్టి యూరట.........(ఉద్యో. ౩ ఆ. ౧౦౧). క.........మఖ। వ్రాతంబు మఖములుఁ బెడఁ। బాతురు దుర్మార్గ కర్మపరులై విప్రుల్. (ఆర. ౮ ఆ. ౨౯౭). (పెడఁబాయు. ప్రే. పెడఁబాచు). శా.........ఇ। త్తుం గౌంతేయుల కిమ్మహీవలయమును దుర్దాంత చంచద్భుజా। .........(భీష్మ. ౨ ఆ. ౧౫౩). క. పోయి మనము వత్తమెల్లి ప్రొద్దున ననికిన్ (భీష్మ. ౨ ఆ. ౨౫౨). క. మన మంతకు వేఱొకది। క్కున నడతము.........(ద్రోణ. ౫ ఆ. ౨౦౦). క. తెత్తముగాక నరేంద్రము। రుత్త కలితమైన దానరూపము.........(అశ్వ. ౩ ఆ. ౧౩౮).

ఆగమ చకారంబునకు నెఱసున్న మీఁది దానికి దుక్కు పరంబగునపుడు పకారంబు విభాషనగు. ౯౦.

ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు. పక్షంబు రానిపక్షంబున వక్ష్యమాణ తాదేశంబు-ఆకర్ణింతురు-దంతురు - చింతురు.

బాలవ్యాకరణ వివరణము. 33౨ I విమ.

చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు. ౧౦౮. నిలుతురు - పిలుతురు - అడఁతురు - కడతురు - చింతురు - పెంతురు - పచింతురు - వచింతురు. చేతురు - కోతురిత్యాదు లసాధువులని యెఱుంగునది.

సంజీవని. 33౨ I విమ:—ఇంచుక్ - చుక్కల చకార మాగమ చకారము. పూర్ణానుస్వార పూర్వకమగు నాగమ చకారంబునకు దుగాగమము (బా. క్రి. ౨౨ సూ) పరంబగునపుడు వైకల్పికముగా 'ప'కారాదేశం బగును. పక్షంబున వక్ష్యమాణ తాదేశ మగునని సూరిగారే వివరింతురు. ఉదా:—ఆకర్ణించు+దు+రు = ఆకర్ణింపుదురు. దంచు+దు+రు = దంపుదురు. చించు+దు+రు = చింపుదురు. ఆక

ర్ణించు - బా. క్రి. ౬3 సూత్రముచొప్పున వచ్చిన ఇంచుక్కు. దంగు - ప్రే - దంచు - చినుఁగు - ప్రే - చించు - బా - క్రి. ౭౬-౭౭ సూ - చొప్పున వచ్చిన ప్రేరణార్థక చుక్కు. షత్వాభావపక్షమున వక్ష్యమాణం బనఁగా బా. క్రి. ౧౦౮ సూత్రమునఁ జెప్పఁబడిన తాదేశంబు రాఁగా - ఆకర్ణిం+చుదు+రు = ఆకర్ణింతురు. చిం+చుదు+రు = చింతురు. దం+చుదు+రు = దంతురు. ౧౦౮ సూత్రమున 'చుదు' అనుదానికి 'తు' అనునది యాదేశమగును. ఈ తాదేశవిధియందు 'చు'వర్ణమునకు ముందు ఖండముగాని పూర్ణముగాని యుండ నక్కఱలేదు. ఉన్నను బాధకము కాదు. బిందువులేమి కుదా:—గెలుతురు - పిలుతురు - మొ. నన్నయాథర్వణీయమునం దీ తాదేశము నిత్యముగ వర్తిల్లును. పాదేశవిధిలో నెఱసున్న మీఁది దాని కనుటచేత "తలఁపుదురు - అణఁపుదురు" మున్నగురూపములు సమ్మతము కావనియు "తలంపుదురు - అణంపుదురు" అనికాని "తలంతురు - అణంతురు" అనికాని సాధువులనియు నెఱసున్న లేనపుడు "తలఁతురు - అణఁతురు" అనియే యుండవలెననియు సూరియాశయము నెన్నఁదగును. 'ఆకర్ణింపుదురు' అను సూరిగారి యుదాహృతి నరయఁగా "క........ । ఆకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్. (భాగ ౮ స్కంధ. ౨౧ ప)" అను భాగవతపద్యమును మూలముగా నెన్నిరా యని యాలోచింపనగును. ఈసూరిపద్ధతి నన్నయాథర్వణ సమ్మతము కాదు. కావుననె "ఆకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్ ఇత్యాదౌ ఆకర్ణింతురు మహోత్సు లతిహర్షమునన్ ఇత్యాదిపాఠ ఏవ సాధుః." (అహో. ౧౮3 పు). అని యిట్లహోబలపతి సాహసముగా భాగవతపద్యమును దిద్దఁబెట్టెను. కాని పదునాల్గవ శతాబ్దమున కిట్టిప్రయోగము సమ్మతి కెక్కెననుట యుక్తము. క. తుద బహువచనమునకు నిం । పుదురును నింతురును నయ్యెఁ బుడమిఁ గొడల నిం । చుదురును గలుగుఁ బ్రయోగా । స్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్ (౧౬౦ పద్య). సీ. శ్రీవిశ్వభూపతి చేయించుఁ గ్రతువులు, సేవింపుదురు తదాశ్రితులు సురలఁ । బండంగ సింద్రుండు వరగించు వానలు, హాలికుల్ పరఁగింతు రర్థచయము । నొసఁగించు ధర శ్రీల నేపారుఁ దద్వృత్తి, వరభటు లెఱఁగించుదురు జయంబు । వెలయించు కీర్తి యవ్విధి నెలయింపుదు, రర్థు లెల్లెడఁ బ్రతాపాతిశయము । ........(౧౬౧ కావ్యాలం. ౯ ఉల్లా). ఇట్లు ప్రథమపురుష బహువచనమందు మాత్రమె 'పుదురు అనుదానిని బదునాల్గవ శతాబ్దాదివాఁడగు విన్నకోట పెద్దన యుదాహరించెను. సూరిసూత్ర మన్ననో 'ఆకర్ణింపుదును - ఆకర్ణింపుదుము' మున్నగురూపములనెల్ల సంగ్రహించుచున్నది.

పయిసందర్భమునుబట్టి నన్నయభారతభాగమునందలి 'పుదురు' పాఠము ముద్రణసంస్కర్తృకృత ప్రక్షిప్తమని గ్రహింపవలెను. "అక్కర. ఏమేము మున్ను పూజింపుదుము రుద్రు నిం దని వేడ్క (అర. ౨ ఆ. ౨౫౬). (వావిళ్ళవారిముద్రణము. శ్రీవిక్రమదేవవర్మ మహారాజావారి ముద్రణమందును నిట్లెయున్నది). "ఏమేము మున్ను పూజింతుము రుద్రు నిం దంచు వేడ్క" అని నాయొద్ద నున్న తాళపత్త్రమాతృకలు రెండిటియందును నున్నది. ఆంధ్రవిశ్వ కళాపరిషత్పుస్తక భాండాగార తాళపత్త్రమాతృకలు మూఁడియందును 'పూజింతుము' అను పాఠమె వెలయుచున్నది. తాళపత్త్ర మాతృకలలోని నన్నయగారి యక్కరను నప్పకవీయ లక్షణమునకు సరిపెట్టుటలో ముద్రణసంస్కర్తలు నేఁడు సాధువుగా సమ్మతమగుచున్న యీ 'పుదురు' పాఠమును నన్నయభారతభాగమునఁ బ్రక్షిప్తముచేసిరనుటలో సందియము లేదు.

"నన్నయగారికాలములో 'చుదురు' రూపములూ లేవు. పుదురు రూపములూ లేవు. సాధ్యమైనంత శ్రద్ధతో మేము వెదకగా వెదకగా అరణ్యపర్వము రెండవ యాశ్వాసములో ౨౫౫ పద్యమందు 'ఏమేముమున్ను పూజింపుదుము రుద్రు నిం దని వేడ్క' అని మధ్యాక్కర ప్రథమచరణములో 'పూజింపుదుము' అన్న 'పుదురు' రూపము ఒక్కటిమాత్రమే మాకంటః బడ్డది. మధ్యాక్కర నన్నయ ఏలక్షణము చొప్పున వ్రాసినాఁడో ఇదివరకు ఎవరికి లెస్సగా తెలియదు. కొన్ని మధ్యాక్కరలు లేఖకులు, కొన్ని పరిష్కర్తలు తారుమారుచేసినారని మేము నిశ్చయముగా చెప్పగలము. మావద్దనున్న ఒకవ్రాత పుస్తకములో (50b) ఈపద్యము ప్రథమ చరణము 'ఏమేము మున్ను పూజింతుము రుద్రు నిందనుచు వేడ్క' అనిన్ని మఱిఒకదానిలో (73b) 'ఏమేము మున్ను పూజింతుము రుద్రుని నిందను వేడ్క' అనిన్ని ఉన్నది. మఱికొన్నిటిలోకూడా 'పూజింతుము' అనేపాఠమే ఉన్నది. తిక్కన కాలములోనైనా పుదురు రూపములు కావ్యభాషలోనికి వచ్చినవో లేదో ఇంకా మేము సిద్ధాంతము చేయలేము; బహుశా రాలేదు. మల్లయ మనషి వరాహ పురాణము వ్రాసిననాటికి మాత్రము గ్రాంథికభాషలో ఉన్నవి. అవి ఈ గ్రంథమందు అనేకపద్యములలో కనబడ్డవి. గాని యతిస్థానమందు దువర్ణముగలవి మూఁడుమాత్రము ఇక్కడ ఉదాహరిస్తున్నాము. సీ......గీ...... । రూపమునునైన తనువు లార్యులు వచింపు । దురు వరుస మూఁడటంచు నందుల నధర్మ । .........(౭ ఆ. ౧౧౦). గీ......... । భూనిలింపోత్తములు యజింపుదురు బ్రహ్మ । .........(౧౦ ఆ. ౭౬ ప). సీ........., తొడవులు ధరియింపుదురు

దివిజులు. (౧౦ ఆ. ౧౧౯). తెనాలి రామలింగకవికూడా వీటిని వాడినాడు. (చూ. పాండురంగ మాహాత్మ్యము. సుఖింపుదురు. ౨ ఆ. ౧౪౬. వసియింపుదురు. ౨ ఆ. ౨౨౪ ప. నుతియింపుదురు. ౫ ఆ. ౨౭౯ ప. ఓసర్పుదురు. ౫ ఆ. ౨౯౨ ప. ఇంకా మరికొందరు ఈరూపము ప్రయోగించినారు." (బాలకవిశరణ్యము. 23-24 పు). ఇట్లు కీర్తిశేషులగు కళాప్రపూర్ణ గిడుగు వేంకటరామమూర్తి పంతులవారు వ్రాసి యున్నారు. కాని వీరీ 'పుదురు' రూపము తిక్కన భారతభాగములో వేయలేదను టకేల సంకోచించిరో తెలియకున్నది. తిక్కనయేకాదు. ఎఱ్ఱాప్రెగడసైత మీ రూపములను భారతమున వ్యవహరింపలేదు. కవిత్రయమువారేకాదు. నాచన సోమనాథుఁడు-శ్రీనాథుఁడు - కవిపితామహుఁడు మున్నగువారుసైతము "చుదురు" రూపమునేకాక "పుదురు" రూపమునుసయితము వ్యవహరింపలేదు. బాలకవి శరణ్యకర్తగారు "చుదురు" రూపము విషయమున నెవరెవరో కుప్పనకవిగారు మున్నగు నేఁటివారి ప్రయోగములుచూపి పదిపుటలు వ్రాసిరేకాని యతిప్రాసాది స్థల ఖచితమగు నొక్క ప్రయోగమునయినఁ జూపఁజాలరైరి. (చూ. బాలక. ౬౫ మొ. 25 పుటలు). నీ పుత్రులఁ గోల్పోయి భూరిశోకంబున, వసటఁ బొందుచు విప్రవరులు చాల। ఏరాజు రాజ్యమం దేని వసించుదు। రా రాజు దలపోయ నవని మీఁద (భాగవ. ౧౦ స్కంధ. ఉ. భా. ౧౨3 ప). అనుదానిని జూపి దానిని దిద్దు టకెవరో యెంతో ప్రయాసపడిరని వ్రాసిరి. కాని యచట 'వసింపుదు ! రారాజు' అని కాని "వసించెద । రా రాజు' అని కాని కవిప్రయుక్త మనుటలో క్షతి యే మున్నది. "ఆకర్ణింపుదురు" అను భాగవత ప్రయోగమును సూరి యంగీకరింపలేదా? విన్నకోట పెద్దిరాజు సమ్మతించెనేకాని యాతనికిముందు వెన్కల ప్రామాణిక కవీంద్రులెవ్వరును నీ 'చుదురు' రూపమును ప్రయోగించిరనుటకుఁ గవిప్రయుక్త మని విశ్వసింపఁదగిన ప్రామాణిక ప్రయోగము లేదు.

౧౦౮ సూ. వ్యాఖ్య:—చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబగు ననఁగా 'చుదు' అనుదానిలోని 'చుద్' అను భాగమునకు 'త' కారవ్యంజన మాదేశమగునని యర్థము. ఉదా:—నిలుచుద్+ఉ+రు = నిలుత్+ఉ+రు = నిలుతురు. పిలుచుద్+ఉ+రు = పిలుత్+ఉ+రు = పిలుతురు. అడఁచుద్+ఉ+రు = అడఁత్+ఉ+రు = అడఁతురు - పచించుద్+ఉ+రు = పచింత్+ఉ+రు = పచింతురు. ఇట్లె తక్కినవాని ప్రక్రియనుసైత మరయునది. "చేయుదురు - కోయుదురు" మున్నగురూపము లందు ధాతువు యువర్ణాంత మగుటచే 'చుదు' అనునదే లేమింజేసి తాదేశమునకుఁ బ్రసక్తి లేదు. కావున "చేయుదురు - కోయుదురు" అనియే యుండవలయుననియు,

'చేతురు - కోతురు' అనునవి వ్యావహారికరూపములు నసాధువులు ననియు సూరి వివరణమునకుఁ దాత్పర్యము. ప్రయోగములు:—ఉ. ఈయవనీశ్వర......... । చేయుదె. (సభా. ౨ ఆ. ౧౫౪). చ.........వాయుసారధి జవంబునఁ దానిట వచ్చె నేమినే । యుదు సుతులార యీబిలము నొయ్యన పోయి వొరఁడు దీనిఁ గ । ప్పెద ఘనపాంశు జాలముల..........(ఆది. ౮ ఆ. ౩౦౪). క......పద్భృ । త్యులకును సత్కార మర్థితోఁ జేయుదె.........(సభా. ౧ ఆ. ౩౯). క......... స । త్కృతిసేయుదె కృత మెఱిఁగెదు । పతియె.........(సభా. ౧ ఆ. ౪౬). సూరి యాంధ్రశబ్దచింతామణిని గవిత్రయమువారిని బ్రాయికముగాఁ బ్రమాణీకరించికొనుచు వ్రాయుచుండుటనుగానఁ బయిరీతిని యువర్ణఁబుతోడ దుగ్ధకారంబు నకు 'త'కారాదేశంబు వచ్చుటను నిరసించినవాఁడయ్యెను. కాని యిట్టిరూపములు ప్రాచీన ప్రబంధములందు లేకున్నను మధ్యకవుల గ్రంథములం దరుదుగాను నర్వాచీనకవుల గ్రంథములందుఁ దఱచుగాను బ్రయుక్తములయి యున్నవి. బాలకవి శరణ్యకర్తగారిది సందుచేసికొని గొప్పగా విజృంభించి రమారమి యేఁబదిపుటల యుపన్యాసము నీశబ్దముల విషయమున వ్రాసిరి. ఊరకే యెన్నో చూపిరిగాని ప్రాచీనాంధ్రలక్షణ ప్రామాణ్యమును జూపలేరైరి. పారావారమువలె నత్యంత విశాలమైన భారతమున లేఖకముద్రాపకాది ప్రమాదమునం బడిన రెండు మూఁడు ప్రయోగములను మాత్రమె చూపఁగల్గిరి. ఆస్థలములందుఁ దాళపత్త్రమాతృకలలో 'చేతురు - కోతురు' వంటి తాదేశ ప్రయోగములు లేవు. "క విషనిధి కుక్షి న సంఖ్యము । నిషాదగణ ముండి ధారుణీప్రజకుఁ గడున్ । విషమము సేతురు వారి, ని । మిషమున భక్షించి చను మమిత్త్రవిఘాతీ (ఆది. ౨ ఆ. ౫౬)." అనితంజావూరి సరస్వతీ నిలయమందలి 27 నెంబరు పుస్తకమున నున్నదని శరణ్యకర్తగారు వ్రాసిరి. కాని వావిళ్ళవారి ముద్రమున "విషమమును జేయుదాని, ని । మిషమున......
..." (ఆది. ౨ ఆ. ౫౯ ప). అనియె యున్నది. నాయొద్దనున్న తాళపత్త్రమాతృకలు రెండిటిలోను "విషముంబు సేయువారి, ని । మిషమున" అనియున్నది. "కుడిచినచోటికిఁ గూర్చ వెపుడు." (సభా. ౨ ఆ. ౧౮౮). "కుడిచినచోటికిఁ గొఱంత సేతు" అను పాఠాంతరముగలదని వావిళ్ళవారి ముద్రణమునఁ గలదని శరణ్యకర్తగారు వ్రాసిరి. సత్యమే కాని నాయొద్దనున్న తాళపత్త్రమాతృకలో "కుడిచినచోటికి కుఱుచ తలఁతు" అనియున్నది.

ఇంకఁ దిక్కనభారత భాగమునందలి ప్రయోగములు:—(౧) "గుప్తార్థప్రకాశికలో నుదాహృతములు. తిక్కన విరాట. ౨ ఆ. ౨౮౧ పద్యము మూఁడో

పాదము. మ. నా । కులతం బొందెడు నప్డు మంటపము, సంక్షోభింపఁగాఁ జేతు. అని ఉన్నదని శ్రీతిరుపతి వేంకటేశ్వరులుకూడా తిక్కన దీప్రయోగ మున్న దన్నారు" (బాలక. ౮౮ పు). అట్లున్నదని చెప్పినవారు గొప్పవారే కాని పద్యము నరసినచో నట 'చేతున్' అనునది సందర్భించి యుండ లేదు. భీముఁడు ద్రౌపదితోఁ బలికిన వాక్య మిది. మ. బలియుం డా సొబగుండు భావభవదర్ప భ్రాంతుఁడై వచ్చి ని । శ్చల సర్వాంగత నున్న నన్నరసి నీచందంబు గాకున్న నా । కులతం బొందెడునప్డు మండపము సంక్షోభింపఁగా <u>లేతుఁ</u> గ । ట్టలుకం బెబ్బులి గోల వ్రేసినటు లుగ్రాకార మేపారఁగాన్. క. ఎఱిఁగి పిలుపనిన వెసఁ బై । కుఱికుదు.........(విరా. ౨ ఆ ౨౮౧-౨౮౨ ప. వావిళ్ళ). "లేతున్" అనుచో 'ఏతున్' అను పాఠాంతరము చూపఁబడెను. (ఏతున్ = విజృంభించెదను. లేవా, పెచ్చుపెరిఁగెదను). ఈపాఠములే సరియనఁ దగును. ద్రౌపది కామిచే, సింహబలుఁ డాకులతఁ బొందునపుడు భీముని వ్యాపార మును దేనిదేని జెప్పకయే "మంటపము సంక్షోభింపఁజేతును - వాఁడు పిలుపనఁగా నుఱుకుదును" అనుట సందర్భింపనేరదుగదా.

(౨) "కర్ణపర్వము. ౧ ఆ. ౨౯౬ లో "దయసేతువుగాక" అని ఆనందముద్రణ ములో నున్నది. గాని పుట అడుగున 'దయసేసెదవు' అని పాఠాంతరమున్నది." (బాలక. ౮౮ పు). ఇదియొకవచనము - తాళపత్త్ర మాతృకలోనిట "దయసేసెదవు గాక" అనియె యున్నది.

(3) ఉ. నీతి దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం । బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియుఁ గుత్సయుఁ బుట్టు భూజనుల్ । <u>వేఁతురు</u> చేటునేఁతలు ఫలిం పక తక్కిన మున్న వచ్చు న । త్యాతురతాస్పదంబులగు నాపద లిద్ధవివేకవైభవా (సౌప్తి. ౧ ఆ, 3౫ వావిళ్ళము). నీతినివిడిచి నిద్రాపరవశులఁ జంపఁబోరాదని యశ్వత్థామకుఁ గృపాచార్యుఁడు బోధచేయు సందర్భములోని దీపద్యము. "నీతి దప్పి యెవ్వఁడేని కార్యముచేసినచో నది ఫలించినను లోకనింద గల్గును. జనులును పీడింతురు. ఇంక నట్టిచేటుకార్యము ఫలింపకే పోయినచో మొదటనే యాపదలు గల్గును" అని దీని తాత్పర్యము. ఈపద్యమున 'వేఁతురు' అనుచో 'చేతురె' అను నపపాఠము కనఁబడినట్లును (అక్కారణముననే) నద్దానియర్థము బోధపడనట్లును నీ క్రిందిరీతిని శరణ్యకర్తగారు వ్రాసిరి ".........చేతురె చేటునేతలు ఫలింపక .........అని తాటాకుపుస్తకములో నున్నది. అచ్చులో చేతురుకు బదులుగా వేతురు అనియున్నది. అర్థమేమో ?" (బాలక. ౮౮ పు).

(౪) "౧ ఆ. ౧౬ ప.........తిక్కన నిర్వచనోత్తర రామాయణము. అలతి యలతి తునియల గా । హళగూర్చినట్టు లమరం జేతున్. అని ఒక తాటాకుల

పుస్తకములో ఉన్నది. మఱియొక తాటాకుపుస్తకములో అలతితునియల గా । హాళ సంధించిన విధంబు నమరగ వలయున్ . అని ఉన్నది." (బాలక. ౮౯ పు). పయి సందర్భమునుబట్టి తిక్కనయు "చేతురు" అనురీతిని 'తా'దేశప్రయోగము చేయ లేదనియె గ్రహింపనగును. పయిరీతిని యువర్ణాంత ధాతువుల తాదేశప్రయోగము ప్రాచీన ప్రబంధములలో లేదని శరణ్యకర్తగారి మనస్సాక్షి బోధించుట చేతనే "ఈరూపముగా కొత్తగా భాషలో దూరిన గ్రామ్యము కాదనిన్ని ప్రాచీనులు తరుచుగా వాడిఉండకపోయినా అయిదువందల సంవత్సరములయి నిస్సందేహముగా కవులు వాడుచున్నారనిన్ని రుజువుచేయగలము" (బాలక. ౮౮ పుట). అని వ్రాసిరి. అర్వాచీన కవిప్రయోగములు పెక్కుచూపిరి. (బాలక. ౧౧౧ మొ. ౧౧౧ పుటలు). "ఉ. కొండలు పిండి సేతుమె.........(అచ్చ. రా. ౭౨ పు). ..........చ.........కన్నియ నెన్నఁడు ప్రోడఁ జేతునో (కవికర్ణ. 3 ఆ. ౫౫). .......................సీ. నుతులు సేతు నెపుడు నతులిత.........(కృష్ణరాయవిజయము ౧ ఆ. ౧౦)...............క. ధరలో వినరె యహింసా । పరమో ధర్మ యనియుంచుఁ బ్రాణివధను సే । తురె యకట యజ్ఞవిధియని । యరయఁగ నది యజ్ఞవిధియె యగుఁ జింతింపన్ (దశా. 3౮౫)...............క......... తత్సం । హారణముఁ జేతువు శక్తిన్.........(వరా. ౬ ఆ. ౧౨౮ ప).......... ........."ఇట్లగుటచేఁ బ్రాచీనగ్రాంథికాంధ్రభాషా స్వరూప నిరూపణమె ప్రాయికముగాఁ జేయుచున్న సూరి యిట్టిరూపములను సంగ్రహింపకున్నను ప్రౌఢవ్యాకరణకర్తయేని వీనిని సంగ్రహింపకుండుట యుక్తముకాదు.

దేశ్యక్రియల రూపసాధనమునె నన్నయ యుపేక్షించెను. అథర్వణుఁడు సైతము మిక్కిలి యల్పముగా వివరించి "భాషేయ మమితా తత్ర । దేశ్యాశ్చిత్ర స్వభావయుక్ । తచ్చిత్ర తాను మన్తవ్యా । పూజ్యపాద సుభాషితే......" అనురీతిని సంక్షేపించెను. (3౨౮ వివ). అట్టిస్థితిలో సూరిగారు ప్రాచీన గ్రాంథికాంధ్రభాషలోని పరశ్శతములగు క్రియలరూపములను ప్రయోగసమ్మతముగా సంగ్రహించి చూపిరి. తర్వాత వెలసిన యాంధ్రవ్యాకరణములెల్ల బాలవ్యాకరణ విషయములనె సంగ్రహించికొని యలంతిమార్పులుచేయుచు వేర్వేఱు గ్రంథములను వ్రాసికొనిరి. ఇట్లగుటచేత సూరియెడల నాంధ్రపండితలోకము కృతజ్ఞమై యుండనగునుగాని నిరసింపరాదు. ఇంతయేల నాగయామాత్య చకారములకుఁ గల్గు పత్వ వత్వములను నిరూపించు సందర్భమునఁ బ్రాచీనలాక్షణికులెంత తేల్చివేసిరో తుదికిఁ బెద్దిరాజును నవ్యుఁడగు కూచిమంచి తిమ్మకవియు నెట్లు ప్రాచీనాశయ

ముల గ్రహింపలేక రెట్లు ప్రమాదపడిరో సూరి యెంతసరిగా నిరూపించెనో యురయఁడు.

క. ఉట పరపదములై క్రియలగు చుట లొక్కెడ యుటలు పుటలు చుట్టంబులఁ ద్రో। చుట త్రోయుట యనఁ జుటలున్। బుటలును నగు సంస్కృతంబు పొందినచోటన్ (ఆం. భూ. ౧౪౭ ప). క. పుటచేత నైన నొరుఁ బం। పుట, చుటచే నైన నొరులఁ బుత్తెంచుట, చే। యుట యుటచే నగునని యా। పటుమతియగు నూత్నదండి ప్రకటము సేసెన్ (ఆం భూ. ౧౪౯ ప). ఇట్టి కేతనపద్యముల తాత్పర్య మును సరిగ గ్రహింపక విన్నకోట పెద్దిరా జీక్రిందిరీతిని భ్రామాదికముగ వచించెను. క. కోపింపుట కోపించుట। కావించుట పసుల నొప్పఁ గాపింపుట నా। నే పారు నిట్టిపలుకులు। లోపుగ బహుళములు జగతిలో నెఱుఁగఁదగున్ (కావ్యాలం. ౯ ఉల్లా. ౧౬౬ ప). క. "కావింపుట కావించుట। భావింపుట మఱియు దీని భావించుటనం। గా వెలయుఁ గృతులఁ దుహిన। గ్రావసుతా ప్రాణనాథ ప్రమథసనాథా "కావింపుట సులభమే. కావించుటకు:—ఉ. మంచిగ.........పు। త్తెంచిన.........భ। ఊంచుచు.........యా। రించుచు.........(శ్రీనాథునిహరవి). ఉ. చంచలనేత్ర.........వీ। ఊంచఁగఁ 'దోఁచు లేనగవు.........(ఆముక్త). శా.........దువా। ళించక బచ్చన వ్రాఁత లూడిపడు.........। చంచద్వాహ ములు.........(కాళమాని. బహుళాశ్వ). ఉ.........వంచనఁ జేసి......... ధూళిగా। వించఁడె పిండిపిండిగను.........కిరీటరత్నముల్। దంచఁడె ఘోర సీర ముసలంబులు.........(విజయవిలాసము) మత్తకోకిల. పంచసాయక...... కూడి వ। త్రించరాదని.........(రుక్మాంగద)" (సర్వలక్ష. ౧ ఆ. ౨౦౫ పొ. ౨౧౨ ప). విన్నకోట పెద్దిరాజువాడిన - కోపింపుట - కాపింపుట' అనునవియుఁ దిమ్మకవి వాడిన 'కావింపుట - భావింపుట' అనునవియుఁ గేవలము నపశబ్దములు. భావార్థక టవర్ణక పరకత్వమున నించు క్చుక్కుల చకారమునకు 'ప'త్వము కవిసమ్మత మనుట సరికాదు.

| | |
|---|---|
| | అగు - వచ్చు - చొచ్చు - చూచులకు ముత్తు పరం |
| బాలవ్యాకరణ | బగునపుడు. కా - రా - చొరు - చూడు లగు. ౯౧. |
| వివరణము. | అగు - కాఁడు - కమ్ము. వచ్చు - రాఁడు - రమ్ము. |
| 333 విషయము. | చొచ్చు - చొరఁడు - చొరుము. చూచు-చూడఁడు- |
| | చూడుము. |

సంజీవని. 333 విష:—ముజ్జీత్తులు పరంబగునపుడు 'అగు' ప్రభృతులకు వరుసగా 'కా' ప్రభృతు లాదేశములగునని యర్థము. "యథాసంఖ్య మను దేశః సమా

నామ్ (౧-౩ ౧౦) (సి. కౌ. ౧౨౮ సూ)." అను సూత్రము నుపదేశించిన కారణ మున ద్వంద్వగత పదార్థముల సాహిత్యము నుపేక్షించి క్రమాన్వయమును గ్రహింప వలయును. కావున ముత్తుపరంబగునపుడు 'అగు' ధాతువునకు 'కా'దేశమును, వచ్చుధాతువునకు 'రా'దేశమును, 'చొచ్చు' ధాతువునకు 'చొరు' అనునాదేశ మును 'చూచు' ధాతువునకు 'చూడు' అను నాదేశమును నిత్యముగా నగునను నర్థము లభించుచున్నది. బా. క్రి. ౮౮ సూత్రముచొప్పున 'వచ్చు - చొచ్చు ధాతువులు ద్విరుక్త సహజ చకారఘటితము లగుటంజేసి వాని చకారమునకు వత్వము రానేరదు. మఱియు వచ్చునకు రాదేశము కవిసమ్మతమై యున్నది. చూచుధాతువునకు వత్వము కవిప్రయోగ సమ్మతముకాదు. డత్వము సమ్మతముః కానఁ బయి రీతిని 'కారా' - దేశాదులు విధింపఁబడెను. ఇట్లె ముం దింకను గొన్ని ముత్పరక విశేషవిధు లుపదేశింపఁబడును. ఇచ్చునకు 'ఈ' (౯౨ సూ) తెచ్చు నకు 'తే-తేరు'లు, (౯౩ సూ) చచ్చు - నొచ్చులకు 'చావు - నోవులు' (౯౪ సూ) విధింపఁబడును. ప్రకృతసూత్రమున నుదాహృతులు:—అగు+లజ్ (బా. క్రి. ౭ సూ). = అగు+డుజ్ = కా+ఁడు = కాఁడు. లజ్ జిత్తు గాన దాని యాదేశములగు డుజాదులు ముత్తు లగుచున్నవి. డుజ్జు జిత్తుగాన బిందుపూర్వక మగుచున్నది. దీర్ఘమువిూఁదిది గానఁ బూర్ణము లేదు. అగు+లూట్ = (బా. క్రి. ౬ సూ) అగు+ ము = (బా. క్రి. ౨౯ సూ. చొప్పున ము డుజ్జు లగును) కా+ము = (బా. క్రి. ౮౬ సూ. ముజ్జు ము త్తగుచున్నది.) క+మ్ము=(బా. క్రి. ౬౧ సూ.) కమ్ము. అగు+ డుజ్ = కా+ఁడు = క+ండు = కండు. (బా. క్రి. ౬౨ సూత్రముచొప్పున లూణ్మ ధ్యమ డుజ్జు పరమగునపుడు 'కా' అనుదానికి హ్రస్వము రాఁగా నుడి తొలి హ్రస్వము విూఁదిదగుటచే బా. సంధి. ౨౨సూ. చొప్పున ఖండము నిల్వక పూర్ణము నిల్చెను). ఇట్టి వచ్చునకు రాదేశాదుల ప్రక్రియ నరయునది. రాఁడు - రండు. చొచ్చు+లజ్ = చొరు+డుజ్ = చొరు+అ+ఁడు=(బా. క్రి. ౨౦ సూ.) చొరఁడు. చొచ్చు+ము = చొరుము. చొచ్చు+డుజ్ (లూణ్మధ్యమడుజ్) చొరుఁడు. ఇట్లె చూచుధాతునకు చూడు మున్నగు నాదేశాదుల ప్రక్రియ నరయునది. చూడఁడు- చూడుము - చూడుఁడు. ఈ 'చూడుము - చూడుఁడు' అను లూణ్మధ్యమ శబ్ద ముల రూపాంతరములె (౩౦౮ II విష. చూచునది) యగు "చుమ్ము - చూవిూ - చూ - చూవె - చువ్వె - చుండు - చుఁడీ - చూఁరె" అనునవియును గవి ప్రయుక్తము లగుచున్నవి. ఇట్లె 'రమ్ము' అనుదానిమూలమున 'రా - ర - రార - రారా' అను రూపము (౩౦౮ III విష. చూచునది) లుప్పతిల్లుచున్నవని యెఱుం

గునది. పయిరీతినె కాదేశాదులు ముత్సంజ్ఞగల ప్రత్యయములెల్లఁ బరమగు నపుడు సంభవించుచుండునని యెఱుంగనగును. ఉదా:—కన్ - కాన్ - రాన్ - చొరన్ - చూడన్ - (నుజ్యంతములు) కాక - కామి - కాని - రాక - రామి - రాని - చొరక - చొరమి - చొరని - చూడక - చూడమి - చూడని - వెం. ప్రయోగములు:— చ.........సంగరము చేతకు సారథి గమ్ము గమ్ము నీ । వను టుచితంబె......... (విరా. ౪ ఆ. 3౫). క. కలనికి రాఁడు నదీసుతు । పలుకులకుం గనలి......... (ద్రోణ. ౧ ఆ. ౨౦). (రాఁడు = రాలేదు). చ.........నీవనికిఁ బోయిన నద్దె స రాను.........(ద్రోణ. ౧ ఆ. ౨౨). ఉ. వాఁడి మయూఖముల్ గలుగువాఁడు .........కచుండు నేనియున్ । రాఁడు వనంబులోన.........(ఆది. 3 ఆ. ౧౧౨). (ప్రాసగతము). క.........శుకచం । చు విలూనముగాక యొక్క చూతఫలంబు .........(సభా. ౧ ఆ. ౧౪3). క......... । ఘనతరతనుదీప్తు లొప్పఁగా వచ్చి వడిన్ (సభా. ౧ ఆ. ౨౧౭) (యతిస్థానగతము). క......... । కావున రావల వ దింకఁ గార్యార్థినివై (అర. ౨ ఆ. ౨౦౧). తే. కానినాఁ డిట్టికాంతి యే కాంత లందు (సభా. ౨ ఆ. ౧౬౦). తే-గీ......... । చులుక నద్వారమునఁ బ్రోలు చొరఁగ నగునె (సభా. ౧ ఆ. ౧౭౨). క.........నీకుఁ దగునె నరునిం । జొర నిచ్చితయేని వారిఁ జొరనీ వనఘా (ద్రోణ. ౪ ఆ. ౧౬3). క. అక్కొడుకు నబ్జ నాభుం । డక్కజముగ నెత్తికొనుఁడు నందఱు జూడన్ (సభా. ౨ ఆ. ౫౭). చ.........సాత్వతిఁ దన మేనయత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి......... (సభా. ౨ ఆ. ౫౫). శా. చూడం బోదు గజాననీత కటఖర్జూ భూర్జఖర్జూర లీ । లా డోలా.........(ఉ. హరి. ౨ అ. ౭౯ ప్రాసగతము). శా. ఓరీ దానవధూర్త నీదు వచనోద్యోగంబు లెల్లఁగ రా । రారా యింకిట నేమి సేసెదవురా (ఉ. హరి. ౬ ఆ. ౨౧౦). ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టితి (ద్రోణ. ౪ ఆ. ౨౭౭). "బ్ర-శ్రీ. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులవారు తమ క్రొత్తభారతములో......... చొరి - చొరినన్ - చొరిన - చొచ్చితిని (బండితాసుండీ) మొదలయిన వింత విచిత్ర రూపములు కల్పించి తమ భారతములో వాడినారు - చూడండి:—......... ...............ఉ.. ...... । పోటరు లెల్లరుం జొఱఁగఁ బోలినచోటిది గాని పిల్వఁగా । నేటికిఁ బోటరిం జొచ్చితి నే నిది ధర్మవు కాదె చూడఁగన్ (శ్రీకృష్ణభార. ౭ ఆ. ౭౨ ప). సీ. హారుఁడను నోరి యీగిరి గహ్వరము తెచ్చి; చొరి రమ్ము నాహరి చొచ్చియందు (౯ ఆ. ౨౭౨) .....................ఇట్లు పెక్కుస్థలములు చూపఁబడెను" (బాలక. ౭౧ పు). నేఁటి మహాకవులు - కవిసార్వభౌములు - కళా ప్రపూర్ణులు నిట్లు ప్రయోగించుట వింత!.

ఇచ్చునకు సర్వంబున కీయగు. ౯౨.

బాలవ్యా. 338 విషయము

ఇచ్చు - ఈఁడు - ఇమ్ము. ఈయ యను నాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి ; బలిమి నీయని భూమి వలయపతుల.

సంజీవని. 338 విషః—సర్వంబునకు - ఇచ్చునకు = ఇచ్చుధాతువున కంతటికిని, 'ఈ'యగు = ఈయను నాదేశంబు నిత్యముగా ముత్తు పరంబగునపు డగునని యర్థము. ఇచ్చు+లజీ = ఈ+డుజ్ = ఈఁడు. ఇచ్చు+ము (ముజ్జు లోనిది)=ఈ+ము = ఇమ్ము (బా. క్రి. ౬౧ సూ). ఇచ్చు+డుజ్ (ముజ్జులోనిది) = ఈ+ఁడు = ఇండు. (బా. క్రి. ౬౧ సూ. సంధి. ౨౨ సూ. చొప్పున ఖండబిందు పూర్వకత్వము లేదు). సీ........ బలిమి నీయని భూమివలయపతుల (ఆది. ౧ ఆ. ౭ ప). అను భట్టారక ప్రయోగము చొప్పున 'ఇచ్చు' ధాతువునకు జిత్పరకత్వమున "ఈయ" అను నాదేశమును జూపట్టుచున్నది. ఇచ్చు+నిజీ = (బా. క్రి. ४౭ సూ) ఈయని. 'ఈని' అనునది యెట్లును సిద్ధించునని యెఱుంగునది. ఊ యేలాదు లాకృతిగణం బగుటచేత నందు (బా ప్రకీ. ౬ సూ) 'ఈయ' అనుదానిని జేర్చి 'య' అనుదానికి ద్విత్వము చేసి, బా. అచ్చి. ౧3 సూత్రముచొప్పున 'ఈ' అనుదానికి హ్రస్వముచేయఁగా "ఇయ్య" అను రూపము సిద్ధించును. కావున - ఇయ్యెఁడు = ఈయఁడు = ఈఁడు, ఇయ్యని = ఈయని = ఈని, ఇయ్యక = ఈయక = ఈక, ఇయ్యమి = ఈయమి = ఈమి, ముజ్జు పరమగునపు డిట్టి యాదేశము చూపట్టలేదు. కాన "ఈయుము - ఇయ్యుము, ఈయఁడు - ఇయ్యఁడు" అను ప్రార్థనాద్యర్థక లోడ్రూపములు సాధువులు కానేరవు. 'ఇమ్ము - ఇండు' అని మాత్రమె ప్రార్థనాద్యర్థక లోడ్రూపములు గలుగునని యెఱుంగునది. జిత్పరకత్వమున 'ఈయ' అను నాదేశము గల్గునటం జేసి యట్ట "ఈయము = ఇయ్యము, ఈయఁడు = ఇయ్యఁడు" అనునవి వ్యతిరేకార్థక లజీరూపములన్నచో సమ్మతములె యగును. జిత్తు పరమగునపు డనుటచే "ఈయకుము - ఇయ్యకుము - ఈయకుఁడు - ఇయ్యకుఁడు" అను వ్యతిరేక ప్రార్థనాద్యర్థక రూపములు (బా. క్రి. 3౨ సూ) గల్గవచ్చును. భట్టారక ప్రయుక్తమగు 'ఈయని' అనుదానినిబట్టి యిట్లు సువిస్తరముగ వ్యాఖ్యచేయఁబడెనుగాని యట్టి ప్రయోగాంతరములు ప్రాచీన మహాకవుల గ్రంథములందు లభింపలేదు. కావుననే కదా సూరి "ఒకానొకచో" అని వచించినవాఁ డయ్యెను. "ఇట్లే ముత్తుపరంబగునపు డంతటను "ఈ" అనునది సర్వాదేశ మగుట యూహ్యము. "ఈయ" అను నాదేశము ముత్తుసంజ్ఞ గలిగిన యెల్లస్థలములం బ్రసక్తముగామి నొకానొకచో నని

వ్యాకర్త వివరించుట గలిగెనని గ్రహించునది" (బా. సా. పే. ౪౬౧ పు). అంతటను సర్వాదేశ మగుట యూహ్యమననేల ? అనుపదమందే "ఎల్లస్థలములం బ్రసక్తముగామి" అని వ్రాయనేల ?

"ఇయ్య = ఈయ. ఇయ్యఁగలఁడు - ఇయ్యఁడు - ఇయ్యక - ఇయ్యన్ - మొ. ఉ.........ఏనుఁగునిచ్చి యంకుశం । బియ్యక కయ్య మాడఁ దగునే నను నీగతి నేఁచఁ బాడియే (శశిబిందుచరిత్రము). క. ఇయ్యఁగ నిప్పింపంగల । యయ్యలకేకాక మీాస మందఱకేలా ? (కవి చౌ. శ. ౧౮)." (సూ. రా. ని). "ఈయ = ఈ (ప్రార్థనాద్యర్థమందు మాత్రమే 'ఈయ' అను నాదేశమురాదు.) ఉదా:— ఈయఁగలఁడు - ఈయఁడు - ఈయని - ఈయక - ఈయన్ - మొ. సీ. బలిమి నీయని భూమి వలయపతుల (భార. ఆది. ౧ ఆ. ౭). క.........ఈయక. (శుక. ౫ ఆ. ౨౩౨). మ.........ఈయఁగ.........(ఇందు. ౩ ఆ. ౧౪)." (సూ. రా. ని). "ఇచ్చు. స. క్రి.........గీ. చెలువునకు నియ్యఁగోరు న చ్చిగురుఁబోఁడి (దశా. ౩ ఆ. ౧౭).........గీ. నిన్నుఁజూచు నహల్యకు నెనరు లేదె । హృదయమియ్యదు పతి భీతి నింతెకాక. (దశా. ౭ ఆ. ౧-౧౦౮)." (సూ. రా. ని). ఇట్టి యర్వాచీన కవిప్రయోగములు పెక్కు వెలయుచున్నవి కాని 'ఈయ - ఇయ్య' అనువానికిఁ బయి నన్నయప్రయోగముతప్పఁ బ్రాచీన మహాకవి ప్రయోగాంతరము లభింపలేదు. 'ఇట్లె 'ఈవుతన్' అనునది "ఇచ్చు"ధాతువు నాశీరర్థక లూడ్రూపముగఁ జేర్కొనఁబడుచున్నది "ఈవుత. ద్రు. ఇచ్చుధాతువుయొక్క ఆశీరర్థక రూపము. 'ఇచ్చుతన్' అనుదానికి రూపాంతరము. చ.........సరస్వతీశ్వరుఁడు దారత మాకుఁ జిరాయు వీవుతన్ (ఉ. రా. ౧ ఆ. ౫)." (సూ. రా. ని). ఇందు 'ఇచ్చుతన్' అనియె కవిప్రయుక్తమేమొం ? 'ఈవుతన్' అనుచోటి వుకారమును నిర్వహించు ప్రాసాదిఘటిత ప్రాచీన మహాకవి ప్రయోగము లభింపలేదు. "ఈవి = త్యాగము" అను కృదంతరూపము కన్పట్టుచున్నది.

గాణపత వివరణకర్త "ఇచ్చునకు - ఇయ్య - ఈయ - ఇవ్వ అనియు రూపంబులు గానంబడియెడి." (గాణ. క్రియా. ౩౩౭ సూ. వ్యాఖ్య). అని వ్రాసి యీ క్రింది ప్రయోగములను జూపెను. "దేవర వివరంబు తెరువరి, తలవరి యెవ్వారు నివ్వారు నవ్వారనఁగ. (అప్ప. ౨ ఆ. ౧౯౬ రేఫాక్షర సీసమాల) 'దాన మివ్వారు' అని వివరణములో నుండుటచేఁ గావలయు గాణపత వివరణకర్త దీని నిచ్చు ధాతురూపముగా విశ్వసించెను. కాని కొన్నిప్రతులలో 'నొవ్వారు' అనియున్నది. ఆ ప్రతులలో 'దానము' అనునదిలేదు. కాన నిది యప్పకవి సమ్మతించె ననుటకు బలముగు

నుదాహృతి కాదు. ఇవ్వఁ డవ్వల నీకనేమి అవ్వపలుక (రంగరా. ౭). ఇది ప్రామాణికకవి ప్రయోగముకాదు. ద్వివనరాశి త్రోవయివ్వక క్రొవ్వుటయును (రంగ. రా. బాల. ౮ పారట). ఈపద్యపాదము వావిళ్ళవారి ముద్రణమునఁ గలదు. యూనివర్సిటీ ముద్రణమున నిది చూపఁబడలేదు. రంగనాథరామాయణ కవి ప్రయోగించిన వ్యావహారిక శబ్దములలో నిది యొకటి యని యీవఱకు వ్రాయఁబడెను. (చూ. విస్తర. III, ౬౩. III విష). మఱియు 'ఇవ్వక - ఇవ్వని - ఇవ్వరు' మున్నగు వకార ఘటిత ప్రయోగములు మఱియే ప్రామాణికకవి గ్రంథములందును లభింపలేదు.

'ఈ' అనునాదేశమునకుఁ బ్రయోగములు:—గీ. ఇమ్ము నీ హోమధేనువు నెమ్మితోడ (ఆది. ౨ ఆ. ౧౦౧). (ప్రాసగతము). క. కరుణించి యిందు నాకుం। బురోహితునిగాఁగ.........(ఆది. ౧ ఆ. ౮౮). సీ.........కూఁతులఁ గన్న ఫలము దగిన। వరులకు సద్ధర్మచరితుల కీ గాన్పకాదె.........(ఆది. ౨ ఆ. ౮౨ ప). తే-గీ. ఈతఁడొడ్డిన ధనరాసు లెవ్వియైనఁ। బోఁడిగా నీకు నీఁగలవాఁడ నేను (సభా. ౭ ఆ. ౧౨౪). క. అని పలుకుచున్న నృపనఁదనునకు మఱుమాట యీక తామరస నిభా। నన.........(ఆది. ౨ ఆ. ౨౨ ప). ఆ-వె. ఎఱిఁగి యెఱిఁగి దీని నెట్లీఁగ నగు......... । ఈనినాఁడు శాప మిచ్చు.. ......(అర. ౭ ఆ. ౩౩౦. ఉ.........తండ్రి పా। లీరని తెంపుసేసి పఱి నెత్తిన నెత్తిరిగాక ద్రోహమే. (ఉద్యో. ౧ ఆ. ౩౪౧). ఈను - ఈవు మున్నగుచోట్ల బా. తత్స. ౭౬ సూత్రము చొప్పున రావలసిన 'ఇ'త్వము బా. తత్స. ౭౨ సూత్రముచే వారింపఁబడును. కాన 'ఈని - ఈవి' అని కానేరవు. కం. దేవా.........ఉవే భక్తపరతంత్ర యేర్పడఁ గరుణన్ (శాంతి. ౪ ఆ. ౭౧౦). మ. .........ననుఁగానీ శంభుఁగానీ రమే। శ్వరుఁగానీ గుఱియించి యివ్వరఁట (కాశీ-౭ ఆ. ౮ ప). 'కానిమ్ము' అను దానిలోని ప్రార్థనాద్యర్థక మధ్యమ పురుషైకవచన ప్రత్యయమగు 'ము' అనునది బా. సంధి. ౪౨ సూత్రముచొప్పున లోపించునపుడు ముపర్ణక నిమిత్తకములైవచ్చిన మూము డియుఁ బూర్వస్వర హ్రస్వతయుఁ (బా. క్రి. ౬౧ సూ. చూ) బోఁగా 'ఈ' అనునది నిల్చుటచే 'కానీ' శబ్ద మేర్పడును (చూ. ప్రౌఢ. సంధి. ౭౩ సూ). కాన్+ ఇచ్చు+ము = కాన్+ఈ+ము = కానిమ్ము. వీనిమూలమున 'కాని' అనునది జనించెననియు నందలి దీర్ఘము హ్రస్వమగుటకు విధానము లేమింజేసి యది (కాని) యవ్యయ మనఁబడుచున్నదనియు దానిమూలరూపమగు కానీశబ్దమును నవ్యయమె యనఁదగు ననియుఁ గోశకర్తలు వ్రాయుచున్నారు. "కానీ. అవ్య. (√ అగు - కాన్+ఈ. ఇది ప్రార్థనాద్యర్థక క్రియయైనను క్రమము గా అవ్యయముగా మాఱినది.) ౧. కానిమ్ము

(అంగీకారమును దెలుపును)......... ౨ కాని. వికల్పమును తెలుపును......"
(సూ. రా. ని) వికల్పము, అంగీకారము మున్నగు నర్థములను దెల్పుటచేత సంమ
తము వీనిని గోశకారు లవ్యయములని తలంచిరి.

బాలవ్యా తే తేరులు తెచ్చున కగు. ౯౩.

౩౩౫ విష. తెచ్చు - తేఁడు - తేరఁడు - తెమ్ము - తేరుము.

సంజీవని. ౩౩౫ విష:—తెచ్చుధాతువునకు ముత్తుపరమగునపుడు 'తే-తేరు' అనునవి నిత్యముగా నాదేశము లగును. ఉదా:—తెచ్చు+లజీ = తెచ్చు+డుజ్ = తేరు+ఁడు = తేరఁడు (బా. క్రి. ౨౦ సూ. చెప్పున 'ఉ' త్త్వమునకు 'అ' త్త్వము). తెచ్చు+లజీ = తెచ్చు+డుజ్ = తే+ఁడు = తేఁడు. తెచ్చు+లూట్ = తెచ్చు+ము = తే+ము = తెమ్ము (బా. క్రి. ౬౧ సూత్రముచెప్పున హ్రస్వద్విత్వములు). తెచ్చు+లూట్ = తెచ్చు+ము = తేరు+ము = తేరుము. 'తెమ్ము' అనుచో బా. సంధి. ౪౭ సూత్రముచెప్పున 'ము' లోపము గల్గుపక్షమున 'తే' అను రూపాంతర మేర్పడును. ఇట్లె తెచ్చు+లూట్ = తెచ్చు+డుజ్ = తే+ండు = తెండు (బాల. క్రి. ౬౧ సూత్రముచెప్పున హ్రస్వము రాఁగా నుడి తొలి హ్రస్వముమీఁద నరసున్న నిల్చదు) (బా. సంధి. ౨౨ సూ). తెచ్చు+లూట్ = తేరు+డుజ్ = తేరుఁడు = తేరుండు - ఇట్లె, తేన్ - తేఁరన్ - తేఁగలఁడు - తేరఁగలఁడు. తేఁబడెన్ - తేరఁబడెన్ - తే వలయున్ - తేరవలయున్ - తేరక = తేక - తేరమి = తేమి. తేరనివాఁడు = తేని వాఁడు - మొ.

ప్రయోగములు:—క. కావున మృతసంజీవనిఁ । దేవలయున్ శుక్రువలన ధృతి వడసి.........(ఆది. ౨ ఆ. ౧౦౫). తే-గీ.........గంగఁ । దేరఁ గడఁగె వీరుండు భగీరథుండు. (అర. ౩ ఆ. ౭౬). ఉ. సారథిఁ జూచి నీవు రథసంబునఁ బూన్పుము ఘోటకంబులం । దేరఁ దదీయ వర్మము లతిస్ఫుటబంధము గాఁగఁ బెట్టు .........(విరా. ౩ ఆ. ౧౪౪). క.........జపవిధి । నాచెప్పిన సుఖము తేదు నరకముఁ దెచ్చున్ (శాంతి. ౪ ఆ. ౧౩౧). క. తేరక యుండఁగఁ జేరున్ । దేరంగాఁ బోలియు విధి యధీనంబులు గా । కారయ విత్తంబులు.........(శాంతి. ౪ ఆ. ౩౭౩).

బాలవ్యా. చావు నోవులు చచ్చు నొచ్చుల కగు. ౯౪.

౩౩౬ విష. చచ్చు - చావఁడు - చావుము. నొచ్చు - నోవఁడు నోవుము. వక్ష్యమాణంబు ద్విత్వంబు - నొవ్వఁడు. జిత్తు పరంబగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు, ౯౫.

చాక - చావక. చాకుము - చావకుము. నోక -
నోవక. నోకుము - నోవకుము.

సంజీవని. 33౬ విష:—౯౮ సూ. వ్యాఖ్య:—ముత్తు పరంబగునపుడు, చచ్చు ధాతువునకు 'చావు' అనియు, నొచ్చుధాతువునకు 'నోవు' అనియు నాదేశములగు నని యర్థము. బా. క్రి. ౮౮ సూత్రముచొప్పున వీని ద్విరుక్త చకారమునకు వత్వము రాదు. ఇంక 'చచ్చన్ - నొచ్చన్' మున్నగు సనిష్టరూపము లుప్పతిల్ల వలసి యుండఁగాఁ బయిరీతిని మహాకవి ప్రయోగసమ్మతరూపములు సిద్ధించునట్లు సూరిచే సూత్రింపఁబడెను. ఇట్లె గతసూత్రములందును విశేషవిధు లుపదేశింపఁ బడెనని యెఱుంగునది. ఉదా:—చచ్చు+లజి = చావు+డుజ్ = చావు+అ+ఁడు = (లజి జిత్తుగాన 'ఉ'త్వమునకు 'అ'త్వము వచ్చెను) చావఁడు. చచ్చు+లూట్ = చచ్చు+ము = చావుము. ఇట్లె నొచ్చు ధాతురూపములగు 'నోవఁడు - నోవుము' అను రూపముల సాధింపనగును. వక్ష్యమాణంబు ద్విత్వం బనఁగా; బా. ప్రకీ. ౬ సూత్రముచొప్పున 'నోవు' అనునది "ఊయేలా"దులలోఁ బరింపఁబడుటంజేసి హ్రస్వ ద్విత్వములు కల్గఁగా నోవఁడు = నొవ్వఁడు. నోవక = నొవ్వక. మున్నగురూపములు సిద్ధించునని తాత్పర్యము. ఉదా:—చ.........మేనమఱంది పొత్తుఁ జా। వవికుతె వంతపెంపున నవారణ నీయెదురన్.........(అశ్వ. 3 ఆ. ౧౭౭), క. సేవకులరైన దానికి। నోవకుఁడీ విూరు లఘుమనోవృత్తులరై (ఉద్యో.౧ ఆ. ౨౦౮ ప). తే-గీ. నొవ్వఁ బలుకుదు సభలోనఁ జివ్వ। కొల్ల కేను గురుపతిఁ జూచి సహించి పోదు (ఉద్యో. ౪ ఆ. ౨3౮). 'నొచ్చు' అనునర్థముగల "నోయు" ధాతువును గలదు. క. ఆయాసపడుట కనుఁగొని। నోయుదు నను బాసి యిటు పనుట తగ వగునే (శాంతి. 3 ఆ. 33౦). సీ. క్రొవ్విన తొవకంబుఁ గోమలంబగు మోముఁ రేయెండ ముట్టిన నోయుఁ దద్ద (నన్ని. కు. ౬ ఆ. ౬3౦).

౯౯ సూ. వ్యా:—చచ్చు - నొచ్చుల కాదేశములగు చావు - నోవుల వువర్ణము జిత్పరకత్వమున వైకల్పికముగ లోపించునని యర్థము. జిత్తు పరముగు నపు డనుటచేత వువర్ణలోపము ముజ్జు పరముగునపుడు కలుగదని తాత్పర్యము. ఉదా:—చాక = చావక. నోక = నోవక. ముజ్జు పరమైయున్నను వ్యతిరేక ప్రార్థనమున వచ్చు 'కుజి' నడుమ నిల్చునపుడు కుజి జిత్తుగాన 'వు'వర్ణలోపము కల్గునని విశదపఱుచుచు సూరి 'చాకుము - చావకుము. నోకుము = నోవకుము' అని యుదాహరించెను. ఉదా:—క. నాలుగుదిశలం దావ। జ్వాలావలి గవిసె గ్రుంది చా నోప మహీ। పాలక.........(అర. ౨ ఆ. ౧౨౭). క. చాకుండ మున్న యొక్క

పరి । నా కాతనితోఁడ భండనము లేదయ్యెన్ (విరా. 3 ఆ. ౧౧౯). స్రగ్ధర......
చా । కుండం బోఁకుండఁ గౌరవ్యులకు వశ మె బిట్టుల్కి మూర్ఛిల్లకుండన్. (ఉద్యో.
౧ ఆ. 3౨3). క.........ఉదాహరణమునం । జా నేర్పువాని చనియెడు । మానిత
గతి.........(స్త్రీ. ౧ ఆ. ౧౧౧). క. నో నేసి సూతు హయ సం । తానముఁ జంపు
టయు.........(భీష్మ. ౨ ఆ. ౧౯౦). ఉ. ఆ యబలాలలాను భవదాస్యము
వేడుకతోఁడఁ జూచి పు । ష్పాయుధుచేత నోఁ బడియె......(దశమ. ౧౦ ఆ. ౪౨
ప. సూ. రా. ని). (నోఁబడియెన్ = నొప్పి ననుభవించె). ఈప్రయోగమంత
యుక్తముగా నగపడదు. నోన్ = నొచ్చువట్లుగా, పడియెఁ = బాధపడెనని కాని
నొచ్చుటపడియెనని కాని యెట్లైటో సమర్థించుకొనవలెను.

అగున కను కనులకు ముజ్జీత్తులు పరంబులగునపుడు
కా నా కానలు విభాషనగు. ౯౬.

బాలవ్యా. అపదాద్య సూత్రముచే గాకు వకారంబు. వక్ష్య
33౭ విష. మాణం బొత్వంబు. కమ్ము - అగుము - అవుము -
ఔము. కండు - అగుఁడు - అవుఁడు - ఔఁడు.
నాఁడు - అనఁడు - కానఁడు - కనఁడు.

సంజీవని. 33౭ విష:—యథా సంఖ్యాన్వయము చొప్పున నీసూత్రము
మూఁడు వాక్యములుగాఁ జేసికొననగును. ౧:—అగు ధాతువునకు ముజ్జు పరం
బగునపుడు కాదేశము విభాషనగును. బా. క్రి. ౯౧ సూత్రముచే ముత్పరకత్వ
మున 'కా' దేశము నిత్య మగుచుండఁగా ముత్తులోనిదగు ముజ్జు పరమగునపు డవి
విభాష నగునని, నిత్యప్రాప్తికి వైభాషికత్వము దీనిచే విధింపఁబడెనని యెఱుంగునది.
౨:—అను ధాతువునకు జీత్తుపరంబగునపుడు 'నా' అనునాదేశము విభాష నగు
ననునది రెండవవాక్యము. ఇయ్యది యప్రాప్తవిభాష. 3:—కను ధాతువునకు జీత్తు
పరంబగునపుడు 'కాన' అను నాదేశము విభాష నగు ననునది మూఁడవవాక్యము.
ఇదియు నప్రాప్తవిభాషయె. పై సందర్భమునుబట్టి 'అగు' ధాతువునకు జీత్తు పర
మగునపుడు బా. క్రి. ౯౧ సూత్రముచొప్పునఁ కాదేశము నిత్యమనియు, 'అను'
ధాతువునకును, 'కను' ధాతువునకును ముజ్జు పరంబగునపుడు 'నా - కాన' అను
నాదేశములు గల్గనేరవనియు విశదమగుచున్నది. ఈసూత్రమును సరిగా గ్రహింపఁ
జాలక హారికారి కావళీకర్త దీనిని గీర్వాణించుటలో నీక్రిందిరీతిని బ్రమాదపడెను.
"ము త్యగో రను కన్యోశ్చ । కా - నా - కానా భవన్తి వా" (హారి. క్రియా. ౪౯
కారి). ప్రకృత బాలవ్యాకరణ సూత్రములోని 'ముజ్జీత్తులు పరంబగునపుడు' అనునది

సూరి వ్యర్థముగా విభజించి వచించెననియు, ముజ్జిత్తులకు ముత్సంజ్ఞ గలదు గాన ముజ్జిత్తు లనుచో 'ముత్తు' అని చెప్పుట యుక్తమనియుఁ దలంచి హారికారికావళీకర్త యిట్లుగ నపార్థము చేసికొనెను. ఇట్టి ప్రామాదిక భాషాంతరీ కరణముచేత 'అగు' ధాతువునకు జిత్తు పరమగునపుడు సైతము కాదేశము వైకల్పికముగానే యగు నినియు 'అను - కను'లకు, 'నా - కాన' అనునవి ముజ్జు పరమగునపుడుసైతము వైకల్పికముగా నాదేశము లగుననియు నపార్థము లుప్పతిల్లుచున్నవి. ఇట్లగుటచేత "వచ్యోః స్యాచ్చో రగో శ్చోచోః । ర స్యాదుః కా చ్చోరు ర్మతి" (హారి. క్రియా. 3౦ కా). అను కారికలోని 'అగోః - కా - ముతి' అనుచోప్పున 'అగునకు ముత్పర కత్వమున 'కా'దేశము నిత్యమనియుఁ బ్రకృతసూత్రముచొప్పున 'అగునకు ముత్పర కత్వమున 'కా'దేశము వికల్పమనియు నున్నత్త వచనములవలెఁ బరస్పర విరుద్ధార్థక విధానము లుప్పతిల్లుచున్నవి. అట్లె హారికారికాపక్షమున 'అగన్ - అవన్ - అగఁడు - అవఁడు' అను ననిష్టరూపములును "నమ్ము - నందు, కానము, కానఁడు" అను లూణ్మధ్యమ పురుషమునందలి యనిష్టరూపములును దుర్వారములగు చున్నవి.

ప్రకృతసూత్రమునకు సూరిగారు వివక్షించిన మూఁడువాక్యముల విధుల కును నుదాహరణంబులు:—అగు+లూట్ = కా+ము = కమ్ము. (చూ. బా. క్రి. ౯౧ సూ). కాదేశా భావపక్షమున, 'అగుము' అనునది నిల్చును. బా. అచ్చి. ౨౭ సూత్రముచొప్పున (అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు) 'అగుము' అనుదానిలోని గకారమునకు వకారాదేశము కాఁగా 'అవుము' అను పాక్షికరూపమును నేర్పడును. బా. క్రి. ౧౦3 సూత్రము చొప్పున (అచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు) 'అవుము' అనుదానిలోని 'అవు' అను భాగమునకు "ఔ" అనునది యాదేశము కాఁగా 'ఔము' అను రూప మేర్పడుచున్నది. ఈవిషయములనే సూరి "అపదాద్య సూత్రముచే........" అను వాక్యమున వివరించెను. 'అగు+లూట్ = కా+ఁడు = కండు' (బా. క్రి. ౬౧ సూ. చూ) అని యిట్లు లూణ్మధ్యమ పురుష బహు వచనరూపము ప్రకృతసూత్రమున వైభాషికముగుచున్నది. ఇది బా. క్రి. ౯౧ సూత్రముచే నిత్యమయి యుండఁగాఁ బ్రకృతసూత్రముచే వైకల్పికత్వము నొందు చున్నది. కావున 'కండు' అనుదానికి 'అగుఁడు' అనియు రూపాంతర ముండవచ్చు నని విశదమగుచున్నది. 'అగుఁడు' అనుదానికిఁ (బా. అచ్చి. ౨౭ సూ. బా. క్రి. ౧౦3 సూ) పైరీతిని 'అవుఁడు - ఔఁడు' అను రూపాంతరములను గల్గుచున్నవి.

"అను+లజీ = నా+డుజ్ = నాఁడు" అనురీతిని జీత్వరకత్వమున 'అను' ధాతువు నుండి పాక్షికరూపములు ప్రకృతసూత్రముచే లభించును. నాదేశాభావపక్షమున 'అను+లజీ = అను+డుజ్ = అనఁడు' అను రీతిగల రూపములును నిల్చును. ఇట్లే - నాన్ = అనన్, నాఁబడున్ = అనఁబడున్, నాఁగలఁడు = అనఁగలఁడు, నారు = అనరు. మొదలగు జీత్వరకరూపములెల్ల సిద్ధించును. 'కను+లజీ = కాన+డుజ్ = కానఁడు.' అనురీతిని జీత్వరక కనుధాతు పాక్షికరూపము లేర్పడును. కానాదేశాభావపక్షమున "కను+లజీ = కను+డుజ్ = కనఁడు" అనురీతిగల రూపములు సంతతము నిల్చును. అను - కనులకు జీత్వరకత్వమున మాత్రమె 'నా - కానా' దేశములు వైభాషికములుగా విధింపఁబడుటంజేసి ముజ్జు పరమగునపుడు 'నను - నండు - కానను - కానఁడు' మున్నగు ననిష్టరూపములు గల్గనేరవు. ప్రయోగములు:—
తే-గీ.. ......నీవిప్డు నాకు దాసి। వగుము మఱియందు నల్లలేదయ్యె నేని। ... ......(ఆది. ౨ ఆ. ౩౨). క.........। ఉదిత క్రోధుండ వగుమ యొక్కించుక। .........(ఆర. ౧ ఆ. ౨౨౦; సీ.........ఆ వె. .. . . । ఆత్మరూపధరుల రగుఁడని పరిదేవ। నంబు సేసె.........(ఆర. ౨ ఆ. ౫౪). క. జ్ఞానమున మాన యజ్ఞము। నా నయథార్థంబు లివియు.........(ఆర. ౩ ఆ. ౨౨౨). (నాన్ (అనన్)+అయథార్థంబులు). వసంతతి. ఈబాలు నెత్తుకొని యింటికిఁ జన్న నన్నున్। నాబంధు లందఱు మనంబున నేమి నారె (ఆది. ౫ ఆ. ౨౯). (నారె = అనరె. 'అనారె' అనునది యపశబ్దము. ముద్రణ సంస్కర్తృ భ్రాంతికృత ప్రక్షిప్తము). పద్మక. కొడుకుపల్కు విని కూడదు నాక దురాత్ముఁడై। .........(ఆది. ౬ ఆ. ౨౩౦). (నాక = అనక). చ.........ఉత్తరుం। డని నొకరుండు నాకుము బృహన్నల సారథి గాన గెల్చు.........(విరా. ౫ ఆ. ౨౩౫). నాకుము = అనకుము. కుజి జీత్తుగాన 'నా'దేశము వచ్చెనని యెఱుంగునది. క.........ఇది గూ। డదు నార.........(ఉద్యో. ౩ ఆ. ౧౯౦). (నార = అనర = అననేలేదు). క......ధర్మజుఁ। డెమ్మెయివాఁ డొక్కొ నారె యీ యున్నజనుల్ (ద్రోణ. ౪ ఆ. ౧౩౦). (నారె = అనరె). శా. ఓ నారాయణ.........। ఓ నావే భవ బంధముల్ చెఱుపవే.........(ఉ. హరి. ౨ ఆ. ౧౨౯). (నావే = అనవే). ద్వి... .. ......దీనిమాట బొంకు।నా రాదు గాక యే నాఁటఁ బొల్లగునే (బసవ. ౪ ఆ. ౬౦౭). చ.........ధర్మసూతి మె। త్తని పులి యొల్లవారలు నధర్మము నీపయిఁ బెట్టునంతకున్। వినఁడును గానఁడున్ బిదప నీకు నాకు మరల్పవచ్చునే (ఉద్యో. ౨ ఆ. ౧౪). శా. దేవా విన్నప మస్మదీయ మిది యర్థిం బుత్త్రులం గానఁ దో। డ్తో వారిన్ (హరి. ఉ. భా. ౫ ఆ. ౫౭ ప).

బాలవ్యా. నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుం బరం బగునపుడు రుచు లకు లోపంబు బహుళంబుగా నగు. ౯౭.

33ర విష. నేచెను - నేరిచెను. నేచును - నేరుచును. నేరఁడు - నేరువఁడు.

సంజీవని. 33ర విషః—నేరుచు ధాతువునకు లిడ్లాట్టులు పరంబు లగునపుడందలి 'రు'వర్ణము బహుళముగా లోపించుననియు వద్దానికి ముత్తు పరం బగునపుడు దాని తుది 'చు'వర్ణంబునకు లోపంబు బహుళముగా నగుననియు నర్థము. 'చు'వర్ణలోపాభావపక్షమున గెలుచు మున్నగువానికివలెనె ముత్పరకత్వమునందు దీని తుది సిద్ధచకారమునకు 'వ'త్వము కల్గును. బహుళగ్రహణముచే 'నేచుకొను' మున్నగు రూపములు గల్గునని సూరి యాశయము కాఁబోలును. కాని యట్టియెడల 'రు'వర్ణలోపము భారతాది ప్రాచీనగ్రంథములలోఁ గానరాదు. క. నీచేఁ దా గాద్యంతము। నేచుకొనంగలరు .......(వరాహ. ౧౨ ఆ. ౭౭ ప. సూ. రా. ని). ఇట్లె యుండలి లిట్టు భూతార్థక (క్త్వదర్థక) న ప్రత్యయమునకు నుపలక్షణ మనఁదగును. క. కాచికొనివచ్చి తగ నా। నేచిన యట్లచట నచట నిలిపితి ముని నా। ధాచేటును భంగంబును। నైచిత్తము శోకమునకు నగ్గంబయ్యెన్ (మౌస. ౧ ఆ. ౨౧౫). దీనినిజూచి కావలయుఁ గేతన క్త్వార్థక రూపమందును 'రు'వర్ణలోపమును బ్రయోగించెను. ఉ. నేచియు నేర్కుఁడియును ...... । త్రోచు......... (దశకు. 3 ఆ. ౧౪౦). (ప్రాసగతము). నేరుచు+లిట్ = నేచు+డుజ్ = నేచు+ఎను = నేచెను (బా. క్రి ౧౬ సూ). రు లోపాభావపక్షమున 'నేరిచెను' అగును. బా. క్రి. ౧౫ సూత్రముచొప్పున 'రు'వర్ణముమీఁది 'ఉ'కారము 'ఇ'కారమయ్యెను. నేరుచు+లాట్ = నేచు+డుజ్ = నేచు+ను = నేచును (బా. క్రి. ౧౬ సూ). ముత్పరకత్వమునః—నేరుచు+లజి = నేరు+డుజ్ = నేరఁడు (బా. క్రి. ౨౦ సూ. చొప్పున రువర్ణోకార మకార మయ్యెను. చువర్ణలోపాభావపక్షమున 'నేరువఁడు' అగును. నేరుచు+లజి = నేరువు+డుజ్ = నేరువఁడు. బా. క్రి. ౧౮ సూత్రముచే 'చు'వర్ణ చకారము వకార మయ్యెను, బా. క్రి. ౨౦ సూత్రము చొప్పున వకారము మీఁది 'ఉ'కారము 'అ'కారమయ్యెను. ఇట్లె - నేరన్ = నేరువన్ (నుజి) నేరక = నేరువక, నేరమి = నేరువమి - మొదలగురూపములను సాధించుకొనునది. ప్రయోగములుః—సీ. నిలిపెఁ దా నిది పతి నేరమి యే దైవ, వైపరీత్యంబైన వనరఁదగునె (సభా. ౨ ఆ. ౨౨౪). చ.........భారత భారతీ సముద్రముఁ దఱియంగ నీఁదను విధాతృనకైనను నేరఁబోలునే (ఆది. ౧ ఆ. ౧౯). ఉ. నేరక

చేర నొక్కనిన నీటుగఁ జేయు...(శాంతి. ౧ ఆ. ౯౩. ప్రాసగతము). క. ద్యూత
క్రీడకుఁ గొండొక । నేతున్.........(విరా. ౧ ఆ. ౧౯౬). (నేరుచు+దు+ను =
నేచు+దు+ను = నేతున్. బా. క్రి. ౧౦౮ సూత్రముచొప్పున 'చుదు' అనువానికి
'తు'వచ్చును) చువర్ణలోపాభావపక్షమున - నేరుతును - నేరుతురు = నేర్తురు,
మొదలగురూపములు గల్గును. క. నేరిమిమాటలన తీర నేర్తురె చెప్పుమా (ఉద్యో.
౧ ఆ. ౩౪౦). ఇట్లె లిట్టునందు 'రు'వర్ణలోపాభావపక్షమున 'నేరిచెన్ - నేర్చెన్'
మున్నగురూపములు నిల్చును. ఉ......ఈ । పట్టున సేయు మారయుఁగఁ బంచుట
కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్ (ఉద్యో. ౧ ఆ. ౩౪౭).

బాలవ్యాకరణ పోవునకు దుజ్మత్తులు ముజ్ఞుం బరంబులగునపుడు
వివరణము. వులోపంబుం బొద పదలును విభాష నగు. ౯౮.
౩౩౯ విష. పోదురు - పోవుదురు. పోఁడు - పోవఁడు. పోవుము.
పొదము - పదము - పొమ్ము.

సంజీవని. ౩౩౯ విష:—దుక్కు (బా. క్రి. ౨౨ సూ) గాని ముత్తుగాని పరంబగుచోఁ బోవుధాతువుకుడి 'వు'వర్ణము లోపించును. ముజ్ఞు పరంబగునపుడు పైవిధిచొప్పున 'వు'లోపమును, 'పొద' అని కాని 'పద' అని కాని యాదేశమును బర్యాయముగ నగును. దుక్కుపరం బగునపుడు:—పోదురు = పోవుదురు. ప్రథమ పురుషైకవచనమున దుక్కు రాదుగాన వులోపము లేదు. ఉదా:—వాఁడు పోవును. ముత్ప్రత్యయమున:—పోఁడు = పోవఁడు. పోవు+లజ్ = పో+ఁడు = పోఁడు - వులోపాభావపక్షమున బా. క్రి. ౨౦ సూత్రముచొప్పున 'అ'త్వము రాఁగా 'పోవఁడు' అని యేర్పడును. ముజ్ఞు పరమగునపుడు:—పోవు+లూట్ = పోవు + ము = పోవుము, వులోపము గల్గునపుడు బా. క్రి. ౬౧ సూత్రముచొప్పున ముమవర్ణకమునకు ద్విత్వోత్వములు రాఁగా, 'పొమ్ము' అనురూపము సిద్ధించును. పొద పదలాదేశ మగునపుడు 'పొదము - పదము' అనురూపము లేర్పడును. ఇట్లె లూణ్మధ్యము డుజ్ఞు పరమగునపుడును, "పోవుఁడు - పొండు - పదఁడు- పొదఁడు" అను రూపములు సిద్ధించును.

ఇట 'పొదము - పదము' అనువానిని "పోవుము - పొమ్ము" అనువానికిఁ బర్యాయములనుగా నుదాహరించుట సరికాదని ౩౦౬ విషయమున విశదీకరింపఁ బడెను. "పోవుము - పొమ్ము" అనువానికి 'నీవు పోవలె'నని మాత్రమే యర్థము. 'పొదము - పదము' అనువానికి 'నీవుపొమ్ము-నీవెంట, నేనును వత్తును' అని యర్థము, ఉభయకర్తృక ప్రార్థనాదర్థక రూపములు 'పోవుదము' (బా. క్రి. ౩౦ సూ)

అనురూపమందును వులోపము చూపట్టుచున్నది. క. .........। దనుజాల శోధించి చంపుదురు యీరువురమున్ (ఉద్యో. ౩ ఆ. ౨౯౫) ఇట్టివి యుభయ కర్తృక ప్రార్థనాద్యర్థకము లనఁబడును. ఇట్టి క్రియకుఁ గర్త యుభయార్థకమగు 'మనము' శబ్దము. ఇది బహువచనాంతము. 'పొదము - పదము' అనువాని యందును 'అ'త్వము చూపట్టుచున్నను నవిగాని 'పొదఁడు - పదఁడు' అనునవిగాని 'పోవుదము' అనెడి యుభకర్తృక ప్రార్థనాద్యర్థకోత్తమ పురుష బహువచన రూపమునకుఁ బర్యాయములు కానేరవు. 'పదము పొదము' అనునవి మధ్యమ పురుషైకవచనములు 'పదఁడు - పొదఁడు' అనునవి మధ్యమపురుష బహువచనాంతములు. ఇవి యుభయకర్తృకములు కావు. యుష్మత్కర్తృకములు. అందలి అ'త్వముమహిమచే నస్మదర్థ సాహిత్యము వ్యక్తమగుటమాత్రమె విశేషము. పదఁడు - పొదఁడు' అనువాని సామ్యమున 'పోవుదండు - పోదండు - చూతండు.' మున్నగురూపములను సోమనారాధ్య ప్రభృతులు ప్రయోగించిరి. "పొదఁడు - పదఁడు - పోవుదండు - పోదండు" అనువానికి 'పొదము - పదము' అను నేక వచనరూపము లున్నటులు చూతండు - వెదకుదండు మున్నగువాని కేకవచన రూపము లెచ్చట నెవ్వరును బ్రయోగించి యుండలేదు. (చూ. ౩౦౬ విష).

ప్రయోగములు:—క. మేదిని నిలుతురె క్రమమునఁ। బోదరుగా కెల్ల జనులుఁ బోవు తెరువునన్ (ద్రోణ. ౨ ఆ. ౨౯౮). సీ.........ఆ-వె......... ఉగ్రభావ। మేల నీకు వలసె నెటు వోదు నింకెట్లు (అర. ౨ ఆ. ౮౨ ప). చ... మనకున్ ధన మిచ్చునేని ని। మ్ములఁ గొని పోద మిప్పుడని......(అరణ్య. ౨ ఆ. ౩౪౪ ప). క. అతుల తపోవీర్య బలో। న్నతిఁ బోదము గంధమాదనంబునకు... ......(అర. ౩ ఆ. ౨౮౮). చ. జలరుహనాభ రమ్యగిరిసాను వనంబుల వేఁట క. పోవలయు నడ్డపడియెదు। దీవస మెదఁగలిగెనేని (విరా. ౩ ఆ. ౧౩౪). క......నీ విమ్మాట లుడిగి పొదపొ దమునికిన్ (కర్ణ-౨ ఆ ౪౮). క. పదపదఁడంచు దిశలు గ్ర। క్కదలఁగ నిర్వ. ౬ ఆ. ౯౨).

దుక్కు పరమగునప్పటివలెనె తివర్ణకము పరమగునపుడును 'పోవు' ధాతువు తుది 'వు'వర్ణమునకుఁ బాక్షికలోపము నర్వాచీనకవులు ప్రయోగించిరి "మ. అన ఘాభ్రవ్యుఁడు నిట్లు తప్పదన నాహా కూటి మాత్రంబునన్। మన మే యమ్ముడు పోతిమో యితనికిం బాపంబు గాదంచు......" (వరాహ. ౧౦ ఆ. ౩౭ ప). "తివర్ణకము పరమగునపుడు పోయి యివర్ణము వైకల్పికముగా లోపించును. ఉదా:—పోతివి -

పోయితివి. పోతిరి - పోయితిరి. పోతిని - పోయితిని. పోతిమి - పోయితిమి. బుద్ధి । పుట్టదో నే నెటు పోతి ననియె (బసవ. 3 ఆ. ౧౪౮). క. సీతాకాదు సుతా విడి । పోతే సుకుమార - (లంకా.) చ. కటకట మోసపోతిగదె కన్నులు మూయ మటన్న. (సాసం.) (ఆం. భా. అ. క్రియా. ౭౫ సూ.)." బసవపురాణమునందలి తృతీయాశ్వాసమున ౧౪౮ పద్యమునఁ బైప్రయోగము కానరాదు. ఉదాహృత పద్యభాగమున ఛందోభంగము. అందలి 'పోతి' అనుచో 'పోయితి' అని సవరించినచో ఛందోభంగము వారించును. ప్రాచీన మహాప్రబంధములం దిట్టి రూపములు చూపట్టలేదు. "కొందఱాధునిక కవులుపోతివి - పోతిరి యిత్యాదిరూపంబులు వర్ణహీనంబులుగా తమ కబ్బంబులఁ బ్రయోగించెదరు. అయ్యవి యతిసాహసంబు. చ..... ।అక్కడి కేలపోయితి మహాగుణభూషణుఁ గోలుపోయితిన్ (ద్రోణ. ౨ ఆ. ౨౪౦). చ. పలుకునె యిట్లు గొంతి విని బన్నెర పోయితి వింత......... (ఉద్యో. ౪ ఆ. ౨౨)." (బా. గు. ప్ర. క్రియా. ౯౯ సూ. వ్యా. 3౮౪-3౮౫ పు. ద్వి. ము).

అగు పోవుల కడ వ్రాల కిద్వక్రంబులు పరంబు లగు
నపుడు యకారంబగు. ౯౯.

బాలవ్యాకరణ వివరణము 3౪౦ విషయము.

వక్ష్యమాణం బైత్వంబు. అయి = ఐ. అయిరి = ఐరి. పోయి - పోయిరి - పోయెను - పోయెదు.

అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు. ౧౦౦.
వక్ష్యమాణంబు ద్విత్వంబు. ఆయెను - అయ్యెను. ఆయెదు - అయ్యెదు.

సంజీవని. 3౪౦ విష:—౯౯ సూ. వ్యాఖ్య:—అగు ధాతువుయొక్కయు నందలి గకారమునకు వకారాదేశముగల్గి (బా. ఆఖ్యా. ౨౭ సూ.). 'అవు' ధాతువు యొక్కయు 'పోవు' ధాతువుయొక్కయు తుదియక్షరమునకు (గకార వకారములకు) 'ఇ'కారాది ప్రత్యయముగాని 'ఎ'కారాది ప్రత్యయముగాని పరమగునపుడు నిత్యముగా యకారాదేశ మగును. ఉదా:—అగు+ఇ = అయ్+ఉ+ఇ = అయి. దీనికి బాల. క్రియా. ౧౦3 సూత్రముచొప్పున "ఐ" ఆదేశము వైకల్పికముగఁ రాఁగా 'ఐ' అను నగు ధాతుక్త్వాంత రూప మేర్పడును. అగు+ఇ+ (బా. క్రి. ౧౭ సూ) రు= (బా. తత్స. ౨౬ సూత్రముచొప్పున 'రు'వర్ణకోత్వమున కిత్వము) అయ్+ఉ+ఇ+రి = అయిరి. బా. క్రి. ౧౦3 సూత్రముచొప్పున 'అయి' అనుభాగమున కైకారాదేశమురాఁగా. 'ఐరి' అనురూప మేర్పడును. పోవు+ఇ = పోయ్+ఉ+ఇ = పోయి. పోవు+ఇరి = పోయిరి. పోవు+ఎను = పోయెను. పోవు+ఎదును = పోయెదును.

౧౦౦ సూ. వ్యాఖ్య:—అగుధాతువున్న 'ఎ' కారము నిల్చునపుడు 'అగు' ధాత్వకారమునకు దీర్ఘం బగును. అగు+ఎను = అయ్+ఉ+ఎను = అయ్+ఉ+ఎను = ఆయెను. బా. ప్రకి. ౬ సూత్రము చొప్పున యకారమునకు ద్విత్వము రాగా "అయ్+య్+ఉ+ఎను" అని యేర్పడును. ఈవిషయమునే "వట్యమానంబు... ......" అను వాక్యముతో సూరి వివరించెను. బా. సమా. ౧౩ సూత్రము చొప్పున 'ఆ' అనునది హ్రస్వము కాగా 'అయ్యెను' అనురూపము సిద్ధించును. ఇట్లే - అగు+ఎడును = ఆయెడు న=అయ్యెడు న, ఆయెదను - అయ్యెదను - మున్నగు రూపములను సాధించుకొనవలెను. ప్రయోగములు:—క.........ఎఱుంగ నాక ర్థిత్వం । బయినది నలుగురు శ్లాఘ్యగు । లగును మోక్షణ మెట్లు సర్వజ్ఞానసిధీ (ఆది. ౮ ఆ. ౨౯౪) చ ఆయ నవి హీం డో పవిక్రనట్లు విఖండిత పక్షతిక్రయుం । డయిన ఖగేంద్రునట్లు... (సభా. ౧ ఆ. ౧౬౧). చ .... .భయంకరం । బయి యదువృష్ణి భోజ కుకురాంధక వాహినియు గలంగె ని । ద్ధయశర .. ..... (సభా. ౨ ఆ. ౩౩). క. ఈయుబ్బు పాపపాలికి । బోయి కదుం బెద్దదయ్యె పోయిన యట్లు । (ఆది. ౧ ఆ. ౧౧౭). ఆ-వె. కలఁడె యిది పిన గఁ గడు నపూర్వం బయ్యె । .........(సభా. ౨ ఆ. ౨౮౮). చ .. .. ..అనంతుఁడు మూఁడు బ్రసన్నుఁడయ్యె డున్ (ఆది. ౧ ఆ. ౧౦౫-౧౦౬-౧౧౭). క. అయ్యెడ ఖేచరులకు వెఱ । గయ్యెడు చందమున నట్టి యవసరమున బల్ । కయ్యము గుదిసిబలముతో । నయ్యె యుధిష్ఠిర బలోచ్చయంబున కధిప. (ద్రోణ. ౩ ఆ ౨౩౭). చ. చని యక్కుమారుఁ డేను । య్యెనొ యిత్తెఱఁగెఱఁగి మనకు నె య్యెంచుట .. .. .(విరా ౫ ఆ. ౨౩౬). ఉ. అక్కడి కేల పోయితి మహా గుణభూషణుఁ గోలుపోయితిన్ (ద్రోణ. ౨ ఆ. ౨౪౦). చ...... . ఎంత విన్నపో । యింత మదినెంత ంత గల నీయదు వీసులు నేల చాల ధీ । రతఁ దరలించి చిత్తముల రాజెవ రన్న ము ౯ రి యిట్లనున్ (ఉ. హరి. ౬ ఆ. ౪ ప). ఉ. ఆయవనీ సురాసురచయంబు .. .....జీవముల్ । పోయిరి కొంద ఱోడి చెడిపోయిరి.........(నన్ని. కు. ౨ ఆ. ౨౦౧).

నన్నయా క్వచిదస్త్యస్య చాన్యస్య । లోపో దీర్ఘశ్చ కుత్రచిత్
౩౪౧ విష. (విక్ర. అజం. ౯౦ కారి. అహో. ౩౬౫ పు).

కల్పతరువు. ౩౪౧ విష:—ఈకారికకు ౨౧౦ VI విషయమున వ్యాఖ్య చేయఁబడెను. "మొగసాల = మోసల.........మొగము = మోము......... చా నేసెన్ = చావ నెసెన్, నోవ నాడెన్=నో నాడెన్, మఱొకు = మఱవకు,...... నెర్తురు ఇత్యత్ర రేఫలోపే కేతురు ఇతి ప్రయోగోపి కవిసమ్మతః." (అహో. ౩౬౭

పు). అను నహోబల వ్యాఖ్యచొప్పున చావు నోవుల వువర్ణలోపమును నేరుచు ధాతు రు చు వర్ణలోపము మున్నగునవి క్వచిదన్యస్యేత్యాది ప్రకృతసూత్రము నకు లక్ష్యము లనవచ్చును. తిక్కన వచ్చు - నొచ్చులకు చావు - నోవులగుట మున్నగునవెల్ల "వర్ణాగమో విశేషః.........భాషేయ మమితా.........భూయసీ దేశ్యశబ్దేషు ...... .మున్నగు 3౨౮ విషయపు సూత్రములకు లక్ష్యములని గ్రహింపవలెను. అట్లె "పిలుచు మొదలగు వాని" కిత్యాది సూరిసూత్రము నకు (౧౦౧ సూ) "క్వచిదన్య" స్యేత్యాది ప్రకృత కారిక మూలమని గ్రహింపవలయును. ప్రయోగములు:— తే-గీ. పంచి పనిగొని కడిమిమైఁ బగఱ గెలఁమ (విరా. ౪ ఆ. ౪3). తే-గీ. నీకు నే దాసి నగుదు పన్నిదము సఱ ('ఱు' పాఠా) మా. (ఆది. ౨ ఆ. 3౨). పి. అనుపమ సౌఖ్యవిస్ఫురణ వాడిన మాట మఱాకు మున్న నీ । యనుజుల నెల్లఁ గడ్డు ముప్పునఁ జేతకు సమ్మతించితిన్ (ఉద్యో. ౪ ఆ. ౭౦). ఇట్టి తిక్కయజ్వ [illegible] ప్రయోగములు వనేగు లమసు [illegible] ద్విపద. నమ్మి పోకాకు దము సమ్మను [illegible] మఱాకు । [illegible] 3 ఆ. ౪౦౭). క. అయినఁగ నెప్పుడు మఱాకు మయ్య ముకుందా (హరి. ఉ. బా. ౯ ఆ ౨౫౫). ఉ. బాంధవు మెల్ల ప్రొద్దుఁ దలఁపందగు శాస్త్ర మఱాకుమింక (భాస్క. యుద్ధ. ౧౭౭ ప). క. పిలువుఁడు తడ యక కన్నని । బ [illegible] (ద్రోణ. ౧ ఆ. ౨౧) క. అలయక తలఁ చితిఁ గాకిటు । నిలుమీ నీగుణగుణసేనా నిజముగనేన్ (ఉద్యో. ౪ ఆ. 3౧౨). చ. పిలుపిలు మొం [illegible] (ద్రోణ. 3 ఆ. ౫౨ ప) ఉ. బుద్ధులు చెప్ప బెల్ల నటు పోవిడు మెమ్మెయున్నైన . ..(విరా. ౨ ఆ. ౭౬). తే-గీ. వేల్పురా యుందుముఖ [illegible] ని [illegible] (కాశీ. ౪ ఆ. ౨౨౭.) తే-గీ. వెఱకు మని యున్ముఖంబున నెలుకుతేని. (కాశీ. ౫ ఆ. ౭౧.) వెఱకుండుఁడు. (కాశీ. ౫ ఆ 3౧౦) ద్విపద. తొల తొలఁ డను చును ద్రోణ సిద్ధంబు । పిలిచి వాచఱవక నిలు నిలుఁ డనుచు. (బసవ. ౫ ఆ. ౫౨౨.) సీ. కట్టంగఁ దోడఁ బూనముఁ బెట్టఁ గొఱఁతలేక... ......(నిర్వ. ౧ ఆ. 3౮ ప.) (తోడన్ = తోడ గు ధాతు చుట్యంతరూపము.)

పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడ

వ్రాయి బహుళంబుగ లోపించు. ౧౦౧.

బాలవ్యా. పిలఁడు - పిలుచఁడు, పిలుము - పలువుము, లేచునను
3౪౧ I విష ముజ్జు పరంబగునప్పుడు చు లోపంబగు. లెమ్ము -
లెండు, పిలుచు - పిలుచు - తలఁగు - ఇత్యాదులు.

సంజీవని. 3౪౧ I విషః— పిలుచు మొదలగు ధాతువులకు ముజ్జీత్తులు పరంబులగునపుడు వాని తుదియక్షరము బహుళముగా లోపించును. పిలుచు+

లజీ = పిలు+డుజ్ = పిలఁడు. లజీ జీత్తుగాన నది పరమగుచుండఁగా చువర్ణము లోపించును. మిగిలిన 'పిలు' అనుదాని తుది 'ఉ' కారము (బా. క్రి. ౨౦ సూ.) 'అ' కార మయ్యెనని యెఱుంగునది. దాని తుదివర్ణము లోపింపని పక్షమందు (పిలుచు+లజీ = పిలువ్+ఉ+డుజ్ = పిలువఁడు.) 'అ'త్వ - వత్వములు రాఁగా "పిలువఁడు" అనురూపము సిద్ధించును. ఇట్లె పిలుచు+లూ్ట్ = పిలు+ము = పిలుము. ధాతువు తుది 'చు' వర్ణము లోపింపని పక్షమున బా - క్రి - ౮౮ సూత్రము చొప్పున 'చు' వర్ణ చకారము వకారముకాఁగా 'పిలువుము' అను రూప మేర్పడును. ఇట్లె 'నిలుచు' ధాతువునుండి నిలఁడు = నిలువఁడు, నిలుము = నిలువుము, మొదలగు రూపములును 'తలఁగు' ధాతువునుండి తలఁడు = తలఁగఁడు. తలము = తలఁగుము మొదలగు రూపములును సిద్ధించును. "లేచు ధాతువునకు ముజ్జు పరంబగునపుడు చు లోపంబగు. లెమ్ము - లెండు" అని సూరి వివరించుటచే నద్దానికి జీత్తు పరంబగునపు డంత్యవర్ణలోపము రాదని తాత్పర్యము. ఉదా:—లేచు+లజీ = లేచు+డుజ్ = లేచఁడు. దీనికి 'లేఁడు' అనుపర్యాయ రూపము గలుగదని యెఱుంగునది. బహుళగ్రహణ మహిమచే నిట్టి యర్థవిశేషము లభించునని సూరియాశయము కానోపును. తిమ్మకవి యీసూరి వ్రాఁతకు విలక్షణముగా వివరించెను. "ఆ.వె. లేవ నెత్తుటంచుఁ జూడక యుండుట । వెఱవకుండుటయును మఱవకుంట । నొవ్వనేయు టనెడు సుగుణములఁ గల వకా । రమ్ము లోపమొందు రాజమకుట. లేనెత్తన్:—ఉ. తనతో నల్గిన వాని పాదములమీఁదన్ వ్రాల లేనెత్త నొ । య్యనఁ బాళ్ళాత్య నిజాఖ్య తన్ముఖములం దనొ్యన్య మొక్కప్పుచుం । బన బుబ్బంగఁ జతుర్ముఖత్వము ఫలింపం జొచ్చు పద్మాసనుం । డు.........(కవులషష్ఠము. సర్వల. ౧ ఆ. ౧౭౨-౧౭3.) జీత్తు పరంబగునపుడు లేచు ధాతు తుదివర్ణము లోపించునన్నచో "లేఁడు - లేరు." మున్నగు లజీ రూపము లుప్పతిల్లవలసి యుండును. ఇట్టి రూపములు ప్రాచీనమహాకావ్యములందుఁ గన్పట్టలేదు. (చూ. వి_స్తర. III. ౭౧ I విష.) (ఈతిమ్మకవి యుదాహృతిని గాణపత వివరణకర్త స్వీకరించెను. గాణ. 3౪౫ పుట.). సూరి యుదాహరించిన 'లెమ్ము - లెండు' అనువాని ప్రక్రియ నీక్రిందిరీతి నరయునది. 'లేచు+లూ్ట్ = లే+ము' అనుచో బా - క్రి - ౬౧ సూత్రము చొప్పున దీర్ఘమునకు హ్రస్వమును 'ము' వర్ణకమునకు ద్విరుక్తియుఁ గల్గఁగా 'లెమ్ము' అనురూపము సిద్ధించును. ఇట్లె "లేచు+లూ్ట్ = లే+డుజ్" అనునపుడును బా - క్రి - ౬౧ సూత్రముచేతనే దీర్ఘమునకు హ్రస్వము రాఁగా "లెండు" అనురూపము లభించును. నుడి తొలి

హ్రస్వము మీఁదిదిగాన (బా. సంధి. ౨౨ సూ.) "లేఁడు" అను ఖండబిందు ఘటిత మగు ననిష్టరూపము గలుగనేరదు. ఈయంత్యవర్ణలోపమును సూరకవియు నీక్రింది రీతిని వచించెను. క. నిలువుము పిలువుము కొలువుము । గెలువుము విడువు మనఁగాఁ దగిన బహుశబ్దం । బులకుం దృతీయవర్ణము । తొలఁగిన దోషంబులేదు తుహినాంశుధరా. (కవిసం. ప్రథమతరం. ౧౧౪ ప. ౨౧ లక్షణము.)

"కవిసంశయ విచ్ఛేదాది గ్రంథకర్తల యభిప్రాయమువలం జేసి యీపిలుచు ప్రభృతిగణంబులోని నన్ని ధాతువులును చువర్ణాంతములే గ్రహింపఁదగినట్లు ధ్వనించు నని కొందఱందురు. కాని బాలవ్యాకరణపుస్తకంబులు కొన్నిటిలోఁ 'దలఁగు'ను కొన్నిటిలోఁ 'దలఁచు'ను ముద్రింపఁబడియె........సుధీమణులు శోధింతురుగాక" (బా. గు. ప్ర. క్రియా. ౧౦౧ సూ. వ్యాఖ్య.) అని గుప్తార్థప్రకాశికలో వ్రాయఁ బడెను. దీనిని వేటికావ్యాఖ్యాత స్వీకరించెను. (బా. సా. వే. క్రియా. ౧౦౧ సూ. వ్యా.) ఉభయులును బా - సంధి - ౧3 సూత్రము నుదాహృతులలోని 'మీరు తలఁడు' అనుచోఁ బయిరీతినే వ్రాసిరి. వేటికాకర్త బా-గు - ప్ర - వ్యాఖ్య నెక్కించుటకన్న విశేషమేమియుఁ బరిశీలింపలేదు గాని యింకను దృఢముగా "తలఁ డనునది సూరిమతమున తలఁచు - తలఁగు ధాతువుల మధ్యమపురుషబహువచన రూపములలో నేదియన్నను బాధలేదు." అని వ్రాసెను. (బా. సా. వే. సంధి. ౧3 సూ. వ్యా.) గుప్తార్థప్రకాశికాకర్త "కొన్నిటిలోఁ 'దలఁచును' ముద్రింపఁబడియెనని వ్రాసెనే కాని బాలవ్యాకరణ ముద్రణములలో నా చూచినంతవఱకే పుస్తకమం దును సూరి యుదాహరించిన పిలుచు ప్రభృతులలో 'తలఁచు' అనునది లేదు. 'తలఁగు' అనునదే యున్నది. ఒక్క గుప్తార్థప్రకాశికా వ్యాఖ్యాతమాత్రము కొన్ని పుస్తకములలో నిట్లు కొన్ని పుస్తకములలో నట్లు గలదని వ్రాసితినిగదా యని తలంచి కావలయును నీసూత్రపు వివరణమున సూరి చూపిన పిలుచు ప్రభృతులలో 'తలఁచు' అనుదాని నిల్పి 'తలఁగు' అనుదానిని దొలఁగించెను. (బా. గు. ప్ర. 3౮౬ పు.) తుదికి సూరి జీవితకాలమున ముద్రితమగు ప్రథమముద్రణమునందును దానికిఁ గేవలము సరియగు ద్వితీయముద్రణమునందును 'తలఁగు' అనునదే యున్నది గాని 'తలఁచు' అనునది లేదు. 'తలఁడు' అని ప్రయోగించిన యీక్రింది మహాకవి ప్రయోగములందెల్ల 'తొలఁగుఁడు' అనునర్థమె సందర్భపడును గాని "తలంపుఁడు" అనునర్థము సందర్భపడదు. వేయేల తలఁచు ధాతు 'చు' లోపమునకుఁ బ్రయోగ మొక్కటేని లేదని దృఢముగాఁ జెప్పనగును. స్వవాదానుకూల్యమునకై గుప్తార్థ ప్రకాశికాకర్త "తలఁడు తలండనిన కతిపయకవుల గద్యంబుల యందలి ప్రయోగం

బులు మాత్ర మర్థసందర్భమునుబట్టి తలఁగునకు సాధకంబగునుగాని తలఁచునకుఁ సాధకంబుగాఁ గనంబడుచుండలేదు." (బా.గు.ప్ర.౨౭౬ పుట. ప్ర.ము; ౩౭౭ పు. ద్వి. ముద్ర.)అని వ్రాసిన వ్రాఁత సత్యము కాదు. పద్యములందె యట్టి ప్రయోగములుగలవు. "తలఁగు(వు)=తలుఁగు. అ - క్రి - (దీనికిఁ బ్రార్థనాద్యర్థమందు 'తలఁగు(వు)ము, తలము. తలఁగు(వు)ఁడు, తలఁడు' అనురూపములును ఈయర్థము ననే యామ్రేడితమున 'తలతల, తలతలము, తలతలఁడు, తలఁడు-తలడు' అనురూపములును సిద్ధించును.) తొలఁగు - అపసరిల్లు.........చ.........మవ్వపుఁ దీఁగె లాగి పు। వ్వు లోరులు గోయ నింకఁ దలవుండని యొప్పుగ జంకె సేయుచున్. (నిర్వ. ౭ అ. ౩౮.) క. లలిత కమనీయ మహిమల। నెల నాగయు సఖులు గలిసి యేతేరఁగ ముం। గల నడిచి కంచుకులునుం। దలతల మనఁ బతియుఁ జతురతరముగ నడచెన్. (నిర్వ. ౭ ఆ. ౬౮.) (యతిప్రాసస్థానగతము - తిక్కనప్రయోగము.) క. వలరాజు దండు వెడలఁగ। బలములు నియమించు సైన్యపతు లెను రెనురఁ। తలతలఁడను నెలుఁగుల। క్రియఁ గలకల నెలుఁగిచ్చె నెల్ల కడ రాచిలుకల్. (పి. శకుం. ౨ ఆ. ౧౩౧.) (తలతలఁడు = ముందఱకు నడువుఁడు అనిభావము.) క. తలతలమను వజ్రంబులఁ। దలతలమను నీదు రదనతతి. (పారం. ౨ ఆ. ౨౨౨.) (రదనములు వజ్రములను దలతలఁ డనుచున్నవి.) చ. తలతల మంచివాఁడవుగదా గురుపుత్రుఁడ వంచు నిన్ను నోఁ। బలుకక యున్న.........(భోజరా. ౮ ఆ. ౨౨౬.) క. వల్లవ బాలకులని మన। మల్లవరులు పెనఁగి నేఁడు మడిసిరి వీరల్। బల్లిదులు తలఁడు తలఁడని। చెల్లా చెదరైరి పాఱి చిక్కిన మల్లుల్. (భాగ. ౧౦ స్కం. పూ. భా. ౧౩౬౭.)" (సూ. రా. ని.) ఇందుదాహరించిన ప్రయోగపరంపరలో నొక్కటనైన "తలఁచు" ధాతువు సందర్భపడ నేరదుగదా. ౩౮౧ విషయపుఁ గల్పతరువులో నుదాహరింపఁబడిన, తలఁగు - తలవు - తొలఁగు - తొడుగు మున్నగు చువర్ణాంతేతర స్థలములందును నంతవర్ణలోపము ప్రయోగప్రసిద్ధమై యుండుటను జూచికొనక గుప్తార్థప్రకాశికావ్యాఖ్యాత త్రొక్కిన యీమార్గము కేవలము నపరిశీలన మూలక మనుటలో సందేహము లేదు.

లాఁతిచో సహితము, కాదేశాదులు కానంబడియెడి.

బాలవ్యా. ౧౦౨.

౩౮౨ సూ. కావుతను - కాతను. అగుట - కావుట. అగుదును - కావుదును. కానను - కావునను. అనుదును - అనవుదును - నావుదును. ఇత్యాదులెఱుంగునది.

సంజీవని. ౩౮౨ విమ:— లాంతిచో సహితమనఁగా ముత్తుపరమందు లేకున్నను దదితర ప్రత్యయాదులు పరములై యున్నపుడును 'కా' దేశాదు లనఁగా బా. క్రి ౯౧ సూత్రము మొదలుకొని చెప్పఁబడిన కాదేశాదులు కా - రా - చొరు - చూడు- ఈ - తే - తేరు - చావు - చా - నోవు - నో - నా - కాన - మొదలగు నాదేశములు మున్నగునవి మహాకవిప్రయోగములందుఁ జూపట్టుచున్నవిగాన నట్టివాని నట్టి మహాకవి ప్రయోగానుసారముగా గ్రహింపవలెనని తాత్పర్యము. ఉదా:— కావుతను:-- అగుధాతువునకు జేత్తు పరమగునపుడు నిత్యముగాను ముజ్జుపరమగునపుడు వైకల్పికముగాను 'కా' దేశము విధింపఁబడెను. (బా. క్రి. ౯౧-౯౬ సూ). అట్టి 'కా' దేశమును దానితోపాటు "వు" అనునదియు నట్టి ముత్తునకు భిన్నమైన యాశీరాద్యర్థక ద్రుతాంత'త' ప్రత్యయము (బా. క్రి. ౨౬ సూ) పరమగునపుడును వచ్చెనని యెఱుంగునది. అందు 'వు' అనునది రాక కేవల 'కా' దేశముమాత్రము వచ్చినచో 'కాతన్' అను రూపమేర్పడును. అట్లె ముజ్జుపరమగు నప్పటివలెనె భావార్థక ట ప్రత్యయము (బా. క్రి. ౩౫ సూ) (ముత్తుకానిది) పరమగునపుడును వైకల్పికముగాఁ కాదేశమును, 'వు' అనునదియు వచ్చుటచేత 'అగుట - కావుట' అను రూపము లేర్పడును. ఆరీతిగనే (బా. క్రి. ౪౨ సూ) యానంతర్యార్థక 'డు' ప్రత్యయము పరమగునపుడును 'కా' దేశమును 'వు' అనునదియు వైకల్పికముగా వచ్చుటచేత 'అగుడును - కావుడును' అను రూపములేర్పడును. ఇట్లు సూరి యుదాహరించెనేకాని 'కావుడున్' అనుదానికిఁ బ్రాచీన కవిప్రయోగము లభింపలేదు. పయిరీతినే 'అగు' ధాతువునకు భావలక్షణార్థక ద్రుతాంత 'న' ప్రత్యయము (ముత్తుకానిది) పరమగునపుడును 'కా' దేశమును 'వు' అనునదియు వచ్చుటంజేసి 'కావునను' అను రూప మేర్పడుచున్నది. అందు 'వు' అనునది పాక్షికమై రానపుడు 'కానన్' అను రూపమేర్పడుచున్నది. ఈరీతి నేర్పడిన 'కానను' అనునది భారతమునఁ బ్రయుక్తముకాలేదు. 'కాన్+అ' అనురీతి నేర్పడిన కళయగు 'కాన' శబ్దముమాత్రమె తిక్కయజ్వచేఁ బ్రయోగింపఁబడెను. (విస్తర. III ౭౮ IV). మ. ధృతరాష్ట్రుండును బుత్త్రులు న్వనము గుంతీనందనుల్ సింహముల్ । మతి నూహింప నసింహమైన వనమున్ మర్దింతు రెందున్ వనా । వృత వృత్తంబులుగాని సింహములకున్ వేగంబ చేటొందుఁ గా । న తగం బొందుట కార్యమీ యుభయమున్ సంతుష్టిమై నున్కికిన్ (ఉద్యో. ౧ ఆ. ౩౫౮). అర్వాచీనకవులు పై రీతి నేర్పడిన ద్రుతప్రకృతిక 'కానన్' శబ్దమునే ప్రయోగింతురు. పయిరీతి నున్న భారతపక్షసమర్థనము నరయక సూ. రా. నిఘంటుకారు లీ క్రిందిరీతిని వ్రాసిరి. "కాన. అవ్య. ద్రు. కావున. (√ అగు. ఇది 'కావునన్' అనుదానిలోని

'వు'లోపింపఁగా మిగిలినరూపము. కాని భారతమునందలి యొక నిర్ధారక ప్రయోగములో కళగాఁ గాన్పించుచున్నది.) కాఁబట్టి. కనుక. మ.........అటుగానన్ మాని గాఁ డారయన్ (చంద్రా. 3 ఆ. ౧౧౫ ప). క.........। రసభావా ద్యుపనిబద్ధరసములు గానన్ (నరస. ౫ ఆ. ౨3౦ వ). మ.........కా। న తగంబొందుట కార్య మీయుభయమున్ సంతుష్టిమై నున్కికిన్ (ఉద్యో. ౧ ఆ. 3౫౮)." (సూ. రా. ని). అనుధాతువున కానంతర్యార్థక ద్రుతాంత 'ఎ' ప్రత్యయము (బా. క్రి. ౮౨ సూ) (జిత్తుకానిది) పరంబగునపుడును 'నా'దేశము 'వు' అనునదియు రాఁగా 'నావుడున్' అను రూపమేర్పడుచున్నది. సూత్రములోని 'కాదేశాదులు' అను నాదిశబ్ద గ్రహణముచేఁ బైరూపములలో 'వు' అనునది వచ్చెనని యెఱుంగునది. అట్లె 'అను' ధాతువున కానంతర్యార్థక డు ప్రత్యయము పరమగునపుడును 'వు' అనునది 'నా'దేశసహితముగను 'నాదేశ' విరహితముగను వచ్చునని యెన్నునది. కానవె 'అనుడున్' అనుదానికి 'నావుడున్ - అనవుడున్' అనునవి పర్యాయములుగ నేర్పడుచున్నవని తెలియనగును. అందు 'అనవుడున్' అనునపుడు 'అను' ధాతు నువర్ణమున కత్వమును సూత్రగతాది శబ్దమహిమ చేతనే కల్గెనని యెఱుంగునది. ఇత్యాదులనుటచే, కావించు - కావించు మున్నగుచోటులందును గాఁ, కా. ప్రభృత్యదేశాదులు వచ్చెనని గ్రహించునది. ప్రయోగములు:—క. దేవతల కప్రియంబులు। గావించి మనుష్యు లధముగతు లగుదు రిలన్। గావున వారి కభీష్టము గావింపుము నన్నుఁ బ్రీతిఁ గావుము తరణీ (అర. ౨ ఆ. ౫౦ ప). క. వనవాస పరిక్లేశం। బున కోపదు కుంతిదేవి భోజాత్మజ గా। వున నాగ్వృహమున నుండెడు। .........(సభా. ౨ ఆ. ౨౮౧ ప). 'కాన' అనుదానికిఁ బ్రయోగములు మీఁదఁ జూపఁబడెను. (ఇంకను. ఆది. ౫ ఆ. ౮౧ సభా. ౨ ఆ. ౧౭౫ సభా. ౨ ఆ. ౨౬3 మొ). చ. అనుటయుఁ గంకుఁ డిట్లనియె నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా। వున నిట వీరికిన్ జయ మవున్ వెఱ పేటికి నీకు నుత్తరుం। డని నొకరుండు నాకుము బృహన్నల సారథి గాన గెల్చు న। య్యనిమిషకోటినైన నతఁ డద్భుత విక్రమ జృంభణంబునన్ (విరా. ౫ ఆ. ౨3౫). క. జీవ్రుఁడు మత్స్యమువేతుఁడు। గావుటెఱుఁగవలయు (శాంతి. ౬ ఆ. 3౮౫). చ. చెడు నిహముం బరంబు నిది సిద్ధము గావుటెఱింగి.........(ఆది. ౧ ఆ. ౧3౯). (ఆది. ౮ ఆ. ౨౮౭). ఉ. నావుడు నమ్మృగేక్షణ మనంబున రోయుచు నేను లంజియుం। గావుడు వానితోడి తమకంబది లంజియగాదు (నిర్వ. ౬ ఆ. ౭౨). ఇందలి 'కావుడు' అనుచోట 'కావుట' అన్నను క్షతి లేదుగాన నిది 'డు' ప్రత్యయ నిర్ణాయకము కాఁజాలదు. క. నీవుం

డుము నాకడ నిం। దీవర దళనేత్ర నీపతిని రోయఁగ భూ। దేవోత్తములం బంచెద। నావుడు నిట్లనియె భీమనందన నెమ్మిన్ (ఆ. ౨ ఆ. ౧౨౦). క. అనవుడు నట్టుల చేయుదు । నని పెరుఁగుట యుడిగి వింధ్య ముని వినయముతో (ఆర. ౩ ఆ. ౨౯). క. అనవుడు రాముండును విని మహాక్రోధమునన్ (ఆర. ౩ ఆ. ౧౪౭). ద్విపద మును వెల్లవేగియుఁదినికి చాబిడ్డఁ, గనిన చంకంబయ్యె (బసవ. ౭ ఆ. ౩౧౦). (చాబిడ్డ = కడుపులోఁ జచ్చినబిడ్డ). క. అఱిముఱి చాపరువు వాఱి యల్లటు వడియెన్ (మనుచ. ౪ ఆ. ౪౫) (చాపరువు = చావుకుఁ దెగించిన పరుగు).

బాలవ్యా॰ వాయి రవు ర్వక్రతమౌ. (ఆం. చిం. అజం. ౧౬ కా.
౩౪౩ విష అహో. ౩౨౧ పు.).

కల్పతరువు. ౩౪౩ విష:—అయిః = 'అయి' అనునదియు, అవుః = 'అవు' అనునదియు, వా = వైకల్పికముగా, వక్రతమౌ = 'ఐ - ఔ'లు, అగుచున్నవి. 'అయి' అనునది 'ఐ' గాను, 'అవు' అనునది 'ఔ' గాను బరిణతి నందు నని తాత్పర్యము. 'ఐ ఔ'లు విశ్లిష్టావయవములగు సంధ్యక్షరములు. (౧౪ విష.) (అయి = అఇ = ఐ, అవు = అఉ = ఔ) కావున వీని యుచ్చారణమునుబట్టియే యీపరిణామము సహజమని తోఁచుచున్నది. భట్టారకుఁడు స్థానాదేశ నిర్దేశము చేయకయే యుప దేశించుటం జేసి 'అయి' అనుదానికి 'ఐ' అనునదియు, 'ఐ' అనుదానికి 'అయి' అను నదియు, 'అవు' అనుదానికి 'ఔ' అనునదియు, 'ఔ' అనుదానికి 'అవు' అనునదియు నాదేశము లగునను నర్థము లభించుచున్నది. అందు 'అయి - అవు' అనువానికి 'ఐ - ఔ' అనునవి వరుసగా నాదేశములగుట తఱుచనియు విపరీతస్థితి యరుదనియు గ్రహింపవలయును. 'అయి - అవు' మున్నగు శబ్దములకే కాక సమానపదములోని యట్టి ఖండములకును, బయిరీతిగ నాదేశములగుట కవిప్రయోగసమ్మతమని గ్రహింప నగును. ఉదా:—అగు ధాతుక్త్వార్థకరూపము 'అయి' అనునది. అగుధాతు గకారము వకారము కాఁగా (బా. ఆచ్ఛి. ౨౭ సూ.) 'అవు' అనుధాతువే యేర్పడును. అట్టి వానికిఁ బ్రకృతసూత్రముచేత వక్రతమాదేశము రాఁగా 'ఐ-ఔ' అనురూపము లేర్పడును. ఘనుఁడయి వచ్చెను = ఘనుఁడై వచ్చెను. అగు = అవు = ఔ, అగుట = అవుట = ఔట. అయిన = ఐన. అయిరి = ఐరి. అయితివి = ఐతివి. అయితిరి = ఐతిరి. అయితిని = ఐతిని. అయితిమి = ఐతిమి. అవుచున్న = ఔచున్న. అవు = ఔ. అవుచున్ = ఔచున్. అవుదున్ = ఔదున్. శబ్దఖండములందు:—కయివారము = కైవారము. సయిఁచు = సైఁచు. సయితము = సైతము. అయిదు = ఐదు. కయిదువు = కైదువు. కయిత = కైత. దయివాఱు = దైవాఱు. రవుతు = రౌతు.

చవుతి = చౌతి. చవుకము = చౌకము. గవుసెన = గౌసెన. తవులు = తౌలు. నవు = నౌ. సవురు = సౌరు. కవును = కౌను. జవుకు = జౌకు. దవ్వు = దవు = దౌ. మొ. విపరీతస్థితికి:—కై = కయి. కైక = కయిక. దైవము = (దైఅము = దైయము) దయ్యము. యౌవనము = (జౌవనము = జవువనము) జవ్వనము. మొ.

ప్రయోగములు:—క......ఎఱుంగ నా కర్థిత్వం । బయినది నలుగురు శార్ఙ్గకు । లయు మోహిణ మెట్లు నిర్మలజ్ఞాన నిధీ. (ఆది. ౮ ఆ. ౨౯౪.) ఉ.........అశేష రా । జావళిలోన నత్యధికులైన సపత్నుల పేర్మిఁ జూచి యేఁ । జూవె సహింప నోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్. (సభా. ౨ ఆ. ౧౧౪.) ఉ......... ను । గ్గై రుధిరంబులో మునుఁగ నానిన యేనిక పిండు పక్షముల్. (ద్రోణ. ౧ ఆ. ౨౭3.) క......సంశప్తకు లె । ట్లై రౌశా యాతని పరాక్రమాతిశయమునన్. (ద్రోణ. ౧ ఆ. 3౦౯.) క......। రే నిద్రించుఁ బ్రభాతం । బైనన్ మేల్కని...... ......(అను. ౧ ఆ. 3౨౨.) క. ప్రియభక్తుండవు......భక్తుం । డయి వర్తిం తా విభుకడ ।......... (అను. ౧ ఆ. 3౪౭.) అవు = ఔ:—క. కవదౌనలును గాండీ వము । నవల నిడం బనుప ముంద రరదము డిగు మే । ను విడప డిగియొద శుభకర । మువునివ్విధ మట్లు సేయు మనుడు నతండున్. (శల్య. ౨ ఆ. 333.) క. అనవుడు నందఱు నౌఁగా । కని సంతస మంద నధిపుఁ డభిషేకించెన్. (ఉద్యో. ౪ ఆ. ౧౪౧.) మ. ఎనయన్ లోకగురుప్రశస్తిగల నీ యిల్లాల నై కాంత వ । ర్తనలం బర్వుచు నుర్వి మానవతులన్ ధన్యస్థితి న్మించి యొ । ప్పిన నన్నర్హమె యిట్లనందనుల యాభీలార్తి పాల్సేఁత పా । వన మానీశ్వర యింతకంటె నయశోవాదంబులే దెన్నఁగన్. (రాఘ. ౧ ఆ. ౪౯.) (నీ+ఇల్లాలను+ఐ) (భారశార్థము) లాలన+ఏకాంత (రామాయణార్థ) చ.........అట్టి క । ర్ణున కయి నీకు నేటికి మనోవ్యథ.........(శాంతి. ౧ ఆ. 3౯.) క. కైకా నీ వూనినపని । కై కా కై కందినట్టి.........(అచ్చ. రా. అయో. ౯౪.) మ. దయ నా యాడినమాటఁ గైకొనవు.........(ఉద్యో. ౪ ఆ. ౪౭.) ఉ. వ్రాఁత మెఱుంగులుం బరువుపూవు బెడంగులు చూపునట్టివా । కైతలు...... (కవిపితా - ఉత్పలమాలిక) (కవిత = కయిత = కైత) ఉ. కయ్యము.........నా । దయ్యము నెత్తి కోలు.........(ఉద్యో. 3 ఆ. ౬౭.) దైవమ్ = (దైయమ్ = దయ్యము) సీ. ఎలజవ్వనంబున విలసనమును. (ఆది. 3 ఆ. ౨౭.) (యౌవనము = జౌవనము (దౌవువంటిది) = జవ్వనము.) ఉ. నావుడు.........దౌ । దౌవుల నిల్చి. (శై. ౨ ఆ. ౫౧.) మ.........। దవులం బాఱిన బట్టి తెచ్చిరి.........(ఉ. హరి. ౧ ఆ. ౬3.) సీ. అన్నువ కౌఁదీఁగ యందంబు మది నిల్పు. (ఆది. 3 ఆ. 3౮.)

ఆచ్ఛికంబులం దయి యవులకు వక్రతమంబులు బహు

బాలవ్యా. ళంబుగా నగు. ౧౦౩.

౩౮౩ I విష. అయిదు = ఐదు. అయిరేని = ఐరేని. అవుడు = ఔడు.

గవుసెన = గౌసెన.

సంజీవని. ౩౮౩ I విష:—'అయి' అనుశబ్దమునకుఁ గాని యట్టి శబ్దభాగమునకుఁ గాని 'ఐ' అనునదియు, 'అవు' అనుశబ్దమునకుఁ గాని యట్టి శబ్దభాగమునకుఁ గాని 'ఔ' అనునదియు బహుళముగా నాదేశము లగునని తాత్పర్యము. బహుళగ్రహణముచే 'ఐ-ఔ' లకుఁ గ్వాచిత్కముగా 'అయి-అవు' అనునవి వరుసగా నగుగని గ్రహింపవలయును. 'ఆచ్ఛికంబులందు' అనుటచేత సంస్కృతసమములం దిట్టి మార్పు కలుగనేరదని తాత్పర్యము. ఉదా:—దయిత (ప్రియురాలు.). దైత్యుఁడు (రాక్షసుఁడు.) భవుకము (మంగళము) కవులు (కవీంద్రులు) కైకయి (కైక.) మొ. సూరి యుదాహృతుల కర్థములు. ఐదు = పంచసంఖ్య. ఐరేని = బచ్చెనపని చేసిన పెండ్లికుండలు. అవుడు = పెదవిక్రిందిచోటు. గవుసెన = వీణె మొదలగువాని మీఁది యొఱ.

ప్రాకృతమునందును నిట్టి మార్పు గలదు. "దైత్యాదిష్వఇ. (౧ పరి. ౩౬ సూ.) దైత్యః = దఇచ్చో" (ప్రాకృతప్ర.) "పౌరాది ష్వఉ. (౧ పరి. ౪౨ సూ.) పౌరః = పఉరో," (ప్రాకృతప్ర.)

బహుళగ్రహణముచేఁ గొన్నియెడల నియ్యది వర్తిల్లక పోవచ్చును. 'తగు=తవు మాటలు' అనుచో "తౌమాటలు" అనురీతి ప్రయోగములు చూపట్టలేదు. 'అయి యవు'లను ద్వంద్వమునందలి యకారాగమము సాధువుకాదని తోఁచెడిని.

కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరంబగునపుడు కల

యగు. ౧౦౪.

బాలవ్యాకరణ ప్ర. కలఁడు - కలరు - కలదు - కలవు. మ. కలవు -

వివరణము. కలరు. ఉ. కలను - కలము.

౩౮౪ విషయము. తద్ధంబునం గలాదేశంబు విభాష నగు. ౧౦౫.

ఎడి యెడులకు లోపం బిట నిత్యంబు. కలవాఁడు -

కలుగువాఁడు.

సంజీవని. ౩౮౪ విష:—కలుగుధాతువునకుఁ బ్రాప్త్యర్థము సయితము గలదు గాన నట్టియర్థమున 'కల' అను నాదేశము రాదనియు "అస్త్యర్థమునందు" మాత్రమె కలాదేశంబు లట్టు పరంబగునపుడు వచ్చుననియు సూరి యాశయము నెఱుంగునది

లిట్టు మున్నగువానియందు "కలిగెను - కలుగును" మున్నగురూపములె యప్త్య ర్థమునందు సయితము కల్గునుగాని కలాదేశంబు రాదు. కలుగు+లట్ = కల+లట్ = కల+డుజ్ = కలఁడు బా. క్రి. ౧౩ సూత్రమున 'ఉదంతంబునకు' అని చెప్పుటం జేసి 'కల' అను నదంతంబునకు 'ఉన్నానుబంధము'ను బా. క్రి. ౧౪ సూత్రము చెప్పున 'చు'వర్ణకంబును రానేరవుగాన 'కలచున్నాఁడు' మున్నగు ననిష్టరూపములు కల్గనేరవు. సీ... .....ఆ-వె. ఇది వడిఁ । గలదు మనసుకంటె గాడ్పుకంటె (ఆది. ౧ ఆ. ౧౧౫). ఇట 'కలాదేశము' వచ్చుటచేఁ ఉన్నానుబంధము, 'చు'వర్ణకము, 'ది'వర్ణకమును రావయ్యెను. కలదు=కలిగియున్నదని యర్థము. ఇదియుఁ బ్రాప్త్యర్థక లద్రూపమె యనఁదగును. ప్రాప్తి ప్రభృత్యర్థములందును సూరి విధింపకున్నను 'కలాదేశము' చూపట్టుచున్నది. క. మగఁటిమిఁ గలఁ డసిరోమను న । మ్మిగఁ జూచుచు నుండు విషము మ్రింగినయేనిన్ (ఉద్యో. ౧ ఆ. ౩౧౫). (మగఁటిమిని గలవాఁడని యర్థము. సీ.........ఆ-వె. కరుణఁ గలుగుమమ్మ కమలనేత్ర (ఆది. ౭ ఆ. ౪). ఇట్లు కలుగుధాతువునకుఁ బ్రాప్త్యర్థమును నన్నయయె ప్రయోగించెను. లట్ పర కత్వమున 'కలాదేశము' నిత్యమగుటంజేసి 'ధనలాభము కలుగుచున్నది' మున్నగు నెడల 'కలుగుచున్+ఉన్నది' అనురీతిని రూపసాధనమును జేసికొనవలయును.

ప్రాప్త్యర్థక ప్రయోగములు:—క.........జ్ఞానము । గలఁడేనిన్ బాలుఁడైనఁ గడువృద్ధు మహిన్ (అర. ౩ ఆ. ౨౪౭). సీ.........ఆ-వె. తల్లి పనిచె నని యథ ర్మువు సేయంగ । నగునె యెఱుక గలరె మగువలెందు (ఆది. ౨ ఆ. ౩౪). క. అమితం బగు మీఁతపము మ । హిమ యెఱుఁగక యిట్లు చేసె నిది దీని సహిం । పుము దయ మతై న్య నిరో । ధము వాపుము యెఱుక గలరె తరుణులు ధరణిన్ (అర. ౩ ఆ. ౧౭౧). ఉ. పాడియు సత్యముం గలరు పాండు తనూజులు.........(భీష్మ. ౨ ఆ. ౨౬౦). సీ.........మహిత విభవ । ఖని యగు శిశుపాలతనయుండు దోర్దర్ప ధుర్యుండు ధృష్టకేతుండు సమర తే-గీ. లంపటుండు శిఖండియు లావుతెంపు । గలరు నీకొడ ననురక్తి గలరు సాలఁ । బెంపుగల యుక్కుముట్టిన తెంపుగలరు । కోరి పతులుగఁ జేయు మక్షోహిణులకు (ఉద్యో. ౪ ఆ. ౧౨౯). సీ.........వల్మీక మాత్ర పర్వతము నెత్తి । కొని లావుగలఁడు వీఁడన నేడు దివసంబు, లునికి (సభా. ౨ ఆ. ౪౧). (చూ. ౨౧౦ VIII విష). (కలవాఁడు = కలఁడు - తచ్ఛబ్ద వా లోపము). పయి ప్రయోగములనుబట్టి యప్త్యర్థ మాత్రమందె కలాదేశమగునను సూరిసూత్రము సరికాదు. కలాదేశ విషయమున నీవఱకు ౨౯౬ విషయము నందును ౨౧౦ VIII విషయమునందును ౩౦౧ విషయమునందును బ్రయోగ ములు విపులముగాఁ జూపఁబడియున్నవి.

ప్రాప్త్యర్థక సకర్మక కలుగు ధాతురూపములగు "కలవాఁడను - కలవారము- కలవాఁడవు - కలవారరు - కలవాఁడు - కలవారు - కలఁడు (= కలవాఁడు) కలరు (= కలవారు)" అనురూపములు నన్నయ సమ్మతములు. అస్త్యర్థక కలుగుధాతు రూపములగు "కలఁడు - కలరు - అదికలదు - అవికలవు (అమహత్కర్తృక)" అను రూపములును నన్నయ ప్రయుక్తములు గలవు. కాని "కలను - కలము - కలవు (నీవు)" అనురూపములు నన్నయభారతభాగమునఁ గన్పట్టలేదు. అట్టివి తిక్కనాదుల గ్రంథములలోఁ గన్పట్టుచున్నవి. అట్టి 'కలను - కలము - కలవు' అను వానికిఁ బ్రాప్త్యర్థకత్వము లేదు. "కలఁడు కలరు" మున్నగువాని సామ్యపు భ్రమచే ముద్రణసంస్కర్త లట్టి వానికిని బ్రాప్త్యర్థకత్వమును బలుచోటులందుఁ బ్రతిక్షిప్తము గావించి యున్నారు. క. నేరుపు గలనసుచు నహం। కారంబున మిడిసి పడితి. (హరి. పూ. భా. ౫ ఆ. ౨౪౭.) ఇందు 'కల ననుచు' అనుచో 'కల దనుచు' అనియే కవి ప్రయుక్తపాఠ మనందగును. ప్రాచీనకవులు 'కలవాఁడను' మున్నగు ప్రాప్త్యర్థక 'కలుగు' ధాతుజన్య సకర్మక రూపములలోఁ దచ్ఛబ్దవకార లోప వాకార లోపములను బ్రయోగింతురే కాని డకార రేఫ లోపములు గల 'కలను - కలము - కలవు' అనురూపములను బ్రయోగింతురనుట విశ్వసింపఁదగినది కాదు. అట్టివి ప్రయోగించిరను నమ్మకమును గలిగించు ప్రబలప్రయోగములు చూపట్టలేదు. కావుననే ఆ-వె. ఒలిమి ఖుండ దయయుఁ గలవేని. (ఆర. 3 ఆ. 3౭౭.) అనుచో "దయయుఁ గలదేని" అనియే నన్నయ ప్రయుక్త మనఁదగునని వెనుక వ్రాయఁబడెను. (౨౯౬ విష.). ఇట్లె 'ఎల్లవారికంటె నెఱుక గలవు' (ఆర. 3 ఆ. 3౭౭.) అనుచోటను సైతము "ఎఱుకగలదు" అనునదె కవిప్రయుక్త మనఁదగునని వ్రాయఁబడెను. (౨౯౬ విష.). ఇట్లె 'బీరము గలవేని' (ఆర. ౧ ఆ. 3౦౯.) అనుచో సైతము 'బీరము గలదేని' అని కవిప్రయుక్త మనఁదగును ఆ-వె. కరుణ గలవు మమ్ము గారవంబున సుఖా। న్వితులఁ జేసి తనఘ. (ద్రోణ. ౫ ఆ. ౨౭౦.) కరుణగలవేని. (శాంతి. 3 ఆ. 3౦౦.) ఆ వె. భక్తి గలవు. (శాంతి. ౪ ఆ. ౨౬౪.) భక్తి పెంపుగలవు. (అను. ౫ ఆ ౪౬౭.) మున్నగు స్థలములం దెల్లఁ బయిరీతినె 'కలదు' అనునదియె కవిప్రయుక్తమనియు 'వు' వర్ణక పాఠములు ప్రక్షిప్తము లనియు గ్రహింపవలెను. ఇంక 'కలాఁడు' మున్నగు వాని వంటిని సామ్యపు భ్రమచే బ్రయుక్తము లగునో యని యాలోచింపఁ దగిన 'కలాను - కలాము కలావు - కలాదు' మున్నగు రూపములును బ్రాచీనప్రామాణికమహాకవి సమ్మతములు గావని యీవఱకె విశదీకరింపఁబడెను. (3౦౧ విష.). అస్త్యర్థ కాకర్మక కలుగు ధాతురూపములు 'కలఁడు-కలరు-కలదు - కలవు - కలను-

కలము - కలవు. (నీవు) కలరు' అనునవి ప్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడును. అందును "కలను - కలము - (నీవు) - కలవు = అనువానికి నన్నయప్రయోగములు చూపట్టలేదు. తక్కినవాని ప్రయోగములు. 3౦౧ విషయమునఁ జూడఁదగును.

౧౦౫ సూ. వ్యాఖ్య:—త్రర్థంబునన్=తృచ్ ప్రత్యయార్థమందు. సంస్కృతమున, "తృచ్" ప్రత్యయము కర్త్రర్థకము. 'కలవాఁడు' అనునది వర్తమానార్థక విశేషణ మన్నను ననవచ్చును. పూర్వసూత్రమునుండి యస్త్యర్థమునందని యను వృత్తి కల్గును గాన నస్త్యర్థక కల్గు ధాతువునకు లట్టు పరమగునపుడు నిత్యముగాఁ గలాదేశ మగుననియు "త్రర్థమునందు వికల్పముగఁ గలాదేశ మగుననియు సూరి తాత్పర్యము. ఉదా:—కలవాఁడు - కలుగువాఁడు. బా. క్రి. ౪౪ సూత్రము చొప్పున 'తృ'వర్ణకార్థంబున వచ్చెడి "ఎడి - ఎడు" అనునవి బా. క్రి. ౪౫ సూత్రములోని బహుళగ్రహణముచే 'కలుగు' ధాతుస్థలమున నిత్యముగా లోపించునని "ఎడి యెడులకు లోపం బిట నిత్యంబు" అను సూరి వివరణమునకుఁ దాత్పర్యము. సిద్ధద్వంద్వము గాన 'ఎడ్వ్యాడు'ల కని వచించుట యుక్తము. క.........ఏ। ర్పడ జగములు గ్రమ్మఱఁ గలి। గెడు నప్పుడు సూచెదవు వికృతి రహితుఁడవై (ఆర. ౪ ఆ. ౨3౭). అను రీతిగల ప్రయోగము విరోధించుచున్నది. "ఎడి యెడులకు లోపం బిట నిత్యంబు" అనుచోటి 'ఇట' శబ్దంబునకు "కల" అనుదానిపట్టుననే యని యర్థము చేయుద మన్న సూరి "కలిగెడువాఁడు-కలిగెడివాఁడు" అని యుదాహరింపక 'కలుగువాఁడు' అని మాత్రమె యుదాహరించెను. క......కడపెఁ। గరము నియతి నింకఁ గలుగుకాలము వత్సా (ఆశ్ర. ౧ ఆ. ౧౭౨). సీ. గుణవంతులగుచున్న కొడుకులు గలవాఁడు (ఆని. ౬ ఆ. ౨౫). సీ.........దైవసంపద గలవారలఁ బాండవవరులనేమి। (ఆది. ౬ ఆ. ౨౧). క. బలహీను లయినవారలు। బలవంతుల నొడుచునపుడు బహుమాయల న। చ్ఛలమునఁ జేయుట యెందును। గలయదియ జయంబ కాదె కర్తవ్య మిలన్ (సభా. ౨ ఆ. ౧౭౦ ప). ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె (ఆది. 3 ఆ. ౧౧౨). ప్రాత్యర్థక కలుగుధాతువును నిట్టి త్రర్థకరూపములతోఁ బ్రయోగదృష్టమగుచున్నది. చ.........భూప్రజఁ గాతు నన్వని। శ్చిత దృఢబుద్ధి గల్గుము (శాంతి. ౨ ఆ. ౨౫3). క. తిరమైన నడవడిం గల। పరిణత చిత్తుండు (శాంతి. ౫ ఆ. ౧౮౯).

అస్త్యర్థంబునకు ఉజీ - మి - క - ని - వడి - వర్ణ కంబులు పరంబులగునపుడు లే యగు. ౧౦౬.

బాలవ్యాకరణ వివరణము. 3౪౫ విషయము.

ప్ర - లేఁడు - లేరు - లేవు - లేవు. మ. లేవు - లేరు. ఉ. లేను - లేము - లేమి - లేక - లేని - లేవడి.

సంజీవని. ౩౪౫ విష:— అస్త్యర్థంబునకున్=అస్త్యర్థకముగు కలుగు ధాతువునకు (పూర్వతర సూత్రమునుండి 'కలుగునకు' అని యనువృత్తి యగును. లజీప్రభృతి వ్యతిరేకార్థక ప్రత్యయములు పరమగునపుడు 'లే'అనునది సర్వాదేశం బగునని యర్థము. అస్త్యర్థంబున కనుటచేతఁ బ్రాప్త్యర్థకంబగు కలుగుధాతువునకు 'లే' అను నాదేశము రాదని సూరి యాశయము. ఉదా:--కలుగు+లజీ=లే+డుజ్=లేఁడు.(బా. క్రి. ౭ సూత్రముచే లజీ విధింపబడెను). ఇట్లే రు ప్రత్యయాదులు పరమగునపుడును బ్రక్రియ నెఱుంగునది. బా. క్రి. ౩౭ సూత్రముచే మిజీయు, ౩౯ సూత్రముచేత 'కజీ'యు ౪౭ సూత్రముచేత నిజీయు, బా. కృ. ౨౨ సూత్రముచేత వడి ప్రత్యయమును విధింపఁబడుటచేగాన నాయా ప్రత్యయములు పరమగునపుడు కలుగు ధాతువునకు 'లే' అను సర్వాదేశము కలుగునని తెలిసికొని ప్రక్రియ నడపునది. సూరి యస్త్యర్థకమునకు మాత్రమె యని వచించెనుగాని ప్రాప్త్యర్థ వ్యతిరేకమునందును సామర్థ్యార్థ వ్యతిరేకమునందును నీయాదేశము కవిప్రయుక్తమగుచున్నది. ప్రయోగములు:—అస్త్యర్థ వ్యతిరేకము:—ఉ.........సంపద గల్గియు దానికిం దగన్ । సంతతి లేమిఁజేసి యది సర్వము హేయమ కా తలంచి.........(సభా. ౧ ఆ ౧౪౧). క. మాయందు లేని గుణములు । మీ యనురాగమునఁజేసి మిగిలి వెలింగెన్ (అర. ౧ ఆ. ౮) ప్రాప్త్యర్థ వ్యతిరేకము:—క. ధృతరాష్ట్రుండును బుత్త్రులు । ...... । గతి లేరై రింక నేటిమాటలు మనకున్ (భీష్మ. ౩ ఆ. ౨౨౭). (లేరు = లేనివారు). వ.........తొలంగి పోవ లావు లేరైరి.........(ఆశ్ర. ౨ ఆ. ౧౫౨). సామర్థ్యార్థ వ్యతిరేకము:—ఆ-వె. మన బలంబునందు మంచి మగల్ పాల । గలిగి యాబలంబు గెలువ లేమి । దైవకృతము గాదె......(భీష్మ. ౨ ఆ. ౩౫౨). సీ. నిలువరింపఁగ లేక తలఁకుటయును (ద్రోణ. ౫ ఆ. ౩౨౮). సకర్మక కలుగు ధాతురూపములగు 'కలను-కలము - కలవు' అనువానిని నన్నయ తిక్కనలు ప్రయోగింపనట్లె వాని వ్యతిరేకరూపములగు 'ఎఱుకలేనె - నిలుపులేవ' అనురీతి వానిని బ్రయోగింప రనియు నవి ముద్రణములందున్నచోఁ బ్రక్షిప్తము లనియు నెన్న నగును. ఆ-వె. అంతయెఱుక లేనె (అర. ౧ ఆ. ౨౩౧). (లేనె=లేనిదానవా?) ఇట "అంత యెఱుక లేదె" అని కవిప్రయుక్త పాఠ మనఁదగును. తే-గీ......నీవును మున్నువోలె । నిలువరింపంగఁ దగియెడు నిలుపు లేవ......(ద్రోణ. ౫ ఆ. ౩౨౬). "ఇటనీకును...... । ......నిలుపులేద" అనియె కవిప్రయుక్త పాఠ మనఁదగును. అస్త్యర్థ వ్యతిరేకమున "లేను - లేము - లేవు - లేరు" మున్నగునవి ప్రాచీనులచే ధారాళముగాఁ బ్రయోగింపఁబడును. క. భూవరులెల్ల నొక్కట । ద్రోవ

దిక్కై తొడరి యతనితోఁ బెనఁగి కడుం। జేవ సెడి పోవునప్పుడు। నీ వచ్చుటఁ గలవో లేవో నిక్కము చెప్పుమా (విరా. ౪ ఆ. ౨౧౧). లేవడికి సుగ్రాహ్యాతులు:— చ......లే। వడి యగు నీచకాంతయెడ వారక యాపలు పొఁగు నిట్లు పె। క్కేడలను........(శాంతి. ౩ ఆ. ౧౬౭). బా. గు. ప్ర. వ్యాఖ్యలో 'లేవడి' అనుదానికి భారతేతర ప్రయోగములు చూపఁబడి యున్నవి. ఉ. లేవడిగ్గొనిన భుక్తిగొని లేవడిగం బడద ఁకలింతయున్ (పాండు. ౪ ఆ. మొ. (బా. గు. ప్ర. ౩౯౮ పు. ద్వి. ము).

వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాష నగు. ౧౧౭.

బాలవ్యాకరణ
వివరణము.
౩౮౬ విషయము.

ప్ర. - ఒల్లఁడు - ఒల్లరు. ఒల్లదు - ఒల్లవు - మ. ఒల్లవు - ఒల్లరు. ఉ. ఒల్లను - ఒల్లము. ఒల్లమి - ఒల్లక ఒల్లని. పక్షంబున వలవఁ డిత్యాది. ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులు గానంబడియెడి.

సంజీవని. ౩౮౬ విష:—వ్యతిరేకార్థము వాచ్యమగునపుడు 'వలచు' ధాతువునకు వైకల్పికముగా 'ఒల్ల' అను సర్వాదేశ మగునని యర్థము. "వలచు. యు. దే. అ. క్రి. వాసనగొట్టు......., గమగమ వలచు చొక్కపు జవాజి. (స్వా. ౨ ఆ). వై. స. క్రి. కోరు - దాని విననగ వలతు. (భార. ఆది. ౩ ఆ). ౨ కామించు." (శ. ర). "వలచు = కోరు - వల్" (వై. దీ). "వల - వల్ల - సంవరణే - సంచరణేచ" (సి. కౌ, తత్వబోధినీ సహిత. ౩౫౨ పు) అను ధాతువునుండి వలచు ధాతువు జనించినదని వైకృత దీపికాకారుని యాశయము. 'కోరు - కామించు' అను నర్థములుగల వలచు ధాతువునకు వ్యతిరేకార్థము వాచ్యమగునపుడు 'ఒల్ల' అను నాదేశము వైకల్పికముగ నగునని యెఱుంగునది. ఉదా:—వలచు = లజి = ఒల్ల+డుజ్ = ఒల్లఁడు. ఇట్లె తక్కినవాని ప్రక్రియ నరయునది. ఒల్లాదేశము రాని పక్షమున వలచు+లజి (బా. క్రి. ౭ సూ). వలచు+డుజ్ = వలవఁడు. బా. క్రి. ౭౭ సూత్రముచొప్పున వలచుధాతు సిద్ధ చకారమునకు వకారాదేశము వచ్చెను. మఱియు బా. క్రి. ౨౦ సూత్రముచొప్పున 'వలచు' అనుదానిలోని 'ఉ'కారమకార మయ్యెను. బా. క్రి. ౩౭-౩౯-౪౭ సూత్రములచే విధింపఁబడిన 'మిజి - కజి - నిజ్' అను వ్యతిరేకార్థక ప్రత్యయములు విధింపఁబడెనని స్మరించునది. ఒల్లఁడు = వలవఁడు = కోరఁడు - కామింపఁడు - మున్నగురీతిని సూరి యుదాహరించినవాని యర్థముల నెఱుఁగునది. ఒల్లమి = వలవమి = కోరకుండుట - కామింపకుండుట. ఇందు 'ఒల్లమి' అనుదానికిఁ బర్యాయముగా

'ఒల్లఁబాటు' అనియుఁ బ్రయోగములు కన్పట్టుచున్నవని సూరి వివరణమునకుఁ దాత్పర్యము. "ఒల్లబాటు. ద్వి. వి (ఒల్లమి+పాటు) అపేక్ష లేమి. ఒల్లమి - విణ - అపేక్షింపఁబడనిది. గీ. ప్రాణములు నర్థములు నొల్లఁబాటు సేసి (భీష్మ. ౧ ఆ).' (శ. ర). "ఒల్లఁబాటు - వి. (త. ఒల్లామై). (ఒల్లమి+పాటు అని శ. ర) ఒల్లమి - అపేక్షింపమి - ఉపేక్ష - నిరసనము......విణ - అనపేక్షితము - ఉపేక్షితము. సీ. యాగాది దుర్గ్రథంబైన దేవత్వంబు నీకొల్లఁ-బాటయ్యె నేఁడు సూడ. (నైష. ౪ఆ. ౭౪)." (సూ - రా-ని). మూఁకోశముల చొప్పునఁ ఒల్లఁబాటు శబ్దలోని పూర్వావయవము 'ఒల్లమి' శబ్దమని తేలుచున్నది. కాని యిందలి పూర్వావయవము ద్రుతాంతముగు 'ఒల్లన్' అను భావార్థక నిపాత మనుటయె యుక్తమని యందలి ద్రుతకార్యములనుబట్టి తోఁచుచున్నది. (౯౦ I విష. విస్త) ప్రయోగములు:—ఆ-వె. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు। వేల నీకుఁ జెప్ప నేల వలసె। (సభా. ౨ ఆ. ౨౨౮). సీ... ......ఆ-వె. పూజ్యులైనవారిఁ బూజింప నొల్లక। భీష్ము పనుపుఁజేసి వేల వయితి (సభా. ౧ ఆ. ౧౧). చ. పలవదు వీనిఁజూంటఁ గుమువన్ మనకున్ (అర. ౨ ఆ. 3౪౪). క. కావున రావలవ దింకఁ గార్యార్థినివై (అర. ౨ ఆ. ౨౦౧). ఉ...... నిను నుగ్మలి నేయఁగ నొల్ల నా పయిం। గ్రొవ్విసలార నీవు........(భీష్మ. 3 ఆ. 3౨౨). ఆ-వె .. .. ..జయిదు పట్టికొన్న। వాని నైనఁ గావ వలతురు వలచిన। నొల్లకున్న నెట్టులొకొ రొయుఱుంగ. (ద్రోణ. ౨ ఆ. ౨౯౦). ఉ. ఒల్లరు రాజు దేవులను నొడ్డులు రాచిన చందనంబు మే। నెల్ల (విరా. ౨ ఆ. ౨౨౦). ఉ. ఒక్కొక వేళఁ బద్మముఖు లొల్లమి సేయుదురు ........(మను. 3 ఆ. ) మ.. ..... నేఁ।డును నుల్లంబున నొల్లఁబాటొలసె నెట్లుం బూని యిష్మేపయిన్ (హరి. ఉ. భా. ౫ ఆ. ౧౮౨. సూ. రా. ని). "ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులు గానంబడియెడి" అనెడి సూరివాక్యమును విమర్శించురీతిగ గుప్తార్థప్రకాశికాకర్త యీక్రింది రీతిని వ్రాసెను. "ఇట నొల్లమియొక్క యర్థముకంటె విశేషంబు గలదు. ఒల్లమి = అపేక్షలేమి. ఒల్లఁబాటు = అపేక్షింపఁబడనిది. అని కర్మార్థము" (బా. గు. ప్ర. 3౯౯ పు. ద్వి. ము.) గుప్తార్థప్రకాశికాకర్త పాటు శబ్దమునుబట్టి భ్రమించి కావలయును 'ఒల్లఁబాటు' అనునది కర్మార్థకమని వ్రాసెను. దీని కుదాహరించిన పద్యము:—

తే-గీ. ఎవ్వరికిఁ గాఁగ ధరణియు నెల్ల సుఖముఁ।గోరెదము వార లందఱు వీరె వచ్చి। ప్రాణములు నర్థములు నొల్లఁబాటు సేసి। కయ్యమునఁ జావ నఱుమఁట గంటిగాదె (భీష్మ. ౧ ఆ. ౧౮౨ ప) ఇందుఁ బ్రాణములను నర్థములను 'నొల్లఁబాటు = ఒల్లమి' చేసి యున్నారను రీతిని గర్త్రర్థము వెలయుచుండఁగాఁ గర్మార్థమని గుప్తార్థప్రకాశికా

కర్త యెట్లు భ్రమించెనో తెలియకున్నది. "పూయు = పూచు, కాయు = కాచు, వైచు = వేయు," అను రీతిని గొన్ని చాంతధాతువులు యాంతములుగా సంయుతము ప్రయోగింపఁబడుట గలదు. అట్లె వలచు ధాతు యాంతరూపము 'వలయు' అని యేర్పడెనా ? యని యాలోచింపవలసి యున్నది. కాని వీనికిఁ గొంత భేదము గన్పట్టుచున్నది. 'వలచు = కోరు - కామించు'. అనుచొప్పున వలచు సకర్మకము. 'వలయు = ఇష్టమగు'. అనురీతిని 'వలయు' అనునది యకర్మకము. మఱియు వలయు ధాతువు న్యూనక్రియాభూత తదర్థ వ్యతిరేకార్థములలోఁ గొన్ని పురుషవచనములలో మాత్రమె ప్రయోగము కన్పట్టుచున్నది. వలచు ధాతువు పూర్ణక్రియ. ఎల్ల పురుషవచనములందును బ్రయుక్తమగును. కాని వలయు ధాతు వ్యతిరేకార్థక రూపమగు 'వలదు' అనునదియు వలచు ధాతు వ్యతిరేకార్థక రూపమగు "వలవదు" అనునదియుఁ బ్రయోగములందుఁ బర్యాయములుగఁ జూపట్టుచున్నవి. చ. వలవదు వీనియింటఁ గుడువన్ మనకున్.........(ఆర. ౨ ఆ. ౩౮౮). క ........| కావున రా వలవ దింకఁ గార్యార్థినివై (ఆర. ౨ ఆ. ౨౦౧). చ. వలదని యెంతసెప్పినను వాఁడిరివై కడు వేగపాటుమైఁ | బలుమఱు నెల్లెడం దొడరఁ బాతెదు.........(విరా. ౨ ఆ. ౨౬౦). తే-గీ ........నీవ నుత్సాహివి గాఁగ వలదు. (ఉద్యో. ౩ ఆ. ౮౧). పై ప్రయోగములలో 'వలవదు' అనునది వలచు ధాతురూపమె యయ్యు నవివక్షిత కర్మకమై యకర్మకముగ 'వలదు' అను వలయ్యాది క్రియకుఁ బర్యాయ మనదగిన రీతిని (బా. క్రి. ౧౨౨) బ్రయుక్తమయ్యెను. శబ్దరత్నాకరమున వలయు శబ్దము క్రింద "ఇది వలయునా? వలవదు" అని యుట్లుదాహరింపఁబడెను "వ్యతిరేకార్థక దువర్ణకంబు పరంబగుచో వలయు 'యు'వర్ణంబునకు లోపంబగు. ఉదా:—వలదు ........వలదునకు, వల్దు - వద్దు అని రూపాంతరములు గలవు" (గ. ణ. ౩౫౦ సూ. క్రియా). ఇట్లు 'వలదు' రూపము గాణపతవివరణమున సాధింపఁబడెను.

భూ గమి క్రియయో ర న్తే | ఘటకాఖ్యా నిరుచ్యతే|
ఉభయత్రాపి భవతి | రన్యాతు వ్యతిరేకిణీ | అన్యా
శ్చా ప్యర్థ ఘటకా | స్యా దనేకార్థతాపిచ | క్వచి
దర్థవిశేషస్య | వివక్షాపి న దృశ్యతి | క్వచి దర్థ విశే
షేచ | రూఢ్యా విశ్రాన్తి రుచ్యతే | క్వచి ద్రూఢ్యాపి
సాధుత్వం | దృశ్యతే కవిభాషితే (అహో. ౫౦౨).
అన్వయస్యాపి గమ్యత్వం | రూఢశబ్దేషు కుత్రచిత్ |

ఘన్నయా ధర్వణీయము. ౩౮౭ విషయము.

> క్వచి దర్థవిశేషేతు । పున రర్థ సమాగమః । పున
> శ్చిత్తారణాదన్యస్మాత్ । క్వచిదిష్టో న వర్ణకాత్ (విక్ర.
> క్రియా. ౨౩ మొ. ౨౬). (అహో. ౫౦౩ ౫౦౫ పుటలు).

కల్పతరువు. ౩౮౭ విష:—అన్తే = కొన్ని క్రియలతుదిని, భూ-గమి-క్రియయోః = 'అగు - పోవు' అను ధాతువులయొక్క - ఆఖ్యా = కథనము = స్థితి, ఘటకా = అర్థవిశేష ఘటకమని, నిరుచ్యతే = చెప్పఁబడుచున్నది. అందు, భవతిః = అగుధాతువు, ఉభయత్రాపి భవతి = స్వార్థమందును వ్యతిరేకార్థమందును నగును. అన్యాతు = ఇతరమగు గమిధాతు వనఁగా 'పోవు' ధాతువు, వ్యతిరేకిణీ = వ్యతిరేకార్థములందు మాత్రమె ప్రయోగము గలదగుచున్నది. ఉదా:—స్వార్థ:—అగు:—చేయనగును - (చేయ వీలుపడును) చెప్పనగును - చేయ గన్ - చెప్పఁగన్- చేయఁగాన్ - లెస్సగాన్ - మానుగన్ - నిజముగన్ - మొ. వ్యతిరేకః—చూడ నయితిని - చెప్పరైరి. లేదయ్యెను నమ్మనేరనయ్యెదను - లేనగున్ - వ్యతిరేక:—పోవు:—మునఁబోవకపోవఁగ రాదు - చెప్పకపోయితివి - చనవకపోను - మొ. "ఘటింపుచున్నాఁడగున్ - చేయఁగలాఁడగున్ - నీవు ఘటింపుచున్నాఁడ వగుదువు - నేను ఘటింపుచున్నాఁడ నగుదున్ - వర్తమానార్థ భవిష్యదర్థయోః భవతేస్తదర్థకత్వమేవ......" (అహో. ౫౦౮). ఘటించుచున్నాఁడు - ఘటింపఁగలాఁడు మున్నగునవి విధేయ విశేషణములగుటంజేసి యవి 'అగు' ధాతు సమాపక రూపములతో నన్వయించుటలో విరోధము లేదుగాని యట్టి కవిప్రయోగములు గన్పట్టలేదు. వ్యతిరేక క్రియలమీఁదనె యట్టి భూతార్థక రూపములును దద్ధర్మా ద్యర్థక రూపములును మాత్రము చూపట్టుచున్నవి. తద్ధర్మ రూపములందును 'ఎన గాగదు' ఘటితంబులె ప్రచురముగఁ గన్పట్టెని - తద్ధర్మ ప్రథమైక వచనములును గానంబడియెడి. చ.........వృష్టి లే। దవు మఱి యర్ఘ్యవుల్ దలుగు.........(ఆది. ౪ ఆ. ౨౪౯). (లేదవున్ = లేనిదగును). సీ.........ఏమికారణంబున......మాపంపు సేయరైరి. ఆ-వె. యెఱిఁగి యెఱిఁగి వారి నేటికి వారింప। రిట్టి గోత్రకలహ మేల పుట్టె.........(ఆది. ౩ ఆ. ౫). 'వారింపరు = వారింపరైరి' అనురీతి నగు ధాత్వనుప్రయోగములేని వ్యతిరేకక్రియల ప్రయోగమును సమ్మతమె. సీ ........। మొగిని దధీచి యెమ్ముచఁ బుట్టదయ్యెనే వాసవాయుధమైన వజ్రము.........తే-గీ ........విప్రులవలనఁ బుట్ట। రైరె సత్ క్షత్త్రియప్రభులు .........(ఆది. ౬ ఆ. ౬౦ ప). చ.........ఇప్పలు కింకను నమ్మనేరన। య్యెద .........(ఆది. ౪ ఆ. ౩౦). నీవచనంబున సంజీవని సాకుఁ బనిసేయ దయ్యెనేని

నాచేత నుపదేశంబుఁ గొన్నవారికిఁ బనిచేయుంగాక.........(ఆది. ౩ ఆ. ౧౩౨. వచనము.) సీ ........నాకులుకుల కెవ్వరుఁ బ్రతివచనం బేల పలుకరైరి. (సభా. ౨ ఆ. ౨౪౪). సీ... .....ఆ-వె .. .. ..నగలిది రేయిది। యని యెఱుంగనైతి మన ములోన. (ఆర. ౧ ఆ. ౧౭౭). చ .. .....తద్విరహితమ్మగు కార్యక మొప్ప దయ్యెడిన్ (ఆర. ౨ ఆ. ౨౯౬). క ..... ..కారణ మిది। యగునని యేర్పఱుప నేరనయ్యెద నెట్లున్ (విరా. ౫ ఆ. ౩౦౬) ఆ-వె .. ..రాజరాజు పీనుంగుఁ గన్నారఁ। గానఁ బడయ నైతిమేఁ కృష్ణ (ఉద్యో. ౩ ఆ ౧౧౮) తే-గీ. కాన నీఁ జాలనయ్యెద వీని నేను (ఆర. ౮ ఆ. ౩౬౪). చ. నిను నొక యక్షమాత్రుఁడుగ నే మది నమ్మఁగ నేరనయ్యెదన్ (ఆర. ౮ ఆ. ౪౬౦). చ...... ..చెప్పఁగ నిప్పుడు నేరనయ్యెదన్ (ద్రోణ. ౧ ఆ. ౩౬౯). ఉ నమ్మఁగ నేరనయ్యెద వినం గడు నక్కజ మట్టులేల........(ద్రోణ. ౨ ఆ. ౭౬). తే-గీ. అం దెవ్వఁడేనియు మీఱు నెగ్గు। లాచరింపనివాఁడు లేఁడయ్యెనయ్య (స్త్రీ. ౧ ఆ. ౧౮౦) తే గీ........కొంద ఱెఱుగఁ జాల। రయ్యెదరు సూడు...... (స్త్రీ. ౨ ఆ. ౨౩). సీ ..... .. తే-గీ. బుద్ధి గైకొనదయ్యెడు సిద్ధముఖ్య (శాంతి. ౧ ఆ ౬). సీ .......పెంపు సుతు వెలయింపదయ్యె (శాంతి. ౧ ఆ. ౧౬). చ........ ఆ। హవమున కొల్ల నయ్యెద (అశ్వ ౪ ఆ ౮). చ... . ..కానన। య్యెద దశకంధరుం డిచట నెచ్చట లేఁడు (నిర్వ. ౬ ఆ. ౧౩౦). సీ ..... . తే గీ .... ..అది విన్నవింపంగ నైతి నిప్పు। డు (హరి. ఉ. భా. ౭ ఆ. ౧౯).

అన్యాశ్చేతి:—అన్యాశ్చాపి=మఱికొన్ని ధాతువులు సైతము, అర్థఘటకాః= అర్థవిశేష ఘటకములగుట గలదు. అనేకార్థకాపిచ = ఒక్కొకటి యనేకార్థములు గల దగుటయుఁ గలదు. ఉదా:—చేయవలయును - చేయరాదు - చేయవలదు - చేయఁగూడదు. ఈరీతిగ వలయ్యాదులు నుజ్యతములమీఁద నిల్చునపుడా నుజ్యంతము భావార్థక మగును. ఇట్లె చేయఁదగును - రక్షింపఁదగును - మొ. సముద్రము దాఁటఁగలఁడు - దాఁటలేఁడు - దాఁట శక్తుఁడు - దాఁటఁజాలఁడు - దాఁటవచ్చును - దాఁటఁజాలును - మున్నగురీతిని గొన్నియెడల సామర్థ్యాద్యర్థ విశేషము లు బోధ్య ములగును. సంపూర్ణము కావచ్చెను, ఆచేను పండఁబాఱెను - పండవచ్చెను- ఎండఁబాఱెను - చేయఁబోయెను - వ్రాయఁబోయెను. ఇట్లు కొన్నిచోట్ల నారంభ, సిద్ధప్రాయతాద్యర్థములు బోధ్యము లగును. ఒనగఁజేయును-చదువఁజేసెను. వ్రాయఁ జేసెను. మున్నగుచోటులందుఁ బ్రేరణార్థము వాచ్యమగును. చదువఁజూచెను- వ్రాయఁజూచెను మొదలగుస్థలములందు యత్నాద్యర్థములు బోధ్యములగును.

చేయవలయును మున్నగు చోటులందలి నుడి భావార్థకమని యీవటకు వివరింపఁ బడెను. (3౯-3౯ I విష). చెప్పకపోతివి = చెప్పవైతివి. చెప్పకపోఁడు = చెప్పును. రాకపోఁడు = వచ్చును. లేకపోదు = ఉండును. చేయకపోయెన్ = చేయఁ డయ్యెను. ఇట్టి జంటశబ్దములు వివిధము లర్థవిశేష ఘటకము లగునని యెఱుంగునది. తెగు ధాతుప్రేరణ రూపమునఁదగు తెంచుధాతువు కొన్ని ధాతువులపయిని నిల్చి యర్థవిశేష ఘటకమగుచు ఈ జంటశబ్దములం దాగమాదేశలోపాదికమును గవిప్రయోగానుసారముగ నెన్నఁదగును. తెచ్చునదు వలెనె యీతెంచు ధాతువు నకును ముత్పరకత్వమున 'తే - తేరు' లగును. ఉదా:—తాఁకుదెంచు - నెగయు దెంచు . అగుదెంచు - చొత్తెంచు (చొచ్చు+తెంచు) వీతెంచు (వీచు+తెంచు) నడ తెంచు (నడచు+తెంచు) పుత్తెంచు (పుచ్చు+తెంచు) తోఁతెంచు (తోఁచు+తెంచు) తోఁతేన్-తోఁతేరన్ మొ. ఇట్టియెడల నున్న "తెంచు" అనునది స్వార్థఘటకమె యనఁ దగును. ఏతెంచు (ఏఁగు+తెంచు). ఏఁగుదెంచు - చనుదెంచు. అరుగుదెంచు - అరుదెంచు - మున్నగుచోటులం దికత్వార్థము లాగమనార్థకము లగుచున్నవి. ఏతే రన్ = రాఁగా. ఏతేన్ = రాఁగా - మొ. కద - కదవు - కదన్న - కదవన్న - కదే - మున్నగునవి నఖ్యంతాదులపై నిల్చునపుడు ప్రార్థనార్థములు బోధ్యము లగును. ఉదా:—రక్షింపఁ గదన్న - రక్షింపఁ గదమ్మ - రక్షింపఁ గదవయ్య - రక్షింపఁగదే - రక్షింపవుగదా - రక్షింపవుగద - మొ. (చూ. 3౦౮ IV. V విష)

స్యాదనేకార్థతాఽపిచ:—"కాని గాక యో రన్వయే బహవో రూప (అర్థ?) విశేషా దృశ్యన్తే. పోయెంగాక - పోవుత్తునే - నీ విచ్చినంగాక కల్గునే ........వచ్చిన వచ్చుగాక - పోయినఁ బోవుఁగాక .. .. ." (అహో. ౫౦౮ పుట). వాఁడు వచ్చునుగాని ప్రయోజనము లేదు. దానినిగాని దీనినిగాని నాకిమ్ము, నీవు వచ్చినం గాని కార్యము నెఱవేఱదు - మొ.

క్వచిత్ .........వివరణ:—క్వచిత్ = ఒకప్పుడు, అర్థవిశేషస్య = అర్థవిశే షముయొక్క, వివరణే = వివరణయు, న దుష్యతి = దోషముకాదు. ఉదా:— "అతఁడుపోక యిది కాదు. అతఁడు రాక యిది కూడదు. అతఁడు వినక చదువఁ డితఁడు ఇత్యాదౌ పోకున్నన్ - రాకున్నన్ ఇత్యాద్యర్థస్య వివరణ క్రియతే." (అహో. ౫౦౮ పుట). 'పోక - రాక' మున్నగుచోటులందు 'ఉన్నన్' మొదలగు రీతి నధ్యాహారము చేసికొని సమన్వయించికొనవలయును. నీవు రాకుండు మున్న=నీవు రాక మున్న (3౯ I విషయ). ఇట్లు 'ఉన్నన్' ఉండు, మున్నగువాని యర్థమునకు వివక్ష గల్గునని తాత్పర్యము.

క్వచి దర్థ విశేష ఇత్యాది:—క్వచిత్ = ఒకానొకచోట అర్థవిశేషేతు=అర్థ విశేషమునందు, రూఢ్యా = ప్రసిద్ధిచేత, విశ్రాన్తిరుచ్యతే = అర్థవిశ్రాంతి గల్గును. ఉదా:—చదలు కానుపు (గాలి), గాలి మేసరి (పాము), నీటిపుట్టువు (అగ్ని) ఇంచు విలుకాఁడు=తియ్య విలుకాఁడు=(మన్మథుఁడు) - మొ. సంస్కృతమునఁ బంకజాది శబ్దములు యోగరూఢము లయినట్లె యిట్టివి కవిసమ్మతము లగునని తాత్పర్యము. వ్యుత్పత్త్యర్థ మర్థ్యమయి యున్నది యౌగికార్థము. అవయవార్థ స్ఫూర్తి గలది యౌగికము. ఉదా:—కర్త = చేయువాఁడు. పాచకుఁడు = వండువాఁడు. కేవల ప్రసిద్ధిచేఁ జెల్లునర్థము రూఢి. ఉదా:—గోవు. (గచ్ఛతీతి గౌః) యౌగికార్థము కుదురుపడియుఁడు పెక్కిటిలో నొకట రూఢ మగునది యోగరూఢి ఉదా:— పంకజము (పంక = బురదయందు, జ = పుట్టునది).

క్వచి ద్రూఢ్యా పీత్యాది = క్వచిత్ - కొన్నియెడల, కవిభాషితే = కవి ప్రయోగమునందు, రూఢ్యాపి = కేవల కవిప్రయోగ ప్రసిద్ధిచేత సాధుత్వము, దృశ్యతే=కనఁబడుచున్నది. ప్రకృతిప్రత్యయ విభాగము కుదురుపడని స్థలములందుఁ గవిప్రయోగ ప్రసిద్ధిగల్గునపుడట్టి కవిప్రయోగ ప్రసిద్ధిచేతనే సాధుత్వము నరయు నది. ఉదా:—అవధారు = అవధరింపుము. రూఢశబ్దములు క్వాచిత్కములని యీ కారికకుఁ దాత్పర్యము కాదు. "చూఁపోపమి ఇత్యాది రూపసిద్ధిస్తు 'క్వచిద్రూఢ్యాపి సాధుత్వం।దృశ్యతే కవిభాషితే' ఇత్యుక్తేర్జ్ఞేయా" (అహో. ౫౧౨ పు) ఇది సరి యగు నుదాహృతిగఁ గన్పట్టదు. "చూపు+ఓపు = చూపోపు = చూడసహించు" అను శబ్దపల్లవ మవయవార్థకలిత మగుచున్నది. "చూపోపు ద్వి - అ - క్రి - (చూపు+ఓపు) చూడసహించు... .....వ్యతిరేకమునందే దీనికిఁ బ్రయోగములు కానఁబడుచున్నవి)." (శ. ర).

అన్వయస్యాపీతి:—కుత్రచిత్ = కొన్నియెడల, రూఢశబ్దేషు = ప్రసిద్ధార్థక శబ్దముల ప్రయోగమున, అన్వయస్య గమ్యత్వమపి=అన్వయము గమ్యమగుటయుఁ గలదు. ఉదా:—చ. వలదని యెంత చెప్పినను వావిగివై.........(విరా. ౨ ఆ. ౨౬౦). 'నీవు తత్తఱపడి పైపాటు చేయవలదని' అను నన్వయము గమ్యమగు చున్నది. "కొన్నియెడలఁ గర్తృ కర్మ క్రియ లధ్యాహార్యంబు లగు. ఉదా:— ......నన్నుఁజూచి నగరె (జనులు కర్త అధ్యాహార్యము)" మొ. (ప్రౌఢ. వాక్య. ౧౪ సూ). "క్రియాన్వయ వాక్యంబులు కొన్ని వ్యంగ్యార్థద్యోతకంబు లగును .........ఉదా:—వాఁడు వచ్చునేని (లేక) వాఁడువచ్చిన వీఁడు వచ్చును. వాడు వచ్చునేని (లేక) వాఁడువచ్చిన వీఁడురాఁడు వీనికి వ్యంగ్యార్థములు: వాఁడు

రాఁడేని వీఁడురాఁడు - వాఁడు రాఁడేని వీ డువచ్చును........." (ప్రౌఢ. వాక్య. ౯ సూ.) "అతనింగాని నుతింపము. అతనికిఁగాక శక్యమా మాకు.........ఇత్యాదా వన్వయప్ల గిద్యుక్తత్వమ్. అతని నుతింతుముగాని యన్యుల నుతింపము......" (అహో. ౫౧౫ పు).

క్వచిదర్థ విశేషేతు । పునరర్థ సమాగమ ఇతి:—క్వచిత్ = ఒకానొకప్పుడు అర్థవిశేషేతు = అర్థవిశేషమందు, పునరర్థ సమాగమః = మరల నట్టియర్థముయొక్క ప్రయోగము కలుగుచున్నది. అట్టి ప్రయోగమున, క్వచిత్ = ఒకప్పుడు నిర్ధారణాద్యన్తాత్ = 'ఏ'శబ్దాద్యంతముకంటెఁ బరముగాను, క్వచిత్ = ఒకానొకప్పుడు, నవర్ణకాత్ = నవర్ణకాంత శబ్దముకంటెఁ బరముగాను, ఇష్టః = సమ్మతముగును. ఉక్తార్థ పునరుక్తి గల్గునని యర్థము. ఉదా—"చేయనేచేసెన్......రానేవచ్చెన్. పోనేపోను. చేసెరా చేయును (లేదా) చేయనేచేయుఁడు. వచ్చెరా వచ్చున్ (లేదా రానేరాఁడు) నవర్ణకముకంటె:—"చేసినఁ జేయున్......అయినంగానిమ్ము. వచ్చిన రానిమ్ము - వచ్చిన రానీ - ఇత్యాది రూపాణ్యపి సాధూని క్వచిదర్థ విశేషేతు।పునరర్థ సమాగమః।క్వచి న్నిర్ధారణాద్యన్తా। త్క్వచి దిష్టో నవర్ణకాత్ - ఇత్యథర్వణ వచనాత్ - పునరర్థ సమాగమః - పునరర్థాత్వర్థ సంగతి రిత్యర్థః." (అహో. ౫౧౫ పుట) పైవిషయములలోఁ గొన్నిటిని, మఱికొన్ని విశేషములను సూరి వివరించెను. సూరి విడిచినవానిని త్రిలింగలక్షణ (బాలవ్యాకరణ శేష మనఁదగు) శేషకర్త కొన్నిటిని వివరించెను.

బాలవ్యా. 3౪౭ I విష.

పడుజి కొను లొకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబు లగు. ౧౧౯.

చొచ్చు - చొరఁబడు, నిలుచు - నిలువఁబడు, కూడు - కూడబడు. పండు = పండుకొను.

సంజీవని. 3౪౭ I విష:—(వి. 3౨౧ I చూ). బా. క్రి. ౪౯ సూత్రము చేత 'పడు' జ్యనుబంధము కర్త్రార్థమునందు ధాతువున కగుననియు, బా. క్రి. ౫౨ సూత్రముచే నాత్మనే పదార్థమున ధాతువునకు 'కొను' అనునది యనుప్రయుక్త మగుననియుఁ జెప్పఁబడెను. కాని యవి కొన్నియెడల ధాతువును స్వార్థమునందె చేరుచుండుట కవిప్రయోగ దృష్టముగుటచే నట్టివిషయము ప్రకృతసూత్రముచే సంగ్రహింపఁబడెను. "చొరఁబడు" అనుదానికి 'చొచ్చు' అనియే యర్థముగాని విశేషార్థ మేమియు లేదని సూరిగారె "చొచ్చు = చొరఁబడు" మున్నగురీతి నుదాహరించిరి. చొచ్చు+పడుజి = చొరఁబడు. 'పడుజి' జిత్తుగాన ముత్తగుటంజేసి

యది పరమగుచుండఁగా బా. క్రి. ౯౧ సూత్రముచొప్పున 'చొచ్చు' ధాతువునకు 'చొరు' అనునది సర్వాదేశ మయ్యెననియు బా. క్రి. ౨౦ సూత్రముచొప్పున "ఉ"త్వమునకు 'అ'త్వమును బా. క్రి. ౨౧ సూత్రముచొప్పున నుగాగమమును ద్రుతకార్యములును గలుగఁగా 'చొరఁబడు' అను రూపము సిద్ధించెననియు తెలియంగునది. 'నిలుచు+పడుజీ' అనుచో బా. క్రి. ౭౭ సూత్రముచొప్పున నిలుచు ధాతు సిద్ధ చ కారమునకు వకారాదేశమును బా. క్రి. ౨౦-౨౧ సూత్రములచే 'ఉ'త్వ నుగాగమములును ద్రుతకార్యములును గలుగఁగా 'నిలువఁబడు' అను రూపము సిద్ధించును. ఇట్లె యంతటను రూపసాధన ప్రక్రియ నరయునది. పడు+కొను = పండుకొను. ఇట సాత్త్వనే పదార్థము లేమింజేసి. బా. క్రి. ౫౩ సూత్రములోని బహుళ గ్రహణముచే 'ఉ'గాగమము రాదని యెఱుఁగునది. ప్రయోగములు:—గీ. రథంబు | మీఁదఁ గూర్చుండఁబడియె జే యాఁడికొనుచు (భీష్మ. ౧ ఆ. ౧౭౭) (కూర్చుండఁబడియె = కూరుచుండె). క.........ఇ | పట్టణమున మెలఁగి చూడఁబడ దే యనఘా (హరి. పూ. ౭ ఆ. ౨౦౮). (చూడఁబడ దే = చూడ వలదా). "క. ఇత్తెఱఁగున సభలోపలఁ | దత్తఱమునఁ గూడఁబడిన దర్పిత సామం | తోత్తములలోన.........(ఉ. రా. ౫ ఆ). ఆ-వె. జాము పండుకొనెడి జాణ యేది. (విజ).........." (బా. గు. ప్ర. ౮౦౦ పు. ద్వి. ము). (జాము+అ జాముపండు). కొన్ని విషయము లీక్రిందిరీతిని ప్రౌఢవ్యాకర్త సంగ్రహించెను.

*ప్రౌఢవ్యాకరణ వివరణము. ౩౮౨ II విషయము.*

అన్నంత క్రియ చేయు యోగంబునం ప్రేరణార్థకంబగు.

ఉదా:—చొక్కుచుఁ జొక్కఁజేయుచు. (కళా. ౨ ఆ). ఉ. కేశవుఁ డవ్విరాట్టనువుఁ గృష్ణసమాఖ్య వహింపఁజేసెనో. (కళా. ౭ ఆ). మొ. (చొక్కఁ జేయు = చొక్కించు. ఇట్లంతట నెఱుంగునది). (ప్రౌఢ. క్రి. ౧౭).

సంజీవని. ౩౮౨ II విష:—అన్నంత క్రియ యనఁగా ణిజ్యంత క్రియ. చొక్కఁజేయు = చొక్కునట్లు చేయు = చొక్కించు. భారతప్రయోగములు:—మద మడఁగించి భూపతి సమాజమును వెల్లను నిన్నుఁ గొల్వఁజే | యుదు నని పూని (ఉద్యో. ౩ ఆ. ౨౭౦). చ. భీ | ష్ముని వెసకొల్పి సేనలకు ముఖ్యుఁడ వీవని యుబ్బఁజేసి (ఉద్యో. ౮ ఆ. ౨౦౨). క. నానాస్త్ర శస్త్రచయబడబానలమును గవియఁజేసి యత్యుగ్రత నే | సేనాళ్ళన యప్పాండవ | సేనాసాగరము నివురఁజేయుదు

నధిపా (ఉద్యో. ౪ ఆ. ౪౧౬). మ.........సీమనోగ్రంథి యడంగఁజేయ నెస కంబునఁ బూనినవారు (ఆర. ౪ ఆ. ౧౬౦). ఉ. భూమిపు చిత్త మూతురతఁ బొం దఁగఁజేయుటకంటె.........(ఆర. ౭ ఆ. ౧౮). క. వినుత ప్రజ్ఞాబాణం । బున మోహన బాణశక్తి పోఁజేసిన.........(భీష్మ. ౨ ఆ. ౩౭౬). క. కాననమున కేగఁజేసి (ద్రోణ. ౫ ఆ. ౪౮).

ప్రౌఢవ్యాకరణ వివరణము. ౩౪౭ III విష.

వ్యాపారోన్ముఖత్వంబున నన్నంత క్రియకుఁ బాఱు ధాతు వనుప్రయుక్తం బగు. ౧౯.

ఉదా:—సీ. పయిఁ బరామరిక చొప్పడమిఁ బాకము తప్పి, పండఁబాఱిన పాల మెండఁబాఱె (స్వా. 3 ఆ).

మొ. (ప్రౌఢ. క్రి. ౧౯ సూ)

సంజీవని. ౩౪౭ III విష:—వ్యాపారోన్ముఖత్వంబునన్ = ఒకపనియొక్క యారభించుటయందు. ఎండఁబాఱెన్ = ఎండ నారంభించెను. పండఁబాఱిన = పండుట కారంభించిన. ఆ-వె. ధూమ్రరంపు టేఁడు తుది సేరఁబాఱె......... (విరా. 3 ఆ. ౧౩౧).

ఇట్లె నఞ్యంతమునకు 'ఉండు - పోవు - కలుగు' మున్నగునవి యను ప్రయుక్తములగునపుడును నర్థవిశేషములు గల్గును. ఆ-వె. చక్రధరుఁడు పాఱి చ మర నున్నాఁడు మి । మ్మింక (ఉ. హరి. ౪ ఆ. ౬౨). (భావ్యర్థము). ద్వి. ఎత్తి కొన్నాఁ డింక నిటమీఁద నెంత । యెత్తికో నున్నాఁడొ (బసవ. ౫ ఆ. ౩౬౩). (చూ ౨౯౬ విష).

బాలవ్యాకరణ వివరణము. ౩౪౭ IV విష.

తెంచుధాతు వగ్వాదుల కనుప్రయుక్తంబగు, నగుచో నుత్వంబుపయిని దాని తకారంబు దకారం బగు. ౧౧౦.

అగుదెంచు - నెగయుదెంచు - పోవుదెంచు. అగు - నెగయు - పోవు - చొచ్చు - వుచ్చు - తోఁచు - నడచు - పఱచు - మోలచు - వీచు - ఇత్యాదులు.

అభ్యాగతి నరుగ్వాదుల కయ్యది యనుప్రయుక్తం బగు, నగుచో గువర్ణంబు విభాషను లోపించు. ౧౧౧.

అరుదెంచు - అరుగుదెంచు. ఏతెంచు - ఏగుదెంచు - చనుదెంచు.

అయ్యెడి పరంబగునపుడు చువర్ణంబు లోపించు.౧౧౨.
చొచ్చు - చొత్తెంచు. పుచ్చు - పుత్తెంచు. తోఁచు -
తోఁతెంచు.
అర్థానికి ముత్తుపరం బగునపుడు తే-తేరులగు. ౧౧౩.
అగుదేఁడు - అగుదేరఁడు. అగుదెమ్ము - అగుదే
రము.

సంజీవని. ౩౮౭ IV విష:—'అగు' మొదలయిన ధాతువులతుదిని 'తెంచు' ధాతు వనుప్రయుక్తమగును. ఉకారముమీఁది తెంచుధాతు తకారము దకార మగును. ఉదా:—అగు+తెంచు = అగుదెంచు = అయిపోవు = గతించు = కావచ్చు = గతించుటకు సమీపించు. ఇట్లిందును నించుక యర్థవిశేషము వెలయు చుండుటచే నీ 'తెంచు' ధాతు వనుప్రయుక్త మనుటకంటె స్వర్థవిశేష ఘటకమను టయె యుక్తము. మధ్యాక్కరము - ఏనేఁడు లగుదెంచె నర్జునుం డేఁగి యింత కేతెంచు। .........(ఆర. ౮ ఆ. ౩) (అయిదేండ్లు కావచ్చెను). చ. తడ వగు దెంచె జమ్మికిఁ బ్రదక్షిణ వృత్తిగఁ దేరు వోవని। మ్ము.........(విరా. ౮ ఆ ౧౭౧) (తడవయిపోయినది). ఉ. అంత సరోరుహాప్తు డుదయం బగుదెంచె (నిర్వ. ౬ ఆ. ౮౭). (సూ. రా. ని). (ఉదితుఁడై వచ్చెను). ఉ.........। సారబలుండు సూది ముసికొనదినంబులు వోవుదెంచె నం। భోరుహ మిత్త్రుఁ డస్తగిరిఁ బొందెడు నంచు .........(ఆది. ౨ ఆ ౧౯౯) (పోవుదెంచె = సమాప్తి కావచ్చెను). "నెగయు దెంచు = (నెగయు+తెంచు. స్వార్థమున) జలాదులనుండి పైకి లేచు - తేలు. ఆ-వె. బంధనంబు లెల్లఁ బాయుడు భీముండు। నీరిలోననుండి నెగయుదెంచె।"(భార. ఆది. ౫ ఆ. ౧౯౩ ప. సూ. రా. ని). (నెగయుదెంచె=లేచివచ్చెను) (శబ్దరత్నాకరకర్తయు "సూ. రా. ని"నిఘంటుకారులు నిట్టె తెంచు స్వార్థికమె యనుమ సంతటను వ్రాసిరి.) చొచ్చు+తెంచు = చొత్తెంచు. బా క్రి. ౧౧౨ సూ. చొచ్చున 'చు'వర్ణలోపము రాఁగా. 'చొచ్+తెంచు' అగును. తదలు చకారముతో సాధించునపుడు తెల్గు నందు 'చకార'ద్వయ మేర్పడును. ఇయ్యది మహాకవిప్రయోగసమ్మతము. ఆ-వె. ఇత్త మెల్లభంగి నిత్తన్వి నని తగ। నాడి...(ఇచ్చు+దము). (నిర్వ. ౩ ఆ. ౧౧౭). (ప్రాస గతము). (విస్తర). తే-గీ...శిఖండియు వీటికే గు। దెంచి నిజమందిరంబు సొత్తెంచి

---

విస్తర. ౩౮౭ IV విష:—బా. గు. ప్ర. వ్యాఖ్యాత యిట్టిరూపము బా. సంధి. ౩౯ సూత్రముచే సాధించుకొనవలెనని వ్రాసెను. "బా. సంధి. పరి. ౩౯ సూత్రముచేతనే 'చొత్తెంచు - పుత్తెంచు' ఇత్యాదులందుఁ దకారద్విత్వంబువోలె

తల్లి । దండ్రులను మ్రొక్కి.........(ఉద్యో. ౪ ఆ ౩౮౯) (చొత్తెంచి = చొచ్చి కొనివచ్చి). ఇట్లె 'పుత్తెంచు' అనురూపమును సాధించుకొనునది. పుత్తెంచు = పంపివేయు. (ఆర. ౨ ఆ. ౪౫. ఆర. ౧ ఆ ౫౫). నడుచు+తెంచు = నడతెంచు = వచ్చు. ఉ. దంతిఘటల్ మహోగ్ర సముదగ్రతతో నడతేర.........(కర్ణ. ౧ ఆ. ౭౫). నడతేరన్ = రాఁగా బా. క్రి. ౧౧౩ సూత్రముచొప్పున ముత్పరకత్వమున 'తెంచు'నకు "తే-తేరు"లగును. బా. క్రి. ౧౧౨ సూత్రముచొప్పున నడుచు ధాతు 'చు'వర్ణలోపము గల్గెనని యెఱుంగునది. తోఁచు+తెంచు = తోఁతెంచు = కనవచ్చు - వచ్చు - మొ. బా. క్రి. ౧౧౨ సూత్రముచొప్పున 'తోఁచు' చువర్ణము లోపించును. సీ. నీలజీమూతంబు లీల నాక్షేపించి నల్లనై తోఁతెంచు నల్ల గృహము (ఆది. ౬ ఆ. ౨౧౧). (తోఁతెంచు = కనవచ్చు). క. కేతన కపిభయదంబై । తోఁతేరఁగ.........వచ్చు వీకుని గంటే (కర్ణ. ౩ ఆ. ౧౭౪ ప). ఈపద్యమునుబట్టి కావలయు సూ. రా. నిఘంటుకారులు 'తోతెంచు' అని దీనిని నిర్బిందుకముగా నుదాహరించిరి. సోమయాజి స్థలాంతరములందు ఖండాఖండ ప్రాసమును బ్రయోగించినవాఁడగుటంజేసి 'తోఁచు' నిర్బిందుక మనుటకిదియొక ప్రమాణము కానేరదు. (చూ. విస్తర. ౪౭ V విష). మఱియు ఉ. క్రూరవిచేష్టిత విభ్రమంబు దోఁ । పన్నురు మాడుఁ బ్రౌఢబలభాసిత భూరిభుజా విహారుఁడై ।.........(శాన్తి ౧ ఆ ౧౭౫ ప) మున్నగు తిక్కయజ్వప్రయోగములందలి 'ప'త్వముసయిత (సైఁచు - సైఁపన్) మందలి ఖండబిందుస్థితిని (చూ. బా. క్రి. ౭౯ సూ) నిర్ణయించుచున్నది. (చూ. ౩౩౧ III విష). పఱచు+తెంచు = పఱతెంచు. బా. క్రి. ౧౧౨ సూత్రము చొప్పున "పఱచు" ధాతు 'చు'వర్ణలోపము. పఱతెంచు = పఱుగిడివచ్చు.

---

నాద్యక్షరశేషంబై 'చు' ద్విత్వంబునకు లోపంబగునుగాన ప్రకృత చువర్ణలోప విధాయకసూత్రంబు క్రియాపరిచ్ఛేదమునందు ననవసరమని యందురేని యట్లన వలదు. నడతెంచు (నడుచు+తెంచు).........ఇత్యాదులందు.........సూత్రారంభం బవశ్యకర్తవ్యంబు. ఈసూత్రంబు లేనిచో 'చొత్తెంచు' వోలె......... 'నత్తెంచు' ఇత్యాద్యనిష్టరూపంబులు.........గావలసివచ్చును." (బా. క్రి. ౧౧౨ సూ. వ్యాఖ్య). ఇట్లు వ్రాసెనే కాని "చొత్తెచు" వోలె 'నత్తెంచు' కాకుండుటకు వినిగమకమును జూపలేదు. కావున బా. సంధి. ౩౯ సూత్రము సమాసస్థలమాత్ర విషయకమనియు నట్లగుటచేతనే యాద్యక్షర శేషసంధిపద్ధతిని విడిచి కొని సూరి యిట్లు 'చు'వర్ణలోపమును వేఱుగ విధించెనెననియు వచించుట యుక్తమనఁదగును.

క.........ఒక మొసలి చూడ్కికి నగోచరమై । పఱతెంచి కుంభసంభవు । చిఱు
తోడ వడిఁ బట్టికొనియె శిష్యులు బెదరన్ (ఆని. ౫ ఆ. ౨౫౬). మొలచు+తెంచు =
మొలతెంచు = మొలచి పైకిఁ జూడనగు. వీచు+తెంచు = వీచుచువచ్చు. పడు+
తెంచు = పడుదెంచు = పడివచ్చు. క. చల్లని దక్షిణమారుత । మల్లన వీతెంచెఁ ద
గిలి యాలలనా థ । విల్లు కుసుమాంగ రాగ స । ముల్లసన సుగంధి యగుచు ముని
వరుమీఁదన్ (ఆది. ౪ ఆ. ౪౦). సీ. విస్ఫృత కేశాంబరుం డయి సౌంధకంబు వలనఁ ।
బడుదెంచు వసుదేవు.........(ఆ. ౧ ఆ ౧౯౧).

౧౧౧ సూ:—అభ్యాగతి = వచ్చుట. 'పోవు' అను నర్థముగల 'అరుగు'
మున్నగుధాతువులకు 'తెంచు' ధాతు వనుప్రయుక్త మగునపుడు పూర్వస్థిత
'గు'వర్ణము వైకల్పికముగ లోపించుటయు నాజంట యాగమనార్థక మగుటయు
సంభవించునని తాత్పర్యము. ఉదా:—అరుగు+తెంచు = అరుగుదెంచు = అరు
దెంచు = వచ్చు (అరుగు = పోవు). గువర్ణమునకు బాహుళకలోపమును, 'ఉ'కా
రము మీఁది తెంచు తకారమునకు రెండుపక్షములందును 'ద'కారమును (బా. క్రి.
౧౧౦ సూ) గల్గెనని యెఱుఁగునది. ఏగు+తెంచు = ఏగుదెంచు = ఏతెంచు =
వచ్చు. వైకల్పిక గు వర్ణలోపము. 'ఏతెంచు' అనుచో నుకారము మీఁదిది కామిం
జేసి తెంచుధాతు తకారము దకారము గాలేదు. 'ఏగు' సూరిమతమున నిర్బిందు
కము. చను+తెంచు = చనుదెంచు = వచ్చు. అర్వాచీనులు వీని నాగమనార్థ
మందె కాక 'పోవు' అను గమనార్థమునందును బ్రయోగించి యున్నారు. ద్వివిధ
ప్రయోగములు నిటఁ జూపఁబడుచున్నవి:—వ......ప్రభాసతీర్థమునం బండ్రెండు
దినంబులు పంచాగ్ని మధ్యంబునం బవనాఁబు భక్షకుండై ధర్మజుండు దపంబుసేసిన.
ఆ-వె. దానినెఱిఁగి రామ దామోదరులు వృష్ణి । వరులతోఁడఁ బ్రీతి నరుగుదెంచి ।
కనిరి.........పాండుసుతుల....... ..(అర. 3 ఆ. ౧౫౯). "క. సమయం బరు
దెంచె దొంటి చందము గలదే (విరా. ౪ ఆ. ౧౯3). క. చంచలలోచన యెందరు।
దెంచెనొ నను గానలేక.........(రసిక. ౬ ఆ. ౪౪. జైమి. ౪ ఆ. ౧౨౨)."
(సూ. రా. ౯). ద్వి. అనుచు సహోదర యగు నాగమాంబ । యును దాను నచ్చోట
నుండఁ గాదనుచు।నరుదెంచె మఱి ఫణిహారి యింటికిని (బసవ. ౧ ఆ. ౫౦3 ౫౦౪)
ఏగుదెంచు = ఏతెంచు. చ. అమితబలుండు హైహయుఁడు.........జమదగ్ని
మహామునీంద్రు నా । శ్రమమున కేఁగుదెంచె.........(అర. 3 ఆ. ౧౪౫).
సీ......... । మగుడింపఁగా దష్టరుతిఁజేరి విదురుఁ బుత్తెంచెఁ గాకున్న నేతేరఁ
డితఁడు । (అరణ్య ౧ ఆ. ౫౫). "ఏగుదెంచు......౨ వెడలు = పోవు........

చం......భీముసేనుఁ డా। గ్రహమునఁ జూచి కన్నులెదురన్ వృషకేతుని పాటుఁ గాంచి యా।యహితుల నెల్ల డించి పవనాశ్వముతోఁ బురి కేఁగుదెంచి య।మ్మహీపతిఁ గాంచి యాతని క్రమం బపుడేమని విన్నవించెదన్ (జై. భా. ౨ ఆ. ౭౩).' (సూ. రా. ని. చనుదెంచు:—క. రా। నేరరుగావున నిట చను। దేరక నిలువుండ యువిధు దేవ పథంబుల్ (ఆది. ౫ ఆ. ౬౫). క. మీరిందుల కందఱుఁ జను। దేరఁగ నే నంద కుండితిని సభ చూపెన్। (సభా. ౨ ఆ. ౧౩౯). తరళ. నోజ...... నిన్ను వడిఁ దోడుకొని పోవ వచ్చితి నిపుడ। చనుదెమ్ము కౌరవేశ్వరు కడ కనిన... (సభా. ౨ ఆ. ౨౦౭). తరల - ఇది కుబేరువనంబు దీనికి నెవ్వరుం జనుదేర నో। డుదురు నీ విట వచ్చి......(అరణ్య. 3 ఆ. 3౬౧). "చనుదెంచు......౨ పోవు ......చ. పర్వతుండు దాఁ। దివురుట యొప్పు మింట జనుదేరఁగ (నైష. 3 ఆ ౭ ప).' (సూ. రా. ని). అరుగుదెంచు మున్నగువాని కిట్టి గమనార్థకత్వము భారత ప్రయోగములందుఁ జూపట్టదు.

౧౧౨ సూ. వ్యాఖ్య:—అయ్యాది పరం బగునపుడు 'చు'వర్ణంబు లోపించు:- అయ్యాది = ఆ 'తెంచు' ధాతువు పరంబగునపుడు పూర్వస్థిత ధాత్వంతగత 'చు' వర్ణంబు లోపించును. ఉదా:—తోఁచు+తెంచు = తోఁతెంచు = ఉదయించు = కనఁబడు - చొచ్చు+తెంచు = చొచ్+తెంచు = చొత్తెంచు. పుచ్చు+తెంచు = పుచ్+తెంచు = పుత్తెంచు. ఇట్లె నడతెంచు (నడచు+తెంచు) పఱతెంచు (పఱచు+తెంచు) మొ.

౧౧3 సూ. వ్యాఖ్య:—అద్దానికి ముత్తు పరంబగునపుడు-తే - తేరులగును. ఉదా:—పుత్తెంచు+నజ = పుత్తేన్ = పుత్తేరన్. 'తెంచు' ధాతువునకుఁ బ్రకృత సూత్రముచేత 'తే' అను నాదేశము కాఁగా "పుత్తేన్" అనురూపము సిద్ధించును. అట్లె ప్రకృత సూత్రము చేత 'తేరు' అను నాదేశము కాఁగా 'పుత్తేరు' అను రూప మేర్పడును. నజ జిత్తుగాన 'తేరు' అనుదాని తుది 'ఉకారమునకు 'అ'కారాదేశము కాఁగా 'పుత్తేరన్' అనురూపము సిద్ధించును. సూరి యుదాహృతుల ప్రక్రియ:—అగు+తెంచు+లజ = అగుదెంచు+డుజ్ = (బాల. క్రి. ౯౧౦ సూ. చెప్పిన నుకారము మీఁది తకారము దకార మగును). ప్రకృత సూత్రముచే 'తెంచు' ధాతువునకు 'తే' అను నాదేశము కాఁగా, బా. తత్స. ౧౯ సూత్రము చెప్పిన 'డు'వర్ణకము బిందుపూర్వకము కాఁగా 'అగుదేఁడు' అనురూపము సిద్ధించును. ముజ్జులోని డుజ్జు పరమయినచో వేఱువిధమగు రూపము సిద్ధించును. అగుదెంచు+లూట్ = అగుదెంచు+డుజ్ = (బా. క్రి. ౬ సూత్రముచే లూట్టున-

బా. క్రి. ౨౯ సూత్రముచే డుఙ్జును నయ్యెను) ప్రకృతసూత్రముచే 'తే' అను నది యాదేశముకాఁగా "అగుదే+డుఙ్" అని యగును. బా. క్రి. ౬౧ సూత్రముచే హ్రస్వము కల్గఁగా 'అగుదె+డుఙ్' అని యేర్పడును. బా. తత్స. ౧౯ సూత్రముచొప్పున జిత్తు బిందుపూర్వకము కాఁగా బా. సంధి. ౨౨ సూత్రము చొప్పున ఖండము నిషిద్ధమగుటచే 'అగుదెండు' అనురూపము సిద్ధించును. అగుదెంచు+లఙ్=అగుదెంచు+డుఙ్=అగుదేరఁడు, (ప్రకృతసూత్రముచే 'తేరు' అను నాదేశము రాఁగా బా. క్రి. ౨౦ సూత్రముచొప్పున 'ఉ'త్వమునకు 'అ'త్వము కల్గెను). అగుదెంచు+లూట్ = అగుదెంచు+ము = అగుదే+ము = అగుదెమ్ము. (బా. క్రి. ౬౧ సూత్రముచే 'తే' అను దీర్ఘమునకు హ్రస్వమును ముపర్ణకమునకు మూముడియు వచ్చెను). అగుదెంచు+లూట్ = అగుదెంచు+ ము = అగుదేరుము (ప్రకృత సూత్రముచే 'తెంచు' ధాతువునకు 'తేరు' అనునది యాదేశమయ్యెను). ప్రయోగములు:—క. వీరలు.........చను। దేరక నిలువుండ యివియు దేవకథంబుల్. (ఆది. ౫ ఆ. ౬౮ ప). క. మీ రింపుల కందముఁ జను। దేరఁగ.........(సభా. ౨ ఆ. ౧3౯). (ప్రాసగతములు). సీ.........విదురుఁ బు। త్తెంచెఁ గాకున్న నేతేరఁ డితఁడు (అర. ౧ ఆ. ౫౫). తరలము. ఇది కుబేరవనంబు దీనికి నెవ్వరుం జనుదేర నో। దుదుర.........(అర. 3 ఆ. 3౬౦). తరువోజ. చనుదెమ్ము కౌరవేశ్వరు కడ కనిన......(సభా. ౨ ఆ. ౨౦౭). చ.........క్ర। చ్ఛలఅ ము నివర్గవాహనుఁడవై చనుదెమ్మను మంతఁ దీటెడున్ (ఉద్యో. ౧౪. ౧౭౬). క. ఒక మార్గంబున రా మయుఁ। డొక కన్నెయుఁ దాను నచట నొయ్యన చనుదే। నకుటిలకాంతో దాత్త। ప్రకృతి యగుట... .....(నిర్వ. ౮ ఆ. 3 ప).

భూతంబున లజీకి లిడంతంబగు నగుధాతు వనుప్రయు
క్తంబగు. ౧౧౮.

బాలవ్యా. 3౮౭ V విధ.

వాఁడు రాఁడయ్యెను - వారు రారయిరి. అది రాదయ్యెను - అవి రావయ్యెను. నీవు రావయితివి - మీరు రారయితిరి. నేను రానయితిని - మేము రామయితిమి.

సంజీవని. 3౮౭ V విధ:—భూతార్థమందలి వ్యతిరేకార్థము వాచ్యమగు నపుడు లఙ్యంత క్రియపైని లిడంతమగు 'అగు' ధాతురూప మనుప్రయుక్తంబగును. లఙ్యంత క్రియ యే పురుషమున నే వచనమునఁ బ్రయుక్తమగునో లిడంతమైన యగుధాతువును నాపురుషమున నావచనమునందె నిల్చును. లఙ్యంత

క్రియకుఁ గర్త మహత్తాయెనా లిడంతాగు ధాతురూపమును మహత్కర్తృకమె
యగును. అది యమహత్కర్తృకమాయెనా నిదియు నమహత్కర్తృకమె యగును.
ఈవిషయములను విశదీకరించు సూరి యుదాహృతులు:—ఉదా:—వాఁడు రాఁ
డయ్యెను - వారు రారయిరి. అది రాదయ్యెను - అవి రావయ్యెను. నీవు రావ
యితివి - మీరు రారయితిరి. నేను రానయితిని - మేము రామయితిమి. ఆ స్త్రీ
రాదయ్యెను - ఆ స్త్రీలు రారైరి. - వచ్చు + లజి (బా. క్రి. ౭ సూ.) =
వచ్చు+డుజ్ (బా. క్రి. ౮ సూ.). (బా. క్రి. ౯౧ సూత్రముచొప్పున రాదేశము)
= రాఁడు. అగు+లిట్ (బా. క్రి. 3 సూ.). అగు+డుజ్ (బా. క్రి. ౮ సూ.)
అగు+ఎను (బా. క్రి. ౧౬ సూ) అయు+ఎను (బా. క్రి. ౯౯ సూ.) ఆయు+ఎను
(బా. క్రి. ౧౦౦.) ఆయెను=అయ్యెను. (బా. ప్రకీ ౬ సూ.బా. సమా. ౧3 సూ.
ద్విత్వ హ్రస్వములు.) ఇట్లె తక్కినవాని రూపసాధన ప్రక్రియ నరయునది. సూరి
ప్రకృతసూత్రంబున "భూతంబున - లజికి" అని వచించెనే కాని తద్ధర్మాద్యర్థము
లందును లజికి లాడంతంబగు నగుధాతు వనుప్రయుక్తం బగుటయుఁ గలదు.
ఉదా:—వృష్టి లేదగును - నేను రానయ్యెదను - దీని నేను నమ్మనేరనయ్యెదను.
వాఁడు రాఁడయ్యె ననఁగా వాఁడు రానివాఁడయ్యె ననియు, నేను రానయ్యెద
ననఁగా నేను రానివాఁడనయ్యెదననియు నర్థముల నెన్నునది. డ్వాది ప్రత్యయములు
పురుషబోధక సర్వనామశబ్దసంబంధులె యను శబ్దతత్త్వచరిత్రము నిటఁ బరిశీ
లించునది. ప్రయోగములు 3౪౭ విషయపుఁ గల్పతరువున 'భూగమిక్రియరో
రిత్యాదికారికావ్యాఖ్యలో' విరివిగాఁ జూపఁబడెను. అట్లగుటచే నిట మరలఁ బున
రుక్తముగఁ జూపలేదు.

నఞ్యంతంబగు నగు ధాతువు క్రియావిశేషణంబుల
కనుప్రయుక్తం బగు; నుజికి విభాష నగు. ౧౧౫.
కాను అనునది నఞ్యంతంబగు నగు ధాతువు రూపంబు.
బాలవ్యా. దానికి హ్రస్వంబు విభాషనగు. ౧౧౬.
3౪౭ VI విష. లెస్సగాను - లెస్సగను. న్యాయ్యముగాను - న్యాయ్య
ముగను. ఇట పరశంబు నిత్యంబు. చూడఁగాను -
చూడఁగను - చూడను. ఇట స్వత్వంబు లేదు

సంజీవని. 3౪౭ VI విష:—'కాను' అనునది యగు ధాతు నఞ్యంతరూప
మని సూరియే వివరించెను. 'అగు+నఞ్' అనునపుడు బా - క్రి - ౯౧ సూత్రము
చొప్పున నగు ధాతునకు 'కా' దేశము రాఁగా 'కాను' అనురూప మేర్పడునని

రెఱుంగునది. అట్టి కాను శబ్దము నిత్యముగాఁ గ్రియావిశేషణముల కను ప్రయుక్త మగుననియు నుజ్యంతె క్రియారూపములకు విభాషగా ననుప్రయుక్త మగుననియు ౧౧౫ సూత్రమునకుఁ దాత్పర్యము. 'దానికి' అను ౧౧౬ సూత్రము లోని తచ్ఛబ్దమునకు 'నట్టి యను ప్రయుక్త 'కాను' శబ్దమున' కని యర్థము. అట్టి యనుప్రయుక్తమగు 'కాను' శబ్దమునకు వికల్పముగా హ్రస్వం బగునని ౧౧౬ సూత్రమునకుఁ దాత్పర్యము. ఇట్లు 'దానికి' అను దాని స్వారస్యముచేత 'కాన్+పట్టి = కాఁబట్టి' మున్నగుస్థలములందలి 'కాను' శబ్దమునకుఁ బాక్షిక హ్రస్వము రానేరదని యెఱుంగనగు. 'కఁబట్టి' మున్నగు ననిష్టరూపములు కల్గ నేరవని తాత్పర్యము. ఉదా:—"లెస్స+కాను = లెస్సగాను = లెస్సగను, న్యాయ్య ము+కాను = న్యాయ్యముగాను = న్యాయ్యముగను" అనునవి క్రియావిశేషణముల 'కాను' శబ్దానుప్రయోగోదాహరణములు. లెస్సగాఁ బఠించెను. న్యాయ్యముగాఁ బలికెను మున్నగు వాక్యములలో 'లెస్సగా - న్యాయ్యముగా' అనుపదములు తత్తత్క్రియానిష్ఠ విశేషములు దెల్పునగుటంజేసి క్రియావిశేషణము లనఁ బడుచున్నవి. క్రియానిష్ఠవిశేషవాచకము క్రియావిశేషణ మనిపించుకొనును. న్యాయ్యముగాఁ బలికె ననునపుడు పలుకుటలోని న్యాయ్యతను దెలుపుచుండుట చేత 'న్యాయ్యము' అనునది క్రియావిశేషణ మగుచున్నది. ఈ క్రింద వివరింపఁబడు రీతి నిట్టియెడల 'కాను'శబ్ద మనుప్రయుక్త మనుట సరికాదనవచ్చును గాని కొన్ని యెడల నిరర్థకముగా 'కాను - కను' శబ్దము లనుప్రయుక్తము లగుట లేకపోలేదు. క. పిలువంగఁ బడక సభలకు. (ఆది. ౬ ఆ. ౩౬.) క......ధారుణి నట్టి యపూర్వ స। భా రచనలు వినఁగఁ జూడఁ బడ వెవ్వరిచేన్ (సభా. ౨ ఆ. ౧౩౯.) (చూ. ౩౧౯ విష.) క.........ను। ష్కర తపమునఁ జేసి పడయఁగాఁబడు విద్యల్. (ఆర. ౩ ఆ. ౨౫౬.) (యతిస్థానగతము.)

'కాను' శబ్దము క్రియావిశేషణస్థలముల ననుప్రయుక్తమగునని చెప్పెనే కాని యట్టి 'కాను' శబ్దమునకు వాక్యమున నన్వయము సుసంగతముగఁ గన్పట్టు చుండుటంజేసి యిది యనుప్రయుక్తమన నక్కఱలేదని యెన్ననగును. విశేషణ మును క్రియలకు విశేషణము లగునపు డయ్యవి విశేష్యతా వివక్షచేఁ బ్రథమాం తములగుచు నగు ధాతుజ రూపమగు 'కాను' శబ్దముతో నన్వయించుననియు నట్టి 'కాను' శబ్దము క్రియతో నన్వయించుననియు గ్రహింపనగును. (చూ. ప్రౌఢ. శబ్ద. ౮-౧౨ సూ.) ఇది తెలుపుగ మెఱయుచున్నది-తెలుపగునట్లు మెఱయుచున్నది. ఇట నీ 'కాను' శబ్దమందలి 'ను జి' భావలక్షణార్థకమని యెన్ననగును. ఇట్టివి ప్రథ

మాంతము లగుటచేతనే యీవిశేషణముల మీఁది 'కాను - కను' శబ్దముల 'క'కారము బా - సంధి-౧౩ సూత్రము చొప్పున నిత్యముగా "గ" కారమగుచున్నది. ఈవిషయమునె సూరి 'ఇట సరళంబు నిత్యంబు' అను వాక్యముచే వివరించెను. సూరి పక్షమున 'గ - స - డ - ద - వా దేశము బహుళ మగుటంజేసి బహుళస్థలంబుగా నిత్యమై వచ్చునని యెన్నవలెను. ఇట స్వాత్వంబులేదు:—'చూడనుగన్' మున్నగు రూపములు లేవని భావము. తెల్ల - నల్ల - లెస్స మున్నగువానికి విశేషణత్వమె కాక విశేష్యత్వమును గలదు. "లెస్స-దే - వి - క్షేమము.........ణ - క్షేమయుక్తము........." (శ-ర). "నల్ల = నల. వి...... ౧ నలుపు. గీ. అమ్మహాశ్వంబు ధవళదేహంబునందు । నల్ల గలిగిన......(ఆది. ౨ ఆ. ౩౨.). న్యాయము విశేష్యము. న్యాయ్యము విశేషణము. "న్యాయ్యమ్. త్రి. న్యాయలబ్ధే......... న్యాయా దనపేతమ్ - ధర్మపథ్యర్థ న్యాయా దనపేత ఇతియత్........." (శబ్దా. చిం) "న్యాయముగానున్నది యని యేక యకారముతోఁ బలుకుట యవిచారిత రమణీయము. ఇచ్చట నేకయకారముతో నున్న న్యాయశబ్దము విశేష్యమే కాని క్రియావిశేషణము గానేరదు........" (బా. గు ప్ర. క్రియా. ౧౧౬ సూ. వ్యాఖ్య. ౨౦౬ పు. ద్వి. ము.) 'న్యాయము' అను విశేష్యము 'కాను' శబ్దముతో నన్వయించుటలో నవిచారిత రమణీయత యేమి కలదో తెలియకున్నది. "ఒక్కచో ద్వితీయాంతవిధేయ విశేషణంబునకుం బ్రథమయు నగు. ఉదా:—ఉ. ఎవ్వనిం । బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ జేకొనువారము... ......(ఆది. ౭ ఆ. ౧౫౬) (ప్రౌఢ. కార. ౨౭ సూ.). ఇట ద్వితీయాంత విశేష్యమునకు విశేషణ మయ్యు "పురోహితుఁడు" అనునది విధేయ విశేషణ మగుచుఁ గ్రియతో నన్వయించునపుడు ప్రథమాంత మగుచున్నది కాదా? (ప్రౌఢ. శబ్ద. ౮-౧౨ సూ). సంస్కృతభాషలోఁ గ్రియావిశేషణములు ద్వితీయాంతములై యుండు నను సంప్రదాయము గలదు. "తత్ప్రత్యనుపూర్వ మీప లోమ కూలమ్. (౪-౪-౨౮.) ద్వితీయాన్తా దస్మా ద్వర్తతే ఇత్యస్మి న్నర్థే ఠక్ స్యాత్. క్రియావిశేషణత్వా ద్ద్వితీయా - ప్రతీపం వర్తతే = ప్రాతీపికః (ప్రతికూలం యథా తథా వర్తతే ప్రాతీపికః = ప్రతికూలముగ = ప్రతికూలమగునట్లుగ వర్తించుచున్నాఁడు) ........." (సి. కౌ. ౧౫౭౮ సూ. తద్ధిత.) "ప్రతీపం వర్తతే ఇత్యాది వక్ష్యమాణ విగ్రహేషు వర్తతే రకర్మకత్వా త్కథం ద్వితీయే త్యత ఆహ - క్రియా విశేషణత్వాదితి. ఇదంచ కారక నిరూపణే నిరూపితమ్. 'క్రియావిశేషణానాం ప్రథమాన్తత్వ మేవ' ఇతి తు శబ్దేన్దుశేఖరే" (బాలమనోరమావ్యాఖ్య.). "లెస్స

గాను జనివె ఇత్యాది వాక్యములందు........సంస్కృతభాషలో మాత్రము...
......అకర్మక ధాతు క్రియావిశేషణంబులు సయితము ద్వితీయాంతములై యగు
నని భాషాపరిపాటీ విశేషము. ఏవిభక్తియు నిరూపింప శక్యముకానిచో సామాన్య
ముగాఁ బ్రాతిపదికార్థమందు ప్రథమావిభక్తియే న్యాయ్యంబు గాన "లెస్స" అను
ప్రథమావిభక్తింటెఁ బరమైన కాను శబ్ద కకారంబునకు సంధి - - ౧౩ సూత్రం
బున నిత్యముగా సరళ గకారంబై ద్విరూపము సిద్ధించె" (బా గు ప్ర. ౪౦౬
పు.ద్వి.ము.)సయిరీతిని గ్రియావిశేషణ స్థలములందు 'కాను'శబ్ద మనుప్రయుక్త మనుట
సరియని తోఁచుచున్నది. కాని "నుజేకి విభాషనగు" అను సూరివాక్యమును "దానికి
హ్రస్వంబు విభాషనగు"అను ౧౧౬ సూత్రమును బ్రయోగసమ్మతము లయియున్నవి.

'చూడఁగాను = చూడఁగను = చూడను' అని సూరి యుదాహరించెను. ఇట్లు
తుమున్నా ద్యర్థక 'నుజేకే' కాక బా క్రి. ౧౨౨ సూత్రమున విధింపఁబడిన వల
య్యాది క్రియాపరకత్వమున వచ్చు నుజేకిని 'కాను - కను' శబ్దము లనుప్రయుక్త
ములగుచున్నవి. ఇంతియకాక కర్త్రర్థమందును (బా. క్రియా. ౨౧ సూ). (చూ.
౩౧౯ విష.) భావ్యర్థమందును విధింపఁబడిన నుక్కునకుఁ బరముగా సయితము
'కాను - కను' శబ్దములనుప్రయుక్తములగుట కవి ప్రయోగదృష్ట మగుచున్నది.
ప్రయోగములు:—

క్రియావిశేషణములకు:—క......ఆతని। పుట్టిన విధ మెట్లు చెప్పు పోలు
పుగ నాకున్ (సభా. ౧ ఆ. ౧౩౪). చ.........యూ। నుగ నెడ నిశ్చయించె...
......(ఆది. ౭ ఆ. ౬౯). (ప్రాసగతము). చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశి
భాస్కర తారకాగణం। బనవరతంబుఁ ద్రిమ్మరు.........(అర. ౪ ఆ. ౩౮).
(యతిస్థానగతము). ఉ. కావున నీకు నప్రియముఁ గౌరవరాజునకుం బ్రియంబునుం।
గా విధి మెచ్చ బాహుబలగర్వ మఖర్వముగాఁగ లక్ష్మికిం। జేవయుఁ గీర్తి కున్నత
విజృంభణముం గలుగన్ ముకుంద గాం। డీవులఁ దాఁకి గెల్చెదఁ గడింది మగంటిమి
యుల్లసిల్లఁగన్ (కర్ణ. ౨ ఆ. ౧౦౫). ఇందు వివిధములగు కానుశబ్ద ప్రయోగ
ములు గలవు. 'విధిమెచ్చన్ - విజృంభణము కలుగన్' అను చోటులందలి నుజ్యం
తములు కాను శబ్దానుప్రయోగము లేకుండఁ బ్రయోగింపఁబడినవి. 'ఉల్లసిల్లఁ
గన్' అనుచోటి నుజ్యంతము కాను శబ్దాను ప్రయోగకలితమై ప్రయోగింపఁబడెను.
ఇట దీర్ఘమునకు హ్రస్వమును గలిగెను. ఈ ద్వివిధ ప్రయోగములును నతిప్రచు
రములై యంతటను వెలయుచుండును. కాన వీని కంతగాఁ బ్రయోగములఁ జూప
నక్కఱలేదు. 'బాహాబల గర్వ మఖర్వముగా' అనుచో 'అఖర్వముగా' అను

విధేయ విశేషణము 'కాను' శబ్దాన్వితమగుచుఁ బ్రయుక్తమయ్యెను. ఇంక "నీకు నప్రియ (నీకు కల్గునను) మును గౌరవరాజునకుం బ్రియంబును 'కాన్' ముకుంద గాండీవులఁ దాఁకి గెల్చెదను" అను వాక్యమున "అప్రియంబుగాను, ప్రియంబు గాను" అనునవి క్రియావిశేషణములు. 'గెల్చెదన్' అను క్రియకు విశేషణములు. చార్థక ను శబ్దముచే నొక్కచోఁ బ్రయుక్తమయినను 'కాన్' అను శబ్దము రెండు క్రియావిశేషణములతోను నన్వయించుచున్నది. కొన్నియెడలఁ గ్రియావిశేషణ ములు 'కాను - కన్' అనునవి లేకుండఁగనుఁ బ్రయుక్తములగును. "క్రియా విధేయ విశేషణంబుల మీఁది యగు ధాతువున కన్నంతమునకు లోపంబు విభాష నగు. ఉదా:— క్రియావిశేషణములకు:— పెల్లు దొరఁగు నెత్తురునై (భార. భీష్మ. ౧ ఆ). క. సౌందర్య విలాసాదుల। యందును తగులువడి యింతర మరయని మగవా। రుం దలుచు గలర.........(కళా) క. తెల్లము నాకెఱిఁగింపుఁడు। ......... (విష్ణు. ౨ ఆ). విధేయ విశేషణములకు:— క. లవణంబు కప్పు మడుగును। (ఉ. హరి. ౪ ఆ). తగువస్తువు లప్పన మంపువారు (కళా. ౬ ఆ,. వరునిప్రేము నడుము తెరువాటు గొట్టె. (కళా. ౭ ఆ). చ.........భవ। జ్జనకుఁ బరీక్షితుం భుజ గజాల్మః దసహ్య విషోగ్ర ధూమకే। తన మాతిఁజేసి చేసె నతిదాంతుఁ గృతాంత నికేతనాతిథిన్. (ఆది. ౧ ఆ). పక్షమున - పెల్లుగఁ దొరఁగు - కప్పుముగ నడు గుము - కృతాంతనికేత నాతిథిగ. మొ. మత్తులుగా నొనరించితె (సభా. ౧ ఆ). మొ. (ఇది 'కాను' శబ్దస్థితి కుదాహరణము)." (ప్రౌఢ. క్రియా. ౨౨ సూ). భవ జ్జనకుని గృతాంత నికేతనాథిగఁ జేసె నను మొదలగుచోటులందు 'కృతాంత నికేతనా తిథి' శబ్దము 'జనకున్' అనుదానికి విశేషణమగుచు వాక్యములో విధేయకోటి నధి రోహించుచున్నది గాన నది విధేయ విశేషణమని ప్రౌఢవ్యాకర్త యాశయము. కాని యట్టి విధేయ విశేషణము క్రియతో నన్వయించుచున్నది గాన "ఎట్లుచేసెను? కృతాంత నికేతనాతిథి యగునట్లు చేసెను?" అనురీతిని జేయుటలోని విశేషమును సైత మయ్యది తెల్పుచున్నది గావున నది క్రియావిశేషణములలో నంతర్భూతమె యని తలఁచి కావలయును సూరి వేఱుగ వచింపలేదు. "నీ జనకుని గృతాంత నికేతనా తిథిని జేసెను" అనురీతిని ద్వికర్మకముగా నిటఁ గొంద ఱన్వయింతురు. అట్లయినను 'కాను' శబ్దాన్వయము లేకుండఁగా సైతము విధేయ విశేషణములును గ్రియా విశేషణములును గ్రియతో నన్వయించుట లేకపోలేదు. ఉ......... పాపకారులకుఁ బాయు నవశ్యము నర్థధర్మముల్ (సభా. ౨ ఆ. ౧౩౬). అవశ్య ముగాఁ బాయునని కానుశబ్ద ప్రయోగమున నుండును. 'అవశ్యముగా' అనునది

క్రియావిశేషణము. ఉ. నీవు పాండవులు నెప్పటియట్ల........ఏలుచున్కి...
......(సభా. ౨ ఆ. ౧౩౬). (ఎప్పటియట్లుగ). ఇట్టివి పెక్కు పైని జూపఁబడినవి.
చ. కనకగిరిం బ్రదక్షిణముగా శశిభాస్కర తారకాగణం । బనవరతంబు ద్రిమ్మరు
(అర. ౪ ఆ. ౩౯). ఇందు 'ప్రదక్షిణముగా . అనవరతంబు ద్రిమ్మరురు' అని యిట్లు
'కాను' శబ్ద సహితముగాను 'కాను' శబ్దరహితముగాను క్రియావిశేషణములు
ప్రయోగింపఁబడెను. విధేయ విశేషణములు:—మ.........మేఘకథంబునం
దిరుగుచుండెన్ విస్మితుల్ గా జనుల్ (ఆది. ౨ ఆ. ౨౩౪). విస్మితు లనునది విధేయ
విశేషణము. సీ. అసిచర్మ కౌశలం బరయంగఁ జూపెడువారును.........లక్ష్యము
లేయువారు.........దక్షతఁ బ్రకటించువారును.........గదా కుశలత్వ మెఱఁ
గించువారును గా నిట్లు.........ఆ-వె.........పాండవ ధృతరాష్ట్రసుతులు...
తమతమవిద్యలు మెఱసిరి......... (ఆది. ౬ ఆ. ౧౨ ప). మెఱసిరి = మెఱ
యించిరి). ఇందుఁ జూపెడువారు మున్నగునవెల్ల విధేయ విశేషములై యగుచు
"కాను" శబ్దముతో నన్వయించుచున్నవి. ఉ.........వ్రతా । ధీవతఁ బొండ యన్న
మును ధేనువుమాత్రముఁ బాలు పానముం । గా నియతిన్ వసించి బహు కామ్య
ఫలంబుల.........(అను. ౩ ఆ. ౧౬ ప). కొన్ని క్రియావిశేషణ ప్రయోగ
ములు:—మ. సుతువాఁడై.........వే । గ తెగం బాఱుకు........(ఉద్యో. ౩
ఆ ౨౫) ఇచట 'వేగ = వేగగా = వేగముగా' అని యర్థము. ఇట్లు 'వేగ' అను
నది క్రియావిశేషణ మగుటచేతనే యిచట గసడదవాదేశము రాదయ్యెను.
(చూ. ౨౪ IV విభ. తుదిపుట). క. కీచకుని యింట......... । వే చని యిచటికిఁ
గొనిర । మ్మా నూతము.........(విరా. ౨ ఆ. ౮౫ ప). ఇచటి 'వే'శబ్దమునకు
'వే+కన్ = వేగన్' అని క్రియావిశేషణపరముగనె యర్థము నెన్నవలెను. ఇట్లగు
టనే యిచటను గసడదవాదేశము రాలేదు. చ. వికృతపు చావు చంపమది
వేడుక పుట్టె.........(విరా. ౨ ఆ. ౩౫౩ ప). (వికృతపుచావు = వికృతపుచావు
గన్) ఇచటి క్రియావిశేషణము కాను శబ్ద విరహితముగఁ బ్రయుక్తమయ్యెను.
ఉ. వారలు పూనినట్లు వనవాసము సల్పిరి వీరు వేచి త । మ్మారయఁగా బయల్పడని
యట్లుగ నుండెడు వత్సరంబునం । జేరువ చేరువల్ గడచె.........(విరా. ౩ ఆ.
౧౦౭). 'పూనినట్ల = పూనినట్లుగనె' కాను శబ్దవిరహితమగు క్రియావిశేషణ
ప్రయోగము. "బయల్పడనియట్లుగ" కాను శబ్దసహిత క్రియావిశేషణ ప్రయో
గము. "చేరువ చేరువల్ గడచె" చేరువ చేరువలుగాఁ గడచిపోయినది. ఇది కాను
శబ్దలోపకలిత క్రియావిశేషణ ప్రయోగము. ఇట్టివి మఱికొన్ని:—కం.........

మనం । బునఁ బొంగి యనుజ సహితము । చని.........(నిర్వ. ౨ ఆ. ౮౧).
ద్విపద. ఆలలనకు నతఁ డష్టాంగ మెరఁగి । (బసవ. ౬ ఆ. ౭౩).

కొన్ని ధ్వన్యనుకరణాది శబ్దస్థలములందు 'అను' ధాతు విరహితముగాఁ బ్రయోగించుటయు నట్టియెడల నట్టి యనుకరణశబ్దములు క్రియావిశేషణములుగా 'పాతిక' కాను శబ్దప్రయోగసహితముగాఁ బ్రయోగింపఁబడుటయుఁ గలదు. వడ వడ జమదగ్ని సూతి వడఁకెన్. (౧ మా. ౪ ఆ.) సీ. వేసవిఁ గణకణ వేఁగు చట్రాతిపై (నిర్వ. ౩ ఆ. ౬౩). ఇట్టియెడల 'వడవడగా' జమదగ్ని సూతి వడఁకెననియు 'కణ కణగా' వేఁగు చట్రాతిపై ననియు వీనిని క్రియావిశేషణములుగా నెన్నవగునని యీ క్రింది ప్రయోగము విశదీకరించుచున్నది. మ.........హరియుం భుగుల్ భుగులుగాఁ గ్రక్కెన్ వెస న్నెత్తురుల్. (ఉ. హరి. ౪ ఆ. ౨౩౧.) "సీ. అడుగుడు నీకుఁగా నని సేయుటొక్కటి దక్కఁగ.........(భీష్మ. ౧ ఆ. ౧౫౭.) కం...... నీమానసమునఁ గృప గలిమిఁ గాన్. (స్త్రీ. ౧ ఆ. ౮౭.)" అనురీతి ప్రయోగములును గలవు. కాను శబ్దమునకుఁ బరముగా 'కల' మున్నగువాని యధ్యాహారమును గవిప్రయోగ దృష్ట మగుచున్నది. (చూ. ౩౦౯ I విష.) క. నీచెప్పెడు పెద్దలు ద్రో। ణాచార్యుఁడు మొదలు గాఁగ నని కొల్లని వా। రై చన్న। (ఉద్యో. ౨ ఆ. ౨౫౦ ప) (ద్రోణాచార్యుఁడు మొదలుగాఁగన్ = మొదలుగాఁగలవారు.) మత్త కోకిలము. అంబుధీశుఁడు లోనుగా సుర లస్మదాకృతు లుర్వి...... ..(ఆర. ౪ ఆ. ౨౬౮.) (అంబుధీశుఁడు లోనుగాన్ = వరుణుఁడు లోనగు)

"ఒకానొకచో నన్నంతమగు నగు ధాతువు దీర్ఘంబునకు భావ్యర్థంబున నున్న పరంబగునపుడు హ్రస్వమును గానంబడియెడి. ఉదా:—క. తరుణీ యేరికిఁ జెల్లునె। యరయఁగ నేమింతవార మనుకొన నిదిగోఁ। బిరుసీకు గనున్నది తాఁ। గర మద్భుతమైన సవతి కయ్యము చేతన్. (కనున్నది = కానున్నది యని యర్థము. పిరుసీఁకు కర్త.) (కళా. ౧ ఆ.). ఉ.........నీకు నాథుఁడు గనున్న మహామహు నా నృపాలు నా। కెప్పుడు చూడఁగాఁ గలుగు. (నాథుఁడు గనున్న=నాథుఁడు కానున్న యని యర్థము.) (కళా. ౫ ఆ.) మొ సూరి యనుప్రయుక్తముగు 'కాను' శబ్ద దీర్ఘమునకే హ్రస్వము వచ్చునని సూత్రింపఁగా దానిని సామాన్య విధిగ నెన్ని త్రిలింగలక్షణశేషకర్త యనుప్రయుక్తము కాని స్థలమందును హ్రస్వము గల్గుట గలదని యొక విశేషమును సూత్రించెను. అట్లు సూత్రించుటలోఁ దనకు లభించిన కళాపూర్ణోదయ ప్రయోగద్వయమునందె వర్తిల్లునట్లుగ ననుగమమును గల్పించెను గాని పింగళి సూరన యట్లు ప్రయోగించుటకు మూలమా యనఁదగు స్థలాంతరము

లందును గ్రామ్యచిత్రముగా నట్టి ప్రాస్వము గవి బ్రహ్మాదిగ్రంథములందుఁ జూపట్టు చున్నది. క. తనయింటఁ గలుగు నన్నము । మును దేవతలకు నివేద్యముగఁ జేసి ప్రణా । మ నియమ సహిత సమర్పణ । మునఁ గృతకృత్యుఁడు గవలయుఁ బురుషుం డనఘా. (అను. ౪ ఆ. ౨౬ ప) (కవలయును = కావలయును). సీ. అనుపమ ముక్త్యంగ నాథీశుఁడు గఁగోరు నతఁడేల కుజనుల సఖుల కొలుఁగు. (నన్ని. కు. ౬ ఆ. ౭౨౨). (కఁగోరు = కాఁగోరు). ద్విపద. నీకుఁ । దాఁ బ్రధాని గఁదగు ధరణీశ యనిన. (బసవ. ౨ ఆ. ౧౦.) కాను బ్రధాని 'కఁదగును' అని కాని 'ప్రధానిగ నుండఁ దగును' అని కాని యర్థము చేయక తీరదు. గీ. నాభిరంధ్రంబు సప్త కంఠ స్వరములు । మూఁడు నత్యంత గంభీరములు గవలయు. (కాశీ. ౪ ఆ. ౨౬ ప.)

బాలవ్యా. ఉన్న కల న వర్ణకంబుల మీఁది తచ్ఛబ్ద వకారంబునకు
౩౮౭ VII విష. లోపంబు విభాష నగు. ౯౧౭.

సంజీవని. ౩౮౭ VII విష:—ఈసూత్రమున కీవలను ౨౧౦ IX విషయమున వ్యాఖ్య చేయఁబడెను. ౨౧౦ VIII విషయము సైతము (ఇందె ప్రయోగములు చూపఁబడినవి.) మీవిషయమునఁ జూడనగును. చేయుచున్నవాఁడు = చేయుచున్నాఁడు. చేయఁగలవాఁడు = చేయఁగలాఁడు. చేసినవాఁడు = చేసినాఁడు మున్నగునవి జంటపదములె యగుటచే నీసందర్భమున వివరింపఁబడెను.

బాలవ్యా. వలయ్వాది క్రియలకుఁ గర్తయగు భావంబునందు
౩౮౮ VIII విష. నజి యగు. ౧౨౨.

సంజీవని. ౩౮౮ VIII విష:—ఈసూత్రమున కీవలను ౩౦౯ I విషయమున వ్యాఖ్య చేయఁబడెను. ౩౦౯ విషయము సయితము చూడఁ నగును. ఇవియు జంట పదములె యగుటచే నిటఁ బ్రదర్శింపఁబడెను.

సన్నయా.
ధర్వణీయము.
౩౪౮ విషయము.

క్రియాః ప్రసిద్ధా బహావ । శ్శబ్ద పల్లవ సంజ్ఞికాః ।
శబ్దశక్త్యా పరిప్రాప్త । స్సర్వ త్రార్థోహి గృహ్యతే.
(వికృ. క్రియా. ౨౯-౩౨ కా. అహో. ౫౦౮ విష)
ప్రథమాయా ద్వితీయాయా । స్సంబన్ధ స్తత్ర సమ్మతః.
తయో ర్విధి ర్యథాయోగం । తత్సమా ద్వైకృతా
దపి । క్రియాయా ఉపచారః స్యా । త్త్రివిధమాపద
సంగతౌ । అకర్మకత్వం ప్రాయ స్స్యా । త్పర త్రో భయ
సమ్మతిః । క్వచి ద్విభక్తి వైచిత్ర్యం । దృశ్యతే కవి
భాషితే । క్వచి న్నైవ వికారః స్యా । ద్బాధకా

చ్ఛబ్ద పల్లవే। కేచి చ్ఛబ్దవిశేషాః స్యుః। క్రియాయోగే
ద్రుతాన్వితాః। (వికృ. క్రి. ౩౦-౩౧-౩౨-౩౩ కా.
అహో. ౫౦౮- ౫౦౯-౫౧౦ పు.)

కల్పతరువు. ౩౪౮ వివ:—శబ్దపల్లవ సంజ్ఞికాః=శబ్దపల్లవము లను సంజ్ఞగల, బహవః - క్రియాః = అనేకములయిన జంట శబ్దములగు క్రియలు, ప్రసిద్ధాః = కవి ప్రయోగములందుఁ బ్రసిద్ధములయి యున్నవి. పల్లవ మనఁగాఁ జిగురు. రెండు దళము లేకీభవించి పల్లవముగా సంకురించినట్లు రెండుశబ్దములు కలిసి యొక శబ్దముగ నేర్పడుటచే నట్టిది శబ్దపల్లవ మనిపించుకొనును. పల్లవమువంటి శబ్దమని తాత్పర్యము. ఇట్టి వ్యుత్పత్తినిబట్టియు బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణాదులను బట్టియు శబ్దపల్లవ పూర్వావయవము నామమే కానక్కఱ లేదనియు ధాతువైనను గావచ్చుననియు నుత్తరావయవము మాత్రము ధాతువె యై యుండవలయు ననియుఁ దోఁచుచున్నది. శబ్దపల్లవసంప్రోక్తపదిష్టములగు నీయథర్వణ కారికలను బట్టియు వీనికి వ్రాయఁబడిన కవిశిరోభూషణ వివరణోదాహరణములను బట్టియు శబ్దపల్లవధాతు పూర్వావయవము సుబంతమె యై యుండవలయుననియు నయ్యది ప్రథమాంతముగఁ గాని ద్వితీయాంతముగాఁ గాని యుండుట సమ్మతమనియు విశదమగుచున్నది. ఆట్లె యహోబలపండితుఁడు శబ్దపల్లవములుగా నుదాహరించిన పెక్కు ధాతువులలో నొక్కటైనను ధాతు పూర్వావయవము కానరాదు. ఎల్ల యుదాహృతులును సుబంత పూర్వావయవములు గానె యున్నవి. అట్లయినను వికృతి వివేక టీకాకర్త యహోబలపతినే యనుసరించి కవిశిరోభూషణములోని సుబంత పూర్వావయవ ధాతువులను మాత్రమె శబ్దపల్లవములనుగా నుదాహరించియు శబ్దపల్లవవివరణమున "ధాత్వాదుల కనుప్రయుక్తంబులై విలక్షణార్థాభిధాయకంబులగు ననేకధాతువులు శబ్దపల్లవము లనిపించుకొనును" (వికృ. ౩౦ కారి. టీక.) (౧౬౯ పు.) అని వ్రాసెను. ఈవ్యాతింత్రిణీ సీతారామకవి పెట్టిన భిక్షమె బాలవ్యాకరణ కర్తృప్రభృతులగు తరువాతివారి కెల్ల గతి యయ్యెను. బాలవ్యాకరణాదులందె కాక నన్నయాథర్వణీయ వివరణమగు నారాయణీయాంధ్రవ్యాకరణ గాణపతవివరణములందును నట్టి వికృతి వివేక టీకా వాక్యమె విస్తరింపఁబడెను. "ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు" (బా. క్రి. ౧౧౮.) అని సూత్రించి సూరి కవిశిరోభూషణోదాహరణములను జాలవఱకు విడిచి "మారు చుండు............అఁకొను" మున్నగు మార్గాంతరానుకూలోదాహరణముల

నొసంగెను. అది శబ్దముచే నవ్యయమును నిల్వనగును. 'కొనిపోవు' అని సూరి యుదాహరించెను. అట్టి సూరి మార్గమునె తత్ప్రాతివారెల్ల ననుసరింపసాగిరి. నన్న యాథర్వణీయాంధ్రీకరణ నారాయణీయ గాణపతవివరణము సయితము మీమార్గము ననె పోవుట వింత. 'గీ. సంగతి మెయి వైకృతమొ తత్సమమొ యైన। ప్రథమకు ద్వితీయకు నిట సంబంధ మొదవు' (నారా. క్రి. ౪౦౫ కారి. ౭౨ ప.) అని మూలముండఁగా దాని వివరణ మీక్రిందిరీతిని వ్రాయుట సరియా? "ధాతువులు ధాత్వాదుల కనుప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నయ్యవి శబ్దపల్లవంబులు నాఁబడు. పల్లవశబ్దమున కిట లక్షణచే సంతాన్యార్థకత్వము. శబ్దపల్లవము లనఁగాఁ క్రియానామపదములకుఁ జివర రాఁగా నేర్పడినవి యని వ్యుత్పత్త్యర్థము" ఈతుది వాక్యమున కర్థమేమో? యది పూర్వవాక్యముతో నెట్లు సంబద్ధపడునో తెలియకున్నది. "గీ. శబ్దపల్లవ క్రియ లౌపచారికార్థ। మగుట నవయవార్థ విహీనమై యొసంగు।........." (నారా. క్రియా. ౪౧౬ కారి. ౭౩ ప.) శబ్దపల్లవక్రియ లవయవార్థ విహీనము లగునఁట! మీఁద నుదాహరించిన "క్రియాయా ఉపచారః స్యాత్" అను నథర్వణ సూత్రమును దాని కవిశిరోభూషణ వివరణమును వీరి కెట్టి యర్థము నిచ్చినవో తెలియకున్నది? "ఔపచారికార్థంబు = లాక్షణికార్థము. వ్యుత్పత్త్యర్థరహితమైయుండి సమస్తముగ నొక విలక్షణార్థమును దెలుపుచుండునని భావము" (గాణ. ౪౧౬ కారి. ౭౩ పద్యపు వివరణము). ఇట్లు సూరి యర్థమును స్వీకరించుట కేల యత్నించిరో తెలియకున్నది. "క్రియాయా ఉపచారః స్యాత్ ప్రథమాపదసంగతౌ" అని యథర్వణుఁడు శబ్దపల్లవ ధాతువుయొక్క పూర్వావయవము ప్రథమాంత మగునపుడు మాత్రమె యుత్తరావయవమగు క్రియ యర్థము కర్తయం దౌపచారిక మగునని చెప్పుచుండఁగా నెల్లవిధములగు శబ్దపల్లవ క్రియలను నవయవార్థ విహీనములగునని వచించుటకు వీరెట్లు గడంగిరో తెలియకున్నది. ఈసందర్భమున వీరికెల్ల మార్గదర్శకుఁడగు వికృతి వివేక టీకాకర్త కీక్రింది కవిశిరోభూషణసూక్తి సరిగా నర్థము కాలేదని తోఁచుచున్నది. "ఆధేయనిష్ఠ క్రియాయా ఆధార ఆరోపణ ముపచార ఇత్యుచ్యతే" (అహో. ౫౦౮ పు.) "ఆధేయక్రియకు నాధార క్రియయం దారోప ముపచారమనుట" (వికృ. టీక. 3౧ కా. ౧౬౯ పు.) "తా - క్రియకు నుపచారము ప్రథమావిభక్తితోఁ గూడుకొనినదగు చుండఁగాఁ దలుచుగా సకర్మకత్వ మగును." (వికృ. 3౧ కా. తాత్పర్యము. ౧౭౦ పుట.)

3౭౮ విషయమున వచింపఁబడినట్లుగ నాంధ్రభాష యనంతమును జిత్ర స్వభావములతోఁ గూడినదియు నయియున్నది. "భాషేయ మమితా తత్ర। దేశ్యా

చిత్ర స్వభావయుక్ । తచ్చిత్ర కానుమ స్తవాన్ । పూజ్యపాద సుభాషితే......
భూయసీ దేశ్యశబ్దేషు । లోపవర్ణాగమ శ్రుతిః" (౩౭౮ విష) అను చొప్పునఁ
దెల్గున విశేషార్థము గల్గునపుడును నొక్కొకచో నర్థవిశేష మంతగా లేనపుడును
గొన్నిశబ్దముల మేళనము ప్రసిద్ధమై వివిధములగు లోపాదేశాదులతో ననేకస్థలము
లందుఁ జూపట్టుచున్నది. అట్లు మేళగించిన శబ్దముల గుంపిని (మొత్తమును) శబ్ద పల్లవ
మనుట ప్రామాణికుల యాశయము కాదు (౩౪౭-౩౪౭ I మొ. ౩౪౭ VI విష).
శబ్దపల్లవసంజ్ఞ సంస్కృతాది వ్యాకరణములం దెందును గన్పట్టదు. భట్టారకుఁడును
వాడలేదు. ఈసంజ్ఞ నథర్వణాచార్యుఁడె మొదట వచించెనని తోఁచుచున్నది.
పయిసందర్భమునుబట్టి - చదువుచుండు - చదువఁగల్గు - చదువఁబడు - చదువుకొను -
మొదలగు ధాతువులును, బా. క్రి. ౧౦౯ సూత్రముమొదలు ౧౧౨ సూత్రము
వఱకు వివరింపబడిన వివిధములగు శబ్దముల జంటలుగానుండు ధాతువులును
నింకను వివిధములగు శబ్దముల జంటలును శబ్దపల్లవము లనఁబడుట సంప్రదాయము
కాదు. (చూ. ౩౪౭ ౩౪౭ I మొ. ౩౪౭ VI). జంటశబ్దములలోఁ బూర్వా
వయవము సుబంతముగాను నుత్తరావయవము ధాతువుగాను నుండు
రూపములుమాత్రమె శబ్దపల్లవములని యథర్వణునిచే నుపదేశింపఁబడినట్లు
కన్పట్టుచున్నది. ధాతువులు నవ్యయములును బూర్వావయవములుగా నున్నవి
శబ్దపల్లవము లనుట యథర్వణసమ్మతమని యాతని పై వివరణమువలన తోఁచనేరదు.
కాలక్రమమున నర్వాచీనులు నథర్వణోపదిష్ట వివరణమునకు భిన్నములగువానిని
నైత మనఁగా ధాత్వాదులు పూర్వావయవముగాను ధాతుమాత్ర ముత్తరావయవము
గాను నుండునవెల్ల శబ్దపల్లవములె యని వ్యవహరింపసాగిరి. అందును నొకరీతి లేదు.
ఒక్కొక్క రొక్కొక్క రీతిని వ్యవహరించియున్నారు. తుదికి బాలవ్యాకరణ
ప్రౌఢవ్యాకరణములకైనను నైకమత్యము కానరాదు. బా. క్రి. ౧౦౯ మొదలు
౧౧౨ వఱకుఁగల సూత్రములందు నిలువఁబడు - పండుకొను - అఱుదెంచు - అరు
దెంచు - (రాఁదయ్యెను) రాఁడగు - లెస్సయగు (లెస్సగ) వండుచుండు - వండఁ
గల్గు మున్నగు వివిధములగు జంటశబ్దములతోడి ధాతువులు ప్రసంగింపఁబడెనేకాని
యవి శబ్దపల్లవములని వచింపఁబడలేదు. అథర్వణుఁడు తలంపని యొక నూతన
లక్షణము వికృతివివేకానుసారి సూరిచే నుద్దేశింపఁబడినట్లు విశదమగుచున్నది. అట్టి
జంటశబ్దముల ధాతువులలోఁ బూర్వోత్తరావయవశబ్దముల యర్థమునకన్నఁ దన్మి
శ్రణ శబ్దపల్లవ ధాత్వర్థమందు వైలక్షణ్య ముండవలయునని సూరియుఁ దదను
యాయులును దలంచినట్లు బా. క్రి. ౧౧౮ సూత్రము మున్నగువానివలన స్పష్ట

కడుచున్నది. కాని ముందు వివరింపఁబోవు రీతిని వారిచ్చిన యుదాహృతులం దట్టి యర్థ వైలక్షణ్యము నియతముగాఁ జూపట్టుచున్నది. (3౭వ I విష). ప్రౌఢ వ్యాక రణకర్త యట్టి జంటశబ్దముల ధాతువులను గొన్నిటిని శబ్దపల్లవములనియుఁ గొన్ని టిని ద్వ్యవయవ క్రియలనియు నీక్రిందిరీతిని వ్యవహరించెను. "శబ్దపల్లవ క్రియ లును ద్వ్యవయవ క్రియలును సమాస్తంబులయి పునర్గృహీతంబులగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాషనగు. ఉదా:— ఆ లతాంగిఁ దో! డ్కొని చనుదెమ్ము తేవనువు కూడనివక్కముఁగం దు (భోజ. 3 ఆ). ఇలకుం దివికిం జననిచ్చు నిచ్చి యేవని వెసవార్చు......(భాస్క. ఆ. కాం. ౨ ఆ). పక్షమున - చనుదే - చవ నిచ్చి - మొ." (ప్రౌఢ. క్రియా. ౨౫ సూ) ఇందు 'చనుదెమ్ము' అను నది శబ్దపల్లవక్రియయనియు "చననిచ్చు" అనునది ద్వ్యవయవ క్రియయనియుఁ నుదాహరింపఁబడెను. 'చనుదెమ్ము' అనునది శబ్దపల్లవ క్రియయనుట సూరికి సమ్మ తముకాదు (చూ. బా. క్రి. ౧౧౧ సూ). సూరిశబ్దపల్లవముల నుదాహరించుటలో 'చనుదెంచు' మున్నగు పూర్వసాధిత రూపములలో నొక్కటినేని చూపలేదు. 'చనుదెంచు' మున్నగురూపములను ౧౦౯ మొదలు ౧౧౭ వఱకుఁగల సూత్ర ములతో వేఱుగ నిరూపించి తద్భిన్నములగు శబ్దపల్లవములను వేఱుగ నుపదేశిం చెను. (బా. క్రి. ౧౧౮).

శబ్దశక్త్యేతి:— శబ్దశక్త్యా = శబ్దమునకుఁగల యర్థబోధకతా శక్తిచేత, పరి ప్రాప్తః = సంభవించినట్టి, అర్థః = అర్థమె, సర్వత్ర = అంతటను, గృహ్యతేహి = గ్రహింపఁబడును. "శబ్దశక్తిమహిమ్నా యో ఽర్థః ప్రాప్తశ్శాస్త్రమాత్రే తాదృశ ఏవార్థః ప్రామాణికై ర్గృహ్యతే, వివక్షితార్థ ప్రతిపాద నాక్షమం పదం నప్రయోజ్య మిత్యర్థః." (అహో. ౫౧౧ పు). శబ్దము నుచ్చరించినతోడనె యొకానొక యర్థ మును స్ఫురింపఁజేయు నీశ్వరేచ్ఛ శబ్దశక్తి యనఁబడును. "శక్తిగ్రహ - పుం. శవే. కార్తికేయే - శబ్దశక్తిజ్ఞానే - అస్మాత్పదా దయ మర్థో బోద్ధవ్య ఇతీశ్వరేచ్ఛా శక్తిరితి తార్కికాః. తద్జ్ఞానంతు వ్యాకరణాదిభ్యః - అత ఏవ శక్తి గ్రహం వ్యాకరణోపమాన। కోషాప్తవాక్యా ద్వ్యవహారతశ్చ। వాక్యస్య శేషా ద్వి వృతే ర్వదన్తి। సాన్నిధ్యత స్సిద్ధపదస్య వృద్ధా ఇతి ప్రాహుః" (శబ్దా. చిం). ('వ్యవహారతశ్చ' అనఁగా లోకవ్యవహారమునుండియుఁ గవిప్రబంధ వ్యవహారము నుండియు శబ్దశక్తి గ్రాహ్య మగునని తాత్పర్యము). ఈరీతిని శబ్దపల్లవముల యర్థము కవి వ్యవహారజ్ఞేయమని యొఱుంగునది. అర్థము మహాకవిప్రయోగముల మూలమునఁ దెలిసికొన్నట్లె వాని సంధియందలి వర్ణలోప వర్ణాదేశ ప్రభృతులు నైతము ప్రయోగవేద్యము లని యెన్నునది.

ప్రథమాయా ఇత్యాదిః—ప్రథమాయాః = ప్రథమావిభక్తియొక్కయు, ద్వితీయాయాః = ద్వితీయావిభక్తియొక్కయు, సంబన్ధః=అన్వయము, తత్ర = ఆశబ్ద పల్లవము లజంట లేదు, సమ్మతః = సమ్మతమగును తయోః=ఆజంట శబ్దములయొక్క, విధిః=విధానము, తత్సమాత్=తత్సమశబ్దమునకంటెః బరముగునట్లు గాంగాని, వైకృతాదపి = అచ్ఛికశబ్దమునకంటె బరముగునట్లుగాని, యథాయోగమ్=యథాప్రయోగముగా ధాతువు నిల్పుట సమ్మతమగును. ప్రథమాపద సంగతౌ=శబ్దపల్లవపు జంట లోని పూర్వపదము ప్రథమాంతమగునపుడు, క్రియాయాః=ఉత్తరశబ్దమగు క్రియ యొక్కయర్థము, ఉపచారఃస్యాత్=ఆధారభూతకర్తయం దౌపచారికముగా వర్తిల్లును. ఇట్లు ప్రథమాంతము పూర్వపదమగునపుడు, ప్రాయః=తఱుచుగ, అకర్మకత్వం స్యాత్ = ఆశబ్దపల్లవ క్రియ కకర్మకత్వము సంభవించును. 'ప్రాయః' అనుటచే నరుదుగ సకర్మకత్వమును గల్గవచ్చును. పరత్ర = అందలి పూర్వపదము ద్వితీయాంత మగునపుడు, ఉభయసమ్మతిః=సకర్మకత్వాకర్మకత్వములు రెండిటికిని సమ్మతి గల్గును. ఉదా:—పూర్వావయవము ప్రథమాంతమగునపుడు:—రూపఱు = రూపుచెడు= నశించు; పెంపఱు = పెంపుచెడు = క్షీణించు = నశించు. 'వాఁడు రూపఱెను' అనుచో రూప మాధేయము, 'వాఁడు' అను తత్పదార్థ మాధారము. ఈ వాక్యము నందు నశించినది యాధేయభూతమగు రూపమె యయినను నట్టి నశించుట యాధార భూత తత్పదార్థము (వానియందు) దుపచరిత మగుచున్నదని గ్రహింపవలయును. ఇట్లె యంతట నెఱుంగునది. 'రూపఱు' అనుదానిలోని పూర్వావయవము తత్స మము. 'పెంపఱు' అనుదానిలోని పూర్వావయవ మాచ్ఛికము. రూపఱు పెంపఱు మున్నగు ప్రథమాపద సంగతిగల శబ్దపల్లవము లకర్మకము లగుచున్నవి. ప్రాయశ్శబ్దముచేఁ గ్వాచిత్కముగా సకర్మకత్వమును గలదు. "అంబుభుజా నను వివాహమగుదే యనినన్" (ఆది. 3 ఆ. ౧౬3). ఇట 'వివాహమగు' అనునది సకర్మక మగు శబ్దపల్లవధాతువు ఇం దగునట్టిది యనఁగా జరుగునట్టిది వివాహము. అట్టి 'అగుట' అనునది కర్తమగు యయాతి నౌపచారికముగా నాశ్రయించుచున్నది. శబ్దపల్లవ పూర్వావయవము ద్వితీయాంతమగుట కుదాహరణము:—చిందులాడు = నాట్యమాడు = నర్తించు. 'చిందులన్ = చిందులు+ఆడు = చిందులాడు' అను శబ్దపల్లవమునందలి పూర్వావయవము 'చిందులన్ = చిందులు' అనునది ప్రథ మాంతమెయైనను నది ద్వితీయార్థకము. ఇది యకర్మకత్వోదాహరణము. ఇంక ద్వితీయాంతము పూర్వావయవ మగునప్పటి సకర్మకత్వోదాహరణము:—'ఆమె వానిని జెట్టపట్టెను' అనుచో 'చెట్ట' యనఁగా నడ్డిమీఁది భాగము. లేదా

హ స్తము. ఇట 'చెట్టన్ = చెట్ట' అనునది ప్రథమాంతమైనను ద్వితీయార్థకము. సకర్మకధాతువు.

పయిరీతినె యీకారికల కహోబలపండితుఁడ ర్థముచేసెను. "అకర్మకత్వం ప్రాయః స్యా దిత్యస్య పూర్వత్రాన్వయః. పరత్ర = ద్వితీయా సంబన్ధస్థల ఇత్యర్థః. అత్రాధేయ నిష్ఠక్రియాయా ఆధారే ఆరోప ఉపచార ఇత్యుచ్యతే. పెంపెక్కుచున్నాఁడు........ దెరచెడి - దిక్కుచెడి - పదనెక్కి - లావతి - పెంపతి - బలమతి.........సొంపారి - పెంపారి..........ఇత్యాదిరూపాణి ప్రథమాసంబన్ధ ఉదాహరణమ్. ప్రాయోగ్రహణాత్ క్వచిత్ సకర్మకత్వమపి.........అలఘు భుజా నను వివాహ మగుదే యనినన్ ఇత్యాదివచన మాచార్యస్య......చిందులు ద్రొక్కి - నాట్యమాడి - త్రొక్కులాడి.........విజయంచేసినతఁడు ......... ఏతాదృశాని రూపాణి ద్వితీయాసంబన్ధ అకర్మకత్వ ఉదాహరణమ్. అతని మార్గాని - వీడ్కొని - చేకొని..........చెట్టపట్టి.........ఇత్యాదీని బహూన్యుదాహరణాని సకర్మకత్వే." (అహో. ౫౦౮-౫౦౯ పు).

ప్రయోగములు:— తే.గీ పథ్యముగ పల్కు ప్రియులందు బలిమినైనఁ । బలుకవలయు మోమోడక.........(సభా. ౨ ఆ. ౧౯౨). క. సుందరిఁ బాంచాలేంద్ర సు । తం దోడ్కొని రమ్ము.........(సభా. ౨ఆ. ౨౧౧). చ......... నిన్ను నుం । బుడమిని దమ్ముఁ గోల్పడిరి పార్థి భవత్సుతులైన పాండవుల్. (సభా. ౨ ఆ. ౨౧౪). క. సాహసమున యుద్భావహ్ని గ । దాహతి దుర్యోధనాదులగు రిపుల జగ । ద్ద్రోహులఁ జంపుదు నత్యు । గ్రాహవమున హరిహరాదు లడ్డంబైనన్ (సభా. ౨ ఆ. ౨౯౫). క. పోయెద నీవును విజయము । చేయుము యందులకుఁ జెలిమి సేయుము నాతోన్ (ఆ<. 3 ఆ. ౯౯). క. నాకారణమున బుత్త్రిజుఁ । డేకాంతము నరకగతికి నేఁగెను వానిం । దోకొని పోయెద నని శుభ । లోకంబున కరిగెఁ ద్రిదశ లోకస్తుతుఁడై (ఆర. 3 ఆ. ౨౨౦). మొ.

క్వచి ద్విభక్తిత్యాది:— క్వచిత్ = శబ్దపల్లవ క్రియలలోఁ గొన్నియెడల, విభక్తి వైచిత్ర్యమ్ = వివిధ విభక్తులు నిల్చెడి వైచిత్రి, సప్తమ్యాదులచోటఁ బ్రథమనిల్చు వైచిత్రి మొదలగునది, కవిభాషితే = కవిప్రయోగములందు, దృశ్యతే = కనఁబడుచున్నది. ఉదా:—"నిన్ను దానిం బెండ్లి చేసెదన్. నీకు దానికిఁ బెండ్లి చేసెదన్. ఇద్దఱకుఁ బెండ్లియగున్ ఇత్యాదౌ విభక్తి వైచిత్ర్యం ప్రామాణిక ప్రయోగతో వగన్తవ్యమ్." (అహో. ౫౦౦-౫౧౧ పు). క. నైపడు నాపద నైఁటిన భూపాలా.........(భాస్క. ఆరణ్య. శ. ర).

క్వచి న్నైవేత్యాదిః—క్వచిత్ = ఒకప్పుడు, రూఢత్వాత్ = కవిప్రయోగ ప్రసిద్ధమగుటచేత, శబ్దపల్లవే = శబ్దపల్లవక్రియయందు, వికారః నైవ స్యాత్, గసడదవాదేశాది వికారమును గలుగదు. ఉదా:—"చేకొని ఇత్యాదౌ న 'గ' కారాది వర్ణవికారః క్వచిన్నైవ వికారః స్యాత్। రూఢత్వా చ్ఛబ్దపల్లవ ఇతి తస్యై వోక్తేః" (అహో. ౫౦౯ పు). శబ్దపల్లవ పూర్వావయవము ప్రథమాంతము ద్వితీయార్థక ప్రథమాంతము, క్వచిన్నైవ ? వైచిత్ర్యమును చెప్పిన సప్తమ్యాద్యర్థక ప్రథమాంతము కానోపును గాన "గసడదవాః స్యుః ప్రథమామాత్రా" దిత్యాది చెప్పిన నిత్యముగా రావలసిన గసడదవాదేశ వికారమునైతము రాకుండుట గలదని తాత్పర్యము. క.........వానిం। దోకొనిపోయెద నని శుభ। లోకంబున కరిగెఁ ద్రిదశలోకస్తుతుఁడై (అర. 3 ఆ. ౨౨౦). (ప్రాసగతము). (చూ ౭౮ IV విష). ఉ. ప్రాకట ధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుం డుగాఁ। జేకొనువారము.........(ఆది. ౭ ఆ. ౧౫౫). ఉ.........పాండవుల్। నేపడిరేని చంప నబసేయక చెప్పెద సవ్యసాచి పైఁ। గోపము పెద్ద......... (ఉద్యో. ౪ ఆ. ౬౮). క.........। పైపడు నాపద నైఁచిన। భూపాలా......... ......(భాస్క. అర. ౨ ఆ. శ. ౧). గీ. కైకొనుము దీని నని యిచ్చె నాకవనిత। .........(నైష. 3 ఆ. ౧౨౦). (౭౮ IV విష).

కేచి చ్ఛబ్ద విశేషా ఇత్యాదిః—కేచిత్ = కొన్ని, శబ్దవిశేషాః = విశేషశబ్దములు, క్రియాయోగే = క్రియతోఁ గూడునపుడు, ద్రుతాన్వితాః = ద్రుతాగమయుక్తములు, స్యుః = అగుచున్నవి. ఉదా:—"వెలవెలఁ బోయి - విన్నఁ బోయి - ఒడబడి - తడఁబడి. ఇత్యాదికం చోదయత్రాఽగ్రాహ్యమ్ - కేచి చ్ఛబ్దవిశేషాః స్యుః। క్రియాయోగే ద్రుతాన్వితా ఇత్యుక్తేః. ఒల్లంబాటు ఇత్యత్ర ఒల్ల నితి వ్యతిరేకార్థకో దేశ్యశబ్ద ఇతిబోధ్యః" (అహో. ౫౧౦ పు). (చూ. ౯౦ I విష. ౨౮౨ I విష). ప్రయోగములు:—చ. తడఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రము దప్పెడున్।.........(భీష్మ 3 ఆ. ౩౫౧). క. చెంగట నుద్గాతలఁ గూ। డం, గించిన్మాత్రము దడంబడక సము। త్తుంగస్వరముల.........(వరాహ ౪ ఆ ౯౩ సూ. రా. ని). ఆ-వె. జగతి నాఁడుఁదనము మగతనమును దడం। బఱుచుకొనుఁడి యొండు నెఱుఁగఁబడదు (కళా. ౫ ఆ. ౯౨). మ......వెవ్వెలఁ బాటె దీపకళికా వ్రాతంబు శాతోదరి (మనుచ. 3 ఆ. ౫౬). క. ఒసఁగు నెడఁ గసరు గజ్జిలు। నొసఁగి యొసఁగి వెల్లఁబాఱుఁ గోగి నీకరణిన్। వినువక యొసఁగఁగ నేర్చునె యసన్మశగతి నంబువాహ మహాబళనరసా (కావ్యాలంకార సంగ్రహము.

౨ ఆ. శ. ర.). ఇంకను ననేకవిధములగు వర్ణలోప వర్ణాదేశాదికార్యములు శబ్దపల్లవములందుఁ గల్గును. "భూయసీ దేశ్యశబ్దేషు। లోపవర్ణాగమ శ్రుతి" రిత్యాద్యథర్వణకారికలె యందులకు మూలమని యెఱుఁగునది. (3౨౮ విష). ఉదా:— తలఁపు+పోయు = తలపోయు - ఆకలి+కొను = ఆఁకొను. అలవు+పడు = అలపడు. ఆకట+పోవు = ఆపోవు. విజయము+చేయు = విజయంచేయు - చొప్పు+పడు = చొప్పడు - మొ.

ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు. ౧౧౮.

కూరుచుండు - నిలుచుండు - పరుండు - పన్నుండు -
ఆఁకొను - ఈఁకొను - ఈసుకొను - ఇయ్యకొను -
రక్కొను - త్రెక్కొను - మేకొను - మయికొను -
మేలుకొను - మేలుకను - మేలుకాంచు - అలవడు -
ఏరుపడు - చొప్పడు - వెలువడు - తలపోయు -
వాసపోయు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు -
విజయంచేయు - కయిత్రాలు - తూపాడుచు ఇత్యాదులు శబ్దపల్లవంబులు.

బాలవ్యాకరణ వివరణము. 3౮౮ I విషయము.

సంజీవని. 3౮౮ I విష:— ధాత్వాదులకు = ధాతువులు మున్నగువానికి, ధాతువు లనుప్రయుక్తంబు లయి యనుటచే శబ్దపల్లవముల యుత్తరావయవము మాత్రము ధాతువై యుండవలయుననియుఁ బూర్వావయవము ధాతువుగాని ధాతుభిన్నమగు శబ్దాంతరముగాని కావచ్చునని యు విశదమగుచున్నది. ఇంక నిట్టి శబ్దముల జంట విలక్షణార్థాభిధాయకము నగు ననఁగా నవయవభూత శబ్దద్వయము మేళనమువలన వానియర్థమునకు భిన్నమగు నొక విలక్షణమగు నర్థము దానిచే వాచ్యమగునని యర్థము. శబ్దపల్లవ ధాతువులలోని పూర్వావయవము ధాతువు కావచ్చుననుటను స్థాపించు ప్రాచీన ప్రామాణిక వచనప్రమాణము కానరాదు. ఇంక నవయవభూతశబ్ద ద్వయార్థముకన్న భిన్నమగు విలక్షణార్థము కలుగవలె ననుటయు నిరాధారమె. ఈ రెండు విషయములను వికృతి వివేక టీకావాక్యము నూఁతగాఁగొని సూరి కల్పించఁగా నర్వాచీనులెల్లఁ దన్మార్గానుయాయు లగుచు వచ్చిరి. అట్లనుసరించుటలో నైన నొకపద్ధతి లేదు. ఎవరికిఁ దోఁచినరీతిని వారు వ్రాయుచువచ్చిరి. కూరుచు+ఉండు = కూర్చుండు. కాళ్ళు మున్నగువానిని

గూరుచుచు (కూడఁ దీసికొనుచు) నుండుట యని యర్థ మునఁదగను. కూరుచుండు టలో నధఃకాయమును గూడఁ దీసికొనుట సంభవించు ననునది యనుభవసిద్ధము. ఇట్టి యర్థ మువయవ శబ్దార్థమేళనరూపమె యనఁదగునుగాని తద్విలక్షణముగు వేఱొక యర్థ మనుట సరి కాదు. 'కూరుచు' అనునది 'కూడు' ధాతువుయొక్కకాని, 'కూరు' ధాతువుయొక్కకాని ప్రేరణరూపము. కూడు+చు = కూరుచు. (బా. క్రి. ౭౦ సూ). "కూరుచు - దే, అ - క్రి ప్రియపడు, ప్రే - కూడఁబెట్టు (కూ - కూర్పు) .........." (శ. ర). బా. గు. ప్ర. వ్యాఖ్యాత పయిరీతిని 'కూరుచుండు' అను దానిలోని పూర్వావయవము ప్రేరణార్థకమగు 'కూరుచు' అనుధాతువని తలంచినచో శబ్దకల్పవరూపము దర్థవైలక్షణ్యము బాగుగఁ జూపఁబడదని తలంచి కావలయు 'ప్రియపడు' అను నర్థముగల యకర్మకధాతువు దానిలోని పూర్వావయవ మనియు "కూరుచుండు - దే - అ - క్రి. (కూరిచి+ఉండు) ఆసీనుఁడగు 'నడచుచుఁ గూరు చుండుచును' (కా శి. ౫ ఆ)... .. .." (శ. ర). అను శబ్దరత్నాకరమును స్వీకరించి కావలయును నందలి పూర్వావయవము "కూరిచి" అను క్త్వార్థకావ్యయమనియు నీక్రిందిరీతిని వ్రాసెను. 'కూరుచుండు (కూరిచి+ఉండు). కేవల కూరుచు ధాతువు నకు ప్రియపడుట యర్థము. క్రియాంతర మేళనానంతరమందు కూరుచుండు = ఆసీనుఁడగుట యని యర్థము విలక్షణమయ్యె. నడచుచుఁ గూరుచుండుచును. (కాశీ. ౫ ఆ)" (బా. గు. ప్ర. ౪౦౯ పు ద్వి. ము). "ధాత్వాదులకు = క్రియలు మొద లైనవానికి (ఆశబ్దముచే నామవాచకములు గ్రహింపఁబడును), ధాతువులు = క్రియలు, జతపఱుపఁబడినచో శబ్దద్వయము మేళనంబునఁ బూర్వముండున్న యర్థము కంటె నితరార్థము బోధించుచున్నవై యయ్యవి వ్యాకరణ పరిభాషంజేసి శబ్దపల్ల వంబులనంబడు." (బా. గు. ప్ర. ౪౦౯ పు. ద్వి. ము). అని తాను నిర్వచించిన శబ్దపల్లవ లక్షణమునందలి యితరార్థమును బోధించుటను బయిరీతిని బాగుగఁ బ్రదర్శించెను. ఈ ప్రకాశికా వ్యాఖ్యాత శబ్దపల్లవ పూర్వావయవము ధాతువు గాని నామముకాని కావలయుననెడి తం నిరూపణమును విడిచికొని శబ్దరత్నా కరానురోధమునఁ గావలయును క్త్వార్థక సంధిని సైతము తెచ్చిపెట్టుకొని 'కూరిచి' అనునది పూర్వావయవమనుచుఁ జూపను. బా. సా. వే. వ్యాఖ్యాత యీప్రకా శికా వ్యాఖ్యావిషయమునెల్లఁ బూర్ణముగాఁ దనగ్రంథమున నెక్కించియుండు టచే దానిని గ్రంథవిస్తరభీతి నిట వేఱుగఁజూపలేదు. (బా. సా. వే. ౪౮౧ పు). అనుశాసనకర్త 'కూరిచి' శబ్దమును సంగ్రహించుకొనుటకుఁ గావలయు ధాత్వా దుల కనుచోటి యాదిశబ్ద మవ్యయములకును బోధకముగునని యిట్లు వ్రాసెను.

"ధాతునామావ్యయముల తుదఁజేరి కొన్ని ధాతువు లర్థాంతరములను దెల్పును. అవియే శబ్దపల్లవము లనఁబడును. ఉదా:—కొంపోవు - ఏర్పడు - ఆపోవు - తలపోయు - వెలువడు - పొర్పుండు - నిలుచుండు........." (ఆం. భా. అ. క్రియా. ౪౭ సూ. ౨౪౭ పు. తృ. ము.). 'కొనిపోవు' అను సూరియుదాహృతియు నీమార్గమె సూరికిని సమ్మతమని సూచించుచున్నది. నారాయణీయ గాణపత వివరణకర్త యొక్క గ్రంథముల విషయములను సంగ్రహించు కోర్కితో మొదట నహోబల పండితీయోదాహృతులనెల్లఁ జూపి తుదిని సూరిప్రభృతుల యుదాహృతులను సైతము చూపుటలో 'పొరచుండు' అనుదానిని సైత ముదాహరించి దాని విభాగమును శబ్దరత్నాకరాదుల రీతినె "పొరిచి+ఉండు" అనియె చూపెను.

రెండవ యుదాహరణమగు 'నిలుచుండు' అనుచోట, బా. గు. ప్ర. వ్యాఖ్యాత "పొరచుండు" అనుస్థానమునఁ గ్రొక్కిన యపమార్గమును వీడి వేఱొక యపమార్గమున శబ్దపల్లవమునందలి యనయవార్థ వైలక్షణ్యమును జూపఁ గడంగెను. "నిలుచుండు (నిలిచి+ఉండు) = నిలఁబడియుండు, కేవల నిలుచు ధాతువునకు (౧) నిలఁబడు, (౨) ప్రతిష్ఠితమగు. (౩) ఉండు. (౪) శేషించు. (౫) అడ్డపడు అనిన, యనేకార్థములు గలవు. క్రియాంతరము మేళగించినప్పుడు 'నిలుచుండు' శబ్దమునకు నిలఁబడుట యొక్కటియే యర్థమయి తక్కుంగల యర్థములు స్ఫురింపవని తెలియుచున్నది. నిలుచు శబ్దార్థమైన నిలబడుట 'నిలుచుండు' అన్న ధాతు మిశ్రితమునకును నర్థమై నిల్చినను తక్కిన 'ప్రతిష్ఠితమగు' ఇత్యాద్యర్థము లీశబ్దంబునకు శబ్దపల్లవత్వావస్థయందు స్ఫురింపకుండుటయె విలక్షణార్థాభిధాయకత్వమని తెలియందగినది. ఇట్లే తక్కిన ధాతువులును సాంకర్యంబున విలక్షణార్థబోధకత్వ మూహింపవలయును." (బా. గు. ప్ర. ౪౧౦ పు. ద్వి. ము.). ఈసమర్థనము కేవల మసంగతమగుచు 'విలక్షణార్థాభిధాయకత్వ'మున్నది కేవలము వాంఛిక్యయని సమర్థించుచున్న దనఁదగును. 'నిలుచు = నిలుచుండు' అనునవి రెండును తుల్యార్థకములనుటలో సందియము లేదు. మఱియు 'నిలుచు' అనుదానికిఁ గల యితరార్థములెల్ల 'నిలుచుండు' అనుదానికి లేకుండుట "నిలుచు = నిలఁబడు. నిలుచుండు = నిలఁబడు" అనువాని విలక్షణార్థకత్వమును స్థాపించుననుట కేవలము నసంగతములై యున్నవి. శబ్దపల్లవముల యర్థము వాని యవయవ భూతశబ్దములలో నొకదానిదె యైయుండిన నుండును. లేదా రెండిటి మేళనమునఁ గల్గఁదగు నుచితమగు నర్థమేని కానోపును. ఇది యర్థవైలక్షణ్య మనిపించుకొనదు. అయ్యది శబ్దమేళనమునఁ గల్గు నుచితమయిన పరిణామమె యనఁదగును.

ఇట్టియెడల "కూరుచు+ఉండు = కూరుచుండు, నిలుచు+ఉండు = నిలుచుండు" అనురీతిని ఛేదము నంగీకరించుటయె యుక్తము. ధాతుద్వయ మేళనమున నట్టి యర్థ ముప్పతిల్లె ననుటయె సమంజసము "నిలిచి+ఉండు = నిలుచుండు" అనురీతిని ఛేదించునపు డట్టి వ్యస్తపదములనుండియే యచటి వివక్షితార్థము సిద్ధించునుగాన వానినొక పదముగా నెన్ని శబ్దపల్లవత్వము నంగీకరింపవలసిన ప్రసక్తియే లేదు. "ఆఁకలి+కొను = ఆఁకొను" మున్నగుచోటులందలి లోపాదేశాదికము "ఆవు+తోఁక = ఆఁదోఁక" మున్నగు స్థలములందువలెనె వానివాని వ్యుత్పత్తియందుఁ గల్గఁ దగినదే కాన నందులకై శబ్దపల్లవత్వము నంగీకరింపవలసిన ప్రసక్తిలేదు. 'ఆఁదోఁక' మున్నగునవియు శబ్దపల్లవములె యన్నచోఁ గింక ధాతువుల విషయమునమాత్రము శబ్దపల్లవత్వమును నిరూపించుట సరికాదుగదా. "భాషేయ ముభితా తత్ర । దేశ్యా చిత్ర స్వభావయుక్ । ......... । భూయసీ దేశ్యశబ్దేషు లోపవర్ణాగమ శ్రుతిః" (చూ. ౩౭౮ విష). అని యథర్వణుఁడు వచించియే యున్నాఁడు.

సూరిగారి తక్కిన యుదాహృతుల వివరణము:—పరుండు - పన్నుండు:— "పరుండు. దే. అ. క్రి. (పడి+ఉండు)......" (శ. ర). "పన్నుఁడు - దే - అ - క్రి. శయనించు - పరుండు" (శ. ర). 'పడు+ఉండు' అనునదే రెండిటికిని ఛేదమనుట యుక్తము. క్త్వార్థకేకార సంధి నంగీకరించుట సరికాదు. పేటికావ్యాఖ్యాత "పన్ను+ఉండు = పన్నుండు" అని ఛేదము చూపెను. కాని 'పన్ను' శబ్దము శయనార్థక శబ్దపల్లవములోని పూర్వావయవమనుట సుసంగతముగా లేదు. "పన్ను. దే. అ క్రి. ౧ యుద్ధమునకు సిద్ధపడు.........౨ కలుగు.........అం. ప్రే. ౧ సిద్ధపఱుచు.........౨ కలుగఁజేయు.........స క్రి. పర్పఱుచు......... ౨ చేయు..........వి. కప్పము, వినా ఒప్పు........." (శ. ర). ఆఁకొను:— "ఆఁకొను. దే. అ. క్రి. (ఆకలి+కొను) ఆఁకలిఁగొను" (శ. ర). ఈకొను = ఈయకొను = ఇయ్యకొను. వీనికి 'అంగీకరించు' అను నర్థము నిచ్చెనే కాని శబ్దరత్నాకర కర్త పదచ్ఛేదము చూపలేదు. "ఈయకొను = (ఈయ = అపేక్ష+కొను) అంగీకరించుట" (బా. గు. ప్ర. ౪౧౦ పు. ద్వి. ము). అని ప్రకాశికా వ్యాఖ్యాత వ్రాసెను. "ఇచ్చు+కొను = ఈకొను, అంగీకరించు. ఇట నిచ్చున కీ యనునది యాదేశము. ఈయ యాదేశమైన నీయకొను........." (బా. సా. పే. ౪౮౧ పు).

2

అని పేటికావ్యాఖ్యాత వ్రాసెను. ఈరెండును సరికావు. "ఇయ్య - అవ్య. (తు. ఇయ్యె). అంగీకారమును దెలుపును. ఉదా. ఒకర నాసుతునకు భార్యవగు మన్న నొడఁబడి యియ్య యనియె (భార. ఆది. ౪ ఆ. ౧౪౧). క. చక్కనగు మనిన

రక్కసు । డక్కజముగఁ బెరఁగి యియ్యకొ యగు నిప్పుడు నీ । యుక్కును బీరముఁ జూచెద (భార. ఆది. ౬ ఆ. ౨౦3)." (సూ-రా-ని) రకొ్కను:—"రకొ్కను - దే - అ- క్రి. ౧ వర్ధిల్లు...ఉ. చక్కెరవింటిరాజు నగచాపునితో (శివు) నెదిరించి పడ్డ నాఁ డెక్కడ నుండి తీవు మధుఁ డెక్కడ నుండె......ఇపుడాతఁ డదృష్టరేఖచే । రకొ్కని క్రమ్మఱం బ్రదికి రాఁ జనవ గ్లానిఁ దారు గా శశీ (విజ. 3 ఆ).........(రెకొ్కను యొక్క రూపాంతరము). రెకొ్కను. దే. అ. క్రి. (రేక+కొను) ౧ వర్ధిల్లు... ......" (శ. ర). ఈవిషయములనె ప్రకాశికా - పేటికా వ్యాఖ్యాతలు స్వీకరించిరి. త్రెకొ్కను: "త్రెకొ్కను. దే. స. క్రి. ౧ చెలఁగు.........౨ చంపు. ఉ. అక్కట తండ్రి లేని మము నమ్మెయిఁ బెంచిన తాత నిమ్మెయిం । ద్రెకొ్కనఁ గా దతండు సముద్దీక్షభూధా.........(భీష్మ. 3 ఆ).........."(శ. ర). దీనినిబట్టి 'త్రెంచు+కొను' అనురీతి నిట ఛేదము నంగీకరింపనగునని విశదమగుచున్నది. మేకొను = మఱికొను. శబ్దరత్నాకరమున 'మఱికొను = మైకొను = మెఱికొను = మేకొను' అను నాల్గును తుల్యముగా 'సమ్మతించు' మున్నగు నర్థములు గలవిగఁ జూపఁబడినవి. "మైకొను. దే. అ. క్రి. సమ్మతించు, ఇయ్యకొను. (మొదటి రూపము మఱికొను." (శ. ర). "ఇందొక్కరుఁడైన కేశవు హితోక్తికి మేకొనఁ డయ్యె (ఉద్యో. ౪ ఆ)" (శ. ర. మేకొను). 'మఱి - మై - మెఱి - మే' శబ్దములకుఁ దుల్యముగా 'పార్శ్వము' అను నర్థముగలదు. 'మఱి+కొను' అను దానికిఁ బార్శ్వమును గొనుట యనఁగా సమ్మతిని గొనుట యను నర్థము సంభవించెనని తోఁచెడిని. "మేకొను (మే = శరీరము)+కొను = సమ్మతించు......" (బా. గు. ప్ర. ౪౧౦ పు). అనునది యంత సరియని తోఁచదున్నది. మేలుకొను = మేలుకను = మేలుకాంచు:—ఈ మూఁడిటికిని శబ్దరత్నాకరమున 'నిద్రఁ దెలియు' అనునర్థము తుల్యముగనే చూపఁబడెను "మేలుకొను - దే. అ. క్రి. నిద్రఁ దెలియు .. ......" (శ. ర). జాగ్రదవస్థలో నుండుట మేలు = శుభ మని యీశబ్దముల జంట కర్థము నరయునది. "మేలుకను. దే. అ. క్రి.........క. అనిలసుతుఁ డంత టన మే । ల్కని నీల్గుడు. ఆది. ౫ ఆ." (శ. ర). అలవడు: "అలవడు. అ. క్రి. (అలవు+పడు) ౧ అభ్యస్తమగు - అబ్బు. చ. నృపవరు విద్యలుం దగిన నేర్పుల వడ్డది. కొంతకొంత. (విరా. ౧ ఆ. ౧౯౭).........౪ శక్యమగు - సాధ్యమగు ........." (సూ. రా. ని). "అలవు. దే. వి. ౧ పరిశ్రమము..........౨ బలము ........." (శ. ర). 'అభ్యాసముచే వశపడు - శక్తికిలోఁబడు' అనురీతి నీశబ్దపల్లవమున కర్థమునెన్నునది. ఏఱుపడు:—దీని పూర్వావయవ మనఁదగు 'ఏఱు' శబ్ద

మునకు "ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపఱిచిన నాఁగలి - నొప్పి" అను నర్థములు కోశములందుఁ జూపబడినవి. ఇవి 'ఏఱుపడు - ఏర్పడు' అను శబ్దములకుఁ గల వేఱుపడు - స్పష్టపడు - మున్నగు నర్థములతో నెంతమాత్రము సందర్భపడవు. క. .........మహాభారత బం। ధ నిరూపితార్థ మేర్పడఁ। దెనుఁగున రచియింపు మధిక ధీయుక్తిమెయిన్ (ఆది. ౧ ఆ. ౧౬). గీ. ఊరు మూల మేర్పడఁగ నయ్యు విద వలువ। దొలఁగె.........(ఆది. ౪ ఆ. ౧౨౨). ఇట్లగుటచేత నీశబ్దపల్లవము లోని పూర్వావయవము "ఏఱు"శబ్దమనియు లఘురేఫము ప్రమాదపతిత మనియుఁ దోఁచుచున్నది. "ఏఱు - స. క్రి. ౧ (క్రిందినుండి గింజలు మున్నగు చిన్నవస్తువులను) ఒకటొకటిగా ఎత్తు. గీ. తారు నలువురుఁ జని తృణధాన్య మల్ప। మేఱికొని వత్తు రాఁకలి దీఱకుండు. (భార. ఆశ్వ. ౪ ఆ. ౨౨౦).........౨ (కావలసిన వానిని) ఎన్ను - ఎంచు - గణించు........." (సూ. రా. ని). అలఘు రేఫము హలంతర సంయుక్త మగునపుడు లఘురేఫ మగుట సమ్మతమేకదా. (౫౮ I విష. ౫౮ III విష). కాని సూ. రా. నిఘంటుకారులు "ఏఱుపడు = ఏర్పడు" అని యుదాహరింపక "ఏరుప (ర్ప) డు. అ. క్రి. ౧ వేఱుపడు - వేఱుగాఁ గనఁబడు. గీ. ఏరు పడి నాల్గు పాఁజులై యుప్పదెప్పు। మురర, దురంబరుచున్న వానకుఁ జూడి (రామా. ౮ ఆ. ౯౦)........." (సూ. రా. ని). అని లఘురేఫముతో నుదాహరించుట వింతగ నున్నది. శబ్దరత్నాకరమందును నిట్లేయున్నది. గుప్తార్థ ప్రకాశికా వ్యాఖ్యాతయుఁ బేటికావ్యాఖ్యాతయు "ఏర్చు+పడు" అని విభాగము చూపిరి. కాని 'ఏర్చు' శబ్దము నయితము "ఏఱు" శబ్దసంబంధి యనియె సూ. రా. నిఘంటు కారులు వ్రాసిరి. "ఏర్చు - స - క్రి. (√ ఏఱు) (కావలసినవానిని) ఏఱు - ఎన్ను .........౨ విభజించు.........౪ నిర్మించు - ఏర్పఱుచు.........౫ (పూర్ణహా ముగా) పన్ను........." (సూ. రా. ని). పయిసందర్భము సరయఁగా 'ఏఱుపడు' అని శకటముతోడి రూపము నంగీకరించుటకాని, పైనదాహరించిన "ఏఱు - స - క్రి. (క్రిందినుండి గింజలు మున్నగు చిన్నవస్తువులను) ఒకటొకటిగా ఎత్తు..." అను ధాతువులోనిది లఘురేఫమేయనియుఁ దిక్కనరేఫద్వయము మైత్రి చేసినవాఁడే కానఁ బయి యశ్వమేధ పద్యప్రయోగము బాధకము కానేరదనియుఁ జెప్పుటకాని, యావశ్యక మనకతీరదు. చొప్పడు:—"చొప్పడు - ద్వి. ౮ - క్రి. (చొప్పు+పడు). ౧ సరిపడు. ౨ కలుగు. ఉ.........పే। రుక్కునఁ బోరనన్ సుగతి యొండె జయంబును నొండెఁ జొప్పడున్. (భా. శల్య. ౧ ఆ.)" (శ-ర) "చొప్పడు - అ - క్రి. (చొప్పు+పడు) .........౨ (నిద్ర మొ.) వచ్చు. క. అప్పటినుండియు......।

చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా. (ఉద్యో. ౨ ఆ. ౧౯)." (సూ. రా. ని.)
"చొప్పు. దే. వి. ౧ జాడ. ౨ మార్గము. ౩ విధము.)" (శ-ర). వెలువడు: "వెలు
వడు. దే. అ - క్రి. (వెలి+పడు) ౧ బయలుపడు. చ.........నూతిలో। వెలు
వడఁ గోమలిం దిగిచె. (ఆది. ౩ ఆ. ౧౪౪.)" (శ-ర). తలపోయు:—"తలపోయు=
తలఁచు. అ - క్రి. (తలఁపు+పోయు) (శ-ర). ౧ యుక్తాయుక్త విచారణచేయు...
......క. నాతోఁ దలపోయక రో। పాతురతం బ్రతిన వట్టితి......(ద్రోణ. ౨
ఆ. ౩౦౨). వాసపోయు:—"వాసపోయు. దే. అ - క్రి. వాసాలు పఱపు. సీ. వాస
పోసెడుచోట వాసనగలవాస మేసె వాసము నొక్కఁ డింతె మహింప. (రాజవాహన
విజయము. ౩ ఆ.)" (శ-ర) "వాసము ఉభ - దే - వి - ఇంటికిమీఁద
పఱచెడు పట్టె........" (శ-ర). గుప్తార్థప్రకాశికాకర్త ప్రథమ ద్వితీయ ముద్రణ
ములు రెంటను 'వాసపోయు' అని మూలోదాహరణమందును "వాపోవు (వాయి
పోవు.) ఏడ్చు........" అని వ్యాఖ్యా సందర్భమందును ప్రామాదికముగా
వ్రాసెను. (ప్ర. ము. ౨౯౩-౨౯౪ పుటలు. ద్వి. ము. ౪౦౯-౪౧౧ పుటలు). దీని
నుండి యెత్తి వ్రాయు నలవాటుగల పేటికావ్యాఖ్యాత "వాయి+పోవు =
వాపోవు ఇట యివర్ణలోపము - ఏడ్చు." (బా. సా. పే. ౪౮౧-౪౮౨ పు) అని
వ్రాసెను. మూలమును జూపునపుడు 'వాసపోయు' అని వ్రాసెను. బాలవ్యాకరణ
పుస్తకములందెల్ల (ప్రథమ ద్వితీయ ముద్రణములందు సయితము) "వాసపోయు"
అనియె యున్నది. దీనికి భారతమునఁ బ్రయోగము లేదు. ఆపోవు:—
"ఆపోవు. అ - క్రి. (ఆదట+పోవు అని శ-ర) తృప్తిఁబొందు. క. శ్రీపతి కడు
నెయ్యంబున। నాపోవక పార్థునొద్ద నారాత్రి ప్రియా। లాపములఁ దగిలి
యుండెన్. (ఆది. ౮ ఆ. ౧౭౨.) (ఉద్యో. ౨ ఆ ౩౨.)" (సూ. రా. ని.). కొం
పోవు = కొనిపోవు:—"కొనిపోవు = కొంపోవు. స - క్రి. (కొని+పోవు) అపహ
రించు - తీసికొనిపోవు. క. నాచిన్ని ముద్దుకూఁతురు। నాచక్కని తల్లి వీథి నడ
యాడఁగ న। న్నీచు కొనిపోయె............(రాజశేఖరచరిత్ర. ౨ ఆ. ౩౧.)
క. చంపినఁ జంపు నన్నటు। గొంపోకుండినను జాలు.........। కొంపోయిన...
(ప్రభా. ౩ ఆ. ౧౪౩)." (సూ. రా. ని) ఈశబ్దపల్లవమునకు భారతప్రయోగము
లభింపలేదు. వీని నుదాహరించుటచేత సూరి సూత్రములోని 'ధాత్వాదులకు'
అనుచోటి యాదిశబ్దముచేత శబ్దపల్లవ పూర్వావయవము క్త్వార్థకాదికమును
గావచ్చునని సూరి తలంచినట్లు విశదమగుచున్నది. విజయంచేయు:—"విజయం
చేయు. మి. అ - క్రి. (విజయము+చేయు) వచ్చు. వ. దివ్యబోధమహనీయుండైన

యష్మహోత్సుండు విజయంచేయుటయు. (భార. ఆర. ౨ ఆ.) .........(విజయము చేయు యొక్క రూ. చూ-విజయముచేయు)" (శ.ర) "విజయముచేయు. మి. అ-క్రి. వచ్చు. ఉగ్రసేనుని విజయము చేయు నునుడు. (హరి. ఉ. ౫ ఆ.) మ. విజయుం చేయుఁడు నావుడున్ మునులు పృథ్వీనాథ......(నిర్వ. ౭ ఆ. ౧౩౫ ప.)" (సూ-రా-ని) కయివ్రాలు:—"కయివా (వ్రా) లు=కైవాలు. వంగు - ఒఱగు......చ... ......క్రిం। దికిఁ గయివ్రాలు శోస్నలిల నిర్మలధార......(అను. ౪ ఆ. ౨౧)" (సూ. రా. ని). "కైవా (వ్రా) లు. కైవాలు అ - క్రి. వంగు - ఒఱగు......... గీ. ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండ. (కాశీ. ౧ ఆ. ౭.) ........." (సూ. రా. ని.). తూపాడుచు:—"తూపొడుచు (చ్చు) అ - క్రి. స - క్రి. (√తూ) ౧ తూ తూ యనుచు) ఉమియు. వ. అచ్చటి భూరజంబు పుచ్చి పిడిచి వైచి తూ పొడిచిరి. (హరి. పూ. ౫ ఆ. ౧౮౯.) ........." (సూ. రా. ని). ఇత్యాదులు శబ్దపల్లవంబు లను నాదిశబ్దముచేత 'అందు+ఇచ్చు = అందిచ్చు' (౭౨। విష. చూ.) "పశు+పడు+ఇంచు = పశువరించు, వెలువరించు - చొప్పరించు (చూ. 3 ౨౮ X విష. బా. క్రి. ౮౩ సూ). మున్నగువాని నెన్నునది.

త్రిలింగలక్షణశేషమున నీశబ్దపల్లవముల విషయమునఁ జూపఁబడిన విశేషముల నిటఁ జూపుచున్నాను. "శబ్దపల్లవక్రియలు కొన్ని ద్విరుక్తంబులగుచో నుత్తరపదంబు పూర్వావయవంబునకు లోపంబు విభాషనగు. ఉదా:—సీ...... రయమ్మునఁ దునిమి తూఁటాడి యాడి. (భార. విరా. ౫ ఆ). సీ ........విందులం చర్థిఁ బిల్వఁగ నడయాడి యాడి (హరి. పూ ౫ ఆ). పోరాడి యాడి చెన్నొదవె నేని (హరి. పూ. ౭ ఆ).........వాదడిచి యడిచి (కాశీ. ౫ ఆ). సీ......... గుఱుతులు మదిఁ బాదుకొలిపి కొలిపి (కళా. ౪ ఆ).........కుది తలపోసి పోసి (పర. ౨ ఆ). పక్షమున తూఁటాడి తూఁటాడి - మొ" (ప్రౌఢ. క్రియా. ౨౪ సూ).

"శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవ క్రియలును సమాస్తంబులయి పునర్గ్రహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు. ఉదా:— చ.........అలతాంగిఁ దో। డ్కొని చనుదెమ్ము తేనవును గూడనిపక్షమువంచు (భో. 3 ఆ.). ఇలకుం దివికిం జననిచ్చు నిచ్చి యేనని వెపవార్చు. (భాస్క. ఆర. కాం. ౨ ఆ) పక్షమున - చనుదేన్ - చననిచ్చు - మొ." (ప్రౌఢ. క్రియా. ౨౫ సూ)

బాలవ్యాకరణ చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. ౧౧౯.

వివరణము. ఆ ఋషీశ్వరుఁడు వచ్చెనా ఫలించుఁ గార్యముల్.

౩౮౯ విషయము. వాఁడు తేపువచ్చెనేని నీవు కార్యంబు దొరకొనుము.

సంజీవని. 38౯ విష:—ఈసూత్రమునకు 31౯ I విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయి
వచనంబు ధాతు విశేషణంబుల కగు. ౧౨౦.

బాలవ్యాకరణ వివరణము. 390 విష.

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను
సౌమిత్రి సహితంబుగం బుష్పకారూఢుండయి సాకే
తంబున కేతెంచె.

సంజీవని. 390 విష:—సంస్కృతమునందలి యాత్మశబ్దపర్యాయము తెలుంగున 'తా' శబ్దము. తాశబ్దప్రథమాది రూపములు - తాను - తాము తార. తన్నున్ - తమ్మున్ - మొదలగునవి. అభిహితంబగుచో ననఁగా నాఖ్యాతముచేతఁ జెప్పఁబడినపుడని యర్థము. (సూ. కార. ౨38 విష). ఆత్మార్థ మాఖ్యాతముచేఁ జెప్పఁ బడినపుడు, క్రియయు విశేషణములును దానికి సరియగు లింగవచనములనె యందు నని యర్థము. అనఁగా నాత్మశబ్దవాచ్య కర్తతోఁపాటుగ నితరపదార్థము లును కర్తలై యాఖ్యాతముచేఁ జెప్పఁబడినను దత్తత్కర్తలచేఁ గ్రియకుఁ గల్గ వలసిన (బా. కార. ౧౯ సూ) బహుత్వాదికము గ్రియకుఁ గల్గక యాత్మపదార్థ కర్త్రనుకూల లింగవచనములు మాత్రమె క్రియకుఁ గల్గునని తాత్పర్యము. ఉదా:- "రాముఁడు తానును సీతయు సాకేతమునకేతెంచె." అను వాక్యమున నేతెంచె నను క్రియమీఁది లిట్టుచే నాత్మార్థక రాముఁడను కర్తయు సీతయను కర్తయుఁ జెప్పఁబడుచున్నను సీతయను కర్తచే సముచ్చితమగుటచేఁ గల్గవలసిన (సూ. ౨౫౯ విష) బహుత్వము క్రియకుఁ గల్గక తాను శబ్దార్థమగు 'రాముఁడు' అను కర్త యొక్క యేకవచనమును మహత్త్వరూపలింగమును మాత్రమె "ఏతెంచెన్" అను క్రియయందుఁ గల్గెనని యెఱుంగనగును. తాను శబ్దార్థమె యభిహితము కాన పుడు "రాముఁడు సీతయు నేతెంచిరి" అను బహుత్వమె క్రియయందు వర్తిల్లునని యెన్నునది. ఇట్లె సీత తానును జెలులును నుద్యానమున విహరించుచున్నది. మున్నగు స్థలములందు నభిహితాత్మార్థక కర్తృలింగ వచనములు మాత్రము క్రియ యందు నిల్చుట నరయునది. సూరి యుదాహరించిన వాక్యమున నట్టి 'రాముఁడు' అను మహత్త్వమును నేకవచనమును విశేషణమగు పుష్పకారూఢుం డనుదాని యందును నిల్చెను. పయిసందర్భమునుబట్టి "అభిహితము = చెప్పఁబడుట = వాక్య మునఁ బ్రయుక్తమగుట" (బా. సా. పే. ౪౨౪ పుట). "వాక్యమున నాత్మార్థక మగు తాను శబ్దము ప్రయోగింపఁబడియున్నపుడు కర్తృబహుత్వ మమరి యున్నను

నాకర్తలకుఁ జెందిన విశేషణములును క్రియలును దాను శబ్దమునే ప్రధానముగా నాశ్రయించిన లింగవచనముల నందునని సూత్రాభిప్రాయము” (బా. పా. పే ౪౮3 పు). అను పేటికావివరణము సరికాదని విశదమగుచున్నది. ఉదా:—“రాముఁడును లక్ష్మణుఁడును హనుమంతుఁడు తాను సేవించుచుండఁగా సాకేతమునకు సీతతో నేఁగిరి.” అనువాక్యమునఁ దాను శబ్దప్రయోగమున్నను దదనుకూల లింగవచనములు సమాపకక్రియకు సంభవింపనేరవుగదా.

“కొన్నియెడల సహార్థంబున యుష్మదస్మదాత్మార్థంబు లభిహితంబులగుచో ధాతువునకును విశేషణంబునకును దల్లింగవచనంబులు విభాషనగు” (నా రా. గాణ. క్రియా. 3౭౬ సూ). అని యిట్లు గాణపత వివరణకర్త ప్రౌఢవ్యాకరణములోని క్రియాపరిచ్ఛేదమందలి ౨౬ సూత్రమును స్వీకరించి దానితోపాటుగఁ బ్రకృతబాల వ్యాకరణ విధికిని వైభాషికత్వమును సూత్రించెను. “ఒకానొకచో సహార్థంబున యుష్మదస్మదర్థంబు లభిహితంబులగునపుడు క్రియలు తత్కర్తృకంబులు విభాషనగు” ఉదా:— విప్రకులుండ వెల్వెకుము వేగము నీవును నీ నిషాదియున్ (భాగ. ఆది. ౨ ఆ) క. మనకాప్తుఁడు ............................ అ। తనిఁ బొందిన బ్రదుకు దీవ్రుఁ దమ్ములు సుతులున్ (భా. ఉద్యో. ౨ ఆ). నేను నాసేనయు దాడివెట్టిన విశృంఖలతన్ (పారి. ఉ. 3 ఆ. ౯౪.)..................
...పతిమున - మోహాంధుండను భీష్ముండను గే। శవ నీవుం గడఁగుండు. (భార. సభా. ౨ ఆ)...” (ప్రౌఢ. క్రియా. ౨౬ సూ). అనురీతిని యుష్మదస్మదర్థంబు లభిహితంబు లగునపు డిట్టివిధికి వైభాషికత్వమున్నను నాత్మార్థ మభిహితంబగునపు డీవిధికి భారతమున వైభాషికత్వము కానరాదు. గాణపతవివరణకర్త యట్లాత్మార్థాభిహితత్వపక్షమునకు వైభాషికత్వమును సూత్రించెనే కాని యట్టి కవిప్రయోగములను జూపలేదు. “సీతయుం దాను బుష్పకారూఢులై సాకేతంబున కేతెంచిరి.” అని సూరి వాక్యమునకై తలఁచియుపు పెట్టి యుదాహరించెను. సూరిసూత్రమునకుఁ బ్రయోగములు:—సీ.........ధర్మతనయుఁ। దనుజులుఁ దానును జనుదెంచె.........
(ఆది. ౮ ఆ. ౬3) క. త్రిదశాధినాథ సన్నిభుఁడు। ద్రిదశాలయమునకు మాద్రి దేవియుఁ దానున్। ముద మొనర నరిగె నేటికిఁ। బదియేడగు నాఁడు దురిత బంధచ్యుతుఁడై (ఆది. ౫ ఆ. ౧౫౪). క. అంబుజలోచన.........విహరించుచుండె సఖులుం దానున్ (ఆది. ౪ ఆ. ౪3). క. ఖలుఁడై ధృతరాష్ట్రుఁడు పు। త్రులు దానును గూడి దమ్ము......లాక్షా। నిలయంబున నునిచె.........(ఆది. ౬ ఆ. ౧౮౧.) చ.........పాత్వత కుంజరుఁ డేఁగె భక్తి నా। తని <u>ననిచెన్</u> యుధిష్ఠి

రుఁడు దమ్ములు దానును బాదచారియై (సభా. ౨ ఆ ౮౪ ప). ఉ.........
సభఁ బార్థివ ముఖ్యుఁడు ధర్మజుండు......సహోదరవీరులు దానుఁ జూచి ల। క్ష్మీ
ధరమూర్తి యెంత యును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్ (సభా. ౨ ఆ. ౧౬౨).
క. నృపవరుఁ డనుజులుఁ దానును। ద్రుపద తనూజయుఁ బ్రియంబుతో నరిగెన్
హా। స్తిపురంబునకు.........(సభా. ౨ ఆ. ౨౭౫). క.. .....కువలయ రాజ్య।
శ్రీ మనచేఁ గొని కౌరవుఁ।డేమని తలఁచు నొకో బుద్ధి నిష్ఠులుఁ దానున్ (అర. ౧ ఆ.
౨౩౮). క. భీమ ప్రస్థాపిత యయి। కోమలి దమయంతి పుత్త్రకులుఁ దానును ల।క్ష్మీ
మహిమ వెలుఁగుచుండఁగఁ। దామరస దళాక్షి వచ్చెఁ దన పతికడకున్ (అర. ౨ ఆ.
౨౨౯). క......... । తమ్ముండును దాను నతిముదంబున నుండున్ । .........
(అర. ౨ ఆ. ౩౪౧). క.......... । ధర్మపత్నులుఁ దానున్ । గడురంతస పడ
కరిగెన్ । దడయక సగరుండు మగుడి తనపురమునకున్ (అర. ౩ ఆ. ౫౨). క. అను
జులు దానును మునికా । ననమున నవ్వేది యొక్క సమధికవీర్యం । బున నొప్పె...
...(అర. ౩ ఆ. ౧౨౩). తరల - ఉరుతతేజుఁడు క్రీడ లాడుచు నుండు నింతులుఁ
దాను న। మ్మదముతోడఁ గుబేరు పు ..........(అర. ౩ ఆ. ౩౬౦). ఇట్లు
నన్నయ యంతటను నిత్యముగానె ప్రయోగించెను. తిక్కనయు నిట్లు:— ఉ.......
ధర్మజుఁడు........సన్నుతి కెక్కుడుఁ దానుఁ దమ్ములున్ (ఉద్యో. ౧ ఆ. ౨౧౦).
క. సుయో। ధనుఁడు ప్రియోక్తులఁ దగువా। రును దానును వారిజోదరుం గొని
యాడెన్ (ఉద్యో. ౩ ఆ. ౨౪౬). తే-గీ. అనినఁ దానును మంత్రులు నవ్విభుండు।
సులభఁ గొనియాడె నాఁడెల్ల.........(శాంతి. ౬ ఆ. ౨౨౦). మ.........
పదాతుల్ సాత్యకి స్ఫారదో। స్స్ఫురణన్ మ్రగ్గుట కెల్లు దాను ననుజుల్ శోకిం
చెనో యక్కటా (ద్రోణ. ౪ ఆ. ౨౦). (ఇందు "శోకించిరో," అని పాఠాం). ఇట్లు
తిక్కన కవితలోఁ గొన్నియెడలఁ బాఠాంతరములు గలవు. ప్రక్షిప్తము లేమో?
యుష్మదస్మ దర్థము లభిహితంబు లగునప్పటి వైభాషికతకు:— విరాటుఁడు ధర్మనంద
నుంజూచి. చ. ధరణియుఁ బట్టణంబు హయదంతి రథంబులు గోవులున్ భటో। త్క
రము సమాత్యవర్గమును గాఁగల రాజ్య మితండ యేలు ని। ర్భరమున నేను బుత్త్రు
లును బాంధులుఁ దమ్ములుఁ గొల్చియుండెదన్ । .........(విరా. ౫ ఆ. ౩౪౮).
క. ఏను నా దళమును ద్రుప। దానీకవిరాటసైన్య యాదవబల సం। తానముల
తోడఁ బెనఁగెదఁ। బూనుఁడు మీరెల్లఁ బాండుపుత్త్రుల గెలువన్ (భీష్మ. ౩ ఆ.
౧౮౧). క......వజ్రము నీవును బిడి। కిటి తాఁకున నొఱగు దేను కినిసితి నేనిన్
(శాంతి. ౪ ఆ. ౩౯౮). బహుత్వమునకు:— ఉ. వినుఁడీ నాదు ప్రతిజ్ఞ నీవు నిఖిలో

ర్వీనాథులున్.........(ద్రోణ. ౨ ఆ. ౨౭౭). చ......నను జూడుడు నీవును వాసుదేవుఁడున్ (కర్ణ. 3 ఆ. ౫౦).

బాలవ్యా. 3౫౧ విష.

అగతికంబులగు భ్వాదుల కింపుఁ బ్రయోగంబు లేదు. ౧౨౧.

భూ. స్ఫు - క్ష్మ - రేక్ష - లోక్ష - శోచ - పచి - లప ఇత్యాదులకు గతివిరహితంబులగు ధాతువుల కీ భావం ప్రయోగంబు లేదు..........................

సంజీవని. 3౫౧ విష:—ఈసూత్రమున కీనటికు 3౨౬ VII విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

బాలవ్యా. 3౫౨ విషయము.

వలయ్యాది క్రియలకుం గర్తృభూత క్రియావృత్తి యగు ధాతువునకు నజి వర్ణకం బగు. ౧౨౨.

వాఁడు చూడవలయు. వారలు చూడఁగా వలయు ...................................

సంజీవని. 3౫౨ విష:—ఈసూత్రమున కీనటికు 3౮౯ I. ౨౬3 I. విషయములందు వ్యాఖ్య చేయఁబడెను.

బాలవ్యాకరణ వివరణము. 3౫3 విష.

గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మ కాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు. ౧౨3.

పొందు మొదలయినవి గత్యర్థకంబులు. తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు. తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు. విను చెప్పు చదువు మొదలయినవి శబ్దకర్మంబులు.......................

అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు. ౧౨౪.

రాముఁడు మిథిలం గనియె. రామునకు మిథిల గనంబడియె.......................................

సంజీవని. 3౫3 విష:—వీనిలో ౧౨3 సూత్రమున కీనటికు ౨3౬ I విషయమున వ్యాఖ్య చేయఁబడెను. ౧౨౪ సూత్రమునకు ౨3౭ I విషయమున వ్యాఖ్య చేయఁబడెను. ఈ రెండుసూత్రములకు (౧౨3-౧౨౪) వెనుక వ్యాఖ్య చేయునపుడు ధాతువులకు స్వరూప ప్రేరణాత్మనేపద కర్త్రర్థములందుఁగల్గు సూరి వివరిం

చిన రూపవిశేషములకు వ్యాఖ్యానము చేయఁబడలేదు. అయ్యది యిట సవిస్తరముగఁ జూపఁబడుచున్నది:—సకర్మక ధాతువులకుఁ గొను పడ్వనుబంధములు చేరవచ్చును గాన నేదియుఁ జేరని స్వరూపము ౧+'కొను' చేరినది ౧+పడు చేరినది ౧+కొను పడులు రెండు చేరినది ౧=౪ రూపము లగును, ఇట్లె యట్టిస్వరూపముపైఁ బ్రేరణప్రత్యయము నిల్చినది ౧+దానిపైని 'కొను' చేరినది ౧+పడు చేరినది ౧+రెండును చేరినవి ౧ = ౪ రూపములగును. ఇట్లు స్వరూపభేదములు ౪ +ప్రేరణరూపభేదములు ౪ కలిపి యెనిమిదివిధముల ధాతువులు సకర్మకముల కేర్పడుననియు బా. క్రి. ౫౨ సూత్రముచెప్పిన నాత్మనేపదార్థమున "కొను" ధాతు వను ప్రయుక్త మయినపిదపనే దానిపైని గర్మార్థమున బా. క్రి. ౪౯ సూ. చెప్పిన 'పడు' జ్యనుబంధము చేరునేకాని విపరీతముగా ననఁగా 'పడు' జ్యనుబంధముచేరినపై నాత్మనే పదార్థమున 'కొను'ధాతు వను ప్రయుక్తము కానేరదనియు నట్టి యర్థవిశేషములచే వేర్వేఱ నేర్పడిన ధాతువులనుండి లడాది సమాపక క్రియారూపములును భావార్థకాద్యసమాపక క్రియారూపములును జనించుననియు సూరిగారి "సకర్మకంబులకు స్వరూప........" అను వివరణమునకుఁ దాత్పర్యము. అట్టి యెనిమిది జాతులను వేర్వేఱ జాతికొక్కటిచెప్పిన నుదాహరించుచున్నాఁడు. 1. కర్త్రర్థకము:—మైత్రుఁడు వంటకమును వండెను 'వండెను' అనుచోటి యాఖ్యాతమగు లిట్టుచేఁ గర్త యభిహితమగుచున్నది. కాన నీక్రియ కర్త్రర్థకమని తాత్పర్యము. 2. ఆత్మనేపద కర్త్రర్థకము:—మైత్రుఁడు వంటకమును వండుకొనియెను. ఇందాత్మనే పదార్థమున 'కొను' ధాతు వను ప్రయుక్త మయ్యెను. 3. కర్మార్థకము:—మైత్రుని చేత వంటకము వండఁబడియెను. ఇందుఁ గర్మార్థమున 'పడు' జ్యనుబంధము చేరెను. 'వండఁబడియెను' అనుచోటి యాఖ్యాతముచేఁ గర్మంబగు వంటక మభిహిత మయ్యెనుగాన వంటకశబ్దముపై ద్వితీయ నిలువక ప్రథమ నిల్చెను. మైత్రుఁ డనభిహితకర్త యగుటంజేసి మైత్రశబ్దముపైఁ దృతీయ నిల్చెను. 4. ఆత్మనేపద కర్మార్థకము:—మైత్రునిచేత వంటకము వండుకొనఁబడియెను. ఆత్మనేపదకర్మార్థక మగుట చేత 'కొను - పడు'లు రెండును జేరినవి. 5. ప్రేరణకర్త్రర్థకము:—చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను. ఇందుఁ బ్రేరణకర్త యనఁగాఁ బ్రయోజకకర్త చైత్రుఁడు. అప్రేరణకర్తయగు మైత్రుని వంటకమును జేయునట్లు ప్రేరించినవాఁడు. అట్టి ప్రేరణకర్తృత్వము 'వండించెను'అనుచోటి యాఖ్యాతమగు లిట్టుచే నభిహిత మగుటచేత దద్వాచకముపైఁ దృతీయ నిలువ దయ్యెను. ఇంకఁ బ్రాతిపదికార్థప్రథమయె నిలిచెను. ఇంక నిందలి యప్రేరణకర్త మైత్రుఁడు

ఆఖ్యాతముచేత నభిహితము కాలేదుగాన నట్టి యనభిహిత కర్తృవాచకము తృతీయాంతమయ్యెను. ఈవాక్యమునందలి వండుధాతువు బా. క్రి. ౧౨౩ సూత్రముచెప్పిన గతి బుద్ధి ప్రత్యవసానార్థ శబ్దకర్మ కాకర్మకములలో జేరినది కాఁగామింజేసి యప్రేరణకర్త కనఁగాఁ బ్రయోజ్యకర్తకుఁ గర్మత్వము సంభవింపదయ్యెను. 6. ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము:—చైత్రుఁడు మైత్రునిచేత వంటకము వండించుకొనియెను. అయిదవ యుదాహృతిలో లేని యాత్మనేపదార్థకత్వ మిందు విశేషముగాన నిందు 'కొను' ధాతు వనుప్రయుక్తం బయ్యె. 7. ప్రేరణ కర్మార్థకము:—చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండింపఁబడియెను. ఇందు 'వండించు' అను ప్రేరణార్థకముపైని కర్మార్థకత్వమున 'పడు' అనుబంధము నిల్చెను. 'వండింపఁబడియెను' అనుచోటి యాఖ్యాతముచేత వంటక మను కర్మ మభిహిత మగుటంజేసి యభిహిత కర్మవాచకముపై ద్వితీయ నిల్వక ప్రాతిపదికార్థ ప్రథమ నిల్చెను. ఇందుఁ బ్రేరణకర్త చైత్రుఁడు - అప్రేరణకర్త = ప్రయోజ్యకర్త మైత్రుఁడు. ద్వివిధకర్తృత్వములు నాఖ్యాతముచే ననభిహితములై యగుటంజేసి యట్టి యనభిహితకర్తృవాచకములు రెండును దృతీయాంతములయ్యెను. 8. ప్రేరణాత్మనేపద కర్మార్థకము:—చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించుకొనఁబడియెను. ఇం దేడవ యుదాహృతిలో లేని యాత్మనేపదార్థము విశేష మగుటంజేసి 'కొను' ధాతు వనుప్రయుక్త మగుటయె దానికన్న విశేషమని యెఱుఁగునది.

౧౨౪ సూ. వ్యాఖ్యలోని 'అకర్మకంబుప' కిత్యాది:—అకర్మకంబునకుఁ గర్మార్థకత్వమును నాత్మనేపదార్థకత్వమును (ఆత్మనేపదమునందుఁ గ్రియాఫలము కర్తృగామి కావలసియుండును. ధాత్వర్థ ఫలాశ్రయమగు కర్మమే లేనిది యకర్మకముగదా) నసంభవములగుటంజేసి "కొను - పడులు" సంభవింపవు. కావున నకర్మకత్వమున ధాతుస్వరూపము మాత్రమె ప్రయోగింపఁబడును. బా. క్రి. ౧౨౩ సూత్రముచెప్పిన నకర్మక ధాతువుపైని ప్రేరణార్థక ప్రత్యయము నిల్చునపుడ ప్రేరణకర్త కర్మంబగును గాన నది సకర్మకమగును. అక్కారణమున నాత్మనేపదార్థకత్వమును గర్మార్థకత్వమును నద్దానికి సుసంభవములగుటంజేసి యట్టిధాతువుపైని 'కొను' నిల్చుటయు 'పడు' నిల్చుటయు 'కొను పడు'లు నిల్చుటయు సంభవించును. కాఁబట్టి కేవల ప్రేరణరూపమును 'కొను పడు'ల మూలమునఁ గల్గు రూపత్రయమును గలిసి నాలుగువిధములగు ధాతురూపము లీప్రేరణార్థమున సంభవించును. అట్లగుటంజేసి యకర్మకముల కప్రేరణమునందలి యొక్కటేవిధమగు రూపమును బ్రేరణమునందలి రూపచతుష్టయమును గలిపి యైదువిధములగు రూపము లేర్పడును.

ఈవిషయమునే సూరి "అకర్మకంబున కప్రేరణంబునం" దిత్యాదివాక్యముచే వివరించెను. అట్టి రూపపంచకమును వరుసగా "మైత్రుండు మునియయ్యెను" మున్నగు వాక్యములతో నుదాహరించెను. వీనియందలి కారక విశేషములను బైనుదాహరించిన సకర్మకోదాహృతులందువలెనె గ్రహింపవలయును.

వెండియుం బ్రేరణంబునం దిత్యాది:—వెండియుం బ్రేరణంబునం దించుగాగముంబు గలిగినచో = ప్రేరణార్థకములగు చుక్కతోఁగాని పుక్కుతోఁగాని కూడిన ధాతువుపై మరలఁ బ్రేరణార్థము వివక్షితమగుచో, బా. క్రి. ౮౪ సూత్రముచొప్పున "ఇంచు"క్కు నిలువవచ్చునుగాన నట్టియెడల సకర్మక ధాతువునకు స్వరూపమున నాల్గువిధములును బ్రథమప్రేరణమున నాల్గువిధములును బునః ప్రేరణార్థంచుగాగమున మఱి నాల్గువిధములును గలిపి పండ్రెండు విధములగు ధాతురూపభేదము లేర్పడును. అకర్మక ధాతువునకు స్వరూపమున నొక్కవిధమును బ్రథమప్రేరణమున నాల్గువిధములును బునః ప్రేరణమున మఱి నాల్గువిధములును గలిపి తొమ్మిదివిధములగు రూపభేదము లేర్పడును. అట్టి తొమ్మిదివిధము లిటఁ జూపఁబడుచున్నవి:—తడియుధాతు వకర్మకము. (౧) కర్త్రర్థకము. వస్త్రము తడిసెను (ఇది స్వరూపము). ఇంకఁ బ్రథమప్రేరణము:—(౨) ప్రేరణ కర్త్రర్థకము - రాముఁడు వస్త్రమును దడిపెను. (3) ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము - రాముఁడు వస్త్రమును దడిపికొనెను. (౪) ప్రేరణకర్మార్థకము - రామునిచే వస్త్రము తడుపఁబడెను. (౫) ప్రేరణాత్మనేపదకర్మార్థకము - రామునిచే వస్త్రము తడిపికొనఁబడెను. ఇంకఁ బునః ప్రేరణమున:—(౬) పునః ప్రేరణకర్త్రర్థకము - రాముఁడు రజకునిచే వస్త్రమును దడిపించెను. (౭) పునః ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము - రాముఁడు రజకునిచే వస్త్రమును దడిపించికొనెను. (౮) పునః ప్రేరణకర్మార్థకము - రామునిచే రజకునిచే వస్త్రము తడిపింపఁబడెను. (౯) పునః ప్రేరణాత్మనేపదకర్మార్థకము - రామునిచే రజకునిచే వస్త్రము తడిపించికొనఁబడెను. సకర్మక ధాతువునకును నిట్లె పండ్రెండు రూపభేదములను గ్రహింపనగును.

ఇది క్రియాపరిచ్ఛేదము = ఇంతటితోఁ గ్రియాపరిచ్ఛేదము ముగిసెనని యర్థము.

---

# ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వము

## కృదంతపరిచ్ఛేదము

ఆంధ్రశబ్ద చింతామణియందుఁ గృదంత పరిచ్ఛేద మనునది వేఱ సూత్రింపఁ బడలేదు. బాలవ్యాకరణమునఁ గృదంతపరిచ్ఛేదము వేఱుగ వివరింపఁబడినది. అట్లయినను సమాపక క్రియా ప్రత్యయములవలెనె ప్రతిధాతువుపైని నిల్చునట్టియు ధాత్వర్థభానమును మాపనట్టియు భావార్థకాదులగు 'ట' ప్రత్యయాదులు నన్నయాధర్వణీయమునందును బాలవ్యాకరణమునందును క్రియాపరిచ్ఛేదముననె యుపదేశింపఁబడెను. అయ్యవి కృత్ప్రత్యయములె యనఁదగునుగాని తక్కిన కృత్ప్రత్యయములకన్న నవి విభిన్న విషయకములు. (చూ. ౩౦౯-౩౦౯ I విష). అట్టి విభిన్న విషయకములగు కృత్తులలో నొక్కటేని చింతామణిలో నుపదేశింపఁబడలేదు. అయ్యవి మహాకవిప్రయోగములవలనఁ దెలిసికొనఁదగినవె యని తలంచి దిక్ప్రదర్శకమును, దత్సమశబ్ద నిరూపణప్రధానమును నగు చింతామణియందు భట్టారకుఁడు వచింపక శిష్టపరంపరా సంప్రదాయమువలన గ్రహింపవలయు ననుచు "ప్రవాహినీ దేశ్యా" (చూ. ౪౯ విష) అనియు, "ప్రాకృత భవ సంస్కృతభవ। సంస్కృతవత్ ప్రాకృతభవ వికృతి భవాః। వ్యతిరిక్తా భూయాంసో। వ్యతిరిక్తా స్సంప్రదాయతో వేద్యాః" (చూ. ౧౮౮ విష) అనియు నుపదేశించెను. అధర్వణాచార్యుఁడును నట్టి యాచ్ఛికభాషా వ్యుత్పత్తుల విషయము వివరింపక "అజన్యజన్య భేదేన। శబ్దాః స్యు ర్వికృతా మతాః। జన్యాంతర్గత శబ్దానాం। భూయసీ స్యా ద్విచిత్రతా" (చూ. ౧౮౮ విష). అని మాత్రము వివరించెను. ఆచ్ఛికశబ్దములు వ్యుత్పన్నములును నవ్యుత్పన్నములును నని రెండువిధములనియు నవ్యుత్పన్నముల విషయము దుర్జ్ఞేయమనియు వ్యుత్పన్నములును ననంతములుగా నుండుననియు వచించి వానిని గొన్నిటనైన విస్తరింపక యీ క్రిందిరీతి నుపదేశించెను.

నన్నయా ధర్వణీయము — అన్యేచ బహవో దేశ్యా। వర్ణకా అర్థభేదకాః। క్వచి దన్త్యస్య లోపః స్యా। త్క్వచి ద్వర్ణాగమో మతః.

౩౫౫ విషయము. (వికృ. అజం. ౪౨-౪౩ కారి. అహో. ౩౨౯ పు).

కల్పతరువు. ౩౫౫ విష:—ఈ కారికకు ౨౧౭ I విషయమున ౨౨౧-౨౬౦-౨౬౫ విషయములందును, వ్యాఖ్య చేయఁబడెను.

అనంతములగు "అ - ఇ"-(ఎండ - చేయి - అలుక) మున్నగు ప్రత్యయములు ధాతువులపయిని నిల్చునపుడు వర్ణలోప వర్ణాదేశ వర్ణాగమాదిరూపమగు మిక్కిలి విస్తృతమైన వైచిత్రి వెలయుచుండుటచే నదియు శిష్టజనవ్యవహారైకవేద్యమే యని వచించి విరమించెను. స్థలాంతరములందును దేశ్యశబ్దములందలి వర్ణాగమాది వైచిత్రి మహాకవిప్రయోగవేద్యమే యని వచించెను.

భాషేయ మమితా తత్ర । దేశ్యా చిత్రస్వభావయుక్।
తచ్చిత్ర తానుమన్తవ్యా । పూజ్యపాద సుభాషితే
నన్నయా (విక్రి. క్రియా. ౩౬ కారి. అహో. ౫౧౩ పుట).
థర్వణీయము. తత్తత్పదం పరిగ్రాహ్యం । యదస్య త్సప్రాదయే
౩౫౫ విషయము. హితమ్. (విక్రి. అజం. ౯౩ కారి. అహో. ౩౭౧ పు).
యథాశాస్త్రం యథాశక్తి । యథాశ్రోత్రానురఞ్జనమ్ । యథాప్రసిద్ధి సర్వత్ర ।శబ్దానాం కల్పనా మతా।
(విక్రి. క్రియా. ౧౨ కా. అహో. ౪౯౧ పు).

కల్పతరువు. ౩౫౫ విష:—వీనిలో భాషేయ మిత్యాదికారికకు "౮౮ I విష. ౨౮౧ వి. ౨౮౮ విష." అను విషయములందు వ్యాఖ్యచేయఁబడెను. తత్తత్పదమిత్యాద్యర్థర్పమునకు '౮౮ I - ౨౮౮' అనువిషయములందు వ్యాఖ్య చేయఁబడెను.

యథాశాస్త్రమిత్యాది:—యథాశాస్త్రమ్ = వ్యాకరణశాస్త్రపద్ధతుల నతిక్రమింపకుండునట్లుగను, యథాశక్తి = సంకేతితార్థ బోధనమను శబ్దశక్తి నతిక్రమింపకుండునట్లుగను, యథాశ్రోత్రానురంజనమ్ = మహాకవిపండితరుచి నతిక్రమింపకుండునట్లుగను, యథాప్రసిద్ధి=ఆంధ్రమహాకావ్యవ్యవహారరూఢి నతిక్రమింపకుండునట్లుగను, శబ్దానాం కల్పనా = ఆచ్ఛిశబ్ద కల్పన మనఁగాఁ బ్రకృతి ప్రత్యయాది కల్పనము చేయుట, మతా = సమ్మతమైనది. అనంతములగు కృదంతము లంతటను బైరీతిని మహాకవిప్రయోగానుసారముగఁ దెలియవలెనని తాత్పర్యము. ఆథర్వణాచార్యుఁ డిట్లు వచించుట యొకకొఱంతయని తలంపరాదు, కృత్ప్రత్యయములను బాణిని వచించినను ననేకము లుండిపోఁగా శాకటాయనుఁ డుణాదులనుచుఁ బెక్కిటిని వివరించెను. అట్లయినను బూర్తి కామింజేసి శ్రీభట్టోజీ దీక్షితు లిట్లు వివరించిరి. "ఉణాదయో బహుళమ్. (౩-౩-౧) ఏతే వర్తమానే సంజ్ఞాయాంచ బహుళం స్యుః.

కేచిదవిహితా అపూర్వ్యహార్యః. "సంజ్ఞాసు ధాతురూపాణి। ప్రత్యయాశ్చ తతః పరే। కార్యా ద్విద్యా దనూబన్ధ। మేత చ్ఛాస్త్ర ముణాదిషు (భాష్యమ్)." 'కృవాపాజి మిస్వదిసాధ్యశూభ్య ఉణ్" ఇత్యాదిసూత్రాణితు శాకటాయన ప్రణీతాని. అస్యైవ బహుళగ్రహణస్య ప్రపఞ్చ ఇత్యర్థః" (బాలము) (సి కౌ. ౩౧౬౯ సూ). "కృతో యే యత్ర విహితా। స్తత్ర నూనం భవన్తి తే। కృద్ధోః క భావ ఇత్యుక్తే। రన్యత్రాపి ప్రయోగతః. తథాచః—కృత్తద్ధిత సమాసానా। మభిధానం నియామకమ్। లక్షణం త్వనభిజ్ఞానాం। తదభిజ్ఞానసూచకమ్" (ముగ్ధ. వ్యా. ౧౧౮౩ సూ. వివరణము) "యేకృతః - యత్ర = యేష్వర్థేషు, విహితా స్తే, తత్ర = తేషు, నూనమ్ = నిశ్చితం భవన్తి. ప్రయోగతః = మహాకవిప్రయోగానుసారేణ, అన్యత్రాపి స్యుః - తత్ర హేతు మాహ - కృద్ధోః క భావ ఇతివచనాత్. ఉదాహరణం తత్రైవ ద్రష్టవ్యమ్. నకేవల మహ మేవం బ్రవీమి. ప్రాఞ్చో ప్యేవ మాహుః. ఇత్యత ఆహ. కృత్తద్ధిత సమాసానామితి." (ముగ్ధ. ౧౧౮౩ సూ. దుర్గాదాసవ్యాఖ్య). "కృ ద్ధోః క భావే - వక్ష్యమాణః త్యః (ప్రత్యయః) కృత్సంజ్ఞః స్యాత్ - సచ ధోః (ధాతోః) పరః స్యాత్ -సచ కే, (కారకే) భావేచ స్యాత్." (ముగ్ధ. ౯౬౪ సూ). "సచ (కృత్ ప్రత్యయః) ధాతువిశేషా ద్విహితోఽపి ప్రయోగానుసారా దన్యత్రాపి స్యాత్......ఏవ మర్థ విశేషే విహితోఽపి కృత్ ప్రయోగానుసారా దర్థాంతరేఽపి స్యాత్......అతఏవ కృ ద్ధోః క భావ ఇత్యుక్తే। రన్యత్రాపి ప్రయోగత ఇతి స్వయం వక్ష్యతి." (ముగ్ధ ౯౬౪ సూ. దుర్గాదాసవ్యాఖ్య) అని యిట్లు కృత్తద్ధిత సమాసములను జెప్పుట దిక్ప్రదర్శనమాత్రమె యని యెఱుఁగనగును.

సూరిసైతము కృదంతపరిచ్ఛేదము నుపదేశించెనే కాని యలంతిగ నుపదేశించి తుదికి "ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది." అనియు వచింపవలసిన వాఁడయ్యెను. వెనుకనుపయుక్తము దేశ్యము త్రిలింగదేశవ్యవహార సిద్ధమనియే వచించెను. (౬౧-౬౧ I విష). సూరి యొక్క యిరువదిరెండు సూత్రములతోఁ గృత్తులను దిక్ ప్రదర్శనముగా వివరించెను. పిదఁ ప్రౌఢవ్యాకర్తయు మఱి కొన్నిటిని జూపెను. అవెల్ల నిటఁ బ్రదర్శింపఁ బడుచున్నవి. అర్థవిశేషములనుబట్టి యొక్కొక ధాతువుపై ననేకకృత్తులు నిలువవచ్చును. ఉదా:—మూయు. బా-కృ. ౫ సూత్రము చొప్పున తజ్ వర్ణకము:—మూఁత. బా. కృ ౨౨ సూ. చొప్పున మూయు+ఇ = మూయి. ఇట్లె కానుక - కానిక - కానుపు. (చూ. బా. కృ. ౩ సూ). మొ.

కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యం
బులు. ౧.

బాలవ్యాకరణ వివరణము. 3ఆ౨ I వివ.

ధాతువునకు విహితంబగు డుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తు నాఁబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావ కర్తృ కర్మాద్యర్థంబులు మహాజన వ్యవహారాను సారముగా నెఱుంగునది. అల్క=బంధనము. మొలక = నవోద్భిదము. ఏలిక = పాలకుఁడు. కోరిక = వాంఛయు - వాంఛితంబును. మూఁక = సంఘము. ఆడిక = నింద. ఓడిక = స్రోతస్సు.

సంజీవని. 3ఆ౨ I వివ:—సంస్కృతవ్యాకరణమున "కృదతిఙ్. (3-౧-౯3) సన్నిహితే ధాత్వధికారే తిఙ్భిన్నః ప్రత్యయః కృత్ సంజ్ఞః స్యాత్." (సి. కౌ. 3౭౮ సూ). "సన్నిహితే ధాత్వధికారే ఇతి - తేన ణిజాదినిరాసః" (బాలమనోరమావ్యాఖ్య). అని యిట్లు కృత్సంజ్ఞాస్వరూపము నిరూపింపఁబడెను. దీనినె చాల వఱకనుసరించి సూరి "ధాతువునకు విహితంబగు డుఙ్ భిన్న ప్రత్యయంబు కృత్తు నాఁబడు" అని వివరించెను. ఈవాక్యమునఁబట్టి "ధాతువునకు" అనెడి బా. క్రి. ౧ సూత్రము క్రియాపరిచ్ఛేదమునందెకాక యీకృదంత పరిచ్ఛేదమునందును నధికారసూత్రముగా సూరిచే నుద్దేశింపఁబడెనని విదితమగుచున్నది. "లకారంబునకు డు - ఙు - వు - రు - ను - ముఙ్లగు" (బా. క్రి ౫ సూ.) అనుసూత్రమున నుపదేశింపఁబడిన. "డుఙ్ - రు - వు - రు - ను - ముఙ్" అను ప్రత్యయముల ప్రత్యాహార మిందలి "డుఙ్" అనుదానిచే నుద్దేశింపఁబడినది. పాణినిముని "తిఙ్" భిన్న ప్రత్యయము కృత్తనఁగా నీతడు "డుఙ్" భిన్నప్రత్యయము కృత్తని వచించెను. కాని పాణినీయములోని ణిచ్చు మున్నగునవి ధాత్వధికారములోనివి కాకుండుటంజేసి వానికిఁ బాణినీయమున "కృ"త్సంజ్ఞ యతివ్యాప్తము కాదయ్యెను. బాలవ్యాకరణమునందన్నను ణిచ్చు మున్నగునవెల్ల ధాత్వధికారములోనివే యగుటంజేసి వానికెల్ల "కృ"త్సంజ్ఞ గలదని చెప్పవలసివచ్చుచున్నది. అట్లు చెప్పినచో నట్టివానికిఁ బ్రాతిపదికత్వము గల్గి తదంతములపై సుప్పులు నిల్వవలసివచ్చును. ఇంక నీ కృదంతపరిచ్ఛేదములోని ధాత్వధికారస్థములగు ప్రత్యయములుమాత్రమె కృత్తు లందమన్న - భావార్థకాదులగు "ట" ప్రత్యయాదులకు "కృ"త్సంజ్ఞ లేకపోవలసివచ్చును. అట్లు లేనిచోఁ దదంతములు ప్రాతిపదికములు కామింజేసి వానిపై సుప్పులు నిల్వకపోవలసివచ్చును. ఇట్టిచిక్కును వారించుకొనుటకే సూరిగారు 'ఇంచు'గాదులను బ్రత్యయములని వచింపలేదందురు.

మీఁద వివరించినట్లు కృత్తులయర్థములు మహాజనవ్యవహారానుసారంబుగ తెలియఁగనగునని సూరి వివరించెను. "యథా వ్యవహారంబుగ = మహాజన వ్యవహారానుసారముగా" అను సూరివాక్యములకు బా. సా. పే. వ్యాఖ్య యీక్రిందిరీతి వివరణము వ్రాసెను. "ఇది గ్రాంథికభాషకు వ్యాకృతియగుట నిందలి వ్యవహార శబ్దము కవివ్యవహారబోధక మనుట కర్హ్యముగాన గ్రాంథికపుఁ బ్రయోగముల ననుసరించి కృత్ప్రత్యయము లేయే యర్థముల నైనవియుఁ దెలియనగునని భావముఁ తేలెడిఁగాని వానికెల్లను బ్రయోగములు వాఙ్మయమునందుఁ జూపరానివగుటచు, మహాజన వ్యవహారానుసారముగా వీనిని గవీశులు ప్రయోగించుట యనాదిసిద్ధమగుటను గృత్తుల యర్థములు మహాజన వ్యవహారానుసారముగా నెఱుంగునదని వివరించెనని తోఁచెడి" (బా. సా. పే ౪౯౭ పు). ఇది సరికాదు. కృత్తులేకాక యేవ్యాకరణవిషయమైనను శిష్టజన వ్యవహారమునుండి మహాకవు లాదరించినదే యగును. మహాజన వ్యవహారమెల్ల నెందును సాధువు కాదు. అందుండి మహాకవు లేర్చినదియు దానిని మహాకవులు సవరించి యాదరించినదియు మాత్రమే సాధువు కానోపును. కావున సూరివాక్యములలోని మహాజనవ్యవహార మనఁగా మహాకవివ్యవహారమె యని తలంపనగును. భావకర్తృ కర్మాద్యర్థంబు లనుచోటి యాదిశబ్దముచేఁ గర్మకర్తృకరణాదికారకములు మున్నగునవి నైతము గ్రహింపఁబడుచున్నవి. భావమనఁగా ధాత్వర్థము. కృద్విషయమున సిద్ధావస్థాపన్నము:— "భావః పు......సాధ్యరూపే సిద్ధరూపే వా క్రియారూపే ధాతో రర్థే.........." (శబ్దస్తో). "తత్ర క్రియాసామాన్యం భావపదార్థః - తిఙ్వాచ్యం లిఙ్గసంఖ్యాన్వయాఽయోగ్యం సాధ్యావస్థాపన్నమ్, కృద్వాచ్యంతు లిఙ్గసంఖ్యాన్వయయోగ్యం సిద్ధావస్థాపన్నమ్, 'కృదభిహితో భావో ద్రవ్యవత్ ప్రకాశతే' ఇతి భాష్యాదితి" (సి. కౌ. ౩౧౮౮ సూ. బాలమనోరమావ్యాఖ్య). "ద్రవ్య. న.........వ్యాకరణోక్తే లిఙ్గసంఖ్యాన్వయిని పదార్థే........" (శబ్దస్తో). తిఙ్చే వాచ్యమగుభావము కర్తృసాధ్యమయి యుండునుగాన దానికి లింగసంఖ్యాన్వయయోగ్యత యుండదు. కృత్ప్రత్యయవాచ్యమగు భావము ద్రవ్యమువలెనె లింగసంఖ్యాన్వయయోగ్యమగుచు సిద్ధావస్థ నందియుండు క్రియాసామాన్యము. కర్తృకర్మకారకాదుల కర్థమీవలను కారకపరిచ్ఛేదమునఁ జూపబడెను. భావార్థక కృత్తుల యుదాహృతులు: ఆక = బంధనము, కోరిక = వాంఛ, ఆడిక = నింద, కర్త్రర్థకోదాహృతులు:— మొలక = నవోద్భిదము, మూఁక = సంఘము, ఏలిక = పాలకుండు, ఓడిక = స్రోతస్సు. కర్మార్థకోదాహృతి:— కోరిక = వాంఛితము.

'ఆఁక - మొలక' అను రెండును "కవర్ణకం బలుగ్వాదులకగు" అనెడి బా. కృ. 3 సూత్రముచేతనే సాధ్యము లగుచున్నవి. అట్లయినను "ఆఁక" అనునది (ఆఁగు+క) 'ఆఁగు' ధాతువుపై భావార్థక 'క' ప్రత్యయము నిల్పుటచే సిద్ధించును. 'మొలక' అనునది 'మొలచు' ధాతువుపైని కర్త్రర్థక 'క' ప్రత్యయము నిల్పుటచేత సిద్ధించును. 'ఆఁక' అనుదానికి 'ఆఁగుట' అనుభావ (ధాత్వర్థ క్రియ) మర్థము కాన నిచటి క ప్రత్యయము భావార్థకము. 'మొలక' అనుదానికి 'మొలచునది' అని యర్థము కాన నిచటి 'క' ప్రత్యయము కర్త్రర్థకము. మొలక=(నవోద్భిదము) మొలచునది = మొలచుట యను వ్యాపారమునకుఁ గర్త. ఇట్లె యంతటను కృత్తుల యర్థములను గ్రహింపవలయును. 'కోరు' ధాతువుపై బా. కృ. ౧౨ సూత్రముచొప్పున 'ఇక' ప్రత్యయము నిల్పినది. 'వానికి విద్యయందుఁ గోరిక కలదు' అనుచో 'కోరిక' శబ్దము భావార్థకము 'ఇక' ప్రత్యయముతోఁ గూడినదనఁదగును. "వానికి దేవుఁడు కోరికల నిచ్చెను" అనుచోటి కోరికశబ్దము కర్మార్థకము "ఇక" ప్రత్యయాంత మనఁదగును. "కోరికలను = కోరఁబడినవానిని" అని యర్థమగుటచే నిట 'ఇక' ప్రత్యయము కర్మార్థకమని యెఱుంగునది. ఇట్లె యొక్క ధాతువుపై నొక్కటె ప్రత్యయము నిల్పినపుడును సందర్భవశమున నట్టికృత్తున కర్థములు భిన్నము గానుండుటను సయితమరయునది. సూరిగా రుదాహరించినవాని యర్థములు:—ఆఁగు+క (బా. కృ. 3 సూ). = ఆఁక = ఆఁగుట - భావార్థకము - మొలచు+క (బా. కృ. 3 సూ). = మొలక = మొలచునది - కర్త్రర్థకము. ఏలు+క (బా. కృ. ౧౨ సూ) = ఏలిక = ఏలువాఁడు - కర్త్రర్థకము. కోరు+ఇక (బా. కృ. ౧౨ సూ), = కోరిక = కోరుట = వాంఛ - భావార్థకము. కోరఁబడినది = వాంఛితము - కర్మార్థకము. మూఁగు+క (బా. కృ. 3 సూ). = మూఁక = మూఁగునది - కర్త్రర్థకము. ఆడు+ఇక (బా. కృ. ౧౨ సూ). = ఆడిక = ఆడుట = నిందలాడుట = నింద - భావార్థకము. ఓడు+ఇక (బా. కృ. ౧౨ సూ). = ఓడిక = ఓడునది = పాఱునది = ప్రవహించునది = ప్రవాహము = స్రోతస్సు - కర్త్రర్థకము. కొన్నిటికిఁ బ్రయోగములు:—"ఆఁక. వి. (√ఆఁగు) నిరోధము.........గీ. ఆఁక లేక యెవ్వాని జలాశయమున । మండు వేసవియందును మనుజకోటి । యవభృథ స్నాన పానంబు లాచరించు (భా. ర. అను. ౨ ఆ. 3౦౬. సూ. రా. ని)." (ఎవ్వాని జలాశయమున = ఎవఁడు త్రవ్వించిన చెఱువున. అవభృథశబ్దము = యజ్ఞాంగభూతస్నానార్థకమైన నిట స్నానమాత్రార్థమున సోమయాజిచేఁ బ్రయుక్తమయ్యెను). "మొలక - వై - వి - ౧ అంకురము - ౨ అంకురితబీజము. వ. చతురహాలికుఁడు సల్లు పరువంపు మొలకల

చెలువున.........(భార. విరా. ౫ ఆ. ౬౦ గద్యము. శ. ర)." "మూఁక. దే-వి-౧ సమూహము.....సీ. మూఁకల విరియించి వీఁక నాచార్యాది యోధుల నెల్లను నొక్కెడ సెసఁకు। వెలిచి.........(భార. ద్రోణ. ౩ ఆ శ. ర)." "ఆడిక. వి. (√ఆడు).........౨ నింద - అపవాదము. సీ. కువలయంబు దినంబుఁ గూల్చు నాడిక.........(వసు. ౧ ఆ. ౧౦౭ ప)." (సూ. రా. ని.) "ఓడిక - వి. (√ఓడు .........) ప్రవాహము. క.........। ఓడికలయి పువ్వుఁ దేనె లురలఁగ నొప్పెన్. (హరి పూ. ౭ ఆ. ౧౧౭)." (సూ. రా. ని).

ఇటం గృత్కగ తపవేములు పరంబులగునపుడు క గ
బాలవ్యాకరణ చ య వలకు లోపంబగు. ౩.
వివృతి కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువు
కృదంత విషయము నంతంబులగు క గ చ య వలకు లోపంబగు.
మీఁది లక్ష్యంబులం జూడంబడు.

సంజీవని. కృదంత విష:—ఇటన్ = ఈ కృదంతపరిచ్ఛేదమునందలి, కృత్ = కృత్ప్రత్యయములయొక్క, "క - గ - త - ప - వ - ఇములు = పరంబులగునపుడు కృత్ప్రత్యయముల మొదటనున్న - 'క - గ - త - ప - వ' అను హల్లులలో నేది పరమైనను, 'ఇమి' (బా. కృ. ౮ సూ). ప్రత్యయము పరమైనను, ధాతువుతుదినున్న, క - గ - చ - య - ప - వలకున్ = "క - గ - చ - య - వ" అనువాని లో నే హల్లునకైనను దానిమీఁది స్వరముతోఁగూడ, లోపంబగు = లోపము కల్గును. క్రియాపరిచ్ఛేదాదినున్న 'ధాతువునకు' అనునది క్రియాపరిచ్ఛేదాంతము వఱకేకాక కృదంత పరిచ్ఛేదాంతమువఱకును నధికార సూత్రమగుటచే నిందును ననువృత్తమగును గావుననే సూరి యీసూత్రపు వివరణమునఁ ధాతువు నంతంబులగు క - గ - చ - య - వలకు లోపంబగునని వివరించెను. "మీఁది లక్ష్యంబులం జూడంబడున్" అనఁగా. "కవర్ణకం బలుగ్వాదుల కగు" (బా. కృ. ౮ సూ). అనునది మొదలగు సూత్రముల లక్ష్యములలో నిట్టి కాదులలోపము చూడ నగునుగాని నిందు వేఱుగ నుదాహరింపఁబడ లేదని తాత్పర్యము. వెనుకటి సూత్రమున నుదాహరింపఁబడిన 'ఆక' మున్నగు లక్ష్యములందును నిట్టిలోపము సంభవించియే యున్నది. "ఆఁగు+క" అనుచో 'గు' వర్ణలోపము రాఁగా 'ఆఁక' అని యయ్యెను. 'మొలచు+క' అనుచో 'చు'వర్ణలోపము రాఁగా "మొలక" అని యేర్పడెను. 'మూఁగు+క' అనుచో 'గు'వర్ణలోపము కల్గఁగా 'మూఁక' అని యేర్పడెను. ఇట్లే యంతటను 'కా'దుల లోపము నరయునది. 'ఇటన్' అను సూత్రస్థ

దళముచే వ్యతిరేకాద్యర్థములందు వచ్చు 'కజి' అను కృత్ప్రత్యయ కకారపరకత్వమున "కాదులకు" లోపము రాదు. ఉదా:—కలుగు+కజి = కలుగక. మొ.

కవర్ణకం బలుగ్వాదుల కగు. 3.
అలుగు - అలుక. ఆఁగు - ఆఁక. ఎఱుఁగు - ఎఱుక.
ఇట బిందులోపంబు. ఇట్లు గొన్నింట గ్రహించునది.
కడఁగు - కడఁక. కలఁగు - కలఁక. కాఁగు - కాఁక.
తునుఁగు - తునుక. నడచు - నడక. నలఁగు -
నలఁక. పోవు - పోక. మడఁగు - మడఁక. మలఁగు -
మలక. మునుఁగు - మునుక. మూఁగు - మూఁక.
మొలచు - మొలక. వచ్చునకు రా - రాక. వంగు -
వంక. వీఁగు - వీఁక ఇక - క - ప్రులు పరంబులగు
నపుడు కనునకు దీర్ఘంబగు - కానుక. కినియు -
ముదియుల కుత్వంబు నగు-కినియు-కినుక. ముదియు -
ముదుక. ఇత్యాదు లలుగ్వాదులు.

బాలవ్యాకరణ వివరణము. ౩౫౭ విషయము.

సంజీవని. ౩౫౭ విష:—"అలుగు" మొదలగు ధాతువులకు భావాద్యర్థములందు 'క' ప్రత్యయ మగునని యర్థము. సూరి యుదాహరించిన 'అలుగు' ప్రభృతులలో "నడచు - పోవు - మొలచు - వచ్చు - కను - కినియు - ముదియు" అనునవి తప్పఁ దక్కిన ధాతువులెల్ల 'గు'వర్ణాంతములె - వానికి 'క' ప్రత్యయము పరమగునపుడు, ధాతువు తుదినున్న 'గు'వర్ణము బా. కృ. ౨ సూత్రముచొప్పున లోపింపఁగా "అలుగు+క = అలు+క = అలుక" అనురీతిని రూపము లేర్పడును. 'క' ప్రత్యయ కకారము పరుషమగుటచే నది పరమగునపుడు బా. సంజ్ఞా. ౧౬ సూత్రముచొప్పున (౫౦-౫౧ I విష) ధాతువునందలి బిందువు నిలుచుట కర్హత కలదగాన సాధారణముగా నట్టిబిందువు లోపింపదు. ఉదా:—వంగు - వంక. ఆఁగు - ఆఁక. కడఁగు - కడఁక. కలఁగు - కలఁక. కాఁగు - కాఁక. నలఁగు - నలఁక. మడఁగు - మడఁక. మలఁగు - మలఁక. మూఁగు - మూఁక. మొ. "ఎఱుఁగు - ఎఱుక - ఇట బిందులోపంబు ఇట్లు గొన్నింట గ్రహించునది" అను సూరిగారి వివరణముచొప్పున 'ఎఱుక' మున్నగువానియందు ఖండము నిలువక లోపించుటయుఁ గలదని యెఱుంగనగును. ఉదా:—తునుఁగు - తునుక. మునుఁగు - మునక - మొ. బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయముద్రణములందును దర్వాతి పెక్కుముద్రణములందును 'మలఁగు - మలక' అనియె యుదాహరింపఁబడి

యున్నది. కాని పేటికావ్యాఖ్యాత 'మలఁగు - మలఁక' అని సబిందుకముగ నుదాహరించెను. కొన్ని బాలవ్యాకరణ పుస్తకములందును నట్టి సబిందుకరూపము చూపట్టుచున్నది. బా. గు. ప్ర. వ్యాఖ్యలోఁ బ్రథమ ద్వితీయముద్రణములు రెంటను "మలఁక - మలక - ఇట్లు అర్ధబిందుసహితమును బిందురహితమును నయిన రెండుశబ్దములును 'మలఁగు' వలన నైనరూపములె" (బా. గు. ప్ర. 3౦౦ పు) అని వ్రాయఁబడియున్నది. కాని 'మూకుడు - తునక' అను నర్థములుగల నిర్బిందుకమలకశబ్దము 'మలఁగు' ధాతుజమని విశ్వసింపఁదగి యుండ లేదు. బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయముద్రణములలో నిర్బిందుకముగాఁ బడుట ప్రామాదికమని తోఁచుచున్నది. "మలఁక - దే - వి - ౧ చిక్కు.........౨ చుట్టు - పాప తెర త్రాటి మలంకల (కాశీ. ౫ ఆ. శ. ర)." అను రీతిగల ప్రయోగములచే నిది సబిందుకమనియే విశ్వసింపఁదగియున్నది. "మొలచు+క = మొలక. నడచు+ క = నడక" అను చోటులందు 'క' ప్రత్యయ పరకత్వమున 'చు'వర్ణమునకును, "కినియు+క = కినుక. ముదియు+క = ముదుక" అను చోటులందు 'క' ప్రత్యయ పరకత్వమున 'యు'వర్ణమునకును, బా. కృ. ౨ సూత్రముచేత లోపము సంభవించెనని యెఱుంగునది. అంతియకాక "కినియు+క = కిని+క = కిను+క = కినుక. ముదియు+క = ముది+క = ముదు+క = ముదుక" అనురీతిని ధాతువులోని - 'ని - ది' అనువాని మీఁది 'ఇ'కారమునకు 'ఉ'కారాదేశమును నయ్యెనని "కినియు ముదియుల కుత్వంబు నగు" అని సూరిగారే వివరించిరి. 'వచ్చు+క = రా+క = రాక' అనుచో వచ్చు ధాతువునకు రాదేశము కప్రత్యయ పరకత్వమునందుసమ్మతము గల్గు నని (చూ. బా. క్రి. ౯౧ సూ). "వచ్చునకు రా" అనుచు సూరియే వివరించెను. "కను+క = కాను+క = కానుక" అనుచో 'క' ప్రత్యయ పరకత్వమున 'కను' ధాతు 'క' కారముమీఁది స్వరము దీర్ఘమగుననుచు సూరి "ఇక - క - పులు పరంబులగు నపుడు కనునకు దీర్ఘంబగు" అను వాక్యముచే విశదపఱిచెను. క ప్రత్యయ పరకత్వమందేకాక - "ఇక - (బా. కృ. ౧౨ సూ) పు (బా. కృ. ౧౧ సూ)" అనునవి పరమగునపుడును నిట్టి దీర్ఘము కల్గునని సూరివివరణమునకుఁ దాత్పర్యము. ఉదా:—కను+ఇక = కాను+ఇక = కానిక. కను+పు = కాను+పు = కానుపు. అర్థములు:—అలుక = కోపము = అలుగుట. (భావార్థకము). ఆఁక = నిరోధము (భావార్థకము). ఎఱుక = పరిచయము = ఎఱుఁగుట (భావార్థకము). "జ్ఞానము - సోదె - గుఱుతు - జ్యోతిశ్శాస్త్రమును అర్థమగునపుడు కరణార్థమందు (సాధనార్థమందు) కవర్ణక మనవలెను. దీనిచేతను యుక్తాయుక్తములు మొదలైనవి

తెలియఁబడునని వ్యుత్పత్తి చెప్పఁదగును. యుక్తాయుక్త వివేకమునకు జ్ఞానము సాధనముగదా. పరోక్షమైనసంగతి తెలియుటకు సోదె సాధనము (కరణము). వస్తునిర్ణయంబునకు గుఱుతు సాధనము. ఆగతానాగతములు తెలియుటకు జ్యోతిశ్శాస్త్రము సాధనము. సాధనములైన జ్ఞానాదులను తెలుపుచున్నందున నెఱుకశబ్దము కరణార్థకము." (బా. కు. ప్ర. ౮3౨ పు. ద్వి. ము). కడఁక = పూనిక = కడఁగుట. (భావార్థకము). కలఁక = సంక్షోభము - కాలుష్యము - కలఁగుట (భావార్థకము). కాఁక = తాపము - కాఁగుట (భావార్థకము). తునుక = ఖండము - ముక్క - (తునిఁగినది - కర్త్రర్థకము). నడక = గమనము - నడచుట (భావార్థకము). నలఁక = నలఁకువ = నలఁగుట (భావార్థకము). పోక = గమనము - పోవుట (భావార్థకము). మడక = మడుఁగువస్త్రము (బాగుగ మడుఁగునది - కర్త్రర్థకము). మలఁక = మెలిక (భావార్థకము). మునుక = మునుఁగుట (భావార్థకము). మూఁక = సంఘము (మూఁగునది - కర్త్రర్థకము). మొలక = అంకురము - నవోద్భిదము (మొలచునది - కర్త్రర్థకము). రాక = ఆగమనము - వచ్చుట (భావార్థకము.) వంక = వంకర (వంగునది - కర్త్రర్థకము). వీఁక = విఱ్ఱవీఁగుట - ఓడుట (భావార్థకము). కానుక = కానిక - (ఉపాయనము - దాతలచే శ్రద్ధతోఁ జూడఁబడునది. లేదా గొప్పగాఁ జూడఁబడునది). (లేదా - గౌరవముగఁ బొందఁబడునది. కర్మార్థకము). కినుక = కోపము - కినియుట (భావార్థకము). ముదుక = వృద్ధుఁడు ముదిసినవాఁడు - ముదిసినది (కర్త్రర్థకము).

కృత్ప్రత్యయములకు మిక్కిలి యధికముగా సూరి యుదాహృతుల నిచ్చుట చేత వానికెల్లఁ బ్రయోగములు చూపిన నతివిస్తరమగుననియు, నొక్కొక రూపమున ననేకార్థము లుండుటచే వానికెల్ల నుదాహృతుల నిచ్చినచో నింకను నతి విస్తృతియగుననియు నట్టి ప్రయోగములు శబ్దరత్నాకర సూర్యరాయాంధ్ర నిఘంటువులందు విపులముగా నుదాహరింపఁబడి యుండుటచే వానినే మరల నెక్కింపనేల యనియు నీపరిచ్ఛేదమునఁ బ్రయోగప్రదర్శనము సంక్షేపింపఁబడియె. కేవలము చూపఁదగినవని తోఁచినవి మాత్రమె చూపఁబడును. ప్రయోగములు:—

ఉ.........ఉద్భటుం । డై నెగసెన్ సమీరసుతు నక్కడుఁ బ్రాఁకిడినట్లు వీఁకతో (భార. విరా. ౨ ఆ. 3౫౦). క. ఎఱుక గలవారి చరితలు । గఱచుచు...... (భార. ఆది. 3. ఆ. ౨౦3). గీ. రాజునకుఁ గీడుపుట్టెడు రాజ్య మడఁగు । ననుచు నెఱుక చెప్పెడు జ్యోతిషాధములను । ......(విజ్ఞా. ప్రా. ౧3౭ సూ. రా. ని). సీ......పాంచాలతనూజపంచకముఁ గోలు (తే-గీ.) పోకఁ జేసియు గెల్పు గెల్పుగ

మదీయ । బుద్ధి నైగ కొనదయ్యెడు.........(శాంతి. ౧ ఆ. ౬). ఉ. ఏను సుమాలి కూఁతుర మునీశ్వర మిమ్మిటఁ దండ్రి పంపునన్ । గానఁగ రాకయుంచు......... (నిర్వ. 3 ఆ. ౫౦). ఆ.వె. ఎచటనుండి రాక యెవ్వరి సుత వేమి (నిర్వ. 3 ఆ. ౪౯ ప). చ.........గాయకా । వి పరిజనంబుతోఁ జని తదీయసమీరుఁడు దన్నుఁ గానరా । క పగిది వీచినం గొలువు నైగ కొని యుండె పెద నాదరించుచున్ (నిర్వ. ౮ ఆ. ౨౪). (రాకయొక్క పగిది = రాక పగిది). ఇత్యాదు లడంగ్వాదులనుటచే నీయం డంగ్వాదు లాకృతిగణము. ఇదియె యననేల? ఈ కృత్తుల సూత్రములెల్ల నాకృతి గణవిషయకములె.

ఇమివర్ణకంబు కలుగ్వాదుల కగు. ౮.

బాలవ్యా. 3౫౮ విషయము — కలుగు - కలిమి. ఓరుచు - ఓరిమి. కూరుచు - కూరిమి. నేరుచు - నేరిమి. వేలుచు - వేలిమి. బడియు - బడిమి. బ్రదుకు - బ్రదిమి. ఒడ్డు - ఒడ్డిమి. తాలు - తాలిమి.

సంజీవని. 3౫౮ విష:—కలుగు మొదలగు ధాతువులకు భావాద్యర్థము లందు 'ఇమి' ప్రత్యయమగు నని యర్థము. సూరి యుదాహరించిన కలుగు ప్రభృతులలో 'ఒడ్డు' 'తాలు' ధాతువులు తప్పఁ దక్కిన యన్నిటికిని బా. కృ. ౨ సూత్రమఁచొప్పున నంత్యవర్ణలోపము కలుగఁగా బా. సంధి. ౧౧ సూత్రము చొప్పున నపదాది స్వరసంధి నిత్యముగా వర్తిల్ల "కలుగు+ఇమి = కల+ఇమి = కలిమి" మున్నగురూపము లేర్పడును. 'కలుగు' అనువాని తుది 'గు'వర్ణమును, 'ఓరుచు - కూరుచు - నేరుచు - వ్రేలుచు' అనువానితుది 'చు'వర్ణమును, 'బడియు' అనుదానితుది 'యు'వర్ణమును, 'బ్రదుకు' అనుదానితుది 'కు'వర్ణమును 'ఇమి' ప్రత్యయపరకత్వమున బా. కృ. ౨ సూత్రముచే లోపించెనని యెఱుంగునది. బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయముద్రణములందు సైతము 'తాలు - తాలిమి' అనియె యున్నది. 'ఓర్చు - సహించు' అను నర్థముగల 'తాలు' అనునది లఘు లకారయుక్త ధాతువే యని సూరి తలంచియుండును. కోశములందు "తాళు స - క్రి. సహించు - ఓర్చు.........అ - క్రి. (క - తాళు - త - తాళ్). ఆఁగు - నిదానించియుండు........." (సూ. రా. ని). అని తాళుధాతువు ద్రావిడమూర్ధన్య ళకారయుక్తముగా నుదాహృతమైయున్నది. ల ళ లకు యతి ప్రాసమైత్రి లాక్షణిక సమ్మతమగుటచేతఁ గవిప్రయోగములనుబట్టి యిట సందేహ నిర్ణయము చేయుటకు శక్యము కాకున్నది. 'తాళు' ధాతువునకు భారతమందుఁ

ప్రయోగము లభింపలేదు. సూ. రా. నిఘంటుకారులు తాలిమిశబ్దము 'తాలుచు' ధాతువునుండి యేర్పడినదనుచు నిట్లు వ్రాసిరి. "తాలిమి - (ల్మి) వి. (√ తాలుచు - త. తాళమై). ౧ ఓపు - ఓర్పు". (సూ. రా. ని). తాలుచు ధాతువు తుది 'చు' వర్ణము 'ఇమి' ప్రత్యయ పరకత్వమున బా. కృ. ౨ సూత్రముచొప్పున లోపించి "అపదాది నిత్యసంధి" కల్గఁగా 'తాలిమి' అను రూప మేర్పడనగును. తాలుచు - ధాతువును తాలిమిశబ్దమును భారతప్రయుక్తములై యున్నవి. ఈ సందర్భమును బట్టి "తాళు అని ధాతువుగా నున్నపు డలఘు ళకారముతో నుండును. ఈ ళకారము కృదంతత్వావస్థయందు లఘు లకారమగు 'తాలిమి' అగు" (బా. గు. ప్ర. ౪౩౪ పు. ద్వి. ము) అనెడి గుప్తార్థప్రకాశికా కల్పనము సరికా దనఁదగును.

కలుగు+ఇమి = కలిమి - కలుగుట - భావార్థకము. "కలిమి - భావార్థకమైనచోఁ గలియుట యర్థము. 'ఇట్టి మహిమకలిమికిఁ గత మెయ్యది' (భా. అర. ౪ ఆ.)" (బా. గు. ప్ర. ప్ర. ము. ౩౧౧ పు. ద్వి. ము. ౪౩౩ పు). అనెడి గుప్తార్థప్రకాశిక వ్రాఁత ప్రమాదపతిత మనఁదగును. 'కలియు' అను ధాతువు నుండియుఁ బ్రకృతిసూత్రముచే 'కలిమి' అను రూపమును సాధింపనగునుగాని యట్టిది సూరిచే నుదాహరింపఁబడలేదు. కలిమిశబ్దమునకు 'కలియు' ధాత్వర్థమునఁ బ్రయోగమును జూపట్టదు. కలుగు+ఇమి = కలిమి = సంపద. అధికరణార్థకము. దీనియందు (సంపదయందు) సుఖాదికము గలుగునని వ్యుత్పత్తి నరయునది. ఓరిమి = సహనము (భావార్థకము). కూరిమి = ప్రేమము - స్నేహము. (కరణార్థకము - దీనిచేతఁ బ్రీతిని గూర్తుగని వ్యుత్పత్తి నెన్నునది). నేరిమి = చతురత = నేర్చుట (భావార్థకము). వేలిమి = హోమము = వేల్చుట (భావార్థకము). బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయముద్రణములందును దర్వాతి ముద్రణములన్నిటియందును "వ్రేలుచు = వ్రేలిమి" అనియేయున్నది. "బా - గు - ప్ర. బా - సా - వే." వ్యాఖ్యాతలును 'వ్రేలుచు - వ్రేలిమి' అనియె నిల్పిరి, కాని "హోమముచేయు" అను నర్థముగలది 'వేలుచు' ధాతువెకాని "వ్రేలుచు" ధాతువుకాదు. "వేలుచు - దే. స - క్రి. హోమాగ్నియందు నేయి మొదలగువాని సమర్పించు. (రూ - వేల్చు) ........." (శ-ర). "వ్రేలుచు - దే - ప్రే. వ్రేలఁజేయు. (రూ - వ్రేల్చు)... ......౨ కడుగు." (శ-ర). 'వ్రేలిమి' అనెడు వకారరేఫ సంయుక్తరూపమే కోశములందు లేదు. బడిమి = (దృష్టి దోషాదిపరిహారార్థము) దిగఁదుడుచుట (భావార్థకము). "బడిమి - దే - వి - ౧ బడియుట. ౨ చక్రాకారభ్రమణము. 'ద్వి - పురిమట్టు బడిమిగాఁ ద్రిప్పి'. (సారంగధరచరిత్రము - ద్వికద. భా. ౭ శంభు

కవి) 3 భూతబలి." (శ-ర). "బడియు. దే. స. క్రి. (దృష్టిదోష పరిహారార్థము) దిగఁదీయు. నై. 3 ఆ" (శ. ర). చక్రాకార భ్రమణ మను నర్థమునుబట్టియే 'బడియు' ధాతువునకు 'దిగఁదుడుచుట' అను నర్థముగల్గెనని తోఁచెడిని. ఉప్పు - కాల్చినమిరపకాయలు - పసుపుమెతుకులు - ములకాకులు ('ములగ' అందురు) దృష్టిదోషము తగిలినవానిచుట్టును డ్రిప్పి వీథిలో పాఱవేయుదురు లేదా యా వస్తువులను ప్రొయ్యిలోవేసి కాల్తురు. "దిగఁదుడుచు. దే. స-క్రి. (దిగన్+తుడుచు) (దృష్టి దోషము మొదలైనవానికి ఉప్పు మిరపకాయ లోనగువాని) చుట్టివేయు." (శ. ర). బ్రదిమి = జీవనము = బ్రదుకుట (భావార్థకము). ఒడ్డిమి = పందెములో నొడ్డిన ధనాదికము. (కర్మార్థకము. పందెమునం దొడ్డఁబడినది). "ఒడ్డిమి. దే. వి. ఒడ్డు - పందెము. 'వ' ఆశకుని యాడి యుధిష్ఠిరుం డొడ్డిన యొడ్డిమి యెల్లగెలుచుచు వచ్చె (భార. ఉద్యో. ౧ ఆ. ౨౨ గద్యము)." (శ. ర). ఇట్లు సూరియు శబ్దరత్నాకరకర్తయు వచించి యుండఁగా దీనిని సూ. రా. నిఘంటుకారు లుజ్జగించుటకుఁ గారణము తెలియకున్నది. తాలిమి = ఓర్మి - సహనము. (తాలు ధాతుజన్య మనుపక్షమున భావార్థకము. తాలుచు ధాతుజన్యమనుపక్షమున నధికరణార్థకము. దీనియందు స్థైర్యము తాల్తురని వ్యుత్పత్తి నరయఁదగును.)

ప్రయోగములు:—క. కలిమియ చుట్టలఁ జేర్చుం । గలిమియ చెలులను ఘటించు.........(భార. శాంతి. ౧ ఆ. ౫౧). ఉ. ప్రాయము కల్మి నొక్కటన భవ్యధృతిన్ మహనీయశీలతన్ ।..........వృద్ధుఁడవు గావె......(ద్రోణ. ౧ ఆ. ౬౮ ప). గీ. తాల్మి పుణ్యలోట యడఁకువ తగవు మెలవు । (విరా. ౨ ఆ. 3 ప). క.........ఉ । త్తమరూపము గోరువారు తాల్తురు దానిన్ (ఉద్యో. ౨ ఆ. ౮౦ ప). తే-గీ. బ్రహ్మలోకంబు కాశికి బడిసివాటు (కాశీ. ౭ ఆ. శ. ర). ఉ.........భీష్ముఁడను సాగరముం గడవంగ నీఁదఁగా । నేరిమి యెట్లొకో కలుగనేర్చె శిఖండికి నేమి సేయుదున్ (భీష్మ. ౧ ఆ. ౫౮).

తజ్వర్ణకంబు చేయ్యాదుల కగు. ౫౧.

బాలవ్యాకరణ వివరణము. 3౫౧ విషయము.

చేయు - చేఁత. అలయు - అలఁత. కూయు - కూఁత.
కోయు - కోఁత. గీయు - గీఁత. నేయు - నేఁత.
పూయు - పూఁత. పోయు - పోఁత. మూయు - మూఁత. మేయు - మేఁత. మ్రోయు - మ్రోఁత.
రోయు - రోఁత. లాయు - లాఁత. వ్రాయు - వ్రాఁత. ప్రేయు - ప్రేఁత.

సంజీవని. 3౫౯ విష:—చేయు ప్రభృతి ధాతువులకు భావాద్యర్థములందు తజ్ ప్రత్యయమగు నని యర్థము. ప్రాయికముగా 'యు' వర్ణాంత ధాతువుల కీ ప్రత్యయమువచ్చు ననదగును. డాయు - దాయు - కలయు - కలియు - కాయు - పాయు - మాయు - మున్నగు ధాతువులం దీప్రత్యయము చూపట్టమింజేసి యు వర్ణాంతములకని సూత్రించుటకు వలనుపడదయ్యె. తెలుగు జేత్తుగాన బా తత్స. ౧౯ సూత్రముచొప్పున బిందుపూర్వకం బగు. 'అలత - అలంత' మున్నగు రతిని హ్రస్వముమీద ఖండపూర్ణములు రెండును నిల్చును. తజ్వర్ణక పరకత్వమున బా. కృ. ౨ సూత్రముచొప్పున ధాతువు తుది నున్న 'యు' వర్ణము లోపించును. ఉదా:—చేయు+తజ్ = చే+తజ్ = చేత. ఇట్లె యంతటను బ్రక్రియ నరయునది పెక్కుచోట్ల నీప్రత్యయము టప్రత్యయమువలెనె (బా. క్రి. 3౫ సూ) భావార్థమందు వచ్చుటయు వ్యాపారార్థము మాయని రీతి నర్థము నిచ్చుటయు భావార్థకాదులలోఁ జేరి కర్తృకఁ బ్రథమాంతత్వమును ఘటించు టయుఁ జూపట్టుచున్నను "చేత = కృత్యము = పని. ప్రేత = దెబ్బ. గీత = రేఖ. మూత = మూయు పనిముట్టు = మూకుడులో నగునది. మేత = గడ్డి మొదలగు పశువుల యాహారము." మున్నగు స్థలములయందు భావార్థభిన్నము లగు నర్థ విశేషములు దీనికి వెలయుచుండుటచేతను సర్వక్రియా సాధారణము కాకుండుటచేతను నిది భావార్థక 'ట' ప్రత్యయమువంటిది కాదనియుఁ గ్రియాప్రక రణమున నుపదేశింపఁదగినది కాదనియు నెఱుంగునది.

చేత = చేయుట (భావా). చేత = పని = కృత్యము. (కర్మార్థకము-చేయఁ బడునది). అలంత = అలత = అలయుట. (భావా). కూత = కూయుట-(భావా). కూత = మొఱ - (కర్మా - కూయఁబడునది). కోత = కోయుట (భావా). గీత = రేఖ - గీటు (కర్మా - గీయఁబడునది). నేత = నేయుట (భావా). పూత = చందనాదిచర్చ - (కర్మా - పూయఁబడునది). పోత = పోయుట - (భావా). మూత = మూయుట (భావా). మూత = మూసెడు పనిముట్టు - మూకుడులోనగునది (కరణార్థకము - బిందెలు మున్నగువానిని మూయునది). మేత = మేయుట (భావా). మేత = పశ్వాద్యాహారము (కర్మా. మేయఁబడునది). మ్రోత = ధ్వని (కర్మా. మ్రోయఁబడునది). రోత = జుగుప్స. రోయుట (భావా). రోతలు = ఓట్టులు - (కర్మా. రోయఁబడునవి). లాత = ఉద్రేకించుట (భావా). వ్రాత = వ్రాయుట (భావా). వ్రాత = లేఖనము (కర్మా. వ్రాయఁబడునది). ప్రేత = ప్రేయుట (భావా). ప్రేత = దెబ్బ (కర్మా. ప్రేయఁబడునది). "ప్రేత - ప్రేయు

టయు, కార్యకారణాభేదోపచారంబుచేత ప్రేయుటవలన (కలిగిన) దెబ్బయు నర్థములు. క. ఆసూర్యభానుః డీక్రియు। ప్రేసిన యప్పరిఘు దనుజవిభుః డధిక బలో। ల్లాసమునఁ బుచ్చుకొని పొడి। చేసె నసుకు లార్వ నతని శిర మొక ప్రేఁతన్ (నిర్వ ౮ ఆ) (దెబ్బచేత) భావార్థక ప్రత్యయమైనను నీయర్థమందు (కార్యము కారణముతో నభిన్నమన్న బుద్ధిచేత నిటు ప్రయోగింపఁబడియె" (బా గు. ప్ర. ౩౧౨ పు). ఈరీతిగ "గీఁత (గీయఁబడునది, అనిన కర్మార్థమందు (దణ్వర్థకము; గీటు అర్థము)" (బా. గు. ప్ర. ౩౧౨ పు). అనుచో నేల వ్రాయఁడయ్యెనో? గీయుట చేతనే కదా 'గీఁత=గీటు'-ఏర్పడును. ప్రయోగములు:—ఉ. కావున మేలుసేయదె జగజ్జనలోకికి రాజునాజ్ఞమై। 'బోవుట' యాతనిం దగినపూజలఁ దృప్తునిఁజేత,..... (శాంతి. ౨ ఆ. ౨౬౦). "లాయు...గ. లయు కాలోగ్ర పతంగబింబము క్రియఁ లాయుఁ యదీయోగ్ర.........చక్రంబు.........(హరి. ఉ. ౭ ఆ). "(శ. ర).

కువ వర్ణకం బడంగ్వాదుల కగు. ౬.

| బాలవ్యాకరణ | అడఁగు - అడఁకువ. ఎఱుఁగు - ఎఱుకువ. కలఁగు - |
|---|---|
| వివరణము | కలఁకువ. నలఁగు - నలఁకువ. పెనఁగు - పెనఁకువ. |
| ౩౬౦ విషయము | పొలయు - పొలకువ. మఱచు - మఱకువ. మెలఁగు- |
| | మెలకువ. లోఁగు - లోఁకువ. వేగు - వేకువ. |

సంజీవని. ౩౬౦ విష:—అడఁగు ప్రభృతిధాతువులకు భావాద్యర్థములందు. 'కువ' అను ప్రత్యయమగునని యర్థము. అడంగ్వాదులకెల్ల 'కువ' ప్రత్యయ పరకత్వమున బా. కృ. ౨ సూత్రముచొప్పున ధాతువుల తుదియున్న 'గు - యు - చు' అనువర్ణములు లోపింపఁగా 'అడఁకువ - పొలకువ - మఱకువ' మున్నగు రూపములేర్పడును. 'ఎఱుఁగు' ధాతువునందుమాత్రము క ప్రత్యయపరకత్వమందువలెనె (ఎఱుఁగు+క = ఎఱుక) కువ ప్రత్యయ పరకత్వమందును బిందు సహిత 'గు'వర్ణము లోపించును. ఎఱుఁగు+కువ = ఎఱుకువ. ఇది నిర్బిందుకము. తక్కిన 'అడఁగు - కలఁగు' మున్నగు ధాతువులందలి సిద్ధబిందువు లోపింపక నిల్చును. ఉదా:—అడంకువ - అడఁకువ. కలంకువ - కలకువ. పెనంకువ - పెనఁకువ - మొ. వేగు మున్నగు నిర్బిందుకములు కువ ప్రత్యయయోగమందును నిర్బిందుకములుగనే యుండును. ఉదా:—వేగు+కువ = వేకువ మొ.

అడఁకువ = నమ్రత = అడఁగియుండుట - అణఁకువ - రూపాంతరము (భావా). ఎఱుకువ = తెలివి. (కరణా. దీనిచేతఁ దెలియఁబడును). (ఎఱుక. భావా). కలఁకువ = సంక్షోభము = కలఁక = కలఁత. (భావా). నలంకువ = నలఁగుట (భావా).

నలఁకువ = ఆపద వ్యాధి - (దీనిచే నలఁత (శ్రమ) కలుగును - కరణా) పెనఁకువ = పెనఁగుట = పెనఁగులాట - (భావా). పెనఁకువ = యుద్ధము (అధికరణార్థకము. దీనియందుఁ బెనఁగులాడుదురు). పొలకువ = జాడ = పోబడి. (భావా). "పొలకువ-దీనియందు సంచరింతురన్న వ్యుత్పత్తిని - మార్గము. ఇత్యాద్యర్థములందు నధికరణార్థకము" (బా. గు. ప్ర. ౪౩౬ పు. ద్వి. ము). మఱకువ = అజ్ఞానము. (కరణా. దీనిచే మఱపు గల్గును). క. ఎఱుకని యెఱుఁగక మిమ్మున్ । మఱకువ మార్గొన్న తప్పు మఱవుఁడు.........(ఆర. ౧ ఆ. ౩౨౬). (శ. ర). మెలఁకువ = వర్తనము - జాగరూకతతోడి వర్తనము (భావా). "మెలఁగు - దే - అ - క్రి. ౧ వర్తించు .........౨ జాగరూకతతోవర్తించు........." (శ. ర). మెలఁకువ = మేలుకొనుట (అధికరణా - దీనియందు మెలఁగుదురు). లోఁకువ = లొంగుట = లోఁగుట (భావా). "లోఁకువ - దే - విశే - అధీనము" (శ. ర). అనెడి శబ్దరత్నాకరమును బట్టి కావలయును బా. గు. ప్ర. వ్యాఖ్యాత "లోఁకువ - అడఁగునది. ఇత్యాది విశేషణార్థమునఁ గర్త్రర్థమందుఁ బ్రత్యయము. విశేష్యంబగుచో భావార్థకము". (బా. గు. ప్ర. ౪౩౬ పు. ద్వి. ము). అని వ్రాసెను. కాని 'లోఁకువ' అనుదానికి 'లోఁగువాఁడు - లోఁగునది' అను విశేషణపరార్థము ప్రసిద్ధముకాదు. వేకువ = ప్రాతఃకాలము. (అధికర. "ఈకాలమునందు వేగును = తెల్లవాఱును." అని వ్యుత్పత్త్యర్థము నరయునది).

ప్రయోగములు:—క. ..........వి 'చ్చలవిడి భోగింపక వే । డ్కలు సలుపఁగవలయు భటుఁ డడంకువతోడన్. (విరా. ౧ ఆ. ౧౪౦). క. కాన యవశ్యము పెనఁకువ । గాని యుపాయమున........(ఉద్యో. ౩ ఆ. ౧౯). "పొలకువ - దే - వి - జాడ - పోబడి. సీ. పొలకువ గనుఁగొన్నఁ బోవు దయ్యంబుల విసరముల్ భీతిచే విస్తరిల్లి. (హంస ౩ ఆ)." (శ. ర).

టవర్ణకం బాడ్యాదుల కగు నగుచో నంత లోపం
బగు. ౭.

బాలవ్యాకరణ వివరణము. ౩౬౧ విషయము.

ఆడు - ఆట. ఊరు - ఊట. ఊఱడు - ఊఱట. ఏఁకరు - ఏఁకట. ఓడు - ఓట. తివురు - తివుట. తేరు - తేట. త్రిమ్మరు - త్రిమ్మట. పండు - పంట. పాడు - పాట. మండు - మంట. వండు - వంట. వేసఱు - వేసట. అనుప్రయుక్తంబయిన యాట శబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబరుసుంబగు. కోలాటము - పోరాటము. మండ్రాటము. ఇత్యాదులు.

సంజీవని. ౩౬౧ విష. ఆడు - మొదలగు ధాతువులకు 'ట'వర్ణకంబు భావా ద్యర్థములం దగును. అట్లగునపుడు ధాతువు తుదియక్షరము (స్వరసహిత వ్యంజనము) లోపించును. "పండు+ట = పంట" మున్నగు చోటులందు 'డు'వర్ణము లోపించిన 'ట'ప్రత్యయము సైతము బిందుపూర్వకమగుట కర్హమగునదేకాన (బా. సంజ్ఞా. ౧౬ సూ.) నచటిబిందువు లోపింపదు. బా. కృ. ౨ సూత్రము చెప్పిన "క-గ-చ-య-వ"అనునవి మాత్రమె లోపించును. ప్రకృతసూత్రపు ట ప్రత్యయము పరమగునపు డన్నచో ధాతువు తుది నేయక్షరమున్నను నది లోపించునని యెఱుంగునది బా. క్రి. ౩౫ సూత్రపు టప్రత్యయము పరమగునపు డిట్టి లోపము కలుగదు ఉదా - ఆడు+ట = ఆడుట. ఆకృతిగణముగాన చెడుట - చెట్ట మొ. (సభా. ౨ ఆ. ౩౧౩).

ఆట = ఆడుట = క్రీడ. (భావా). ఊట = ఊరిన ద్రవము. (కర్త్ర - ఊరునది). ఊఱట = ఊఱడిల్లుట. విరామము. (భావా). ఊఱట = సహాయుఁడు - ఊఱడించునది. విశ్రాంతి నిచ్చునది. (కర్త్ర) - ఊఱట గల్గించువాఁడు). గీ. మాటి మాటికిఁ బరికించి మందడీల। కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్తు (విరా. ౧ ఆ. ౬౫). ఏఁకట = అపేక్ష. (భావా). ఓట = పరాజయము = ఓడుట. (భావా). ('ఓటము' అను నపుంసకలింగసమరూపమును గలదు. 'ఓటమి = ఓటు' అనురూపములును గలవు). తివుట = కాంక్ష = తివురుట. (భావా). తేట = తేఱిన ద్రవపదార్థము. (కర్త్ర - మీఁదికిఁ దేఱునది). త్రిమ్మట = పర్యటనము = త్రిమ్మరుట. (భావా). పంట = పండుట. (భావా). పాట = గానము. (కర్మా. పాడఁబడినది). మంట=జ్వాల. (కర్త్ర - మండునది). వంట = వండుట. (భావా). వేసట = విసుగు శ్రమము. (భావా).

ఆడుధాతు కృదంతరూపమగు 'ఆట' శబ్దము స్త్రీసమమే యయినను నది మఱొకశబ్దమున కనుప్రయుక్తమగునపుడు నపుంసకలింగసమ మగు ననఁగా 'ము' ప్రత్యయముతోఁ గూడి యుండును. కోలాటము=హల్లీసక మనెడి క్రీడ (భావా). "కోలాట(ము). వి. (కోల+ఆట. త. కోలాట్టం). హల్లీసకము. స్త్రీలు చేతికోలలతో తాళము వేయుచు పాడుచు చుట్టును తిరిగి ఆడెడు ఒకవిధమగు ఆట.........వ. మోహనాంగు లపారశృంగారంబులు నెఱపుచు కోలాట లాడ (లక్ష్మీవిలాసము.)" (సూ. రా. ని). పోరాటము = యుద్ధము - (భావా) (సూ- ప్రాయికమనుటచే కోలాట - పోరాట మున్నగు రూపములును గలవని యెఱుంగునది). "పోరాట. దే-వి (పోరాడుట). ౧ కలహము ౨ యుద్ధము. తే. గీ. అవినీతుఁడైన। యా

సుయోధనుతోడి పోరాట దక్కి (ఉద్యో. 3 ఆ)........(రూ. పోరాటము) - యుద్ధమునకు క. నీరాట వనాటులకుం। బోరాటం బెట్లు గలిగెఁ బురుషోత్తముచే। నారాట మేట్లు మానెను। .........(భాగ. ౮ స్కం).......” (శ. ర). శా. నీటి పో। రాటం బోటుపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై (భాగ. ౮ స్కం ౫౭,. ('నీటి। పోరాట నోటమి'అని పాఠాంతరము). సీ. అదరి పోరాటకు వదనెవరో........(భీష్మ. ౧ ఆ. ౧౫౮). మ........నీచిత్తంబు పోరాటకుం। జూరచే నిశ్చలికిం బోలంగి (శల్య. ౨ ఆ. ౮౮). ఇట్లు "పోరాటము - పోరాట" అను ద్వివిధరూపములును గన్పట్టుచున్నవి. ద్వి. అనురక్తిఁ గోని యాట కదిసీవె సాటి (బం. 3 ఆ. 3౮౭). క........మిమ్ముం గోనియా। టకు నాతడు మనసు చేద్వాడం జింతిల్లున్. (శాంతి. ౧ ఆ. ౧౭). చ........మా। ధవుగోని యాటలం దమ కృతంబులకుఁ మెఱుఁగిడ్డ యట్లుగాన్. (అశ్వ. ౮ ఆ. ౧౭౮). ఇట్లు 'కోనియాట' అనిమాత్రమె మాపట్టుచున్నది. శా........ రిపులం జెండాట సూచింపఁగా. (ఉ. హరి. ౬ ఆ. ౬౭). ఇట్లగుటచేత "కోలాట - పోరాట- మంత్రాట అనురీతిని ముపర్ణక విరహితమై యాటశబ్దము వ్యస్తముందువలె నుండదని యెఱుంగునది." (బా-సా-పే-౫౦౦ పుట) అను పేటికా వ్యాఖ్య యపరిశీలన మూలక మనదగును. "దీన వ్యస్తమున నిది(ట) నిత్యముగ స్త్రీసముంబె యగు ననుట తెల్లము" (బా-సా-పే-౫౦౦ పుట) అను వాక్యమును సరికాదు. 'ఓటము (కొలువు) కూటము' మన్నగు రూపములు చూపట్టుచున్నవి. "ఓటము = ఓట. వి........." (సూ. రా. ని) "కూటము.........క.........మశివామక। ములు గట్టు డు ప్పద్దకూటమున సొంపారన్. (భార. ఉద్యో. 3 ఆ. ౧౫౨). (భావార్ధ). మంద్రాటము = సంతాపము. (భావా) "మంద్రాడుట = మంద్రాటము. దే. వి. సంతాపము. శా. కంద్రేడులు నీగతిం జనఁగ జంభద్వేషి ముఖ్యామరుల్। మంత్రాటం బిడియేల చెప్పుదము కామధ్వంసికిన్.........(ఉ. హరి. ౨ ఆ). ఇత్యాదులనుటచే నీ యాద్యాదు లాకృతిగణము. సూరి యిట్లు కొన్నిసూత్రముల యొద్ద వ్రాయకున్నను నీకృత్యనిత్యయాముల గణములెల్ల నాకృతిగణములె.

| | |
|---|---|
| బాలవ్యాకరణ | టు వర్ణకంబు పద్యాదుల కగు, నగుచో నవి యాద్య |
| వివరణము | క్షరశేషంబులయి దీర్ఘంబు నొందు. ౮. |
| 3౬౨ విషయము | పడు - పాటు. చెడు - చేటు. అడుచు - ఆటు. |
| | కఱచు - కాటు. పొడుచు - పోటు. వయిచు - |
| | వాటు. ఏయు - ఏటు. ఓడు - ఓటు. ప్రేయు - ప్రేటు. |

సంజీవని. 3౬౨ విష:— పడు ప్రభృతిధాతువులకు భావాద్యర్థములందు 'టు' ప్రత్యయం బగు. అది పరమగునపుడు ధాతువు తొలియచ్చు మీఁదివర్ణంబు లెల్ల లోపించును. ఆతొలియచ్చు హ్రస్వంబగునేని యది దీర్ఘంబగును. పడు+టు= ప+టు = పాటు. కఱచు+టు = క+టు = కా+టు = కాటు. (బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందును 'కఱచు'అని 'ఉ'కారమధ్యముగానె పడి యున్నది. అయ్యది పొరపాటు. "రెండిటికి మించిన వర్ణములు గలవాని విషయ మునసే యాద్యక్షరశేషంబగు నను విధానము సార్థకంబగునని యెఱుంగునది. రెండువర్ణములు గలవానికి ౨. చే అంతిమవర్ణలోపము సిద్ధముగాన సవ్వాని విషయమున దీర్ఘవిధానమే యావశ్యకము గును." (బా - సా - వే. ౫౦౦ పుట.) ఈ పేటికాపంక్తులు కేవలము సజాగ్రత్తగా వ్రాయఁబడినవి. ఈసూత్రము వివరణ మున సూరి యుదాహరించిన ద్వ్యక్షరధాతువులు డు వర్ణాంతములును, 'ఏయు - వ్రేయు'అనునవియునై యున్నవి. వీని తుదినున్న 'డు'వర్ణముగాని 'యు'వర్ణము గాని బా. కృ. ౨ సూత్రముచే లోపింపనేరదు. ఈ రెండవసూత్రము కృత్ - క - గ - త - ప - వేములు పరమగునపుడుమాత్రము క గ చ య వలకు మాత్రమే లోపమును విధించుచున్నది. క - గ - త - ప - వేములలోనిది 'టు'వ ర్ణకము కాదు. 'డు'వర్ణము "క గ చ య వలలోనిదియును గాదు. ఈ ౨ సూత్ర మంతిమవర్ణ లోప విధాయకము గాదు. ఎంతచూచికొనకుండ నీవ్యాఖ్య వ్రాయఁ బడెనో తెలియకున్నది. పాటు = పడుట. (భావా). పాటు = ఆపద. (అధికర - దీనియందుఁ బడుదు రనఁగా శ్రమపడుదు రని వ్యుత్పత్త్యర్థము). చేటు = చెడుట. (భావా). చేటు = ఆపద. (అధికర - దీనియందుఁ జెడుదురు). ఆటు = ఆడుపు. హాలి. (భావా). కాటు = కఱచుట. (భావా). "కఱచు = అభ్యసించు" అను ధాతువున కీ "టు" ప్రత్యయము రాదు. అట్టి ధాతువునకు 'కఱపు'అనునది కృదంత రూపమగును. పోటు = పొడుచుట. (భావా). వాటు = వైచుట. (భావా). ఏటు = ఏయుట. బాణప్రయోగము. (భావా). (ఏయు = బాణాదులను బ్రయోగించు). ఓటు = ఓడుట. (భావా). వ్రేటు - వ్రేయుట - హాలి - (వ్రేయు = నఱకు - కొట్టు. వేయు _ వైచు). "వేటు - దే - వి - వ్రేటుయొక్క రూపాంత రము. (అదురువేటు - కూఁతవేటు మొ.)" (శ. ర.) ఈ శబ్దరత్నాకరమునుబట్టి కావలయు సుప్తార్థప్రకాశికాకర్త యిట్లు వ్రాసెను. "వ్రేటు—దీనికి రూపాంతరము వేటు. కొట్టు - నఱకు - అర్థము. వేయువలన వేటు అను రూపం బయినదని చెప్పఁ గూడదు. అపుడు విశేషం బర్థమగుఁ గాని కొట్టుట యర్థము కాకపోవలసివచ్చును'

(బా. గు. ప్ర. ౪౩౮ పు). ఇది సరికాదు. శబ్దరత్నాకరకర్త యిచ్చిన లక్ష్యములు ‘అదురువేటు - కూఁతవేటు.’ అనునవి నఱకుట యర్థముగల స్థలములు కావుగదా. “వేటు” శబ్దమునకు నఱకుట యర్థమని నిర్ణయించు ప్రయోగమును గుప్తార్థప్రకాశికాకర్త చూపలేదు. శబ్దరత్నాకరమున ప్రేటు శబ్దరూపాంతరము ‘వేటు’అని వ్రాయఁబడుటయు దానికి ‘అదురువేటు - కూఁతవేటు’అని లక్ష్యము లీయఁబడుటయుఁ బొసఁగియుండలేదు. పరిశీలింపఁగా వేయుధాతుజమే ‘వేటు’ శబ్దమని తోఁచెడిని.

ప్రయోగములు:—చ. కినుకకుఁ జాల కెంతయును గీడ్పడి నా పడుపాటులెల్ల......(విరా. ౨ ఆ. ౧౮౬). సీ. దాసత్వ మొంది యదల్పులఁ దిట్టుల నాటులఁ బడుచుండునట్టి నీచులు (అను. ౫ ఆ. ౧౦౭). ఉ. ఏటుల మ్రొగ్గువారిఁ గని యించుక కొంకక యర్మిపెంపునన్ । బోటుల వాతఁ బోవు భటపుంగవులన్ మది మెచ్చుచున్ వడిన్ । వ్రేటులఁ గ్రిందసల్పి పృథివింబడు వీరులఁ ద్రొక్కికొంచు నా । చోటులనైన నగ్గలికఁ జొత్తురు నెత్తురు వఱ్ఱుసేయుచున్. (విరా. ౩ ఆ. ౧౬౪). ఉ. ఎల్లధనంబు నోటువడి తిందు కులేశ్వర.........(సభా. ౨ ఆ. ౧౯౪ ప).

బాలవ్యాకరణ వివరణము. ౩౬౩ విషయము.

పవర్ణకంబు తిరియ్యాదుల కగు. ౯.
తిరియు - తిరిపము. కలియున కత్వంబు నగు. కలపము. పొలయు - పొలపము. మురియు - మురిపము. సొలయు - సొలపము. వలియు - వలిపము.

సంజీవని. ౩౬౩ విష:—తిరియు మున్నగుధాతువులకు భావాద్యర్థము లందు పవర్ణకంబగునని యర్థము. అట్లేర్పడిన తిరిపాదిశబ్దములెల్ల నపుంసకలింగ సమములె యగును. తిరియు+ప = తిరి+ప = తిరిపము. బా. కృ. ౨ సూత్రము చొప్పున ‘ప’వర్ణక పరత్వమున ధాతువుతుది ‘యు’వర్ణము లోపించెనని యెఱుంగునది. తిరిపాది కృదంతములకు బా. అచ్చి. ౨ సూత్రమునఁ గ్లీబసమత్వమునం జేసి బా. తత్స. ౩౯ సూత్రముచొప్పున ‘ము’వర్ణకము రాఁగా. ‘తిరిపము’ మున్నగు రూపములు సిద్ధించును. కలియుధాతువునందలి ‘లి’వర్ణముమీఁది ‘ఇ’కారమునకు ‘ప’వర్ణక పరకత్వమున ‘అ’కారాదేశమగు ననుచు సూరిగారే ‘కలియు నకత్వంబు నగు’ అని వివరించిరి. దీనినిబట్టి కలియుధాతువునకుఁ బర్యాయమగు “కలయు” ధాతువు సూరిగారికి స్మృతి గోచరము కాలేదా యని యాలోచింపవలసి యున్నది. “కలయు” ధాతువునకు ‘ప’వర్ణకమగునపుడు ‘అ’త్వవిధానమును విశేషవిధిగఁ జేర్ప నక్కఱలేదు. శబ్దరత్నాకరకర్త ‘కలపు’ అను ప్రేరణార్థక ధాతువునుండి

యిది యుత్పన్నమైనదని తలంచినట్లు తోఁచును. "కలపము - దే - వి - ౧ కలపుట" (శ. ర). "కలపము - వి (√కలపు త. కలప్పు) కలపుట. సీ. సచ్చందనముకంటెఁ జందనంబునఁ గలపంబుఁ జేసిన కప్పురంబుకంటె (పి శకుం ౪-౧౪౬) (కలపంబు చేయు = కలపు)........" (సూ. రా. ని). అని యిట్లు స్పష్టముగా 'కలపు' ధాతువునుండియె యేర్పడినట్లు సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెను. ఈపక్షమున "కలపు+ప+ము" అనుచో ధాతువుతుది 'పు'వర్ణము లోపించుటకు విధానము లేకపోవును. బా. కృ. ౨ సూత్రమున "క - గ - చ - య - వ" లకు మాత్రమె కదా లోపము విధింపఁబడెను. "కలయు ధాతువును దిరియాదిగణములో భావించి నందున 'కలపము' అను రూపంబు సులభంబైనను కలియు ధాతువువలనంగూడ నట్టి రూపంబు సిద్ధించుటకై యాత్వంబు విధింపఁబడియె." (బా. గు. ప్ర. ౭౩౮ పు). అని గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడెను. కాని యీ 'ప'వర్ణక మెల్ల ధాతువుల పయిని నిలువవలసిన ప్రసక్తి లేదుగదా.

తిరిపము = భిక్షము. (భావా). తిరిప = తిరిపుఁడు = భిక్షించువాఁడు (కర్త్రి. తిరియువాఁడు = తిరిపముచేయువాఁడు - తిరిపరి - తిరిపకాఁడు' పర్యాయరూపములు). "తిరిపము - దే - వి - భిక్షము.........విణ - భిక్షుకుఁడు. సీ. కడఁదిరిపంబవై కాంతయు నీవును దేశంబులందెల్లఁ దిరిగి తిరిగి (కవిక. ౫ ఆ. ౧౭). (వృత్తి యందు మువర్ణలోపము. ఎ-గీ. తిరిపజోగి దగునె దేవుఁడనఁగ. (వీర. ౧ ఆ. ౧౩౫)." (శ. ర). గుప్తార్థప్రకాశికా వ్యాఖ్యాతయు సూ. రా. ని. కారులును నీ శబ్దరత్నాకర విషయములనె స్వీకరించిరి. పరిశీలింపఁగా "తిరిపము" అను ము వర్ణకాంతరూపమునకు భిక్షుకుఁ డను నర్థము సరికాదని తోఁచుచున్నది. ఉదాహృతకవిప్రయోగము లచట "తిరిపము" అను రూపమును నిర్ణయింపఁజాలి యుండ లేదు. "కడఁ దిరిపంబవై కాంతయు నీవును" అను కవికర్ణరసాయన ప్రయోగమున "కడఁ దిరిపండవై కాంతయు నీవును"అని కవిప్రయుక్తపాఠమై యుండు ననఁదగును. సూ. రా. నిఘంటువున "తిరిపము=భిక్షుకుఁడు" అనుదానికి మఱొక శ్రీనాథుని చాటుపద్య ముదాహరింపఁబడెను. "క. సిరి గలుగు రాచకొమరుఁడు । తరుణులఁ బదివేల మందిఁ దగుఁ బెండ్లాడన్ । దిరిపమున కిద్ద ఱాండ్రా । పరమేశా గంగ విడుము పార్వతిచాలున్. (శ్రీనాథుని చాటువు. చాటుపద్యమణిమంజరి. ౧ భా)." (సూ. రా. ని. తిరిపము శబ్దమునొద్ద). ఇందు భిక్షమున కిద్దఱు భార్య లేలా యని యర్థము చేయనగును. లేదా 'తిరిపనికి నిద్ద ఱాండ్రా' అని కవిప్రయుక్తపాఠ మనఁదగును.
కలపము = యక్షకర్దమము = లేపనద్రవ్యవిశేషము=పరిమళద్రవ్యములను జేర్చి కల

తవర్ణకము 'ఇంచు'పైనె కాక 'కంచు'మన్నగుణ శబ్దముల పైనినిల్చును. [౩౬౭ వి.సం.]

పినచందనము. (అధికరణార్థక. పరిమళద్రవ్యములు దీనియందుఁ గలిగియుండు లేదా కలయును) (పరిమళద్రవ్యముతోఁ గలపఁబడినది యని యర్థము చేసినచోఁ గర్త్రర్థకము). సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి తేనెపువ్వు నలదుదు నను వు గాఁగ (విరా. ౧ ఆ. ౧౦౫). పొలపము = వ్యాపనము - (పొలయు = వ్యాపించు) (భావా). మురిపము=నడకయందలి కులుకు. (భావా). ('మురిపెము' అను పర్యాయ రూపమును గలదు). సొలపము = పారవశ్యము. (భావా). శబ్దరత్నాకరమున "సొలయు = మూర్ఛపోవు" "సొలపు = పారవశ్యము" అను శబ్దములు గలవుగాని 'సొలపము' అను శబ్దము లేదు. వలిపము = సన్నముగా నుండు వస్త్రము. (కర్త్ర. వలియునది. వలియు = సన్నగిల్లు). సీ. నునుఁదీగఁ జీరకి గొనసి నీ మైదీఁగె మురిపంబు డెందంబు మరులుకొల్పె (ఆను. ౧ ఆ. ౪ ౧). ఉ. భీతిలి యుండె సిగ్గు మురిపెంబును మోహము జేఱు చూపు (భాగ. ౧౧ స్కం). (శ. ర).

తవర్ణకం బావులించు లోనగువానికగు. ౧౦.

బాలవ్యాకరణ వివరణము. ౩౬౮ విషయము.

ఆవులించు - ఆవులింత. ఇగిలించు - ఇగిలింత. ఓకిలించు - ఓకిలింత. కుళ్ళగించు - కుళ్ళగింత. కుసిలించు - కుసిలింత. కొక్కరించు - కొక్కరింత. కొప్పరించు - కొప్పరింత. గిలిగించు - గిలిగింత. ఇత్యాదు లెఱుంగునది.

సంజీవని. ౩౬౮ విష:—ఆవులించు మున్నగుధాతువులకు భావార్థంబున 'త' ప్రత్యయంబగును. బా. క్రియా. ౬౩ సూత్రముచొప్పున 'ఆవుల' మున్నగు వానిపయిని స్వార్థమున "ఇంచు"గాగమము నిలుపఁగా "ఆవులించు" మున్నగు నాచ్ఛికధాతువు లేర్పడును. ప్రకృతసూత్రముచే భావార్థమున వానిపై "త" ప్రత్యయము నిలువఁగా "ఆవులింత" మున్నగు కృదంతరూపము లేర్పడును. 'ఆవులించు+త' అనుచోట బా. కృ. ౨ సూత్రముచొప్పున "త"వర్ణక పరకత్వమున ధాతువుతుదినున్న "చు"వర్ణము లోపించును. ఉదా:—ఆవులించు+త = ఆవులిం+త = ఆవులింత. జృంభమున "ఆవు" అనుశబ్దము వినఁబడును. కాన "ఆవులించు" అనునది యనుకరణధాతు వనఁదగును. ఈ త ప్రత్యయము భావార్థమందుఁ గతిపయధాతువులకుఁ బరముగా మాత్రము నిలుచును. దీనికి ముందున్నైతము బిందువు గన్పట్టుచున్నది. (ఆవులింత. అప్పగింత. ఒప్పగింత. మొ). కాని యట్టి బిందువు ధాత్వవయవము లోనిది. సాధారణముగా నిది 'ఇంచు' గంతధాతువుల మీదనే నిలుచును. "ఈఁదు - ఈఁత. కలఁచు - కలఁత. వడఁచు-వడఁత" అనురీతి

గల యించు గంతములుగాని యలంతిధాతువులయం దీ ప్రత్యయము నిల్చుటగలదు. ధాతువుకడనుండు 'చు'వర్ణాదికము లోపించినను నీ 'త' ప్రత్యయము పరమగు నపుడును బా. సంజ్ఞా. ౧౬ సూత్రముచేఁ పూర్ణ బిందువు నిలుచుటకు యోగ్యత గలదుగానఁ బూర్వస్థిత ధాత్వవయవ పూర్ణబిందువు లోపింపనేరదు. ఉదా:— ఆవులించు+త = ఆవులిం+త = ఆవులింత. ఇట్టి తక్కినవాని రూపముల ప్రక్రియను నిట్లే యూహించుకొనునది. ఆవులింత = జృంభము. (ఆవలింత, పర్యాయపదము) (భావా). ఆ వె. ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవ । నంబు గుప్త స్తనములు గాఁగ (విరా. ౧ ఆ. ౧౩౭). ఇగిలింత = పండ్లు కనఁబడునట్లు నోటి నించుక తెఱచుట. (భావా). ఓకిలింత = పిత్తవ్యాధి మొదలగువానివలన 'ఓక్' అనెడి ధ్వనితోఁ గడుపులోనిది నోటికి వచ్చుట (భావా). ('ఓకరింత' అనియుఁ గలదు). పుళ్ళగింత = ఫలాదు లెక్కువకాలము నిలవుంచి చెడఁగొట్టుట. (భావా). ఈశబ్దము కోశద్వయమునందును జేరలేదు. "ప్రుళ్ళగింత" అనునది దీని పర్యాయము. పుసిలింత= అతృప్తిచే ఖేదపడుట. (భావా). కొక్కరింత = కొక్కరించుట - పరిహాసము చేయుట - బెదరించుట - కోఁతులు వెక్కిరించుట. (భావా). "ద్వి. కొనచెవుల్ తెక్కించి కొక్కరించుచును. (రంగనాథ రా. సుంద. ౨౭౮ పాటకం. ౫ పం. సూ. రా. ని) (వానరవర్ణనము). "ద్వి. మోకాళ్ళ దొడలును ముడివఱ్ఱుకొనుచుఁ । గూఁకటి గిలుపుచుఁ గొక్కరించుచును (పండితా. పర్వ. ౩౭౧ పా) (నట వర్ణనము). కొప్పరింత - విజృంభణము - అతిశయము (భావా). కొప్పరించు......న....... కొప్పరించి యొ......నవలించియుం గదలించియు (ఉ. హరి. ౪ ఆ. ౨౫౬). (సూ. రా. ని). గిలిగింత = చక్కిలిగింత = (భావా) అన్యకర స్పర్శముచేతఁ గలిగెడు చంక మొదలైన యంగముల సంకోచము (చక్కిలి=చంకిలి = చంక.) "చక్కిలిగింత = ద్వ - వి - (చక్కిలి+గిలిగింత)" (శ. ర). గీ.........ఓ సరసిజాక్షి । యేను జెక్కిలి గిలిగింత లిడుటఁ దలఁతె (నైష. ౮ ఆ. ౮౬). (గిలిగిలింత. పర్యాయపదము). ఇదియు నాకృతిగణము. ఈఁదు - ఈఁత = ఈఁదుట (భావా). సీ. శచికీఁత గఱపుచుఁ జదలేటి సురరాజు (మను. ౨ ఆ ౧౧). కలఁగు - కలఁత = క్షోభము. (భావా). ముడుఁగు - ముడుఁత = వస్త్రపు ముడుఁత. (కర్త్రు. బాగుగా ముడంగు (వంగు) నది). ఇయ్యది శబ్దరత్నాకరమున నిర్బిందుకముగఁ జూపఁబడుట చింత్యము. "ముడుఁగు = వంగు. ముడుఁగు = వంగు - పరిశుద్ధి" అనునవి శబ్దరత్నాకరమందు నబిందుకములుగానే చూపఁబడినవి.

ఘువర్ణకంబు మూయ్యాదుల కగు. ౧౧.

మూఁగు - మూపు. మేయు - మేపు. అడుచు -

బాలవ్యాకరణ వివరణము. 3 ౬౫ విషయము

అడుపు ఇంచు - ఇంపు. ఏఁచు - ఏఁపు. ఏచు - ఏపు. కను - కానుపు. కాచు - కాపు. చూచు - చూపు. తలఁచు - తలఁపు. తోఁచు - తోఁపు. త్రేఁచు-త్రేఁపు. త్రోచు - త్రోపు. పూఁచు - పూఁపు. పెనుచు - పెనుపు. పోలుచు - పోలుపు. ప్రోచు - ప్రోపు. మెచ్చు - మెప్పు. మోచు - మోపు. వలచు - వలపు. వాచు - వాపు. ఇత్యాదులు మాయ్యాదులు.

సంజీవని. 3 ౬౫ విష:—'మాయు' మున్నగుధాతువులకు భావాద్యర్థంబుల 'పు' ప్రత్యయం బగును. 'మాయు+పు' అని యుండఁగా, బా. కృ. ౨ సూత్రము చొప్పున 'యు'వర్ణము లోపించుటచేత "మాపు" అను రూప మేర్పడును, ఇట్లె 'అడుచు' మున్నగు ధాతువులకు 'పు' ప్రత్యయము పరము కాఁగా. "అడుచు+పు" మున్నగు రూప మేర్పడును. బా. కృ. ౨ సూత్రముచొప్పున 'చు'వర్ణము లోపింపఁగా "అడుపు" మున్నగు రూపములు సిద్ధించును. సూరి యుదాహరించినవానిలో 'కను'ధాతువు తప్పఁ దక్కినవెల్ల 'యు - చు' అనువానిలో నొకటి తుదిని గలవే కాన వాని యు చులకు "పు"వర్ణక పరకత్వమునఁ బైరీతిని లోపంబు గల్గుటచేఁ గృదంతరూపము లేర్పడును. బా. కృ. 3 సూత్రము వివరణమున వ్రాయఁబడిన రీతిని 'పు'వర్ణక పరకత్వమున 'కను'ధాతువు కవర్ణమునకు దీర్ఘము కలుగఁగా "కానుపు"అను రూప మేర్పడును. "ఇంచు - ఏఁచు. తలఁచు - తోఁచు. త్రేఁచు- పూఁచు"అను వానిలోని తుది 'చు'వర్ణము పువర్ణక పరకత్వమున లోపించినను బా. సంజ్ఞా. ౧౬ సూత్రముచొప్పున నీ పువర్ణకమునకుఁ బూర్వమున నైతము బిందువు నిలువనగును గాన వానిబిందువు నిర్బాధముగా నిల్చును. ఉదా:— ఇంపు - ఏఁపు. తలఁపు - తోఁపు. త్రేఁపు - పూఁపు. ఇత్యాదు లనుటచేత మాయ్యాదికమును నాకృతిగణమె. మెచ్చుధాతువునకు 'పు'వర్ణకపరకత్వమునఁ దుదినున్న చకారద్వయము లోపించుటచేత నచటి 'పు'వర్ణకమునకు ద్విత్వము సంభవించెనని యెఱుంగునది.

మాపు = మాయుట = మఱికి = మైల (భావా). మాపు = రాత్రి. (అధికర - దీనియందు మాలిన్య మనఁగాఁ జీఁకటి క్రమ్మును. లేదా దీనియందుఁ జాక్షుష ప్రపంచము మానిపోవు ననఁగా నగపడదు. "విశ్వం చాక్షుష మస్త మస్తి హి తమః కైవల్యమ్" (అనర్ఘరాఘవము). "రాత్రి దైవతప్రపంచము సుషుప్తివశంబున నీకాలమందు నశించును. అనఁగా నైనందిన ప్రళయము దీని యందు జరుగును."

(బా. గు. ప్ర. ౪౪౦ పు). "మనసో మీలనం నిద్రా" అనుచొప్పున నిద్రావశంబున ఘటపటాదులకుఁ బ్రళయము బొత్తిగా న సంభవము గాన రాత్రియందు ద్వైతప్రపంచము నశించు ననుట సరికాదు. మేపు = మేఁత (భావా). మేపు = పశ్వాద్యాహారము (కర్మా - మేయఁబడునది). అడుపు = దెబ్బ. (అణుపు రూపాంతరము) (భావా). ఇంపు - ఇష్టము - రుచించుట. (భావా). ఏఁపు = పీడ. (భావా). ఏపు - విజృంభణము - అభివృద్ధి. (భావా). కానుపు=౧. ప్రసవము, ౨. వీక్షణము. (భావా). కాపు = ౧. కాయలు కాచుట, ౨. రక్షించుట. (భావా). కాపు=రక్షించువాఁడు. (కర్త్ర - కాచువాఁడు). చూపు = వీక్షణము. (భావా). తలఁపు = తలఁచుట. (భావా). తలఁపు = ఇచ్ఛ. (కర్మార్థ. తలంపఁబడునది). తోఁపు = తలఁపు. సీ. తోఁచు తోఁపులనెల్లఁ దోస్తోడ దుల్చి నిరాలంబనుండైన యతఁ డొకండు (ఆశ్వ. ౧ ఆ. ౨౦౨). త్రేఁపు = ఉద్గారము = త్రేనుపు. (భావా). త్రోపు = త్రోయుట. (భావా). పూపు = బండి కెక్కను పూన్చిన పూఁపు. పూనిక. (భావా). పెనుపు = పెంచుట. (భావా. పెరుఁగు - ప్రేరణ - పెనుచు). పొలుపు = ఒప్పు - పొలుచుట (భావా). ప్రోపు = ప్రోచుట - పోషణము (భావా). మెప్పు=మెచ్చుట= శ్లాఘ (భావా). మోపు = గడ్డిలోనగువాని పెద్దకట్ట. (కర్మార్థ. మోయఁబడునది). వలపు = వాసన - కోరిక. (కర్మార్థ. వలవఁబడునది). వాపు = ఉబ్బు - ఉబ్బరించుట. (భావా). బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయముద్రణములందుసైత మిది నిర్బిందుకము గానే చూఁపబడినది. ఇట్టి నిర్బిందుకరూపముగాని దీనికి మూలమగు 'వాచు' ధాతువుగాని శబ్దరత్నాకరమున నుదాహరింపఁబడలేదు. 'మోము వాచినది.' అను రీతి నిది ధారాళముగ వ్యవహరింపఁబడుచున్నది. "వాఁచు. వై. అ-క్రి. ఏఁకరు. ఉ.........ఏము సైతముఁ । వాఁచినవారి యట్ల గరువంబునఁ గన్గొనుచుంటి మవ్విభున్ (వి. పు. ౬ ఆ.) ౨ ఊఁదు." (శ. ర.) అనునదిమాత్ర ముదాహరింపఁబడియున్నది.

"రక్షింపు = రక్షణము" మున్నగురీతిని భావార్థకములుఁ దత్సమాదిరూపములు సైతము పువర్ణకాంతములు (ఇంప్వంతములు) గలవని కేచిన్మతముగా నథర్వణుఁడు వచించెను. "క్వచి దింప్వ న్తతాం కేచి । దూచిరే నహి మే రుచిః" (౩౦౯-౩౦౯ I విష. చూడుఁడు). ఉదా:—రక్షింపు. బోధింపు. పోషింపు. ఆరగింపు మేళగింపు. మొ.

ప్రయోగములు:—క.........మిమ్ము ధృతరాష్ట్రుఁడు పెం । పునఁ బూడించెం గావునఁ । జనదింకను.........(సభా. ౨ ఆ. ౨౭౭). క. ఇమ్ముల ధర్మజుతో

జూదమ్మాడఁగఁ గాన్పు నాకు ధరణీశ్వర య। జ్ఞమ్ము.........(సభా. ౨ ఆ. ౧౩౮) సీ......... ఆ. వె..........। బ్రాహ్మణులకుఁ బ్రియము పాయక చేయుంగఁ। గాన్పు నూావె పుణ్యకర్మఫలము (ఆది. ౬ ఆ. ౨౮౬) క. అనఘ యనులోమ మునఁ దోఁ। పును బ్రతిలోమమున లయము పొందుటయును............... (అను. ౪ ఆ. ౧౮౪). సీ. తోఁచు తోఁపులనెల్లఁ దోడ్తో నడంచి........... (అశ్వ. ౧ ఆ. ౨౦౨). చ..........నీ। విలుపును బార్థు చాలుటయు లేదు గదా..........(ద్రో. ౧ ఆ. ౩౫౫). క. తిరముగ వేల్పులచే దు। ష్కృగతమ మున..........(అర. ౧ ఆ. ౩౮౬). (వేలుచు హోమము చేయు. వేల్వఁబడుమరు గాన వేల్పులు). సీ.........శకటంబు త్రోపును జరణనిహతి (సభా. ౨ ఆ ౪౧).

ఇక వర్ణకం బంజ్యాదుల కగు. ౧౨

బాలవ్యాకరణ వివరణము ౩౬౬ విషయము

అంజు - అంజిక. అమరు - అమరిక. అరయు - అరయిక. అలయు - అలయిక. ఆడు - ఆడిక. ఓడు - ఓడిక. ఓపు - ఓపిక. కను - కానిక. కూడు - కూడిక. కోరు - కోరిక. పొందు - పొందిక. పోలు - పోలిక. తూను తూఁగునకగు - తూనిక. ఇత్యాదు లం జ్యాదులు.

సంజీవని. ౩౬౬ విష:—అంజు ప్రభృతిధాతులకు భావాద్యర్థములందు 'ఇక' ప్రత్యయ మగును. అపదాది స్వరనిత్యసంధి కలుఁగగా 'అంజు+ఇక = అంజిక' మున్నగురూపము లేర్పడును. బా. కృ. ౩ సూత్రపు వివరణముచొప్పున 'ఇక' ప్రత్యయ పరకత్వమున 'కను' ధాతువునకు 'కాను' ఆదేశము కాఁగా "కను+ఇక= కాను+ఇక=కానిక"అను రూప మేర్పడును. ఇట్లె ప్రకృతసూత్రములోని వివరణము చొప్పున "ఇక" ప్రత్యయపరకత్వమున "తూఁగు" ధాతువునకు "తూను"అను నాదేశము రాఁగా "తూఁగు+ఇక=తూను+ఇక = తూనిక"అను రూప మేర్పడును. అంజిక = భయము. (భావా). అమరిక = ఒప్పిదము. (భావా). అరయిక = అరయుట. (భావా). అలయిక = అలయుట = శ్రమము. (భావా). ఆడిక - నింద. (భావా). ఓడిక = ప్రవాహము. (కర్త్రు - ప్రవహించునది). ఓపిక = శక్తి = ఓర్పుట. (భావా). కానిక = కానుక = ఉపాయనము. (కర్మా. దాతలచే గౌరవముగాఁ జూడఁ బడునది. లేదా - గౌరవము పొందఁబడునది). కూడిక = కూడుట. (భావా). కోరిక = వాంఛితము. (కర్మా - కోరఁబడునది). పొందిక = చేరిక. (భావా). పోలిక = పోలుట. (భావా). తూనిక = తూఁచుట. (భావా - వే?). (లేదా అధి

కర. దీనియందు సరిగా తూఁగును) ఇత్యాదు లనుట నీ యంజ్యాదిక మాకృతి గణము.

అప్పాదులకు నజీ యగు. ౧౩.

బాలవ్యాకరణ వివరణము. ౩౬౭ విషయము — అప్ప - అప్పన. ఉజ్జ - ఉజ్జన. ఒప్ప - ఒప్పన. గట్ట- గట్టన. గడ - గడన. దట్ట - దట్టన. దీవ - దీవన. పాట = పాటన. మన్న = మన్నన. వీచు = వీవన.

సంజీవని. ౩౬౭ విష:—అప్ప - మున్నగు ధాతువులపయిని భావాద్యర్థము లందు 'నజీ'అను ప్రత్యయము నిల్చును. 'జీ' అనునది యిద్వర్ణము. కావున 'నజీ' పరమగునపుడు బా. క్రియా. ౨౦ సూత్రముచొప్పునఁ బూర్వస్థితమగు ధాతువు తుదిని 'ఉ'కార మున్నచో నది 'అ'కారమగును. మఱియు బా. క్రి. ౮౬ సూత్రము చొప్పున 'నజీ' ప్రత్యయము 'ముత్'సంజ్ఞగలది గావున నయ్యది పరమగుచుండగాఁ బా. క్రి. ౮౮ సూత్రముచొప్పున 'వీచు' మున్నగుధాతువుల తుదినున్న సిద్ధ 'చ'కారము వకారమగును. ఉదా:—వీచు+నజీ = వీవు+నజీ = వీవ+న = వీవన = విసనకఱ్ఱ = వ్యజనము. 'అప్ప' మున్నగుధాతువుల తుది నుకారముగాని చకారముగాని లేమింజేసి వానియందుఁ బైకార్యములకుఁ బ్రసక్తిలేదు. 'అప్ప' మున్నగు ధాతువులు బా. క్రియా. ౬౩ సూత్రమునఁ జెప్పఁబడిన 'అంగ'లాదులలోని వగుటంజేసి వానికి స్వార్థమున 'ఇంచు' గాగమనును బా. క్రి. ౭౯ సూ. చొప్పున 'గు'గాగమమును వచ్చును. కాన సూరి సూత్ర రచనమునుబట్టియు నుదాహృతులనుబట్టియు నట్టి 'ఇంచు' గాగమ పాక్షిక గుగాగమములు నజీ ప్రత్యయపరకత్వమున రావని కాని వచ్చి లోపించునని కాని వ్యాఖ్య చేసికొనవలయును. 'అప్ప' మున్నగునవియు ధాతువులె యగుటచేత వానిపైని 'నజీ' విధానము నిర్బాధము.

'అప్పన - ఒప్పన - ఉజ్జన - గట్టన - గడన - మన్నన'అను శబ్దములు "అర్పణా"ది ల్యుడంత సంస్కృత శబ్దభవములగుటచేత వీనిలోని 'న' అనునది యాచ్ఛికకృత్ప్రత్యయమనుట సరికాదని తోఁచుచున్నది. దట్టన - దీవన - పాటన- వీవనాది శబ్దసామ్యమున సూరిభ్రమించి యట్టిప్రకృతి ప్రత్యయవిభాగముచేసె ననఁదగును.

అప్పన:—"అప్పనము = అప్పన. వి. (సం. అర్పణం. అర్పణా. క. అప్పన.) ౧. అప్పగింత, ౨. ఒప్పనము........." (సూ. రా. ని). ఇట్టి సూ. రా. నిఘంటూదాహృతినిబట్టి యది సంస్కృతభవమనుట స్పష్టము. "అప్ప+నజీ = అప్పన = అర్పణము. (భావా)"అని సూరి యాశయము. ఉజ్జన:—"ఉజ్జనము. వి. (సం.

ఉజ్ఝనమ్). త్యజించుట. విడుచుట" (సూ. రా. ని). అను కోశముచొప్పున "ఉజ్జనము" శబ్దము సంస్కృతభవ మనఁదగును. శబ్దరత్నాకరమందును, సూ. రా. నిఘంటువునందును "ఉజ్జన"అనెడి 'ము'వర్ణక విరహితరూపము చూపఁబడలేదు. "ఉజ్జన - ఉజ్జనము = విడుపు = ఉజ్ఝనమ్" (వై-దీ) అని వైకృత దీపికలో 'ఉజ్జన' అనునది సైతము 'ఉజ్ఝన' శబ్దభవముగాఁ జూపఁబడినది. "ఉజ్జ+నజ్ = ఉజ్జన = విడుచుట (భావా)" అని సూరి యాశయము. ఒప్పన:— "ఒప్పన = ఒప్పనము." (సూ. రా. ని). "ఒప్పనము = అప్పనము. వి. అర్పణము" (సూ. రా. ని). ఇట్లు సూ. రా. నిఘంటువున వ్రాయఁబడెనె కాని 'ఒప్పన' శబ్దము "అర్పణ" శబ్దభవమని వ్రాయఁబడలేదు. శబ్దరత్నాకరమున 'ఒప్పనము' అనునది మాత్రమె చూపఁబడెనుగాని 'ఒప్పన'అను స్త్రీసమరూపము చూపఁబడలేదు. కాని "ఒప్పన = ఒప్పనము = ఒప్పగించుట = అర్పణమ్" (వై-దీ)అని వైకృతదీపికయందు 'ఒప్పన'అనునది యర్పణ శబ్దభవమనియు స్త్రీసమరూపము సైతముగలదనియు వ్రాయఁబడెను. "ఒప్ప+నజ్ = ఒప్పన = అర్పణము. (భావా)"అని సూరి యాశయము. గట్టన:—"గట్టన-వి. (సం. ఘట్టనా) గట్టించుట." (సూ. రా. ని) "గట్టన. వై. వి. గట్టించుట. (గులకపోసి గట్టనచేసినాఁడు)" (శ. ర). రెండు కోశములందును "గట్టనము"అను నపుంసకలింగ సమరూపము చూపఁబడలేదు. "గట్ట+నజ్ = గట్టన = గట్టించుట. (భావా)"అని సూరి యాశయము). గడన:—"గడన[1] = వి. (√ గడించు[1]. సం. ఘటనా). సంపాదనము. ఆర్జనము" (సూ. రా. ని)."గడన[2]. వి. (√ గడించు. సం. గణనా) ౧. ఎన్నిక - లెక్క" (సూ. రా. ని). 'గడనము'అను రూపము కోశద్వయమునందును లేదు. "గడ+నజ్ = గడన = ఆర్జనము. ఎన్నిక" (భావా)అని సూరి యాశయము. మన్నన:—"మన్నన. వై. వి. ౧ సమ్మానము" (శ. ర). "మన్నన = సన్మానము = మానవమ్" (వై. దీ). 'మన్ననము'అని యే కోశమందును లేదు. "మన్న+నజ్ = మన్నన = సమ్మానము. (భావా)"అని సూరి యాశయము. ఇంతవఱకుఁ జూపఁబడిన 'అప్పన' మున్నగు శబ్దములెల్ల సూరి పడిన ప్రామాదికాశయముచొప్పున నాచ్ఛిక కృదంతములుగఁ జూపఁబడినను నివి సంస్కృత శబ్దభవములనుటయె యుక్తము. ఇంక నిర్బాధములగు నజ్ ప్రత్యయాంతములు చూపఁబడుచున్నవి. దట్టన:—"దట్టన. వి. (√ దట్టించు) అదలుపు - అదలించుట." (సూ. రా. ని). దట్ట+నజ్ = దట్టన. (భావా). దీవన:— "దీవన = దీవెన. వి. (√ దీవించు) ఆశీర్వాదము" (సూ. రా. ని). దీవ+నజ్ = దీవన. (భావా). పాటన:—పాట+నజ్ = పాటన = ఆదరణము (భావా).

వీవన:—వీచు+నజి = వీవు+నజి = వీవ+న = వీవన = తాళవృంతము = విసనకఱ్ఱ. (క ర్తృ. గాలిని వీచునది).

ప్రయోగములు:—క. విని యతనిం దనపై నిడు । కొని యేఁగి నియమికిఁ దగని ఘోరా త్రి యొన । ర్చినవాఁడ విూకు దండ్యుఁడ । నని తనుఁ దెలుపుచును వారి కప్పనసేసెన్. (రాఘు. ౧ ఆ. ౫౮., ఆ. వె. మనుజ భర్తుఁ డిడియ తనకు నప్పన ముగా । నొరులవలని బాధ నొరయకుండ । దీనిఁ గాచుచుండు............ (ఆది. ౬ ఆ. ౫౬౯). ఈపద్యమున "అప్పన" మనఁగా "పన్ను = కరము". కాఁబట్టి కర్మార్థక మనఁదగును. రాజున కర్పింప బడున దని వ్యుత్పత్త్యర్థ మెన్నవలయును. సీ. సంధ్యాభివందనశ్రద్ధ యుజ్జనసేయు గీతవాద్య వినోదకేళిఁదగులు (కాశీ. ౪ ఆ. ౮౧). (సూ. రా. ని). సీ. ఒఱ కత్తి పెఱికి నీ కొప్పన మిదె యంచు సత్తికిఁ గత్తి చెయ్యెత్తి మ్రొక్కి. (కళా. 3 ఆ. ౧౧౯ శ. ౪). క. అనుజులు దానును ముని శా । సనమున నన్వేది యొక్క సమధిక వీక్ష్యం । బున నొప్ప బ్రాహ్మణుల దీ । వన లెసఁగఁగ ధర్మసుతుఁడు వాసవలీలన్. (ఆ౯. 3 ఆ. ౧౨3). సీ. ధ్వజము వాహనము దీవనయు నాదిగఁ బెక్కురూపులై గరుడుఁ డారూఢిఁ గొల్వ (కళా. ౮ ఆ.) (శ. ర).

బడి యేల్వాదుల కగు. ౧౮.

బాలవ్యాకరణ వివృతి ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - 3౬౮ విషయము. చెల్లుబడి - చేరుబడి - తగులుబడి - తీఱుబడి - పెట్టుబడి - పోబడి - మ్రొక్కుబడి - వచ్చుబడి - సాఁగుబడి.

సంజీవని. 3౬౮ విష:—ఏలు ప్రభృతిధాతువులకు భావాద్యర్థములందు 'బడి' ప్రత్యయం బగును. పోవుధాతు వు వర్ణము బడిప్రత్యయపరకత్వమున నిత్యముగా లోపించును. ఉదా:—పోవు + బడి = పోబడి. సూరి తెలుపకున్నను ఏల్వాదులు సైత మాకృతిగణమె. ఇంతయేల ? కృత్ప్రకరణమునందలి గణములెల్ల నాకృతిగణములె యనఁదగును. కావున "రాబడి - దే - వి - వచ్చుబడి. ఆయము" (శ. ర). మొదలగు చోటులందును 'బడి' ప్రత్యయ మగునని యెఱుంగునది.

ఏలుబడి = ఏలుట. (ఏలు = పరిపాలించు) (ఏల్బడి. రూ). (భావా). కట్టుబడి:—"కట్టుబడి. వి. (√ కట్టు). సేవచేయుటకయి భృత్యులు మున్నగు వారికి శాశ్వతముగా నిచ్చు మాన్యము......... భూమిమీఁదఁ జెల్లింపఁదగిన యొకవిధమైన పన్ను. (శ్రోత్రియము). ఇది వాడుకలోని యర్థము." (సూ. రా. ని). కట్టు+బడి = కట్టుబడి. (కట్టు = ఇచ్చు - చెల్లించు). (కర్మా. కట్టఁబడున దనఁగాఁ

జెల్లింపఁబడునది). "కనుబడి. దే-వి. ఉత్పత్తి" (శ. ర). కనుబడి. (భావా). (కను = పొందు) "కనుబడి. వి. (√ కను). ౧ రాబడి. సీ. ఒకచాయఁ గరణాకుల్ సకల దేశంబుల కనుబడి కవిలెలు వినికి సేయ (భోజసుతా. ౧ ఆ. ౧౦౪)."(సూ. రా. ని). (కర్తా. రాజులచేఁ గనఁబడున దనఁగాఁ బొందఁబడునది). కొనుబడి = కొనుట. (కొను=వెలకుఁదీయు). (భావా) "గిట్టుబడి. వి. (గిట్టు[2]+బడి). అమ్మకమునందలి లాభము. (శ. ర)" (సూ. రా. ని). సూ. రా. నిఘంటువున శబ్దరత్నాకరము నందలి దనుచు నిట్టియర్థము వ్రాయఁబడెనుగాని యిది ధాత్వర్థమునకు సరిపడలేదు. "గిట్టు[2]. అ. క్రి. చాలు. ఉదా:—కూలి గిట్టినచో ఈపనిచేయుదము. గిట్టనిచో మానుకొనుము. ౨ అనుకూలమగు - ఇష్టమగు - సరిపడు. ఉదా:—ఆనీళ్ళు నాకుఁ గిట్టలేదు........." (సూ. రా. ని). కావున 'ఆనుకూల్యము'అని యర్థము చేయనగును. (భావార్థకము). చెల్లుబడి = అధికారముచెల్లుట - అధికారము సాగుట. (చెల్లు = అధికారముసాగు - మాటచెల్లు). మాటచెల్లుబడియగుట. (భావా) చేరుబడి = చేరువు = సమీపము. (చేరు = సమీపించు. ధాత్వర్థము). (కర్త్రర్థకము. సమీపించున దని వ్యుత్పత్త్యర్థము.) "తగులుబడి=వి. (√ తగులు) వ్యయము - వెచ్చము. (శ. ర. బ్రౌ). తగులుపాటు" (సూ. రా. ని). (భావా). తీఱుబడి = తీఱుపాటు - అవకాశము. (తీఱు. అ. క్రి. అవకాశము గలుగు - వీలుపడు.) (భావా). పెట్టుబడి:—"పెట్టుబడి = దేనికేని వెచ్చమునకై మొదటఁ బెట్టిన ధనము" (శ. ర). (పెట్టు = ఇచ్చు). పెట్టు+బడి = పెట్టుబడి. (కర్త్రార్థకము. ఏదేని వ్యాపారమున ముందుగాఁ బెట్టఁబడునది). పోబడి = పోవుట (భావా). పోవుధాతువు వు లోపము. మ్రొక్కుబడి = మ్రొక్కుకొనుట = దేవతా ప్రార్థన. (అధికరణార్థకము. దీనియందు ధనాదికముతో మ్రొక్కుదురు). "వచ్చుబడి. దే. వి. ధనాగమము = ఆయతి" (శ. ర). (కర్త్ర. ఇతరులనుండి వచ్చునది. రాబడి. రూ.) "సాగుబడి దే. వి. పైరుపెట్టుట. కృషి........." (శ. ర). సాగు. బడి = సాగుబడి. (సాగు. దే. అ. క్రి.........యత్నించు శ. ర). (అధికర - దీని యందు యత్నింతురు). ఈప్రత్యయమునకు భారతప్రయోగము లభింపలేదు.

బాలవ్యాకరణ కృతి గడ చేర్వాదుల కగు. ౧౫

3ఓ వివయము. చేరుగడ - తిరుగడ - తీఱుగడ - తేఱుగడ - త్రేగడ-
మనుగడ - విడుగడ - వీడుగడ.

సంజీవని. 3ఓ విష:—చేరు ప్రభృతిధాతువులకు భావాద్యర్థంబులందు 'గడ' ప్రత్యయం బగు. తిరుగు. మున్నగుధాతువులకు 'గడ'ప్రత్యయ పరకత్వ

మున దుదినున్న 'గు' మున్నగువానికి బా. కృ. ౨ సూత్రముచే లోపము కల్గును.
ఉదా:—తిరుగు+గడ = తిరుగడ.

చేరు+గడ = చేరుగడ = సమీపము. (కర్త్రర్థ - సమీపించునది. చేరు = సమీపించు). చేరుగడ = శరణము = దిక్కు. (కర్మా. ఆర్తులచేఁ బొందఁబడునది. చేరు=పొందు). తిరుగడ:—"తిరుగడ. దే. వి. (తిరుగు+గడ) మఱపెట్టినగొట్టము." (శ. ర). (కర్త్రు - మఱచేతఁ దిరుగునది). తీఱుగడ:—"తీఱుగడ. దే. వి. ౧. ముగియుక........ ౨ తీఱిక" (శ. ర). (భావా. తీఱు = కొఱను - ముగియుట. అవకాశమగు) తేఱుగడ:—"తేఱుగడ. దే. వి. ౧. ముగియుక, ౨. తెలివిడి" (శ. ర). (భావా. తేఱు - ముగియు - తేటపడు). త్రేగడ:—ఈశబ్ద కోశద్వయమునందును జూపఁబడలేదు త్రేగడ - త్రేనుపు - ఉద్గారము. (భావా. త్రేఁచు = ఉద్గారించు.) (ఇందు 'చు'లోపము బిందులోపము నయ్యెను). మనుగడ:- "మనుగడ దే. వి. జీవనము. ౨ జీవనోపాయము" (శ. ర). (భావా. మనుట జీవించు-జీవించుట) (కరణా, దీనిచేత జీవింతురు). విడుగడ=వీడుగడ:—"విడుగడ. దే. వి. విడుపు - విడుదల........." (శ. ర). (వీడుగడ శబ్దరత్నాకరమునఁ జూపఁబడ లేదు) (భావార్థ).

ప్రయోగములు:—క. వారలకఁ దేల మాధవ । కౌరవులకు మఱి యుం నీ జగంబుల కెల్లం । జేరుగడ నీవ...(ఉద్యో. 3 ఆ. ౨౦౮) "తీఱుగడ...నేడు సంగ్రామమునకుఁ దీఱుగడ యగుఁగాకని. (భీష్మ. ౨ ఆ.)" (శ. ర) క. పనులరయుచు మేలు గాంచిన । మనుగడ యగ్గలముచేసి మన్నింపుదుము. (భార. ఆశ్ర. ౧ ఆ. శ. ర). జనకానుమతంబున నా బలారికిన్ । విడుగడ చేసె" (నిర్వ. ౭ ఆ. శ. ర).

బాలవ్యాకరణము+ ఇకి కోర్వాదులకగు. ౧౬.
' 320 విషయము కోరికి - వూనికి - పోలికి - మనికి - వినికి - చూపు
చూచున కగు - చూడికి.

సంజీవని. 320 విష:—కోరు మున్నగుధాతువులకు భావాద్యర్థంబులందు 'ఇకి' ప్రత్యయంబగును. ఇకి ప్రత్యయపరకత్వమున 'చూచు'ధాతువునకు 'చూడు' అను నాదేశమగునని సూరిగారే వివరించిరి. ఈకృదంతగణము లాకృతిగణములుగాన "ఉనికి - కానికి" మున్నగువానిని నెన్నునది. సీ. ఉత్సంగతలమున నుగ్రవిషోరగం బున్నట్లు నీవు మాయొద్ద నునికి (సభా. ౨ ఆ. ౧౮౮) చ.........మహాపురుషులకన్న కాన్కి యనపోహము (నన్ని. కు. ౬ ఆ. ౮౨౧) (కాన్కి=చూపు). కోరు+ఇకి = కోరికి = ఇచ్ఛ (భావా. కోరు = ఇచ్ఛించు). "కోరికి. దే. వి.

ఇచ్చు. చ.........ఇత్తెఱంగు గో। రి_కిఁ గతమేమి పాండవుల గెల్చి" (భార. ద్రో. ౧ ఆ. ౪ ర) పూనికి = పూనిక. పూను + ఇకి = పూనికి. (భావా). పోలిక:—పోలు+ఇకి = పోలికి = పోలిక = సాదృశ్యము. పోలు = సరిపోలు. (భావా) "క. వెను బొంపి లోపలసు బ్బం। గివధేనువు నెత్తు పోలికిని శల్యుండం ద। మ్మొనఁ దన భుజబలమునఁ గలఁ। గని యట్లుగ నిలిపె శౌర్యగర్వము మెఱయన్" (శల్య. ౧ ఆ. ౪. ర). మను+ఇకి = మనికి జీవించుట (భావా. మను - జీవించు). మనికి - వాసస్థానము. (అధికరణా - దీనియందు మనుదురని వ్యుత్పత్తి). విను+ ఇకి = వినికి - వినుట. (భావా) చూచు+ఇకి - చూడు+ఇకి - చూడికి = చూపు (భావా) "చూడికి - వై - వి. చూపు - వీక్షణము" (శ. ర). చూచుధాతువు "సూచ పైశున్యే" (శబ్దస్తోమ) అను సంస్కృత ధాతువునుండి యేర్పడెనని శబ్ద రత్నాకరాశయము. "చూచు - కను - సూక్" (వై-దీ). క...చూ। డ్కల తెఱఁ గెడ పొందు దెలిపెడుఁ గంటిరె.........(విరా. ౨ ఆ. ౨౦౦).

వు వర్ణకంబు మన్వాదుల కగు. ౧౭.

బాలవ్యాకరణ వివృతి 320 విషయము.

మను - మనువు. కాచు - కావు. కొలుచు-కొలువు.
చచ్చు - చావు. తడయు - తడవు. నిలుచు - నిలువు.
నొచ్చు - నోవు. పూచు - పూవు. ప్రచ్చు - ప్రవ్వు.

సంజీవని. 320 విష:—మను మొదలగుధాతువులకు భావాద్యర్థములందు 'వు' ప్రత్యయంబగును. కాచు - కొలుచు మున్నగుధాతువుల తుది 'చు'వర్ణము వుప్రత్యయ పరకత్వమున బా. కృ. ౨ సూత్రముచొప్పున లోపించును. ఉదా:— కాచు+వు = కావు. కొలుచు+వు = కొలువు. నిలుచు+వు = నిలువు. పూచు+వు= పూవు మొ. ఇట్లె "తడయు+వు = తడవు" అనుచో బా. కృ. ౨ సూత్రము చేతనే 'యు'వర్ణమును లోపించెను. "చచ్చు+వు = చావు. నొచ్చు+వు = నోవు" అను స్థలములందు 'చ్చు' అనెడి ద్విత్వఘటిత చువర్ణము లోపించుటచే: బూర్వా క్షర గౌరవమునకు భంగములేకుండఁ బూర్వాచ్చునకు దీర్ఘముకల్గెను. "ప్రచ్చు+వు= ప్రవ్వు"అనుచో ద్విత్వఘటిత 'చు'వర్ణము లోపించుటచే ద్విత్వఘటిత వుప్రత్య యము నిల్చెను. కృదంతగణము లాకృతిగణములు గాన 'పుట్టువు' మున్నగువాని నెన్నునది. క.........క్షత్త్రియకులంబునందిం కిటఁ బు। ట్టువు కాకుండెడు... (ఆర. ౧. ౨౮ర) (పుట్టు. ధా).

మను+వు = మనువు = జీవనము, మగనివరించుట. (భావా. మను (ధా) = జీవించు). ఎ-గీ.........దుఃఖ। మునకొ సుఖమునకొ నరులమనువు చెపుడు

(మార్కం. ౫ ఆ. ౬. ౪). కాచు+వు = కావు. "కావు.² వి, ౧............(ట)........పిల్లలకు రక్షార్థము పెట్టు తిలకము." (సూ. రా. ని). (కర్త్రర్థకము. దృష్టి దోషాదికమునుండి కాచునది. కాచు = (ధా) రక్షించు.) కొలుచు+వు = కొలువు = సేవ - కొలుచుట. (భావా). చచ్చు+వు = చావు = మరణము (భావా). తడయు+వు = తడవు = జాగు (భావా). తడయు = ఆలస్యముచేయు "క.........। త్రావ ననన్ రాదె యింకఁ దడవేమిటికిన్. (భార. ఉద్యో. ౪ ఆ. ౧౯౫). నిలుచు+వు = నిలువు = నిలుచుట. (భావా) సీ.లావివేకమున నానం డింపఁ గనిన యంగన యొట్లు నిలువునఁ గ్రాఁగకుండు. (విరా. ౨ఆ. ౩౩౫) నొచ్చు+వు =నోవు = నొవ్వు=నొప్పి = వేదన = బాధ. క. కౌరవపాండవులం దె। వ్వారలకుం జావు నోవు వచ్చిన.........(ఉద్యో. ౩ ఆ. ౬. ౪). క. చావును నోవును మన రో। ధావళికిఁ గెలుపు నుబ్బు.........(భీష్మ. ౨ ఆ. ౧౯౯). పూచు+వు = పూవు - పువ్వు = పుష్పము. (కర్త్రా. వృక్షాదులచేఁ బూయఁబడును.) పురిచ్చు+వు= ప్రువ్వు = పురుగు = కీటకము. (కరణార్థకము. దీనిచేతఁ బ్రుచ్చును = దీనిచేఁ బుప్పి పట్టును). ఇట్లె తొడవు. మొ. ఆ.వె. తొడర వలయునట్టి తొడరువు గావించి। కొనిరి.........(శల్య. ౧ ఆ. ౩౮౯) తొడరు (ధా) = యత్నించు.

అవర్ణకంబు గీత్వాదులకగు. ౧౮.

బాలవ్యాకరణ వివృతి గీఱ - ఊఁగ - ఎండ - కాయు - చదియ - తునియ-
౩౭౨ విషయము. పరియ - పాయు - పిసుచ - మీాట - ముడియు -
వసర - వ్రయ్య.

సంజీవని. ౩౭౨ విష:—బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయముద్రణములందు సయితము గీత్వాదులకనియె పాఠము వెలయుచున్నది. శకట మన్య హల్లుతో సంయుక్తమగునపుడు లఘురేఫము కావలయును. (చూ. ౫౮ III విష) (వై-పా. ౪౨౧-౪౨౨ విష), కాని 'గీఱు'అను నాచ్ఛికశబ్దమును సంస్కృతముగా ననుక రించునపుడు యణాదేశరూప సంస్కృతసంధిలో హలంతర సంయుక్తమయ్యెను గాన శకటము నిల్చుటయె యుక్తమని సూరి తలంచియుండును. ఇట్లె యుత్తర సూత్రమునందును "మాత్ర్వాదులనియు, ఆత్ర్వాదులనియు" సూరి ప్రయో గించెను.

గీఱు ప్రభృతిధాతువులకు భావాద్యర్థములందు 'అ' ప్రత్యయమగును. గీఱు+అ = గీఱ = గీఁత = రేఖ. (భావా. గీఱు = గోళ్ళ మున్నగు వానితో గీయు.) ఊఁదు+అ = ఊఁద = ఉబ్బుట. (భావా. ఊఁదు (ధా) = ఉబ్బు.

పైకుబుకు). ఎండు+అ = ఎండ = ఆతపము. (కర్త్ర - ఎండించునది. ఎండు = నిర్జీవమగు. అంతర్భావిత ప్రేరణార్థము - ఎండించు). ఆ-వె. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుం । గని పురంధ్రులెల్ల......అక్రూరు వ్యగ్రుం జూడ (ఆశ్వ. ౧.ఆ. ౧౪౩ ప). కాయు+అ = కాయ = శిలాటువు. (కాయు. ధా) (కర్మా-చెట్టుచేం గాయంబడినది) "శా. కాయం జొచ్చు రసాలముల్..... ...(బ్యాత్రింశిక. ౭ ఆ. ౧౨). చదియు+అ = చదియ = నలంగుడు. (భావా). (చదియు - (ధా) = నలంగు.) సీ. పదఘట్టనంబులం జదిసి తాలు । నులుము గాంగ...........(ఆది. ౬ ఆ. ౧౬౦). తునియు+అ = తునియ = ముక్క = ఖండము. (కర్త్ర - తునిసినది). "తునియు = తునుంగు. అ. క్రి. ౧. భిన్నమగు - తెగు - ఖండితమగు - విఱుగు" (సూ. రా. ని). తే-గీ. దివిజయపతి సీకునిచ్చిన తీవ్రశక్తి । చేతం గవ్వడి పడునని మాతువేని । వాసుదేవునిచే నది వ్రయ్య లయ్యెం । దుని యలయ్యెను బోడి యయ్యెం దొరంగు ధరణి (ఉద్యో. ౨ ఆ. ౨౭౨). పరియు+అ = పరియ = బీంట-బ్రద్ద. (భావా). "పరియు - అ - క్రి......... ౩. మీందిభాగము సారహీనమై చెక్కలువాసి రాలు......... ద్వి. మురిసినశక్తులు ముద్గరంబులును । బరిసిన పరిఘులం బట్టిసంబులును (భాస్క - యుద్ధ)" (శ. ర). పాయు+అ = పాయ = చీలిక - నదిలోనుండి చీలిపోయినది (కర్త్ర - ఒకవస్తువునుండి చీలి దానిని బాయున దనంగా విడుచునది). పిడుచు+అ = పిడుచ - అన్నములోనగు వానిముద్ద (కర్మా-పిడువంబడినది. పిడుచు = పిండు - అఱచేతితో నదుము.) మీటు+అ = మీట = ఏతము మున్నగువానిలోని కీల. (కర్త్ర - మీటునది - చిమ్మునది). ముడియు+అ = ముడియ = మూట. (కర్మా - ముడువంబడినది) (ముడియు - ముడిపడు. శబ్దరత్నాకరమున ముడుచుధాతువు చూపబడినది. 'ముడుచు = దే.స-క్రి. ముడివేయు'అని వ్రాయంబడెను). వదరు+అ = వదర - వదరుంబోతు = ప్రేలరి. (కర్త్ర - వదరువాండు. వదరు (ధా) = ప్రేలు). వ్రయ్యు+అ = వ్రయ్య= వ్రక్క = ఖండము. (కర్త్ర - వ్రయ్యునది. వ్రయ్యు (ధా) = బ్రద్దలగు). "వ్రయ్యలయ్యెను." (ఉద్యో. ౨ ఆ. ౨౭౨ ప.)

అక వర్ణకంబు మాటాద్యుల కగు. ౧౯.

బాలవ్యాకరణ వివరణము. ౩౨౩ విషయము. మాటు - మాటుకము. అమ్మ - అమ్మకము. అంపు - అంపకము. పంచు - పంపు - పంపకము. వండు డకారంబు టకారంబగు - వంటకము. త్రోము - త్రోముకము. అద్దు - అద్దకము.

సంజీవని. 323 విష:— పైసూత్రపు వివరణమున వ్రాయఁబడినరీతినె "మాఱ్ఱాదు"లనుచోటి శకటస్థితి సాధువగుచున్నది. మాఱు మున్నగుధాతువులకు భావాద్యర్థములందు 'అక' ప్రత్యయమగును. 'పంచు - పంపు - పంపకము' అనుటచే 'అక' ప్రత్యయపరకత్వమున 'పంచు'ధాతు చకారము పకారమగునని సూరియాశయమును వర్ణింపనగును. "వండు+అకము = వంటు+అకము = వంటకము" అని యిట్లుగ 'అక' ప్రత్యయపరకత్వమున వండుధాతు డకారము టకారమగునని సూరియె విశదముగ వివరించెను. "త్రోము - త్రోముకము" అని బాలవ్యాకరణ గ్రంథము ద్వితీయముద్రణములందును రేఫసంయుక్త తకారమే పడియున్నది. శబ్దరత్నాకరమున 'తోము - తోముకము' అను రేఫసంయోగ రహితశబ్దములుమాత్రమె యుదాహరింపఁబడినవి. ఇది చూచి కావలయు బా. గు. ప్ర. వ్యాఖ్యాత "మూలంబునఁ గ్రావడి ముద్రణప్రమాదమూలకంబు" (బా. గు. ప్ర. ౭౭౪ పుట) అని వ్రాసెను. సూ. రా. నిఘంటువున "త్రోము = తోము. స. క్రి. మఱికిపోవునట్లు రుద్దు" అనుచు రేఫసంయుక్త తకారఘటితరూపము సైతము చూపఁబడెను. కాని యందులకుఁ బ్రమాణముగాఁ జూపఁబడిన యీ క్రిందిప్రయోగ మట్టి రేఫసంయోగమును నిర్ణయింపఁ జాలియుండ లేదు. "సీ. చంద్రబింబము కాంతి సహించి యాలేము మోమును నునుపుగాఁ ద్రోమి రొక్కొ! (భోజరా. 3 ఆ. ౨౨౮ ప) (వి. ని. పా. తోమి రొక్కొ-ముద్రి)." (సూ. రా. ని). 'తోము' అనువాని తకారము విశ్రమస్థానగతమై కన్పట్టుచున్నది. "ఉ. తోయము లాడుచో నొడలు తోమెడు పూర్తికి.............(ఉ. రా. ౧ ఆ ౨౦౦ ప)." (సూ. రా. ని. 'తోము' ధాతువునొద్ద). ఈ 'అక' ప్రత్యయాంతములెల్ల నపుంసకలింగ పదములగును గాన నివి 'ము' ప్రత్యయాంతములగుచుఁ బ్రయుక్తములగును. ఉదా:— మాఱకము - అమ్మకము. మొ.

మాఱు+అక = మాఱకము = మాఱుపు = వినిమయము. (భావా). అమ్ము+అక = అమ్మకము = విక్రయము = అమ్ముట (భావా). అంపు+అక=అపకము = అంపుట = ప్రేషణము (భావా). (పోవుధాతు ప్రేరణరూపము 'అంపు'). పంచు+అక = పంపు+అక = పంపకము = విభజించుట. (భావా. పంచు (ధా) = విభజించు) పోవుధాతు ప్రేరణరూపమగు 'పంపు'ధాతువు పైని 'అక' ప్రత్యయము నిల్చినపుడును 'పంపకము' అని యేర్పడును. అట్టియెడల 'పంపకము' అనఁగా 'పంపుట' అని యర్థము. కావుననె సూరి 'పంచు - పంపు' అను రెండుధాతువుల నుండియు 'పంపకము' అనునది యేర్పడునని వ్రాసెను. పంచుధాతువులోని 'చు'

అనునది 'అక' ప్రత్యయపరకత్వమున 'పు' అనునదిగా మాఱునని యెఱుంగునది. వండు+అక = వంట+అక = వంటకము = అన్నము - వండినపదార్థము. (కర్మా-వండఁబడునది.) త్రోము+అక = త్రోమకము = తోముట = మాలిన్యము పోవునట్లు రుద్దుట. (భావా - శబ్దరత్నాకరమున రేఫసంయోగ మంగీకరింపఁబడలేదు). "తోమకము - దే - వి. తోముట. వ. 'ఏమక గోఱపంపుఁ దోమకంబునం బుటపుటనై' (ఆము. ౪ ఆ)" (శ. ర). అద్దు+అక = అద్దకము = వస్త్రమునకు వేయు రంగు. (కర్మా - వస్త్రమందు 'అద్దఁబడినది'-అద్దు - (భా) రంగు సంటించు = రంగు వేయు).

ప్రయోగములు:—క......... । కోరినవంటకములు నా । నేరిమిఁ దగ నెఱపి కొలంతు నిశ్చలభక్తిన్ (విరా. ౧ ఆ ౨౧౯). (ఉద్యో. 3 ఆ. ౨3౦. ద్రోణ. ౨ ఆ. ౨౦౬).

డువర్ణకం బాత్వాదుల కగు, నగు నప్పుడు పకారంబు
చయుల కగు. ౨౦.

బాలవ్యాకరణ వివరణము. ౩౨౮ విషయము.

ఆఱు - ఆఱుడు. అమ్ము - అమ్ముడు. అల్లు - అల్లుడు. ఎక్కు - ఎక్కుడు. క్రమ్ము - క్రమ్ముడు. చోపు - చోపుడు. త్రొక్కు - త్రొక్కుడు. త్రోచు - త్రోపుడు. దంచు - దంపుడు - దాఁచు - దాఁపుడు. దిగు - దిగుడు. దోఁచు - దోఁపుడు. పెంచు - పెంపుడు - ప్రేఁపుడు. ప్రాఁకు - ప్రాఁకుడు. మాయు - మాపుడు. రాచు - రాపుడు. ఇత్యాదులు.

సంజీవని. ౩౨౮ విష:—ఆఱు మొదలగుధాతువులకు భావాద్యర్థములందు డుప్రత్యయ మగును. అట్లది యగునపుడు ధాతువు తుదినున్న 'చ-యు'లకు 'ప' కారాదేశమగును. ఉదా:—త్రోచు+డు = త్రోపు+డు = త్రోపుడు. త్రోచు ధాతుపర్యాయము త్రోయుధాతువు కలదు. దానిపై 'డు' ప్రత్యయము నిల్చినను 'య' కారమునకు 'ప' కార మాదేశము కాఁగా 'త్రోపుడు' అనియే రూప మేర్పడును. ఇట్లె దంచు - దాఁచు - దోఁచు - పెంచు - రాచుధాతువుల చకారమునకును మాయుధాతు యకారమునకును 'డు' ప్రత్యయపరకత్వమున 'ప'కారాదేశము రాఁగా 'దంపుడు - దాఁపుడు - దోఁపుడు - పెంపుడు - రాపుడు - మాపుడు' అను రూపము లేర్పడును.

"పెంచు - పెంపుడు - ప్రేఁపుడు" అని సూరి యుదాహరించుటచే "ప్రేఁపుడు"అనునది యు "పెంచు"ధాతు జన్యమెయని గుప్తార్థప్రకాశికలో నీక్రింది రీతిని వ్రాయఁబడెను. "పెంచు - పెంపుడు - ప్రేఁపుడు - పెంచుధాతువునకే డువర్ణకంబు పరంబగునపుడు "ప్రేఁచు" ఆదేశంబై ప్రకృతసూత్రమ్మున నే చకారంబునకుఁ బకారంబగు. కర్త్రర్థక ప్రత్యయము - పెంచువాఁడు = వర్ధిల్లఁ జేయువాఁడు - అధికుఁడని ఫలితార్థము" (బా. గు. ప్ర. ౮౮౬ పుట). ప్రేఁపుడు శబ్దమునకు మూలమనఁదగు ధాతువు లేకుండుటచే నిట్లు వ్రాయవలసెను. పెంచు ధాతువు పెరుఁగుధాతు ప్రేరణార్థకము. ప్రేఁపుడుశబ్దమున కధికుఁడని కోశములో నర్థము వ్రాయఁబడెను. ఆట్వాదులను చోటి శకటస్థితిని బా. కృ. ౧౭ సూత్రపు వ్యాఖ్య యందువలెనె సమర్థించుకొనవలెను.

ఆఱు+డు - ఆఱుడు = ఆఱుట = నిర్ద్రవముగుట. (భావా. 'ఆఱుడు' శబ్దము, కోశములలోఁ జూపఁబడలేదు). అమ్ము+డు = అమ్ముడు = అమ్ముట = అమ్మకము. (భావా). అల్లు+డు అల్లుడు = అల్లుకొనుట = అల్లిక. (భావా). ఇది నిర్బంధకముగుటచే "అల్లు+వాఁడు - అల్లుడు" అనుదానికంటె భిన్నమైనది. "అల్లుడు. వి. (∠అల్లు) ౧ అల్లిక. (శ. ర) ౨ ఉపఘ్నము - ప్రాఁకు (చి-ని = చిన్నయసూరి నిఘంటువు)" (సూ. రా. సి) ఈ వ్రాఁతనుబట్టి సూరి యుంచటి 'అల్లుడు'శబ్దమునకుఁ 'ప్రాఁకు'అను నర్థమునే యుద్దేశించియుండు ననఁదగును. కాన నట్టియర్థమున నీ 'డు'ప్రత్యయ మధికరణార్థక మనఁదగును. లతాదికము దీనియం దల్లుకొనునని వ్యుత్పత్త్యర్థము నెన్నవగును. ఎక్కు+డు = ఎక్కుడు = ఎక్కుట (భావా). ఎక్కుడు = వాహనము. (అధికర - దీనియందు ఎక్కుదురు). "ఉ. ఎక్కుడివారొకో గరుఁడు డెక్కుడుగాఁ గలవారు. (ఉ. హరి. ౬ ఆ. ౩౭ ప)" (శ. ర). క్రమ్ము+డు = "క్రుమ్ముడు దే. వి. (కొమ్ముల) పొడుపు" (శ. ర). (భావా). చోపు+డు = "చోపుడు. వై. వి. కలఁత. గీ. కలయఁజోపుడు వెట్టింపఁ గరియుఁ గిరియు। .........మొదలగు మెకములు కలఁక దోలఁకఁ। జెదరి............ (ఉ. రా. ౨ ఆ)" (శ. ర). (భావార్థకము). త్రొక్కు+డు = "త్రొక్కుడు. దే. వి. ౧. ఆపద........." (శ. ర) (భావా). త్రోచు+డు "త్రోపుడు. దే. వి. ౧ త్రోపు............." (శ. ర) = (భావా). దంచు+డు = "దంపుడు. దే. వి. దంచుట = దంపు" (శ. ర) (భావా). దాఁచు+డు = "దాఁపుడు. దే. వి. దాఁచుట - గోపనము" (శ. ర) (భావా). దిగు+డు = "దిగుడు. దే. వి. ఆనతము = పల్లమైనది............" (శ. ర). (కర్త్రు - దిగి

యుండునది). దోఁచు+డు = "దోఁపుడు. దే. వి. ౧ దోఁచుకొనుట ౨ కొల్ల" (శ. ర). (భావా). పెంచు+డు = "పెంపుడు. దే. విశే - పెంపఁబడినది. (పెంపుడు చిలుక)" (శ. ర). (కర్మా - పోషింపబడినది). పెంచు+డు = "ప్రేఁపుడు. దే. విశే - అధికుఁడు. క. సప్తపువారల నధిపతి । మన్నించినఁ బ్రేఁపుడైన మంత్రికి బ్రదు కే । యున్నది ? యుచుమున్న యతఁడు । సప్తకుప న్నచటు వాని చనకున్నఁ జెడున్ (పంచ. సారా. ౧ ఆ)" (శ. ర) (కర్త్రర్థకము - జనులను బెంచువాఁడని వ్యుత్పత్త్యర్థము నెన్నునది) ప్రాఁకు+డు - "ప్రాఁకుడు. దే. వి. ౧ ప్రాఁకుట, ౨ పాఁచి." (శ. ర). (భావా). మాయు+డు - "మాపుడు. దే. వి. మైల - కలుచ. మాపుడు పుట్టంబు. (భార. విరా. ౧ ఆ)" (శ. ర). (భావా). రాచు+డు= "రాపుడు. దే. వి. రాచుట" (శ. ర). (భావా).

బాలవ్యాకరణము ఉవర్ణకం బడుక్వాదుల కగు. ౨౭.

౩౭౫ విష. అడుకు - అంటు - ఒప్పు - ఒలుగు - ఒరుఁగు.

సంజీవని. ౩౭౫ విష:—అడుకు మొన్నగు ధాతువులకు భావాద్యర్థంబులందు 'ఉ' ప్రత్యయం బగును. అడుకు+ఉ = అడుకు = దొంతి. (కర్మా - దొంతిగ నిల్పఁబడినది). "అడుకు(లు) వడ్లు నానఁబోసి వేచి కొట్టినవి. ఈ యర్థమందు నిత్య బహువచనాంతము. కం. అడుకులు దిన్న ట్లగు నే............(ద్రోణ. ౪ ఆ)" (బా. గు. ప్ర. ౪౪౬-౪౪౭ పుట) అని గుప్తార్థప్రకాశికలో వ్రాయఁబడెను. దీనినే పేటికావ్యాఖ్యాత "అటుకులను వ్యాకనహారికపదము నర్థమున నీధాతురూపము నిత్యబహువచనాంతముగఁ జూపట్టెనే" (బా. సా. పే ౫౦౫ పుట). అని వ్రాసెను. కాని చిపిటములనెడి యీయర్థము ధాత్వర్థమును సంబంధించి యుండ లేదు కావున నీయర్థము సూరిచే నుద్దేశింపఁబడి యుండ దననగును. "అడుకు - దే - స - క్రి. దొంతిగనిడు. వి. ౧ దొంతి. ౨. బ. వడ్లునానఁబోసి వేచి కొట్టినవి. చిపిటములు. క. అడుకులుదిన్న ట్లగునే...(భార. ద్రోణ. ౪ ఆ)" (శ. ర). "అడుకు - స. క్రి. (క - అడుకు - త - అడుక్కు). దొంతిగానిడు. వి. (క - అడక) దొంతి. (శ. ర)." "అడుకులు = అటుకులు. వి. బ. చిపిటములు. పృథుకములు. (నానఁబోసి వేఁచి కొట్టిన వడ్లు) క. అడుకులు దిన్నట్లగునే...........(భార. ద్రోణ. ౪ ఆ. ౮౯)" (సూ. రా. ని). అంటు+ఉ = అంటు = అంటుట = స్పర్శము. (భావా). అంటు = (మామిడి) అంటు. (కర్త్ర - ఉటోకచెట్టుకొమ్మ నంటికొన్నది). మైల - ఆశౌచము. (అపాదానార్థకము - అంటుటవల్లఁ గల్గినది). ఒప్పు+ఉ = ఒప్పు=ఒప్పిదము. (భావా). ఒలుగు+ఉ = ఒలుగు = ఒలఁకుట (భావా). "మూలములో నుకార

మధ్యమము ప్రామాదికము" (బా. గు ప్ర. ౪౪౭ పు) అని బా. గు. ప్ర. వ్యాఖ్య యందు వ్రాయఁబడెను. శా. సా. పే. వ్యాఖ్యాతయు సద్దానినె వ్రాసెను శ. ర. సూ. రా. నిఘంటువులు రెండిటి యందును 'ఒఱగు' అను 'అ' కారమధ్యమె చూపఁ బడెను. కాని యొక్క ప్రయోగమైనను 'అ' కారము నిల్పు యతిస్థానప్రయోగము చూపఁబడలేదు. ఒసగు+ఉ = ఒసఁగు = ఈవి-బహుమానము (కర్మార్థ - ఒసఁగఁబడునది). ఆకృతిగణము. చదువు+ఉ = చదువు. అడలు+ఉ = అడలు = దుఃఖము. అని కడు నడలుగఁ బలికిన (సభా. ౨ ఆ. ౧౨౮). పలుకు+ఉ=పలుకు = మాట (సభా. ౨ ఆ. ౧౯౧). ఒడ్డు+ఉ = ఒడ్డు = పందెము. సీ.........నలువురఁ గౌరవేంద్రుఁ । డొక్కొక్క యొడ్డున నొడ్డి.........(సభా. ౨ ఆ. ౧౯౬). కఱచు - ప్రేర - కఱపు+ఉ - కఱపు - బోధనము. సీ. కర్ణగాంధారుల కఱపుల విని (సభా. ౨ ఆ. 3౧3) ఎఱుఁగు+ఉ ఎఱుకు - సోదెచెప్పువాఁడు (కర్త్ర-'కిరాతుఁడు' అను నర్థము దీని గౌణ మని తలంచుట యుక్తము. "ఎఱుకు దే-వి. ౧. కిరాతుఁడు .........(ఎఱుకు అనఁగా వ్యతిరేకలక్షణచే ఎఱుఁగనివాఁడు మూఢుఁడు అని వ్యుత్పత్త్యర్థము.)" (శ. ర). పుట్టు+ఉ = పుట్టు - జన్మము. ఉ......నా । పుట్టు గృతార్థతం బొరసె.........(విరా. ౧ ఆ. ౨౭). హెచ్చు+ఉ=హెచ్చు = ఆధిక్యము. ఉ.........। హెచ్చుగుఁ గుందగున్.........(ఉద్యో. 3 ఆ. ౮౫). ఉబ్బు+ఉ=ఉబ్బు. క. చావును నోవును మన యో । ధావళికిన్ గెలుపు నుబ్బు నావలికిని.........(భీష్మ. ౨ ఆ. ౧౯౯). చెప్పు+ఉ - చెప్పు = చెప్పినమాట । నా చెప్పు సేయు (నన్ని. కు. ౭ ఆ. ౮౭౧). కుడుచు+ఉ = కూడు - అన్నము. మొ.

వడిప్రభృతు లిట్లెఱుంగునది. ౨౨.

వడి:—కొలువడి - గెలువడి - నడవడి. వ్యతిరేకంబున - లేవడి. వి:—తనివి - తెలివి - విరివి. అవు:—తగవు - నగవు - ఉఱవు. ఇ:—చేఁపి - వాఁపి. కలి:—కనుకలి - వినుకలి. ఇత్యాదులు మహాజన వ్యవహారంబుల నెఱుంగునది. ఇది కృదంత పరిచ్ఛేదము.

బాలవ్యాకరణ
వివృతి
3౭౬ విషయము.

సంజీవని. 3౭౬ విష:—వడిప్రభృతి ప్రత్యయము లనఁగా - వడి - వి - అవు - ఇ - కలి మొదలగు ప్రత్యయములు, ఇట్లు – ఈక్రింద వివరించినరీతి నెఱుంగునది. అనఁగా 'వడి' ప్రత్యయము కొలుచు ప్రభృతులకును, 'వి' ప్రత్యయము తనియు ప్రభృతిధాతులకును, 'అవు' ప్రత్యయము 'తగు' మున్నగు

ధాతువులకును, 'ఇ' ప్రత్యయమును, చేయు మొదలగు ధాతువులకును 'కలి' వర్ణకము కను ప్రభృతిధాతువులకును భావాద్యర్థంబులం దగునని తాత్పర్యము. "ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది" అనుటచేత మీఁదఁజెప్పిన కృత్ప్రత్యయములు దిక్ప్రదర్శనముగా మాత్రము చెప్పఁబడినవనియు మహాకవి ప్రయోగములనుబట్టి తక్కిన కృత్ప్రత్యయప్రపంచము నెఱుంగవలెననియుఁ దాత్పర్యము. ఇందును 'వడి - వి' అను ప్రత్యయములు పరమగునపుడు బా. కృ. ౨ సూత్రము చొప్పున కాదులకు లోపము కల్గునని యెఱుంగునది. ఉదా:—కొలుచు+వడి-కొలు వడి = కొలువడి. గెలుచు+వడి=గెలు+వడి = గెలువడి. నడచు+వడి = నడ+వడి= నడవడి. తనియు+వి = తని+వి = తనివి. తెలియు+వి = తెలి+వి = తెలివి. విరియు+వి = విరి+వి = విరివి. మొ.

కొలుచు+వడి = కొలువడి. "కొలువడి. దే. వి. (కొలుచు+వడి) కొలత. (భావా). గెలుచు+వడి. "గెలువడి. వి. (గెలుచు+వడి - త - కెలిప్పు) జయము - గెలుపు. గీ.. ...జయము । గెల్పు గెలుపడి గెలుపము గెలు పనఁదగు...... (ఆం. భా. ౨ ఆ. ౨౨౩)." (సూ. రా. ని). (భావా) శబ్దరత్నాకరమున నీశబ్దము చూపఁబడలేదు. నడచు+వడి. "నడవడి. దే. వి. (√నడ). గమనము - నడక." (సూ. రా. ని). (భావా). క. నడవడి యను మున్నీటిం । గడవం బెట్టంగ నోడక రణిం దగి............(ఉద్యో. ౨ ఆ. ౩౯). బా. క్రి. ౧౦౬ సూత్రము చొప్పున వడిప్రత్యయపరకత్వమున (వ్యతిరేకంబున) 'లే' అనునది యస్త్యర్థక కలుగుధాతువున కాదేశంబగును గాన లే+వడి. "లేవడి. దే. వి. లేమి........." (శ. ర). (వ్యతిరేకభావార్థకము). విరియు+వి. "విరివి. దే. వి. విస్తృతి............ ......" (శ. ర). (భావా) "విరియు. దే. అ. క్రి - "వికసించు............ ౪ చెదరు......... ౬ ఉప్పొంగు" (శ. ర) అను నర్థములచే విస్తృతి యను నర్థము కల్గుట యుక్తమె యనఁదగును. తనియు+వి. "తనివి. దే. వి. ఆపోక - తృప్తి" (శ. ర) (భావా). తెలియు+వి = తెలివి - వివేకము - జ్ఞానము - (కరణా - దీనిచే= వివేకముచే సర్వమును దెలియును). తగు+అవు. "తగవు. దే. వి. ౧ తగుట. క. కడునమ్మి యునికియును నె । య్యుఁడు నమ్మియును సుశీల కుశలత కా దె । య్యెడ నైనను బుద్ధి సొనిపి । తడవి గనుంగొనఁగ వలయుఁ దగవు తగమియున్. (శాంతి. ౨ ఆ. ౧౮౭)......... ౪. పెం డ్లప్పుడు పెండ్లికూఁతునకుఁ దల్లిదండ్రు లిచ్చెడు బహుమానము." (శ. ర). బహుమాన మర్థమైనపుడు కర్త్రర్థకము. తగియుండును దని వ్యుత్పత్త్యర్థము. తగవు = అభియోగమునందలి తీర్పు. (అధికర - దీనియందు

తగునట్లు తీర్మానము జరగును.). మో. నగు+అవు = నగవు = నవ్వుట - హాసము (భావా). ఉఱు+అవు. "ఉఱవు = వై-వి. ౧. ఔచిత్యము" (శ. ర). (భావా) "ఉఱు. యు-వై-అ-క్రి. ౧. శ్రేష్ఠమగు, ౨. తగు........." (శ. ర). చేయు+ఇ= చేయి (కర్త్రు. పనులను జేయునది). వ్రాయు+ఇ = వ్రాయి = అక్షరము. (కర్తా - వ్రాయఁబడునది.) కను + కలి - కనుకలి - చూపు. విను + కలి = వినుకలి = వినికి (భావా). "కనుకలి. వి. (కను+కలి) చూపు - దృష్టి. చ. వినుకలిచేతనే విరహ వేదన నాయది యింత వర్ధిలెన్ । గనుకలి నట్లు చిత్రఫలకంబునఁ గాంచిన యింతి .........(ప్రభా. 3 ఆ. ౨౫)" (సూ. రా. ని). విను+కలి. "వినుకలి. దే. వి - వినికి. ఆకర్ణనము. చ. దీని విన్నయవ్వినుకలి (హరి. ఉ. 3 ఆ)". (శ. ర).

ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది యన్నచొప్పున మఱి కొన్ని కృత్ప్రత్యయములను త్రిలింగలక్షణ శేషకర్త వివరించెను. అవి యిచటఁ బ్రదర్శింపఁబడుచున్నవి. "౧. డయ్యు దయ్యు నొచ్చు పుచ్చుల కివర్ణకంబగు. అగుచో వానికడ హల్లులు పకారంబులగు. ఉదా:—డప్పి-దప్పి - నొప్పి పుప్పి". డయ్యు+ఇ=డప్పు+ఇ=డప్పి. "డప్పి దే. వి. దప్పియొక్క రూపాంతరము. (శ్రమము నకు. వ. నీవు కడుదూరంబు వచ్చి డస్సితి. ఇంక మరలుట లెస్స. అనిపలికిన నప్పతి వ్రత యిట్లనియె. తే-గీ. నాకు డప్పి యొక్కడిది...............(భార. ఆర. ౭ ఆ. ౨౩౯ ౨౪౦)" (శ. ర). "ఆ వె.........। డప్పిఁ దీర్చికొని కడంగు మనిన (భా - రా. యుద్ధ - ౨౫౧ - హరి-పూ. ౨ ఆ. ౪౪)." (సూ. రా. ని. దప్పి శబ్దము నొద్ద). (భావార్థకము). దయ్యు+ఇ. "దప్పి = డప్పి - దప్పిక. వి. (√దయ్యు) గ్లాని - శ్రమ. క. పాండవబల మల్పంబై । యుండఁ గృష్ణుఁడు ధనంజయుండును దప్పిం । బెండువడఁగ.........(శల్య. ౧. ఆ. ౩౦౯) ........ ౨ నీరువట్టు - దప్పి - పిపాస. ఉ.........సలిలంబు దప్పి వోఁ । దాఁగిన వారికి............. (నైష. ౨ ఆ. ౮౧)" (సూ. రా. ని) (భావార్థకము). నొచ్చు+ఇ = నొప్పు+ఇ = నొప్పి. (భావా). "క. అప్పాండవ మధ్యమునకు। ......... । నొప్పి పరిహరించి దయ గనుంగొను మనినన్ (జై. ౭ఆ. ౧౧౭)" (శ. ర. నొప్పిశబ్ద). పుచ్చు+ఇ = పుప్పు+ఇ - పుప్పి - పుచ్చుట (భావా). "౨ సూ:—రాచున కిడి వర్ణకం బగు. ఉదా:—రాయిడి - రాపు" గ్రంథకర్త వచింపనున్నను నీ త్రిలింగలక్షణశేషము బాలవ్యాకరణమునకు శేషగ్రంథమె యనఁదగును గాన "రాచు+ఇడి" అనుచో బా. కృ. ౨ సూత్రముచొప్పున "రాచు" అనుదాని తుది 'చు'వర్ణము లోపించెనని యెన్నఁనగును. బా. కృ. ౨ సూత్రమున 'ఇడి'వర్ణకపరకత్వమున లోపము చెప్పఁ

బడకున్నను 'ఇమి'వర్ణకపరకత్వమున లోపము చెప్పఁబడుటంజేసియు 'ఇడి - ఇమి' అను రెండును 'ఇ'వర్ణాదులై యగుటంజేసియు నట్టి వర్ణలోప మీ సూత్రముచే రావచ్చునని త్రిలింగలక్షణశేషకర్త తలంచియుండును. ప్రౌఢ. కృ ౭ సూత్రము నొద్ద "కాఁచు+పురము = కాఁపురము" మున్నగుస్థలములందు బా. కృ. ౨ సూత్రమును త్రిలింగలక్షణశేషకర్త యుపయోగించుకొనుటయె పై విషయమునకు నిదర్శనము. ఇట్లె ప్రౌఢ. కృ. ౬-౭ సూత్రముల యుదాహృతులందును బా. కృ. ౨ సూత్ర ముపయోగించుకొనఁబడెను. "రాచున కిడి వర్ణకంబు నగు" అనుచోటి చార్థక 'ను' శబ్దముచేత బా. కృ. ౧౧ సూత్రముచొప్పున 'పు'వర్ణకము నైతము రావచ్చునను తలంపున 'రాపు' అను రూపాంతరమును నుదాహరింపఁబడెను. ప్రౌఢవ్యాకర్త యుదాహరింప మఱచెనేమోకాని బా. కృ. ౨౦ సూత్రము చొప్పున 'డు'వర్ణకమును రావచ్చును. ఉదా:—రాచు+డు = రాపుడు. సూరియుఁ బ్రౌఢవ్యాకర్తయుఁ జెప్పలేదుగాని 'రాపిడి' అనురూపమును గలదు. ఇట 'ఇడి' ప్రత్యయపరకత్వమున 'రాచు'ధాతు చకారము పకార మగునని సూత్రించుకొన వలసియుండును. రాచు - రాయిడి = ఒత్తిడి; రాచు - రాపిడి - రాపు-రాపుడు= ఒరయిక (భావార్థకములు). "౩ సూ ఈర్చుబ్బు కందు దువ్వు వడ్డించుల కెన వర్ణకం బగు; అగుచో 'ఈర్చు-ఉబ్బుల' చకార బకారములు పకారంబు లగు. వడ్డించు నించు లుప్తం బగు. ఉదా:—ఈర్పెన - ఉప్పెన - కందెన - దువ్వెన - వడ్డెన" ఎన వర్ణకపరకత్వమున 'ఈర్చులోని' చకారము పకారమగును. ఉబ్బులోని బకార ద్వయమును 'ప'కారద్వయ మగును. "వడ్డించు" ధాతువులోని 'ఇంచు' అను భాగము లోపించును. ఉదా:—ఈర్చు+ఎన = ఈర్పు+ఎన = ఈర్పెన = ఈళ్ల నీర్పెడి దువ్వెన. (కర్త్రర్థ - ఈరుల నీర్చునది) "ఈరు = దే - వి - పేనుగ్రుడ్డు. లీఖ........" "ఈరుచు దే. స. క్రి. (ఈర్పెనతో ఈళ్ళను) ఈడ్చు - (రూ ఈర్చు)." (శ. ర). ఉబ్బు+ఎన = ఉప్పు+ఎన = ఉప్పెన - సముద్రాదికము పొంగు. (అధికర - దీనియందు సముద్రాదుల జల ముబ్బును). కందు+ఎన - కందెన = బండి యిరుసునకుఁ బూసెడి మసి. (కరణార్థ - దీనిచేత బండి యిరుసు కందును = నల్లఁబడును.). దువ్వు+ఎన = దువ్వెన = కంకతిక = కేశప్రసాధని. (కర్త్రర్థకము - తల చిక్కును దువ్వునది). వడ్డించు+ఎన = వడ్డెన = భోజ్యపదార్థములను భోజన పాత్రమందు పెట్టుట (భావా) "౭. పురవర్ణకంబు కాఁచు డాఁచు దాయ్యాదుల కగు. ఉదా:—కాఁపురము - డాఁపురము - దాపురము. మొ." కాఁచు+పురము = కాఁ+పురము = కాఁపురము = కాఁపు = సంసారము. (కర్త్రర్థకము -

కాఁగఁజేయునది. సంసారము జనులను కాఁగఁజేయుట ప్రసిద్ధము) కరఁగు ప్రేరణ రూపమగు 'క్రాఁచు = కాఁచు' ధాతువు సబిందుకము-కాఁపురము శబ్దము సబిందుకము. కాన "కాచు = రక్షించు" ధాతువు "కాఁపు - కాఁపురము" మున్నగువానికి మూలము కానేరదు. "కాఁపురము. వి. ($\sqrt{}$కాఁపు$^2$) ౧. నివాసము... ...... ౨. సంసారము........." (సూ. రా. ని) "కాఁపు$^2$ - వి - కాఁపురము - నివాసము..........." (సూ. రా. ని). ఈ సూ. రా. నిఘంటు వ్రాఁతల నరయఁగా "కాఁపు" అను విశేష్యమునుండి స్వార్థిక పుర ప్రత్యయాంతమగు "కాఁపురము" అనునది యేర్పడెనని తేలుచున్నది. ఈపక్షమున నిది తద్ధితాంతమగును గాని కృదంతము కానేరదు. ప్రౌఢవ్యాకర్త పయిరీతిని 'కాఁచు' ధాతువునుండి 'కాఁపురము' అను కృదంత మేర్పడెనని సూత్రించెను. "కాఁచు దే. ప్రే. కాఁగఁజేయు" అనురీతిని మాత్రమె సబిందుక 'కాఁచు' ధాతువు కోశద్వయమునందును జూపఁబడియున్నది. దాఁచు+పురము = దాఁపురము = దాఁచుట. (భావా). దాయు+పురము = దాపురము = పొందుట కనువయినది (కర్త్ర - సమీపించునది. పొందుటకు వీలుగ నున్నదని యర్థము). "౫ సూ. ఎక్కు దిగులకుం బ్రేరణార్థంబున మతివర్ణకం బగు. అగుచో 'ఏగు' ఎక్కున కాదేశం బగు. ఉదా:—ఎగుమతి - దిగుమతి. ఇట్లు ఎగువ.". "ఎగుమతి. దే. వి. ఓడకు సరకు లెక్కించుట" (శ. ర). "దిగుమతి. దే. వి. (ఓడలోనున్న సరకును రేవునందు) దించుట" (శ. ర). (భావార్థకములు). 'ఇట్లు = ఇట్లె' అనుటచేత ఎక్కు ధాతువునుండి 'ఎగువ' అను కృదంతమును గల్గును. ఎక్కు+ = ఎగువ = మీఁది భాగము. "౬ సూ. వువర్ణకం బులియాద్యాదుల కగు. ఉదా:—ఉలివు. మొ". ఉలియు+వు = ఉలివు = మ్రోఁత. (భావా.) "ఉలియు. దే-అ-క్రి......౨ మ్రోయు" (శ. ర). "౭ సూ. కాచు - వీచులకు వలి వర్ణకంబగు ఉదా:— కావలి - వీవలి." కాచు+వలి = "కావలి. దే. వి. రక్షణము........." (శ. ర). వీచు+వలి = "వీవలి. దే. వి. గాలి - వాయువు ......" (శ. ర) (కర్త్రర్థకము - వీచునది యని వ్యుత్పత్త్యర్థము). గాణపత సూత్ర వివరణకర్త మఱికొన్ని కృత్తులను జేర్చెను. "ఒదుగు ప్రభృతుల కిలి యగు. (౪౧౦ సూ). ఒదిగిలి - పొక్కిలి - చెక్కిలి. మొ" "౪౧౫. సూ. వ వర్ణకంబు తెగ్వాదుల కగు. ఉదా:—తెగువ - ఎగువ" "౪౨౦ సూ అరుగ్వాదులకు దల యగు. ఉదా:—అరుగుదల. మొ" "౪౨౧. సూ. వచ్చు పోవు నిలుచులకు కడ యగు. ఉదా:—రాకడ - పోకడ - నిలుకడ" "తెలివిడి = తెలియు+విడి. తిరుగు+కలి = తిరుగలి. మొ."

ఇంకను ననంతములు కృత్ప్రత్యయములు గలవు. 'కొను' ధాతుకృదంతము. 'కోలు' అనునది - పొగడికొను - పొగడికోలు = పొగడికొనుట. ఆ-వె. అన్యకీర్తనంబు నన్యనిందయుఁ దన్నుఁ । బరఁగఁ బొగడికోలు ప్రబ్బికోలు । నాపగా తనూజ యార్యవృత్తములు గా । వనిరి వీని నాద్యులైన మునులు (సభా. ౨ ఆ. ౪౯) (ప్రబ్బికొను - ప్రబ్బికోలు = అతిశయించికొనుట). విల్చికొను - విల్చికోలు = వెలకుఁగొనుట. ఉ.............ఒక నక్కనిచ్చి సిం।హమ్ముల విల్చికోలు అదె.........(సభా. ౨ ఆ. ౧౮౧). ఉక్కు+ఇవము = ఉక్కివము సీ. గాండీవ మాదిగాఁగల యాయుధావళి । యుక్కివంబున నప్పు డొడిచికొనఁగ । మఱచిన వాఁడు............(ఆర. ౧ ఆ. ౫౫ ప.) "అలుగు - అలుగుల - అలుగులము = ౧. నలఁగుడు, ౨. బాధ" (శ. ర). చ. అలుగుల మంది యందుల మృగావళియున్ విహగంబులున్ భయా । కుల గతిఁ బొంది (ఆర. ౧ ఆ. ౩౦౧). కుడుచు - కూడుఁ అన్నము. పస్ను - పసి. విడుచు - విడుగడ - విడుగర - విడుదల - విడుపు. మొ. కృత్తద్ధితములను సాకల్యముగ వివరించు టెవ్వరికిని శక్యము కాదు. ఈ భాగములు తెల్గున మిక్కిలి యలంతిగనున్నవి. సంస్కృతమున శాకటాయనుఁడుణాదుల విస్తరించి యుపదేశించినరీతిగఁ దెల్గున వీనికి వేఱు గ్రంథముగ విస్తరించుట యత్యావశ్యకము.

ఇది కృదంతపరిచ్ఛేదము, ఇది = ఇంతతో ముగిసినది.

---

# ఆంధ్రవ్యాకరణసంహితా సర్వస్వము

## ప్రకీర్ణక పరిచ్ఛేదము

పదాద్యంబులు ఋ ౠ వర్ణంబులు ర ల తుల్యం బులు. ౧.

బాలవ్యాకరణ వివరణము. 322 విషయము

అతఁడు ఋషి - ఇట సంధిలేదు. ఆఋషి - ఇట యడాగమములేదు. వచ్చెఋషి - వచ్చెన్ ఋషి - వచ్చెను ఋషి - ఇట ద్రుతమునకు లోప సంశ్లేష స్వాత్వములు.

సంజీవని. 322 విష:—ప్రకీర్ణక = "ప్రకీర్ణ - న. (ప్ర+కౄ+భావే క్తః). చామరే - భిన్నజాతీయానాం మిశ్రణే చ—......స్యార్థేకన్............" (శబ్దస్తో) అను కోశము చెప్పిన బాలవ్యాకరణములోని వివిధప్రకరణములను సంబంధించిన మిశ్రవిషయము లీ పరిచ్ఛేదమున వివరింపఁబడునని గ్రహింపవల యును.

పదాది నున్నట్టి - ఋ - ౠ వర్ణములు ర ల లవంటి వగు ననఁగా ఋకారము రేఫమువంటిదియు ౠకారము లకారమువంటిదియు నగునని యర్థము. రలలు పరముగునపు డెట్టి సంధికార్యాదులు సంభవించునో యట్టి కార్యములె ఋ - ౠవర్ణ పరకత్వమందును సంభవించునని గ్రహింపవలయును. ఈవిషయము 'ఋకారం చ వి ముచ్యేత్యథర్వణ కారికచే ధ్వనితఁమగుచున్నది. (చూడు ౨౪౦ విష.). "అతఁడు+ ఋషి" అనుచో స్వరపరకత్వమున నిత్యముగా రావలసిన పరరూపసంధి సంభవింపక రేఫరూప హల్పరకత్వ మందువలెనె నిల్చెను. "అతఁడు ఋషి-ఇట సంధిలేదు" అను సూరి వివరణమున కిదియె తాత్పర్యము. (చూ. ౬౫ II విష). 'ఆ ఋషి - ఇట యడాగమములేదు' అను సూరి వివరణముచే బా. సంధి. 3 సూత్రము చెప్పిన (౬౭-౬౭ I విష) రావలసిన యకారాగమము ఋ ౠ వర్ణపరకత్వమున రాదని భావము. 'ఆ+ఋషి=ఆ+య్ఋషి=ఆయ్ఋషి' అనురీతి నసిష్టరూపము కల్గనేరదని తాత్పర్యము. "వచ్చెన్+ఋషి = వచ్చె ఋషి - వచ్చెన్ ఋషి వచ్చెను ఋషి" అనుచో రేఫ లకారరూపము హల్పరకత్వమందువలెనె బా. సంధి. ౧౪

సూత్రము చొప్పున (౮౧-౮౧ I - ౮౧ II విష) ద్రుతలోపమును ద్రుతమునకు 'ను' స్వరూపమును ద్రుతమునకు నకారవ్యంజన రూపస్థితియుఁ గల్గునని సూరియె వివరించెను. (చూ. ౮౧ II విష.). సంస్కృతభాషయందును ఋవర్ణ పరకత్వమున సంధిలేకుండుట గలదు. "ఋత్యకః - (౬-౧-౧౨౮). ఋతి పరేఽకః ప్రాగ్వత్ - బ్రహ్మఋషిః - బ్రహ్మర్షిః..........సమాసేఽప్యయం ప్రకృతిభావః - సప్త ఋషీణామ్-సప్తర్షీణామ్." (బాలమనోరమా వ్యాఖ్య "బ్రహ్మ ఋషి రితిస్థితే ఆకారస్య హ్రస్వః - ప్రకృతిభావశ్చ. తతశ్చ 'ఆద్గుణ' ఇతి రపరః అకారో న భవతి.") (సి. కౌ. ౯౨ సూ).

ప్రయోగములు:—రుధ్యాక్షరము. ఇలఁ బ్రసిద్ధుఁడు ఋతుపర్ణుఁ డనెడు నహీశుఁ డిక్ష్వాకు। కులజుండు.........(అర. ౨ ఆ. ౧౨౫ ప), క. ఆ ఋషి కుమారు కట్టిన। చీరలు............(అర. 3 ఆ. ౧౦౪ ప.) చ. ద్విజవరులం గుమారుల నతిప్రియదర్శనులైనవారి, ఋ। గ్యజుష పదక్రమంబులు క్రియఁ గుణియించుచు.........(ఆది. ౨ ఆ. ౧౯౬.) క. గోరథమును ఋష భము వై। హారము ఋషిగిరియుఁ జైత్యకాద్రియు...... (సభా. ౧ ఆ. ౧౭౫). మత్తకోకిలము. స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును సిష్టుఁడున్। ...... (సభా. ౨ ఆ. ౪). ఉ. ......। ఏవిధి నీఁగువాఁడ ఋణమెయ్యదియేనియు వేఁడుఁ డిచ్చెదన్ (విరా. 3 ఆ. ౨33). చ. ...... నన్నుఁ బెం। చిన గురువంపుఁ దండ్రులకుఁ జిత్త మెలర్ప ఋణంబు దీర్చెదన్ (ద్రోణ. ౨ ఆ. ౫౦. ప.) ...... కొన్నలు గొన్న ఋణంబు నీగుదున్ (నన్ని. కు. ౧౧ ఆ. ౬౦౪). మ. కరయుగ్మం బున ఋశ్యమూకమును......(భాస్క. రా. కిష్కిం. ౮౨3. ప). 'వచ్చెనృషి' అను సూరిపక్షపు సంశ్లేష ప్రయోగ మగపడదు.

ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగు రు - లు - డు-ల
ముందఱి యేత్వంబునకు హ్రస్వంబు విభాష నగు. ౨.

బాలవ్యాకరణ విపృతి. 3౭౮ విషయము.

నల్లేరు - నల్లెరు, పల్లేరు - పల్లెరు, పెన్నేరు - పెన్నెరు, మానేరు - మానెరు, ఆడేలు - ఆడెలు, కుందేలు - కుందెలు, తోఁడేలు-తోఁడెలు, నాఁగేలు-నాఁగెలు, నేరేడు, నేరెడు, మారేడు - మారెడు, పూరేడు - పూరెడు, తంగేడు - తంగెడు.

సంజీవని. ౨౮ విష:—ఉత్తమంబులగు = మూఁడక్షరములకుఁ (అక్షరము= అచ్చు. చూ. ౧౫ విష.) దక్కువకాని యక్షరములుగల సమానపదముల తుది

నున్న - 'రు - లు - డు' అనువానిలో దేనికయినను బూర్వమందున్న 'ఏ' కార మునకు వైకల్పికముగా హ్రస్వం బగును. ఇట్టివిధి యాచ్ఛికపదములందు మాత్రమే సంభవించును. (౧౫౧ - ౧౫౧ I విష. చూచునది). ఉదా:—'నల్లేరు' శబ్దము మూఁడక్షరములుగల యాచ్ఛికశబ్దము. అందలి తుది 'రు' అనునది 'ఉత్తరమగు పదాంత్య 'రు' వర్ణము. అద్దానికిఁ బూర్వమందున్న 'ఏ' అనుదానికి హ్రస్వము రాఁగా "నల్లెరు" అను రూప మేర్పడుచున్నది. ఇట్లె యంతటను నరయునది. సమాన పద మనుటచే "మిన్ను+ఏఱు = మిన్నేఱు" అనుచో "మిన్నెఱు" అని కానేరదు. "నల్లేరు-దే. వి. ఒకదినుసు తీఁగ - వజ్రవల్లి" (శ. ర.) "పల్లేరు = పల్లెరు - దే వి పలంకష" (శ - ర). "పెన్నేరు = పెన్నెరు - దే. వి. అశ్వగంధ" (శ. ర). "మానేరు = మానెరు - దే. వి. ఎక్కుడుఁ దీగ - జ్యోతిష్మతి" (శ-ర). "ఆడేలు = ఆడెలు - దే - వి - పక్షివిశేషము - శరారి" (శ - ర). క. బకమై యుండెద వని కా। శికు నతఁడు శపించె విని వశిష్ఠునకుం గా। శికుఁడును నాడే లగు మని। ప్రకట క్రోధమున నిచ్చెఁ బ్రతిశాపంబున్. (మార్కం - ౨ ఆ. ౮). (సూ. రా.). "కుందేలు = కుందెలు - వి - ఔ. (చూ - కుందేటికొమ్ము) శశము - చెవులపిల్లి. (ఉ. ...... వంటయిల్ । కుందెలు సొచ్చి......(ఆది. ౬ ఆ. ౧౮౬)." (సూ. రా. ని). "తోఁడేలు = తోఁడెలు - దే - వి - ఔ. (అడవి కుక్క). క. ......అధిపుక్లై పట్టిరి బె। బ్బులి మహిష మెలుఁగుఁ గిటి తోఁ। డెలు మొదలగువానిఁ గొన్నిటిని వేఁటకరుల్ (మనుచ. ౪ ఆ. ౫౦). క. ఇవి తోఁడేలుల భంగిన్। గవియు......(శాంతి. 3 ఆ. ౪౨3)." (సూ. రా - ని). "నాఁగేలు= నాఁగెలు = నాఁగలి - వి - ఔ - తే. గీ. అన్యరుల డించి ముఖవర్ణ మభిలషించి। కూడె నాఁగెలు సంపంగి కోమలాంగి నాస యనవించె......(చంద్రా. ౪ ఆ ౧౧౯). ......" (సూ - రా - ని). సూ - రా - నిఘంటుకారులు దీని వైకృతముగా నంగీకరింపలేదు - "నాఁగలి = నాఁగేలు = నాఁగెలు - దున్నెడు సాధనము - లాఙ్గలమ్" (వై. దీ). "నేరేడు = నేరెడు = వి - ఔ. జంబూవృక్షము. ఉ. అన్నేరెడు మ్రానిమూలమున.........(మార్క. ౪ ఆ. ౧౪౪)......గీ. నేరెటేటి యసల్ దెచ్చి......(మనుచ. ౨ ఆ. 3౬)." (సూ. రా. ని). "మారేడు = మారెడు - వై - వి - బిల్వము. రగడ - మారేటికిఁ బలు మారేటికిఁ జన...... (య. ౪ ఆ.)" (శ. ర). "మారేడు = మారెడు ఒకానొకచెట్టు - మాలూరః" (వై - దీ). "పూరేడు = పూరెడు = పక్షివిశేషము" (శ - ర). "తంగేడు = తంగెడు = దే. వి. గోశ్రేణి" (శ - ర). వ.......... ఘంటిపాటునం గంటికిం

బ్రియుండై తంగేటి జుంటి చందంబునం గొంటుదనం బెఱుంగక కుఱంగట నున్న యమ్మహీసురవరకుమారు......... (మనుచ. ౨ ఆ. ౬౧ వచనము). చ........ ఉ। త్తరగతిలాభ వైభవము తంగేటిజున్నుగఁ జేయు గోవులు. (ఆను. 3 ఆ. ౪౬). సీ. కెలఁకుల నున్న తంగేటి జున్ను గృహమేధి.........(మనుచ. ౧ ఆ. ౬౬ ప). నల్లేరు ప్రభృతులాకృతిగణము.

నన్నయా డోలాభూషోత్తరీయాణి । విన్నైత్వం నాస్తి మధ్యమే

౩౭౯ విషయము. (వికృ - సంజ్ఞా ౨౩ కారి - అహో ౧౪౩ పు).

కల్పతరువు. ౩౭౯ విష:—ఈకారికకు ౪౩ విషయమున వ్యాఖ్యచేయఁబడెను. "డోలార్థకముగు 'ఉయ్యెల' శబ్దమును, భూషార్థకముగు 'తాయెతు' శబ్దమును, నుత్తరీయార్థకముగు 'పయ్యెద' శబ్దమును దక్కఁ దక్కిన యే సమానపద మధ్యమునందును 'ఎ' కారయుక్త యకారము లేదు." అని ప్రకృతకారిక కర్థము. "ఇయ్యది - యకారము మీఁద అత్వ మెచట నిల్చునో ? ఎత్వ మెచట నిల్చునో?" అను విషయములను వివరించు ప్రసంగమున వచింపఁబడెను. పయిని వ్రాసిన యర్థమునుబట్టి "ఉయ్యెల - పయ్యెద - తాయెతు" అనువాని నడుమ 'ఎ' త్వము గలదని యర్థము లభించుచున్నను వీనిలోని "ఉయ్యెల - పయ్యెద" అనువాని నడుమఁ బాక్షికముగా 'అ' కారము సైతముండిన నుండవచ్చు నను నర్థమునకు బాధ కలుగనేరదు.

ముద్దరాజు రామ నాప్పకవి కవ్యాదుల కథర్వణకారికలు సాకల్యముగా లభింపలేదు గాని మఱికొన్ని కారికలతోపాటుగ నీ ప్రకృతకారికయు లభించుటచేతఁ గావలయు వారిక్రిందిరీతి నీ విషయమునఁ బ్రసంగించిరి. తే. గీ. తాయెతును నుయ్యెలయుఁ బయ్యెదయును దక్కఁ।గలుగ దెత్వంబు మధ్య యకారములకు।... (కవిజనసంజీవ. ౧ తరం. ౧౧౭ ప.) తే-గీ.ధరణి నుయ్యెల పయ్యెద తాయెతులను। గల యకారంబులకు వక్రములు నిజంబు। ముద్దరాజు రాముని వాని మాఁటిని బద। మధ్యయాలని చెప్పె నిమ్మాట మిథ్య. ౧౮౪. తే-గీ. ఊచు నెల కాకగుటచేత నుయ్యెలయ్యెఁ। బయిని నెన కున్కి వక్రోక్తిఁ బయ్యెదయ్యెఁ। తల్లి కాపునకై కట్టఁదగిన సకలు। తేలఁ బల్కఁగఁ దాయెతు ద్రేశ్యమునను. ౧౮౫.(అప్పక.౨ ఆ) పయి సందర్భమునుబట్టి చూడఁగా డోలేత్యాద్యథర్వణకారిక ముద్దరాజు రామనకు మాత్రమె లభింపఁగా నాతఁ డయ్యది యాథర్వణ మని చెప్పక యావిషయమును దాను వచించినట్లుగ నాంధ్రీకరించెననియు నవ్విషయమును రామనయె వచించె నను తలంపున నప్పకవి కూచిమంచి తిమ్మకవి మున్నగువారీ క్రిందిరీతి నద్దానిని విమర్శించిరనియుఁ దోఁచుచున్నది.

ఏలాశబ్దము హేలాశబ్దభవ మనియు నందలి'ఏ'కారము కాకుస్వరమగుటచే హ్రస్వము కాఁగా 'ఎల'శబ్ద మేర్పడె ననియు, "ఊచు+ఎల=ఊయెల = ఉయ్యెల" అనురీతిని రూపసిద్ధి కల్గె ననియు, నక్కారణమున 'ఉయ్యెల' శబ్ద మఖండశబ్దము కామింజేసి యందలి 'ఎత్వము' సమానపద మధ్యగతముగా ముద్దరాజు రామన పల్కుట సరికా దనియు నప్పకవి విమర్శమున కభిప్రాయ మెన్నునది. అట్లె "ఎద+పయి=పయియెద=పయ్యెద=ఎదపై ననఁగా రొమ్ముపై నుండునది"అనురీతి వక్రసమాసమున ననఁగా నుత్తరపదము పూర్వపదముగా నిల్చిన సమాసమున 'పయ్యెద' శబ్ద మేర్పడుటంజేసి యందలి యకారముమీఁది 'ఎ' త్వము సమానపదమధ్యగతమని రామనకవి వచించుట సరికాదని 'పయ్యెద' శబ్దవిషయమఁ జేసిన యప్పకవి విమర్శమున కభిప్రాయము. ఇట్లె తాయి యనఁగాఁ దల్లియనియుఁ దల్లికట్టిన 'ఎత్తు=రక్షాబంధము' "తాయి + ఎత్తు = తాయెత్తు" అని యేర్పడుననియు నందలి "త్తు" అను దానిలోని ద్విత్వము దేలఁగా 'తాయెతు' శబ్ద మేర్పడుననియు నక్కారణమున "తాయెతు" శబ్దగత యకారముమీఁది 'ఎ' త్వము సమానపదగతమని కవిజనసంజీవనీకర్త వచించుట సరికాదనియు నప్పకవి విమర్శమునకుఁ దాత్పర్యము.

పయి మూఁడు స్థలములయందును నప్పకవి చేసిన శబ్దముల విఱుపు సరియే యని తోఁచుచున్నను దావన్మాత్రముచేత నవి సమానపదములు కావని చెప్పుట యుక్తము కాదు. అప్పకవి చెప్పిన 'ఎల' శబ్దముకాని 'ఎతు' శబ్దము కాని పృథక్ ప్రయోగార్హములగు నర్థవచ్ఛబ్దములు కావు. అయ్యవి యే కోశమునందును జూపఁబడ లేదు. 'పయ్యెద' అనుచోటి వక్రసమాసము తెల్గునఁ గేవలము నప్రసిద్ధము మఱియు నచట యకారద్విత్వరూపసిద్ధి సాధువుకాదు. ఇట్టివి వ్యస్తము లన్నచోఁ గృత్తద్ధితాంతాదులును సమానపదములు కా వన వలసి వచ్చుఁ గదా. కృత్తద్ధిత ప్రత్యయములును నొకప్పు డర్థవచ్ఛబ్దములెకదా. మఱియు "ఉయ్యెల=ఉయ్యాల = పయ్యద" మున్నగు 'అకార' మధ్యశబ్దములు మహాకవి ప్రయుక్తములయి వెలయుచుండుటంజేసి పయి పదచ్ఛేదము సరికాదనియు వాని సమాసపదత్వము సమ్మతింపఁదగినదే యనియుఁ జెప్పనగును.

ఇట్లగుటచేతనే యప్పకవి విమర్శము నంతను బరిశీలించినవాఁడేయయ్యు సూరి "ఊయేల-పయ్యెద-తాయెతులం ద్రిక్క నామంబులందు యాకుం దాలవ్యవక్రయోగంబు లేదు" (బా. ప్రకీ. 3 సూ) మున్నగు సూత్రములు నాల్గిటి నుపదేశించెను. అప్రసిద్ధమగు 'ఎల' శబ్దముతోఁ గూడియుండు 'ఉయ్యెల'శబ్దమును విడిచి ప్రసిద్ధమగు 'ఏల' శబ్దముతోఁ గూడియున్న "ఊయేల" శబ్దమును జేర్చి పైరీతిని

సూత్రించెను. "ఏల......వై. వి......౨. బ. శృంగారపుఁ బాట-ఏలలుపాడుచు......" (శ.ర). అని యిట్లు హేలాశబ్దభవముగా నంగీకరించినను 'ఏల' శబ్దమునకు 'పాటలు' అర్థమగుటచేత డోలార్థకమగు 'ఊయేల' శబ్దమునం దద్దానికి సంగతి యసంభవ మని సూరి తలంచి యుండును. పయిరీతి నర్థమువ్రాసియు శబ్దరత్నాకరకర్త "ఊయేల ద్వ-వి. (ఊఁచు+ఏల) ఉయ్యాల" (శ. ర) అని యప్పకవీయపద్ధతి ననుసరించి వ్రాయుట శబ్దరత్నాకరకోశ బహుకర్తృకతా యాథార్థ్యమును వెల్లడించుచున్నది. "వ. హేలాశబ్దమునకు తద్భవము ఏల. అది కుఱుచ కాకు చేయఁగా హ్రస్వముగాఁ బలికిన 'ఎల' అయినది. ఊఁచెడి 'ఎల' కనుక 'ఉయ్యెల' (పదాదిగతమగు 'ఏ' కారము కాకు వగు టేమి? దానికి హ్రస్వమెట్లు) (అప్పక. ౨ ఆ. ౧౮౬) అను నప్పకవీయపు తెలివిడినిబట్టి యీస్థలమునందలి - "హేలా = ఏల = ఎల" శబ్దము విలాసార్థక మని యీపక్షమువారు చెప్పవలసియుండునుగదా. "ఊఁచువట్టిపాటలు" అనునపుడు డోలార్థము సంభవింపనేరదుగదా. కావుననె సూ. రా. నిఘంటుకారులు "ఊయేల" అను శబ్దమునొద్ద 'ఉయాల' మున్నగు పెక్కురూపాంతరములను జూపియు, 'ఉయల్' మొదలగు కర్ణాటశబ్దసామ్యమును, 'ఊచల్ - ఉంచల్' మున్నగు తమిళశబ్దముల పోలికని జూపియు 'ఊఁచు+ఏల' అను ఛేదమును స్వమతముగా వచింపఁజాలక "ఊఁచు+ఏల" అని ప్రాచీనుల వ్యుత్పత్తి" (సూ. రా. ని) అని వ్రాసిరి.

పయిరీతినున్న శబ్దరత్నాకరము నాధారముగాఁగొని బా. గు. ప్ర. కర్త యీ క్రిందిరీతిని వ్రాయుట సరికాదనకతీరదు. "శబ్దరత్నాకరమందు 'ఊయేల' శబ్దమునొద్ద 'ఊఁచు+ఏల' అని యనయవార్థము చూపఁబడినది. ఇట్టి వాస్తవార్థంబును బరిశీలింపక సూరిగారు 'తే గీ. తాయెతును నుయ్యెలయుఁ బయ్యెదయును దక్కఁ । గలుగ దెత్వంబు మధ్య యకారమునకు.' అనిన కవిలోక (జన?) సంజీవని ననుసరించి యేకపదంబులన్న భ్రమమూలంబున నీ సూత్రము రచించె (సూరిగారు రచించె) నని యెఱుంగునది" (బా. గు. ప్ర. ప్రకీ. 3 సూ. వ్యాఖ్య. ౪౫౨ పుట ద్వి. ము).

ఇట్లగుటచేతనే కావలయుఁ గూచిమంచి తిమ్మకవి పయిను దాహరించిన యప్పకవీయాక్షేపము నుపేక్షించి యాశబ్దములు "అకార" మధ్యముగా నయితము మహాకవి ప్రయోగదృష్టము లగుచుండుటం జేసి ముద్దరాజు రామన చెప్పినది సరికాదని మార్గాంతరమున విమర్శించెను. "తే-గీ. తాయెతును నుయ్యెలయుఁ బయ్యెదయను నెడలఁ । గలుగ దత్వంబు మధ్య యకారమునకు । ననుచు మును ముద్దరాజు

రామన వచించెఁ। గాని యత్వంబుఁ గృతులందుఁ గలదు శర్వ (సర్వల. ౧ ఆ. ౧౯౦ ప. 3౬ ఫుట)." అని విమర్శించి "ఉయ్యెల ఉయ్యల, పయ్యెద - పయ్యద" అను ద్వివిధరూపములకును బ్రయోగములను జూపెను. "తాయతు" అను 'అ' కార మధ్యస్థితికిఁ బ్రయోగములు లేవు. "ఉయ్యల - పయ్యద" అను "అకార" మధ్య స్థితి లేదని ముద్దరాజు రామన పద్యమందుఁగాని దానికి మూలమగు నథర్వణుని "ద్వికే" త్యాదికారికయందుఁగాని చెప్పఁబడియుండలేదు. ఈ మూఁడిటియందుఁ దప్ప మఱెచ్చటను మధ్య యకారముపయి 'ఎత్వము' లేదనిమాత్రమె యారెండు వచనములందును వచింపఁబడెను. అంతసూత్రమున మధ్య యకారముపైని 'అత్వ ము' లేదను నర్థము రానేరదు. కావున నీ తిమ్మకవి విమర్శమునకుఁ బ్రసక్తియేలేదు.

ప్రయోగములు:—ఎకారమధ్యతకు-చ-నలుఁడు విమోహార్జులఁ జెనంగి గతాగతకారియైన యు। య్యెలయునుబోలె నూఱడక యెంతయుఁ బ్రొద్దు వినిశ్చి తాత్ముఁడై (ఆర. ౨ ఆ. ౭౯) సీ.........ప, య్యెదలోని గుబ్బ పాలిండ్లు మెఱయ (యయా, సర్వల. ౧ ఆ. ౧౯3 ప). ఎ గీ. ఇమ్ముగా మేల్పసింపి తాయెతులు మొల్ల। విరిసరుల్ దట్టముగఁ జుట్టి కెసిఁట్టు (౧ సి. ౧ ఆ. ౪. ౧). అత్వమధ్యతకు:—సీ. ఔఁదలఁ జదలేటి లేఁదరఁగలు జాలుఁ, దగుచందమామ నుయ్యాల లూఁచ(హరి. పూ. ౬ ఆ. 3౮ ౪. ౮). ౬....ఉ। య్యలనూఁపుచుఁ జెనుపఁ దొడఁగె నా వరశిశువున్ (కళా. ౬ ఆ. ౧౯3). సీ. యాన వేగమునఁ బయ్యద కొంగు సడలిన.........(షో. ౮ ఆ. ౪. ౮). తాయి శబ్ద మే ప్రాచీనకావ్యములందుఁ జూపట్టదు.

ఊయేల - పయ్యెద - తాయెతులం ద్రిక్క నామంబు
లందు యాకుం దాలవ్య వక్రయోగంబు లేదు. 3.

స్పష్టము.

ఊయేల-యూ యాలల చాపుల నొండొంటికిం గుఱుచ
యొండె నగు. ౪.

బాలవ్యాకరణ ఉయెల - ఊయెల - ఊయేల. ఉయాల - ఊయల -
వివరణము. ఊయాల - వక్ష్యమాణంబు యద్విత్వంబు-ఉయ్యేల -
3౭౯ I విష. ఉయ్యెల - ఉయ్యాల - ఉయ్యల.

పయ్యెద - పయ్యద. ౫.

ఊయేలాదులం దొలియచ్చు మీఁది హల్లునకు ద్విర్వ
చనం బొండె నగు. ౬.

ఉయ్యేల - ఊయేల. ఊయేల - ఊయెల - ఊయాల

ఊయల - ఆయె - ఏలిదము - ఓయు - ఓయా
రము - కోపు (ధనురగ్రము) - జాజర - తీనియ -
తీయము - తేప (ప్లవము) తేయు - తోయలి - దీవియ -
నూవు - నోవి - నోపు - పూవు - పేయు - మోక (అంకు
రము) మోటిక - మోవు - వీయము. ఇత్యాదు లూ
యేలాదులు.

సంజీవని. 32౯ 1 విష:— 3 సూ. వ్యా:—ఈసూత్రము విషయమున నప్పకవి, కూచిమంచి తిమ్మకవి చేసిన యాక్షేపములు 32౯ విషయమునఁ గల్పతరువులో విమర్శితము లయ్యెను.

త్రిక్కణ = తక్కన్. "త్రిక్క[2] = తక్క. అవ్య - ద్ర. (√ త్రిక్క) విసార్థకము." (సూ. రా. ని). "ఏ దైతోః కంఠతాలు" (సి. కౌ. ౧౦ సూ. విసృతి). అనుచోప్పున 'ఏ'కారము తాలవ్య మనఁదగును. "ఎ ఏ ఒ ఓలు వక్రములు" (బా. సంజ్ఞా. ౨ సూ. వివరణము). అనుచోప్పున ఎ - ఏ - లకు వక్రసంజ్ఞగలదు. కావునఁ దాలవ్యవక్రము లనఁగా "ఎ - ఏ"లు. ఊయేలశబ్దమె 'ఉయ్యేల' మున్నగువానికి మూలమగుటంజేసి యయ్యదియె యిందు గ్రహింపఁబడెను. అచ్ఛాంధ్రభాషాగత ప్రాతిపదికములలో "ఊయేల - పయ్యెద - తాయెతు" అను నీమూఁటియందుమాత్రమె శబ్దమధ్యగత యకారముపైని 'ఎ - ఏ'లు నిల్చుట గలదనియు మఱే యేప్రాతిపదికమునందును మధ్యయకారముపైని 'ఎ - ఏ'లు నిల్చుట లేదనియు సూత్రార్థము. 'స్పష్టము' అనఁగా నీసూత్రము నర్థము స్పష్టము గాన దీనికి వేఱుగ వివరణమును దాను వ్రాయ లేదని యర్థము. 'ఊయేల-పయ్యెద' అనువాని రూపాంతరములను వివరింపఁదలఁచి సూరి వీనిలోని 'ఎత్వము' మొదటి రూపమని విశదపఱచుట్కై పై యథర్వణసూత్రము నిట్లు ముందుగా వివరించెను.

ర సూ. వ్యాఖ్య:—ఒండొంటికి = ఒకొక్కటికి. కుఱుచ = హ్రస్వము. ఒండె = వికల్పముగా. 'ఊయేల - ఊయాల' అను రెండుశబ్దములందును నొక్కొక్క దీర్ఘమున కొకొక్కసారి హ్రస్వమగునని యర్థము. "ఉయెల - ఉయల" అనురీతిని రెండు దీర్ఘములకును నొక్కసారి హ్రస్వము కానేరదని తాత్పర్యము. ఉదా:—ఉయేల. (మొదటి దీర్ఘమునకు హ్రస్వమువచ్చెను). ఊయెల (ద్వితీయాక్షరదీర్ఘము కుఱుచ యయ్యెను). ఊయేల (ఒకదానికిని హ్రస్వము కాలేదు. ఇట్లె 'ఊయాల' శబ్దమునకును రూపత్రయము నుదాహరించుచున్నాఁడు:—ఉయాల - ఊయల - ఊయాల. "వక్ష్యమాణంబు యద్వి

త్వంబు" అనఁగా బా. ప్రకీ. ౬ సూత్రముచొప్పున "ఊయేల - ఊయొల, ఉయాల-
ఊయల" అను నాల్గుశబ్దములందును ద్వితీయాక్షరములోని 'య' కారమునకు
ద్విత్వము గల్గఁగా. బా. సమా. ౧౩ సూత్రముచొప్పున ద్విత్వపూర్వదీర్ఘమునకు
హ్రస్వముకల్గుటచేత వరుసగా 'ఉయ్యేల - ఉయ్యెల - ఉయ్యాల - ఉయ్యల'
అను నాల్గురూపములును సిద్ధించును బా. ప్రకీ. ౬ సూత్రముచేఁ గల్గు ద్విత్వము
పాక్షిక మగుటంజేసి ద్విత్వాభావపక్షమున 'ఊయేల - ఊయెల - ఊయాల -
ఊయల'అను నాల్గురూపములును యథాస్థితముగ నిల్చును. ద్విత్వప్రసక్తియేలేని
'ఉయేల - ఉయాల' అను రెండును యథాస్థితముగనె నిల్చును. ఈరెండు శబ్దం
బులును బా. ప్రకీ. ౬ సూత్రమునందలి "ఊయేలా"దిగణమునఁ బఠింపఁబడలేదు
గాన వీనిలోని ద్వితీయహల్లునకు ద్విత్వప్రసక్తి లేదయ్యెను. ఇట్లివి పదివిధముల
రూపము లేర్పడును. ఈ పదిరూపములును గోశద్వయమునందును జూపఁబడినవి.
వీనిలో నాలిటికిమాత్రమె సూ. రా. నిఘంటువునందుఁ బ్రయోగములు చూపఁ
బడెను. 'ఉయేల-ఉయ్యల - ఊయేల-ఊయల-ఊయాల' అను నైదిటికిని బ్రయో
గములు చూపఁబడలేదు. తక్కిన యైదిటికిఁజూపిన ప్రయోగములలో నొకటి
భారతప్రయోగము. మఱొకటి హరివంశప్రయోగము. ఉయ్యాల. సీ. నిలువు
టద్దములు గంటల యుయ్యాలలు హంసతూలికపాన్పులు దోమతెరలు. (షోడశ.
కుమారచరిత్రము. 3 ఆ. శ. ర) ఇందు "గంటల యుయ్యేలలు - గంటల యుయ్యె
లలు - గంటల యుయ్యలలు" అను వానిలో నేది కవి ప్రయుక్తమున్నను క్షతి
కానరాదు. ఉయ్యల:—గీ. అనుపమంబగు పసిఁడి యుయ్యలఁ గుమారు। నునిచి
(పద్మ. ౧౦ ఆ ౫౯). క.........ఉ। య్యల నూఁపుచుఁ బెనుపఁ దొడఁగె నా
వరశిశువున్. (శా. ౬ ఆ. ౧౯౩). (సూ. రా. ని) ఈరెండుప్రయోగములందును
'ఉయ్యల' అనుచోట 'ఊయల'అని కవిప్రయుక్తమున్నను ననవచ్చును.
ఉయ్యెల:— చ.........గతాగతకారియైన యు। య్యెలయునుబోలె నూఱ
డక యెంతయుఁ బ్రొద్దు......(భార. అర. ౨ ఆ. ౭౮). ఇందును "ఊయెలయును
బోలె"అని కవిప్రయుక్తమున్నను బాధలేదు. ఉయ్యాల:— సీ. పొదలఁ జదలేటి
లేఁదరఁగలు బాలుఁ డగు చందమామను నుయ్యాల లూఁప (హరి. పూ. ౬ ఆ. ౩౮).
ఇందును "ఊయాల - ఉయాల"అను వానిలో నేది కవి ప్రయుక్తమున్నను నన
వచ్చును. ఇట్లె దీని యితరప్రయోగములును బరివృత్తిసహములె యైయున్నవి.
ఊయెల:— గీ......మంచి। సేయుటకుఁ బంపు సపరించి యూయెలలును (అచ్చ.
రా. అరణ్య. ౫౯ ప.) ఇందును 'ఊయల' అని కవిప్రయుక్తమున్నను క్షతిలేదు.

౫ సూ. వ్యా:—'పయ్యెద' అనుదానికి 'పయ్యద' అనియు రూపాంతరము కవిప్రయోగ దృష్టమగుచున్నదని తాత్పర్యము. తాలవ్య యకారమువిూఁది "ఎత్వము"చోట "అత్వ" ముచ్చారణ సౌలభ్యాపేక్షచే సుసంభవ మగుచుండు ననుటకుఁ బూర్వసూత్రములోని "ఊయాల"ది శబ్దములును బ్రకృతసూత్రము లోని "పయ్యద"శబ్దమును నిదర్శనములగుచున్నవి. పయ్యద. సీ. యానవేగమునఁ బయ్యదకొంగు సడలిన............(షోడశ కుమారచరిత్రము. ౮. ఆ. శ. ర) పయ్యెద:— సీ..............బలుఁగు ప। య్యెదలోన గుబ్బపాలిండ్లు మెఱయఁ (యయాతి చరిత్ర. ౧ ఆ. ౧౯3).

౬ సూ. వ్యాఖ్య:—ఊయేల మొదలగు నాచ్ఛికశబ్దంబుల ద్వితీయాక్షర మందలి హల్లునకు ద్విర్వచన మనఁగా ద్విత్వము వైకల్పికముగా (ఉండెడి వికల్పార్థకము) నగును. తొలియచ్చువిూఁది హల్లున కనుటచేతఁ బదాదివర్ణ ముచ్చైనను (ఊయేల = ఉయ్యల) హల్లైనను (కోపు = కొప్పు) నీవిధి వర్తిల్లు నని విశదమగు చున్నది. 'ఊయేల - ఊయెల - ఊయాల - ఊయల' అనువాని యుదాహృతు లును వానిప్రయోగములును నీవఱకుఁ బ్రదర్శితములయ్యెను. (3౭౯ I విష. ర సూ. వ్యాఖ్య). ఆయె:—ఇది "అగు = అవు" ధాతువుయొక్క భూతార్థక ప్రథమ పురుషైకవచనము. 'అవు+డుఁజ్' అనుచో. బా. క్రియా. ౧౬ సూ. చొప్పున లిట్టు డుఁజ్జున కెను వర్ణకము రాఁగా 'అవు+ఎను' అని యగును. బా. క్రియా. ౯౯ సూత్రముచొప్పున నవు ధాతువు తుది వర్ణమునకు యకారా దేశము కాఁగా "అయు+ఎను అయెను" అని యగును. బా. క్రియా. ౧౦౦ సూ. చొప్పున 'అయెను' అనుచోటి 'అ'కారమునకు దీర్ఘము కలుగఁగా "ఆయెను" అగును. ప్రకృతసూత్రముచేత నందలి 'యె' అనునది పాక్షికముగా ద్విరుక్త మగుటయు నట్టియెడల బా. సమా. ౧3 సూత్రముచేత ద్విత్వపరక దీర్ఘము హ్రస్వమగుటయు సంభవింపఁగా "అయ్యెను" అనురూప మేర్పడును. ద్విత్వాభావపక్షమున యథాస్థితముగ "ఆయెను" అనురూపమే నిల్చియుండును. ప్రకృత సూత్రపు గణమున 'ఆయెను' అని పఠింపక "ఆయె "అని పఠించుటచేత బా. క్రియా. ౨3 సూత్రముచొప్పున వచ్చు 'ఎన-ఎడున్-ఎడిన్' అనునవి పరమగు నపు డేర్పడెడి 'ఆయెదను - ఆయెడును - ఆయెడిని' అను రూపములందును, బా. క్రి. ౪౪ సూత్రముచొప్పున వచ్చెడి 'ఎడు - ఎడి' అనునవి పరమగునపు డేర్పడెడి "ఆయెడు-ఆయెడి" అను త్రర్థక విశేషణములందును గల "ఆయె" అను పూర్వభాగ ముక్త మగుటంజేసి యట్టి యెడలను దొలియచ్చువిూఁది హల్లగు 'యె'

అనుదానికి వైకల్పిక ద్విత్వమును బా. సమా. ౧౩ సూత్రము చొప్పున దీర్ఘము
నకు ముందటి దీర్ఘమునకు హ్రస్వమును రాఁగా. "ఆయొదను - అయ్యోదను
ఆయొదము - అయ్యోదము." మున్నగు రూపములును 'ఆయొడున్ - అయ్యోడున్.
ఆయొడిన్ = అయ్యోడిన్.' మున్నగురూపములును 'ఆయొడువాఁడు = అయ్యోడు
వాఁడు. ఆయొడివాఁడు - అయ్యోడివాఁడు.' మున్నగు రూపములును సిద్ధిం
చును. (చూడుఁ. ౩౪౦ విష). క. అయ్యోడ ఖేచరులకు వెఱఁ । గయ్యోడు
చందమున నట్టి యవసరమున బల్ । కయ్యమును గురుని బలముతో । నయ్యో
యుధిష్ఠురు బహోచ్చయంబున కధిపా. (ద్రోణ. ౩ ఆ. ౨౩౭). చ......అనంతుఁడు
మాకుఁ బ్రసన్నుఁ డయ్యోడున్ '(ఆది. ౧ ఆ. ౧౦౫-౧౦౬-౧౦౭). మొ. 'ఎలి
దము' = (చులుకఁదనము) అనుచోఁ దొలియచ్చుమీఁది హల్లగు లకారమునకు
బాహుళిక ద్విత్వము కలుగఁగా బా. సమా. ౧౩ సూత్రముచేత ద్విత్వపరకదీర్ఘము
నకు హ్రస్వము కల్గుటచేత "ఏలిదము = (ఏల్లిదము) = ఎల్లిదము" అను రూపద్వ
యము సిద్ధించును. ఇట్లె తక్కిన యన్ని యుదాహృతులందును బ్రక్రియ నరయునది.
క. బాలుఁడని నమ్మి రిపుతో । నేలిదమునఁ గలసి యునికి యిది కార్యమె ......
(ఆది. ౬ ఆ. ౧౧౬. ప.) గీ. ఎల్లిదంబుగఁ దలఁచుచు నిట్టులనియె. (విరా. ౫
ఆ. ౩౧౭. సూ. రా. ని) సూ. రా. నిఘంటువునఁ బెక్కు ప్రయోగములు
చూఁపఁబడెను గాని ల ద్విత్వము ప్రాసఘటితముగా నొక్కటనైన లభింపదయ్యె.
'ఓయు' శబ్ద మే కోశమునందును గానరాదు. కాని "ఓయన = ఒయ్యన = ఒయ్య"
అనుశబ్దములుమాత్రము "శ-ర, సూ. రా." నిఘంటువులు రెంటను జూపఁబడినవి.
"ఓయన = ఒయ్యన - అవ్య - ద్రు. తిన్నగా - ఋజువుగా - క. ఈ యగ్ని దేవుఁ డసు
రకు । నోయనఁ జెప్పుటయు విని మహోగ్రాకృతితో । ......(ఆది. ౧ ఆ. ౧౩౩)
ఒయ్య=మెల్లఁగా. గీ. ఒయ్యఁ దలయంపి దిక్కున నొదిగి యుండె (హరి. ఉ. ౨ ఆ.
౧౩౬). ఒయ్యన = మెల్లగా. క.......బలంబే । ర్పడ విల్లు వంప నోపక । యుడిగిరి
నృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్. (ఆది. ౭ ఆ. ౧౭౫). ఓయారము=ఒయ్యా
రము=విలాసము. క. ఆయంగన క్రేఁగన్నుల । యొయ్యారపుఁ గలికి చూపు టురులం
బడినన్. (విక్ర. ౫ ఆ. ౧౭౦.) (సూ. రా. ని). సీ. హారముల్ మెఱయ నొయ్యా
రంబులుగ గ్రుచ్చి ...... (విరా. ౧ ఆ. ౧౦౭). కోపు = కొప్పు = ధనురగ్రము.
జాజర = జజ్జర = మోసము=వంచన. తీనియ = తిన్నియ = వేదిక=అరుగు. తేప = తెప్ప=
ప్లవము. క. ఆపత్సముద్రమగ్నుం । బై పోయెడు నస్మదన్వయము పెంపెసఁగన్ ।
తేప యయి కడవఁబెట్టిన । నీ పుణ్యచరిత్ర కీర్తనీయము తల్లీ (అర. ౭ ఆ. ౨౭౩)

ఉ. కోపము సంహరింపు యదుకుంజర పాండవకోటి కెల్లనుం। దేపవు గావె (భీష్మ. ౨ ఆ. ౧౬౦) తేమ = తెమ్మ = ఆర్ద్రిత = తడి. తోయలి = తొయ్యలి = స్త్రీ = ఆఁడుది. దీవియ = దివ్వియ = దీపము. నూవు = నువ్వు = తిలసస్యము. క. నూవుం బువ్వును సంపెగ। పూవు గెలిచి......(శశిబిందుచరిత్రము. శ-ర). నోవి = నొవ్వి = నొప్పి = వేదన. ఉ. త్రెవ్వెడు గంటులం గురువు దేరెడు నెత్తురు రాకమున్న నే। నొవ్వియు నేవికారము మనోగతిఁ జెందకమున్న......(భాస్కర. రా. యుద్ధ. ౨౧౪౫ ప). నోవు=నొవ్వు = వేదన = బాధ. క. చావును నోవును మనయా। థావళికిన్...... (భీష్మ ౨ ఆ. ౧౯౯) పూవు = పువ్వు = పుష్పము. పేయ = పెయ్య = పశువత్సము దూడ. మోక = మొక్క = అంకురము=మొలక. మోటిక = మొట్టిక = "మొటిక = దే. వి. ౧ మొలక......" (శ-ర). మోవు = మొవ్వు = "తాటిచెట్టు లోనగువానియందు పుట్టెడు ముదుత పీడని లేఁత ఆకు మొలక." (శ-ర). వీయము = వియ్యము = "వైవాహికసంబంధము" (శ. ర). ఊయేలాదిక మాకృతిగణము.

ఆకారంబు క్రింది అకారంబునకుం దుది నులుల క్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు. ౭.
అక్కటాదుల జడ్డకు లోపంబు విభాష నగు. ౮.
జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. ౯.

బాలవ్యాకరణ వివరణము.

హాదులయు నీలుగులోనగువాని తొలి హల్లునకు లోపంబు బహుళంబుగ నగు. ౧౦.

౩౮౦ విషయము.

ఆరాటాదులం బ్రథమేతర దీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు. ౧౧.
ఆరాటము - ఆరటము. ఆరాటము - కహ్వాళితి - కేళాహాళి - కొమారుఁడు - కొమారిత - గంబారము - పెండారము - బంగారము - ఓయారము - వీటతాటము - సంతోసము.

సంజీవని. ౩౮౦ విష:—వీనిలో ౭-౮-౯ సూత్రములకు ౨౧౦ V విషయమున వ్యాఖ్య చేయఁబడెను. ౧౦ సూత్రమునకు ౨౧౦ VII విషయమున వ్యాఖ్య చేయఁబడెను.

౧౧ సూ. వ్యాఖ్య:—ఆరాటము మొదలగు నాచ్ఛిక శబ్దముల ప్రథమేతర దీర్ఘంబున కనఁగాఁ దొలియచ్చు తప్పఁ దక్కిన యచ్చుల దీర్ఘమునకు వైకల్పిక

ముగా హ్రస్వం బగునని యర్థము. ఉదా:—ఆరాటము = అరటము=పరితాపము-సంతాపము. తే-గీ. ఎగ్గతంబునఁ దాను గారగ్గిఁ గాలె। నటు యనాథయై దీనికి నంత రంగ। మలదురక తల్లడిల్లక యారటమున। సుడుక కలయుటఁ బడక యొట్లుండుఁ జెప్పుమ. (ఆశ్వ. ౨ ఆ. ౧౬3). క......। ఆరాటమెట్టు మానెను। ఘోరాటవి లోన భద్రకుంజరమునకున్. (భాగ. ౮ సం. ౧౯). 'అరట' అని రూపాంతరమును గలదు. ప్రథమేతరదీర్ఘము లొక శబ్దమున నేకాధికము లున్నచో నన్నిటికినిగాని పర్యాయముగాఁగాని హ్రస్వము వచ్చును. కేళాకూళి=కేళకుళి = కేళాకుళి = కేళకూళి. శబ్దరత్నాకరమున "కేళాకుళి" అను రూపము చూపఁబడలేదు. సూ. రా. నిఘంటువున నదియుఁ జూపఁబడెను. బా. ప్రకీ. ౧౨ సూత్రముచొప్పున వీని తొలి దీర్ఘమునకును హ్రస్వము రాఁగా "కెళకుళి - కెళాకుళి - కెళాకూళి" అను రూపములు ప్రయోగదృష్టము లగుచున్నవని శబ్దరత్నాకరమునను, సూ. రా. నిఘంటువునను జూపఁబడెను. సూరి వీనిలోని కెళాకూళిశబ్దమును మాత్రమె యుత్తర సూత్రమునఁ జూపెను. ఇవెల్ల "ఖేలాకూలమ్" అను సంస్కృత శబ్దమునుండి జనించినవని శబ్దరత్నాకరమునందును వైకృతదీపికయందును వ్రాయఁబడెను. సూ. రా. నిఘంటువున నివి సంస్కృతభవములుగఁ జూపఁబడలేదు. ఇంక దేశ్యములుగఁ జూపఁబడినవి. ఈ శబ్దములకు "క్రీడా సరస్సు" అని యర్థము. "ఖేల. సం. వి. ఆ. స్త్రీ. క్రీడ - ఆట" అనియు "కూలము. సం. వి. అ. న.........3 తటాకము - చెఱువు" అనియు సూ. రా. నిఘంటువున నుదాహరింపఁబడి యున్నవి. వీనిని వైకృతము లనుటకుమాత్ర మీకోశకర్త లంగీకరింపరైరి. సీ. కుక్కుటేశ్వరు కేళకూళి నుద్భవమైన మణికర్ణిక నొనర్చి మజ్జనంబు (భీమ. 3 ఆ. ౧౮౯ సూ. రా. ని). తే-గీ. తావితమ్మి కెళాకూళి దండ నొప్పు। గొప్ప పన్నీటికాల్వకు నుప్పరిగకు। నతుల జలసూత్ర మిడినట్టి యద్భుతంబుఁ। గాంచి రాజన్యమూర్ధన్యకన్యఁ బొగడె (రాజవాహనవిజయము. 3 ఆ. ౮౧ సూ. రా. ని) శా. అకప్రంపు టనంటి మూఁక నడిచాయన్ మించు పన్నీటి కే। ళాకుళిం దిలకించి......(ఉ. రా ౪ ఆ. ౧౬౬ సూ. రా. ని). విస్తరభీతిని వీనియన్నింటి ప్రయోగములను గోశములనుండి యెత్తి చూపలేదు. కక్కూటితి = కక్కుటితి = లోభము. శబ్దరత్నాకరమున "కక్కూటితి" అను దీర్ఘఘటితరూపమే చూపఁబడలేదు. "క. వల దిటువలెఁ గక్కూటితి। పలుకులు పలుకంగ...(సారం. ౨ ఆ. ౧౯౯.) ద్వి. కడుపు కక్కూర్తికిఁ గర్మకాండంబు। .........(ప్రభులిం. ౧-౫-పొరట. ౨౧ కం.)........." (సూ.రా. ని). క. పాండొందని పలుకులు పలు। కం దగునే యోడి యకట కక్కుటితి మొఱిన్,

(హరి. 3 ఆ. ౨౩౭). చ. కిఱుకులఁ బెట్టి పీఁకి నడకించి తోలంగెద మన్న నట్టి క | కక్కుఱితియు కాని దైవ మనుకూలము గాదు. (జై. భా. ౬ ఆ. ౨౩౪). కొమారుఁడు = కొమరుఁడు=కొడుకు. కొమారిత = కొమరిత. గీ.........అతను కాగాచమైన | రాచకొమరితఁ బాంచాలిఁ జూచునపుడు | (పాంచా. ౨ ఆ. 3౧). గంబూరము = గంబురము=కర్పూరము. (గంబుర - గంబురా - గంబూర అనియు రూపాంతరములు గలవు). సీ. మొత్తమె కూరు తాయత్తమె గంబూర; మెగయు.........(వసు. ౧ ఆ. ౧౪౧ (సూ. రా. ని). ఉ.........తెలిగంబుర వెన్నెలలోని తేట యొ | య్యారపుఁ దొకి...........కులకాంత............ (శుక. ౧ ఆ ౯౪. సూ. రా. ని). పెండారము = పెండరము = అందె - (గండ పెండారము). సీ. కడుమించు డాకాలి గండపెండారంబు......... (య. ౪ ఆ.) సీ. పాసఁగ నొదలల హొన్నొబ్బిడికంబులు పూని డాకాల గండపెండర మమర్చి (అచ్చ. రా. యుద్ధ) (శ. ర) (గండపెండెరము - గండపెండేరము - గండపెడెము - గండపెండియము - రూపాంతరములు గలవు.) సీ. బిరుదైన గండపెండేరంబునకు నీవె తగుదని తాన పాదమునఁ దొడిగె (అల్లసాని పెద్దన చాటువు). బంగారము = బంగరము. (రూ - బంగారు - బంగరు - బంగరువు). బేహారము = బేహారము = (వ్యవహార శబ్దభవము.) వాణిజ్యము. ఉత్తరసూత్రముచేఁ బదాది దీర్ఘమునకు హ్రస్వము రాఁగా - బెహారము. (రూ. బేరము). ఎ-గీ. అధిప కృషి సేయుటయును బేహార మాడు | టయును గోరక్ష గావించుటయును మొదలు | గాఁగ బ్రదికెడు తెరువులు గాసి గావె (భార. శాంతి. ౨ ఆ. శ. ర). క. పెక్కండ్రొక్కటియై తా | రొక్క బెహారంబు నాడుచుండఁగ.........(విజ్ఞా. ప్ర. కాం. శ. ర). వీటతాటము = వీటతటము - తాఱుమాఱు. సీ. కేతనంబుల వీటతాటంబుచేసి (కర్ణ. ౧ ఆ. శ. ర). ఉత్తరసూత్రముచేఁ బదాదిదీర్ఘము హ్రస్వము కాఁగా - విటతాటము = విటతటము. (రూ. వీటతాటనము - విటతాటనము) సీ. మండిత ధ్వజదండమండలంబులు గిట్టి విటతాటనంబుగ విఱిచి విఱిచి (భార. విరా. ౫ ఆ). సీ. తరువు లెల్లెడ విటతాటంబులై కూలె (భాగ. 3 స్కం." (శ. ర). ("మామిడులు విటతటముగా కాచిన"వను వాడుక యీ ప్రాంతమునఁ గలదు. సంతోసము = సంతోసము. ఆరాటాదు లాకృతిగణము.

ఓయారాదులం దొలి దీర్ఘంబునకు హ్రస్వంబు

బాలవ్యాకరణ విభాషనగు. ౧౨.

వివరణము. ఓయారము - ఒయారము. ఓయారము - కేళాకూళి-

3౮౧ విమ. కోలె - గూడారము - గోరువంకపక్షి - జోహారు -

నీలుగు - పేఁడ - జేహారము - (దీర్ఘమధ్యంబు)
మూఁఱు - మూలుగు - మోఁఱకు - వీటలాటము - వీడి
యము - ఇత్యాదులు.

సంజీవని. ౩౮౧ విష:—ఓయారము మున్నగు నాచ్ఛికశబ్దముల శబ్దాది దీర్ఘమునకు వైకల్పికముగా హ్రస్వం బగును. పేఁడ శబ్దాదిదీర్ఘము హ్రస్వము కాఁగాఁ బదాదిహ్రస్వముమీఁద ఖండబిందు వుండనేరదు గాన నది పూర్ణముగాఁ బరిణమించును. పేఁడ = పె+ఁ+డ = పెండ = పశువుల మలము.

ఓయారము = ఒయారము = విలాసము - (రూ. ఒయ్యారము. బా. ప్రకీ. ౬ సూత్రముచే యాకు ద్విత్వమును బా. సమా. ౧౩ సూత్రముచే 'ఓ' అను దానికి హ్రస్వమును వచ్చును). సీ. హారముల్ మెఱయ నొయ్యారంబులుగ గ్రుచ్చి యందంద వింతగా నలవరించు. (విరా. ౧ ఆ. ౧౦౭. ఒయ్యారంబులుగ = మనోజ్ఞముగ). క. ఆయంగన క్రేఁగన్నుల । యోయారపుఁ గలికి చూపు టురులం బడినన్.........(విక్ర. ౫ ఆ. ౧౭౧. సూ. రా. ని). కేళాకూళి = కెళాకూళి = క్రీడాసరస్సు. దీని రూపాంతరములు ప్రయోగములును బూర్వసూత్రమునఁ జూపఁబడెను. కోలె = కొలె. "కొలె = కోలె. అవ్య. ద్రు. మొదలుకొని. శా.........ఆ । రామక్షోణికిఁ జన్న నాఁటఁ గోలె నిద్రాసౌఖ్యముల్ మానినాఁ । డేమో యంచు.........(వసు. ౪ ఆ. ౭౬). సీ. జనసుత దానివత్సంబు సిన్నటఁ గోలె నుడుగక యఱచుచు (ఆసి. ౮. ఆ. ౧౧౮) గూడారము = గుడారము. (రూ - గూడారు - గుడారు) = పట కుటీరము. బట్టతో నేర్పఱిచినయిల్లు. మ.........దంష్ట్రాంకు రా । గ్రమునన్ ధారుణి యొంటి కంబము గుడారంబై తగన్.........(చంద్రా. ౧ ఆ. ౭౬). ద్విపద. గూడారములు దెరల్ గొల్లెన ల్వన్ని । వేలముల్ దప్పక విడిసె నుత్సుకత । (పండితా. పర్వ. ౩౫౦. పా. నన్ని కు. ౧౧-౬౦౦. సూ. రా. ని). గోరువంకపక్షి = గొరువంకపక్షి = శారిక = గోర = గోరంకువు శబ్దభవము. (రూ - గోరంక - గోర. గోర్వంక - గోరవంక - గొరవంక. సూ. రా. ని). అప్పకవి దీనిని శకటయుక్తమనుట చింత్యమని తిమ్మకవి నిరసించెను. క. గొరువంక యాసమూటల । మరువంకఁ దలంపు గలిగె......(విక్ర. ౭ ఆ. ౪౯. యయా. ౨ ఆ. ౨౪). మ. శరసంధానము......... । గొరువంకల్ మొఱపెట్టి నట్లు గుణముల్ ఘోషింప.........(మను. ౪ ఆ.) జోహారు = జొహారు = నమస్కారము. (రూ - జొహారువు - జోహారువు). గీ. ధనపతి భ్రాతృకుల దేవ తకు జొహారు । నత మృడాదిక సుమనసకు నమస్సు (ఆము. ౬ ఆ. ౯౯

సూ. రా. ని). సీ. జోహారు మదగజ ద్రోహాగ్ర హావహ గ్రాహచ్ఛిదాహవోత్సాహ నీకు (ఉ. రా. ౧ ఆ. ౩౭౨. సూ. రా. ని). నీలుగు = నిలుగు = ఒడలు విఱుచుకొను—చచ్చు. క. అనిల సుతుం డంతన మే। ల్కని నీల్గుచు నతని వజ్రఘనకాయముఁ బొం। దిన లతికాజాలము లె। ల్లను ద్రెస్సె మృణాలబాలలతికలు వోలెన్. (ఆది. ౫ ఆ. ౧౭౨). క. బలదేవు మేను సోఁకిన। వెలిమిడిచే వేకి సఱచి విటతాటముగా। నిలుగుటతో ములుగుటతో। నలముటతో నావులింత లంతంతకుఁగాన్. (ఉ. హరి. ౬ ఆ. ౭౭). "పేఁడ = పెండ = గోమయము. (రూ - పెండ)" (శ. ర) బేహారము = బెహారము=వాణిజ్యము. 'బేహారము' అను దాని మొదటి దీర్ఘమునకు హ్రస్వము రారాదని చూపుట కీయోయూరాదిగణము లో నిది 'దీర్ఘమధ్యంబు' అని సూరి వివరించెను. బేహారము మున్నగు రూపాంతరములును ప్రయోగములును బూర్వసూత్రపు వ్యాఖ్యలోఁ జూపఁబడెను. మాఱు = మఱు = తడవ. "మఱు దే-వి. ప్రతియందు మఱుగు - మఱుప - మారు శబ్దముల కాదేశరూపము (మఱునాఁడు - మఱువాఁడు - మఱుమాట. మొ). మ. గదతోడన్ గదచుట్టి రాఁదిగుచుచున్ గండొప్ప లంఘించి మా। ఱు దెసన్ గైకొనుచున్ గడంగి పలుమాఱున్ వ్రేఁకుచున్. (శల్య. ౨ ఆ. శ. ర)." క.........పాండుతనయుల బల మే। ర్తెఱ తఱుఁగక పెనఁగుట పలు। మఱు చూడెద వకట! యేమి మాయయొ తలఁపన్. (భీష్మ ౩ ఆ. శ. ర). "మూలుగు = ములుగు = "నొప్పివలని బాధచే నొకవిధముగా ధ్వనించు............"(శ. ర). నిలుగు శబ్దోదాహరణ సందర్భమున "నిలుగుటతో ములుగుటతో" అను ప్రయోగము మీఁదఁ జూపఁబడెను. "మోఱకు = మొఱకు = మూర్ఖుఁడు - (మూర్ఖశబ్దభవము - రూ - మోఱకుఁడు - మొఱకుఁడు). ఉ.........పెన్। మోఱకు భంగి మాంసములు మెక్కినబంటిగ మ్రింగుచుండ" (భో. ౧ ఆ. శ. ర). వీట తాటము = విటతాటము = తాఱుమాఱు. దీని రూపాంతరములును ప్రయోగములును బూర్వసూత్రమునఁ జూపఁబడెను. వీడియము = విడియము = తాంబూలము. (రూ - విడెము - వీడ్యము - విడియ. వీటికాశబ్దభవము). ఓయూరాదికమును నాకృతిగణమె.

ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు. ౧౫.

బాలవ్యాకరణ

వివరణము.

శిలా విషయము.

ఏఁతము = ఏఁతాము. ఏతము - కళ్ళము - గాలము - గుడ్డము - గోణము - గోతము - జూజము-జొంజము -

జోతము - తణగము బొండ్లము - మండము - లా
తము - పీణము - ఇత్యాదులు.

సంజీవని. తరాజి పద:— ఏతము మున్నగు శబ్దములలోని ముపర్ణకమునకు ముందటి 'అ' కారము వైకల్పికముగా దీర్ఘంబగును. ఉదా:— "ఏఁతము = ఏఁతాము = తలుఁము = యన్త్రమ్" (వై. దీ). యన్త్రశబ్దభవ మనుట విశ్వసనీయమై యుండుటచే నిందు ఖండబిందుస్థితి యంగీకరింపఁదగును. అట్లయినను సూరి దీనిని నిర్బిందుకముగా నుదాహరించెను. వైకృతదీపికా శబ్దరత్నాకరము లేక కర్తృకములె గ్గైనను శబ్దరత్నాకరమున నిది నిర్బిందుకముగాఁ బ్రమాదమునఁ బడియున్న (ఏతము - ఉభ - వై. వి......ఆరఘట్టము. శ-ర.) దీనిఁబట్టియు సూరి దీనిని నిర్బిందుకముగా నుదాహరించుటనుబట్టియుఁ దర్వాతి వైయాకరణులెల్ల దీనిని నిర్బిందుకముగానె యుదాహరించిరి. సూ. రా. నిఘంటు కర్తలు దీనిని యంత్రశబ్దభవమని యుదాహరించియు నిర్బిందుకముగా వ్రాయుట వింతగా నున్నది "ఏతము= ఏతాము - వి. (సం. యన్త్రమ్)......" (సూ. రా. ని). శబ్దతత్త్వశాస్త్రజ్ఞుల మనుచుఁ గొందఱు దీనిని సంబంధించిన శబ్దములు తమిళకన్నడాదులలో వెలయుచుండుటం జేసి యిది సంస్కృతభవము కాదనియు దేశ్యమనియుఁ జెప్పవత్తురు. అట్టి యభిప్రాయము కేవలము నవిమృశ్యకృతము. తమిళ కన్నడాదులలో మాత్రము సంస్కృతభవములు లేవా? విస్తర V. ౬౧ I విషయమునఁ దమిళాదులను సంస్కృతభవపూరితములె యను విషయము సప్రమాణముగా నిరూపింపఁబడినది గావున నిట మరలఁ జూపలేదు. పరిశీలింపఁగా, సూ. రా. నిఘంటుకారులు 'ఏతము' శబ్దమునకుఁ దమిళులు చెప్పెడి దీని వ్యుత్పత్తిని విని భ్రమించి స్వవచన వ్యాఘాతముగా దీనిని నిర్బిందువుగా నుదాహరించిరా యని యాలోచింపవలసియున్నది. తమి - ఏఱ్ఱమ్ = (ఏట్ర్రమ్.) మల - ఏత్తమ్. క. ఏతం. తెలుఁగు - ఏతము = ఏతాము. తమిళ కన్నడములలో 'ఏఱు = ఆరోహించు' అను ధాతువు గలదు. "ఏఱు+త్ +అమ్ - ఏఱ్ఱమ్= (ఏట్ర్రమ్) = మనుజులు దీనినెక్కి నీరు తోడుదురు" అని తమిళులు దీనికి వ్యుత్పత్తి చెప్పుదురు. ఇట్లు స్వసంబంధి ద్రావిడభాషలలో దీనియందు సున్నగాని దానికి మాఱుగు ననునాసికముగాని లేమిం జేసి తెల్గునందును దీనిలో బిందు వుండనేరదని యొకయుక్తి కన్పట్టుచున్నది. ఇది వ్యుత్పత్త్యాభాసము కావచ్చును. యన్త్రశబ్దములోని సంయుక్తరేఫము మాఱుగ "ఏఱ్ఱమ్=(ఏట్ర్రమ్)" అను తద్భవము తమిళము నను వెలసియుండవచ్చును. (౧) మఱియు సంబంధి ద్రావిడపదములలోని యను నాసికము లేకాక ద్విత్వము సైతము తెల్గులోని బిందువునకు మాఱుగ నుండుట

ప్రచురమైయున్నది. (౨) ఇంతియకాక ద్రావిడభాషాభేదములలో నొకట సబిందుక ముగ నున్నను వేఱొకట ననునాసికమేని లేకుంటయు బ్రచురముగ యున్నది (వై. పా. ౩౫౫-౩౫౬ విమ).

| ౧. తెల్గు. | తమిళము. |
|---|---|
| ఈఁటె | ఈట్టి |
| ఊఁదు | ఊత్తు |
| కలఁకు | కలక్కు |
| కోఁట | కోట్టై |
| తాఁకు | తాక్కు |
| తోఁట | తోట్టమ్ |
| గీఁత | కీట్టు, (కీట్రు) |
| పోఁక | పాక్కు (పూగ - సం) |
| వ్రాఁత | వరై త్తల్ |

| ౨. తెలుఁగు. | తమిళము. |
|---|---|
| అలుఁగు | అలకు (బాణాగ్రము) |
| కడిఁది | కడిదు |
| కుఱుఁగలి | కుఱుగు |
| చూఁడు | చూడు |
| తోఁక | తోకై |
| పాఁచి | పాచి |
| పులుఁగు | పులుగు |
| మఱుఁగు | మఱుకు (సంతాపించు) |
| మీఁదు | మీదు |
| మునుఁగు | ముయి(ழு)గు |
| మోఁదు | మోదు |

"కళ్లము = కళ్లాము = ధాన్యమునూర్చెడుచోటు. (ఖలశబ్దభవము). క. మిను కళ్ళము తారలు చి। క్కినగింజలు.........(వరాహ. ౮ ఆ. ౧౮౭ ప)." (సూ. రా. ని). గాలము = గాలాము = చేఁపలను బట్టుసాధనము = బడిశము. ఉ..........వినుమీను లోలతన్। గ్రక్కున నామిషంబు చవి గాలము మ్రింగిన చాడ్పు నూవె......(ఉద్యో. ౨ ఆ. ౫౨). సీ. వాలారు గోరు మే గ్గాలాము సేసె నే జేజే హిరణ్యాసు శిశుకమునకు (పాండు. ౨ ఆ. ౧౩౭). గుడ్డము గుడ్డాము "గుడ్డము = దే. వి. చేను......" (శ-ర). బాడికెద్దులను జూఁచునపుడు బండి నెత్తిపట్టెడి యుపకరణమని వ్యవహారమునఁ గలదు. "గోణము = గోణాము= కౌపీనము (రూ. గోవణము - కౌపీన శబ్దభవము). సీ. బంగారు వ్రాఁత చెఱంగుల గోణాము, గళమున రుద్రాక్ష కంఠమాల (కాళ. ౧ ఆ. ౩౦)" (సూ. రా. ని.) "గోతము = గోతాము = అల్పగోణీవిశేషము = ఒకవిధమైన చిన్నగోనె. సీ...... "అసిమి గోతము సంచి యన నల్పగోణీ విశేషముల్ గొఱలు......(ఆం. భా. ౨ ఆ. ౨౬౬)." (సూ. రా. ని). "జాజము (జాజాము) దే. వి. పాలికలయందుఁ బోసిన నవధాన్యముల నారు. (చూ - జాజాము)" (శ-ర). "గీ. శర్వరీ చంద్రపరిణయ సము చితాంకు। రార్పణక్రియలందు వియద్విభాగ। పాలికలఁ దోఁచు క్రొత్త జాజాల మొలక। లనఁగఁ దారక లొండొండ నంకురించె (కవిక. ౮ ఆ." (శ-ర). సూ. రా. నిఘంటువున నిట్లు 'జాజము' అను నేకవచనరూపములు చూపఁబడలేదు. "జాజాలు

వి - బ - శుభకర్మములందు అంకురోత్పత్తికై పాలికలయందు పోసిన నవధాన్యములు......" (సూ. రా. ని). అని చూపఁబడెను. "జొంజము = జొంజాము = జొంజుఅుకట్టు. వి. ౧ దీపావళి పండుగునాఁటి రాత్రి బాలురు కాల్చి త్రిప్పెడు తెల్లు విడువలి లోనగువాని నిడుపాటి సన్నకట్టు. ౨ కాష్ఠదీపిక" (సూ. రా. ని) "జోతము = జోతాము = నమస్కారము (రూ జోత)" సూ. రా. ని). "తణగము = తణగాము - ఎద్దు మీఁదనుంచి సీళ్ళుతెచ్చెడి తోలుసంచి - పకాలి (రూ. తడగము)......" (సూ. రా. ని). "బొండ్లము = బొండ్లాము = (రూ. బొండలము. ఔంకాయమీఁది బొసిక) సీ. ఎళనీటి బొండలంబులువోలె మెదడెల్ల జొట్టి వైచిన డొల్లు పుట్టె గములు......(ఆము ౬ ఆ). చ. అరుణంపుబొండ్లముల నారికెడంబులు (ఆము. ౧ ఆ)." (శ-ర). "మండము = మండాము = చేఁపలను బొడుచు చిల్లకోల" (శ-ర) "లాతము = లాతాము = సన్న్యాసులు చేతఁ బట్టెడు దండము. సీ. కకపాలకేనారకటకముద్రితపాణిఁ గుఱుచలాతాముతోఁ గూర్చి పట్టిని (స్వా ౧ ఆ.)" (శ-ర) వీణము = వీణాము = సన్నవస్త్రము - వలిపము - అంశుకము. క. పన్నీట జలక మాడెను। నున్నని వీణాము గట్టెను విరులు దుఱిమెన్। సన్నముగ నలఁదెఁ గస్తురిఁ। జన్నుల ముత్యాల బన్నసరములు దాల్చెన్ (జై. ౩ ఆ)" (శ-ర). ఇత్యాదు లనఁగా 'వీ.తా' దు లాకృతిగణ మని యర్థము.

| | |
|---|---|
| సన్నసూ | క్వచి త్తో దః క్వచి డ్డో ణో। దృష్టో దస్తు క్వచి |
| ధర్వణీయము. | చ్ఛ్రితః। (వికృ. అజం. ౯౧ కారి. అహో ౩౬౯ పు). |
| ౩౮౩ విషయము | కేచిత్తు వైకృతా శ్శబ్దా। డాదిత్వేనైవ సాధవః। |
| | (వికృ. అజం. ౬౩ కారి. అహో. ౩౫౨ పు). |

కల్పతరువు. ౩౮౩ విష:—క్వచిత్ = ఒకానొకప్పుడు, దః=దకారము, తః = తకార మగును. ఉదా:—ఉదుకు = ఉతుకు, బ్రదుకు = బ్రతుకు, పిదుకు = పితుకు, మొ. క్వచిత్ = ఒకప్పుడు డః = డకారము, ణః = ణకారముగ, దృష్టః = చూడఁబడును. ఉదా:—వడఁకు = వణఁకు, అడఁగు=అణఁగు, నాఁడెము = నాణెము, పోఁడిమి=పోణిమి. మొ. క్వచిత్=క్వాచిత్కముగా, దస్తుశ్రుతః=ద డలకుఁ బరస్పరము మార్పు గల్గును. ఉదా:—ఎద=ఎడ, కదుకొను = కడుకొను, దిగు = డిగు, దక్కు= డక్కు, దగ్గఱు = డగ్గఱు, దంచనము = డంచనము, దిమ్మరి = డిమ్మరి. దాఁగు = డాఁగు, దొప్ప = డొప్ప, దొంగ = డొంగ, దంపు = డంపు, దెందము = డెందము, మొ. కేచిత్తు వైకృతా శ్శబ్దాః=కొన్ని వికృతిశబ్దము లన్ననో, డాదిత్వేనైవ=డకారమూదియందుఁ గలిగియే, సాధవః = సాధువు లగుచున్నవి. ణ కారము శబ్దాది నెట్లును

నుండదు. కావునఁ గొన్ని డకారాదిశబ్దములకు దకార మాదిగాఁగల పర్యాయరూపము లుండ నేరవని యీ కారికకుఁ దాత్పర్యము. ఉదా:—డెబ్బది, డాలు=కాంతి, డేగ, డయ్యు మొ. కొన్నిట 'డ' కారము ణకారముగా మాఱు ననుచు నహోబలపతి 'డస్తు ('దుస్తు' ఎట్లును తప్పే) క్వచి' త్తను పాఠము నంగీకరించెను. కాని 'క్వచి ద్ధో ణః,' అనుచోటి క్వచి చ్ఛబ్దముచేతనే యట్టి యర్థము లభించును గాన నది పునరుక్త మగును. డడల మార్పును వచించుచున్న 'డస్తు' అను నా పఠించినపాఠమె గ్రంథకృదభిప్రేత మనఁదగును. అహోబలపతి "డాదిత్వేనైవ" అనుసూత్రమునకు వివరణము వ్రాయనే లేదు. ఇంక "డాసి డాపల నిత్యాది" (అహో 3౫౨ పు). అని రెండుదాహృతులను మాత్ర మిచ్చెను. ఇట్లుదాహరించుటలో నాతని భావ మేమో తెలియకున్నది. రెండిటికిని "ద' కారాదులగు పర్యాయరూపములు ప్రసిద్ధములై యున్నవి. "దాయు = డాయు.........స. క్రి. చేరు - సమీపించు. గీ .....తానడు గడుగునకును। దడఁబడి పడుచుఁ బార్వతిఁ దాయ వచ్చి। ......(వరాహ. ౬ ఆ. ౧౭). ఉ. తక్కుల యాలవాలములు దాయుదురే తరుణీజనంబులున్. (విక్ర. 3 ఆ. ౨౯)" (సూ. రా. ని) "దాపల. దే. వి. డాపల......" (శ-ర.) "దాపల = డాపల. వి. ఔ. ఎడమవైపు......" (సూ. రా. ని). "క్వచి త్తో ద ఇత్యాదిని నహోబపతి యిట్లు వివరించెను. "వెదకెన్ - కదికెన్ - చదికిలఁబడియెన్- పిదికెన్ - ఉదికెన్ - ఇత్యాదౌ వెతకె నిత్యాదీని తకారేణాపి రూపాణి, పోఁడిమి- ఉరవడి - నాఁడెము ఇత్యత్ర, పోణిమి - ఇత్యాది రూపాణి ణకారేణాపి సిద్ధాని. పడఁతుక - పడఁకు - పదుక - కడిమి మ్రాను - కడఁక - వేఁడుకొనెన్ - పువ్వుఁబోఁడి ఇత్యాదౌ డకారఏవ, న ణకార ఇతి జ్ఞేయమ్" (అహో. 3౬౯-3౭౦ పు). దతల పర్యాయస్థితిలో దకారఘటితరూపములు ప్రాచీనకృతులనుటకు సందియము లేదు. అహోబలపతి యుదాహరించినవానిలో "కదుకు" శబ్ద మేకోశమునను లేదు. కతుకు శబ్దము సూ. రా. నిఘంటువున నుదాహరింపఁబడినది గాని దాని కకారాదిత్వమును నిర్వహించు ప్రాసగత ప్రయోగము చూపఁబడలేదు. ఇంక "గతుకు = గదుకు = ఎంగిలితిను" అనునని కోశద్వయమునందును నుదాహరింపఁబడెను. క... ...బంధుల గురులకా। వెదకి వధియించు సౌఖ్యం। బనిదేటికి...(ఉద్యో. ౧ ఆ. 33౨). చ. అతఁడు మహాప్రసాదమని యత్తొలి వాకిలి చొచ్చి యచ్చటన్। వెతకి ......(ఉ. రా. ౪ ఆ. శ-ర). చ......పాండవవీరుఁడు రాజు మేన బె। ట్టిదముగు బాణ మొక్కటి వడింగొని తూఱఁగ నేయఁ దేరిపైఁ। చదికిలఁబడ్డ మూర్ఛ...(భీష్మ. ౨ ఆ. ౧౧౦). "చతికిలఁబడు" అను తకార ఘటితత్వమునకుఁ బ్రాసప్రయోగము

లభింపలేదు. చ...త్రాట ము । స్నదికిన కౌటి వ్రేల నది నొక్కటఁ గ్రుంకిడి వత్తు రెండతే । వదలక......(ఆము. ౧ ఆ. ౮3). ఎ-గీ. ఇద్ధరాదోగ్ధ్రిఁ గ్రేవుల నెలమిఁ జేర్చి । పితికికొనుఁ డని పనిచె సమ్మతము మిగుల (హరి. పూ. ౧ ఆ). ఇట్లు కవిప్రయోగసిద్ధము కోశప్రసిద్ధము విశేషించి యథర్వణాచార్యోపదిష్టము నగు నీ 'దత' లమార్పును సూరి యుపేక్షించుట చింత్యము.

డ ణ ల మార్పు సర్వసమ్మతమె. 'నాఁడెము' శబ్దమునందలి ఖండమును నిర్వహించు ప్రమాణములేమిం జేసి సూ. రా. నిఘంటుకారు లుదాహరింపలేదు. శబ్దరత్నాకరమున నిది సార్థబిందుకమని వ్రాసిరి. సూరియు దీనిని సబిందుకముగానె యుదాహరించెను. చ. యజనము దానకర్మమును.....సంగరంబునన్ । విజిత విభీతిమై నురవణించుటయున్ నృపధర్మముల్......(శాంతి. ౨ ఆ. ౨౨౪) ఉ. వాఁడిమయూఖముల్......। పోఁడిగ వేల్పుఁగాఁబడియె...... (ఆది. 3 ఆ. ౧౧౨). క. వేఁడికొని కృపణులై కను । పోఁడిమి యదియేల ?.....(ఉద్యో 3 ఆ. ౧౯౭). "పోణి, దే-వి. విణ. పోఁడియొక్క రూపాంతము. ఎ-గీ. మేటి రతులకు సురతాణి మించుఁబోణి (శశాం. ౪ ఆ. శ-ర.)" "పోణిమి - దే - వి. పోఁడియొక్క రూపాంతరము. సౌందర్యమునకు సీ. పికవాణి యగువాణి పృథువేణిఁ గల పోణిమిని జాణతనమున మించనాడి (రాజ. ౧ ఆ.) ఓప్పునకు. ఉ. ప్రాణముతోడనుండి బహుభంగులఁ బుణ్యము లాచరించియుం । బోణిమిగాఁగ మోక్షమును బొందుట దుర్లభము.........(రుక్మాం. ౫ ఆ). విధమునకు:—క. ప్రాణేశ్వరుండు గడు ని । ద్రాణతనున్నాఁ డిదేమి తన కన్నులకున్ । రాణింపనో యితనికి మగ । పోణిమియే లేదో యనుచుఁ బొక్కుచు మదిలోన్. (శుక. ౧ ఆ)" (శ-ర) పంయిరీతి నున్నఁ పోఁడి - పోణి - పోఁడిమి - పోణిమి' శబ్దముల సంబంధము నరసినపుడు కవిశిరోభూషణమునఁ బైని వ్రాయఁబడినరీతిని 'పువ్వుఁబోఁడి' శబ్దమునందలి డకారము ణకారముగ మారదని జెప్పుట సరికాదని గ్రహింపనగును. మఱియు "క్వచి డ్డో ణో దృష్టః" అనుటచేతనే డకారముచోట ణకారాదేశము వచ్చుట క్వాచిత్కమనియు డాకు ణా రాకుండుట పెక్కుచోట్లఁ గలదనియు నర్థము లభించుచుండఁగా నట్టి యర్థమునె వచించెడి "డస్తు క్వచి చ్ఛ్రితః" (డకారమె కొన్నిచోట్ల నిల్చును.) అను పునరుక్తి నథర్వణుఁ డుపదేశించి యుండఁడనుట నిశ్చయము. కావున "దస్తు క్వచిచ్ఛ్రితః" అనియె యచట నథర్వణోక్త పాఠమనియు "డస్తు - దస్తు" అను కవిశిరోభూషణపాఠము లేఖన ముద్రణాది ప్రమాదకృతమనియుఁ జెప్పుటకు సందియము లేదు. 'పువ్వుబోణి' అను ణత్వఘటిత

రూపము లేదన్నట్లే యహోబలపతి 'కణఁక - పణఁకు' అను ణకారఘటితరూపములు లేవని వ్రాయుటయు సరికాదు. ద్విపద. పణిహారులను బిల్వఁ బంచి యాక్షణమె। కణఁకతోఁ గల్యాణకటకంబునందు (పండితా. దీక్షా. ౮౧ పొ. నీలా. ౧-౪౯. సూ. రా. ని). "పణఁకు - దే - వి. పడఁకుయొక్క రూపాంతరము" (శ-ర). ఇంక ద డ లకుఁ బ్రయోగములు:—"ఎడ. యు.....వై-వి. హృదయము . చ. ఎడఁబోడి వోని వేడుకల యేడ్తెఱసొంపున నంతకంత కె। క్కుడగు ముదంబు పేర్మి.....(నిర్వ. ౮ ఆ. ౭౩ ప. శ-ర). "కదుకొను - అ. క్రి.....అతిశయించు. (సీత) చ. కదుకొని వేఁడి బాష్పములు గ్రమ్మి పయింబయిఁ బర్వి భీతిమై। నదరుచు........భాస్క. యుద్ధ. ౨౩౪౬ ప)" (సూ. రా. ని). క.......। కదుకొని మాయ ట్లిడుములఁ। బడిన నరులు గలరె యొరులు పరమమునీంద్రా. (ఆర. ౨ ఆ. ౪ ప). ఉ. దగ్గఱి మేదినీ పరివృఢ ప్రవరుఁడు (నై. ౮ ఆ, ౧౦౮). క. దగ్గఱి చనుదెంచి రాఁము తమ్ముని కరమున్. (భాస్క.ఆర ౨ ఆ. ౩౭౮). ఉ. డక్కను రాజ్య మంచు నకటా యిటు తమ్ముని భాగ మీక.....(ఉద్యో. ౨ ఆ. ౫౨). "దెందము = డెందము. హృదయము = మనస్సు. ఉ.........విప్రు మాత్రుఁగా। దెందమునం దలంచితివొ దెప్పరముపని........(దశా. ౨ ఆ. ౨౯.)" (సూ. రా. ని). "డంచు = దంచు. (√ - డంగు) స. క్రి. (ధాన్యాదులు రోఁకటితో) నలఁగఁగొట్టు.....సీ. పిండి పీఁచంబుగాఁ బృథివీధరంబులు డంతునే కాలదండమున నభవ. (కాశీ. ౭ ఆ. ౭౯)." (సూ. రా. ని) "డొంగ = దొంగ. వి. (√ డొంగు) చోరుఁడు - తస్కరుఁడు. గీ. డొంగవలె వచ్చి యిచ్చట డొంగి నావ। దేమయా .....(వైజ ౪ ఆ. ౩౬)" (సూ. రా. ని). "డొప్ప. దే. వి. దొప్పయొక్క రూపాంతరము. ఎ-గీ. డొప్పచెవులును గొగ్గిపండులును గలిగి (నైష. ౭ ఆ. ౯౩) దంచన. దే. వి. పెద్దపిరంగి. ద్విపద. దంచనగుండ్లచేఁ దాఁకించి కడిమి। ముంచిన.....(రంగనా. యుద్ధ)" (శ-ర). సీ. డంచనంబులఁ దద్దడంబులు నెత్తించి (ఉ. హరి. ౨ ఆ. ౯౨). ఈ డంచనశబ్దము (శ. ర-సూ. రా. ని.) రెండుకోశములందును సంగ్రహింపఁబడలేదు. క. పవనజుఁ డొక్కఁడె పెఱపాం। డవులును సాత్యకియు హరియు డాఁతురె యుగ్రా। హవమునఁ బ్రాణము.....(ద్రోణ. ౪ ఆ. ౨౦౮). చ.........పుచ్చికొం। టయును మదర్థముం గొనుట డాఁపక చెప్పితి నిక్క మింతయున్ (అను. ౫ ఆ. ౬ ప). "డాఁగు......శా. డాఁగెం బల్వల పంకసీమ బకజాలత్రస్త పాఠీనముల్ (పారి ౪ ఆ. ౨౦)." (సూ. రా. ని). "చ......ము। ఘనతర రాజ్యసంపదలు దాఁచక సర్వము నీకు నిచ్చితిన్. (హరిశ్చ. ౩ ఆ)." (శ-ర). "డించు. దే. ప్రే. దిగఁద్రోయు. ఎ-గీ.

తెగువ సాగ్రహబుద్ధియు దింపవైతి (భాస్క. యుద్ధ.)" (శ.ర). క......బె। ట్టిద ముగఁ బెదఁగిరి చలంబు డింపక కడిమిన్. (విరా. ౨ ఆ. ౩౪౮). 'త్రిమ్మరి = డిమ్మరి' అను వింత ప్రయోగములు గలవు. "√ త్రిమ్మరి. విణ. (త్రిమ్మరు) మిక్కిలి తిరుగు వాఁడు......ఉ. తెల్లదుగాఁగ గంధవహ త్రిమ్మరి వాట యెఱుంగరే జనుల్ (ఇందు. ౪ ఆ. ౫౭)" (సూ. రా. ని) క. వనితల పురుషులయెడఁ బు। ట్టిన యది వెల్లివిరి సేత డిమ్మరితనమె। ట్టి నికృష్టుండైనను......(శాంతి. ౬ ఆ. ౨౦౮). సూ. రా. నిఘంటువున "డిమ్మరి = దిమ్మరి. విణ" అని వ్రాయఁబడెనే కాని దిమ్మరి శబ్దము చూపఁబడ లేదు.

అడం గ్వాదుల డాకు ణకారంబు విభాష నగు. ౧౩.

అడఁగు = అణఁగు. అడఁగు - కడఁగు - చిల్లాడము - తడగము - నాఁడెము - పోఁడి - మిడుఁగు - వడఁకు - మిడుగులు - ఇత్యాదుల డంగ్వాదులు.

దక్కులోనగువాని దాకు డకారంబు విభాష నగు. ౧౪.

దక్కు - డక్కు. దక్కు - దగ్గఱు - దాఁగు - దాలి- దిగు - డిగ్గియ - దూయు - దెందము - దెప్పరము - దెప్పు - దొంగ - దొప్ప - ఇత్యాదులు.

బాలవ్యాకరణ వివరణము. ౩౦౪ విష.

జూదాదుల దాకు జకారంబు విభాష నగు. ౨౧.

జూదము = జూజము. అవుదు - జవాది - జాది - జాదు - విరవాది.

సంజీవని. ౩౦౪ విష:—౧౩ సూ. వ్యాఖ్య:—అడంగ్వాదులలోని డకారమునకు వైకల్పికముగా ణకారాదేశ మగును. అడఁగు = అణఁగు = నమ్రమగు - తగ్గు - ఉపశమిల్లు. కడఁగు = కణఁగు = యత్నించు. "చిల్లాడము = చిల్లాణము = వక్రశస్త్రము = బాకు. క. భిల్లుఁ డొకఁడు............ వైఁబడు పులి......... బెడిదపుఁ। జిల్లాణము కొలఁది గ్రుచ్చి చీరెం గెరెన్. (చంద్రా. ౨ ఆ. ౮౯)" (సూ. రా. ని). "తడగము = తణగము=ఎద్దుమీఁదనుంచి నీళ్ళు తెచ్చెడి తోలుసంచి. పఖ్ఖాలి. ద్విపద. ఒడలి చీర నెఱుంగ కుదరంబు పెద్ద। తడగంబు గతిఁ దోఁప... (ద్వి. హరిశ్చం. ఉ. ౧౬౫౬ పం.)" (సూ. రా. ని). (రూ. తడగాము) "నాడెము- (ఇది సబిందుకముగ శ. ర. నిఘంటువునఁ జూపఁబడెను.) నాణెము = ౧. శ్రేష్ఠమైనది. ౨. శుద్ధ దీనారము. (ముద్రింపఁబడిన రాగి వెండి బంగారముల బిల్ల అని. శ. ర)."

(సూ. రా. ని). "మిడుఁగు దే-వి. మిణుఁగు = మిడుఁగుఱుఁ బురుగు. "మింట మిడుఁగుల్ దట్టంబుగాఁ బర్వ. భాగ. ౧౦. స్కం. ఉ. (దీనికిఁ బ్రయోగాంతరము కానఁబడదు)" (శ. ర). "వడఁకు = వణఁకు = కంపించు - కంపము. క. గణపాదని హతిచేతను। వణఁకె గిరుల్ తరులతోడ వసుధం బడియెన్. (వీర. ౪ ఆ.)" (శ. ర). "మిడుఁగుఱు దే-వి. మిణుఁగుఱు ౧. అగ్నికణము......... ౨. మిణుఁగుఱుఁ బురుగు." (శ. ర).

౧౪ సూ. వ్యాఖ్య:—దక్కు మొదలగు శబ్దముల దకారమునకు వైకల్పికముగ డకారాదేశంబగును. ఉదా:—దక్కు = డక్కు = లభించు - వశమగు. "దగ్గఱు = డగ్గఱు = సమీపించు. గీ. దగ్గఱె ముహూర్తవేళ యో దశరథేంద్ర (రామా. ౪ ఆ. ౧౧౪)." (సూ. రా. ని). "డగ్గఱ = దగ్గఱ...... (సమీపస్థలము) ఉ. డగ్గఱ మేదినీ పరిష్కృత ప్రవరుఁడు......(నై. ౬ ఆ. ౧౦౮)" (సూ. రా. ని). దాఁగు = డాఁగు = మఱుఁగుపడు. తిరోహితమగు. "దాకలి = డాకలి. దే - వి. (దాయి+కలు) కాఁచి సాగఁగొట్టెడు ఇనుము బంగారు లోనగు వానికి ఊఁతగా క్రింద నుంచెడు ఇనుప ముద్ర లోనగునది = నిఘాతిక. 'దాకటి మీఁదఁ బెట్టి బెడిదంబుగ సంపెటవేయ' (రత్నపరీక్ష)" (శ. ర) (రూ - దాగలి). బా. గు. ప్రవ్యాఖ్యాకర్తయు బా - సా - పే వ్యాఖ్యాతయు దీనిని సఖండకముగా నుదాహరించిరి. "దాఁగు - దాఁకలి - దిగు........." (బా - గు - ప్ర. ద్వి-ము. ౪౬౫ పుట). (బా - సా - పే. ౫౧౬ పుట). బాలవ్యాకరణ ప్రథమ ద్వితీయ ముద్రణములందును దర్వాతఁ గొన్ని ముద్రణములందును "దాకలి" అని యిది నిర్బిందువుగానే చూపఁబడెను. "దాకలి = డాకలి - డాకట్లు[2] - దాగలి - వి - పొ. (దాయి+కలు[2]. శ. ర). (దాఁకలి అని. చి. ని)". (సూ. రా. ని). ఈ సూ. రా. నిఘంటు వివరణమునుబట్టి (చి. ని = చిన్నయసూరి నిఘంటువు. వ్రాఁతది) చిన్నయసూరి తన నిఘంటువున దీనిని సబిందుకముగా వ్రాసియుఁ దర్వాతఁ దన యా యభిప్రాయమును మార్చుకొని బాలవ్యాకరణమున నిట్లు నిర్బిందుకముగా దీని నుదాహరించెనని గ్రహింపనగును. సుప్తార్థ ప్రకాశికావ్యాఖ్యాత చిన్నయ సూరి నిఘంటువును జూచి కావలయు నాతఁడు మార్చుకొన్న విషయమును వివేకింపక దీనిని సబిందుకముగా నుదాహరించెనా యని యాలోచింపవలసియున్నది. సుప్తార్థ ప్రకాశికకుఁ దర్వాతి బాలవ్యాకరణ ముద్రములలో నిది సబిందుకముగానె యుదాహరింపఁబడుచున్నది. బా. గు. ప్ర. వ్యాఖ్యను స్వీకరించి వ్రాయుట బా - సా - పే. వ్యాఖ్యాత కలవాఁడె కదా. దిగు = డిగు = అవరోహించు.

(రూ - దిగ్గు = డిగ్గు). చ. డిగకుఁడు వాహనంబులు కడిందిమిగంటిమి కోలుపోవ .........(ద్రోణ. 3 ఆ. 3౮౧ ప). దిగ్గి(గి)యు = డిగ్గియు=డిగియు. వి. (√దిగ్గు). (సం. దీర్ఘికా. ప్రా. దిఘి ఆ.) నడబావి. ఉ. దిగ్గియు నంచతూఁడుగొని తీరవనేకుపు వంక మీఁదుగా। ............ (ఆము. ౫ ఆ ౧౨౨). గీ. దేవ నిర్మితమ్మైనట్టి దిగ్గియఁ గని। దిగ్గి యగణితవిభవముల్ తేజరిలఁగ (సారంగ. ౧ ఆ. ౧౧౨)". (సూ. రా. ని). (మూలమున గణమును బఠించునపుడు. 'డిగ్గియ' అని పడుట ముద్రణ ప్రమాదకృతము). "దూయు = డూయు = దుయ్యు = డుయ్యు - స. క్రి. ౧ (ఒఱనుండి కత్తి)లాగు - పైకితీయు......... 3 (చింత మొదలగు చెట్ల ఆకులను గుప్పిటిపట్టులతో ఒక్కసారిగా కోయు. శా. దూయంజొచ్చె మరుండు లేఁజిగురు గత్తుల్.........(నిరం. ౨ ఆ. ౧౦3)." (సూ. రా. ని). దెందము = డెందము = హృదయము. "దెప్పరము = డెప్పరము. వి - ఆపద. ఆధిక్యము - దుష్టవచనము - అధికము. ఉ. దిగ్గన వచ్చి శంకరుఁడు దెప్పరమైన వడిం జెరుర్చుచున్. (హర. ౧ ఆ. ౨౧) చ. పరమ పతివ్రతన్............దె। ప్పరములు వల్కఁగాఁ।దగునె...(సభా. ౨ ఆ. ౨౫౫)" (సూ. రా. ని). చ...బె। ట్టి దుఁడగు కౌరవేంద్రునకు డెప్పర మయ్యెడు భంగిఁ జేర్చెదన్. (ద్రోణ. ౨ ఆ. ౧౧) దెప్పు= డెప్పు = నిందించు = మర్మోద్ఘాటనముచేయు. దొంగ = డొంగ = చోరుఁడు. దొప్ప = డొప్ప = దొన్నె. పత్త్రచషకము.

౨౧ సూ. వ్యాఖ్య:—జాదము మొదలగు శబ్దముల దకారమునకు జకారాదేశ మగును. ఈవిషయము నథర్వణుఁడు వచింపలేదు. సూరిగారుపదేశించినది. జాదము = జాజము = ద్యూత శబ్దభవము. "తే. గీ. దొమ్మరుల వీడా పల్లి కూటమ్మెయి ముయిల। సంతో బెస్తల సాలో జూజంపుగట్టొ। రచ్చకొట్టంబొ తన మందిరంబు నీకు। (బహు. ౫ ఆ. ౨౦౬)" (సూ. రా. ని). క. జూదపు సిరి యూసపడం। గాదని విదురుండు సెప్పఁగా.........(ఉద్యో. ౧ ఆ. 3౧౬). "అవుదు = అవుజు = బురద పంకము. జలయంత్రదీర్ఘిక. నీటికాలువు. వలిమించు క్రొమ్మంచు టాదు లీది యీఁది (మనుచ. 3 ఆ. ౨౮)" (సూ. రా. ని). జేవాది = జేవాజి = (జేవ్వాది = జేవ్వాజి. రూ) జవాది శబ్దభవము. "శ్లో. జవాదినీలం సుస్నిగ్ధ। మీషత్పీతం సుగన్ధిదమ్. (రా. ని. చందనాది వర్గుప్. ౭౨.) క. అగురు సితాభ్రజవాదీ। మృగమద చందన హిమాంబు మిళితంబై......(రసిక. ౧ ఆ. ౭3) ..............." (సూ. రా. ని. జవాదిశబ్దమునొద్ద). "జేవి = జోజి = వి. (సం. జాతిః. ప్రా - క - జాడి.) జాజి - జాతిలత - జాతిపుష్పము.............

ఉ. జాదులు సూదులంచు దెలిచల్వలు చిల్వ లటంచుఁ గప్రపున్ । వేదులు...... (అహల్యా. ౨ ఆ. ౮౫) "జాటి = జాది. వి. జాతిలత - జాతిపుష్పము......... క. జాజుల పొట్లము విప్పిన । యోజఁ గవిత్వంబు వెలయుచుండిన సభలన్ । బూజిం తురె......(రుక్మాం. పీఠి. ౨౬)." "జాదు = జాజు - రక్తవర్ణము. ఎఱుపురంగు. గైరికాదిధాతువు. పొడిముగఁజా చందు కొడిగె నంటిన జాతి, రేజోతి జాగోడ జాజుటాకు (ఘటికా. ౨ ఆ. ౬౬)" (సూ. రా. ని. జాజౌ శబ్దమునొద్ద). విరవాది = విరవాజి = విరజాజి = నవమాలిక. "విరవాజి. దేశ్య-వి. విరజాఁజియొక్క రూపాం తరము. రగడ. మితిలేనితేనె నామెతఁజెసె విరవాది । యితర లతికల మరగి యేగు నది వరవాది. (ప్యా. 3 ఆ.)" (శ. ర.)

బా - ప్రకీ - లోని. ౧౬ సూత్రమునకు ౨౧౦ III విషయమునందును ౧౭-౧౮-౧౯-౨౦ సూత్రములకు ౨౧౦ XI విషయమునందును, ౨౨ సూత్రము నకు ౧౦౪ I విషయమునందును, ౨3 సూత్రంబునకు 3౦ IV విషయమునందును, ౨౪ - ౨౫ సూత్రంబులకు ౫౮ VII విషయమునందును మూలోదాహృతియు వ్యాఖ్యానము జేయఁబడెను.

## ఇది ప్రకీర్ణక పరిచ్ఛేదము

శ్లో. శ్రీస్తనాఞ్చిత కస్తూరీ । కఙ్కసంకలితోరసే ।
పఙ్కజాక్షాయ నాథాయ । వేంకటేశాయ మఙ్గళమ్.

వ్యాఖ్య:—దీనిచే సూరి గ్రంథాంత మంగళాచరణమును జేయుచు న్నాఁడు. అర్థము, స్పష్టము. ఇంతతోఁ బ్రకీర్ణపరిచ్ఛేదము ముగిసెనని యర్థము.

---

బాలప్రకీర్ణక-౨౫ సూత్రంబున "తక్కుంగల విశేషంబుల నార్యవ్యవహా రంబులం దెలియుట శ్రేయంబు" అని సూరిగా రుపదేశించిరి. కావునఁ బ్రౌఢ వ్యాకరణములోని వాక్య పరిచ్ఛేదపు విశేషవిషయములను మఱికొన్ని వింత వాక్య ముల విశేషములను నిట విశదపఱుచుచున్న వాఁడను.

వాక్యం స్యా ద్యోగ్యతా కాంక్షా । ఽసత్తియుక్తః
పదోచ్చయః (సాహి- ద. ౨ పరి ౧ కా).
యోగ్యతా పదార్థానాం పరస్పరసంబన్ధే బాధాభావః.
పదోచ్చయస్య ఏతదభావేపి వాక్యత్వే వహ్నినా
సిఞ్చతీత్యపి వాక్యం స్యాత్. ఆకాంక్షా ప్రతీతి
పర్యవసాన విరహః - స చ శ్రోతు ర్జిజ్ఞాసారూపః.

సాహిత్యదర్పణము.
3౮౫ విషయము.

నిరాకాంక్షస్య వాక్యత్వే గౌరశ్వః పురుషో హస్తీ
త్యాదీనామపి వాక్యత్వం స్యాత్. ఆసత్తి ర్బుద్ధ్య
విచ్ఛేదః బుద్ధి విచ్ఛేదేపి వాక్యత్వే ఇదానీ ముచ్చరి
తస్య దేవదత్తశబ్దస్య దినాన్తరోచ్చరితేన గచ్ఛతీతి
పదేన సంగతిః స్యాత్.

కల్పతరువు. 3౮౫౯ విష:—దర్పణపంక్తులె ప్రౌఢవ్యాకరణమున నీ క్రింది రీతిని సంగ్రహింపఁబడెను. "౧. సూ. వాక్యము నా యోగ్యతాకాంక్షాసహితం బగు నర్థము గల యాసత్తి యుక్తమగు పద సముదాయంబు. యోగ్యత యనఁగాఁ బదార్థములకుఁ బరస్పర సంబంధంబునందు బాధ గలుగకుండుట. ఆకాంక్ష యనఁగా నిలుపుదల లేక పయింబయిఁ బోయెడి పదార్థములమీఁది యాదరము. అది విను వారికిఁ దెలిసికొనవలయు ననెడి యపేక్షారూప మగునది. ఆసత్తి యనఁగాఁ బదము లచేరిక......" (ప్రౌఢ. వాక్య. ౧ సూ) వాక్యగత పదములకు యోగ్యతలేనిచో "అగ్నిచేఁ దడుపుచున్నాఁడు" అనురీతి గలవానికిని వాక్యత్వము కల్గవలసి వచ్చుచు. ఆకాంక్ష లేనిచో "గోవు - అశ్వము - పురుషుఁడు - గజము" అనురీతి పదసము దాయము వాక్యమనిపించుకొనవలసివచ్చును. ఆసత్తిలేనిచో నిపుడు పల్కిన దేవ దత్తుఁడనుశబ్దము దినాంతరమునఁ బల్కిన 'వెళ్లుచున్నాఁడు' అను శబ్దముతో నన్వ యింపవలసి వచ్చును.

వాచకమనియు లక్షకమనియు వ్యంజకమనియుఁ బదములు మూఁడువిధ ములు. వానియర్థములు వరుసఁగా వాచ్యము - లక్ష్యము - వ్యంగ్యము నని మూఁడువిధములు. వాచకాది త్రితయమునందు వరుసగా "అభిధ - లక్షణ - వ్యంజన" అని మూఁడు శక్తులు గలవు. వాచకశబ్దమునుండి యభిధాశక్తిచేఁ దోఁచు నర్థము వాచ్యార్థ మనఁబడును. అట్లె - లక్షకశబ్దమునుండి దానియందలి లక్షణా శక్తిచేఁ గల్గు నర్థము లక్ష్యార్థ మనఁబడును. ఈరీతినె వ్యంజకశబ్దమునుండి దాని యందలి వ్యంజనాశక్తిచేఁ దోఁచు నర్థము వ్యంగ్యార్థ మనిపించుకొనును వ్యాకరణ కోశవ్యవహారాదులచేతను ప్రకరణాదులచేతను వాచ్యార్థము బోధ్య మగును. ఉదా:—రాముఁడు సీతను బెండ్లాడెను. మొ. ఈ వాచ్యార్థమును ముఖ్యార్థమ నియుఁ జెప్పనగును. ఇట్టి వాచ్యార్థము చెప్పినచో బాధ కల్గునపుడు దానిని సంబం ధించిన యబాధితమగు నర్థము లక్ష్యార్థ మనిపించుకొనును. (గఙ్గాయాం ఘోషః)= "గంగయందు గొల్లపల్లె గలదు." అను వాక్యమున వాచ్యార్థముచొప్పున గంగా ప్రవాహములో గొల్లపల్లె యుండుట యసంభవ మనెడి యనుపపత్తి గల్గి ముఖ్యా

ర్థము బాధిత మగుచున్నది. అట్టియెడ గంగయం దనుశబ్దమునకు గంగాతీరమందనుచు నబాధితార్థమును జెప్పవలయును. అట్టియెడ గంగయం దను దాని వాచ్యార్థము గంగాప్రవాహము. అట్టి యర్థము గంగయం దను శబ్దము నందలి యభిధాశక్తిచే వాచ్య మగుచున్నది. కావున నాశబ్దము వాచకము. ఇంక నచట గంగయం దనుశబ్దమునకుఁ జెప్పిన గంగాతీరము దను నర్థము లక్ష్యార్థము. ఆ శబ్దమునందలి లక్షణాశక్తిచే నట్టి యర్థము లభించుచున్నది గాన నా శబ్ద మాయర్థమునకు లక్షకము. ఇట్టి లక్ష్యార్థము నపేక్షించురీతిగా నేల ప్రయోగింపవలెనని శంకింపరాదు. ఇట్టి యర్థము చెప్పునపుడా గొల్లపల్లె గంగ కత్యంతసమీపస్థమై యున్నదనియు నక్కారణమున నది శీతత్వ పావనత్వములతో నలరుచున్నదనియు నర్థములు వ్యంగ్యములగుచున్నవి. వ్యంగ్యార్థము నిచ్చు శబ్దములు వ్యంజకములు. అట్టి వ్యంజకశబ్దములందలి వ్యంజనాశక్తిచే దోఁచు నర్థము వ్యంగ్యార్థ మనిపించుకొనును.

రాఘవ పాండవీయాది ద్వ్యర్థి కావ్యములందలి రెండర్థములును శ్లేషార్థములే. అందొకటియు వ్యంగ్యము కానేరదు. రెండర్థములును నుద్దిష్టములే యగుటచేత స్ఫురణ విషయమున నవి సమానబలము గల్గి యుండును. వ్యంగ్యార్థ మట్టిది కాదు. ప్రకరణాదివశమున నొకయర్థము వాచ్యమైనపిదపఁ దోఁచునది వ్యంగ్యార్థము. ఒక రాజును వర్ణించునపుడు రాజపరమగు నర్థమే కాక యందు విష్ణ్వాదిపరమగు నర్థాంతరమును నున్నయెడల నందు రాజ పరార్థము ప్రకరణవశమున ముందుగాఁ దోఁచును గాన నది వాచ్యార్థము. తర్వాత స్ఫురించు విష్ణ్వాది పరమగు నర్థము వ్యంగ్యార్థము.

ప్రయోగ:—అట్టియెడఁ గద్రువయు వినతయు......ఉద్యానవనంబునుం బోలె బహువిద్రుమలతాలంకృతంబైనదాని, నాటక ప్రయోగంబునుంబోలె ఘనరస పాత్రశోభితరంగ రమ్యంబైనదాని దివంబునుంబోలె సహిమకరభరితంబైనదాని......మహోదధిం గనిరి. (ఆది. ౨ ఆ. ౨౭ గద్యము). ఇందు మహోదధి యుద్యానవనమువలెను నాటక ప్రయోగంబువలెను దివమువలెను నున్నదని యుపమించుటలో సమానధర్మములగు విశేషణములు మహోదధి పరముగాను నుద్యానవనాది పరముగాను నర్థద్వయము గలవగుచున్నవి. అట్టి శబ్దశ్లేషముతో నొప్పు నర్థద్వయమును వాచ్యార్థములే యనఁదగును. స్ఫురణవిషయమున ద్వివిధములగు నర్థములును సమానబలము గలవె యగుటచే నందొకయర్థము వాచ్యము వేఱొకటి వ్యంగ్యము ననుటకు వలనుపడదు. సముద్రపరమగు నర్థము ప్రకృతమును, నుద్యానవనాది పరార్థము లప్రకృతములు నగుటచేత నిందుఁ బ్రకృతాప్ర

కృతశ్లేష మనఁగా నుభయశ్లేష మందురు. ఉపమాశ్లేషాలంకారముల కేకవాచకాను ప్రవేశ సంకరమని కొందఱ యాశయము. శ్లేషోపమల కంగాంగిభావసంకరమని మఱికొంద ఱాలంకారికుల యాశయము. ఇట్లు వ్యంగ్యమునకును శ్లేషమునకును నంతటను భేదము నరయునది.

కల్పతరువు. ౩౮౬. విష:—"విషయబోధకము వాక్యము". "ఉద్దేశ్య విధేయభిన్నంబు విషయంబు." (ప్రౌఢ. వాక్య. ౫. ౬. సూ.) అని సూత్రించి త్రిలింగ లక్షణశేషకర్త యీ క్రిందిరీతిని వివరించెను. "విషయ ముద్దేశ్యవిధేయములతోఁ గూడినది. అనఁగా విషయమునం దుద్దేశ్యము విధేయము నని రెండు గలవని యర్థము. ఉద్దేశించి చెప్పఁదగినది యుద్దేశ్యము. మీఁదఁ దెలియఁదగినది విధేయము. ఉద్దేశ్యము వక్తృశ్రోతల కుభయులకును దెలియును. విధేయము వక్తకు మాత్రము తెలియును." (ప్రౌఢ. వాక్య. ౬. సూ. వివరణము.) ఉదా:—'పర్వతము వహ్నిమంతము' అనుచోఁ బర్వత ముద్దేశ్యము. 'వహ్నిమంతము' అనునది విధేయము. పర్వతము వక్తృశ్రోతల కిద్దఱకును దెలిసినది. అందు వహ్నిగలదనుట వక్త చెప్పవఱకును శ్రోతకుఁ దెలియదు. మహాత్ముఁడగు రాముఁడు దుర్మార్గుఁడగు రావణుని వధించెను' అనుచో 'మహాత్ముఁడగు రాముఁడు' అనునది యుద్దేశ్యము. "దుష్టుఁడగు రావణుని వధించెను" అను భాగము విధేయాంశము. "నీవు రానేల" అనుచో - నీవురాన్ = నీవు వచ్చుట = ఉద్దేశ్యము, ఏల విధేయము. ఇట్లు వాక్యమును రెండుభాగములుగ విభాగించుకొనవలెను.

"అనేక కర్తృకక్రియకు సమీప కర్తృయొక్క లింగవచనంబు లగు. ఉదా:—క. ఏవాని బంధుమిత్రులు । జీవధనంబులును దప్పిఁ జెందుదు గృశునిం । గా వాని నెన్నఁగాఁ దగు । .........(భార. శాంతి. ౧ ఆ. ౫౩ ప). క. సురగంధర్వ ప్రభృతులు । ధరణీ శైలాపగాబ్ధి ధాత్రీజాదల్ । నరవర నీకేయపకృతి । నరయఁగఁ గావించె. (భాస్క - రా. అర-కా. ౨ ఆ). తమసేనలు వారును విశ్రమించిరి. (ఉ. హరి. ౪ ఆ) వ. భూతంబులు దేవాసురలు వినాశగతులు కారె. (భాస్క - రా. అర - కాం. ౨ ఆ) మొ." (ప్రౌఢ-వాక్య. ౧౫ సూ. వివృతి). తిక్క యజ్వ స్థలాంతరమునందును నిట్టి ప్రయోగమును జేసెను. తే.గీ. ధరణియును ఋక్షములుఁ బరాశరుఁడు గోస । మూహామలు వత్సములు గౌతముండుఁ గపులుఁ । దోయధియు నింత పుణ్యంబు సేయునే జ । నంబు భాగ్యంబు నభివర్ణనమున కెక్కె (శాంతి. ౨. ఆ. ౯౮. ప.) ఇందుఁ గర్తృబహుత్వ మున్నను గర్తలలో మహద్వాచకము లున్నను సమీపకర్తృవాచకమగు "తోయధి" అను దానికి

సరిగనె క్రియయొక్క లింగవచనములు ప్రయుక్తములయినవని యెఱుంగునది. కర్తృవాచకము లెల్లఁ బ్రథమపురుషమునం దున్నపుడే యీసూత్రము వర్తిల్లును. అస్మ దుష్మ దన్యతరము కర్తలలో నున్నపుడు బా. కార. ౩౬ సూత్రముచొప్పున నట్టి యుష్మ దస్మ త్కర్తృకత్వమున కనుకూలముగనె క్రియ ప్రయుక్తము కావలయును. విశేషములు ౩౫౦ విషయమున వివరింపఁబడెను. పునరుక్త మగునని యిట మరల వివరింపఁబడ లేదు.

కల్పతరువు. ౩౮౭. విష:—ప్రకృతులు పదత్వము నంది వాక్యమునఁ బ్రయుక్తములు కావలయును. "అపదం న ప్రయుఞ్జీత" "న కేవలా ప్రకృతిః ప్రయోక్తవ్యా, నాపి ప్రత్యయః" అను నభియుక్తోక్తుల చొప్పున వాక్యమందు పదములు మాత్రమె ప్రయోగార్హము లగును. కావుననే కదా "వాక్యం స్యా ద్యోగ్యతా కాం క్షాసత్తి యుక్తః పదోచ్చయః" అను వాక్యలక్షణము వెలయుచున్నది.

వాక్యమునందలి పదము లన్వయయోగ్యరుగు వరుసతో నుండుటయె సహజము. కాని ఛందోనురోధమునఁ బద్యములందు వాక్యగత పదములు ప్రకృతార్థ ప్రకాశ భంగము కాకుండ వ్యత్యస్తముగా నుండుటయు దుష్టము కాదు. ఈవిషయమునే ౨౬౫ విషయమున "వ్యవధానం చ సాధు స్యా దిత్యాదివచనము వక్కాణించుచున్నది. అట్లె యేపద్యమున కాపద్యమునందె యన్వయ పరిసమాప్తి యగుచుండుట యనుకూలమెకాని ఛందోనురోధమున ననేక పద్యములం దేకాన్వయ ముండుటయు దుష్టము కాదని ౨౬౫ విషయమునందె "క్వచిత్ కులక సంబన్ధో । యత్ర నాహిత కృ ద్భవేత్" అను చొప్పున నధర్వణుఁ డుపదేశించి యున్నాఁడు. ఇవ్విషయములీ వాక్య పరిచ్ఛేదమునందె యుండఁ దగినవయ్యును గారక పరిచ్ఛేదమందలి ప్రసక్తిచే ౨౬౫ విషయమున వివరింపఁబడినవి. కాన ౨౬౫ - ౨౬౫ I విషయము నెల్ల నిచట ముందుగాఁ బరిశీలింపవలయును. ఈ ౨౬౫ విషయమునందె వాక్యమునం దావశ్యకములగు పదములు కొన్ని గమ్యమానములగుచు నప్రయుక్తములు కావచ్చుననియు నట్టివి యధ్యాహృతము లగుటయుఁ బ్రయోగదృష్ట మగుచున్నదనియు విశదీకరింపఁబడెను.

కల్పతరు. ౩౮౮ విష:—ఆచార్యదండి కావ్యాదర్శమునందుఁ గవితారీతికిఁ బ్రాణము లనఁదగు కావ్యగుణముల నుపదేశించుట మూలముగాఁ గొని వాక్య స్వరూపమును నిరూపించి యున్నాఁడు. "శ్లేషః ప్రసాదః సమతా । మాధుర్యం సుకుమారతా । అర్థవ్యక్తి రుదారత్వ । మోజః కాన్తి సమాధయః." (కావ్యా. ౧ పరి. ౪౧.) అని ప్రాణదశకమును వివరించెను. ౧. శ్లేషము = వాక్య

గత పదబంధము శైథిల్యము లేనిదయి యుండవలయును. ౨. ప్రసాదము=శుష్కేం ధనము చుర చుర నంటుకొను నట్లు సంకేతిత సుప్రసిద్ధ పద ఘటితమై వాక్యము సులభార్థ బోధకమై యుండవలయును. గౌడీరీతిలో నిట్టి నియమము లేదు. (చూ. ౧ IX. విష. ౧ X. విష). 3. సమత - పదబంధమందును నర్థవిషయమును నందును బ్రక్రమ భంగాది వైషమ్య ముండ రాదు. ౪. మాధుర్యము = వాక్యార్థము రసప్రచురమై యుండవలయును. మధురం రసవ ద్వాచి। వస్తున్యపి రసస్థితిః। యేన మాద్యన్తి కవన్తః । మధునేవ మధువ్రతాః" (కావ్యా. ౧ పరి. ౫౧.) ౫. సుకుమారత=పదబంధ ముచ్చారణ సౌకుమార్యము గలదిగ నుండవలయును. రౌద్రాది రస సందర్భములం దిట్టి నియమ ముండ రాదని గౌడుల యాశయము. ౬. అర్థవ్యక్తి = వివక్షితార్థబోధన క్షమముగ వాక్యగతపదము లన్యూనానతిరిక్తముగ నుండవలయును. ౭. ఉదారత = వివక్షితార్థ ప్రకాశనమునం బ్రౌఢిమ యుండవలయును. ౮. ఓజము = దీర్ఘసమాసములు - గాఢబంధము - రౌద్రాది రస సందర్భమున నుండవలయును. ఇట్టి రచన గద్యమందె యుండనగును గాని పద్యములం దుండరాదనియు రౌద్రాదులం దర్థదీప్తి యుండుట యుక్తమనియు వైదర్భుల యాశయము. గద్యపద్యములు రెంటను నర్థదీప్తియు గాఢబన్ధ దీర్ఘసమాసములును నుండవలెనని గౌడుల యాశయము. ఉదా:—అర్థదీప్తి - మృదుబంధము:— క. తడఁబడ నేసియు వైచియుఁ। బొడిచియు వివిధాస్త్ర శస్త్రముల నుద్ధతులై। కడుకొని యుద్ధము సేసిరి। గడిమి మెయిన్ విబుధవరులు గరుడునితోడన్. (ఆది. ౨ ఆ. ౯౫). శా. కర్ణుండున్ విజయుండు నొండొరులఁ జుల్కం దాఁకి చాపంబు లా। కర్ణాంతంబులుగా వడిం దిగిచి యుగ్రక్రోధులై యేసి రా। పూర్ణం బయ్యెఁ దదీయబాణ తతిసంభోభృత్పృథంబెల్ల నా। స్తీర్ణంబయ్యె ధరిత్రియెల్ల నవిసెన్ దిక్చక్రమెల్ల న్వడిన్. (ఆది. ౭ ఆ. ౧౯౮). మొ.

౯. కాంతి:—అసంభ వాతిశయోక్తి కాకుండ సంభావ్యము లగు నతిశయోక్తు లుండవలయును. ఈవిషయమును నాచార్యదండి యీక్రింది రీతిని వివరించెను. "కాన్తం సర్వజగత్కాన్తం। లౌకికార్థానతిక్రమాత్...... .........అనయో రనవద్యాఙ్గి। స్తనయో ర్జృమ్భమాణయోః। అవకాశో నపర్యాప్త। స్తవబాహు లతాన్తరే। ఇతి సంభావ్య మేవైతత్ । విశేషాఖ్యాన సంస్కృతమ్। కాన్తంభవతి సర్వస్య । లోకయాత్రానువర్తినః। .......... అల్పం నిర్మిత మాకాశ। మనాలోచ్యైవ వేధసా। ఇద మేవంవిధం భావి। భవత్యాః

స్తన జ్జృమ్భణమ్ । ఇద మత్యుక్తి రిత్యుక్త । మేత ద్గౌడోపలాలితమ్." (కావ్యాదర్శము. ౧ పరి. ౮౫. ౮౭-౮౮. ౯౧-౯౨-శ్లో). అసంభవముకాని యతిశయోక్తియే సర్వాలంకారమూల మని యాలంకారికుల యాశయము. "కస్యాశ్చి ద్యతిశయోక్తి । రిత్యన్వర్థ విచారణాత్ । ప్రాయేణామీ అలఙ్కారా । భిన్నా నాతిశయోక్తితః." (కావ్యాదర్శ వ్యాఖ్య. ౨౨౦ కారి. వ్యా). లోకసీమానువర్తి యగు నతిశయోక్త్యలంకారమును దండ్యాచార్యుఁడీ క్రిందిరీతిని బ్రశంసించెను. "వివక్షా యాం విశేషస్య । లోకసీమాతివర్తినీ । అసా వతిశయోక్తిః స్యా । దలఙ్కారోత్తమా యథా । .........అలఙ్కారాన్తరాణా మ । ప్యేక మాహుః పరాయణమ్ । వాగీశ మహితా ముక్తి । మిమా మతిశయాహ్వయామ్. (కావ్యాద. ౨ పరి. అతిశయోక్తి చక్రము. ౨౧౪-౨౨౦ శ్లో).

౧౦. సమాధి:—వ్యంగ్య ప్రయోజనికములగు గౌణోక్తులు విలసిల్ల వలయును. ఉదా:—చ. అతిరుచి రాగతుండయిన యాతనికిన్ హృదయ ప్రమోద మా । తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ । ర్జిత కుసుమాక్షతావళులు సేసలువెట్టిన యట్టిరై రి సం । పత దళిసీనినాదమృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్. (ఆది. ౪ ఆ. ౧౭). (శకుంతలా పరిగ్రహము సంభవింపనున్న సందర్భమునందలి దుష్యంత తపోవన ప్రవేశమును వర్ణించు నీపద్యరత్నమున కిదియె సాటి). ఇందలి లతలయందలి లలనాధర్మ వర్ణనము గౌణవృత్తి నాశ్రయించి యున్నది. అర్వాచీనపద్ధతి:—సీ. గగన కల్లోలినీ కల్లోలమాలికా హాస్లిసకములతో నవఘళించి । చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా స్తబక పంక్తులతోడ సరసమాడి । శరదాగమారంభ సంపూర్ణ పూర్ణిమా, విమల చంద్రికలతో వియ్యమంది । బిసరుహాసన వధూపృథుపయోధర భారహారపల్లరులతో నఁగి పెనఁగి । తే-గీ. వెలయు నెవ్వాని యభిరామ విమలకీర్తి । .........(నైష-అవతా. ౩౭ ప).

కల్పతరు. ౩౮ విష:—కావ్యపద్ధతికి ముఖ్యప్రాణమగు నర్థవ్యక్తి గుణమత్యావశక్యము గానఁ బునరుక్తులును వ్యర్థపదములు నపుష్టార్థములును గావ్యమునం దెంతమాత్రమును నుండరాదు. అట్లయినను ఛందో యతిప్రాసానురోధమున నట్టివి సహృదయచేత స్సుఖావహమగు రీతిని నిల్పఁదగునని యథర్వణుఁడీ క్రిందిరీతిని వివరించుచున్నాఁడు.

నన్నయా — అపుష్టార్థోపి సాధుః స్యా । ద్యది చేత స్సుఖావహః
థర్వణీయము. — (విక్ర. అజం. ౯౪ కా. అవలో. ౩౭౨ పుట.)
౩౮ విషయము. — ఉక్తస్య పునరుక్తిః స్యా । త్కృచి ద్దార్ఢ్య ప్రదర్శనే.

(విక్ర. అహో. ౪౯౪ పుట.) ప్రసిద్ధౌ స్యా ద్విశే
షస్య । పునరుక్తి ర్న దోషకృత్. (విక్ర. క్రియా.
౩౪ కా. అహో. ౫౧౧ పుట).

కల్పతరువు. ౩౮౯ విష:—అపుష్టార్థో౽పి = అర్థపోషణములేని శబ్దముల ప్రయోగము సైతము, చేతస్సుఖావహోయది = పండితకవీంద్రుల హృదయము నకు సుఖావహముగఁ దోఁచునపుడు, సాధుః స్యాత్ = ప్రయోగార్హమె యగును. ఇచటఁ అపుష్టార్థ మనునది, వ్యర్థ పునరుక్తులకు నుపలక్షణము.

ఉ. శారదరాత్రు లుజ్జ్వల లసత్తరతారక హారపంక్తులం । జారుతరంబులయ్యె వికసన్నవకైరవ గంధబంధురో । దారసమీర సౌరభముఁ దాల్చి సుధాంశువి కీర్యమాణ క । ర్పూరపరాగ పాండురుచి పూరములం బరిపూరితంబులై (ఆర. ౪ ఆ. ౧౪౨) ఇందుఁ దారకల విశేషణములలో 'ఉజ్జ్వల' అనునది చాలియుండును గాన 'లసత్తర' అను విశేషణశబ్దము భట్టారకహితమై పునరుక్తముగఁ బ్రయో గింపఁబడెను. అట్లె గంధబంధురోదార సమీర మనునపుడు "ఉదార" శబ్దము సత్కవిచేతో హితమగుచుఁ బునరుక్తముగఁ బ్రయోగింపఁబడెను. ఉక్తార్థ దృఢీకర ణార్థకమగు పునరుక్తి దోషమే కాదని వచించుచున్నాఁడు.

ఉక్తస్యేత్యాది:—క్వచిత్ - ఒకానొకప్పుడు, ఉక్తస్య = చెప్పఁబడినదానికి, దార్ఢ్యప్రదర్శనే = పుష్టిని జూపుటవిషయమున, పునరుక్తిః స్యాత్ = పునరుక్తి సమ్మతమేయగును. (చూడు. ౩౯౩. విష). వెనుక నుదాహరించిన "శారద రాత్రులు........." అనుపద్యమునందలి, 'నవ' శబ్దము దీని కుదాహరణ మన నోపును. "వికసన్నవకైరవగంధ" అనునపుడు వికసించుచున్న కైరవముల గంధము నూతనమని వేఱ చెప్పనక్కఱలేదు. అట్లయినను దాని నవ్యతను దృఢీకరించుటకై 'నవ' శబ్దమును బ్రయోగించుట యుక్తమె యని తాత్పర్యము. ఈకారిక యాథా ర్థ్య మిమని యహోబలపతి యనలేదు.

ప్రసిద్ధావిత్యాది:—విశేషస్య = క్రియచేత నుక్తమె యైన యర్థవిశేషము యొక్క, పునరుక్తిః = పునః కథనము, ప్రసిద్ధౌ = పండితకవి వ్యవహార ప్రసిద్ధమగు చుండఁగా, నదోషకృత్ = దుష్టము కాదు. అహోబల పండితుఁడీకారిక కిట్లు వివర ణము వ్రాసెను. "విశేషస్య క్రియోపాత్త విశేషస్యేత్యర్థః. తరువు పూవులు పూచెన్ - కాయలుగాచెన్ - పండ్లు పండెన్ - పల్కులు పల్కెన్ - దూఱులు దూఱెన్ - నోములు నోచెన్ - ఇత్యాది ప్రసిద్ధదేశ్యపద నిర్వాహార్థో౽యం విధిరితి జ్ఞాపయితుం ప్రసిద్ధా విత్యుక్తమ్, వాగనుశాసనేనా ప్యంగీకృత ఏవాయం పక్షః.

"పల్కులు పల్కునది - నా పల్కిన పల్కు ఇత్యాది వచనాత్ జ్ఞాపకాత్...... జగాద మధురాం వాచం। విశదాక్షరశాలినీమ్। వాచ మూచే సుధాధారా। మధురాం మధుసూదనః........." (అహో ౫౧౧ పు). "మ. తలఁపం జొప్పడి యొప్పె నప్పుడు......" (రాఘవ. ౧. ఆ. ౯. ప). ఇత్యాద్యాకారే ణాపుష్టార్థ పదానాం క్వచిత్ ప్రయోగ స్సాధుః" (అహో. 3౭౨. పుట.) "ఉక్తస్య పునరుక్తి రిత్యాది కహోబలపతి భట్టారక సూత్రార్థ పునరుక్తి నీక్రిందిరీతి నుదాహరించెను. "పర్యాప్తో మన్మతేతు సంకేతః. (వ్యాఖ్య):—పర్యాప్తః పూర్ణః సుప్రసిద్ధ ఇతి యావత్. మన్మతేతు సంకేతః పర్యాప్తో భవతి. యత్సంకేతితం శిష్ట ప్రయోగా రూఢంచ పదం త త్ప్రయోజ్య మిత్య త్రాస్మాక మభినివేశః...ఇత్యనేనై వోక్తో ప్యర్థః 'ఇహాతు ప్రవ్యాహార్యం। సంకేతిత సుప్రసిద్ధ మేవ పద'మితి. (మా. ౧. IX విష). పునరుచ్యతే ద్వాధ్యార్థమ్. ఉక్తస్య పున రుక్తి స్స్యా। త్క్వాచి ద్దార్ఢ్య ప్రదర్శనే ఇతి." (అహో. ౪౯౪ పు). ఇంకను ననేకస్థలములందుఁ బునరుక్తులు ప్రసిద్ధములై యున్నవి. (చూడు. 3౪౭ విష). చంద్రుని నగుమోము తామరసికల్. (రాఘవ. ౨ ఆ. ౯ ప.) "నెత్తమ్ముల తమ్ములైన కనుదమ్ములు" మున్నగు నర్థపునరుక్తులును గవి ప్రయోగ దృష్టము లగుచున్నవి. (చూడు. ౨౭౪ విష).

ద్వ్యర్థిపద్యములందు సఖండాఖండపద మేళనము సాధువనియు నట్లె ప్రశ్నాద్యర్థకస్వర మేళనమును గల్గుట గలదనియు నథర్వణుఁడు వివరించుచున్నాఁడు.

నన్నయా  శ్లేషే సఖణ్డ నిర్ఖిన్ద్వో। ర్మేళనం కుత్రచి న్మతమ్।
థర్వణీయము. ప్రశ్నాద్యర్థకస్య చాన్యస్య। స్వరయోః శ్లిష్టతా
3౯౦ విషయము. మతా. (విక్ృ - సంధి. ౨౨. కా. అహో. ౨౧౪.)

కల్పతరువు. 3౯౦. విష:—శ్లేషే = శ్లిష్టార్థసంఘటన సందర్భమున, సఖణ్డ నిర్ఖిన్ద్వోః = సార్ధబిందు నిర్బిందుక శబ్దద్వయ సంమేళనము, కుత్రచిత్ = కొన్నియెడల, మతమ్=సమ్మతమగును. ఇది సఖండాఖండప్రాసాదులకును నుపలక్షణ మగును. ఉదా:—మ. ఒప్పెసఁగు రూఢాపూర్వసత్కీర్తితోన్. (రాఘ. 3 ఆ. ౧౫ ప.( ఒప్పెన్+సగురు+ఊఢ+అపూర్వసత్కీర్తితోన్ (భార). ఒప్పు+ఎసఁగు+రూఢ + అపూర్వసత్కీర్తితోన్ (రామా.)

ప్రశ్నార్థకస్య = ప్రశ్నాద్యర్థకమైనట్టి కాక్వాది స్వరము, అన్యస్య = తద్భిన్న స్వరము ననెడి, స్వరయోః = స్వరములకు, శ్లిష్టతా = మేళనము, మతా = సమ్మతమగును. ఉదా:—మ......మానిత్వాకృతేష్టసిద్ధితఁ దిరంబై పోయి దేదీప్యమాన నిరూఢిన్. (రాఘవ. ౨ ఆ. ౯౬). మానిత్వా కృత = సన్న్యాసిత్వాకృతమగు,

ఇష్టసిద్ధితన్ = సుభద్రను వరించుటచే - దేదీప్యమానసిరూఢిన్ - పోయెన్. (భార.) మానిత్వ=నిరుత్తరత్వముచే=మూకత్వముచే, కృతేష్టసిద్ధితన్=నాదాడి తప్పించుకొను టచేత, లిరంబై=బ్రదికినవాఁడవై, పోయెదే - (రామా) (పరశురాముఁడు రాముని గూర్చి పలికిన వాక్యము). ఈ సూత్రములు రెండును నాథర్వాణము లని యహోబలపండితుఁడు వచింపలేదు. "శ్లేషే సఖణ్డ నిర్బిన్దో! శ్లేశనం కుత్రచి త్స్మతమ్। ప్రశ్నార్థకస్య చాన్యస్య। స్వరయో శ్శ్లిష్టతా మతేతిః-అనఘ శ్రీధరణీశుఁడొప్పెసఁగు రాధాపూర్వ సత్కీర్తితోన్. వేడుకగా వరించితి ఖ్యాతిగా దేవర స్నాశ్రయము- ఇత్యాది రూపాణి నిర్బాధాని." (అహో. ౨౧౮ పు). అట్లయినను నిది యవిరుద్ధ మగుటచే నిటఁ జేర్పఁబడెను. ప్రతిపత్తికారికలు పెక్కు కవిజనాంజనాదులలో నుదాహృతము లయియున్నవి. అట్టివెల్లఁ బరస్పర విరుద్ధతాది దుష్టము లగుటచే వాని నుపేక్షించి యిందుఁ జేర్పలేదు. నారాయణీయాంధ్ర వ్యాకరణమున నాంధ్రీకరింపఁబడెను. అహోబలపండితుఁడు కంఠోక్తముగా నాథర్వణము లని వచించిన కారికలుమాత్రమె వికృతి వివేకగతములని విశ్వసించి వానిని మాత్రమె సంగ్రహించితిని.

నన్నయా     అన్యేషాం చ ద్విరుక్తౌ స్యు। ర్బహు లోపాగమా

3౯౦. I విషయము. మతాః. (వికృ-అజం ౨౧ కారి. అహో. 3౬౧ పు.)

కల్పతరువు. 3౯౦ I విషః—ఈకారికకీవఱకు ౭౮ విషయమందును ౧౦౨ విషయమందును వ్యాఖ్య చేయఁబడెను. స్వాయ మర్థకములను గొన్నిటి నహోబలపతి వివరించెను. "తారుదారె - తమరు దమరె - తముకుఁ దామె - తనకుఁ దనక- తనకుఁ దాన - తముకుఁ దముకె - తము తముక - వారు వారె - వారికి వారికె - వారివారె ఇత్యాది. తనంతం దాను - తమంతం దాము - ఇత్యాదావంత శబ్దస్య పరిమాణవాచినః ప్రయోగః" (అహో. 3౬౧ పుట). ఇట్టివానిని సైతము "అన్యేషాంచే" త్యాద్యథర్వణకారిక చేతనే సంగ్రహింపనగును.

అన్యేషాం చేత్యాది:—అన్యేషాం చ = కాంతి శబ్దాదులకె (౧౦౨ విష.) కాక మఱికొన్ని జాతులయొక్కయు, ద్విరుక్తౌ = ద్విరుక్తియందు, బహుం లోపాగమాః = అనేకవిధములైన లోపాగమాదేశాదివికారములు పెక్కు, మతాః స్యుః = సమ్మతము లగుచున్నవి. ఉదా:—తనకుఁదానె. వనిత తనంతఁ దా వలచి వచ్చిన (మనుచ. ౨ ఆ.) మొ. ప్రయోగ:—చ. మానిని కిం దనుఁదాన కాచికో। లొాదవినదానఁ జేసి (ఉద్యో. ౧ ఆ. 3౭౮). ఉత్సాహ......ఇర్వరుం। దముక మీది తముక తముక తనిసీ రాహవంబునన్. (అర. ౭ ఆ. ౭౬.) క. సమరక్రీడన లీలం।

దమకుఁగమక తనిసి మరలి తను తను యావా। సములకు సరిగి......(భీష్మ. ౨ ఆ. 3౮౨). ఉ......తద్గణాధిపులఁ గాంచుచు మీఁదికి మీఁదఁ బ్రాణముల్ । పోయిరి (నన్ని-కు. ౨ ఆ. ౨౦౧). (పోయిరి = కోల్పోయిరి). (విస్తర)

ఏవావ్యయ సమూ వార్థ । మేత్వ గుత్వంచ దృశ్యతే ।
వైపుల్యవాచకత్వేన । పేరు శబ్దే విధీయతే. (విక్ర - అజ. ౭౮. అహో. 3౯౯. పు. విక్ర - అజం. ౭౦. కా. ఆహో. 3౯౮ పు.)

నన్నయాథర్వణీయము. 3౯౦ II విషయము

సహితాది పదానాం స్యా । త్క్రియాభేదకతా యది ।
సుప స స్తత్త్వ విష్టం సాత్ । స్యా త్తృతీయా స్తతాపి చ । క్వచిల్లక్షక శబ్దస్య । ప్రయోగశ్చ హితా వహః. (విక్ర. అజం. ౭౯-౮౦. కారి. అహో 3౯౯.)

కల్పతరువు. 3౯౦. II విష:—ఏవావ్యయేత్యాది కారికకు ౨౧౦ విషయమున వాఖ్య చేయఁబడెను. 'ఏ - ఏ - అ' అను నవ్యయ శబ్దములు ఉవధారణార్థకము

---

విస్తరము. 3౯౦ I విష:—౧౦౭ "సద్రుతం బంత శబ్దంబు తన తగు పూర్వకంబు స్వయమర్థకం బగు. ఉదా:—తనయంత-తనంత-తమయంత-తమంత. చ. వనిత తనంతఁ దా వలచి వచ్చిన చుల్కన గాదె యేరికిన్. (మనుచ. ౨. ఆ.) మొ ౧౦౮. షష్ఠ్యంత త దేత దుష్య ష్మ దస్మ దాత్మ శబ్దపూర్వకంబులగు ప్రథమాంత తదాది శబ్దంబు లవధారణార్థకాంతంబులు తెలుచుగ స్వయ మర్థకంబు లగు ఉదా:—వానికి వాఁడె - వీనికి వీఁడె - నీకు నీవె-నాకు నేనె - తనకుఁ దానె - వారికి వారె - మొ. తెలుచుగ నగుటచే, తనుదాన తారుదారె. ఇత్యాదులు గ్రాహ్యంబులు. తనుఁదాన తొరగిన. (మనుచ. ౨ ఆ.) తనుదా నాపూర్ణప్రభల వెలయు. (పర. ౧ ఆ.) మొ. ౧౦౯. కొన్నియెడల షష్ఠ్యంత తదాదిశబ్ద పూర్వకంబులు గాకయు నవి స్వయమర్థకంబులగు. (అవి=త దేత దుష్మ దస్మ దాత్మశబ్దములు). ఉదా:—వాఁడే వచ్చెనుఁ= వాఁడు తనంత వచ్చెననుట." (ప్రౌఢ - శబ్ద). ఇచట వాఁడై వచ్చె ననువిధమునఁ బ్రయోగములు కన్పట్టును. క......శమము తానై కలుగున్. (శాంతి. ౧. ఆ. ౯). మ.........దై । త్యగణోన్మర్దనుఁ డా జనార్దనుఁడు తానై మానసీయోన్నతిన్. (హరి. ఉ - భా. ౪ ఆ. 3 ప). (ఇది యతిస్థానఘటితము.)

"షష్ఠ్యంత త దేత దుష్మ దస్మ దాత్మశబ్దపూర్వకం బంతట శబ్దంబు పృథగర్థకం బగు. ఉదా:—వానియంతట వాఁడున్నాఁడు." (ప్రౌఢ. శబ్ద. ౧౧౦. సూ.)

లని యర్థము. ఉదా:—ఇప్పుడె వచ్చెను. ఇప్పుడేవచ్చెను. ఇప్పుడ వచ్చెను. మొ. పేరు శబ్దః=పేరుశబ్దము, వైపుల్యవాచకత్వేన = 'విపులమైన' అను నర్థము గలదిగ, విధీయతే = చెప్పఁబడుచున్నది. ఉదా:—పేరు+ఉరము = పేరురము. పేరన్న - పేరమ్మ - పేరుశాస్త్రి. మొ. క. పే రనియెడు శబ్దం బే । పారం దెనుఁగులకు మొదల నధికతఁ దెలుపుఁ । బేరాఁకలి పేరాముని । పే రాముదపాకు లనఁగఁ బేరిం పనఁగన్. (ఆం. భూ. ౧౨౬ ప.) సయితాదిపదానామ్ = "సయితము (సహిత శబ్దభవము) సైతము" అను పదములకు, క్రియాభేదకతా యది = క్రియా విశేషణత్వమున, సుస్ - అస్-అన్తత్వమ్ = ప్రథమాంతత్వము - ద్వితీయాంతత్వమును (సు-ఔ-జస్, అమ్ - ఔ - శస్). ఇష్టం స్యాత్ = సమ్మతమగును. తృతీయాన్తతాపిచ = తృతీయాన్తత్వము సైతము, స్యాత్=సమ్మతమగును. ఉదా:—అది సైతము = అదియు, దానిని సైతము, దానితో సైతము మొ. నేఁటి వాడుకలో దానికి సైతము మున్నగురీతి నెల్ల విభక్తులును వాడఁబడుచున్నవి. సయితాది పదములు సముచ్చయార్థకములై యథేష్టముగా వాడఁబడుచున్నవి. క్వచిత్ = ఒకానొకచో, లక్షక శబ్దస్య = లక్షార్థమును దెల్పు శబ్దముయొక్క ప్రయోగశ్చ = ప్రయోగము సైతము, హితావహః = సమ్మతమగుచున్నది. (3౮౫ విష. చూ). ఉదా:—అదే పదివేలు = అదే చాలు నని యర్థము. దశసహస్రరూప వాచ్యార్థము ప్రసక్తము కాదు. ప్రయోగములు - అవధారణార్థకములు:—శా......పోయిన । ట్లే పోనిత్తురు గాన నిన్నతఁడు జాలిం బెట్టెడుం జూడుమీ (ఉద్యో. 3 ఆ. ౮౫.) శా. ఇం । త్రే పోతమ్ముఁ 'గపిధ్వజ ప్రభులె యంధీభూతులం జేయవే. (ఉద్యో. ౧ ఆ. 3౨౧). క......పర్వం । బ కడు న్మేలనఁగ శాంతిపర్వము వెలయున్. (ఆది. ౧ ఆ. ౫౮). మ. ......కా । న తగం బొందుట కార్య మీ యుభయమున్ సంతుష్టి మైనున్కికిన్. (ఉద్యో. ౧ ఆ. 3౫౮.) శా...వీఁడె వ । చ్చెం గుంతీసుతముఖ్యముండు. (విరా. ౪ ఆ. ౯౫).సయితాదులు:—"తమ్ములు భూమిజాత సయితమ్ముగ నుండెడు రాముఁ గొల్చెదన్." "నన్ను సయితమ్ము విడిచె నన్నరపమౌళి" "తమ్ములతో సయితమ్ముగ" "సైత శబ్ద స్సహిత శబ్దాన్నిష్పన్నః తేన సయితమ్ముగ నితి ప్రయోగోపి సాధుః." (అహో. 3౪౯.) లక్షకశబ్దము:—"చాలు పదివేలు వచ్చె నో జలజనయన ఇత్యాదౌ లక్షకత్వమ్" (అహో.3౪౯).పై వానిలోఁ గవి శిరోభూషణమున 'సహిత' శబ్దము గలదు. సహిత శబ్దమునకు సంస్కృతమున నిట్టి యర్థము లేదు. అథర్వణుఁ డాచ్ఛికశబ్దముల వివరించు సందర్భమున నీకారికనుపదేశించెను. సూరియు నీ కవి శిరోభూషణస్థితిని జూచియే కావలయుఁ దలఁచుగా సహితశబ్దమును వాఁడెను.

"లాఁతిచో సహితము" (బాల - సంధి ౫౦ సూ. క్రియా. ౧౨3 సూ.) ఇట్లు నేఁటి వారు వీని నెల్లవిభక్తులచోటను వాఁడుదురు. ప్రాచీనకావ్యములలో వీనికిఁ బ్రయోగములు లభింప లేదు.

నన్నయా. క్వచి త్సాదృశ్య శబ్దస్య । తదుత్కర్షే వ్యవస్థితిః.
3౯౦ III విష. (వికృ. అజం. ౮3 కారి. అహో. 3౬౪ పుట.)

కల్పతరువు. 3౯౦ III విషః—క్వచిత్ = ఒకానొకప్పుడు, సాదృశ్యశబ్దస్య= ఉపమానవాచకములగు వంటి - అట్టి మున్నగువానికి, తదుత్కర్షే = ఉపమానము యొక్క యుత్కర్షాతిశయార్థమందు, వ్యవస్థితిః = ఉనికి గలదు. ఉదా:—ధర్మజుని వంటివాఁ డసత్య మాడెను. ఇచటి వంటిశబ్దము ధర్మజుని సత్యవాచితోత్కర్షమును దెల్పును. నీయట్టి పుణ్యాత్మకుల్ గలరే. (భాగ) క. విమల తపోవిభవంబునఁ గమలజునట్టిండు. (ఆది. ౨ ఆ. ౨౨౦ ప.)

ప్రకృత్యుక్తిప్రకారేణ । రచనా రసరంజనీ । అనాదృశ్యస్యాపి శబ్దస్య।కల్పనా క్వచి దిష్యతే (వికృ. అజం. ౧౧౪ - ౯౫ కా. అహో. 3౭౧ - 3౫3 పు.)

నన్నయా ధ్వరణీయము 3౯౦ IV విష. లోకే క్తీనాం భవే ద్యోగో । యది స్యా చ్ఛృతిరఙ్జనమ్. (వికృ. అజం. ౮౨ కారి. అహో. 3౬౨ పు.)
భవే దత్రాపి శబ్దస్య । క్వచి ద్యోగేన సాధుతా । భవేత్ క్వచి దయోగేన । క్వచిత్తు వచనశ్రుతేః । తత్త త్పదం పరిగ్రాహ్యమ్ । యదన్య త్సహృదయే హితమ్. (వికృ. అజం. ౯౨ - ౯3 కా. అహో. 3౭౧ పు.)

కల్పతరువు. 3౯౦ IV విషః—ప్రకృత్యుక్తి ప్రకారేణ = సంస్కృత కావ్యములలోని శబ్దములందలి రీతులచొప్పున, రచనా = శబ్దరచనము, రసరఞ్జనీ = రసవంతముగానుండును. ఉదా:—వాగ్దేవి = మాటల తొగకంటి, ఇట్లు - జగడం పుటోరెంపు జడదాదిరాడెంపుఁ బాటల కెద నుబ్బు బల్లిదుండ = కలహాశనుని స్తుతుల నుబ్బువాఁడు = విష్ణువు మొ. అనాదృశ్యస్యాపి శబ్దస్య కల్పనా = సంస్కృత మునఁ బ్రసిద్ధిలేనిరీతిని శబ్దఘటన చేయుటయు, క్వచి దిష్యతే = ఒకప్పుడు సమ్మతము గును. ఉదా:—తుంటవిల్తుఁడు, చెఱకు విలుకాఁడు, తీయవిల్తుఁడు మొ. ఇట్టి శబ్ద రచనము సంస్కృతానుకారి కాదు. ఆంధ్రకవు లిట్లుగ నాచ్ఛికశబ్దరచనము చేయు టయేకాక తత్సమ శబ్దరచనమును జేయుటయుఁ గలదు. కా...ఆ । హా పుట్టింపదె

యిత్తు ధన్వునకు నయ్యబ్జాక్షి సీక్షించినన్. (పినవీర. శకుం. ౨ ఆ. ౧౫౭). ఇట్టి శబ్దములు సంస్కృత కోశములలో లేవు. సంస్కృతకావ్యములందును నిట్టిశబ్ద రచనలులేవు - మఱొక విశేషము:—ఖండశబ్దపర్యాయమగు 'తుంట' శబ్దమున కితు శబ్దార్థము సైతము గలదని శబ్దరత్నాకర, సూ. రా. నిఘంటువులలో వ్రాయఁబడెను. వీరు తుంటరిస మనుటకుఁ జెఱకురస మను నర్థమును నంగీకరింతురు కాఁబోలును?

లోకోక్తీనామ్ = లోకవ్యవహారమున నున్న కొన్ని వాక్యములకును, యది స్యాత్ - శ్రుతి రఞ్జనమ్=పండితకవీంద్ర శ్రుతిహితమగునేని, యోగః = ప్రయోగము, భవేత్ = అగును. ఉదా:— "అమ్మకచెల్ల - అమ్మచెల్ల - నీవెట్టి బంగారయ్యెద......ఇత్యాద్యా లోకోక్తయః." (అహో. 3౬౨ పు.) 'నీవెట్టి బంగారుగాను' మున్నగులోకోక్తులలో 'కాను' అనుదానికి 'అగుఁగాక' అను నర్థము వచ్చుట కవకాశము లేకున్నను కవి సమ్మత లోకోక్తిగాన సాధువే యనఁదగును.

అత్ర = ఈ యాంధ్రభాషయందు, శబ్దస్యాపి = సు శబ్దమునకు సైతము, క్వచిత్ = ఒకప్పుడు, యోగేన సాధుతా = శబ్దాంతరముతోడి సమాసమందే సాధుత్వము భవేత్ = సమ్మతమగును. ఉదా:— "సును గాళ్ళు - మిాఁగాళ్ళు. ఇత్యాదీనాం శబ్దాంతరయోగే శృంగారే సాధుతా" (అహో. 3౭౧ పు). క్వచిత్ = ఒకప్పుడు, అయోగేన = వ్యస్తతయందును, సాధుతా = సాధుత్వము భవతి = సమ్మతమగును. "వ్రేళ్ళు చిదిమియుఁ, గాళ్ళు నఱకియు నిత్యాదీనా మయోగే రౌద్రాదౌ సాధుతా." (అహో. 3౭౧ పుట.) క్వచిత్తు = ఒకప్పుడు, వచనశ్రుతేః = శ్రుతిహితమగు బహుత్వాది వచన విశేషప్రయోగమున సాధుత్వము సమ్మతమగును. ఉదా:—"పం డ్లికిలించుచుండె - ఇత్యాదీనాం బహువచన శ్రవణేన బీభత్సాదౌ సాధుతా." (అహో. 3౭౧ పు.) ఆలంకారికులు సంస్కృతమున "కటిగల్లా" దులనువలెనె తెల్గునందును గొన్ని చుల్కని పదములను "కాళ్లు" మున్నగువాని నాలంకారిక గ్రామ్యమనెడి యనిత్యదోషమునకు లక్ష్యములనుగాఁ గొందఱు దలంచుటంజేసి యట్టివానికి సైత మాయా రసములందలి ప్రయోగౌచితినిఁబట్టి వానికి గ్రామ్యత లేదని యథర్వణుఁడు వచించెనని తోచుచున్నది. తే-గీ. రణము వర్ణించుచో వీరరసమునందు। యుద్ధపంచకమునఁ దిక్కనొజ్జ సారెఁ। గాళ్ళటంచు రచించుట గాంచి కవులు। చెప్పికొనిరి మిాఁగాళ్ళని చెలఁగి కృతుల." (అప్పక. ౧ ఆ. ౧౯౯ ప.) సీ. మదిరాక్షి చెవులు తోమ్మిది లెక్క లనరాదు ముద్దియ కనులు దమ్ము లనరాదు। శుకవాణి బుగ్గలు ముకురంబు లనరాదు చెలిపండ్లు మల్లె

మొగ్గ లనరాదు। గజయాన చనులు బంగరుకుండ లనరాదు సతిబొడ్డు సుడిని మెచ్చ దనరాదు। సరసిజానన మడ్డి సైకతం బనరాదు।హరి మధ్య కౌ న్గిగు లని యనంగ రాదు. "తే-గీ. క్రమత వీనికి వీనులు కన్న దోయి। చెక్కులును బలువరుసలు నిక్కఁ జన్ను। గవయుఁ బొక్కిలి పిఱుదు చొక్క పుటడుగు। లనుచు మునువాడి రవియు చేకొనఁగవలయు. (అప్పక. ౧ ఆ. ౧౧౮) కాని యిందియు నిత్యదోషము గాటచేతఁ బయి నియమములు లేకున్నను గొన్ని ప్రయుక్తము గుచున్నవి. క... । మిక్కిలి చేతులును వాని మిక్కిలి కన్నుల్. (సభా. ౨ ఆ. ౫౭ ప.) మొ తత్తత్పద మ్మనుకారిక ౮౮ I విషయమున వ్యాఖ్యాతము.

కల్పతరువు. ౩౯౧ విష:—కొన్ని వింతప్రయోగములు:—౩౪౭ విషయమునఁ బెక్కువిధములగు విశేషార్థ ఘటకప్రయోగములు చూపఁబడినవి. అందలి యర్థ విశేషము లరయునది.

కల్పతరువు. ౩౯౨ విష:—౩౧౩ విషయమున "తుము న్నర్థక నాన్తైన మిసమాసః క్వచి ద్భవేత్" అనుచోఁ బ్రోవిన వింతలగు పెక్కు సంక్షేపవాక్యములు ప్రదర్శింపఁబడెను. పునరుక్తి భీతి నట్టివాని నిట మరలఁ జూపలేదు.

కల్పతరువు. ౩౯౩ విష:—అర్థదార్ఢ్యమునకై యవధారణార్థ కావ్యయ పునరుక్తి:—క. కురుసేనగదా గెలుచుట। కిరము భరం బర్జునునకు గాండీవమునం। బెరిఁగిన యమ్ముల మంటల। దరికొని తెగఁ గాల్చునట్టి గయు యగుఁ జూమ్మీ (శివరా. ౨ ఆ. ౧౯౭). ద్వి. పరమ తత్వామృతం బయు చన్నుఁబాలు। గురుపద ధ్యాన విస్ఫురణయ వెన్న. (బసవ. ౧ ఆ. ౧౯౯). "ర - ఒక యక్షరము. దే - అవ. ౧ నీచ మిత్రోద్దేశములయందు ఉద్దేశ్యవాచకమునకు ఏకత్వంబున అంతాగముంబగును..." (శ-ర.). ఇది "రమ్ము = రా=ర" అనురీతి గల పదమే యనఁదగును. దీని వాడుకలలోని వింతలు:—చ......న। త్వరముగ......తప్పు సుమ్మురయని......(ద్రోణ. ౫ ఆ. ౩౨౪). చ...తం। ద్రి యముని చందమై తెగితిరే శినివీరుఁడ యంచు నేయుడున్। ......(కర్ణ. ౩ ఆ. ౧౮౮.) (తెగితివిర+ఏ = తెగితిరే). ఇట్టి ప్రయోగములను బట్టి యిది యుద్దేశ్యవాచకమున కంతాగము మను శబ్దరత్నాకరము సరికాదుగదా. ఇట్టిది యుష్మదర్థకాన్విత మఁగుఁదు నిల్చును.

కల్పతరువు. ౩౯౪ విష:—అగు ధాతు నన్యాంతరూపములగు "కాన్ = కన్" అనువాని వాడుకలను గూర్చి। ౩౪౭ VI విషయమునఁ గొన్ని విశేషములు చూడఁబడెను. ఇయ్యది పెక్కుచోట్ల కొక్కటియె ప్రయోగింపఁబడుటయుఁ గలదు. మత్తకోకిల......ఊర్వి పా। దంబు లగ్ని ముఖంబు సూర్యసుధాకరుల్ నయనంబు

లీ। యంబరంబు శిరంబుగా నిటు లద్భుతాకృతి నుండెదన్. (అరణ్య. ౪ ఆ ౨౬౮). క. ఏ నిది యంతయు నెఱుఁగుదుఁ। గాన వృథా శోకవహ్నిఁ గాలమికిని నీ। మానసమునఁ గృపగలిమికిఁ। గా శౌడినితి దేవగుహ్యాగతి యుఁ దెలిపితిన్. (స్త్రీ. ౧ ఆ. ౮౭ వ). ఇట్టి స్థితి యుఁకొన్ని శబ్దములకును గలదు. మ.....భూ। రితరారాతిబలంబులం బొడవి మూర్చిల్లన్ విభేదిల్లఁగం। పితచేష్టల్ దురటిల్ల వివ్వాల దశక్ భీతిల్లఁ జేసెన్ వెసన్. (హరి. పూ. ౪ ఆ. ౧౨౫). చ. అనఘు మనుష్యులంను వసుధావరుఁడున్ జతురాశ్రమంబులం। దును గృహమేధి ధర్మమును దుర్గను దైవత దైత్యకోటియం। దనుపమ సత్వ వైభవ సముగ్రుఁడు నింద్రుఁడు వోలె......... (హరి. ఉత్త. ౧౦ ఆ. ౨౫౦.)

కల్పతరువు. 3౯౫ విష:—అగు ధాతు క్త్వార్థకము 'అయి' శబ్దము 'కలిగి' మున్నగువర్థముల నిచ్చును. చ......భ్రూకుటియుం దశనోష్ఠపీడనం। బును నయియున్న వాఁడ నిల పుత్త్రుఁడు......(ఆర. ౬ ఆ ౨౦౯). (అయి = కలిగి) క...... ఏ। త్తినికన్నులు నై......ఒకండుపుట్టె......(శాంతి. ౨ ఆ. ౨౦౬). మ. అర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ గృ। ష్ణుని సారథ్యము నై జగత్త్రితయ సంక్షోభంబు గాకుండు నే (ఉద్యో. ౧ ఆ ౨౬౬). ఉ......ఆతండును నేము నైన విబుధ ప్రకరంబును మాకు నడ్డమే. (శాంతి. ౧ ఆ. ౧౨). (ఇందలి - 'ఐనన్' అనుదానికి నేకీభవించినచో నని యర్థము).

కల్పతరువు. 3౯౬ విష:—శత్రర్థక చువర్ణకస్థలములందుఁ దద్ధర్మార్థక విధేయవిశేషణములను వాఁడుటయుఁ గలదు. (చూ. 3౧౫ II విష). ఉదా:— అయ్యుదంకుండు......ఒక్కరుండ చనువాఁ డెదుర......ఒక్క దివ్యపురుషుం గని......(ఆది. ౧ ఆ. ౮౪ వ.) ఇట్టియెడల "ఉదంకుఁడు చనుచు నెదుర దివ్యపురుషుం గని" అనురీతిని వాడుట సామాన్యపద్ధతి. సంస్కృతపద్ధతి ననుసరించి భట్టారకుఁ డట్టి విశేషపద్ధతిగల వాక్యవిన్యాసము నారంభించె ననఁదగును. "ఉదఙ్కః గచ్ఛన్ పురతః దివ్యపురుష మపశ్యత్." అనుచోటి 'గచ్ఛన్' అనుదానికిఁ దెలుంగున 'చనుచున్' అనియు 'చనువాఁడు' అనియు నర్థములు విలసిల్లునుగదా. తిక్కయజ్వయుఁ బయి నన్నయ పద్ధతి నరుదుగ వాడెను. "వ. అతండు (శాంతి. 3 ఆ. 33౮.)...తే గీ. అరుగుచుండువాఁ డొకచో దవానలంబు। గట్టెదిరి కాననం బెల్లముట్టి యుండ। సంప్రమోదిత చిత్తుఁడై చక్కఁ జొచ్చి...(శాంతి. 3 ఆ. 3౪౦).

కల్పతరువు. 3౯౭ విష:—వ్యస్తరూపకమున నారోపితవస్తువాచకముతోనే సమస్తరూపకవిశేషణము లన్వయించును. ఉ. వీరరసాంబుపూరమును విశ్రుత

బాహుమహోగ్రసత్త్వరుం। జారు గదాధ్వజాచల విశాలము నంబక జాల వీచికా। స్ఫారము నైన భీష్ముఁ డను సాగరముం గడవంగ నీఁదఁగా। నేరిమి యెట్లొకో కలుగ నేర్చు శిఖండికి నేమి సేయుదున్. (భీష్మ. ౧ ఆ. ౫౪). దీని కనుసృతిగా నన్నిచోడుఁ డీక్రిందిరీతిని వర్ణించెను. మ. అలిధమ్మిల్ల మృణాలహస్తఁ గమనీయావర్తనాభిక మహోత్పలగంధిం గలహంస యాన విల సద్బంధూకరక్తోష్ఠ నుత్పలనేత్రం గమలాస్య నంగజ రసాంభః పూరఁ దత్పార్వతిక। జలజావాసముఁ జొచ్చి యాడక మనోజాతానలం బాఱునే. (నన్ని. కు. ౬ ఆ. ౭౨౪ ప.) పార్వతీజలజావాస మనెడు ముద్రణ మవిమర్శనకృతము. సోమయాజి వ్యస్తరూపకమునందలి యారోపితవస్తు వాచకమునకు విశేషణములుగ సమస్త రూపకములను ఘటింపఁగా నన్నిచోడకవి ప్రకృత వస్తువాచకమునకు సమస్తరూపకములు విశేషణములగునట్లు ఘటించెను. ఈపక్షమున అళులవంటి ధమ్మిల్లముగలది మున్నగురీతి నుపమానపూర్వపద బహువ్రీహుల నెన్నునది. ఈపక్షమున నళ్యాదులను బద్ధాకరసంబంధులుగ నుపచరింపఁ జేసికొనవలసియుండును. తిక్కన రచనమున నిట్టిచిక్కు లేదు.

నన్నయాథర్వణీయము. అనిన్ద్యతాయాం భాషాణాం। శ్లేషో యోగశ్చ

౩౯౮ విషయము. సమ్మతః (వికృ. అజం. ౯౬ కా. అహో. ౩౭౫ పు).

కల్పతరువు. ౩౯౮ విష:—అనిన్ద్యతాయామ్ = మహాకవి ప్రయోగసమ్మతిచే నింద్యము కానపుడు, భాషాణామ్ = వివిధభాషల పదములకు, శ్లేషః = వాక్యమం దన్వయమును, యోగశ్చ = సమాసమును, సమ్మతః = సమ్మతమగును.

విస్తర. ౧౧౩ II విషయమునందు సంస్కృతపదములు నిరనుకృతికముగాఁ దెల్గు వాక్యమునఁ బ్రయోగించుట భారత సమ్మతము కాదని విశదీకరింపఁబడెను. క్వాచిత్కముగా భారతేతరములందు "వినానుకరణం కేచి దాద్యశబ్దం ప్రయుఞ్జతే" అను నథర్వణోక్తిచొప్పున నిరనుకృతికముగ శుద్ధసంస్కృత విభక్త్యంతముల ప్రయోగము కన్పట్టుచున్నది. వృథా శపింతురే (మనుచ. ౪ ఆ.) క...... ఆనం। దకాననమునందు సర్వదా సిద్ధించున్. (కాశీ. ౭ ఆ.) మహాకవి ప్రయుక్తములగుటచే ననింద్యములగు నిట్టి యలంతిస్థలములందుఁ దప్పు మఱెచ్చుటను మణిప్రవాళరీతిగల వాక్యములు ప్రయోజ్యములు కావని యెఱుంగునది. మలయాళభాషలో మణిప్రవాళరీతి సమ్మతమై యుండుటచే నట్టిరీతిగల వాక్యములు తెల్గున బ్రయోజ్యములు కావని దృఢీకరించుటకయి యీ యథర్వణకారిక వేఱుగ నుపదేశింపఁబడెను. "యోగశ్చ సమస్తత్వేన పదానాం సంబన్ధః మిఁటఁ గంటిఁ గలకంఠి శశాంక మిత్యాది." (అహో. ౩౭౫ పు.) ఇచట "శశాంకమ్" అనునది సంస్కృత

ద్వితీయైక వచనాంతపదము తెనుఁగు వాక్యమున నన్వితమగుచున్నదని యహోబల పతి యుదాహరించెను. కాని యిట్టిది మహాకవిగ్రంథములం దెచ్చటను గన్పట్టలేదు గాన నిది నింద్యమే యగుటచేత నిది యిచటి యథర్వణకారికకు లక్ష్య మనఁదగదు. "జయజయమంగళసంగతరూపా" మున్నగు నాచన సోమనాథాది ప్రయుక్తములగు జయాది శుద్ధ సంస్కృతవిభక్త్యంతపదముల ప్రయోగముమాత్రమె కవి ప్రయుక్తమగుటచే ననింద్యమై సమ్మత మగునని యున్నది. ఈ విషయము "విరామానుకరణమిత్యాదికి బునరుక్తమే (చూ ౧౧౨ విష) యనఁదగి యున్నను మలయాళ వాఙ్మయ ప్రసిద్ధమగు మణిప్రవాళరీతి యథేచ్ఛముగాఁ బ్రయోజ్యము కాదని దృఢీకరించుటకయి" ఉక్తస్య పునరుక్తిః స్యాత్క్వచిద్ద్రాఢ్య ప్రదర్శనే." (చూ. ౩౮౯ విష.) అను చొప్పున నిది మరల నుపదేశింపఁబడెనని యెఱుంగునది.

కల్పతరువు. ౩౯౯ విష·—కొన్ని వింతలగు వాక్యవిశేషము లీక్రిందఁ జూపఁబడుచున్నవి:—కం...హా। రామ గుణధామ యని యని। భూమీశ్వరుఁడసు వియోగముం బ్రాపించెన్. (ఆర. ౬ ఆ. ౩౦౫). (అని పలికి యని పలికి యని యర్థము కాదు. అని పలికి పలికి యని యర్థము). గీ. అనఘు లింతకు వత్తురు వినుత బలులు (ఆరణ్య. ౬ ఆ. ౧౫౮). (ఇంతకున్ = ఇప్పుడే). క. వినుతమగు లోకరేచన। మున నన్ను విరించుఁ డంద్రు...(శాంతి. ౬ ఆ. ౪౩౮). ఉ. దా। మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని (సభా. ౨ ఆ. ౧౮). క......సౌమిత్రిఁ గనుం। గొని జనకతనయ సుమ్మీ। యని పలుమఱు నప్పగించి...(భాస్క. రా. ఆర, ౨ ఆ. ౪౫ ప.) (జనకతనయను జాగ్రత్తతోఁ గాచి యుండుమూ యని యప్పగించె నని యర్థము). క. మీ యనుగతి మాకు నభిప్రాయము......(ఆర. ౧ ఆ. ౮ ప.) (మీరు మాతో వచ్చుట మాకు సమ్మతమె). ఆ. వె......ఇతని నియోగంబు। మనకుఁ జేయ కునికి మానుషంబె. (ఆర.౧ ఆ. ౫౫.) మత్తకో. ఇంతయుం గపినాథ నీకిది యేమిపెద్ద...
......(ఆర. ౩ ఆ. ౩౫౩). (ఇదెల్ల నీకొక గొప్పకార్యమా? చుల్కఁగాఁ జేయుదువని యర్థము). ఆ. వె. ఇంకనైన నన్ను నేల యాలింపవు. (ఆర. ౨ ఆ. ౮౮). (ననుఁ గుఱిచి నేఁ బెట్టుచున్న మొఱ నేల యాలింప వని యర్థము). శా. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱి యొందేఁ గంటిమే. (మను. ౨ ఆ.) (నీయందుఁదప్ప మఱియొందేఁ గంటిమేయని నిల్పలేదు). వ........ కొండొక యయ్యును దపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దయైనవాని నుపయాజు నుపాసించి యిట్లనియె. (ఆది. ౭ ఆ. ౮). (ఎవ్వరికంటెన్ = అందఱికంటెను = ఎల్లవారికంటెను). సీ.....ఒక్కొక్కనింటఁ దానొక్కయేఁడు. (ఆది.౮ ఆ. ౧౧౫) ('ఒక్కొక్కని యింట నొక్కొక్క యేఁడు'

అనలేదు) క. వృద్ధులోక లక్ష యున్నను । బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా । నిర్ధరణీశులలో గుణ । వృద్ధని పూజింతిమి త్రివిక్రము భక్తిన్. (సభా. ౨ ఆ. ౨౭). ఆ. వె కరుణతోడ నాకు వరము ప్రసాదింప । బుద్ధిగాని లోకపూజితుండు । మను నిభుండు ధర్మతనయుండు దాస్యంబు । వలనఁ బాయువలయు వసుమతీశ. (సభా. ౨ ఆ. ౨౫౯.) సీ......ఆ. వె. నాకుఁ బుత్త్రివై పితామహికిఁ బత్నివై । మిథునచరితఁ దగిలి మీాగు లోక । జననములకు బీజశక్తివై యుండంగ । వరముఁ గరుణ నొసఁగ వలయు దేవ. (నన్ని. కు ౧ ఆ. ౭౦.) సీ. నీకంటె హరి బుద్ధి లేకయే నిజనేత్రకమ లంబు పూన్చి చక్రంబు వడసెఁ బరమేష్ఠి నీకంటెఁ బరవిడియే శిర మొప్పించి నిత్యుఁ డై యున్నవాఁడు । (పరవు = గౌరవము. పరవిడి = గౌరవములేనివాఁడు). మఘ వుండు నీకంటె మరులై యొ క్రతుతతి నర్చించి దేవేంద్రుఁ డై వెలిఁగె । నిఖిల దేవా వలి నీకంటె నవివేకు లయి యొ సేవించి భోగాత్ము లైరి । ......(నన్ని. కు. ౨ ఆ. ౧౬౮౪.) సీ. ఒక విప్రుఁ డలిగి పయోనిధి జలము లపేయముల్ గాఁగ శపింపఁ డెట్లు (ఆర. ౫ ఆ. ౧౯.) (శపింపఁడెట్లు = శపింపలేదా). క. వరదములగు కల్పలతాం । కురములొ విషమాస్త్ర నిశితకోరకవిశిఖో । త్కరము లనఁ గరజములు సుం । దరి కగు నరుణోత్పలాగ్రదళముల పోలెన్. (నన్ని. కు. ౩ ఆ. ౩౦౨). క. జననీజనకు లును సుహృ । జ్జనులును దెగునపుడు గావఁజనమి దెలియదే । ధనములు వారల కంటెనె । మనుజేశ్వర పగపు వాని మగిడించునొకో. (శాంతి. ౩ ఆ ౨౯.) వ. అయ్యిద్దఱుఁ జేరనరిగి......ప్రణామంబు లాచరించి కృష్ణుండు ప్రాంజలియై యతని కిట్లనియె. (హరి. ఉ. భా. ౧ ఆ. ౩౮.) (ఆయిద్దఱిలో నొకఁడగు కృష్ణు డిట్లనియె నని యర్థము.) వింత వింతైన యవధారణార్థక ప్రయోగములు కాకువులు మహాకవి ప్రయోగములనుండి గ్రహింపవలయును. క. వదలక నీకోర్కి తీర్ప వల యున యొట్లున్. (ఆర. ౬ ఆ. ౨౫౬.) క. ఉడుగక యే మహితముఁ బలి । కెడు వారము నీవు హితవు క్రియ గొనఁగాఁ బ । ల్కెడు వాఁడవు మాకంటెను । గడు హితుఁడవు నీవ కావె కౌరవ్యులకున్. (ఆది. ౭ ఆ. ౮౦.) ఉ. ఈవును జూచి తట్టి సభ నేని వినంబడ దే యుగంబునన్ । ......ఏ క్రియం బడసె నయ్య మహాత్ముఁడు దాన నేమి సం । భావిత భాగ్యుఁ డయ్యెనుఁ బ్రభాకర తేజుఁడు ధర్మజుం డిలన్. (సభా. ౨ ఆ. ౯౫.) 'ఏమి' అనుదానియందు నిల్చిన కాకువుచేతను సంభావిత భాగ్య వత్త్వాతిశయవాచక మగు 'అయ్యెన్+నున్' అనుచోటి 'ను' శబ్దముచేతను నర్థవిశేష స్ఫూర్తి గలుగుచున్నది. ఉ. ధర్మత । త్త్వమ్ములు పాండవేయులును దానును గాని యెఱుంగ రట్టె. (సభా. ౨ ఆ. ౩౯).

కల్పతరువు ౪౧౦ విష:—యత్త చ్ఛబ్దాన్వయస్థలములలో యచ్ఛబ్ద ఘటిత వాక్యమునందలి క్రియ భావ్యర్థకము యుండఁదగి యున్నను నట్టి క్రియ తచ్ఛబ్ద ఘటితవాక్యక్రియకు భూతమె యగును గాన దానిని భూతార్థకముగాఁ బ్రయోగించుటయుఁ గలదు. భావ్యర్థమును దద్ధర్మాదులలోనిదే కాన నట్టియెడలఁ దద్ధర్మాద్యర్థక క్రియను నిల్పుటయు సహజమె. ఉదా:—ఈమంత్రంబున నీ వెవ్వేల్పు నొక్క వేల్పు నారాధించి తవ్వేల్పు నీ కోరినయట్టి పుత్త్రకుల నిచ్చు. (ఆర. ౫ ఆ. ౧౭ గద్య). ఇట నీ వేవేల్పు నేని యారాధింతువేని యావేల్పు నీకోరిన పుత్త్రకుల నిచ్చు ననుట సహజము. వ. విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె. సీ. ...। ద్రోణగాంగేయులు దురితవిదూరులు ని న్నెద్ది గఱపిరి నెమ్మితోడ। దానిన చేయుట ధర్మువు... (ఆది. ౭ ఆ. ౪౯ వ. ౪౩). ఆ. వె. ఇందు లక్ష్య మెవ్వఁ డేసె నాతని వరి। యింపు నెమ్మితోడ నిందువదన. (అది. ౨ ఆ. ౧౨౯) సీ.....కమలాక్షి యెవ్వారి యింటఁ దానుండె నయ్యింటివలనఁ। బెఱవారు చనకుండ...... (ఆది. ౭ ఆ. ౧౧౫). చ......నీ గురువుఁ బొల్తి తగం గొని యాడుమెట్లు సె। ప్పె నటుల భక్తిమై నడవు పెంపెసలారఁగ ......(విరా. ౧ ఆ. ౯౫౯.) క. మన సంవాదం బెవ్వరు। వినిరి నియతి నజ్జనులకు విభవము కల్గు.....(అను.౫ ఆ. ౩౦౭).చ......ఎ।వ్వరి దెసఁ గాంచి తెక్కడుగ వారి నుతింపుము...(కర్ణ. ౯ ఆ. ౯౭). సీ......ఎ-గీ. అచ్యుతుండు। నెట్లు దనకు రుచించెఁ దా నట్లుసేయు (ద్రోణ. ౫ ఆ. ౩౬౬.) గీ... ఆ హంపడిభకు లే నాఁట నేడి। నడపి రదె చెల్లుఁగాక. (ఉ. హరి. ౪ ఆ. ౧౦౩.) గీ. వాఁడు చేసిన ధర్మంబు వానిం గాంచు. (కాశీ. ౯ ఆ. ౧౦౨) (ఎవఁడు చేసిన ధర్మము వానిని గాంచునని యర్థము.) తద్ధర్మము నిల్పుటరుదు:—తే-గీ. ఇప్పురంబు జయింపంగ నెవ్వరేని। వత్తు రుద్ధతులయి శత్త్రువరులు వారు।......నిర్ధగ్ధులై విహీను లవునట్లుగా.........(సభా. ౧ ఆ. ౯౫౨). యత్తచ్ఛబ్దాన్వయంబు సంస్కృతమందువలెఁ బ్రచురముగాకున్నను దెలుంగునను బ్రయుక్తమగుచున్నది. క. ఏయది హృద్య మపూర్వం। బేయది; యెద్దాని వినిన నెఱుక సమగ్రం। బై యుండు నఘనిబర్హణ। యేయది యక్కథయ వినఁగనిష్టము మాకున్. (ఆది. ౧ ఆ. ౩౦ ప.) తిక్కయజ్వయు నీరీతిని వాడియున్నాఁడు. ఉ......ఖాండవం। బే తెలివొందఁ గాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా। నా తెలి వాత్మ నూల్కొలిపి.....(కర్ణ. ౩ ఆ. ౯౬౯.) "ఖాండవమును గాల్చిన తెలివి నాత్మనూల్కొలిపి" అని వాడుట తెలుంగు సామాన్యపద్ధతి, అట్లె నన్నయ పద్యమందును "హృద్యము నపూర్వము నఘనిబర్హణము నగు కథయ

వినఁగ నిష్ట ముని వాడుట సాధారణపద్ధతి. ఉదా:—సీ. కమనీయ ధర్మార్థకామమోక్షములకు నత్యంత సాధనంబైనదాని। వేడ్కతోఁ దవిలి తన్ వినుచున్న వారల కభిమత శుభకరం బైనదాని। రాజుల కఖిలభూరాజ్యాభివృద్ధి నిత్యాభ్యుదయ ప్రదం బయినదాని। వాఙ్మనఃకాయ ప్రవర్తితానేక జన్మాఘనిబర్హణంబయిన దాని. ఆ. వె. సత్యవాక్ప్రబంధశత సహస్రశ్లోక। సంఖ్య మైనదాని సర్వలోక। పూజ్య మైనదాని బుధమత వ్యాసము।నీముని ప్రణీత మైనదాని. (ఆది. 3 ఆ. ౯.) చ. వినుత పరాక్రముల్ ధృత వివేకులు సత్య సమన్వితుల్ యశో। ధనులు కృతజ్ఞు లుత్తములు ధర్మపరుల్ శరణాగతానుకం। పను లనఁగాఁ బ్రసిద్ధులగు భారతవీరుల సద్గుణానుకీ। ర్తనముల నొప్పుదాని విదితంబగుదాని సభాంతరంబులన్. (ఆది. 3 ఆ. ౧౦). శా. ఆయుష్యం బితిహాసవస్తుసముదాయం బైహికాముష్మిక। శ్రేయః ప్రాప్తినిమిత్త ముత్తము సభాసేవ్యంబు లోకాగమ। న్యాయై కాంత గృహంబు నాఁబరఁగి నానా వేదవేదాంతవి। ద్యాయుక్తం బగుదానిఁ జెప్పఁ దొడఁగెం దద్భారతాఖ్యానమున్. (ఆది. 3 ఆ. ౧౧).

గద్యము

ఇది శ్రీవత్స సగోత్ర పవిత్ర శ్రీమద్వేంకటాంబాముఖలింగేశ్వరశాస్త్రి జ్యేష్ఠపుత్ర శ్రీమచ్చిన్నామణ్యపాఖ్య షడ్దర్శనీపారంగత నారాయణాఖ్య పండితకవీంద్ర శమనిచయానంద గురుప్రకాండ పాదపద్మమధుకర వివిధప్రబంధ శాస్త్రగ్రంథ విమర్శన వీరసింహమంజరీప్రబంధ వైయాకరణ పారిజాత సుమ సమర్చితాంధ్రవాగ్దైవత కౌత్స సమాఖ్యఖండకావ్యపతిత్వబంధు రాంధ్రసారస్వత పరిషద్బహూకృత వ్యాకరణోపాధ్యాయాంధ్ర విశ్వకళాపరిష ద్బహూకృత కళాప్రపూర్ణ బిరుద భూషిత వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రి విరచితాంధ్రవ్యాకరణసంహితా సర్వస్వమునందుఁ గారకసమాసతద్ధిత క్రియాకృత్ప్రకీర్ణక పరిచ్ఛేదముల ద్వితీయభాగము.

శ్రీ ర స్తు.

# గురుదేవతా నమస్కారము

శ్లో. వేదాన్తాద్వైతసిద్ధాన్త । దేశికం జనకం భజే,
కావ్యనాటకసాహిత్య । విద్యాచార్యం విపశ్చితమ్. ౧

శ్లో. గిర్వాణాన్ధ్రచ్ఛన్దో । వ్యాకరణాలంక్రియేడ్య శాస్త్రాణామ్,
ఆచార్యం నారాయణ । పణ్డితవర్యం నమామి సద్భక్త్యా. ౨

శ్లో. స్కన్ధత్రయాత్మకజ్యోతి । శ్శాస్త్రాచార్యం భజే సదా,
చినవేఙ్కటసిద్ధాన్తి । మత్కనిష్ఠపితామహమ్. 3

శ్లో. దీపికాన్త న్యాయగురుం । పీసపాటికులోద్భవమ్,
తర్కశాస్త్రప్రవక్తారం । వన్దే శ్రీవేఙ్కటేశ్వరమ్. ౪

శ్లో. ముక్తావలీ శ్రీవిశిష్టా । ద్వైతసిద్ధాన్తదేశికమ్,
వన్దే సదాధూర్యనన్తా । ఖ్యారు విద్యా మహోదధిమ్. ౫



# ముఖ్యములగు తప్పొప్పుల పట్టిక

| పుట. | పం_క్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| ౯౭౭ | ౨౦ | ధాతువువలె నీఁబడిన | ధాతువులె యీఁబడిన |
| " | ౨౩ | ద్వితీయము | ద్వితీయయం |
| ౯౮౪ | ౩౧ | లన వర్ణకము | పలన వర్ణకము |
| ౧౦౦౮ | ౨౯ | ఏమి సేయ | లేమి సేయ |
| ౧౦౪౦ | ౧ | వష్టి | వష్ఠి |
| ౧౦౬౮ | ౧ | మాక్షేశము | యాక్షేపము |
| ౧౦౭౧ | ౬ | బహువచనమునకు | బహువచనములకు |
| " | ౨౮ | స్త్రీ సముపిశేషణ | స్త్రీసమ విశేషణ |
| ౧౦౭౨ | ౮ | మొ. | అందమగు సేయుంగులు మొ. |
| ౧౦౭౫ | ౧ | సూరికవి | సూరకవి |
| ౧౦౭౯ | ౧౦ | సము।జ్జలుఁడు | సము।జ్జ్వలుఁడు |
| ౧౦౮౪ | ౧౫ | అని భేదము | అని ఛేదము |
| ౧౦౮౫ | ౬ | కేశవార్జున కృతి (నీ) | కేశవార్జున కృతి (న్) |
| ౧౦౯౪ | ౧౪ | వార లిట్టి | వార రిట్టి |
| ౧౧౧౬ | ౧ | సమాసకము సమాస | సమాసకము. సమాస |
| ౧౧౨౦ | ౨౦ | ప్రాయః. సూపప్రతి ఉన్మత్తగఙ్గ సూపస్యలేశః | ప్రాయః. సూపస్యలేశః |
| ౧౧౩౬ | ౨౭ | (నన్ని. | (నన్ని. |
| ౧౧౪౩ | ౨ | సమీపే' యే సతఉపదశాః | సమీపే యే సన్నిత ఉపదశాః' |
| ౧౧౪౪ | ౧౭ | ఘటింత | ఘటిత |
| ౧౧౪౭ | ౧ | అనఙ్గు | అనజ్ఞు |
| " | ౬ | అనజ్ఞు | అనజ్ఞు |
| ౧౧౫౦ | ౪ | మాతృప్వస | మాతృష్వస |
| ౧౧౫౬ | ౧ | ధారయానిత్యాదిసు | ధారయా విత్యాదిసు |
| ౧౧౫౮ | ౯ | సాధువుకాదు. | సాధువుకాదు. (చూ ౨౪౬ I విష. ౧౦౧౨ పుట.) |
| ౧౧౬౧, ౧౧౬౩, ౧౧౬౫, ౧౧౬౭ | ౧ | సమా ౩ సూ | సమా ౨౫ సూ |
| ౧౧౮౨ | ౧ | 'జనుపకార' | 'జనుపనార' |
| ౧౧౯౫ | ౧౯ | శ్లోకార్థ | శోకార్థ |

| పుట. | పం_క్తి | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| ౧౧౯౬ | ౬ | షష్ఠ్ర | షష్ఠ్యై |
| ౧౧౯౮ | ౨౩ | ములు ఇది తుదికి | ములు తుదికి |
| ౧౨౦౨ | ౧ | కర్మధారయమునందున | కర్మధారయమునందు |
| ౧౨౧౩ | ౨౦ | అక్షు్ణంబునన్ | అక్ష్ణంబునన్ |
| ౧౨౨౯ | ౨౫ | నిరుడెరుఁ | నిరుదేరుఁ |
| ,, | ౨౭ | బొందవె | బొందవే |
| ౧౨౪౨ | ౧౨ | క్వత్తులు | కృత్తులు |
| ౧౨౪౫ | ౧ | స్థానీకము | స్థానికము |
| ౧౨౪౭ | ౩ | స్పష్టము. కా | స్పష్టము కాన |
| ,, | ౧౬ | ద్వద్వార్థ | ద్వద్వ్యార్థ |
| ౧౨౬౩ | ౨౭ | లోపించినట్లు | లోపించినట్లు |
| ,, | ,, | కనఁబడు | కనఁబడును. |
| ౧౨౭౩ | ౧ | శబ్దములు | శబ్దముల |
| ౧౨౭౫ | ౧ | ధర్మ | ధర్మి |
| ౧౨౮౮ | ౧ | నియనురా | నియమరా |
| ౧౩౦౮ | ౧ | యధర్వణ | యాథర్వణ |
| ,, | ౩౧ | తద్గిత | తద్ధిత |
| ౧౩౧౦ | ౧ | సంధికి | సందిలి |
| ౧౩౧౨ | ౧౧ | కీర్తుల్ | కీర్తుల్ |
| ౧౩౧౬ | ౨౪ | ౬ అ ౧౪౧ ప)'' | ౬ అ ౧౪౧ ప)'' (శ-ర) |
| ౧౩౨౬ | ౧౫ | రనబంధక | రనుబన్ధక |
| ,, | ౨౪ | సెల్లధాతువులను | సెల్లధాతువులకును |
| ౧౩౩౭ | ౧౧ | రక్షింపక | ''రక్షింపక |
| ౧౩౪౪ | ౨౦ | విశేషం | విశేష |
| ౧౩౫౧ | ౯ | క్రియయుత్తమరుష | క్రియ యుత్తమపురుష |
| ౧౩౫౨ | ౯ | అది-వి. | అవి-వి. |
| ౧౩౬౦ | ౧౦ | క్వత్వ్యా స్తవ్యాదయః | కృత్వ్యా స్తవ్యాదయః |
| ౧౩౬౪ | ౫ | ఈమంత్రంబునని | ఈమంత్రంబున నీ |
| ౧౩౭౧ | ౧ | 'దు' దాగమ | 'దు' గాగమ |
| ౧౩౭౪ | ౭ | ప్రాబసరి. | ప్రాసిరి. |
| ౧౪౦౦ | ౯ | క్వచి''న్నతత్తను | క్వచి న్న తత్త'' ను |
| ౧౪౨౩ | ౭ | ''మ. బళిరా | మ. బళిరా |
| ౧౪౨౫ | ౧ | ఆర్యాబీకవి | ఆర్యాబీనకవి |
| ౧౪౨౯ | ౧ | ౩౭-౧౨౨ | ౩౬ ౧౨౨ |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౪౩౧ | ౧ | ౩౭-౧౨౨ | ౩౬-౧౨౨ |
| ౧౪౪౧ | ౧ | సూరికి సరికాదు | సూరివిధి సరికాదు |
| ౧౪౫౪ | ౧ | ఎత్తుకు—ఎత్తుకు | ఎత్తుక—ఎత్తుకు |
| ౧౪౫౫ | ౧ | ధాత్వ ద్వ్యాహారము | ధాత్వధ్యాహారము |
| ౧౪౬౦ | ౧ | 'బాలక్ | 'చాలన్ |
| ౧౪౮౨ | ౨౭ | కాన 'తగిన | కాన ''తగిన |
| ౧౪౮౪ | ౨౮ | (నిర్ణయింపక | నిర్ణయింపక |
| ౧౫౧౩ | ౧ | ప్రాచీనము లేవు | ప్రాచీనములు లేవు |
| ౧౫౧౩ | ౨౩ | వివృతి). | వివృతి) |
| ౧౫౧౮ | ౪ | నిల్చి | నిల్పి |
| ౧౫౬౧ | ౧ | వసరాదు. | వసవలెను. |
| ౧౫౬౯ | ౨౬ | కర్తృప్త్వేవ | కర్తృష్వేవ |
| ౧౫౮౫ | ౪ | కల్లుచుండును. | కల్గుచుండును. |
| ౧౫౮[illegible] | ౧ | అగుప్రభృతి | ఆగుప్రభృతి |
| ౧౫౯౫ | ౨౦ | అనునది | అనునది |
| ౧౬౦౫ | ౧౪ | మున.తడంబఱచి | మున) తడంబఱచి |
| ౧౬౦౮ | ౧౦ | సందర్భనన | సందర్భమున |
| ,, | ౧౧ | జాలక'' యని | జాలక'' అని |
| ౧౬౭౯ | ౧ | ౪౬ మొ. | ౮౬ మొ. |
| ౧౬౨౨ | ౧ | 'తలఁచు' | 'తోఁచు' |
| ౧౬౩౩ | ౧ | 'చొఱి-చొరితిని' | చొరి-చొఱితిని' |
| ౧౬౩౪ | ౨౧ | ప్రార్థనాద్యక | ప్రార్థనాద్యర్థక |
| ౧౭౧౧ | ౧౮ | క-గ-చ-య-వ-వలకుక్ | క-గ-చ-య-వలకుక్ |
| ౧౭౩౬ | ౧ | పాద్యక్షర | నాద్యక్షర |
| ౧౭౩౮ | ౧ | ప్రిభృతుల | ప్రభృతుల |
| ౧౭౪౧ | ౧ | అటాదుల | అట్వాదుల |
| ౧౭౬౭ | ౧౩ | పట్టిని | పట్టి |
| ౧౭౬౬ | ౧ | తమిలు | తమిళి |
| ౧౭౬౮ | ౧ | ౩౮౨. వి. | ౩౮౩. వి. |
| ౧౭౭౫ | ౨ | పురుషోహాస్త్రీ | పురుషో హాస్త్రీ |
| ౧౭౮౫ | ౧ | సైహితాది | సైతాది |
| ౧౭౯౩ | ౧౪ | బొల్లి | బొల్తి |